KATHALU-GAATHALU (Ist part)
**Chellapilla Venkata Sastri**

కథలు - గాథలు (ప్రథమ భాగము)
శతావధాని
**చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి**

సంపాదకులు
**డా॥ డి.చంద్రశేఖర రెడ్డి**

సహాయ సంపాదకులు
**లక్ష్మణ్‌రావు పతంగే**
**డా॥ తిరుమల నీరజ**

ముద్రణ
**డిసెంబరు, 2011**

మూల్యం: రూ. **350/-**
ISBN : 978-93-80409-97-9

టైటిల్ డిజైన్
**జి. పురుషోత్త్ కుమార్**

డి.టి.పి.
**కె.లక్ష్మణ్**

ప్రింటర్స్
**సాయిలిఖిత ప్రింటర్స్**
హైదరాబాదు.

ప్రచురణ
**ఎమెస్కో బుక్స్**
1-2-7, బానూ కాలనీ,
గగన్‌మహల్ రోడ్, దోమలగూడ,
హైదరాబాద్ - 500 029.
ఫోన్ & ఫ్యాక్స్ : 040-23264028
e-mail : emescobooks@yahoo.com,
www.emescobooks.com

పంపిణీదారులు
**సాహితి ప్రచురణలు**
29-13-53, కాళేశ్వరరావు రోడ్డు,
సూర్యారావుపేట, విజయవాడ - 2.
ఫోన్ : 0866-2436643
0866-6460633
e-mail: sahithi.vja@gmail.com

# విషయసూచిక


1. పిఠాపుర ప్రభువు లేటు గంగాధర రామారావుగారి కథలు .......... 11
2. వెంకప్ప సోమయాజులు .......... 51
3. ఈతి బాధలు .......... 61
4. కొత్తరకం ఈతి బాధలు .......... 79
5. గర్భాధానం .......... 93
6. మద్యనిషేధం అవసరమే! .......... 100
7. సస్యగర్భ భూదానం .......... 108
8. భీష్మ బ్రహ్మచారి గురుశిష్యవివాదం న్యాయసమ్మతమేనా? .......... 111
9. పశ్చాత్తాపము .......... 121
10. ఏది అహింస? .......... 125
11. అతిక్షమ దైన్యాపాదకమా? .......... 129
12. సోమరిసత్రాలు .......... 138
13. బ్రాహ్మణశాఖలు .......... 143
14. "యెనీమా"వల్ల కడుపు తేలికపడ్డట్టే సినీమావల్ల యిల్లు తేలికపడుతుంది .......... 158
15. ఆచారభేదాలు .......... 162
16. కళలకోసరం దేవదాసిజాతి .......... 169
17. కళలను ప్రదర్శించే స్త్రీలు స్వతంత్రలుగా ఉండాలి .......... 174
18. పుక్కిట పురాణ కథలు .......... 192
19. సామెతలు .......... 207
20. "నాఽనృషిః కురుతేకావ్యం" .......... 213

21. కవుల కష్టసుఖములు ........................................................ 222
22. పదకవులు ........................................................ 231
23. కవిసన్మానం ........................................................ 243
24. కవులు భిక్షాటకులేనా? ........................................................ 249
25. శిష్టావారి విశిష్టత్వం ........................................................ 269
26. పౌరాణికులు నీచులా? ........................................................ 275
27. వికటవిమర్శనం ........................................................ 281
28. చొప్పదంటు శంకలు ........................................................ 290
29. వెనకటి పండితులు ........................................................ 294
30. మా ముత్తాత ........................................................ 305
31. నా గురుపరంపర ........................................................ 322
32. నేను-మా తిరుపతిశాస్త్రుల్లూ ........................................................ 333
33. "పుణ్యైర్యశోలభ్యతే" ........................................................ 392
34. నీలాపనిందలు ........................................................ 405
35. అపవాదలు ........................................................ 417
36. మఱొక అపవాద ........................................................ 426
37. కీర్తి - అపకీర్తి ........................................................ 429
38. కవికన్న విమర్శకుఁడికి జాగరూకత ఎక్కువగా ఉండాలి ........................................................ 434
39. వెక్కిరింపఁబోయి బోల్తాపడుట ........................................................ 439
40. బ్రతికించారు ఆచార్యులుగారు ........................................................ 445
41. వెక్కిరింపఁబోయి బోల్తాపడుటయే-1 ........................................................ 460
42. వెక్కిరింపఁబోయి బోల్తాపడుటయే-2 ........................................................ 465
43. యింకో అపవాద ........................................................ 475
44. క్షంతవ్యుఁడుగారు ........................................................ 480

45. పాండవాశ్వమేధము ........................................ 483
46. పిష్టపేషణము ........................................ 490
47. పునఃపేషణము ........................................ 496
48. పాడినపాటే ........................................ 501
49. నన్నయ్యభట్టు ........................................ 506
50. "శుభస్యశీఘ్రమ్" ........................................ 529
51. భారత భారతి ........................................ 582
52. వడ్లగింజలోది బియ్యపుగింజ ........................................ 592
53. వైకర్తనశబ్దవిచారము ........................................ 594
54. జలతాడనము ........................................ 601
55. అమవసనిసియన్నమాట ........................................ 607
56. తెనాలి రామలింగకవి కవిత్వం-1 ........................................ 634
57. తెనాలి రామలింగకవి కవిత్వం-2 ........................................ 652
58. యెంకిపాటలను గూర్చి ........................................ 670
59. కవితా విప్లవం - 1 ........................................ 678
60. కవితా విప్లవం - 2 ........................................ 690
61. కర్ణాట కలహం ........................................ 697
62. "సహృదయాః ప్రమాణమ్" ........................................ 703
63. యేది సాధ్యం? ........................................ 707
64. యేది కవిత్వం - 1 ........................................ 710
65. యేది కవిత్వం - 2 ........................................ 727
66. రచయితలు ........................................ 734
67. అన్నీ కవిత్వాలేనా? ........................................ 741
68. రాజ్యలక్ష్మి ........................................ 747

69. కవిత్వమూ-బ్రాహ్మణత్వమూ ........................ 752
70. అంతా రామమయం ........................ 773
71. అడియాస ........................ 782
72. పండితరాయలు : కాళిదాసు ........................ 787
73. ఆంధ్రభోజుఁడననేమి? ........................ 793
74. మహాకవి భోజమహారాజు ........................ 797
75. గారుశబ్ద విచారము ........................ 805
76. మనుగుడుపు ........................ 807
77. అష్టావధానమంటే! ........................ 814
78. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః ........................ 820
79. శ్రీపాదగురువులకడ నా శుశ్రూష ........................ 827
80. నా ముక్త్యాల ప్రయాణము ........................ 842
81. నా పాలకొల్లు ప్రయాణము ........................ 865
82. శాస్త్రిగారి "క్షమాపణ" ........................ 877
83. వకటేమాట లేక సూక్ష్మోపాయం ........................ 887
84. దోషావాచ్యా గురోరపి ........................ 889
85. నేఁడు ........................ 897
86. ఆత్మవంచన ........................ 900
87. పనిలేనిపాట ........................ 905
88. "ఊరిపిడుగు వీరి సెట్టిని కొట్టుకు పోయింది" ........................ 925
89. గురువుగారు వట్టి అమాయికులు ........................ 933
90. సంధి మిచ్ఛంతి సాధవః ........................ 944
91. గురు శిష్య ప్రశ్నోత్తరములు ........................ 947

# పిఠాపురప్రభువు లేటు
# శ్రీ గంగాధర రామారావుగారి కథలు

పైని వుదాహరించిన ప్రభువరేణ్యుని అత్యద్భుతచర్యలు మాప్రాంతములలో తఱచుగా చెప్పుకుంటూవుంటారు. నాకు కొంచెం ప్రాజ్ఞత కలిగేటప్పటికి వీరు తుట్టతుదిదశలో వున్నారు. వీరిని నేను చూడడం చూశాను. గాని, నన్నుమాత్రం వా రెఱిగడానికి తగ్గస్థితిలో అప్పటికి నేను లేను. నేను కాశీనుండి కాశీకావడి బుజాన్ని పట్టుకొని వచ్చే రోజులలో తునికిన్నీ అన్నవరానికిన్నీ మధ్యగావున్న తేటగుంట, తిమ్మపురంవద్దకు వచ్చేటప్పటికి యీ మహారాజు ద్వాదశాహస్సునాఁటి సంభావన పుచ్చుకొన్న బ్రాహ్మణ్యం యెదురుగావచ్చింది. నాకు నామరూపాలు కలగడం కాశీనుంచి వచ్చిన మఱుచటినాటి నుండే కావడంచేత, వారిని నేనెరగడమేకాని నన్ను వారెఱిఁగి వుండే యోగం తటస్థించలేదు. అదిన్నీకాక యీ ప్రభువు సుమారు 5, 6, సంవత్సరాలకాలం అంత్యదశలో కొంత అనారోగ్యంగావుండి – "కాశ్యాంతు మరణాన్ముక్తిః" కనక. కాశీలో భౌతికదేహం చాలించేవుద్దేశంతో వకటి రెండుసార్లు కాశీకి వెళ్లినట్లుకూడా వింటాను. కాని తుదకు వీరు తమ రాజధానియగు పిఠాపురంలోని కోటలోనే భౌతికదేహాన్ని చాలించినారు. వీరు భౌతిక దేహాన్ని చాలించేనాటికి కొంచెం పూర్వగాథలు నాకు తెలియటాని కభ్యంతరం లేదుగాని, వీరు రాజ్యానికివచ్చిన కొలఁదికాలం నాటిచర్యలు నాకు వినికివల్ల తెలిసినవేకాని ప్రత్యక్షంగా తెలిసినవి మాత్రం కావు. బహుశః, గతించిన ధాత, ఈశ్వర సంవత్సరాల ప్రాంతంలో జరిగిన వకచర్యనుగూర్చి యిందు వ్రాస్తాను.

## జియ్యంగారిరాక

అప్పటికి నావయస్సు సుమారు ఆఱుసంవత్సరాలకు దాదాపు. అప్పుడు కఱవువచ్చింది. రూపాయిపెట్టి బియ్యంకొంటే చేటలోకి పూర్తిగా వచ్చేవికావు. యిటీవల బియ్యపుధర ఆమాదిరిగా వున్న రోజులు నాబాల్యానంతరం చాలావున్నాయి గాని కఱవనిమాత్రం లోకం అనుకున్నట్లు లేదు. ఆ కాలానికి అదే పెద్దకఱవు. అప్పటికింకా మా కుటుంబము కడియం గ్రామంలోనేవుంది. నాకు తగుమాత్రం అప్పటి సంగతు

లిప్పటికిన్నీ జ్ఞప్తిలో వున్నాయి. గాని యిప్పుడు వ్రాసేదిమాత్రం యిటీవల విన్నదేగాని అనుభవించి జ్ఞాపకముంచుకొన్నదికాదు. అప్పుడు మాగ్రామం జియ్యంగారు వచ్చారని చెప్పుకోవడం మట్టుకు జ్ఞాపకంవుంది. నేను జియ్యంగారిని "బియ్యం" గారని వాడినట్లు కూడా జ్ఞాపకంవుంది. యిఁక వ్రాయబోయే సంగతులేవిన్నీ జ్ఞప్తిమీఁద వ్రాసేవికావు. మా తండ్రిగారు వగయిరా లిటీవల చెప్పుకొనేటప్పుడు విన్నవే.

జియ్యంగారంటే, బహుశః శ్రీవానమామల జియ్యంగారైవుండాలి. వీరు శ్రీవైష్ణవపీఠస్థులు. స్మార్తులకు శ్రీశంకరాచార్యపీఠం యేలాటిదో విశిష్టాద్వైతులకు యీ పీఠమున్నూ అలాంటిదే. యిటీవల చాలాభాగము ఆ యీ పీఠస్థుల పవరు తగ్గిందికాని మా చిన్నతనంలో గవర్నమెంటువారి కన్న యీ పీఠస్థులకు తక్కువ అధికారం వున్నట్టు లేదు. వారికి యివ్వవలసిన పాదపూజ సమర్పించకపోతే ఆయాగృహస్థుల యిళ్లల్లో సామాను జప్తుచేయడం వగయిరా అధికారాలు పీఠస్థులకు గవర్నమెంటుతోపాటు వుండేరోజులు నేను కొంచెం ఎఱుగుదును. క్రమంగా మా గోదావరి డిస్ట్రిక్టుకు పీఠమంటూ వుండడమే అంతరించి చాలారోజు లయింది. సుమారు నలభైయేండ్ల దరిమిలాను మా ప్రాంతానికి శంకరాచార్యపీఠం వచ్చినట్టు గాని, పాదపూజ సమర్పించినట్టుగాని నే నెఱుఁగనే యెఱుఁగను. కాని సుమారు పదేండ్లనాడు కాఁబోలును, యెవరో మాంతాచార్య స్వాములవారంటూ మా సమీపగ్రామం జేగురుపాడుకు వచ్చి నాపేర శ్రీముఖం పంపించారు. శ్రీముఖం అంటే గురుపీఠంవారు శిష్యులకుపంపే నోటీసు. దానిమీద నాకు తోఁచిన పాదపూజ పంపించుకొన్నానుగాని తీరికలేని వారి సందర్శనానికి వెళ్లలేదు. మొత్తం చిరకాలాన్నుంచి మా జిల్లాకు పీఠస్థుల సందర్శనం లేకపోయిందన్నది ప్రస్తుతం.

## శైవం - వైష్ణవం

వానమామల పీఠస్థులు మా గ్రామం దయచేయడానికి కారణం శ్రీపిఠాపురం రాజావారే. మాప్రాంతం వెలమవారందఱున్నూ వైష్ణవ మతస్థులే. నేను వెంకటగిరి సంస్థానానికి వెళ్లడానికిపూర్వం వెలమవారిలో శైవులున్నారనే సుతరామున్నూ యెఱుఁగను. యీకారణంచేతనే వెంకటగిరి స్టేషనులో వక వెలమదొరగారితో నాకు నిష్కారణంగా పోట్లాట తటస్థించింది. ఆయన చాలా మంచివారుకనుక కాని, లేకపోతే నాకు ఆపోట్లాటలో "తస్యప్రహరణ" మహోత్సవం కూడా జరిగేదే. అసలు కథేమిటంటే, జంగందేవర వేషముతో వకాయన ఆ స్టేషనులో నాకు ప్రత్యక్షమైనారు. ఆయనతో నేను సామాన్యపు జంగాలతోవలెనే మాట్లాడుతూ వున్నాను. ఆయన మంచివారు కనుక మేము వెలమవారం అని చెప్పారు పాపం. కాదు, మీరు జంగాలన్నాను నేను, యెఱుగనప్పుడు నేనేమన్నా, ఆయన యథార్థం

చెప్పిన తరువాతేనా వెనక తగ్గవలసింది. కాని ఆయన వేషం, వకగంటా శంఖమూ యింతే తరవాయిగాని పూర్తిగా జంగందేవరలా కనపడింది. పయిగా వెలమవారేమిటి? విభూతిరుద్రాక్షలు వేసుకోవడం ఏమిటి? అని వకశంక. అందుచేత ఆయన మాటను నేను బొత్తిగా నమ్మలేకపోయాను. తుదకు విధిలేక నమ్మి, "మావైపున వెలంవారు యెవ్వరూ విభూతివగయిరా ధరింపరు." అంటూ యేవో రెండు యథార్థమైనమాటలే చెప్పి ఆయనవల్ల కాళహస్తి ప్రాంతంలో శివభక్తులైన వెలంవారు వున్నట్టు తెలిసికొన్నాను. యిటీవల చాలారోజులకు గుంటూరుసీమవివాదాలనాడు చేబోలు కమ్మవారిని చూచి కమ్మవారిలో శైవులుండడం తెలుసుకున్నాను. అలాగే హైదరాబాద్ ప్రాంతంలో కంసాలులలో తిరుమణి ధారులున్నట్లు తెలుసుకున్నాను. అందుకే కూప కూర్మంగా వుండడం యెవరికీ కూడదు. కవికి బొత్తిగా కూడదని అనుభవజ్ఞులు చెపుతారు. "అప్రవాసినంచ బ్రాహ్మణందృష్ట్వా సచేలస్నాన మాచరేత్" అనేవారట మా గురువుగారి గురుపరంపరలో వకరైన శ్రీ యింద్రగంటి గోపాలశాస్తుర్లుగారు. అది అట్లా వుండనిచ్చి ప్రకృతం మాట్లాడుకుందాం.

## వర్ణాశ్రమాచారాల పట్టుదల

శ్రీ గంగాధరరామారావుగారు వైష్ణవ మతస్థులవడంచేత వారు పిలిపిస్తే వానమామల జియ్యంగారు శ్రీ రాజావారి ప్రధానగ్రామాల్లో ఒకటైన మాకడియం గ్రామం దయచేశారు. వారు దయచేసేటప్పటికి శ్రీ బులుసు పాపయ్యశాస్త్రులవారుకూడా శ్రీరాజావారి సమక్షమందే దయచేసియున్నారు. శ్రీ రాజావారికి గురుదర్శనానికి వెళ్లేటప్పుడు పాపయ్యశాస్త్రులవారి సహితంగా వెళ్లాలని కుతూహలం వుంది. కాని రాజావారికి వారు గురువులు గాని పాపయ్య శాస్త్రులవారికి వారు మతరీత్యా గురువులు గారుగదా? విద్యలోనో, యెవరూకారు. అట్టిస్థితిలో వారి సందర్శనానికి వీరేలావస్తారు? స్వబుద్ధిచేత రారు. శ్రీ రాజావారు మాత్రం రావలసిందని యేలా కోరుతారు? అప్పటి రాజులంటే వర్ణాశ్రమాచారాలను పరిపాలించడానికి బద్ధకంకణులుకదా? ఆరాజావారిరోజులలో మనగవర్నమెంటు యింత కట్టుదిట్టంలో లేకపోయినా కొంతేనా వ్యాపకంలో లేకపోలేదు. గవర్నమెంటు అధికారాలలో యేకొంచెమోతప్ప "నాన్‌బ్రామిన్సు" వున్నట్టులేదు. గొప్పగొప్పపదవులలో యేచిన్నపరీక్షలో ప్యాసయిన బ్రాహ్మణులే వుండేవారు. అప్పటికి ప్లీడర్ల ఆర్గుమెంటునుగూర్చి యిప్పటికిన్నీ కొందఱు వేళాకోళంగా చెప్పుకుంటూవుంటారు. కోర్టుమునసబుగారు మీ ఆర్గుమెంటు చెప్పండనేసరికి, యెవరో వక్కలంకాయనంట, పేరు జ్ఞాపకంలేదు. "నేను చాలా పెద్దకుటుంబీకుడను, వేతే మనవిచేసేదేమిటి? యీ కేసు కోర్టు వారు నాకు వ్యతిరేకంగా చేస్తే నా దగ్గటికి మఱోకేసు రాదు, కాఁబట్టి అనుగ్రహించ వలసిందని మీ ఘనతనుగూర్చి

మిక్కిలిప్రార్థిస్తాను." అనిచెప్పే వారట! అట్టిస్థితిలో బ్రాహ్మణ ప్లీడర్లే వుండేరోజుల్లో "నాన్‌బ్రామిన్సు"కు చదువుసందెలెక్కడ? ఉద్యోగాలెక్కడ? యెవరేనా వక వుద్యోగి వారిలోవుంటే జమీందార్లకు-అందులో క్షత్రియ వెలమ యీ జాతి జమీందార్లకు - వారికి దర్శనమివ్వడానికిఁగాని వారితో మాట్లాడటానికిగాని, బొత్తిగా ప్రాణసంకటంగా వుండేదఁట. దీనికిసంబంధించిన గాథలు పిఠాపురం సంస్థానానికి చెందినవే చాలా వున్నాయి. వాట్లనుగూర్చి మఱొకప్పుడు మాట్లాడుకొందాం. అప్పటి జమీందార్లకేమి, ప్రజలకేమి వర్ణాశ్రమాచారాల విషయమై మిక్కిలి పట్టుదల వుండేదన్నది ప్రస్తుతం.

## గజానికి గజమున్నర లెక్క

ఆ కారణంచేత శ్రీ పాపయ్యశాస్త్రుల్లుగారు జియ్యంగారి దర్శనానికి వెళ్లావెళ్లరు, వారిని శ్రీ రాజావారు రమ్మని అనాఅనరు. కాని ప్రస్తుతం అలా జరుగలేదు. దీనిలో మహాపాతక మేముందనే తాత్పర్యంతో, "మహాపండితులుగదా శాస్త్రుల్లుగా"రని ఆలోచించి, అయినా యేమంటారో చూతామని రాజావారు 'శాస్త్రుల్లుగారూ జియ్యంగారి దర్శనానికి మాతో తాము దయచేయడాని కేమైనా అభ్యంతరం వుంటుందా?' అన్నారట, విలాసంగా. దానిమీద పాపయ్యశాస్త్రుల్లుగారికి పచ్చివెలక్కాయ గొంతుకలో పడ్డట్టయింది పాపం! యేమంటే, నిన్నగాక మొన్న శ్రీరాజావారిచే స్వయముగా "మీకు మా యెస్టేటులో యెక్కడ యెంతభూమి కావాలో కోరుకోవలసిం"దని కోరుకోఁబడి, "నెల 1 కి ఒకపుట్టి భూమి చొప్పున వుంటేచాలును" అనఁగా పుట్టి అంటే మా వైపున 8 యకరాలు కనుక "సంవత్సర గ్రాసానికి 12 పుట్ల భూమి 96 యెకరాలు యిప్పించవలసిం"దని కోరుకొని ఆ భూమి వారి స్వగ్రామానికి సమీపంలోవున్న శానపల్లె లంకలో పుచ్చుకొని వున్నారాయె. ఆ పుచ్చుకోవడంలో ఠాణాదారుగారిని, పాండిత్యం చేతనే అనుకోండి, లోపుచేసుకొని 12 పుట్లకు పద్దెన్మిది పుట్లుకూడా కొల్పించుకొని వున్నారు పాపయ్యశాస్త్రుల్లుగారు. యీ మోసము రాజావారి కేలాగో తెలిసి ఆ ఠాణేదారుని బరతరపు చేశారు కూడాను. ఆ సంగతి పాపయ్య శాస్త్రుల్లుగారికి తెలిసి మళ్లా రాజావారి దర్శనానికి వెళ్లి తాము మాకు మొన్న దయచేయించిన భూమిని మళ్లా మీరే స్వీకరించవలసింది. మాకు సుతరామున్నూ అది అక్కరలేదన్నారట పాపయ్య శాస్త్రుల్లుగారు! దానిమీద రాజావారు "ఇదేమి శాస్త్రుల్లుగారు; యిలాసెలవిస్తూవున్నారు. మేము మీయెడలచేసిన మహాపరాధమేమిటో దాన్ని వ్యక్తీకరిస్తే సవరించుకోఁదగ్గదయితే సవరించుకుంటా" మన్నారట. శాస్త్రులుగారు "యింతకంటే అపరాధ మేం కావాలి. మాకు భూమి కొలిచియిచ్చిన ఠాణేదారుణ్ణి మీరు బరతరపు చేయడంవల్ల మాకు ఆ భూమియందు అనాదరంకలిగిం"దన్నారట. దానిమీఁదరాజావారు "మా వుద్యోగస్థుడు మా ఆజ్ఞకు

అన్యథాగా వర్తించడంవల్ల బరతరఫుచేశాం కాని మీ యందు మాకు లేశమున్నూ అనాదరం లేదే" అన్నారట. దానికి శాస్త్రులుగారు చెప్పిన జవాబేమిటంటే:- "అయ్యా ఆయన మీ యాజ్ఞకు లేశమున్నూ వ్యతిరేకించలేదు. యేమంటారా? పండ్రెండుపుట్ల భూమి మీరు మాకుకొలిచి వప్పజెప్పవలసిందనేకదా ఆయనకాజ్ఞాపించి ఉన్నారు. ఆయన అట్లే వప్పగించారు. దీనిలో ఆయన తప్పేముందన్నారట." రాజావారు "12 టికి 18 పుట్లు యివ్వడం తప్పుకాదా" అన్నారట. పాపయ్యశాస్త్రులుగారు అన్నారట:- "అయ్యా మాకు మీరు భూమి యివ్వడం యెందుకువచ్చిం"దని ప్రశ్నించారట. మీరు జగదేక పండితులనే కారణంచేత యిచ్చి తరించాలనేవుద్దేశంచేత నన్నారఁట. సరేఎందులో పండితులమని మీవుద్దేశమన్నారట? వేదశాస్త్రాలలో అన్నారఁట. అవి యే భాష అన్నారఁట. గీర్వాణభాష అన్నారట రాజావారు. గీర్వాణభాష కదా, గీర్వాణులంటే దేవతలే కదా? మేము ఆ భూమి దేవమానంచేత కొలిపించు కొంటాంగాని మనుష్య మానంచేత యేలాకొలిపించు కొంటామని తమరనుకున్నారంటూ చెప్పి యేలాగయితేనేమి గజానికి గజమున్నర చొప్పున లెక్కకట్టి సరిపెట్టి రాజావారికి నచ్చఁజెప్పి మళ్లా ఆ ఠాణేదారు వుద్యోగం ఠాణేదారుకిప్పించి తమ భూమిని తాము నిల్పుకున్నారఁట. ఆ భూమి అంటే సామాన్యమైనదికాదు, లంకభూమి. యితరత్ర వకయకరం యెంత ఖరీదో అక్కడ వకసెంటు అంతఖరీదు చేస్తుందన్నమాట. అది యిప్పటికిన్నీ వారి కుటుంబీకులు అనుభవిస్తున్నారు.

### శాస్త్రులుగారి లౌక్యప్రజ్ఞ

చెప్పేదేమిటంటే, అట్టిమహాదాత రాజావారు. వారిగురువులదర్శనానికి వెడుతూ, రమ్మంటే రానని శాస్త్రులుగారు ఎలాచెప్పఁగలరు? "అర్థస్య పురుషో దాసః" అన్నాఁడుగదా భీష్ముఁడంతటివాడు. ద్రోణాదులు కూడా ఈమాటేచెప్పారు ధర్మరాజుతో. అయితే పాపయ్య శాస్త్రుల్లుగారు మహాలౌక్యులు. తుదకు వెళ్లకుండా చమత్కారంగా తప్పించుకున్నారని వినికి. యేంచేశారంటే:- అయ్యా మా స్మార్తమతం సర్వమతాలని సహిస్తుంది. వానమామలస్వామి దర్శనానికి రావడం నాకు లేశమున్నూ బాధకంకాదు. కాని నన్ను చూడడం వారికి బాధకంగా ఉంటుంది. విభూతి రుద్రాక్షధారణతో వున్నవారిని సామాన్యంగా శ్రీవైష్ణవులే చూడడానికి సంశయిస్తారు. అందులో వారు గురుపీఠంగదా? అట్టివారు సంశయింపకుండా వుంటారా? వకవేళ తమతోవచ్చిన హేతువుచేత యేలాగో స్వామి సహించి వూరుకొన్నా శిష్యులవల్ల ముందుముందేనా వారికి ఆక్షేపణ కలగడంతప్పదు. అనేటప్పటికి రాజావారు వారిలౌక్యప్రజ్ఞకు సంతోషించి వారిని వెంటఁబెట్టుకొనివెళ్ల కుండానే గురువులవారి దర్శనానికి దయచేశారఁట!

భూమి కొలత సందర్భములో దేవమాన మనుష్యమానాల విషయం యెట్లావున్నా అప్పటికాలపు దాతల సౌశీల్యాన్ని మనం ముఖ్యంగా గమనించాలి. అంతేకాక, పాండిత్యంలో యెంతగొప్పతనమున్నా ఛాందసత్వం కొంత దురాశ కలిగింపక మానదనికూడా అనుకోకతప్పదనుకొంటాను. ఆ దురాశవల్ల అవమానం పొందకపోవడమున్నూ పయిగా తమ లౌక్యప్రజ్ఞచేత తాముతరించడమే కాకుండా తమతోపాటు తాటితోదబ్బనంగా ప్రవర్తించిన (పాలెప్పళ్లంరాజు) ఠాణాదారుగారినికూడా తరింపఁజేయడం వగైరా పాపయ్య శాస్త్రుల్లుగారి ప్రజ్ఞావిశేషానికి వుదాహరణంగా మనం గ్రహించవచ్చును. ఆయన గనక సరిపోయింది కాని యిదే మఱో పండితుఁడికి తటస్థిస్తే రాజావారు మంచివారుకనక శాస్త్రుల్లు వారికిదక్కితే 18 పుట్ల భూమిన్నీ దక్కేదేమోకాని ఠాణాదారుగారికి వుద్యోగంవూడి "అగ్నేయంతి" సిద్ధమయ్యేది.

## రామకవిచాటుధార

ఈ పళ్లంరాజుగారి తుట్టతుదిదశలో, అనగా వారం పదిహేను రోజులలో స్వర్గానికి వెడతారనగా నేనూ వీరిని చూడడం తటస్థించింది. వీరివల్ల ఆరోజున శ్రీ శిష్టు కృష్ణమూర్తిగారికి సంబంధించినవిన్నీ, పాపయ్య శాస్త్రుల్లుగారు వగయిరా ఆ కాలంనాటి వారికి సంబంధించినవిన్నీ చాలా గాథలు విన్నాను. నన్ను ఆయన యెవరిద్వారానో యేకసంథాగ్రాహినిగా వినివున్నారఁట. భోజనమయిన తరవాత కూర్చున్నప్పుడు అన్నారుగదా:- వెనక శ్రీ శిష్టు కృష్ణమూర్తిగారికి వుండేది యీ ప్రజ్ఞ యిటీవల తమకు వుందని విన్నాను. యేదోవకపద్యం చదువుతాను మళ్లా మీరు చదవాలంటూ అడగడానికి మొదలుపెట్టారు. ఆ యీ గాథ వికారి సంవత్సరం నాఁటిది. అప్పుడే నాకు కొంచెం బుద్ధిబలం తగ్గడ మారంభించడంచేత, తెనాలిరామలింగంగారి - "ప్రాయపుప్రొద్దంత కొంత పడమటఁదిరిగెన్" అనేస్థితిలో వున్నాను. అంతకుముందైనా యేవోకొన్ని పద్యాలు మాత్రమే యేకసంతకు వస్తాయిగాని అన్నీరావు. అర్థం తెలిసేవైతే రావడాని కభ్యంతరంవుండదు. కాని అప్పటిస్థితిలో అలాటిది కూడా యేకసంతకు రావడం అనుమానాస్పదమే. ఆ యీ సందర్భాలు వున్నవివున్నట్లుగా చెప్పేటప్పటికి ఆయన అన్నారుగదా; పోనీ రెండుసంతలకు చదివినా చాలునని యీ క్రింది పద్యాన్ని చదివారు.-

ఉ. పెండెలనాగి చెక్కులను పెద్ది కటిస్థలి, గంగిగుబ్బచన్
గొండల నుండు రామకవికుంజరు హస్తము క్రిందుచేసె, హా!
పండక బంటుమిల్లి, అది పండిన యీ కసుమాలధారుణీ
మండలనాథుఁబోలు నొక మానవనాయకు వేఁడనిచ్చునే?

నేను సుళువుగా రెండుసంతలకు వప్పగించాను పై పద్యం. ఆయన సంతోషించారు. యీ పద్యం తురగా రామకవిగారి చాటుధార. యీయన తాలూకు అగ్రహారం బంటుమిల్లి పండకపోతే శ్రీ మొగల్‌తుర్తి ప్రభువుల సందర్శనానికి వెళ్లేటప్పటికి దివాన్‌జీగా రన్నారఁట:– యీయేడు దివాణం పనిన్నీ కిచ్చాటుగానేవుంది వచ్చేయేడు దయచేయాలన్నారఁట. దానిమీఁద కవిగారికి కోపంవచ్చి "పనసకాయ దొరికినప్పుడు తద్దినం పెట్టుకోవాలిగాని, తద్దినం వచ్చినప్పుడు పనసకాయెక్కడ దొరుకుతుం" దని పైపద్యాన్ని చెప్పాఁడట! ఆ పద్యంవల్ల నాఁటికవుల నిరాఘాటత్వం మనం తెలుసుకోవచ్చు. "పెద్దాపురపుకోట పెద్దమ్మ కిల్లొట కవివరేణ్యుల కోప కలనఁగాదె" అన్న మా శ్రవణానందంలోని కవి వరేణ్యుఁడు యీ రామకవిగారే. పిండి ప్రోలు లక్ష్మణ కవిగారు మొదలయిన వారు యీ తురగా రామకవిగారిని వేములవాడ భీమకవిగారితోపాటు గౌరవించి వున్నారు – "ఉంగుటూరిళ్ల రాకాసు లుండవచ్చు" అన్నది కూడా యీ రామకవిగారే. యీయనవాక్కు మంచినిగాని చెడ్డనుగాని సాధించడంలో పేరుపడింది. మంచివిషయమైన గాథలున్నట్లేలేదు. చెడ్డ లెక్కువున్నాయి. వాట్లను వుదాహరించడాని కీవ్యాసం పుట్టలేదు కనుక స్పృశించి వదలుతున్నాను. యిట్టికవులెవరో కొందఱున్నారని ప్రతీకవి కవిత్వాన్ని బట్టి యిలాటి మంచిచెడ్డలు జరుగుతాయని విమర్శించే నేఁటి విమర్శకులధోరణి శోచ్యము. దీన్ని గుఱించి నేఁటరేపటఁ గొంత ప్రసక్తి కలిగితే కలుగుతుందని కొంచెం వాసనగొట్టడంచేత యింతదాఁకా ప్రస్తావించాను.

## గురువులవారి శిష్యవిత్తాపహారిత్వం

శ్రీరాజావారిని గురువుగారి దర్శనానికి పంపించివుంది కథాసరస్వతి. యింక అక్కడ జరిగిన సంగతి సందర్భాలు వ్రాయాలి. యేముంది, 'కట్టేఁడు – కొట్టేఁడు' అన్నమోస్తరుగా వ్రాస్తే యిదివఱకే ముగింపయేది. మధ్యమధ్య యితరప్రసంగాలవల్ల కొంత పెరిగింది. కానివ్వండి. గురువులవారికి పాదపూజ వక లక్షకు తక్కువ స్వీకరించడానికి సంకల్పం లేకపోయింది. రాజావారో? యేభైవేలకుమించి యిచ్చేసంకల్పం లేకపోయింది. వారికీ వీరికీ కొంతవఱకు మృదువుగానే కొంత చర్చ జరిగివుంటుంది. శ్రీ రాజావారు గురువులవారి "శిష్యవిత్తాపహారిత్వం" బాగా కనిపెట్టారు. "శిష్యహృత్తాపహారులు" వీరు లేశమున్నా కారనుకున్నారు. యిట్టివారిని మనం పిలిపించడమే ప్రథమ తప్పిద మనుకొన్నారు. యేభైవేలుకూడా ఆయన అంగీకరించినప్పటికీ ఇవ్వడం దుర్వ్యయమే అనుకున్నారు. యీ దుర్వ్యయం లేకుండా చేసినందుకు గురుపీఠంవారు అభినంద్యు లనుకొన్నారు. యేమనుకొన్నప్పటికీ గురుత్వం వదులుకోడానికి వీలులేదే! దానిలో యివేమేనా స్మార్తగురుత్వాలా? 'అర్థం ప్రాణం ఆచార్యాధీనం' అనే తరగతిలోవి కదా?

## జుట్టుకోతప్రకరణం

మా రాజావారివద్ద యీ అర్ధప్రాణాచార్యాధీనాల ఆటలు కూడా సాఁగుతాయా? ఆయన మహా యుక్తిశాలి. చక్కఁగా ఆ శిష్యత్వాన్నుండి తప్పించుకున్నారు చూడండి. లోపల గురువుగారిమీద బోలెఁడు కోపం వచ్చింది. అలా కోపంరావడమే తటస్థిస్తే ఆరోజుల్లో మా రాజావారికి యెవరిమీఁద వచ్చిందో వారిజుట్టు వుండేదికాదు, కాని ఆ జుట్టుకు యెన్ని సంచుల రూపాయిలో వెంటనే ముట్టేవి అని యిప్పటికిన్నీ చెప్పుకుంటారు. జుట్టు పోఁగొట్టుకొని రూపాయిలు స్వీకరించినవారిలో యిప్పటి కెవరున్నూ మిగిలినట్లు లేదు. యాభై అరువై యేళ్లనాఁటి ముచ్చట్లు. యీ సంగతి తెలిసి కొందఱు ధనసంపాదనకు యిది మంచి వుపాయమని రాజాగారివద్ద కొంత తెలివి తక్కువగా నడవడాన్ని ఆరంభించేవారఁట. యెందుకంటే ఆ కాలంలో యిప్పటికాలంలోలాగా - సకలమ్మున్ గౌరిగించుకోవడం ఫేషను కాకపోవడంచేత, జుట్టుపోయిందంటే పెద్ద అవమానమేకాని, ఆ అవమానానికేమి, పోతేపోయింది వెధవజుట్టు, మళ్లా పెరుగుతుంది. “శాకినీవ దినేదినే” వేలకొలది సొమ్ము దానంతటది వచ్చి యింట్లో పడుతుంది గదా! అని ఆ పెద్ద మనుష్యుల ఆశ. “బోలెడుతిట్లయినా బొక్కెఁడు కొట్లలుగా” వంటారుకదా పెద్దలు? అయితే అలా ప్రయత్నించినవారి జుట్టుమాత్రం మారాజావారి ఆయుధానికి వక్కటీకూడా బలిఅయినట్లు నేను వినలేదు. యెంతసేపూ వారి దివానులవీ, అడపాదడపా గవర్నమెంటు వుద్యోగులవీ అరుదుగా పండితులవీ పోతూవచ్చాయి. పండితులంటే ఆకాలంలో ఆ బిరుదు రావడం సామాన్యంగా వచ్చేదికాదు. కావ్యనాటకాలంకారాలు పూర్తిగా చదివినవారికి ఆ బిరుదు వుండేదేకాదు. సాహిత్య గాళ్లనేవారు వారిని. ఏదో వక శాస్త్రంలో పూర్తిగా పాండిత్యం సంపాదిస్తేనే పండితుడనడం. ప్రస్తుతం పండిత అనేబిరుదు బహు తేలికగా సంపాదన అవుతూవుంది. దీన్నిలా వుంచుదాం.

## పొక్కునూరి వేంకట శాస్త్రులుగారు

పండితులలో అనగా సాహిత్యపరులలో పొక్కునూరి వేంకట శాస్త్రుల్లు గారనేవా రొకరు శ్రీ రాజావారితో బహు చనవుగా మాట్లాడేవారుండేవారట! శ్రీవారున్నూ యీ శాస్త్రుల్లుగారున్నూ సహాధ్యాయులని వినడం. యే చదువు సందర్భంలోనో తబిసీలు తెలియదుగాని బహుశః కావ్యపాఠ సందర్భంలో అయి వుండాలి. రాజావారు యెవరేనా పండితులు వస్తే వారితో ధారాళంగా సంస్కృతమే మాట్లాడేవారని వినికి. ఆ కారణంచేత వారు బాల్యంలో సంస్కృతభాష అభ్యసించి వుండాలి. ఆ సందర్భంలో యీయన రాజావారికి సహాధ్యాయులో, సతీర్థులో అయివుండాలి. ఆ చనువుచేత ఆంతరంగికులుగా వుండడమే

కాకుండా యీయన రాజబంధువులకేమి, పండితులకేమి యెందటికో రాజావారిచేత యెన్నో వుపకారాలు చేయించినట్లు వినికి. అంత చనువుండడంవల్ల నిర్భయంగా మాట్లాడుతూ వుండడం వుండేదేమో. దానిలో యేం పొరపాటొచ్చిందో వకపర్యాయం కాబోలును రాజుగారి కత్తికి శాస్త్రుల్లుగారి జుట్టుపిలక పనిచెప్పినట్లు వింటాము. ఆ పిమ్మట కూడా వారిద్దరికీవున్న బాల్యమైత్రికి లోటులేకుండానే జరిగినట్టున్నూ వింటాము. ఆ కారణంచేతనే ఆ శాస్త్రుల్లుగారెప్పుడో మళ్లా రాజాగారు కులాసాగా మాట్లాడుతూవున్న సందర్భంలో యీ జుట్టుకోఁత ప్రసంగం వచ్చేటప్పటికి "మహాప్రభో, నా జుట్టు యెంతో అదృష్టం పెట్టిపుట్టిందికనక మీవంటి మహాప్రభువుల కత్తికి యెరయింది" అంటూ యింకా కొంత మోటుగానే మాట్లాడినట్లున్నూ, ఆయుక్తికి రాజావారు చాలా సంతోషించినట్లున్నూ కూడా వినికి.

## వకకమ్మకులీనుడు

ప్రసక్తానుప్రసక్తంగా జుట్టుకోఁత ప్రకరణంలోకి దిగాంగనుక యీ ప్రకరణం తరువాయికూడా యేకరు పెట్టేసే ప్రధానాంశంలోకి వస్తాను. గృహస్థులలోకి శ్రీ రాజావారికి మిక్కిలీ ప్రేమపాత్రుఁడైన సంపన్న గృహస్థు వక కమ్మకులీనుని జుట్టుక్కూడా యీ అదృష్టం పట్టిందట. కాని వెంటనే నలభైవేల రూపాయిల సంచులను యేనుఁగుమీఁద వేసికొని రాజావారు ఆ ఆసామీని గౌరవించడానికి స్వయంగా మితపరివారంతో వస్తాదు సహితంగా ఆయన గ్రామానికి దయచేసినట్టున్నూ, ఆకమ్మ కులీనుని మేనల్లుళ్లు వగయిరా అసలాయన యెంతచెప్పినా వినక రాజావారిని అవమానించే ప్రయత్నం పూర్తిగా చేసినట్టున్నూ. యేలాగయితే యేమి వస్తాదు తెలివి తేటలవల్ల ఆ గండాన్నుండి తప్పించుకొని రాజావారు సురక్షితంగా కోటలోకి చేరుకున్నట్టున్నూ వినికి. కాని అసలు జుట్టుకోతబడ్డ ఆసామీ మిక్కిలీ రాజభక్తుడున్నూ రాజావారి మృదుహృదయమున్నూ తాత్కాలిక కోపమున్నూ యెఱిఁగినవాడున్నూ అవడంచేత, లేశమున్నూ తన మేనల్లుళ్ల దురాగతానికి సమ్మతింపనేలేదని యేకగ్రీవంగా అందఱూ చెప్పుకుంటారు. అయినా తుదకు మేనల్లుళ్లు చేసిన పనికి ప్రతిఫలంగా ఆ ఆసామీ యేడు సంవత్సరాలు కాబోలును కఠిన శిక్ష అనుభవించి విడుదలకాకుండా ఖయిదులోనే కాఁబోలును మరణించినట్లు విన్నాను.

## సవతినాయనమ్మగారు

జుట్టుకోఁతలలో కొంత గణింపదగ్గది పురుషులకు సంబంధించిందిది మాత్రమే. స్త్రీలకు సంబంధించినవి అంతగా నున్నట్లే లేదు. సవతి నాయనమ్మగారిమీఁద కాబోలును

కోపంవచ్చి బాగా చిన్నతనంలో అంటే రాజ్యాధికారం వహించినపిమ్మటే యీ మహోత్సవం జరిగించి తరువాత పస్తాయించికొని వారిలోవారే కనక వక యుక్తిచేసి అది లోలోపలే మాసిపోయేటట్టు చేసుకున్నారని వినికి. యేమిటంటే ఆ యుక్తి:- నాయనమ్మగారే కనక, మళ్లా ఆవిడ దర్శనానికి వెళ్లి నమస్కారంచేసి, నేను యీ పని యెందులకు చేయవలసి వచ్చిందంటే, సుమారు 5, 6 నెలలనాఁడు మీకు మిక్కిలి జబ్బుచేసింది. ఆ సంగతి తమ చిత్తానికి విశదమే. ఆ సందర్భంలో మీరు బ్రతుకరనే సంశయం నాకు తోఁచి, వున్న యీ కాస్త పెద్ద దిక్కున్నూ లేకుండా చేస్తాడేమో భగవంతుడని దిగులుతోఁచి "కలౌవేంకటనాయకః" అని వుండడం చేత శ్రీ తిరుపతి వేంకటేశ్వరస్వామివారికి నాలో నేనే మీరు నింపాదిగావుంటే "యిలా జరిగింపచేస్తా" నని మ్రొక్కుకున్నాను. కాని యిటీవల యీ మాట మీతో మనవిచేస్తే మీరు సుతరామున్నూ అంగీకరించరని నాకు తెలిసివుండడం వల్ల నైతేనేమి, వకవేళ నాయందువుండే ప్రేమాతిశయంచేత తాము అంగీకరించినప్పటికీ తమకేశపాశం వకమంగలిచేత స్పృశింపఁజేయడానికి దేవతా సాన్నిధ్యంలో అయినప్పటికీ అంతఃపుర మర్యాదకు విరుద్ధంగా వుంటుందని తోఁచియేమి, మంచో చెడ్డో నాకీలా తాత్కాలికంగా తట్టి లేనికోపాన్ని తెచ్చుకొని ఆకాస్తా నేనే చేయవలసివచ్చింది. అనేటప్పటికి మనుమడి యుక్తిచమత్కారానికిన్నీ భక్తి తాత్పర్యాలకున్నూ సంతోషించి యెప్పటివలెనే చల్లని దృష్టితోనే ఆదరిస్తూ వుండేవారనిన్నీ పెద్దలవల్ల వినివున్నాను.

యేమైనా, గవర్నమెంటుప్రభుత్వం యింకాబాగా బలపడ్డరోజులు కావుకనుక మా రాజావారి ప్రభుత్వం పూర్వపుజమీందార్ల ప్రభుత్వమ్మాదిరిగా నిరంకుశంగానే వెళ్లిపోయిందనడానికి పయిజుట్టుకోఁతలు వగయిరా సాక్ష్యమిస్తాయి. జుట్టుకోతపడడమంటే శిరచ్ఛేదం చేయడానికితగ్గ కోపం వస్తేనే జరిగించేవారని తజ్ఞులుచెప్పేవారు. రాజావారి దర్శనానికి వెళ్ళడమంటే పెద్దపులివుండే గుహలోకి వెళ్లడమే అని యెవరిమట్టుకువారే భయపడుతూ వుండేవారట. "తస్మాద్రాజ ముఖం భీష్మం భావుకం" అంటారుకదా? కాని నిరపరాధులను యెవరినిగాని రాజావారికోపం బాధించనేలేదని యిటీవల, అనఁగా శ్రీవారి జీవితానంతరం, చెప్పుకుంటూ వుండఁగా శతథా సహస్రథా వినివున్నాను. అంతకుపూర్వం జమీందార్లకు సివిలు మేజస్ట్రేటు అధికారాలు వుండడమున్నూ అప్పుడప్పుడే అవి తప్పిపోతూవున్న రోజులవుతూ వుండడముచేత యెవళ్లేనా దివాణం విషయంలో అవిధేయతగా వర్తిస్తే, సామాన్యపు లాకలూకాయ లతోపాటు వారుకూడా మేజస్ట్రేటువద్ద ఫిర్యాదు చేసుకోవడం అనేది నామర్దా అనిపించి రాజావారిట్లా చేసేవారని లోకుల వుత్ప్రేక్ష. యిదేనా యీ పిఠాపురపు ప్రభువరేణ్యునకే సాగిందిగాని యింతకన్నా పెద్దసంస్థాన మైనప్పటికీ విజయనగరానికి కూడా సాఁగినట్లులేదు. వొక్కొక్క జాతక ప్రభావం వొక్కొక్క

హోరగా జరుగుతుంది. గతించిన శ్రీ ఆనందగజపతి మహారాజులుం గారు యావజ్జీవమున్నూ తమప్రభుత్వానికి సివిల్ మాజస్ట్రేటు అధికార సంపాదన కోసమె యత్నించి తుదకు కృతకృత్యులు కాలేదని వింటాము. వీరట్టి ప్రయత్నం చేసినట్లు లేదుగాని స్వయంగానే సాఁగించుకున్నారు.

## వక గవర్నమెంటు వుద్యోగి

వక గవర్నమెంటు వుద్యోగికూడా వీరి ఆగ్రహానికి యెఱకావడం తటస్థించిందఁట. అది లోలోపల మాసిపోక పై అధికార్ల నోటీసుదాఁకా వెళ్లి, తుదకు ఆ వుద్యోగి శృంగార ప్రియుఁడు కనుక ఆయన ప్రియురాలికి పదిహేనువేల రూపాయిలు యివ్వడానికిన్నీ ఆ వుద్యోగి మొదటతన్ను రాజావారు కొట్టినట్టుచెప్పి యిప్పుడు అన్యథాగా చెప్పడంవల్ల వుద్యోగం పోవడం తటస్థిస్తుందిగనక ఆ విషయంకూడా ఆలోచించఁదగ్గదే అవడంచేత ఆయనకు యావజ్జీవమున్నూ వుదయ వరహా లివ్వడానికిన్నీ యేర్పఱచి ఆ చిక్కులోనుంచి తప్పించుకొన్నట్లు మా తండ్రి గారివల్లనే వినివున్నాను. యింత తపిసీలుగా మా తండ్రిగారికి తెలియడానిక్కారణం:- ఆ వుద్యోగి మా గ్రామం వచ్చినప్పుడు మా పశువుల పాకలో మకాంచేసేవారఁట. యేంకర్మం, గ్రామంలో బసేదొరికేదికాదా అంటే, ఆయన దాసీప్రియురాలి సహితంగా వస్తే యే గృహస్థింట్లో బసదొరుకుతుంది? వారు అడగా అడగరు. అప్పటి కాలాన్నిబట్టి గృహస్థులు యివ్వా యివ్వరుకదా? మాతాతగారికి వ్యవసాయం విస్తరించి వుండడంవల్ల, గవర్నమెంటు అధికారిగదా ఆయనతో యెప్పుడేంపని పడుతుందో అని ముందాలోచనచేసి, యింటికి కొంతదూరంలోఉన్న పశువులపాక బాగుచేయించి, ఆ నాలుగు రోజులున్నూ పశువులను యితరత్ర కట్టుకొనే వారఁట! అందుచేత యీ రాయబారాలు యావత్తున్నూ మా యింట్లోనే జరగడంచేత మా తండ్రిగారికి బాగా తెలియడానికి కారణమయింది.

## గురు శిష్యభావపు వాడితనం

యింతకూ ప్రధానాంశం రాజావారికి గురువుగారి విషయమై పట్టరాని కోపంవచ్చింది. యితరవిషయమైతే యేం జరిగేదో? గురువిషయం కదా? వారి ప్రవర్తన మేలావున్నా శిష్యులు ఆక్షేపించడానికి అవకాశం లేనట్లు, శాస్త్రాలు ఘోషిస్తూవున్నాయి. రాజావారు పూర్వాచార పరాయణులు. మంచి శ్రుతపాండిత్యం కలవారు. గురువుల విషయంలో తొందర పడతారా? లేదా, మరి యిచ్చచొప్పున లక్షా కుమ్మరిస్తారా పాదపూజకింద? యీ మధ్యనే రాజమండ్రిలో జరిగిందని విన్నాను - వక సంపన్న

గృహస్థింటికి గురువులు వచ్చారు. వారికి సప్లయి చేయడంలో బ్రాందికూడా కావాలని జాబితాయిచ్చారు. శిష్యుఁడికి ఆ వస్తువు సేవించడం బాగున్నట్లు తోఁచలేదు. దానిమీద “స్వామీ యిదిమాబోట్లమేసేవించం, మీరు గురువులు, మీరుసేవిస్తే లోకంపాడయిపోదా?” అని వినయంగానే మనవి చేసేటప్పటికి, గురువుగారికి కోపంవచ్చి, నీవు కులగురువునగు నన్ను ధిక్కరించావు కనుక వంశనాశనమయిపోతావు అని శపించారఁట. ఆ శాపాన్ని ఆగృహస్థుతల్లివినినొచ్చుకొని “అయ్యా, యెఱఁగఁడు, అజ్ఞాని, “మీమాటకు యెదురు చెప్పకూడదు” అంటూకోపోపశమనంజేసి జాబితాయిప్పించవలసిం దంటే, శాంతించి వఁకపూటకు కాబోలును నలుగురైదుగురికి రు.25-0-0లు బిల్లుచేశారఁట! గురుశిష్య భావం అంటే ఇట్టిది. అందులో వైష్ణవసంప్రదాయంలో దీనికి మఱీ వాడితనం వుంటుంది. యీ రోజుల్లో అన్నిటితోపాటు దీనికిన్నీ వాడి తగ్గింది కాని యేలాగైనా యింకా యిది అక్కడక్కడ మిక్కిలీ అమల్లోనేవుంది.

సామాన్యగృహస్థే అంతోయింతో గురువుగారి అవ్యక్తతకు యెదురు తిరగవలసివచ్చిందే, మండలాధిపతి యెదురుతిరగడంలో ఆశ్చర్య మేముంటుంది? అయితే యిక్కడ అలాటి అవ్యక్తత యేమివుంది? మండలాధిపతి శిష్యుఁడైనప్పుడు గురువు వారితాహతు ననుసరించి పాదపూజ యిమ్మని కోరవచ్చునుగదా? అంటే, యీ ఆశకు పరిమితంటూ వుంటుందా? యెంత పీఠాధికారస్థులైనా సన్యాసులేకదా? అట్టి సన్యాసుల ఆశ గృహస్థులకన్ననూ మించిపోతే యిఁక సన్న్యాసంపుచ్చుకోవడమెందుకు? ఆయీ సందర్భాలు ఆలోచించి చూస్తే గురువులవారి ప్రవృత్తి సమర్థనీయంకాదు. రాజావారో, లక్షయివ్వడానికేకాదు, యెన్నిలక్షలివ్వడానికైనా తాహతు కలవారే అనుకుందాం. తుదకు రాజావారు చేసిన చమత్కారం చూడండి. అట్టే నిదానించారు. దీనికి వుపాయం యిదే అనుకున్నారు. దగ్గరవుండే ప్రధాన నవుకరు బొంగు కిష్టమ్మను, కిష్టమ్మా విభూతిసంచీ యిలా తెమ్మన్నారు. గురువుగారు చూస్తూవుండఁగానే ద్వాదశోర్ధ్వపుండ్రస్థానాలకు చతుర్వింశతి విభూతి పెండికట్లు ఆదేశంగా ధరించారు. గురువుగారు ఆశ్చర్యపడి, యాభైవేలూ గంగలో గల్పుకున్నాంకదా అనిలోలోపల అనుకుంటూ వున్నారు. ఆ పట్లాన్ని దిగ్గునలేచారు. స్వామీ అని సగౌరవంగానే గురువుల వారిని సంభావించారు. అయ్యా, నా పేరెవరో తమకు తెలుసునా? అన్నారు. గంగాధర రామారావు; యీ పేరునుబట్టి నాకు తిరుమణితిరుచూర్ణధారణ కెంత ఆవశ్యకత వుందో విభూతి రుద్రాక్ష ధారణకున్నూ అంతే అధికారంవుంది. ఆజ్ఞ తీసుకుంటున్నాను, శిష్యుని యందు దయవుంచండి, అనిలేచి కోటలోకి దయచేసినట్లు ప్రత్యక్షంగా చూచినవారు చెప్పగా నే విని వున్నాను.

## అప్పటికాలానికీ యిప్పటికాలానికీ వ్యత్యాసం

యీగాథ యావత్తూ మావీథినే మాయింటికి సుమారు 60, 70 గజాలలో వుండే వైఖానసుల గృహంలోనే జరిగింది కాని, నాకు బొత్తిగా చిన్నతన మవడంచేత యితరులవల్ల విని వ్రాయడమే అయింది. కాని స్వయంగాచూచి వ్రాసిందిమాత్రంకాదు. అయితే ఆ వయస్సులో జరిగినవి కూడా కొన్ని యిప్పటికిన్నీ జ్ఞాపకంవున్నాయి. శ్రీ రాజావారు మా గ్రామం దయచేసినప్పుడు ఏవీథిని వెడతారో ఆ వీథినివున్న యిండ్లల్లో వుండే ముత్తైదువులు మంగళహారతు లివ్వడం వుండేది. ఆలా హారతిపట్టిన పళ్లేలలో యేదో రూపాయికి తగ్గకుండా ఆ రాజావారు వేయించడం వుండేది. యిది జ్ఞాపకం వుందిగాని మఱికొన్ని జ్ఞాపకం లేవు. యిప్పటికీ అప్పటికీ చాలా వ్యత్యాసం. యేవిషయంచూతామన్నా వ్యత్యాసమే. యిప్పటి జమీందార్లు యెవరినేనా ధనికుఁడుగా వుండేవాణ్ణి మన్ననగా పిలుస్తారు పిలవవలసివస్తే. అప్పుడో! కోటీశ్వరుణ్ణేనాసరే, వర్ణాశ్రమాచార పద్ధతినితప్ప, జమీందార్లేకాదు, రాజబంధువులే కాదు, రాజోద్యోగులే కాదు పిల్చేవారేకారు, ఆ ధనాఢ్యులేనా యే సందర్భంలోనో జమీందార్లు తన్ను పిల్చి మాట్లాడేఁడంటేనే సంతోషించేవారు. అంతేనేకాని యేమండీ అన్నారుకారని విచారించినట్లే లేదు. యీ సందర్భం నేను కాకినాడలో వక షాహుకారు సందర్భంలో చూచాను. శ్రీ చెలికాని జగన్నాథరాయణింగారు రాజబంధువులు గాని రాజులుకారు. వీరు మా రాజావారి ఆఖరు మామగారు, అనగా యేడోభార్య తండ్రి అన్నమాట. యింకా కొన్ని చుట్టఱికాలు వుంటే వుంటా యనుకొందాం, అప్పటికి అమల్లోవున్న చుట్టఱికం అది. యీయన వక పెద్ద షాహుకారుని 'నీవు' అని యేకవచనంగా మాట్లాడడం నేను స్వయంగా విన్నదే. అసలు మా రాజావారు యీ షాహుకారు కంటేనేకాదు, యీ దేశంలోవున్న యే షాహుకారుకంటే కూడా చాలా గొప్పగా వుండి పేరుప్రతిష్ఠలు గడించిన షాహుకారినే నువ్వనే వారని విన్నాను. ఆ జమీందార్లకాలంవేరు, యీ జమీందార్ల కాలం వేఱు. వీరు యించుమించు సామాన్యప్రజలుగానే మాఱిపోవలసివచ్చింది. యీ గవర్నమెంటు ప్రభుత్వంలో కాఁబట్టి యిప్పటి దృష్టితో అప్పటి జమీందార్ల చర్యలుగాని అప్పటి దృష్టితో యిప్పటి జమీందార్ల చర్యలుగాని మనం ముచ్చటించుకొంటే "యేతంపెట్టు"గా వుంటుంది గాని లేశమున్నూ సరిపడదు.

కొన్ని చోట్ల శాస్త్రమర్యాదను పూర్తిగా అతిక్రమించిన గౌరవాలున్నూ వుండడం చూచాను. యానాంలో దేవాలయంలో తీర్థప్రసాదాలు శూద్రులకిచ్చాక కోమట్లకిచ్చేమర్యాద యెన్నాళ్లనుంచో వుంది, బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రులుకాని బ్రహ్మక్షత్రియశూద్రవైశ్యులు కాదుగదా? యిది బలాబలాలనిపట్టి జరిగేమర్యాద. దెబ్బకు దెయ్యం జంకుతుంది కదా?

శాస్త్రం కూడా యీలాంటి విషయాలలో పనిచేయదు. జంకుతుంది. యిది విషయాంతరం. పూర్వపు జమీందార్ల మర్యాదలూ వేషభాషలూ యిప్పుడు మనం కథలలో చెప్పుకోవలసిందే గాని అనుభవంలో కనపడవనేది యిప్పటి ముఖ్యాంశం.

మా గంగాధరరామారావుగారు సర్వవిధాల పూర్వపు తరగతిలో వారు. స్నానము, వారి కేర్పడ్డరీతిని సంధ్య, జపము, తపము, యివన్నీ నెఱవేర్చుకొనేవారు. యే వర్ణస్థుల నెట్లు గౌరవించాలో అట్లే గౌరవించేవారు. కులాభిమానం యెంతవుండాలో అంతా పూర్తిగా వున్నవారు. పండితులయం దెంతవఱకు రాజున కభిమానం వుండాలో అంతా సంపూర్తిగా వున్నవారు. వేయేల, యే విషయ మందున్నూ పూర్వులకు తీసిపోకుండా మన మర్యాదలు లవమున్నూ తగ్గకుండా రాజ్యపరిపాలన చేసినవారని అనుభవజ్ఞులు యిప్పటికిన్నీ చెప్పుకుంటారు.

శ్రీవారు రాజ్యానికి వచ్చిన స్వల్పకాలంలోనో, లేక అంతకు పూర్వమో, కొవ్వూరు గోపాలశాస్త్రుల్లుగారనే షడ్దర్శనీ పారంగతులు కాశీ నుండి దేశానికి దయచేసి గోదావరీతీరమనే కారణంచేత తుట్టతుదరోజుల్లో కొవ్వూరులో మకాం చేశారు. యీ శాస్త్రుల్లుగారికి షడ్దర్శనాలలో సంపూర్ణ పాండిత్యం అలా ఉండగా మంత్ర శాస్త్రంలో మిక్కిలీ పాండిత్యం వున్నట్లు అనేకులవల్ల వినడమే కాకుండా శ్రీ మా గురువరేణ్యులు బ్రహ్మయ్య శాస్త్రులవారివల్ల కూడా యెక్కువగా విని వున్నాను. యీ శాస్త్రులవారు నేను యెటిఁగే కాలానికప్పుడే స్వర్గతులైనారు. కాని వీరిముఖ్యశిష్యులలో వకరైన శ్రీ అద్దేపల్లి కృష్ణశాస్త్రుల్లుగారిని నేను చాలాసార్లు సందర్శించి వున్నాను. వీరికికూడా మంత్రశాస్త్రంలో యెక్కువ ప్రజ్ఞవుందని సర్వులు చెప్పుకోవడం కలదు. గురువుగారిప్రజ్ఞ యేలాటిదో మంత్రశాస్త్రంలో, శిష్యులు కృష్ణశాస్త్రుల్లుగారి ప్రజ్ఞకూడా అట్టిదే అని వినికి. గురువుగారి ప్రజ్ఞావిషయం యీ దేశంలోనే కాదు - కాశీలోకూడా చాలా గొప్పగా చెప్పుకోవడం నేను స్వయంగా కాశీలోనే వినివున్నాను. వీరిప్రజ్ఞనుబట్టే వీరికి శ్రీ విజయనగరం సంస్థానంవారు దేవిడీమన్నా చేసినట్లు కూడా మా గురువులు చెప్పఁగా వినివున్నాను.

శ్రీ విజయనగరం ప్రభువు శ్రీ విజయరామగజపతిమహారాజులుంగారు విజయనగరాన్ని సర్వవిధాల కాశీగా మార్చవలెననే వుద్దేశం కలవారని వింటాను. ఆ కారణంచేత ఆ కాశీలో ప్రసిద్ధులైన పండితులను రప్పించి తమ సంస్థానంలో వారివారికి తగిన సమ్మానాలేర్పఱచి గౌరవిస్తూండేవారనిన్నీ, అందులో యీగోపాలశాస్త్రుల్లుగా రొకరనిన్నీ, యీ శాస్త్రుల్లుగారియందు ప్రభువు చూపించే గౌరవాతిశయం మిక్కిలీ యెక్కువగా వుండడంచేత తక్కిన పండితులు దాన్ని చూచి సహింపలేకపోయా రనిన్నీ,

ఆకారణంచేత యీ మహావిద్వాంసుఁడికి ఆ సంస్థానాన్నుంచి "యేలాగరా? వుద్వాసన చెప్పించడం అని ఆలోచించి ఒక కుట్రపన్ని మహా రాజావారితో యీవిధంగా మనవిచేశారనిన్నీ వినడం. యేలాగంటే "మహాప్రభో! మన గోపాలశాస్త్రుల్లుగారు యితర శాస్త్రాలలో నిరుపమానమైన పండితులు సరేగదాండి. వీరు మంత్రశాస్త్రంలో కూడా ప్రత్యక్ష దాఖలా చూపించే పండితులని దేవర విన్నారో లేదో అని మనవిచేసుకుంటూ వున్నాము. యెందుకంటే యీలా మనవిచేసుకోవడం : తమ సెలవైతే ఆలాటి ప్రత్యక్ష దాఖలా వీరు కనుపరుస్తారేమోకాని మాబోంట్లం కోరితే చూపించరు. తమ సన్నిధినివుండి ఆ దాఖల చూద్దామనే కుతూహలంతో యింతగా మనవిచేసుకోవడం" అంటూ శ్రీమహారాజావారితో చాలాసార్లు విజ్ఞాపన చేసుకోఁగా చేసుకోఁగా, వకరోజున శ్రీవారు శాస్త్రుల్లు గారిని సగౌరవంగా "శాస్త్రీజీ" అని సంబోధించి "మీమంత్రశాస్త్ర దాఖలా వకపర్యాయం మాకు చూపించాలి" అని కోరేరఁట. దానిమీద శాస్త్రుల్లుగారు "యివి పరీక్షించతగ్గ విషయాలు కావు – నవగోప్యాని కారయేత్ అనే తెగలోవి" అంటూ మనవిచేసుకోవడమైతే జరిగిందిగాని రాజుగారు యేమైనాసరే చూచి తీరాలని పట్టుపట్టినాఁరట. "అలాగయితే చిత్తం రేపు మా జపం అయేటప్పటికి వక నిమ్మకాయంత బంగారాన్ని నలీ తొలీ లేని ముద్దగా వున్నదాన్ని సిద్ధంచేసి వుంచండి" అని శాస్త్రుల్లు గారు రాజాగారితో మనవిచేసి ఆజ్ఞ తీసుకుని స్వగృహానికి దయచేశారఁట. అయితే శాస్త్రుల్లుగారు వూరికే ప్రజ్ఞ చూపడమే అనుకున్నారు కాని దీనిలో యేదో పండితులు పన్నిన కుతంత్రం వుందని లేశమున్నూ యెఱగరు. ప్రభువంతకంటే గుర్తించలేదు. ఆ తంత్రం యేమిటో ముందు తేలుతుంది కాబట్టి యిక్కడ విస్తరించేదిలేదు.

అదేరీతిని బంగారం సిద్ధంచేయించారు మహారాజావారు. పండితులందఱితోటి పరివేష్టించఁబడి చూస్తూ వున్నారు. ఆ సమయంలో టక్కూ టుక్కూ మంటూ పాంకోళ్ల చప్పుడుతో శాస్త్రుల్లుగారు చిన్న జారీ చెంబు సహితంగా దయచేసి ఆ బంగారు ఘటికమీఁద ఆ జారీచెంబులోవున్న వుదకం ప్రోక్షించేటప్పటికి అది రెండుచెక్కలుగా "ఫడేలు" మని శబ్దంయిస్తూ విడిపోయిందఁట! దాన్ని చూచేటప్పటికి రాజాగారికి అత్యాశ్చర్యమే కాకుండా మనస్సులో కొంత భయంకూడా కలిగిందఁట. పండితులు ఆలోచించిన కుతంత్రము యీలా రాజావారికి భయం కలిగించాలనే. సరే గోపాలశాస్త్రుల్లుగారు మళ్లా స్వగృహానికి సెలవుపుచ్చుకొని దయచేశారు. పండితులు శాస్త్రుల్లుగారి ప్రజ్ఞావిశేషాన్ని పొగడుతూ ఉన్నట్లు అభినయిస్తూ రాజావారి మనస్సులోవున్న భయాన్ని మఱింత వృద్ధిచేశారు. మొత్తం రాజావారికి తుట్టతుద కేంతోఁచిందంటే: వోహో ఈయన అందఱు పండితుల వంటివారుకారు. యీయన్ని సంస్థానంలో పెట్టుకోవడమంటే పులితో చెలగాటం వంటిది.

యెప్పుడేం మనమీద కోపం వస్తుందో : అలా వచ్చేయెడల యీ బంగారు ఘటిక మాదిరిగా మన తలనుకూడా యీయన మంత్రశాస్త్రబలంచేత పగులగొట్టడాని కభ్యంతరం వుండదని నిశ్చయించుకొని, వుపాయంగా సగౌరవంగా వారి మనస్సుకు నొప్పి తగలకుండానే ఈ చిక్కునుండి తప్పించుకోవాలి కనుక, ఫారాలో శాస్త్రులవారు దర్శనానికి వచ్చినపుడు "మా సెల వైతేనే కాని యీలోగా తాము దయచేయవలసి వుండదు. అవసరమైనప్పుడు మేమే కబురుచేస్తా" మన్నారు రాజావా రని చెప్పేయేర్పాటు చేశారఁట. సరే! జీతం ముడుతూవుంది. ఆలా వత్సరమో, రెండు వత్సరాలో జరిగిపోయాయి. దర్శనం మాత్రమే లేదు. కాని తక్కిన మర్యాదలన్నీ యథాప్రకారంగానే జరుగుతూ వున్నాయి. అప్పటికి శాస్త్రుల్లుగారికి యేలాగో కర్ణాకర్ణికగా తోడి పండితులు చేసిన కుతంత్రంకూడా బోధపడింది. దానితో యిఁక యీలాటి శత్రుమధ్యంలో యీ వింధ్యభూమిలో వుండడం యెందుకని తోఁచి "ప్రభువుల ఆజ్ఞ అయితే మళ్లా కాశీకే వెడతా"నని మనవి చేయించుకున్నారఁట. దాన్ని అంగీకరించి "తాము యెక్కడవున్నా తమకు మా సంస్థానంలో నెలనెలకూ యిచ్చే సమ్మానం పంపిస్తూనే వుంటా" మనిన్నీ "తాము చిరకాలం కాశీ నివాసం చేసే వున్నారు కాబట్టి గోదావరి తీరంలో వుండడం మాకు అభిమత" మనిన్నీ కబురుచేశారఁట. రాజావారి అభిమతం ప్రకారం గోపాదక్షేత్రమైన కొవ్వూరులో శాస్త్రుల్లుగారు నిత్య నివాసం యేర్పఱచుకున్నారు. యీ కారణంచేతనే గోపాలశాస్త్రుల్లుగారి యింటిపేరు కొవ్వూరు వారుగా మారింది. కాని అసలు ఇంటిపేరు ఇదికాదు. ఆపేరు నాకిప్పుడు జ్ఞాపకం వచ్చిందికాదు. వ్రాసే విషయం శ్రీ పిఠాపుర ప్రభువు నాయకమణిగా వుండేది - వ్రాఁత విస్తరించి విజయనగరం మహారాజావారిమీదకిన్నీ అక్కడి పండితుల మీఁదకిన్నీ దొర్లుతూవుంది అనీ చదువరు లనుకుంటారేమో. ప్రస్తుత కథలో శ్రీ పిఠాపుర ప్రభువుతోపాటు యీ గోపాలశాస్త్రుల్లుగారుకూడా ముఖ్య నాయకులే కావడంచేత వీరిని గురించి కొంత సంగ్రహంగా వ్రాశాననుకోండి. విస్తరించే వ్రాసే యెడల యెంతేనా యీ శాస్త్రుల్లుగారిని గురించే కాదు - వీరిని సమ్మానించిన శ్రీ విజయనగర ప్రభువును గురించేకాదు - వ్రాయవలసే వుంటుంది. వోపిక వుంటే మఱొకప్పుడు ఆ ప్రయత్నం చేస్తాను.

యీలాగు కారణాంతరాలవల్ల దేవిడీమన్నా అయిన్నీ వారి వంశ పారంపర్యాయంగా పోషింపఁబడుతూ దర్శనం మాత్రం లేకుండావున్న పండితాఖండలులు మఱికొందఱు విజయనగర సంస్థానానికి సంబంధించిన వారు వున్నారు. వారిలో శ్రీ భాగవతుల హరిశాస్త్రుల్లుగారు వకరు. వీరు శ్రీ కోటిపల్లెలో నిత్యనివాసంగా వుండేవారు. యిప్పుడీ దేశంలో వైయాకరణులంటూ శేషం యేమాత్రమేనా వున్నట్టయితే అది యావత్తున్నూ

వీరి విద్యావంశమే అనడంలో లేశమున్నూ అతిశయోక్తి వుండదు. యెనభై సంవత్సరాలకు మించిన వయస్సులో వీరి దర్శనం నేను చేసివున్నాను. వీరున్న సభలో అవధానంకూడా చేయడం తటస్థించింది. ఆ సభలో వీరినిగుర్చి రచించినదే యీ శ్లోకం -

శ్లో. శ్రీమద్భాగవతాన్వయాంబుధి విధూరాజత్కలాపాలకః
పాణిన్యృప్తసుదర్శనశ్చ విబుధారాధ్యాంఘ్రి యుగ్మాంబుజః
సత్యాసక్తహృదంతరో నిరుపమ శ్చానంతగోవర్ధనః
పాయా దేష హరి ర్యథా సచ హరిస్సర్వాఘ విధ్వంసకః!

ఈ శ్లోకంలో శ్రీకృష్ణునకును హరిశాస్త్రుల్లుగారికిన్నీ విశేషణాలు సమంగా అన్వయించుకోవాలి. యీలాంటి మహాపండితులు యెందరో వుండే ఆ కాలం యిక మనకు రాదనుకుంటాను. దానికి ముఖ్యకారణం నూటికి ముప్పైఅయిదో నలభయ్యో మార్కులతో శిరోమణులూ ఉరోమణులూ బయలుదేరడానికి అవకాశంకూడా యేర్పడ్డది. వెనకటివాళ్ల పాండిత్యాలంటే యేలాటి దీక్షతో సంపాదించుకొన్నవో వక వుదాహరణ మచ్చుకు యిక్కడ చూపిస్తాను, పరిశీలించండి.

ముంగండ కాపురస్థులు శ్రీ పుల్లెల దక్షిణామూర్తిశాస్త్రుల్లుగారు కాశీలో శ్రీ జాగేశపండిట్‌జీ వారివద్ద చిరకాలం విద్యాభ్యాసంచేసి గృహస్థాశ్రమాని కభిముఖులై వస్తూ వస్తూ తోవలో కొన్ని సంస్థానాలలో పాండిత్య ప్రకటనం చేసుకొంటూ మాడుగుల ప్రభువు కృష్ణభూపతి దర్శనానికేమో వెళ్లారఁట. అక్కడ భాష్యమంతా సంధ్యావందన ప్రాయంగా కంఠపాఠముగానున్న శ్రీ యింద్రగంటి గోపాలశాస్త్రుల్లు గారితో వాదంవచ్చి ఎక్కడో వోడు తటస్థించిందనిన్ని దానితో మళ్లా వెనక్కి తిరిగి కాశీ వెళ్లి పదిపండ్రెండు సంవత్సరాలు కృషిచేసి గోపాలశాస్త్రుల్లు గారిని జయించే తలంపుతో మాడుగుల సంస్థానానికి వచ్చారనిన్నీ, అప్పటికి సదరు గోపాలశాస్త్రుల్లుగారు స్వర్గస్థులవడంచేత "అయ్యో మనకోరిక తీరకపోయెనే" అని దక్షిణామూర్తిశాస్త్రుల్లుగారు విచారించారనిన్నీ వినికి. ఆయీ కథలవల్ల అప్పటి పాండిత్యాలకున్నూ యిప్పటి పాండిత్యాలకున్నూ వుండే తారతమ్యాలు తెలుస్తాయని కొంచెం వుదాహరించాను.

ప్రస్తుతం కథానాయకులలో ఒకరైన గోపాలశాస్త్రుల్లుగారు చాలా గొప్పవారని విని మన పిఠాపురం రాజావారు వీరికిన్నీ సుబ్బత్రయంలో వకరైన శ్రీ తణికెళ్ల సుబ్బన్నశాస్త్రుల్లు గారికిన్నీ శాస్త్రార్థంపెట్టి జయాపజయాలు చూద్దామనే కుతూహలంతో సబహుమానంగా రప్పించారఁట. సుబ్బత్రయమంటూ వకమాట వ్రాసివున్నాను. నవద్వీపాన్నుంచి తర్కం చదువుకొని వచ్చినవారిలో ముగ్గురుపండితులు మన తెలుగుదేశపువారు సుబ్బన్న, లేక,

సుబ్బయ్య అనేపేరుగలవా రుండేవారనిన్నీ యెవరేనా తర్కంలో పేరుతెచ్చుకోవాలంటే యీత్రయాన్ని సందర్శించి వీరిమెప్పును పొందాలనిన్నీ గురువుగారు చెప్పఁగా విన్నాను. యీత్రయంలో వకరు తణికెళ్లవారు, రెండు-అక్షతలవారు, మూఁడు - యెవరోగాని వారి యింటి పేరు జ్ఞాపకం వచ్చిందికాదు. యీ త్రయంలో వకరు శ్రీగద్వాల సంస్థాన పండితులు అయ్యవారిపల్లెలో కృష్ణాతీరాన్ని వుండేవారు. తక్కిన యిద్దఱున్నూ బహుశః యీ మన కృష్ణాగోదావరీ తీరాలలోనే యేవో గ్రామాల్లో వుండేవారు - నాకు తపిసీలు తెలియదు. యిందులో ప్రస్తుతం గోపాల శాస్త్రుల్లుగారితో వాదం పెట్టఁదలచుకొని శ్రీ పిఠాపురంరాజావారు ఆహ్వానించిన సుబ్బన్న శాస్త్రుల్లుగారి శిష్యులు యించుమించు మా పరమగురువులు చర్ల బ్రహ్మయ్యశాస్త్రుల వారికి సమకాలికులు. వీరు కిర్లంపూడి సంస్థానమునకు సమీపంలోవున్న ధర్మవరంలో శ్రీ బుచ్చి సీతాయమ్మగారు స్థాపించిన ధర్మపాఠశాలలో వుపాధ్యాయులుగా వుండి యెంతమందినో విద్వాంసులను చేసిన మహావిద్వాంసులు. మావిద్యార్థిదశనాఁటికి యీలాటి పాఠశాలలున్నూ యీ విద్యార్థుల పోషణకుగా యేర్పడ్డ ధర్మసత్రాలున్నూ కొన్ని వుండేవి. చదువుకోవడంవల్ల యేదో సంపాదన మనకు అవుతుందనే వుద్దేశంతో చదువుకునే విద్యార్థులు వున్నట్లు నేను లేశమున్నూ యెఱుగను. చదువుకోవడం మనకు విధి అనే వుద్దేశంతోనే అప్పుడు చదువుకొనేవారు. "బ్రాహ్మణేన నిష్కారణో ధర్మష్షడంగో వేదో౽ధ్యేయో జ్ఞేయశ్చ" అనే శ్రుతికి వుదాహరణంగా వుండేది అప్పటివాళ్ల చదువు. డిగ్రీల లెక్క జ్వరం వచ్చినప్పుడుకూడా అప్పుడు లేనేలేదు. అట్టి స్థితిలో చదువు కెక్కడనుండి వస్తుంది? యీ డిగ్రీలనుగూర్చి నా యిటీవలిచర్యలో కొంత వ్రాసివున్నాను - అందులోనుంచి వకపద్యం వుదాహరిస్తాను.

తే.గీ. "ఇంగిలీషు"తో పాటుగా నిపుడు సంస్కృ
తమ్మునకుఁగూడ "డిగ్రీల" తంపి వచ్చె
నట్లు "ప్యా" సగువారలయం దెవండొ
తక్కఁ దక్కినవారు శుద్ధజడమతులె.

ఈ "ప్యాసు"లు కూడా చాలా తంత్రాలతో చేరివుంటాయి. అవన్నీ యిక్కడ యెత్తుకుంటే తేలదు. నూటికి ముప్పైయయిదో నలభై యో మార్కులు తెచ్చుకున్నారే అనుకుందాం. మిగిలిన మార్కు లెవరు తెచ్చియిస్తారు. అందుచేతేకాఁబోలు శ్రీ కస్తూరి శివశంకరశాస్త్రుల్లుగారు "హైయస్టు" నూఱుమార్కులైతే కొందఱికి నూటపదిదాఁకా వేయడం వుండేదఁట! శివశంకరశాస్త్రుల్లుగారంటే సామాన్యులుకారు. పుల్లెల దక్షిణామూర్తి శాస్త్రుల్లుగారుకూడా వీరివద్ద అంతోయింతో పుస్తకం పట్టినట్లు వింటాను. ఆర్ట్సు కాలేజీలో

శ్రీ కం॥ వీరేశలింగంపంతులవారు తెలుఁగు పండితులుగా వుండే రోజుల్లో వీరు అక్కడ సంస్కృత పండితులు. "హైయస్టు" కన్న అధికంగా వేశారేమని అడిగితే విద్యార్థి అంత అనుకూలంగా వ్రాశాఁడు కాబట్టి ఆలా వేశాను పొమ్మని "ప్రినిసిపాల్" గారికి జవాబు చెప్పేవారఁట. యీ శివశంకరశాస్త్రుల్లుగా రేమి, బందరులో శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రుల్లు గారేమి, యింకా మఱికొందఱు పండితులేమి పై అధికార్లకు జంకుతూ వుపాధ్యాయత్వం చేసినవారు కారని యెఱిఁగినవారు యిప్పటికిన్నీ చాలామంది వున్నారు కాఁబట్టి విస్తరించేది లేదు. చెప్పొచ్చే మాటేమిటంటే; నిజమయిన పాండిత్యము నూటికి నూటపదులు మార్కులు తెచ్చుకొన్నదేగాని ముప్పై అయిదూ, నలభయ్యీ తెచ్చుకొన్నది కాదనిన్నీ, యిప్పుడు ముచ్చటించుకొనే కథలో పండితులు నూటికి నూటపదిమాత్రమేకాక నూటపదహార్ల తరగతిలో వారనిన్నీ, ఆలాటిపండితులు శాస్త్రార్థం చేస్తూవుంటే విని సంతోషించడానికితగ్గ శ్రుతపాండిత్యం మా పిఠాపురం లేటు రాజావారికి వుండేదనిన్నీ తెల్పడానికే యీ వ్యాసం నేను వ్రాయడానిక్కారణం.

ప్రస్తుతం శ్రీ రాజావారు గోపాలశాస్త్రుల్లుగారికిన్నీ సుబ్బన్న శాస్త్రుల్లు గారికిన్నీ ముఖాముఖీని వాదం పెట్టి విని ఆనందించఁదలఁచుకున్నారు. వీరిద్దఱి మధ్యనూ జయాపజయాలు నిర్ణయింపదగ్గ పండితులు మూఁడోవారు కూడా వుండాలికదా? వారెవరంటె; మండపేట కాపురస్థులు శ్రీ యెడవల్లి చంద్రశేఖర భట్టాచార్లుగారో లేక వీరికుమాళ్లు జానకిరామ శాస్త్రుల్లుగారో అని గురువుగారు చెప్పారు. వీరుకూడా కాశీపండితులే. యిక రేపోయెల్లుండో శాస్త్రార్థపుసభ జరుగుతుందనఁగా సుబ్బన్న శాస్త్రుల్లుగారు శ్రీ రాజావారితో "మహాప్రభూ? నాతోటి తర్కంలో పూర్వపక్షసిద్ధాంతాలు చేశేవారు యీ దేశంలో మాత్రయంలోతప్ప మఱొక్కరులేరు. యిది చెప్పక తప్పనివిధిచే మనవి చేసుకుంటున్నాను. కాఁబట్టి ఆత్మస్తవంగా తాము అభిప్రాయపడకూడదు. గోపాల శాస్త్రుల్లుగారు ఆఱుశాస్త్రాల్లో పండితులు. నేను ఒక్క తర్కంలోమాత్రమే పండితుణ్ణి. నాకున్నూ ఆయనకిన్నీ ఈ తర్కంలో ఏతంపెట్టుగా వుంటుంది. పోనీ దేవరవారి వినోదానికి అంగీకరించి కూచుందామంటే; గోపాలశాస్త్రుల్లుగారు ఆఱు శాస్త్రాలలో పాండిత్యం అలావుండఁగా మంత్రశాస్త్రంలో అఖండులు. వోడు వచ్చిందంటే ఆయన వూరుకోరు. కాబట్టి మనవి చేసుకున్నాను" అనేటప్పటికి రాజావారు "అలాటిభయం మీరు లేశమున్నూ పడనక్కఱలేదు. ఇది వినోదార్థం జరిగే సభగాని మఱివక మోస్తరుదికాదు. ఈ విషయమై వారితో మేము మాట్లాడుతాము. తాము లేశమున్నూ జంకవలసిందిలే" దంటూ ధైర్యం చెప్పారఁట. కాని ఎంత ధైర్యం చెప్పినా సదరు గోపాల శాస్త్రుల్లుగారి మంత్రశాస్త్ర పాండిత్యం సుబ్బన్నశాస్త్రుల్లుగారికి వినికివల్ల పూర్తిగా తెలిసివుండడంచేత గుండెలు తటతట

కొట్టుకోవడం మాత్రం మానలేదు. 'అయితే వాదం మానుకోరాదా?' అంటే : కారణాంతరం చేత మానుకున్నప్పటికీ అసలు పాండిత్యంలోనే లోటుండి మానుకున్నట్టు లోకం భావిస్తుందికదా? అందుచేత - "యశోవామృత్యుర్వా" అని అంగీకరించక తప్పిందికాదు. పైఁగా రాజావారు సెలవిచ్చారఁట : "ఏదేనా మీకు చిక్కే తటస్థించే యెడల తరతరాల వఱకున్నూ మీకుటుంబాన్ని పోషించేభారం మా మీఁద వుందనుకోండి" అన్నారట. అయితే రాజావారికి మంత్రశాస్త్రంలో పూర్తిగా నమ్మకం వున్నప్పటికీ "గోపాలశాస్త్రుల్లుగారి వల్ల సుబ్బన్న శాస్త్రుల్లుగారికి అపకారం జరుగుతుం"దని మాత్రం లేశమున్నూ అనుమానం లేదనుకోవాలి మనం. అనుమానమేవుంటే; వారికీ వీరికీ వాదం పెట్టకుండానే వుండేవారేమో. రాజావారికి మంత్ర శాస్త్రంలో పూర్తిగా నమ్మకం వుందనుకోవడానికి శ్రీయింగు రామస్వామిశాస్త్రుల్లుగారికి మా గ్రామ సమీపంలో జేగురుపాడు గ్రామంలో యిచ్చిన పధ్నాలుగుపుట్ల భూదానమే, అనఁగా నూట పంద్రెండు ఎకరాలే సాక్ష్యమిస్తాయి. ఆ భూమి యిప్పటికిన్నీ వారికి అవ్యాహతంగా జరుగుతూ వుంది. ఆ భూదానం యెందుకు జరిగిందో వ్రాస్తే చాలా పెరుగుతుంది.

ఇంకొకటికూడా సాక్షాత్తూగాక పరంపరగా సాక్ష్యమిచ్చేది యీలాంటి భూదానమే వుంది. విజయనగరపు సంస్థానంలో అంతఃపురం లోనే అనుకుంటాను. వకగ్రహం కామినీతరగతికి చెందినది పట్టుకొని పీడిస్తూవుందఁట. యిక్కడకూడా కొంచెం వ్రాయాలి, మనకు విద్యలో స్కూలుఫైనలు వగయిరా తరగతులలాగే గ్రహాలకికూడా తరగతులున్నాయి. స్త్రీ గ్రహాలలో "కామినీ" తరగతికి చెందినదంటే చాలా గడ్డు. పురుష గ్రహాల్లో "బ్రహ్మరక్షస్సు" గడ్డు. యీ గ్రహాలు యేలాటి మంత్రశాస్త్ర వేత్తలకున్నూ లొంగవు. వాట్లకు యేదో యితరజన్మం రావడానికి తగ్గంత తపస్సు ధారపోస్తే వదిలిపోతాయని వినడం. సామాన్యగ్రహాలు చేసే చేష్టలకన్న యీ కామినీగ్రహాలుచేసే చేష్టలు అద్భుతంగావుంటాయి. యేమనిషిని యీ కామినీ పట్టుకుంటుందో ఆ మనిషిని తీసుకుపోయి అడివిలోవుండే అతి గహనమైన వెదురుడొంకలు వగయిరా గహనప్రదేశాలలో పెట్టడం కూడా తటస్థించడం చెప్పఁగా విన్నాను. ఇంతదాఁకా కాదుగాని, వక కామినీగ్రహం చేసేచేష్టలు ముప్పదియేండ్లకు పూర్వం నేనున్నూ కళ్లారా చూచివున్నాను. ప్రస్తుతం వినండి. ఆ గ్రహాన్ని వదల్చడానికి కొదవేమిటి? "రాజు తలచుకుంటే" యేంలోపం కనక పెద్దపెద్ద మంత్రగాళ్లంతావచ్చారు. కొందఱు గ్రహంచేత చెంపకాయలు తినడం కూడా తటస్థించింది. మహారాజావారికి యేమీ తోఁచడంలేదు. అట్టిస్థితిలో ఆగ్రహానికే యెంతోఁచిందో?... "రాజా! యీలాచూడు" మని పిల్చి, "యీమంత్రగాళ్లు నన్ను వదిల్పించ లేరు గాని నీకో వుపాయం చెపుతాను. అలా చేయఁగలవా?" అందఁట. చెప్పవలసిందన్నారఁట రాజాగారు, "అయితే విను.

శ్రీ అజ్జాడ అన్నంభొట్లుగారు వకరోజురాత్రి రెండు జాములవేళ వక మాలవాడికిచేసిన అన్నదానఫలితాన్ని నీవు ధారపోయిస్తే నాకు దానివల్ల మంచిజన్మ వస్తుంది. తద్వారాగా నాబాధ మీకు తప్పుతుంది. అని చెప్పిందఁట. అప్పుడు ఆ ప్రభువు అజ్జాడ అగ్రహారం తమ సంస్థానంలోదే కనక, ఆ అన్నంభోట్లుగారిని సగౌరవంగా ఆహ్వానించి "అయ్యా తమవల్ల మాకీవుపకారం కావా" లంటూ ప్రార్థించారఁట. దానిమీఁద "అయ్యా నేను నా కర్తవ్యాన్ని నెఱవేర్చుకున్నానేకాని దాన్ని మళ్లా వకరికివిక్రయించే తలఁపుతో గాని దానంచేసే తలంపుతోఁగాని చేయలే"దన్నారట. రాజావారు మిక్కిలిదీనంగా ప్రార్థించారఁట. దానిమీఁద యేమీ ప్రతి చెప్పలేక ఆ పుణ్యాన్ని ధారపోశారఁట. అంతతో ఆ బాధ నివర్తించిందట.

అయితే రాత్రి రెండుజాములవేళ వక మాలవాడికి పెట్టిన పుణ్యానికి అంతవిలువ యెందువల్ల కలిగిందో కొంత వ్యాఖ్యానం చేయాలి. తూర్పున కొండయేళ్లు చాలావుంటాయి. అవి వర్షాకాలంలో అంతట్లో ప్రపంచమంతా ముంచేటట్టు పొంగడమున్నూ, మళ్లా వెంటనే కుంగడమున్నూ అందఱూ యెఱిఁగిందే. ఆలా పొంగే సమయంలో యేదో వూరినుంచి ఒక మాలవాఁడు అజ్జాడమార్గంగా వస్తూ వక తిప్పలో చిక్కుకున్నాఁడు. క్రమంగా తిప్ప మునిగింది. వీడుకూడా మునిఁగిపోయే అవస్థ వచ్చింది. రెండుజాములరాత్రి అయింది. అంతా పరుండి నిద్రపోయేవేళ కనక "మొఱ్ఱోచస్తున్నాను. ఆకలికూడా బాధిస్తూవుంది బాబో" అంటూ గట్టిగా ఆ తిప్పలోనుంచి అఱచాఁడు. మేడమీద పరున్న నిరతాన్న ప్రదాత అన్నంభొట్లుగారు విన్నారు. ఆపట్లాన్ని లేచి సుమారు శేరుంబావు బియ్యం అన్నమున్ను ఆవకాయముక్క వగైరా రసవర్గాలున్నూ మునకాల కఱ్ఱ లావువి రెండు పొగచుట్టలున్నూ అవి కాల్చుకోవడానికి వక యెండుగడ్డితో చుట్టి నిప్పంటించిన లావాటి తూట కట్టానున్నూ పట్టుకొని, పాముమీసాన్ని తెగేస్తూవున్న ఆ కొండకాలువను తెప్పమీఁద అడిచినుకూ పొడిచినుకుగా వున్న వానలో యీఁదుకొని మళ్లా మాలాడిని ముట్టుకోకుండానే యీవలివొడ్డు చేర్చడానికి తోవాసం యింకో తెప్పకూడా తెప్పకి తగుల్చుకొని తిప్పమీదకి వెళ్లి, సుష్టకృత్తుగా అంటే తృప్తాస్థగా వాడికి భోజనంపెట్టి, చుట్టకాల్చుకున్నాక వాడిసహితంగా యీవలివడ్డుకు వచ్చి చేరారఁట. ఆ మహానుభావుఁడు యెన్ని వేలమందికో అన్నదానం చేసినప్పటికీ ఆనాటికి హరిజనుఁడికి చేసిన అన్నదానం ఆ కామినీగ్రహానికి గణనీయం అయింది. ఆలోచిస్తే బ్రాహ్మణులు కులాచారాలు చెడకుండానే మాలమాదిగల యెడలకూడా యేలాటి దయాదాక్షిణ్యాలు చూపించేవారో యీ మహాపురుషుని చరిత్ర వేనోళ్ల సాక్ష్యమిస్తుంది. అంతేకాని యెవరో తండ్రి ఆబ్దీకంనాఁడు ఇద్దఱు హరిజనులను భోక్తలుగాపెట్టి లేవనెత్తారనిన్నీ, యేమో చేశారనిన్నీ చెప్పేమాటలు బొత్తిగా విరుద్ధాలవడంచేత దయాదాక్షిణ్యాలలోకి చేరవు సరిగదా అవ్యక్తపుపనులలో చేరతాయి కూడాను. యివి

"చక్కని రాజామార్గాలుండగా సందులుదూరడం" వంటివి. యీ మహాపురుషుణ్ణిగూర్చి యీ రెండక్షరాలున్నూ వ్రాయడం వల్ల నా జన్మ తరించిందని నేను సంతోషిస్తూవున్నాను.

యిప్పుడుకూడా యిలాంటి అన్నదాతలు మాజిల్లాలో సకృత్తుగా వున్నారు. మా బంధుకోటిలో మంచి పండితులు శ్రీ నృసింహదేవర పేరు శాస్త్రుల్లుగారినిగూర్చి పలువురు యీలాగే చెప్పుకుంటారు. యీయనవయస్సిప్పుడు డెబ్భైకి పైమాట. యిట్టి వార్ధక్యంలో ఆకాలాన్ని అనఁగా రాత్రి యే రెండుజాములవేళో వచ్చిన యేనిమ్నజాతికేనాసరే వకళ్లని శ్రమపెట్టడం యెందుకని యింటోవాళ్లని లేపక తామే స్వయంగా వండికూడా భోజనం పెడతారని వినికి. కొడుకులూ కోడళ్లూ మనుషులూ బోలెఁడు బలగంతో యీ పుణ్యపురుషుఁడు ధర్మపత్నీ సహితంగా ఆలమూరులో యీ దీర్ఘసత్రాన్ని జరుపుతూవున్నారు. మన పూర్వపు ధర్మాల పద్ధతి యిది. ఇప్పటి పద్ధతి యింకోమాదిరిగా వుంటుంది. కాని నవీన పద్ధతిలోకూడా కొన్ని గౌరవించతగ్గవి లేకపోవు. కాని యీ ధర్మవ్యవస్థ తెలుసుకోవడం చాలా కష్టం భారతంలో యెఱ్ఱన్నగారు వక పద్యాన్ని వ్రాశారు.

క. ఈలోకమ యగుఁగొందఱ
కాలోకమ కొందఱకు, నిహమ్మును బరమున్
మేలగు గొందఱ, కధిపా!
యేలోకము లేదుసూవె? యిలగొందఱకున్.

మన పూర్వులలో ప్రాజ్ఞుల ధర్మాధర్మాలు సర్వమున్నూ ఈ పద్యార్థంలో యిమిడి వున్నాయి.

విషయం విషయాంతరంలోదిగి అంతరిస్తూవుంది. యీ అజ్జాడ అన్నంభొట్లుగారి యశస్సునువిని మారాజావారు పిలిపించి వారిని బలవంతపఱచి పిఠాపురం యెస్టేటులో మల్లవరం చెఱువుక్రింద మంచిభూమిని,- యెన్నియకరాలో చెప్పఁజాలను, విస్తారమే వుంటుంది - పరిగ్రహింప చేశారు. నాకు కూడా ఆ చెఱువుకుసంబంధించిన భూమి మంచిదయితే కాదుగాని వూషరక్షేత్రం వుండడంచేత వీరి భూమినిగూర్చి కొంత నాకు తెలుసును. వారి కుటుంబంవారికి యింకా ఆ భూమి జరుగుతూనేవుందని విన్నాను. ఆ కాలానికింకా - "యీడిగముత్తికి జోడు శాలువలిస్తి" అనే మాదిరి దానాలు ప్రారంభం కానేలేదు కనుక మా రాజావారు చేశారంటే చేసిందల్లా పాత్రదానంలోకే చేరడం తటస్థించింది. యీ రాజావారి యింకొకదానాన్ని గూర్చి వ్రాసి ప్రధానాంశానికి వస్తాను.

పిఠాపురానికి సమీపంలో, గోరస, కొమరగిరి, అని రెండు గ్రామాలున్నాయి. ఆ గ్రామాల్లోవకదానిలో మద్దూరి దీక్షితులుగారనేవారు వేదాధ్యయనపరులు,

నిరతాన్నదాతలు, నప్రతిగ్రహీతలు వకరు వుండేవారు. వారు చాలావృద్ధులైవున్నప్పుడు మా గురువుగారితో వెళ్లేరోజులలో వారి దర్శనం నేనుకూడా చేసివున్నాను. సదరు దీక్షితులవారి యోగ్యతను శ్రీరాజావారు కూడా విని వారిని ఆహ్వానించి సమ్మానించాలని అనుకోవడం శ్రీ రాజావారి అంతరంగిక స్నేహితులని యిదివఱలో మొదటి వ్యాసంలో వ్రాసిన శ్రీపొక్కునూరి వేంకటశాస్త్రుల్లుగారు విని వుండడం చేత దీక్షితులవా రేదో పనిమీద పిఠాపురం వచ్చినప్పుడు రాజావారి దర్శనానికి వెంటఁబెట్టుకొని వెళ్లారట. అప్పుడు శ్రీవారు స్నానగృహంలో వున్నారట. యీ వ్రాయఁబోయే సంగతులలో నిజమెంతో, లోకులకల్పితమెంతో – బాల్యంలో నేను యేలావిన్నానో అలాగే వ్రాస్తాను. మధ్య సంగతి సందర్భాలమాట యేలావున్నప్పటికీ ప్రధానాంశంమాత్రం నిజం. దీక్షితులవారు రాజావారి సన్నిధికి వెళ్లేటప్పటికి, రాజావారేమో స్నానానికి ప్రారంభించారనిన్నీ, వేంకట శాస్త్రుల్లుగారికి వుండే చనువు సర్వసామాన్యమయింది కాకపోవడాన్నిబట్టి ఆ స్నానగృహం లోకే వెళ్లి ప్రభువుతో సంస్కృత భాషతో – "దీక్షితాస్తావత్ ఆగతా వర్తంతే, తేషాందర్శన మవశ్యం దాతవ్యమ్" అని పొక్కునూరి శాస్త్రుల్లుగారు మనవి చేశారనిన్నీ, దానిమీఁద "ఇదానీమేవవా?" అని రాజావారు చిఱునవ్వుతో సెలవిచ్చారనిన్నీ, వేంకట శాస్త్రుల్లుగారు "ఇదా నీమేవ దాతవ్యం, నచేత్కాలాంతరేతే సమాగచ్ఛంతివా నవేతిసందేహః" అన్నారనిన్నీ వినడం. పిమ్మట శ్రీవారు కొంత తడిసి తడియని కట్టుబట్టతోనే సదరు దీక్షితులవారికి దర్శనమిచ్చి యేవో రెండు మూడు మాటలు మాటలాడి ఆదరించి అప్పుడే వాచాయిచ్చినభూమి యిప్పుడేమి వసూలౌతుందో తెలియదుగాని అప్పుడు మాత్రం సాలువక్కంటికి ఆఱువందల రూపాయలు వచ్చేదిగా వుండేదని చెప్పడం నేను యెఱిఁగిందే. ఆ యీ సందర్భంవల్ల ఆ రాజావారి కృతయుగ దాతృత్వం వెల్లడికావడమే కాకుండా ఆ ప్రభువు దాతృత్వానికి సమయాసమయా లక్కఱలేదనీ కూడా తెలిపినట్లవుతుంది. మఱిన్నీ శ్రీ రాజావారంటే యితరులకే కాని పండితులకు భయపడవలసి వుండేది కాదేమోనని పై గాథలవల్ల చదువరు లభిప్రాయపడతారేమో. వక్కపొక్కునూరి వేంకటశాస్త్రులుగారికి తప్ప ఇతర పండితుల కెవరికిన్నీ ఇట్టిచనువు లేదు. యీయన శ్రీ రాజావారికి సతీర్థులో సహాధ్యాయులో అయియుండడంచేత ఇంతచనువు కలిగివున్నట్లు వెనుకటివ్యాసంలో వ్రాసేవున్నాను. శ్రీ పిఠాపురపు పూర్వ ప్రభువంటే – "తస్మాద్రాజముఖం భీష్మం భావుకమ్" అనే శ్రుతికి ప్రథమోదాహరణమని పలువురు పండితులు చెప్పగా వినివున్నాను. యిందుకు చిన్న యితిహాసం వుదాహరిస్తాను.

మాజిల్లాలో మా గురువుగారి కారులో వుండే పండితులలో, మార్కొండపాడు చతుష్టయం, ర్యాలిషట్కం, లేక బొమ్మగంటిషట్కం, అంటూ కుటుంబపండితులు వుండేవారు.

మొదటివారు నలుగురు సోదరులున్నూ వ్యాకరణపండితులే అవడంచేత వారి కాపేరు వచ్చింది. రెండో వారు అర్గురున్నూ వకటేశాస్త్రమందు కాకపోయినా మొత్తం భిన్న శాస్త్రాలలోనేనా పండితులే అవడంచేత ఆ సోదరులకు ఆపేరు వచ్చింది. వకరి నివాసం మార్కొండపాడు, రెండోవారి నివాసం ర్యాలి, యిప్పటికిన్నీ యీ కుటుంబ పండితులలో కొందఱు శేషించి ఉన్నారు. వంశంలోకూడా కుటుంబవిద్యను వదలకుండా చదువుకున్నవారేకాక ఉపాధ్యాయత్వాన్నిచేస్తూ పూర్వులపేరు నిలుపుతూవున్న వారున్నూ వున్నారు. యిందులో మార్కొండపాటి చతుష్కం వార్షికం నిమిత్తం శ్రీరాజావారి దర్శనార్థం వెళ్లారట. మనవిచేయించుకున్న మీఁదటదర్శనం అయింది. సగౌరవంగా కూర్చోపెట్టడం జరిగినతరువాత రాజావారు నవుకరుతో "వొరే అక్కడ పదునైనచాకువుంది పట్టుకురా. పండితులు వచ్చారు" అన్నారఁట. దానితో "మనలో యెవరేమి లోపంచేసినట్లు శ్రీవారి నోటీసులోకి యెవరిద్వారా వెళ్లిందో యీవాళ మనకు యేదో అవమానం జరుగుతుంది కాబోలును" అని మిక్కిలిగా భయపడ్డారఁట. అదంతా రాజావారుచూచి కొంతసేపు తూష్ణీభావంగా గంభీరంగా వుండి మళ్లా నవుకరినిపిల్చి మామిడిపళ్లు తీసుకు రమ్మన్నారఁట. ఆ మాట వినడంతోనే పండితుల ప్రాణాలు కుదుటబడ్డాయట. "బ్రతుకుజీవుఁడా" అనుకుంటూ గుప్పెట్లో పెట్టుకున్న ప్రాణాలను గుండెల్లోకి చేర్చుకుంటూ వుండఁగా ప్రభువు స్వయంగా ఆ మామిడిపళ్లు కోసి "పుచ్చుకోండి" అని సెలవిచ్చారఁట. అప్పటిపండితులు యిప్పటి కొందఱు పండితుల్లాగా కవులలాగా - పండ్లే అనుకోండి (కాఫీ గీఫీ ఉప్మాగిప్మాలు కావే అనుకోండి) - యేబట్టలతోఁ బడితే ఆ బట్టలతోడి యెక్కడఁబడితే అక్కడ పుచ్చుకునే ఆచారంలేదు. యిప్పుడో? పెద్ద కర్మనిష్ఠులమనిన్నీ, వైదిక సంప్రదాయం వారమనిన్నీ, పైఁగాయితరులు అనాచారంగా వుంటారనిన్నీ చెపుతూ ఆక్షేపిస్తూవుండేవారుసైతం యెక్కడఁబడితే అక్కడ కూర్చుని కాఫీ పానంచేయడం నేను స్వయంగా చూచివున్నాను. అప్పటికిన్నీ యిప్పటికిన్నీ చాలా భేదం వుంది. యింతదాఁకా యెందుకు? యజ్ఞానికి శ్రౌతులంటూ వస్తారు. సోమపానం మాట దేవుఁడెఱుఁగునుగాని ఆ శ్రౌతులు వుదయ మయ్యేటప్పటికల్లా కాఫీపానం లేకుంటే బ్రతుకలేనివారే నూటికి తొంభై తొమ్మండుగురు. మా చిన్నతనంనాఁటికిన్నీ యిప్పటికిన్నీ మాబోటి అనాచారులమాట అల్లావుండఁగా సదాచారులవైఖరి యెంతో మాఱింది. కప్పగంతుల రామశాస్త్రుల్లుగారు తాంబూలం వేసుకోవడంకూడా మడిగట్టుకొనే వేసుకొనేవారు యిది నేను స్వయంగా చూచినదే. మళ్లా ఆయన శుద్ధ ఛ్ఛాందసులేమో అనుకుంటే - పెద్ద పండితులవడం అట్లా వుండఁగా అఖండ లౌకికులు. వీరిప్పుడు సజీవులే. యిప్పుడుకూడా విత్తనాలు నిల్వచేసినట్లు భగవంతుఁడు అక్కడక్కడ పైమాదిరివారిని దాఁచికొనివున్నాడు. పెద్దవిద్వాంసుడు గాని,

కర్మిష్ఠిగాని కాఁడుగాని మా పెద్ద వియ్యంకుడు అంటే మా పెద్ద చిరంజీవిమామగారు పైని వుదాహరించిన రామశాస్త్రుల్లుగారితో పాటు తాంబూల చర్వణాదులు జరుపుకోవడమే కాకుండా పగలు నిద్దర పోవడంకూడా మడిగట్టుకునే పోతూవుంటాఁడు. ఆహార విషయంలో యితరశాఖలకన్న వైష్ణవులలో చాలా కట్టుబాటువుంది. తక్కిన సదాచారాలు వారిలో చాలా మృగ్యం అంటే తప్పులేదు. దీనిక్కారణం నిజాందేశం తిరిగేటప్పుడు గోచరమయింది. ఆదేశంలో దృష్టిదోషం బొత్తిగాలేదు. రాజసంస్థానాలలో సంతర్పణలు జరుగుతూన్నప్పుడు రాజుగారుగాని, రాజబంధువులుగాని విస్తళ్లువేసే పర్యంతమున్నూ పంక్తులలోనే తిరుగుతూ వుంటారు. వడ్డన అయ్యే సమయానికి అక్కడ నుంచి తప్పుకుంటారుగాని యెదురుగుండా వుండి "యేమండోయి మీరింకో రెండు లడ్డూలు వేసుకోండి" అంటూ హెచ్చరిస్తూ వుంటారు. వైష్ణవులీ కారణంచేతే కాఁబోలు తెరవేసుకోవడం మొదలెట్టారని నే ననుకున్నాను. ఆ దేశంలో మేము వంటచేసుకుంటూ వుండఁగా వక శూద్ర స్త్రీ ఆ చోటికే వచ్చింది. యిదేం కర్మం, వంట చేసుకునేచోటికి వచ్చావంటే జవాబు చెప్పిందికదా : "యేమయ్యోయి! నీవేమేనా శ్రీవైష్ణవుఁడవా? రాకపోవడాని"కంది. కథ కంచికే వెడుతూ వున్నట్లుంది ప్రస్తుతానికి వస్తాను. రాజావారు మామిడి పండ్లు కోసి తినమంటే తినకపోతే ఆ చాకుతో యేం మర్యాద చేస్తారో కదా అని భయం. పోనీ తినేసివేద్దామంటే తీరా తిన్న తర్వాత "ఏం బ్రాహ్మలయ్యా? యెక్కడపడితే అక్కడే తింటారా?" అని ప్రశ్నిస్తే యేం జవాబు చెప్పేదిరా భగవంతుడా అని సందేహమాయె. "సేయ ముభయతః పాశారజ్జుః" తుట్టతుదకు రాజావారి వార్షికంతో ఫలహారాన్ని కూడా స్వీకరించి యేలాగో యీవలపడి తల తడివి చూచుకున్నామంటూ మా గురువుగారు బ్రహ్మయ్యశాస్త్రుల వారితో ఆ పండితులే చెప్పేటప్పుడు విన్నాను. యీ చెప్పడంలో యే స్వల్పమో కల్పితం వుంటే వుందేమోకాని అసలు తమామున్నూ కల్పితంకాదు. ఆ రాజావారి లక్షణం కాళిదాసుగారు వర్ణించినట్లు "అధృష్యశ్చాభిగమ్యశ్చ" అనే తరగతిలో వుంటుంది. కాని అభిగమ్యత్వంకన్న అధృష్యత్వమే ప్రధానం. వీరి సన్నిధానంలో వక్క పొక్కునూరి వేంకటశాస్త్రుల్లుగారు వినాగా నిర్భయంగా మాట్లాడినవారే లేరని నా వినికి.

దండిభట్ల విశ్వనాథశాస్త్రుల్లుగారు వీరి దర్శనానికి వెళ్లినప్పుడొక చిత్రం జరిగిందట. రాజావారికి సంస్కృతంలో మంచి శ్రుతపాండిత్యం వుందని యిదివఱకే వ్రాసివున్నాను. అందుచేత రాజావారు యేలాటి పండితులు దర్శనానికి వచ్చినా వారితో సంస్కృతభాషతోనే మాట్లాడే ఆచారం. ఆ ఆచారాన్ని బట్టి సదరు విశ్వనాథ శాస్త్రుల్లుగారితోకూడా సంస్కృతాన్నే ప్రసంగించడానికి ఆరంభించేటప్పటికి ఆ తృణీకృత బ్రహ్మపురందరుఁడన్నాఁడఁట : 'రాజా,

నీవు తెలుఁగులో మాట్లాడితేతప్ప, నీ రాజ్యమంతా నాకు తలక్కట్టినా నేనిక్కడ నిమిషమేనా వుండేదిలే" దన్నాఁడఁట! దానికి రాజావారు లేశమున్నూ కోపగించుకోక అలాగే అంగీకరించి వారిని సమ్మానించి పంపించారని వినికి. విశ్వనాథశాస్త్రుల్లుగారి చర్యలు యీ రాజావారి చర్యలవలెనే అత్యద్భుతంగా వుంటాయి.

గీ. రాజులచరిత్రలును కవిరాజచరితములును
గ్రంథమ్ములకు వన్నెగలుగఁజేయు;
నందులో నామనమ్మున కరసిచూడ
కవులకతలకు రాజులకతలు లొచ్చు.

సంస్కృతం మాటలాడడమంటే సామాన్యంగాదు. అబ్బో! దానిలో యెన్నో చిక్కులున్నాయి. ముఖ్యంగా కారకవిషయం. అంటే ఆయా విభక్తులు వాడడం కొంతకష్టం. సమాసవిషయంకూడా కష్టంలోదే. సమాసాంత ప్రత్యయాలవల్ల కలిగే మార్పులు చాలావుంటాయి. అన్నిటి కన్నా ధాతువులు వాడడంలో చిక్కులు చాలా వున్నాయి. సేట్టులనిన్నీ అనిట్టులనిన్నీ వుంటాయి. ఆ భేదంలో వకప్పుడు మహామహా పండితులే తప్పటడుగులు వేస్తారు. ఆత్మనేపదమంటే పరస్మైపదమంటే అలావుండఁగా ఉభయ పదులైన ధాతువులుకొన్ని వున్నాయి. వీట్లని వాడడానికి లక్షణప్రవర్తకులు కొన్ని నియమా లేర్పఱచివున్నారు. ఆ నియమాలు కాళిదాసాది మహాకవులే పాటింపలేక పోయారు. ఆయీ విషయమైన రహస్యాలు బాగా తెలియక యిప్పుడు కొందఱు వృథాగా కొందరిని ఆక్షేపించడం అలావుండగా అంతోఇంతో ఈ రహస్యం యెరిగిన వాళ్లు దీని సందర్భం ఇట్టిదని వక్కాణిస్తే దాన్ని విశ్వసించకపోవడం అట్లావుండగా పైఁగా వక్కాణించిన వాళ్లకేమీ తెలియనట్లున్నూ, తమకేమో తెలిసినట్లున్నూ అపహాస్యంచేస్తూ వ్రాయడానికారంభిస్తారు. ఆ యీవిషయం "కాలీన" శబ్దాన్ని గూర్చి వ్రాసేసందర్భంలో అన్యత్ర వ్రాసివున్నాను. కాఁబట్టి యిక్కడ యెత్తేదిలేదు.

రాజావారు సంస్కృతం మాట్లాడుతూవుంటే యేవో లోపాలున్నాయని కదా విశ్వనాథశాస్త్రుల్లుగారు వద్దని నిషేధించింది? రాజుగారివలె కాకపోయినా ఇతర పండితులకు కూడా సంస్కృతంలో త్వరగా సంభాషించే సందర్భంలో కొన్ని లోపాలు ఉండి తీరతాయి. యీ సంస్కృతాన్ని మెయిల్‌ట్రైనులాగ నడిపించిందల్లా యేలేశ్వరపు నరసింహ శాస్త్రుల్లుగారు మాత్రమే. అయితే వీరి ధోరణిలో దోషాలుండేవికావా అంటారేమో? ఇలాటి శంకకు శ్రీహరిశాస్త్రుల్లుగారేం జవాబు చెప్పేరంటే: ఆ మహాధోరణిలో యెక్కడో మనం శంకిద్దామని గొంతుక సవరించుకునేటప్పటికి ఆయనకు కొన్ని వందలో

వేలో మాటలు నడిచిపోతాయి. కాఁబట్టి ఆ ధోరణికి అడ్డు తగలడం శుద్ధ తెలివితక్కువ అని జవాబు చెప్పారఁట. శ్రీబులుసు పాపయ్యశాస్త్రులవారి ప్రథమపుత్రులు - "పుత్రాదిచ్ఛేత్పరాజయం" అన్న సూక్తిని తండ్రిగారియందు సమన్వయింపఁజేసిన మహా విద్వాంసులు. ఆ నరసింహశాస్త్రుల్లుగారిలాగ మాట్లాడడాన్ని కొంతవఱ కభ్యసించినట్లు వింటాను. కాని కృతకృత్యులయినట్లు వినలేదు. దీన్ని యిక్కడికి ఆపుదాం. కథ కాదంబరిలాగున్నూ దశకుమారచరిత్రలాగున్నూ అగమ్యగోచరప్పంథలో పడుతూవుంది. యెక్కడికి తీసుకువెళ్లి అసలు ప్రధానాంశానిక్కలిపితే బాగుంటుందో మళ్లా వెనుకనుంచి చదువుకుంటేనే కాని నాకే అవగత మయ్యేటట్టులేదు. ఇఁక యీ పిచ్చి వ్రాఁత చదువరుల నేమి రంజింపఁ జేస్తుందో కదా! కానివ్వండి. రాజావారు మహాదాతలు, పండితులు పండితగోష్ఠీ ప్రియులు, అన్నదగ్గరనుంచి మళ్లా మొదలెట్టుకుందాము. అదికాక తొట్టికి "రేవేమిటి?"

తణికెళ్ల సుబ్బన్న శాస్త్రుల్లుగారికిన్నీ, కొవ్వూరు గోపాలశాస్త్రుల్లుగారికిన్నీ తర్కశాస్త్రంలో వాదం జరుగవలసి వుంది. సుబ్బన్నశాస్త్రుల్లుగారు "గోపాలశాస్త్రుల్లుగారు తనకైతే వాదంలో వోడిపోవడం తప్పదుగాని ప్రయోగంచేసి తన్ను కడతేరుస్తా"రనే భయంలో వున్నారు. ఉపాసనాశక్తికలవారు యిదివఱలో అక్కడక్కడ వుండేవారు. పుల్లెల దక్షిణామూర్తి శాస్త్రుల్లుగారికిన్నీ అద్దేపల్లి కృష్ణశాస్త్రుల్లుగారికిన్నీ యేదోవిషయంలో కొంత చర్చ నడిచిందనిన్నీ, కృష్ణశాస్త్రుల్లుగారి వాదం వెనుక తగ్గిన కారణంచేత ఆయన మీద యీయన మూఁడోకన్ను తెరిచారనిన్నీ వక జనశ్రుతి వుంది. దక్షిణామూర్తిశాస్త్రుల్లుగారు యితర శాస్త్రాలతోపాటుగా యీ మంత్రశాస్త్రంలో కూడా మహాప్రజ్ఞకలవారు. అట్టివారై వుండీనిన్నీ అద్దేపల్లి కృష్ణశాస్త్రుల్లుగారి ప్రయోగంవల్ల నెల్లాళ్లో రెండునెలలో కట్టువస్త్రంకూడా యెఱుఁగనిస్థితిలో వుండి చిక్కుపడుతూవుండగా వక గుజరాతీ దేశస్తుడు వచ్చి ఆ ప్రయోగాన్ని మళ్లా మళ్లించినట్లు విన్నాను. యిదంతా మా రోజుల్లో జరిగిందే. అయితే వక శంక : యిద్దఱూ మంత్ర శాస్త్రజ్ఞులేకదా, వీరి దానికి వారెందుకు లొంగిపోవలసి వచ్చింది, -అని. వినండి యీ వుపాసనలలో కొన్ని కేవలం పరానికే వుపయోగిస్తాయఁట. కొన్ని యిహానికే. వీట్లనే శాబరాలంటారు. కొన్నో? వుభయానికిన్నీ పనికివస్తాయఁట. కృష్ణశాస్త్రుల్లుగారి మంత్రాలు తుట్టతుది తరగతిలోవి. దక్షిణామూర్తి శాస్త్రుల్లుగారివి మొట్టమొదటి తరగతిలోవి అంటూచెప్పగా పెద్దలవల్ల విన్నాను. అసలు సందర్భం యీలాటిదే అయినా కొందఱు అసమర్థులైనవైద్యులు రోగాన్ని చక్కఁగా నిర్ణయించుకోలేక "ప్రయోగ" మనడంకూడా కలదు. కొందఱో! పిశాచమని మొదలెడతారు. రెండూ వకటేకాని, పిశాచం దానంతట అది ఆవహించేదిన్నీ, రెండవది యెవరో మంత్రశక్తిచే పంపిస్తే వచ్చి ఆవహించేదిన్నీ,

యింతేభేదం. పిశాచాదులను బొత్తిగా నమ్మనివారే పలువురు. వీరు నేఁడేఁకాదు పూర్వమున్నూ వుండేవున్నారు. నేనుకూడా చాలాభాగం యీ తరగతిలోకే చేరతాను. కాని యే కొంచెమో నమ్ముతాను. యీ మధ్య మాయింటిలోనే యీ పీడ తటస్థించింది. సామాన్యులు కొందరువచ్చి "హోత్తు హూత్తు" అంటూ జడిపించారు. రక్షరేకులు కట్టి వెళ్లారు. లక్ష్యపెట్టలేదు. నా పినతల్లికుమారుడు యీ విషయమై ప్రవేశం కలవాఁడున్నాఁడు. అతడు వచ్చి ఒక రోజు మాత్రం జపంచేసి యేవో అంకెలువేసి బంగారపు రక్షరేకు కట్టి వెళ్లాడు. అంతటితో ఆ పీడ ఆగింది. కాని ఆ గ్రహం ఆ పిల్లమీఁదకు మాత్రం రాకుండానే ఆ రక్షరేకు పనిచేస్తుంది కాని, అసలు గ్రహాన్ని వూళ్లో లేకుండా చేయలేదట. ఆ గ్రహమే మాకు సంబంధించిన విద్యార్థి భార్యను ఆశ్రయించినదని అన్నారు. రక్షరేకు ఇచ్చినాడు. ఆపెకున్నూ నివర్తించినది. ఇక దీనిలోకి దిగితే తేలదు. లేదని మాత్రం నేను చెప్పలేను. వుందనే చెపుతాను. ప్రస్తుత చరిత్ర దీన్ని వప్పుకొనే విశ్వాసం మీఁదే ఆధారపడివుంది.

సరే, మహాసభలో యిదివరలో వుదాహరించిన పండితులిద్దఱికీ వకరోజున శాస్త్రార్థం జరిగింది. యెవరు పూర్వపక్షం చేయడం?– సిద్ధాంతం చేయడం యెవరు?– అనే ప్రశ్న వచ్చింది. యిక్కడ కొంత వ్రాయాలి; పూర్వపక్షం చేసేవారికంటె సిద్ధాంతం చేసేవారికి గౌరవంహెచ్చు. కాబట్టి పూర్వపక్షకోటిలో చేరడానికి మహాపండితులు అంగీకరించరు. గోపాలశాస్త్రుల్లుగారు "నాది సిద్ధాంతకోటి" అన్నారు. సుబ్బన్న శాస్త్రుల్లుగారు "అలాఅయితే నేనే పూర్వపక్షం చేస్తా" నన్నారు. కాశీలో యేంచేస్తారంటే; యిలాటి సందర్భాలలో యెవరో విద్యార్థిచేత ముందుగా పూర్వపక్షాన్ని వుపపాదన చేయిస్తారు. దానిమీఁద ఆయా పండితులు అందుకుంటారు. ఇది సామాన్యంగా వినోదార్థం జరిగే సభల ముచ్చట. పట్టు పటాంగాల మీఁద జరిగేవయితేనో : "నే పూర్వపక్షంచేస్తే నీవుచెప్పఁగలవా?" అని యెవరంటారో వారిదే పూర్వపక్ష కోటిగా వుంటుంది. సుబ్బన్న శాస్త్రుల్లుగారు యెక్కడో వకచోట పూర్వపక్షం వుపపాదించారు. బహుశః వక అరగంటసేపు దానికి పట్టివుంటుంది. లేదా ఒక గంట పట్టి వుంటుంది. మాధ్యస్థ్యంచేసేవారు పూర్వపక్షాన్ని యావత్తున్నూ తమస్వంత మాటలతో సంస్కృతంలోనే అనువాదంచేసి సిద్ధాన్తంచెప్పేవారికి తెలియపరచాలి. బహుశః యీయన జడ్జీగారికోటి బోధపడితేనా ఆ పూర్వపక్షధోరణి? అందుచేత మండపేటనుంచి మాధ్యస్థ్యానికి వచ్చిన పండితులున్నూ తెల్లపోవలసి వచ్చింది; సిద్ధాంతం చెప్పాలని కూర్చున్న గోపాలశాస్త్రుల్లుగారున్నూ తెల్లపోవలసివచ్చింది. అంటే వీరిద్దఱున్నూ మహా గొప్పవిద్వాంసులే అయినా తణికెళ్ల సుబ్బన్నశాస్త్రుల్లుగారు చేసిన పూర్వపక్షానికి జవాబు చెప్పడంమాట దేవుఁడెఱుఁగునుగాని, ఆ మహామహుఁడు చేసిన పూర్వపక్షం యిట్టిదనికూడా తెలిసికోలేక పోయారనడంవల్ల ఆ సుబ్బన్న శాస్త్రుల్లు గారు ఆ శాస్త్రంలో యెంత ప్రజ్ఞ

గలవారో లోకులు తెలుసుకుంటారు. గోపాలశాస్త్రుల్లుగారే పూర్వపక్షం చేస్తే కొంతసేపేనా రాజావారి కుతూహలం తీరేది. అలా జరక్కపోవడంచేత మొట్టమొదటే శాస్త్రార్థం ఆగిపోయింది. "ప్రథమ కబళే మక్షికాపాతః".

సుబ్బన్న శాస్త్రుల్లుగారి దర్శనం చేయలేదుగాని శ్రీకర్ణాట సీతారామ శాస్త్రుల్లుగారిని మట్టుకు నే నెఱుఁగుదును. యీ దేశంలో తర్కంలో మహాపండితు లనిపించుకోవడమే కాకుండా యెందఱినో మహావిద్వాంసులను చేసిన పండితులు, వారుచెప్పేపాఠాన్ని అవగాహనచేసుకోలేకపోయారంటూ పెద్దలవల్ల వినడం. యిందులో కొన్ని మాటలు మూఢభక్తికల్పితాలుంటాయి. కాని ఏమేనా కర్ణాట సీతారామశాస్త్రుల్లుగారి ప్రతిభ అద్వితీయం అన్నమాట స్వభావోక్తి కాకపోదు. యీ శాస్త్రుల్లుగారిబుద్ధి మిక్కిలి తీక్షణమయినదని గురువుగారు చెప్పేవారు. "గురుడు బ్రహ్మయ్యశాస్త్రి కొనియాడు నెవని కర్ణాట సీతారామునసాటిచేసి" అని నేను మా తి॥ శా॥ గారిని గూర్చి చెప్పినమాట ఈ సీతారామశాస్త్రిగారికి సంబంధించిందే. ఆ సీతారామశాస్త్రుల్లుగారు నీలదేవపండిజీవారి శిష్యులఁట. లోకాతీతులైన యీ మహామహుణ్ణిగూర్చి – "సీతారామ్‌కూబ్ జాన్తీహై" అని పండిజీవారు సెలవిచ్చేవారఁట. తర్కశాస్త్రంలో పండితులనిపించుకోవడం చాలా అరుదు. వ్యాకరణం మొట్టమొదట మిక్కిలీ కష్టంగా ఉన్నట్లు కనబడుతుందిగాని యే నాలుగైదు మాసాలో శ్రద్ధపుచ్చికొని అభ్యసిస్తే క్రమంగా పేలపిండివైఖరిగా ఉంటుంది. యిటీవల వ్యాకరణాన్ని తర్కశాస్త్రంలో పూర్తిగా మిళితం చేయడంచేత ఇదికూడా కొంత దుర్బోధంలోకి వచ్చింది. కాని, మొట్టమొదట – అనఁగా – కౌముదీరచననాఁటి వరకున్నూ అంత దుర్బోధస్థితి వ్యాకరణానికి రాలేదు. కాశికావృత్తి నాఁటికి చెప్పనక్కరలేదు. ఆ కారణంచేతనే అప్పటి పండితులు చాలామంది సాంగంగా వేదం అభ్యసించిన వాళ్లుగానే వుండేవారు. యిప్పుడో వకటివస్తే రెండోది రానివాళ్లే తఱచుకనపడతారు. కారణం ఒక్కొక్క శాస్త్రానికి సుమారు పదేళ్లకు తక్కువ కాలం పట్టదు. యావత్తున్నూ సరిగా కృషిచేయరుగాని, చేసేయెడల ఓంకారంలో సర్వవేదాలు యిమిడినట్లు తర్కశాస్త్రంలో సర్వశాస్త్రాలూ యిమిడాయని చెప్పవచ్చును. ప్రత్యక్షఖండ మాటట్లావుంచినా అనుమానఖండ వక్కటితప్ప యెవరోగాని ఉపమాన శబ్దఖండలుకూడా చదవరు. ఉపమానఖండలోదే అలంకారశాస్త్రం యావత్తూ అనుకోవచ్చు. వ్యాకరణం శబ్దఖండంలోదిగదా? యిక కావలసిందేమిటి? వక్క వేదంతప్ప తర్కంలో సర్వమున్నూ గతార్థమవుతుంది. పైఁగా దాన్ని చదివి పూర్తిపాండిత్యాన్ని సంపాదిస్తే వారిముందర బ్రహ్మాండనాయకుఁడుకూడా నిల్వనేలేడు. తిమ్మిని బ్రహ్మినీ, బ్రహ్మిని తిమ్మినీ చేసేశక్తి తార్కికులకుతప్ప వేఱెవ్వరి కుంటుంది.? చూడండి– ఆ శాస్త్రంలో విజ్ఞులైనవారి ప్రతిజ్ఞలు–

శ్లో. విదుషాంనివహై రిహైకమత్యా
దృదదుష్టం నిరటంకి యచ్చ దుష్టం
మయి జల్పతి కల్పనాధినాథే
రఘునాథే మనుతాం తదన్యదైవ.

ప్రపంచంలోవున్న పండితులంతా దేన్నికాదంటే దాన్ని తాను ఔననిచెప్పి సమర్థిస్తాననిన్నీ, అవునన్న దాన్ని కాదనిచెప్పి సమర్థిస్తాననిన్నీ యీ రఘునాథపండితుని ప్రతిజ్ఞ- యితర శాస్త్రాలలోవున్న పండితుల కీ లాటి స్వాతంత్ర్యం కుదురదు.

ప్రస్తుతం గోపాలశాస్త్రుల్లుగారు యితరశాస్త్రాలల్లో పూర్ణపండితులై కూడా యీ తర్కంలో మహాసముద్రులు. సుబ్బన్న శాస్త్రుల్లుగారో? తామెక్కడ పూర్వపక్షం యెత్తుకున్నారో ఆ సందర్భంకూడా యీ మహా సముద్రుఁడికి అంతు తెలియనీయనంత ప్రజ్ఞావిశేషం కలవారు. యీలాటి వారినిగూర్చి నావంటివాఁడు వ్రాయవలసివస్తే వట్టి పొడిపొడి మాటలు పడతాయిగాని అసలు వుపయోగించతగ్గ మాటలు పడతాయా? అయినా యేవో వ్రాసినందుకు విద్వల్లోకం క్షమించాలి.

ప్రస్తుతాన్ని రెండుమాటలు వ్రాసి యిక ముగిస్తాను. ముగించడానికేముంది? యెప్పుడు సుబ్బన్నశాస్త్రుల్లుగారి పూర్వపక్షం అయోమయప్పుంతలో వున్నట్టు తోఁచిందో అప్పుడే గోపాలశాస్త్రుల్లుగారికి అవమానం సిద్ధమేకదా? దానితో కోపాగ్ని భగ్గున హృదయంలో వక్కసారిగా మండింది. ఆ మంట నేత్రగోళాల ద్వారా సుబ్బన్నశాస్త్రుల్లుగారి మీఁద ప్రసరించింది. దానితో సుబ్బన్నశాస్త్రుల్లుగారు "అదుగో బాబూ ప్రయోగించారు దేన్నో" అంటూ పడిపోయారు. వాక్కుమాత్రం లేకుండా, పది పన్నెండురోజులు జీవించి స్వర్గతులైనారు. యీ సందర్భం రాజావారు పూర్తిగా గమనించడంచేత అదిమొదలు తమ సంస్థానంలో పండితుల వివాదాన్ని పెట్టి చూడడానికి అంగీకరించకుండానే కాలక్షేపం చేసినట్లు వినికి. గోపాలశాస్త్రుల్లుగారిని యేమేనా గట్టిగా అనేయెడల రాజావారిక్కూడా భయమేకాఁబట్టి, యేకొంచెమో మందలించారేమోకాని విశేషించి కలుగజేసికొన్నట్లు వినడంలేదు. సుబ్బన్నశాస్త్రుల్లుగారి కుటుంబానికి తగిన యేర్పాటుచేసి ఆదరించివుంటారు కాని, దాన్ని గుఱించి తపిసీలు తెలియదు. మంత్రశాస్త్రంలో అలాటిప్రజ్ఞకలవారు కూడా వుండేవారా అన్నశంక చాలామందినిబాధిస్తుంది. కాని కొంచెంవోపికపట్టి విమర్శించుకుంటే, ఆశంకనివర్తిస్తుంది. పురాణాల్లో సర్వత్రా విమానాలున్నట్లు కనపడేది గదా? అది నిజమని అనుకునేవాళ్లు అనుకున్నా, కవులకల్పన అనుకునే వాళ్లెందరుండేవారు? ఇప్పుడో అందరూ నమ్ముతారుగదా? ఆలాగే గోపాలశాస్త్రుల్లుగారివల్ల మంత్రశాస్త్రం చాలావఱకు ఆ కాలంలో

ఋజువివ్వడం కలిగిందనుకోండి. ఆయన మాత్రమేకాక ఆయనకు ముఖ్యశిష్యులైన అద్దేపల్లి కృష్ణశాస్త్రుల్లుగారివల్లకూడా కొంత యీశాస్త్రంఋజువిచ్చే వున్నట్లు వినికి. వకగొప్ప షాహుకారు కృష్ణశాస్త్రుల్లుగారివల్ల రావలసిన కొన్నివేల పరిమితిగల అప్పుపత్రాన్ని భయపడి యిచ్చేసినట్లు చెప్పుకోవడం నే నెఱుఁగుదును. యిప్పుడు మనం మంత్రశాస్త్రప్రజ్ఞనే విచారించి సంతోషించడమా కావలసింది?– గోపాలశాస్త్రుల్లుగారు చేసిన అకార్యాన్ని నిరసించడమా?– అంటే, దేనికదే వుంటుందికాబట్టి దాన్నీ ఆలోచించవలసిందే, దీన్నీ ఆలోచించవలసిందే. మహాపండితులై వుండి బ్రహ్మహత్యకు సిద్ధమయినారు కనుక గోపాలశాస్త్రుల్లుగారు యిప్పట్ల దూష్యులే. అయితే వూరికే ఆయనకువుండే ప్రతీతినిపట్టి సుబ్బన్న శాస్త్రుల్లుగారు "రజ్జుసర్పభ్రాంతి"గా హడిలి బేజారై వాక్కుపడిపోవడమే కాకుండా క్రమంగా స్వర్గతులవడంకూడా తటస్థించిందేమో, అంటారా? అయితే గోపాలశాస్త్రుల్లుగారు దూష్యులుకారు. పాపం పుణ్యం పరమాత్ముడికే యెఱుక. మనకు ముఖ్యంగా కావలసినది సుబ్బన్న శాస్త్రుల్లుగారి పాండిత్య ప్రసంగం. అది నిరుపమానం అనే సంగతి ఆనాటి సభవల్ల తేలింది.

యీ సుబ్బత్రయాన్ని మెప్పించినవారు కురుగంటివారిలో వకరు వుండేవారంటూ గురువుగారు సెలవిచ్చేవారు. వారిపేరు వేంకటరామ శాస్త్రుల్లుగారని విన్నట్లు జ్ఞాపకం. తాడెక్కేవాణ్ణి తలదన్నేవాఁడున్నూ వుండవచ్చునుగదా? విద్యావివాదాలంటూ యిప్పుడున్నూ పత్రికలలో జరుగుతూ వుండడం అందఱికి అనుభూతమే. కాని యిప్పటివారికి మంత్ర శాస్త్రప్రజ్ఞలు లేకపోడంవల్ల వోడుకలగటం తటస్థిస్తే వట్టి శాపాలు మాత్రం పెట్టడం తటస్థిస్తూవుంది. ఆ శాపస్వరూపం పత్రికలలో చదువుతూనే వున్నారు కాఁబట్టి యిందులో యెత్తిచూపలేదు. అవమానం మహాచెడ్డది. కొంచెం నామరూపాలు కలవాళ్లు దాన్ని బొత్తిగా భరింపలేరు. మృచ్ఛకటికలో యేమన్నారో చూడండి–

"నిస్తేజాః పరిభూయతే పరిభవా న్నిర్వేద మాపద్యతే। నిర్విణ్ణశ్శుచమేతి శోకపిహితో బుద్ధ్యా పరిత్యజ్యతే। నిర్బుద్ధిః క్షయమేతి–"

తుట్టతుదకు అవమానం మరణాన్ని కూడా సాక్షాత్పరంపరయా కలిగిస్తుంది. కాఁబట్టి అది తటస్థించినవారు యెదటివాళ్లను శపించడానికిదిగడం తప్పదనుకుంటాను. దీనిలో వకవిశేషం గమనించవలసివుంది. యేమిటంటే విద్యావిషయంలో జరిగేవాదోపవాదాలలో జయాపజయాలు నిర్ణయించడానికి తగ్గ శక్తిసామర్థ్యాలు యెవరికోగాని వుండవు, వారుకూడా ఆ జయాపజయాలు తెలుసుకోవడానికి యీ శాపాలు ఆధారమవుతాయి. యెవరు తిట్లకువుపక్రమిస్తారో వారికి అపజయం కలిగినట్లు సులువుగా తేలుతుంది. ప్రస్తుతం

రాజావారు యెవరికి వాదోపవాదాలు పెట్టివున్నారో వారి తారతమ్యం మంత్రశాస్త్ర ప్రయోగంవల్లనే సులువుగా గ్రహింపగలిగారనుకోవచ్చు. లేకపోతే మాధ్యస్థ్యం చేయడానికి వచ్చిన పండితులకేమి వాదించడానికి కూర్చున్న గోపాలశాస్త్రుల్లుగారికేమి లేశమున్నూ అవగాహనకాని విషయం యెంత శ్రుతపాండిత్యం వున్నప్పటికీ రాజావారికి తెలియడం తటస్థింపవలసివుండదు. యితర విషయాలయితే శ్రుతపాండిత్యానికి లొంగుతాయేమోకాని శాస్త్రవిషయం లేశమున్నూ శ్రుతపాండిత్యానికి లక్ష్యపెట్టదు. "అనభ్యాసే విషంశాస్త్రం" అని వూరికేనే అన్నారా పెద్దలు? అందులోతర్క శాస్త్రం చెప్పనే అక్కరలేదు. యితర విషయాలుకూడా కొన్ని చిక్కగానే వుంటాయి. ఉదాహరణకి కొన్నిచూపి యీ వ్యాసం ముగిస్తాను.

భారతంలో ద్రోణాచార్యవధ ఘట్టంలో "అశ్వత్థామా హతఃకుంజరః" అని పల్కినవాఁడు సాక్షాత్తూ ధర్మరాజా? మరివకరా? ధర్మరాజే కదా! పాండవ విజయంలో హిడింబతాలూకు పరిజనంలో రాక్షసుఁడెవరో కామరూపం కలవాఁడు ధర్మరాజు రూపంతోవచ్చి ఆ అబద్ధం ఆడినట్లు కల్పించఁబడ్డది. యిది శాస్త్రసంప్రదాయం తెలియక కేవలమున్నూ భారతకథా సందర్భమే యెరిగివున్న శ్రుత పాండిత్యం కలవారికి శుద్ధ తప్పుగా తోఁచితీరుతుంది. అలాగే మురారినాటకంలో వాలిన్నీ శ్రీరాముఁడున్నూ యెదుటఁబడి యుద్ధంచేసినట్లున్నూ ఆ యుద్ధంలోనే వాలిహతమైనట్టున్నూ వుంది. నాటక సంప్రదాయం తెలిస్తే తప్ప యిదిన్నీ కేవలం విరుద్ధంగా తోఁచకమానదు. అలాగే ప్రభావతీ ప్రద్యుమ్న నాటకంలో గదుడు శ్రీ కృష్ణమూర్తి తమ్ముఁడనక కొడుకని కల్పింపబడివుంది. ఆయీకల్పనలకు కొన్ని వుపయోగాలు వున్నాయి. మొదటిదాని కేమి వుపయోగమంటారా? ధర్మారాజంటే లోకానికి చాలా గౌరవించతగ్గ వాడుగదా? అవసరాన్ని బట్టి అట్టి మహాపురుషుఁడే అబద్ధమాడినట్లు నాటకంలో వుండేయెడల, -అది దృశ్యప్రబంధ మవడంచేత పలువురు పండితులుమాత్రమే కాక పామరులుకూడా నాటకం చూడటానికి వస్తారుగదా, - వాళ్లందఱున్నూ "ధర్మరాజంతవాఁడే అవసరాన్నిబట్టి అబద్ధమాడితే సామాన్యులం మన మెందుకాడగూడ"దనుకొని దుర్నీతిపరులవుతారు. కాబట్టి, అట్టికల్పన చేయవలసివచ్చింది. అలాగే వాలిన్నీ రాముఁడున్నూ, యుద్ధంచేసేసందర్భమున్నూ వకలోకంకాటు, పద్ధాలుగులోకాలున్నూ, నెత్తిమీఁద పెట్టుకొనే శ్రీరాముఁడువాలిని చెట్టుచాటునుండి-అంతేకాక యితరుఁడితో పోట్లాడుతూవున్న సమయంలో వధించాడంటే యెంతేనా తప్పిదంగా వుంటుందికనక నాటకంలో మార్గాంతరంగా ఆ కళంకాన్ని తొలగించాడు. ప్రభావతీ ప్రద్యుమ్న నాటకంలో ప్రద్యుమ్నుఁడున్నూ గదసాంబులున్నూ, వెరశి ముగ్గురున్నూ వజ్రనాభ, సునాభులనే రాక్షససోదరులయొక్క కొమార్తలైన ప్రభావతీ

చంద్రవతీ గుణవతులనే ముగ్గురిని అప్పాచెల్లెళ్లను గాంధర్వరీత్యా పరిగ్రహించి వున్నారు. పినతండ్రి పెత్తండ్రికొమార్తలైన యీకన్నియలను పెండ్లాడిన వీరలుముగ్గురును అన్నదమ్ములవావివారుగా వుండడమేఅర్థమో, తండ్రీ కొడుకులవావివారుగా వుండడమే అర్థమో, ఆలోచించవలసివుంటుంది. ఇందులో వక వరుడు కృష్ణమూర్తికి తమ్ముడున్నూ తక్కిన యిద్దరున్నూ కొడుకులున్నూ, అయేపక్షంలో యిద్దఱు తల్లికి మొగుళ్లు కావలసివస్తుంది. యిదిన్నీ యిలావుండగా యించుమించు సమానవయస్సులోవుండే యీ కన్యకలకు సమానవయస్సులో వుండే భర్తలైతేనే అనుకూలదాంపత్యంలోకి చేరుతుంది కాని దాంపత్యం, లేకపోతే ముదురు మొగుడున్నూ లేతపెండ్లాముగా వుండడం తటస్థించి రసాన్ని చెడగొడుతుంది, పోనీ యీ దాంపత్యాలేమేనా యిప్పుడు లోకంలో ధనాపేక్షచేత ముసలాడికి పసిపిల్లను కట్టిపెట్టే రకంలోకి చేరతాయేమో అంటే, అట్టివికావు. పరస్పరమున్నూ గుణవయోరూపాదులను పురస్కరించుకొని యేర్పఱచుకున్నవి. కృష్ణమూర్తికి తమ్ముడైన గదుఁడే పెళ్లికొడుకులలో వకఁడుగా వున్నట్టయితే అతఁడు కృష్ణమూర్తికి యెంత కడగొట్టుతమ్ముడైనా ప్రద్యుమ్నాదుల వయస్సులోవాడు కాఁడని వారివీరి జన్మసందర్భాలను విమర్శిస్తే తేలుతుంది. చచ్చిచెడి యెట్లో వయస్సు యించుమించులో సరిపెడదామన్నప్పటికీ వావి కుదరదు. ఆయీ సందర్భాలు అన్యత్ర విస్తరించఁదలఁచుకొని వూరికే స్పృశించి విడుస్తూ వున్నాను.

దీనిమీద పుట్టేశంకలు చాలా వున్నాయి. (1) కృష్ణమూర్తికి గదుఁడనే పేరుగల తమ్ముఁడే వున్నాఁడు గాని గదుఁడనే కొడుకున్నాఁడా? (2) అయితే యీ మార్పు కవికులాగ్రేసరుఁడైన పింగళి సూరన్నగా రెందుకు చేయలేదు? యిత్యాది శంకలకు చక్కని సమాధానాలున్నూ వున్నాయి. కృష్ణునికొడుకు లెందఱో, వారివల్ల ఆ వంశం యెంత అభివృద్ధి చెందిందో. ఆ సంతానంలో భాగవతాదులలో యెన్నోవంతు వారిపేర్లు వుదాహరింపబడ్డాయో యెఱిఁగినవాళ్లు పై శంకలు చేయరు. యాదవ కుమారులకు విద్యాభ్యాసం చేయించే గురువులు మూడుకోట్ల యెనభైయెనిమిదివేలని కాబోలును భాగవతంలో వుంది. ఒక్కొక్క గురువు యెందఱికి పాఠంచెపుతాడో ఆలోచించి ఆ సంఖ్యనుబట్టి ఉపాధ్యాయుల సంఖ్యను గుణిస్తే సుమారు ముప్పై కోట్లేనా సంఖ్య తేలుతుంది, యీ ముప్పైకోట్ల యాదవకుమారులకున్నూ మూలపురుషులైన కృష్ణునియొక్కానున్నూ ఆయన సోదరులయొక్కానున్నూ కుమాళ్లు అధమం వక లక్షవరకేనా వుండవలసి వస్తుంది. ఆ లక్షలో కృష్ణుడికుమాళ్లు వక వెయ్యేనా "అట్లీస్టు" వుండరా? ఆ వేయి మందిలో గదుడనే కొడుకుకూడా పినతండ్రిపేరింటి వాఁడు వుండఁగూడదా? యిత్యాదికం వూహించుకోవాలి. యీలాటి అభూతకల్పనలు నాటకాలలో చాలావున్నాయి. ఆలాగ ఆయాకవులు

కల్పించడానికి కారణం కొన్నిచోట్ల అధర్మాన్ని తొలగించడానికిన్నీ అని పొడకడుతుంది. కొన్నిచోట్ల అదీ యిదీ కాకుండా ఆ కవులు నిష్కారణంగానే మార్చినట్లున్నూ స్థూలదృష్టికి కనపడుతుంది. జానకీ పరిణయం, బాలరామాయణం మొదలైనవి దగ్గిఱపెట్టుకొని కుశాగ్రబుద్ధులైనవారు విచారణచేస్తే సంగతి సందర్భాలు తేలుతాయి. శ్రుతపాండిత్యం మాత్రమే వున్నవారికిగాని, నూటికి ముప్పైఅయిదు వారికిగాని నాటకంలోవుండే కల్పనావిశేషాలు బోధపడక, కవి కథతెలియక పాడుచేశా డనుకుంటారు. అట్టిస్థితిలో తర్కంలో మాట్లాడే పండితుల తారతమ్యాలు శ్రుతపాండిత్యం యెంతవున్నా శ్రీ రాజావారు గ్రహించడం తటస్థించేదేకాదు కాని,- గోపాలశాస్త్రుల్లుగారు ప్రయోగం చేశారో లేదో దేవుడికెఱుక- వారు కళ్లెఱ్ఱజేసి చూడడంవల్ల తాత్కాలికంగా గోపాలశాస్త్రుల్లుగారికి కల్గినకోపం వ్యక్తమయింది; దానితో అంతకుముందే మనవి చేసుకొన్న సుబ్బన్నశాస్త్రుల్లుగారి మాటలు తార్కాణంగా రాజావారికి తోఁచాయి. దానితో విశేషించి పండితాదరంకల ఆ రాజన్యునకు పండితులంటే అసహ్యం కలిగింది.

పాండిత్యానికి వుండదగ్గ లక్షణం ముఖ్యమయింది సత్యం. అట్టి సత్యాన్ని మన్నించేవారే అయితే గోపాలశాస్త్రుల్లుగారు రాజావారితో “అయ్యా నేను ఆరుశాస్త్రాలలో ప్రజ్ఞకలవాణ్ణి. సుబ్బన్న శాస్త్రుల్లుగారు వకటే తర్కంలో యావజ్జీవమున్నూ కృషిచేసినారు, అందుచేత దానిలో వారిని సాక్షాత్తున్నూ గౌతముఁడో కణాదుఁడో అయితేనే తట్టుకోగలరేమో కాని ఇతరులు తట్టుకోలే”రంటూ కొన్నిమాటలు తత్కాలోచితంగా మనవి చేస్తే రాజాగారున్నూ సంతోషిస్తారు. సుబ్బన్నశాస్త్రుల్లుగారున్నూ “అయ్యా నాకన్న గోపాలశాస్త్రుల్లుగారే గొప్పవారు; యేమంటే : ఆఱుశాస్త్రాలలో పూర్ణ పండితులుగదా వారు?” అని చెప్పి స్తుతిచేసివుందురు. అలాకాక రసాభాసంగా లోకులు చెప్పుకొని కళంకాన్ని ఆపాదించేతోవలోకి గోపాలశాస్త్రుల్లు గారు దిగి, తమకేకాక పండితలోకానికంతకున్నూ తీరనికళంకాన్ని దెచ్చిపెట్టారని వ్రాయకతప్పదు. పాండిత్యమెంత ఉన్నప్పటికీ లౌకిక జ్ఞానం కొంతవుండాలి. యుక్తినైపుణ్యం కొంత వుండాలి. అప్పుడుగాని ఆ పాండిత్యం శోభించదు. యీ సందర్భాలన్నీ వున్నట్టు వక్క బులుసు పాపయ్యశాస్త్రుల్లు గారినే పండితమండలి యేకవాక్యంగా అంగీకరిస్తుంది. మచ్చుకు ప్రకృతానికి సంబంధించిందే వక యితిహాసం వుటంకించి వ్యాసం ముగిస్తాను.

విజయనగరంలోనే శ్రీ పాపయ్యశాస్త్రుల్లుగారు మహా పండితసభలో వేదార్థం చెపుతూవున్నారఁట. యెక్కడో సంశయంగా వున్నట్టు తోఁచి కొవ్వూరు గోపాలశాస్త్రుల్లుగారు, “బావగారూ! ఆ స్థలంలో మళ్లా సెలవియ్యండీ” అని పృచ్ఛచేశారఁట. దానిమీద పాపయ్యశాస్త్రుల్లుగారు- “బావగారూ, యీ తరవాయి మనవిచేశాక తుట్టతుదకు

సావకాశంగా తమరడిగిన సందర్భానికి జవాబు మనవిచేసుకుంటా"నని యుక్తిగా అప్పటికి దాఁటుకుని అదిపూర్తికాగానే, అంటే గంటకో రెండుగంటలకో అన్నమాట, "యేదండీ బావగారూ! తాము యిందాకా అడిగిన సందర్భం?" అన్నారట. గోపాలశాస్త్రుల్లు గారు ఆ పనసలో వాక్యం వుచ్చరించి యిక్కడనే నేనడిగిందని చెబుతూవుండఁగా పాపయ్యశాస్త్రుల్లు గారు చెవులు మూసుకొని "నారాయణ, నారాయణ, నారాయణా" అంటూ ముమ్మాఱు స్మరించారఁట! గోపాలశాస్త్రుల్లుగారు వెలవెలపోయారఁట! కారణమేమిటంటే; పాపయ్య శాస్త్రుల్లుగారు వేదానికి యెంతవఱకవసరమో అంతవఱకే ఆయా శాస్త్రాలలో కృషిచేసినారు. గోపాలశాస్త్రుల్లుగారో? వేదంలో యేకొంచెమో ప్రవేశం చేశారో లేదోగాని ఆయా శాస్త్రాలల్లో సమగ్రంగా పనిచేసిన మహామహోపాధ్యాయులు. ఈ సంగతి మహాలౌక్యులైన పాపయ్య శాస్త్రుల్లుగారికి తెలుసును. ఆయన అడిగినప్పుడే ఆశంకకు జవాబు చెప్పేటట్టయితే "లక్కికి లక్కి" వాదంలోకి దింపి గోపాలశాస్త్రుల్లుగారు, పాపయ్యశాస్త్రుల్లుగారిని వోడించడం యేలాగున్నూ తప్పదు. కాఁబట్టి "అటునుండి నఱుక్కు రమ్మన్నా"రని అప్పటికి మృదువుగానే తప్పుకొన్నారు. తిరిగీ ఆ స్థలం అడగడంలో పాపయ్యశాస్తులవారి యుక్తి పూర్తిగా గోచరిస్తుంది. గోపాలశాస్త్రుల్లు గారికి పుట్టిన వుద్దేశ్యంలో కొంత దోషంవుంది. యేమిటా దోషమంటే; యేదో గవడగొయ్యలోకి దింపి పాపయ్యశాస్త్రులుగారి వాగ్ధాటికి అడ్డుకల్పించి గొప్ప సంపాదిద్దామనుకోవడమే. పాపయ్యశాస్త్రుల్లుగారు దాన్ని కనిపెట్టి 'యీయన శిరోభారం తగ్గించే వుపాయం యిదికదా' అని యీ యుక్తిచేశారు. శాస్త్రంలో కొంతవఱకేనా పాపయ్యశాస్త్రుల్లుగారు లేశమున్నూ పనిచేయ లేదుగదా? తక్కినదల్లా వుండఁగా వుచ్చారణలోనే అనఁగా స్వరవిషయంలో తప్పుపట్టుకుంటారు. ప్రస్తుతం జరిగిందిన్నీ అదే. వకవేళ 'గోపాలశాస్త్రుల్లుగారు మహామంత్రవేత్త-మహాజిపిత-ఆమాత్రం వేదవాక్యాన్ని సరిగా ఉచ్చరించనేలేకపోయారా?' అని కొందఱికి శంక కలగవచ్చును. ఉచ్చరించ లేకేమి? ఉచ్చరించే వుంటారు. పాపయ్యశాస్త్రుల్లుగారు సరియైనదాన్నే కాదంటారు, కాదంటే సమర్థించుకొనేశక్తి ఆభాగంలో గోపాలశాస్త్రుల్లుగారికి వుందా? "నహి సర్వ స్సర్వం విజానాతి" కదా? ముందు దురుద్దేశంపుట్టిన దెవ్వరికి? గోపాలశాస్త్రుల్లుగారికి. పిమ్మట దురుద్దేశంపుట్టడం పాపయ్య శాస్త్రుల్లు గారికి. వీరు నిజానికి ఛాందసులే అయినా ఆ షడ్దర్శనవేత్తను వోడించినట్లయింది. యథార్థం ఆలోచిస్తే వారున్నూ మహానుభావులే వీరున్నూ మహానుభావులే.

సామాన్యలోకానికి యీ ధోరణి పనికిరాదు. కాఁబట్టి యెంతవారైనా జయాపజయాల కోసం కొంత పెనుగులాట పూర్వం సర్వసమ్మతంగావుండేది. ఇది యీ జన్మంలోనేకాక వుత్తర జన్మానికిక్కూడా సంబంధించివుండేదన్నట్టు శ్రీహర్షుఁడు (నైషధగ్రంథ కర్త) గారి

తండ్రి శ్రీ హీరుండుగారికిన్నీ ఆయన బావమఱందికిన్నీ జరిగిన వాదోపవాదాలకు సంబంధించిన యితిహాసంవల్ల మనకు తెలుస్తుంది. దీనియందు పూర్వపురాజులకు యెంత ఆసక్తిన్నీ లేకపోతే-

"పగులంగొట్టించి తుద్భట వివాదప్రౌఢి గౌడడిండిమభట్టు కంచుఢక్క"

అనే శ్రీనాథునిపద్యపాదం మనకు ఆదరపాత్ర మవుతుందా? శ్రీనాథుండు ఆంధ్రంలో గ్రంథాలు వ్రాసినప్పటికీ సంస్కృతంలో సామాన్యుండు కాదు. గౌడడిండిమభట్టు సంస్కృతంలో జయసూచకమైన కంచుఢక్కా రూపమైన బిరుదచిహ్నం కలవాడు. శ్రీనాథుండేమో కవి సార్వభౌమ బిరుదాంకితుండాయె. యీ రెండుచిహ్నాలున్నూ రజోగుణప్రధానాలే అవడంచేత వీరిద్దరికిన్నీ వాదంపడింది. శ్రీనాథుండు జయించాడు. ఢక్కా పగుల్ల గొట్టించాడు. యిప్పటి నాగరికులే అయితే యెందుకీ పిచ్చివాదాలందురు. అందురేమిటి? అనేతీరతారు. ఫీజుపుచ్చుకుని స్వార్థంకాకుండా పరార్థం యెంతగానో పోట్లాడుకుంటూ కోర్టుల్లో బల్లలుగుద్దుతూ వుండేవారినో - యిప్పటివారు లేశమున్నూ యెత్తుకోరు. అది "ఉదరనిమిత్తం బహుకృతవేషం" కింద జమకట్టుకుంటారు. పండితులో కవులో పెట్టుకొనే వాదాలైతే వీరు పూర్తిగా యేవగించుకుంటారు. కొందరు యేవగించుకోవడంతో సరిపెట్టక తూలుమాటలుకూడా వ్రాస్తారు. అయితే యీ పండితులలో కూడా కొన్ని లోపాలు లేకపోలేదు. యేవిషయమై వాదం ప్రారంభమయిందో దాన్నిగురించి మాత్రమే యుక్తులు వుపయోగించక, అతనికి వకకన్ను లేదనిన్నీ, యితనికి స్నానంచేయడం చేతగాదనిన్నీ, అతనికి బోదకాలు వుందనిన్నీ యేమేమో యెంచడం మొదలుపెడతారు. తక్కిన వేవేనా యెంచితే కొంతవరకు సహించవచ్చు నేమోకాని దైవకృతమైన అంగవైకల్యాదులనుకూడా విద్యావివాదాల్లో యెత్తుకోవడం పరమాసహ్యం అనడానికి సందేహంలేదు. పూర్వం మహారాజసభలలో యీ వాదోపవాదాలు జరిగేవికనక యీలాటి అవ్యక్తప్రసంగానికి అవకాశం వుండేదికాదు. యిప్పుడో? మహారాజులే చాలావఱకు తగ్గివున్నారు. ఉన్నవారిలో యే వకరిద్దరోతప్ప పండితగోష్ఠికి చెవియొగ్గేవారు కనపడరు. అన్నిటికీ ఆధారం పత్రికలున్నాయి. ఆ పత్రికలలో కొన్ని కొంత మంచీచెడ్డా విమర్శించి ప్రచురించేవి వున్నప్పటికీ యేదో మేటరుదొరికితేనే చాలు అనుకొనడంవుంది. అందుచే పండితులవాదాలు బొత్తిగా రసాభాసప్రకరణంలోకి దిగుతూ వున్నాయి.

అప్పటి రాజులను గూర్చిన్నీ, పండితులను గూర్చిన్నీ గురుముఖతః విన్నమాటలలో జ్ఞాపకమున్నంతవరకు యీ వ్యాసంలో యేకరుపెట్టివున్నాను. అప్పటికన్న ఇప్పుడు విద్య సర్వతోముఖంగా వ్యాపించి వుందనడం సర్వానుభవ సిద్ధమే. కాని వక తేడావుంది.

ఇప్పటి విద్య ప్రస్తుతం రష్యాలో జరుగుచున్న సామ్యవాదంలోకి దేఁకుతుంది. అంతో యింతో విద్య వచ్చినవారు యిప్పుడు వేలకొలఁదిగా ఉన్నమాట సత్యం. అప్పటి విద్వాంసులవంటి వాళ్లు మాత్రం లేరు. చూడండీ యిప్పటివారి పాండిత్యాలేలావున్నాయోను.

వకచోట, "మహస్తరణులు" అని పడడానికి బదులు "మహాస్తరణులు" అని అచ్చులో దీర్ఘంపడింది. దాన్ని సవరించుకోవడం చేతకాక వకరు "గొప్పదైన ఆసనము కలవారు" అని అర్థంవ్రాసియున్నారు. యీ అర్థంలో లేశమున్నూ యోగ్యతలేదు. "మహః=తేజస్సుచేత, తరణులు-సూర్యులు" అని కవి తాత్పర్యం. యీ తాత్పర్యాన్ని గ్రహించగలిగినవారే అయితే ఆ హకారంమీదవున్న పొల్లు ముద్రాప్రమాదమని గ్రహించగలుగుతారు. గాని ఆ మాత్రం పిండిలేనివారికి అది సాధ్యంకాదని వ్రాయనక్కఱలేదు. యింకొకచోట-

"తనయుల సనయుల మనుమల ఘనముల మునిమనుమలసైతము" అనివుండగా- "మనుమలన్" అనునది మహద్వాచకముగాన, దానికి "ఘనములన్" అనే అమహత్తును విశేషణం చేయకూడదంటూ వకరు వెక్కిరిస్తారు. యీ కాలపు పాండిత్యాలు యిలా వున్నాయి, "ఘనము-ఘనములు" అనుకోకపోతే, ఘనా-మా-లక్ష్మీః- యేషాంతే ఘనమాః. ఆఘనమశబ్దానికి ప్రథమైక వచనం ఘనముఁడు, బహువచనం ఘనములు, రాముఁడు రాములు అన్నట్లే అగుననిన్నీ, దాని ద్వితీయైకవచన బహువచనాలు "ఘనమునిన్" "ఘనములన్" అవుతుందనిన్నీ తెలిసి కోఁజాలని వారిప్పుడు కవులు కవులే కారు, ఇంకా యెవరో యెవరో యెవరో, ఆకాశంమీఁద వుండేవారు. దీన్నిబట్టి అప్పటిపాండిత్యాలకూ యిప్పటి పాండిత్యాలకున్నూ కల భేదం వ్యక్తంగావడంలేదా? యింకొకటి మచ్చుకి చూపి వ్యాసాన్ని ముగిస్తాను.

"ఆత్మ ప్రభుతన్ సాగింపఁగాఁజొచ్చెన్"

అనివున్నది వకచోట. "ఆత్మప్రభుతన్" అన్నది సిద్ధసమాసమనుకొని "ఆత్మ" అన్నది గురువుగావడానికి బదులు లఘువయిందంటోవకరు లిఖిస్తారు. యేమనుకొనేది? రేఫయుక్తమైనద్విత్వం పరమందుంటే పూర్వం వికల్పంగా లఘువవడానికి ప్రీవీకౌన్సిలుతీర్పులున్నాయి. అవి అన్యత్ర విస్తరించడమయింది. యిక్కడ ఆత్మ-తత్సమం, ప్రభుతతత్సమం, ఈ రెండిటికిన్నీ సాధ్యసమాసం చేసుకుంటే నచశంకా నచోత్తరంగదా? హరి ప్రభుత్వం- అంటే అది సిద్ధమున్నూ కావచ్చును, సాధ్యమున్నూ కావచ్చును. యీమాత్రంకూడా తెలియనివారిప్పుడు కవులు, మహాకవులు, చక్రవర్తులు, సమ్రాట్టులు, వ్యాఖ్యాతలు. పాండిత్యానికి దుర్దశపట్టింది. అందుచేతనే నేను తుట్టతుదకు వ్యావహారికభాషలోకి దిగింది. దీనిలో వ్రాస్తే తప్పనే వారుండరుకదా? సలక్షణమైనభాషలో వ్రాసినప్పటికీ దాన్ని

గ్రహించడానికితగ్గ శక్తిలేక తప్పని అనడం యేలాగా తప్పదని దీనిలోకి దిగాను. యిదియిలా వుంచి పూర్వపువారి పాండిత్యాలకున్నూ, యిప్పటి పాండిత్యాలకున్నూ హస్తిమశ కాంతరమనిన్నీ, అప్పటి రాజాధిరాజులు పండితుల వాదోపవాదాలను వారి యుద్ధాలతో పాటు గౌరవించేవారనిన్నీ, అందుకే మాపిఠాపురం రాజావారుకూడా గోపాలశాస్త్రుల్లు గారియొక్కానున్నూ సుబ్బయ్యశాస్త్రుల్లు గారియొక్కానున్నూ వాదోపవాదాలు వినడానికి సభచేసివున్నారనిన్నీ ముఖ్యంగా మనం తెలుసుకోవలసి వుంటుంది. అట్టి మహా రాజులేవుంటే "పిడివాదాలు" వాదించేవారిబండారం తేలుతుందిగాని పత్రికలవల్ల లేశమున్నూ తేలదు. మాఅదృష్టంమంచిదికనక శ్రీఆత్మకూరిలో వచ్చినవాదంలో

## "దేవతలు ధర్మవర్తులు"

అన్న ప్రయోగాన్ని మేమిచ్చినప్పుడు "ధర్మవృత్తులు" అనిదిద్దుతామన్నవారి పిడివాదాన్ని సాగనీయని ప్రభువుండడం తటస్థించింది గాని- యిప్పుడు- "మనుజుల విప్రుండు" అన్న ప్రయోగాన్నిదిద్దుతామనే పిడివాదాన్ని మానిపించడానికి దగ్గ ప్రభు వేఁడీ? లేదుగదా? లేకేమి, రాజన్నా రెడ్డన్నావకటే, యశముగాఁచె యీ రెడ్డెయ్య ప్రభువు మాకిప్పుడు దిక్కుగా కనపడ్డాఁడు. యిది విషయాంతరం.

యింకా యీ పిఠాపురపు గంగాధర రామారావుగారికి సంబంధించిన గాథలు కొన్ని వున్నాయి. మరొకప్పుడు వ్రాస్తాను. వెనుక వ్రాసిన సంగతులలో "జుట్ల" విషయమై కొంతసవరణను పెండ్యాల వెం॥ సు॥ శాస్త్రుల్లుగారు వుపపాదించి వున్నారు. కృతజ్ఞతను పత్రికాముఖమున తెల్పి వున్నాను. కృతజ్ఞతా ప్రకటనానంతరం తలవని తలంపుగా మద్రాసుకు వెళ్లడం తటస్థించింది. అక్కడ సదరు గంగాధర రామారావుగారికి దత్తత రీత్యా మనుమలున్నూ వారిపేరిటవారున్నూ నాతో చెప్పినారుగదా : 'మీరు సవతినాయనమ్మ గారిని గూర్చి వ్రాసిన విషయాన్ని తాము సవతితల్లిగారికి జరిగిందని విన్నా' మన్నారు. అసలే జరగలేదని శాస్త్రుల్లుగారు లిఖించి వున్నారు. మా గ్రామంలో వెలంవారు పలువురున్నారుగాని వారిలో నా కన్న వయస్సు మించినవారిప్పుడు వక్కరున్నూ సజీవులుగాలేరు. నేను వ్రాసే సంగతులు శ్రీ మాతండ్రిగారి వల్లనేకాక మావూళ్లోవుండే వెలమ వృద్ధులవల్లకూడా విని వున్నవి. మావూళ్లో జరిగిన "లక్ష-యేభైవేల" వాదమే కాదన్నారు శాస్త్రుల్లుగారు. దానికి ధుండిగారు చెప్పిన శ్రీరంగంలో సంగతిని వుదాహరణంగా చూపివున్నాను. అదిన్నీ సత్యమైవుండునుగాని మా గ్రామంలో మా వీధినే జరిగిన లక్ష-యేభైవేలు "విభూతిరుద్రాక్ష ధారణమున్నూ" అసత్యం కాదేమో అని యిప్పటికిన్నీ నాకు సందేహం. కమ్మగృహస్థు విషయంకూడా శాస్త్రుల్లుగారు అన్యథాకరించివున్నారుగాని

అది తగినంత యుక్తియుక్తంగా కనుపడడంలేదు. ఆయన్ని శ్రీరాజావారు అవమానించ కనేపోతే ఆయనమేనల్లుళ్లు శ్రీ రాజావారి విషయంలో కొందఱు రౌడీలతో దౌర్జన్యాన్ని చూపడం యేలావస్తుంది? దాన్ని వస్తాదు వారించడం యేలావస్తుంది? యీవిషయాన్ని పురస్కరించుకొని కమ్మగృహస్థును రాజావారు ఖైదుచేయించడం యేలావస్తుంది? ఆయన ఖైదులో మృతిచెందలేదన్నంతవఱకు సత్యమైతేకావచ్చునుగాని, తక్కినయావత్తున్నూ అసత్యమని నాకు విశ్వాసం లేదు. శాస్త్రుల్లుగారేనా నాయిాడువారేకాని యెక్కువపెద్ద కారు. వారున్నూ ఆయీసంగతులు వినేవుంటారుకాని చూచి వుండరు. వారివినికినిబట్టి వారు సవరణను వుపపాదించివున్నారు. మునిగిపోయిందేముందని నేను నమస్కృతులతో స్వీకరించివున్నాను. శాస్త్రుల్లుగారి తాతగారిని గూర్చిన సహాధ్యాయిత్వం మొదలైన విషయాలమాటెట్లావున్నా అసలువిషయం అసత్యమని వ్రాయడానికి కారణాంతర మేమేనావుండి వుండునా అని నా కిప్పటికిన్నీ అనుమానమే. ఆ విషయం నేను శతధా సహస్రధా విని వ్రాసిందికాని మఱొకమాదిరికాదు. సహాధ్యాయులో మఱొకరో అన్న విషయం నేనే సంశయిస్తూ వ్రాసివున్నానుకదా? వారి యెడల నాకు ద్వేషభావం వుండివ్రాసినట్లు శాస్త్రుల్లుగారున్నూ వ్రాయలేదు. మొత్తం మన మేలా అనుకోవాలంటే : ఆయాచరిత్రలు పలువురనోళ్లలోఁ బడి పలువిధాలుగా మారిపోతూవుంటా యనుకోక తప్పదు. వాల్మీకి సీతాదేవి లంకలో నిరాహారిణిగా వుందని వ్రాశాడు. దేవీభాగవతంలో ఇంద్రుఁడు పంపిస్తూవున్న కామధేనువుపాలు ప్రాణధారణానికి తగ్గన్ని పుచ్చుకుంటూ వుండేదని వ్రాసివుంది. రామదాసు బొందితో వైకుంఠానికి వెళ్లేఁడనిన్నీ వెళ్లేటప్పుడు - "తరలిపోతాము చాలదయలుంచండీ -యిఁక- మరలీజన్మాలకురామూ మదిలో నుంచండీ" అని గానంచేస్తూ మఱిన్నీ విమానాన్ని అధిష్ఠించాఁడని భక్తులు గానం చేస్తూవున్నారు. చరిత్రకారులో? రామదాసుగారిని వురి కాఁబోలును తీసినట్లు చెపుతారు. కాఁబట్టి వీట్ల సత్యాసత్య నిర్ణయం చాలాకష్టం. శాస్త్రుల్లువారేనా బాగా కనుక్కొని సవరణను వుపపాదిస్తే అది యెక్కువ వుపకారం అవుతుందని మఱీమఱీ మనవిచేస్తున్నాను. శిఖావిషయాలు అసలే "సున్నకిసున్నా, హళ్లకి హళ్లీ" అంటే లోకం బొత్తిగా విశ్వసించటం లేదు కనక యింతగా మనవిచేసుకోవడం. యిటీవల యీ సంగతిని కొందఱితో సంప్రతించి నేనింతగా మనవిచేసుకుంటూ వున్నానుగాని వాద తాత్పర్యంతో కాదు. యిప్పటి నా వోపికనుబట్టి, వొప్పులైన ప్రయోగాలను యెవరేనా తప్పులంటే నే ఔదాసీన్యం వహించే స్థితిలో వున్నాను. అట్టి సందర్భంలో యెవరివల్లనో విని వ్రాసే వ్రాఁతల్లో యెవరో కాదంటే వాదం పెట్టుకుంటానా? పెట్టుకొనేది లేదు. మావూళ్లోనే జరిగిన యింకొక శ్రీవారి చర్యను కొంచెం వుటంకించి యీ వ్యాసాన్ని ముగిస్తాను.

మా కడియంలోవుండే గ్రామదేవతకు రంగువేయించవలసిందని రాజావారు ఠాణాదారు తాంట్ర కొండయ్యగారికి ఆజ్ఞాపించారట. కొన్ని మాసాలు జరిగాక రంగుప్రసక్తివచ్చింది. యేకారణంచేతనో రంగువేయించడము జరిగిందికాదు. దానిమీఁద రాజావారు ఠాణాదారుగారిమీఁద కారాలూ మిర్యాలూ నూఱుతూ వున్నారఁట. ఆకోపం చూచితీరవలసిందే కాని విని వ్రాసేవ్రాతలవల్ల అవగతం కాదని చదువర్లు తెలుసుకోవాలి. అట్టి సమయంలో యెవళ్లు గాని కిక్కురుమనకుండా వుంటే కొంతసేపటికి శ్రీ నృసింహమూర్తి కోపంలాగున దానంతట అదే చల్లారుతుంది. మళ్లా యెప్పుడైనా దగ్గరవుండే విదూషకులద్వారా తమ కోపాన్ని అభినయింపజేసి వారిని విశేషించి సత్కరించడం కూడా వుందని విన్నాను. ఆ కోపాన్ని నిర్భయంగా రాజావారియెదుట అభినయించి బహుమానాన్ని గ్రహించిన రామభొట్లుగారి పేరిప్పటికిన్నీ ప్రసిద్ధిగా చెపుతారు. చెప్పేదేమంటే : అలా కారాలు మిర్యాలూ నూరుతో వుండఁగా వక నియోగిగృహస్థు ఉద్యోగాది సంబంధ లేశమున్నూలేని కడియం కాపురస్థుడు యేదో ఠాణాదారుగారి తరపున కొంచెం సవరణ మాటలు మాట్లాడడానికి వుపక్రమించేటప్పటికి ఆ ఠాణాదారుగారిమీఁద వుండే దూఁకుడు యీ సంపన్న గృహస్థుమీదికి వచ్చి వూరిపిడుగు సామెతను జ్ఞప్తికితెచ్చినట్లు చెప్పుకుంటారు. ఆయీ కథలలోవుండే కోపపుసంగతులు వగయిరా మన మిప్పటి నాగరికతని మనస్సులో పెట్టుకొని చదువుకుంటే హృదయంగమంగా వుండవు. అధమం వక అర్ధశతాబ్దమైనా వెనక్కి వెళ్లాలి. అంటే యీ సంగతులన్నీ ఆనకట్టకు పూర్వపుగాథలు. ఆనకట్టకట్టబడి రమారమీ నూరేండ్లు కావచ్చింది. అప్పటికింకా "నావిష్ణుః పృథివీపతిః" అనే సూక్తి అమల్లోనేవుంది. అప్పుడు రాజాగారు వచ్చేరంటే విష్ణుమూర్తి వచ్చినట్లే గ్రామం యావత్తు తలఁచేవారు. రాజుగారివల్ల సమ్మానింపఁబడనే అక్కఱలేదు. అవమానింపఁబడితేకూడా కొంత గౌరవంగానే లోకులు భావించేవారు. యిందులో అతిశయోక్తి లవమున్నూలేదు. రాజుగారితో యేమాత్రం మాటలాడటం తటస్థించినా అదే మహమ్మేరువుగా భావించేవారు. ఆ కారణంచేత ఆ గృహస్థు ప్రసక్తిగాని ప్రసక్తిలో దిగి కొంత అవమానంపొందడం తటస్థించింది. కాని, విశేషమైన అవమానం వరకూ రాలేదు. సామాన్యంతో తేలిందని చెప్పుకుంటారు. యింకా, లకుందాసు వేంకటాచలం అనే నాన్‌బ్రామిను సంస్థానపండితునికి సంబంధించినవిన్నీ, దివాన్ వాడ్రేవు చెలమయ్యగారికి సంబంధించినవిన్నీ, దిగవల్లి శివరావు దివాన్ గారికి సంబంధించినవిన్నీ, మామగారు శ్రీ యినుగంటి ప్రకాశరాయణిం గారికి సంబంధించినవిన్నీ, గాథలుచాలావున్నాయి. అవకాశాన్ని పట్టి అప్పుడు వ్రాస్తానని మనవి చేసుకుంటూ ఇప్పటికి దీన్ని ముగిస్తాను.

★ ★ ★

# వెంకప్ప సోమయాజులు

వీరు కోనసీమలో అయినపల్లి అనే గ్రామకాపురస్థులు. బులుసు అచ్చయ్యగారనే జగత్ప్రసిద్ధవిద్వాంసుల ప్రథమపుత్రులు. తండ్రిగారి వలెనే వేదశాస్త్ర శ్రౌతములలో నఖండప్రజ్ఞకలిగి ఆ సేతుహిమాచలమున్నూ ప్రసిద్ధిచెందిన పుణ్యపురుషులు. అసలు బులుసువారి వంశము "బలుసులేని తద్దినమున్నూ బులుసులేని యజ్ఞమున్నూలేదు" అనే సామెతకు స్థానమైనది. అందులో నీ సోమయాజులుగారు అగ్రగణ్యులు. వీరి నగ్రగణ్యులందామంటే, తండ్రి అచ్చయ్యగారి నేమనవలెనో, తాత జగన్నాథశాస్త్రులవారి నేమనవలెనో, కుమాళ్లు పూర్ణయ్య సోమయాజులు గారి నేమనవలెనో తెలియదు. కాఁబట్టి మొత్తం ఆ నాలుగుతరాలున్నూ వరుసగా వేద శాస్త్ర పుంజాలుగా ప్రకాశించా యనుకొందాం. ఆలా అయినప్పటికీ ప్రస్తుతం మనం వ్రాస్తూవున్నది వేంకప్ప సోమయాజులు గారిని గూర్చి కాఁబట్టి వీరిని అగ్రగణ్యపదంతో వాడడం అంత తప్పు గాదనుకుందాం. "వ్రతానా ముత్తమవ్రతమ్." యీ సోమయాజులుగారు ఆపౌండరీకాంతశ్రౌతియై అనేకులచే యజ్ఞాలెన్నో చేయించడమే కాకుండా స్వయంగాకూడా చేసి చిరకాలం జీవించిన పుణ్యమూర్తులై వున్నారు. ఆయీదేశంలో వుండే పెద్దపెద్ద శ్రౌతులందఱున్నూ వీరివద్ద దివిటీకింద దీపాలే అని చెప్పుకోవడం నేనెఱుగుదును. వీరిచేత చివాట్లు తినని శ్రౌతియేలేదని చెప్పుకోవడం నేను స్వయంగా విన్నదే. నా బాల్యంలో వీరు సజీవులే కాని వీరి దర్శనభాగ్యం నాకు లభించలేదు. చరిత్రమాత్రం పలువురువల్ల విని ఆనందించడం తటస్థించింది. వీరు తండ్రిగారివలె నప్రతిగ్రహీతలు కారుగాని సుప్రతి గ్రహీతలు. అట్లయ్యును తృణీకృత బ్రహ్మపురందరులు.

తండ్రిగారి నప్రతిగ్రహీతృత్వాన్ని గుఱించినగాథలు కొన్నివున్నాయి. అందులో వకటి వుదాహరిస్తాను. వకరోజున వుదయం గుమ్మం అలుకుతూవున్న సమయంలో వీరి తల్లిగారిని తండ్రి అచ్చయ్యగారు "ఈవేళ శాకపాకా లేమిటి" అని ప్రశ్నించేటప్పటికి ఆమె, యేముంది, ఇత్యర్థలు పులుసూ ఇతిభావలు కూరానున్నూ, అని జవాబు చెప్పినట్టున్నూ, దాని మీఁద అచ్చయ్యగారు ఆవిడ భావాన్ని గ్రహించి నీకేమాత్రమో ధనాపేక్ష వున్నట్టుగా తోస్తూవుంది అది యెంతవఱకో వకమాటుబయటపెడితే తెచ్చి యీయడానికి ప్రయత్నిస్తా నన్నట్టున్నూ,

ఆ పట్టాన్ని ఆమె గుమ్మం అలకడానికి నీళ్లు తెచ్చుకొన్న నిలువుచెంబుచూపించి దీనెఁడు వరహాలు తెస్తే చాలునన్నట్లున్నూ, అప్పుడే ఆచెంబుచేతఁబుచ్చుకొని అచ్చయ్యగారు దేశాంతర గమనాభిముఖులై కొన్ని ప్రయాణాల మీఁద హైదరాబాదు చేరుకొన్నట్టున్నూ అక్కడ వక బ్రాహ్మడు యజ్ఞం చేస్తూవుండగా కాకతాళీయంగా వీరా యజ్ఞసమయానికే అక్కడికి వెళ్లి యజ్ఞశాలలోకి వెళ్లినట్టున్నూ, అక్కడ యేదో ప్రాయశ్చిత్తవిషయంలో శ్రౌతులలో శ్రౌతులకు వివాదవచ్చి వాదించుకుంటూ వుంటే, యీ అచ్చయ్యగారు కలగజేసుకొని "యిదమిత్థం" అని ఖండించి చెప్పినట్లున్నూ, దానిమీద వక శ్రౌతి "నిన్నెవరడిగారయ్యా నీవు చెప్పడానికి, అబ్బో! నీవేమో బులుసు అచ్చయ్య వయిపోయినావే" అని సోల్లుంఠంగా మాట్లాడేటప్పటికి అచ్చయ్యగారు "అలాగేఅనుకోండి" అని జవాబు చెప్పినట్టున్నూ, తుట్టతుదకు వారిలోవారు ముఖముఖాలు చూచుకొని, అచ్చయ్యగారే అని స్థిరపడేటప్పటికి, అచ్చయ్య గారిని ఆశ్రౌతులందఱూ విస్తారంగా గౌరవించి, అప్పుడు గోలకొండ నవాబుకు దివాన్‌జీగారున్నూ, దేవబ్రాహ్మణ భక్తుఁడున్నూ, మిక్కిలి ఆస్తికుఁడున్నూ అయిన చందోలాలాగారికి విన్నవించేటప్పటికి వారుకూడా వీరి పేరు అంతకు పూర్వమే వినివుండడంచేత అచ్చయ్యగారిని విశేషంగా గౌరవించి తాము యేకోరికమీఁద యిక్కడికి దయచేశారో సెలవీయవలసిందని ప్రార్థించేటప్పటికి, నాకు యేకోరికా లేదు. "పంచమేఽహనిషష్ఠేవా" అన్నట్లు కాలక్షేపం చేయడమేనాకోరికగాని వేఱేకోరిక లేశమున్నూ లేదని చెపుతూ, చేతులోవున్న చెంబును చూపి యింట్లో ఆడవాళ్లకోరిక యిట్టిది అని చెప్పినమీఁదట దివాన్‌జీగారు యేదేనా జహగీరు యివ్వడానికి ఉద్యుక్తులుకాఁగా, వారు దానిని అంగీకరింపలేనట్టున్నూ, దానిమీఁద విధిలేక ఆ చెంబెఁడు వరహాలు మాత్రమే యిచ్చి పంపినట్లున్నూ, అవి తీసుకువచ్చి భార్యకిచ్చి అది మొదలు నప్రతిగ్రహీతలుగానే వుండి కాలక్షేపం చేసినట్లున్నూ, అందఱున్నూ యిప్పటికిన్నీ చెప్పుకుంటారు. యింకా అచ్చయ్యగారి నప్రతిగ్రహీతృత్వాన్ని గూర్చిన యితిహాసాలు చాలా వున్నాయి మచ్చుకు వకటిమాత్రం వుటంకించాను.

ఇఁక పాండిత్యం యేలాంటిదంటారా? "విస్సన్న చెప్పింది వేదం" అన్న సామెతకి కారణభూతులైన యింద్రగంటి విశ్వపతిశాస్త్రుల్లు గారు అచ్చయ్యగారి శిష్యులే అన్నచో వారి పాండిత్యం యెట్టిదో చెప్పనక్కరలేదు; అయితే అంతగొప్పపండితులుగదా శాస్త్రి, అవధాని, సోమయాజి, లోనైన బిరుదు లేమీలేకుండా వట్టి అచ్చయ్యగారే అనిపించుకున్నారేమని వకశంక రావచ్చును. సోమయాజులు అనిపించుకోవడానికి అచ్చయ్యగారు యజ్ఞం చేయలేదఁట. వేదశాస్త్ర శ్రౌతాలు వచ్చిన మహాపండితుఁడుగదా? ఆయన యజ్ఞం యెందుకు చేశారుకారు? అని మళ్లా శంక రావచ్చును. యెందుకు యజ్ఞంచేయలేదో మనకేం

తెలుస్తుందికాని, లోకంలో ప్రవాదమాత్రం, యీ కలియుగంలో ఆధానం వఱకు మాత్రం చేసి త్రేతాగ్నిసిద్ధిని పొందితే చాలుననిన్నీ, పశుహింసతో చేరిన తక్కిన యజ్ఞయాగాలకు పోఁగూడదనిన్నీ వారి యభిప్రాయమైనట్లు పలువురు పెద్దలు చెప్పఁగా విన్నాను. ఇది సత్యమైతే కావచ్చు. యిఁక తక్కిన శాస్త్రివగయిరా బిరుదాలు ధరించడానికి అన్నీ రావడం వల్ల వకదాన్నే బోధించే బిరుదాన్ని ధరించడం యిష్టంలేక అచ్చయ్యగారు అచ్చయ్యగారుగానే యావజ్జీవమున్నూ కాలక్షేపం చేసినట్లువిన్నాను. వినడంలో అసలు అచ్చయ్యగారే యీ విషయం యిట్టిదని యెప్పుడో స్వయముగా వక్కాణించారనికూడా విన్నాను. యిందులో సత్యమెంతో, కల్పితమెంతో! అది అల్లా వుంచుదాం. అచ్చయ్యగారు సాక్షాత్తూ రెండో చతుర్ముఖుఁడు అన్నంతవఱకు అందఱూ నిర్వివాదంగా వప్పుకుంటారు. వకరిని గూర్చి వ్రాసేటప్పుడు వేరొకరి ప్రసంగం యెత్తితే తేలదు. యిప్పుడు మనకథానాయకులు వెంకప్పసోమయాజులుగారు గాని వారి తండ్రి అచ్చయ్యగారు కారు.

వెంకప్ప సోమయాజులుగారివి కూడా వేదశ్రౌతాలకు సంబంధించిన గాథలు చాలా వున్నాయి. యీ వేంకప్పసోమయాజులుగా రనేవారటకదా:– యీ శ్రౌతప్పల్లకీ వకవైపు దండి మాత్రమే బుజాన్ని పెట్టుకొని నేనుమోస్తువున్నాను. రెండోదండి బుజాన్ని పెట్టుకొనేవాళ్లు కనపడడంలేదనేవారఁట. కాలకర్మదోషాన్ని బట్టి యిప్పుడీ విషయాలు ముచ్చటించుకునేవారు కూడా లేరుగాని శ్రౌతమంటే సామాన్యంగాదు. యిప్పటికీ యీ గోదావరీతీరంలోనూ, కృష్ణాతీరంలోనూ, కావేరీ తీరంలోనూ, యింకా శ్రౌతవిద్య శేషించివుంది. పూర్తిగా నశించలేదు. వెంకప్ప సోమయాజులుగారే కాదు, బులుసు వారందఱున్నూ వేదశ్రౌతాలు వచ్చికూడా ఛాందసులుగా మాట్లాడడం కాక యుక్తియుక్తంగా సభారంజకంగా మాట్లాడే నేర్పు కలవారని పలువురవల్ల వినివున్నాను. ప్రస్తుతానికి అంతగా అవసరం లేక వుదాహరించలేదు. గాని యెనభైయేండ్లవయస్సులో తిరిగీ వివాహం చేసుకొనేనిమిత్తం తూర్పు దేశంలోవున్న జమీందారులను చూడడానికి వేంకప్ప సోమయాజులుగారు ప్రయాణం చేస్తూ వున్నప్పటిగాథలు చాలా హృదయంగమంగా వుంటాయి. పెండ్లిచేసికొన్న పిమ్మట వక రాజుగారు యెకసక్కెంగా, సోమయాజులుగారూ! అవ్వగారు చెప్పినట్టు వింటూవున్నారా? అని ప్రశ్నించినట్టున్నూ దానిమీద మన సోమయాజులుగారు యెకసక్కెమాడిన ప్రభువుగారికి నసాళం అంటేటట్టుగా "రాజా? వక్కపిల్లవినదూ? వక్కపిల్ల" అని యేడుసార్లు కాంఁబోలును రెట్టించి జవాబు చెప్పినట్టున్నూ చెప్పుకుంటారు. యిట్లామాట్లాడడం ఛాందసులలో మిక్కిలి అరుదు.

ఈ వేంకప్పసోమయాజులుగారి తమ్ములే మిక్కిలి సుప్రసిద్ధులైన పాపయ్యశాస్త్రుల్లు గారు. అచ్చయ్యగారి ప్రతిష్ఠ సరేకదా! వేంకప్ప సోమయాజులుగారి ప్రతిష్ఠ విన్నారుకదా!

యీ పాపయ్యశాస్త్రుల్లుగారి ప్రతిష్ఠనుగూర్చి యెంతని వ్రాయను? యీయన కుమారుఁడు ప్రకాశశాస్త్రుల్లుగారు తండ్రిని మించినవారు. యిటీవలకూడా వీరివంశం తామరతంపరగా విద్యా యశోధనాలతో భగవదనుగ్రహంవల్ల తులతూఁగుతూనే వుందిగాని, ప్రస్తుత కాలానికి బొత్తిగా పనికిమాలినవనే హేతువు చేతకాఁబోలును అనూచానంగా వస్తూవున్న వేదశాస్త్ర శ్రౌతాలను వంశీకులు వదలుకొన్నట్లూహించుకోవాలి. ప్రసక్తానుప్రసక్తంగా పాపయ్యశాస్త్రుల్లుగారి ప్రసంగం వచ్చింది. ఈయన వేదశాస్త్రశ్రౌతాల్లో అన్నగారికిఁగాని తండ్రిగారికిఁగాని లేశమున్నూ తీసిపోయేవారుకారు. కాని శ్రౌతంలో అన్నగారిలాగు అనేక యజ్ఞాలకు పాత్రచేతఁబట్టి అధ్వర్యవాన్ని చేయక యేవో కొన్నిటికిమాత్రమేచేసి విరమించినట్లు వింటాను. ఏమయినా, శ్రౌతప్రయోగ విషయంలో ప్రాక్టీసు వేంకప్ప సోమయాజులుగారి కెక్కువ. పాపయ్య శాస్త్రులుగారో! హైకోర్టులాయరీ ప్యాసై కోర్టు కెప్పుడో కొలఁదిసార్లు మాత్రమే వెళ్లి విరమించిన శ్రీ రెంటాల వేంకట సుబ్బారావు పంతులుగారి వంటివారు. వేదార్థం చెప్పేశక్తి వేంకప్ప సోమయాజులుగారికి కూడా వున్నట్లే వింటానుగాని పాపయ్యశాస్త్రుల్లువారి వంటి ప్రజ్ఞ వారికే కాదు యెవరికీ లేదని వింటాను. విద్యారణ్యం పాపయ్యశాస్త్రుల్లుగారికి కంఠపాఠమేనఁట! ధర్మశాస్త్రాలన్నీ వాచోవిధేయంగా వుండేవఁట! యెంతని వ్రాయను వారి ప్రజ్ఞగూర్చి! యిఁక లౌకికజ్ఞానంలో యేప్లీడర్లూ పనికి రారఁట వారిముందు. వారు వేదార్థం చెపుతూవుంటే, అవతల యెంతో అందగత్తె, పాటకత్తె, అయిన వేశ్య అభినయిస్తూ వున్నప్పటికీ ఆసభలోకి వెళ్లక పండిత పామరులందఱూ వచ్చి వీరి సభలోనే కిక్కిరిసి వుండేవారఁట! యివన్నీ పెద్దలు చెప్పుకుంటూవుంటే విన్నమాటలు.

వారి కాలంలో యే బాల్యవయస్సులోనో నేనుకూడా యేకావ్యాలో చదువుకుంటూ వున్నప్పటికీ నా విద్యార్థిత్వమంతా వక్క కడెద్దగ్రామంతప్ప తక్కింది గౌతమికి యీవలివడ్డున జరిగిందే అవడంచేత ఆ మహానుభావుణ్ణి దర్శించడానిక్కాని ఆయన వాక్కును వినడానిక్కాని నోఁచుకున్నది కాకపోయింది. మా తిరుపతిశాస్త్రి అంతో ఇంతో కోనసీమ విద్యార్థిత్వము చేసినవాఁ డవడంచేత పాపయ్యశాస్త్రుల్లవారి దర్శనభాగ్యమేనా అతనిక్కలిగింది. యేమైనా వారికాలంలో నేనుకూడా వున్నానని గర్వించడానికి మాత్రం నాకుకూడా అధికారంవుంది. యీ విన్నమాటలమీఁదనే వకరాజసభలో పిచ్చాయి అభినయాన్ని గూర్చి మాట్లాడవలసివచ్చి యీ క్రింది పద్యం నేను చెప్పఁగలిగాను.

తే.గీ. వేదమున కర్థమును జెప్పఁ బృథివియందు
బులుసుపాపయ్యశాస్త్రి కే పోలుఁగాక
అభినయమొనర్చి పండితసభలనెల్ల
"హాయి" యనిపింప నొక్క పిచ్చాయి తగును.

యిలా పోల్చినందుకు ఆ సభలో పండితులు సమ్మతించక మామీఁదకి లేచారు. ఆ సభలో మాగురువు బ్రహ్మయ్యశాస్త్రుల్లుగారు కూడా వున్నారు. మామీదికి లేచిన పండితులకు సమాధానం చెప్పి మా మాట మేము నిల్పుకున్నాము. యీ విషయం యెఱిఁగినవా రీదేశంలో యిప్పటి కింకా పలువురుంటారు. యింతకన్న యీ విషయాన్ని విస్తరిస్తే "రామాయణంలో పిడుకల వేట్లాట"గా వుంటుందని వదలుతూవున్నాను. ప్రధానం పాపయ్యశాస్త్రులవారి వాఙ్మాధుర్యం సంగీతం వంటిది, అభినయం వంటిది – అంతేకాని "ఆస్సే చూస్సివషే, వషే! చెవుడషే! అష్టాగషే యేమిషే? విస్సావఝ్ఝులవారి – బుఝ్జినష! యా విస్సాయి కిస్సారుషే!" వంటిదికాదు అన్నది యిక్కడ ముఖ్యంగా గమనించవలసిన విషయం. వాఙ్మాధుర్యం యిట్టిదని శాస్త్రమేమేనా రాదా? వ్యాకరణం, పూర్వమీమాంస యింకా యితర శాస్త్రాలు వచ్చునాయె, యిఁక ఆయనకుసాటి – యీ లోకంలోనే కాదు స్వర్గలోకంలోనే అనుకుందాం – యెక్కడ దొరుకుతుందో ఆలోచించుకోండి చదువరులు. యిన్నిటికన్నా సభారంజనకు వాఙ్మాధుర్యం ముఖ్యం. "వినా గోరసం కోరసః పండితానాం" అని వూరకే అనలేదు అభియుక్తులు. గోరసం అంటే వాఙ్మాధుర్యం. ఇంత వాఙ్మాధుర్యం కలవారు కనుకనే పాపయ్యశాస్త్రులవారు మహాకవిన్నీ, సంగీత సాహిత్యపారంగతులున్నూ, మహాపౌరాణికులున్నూ అయిన శ్రీశిష్ట్లు కృష్ణమూర్తిగారితోకూడ వాదోపవాదాలు వచ్చినప్పుడు లోకులకు స్తోత్రపాత్రులు కాగలిగారు. పాపయ్య శాస్త్రుల్లుగారికిన్నీ, శ్రీకృష్ణమూర్తిగారికిన్నీ జరిగిన వాదోపవాదాలు ప్రత్యక్షంగా విన్నవారు నిన్న మొన్నటిదాకా శ్రీ పిఠాపురపు సంస్థానములో నున్నూ యితరత్రానున్నూ పలువురు పండితులుండేవారు. అందులో కొందఱిని నేను ప్రత్యక్షంగా యెఱుగుదును. పాపయ్య శాస్త్రులవారు కుమారుఁడు సూర్యప్రకాశశాస్త్రుల్లుగారివలె తేజశ్శాలి కారఁట! పొడుగుగా చామనచాయగా సన్నముగా వుండేవారఁట. వారు నీర్కావిబట్టలే ధరించేవారఁట. వారి చేతులోవుండే రాగిచెంబు పైభాగం నల్లగానే వుండేదఁటకాని లోపలభాగం బహుపరిశుద్ధి కలిగివుండేదఁట. పండితులకు ముఖ్యంగా కావలసిందేమిటి? అంతశ్శుద్ధేకదా! యీఅంశాన్ని లోకానికి తెల్పడానికే వారల్లాటి పాత్రను ధరించేవారేమోనని నే ననుకుంటాను.

వీరి చిత్ర చరిత్రలు చాలావున్నాయి. వకటి రెండుదాహరిస్తాను. ఏకగ్రామవాస్తవ్యులవడంచేతనో యేమో, మొదటినుండిన్నీ శ్రీ శిష్ట్లు కృష్ణమూర్తిగారికిన్నీ మన పాపయ్యశాస్త్రులు గారికిన్నీ విద్యావిషయంలో భిన్నాభిప్రాయా లుంటూవచ్చేవఁట. పాపయ్యశాస్త్రులుగారికి వచ్చిన వేదం కృష్ణమూర్తిగారికిన్నీ వచ్చునుగాని యేమైనా వీరు కవితాభాగంలో ప్రధానంగా పనిచేయడంవల్ల ఆ విషయంలో పాపయ్యశాస్త్రులగారికి లొక్కుతారనడం సత్యదూరంకాదు. పాపయ్యశాస్త్రులుగారు కవితా విషయంలోఁగాని, సంగీతవిషయంలోఁగాని అసలు

ప్రమేయమే లేనివారు. కాఁబట్టి యీ సందర్భంలో వీరికీ వారికీ తారతమ్య నిర్ణయం చేయనక్కరలేదు. కృష్ణమూర్తిగారు పిఠాపురపు సంస్థానంలో వకప్పుడు విజయదశమీ నిర్ణయములో సంస్థానపురోహితులద్వారా పాపయ్యశాస్త్రులగారి నధః కరిద్దామనే కుతూహలంతో పాపయ్యశాస్త్రులుగారి నిర్ణయానికి వ్యతిరేకంగా పురోహితుడిచేత వాదింపచేయడానికి పూనుకొని తాను కవి కనుక ధర్మశాస్త్రశ్లోకాలు తదనుగుణంగా పాతతాటాకు సంపుటాల్లో యెక్కించి రాజసభలో కనపరచేటప్పటికి శ్రీ రాజావారు పాపయ్యశాస్త్రుల్లుగారికేసి చూచి "దీని కేమంటారు" అని ప్రశ్నించేటప్పటికి శాస్త్రుల్లుగారు "మహా ప్రభూ : శ్రీకృష్ణ సాహాయ్యమండి" అని శ్లేషగా జవాబు చెప్పేరఁట. దానిమీఁద కృష్ణమూర్తిగారు పాపయ్యశాస్త్రుల్లుగారి పేరును శ్లేషిస్తూ "మహాప్రభూ! పాపుఁడికి కృష్ణసాహాయ్యముండ"దని జవాబు చెప్పేరట. అంతతోకూడా వూరుకోక కుమారసంభవంలో శ్లోకాన్నొకదాన్ని యెత్తికొని ప్రస్తుతాని కనుకూలించేటట్టు అర్థం చెప్పి కాళిదాసుకూడా యిదే అభిప్రాయం కలవాఁడని చమత్కరించినట్లు చెప్పఁగా విన్నాను. యీగాథలన్నీ నాకు తు చ తప్పకుండా వచ్చివున్నప్పటికి గ్రంథవిస్తరభీతిచేత స్పృశించి మాత్రం వదులుతున్నాను. యీ పిఠాపురంలో వీరిద్దఱికీ వైషమ్యానిక్కారణం శ్రీ రాజావారు పాపయ్యశాస్త్రుల్లుగారికి పద్దెన్మిదిపుట్ల భూమి యివ్వడమున్నూ యీ సంగతి విని అంతకుముందు సుమారు పద్దెన్మిదేండ్లనాడు శ్రీ కాకర్లపూడి సంస్థానం విచ్ఛిన్నమయ్యే రోజుల్లో-

> శ్లో. "త్రిస్థలీధ్వంసనార్థాయ ప్రవిష్టం నాయనత్రయం
> తత్రైకస్తుకృతార్థోభూ దన్యోద్వౌతు భవిష్యతః"

అని భావికాలాన్ని సూచనచేసి కాళహస్తి సంస్థానానికి సకుటుంబంగా వెళ్లివున్న కృష్ణమూర్తిగారు భూసంపాదనేచ్ఛతో శ్రీ పిఠాపురం రాజావారి దర్శనానికి రాఁగా రాజావారు రు.500-0-0లున్నూ విలువగల సేల్జోడుమాత్రమే యిచ్చి సత్కరించడంవల్ల, నేనేం తక్కువవాఁడనా? పాపయ్యశాస్త్రుల్లు కిచ్చినట్లు నాక్కూడా భూమి యేల యివ్వకూడదు? అనే యీర్ష్యతో రాజుగారికి తన గొప్పదనాన్ని చూపడానికి కృష్ణమూర్తిగారు రాజపురోహితునిచే పాపయ్యశాస్త్రుల్లుగారి నిర్ణయానికి అన్యథాగా చెప్పించారనిన్నీ దానిమీఁద పైన వుదాహరించిన శ్లేషప్రసంగం జరిగిందనిన్నీ స్పష్టమేకదా! యింకా యీ సందర్భంలో కృష్ణమూర్తిగారు శ్లేషగా చెప్పిన - "శ్లో॥రావురామనృపతౌ" అనే శ్లోకాన్ని వుదాహరించి చర్చించవలసియున్ననూ మనకు ప్రధానం పాపయ్యశాస్త్రుల్లుగారిది కూడా కాక వేంకప్పసోమయాజులుగారి విషయ మవడంచేత వుపేక్షిస్తున్నాను. ప్రసక్తాను ప్రసక్తమైనప్పటికీ పాపయ్యశాస్త్రుల్లుగారి చరిత్రకూడా కొంత మనకు ప్రధానమే అన్న అంశం ముందు వ్రాసే సంగతినిబట్టి చదువరులకు గోచరిస్తుంది. యింతకున్నూ

పాపయ్యశాస్త్రులవారి వాఙ్మాధుర్యం మహాకవియు, మహావైణికుఁడును అగు శిష్టు కృష్ణమూర్తి గారితో కూడా పోటాపోటీ చేయఁదగ్గదిగాని సామాన్యమైనది కాదన్నది ముఖ్యాంశం. ఇంకా పాపయ్యశాస్త్రుల్లుగారి వాఙ్మాధుర్యానికి సాధకమైన గాథలెన్నో నేనెఱిఁగిన వున్నాయి. కాని విస్తరభీతిచే వుపేక్షిస్తున్నాను.

వేంకప్ప సోమయాజులుగారు కడుంగడు గొప్పవారే అయినను, వాఙ్మాధుర్యాన్ని బట్టియేమి, తఱుచు సభలలో అదేపనిగా వేదార్థం చెప్తూతా వుండడంవల్లనేమి, దేశంలో పెద్దపేరు పాపయ్యశాస్త్రుల్లువారికి వచ్చింది. యింతేనా కారణం యింకా యేమేనా వుంటుందా అంటే మనకు గోచరించేది యింతమట్టుకే. తక్కినది– "పుణ్యైర్యశోలభ్యతే" అనేది. యేమైతేనేమి లోకంలో పాపయ్యశాస్త్రులవారి కున్నంతపేరు వేంకప్ప సోమయాజులు గారికి లేకపోయిందన్నది సర్వసమ్మతమైనమాట.

పాపయ్యశాస్త్రులుగారు అన్నగారియందు ఎంత భక్తి ప్రపత్తులతో వినయవిధేయతలతో సంచరిస్తూవున్నప్పటికీ, తమ్మునిమీద నిష్కారణంగానే పై సంగతినిబట్టి వేంకప్ప సోమయాజులుగారికి అసూయపుట్టడం తప్పింది కాదు. అసూయ పుట్టినట్లు మనకు యేలాగ తెలియడమంటే, అది పుట్టకుండానే వుండాలిగాని పుట్టిన తర్వాత పైకి రాకుండా మానుతుందా? విన్నమాటలు సుమండీ! దీనిలో యెంత సత్యముందో, యెంత అసత్యముందో! లోకులు కాస్తవుంటే గంపంత కల్పనచేస్తారన్నది సత్యదూరంకాదు. వకప్పుడెవరో వేంకప్పసోమయాజులుగారిని గూర్చి ఎవరికో తెల్పుడుచేసే విషయంలో, 'వీరే వేంకప్ప సోమయాజులుగారు' అనిచెప్పి వూరుకోక 'పాపయ్యశాస్త్రుల్లుగారి అన్నగారు' అనికూడా ఆమాటకు తోఁకగా తగిలించారఁట! దానిమీఁద వేంకప్ప సోమయాజులు గారుతోఁకతొక్కిన తాచులాగులేచి "యేమీ?... పాపిగాఁడి అన్నగారనకపోతే అచ్చయ్యగారి కొడుకనిపించుకోడానికి తగనా?" అని పెద్దగా మండిపడ్డారఁట. యిది యితరుల కల్పనే అయితే పరిశీలించ నక్కఱలేదుకాని నిజమే అయిన పక్షానికికొంత చర్చించవలసి వుంటుంది. అంతగొప్ప పండితుఁడుగదా, ఆయన తన తమ్ముఁడి యందు అంత అసూయగా వుండడం తటస్థిస్తుందా అన్నది యిక్కడ విచారణీయం. అయితే యిది యశోవిషయం కాఁబట్టి, తండ్రిని కొడుకు సహింపఁడు, కొడుకును తండ్రి సహింపడు అన్నదిన్నీ లోకప్రసిద్ధమే. "సర్వత్రజయ మన్విచ్ఛేత్" అన్నదానిలో "పుత్రాదిచ్ఛే త్ప రాజయం" అనివుండడంచేత వక పుత్రుణ్ణిమాత్రమే మినహాయించవలసి వుంటుందికాని తదితరులను మినహాయించవలసి వుండదు. తమ్ముఁడు కూడా కుమారుఁడివంటి వాఁడే అనుకోవడానికి "పితృసమోజ్యేష్ఠః" అనేది సాయపడుతుంది. కాని అంతమాత్రంచేత లాభంలేదు. దానివల్ల తమ్ముఁడియందు వచ్చే పుత్రత్వం ఆరోపిత పుత్రత్వం అవుతుందిగాని సాక్షాత్పుత్రత్వంకాదు.

"పుత్రాదిచ్ఛేత్తు" లోవుండేపుత్రత్వం సాక్షాత్పుత్రత్వమేకాని మఱొకమాదిరిది కాదని అనుకోవడానికి అనేకాధారాలున్నాయి. కాని గ్రంథవిస్తర భీతిచే వుదాహరించ లేదు. సాక్షాత్పుత్రుల విషయంలో కలిగేపరాభవాన్ని ప్రతితండ్రి సంతోషపూర్వకంగా స్వీకరిస్తాఁడనే అంశం సర్వకవిసమ్మతమే. అందుచేతే శ్రీరామునకేమి, అర్జునునకేమి, అట్టి పరాభవాన్ని సంఘటించారు మన పూర్వకవీశ్వర్లు. ప్రస్తుతంమనకు కావలసింది, వేంకప్ప సోమయాజులుగారు యెంతో ప్రాజ్ఞులైనప్పటికి, తమ్ముఁడు పాపయ్యశాస్త్రుల్లుగారి శ్రేయస్సును కోరేవారైనప్పటికీ, ఆయనపేరు ద్వారా తమపేరు పయికి రావడానికి సుతరామున్నూ వప్పుకోలేదన్నది.

దీన్ని గుఱించి విచారిద్దాంకొంత. వకవేళయీ పాపయ్యశాస్త్రుల్లుగారు తమ్ములు మాత్రమేకాక శిష్యులుకూడా అవుతా రనుకుందాం. అప్పుడేనా అంగీకరిస్తారేమో! లోకంలో యిప్పుడు మఱికొందఱి ధోరణ్ణిఁబట్టిచూస్తే శిష్యుఁడిద్వారా తమ పేరుకు వచ్చే ప్రసిద్ధినికూడా అంగీకరించరనే చెప్పవలసివుంది. అయితే మురారి మహాకవి-

> "స్థానే స్వశిష్యనివహైర్వినియుజ్యమానా
> విద్యాగురుం హి గుణవత్తర మాతనోతి"

అన్నాడుకదా:- దాని గతేమిటి?- అంటారేమో! దానిగతికేమి? అసలు వారొప్పుకోక పోయినా లోకంచెప్పుకోవడం మానుతుందా యేమి? ఫలానావారి మూలాన్ని యీయనకు గౌరవం వచ్చిందని? దాన్నెవరాఁపగలరు? లోకాన్ని మూయడానికి మూకుడెక్కడ తేగలం? లోకజ్ఞానంబాగా వున్నవారు విద్వాంసులలోనే తక్కువగా వున్నారుకాని ప్రాకృతజనంలో చాలామంది వున్నారు. వక చతుర్థుణ్ణి కోర్టులోఏదో సందర్భంలో నీపేరు చెప్పవలసిందంటే, నేను ఫలానా పుల్లమ్మ మొగుణ్ణని జవాబు చెప్పినట్టు వింటాము. అతడాలా చెప్పడానిక్కారణం యింటిపెత్తనమంతా చక్కఁగా నిర్వహిస్తూ ధర్మకార్యాలుచేస్తూ పరువు మర్యాదలకు లోటులేకుండావర్తిస్తూవుండడంవల్ల తనపెండ్లాముకు యెక్కువ పేరుందని యెఱిఁగి ఆశ్రేయస్సు తనదిగానే భావించుకోవడం తప్ప వేఱొకటి కనపడదు! యేదో భట్రాజులు పద్యం చదువుతూ వుంటారు.

> కోటసింగరాజు మాటవాసేకాని గంగమాంబచేత ఘనతకెక్కె
> గంగమాంబ పెద్ద గయ్యాళిదైతేను, సింగరాజు యేమి సేయఁగలఁడు?

అని. దీన్నిబట్టి ఆ సింగరాజు కోపగించుకొన్నట్టు మాత్రం వినడంలేదు. తనకు పేరుప్రతిష్ఠలు తేఁదగ్గ మహాపతివ్రత భార్య దొరకడం కూడా పెద్ద అదృష్టాలలోదేకదా! అలాగేడొక్కా సీతమ్మగారి పేరేచెప్పుకుంటారుగాని, భర్తజోగన్నగారిపేరు ముందుగా

చెప్పుకోరు. జోగన్నగారు వ్యవసాయమో వేదాయమో చేసి యింతపదార్థం తెచ్చి సమృద్ధిగా యింట్లోపడేస్తేనేకదా సీతమ్మగారు వచ్చే అతిథిఅభ్యాగతులను ఆదరించి వడ్డించి కీర్తిసంపాదించింది! అయితే అంతదాఁకా లోకాని కవసరంలేదు, శీఘ్రంగా ఉపస్థితమయే విషయాన్నిబట్టి చెప్పుకుంటారు. కాబట్టి పాపయ్య శాస్త్రుల్లుగారి పేరు వేంకప్ప సోమయాజులుగారి పేరుకంటే శీఘ్రంగా ప్రతివాడికిన్నీ మనస్సులో స్ఫురిస్తూవుండడంచేత లోకులు సోమయాజులుగారిని పాపయ్య శాస్త్రుల్లుగారి అన్నగారనుకోవడం తటస్థించింది కాని లేకపోతే శాస్త్రుల్లుగారినే సోమయాజులుగారి తమ్ములని చెప్పుకొనేవారు. మహానదీ ప్రవాహాన్నేనా ఆపడానికి పూనుకోవచ్చునుగాని లోకప్రవాహాన్ని ఆపడానికి పూనుకోవడం వెఱ్ఱిపని. హైదరాబాదు సికిందరాబాదులకు మధ్యవున్న పెద్దతటాకంపేరు 'హుసేనుసాగరం'. యీహుసేను నైజాంరాజ్యాన్ని పాలించిన నవాబులలో వాఁడుకాఁడు సరిగదా మంత్రులలో వాడుకూడా కాదు. సామాన్యమైన నౌకరీ చేసినవాడైతే కావచ్చు. యేనవాబు రోజులలోవాడో కూడా మనకు బాగా తెలియదు. ధన ద్రవ్యాలిచ్చి తవ్వించిన ప్రభువుపేరు రాక యీ హుసేనుకు పేరువచ్చింది యేమనుకోవాలి? ఆపేరుతీసివేయడానికి ప్రయత్నిస్తే యేమేనా లాభం వుందా? "పుణ్యైర్యశో లభ్యతే" అని యిదివరకే వ్రాశానుకదా!

యింకొకటి అందఱూ యెఱిఁగిందే వుదాహరిస్తాను. హరికథాచతురాననుఁ డనదగిన నారాయణదాసుగారిని యెఱగనివారు లేరుగదా. ఆయనతోకూడా తాటితో దబ్బనంగా వెనుక పాడుతూవుండే ఆయన అన్న గారినికూడా లోకం యెఱిగేవుంది. యీ అన్నగారే సర్వవిధాలా ఆదాసు గారిని యుక్తమార్గంలో పెట్టి కథాకాలాక్షేపం చేయించే హంగుదారుఁడని దాసుగారే వప్పుకుంటారు. సంగీతంలో దాసుగా రెంతవిజ్ఞులో అంతవిజ్ఞులు అన్నగారున్నూ అయివుంటారు. కాని లోకం యీమాటకు యెంతవఱకు అంగీకరిస్తూందో చెప్పజాలను. అన్నగారిగాత్రం సన్నవిడిగా మధురంగానే వుంటుంది. దాసుగారి గాత్రం ముదురుగా జంబోరాగా కొంత మోటుగా వుంటుంది. యిద్దఱున్నూ యేకగర్భజనితులే కనుక ఆసృష్టికర్తసృష్టి చేసేతరుణంలో గాత్రస్వరాన్ని నిర్మించేటప్పుడు సరిగా యేర్పాటు చేయాలనుకొని యీయన గాత్రంలో వేయవలసిన సామగ్రినికూడా పొరబాటున ఆయన గాత్రంలో పడవేసేడేమో అని నాకు తోస్తుంది. లేకపోతే తమ్ముడి గాత్రం, 'శంభో' అనేటప్పటకి మూఁడుకోసులుదాకా ఉఱుముఱిమినట్లు ప్రతిధ్వనివ్వడ మేమిటి? అన్నగాత్రం అంతంతలోనే అంతరించడమేమిటి? యిట్టి సందర్భంలో వక సభలో వక కొంటెకుఱ్ఱవాఁడన్నాఁడటకదా : 'యేమండోయి దాసుగారూ! యేదో కొంత డబ్బు పెట్టి టిక్కట్టు కొనుక్కొని రానేవచ్చాం. ఆయనచేత పాడించడం మానిపిస్తే యింకా కొంత డబ్బిచ్చుకుంటాం మీ' కన్నాఁడని చెప్పఁగా విన్నాను. "లోకులలో కాకులలో" వాళ్లని

యెవళ్లాపఁగలరు? యింతమాత్రంచేత అన్నగారు దాసుగారిమీఁద అసూయ పెట్టుకున్నట్టు మాత్రం వినలేదు. ఆయన ప్రాజ్ఞత్వం యేలాటిదో చదువరులు విచారించుకోండి.

అయితే మన కథానాయకులు సోమయాజులుగారు దాసుగారి అన్నగారీమాత్రం ప్రాజ్ఞులున్నూ కారా? మహావిద్వాంసులు కదా, అంటే యేమనవిచేసుకోను. వకరితత్త్వం వకమోస్తరుగావుంటుంది. విద్యా విషయం అల్లావుంచండి. వక మహాపండితుఁడో, లేక కవీశ్వరుఁడో వున్నాడనుకోండి. అతఁడు అత్తవారింటికి వెళ్లేడు. అతణ్ణి ఆ వూళ్లో వుండే అమ్మలక్కలు యేలా వ్యవహరిస్తారు? మన పుల్లమ్మ మొగుడే అంటారు. అంతమాత్రంచేత తనపేరు ప్రతిష్ఠలకు భంగం వచ్చినట్లాలోచించుకొంటే యేలాగ? యుక్తులకేమి, యెన్నేనా చెప్పవచ్చు. ఐనది కాదనటానికిన్నీ వీలుంటుంది. కానిది అవుననడానికిన్నీ వీలుంటుంది. యేమైనా, యెక్కడేనా బావాఅంటే వప్పుకుంటాను గాని వంగతోఁటదగ్గిఱ మాత్రం అంటే వప్పుకొనేది లేదన్నాఁడన్నలోకోక్తి యెఱఁగని వారెవరు? సోమయాజులుగారు తమ్ముని శ్రేయస్సును సర్వవిధాలా కోరేవారే అయినప్పటికీ, ఆయన పేరుద్వారా తమపేరు పైకివచ్చినట్లు మాట్లాడితే అందుకు అంగీకరించారుకారు. ఇందుకు వాల్మీకి రామాయణంలో వున్న- "అగస్త్య భ్రాతరం" అన్న వాక్యం పూర్తిగా తోడ్పడుతూవుంది. అగస్త్యులవారివలెనే ఆయన అన్నగారుకూడా మహా తపశ్శాలియేకదా! అయితే అగస్త్యులవారుచేసిన ఘనకార్యాలు వింధ్యపర్వత స్తంభనం, సముద్రోదకపానం వాతాపిజీర్ణం కథవగయిరాలవల్ల యెక్కువ లోకానికి చిరపరిచితులై వుండడంచేత పెద్ద పేరుకలిగివున్నారు. అన్నగారో! అట్టివారుగా లేరు. దానికి యెవరేంచేస్తారు? దాన్నిఁబట్టి వాల్మీకిమహాకవి ఆ ప్రకారము ప్రయోగించాఁడు. అప్పుడు మొదలు యిప్పటివరకున్నూ అది అప్రయోజకుఁడికి పర్యాయపదమైపోయింది. దాన్నిఁబట్టి సోమయాజులుగారికి కోపం వచ్చింది. దీన్నిబట్టి యిదిన్నీ సమర్థనీయంగానేవుంది. కానివ్వండి యీ వికల్పాలకేమి? బులుసువారి వంశంలో అంతా మహావిద్వాంసులే అన్నది మనకు కావలసింది. అందులో వేంకప్ప సోమయాజులు గారు, అధీతిబోధాచారణ ప్రచారణములుగల మహావిద్వాంసులు. ఆ పుణ్యపురుషుణ్ణి గూర్చి అంతో యింతో ముచ్చటించుకోవడంవల్ల మనం కూడా ధన్యులం. యింకా వీరితండ్రిగారిని గూర్చిన్నీ, తమ్ములు పాపయ్యశాస్త్రులవారిని గూర్చిన్నీ, వారి కొమాళ్లు ప్రకాశశాస్త్రుల్లుగారిని గూర్చిన్నీ యెంతో వ్రాయవలసివుంది. ఆ వ్రాయడం ప్రత్యేకించి ప్రత్యేకించి శీర్షికలు పెట్టి వ్రాయవలసిందేకాని "సఙ్రాజు పెళ్లిలో గుఙ్రాజుకొకపోఁచ" అంటే తేలేదికాదు. కాబట్టి మఱివకప్పుడు వ్రాద్దామని యిప్పుడింతటితో ముగిస్తూ వున్నాను.

★ ★ ★

# ఈతి బాధలు

శ్లో. "అతివృష్టి రనావృష్టి ర్మూషకా శ్శలభా శ్శుకాః
అత్యాసన్నాశ్చరాజాన షడేతా ఈతయ స్స్మృతాః"

అంటూ ఈతిబాధలను పూర్వులు ఆఱింటినిగా పరిగణించివున్నారు. యీ ఆఱింటిలో ప్రతివొక్కదానిలోనున్నూ మఱికొన్నింటికి అంతర్భావం చెప్పవలసివుంటుంది. ఆలా చెపితే దొంగలబాధ, దోమలబాధ, రోగబాధ, వగయిరాలుగూడా కలిసివస్తాయి, అసలు శ్లోకానికర్థం వ్రాసి వ్యాఖ్యానం చేస్తాను-

'అతివృష్టిః' అంటే అబిసీనియాలోలాగ విశేషించి యెప్పుడూవర్షాలు కురియడం. దీనివల్ల ముఖ్యంగా ఆ చెట్టునీడనూ ఆ చెట్టునీడనూ సంసారాన్ని వెళ్లఁబుచ్చుకొనే ఆగర్భభిక్షాటన జనమున్నూ, పశువులున్నూ, పక్షులున్నూ మిక్కిలీ కష్టపడవలసివస్తుంది. వ్యవసాయానికికూడా యిది చాలా అపకారకమే కాబట్టి లోకానికి యిది మిక్కిలీ పీడాకరమని వేఱే చెప్పవలసివుండదు. 'అనావృష్టిః' అంటే? దత్తమండలం వగయిరా ప్రదేశాలలోలాగ అసలే వర్షాలు యెగేయడం. అతివృష్టివల్ల వచ్చే చిక్కులవంటివే దీనివల్లా కొన్ని వస్తాయి. కనక విస్తరించేది లేదు. 'మూషకాః' దీన్ని గుఱించి వ్యాసాంతమందు విస్తరించ తలఁచి యిక్కడ వ్రాయలేదు. 'శుకాః' చిలకలు. చిలకలంటే? వక్క చిలకలే అనుకోనక్కఱలేదు. తల్లక్రిందులు పక్షులు వగయిరా మఱికొన్నింటినికూడా వీట్లతోపాటు చూచుకోవాలి. యివి పూర్తిగా తల్చుకుంటే ఫలజాతిని సర్వాన్నీ వొక్కరోజులోనే నాశనంచేసి మనుష్యజీవితాన్ని సాగనియ్యవు. అన్నట్టు 'శలభాః' అనే పదం యెత్తుకొనేలేదు. "రొట్టెకు రేవేమిటి?" అదిన్నీ ఱెక్కలతో యెగిరేదే కనక చిలకలు వగయిరా పక్షిజాతిలో అంతర్భావం చెప్పినా చెప్పవచ్చు. పక్షిజాతికంటేకూడా యీమిడతజాతి సస్యనాశనానికి పెట్టింది పేరు. "మిడతల దండు" అంటూ పెద్దలు చెప్పుకోవడమేకాని యిప్పటికి సుమారు 25 యేళ్లకుపూర్వం నేను వీట్లనుగుఱించి యెఱఁగనేయెఱఁగను. 25 యేళ్లనాఁడు కోట్లకొలదిగానో అర్బుదాలకొలది గానో మిడతలు బాగా లౌడితెఁడేసి ప్రయాణంలో వున్నవి మనజిల్లాలు కొన్నింటిని ఆక్రమించి ఆకాశంమీఁద వున్నంతసేపు సూర్యరశ్మినిన్నీ, భూమిమీఁద వాలినంతసేపు సర్వసస్యాలనున్నూ మటుమాయంచేసి భగ్గంపాడుచేసి వదలిపెట్టాయి, అవి సంచరించి

నంతట్లో దేశములో వున్న చేలన్నీ "అయ్యవార్లంగారి నట్టిళ్ల" క్రింద మాటిపోయాయి. కాని వీట్లజీవితమంతా కలిపితే సుమారు 24 గంటల కాలం కంటే యెక్కువ వున్నట్టులేదు. యిది యెందుకు పుట్టవలసి వచ్చిందో? అంతట్లోనే యింతటి లోకాపకారానికి హేతుభూతాలై వెంటనే నశించడాని క్కారణమేమో? అని ప్రశ్నవేసుకుంటే మాత్రం జవాబు సుఖసుఖాల తేలదు. యెక్కువ పరిశీలనతో ఆలోచించిచూస్తే మనుష్య జీవితానికి మాత్రం యింతకన్నప్రయోజన మేం కనబడుతుంది? అందులో స్వోదర పోషణకోసం పరాపకారమే నిత్యవ్రతంగా ప్రవర్తించే వాళ్ల జీవితాన్ని గుఱించి వేఱే చెప్పనే అక్కఱలేదు, అందులోనున్నూ పూర్వజన్మకృత సుకృతంవల్ల యేదోరాజకీయాధికారం పట్టి, ఆ అధికారాన్ని లంచగొండితనం కింద వినియోగపఱిచే పుణ్యజనులు యీ మిడతల జీవితంతో తమజీవితాన్ని పోల్చి చూచుకుంటే వెంటనే ఆదుర్వృత్తి వదలకపోయినా కొంత పశ్చాత్తాపమేనా కలిగితీరుతుం దనుకుంటాను. వీట్లని యిందుకోసమే భగవంతుడు లోకానికి పంపివుంటాఁడేమో? మిడతలదండు 25 యేళ్లనాడు చూడడమైంది. రామదండు సుమారు 50 ఏళ్లకు పూర్వం చూచాను. అది యెక్కడ పుట్టిందో తెలియదు. వొకవూరునుంచి యింకోవూరు రావడమున్నూ, వచ్చేటప్పుడు తోవపక్కనువుండే చెట్లూ చేమలూ విఱిచి పాడుచేయడమున్నూ చూస్తే రామదండు అంటే కోఁతులు కనక ఆపేరు సార్థకపఱచడంగా కనపడింది. ఆయాగ్రామాల్లో సంతర్పణలూ సమారాధనలూ అనుభవించడం, ఆవూరివాళ్లద్వారా యింకోవూరు సమీపంలో వున్నది వెడుతూ వుండడం యిదేప్రకారం "గతానుగతికం"గా కొన్ని మాసాలు జరిగింది. దీనిలో వక్క విశేషం మాత్రం వుంది. శ్రీరామనామస్మరణ. యిది అంటే యీ దండు చివరకు యేవూళ్లో అంతరించిందో మాత్రం తెలియలేదు. యెక్కడపుట్టిందో? అంతకుముందే తెలియదు. దండుశబ్దసామ్యం వుండడంచేత దీన్ని యిక్కడ వుటంకించవలసివచ్చిందే కాని అంతో యింతో వీధి పక్కని వుండే చెట్లకొమ్మలకు తప్ప యితర సస్యాలకు మిడతల దండువల్ల కలిగినట్టు యీ దండువల్ల లేశమున్నూ నష్టం కలిగినట్టు లేదు. యింక "అత్యాసన్నాశ్చ రాజానః" అంటే? మిక్కిలీ సమీపంలో, అనఁగా తన యింటికి దగ్గిఱగా వుండే రాజులు లేదా? రాజానుగ్రహపాత్రులైన రాజపురుషులు. వీరు కూడా యీతిబాధలలోకే చేరతారా? అంటే? వినండి. నా చిన్నతనంలో పదేళ్లవయస్సుపిమ్మట సుమారు వక పుష్కరకాలం ఫ్రెంచిటవును యానంలోనే వెళ్లింది. ఆ వూళ్లో కీ॥ శే॥ శ్రీ మన్యం మహాలక్ష్మమ్మ జమీందారురాలు నివాసంగా వుండడంవల్ల యెన్నో వైదికానికి సంబంధించిన పుణ్యకార్యాలు వారి మేడకు యెదురుగా వుండే సత్రంలో తఱుచు జరుగుతూ వుండేవి, వేదంలో ప్రసిద్ధులైనవారు వచ్చి నవరాత్రోత్సవాలల్లో శ్రావ్యంగా స్వస్తివగైరాలు పరస్పర గాత్రాలుకల్పి ఉచ్చైస్స్వరంగా

చెపుతూవుంటే తెలిసినా తెలియకపోయినా విని సంతోషించడానికి బదులు ఆ సమీప గృహంలోనే నివాసంగా వుండే పోలీసుశాఖాధికారి ఆ వేదఘోష తనకు నిద్రాభంగానిక్కారణ మయిం దంటూ "లీగల్"గా నిషేధించడం నేను బాగా యెఱుఁగుదును. అత్యాసన్నులు రాజులుగా వుంటే వుండే చిక్కు కొంచెంమాత్రం సూచించాను. దీన్నిబట్టి యింకా వుండే చిక్కులను చదువరులు వూహించుకోలేకపోరు. పూర్వరాజుల ప్రభుత్వాన్ని కవులు వర్ణించేటప్పుడు 'నీరీతి' పదంతో వర్ణించడం అందఱూయెఱిఁగిందే. యీతిబాధారహితంగా ప్రభుత్వం వుందంటే ప్రజలుమిక్కిలీ సుఖిస్తూవున్నారన్నమాటే. అయితే అతివర్షాదిబాధలు దైవికాలు గదా, వాటిని రాజు తొలఁగించడం యేలా గంటూ స్థూలదృష్టులు శంకిస్తారేమో కాని అందుకు శాంతిక్రియలు చేయించినట్లు గ్రంథ దృష్టాంతాలుకొన్ని కనపడతాయి. యిఁక మిగిలిందల్లా మూషకబాధ. పందికొక్కులుకూడా వీట్లలోనే అంతర్భావంగా చూచుకోవాలి. యిప్పుడేమో వీట్లవల్ల ప్లేగుజాడ్యం వృద్ధిచెంది ప్రజానాశకంగా పరిణమించడంచేత ఆయాప్రదేశాలల్లో వీట్లని మారణంచేయడం జరుగుతూ వుంది. వెనుకటి కాలంలో వీట్లబాధ ఏలా నివారించు కొనేవారో తెలియదు. మనుష్యులలో కలిసి మెలిసి తిరిగే జంతువులలో యింత కొంటె జంతువులేనేలేదని నాకుతోస్తుంది. ఆహారానికిపాట్లు పడడం ప్రతిప్రాణికిన్నీ తప్ప దనుకుందామంటే నిర్హేతుకంగా చక్కనిపుస్తకాలు కొఱికి పాడుచేస్తుందిగదా! యీ పనికిమాలిన జంతువు. అది కొంటెతన మనుకుందామా! లేక యేదో కొఱుకుతూవుంటేనేకాని దానికి కాలక్షేపం కాదనుకుందామా! యిందులో పందికొక్కు జాతివుందా? దానిశక్తి మఱీ అద్భుతం. దాని కోఱలకల్లాలొంగనిది యినుమున్నూ గట్టిజాతి రాయిన్నీ కనపడుతుంది. కఱ్ఱజాతిలో శ్రేష్ఠమయిందిగదా? అని కొంచెం పచ్చగావున్న సంసారులు కిటికీలూ ద్వారబంధాలు తలుపులూ టేఁకువి చేయించుకొంటారు. యీ పందికొక్కులు ఆజాతికఱ్ఱను అప్పడంకన్నా తేలికగాకొఱికి తనకు కావలసినంతద్వారాన్ని కల్పించుకుంటుంది. మాగ్రామంలో వున్నయిళ్లల్లో మాయిల్లుచాలా కట్టుదిట్టమయిందని అంతా అనుకుంటారు. యెలకలు మా యింట్లోవున్నన్ని యెక్కడాలేవు. వాట్లనియింట్లో ప్రవేశించకుండా కట్టుదిట్టంచేయడానికి వుపాయంలేనేలేదు. వాట్లకుసమృద్ధిగా తినడానికి ధాన్యం వుండడంచేత అవి మాయింట్లోచేస్తూవున్న హంగామాకుపరిమితే కనపడడంలేదు. కిందనుంచి కిటికీలోకి యెగరడానికి మధ్యమకాంగా ఆసమీపంలో మడత మంచంమీఁద పడుక్కున్న నన్నే యేర్పఱుచుకున్నాయి. పుస్తకాల బీరువాలల్లో ప్రతిరోజున్నూ వీట్లకుసంబంధించిన పురుళ్లు జరుగుతూనే వుంటాయి. యింటిచూరులనిండా వీట్లకలకలధ్వనే వినపడుతుంది. సరంబీమీఁద వీట్ల చెడుగుడియాటల ధ్వని కొత్తవాళ్లకు కొంత భయంకరంగాకూడా కనపడుతుంది. మాకు జతపాటుగా

వుండడంచేత నిద్రాభంగం వగయిరాలు కలగడంలేదు. కొందఱు బోనులు పెట్టివీట్లని పట్టించి తగ్గించాలని ప్రయత్నంచేసి విఫలమనోరథులు కావడంనేను స్వయంగానే యెఱిఁగివుండడంచేత ఆ ప్రయత్నంయెప్పుడూ చేయలేదు. ప్లేగువ్యాధి గోదావరిజిల్లాకు భగవదనుగ్రహంవల్ల యింతవఱకు సోఁకకపోఁ బట్టిగాని సోఁకే యెడల వీటిబాధ గ్రామపారిశుద్ధ్యంకొఱకేర్పడ్డ సంఘం వారు యేదేనా వుపాయంచేసి తగ్గించే వారేమో? వీట్లఅభివృద్ధికి పరిమితే కనపడడంలేదు. పంచాంగాలల్లో వుండే వృద్ధి క్షయాలు సరిపోవడంలేదు. క్రమంగా మాయింట్లో మాకోసంనిలవచేసుకున్న ధాన్యంలో భాగస్వాములుగా యివియేర్పడ్డాయి. వీట్లబాధ పడలేక యెంతో కట్టుదిట్టంగా వేతే వకగాదె కట్టిస్తే కట్టించినన్నాళ్లేనా పట్టలేదు. దాన్ని కుచేలుని వస్త్రంకన్నా మిన్నగా జల్లెడతూట్లతో చిత్రించి వదిలిపెట్టాయి. యిప్పుడు వీట్లల్లో పెద్దజాతి పందికొక్కులు కిటికీలను పూర్తిగా చిత్రికపట్టు పడుతూవున్నాయి. యిదంతా మనఅహింసా పరత్వానికి ఫలితం అనుకోవలసిందేకాని మఱేమనుకోవలసింది? ఆమధ్య యీబాధ పడలేక వకవూళ్లో వకగృహస్థు మంచిచెడ్డ లెఱిఁగినవాఁడే యింతపాషాణం తెచ్చి కోడలికో కూఁతురికో యిద్దఱికో యిచ్చేటప్పటికి దాన్ని పెరుగుఅన్నంలో కలిపి వకచోట పెట్టేటప్పటికి ఆపందికొక్కులుతిని గోండ్రిస్తూపరమపదించే ప్రయత్నంలో వుండడం ఆయింట్లోనేవుండే వకముసలివృద్ధుచూచి యిదేమిటని ప్రశ్నించేటప్పటికి గతంలో జరిగిన విషయం చెప్పేశారు ఆయజమానురాండ్రు. అదివిని ఆయన 'పిల్లాజెల్లాతో కాపురంచేసేవాళ్లం మనం యీలాటి పని చేయవచ్చునా?' అని మందలిస్తేవాళ్లు - 'దుష్టజంతువును చంపితే పాపంలే'దని జవాబుచెప్పారఁట! 'యివి పాములూ తేళ్లూ వగయిరాల వలె దుష్టజంతువులు కావుగదా!' అంటే? "పాములుమాత్రం అన్నీ దుష్టజంతువులా? కొన్ని అంటేబురదపాములు నీరుకట్టెలు వగయిరాలకు విషంవుండనేవుండదు. ఆకారసామ్యాన్నిబట్టేవాట్లని చూచికూడా భయపడుతూవుంటారు. ఆలాగే యీఎలకలలోకొన్ని విషజంతువులుగా వుండకపోయినా కొన్ని విషజంతువులున్నూ వుండడం సుప్రసిద్ధమే. అవికఱిస్తే వెఱ్ఱికుక్క వెఱ్ఱినక్కలతోపాటు చిక్కుతేవడం అందఱూయెఱిఁగిందే వెఱ్ఱి కుక్కలకూ వెఱ్ఱినక్కలకూ అంటే వీట్లకాట్లకు తరుణంలో అయితే నీలగిరిలో అవ్యాహతంగా కుదిర్చే వైద్యశాల రాజకీయమైనది వకటివున్నట్టు వినబడుతూంది. గాని యెలకకాటుకు అట్టి ఆధారంకూడా వున్నట్టులే" దంటూ ఆ యజమానురాండ్రు జవాబు చెప్పేటప్పటికి ఆ ముసలాయన జవాబు చెప్పలేక- 'హోహో! వీళ్లుధర్మసూక్ష్మాలు యెఱిఁగినవాళ్లుకారు. యెప్పుడో మనకి కూడా వీళ్లీలాటి వుపాయం చేస్తారు.. యేమంటే? అవి వృథాగా చావల్ ఖరాబు చేసినట్టేనేనున్నూ చేస్తూ వున్నట్టు వీళ్లకు తోస్తే గతేమి?' టనిచెప్పి ఆస్థలాన్నుంచి మఱోస్థలానికి మకాంమార్చుకొన్నట్టు

ఆయనేచెప్పగా విన్నాను. అహింసాతత్త్వం తెలుసుకోవడం మిక్కిలి దుర్ఘటంకదా! పూర్తిగా కృతకృత్యులయితే కాలేదుగాని యిందుకోసం ప్రయత్నించేవారు భారతీయులే. అందులో బ్రాహ్మణులు. ఆ బ్రాహ్మణులలో-

"శ్లో. 1. ఆంధ్ర, 2. ద్రవిడ, 3. కర్ణాట, 4. మరాటా, 5. ఘూర్జరా
స్తథా. 1. సారస్వతాః, 2. కాన్యకుబ్జా, 3. గౌడా, 4. ఉత్కల, 5. మైథిలాః"

అనే దశవిధ బ్రాహ్మణులలోనున్నూ మొదటి అయిదు తెగలవారినీ పంచ ద్రావిడులనిన్నీ రెండో ఐదుతెగలవారినీ పంచగౌడు లనిన్నీ అంటారు. యిందు మొదటి ద్రావిడతెగవారు బొత్తిగా మాంససంబంధంగాని మత్స్య సంబంధంగాని ఎఱఁగనివారు. గౌడులందఱున్నూ మత్స్యభుక్కులు. వారికి కులాచారమేమో, మత్స్యభక్షణంవరకే అభ్యనుజ్ఞనిస్తుంది కాని అందులో యెవరో శిష్టులమాటచెప్పలేంగాని తక్కినవారు మాంసాశనానిక్కూడా అలవాటుపడ్డవారే అనివినడం. ఆయాద్రావిడపంచకంలో యేమి, గౌడపంచకంలో యేమి అంతర్భావం చెప్పుకోఁదగ్గబ్రాహ్మణులు చాలామంది వున్నారు. ఉత్కళబ్రాహ్మణులలో బంగాళీలకు అంతర్భావం చెప్పవలసివుంటుంది- మందసాలో వుత్కళబ్రాహ్మణులవాడలో మహాపండితులనఁబడే శ్రీ విద్యా భూషణంగారి గృహబహిర్వేది మీఁద ఆయనతో యేదో ముచ్చటిస్తూ కూర్చున్నప్పుడు ఆ వీధిని మనవైపున శూద్రవాడలో మోస్తరుగానే చేఁపలమ్ముకొనేవాళ్లు రావడం చూచేటప్పటికి నాకేమో విడ్డూరంగా కనపడి మనస్సులో దాఁచుకోలేక నేను- "అయ్యా! మీరు మహా విద్వాంసులుగదా! యిది మీకు హేయంగా తోఁచదా? దీన్ని మీ రెందుకు వర్జించలేదు?" అని ప్రశ్నించాను. దానిమీఁద ఆయన- "నేనెన్నఁడూ దీన్ని ముట్టను కాని యింట్లో ఆఁడవాళ్లు వగయిరా భక్షిస్తారు." అనిచెప్పి మళ్లా అన్నారుకదా "అయ్యా! మీరు దీన్ని వర్జించి యెన్నాళ్లయిం?" దన్నారు. అంటే ఆయన వుద్దేశంలో "మీరు" అనేది నన్ను మాత్రమే వుద్దేశించినమాటకాదు, మీ పంచద్రావిడమున్నూ, అనే తాత్పర్యంలో వుపయోగించినమాట. దానికి నేను తగిన జవాబు చెప్పలేకపోయాను. మనకు దొడ్లల్లో గుమ్మడి, ఆనప, పొట్ల, బీర పాదులు మాదిరిగానే వంగదేశంలో వారివారి పెరళ్లల్లో మత్స్యాలు ఫలించే బావులుంటాయని చెప్పఁగా విన్నాను. నవద్వీపం చదువుకొనడానికి వెళ్లిన మన పంచద్రావిడ విద్యార్థులు బంగాళీ గురువులకు బజారునుంచి మత్స్యాదులు కొని తెచ్చిపెట్టడంమట్టుకు అప్పుడప్పుడు తటస్థిస్తూ వుంటుందని కీ॥ శే॥ శ్రీమాన్ సముద్రాల వెంకటప్పలాచార్యులవారు చెప్పఁగా విన్నాను. అయితే ఆయా మత్స్యమాంసభక్షకులైన వారిలో కూడా భక్షించే జంతువుల విషయంలో తప్ప యితర జంతువిషయంలో చాలాదయాంతఃకరణులు కనపడతారు. శ్రీ నూజివీటి నారయ్యప్పారావుగారు (శ్రీరామచంద్రాప్పారావు గారి ప్రథమ పుత్రులు)

వేఁటలో మిక్కిలీ నేర్పరులు సమర్థులున్నూ, యీయన వకరోజున బోనులోపడ్డ యెలకలను జాగ్రత్తగా వూరివెలుపల వదిలిపెట్టి రావలసిందని నవుకర్లకు ఆజ్ఞాపిస్తూవుంటే నేను- "అయ్యా! మీరు స్వయంగా యెన్నో జీవాలను పశుపక్ష్యాదులను వేఁటలో సంహరిస్తూ వుంటారుగదా! యీ యెలకల విషయంలో యింత దయచూపడం అక్కజంగా వుం"దన్నాను. దానిమీఁద ఆయన 'వేఁటలో వున్నప్పుడు మాకు గుఱికి సరిగా ఆనడం తప్ప యితర విషయం లేశమున్నూ తట్టనే తట్ట'దనిన్నీ 'యితరత్రా మీరెంతో మేమున్నూ అంతే' అనిన్నీ జవాబు చెప్పారు. కాఁబట్టి యీ యెలకల విషయంలో యేమి, పందికొక్కుల విషయంలో యేమి అందఱున్నూ బాధకేనా సహిస్తారు కాని చంపడానికి వప్పుకోరు. ఎవళ్లో బొత్తిగా నిమ్నజాతులవాళ్లు మాత్రం పందికొక్కులను తినడం కూడా వుంది. కొందఱు వీట్లబాధ తొలఁగడాని కంటూ పిల్లులను పెంచడం ఆచారంగా వుంది. కాని అంతమాత్రంచేత ఆ బాధ నివారించదుసరికదా! పైఁగా వీట్లబాధకూడా తటస్థిస్తుంది. అదిన్నీకాక పిల్లులకు పందికొక్కులు లేశమున్నూ జంకవుకూడాను. పిల్లులవల్ల యెలకలున్నూ ముంగులవల్ల పాములున్నూ లేకుండా పోతాయనుకోవడం పిచ్చిమాట. వాట్లకీ వీట్లకీ పరస్పర వైరమన్నమాట నిజమే కాని అవి వీట్లను పూర్తిగా వారించడం వట్టి కల్ల. అశ్వత్థామ యెప్పుడో ఆగ్నేయాస్త్రాన్ని కాఁబోలును ప్రయోగించి దానితో సర్వసైన్యమూ హతమయిం దనుకొని సంతోషించబోయేటప్పటికి మళ్లా కొంత సైన్యం సజీవంగావుండి కృష్ణార్జున సహితంగా యుద్ధానికిసిద్ధపడేటప్పటికి ఛీ! అని విరక్తితో యుద్ధపరాఙ్ముఖుడు కావడమున్నూ పిమ్మట వ్యాసులవారు యేదో బోధించడమున్నూ భారతద్రోణ పర్వంలో అందఱూ చదివేవుంటారు. లోకంలో యెన్నెన్నికలరాలు, యెన్నెన్ని ప్లేగులు, యెన్నెన్ని యుద్ధాలు వస్తూవున్నాయికావు. అంత మాత్రంచేత జనం పూర్తిగా కాదుగదా, యెన్నోవంతు నశిస్తూవుంది? అసలు నశించడమే లేదని చెప్పగలమా? అలాగే ప్రస్తుతవిషయమూ అనుకోవాలి. కాని లోగడ వుదాహరించిన పాషాణప్రయోగం మాత్రం వరసగా కొన్నాళ్లు జరిగితే కొంత శాంతిస్తుందేమో కాని ఆపనికి యే మాత్రం మనస్సంటూవున్నా శుద్ధకటికవాడైనా కూడా అంగీకరించఁడని వేఱే చెప్పవలసివుండదు, బాధకజంతువుల సంహారానికి కూడా కొందఱు స్వయంగా సిద్ధపడరు. యెవళ్లేనా చేసేవాళ్లుంటే వాళ్లకు డబ్బోదస్కమ్మో యివ్వడం మాత్రం వుంది. యీ మధ్య మా వూరిరైతులు లేళ్లవిషయంలో ధనమైతే యివ్వలేదు గాని అలాగే చేశారు. పూర్వమెప్పుడో మా గ్రామ పొలాలలో లేళ్లు విశేషించి వుండేవంటూ మాతండ్రులకాలంలో వుండే పెద్దలవల్ల వినడం. లేళ్లుసంచరించే ప్రదేశం పరమపవిత్రమైనదని వేదవేత్తలు చెపుతారు. మోదుగచెట్లు వుండే ప్రదేశంకూడా అలాటిదే అంటారు. దర్భలు వగయిరా వుండే ప్రదేశం కూడా అలాటిదే. ప్రస్తుతం యెప్పుడో సుమారు నూతేళ్లనాఁటి మాదిరిగా లేళ్లమందలు మాతోఁటల ప్రాంతంలో

పెరిగిcపోయాయి. మావూరి కాపులేమి లంకకాపులేమి వాట్లను స్వయంగా కొట్టడంగాని యితరత్రనుంచి వచ్చేవేcటకాళ్లు కొట్టడానికి అంగీకరించడం గాని లేకపోవడంచేత మందలుమందలుగా పెరిcగి పూర్తిగా చేలు నాశనం చేయడాని కారంభించేటప్పటికి తుదకు విధిలేక వ్యవసాయదారులు స్వయంగా వాట్లను కొట్టడమైతే జరగలేదుగాని కొట్టేవాళ్లను వారించకపోవడం మట్టుకు జరిగింది. యీ అహింసాతత్త్వం చాలా దుర్విజ్ఞేయం అని మొట్టమొదటే వ్రాసివున్నాను. వృత్రాసురవధ విషయంలో యింద్రుcడికి అంతోయింతో సలహాయివ్వడంలో ఋషులున్నూ వున్నారు. అంత ప్రధానంగా కాకున్నా యే కొంcచెమో యితరదిక్పాలకులున్నూ వున్నారు. తుట్టతుదకు యింద్రుcడు బ్రహ్మహత్య చేశాcడు గనక యీ యింద్రపదవికి అర్హుcడు కాcడని ఆక్షేపించి పదభ్రష్టుణ్ణి చేయడంలోకూడా ఆ యీ ఋష్యాదులే కారకులుగా వున్నట్టు కనపడుతుంది. ధర్మప్రతిపాదకంగా వుండే సత్కార్యాల్లోకూడా చిత్రవిచిత్రమైన చిక్కులు మన వేదశాస్త్రాలల్లో కనపడతాయి. యజ్ఞం చేయడమేమో మహా పుణ్యకార్యంగదా! అందులో సోమవిక్రయణం పాపం. ఆ సోమ మంటూ లేకుండా యజ్ఞం సాగదు. ఆ యజ్ఞభేదాలల్లో కొన్నిటిలోనో లేక మహావ్రత మనేదానిలోనో వక బ్రహ్మచారికిన్నీ, వక దాసీకిన్నీ ఆ అగ్నిగుండం సమీపంలోనే కొంతయెత్తు ప్రదేశంలో యేర్పఱచిన మంచెమీcదే అనుకుంటాను సమాగమం జరగాలంటూ చెపుతారు, యింకా కొంత వ్రాయవలసి వుందిగాని “అనుక్తమన్యతో గ్రాహ్యం” కనక సామాన్య ప్రజలు హేయంగా చూస్తారని వదిలిపెడుతూ వున్నాను. అలాటిహోమం యజ్ఞ పురుషప్రీతికరమై యజ్ఞకర్తకు వుత్తమలోకావాప్తి సంపాదకం యేలా అయిందంటే? అది వేద విశ్వాసం వుండేవాళ్ల ప్రశ్నకాదు. వేదములు రాజ సమ్మితాలుకదా! నా చిన్నతనంలో యానాంలోనే పల్లీలతాలూకు వివాహం వకటి దేవాలయంలో జరిగింది. వాళ్లకేమో వివాహంలో హోమాలు చేయడం ఆచారమంటూ వకముసలమ్మ కొంత జరిగాక చెప్పింది. అప్పుడు ఆ పురోహితుcడు లేcత కొబ్బరిమొవ్వు కావాలని చెప్పేటప్పటికి ఆనిశిరాత్రివేళ క్షణంలో వాళ్లు తీసుకువచ్చారు. ఆ మొవ్వుటాకులు స్రుక్కూ స్రువంగా యేర్పఱిచి పురోహితుcడుగారు ఆముదంతో హోమాలతంతు సాగించారు. కొబ్బరి మొవ్వెందుకంటే? – ప్రభుసమ్మితత్త్వ మనేదే జవాబు. ఆ పురోహితుcడు వీళ్లకు నాన్‌బ్రామిన్సుకు హోమాలేమిటి అనే దురుద్దేశంతో చేశా డనుకుంటే తీరిపోతుంది. ప్రస్తుత దాసీ బ్రహ్మచారి సమాగమవిషయం అలాటిది కాదుకదా! దీనిమీcద వేదప్రామాణ్యం వున్నవాళ్లెవళ్లున్నూ ప్రశ్నించడానికి అవకాశం వుండదు. లేనివాళ్లో? వాళ్లచిత్తం వచ్చినట్టు అడగవచ్చు. వాళ్లకు జవాబు చెప్పేదెవరు? వకాయన ‘యజ్ఞంలో మేcక లోcకువ జంతువు కనక బ్రాహ్మలు చంపుతూ వున్నారు. పెద్దపులిని చంపవలసివస్తే యీ బ్రాహ్మల పస తెలిసిపోయే’ దంటూ అన్నట్టు ఒకరు చెప్పగావిన్నాను. అది పిచ్చిమాట. వేదపురుషుడు

పెద్దపులిని చంపి యేదేనా యజ్ఞంలో హోమం చేయవలసిన దని విధించేయెడల దానికి తగు సాధనసామగ్రిమాత్రం శ్రౌతులు సిద్ధం చేసుకోలేకపోతారా? వేదంలో యేలావుందో ఆలాగే జరుపుకోవడంకన్న వేఱేగత్యంతరం లేదని దానికి సంబంధించిన మీమాంస చెపుతూనేవుంది. అందుచేత ఆ హేయమైన దాసీ బ్రహ్మచారిసమాగమాన్ని నిషేధిస్తే ఆక్రతువు నెఱవేఱదని వొప్పి తీరవలసిందే. పాపం! ఆ దంపతులు ఆ క్రీడాగృహాన్నుంచి యీవలికివచ్చి అందు కేర్పడ్డ దక్షిణతాంబూలాది సత్కారాలతో నిర్గమిస్తూ వుండఁగా వారిమీద గోమయోదక సేచనం వగయిరా మర్యాదలు జరుపుతారనికూడా వినడం. అన్నింటికంటే కూడా యీ జంట ధనంకోసం అంగీకరించడం చూస్తే దానికిమించిన దేదిన్నీ లేదని తేలుతుంది. దీనికేంగాని యెంతసరిపెట్టుకుందా మన్నా యీ లజ్జాకరమైన కృత్యాన్ని కూడా పరమపవిత్రమైన యజ్ఞములో చేర్చుకోవడానికి వేదార్థ వేత్తలు యేలాసమ్మతించారో అది దురూహంగానే వుంటుంది. వెధవ యెలకలగోలలో నుంచి పెద్దపెద్ద క్రతువుల విషయంలోకి పాఁకింది మన వుపన్యాసం. యేమీ? యెందుకు పాఁకకూడదంటాను. ఎలకేలాటిజీవమో, మేఁకా ఆలాటిజీవమేకదా! మేఁకదాఁకా యెందుకు? దోమమాటచూడండీ దానిశరీరమెంతో, దానిలో ఉదరభాగ మెంతో, దానిలో వాయువు పుట్టడాని కవకాశ మెంతవుంటుందో, ఆ అవకాశంలోన్నుంచి యేమాత్రంధ్వని పుట్టడానికి వీలుందో ఆలోచించండి! భగవద్విలాసం అనిర్వచనీయం కాకపోతే అస్వల్ప జంతువుగర్భంలోన్నుంచి వకవిధమైన - అతిసూక్ష్మమైన సున్నితమైన నాదం శ్రావ్యమైనదే వినపడుతుందిగదా! దీన్ని గుఱించి యే మనుకోవలసి వుంటుంది? (అణోరణీయాన్) అంత శ్రావ్యంగా గానం చేస్తూ చెవిదగ్గఱ నాట్యంచేసే దోమలెన్నో మనచేత చంపఁబడుతూనే వున్నాయి. కాని మన ఆర్యులమతంలో యజ్ఞంలో చంపఁబడే పశువుల విషయంలోనే గత్యంతరం కనపడదుగాని యీలాటివాట్లకు వైశ్వదేవమంటూ వొకటి నివారకం కనపడుతుంది. యజ్ఞంలో కావాలని బుద్ధిపూర్వకంగా చేసే పశుహింసను మనవారు హింసలోనే చేర్చలేదు. అక్కఱలేదనుకున్నా తప్పని హింస దోమలు వగైరాలది. నిజమైన అహింసాతత్త్వం అంటే జైనులలో కనపడుతుంది. ఆ మతస్థులు ప్రొద్దుగుంకేలోపునే భోంచేయడంకూడా హింసకు జంకియ్యేవే. సర్వబాధకమైన తేలునుగాని పామునుగాని చంపడానికికూడా ఆమతస్థుఁడు లేశమున్నూ అంగీకరించఁడు. అహింసా నిర్వహణంకోసం దంతధావనాది కృత్యాలుకూడా మానిన సన్న్యాసులు ఆమతంలో వుంటున్నారన్నది ప్రసిద్ధమే. వారు మలినవస్త్రాలను పరిహరించడమేకాని నీటితో వుతకడంకూడా వుండదు. ఆలావుతికేటప్పుడు కొన్నిసూక్ష్మ జంతువులకు హానికలుగుతుం దనియ్యేవే. యేవో పూర్వ పక్షాలుచేసి యీ మతాన్ని మన ఆర్యమతాలవారు ఖండిస్తే ఖడించనియ్యండికాని 'అహింసాపరమోధర్మః' అనే వాక్యాన్ని పట్టి నడిచేవారంటే? వారే కాని మనఆర్యులు

కానేకారు. ఇందులో ద్వైతులున్నూ విశిష్టాద్వైతులున్నూ ఆ వాక్యార్థందరికేనా వెళ్లఁగలుగుతారు కాని అద్వైతులు చాలా దూరంగానే వుంటారు. యీజైనులున్నూ బౌద్ధులున్నూ వేదబాహ్యులుగానే మనవారిమతంలో కనపడతారు. జినుఁడన్నా బుద్ధుఁడన్నా పర్యాయపదాలేకాని పై రెండుమతాలలోనూ యేమాత్రమో అవాంతరభేదం లేకపోలేదు. జపాను చైనాలలో ఆనాఁడు వ్యాపించిన మతం బౌద్ధమతమే అని తోస్తుంది. ఆమత వ్యాప్తికల్లా ముఖ్యఫలితం అహింస. అది చీనాలో యెక్కడేనావుంటే ఉండేమోకాని జపానులో బొత్తిగాలేదు. యెందుచేత? పడమటిగాలి పూర్తిగా సోఁకడంచేతే, సందేహంలేదు. అందులో ప్రస్తుతం జపాను చైనాలో బాలవృద్ధాతురులనుకూడా హింసిస్తూవుందని పత్రికలలో వ్రాసే వ్రాఁతలు నిజాలేఅయితే బుద్ధభగవానుఁడికి యీ జపాను శిష్యులవల్ల కలిగేకళంకానికి మితే కనపడదు. అహింసావిషయంలోనే కానివ్వండి. యితర విషయంలోనే కానివ్వండి యేదేనామతమంటూ బోధించవలసివస్తే అది నిరుపద్రవకరంగానే వుంటుంది. తీరా ఆచరణలోకి రావడం తటస్థించాక అది నానావిధాలా మాఱి వెఱ్ఱితల లేయడానికి మొదలెట్టి తుట్టతుదకు మొట్టమొదటి మూలసూత్రాలకు దూరమైపోయి మతకర్తలను దోషదూషితులనుగా కూడా చేయవలసిందవుతుంది.

అంతగా చేదస్తాలకున్నూ పోక బొత్తిగా చేదస్తమంటూ అన్నింటినీ వదలుకోక వకమాదిరిగా కాలక్షేపం చేసుకుపోతే మన ఆర్యమతం పంచ సూనాదోషాలతో కాలక్షేపం జరగనిస్తుంది. యీ దోషాలకు కూడా మనవారు వప్పనేలేదు. యీ దోషాలేవో కొంచెం వివరిస్తాను. "సూనా॥ అంటే హింస. అది ప్రతిగృహస్థుకున్నూ నాంతరీయకతయాఅంటే యెంత చేయకుండా వుందా మనుకున్నప్పటికీ తప్పనివిధిగా అయిదింటిద్వారా సంక్రమించి తీరుతుందనిన్నీ, ఆపాపాన్ని కూడా యేరోజుకారోజు పోఁగొట్టుకోవాలనిన్నీ, ఆదోషనివృత్తికై వైశ్వదేవం అనే కర్మని విధించారు. దీన్ని చేసిన వారినే పాకయాజిబిరుదంతో వైదికులు వ్యవహరిస్తారు. యిది చేయనిదే బ్రాహ్మణీకం వుండనేవుండదు. ఆ అయిదింటిలోను వకటి 'ఛుల్లీ' అంటే పొయ్యి, దీనిద్వారా యెన్నో పురుగులు చస్తాయి. రెండు 'పేషణి' బహుశః తిరగలి. సన్నెకల్లు, రుబ్బురోలు వగయిరాలు అవుతాయి. వీట్లద్వారా కొన్ని సూక్ష్మజంతువులు చస్తూ ఉంటాయి. ఆట్టేగ్రంథం పెంచటం యెందుకు? మనిషి నడిచేటప్పుడు దారిలోనున్నూ, వర్షాకాలంలో పొలాలల్లో నేరేడిచెట్ల సమీపంలో వుండే గట్లమీద ప్రయాణం చేస్తూ వుంటే కోటానుకోట్లు కందచీమలు భూమి యీనినట్టు పరమాణువంత మేరకూడా యెడంలేకుండా వుంటాయి. అక్కడనడుస్తూవుంటే యెన్నో చస్తాయి. అక్కడకీ స్వేదజాలుగా వుండే నల్లులూ పేలూ వగైరాలతో సంబంధంలేకుండా శిష్టులు పిల్లజుట్లు వగైరా లేర్పఱచుకున్నారు. కాని భార్యలకు శిరోజాలుండక

తప్పకపోవడంచేత తద్వారాగా వచ్చే పాతకాన్ని కూడా చెఱిసగం తామే భరింపవలసి వుంటుంది. కనుక మొత్తం వీట్లనన్నిటినీ కల్పి వైశ్వదేవమనే పుణ్యకర్మద్వారా నివర్తింప చేసుకొన్నట్టయిందనుకోవాలి. బాహ్యదృష్ట్యా వైశ్వదేవానికి ఫలితం యిదే అయినప్పటికి అంతర్దృష్టినిపట్టి చూస్తే యేజంతువునకు గాని హానిలేకుండా వర్తించరా, పెళ్లికొడకా? అని ప్రతి మనిషికిన్నీ భగవంతుఁడు విధించినట్టు తేలుతుంది. యిట్టిస్థితిలో ప్రస్తుతం నన్నుపీడిస్తూ వున్న యెలకలకున్నూ పందికొక్కులకున్నూ యేం చేయడానికిన్నీ మన మతరీత్యా వుపాయాంతరం కనపడడంలేదు. యథేష్టఁగా తిని మదించి రాత్రి తెల్లవార్లూ పందికొక్కులుచేసే అల్లరికి పరిమితే కనపడడంలేదు. పందికొక్కును చంపితే పైజన్మానికి వుబ్బసం తగులుకుంటుందంటూ పెద్దలు చెపుతారు. దానికి తథ్యంగా యీ మధ్య మా వూళ్లో వక సంపన్నగృహస్థు కొన్ని పందికొక్కులని విధిలేక చొరవచేసి చంపించి, చంపించిన కొద్ది రోజుల్లోనే లేదు లేదన్నంతవఱకూ జబ్బుపడి భగవదనుగ్రహంవల్ల మనుష్యలోకంలోకి యిప్పుడిప్పుడే వస్తూవస్తూ వుండడం చూస్తే, వాట్ల అధికారం సాగకుండా యేదోవుపాయం చూచుకోవలసిందే కాని వాటిజోలికి వెళ్లడానికి లేశమున్నూ మనకు అధికారం వున్నట్టే బొత్తిగా కనపడదు. వుపాయమల్లా కిటికీలకుగాలి తక్కువ వస్తే వచ్చిందని చెప్పి యేయినపతీఁగెలో బెత్తాయించుకోవడం వగైరా. కొట్లు వడ్లు పోసేవి కుచేలుఁడి బట్టలలాగ తయారైనాయి. వాట్లగతి యీ యేఁటికి యేంచేయాలో ఆలోచన పాలుపోవడంలేదు. యీ బాధ అందరికీ వుండేదే. దీన్ని గూర్చి యింతగా వ్రాయడం లోకజ్ఞాన శూన్యత్వానికి గుఱు తనుకోవడానికి తప్ప మఱొకందుకు కాదని కొందరంటారని నేను యెఱిఁగినిన్నీ తీరికూర్చుని దీన్ని వ్రాశాను. యితరులు వీట్లవల్ల యింతటి బాధపడుతూవున్నవాళ్లు లేరనియ్యేవే, అథవా వుంటే వుంటారుకాక, అంతమాత్రంచేత నాబాధ తీరడం యేలాగ? దీనివల్ల నేను నేర్చుకున్న పాఠమేమిటంటే? ఆర్యమతంకంటే ఉత్తమమైన మతమైతే లేదుగాని ఆ మతంలోవుండి ఆ మతధర్మాలు నెఱవేర్చుకోవాలంటే చాలా దుస్తరం, ఆ చేదస్తంలో వుండేవాణ్ణి. అంతో యింతో జ్ఞానం వుండే మనుష్యుల మాటట్లా వుండఁగా జ్ఞానంలేని తిర్యగ్జంతువులుకూడా లోఁకువచేసి బాధిస్తా యనేదియ్యేవే. నిత్యమున్నూ జంతుహింస చేస్తేనే కాని పొట్ట గడవనివాళ్లెందఱో వున్నారు. వాళ్లందఱూ పిల్లాజెల్లా దోసతోఁటలాగ వృద్ధిగానే వుంటారు. యేం కర్మమో! యెన్నఁడూ చేయనివాళ్లు కనక యెప్పుడేనా ఆఖరికి యేతేలునో యేపామునో చంపడమంటూ తటస్థిస్తే అది వాళ్లకి యెల్లప్పుడూ మనస్సును పట్టి పీడిస్తూనే వుంటుంది. మొత్తం భారతాది గ్రంథాలన్నీ యీ వుద్దేశంతోనే చాలావఱకు ప్రవర్తించాయి. కాని సర్పయాగాది క్రూరకృత్యాలుమాత్రం కోపం తీర్చుకొనే అభిప్రాయంతో ఆరంభించడం మాత్రం సూచిస్తూ వచ్చాయి. దుష్టజంతుమారణంవల్ల లోకానికి యెంతో వుపకారం వుందని యెఱిఁగిన్నీ మహర్షులు ఆ మారణంవల్ల ఆజాతి అసలేలాగా నశించదని

యెఱింఁగి వుండడంచేత కాఁబోలు! వృథాగా యీ హింసారూపమైన పాపాన్ని యీ మహారాజు చేస్తూవుంటే చూస్తూ వూరుకోవడమెందుకని "ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః" చెపుతూ వచ్చారు. చాలా దయాశాలిగావుండే శ్రీనూజివీటి రామచంద్రప్పారావుగారు వక రోజున ప్రసంగవశాత్తూ అహింసాతత్త్వాన్ని గూర్చి మాట్లాడుతూ అన్నారు గదా! మాంసభక్షణం హింసామూలక మవడంచేత పూర్తిగా వర్జించతగ్గదే కాని ఆ పద్ధతిని యీ జంతువులు అందులో చతుష్పాత్తులలో మేఁకలూ గొఱ్ఱెలూ ద్విపాత్తులలో అందులో పక్షులలో ముఖ్యంగా కోళ్లు, యివి యేమికావలసి వుంటుందో? బోధకురాదన్నారు. స్థూలదృష్టిని చూస్తే అలాగే కనపడుతుంది. రోజువక్కంటికి ఆ సేతుహిమాచల పర్యంతంలో తెగుతూవున్న మేఁకలూ గొఱ్ఱెలూ కోట్లసంఖ్యకు మించుతాయనడంలో అతిశయోక్తిలవమున్నూ వుండదు గదా? కోడిగుడ్లను లెక్కపెట్టడం భూరేణువులని లెక్కించడంవంటిదే. యిలా మనుష్యులకోసం యివి హతమౌఱుతూ వున్న మూలచ్ఛేదం కాక సముద్రంలో తరంగాలలాగ మామూలు వృద్ధిలోనే వుండడంచూస్తే వీట్లని గుఱించిన భగవదుద్దేశమేలాటిదో బొత్తిగా మనస్సుకు అందడమేలేదు. యిన్ని జీవరాసులను యీలా చంపుకుతింటూవున్న మాంసభక్షకులను యెవళ్లుగాని నిందించినట్టే కనపడదుగాని వేదవిహితమైనకర్మలు చెడిపోతాయనే భయంతోటి యజ్ఞంలో పరిమితంగా ఆలభనంచేసే మేఁకలను గూర్చి చింతించేవారు పలువురు కనపడతారు. యజ్ఞానికి ఆనల్లమేఁకనో తెల్లమేఁకనో కర్మపరులు తీసుకోవడంమానినంతలో దానికి బలవన్మృతి తప్పుతుందేమో అంటే? "తిరుమలతాతాచార్లగారిముద్ర" లాగఏలాగాతప్పదు. ఈవేళ సోమయాజులుగారి గండం తప్పినా మఱునాఁటి బిస్మిల్లామంత్ర పాఠకుల గండంతప్పుతుందా? అయితే వకటిమాత్రంవుంది. అహింసాపరులమనిన్నీ భూతదయాపరులమనిన్నీ చెపుతూవుండేవారిని యెవరేనా యేమేనా అనడానికి అవకాశంవుంటుందిగాని యితరులని యెవరేమంటారు? అంతేనే కాని వీరియందు వుండే ద్వేషభావంచేత కాదని విస్పష్టమే. పూర్వకాలంలో జంతుహింసలేదని చెప్పఁజాలంగాని యిప్పటిమాదిరిగా తదర్థమై శాలా నిర్మాణాలు వున్నట్టు గ్రంథదృష్టాంతాలు కనపడవు. భారతంలో ధర్మ వ్యాధుఁడు చెప్పినమాటలుకూడా యీ వూహనే బలపఱుస్తాయి. మహమ్మదీయ ప్రభుత్వం వచ్చాకైనా శాలానిర్మాణపద్ధతి వున్నట్టుతోఁచదు. కాని పూర్వంకంటే హింస కొంతతీవ్రరూపం తాల్చిందంటే వొప్పనివారుండరు. ఆ రాజ్యంలోనే గోవధ బాగా విస్తరించివుంటుంది. సందేహములేదు. అంతకు పూర్వం నరమేధంతోపాటుగా బహువిరళంగా గోమేధాలు కూడా వుంటే వుండేవేమోకాని మహమ్మదీయులు గోమేధాలు అజామేధాలతోపాటుగానే సాగించారు. యిటీవల వీట్లకోసమంటూ శాలానిర్మాణాలు కూడా యూరోపియను ప్రభుత్వంలో అయాయి. ఆమధ్య నూజివీటిలో కాఁబోలును పందులను చంపడానికంటూ యూనియన్ బోర్డువారు శాలా నిర్మాణానికి ప్రారంభిస్తారని తెలిసి

మహమ్మదీయులు గోవధకుకూడా అట్టి సదుపాయంకావాలని ఆందోళనానికి మొదలు వేయడం వఱకున్నూ జరిగింది. బోర్డుప్రసిడెంటు ఆజమీందారులలోనే యెవరోవుండి యేలాగో ఆమాటతమకు దక్కవలసివస్తుందేమోనని చాలా భయపడడంవఱకున్నూ మాత్రం నేనెఱుఁగుదును. తరవాత యేంజరిగిందో నాకు తెలియదు. నిన్న మొన్న లాహోరుసిటీలోనే కాఁబోలును యీ పుణ్యకార్యానికి శంకుస్థాపన గవర్నమెంటువారే చేసి గృహనిర్మాణం జరిగిస్తూ వుండఁగా ఆ ప్రాంతపు హిందువులు మొఱ్ఱోమొఱ్ఱో అని లబలబలాడి ఆందోళనచేసి విన్నపాలు పంపుకోఁగా ప్రజాద్వేషానికిది కారణమవుతుంది కాఁబోలు ననియెంచో, లేకవీళ్లమతానికి వ్యతిరేకమయిన కార్యంవీళ్లదేశంలోనే చేయడమెందుకనో అంతటితో ఆఁపినారని యేదో పత్రికలలో చదివినట్టు జ్ఞాపకం. యీ విధంగా జరుగుతూవున్న నిర్మాణాన్ని ఆఁపడంవల్ల వచ్చిన నష్టమే 50 లక్షల రూపాయీలనికూడా ఆపత్రికే వ్రాసింది. నిజంగా అది సంపూర్తికావలసివస్తే లక్షలతోతేలేదికాక కోట్లతోతేలేదని నేననుకున్నాను.

"నీ భాగ్యమ్ము లీపాటికాక సురేంద్రుండు పదత్రయం బడుగనీయల్పమ్ము నీ నేర్చునే?"

అన్నట్టుసూర్యోదయ సూర్యాస్తమయాలే యెరుఁగని మహాసామ్రాజ్యానికి యెంత సొమ్మైతే మాత్రం లక్ష్యమేమిటి? మాంసభక్షణ చేయడం లేదని పూర్వపురాజుల ప్రభుత్వాన్ని గూర్చి చెప్పడానికయితే ఆధారాలు లేవుగాని యీలాటివిషయాల కీలాటి సదుపాయాలని యింతింత ద్రవ్యం వెచ్చించి కల్పించినట్టు దృష్టాంతాలేవిన్నీ లేవు. దిక్కుమాలిన ప్రారబ్ధం బ్రాహ్మణముండాకొడుకులు గట్టిగా నోరారా యేడవడానిక్కూడా వీలులేకుండా యెక్కడో వకటో రెండో వాక్యాలు అతిథిపూజకు లేఁగదూడను కోసిపెట్ట వలసిందని వుండడంవకటిన్నీ, గోమేధంఅంటూ వకటిన్నీ వచ్చి అడ్డు తగులుతూవున్నాయి. దీన్ని బట్టి మురారి మహాకవి-

"మేధ్యావత్సతరీ విహస్య వటుభిస్సోల్లుంఠ మాలభ్యతే."

అంటూ వ్రాశాఁడు కూడాను. నరమేధప్రయుక్తమంత్రాలే కనపడతాయిగాని జరిగినట్టులేదు. హరిశ్చంద్రుడు చేస్తూండఁగా విశ్వామిత్రుడు ఆఁపుచేసినట్టే పురాణగాథ చెపుతూవుంది. వేదమున్నూ దీనికివ్యతిరేకించదు. యింకోచోట తన పుత్రుణ్ణివొకణ్ణి చంపి యాగంచేస్తే నూరుగురు కొడుకులుకలుగుతారని పురోహితుఁడు చెప్పినట్టున్నూ, వొకరాజు ఆలాటి యాగాన్ని చేసినట్టున్నూ భారతంలో కనపడుతుంది. అది నరమేధం అనిపించు కుంటుందో? లేదో నిర్ణయించతగ్గశక్తి నాకు లేదుగాని ఆ వుపాయం జెప్పిన పురోహితుఁడికి సంపూర్ణ ప్రాయశ్చిత్తం పరలోకంలో జరిగినట్టు కూడా ఆ భారతంలోనేవుంది. అయితే

ఆ యాగకర్తకు మాత్రం పుణ్యలోకమే వచ్చినట్టున్ను తుదకు ఆ యాగకర్త తన పురోహితుండి క్కూడా శిఫారసుచేసి ఆ నరకబాధను తప్పించినట్టూన్నూ దానిలోనే కనపడుతుంది. యింతకన్న నరమేధాలకు ఉదాహరణాలు కనిపించవు. పూర్వయుగంలో రంతి దేవుండు కాంబోలును గోమేధాలు యెన్నో చేసినట్టుకనపడుతుంది. కాని అందులో గోవులు స్వయంగా వెళ్లి పుణ్యలోకావాప్తి కొరకు ఆ మహారాజును ప్రార్థిస్తే ఆయన అంగీకరించినట్టు కనబడుతుంది. అంతేనేకాని బలవంత బ్రాహ్మణార్థ ప్రకరణం లేశమున్నూ లేదు. యీ యుగంలో ఆ గోమేధం జరగడానికి వల్లకాదని మహర్షులేలాగో –

"కలౌ పంచ విసర్జయేత్"

అని పుణ్యం కట్టుకోవడమైతే జరిగింది గాని అయితే యేంలాభం? ఆ ధర్మశాస్త్రాలకు కట్టుంబడని మహానుభావులు ఆ రంతిదేవుణ్ణి మించిన యాగాలు చేస్తూవున్నారు. ఆ చర్మాలరాసులవల్ల బయలుదేతిన నీరు ముఱికి నీరుగా వుండడానికి బదులు మహాపవిత్రమైన జలంకలనదిగా ప్రవహించినట్టు మన పురాణాల్లో వ్రాయంబడి వుందిగాని యీ చర్మాలవర్తకులు కోటీశ్వర్లై యెంతో పేరుప్రతిష్ఠలు గణించినట్టు మనకు ప్రత్యక్షదృష్టాంతమే కనపడుతూవుంది. పురాణగాథలతోవ పురాణాలదీ మనతోవ మనదీగా వుండడంచేత ధర్మాధర్మనిర్ణయం చాలా దుర్ఘటంగా కనపడుతూవుంది. "సత్యంబ పల్కంబడున్" అనే ప్రతిజ్ఞతో ముక్కుమూసుకొని జపతపాలతో కాలక్షేపం చేస్తూవుండే "తృణీకృత బ్రహ్మపురందరులు" మహర్షుల కేమంతకర్మం కాలిందని అబద్ధాలు వ్రాసి లోకాన్ని మోసపుచ్చడానికి? నాన్ బ్రామిన్సులో కొన్ని తెగలవారు యిప్పుడు చెప్పేమాటలు చూస్తే "ఋషులేమో బ్రాహ్మణజాతికి సంబంధించిన వాళ్లనిన్నీ, అందుచేత బ్రాహ్మణుల కనుకూలంగానున్నూ తమకు అననుకూలంగానున్నూ గ్రంథాలువ్రాసి తమకు మహాద్రోహం చేశా"రంటూ కనపడతాయి, కాని ఆ ఋషులలో కొందరు జన్మతః బ్రాహ్మణులు కానివారు, క్షేత్రతః బ్రాహ్మణులు కానివారుకూడా వున్నట్లు గ్రంథాలవల్లనే అవగత మవుతుంది – అట్టివాళ్లుకూడా తమకు వ్యతిరేకంగానే లిఖించివుంటారా? అనే ప్రశ్నకు జవాబు కనపడదు. మొట్టమొదట యీ వ్యాసం ప్రారంభించడమేమో? యీతిబాధలనుగూర్చి దానిక్కారణం యింట్లో మిక్కిలిగా విజృంభించివున్న యెలకల యొక్కానున్ను పందికొక్కులయొక్కానున్నూ కోలాహలాతిరేకం. యిప్పుడు ఋషుల పురాణాలు విషయంగా నడుస్తూవుంది. దీన్ని చూచి లోక మేమనుకుంటుంది? వ్యాసకర్త మతిమాలినవాడని అనుకుంటుంది. లేదా? "కొండనిత్రవ్వి యెలకను పట్టడం అంటే యిదేకాంబోలు"ననేనా అనుకుంటుంది. 55 యేళ్లు దాంటినవాళ్ల బుద్ధి స్థిరంగా వుండదనే మాటకు అంతతో నవుకరీనుంచి తొలంగించి యెందటినో యింట కూర్చోం బెట్టి పోషిస్తూవున్న మన గవర్నమెంటు ప్రవృత్తివల్లనే అందఱూ

తెలుసుకొని వుంటారు. కనుక ఆమితికికూడా పుష్కరకాలంలోవున్నవాళ్ల వ్రాతలకు తోవాతెన్నూ వుండకపోవడం అంత విడ్డూరం కాదుగదా? నాలుగు మాటలు వక యితిహాసరూపమయినవి ఆ యీ యీతిబాధలలో మొట్టమొదటిదానికి సంబంధించినవి వ్రాసి దీన్ని ముగిస్తాను. వకబ్రాహ్మణుఁడు శ్రావణభాద్రపదాలు వస్తున్నాయని సప్రయత్నంగా యింట్లో ఆయీ సామగ్రి జాగ్రత్తపెట్టుకుంటూభార్యతో - "శ్రావణభాద్రపదాలు వస్తున్నాయి సుమా" అని మధ్య మధ్య అంటూ వుండేవాఁడు. యీ సందర్భం యితరులుకూడా వింటూవుండేవారు. పప్పు, వుప్పు, కట్టెలు, బియ్యం, నెయ్యి, నూని వకటేమిటి? శాయశక్తులా అన్నీ తెచ్చి భద్రంగా జాగ్రత్త పెట్టుకున్నాఁడు. అంతట్లో యేదోపనిమీద హఠాత్తుగా యేదో వూరికి ప్రయాణం తగిలింది ఆగృహస్థుకు. సరే బయలుదేఱి వెళ్లాఁడు. వెళ్లీవెళ్లడంతోటట్టే యిద్దఱు బ్రాహ్మణులు ఆ యీ సంగతి సందర్భా లెఱిఁగినవారు దర్భాసనాల్లతో వచ్చి వాకట్లో కూర్చున్నారు. ఆయింటి యజమానురాలు చూచి నాయనలారా ఆయన గ్రామంలోలేరు తమ రెవరో దయచేశారు. స్వయం పాకస్థుల్లా వున్నారు. ఆ పంచపాళిలో స్వయంపాకం చేసుకోండి అంటూ వుపచారం చెపుతూ వుండఁగా ఆ మోసగాళ్లు - మాకాలాటి నియమంలేదు. మేమే శ్రావణభాద్రపదాల మన్నారు. అనేటప్పటికి ఆ అమాయకపు యిల్లాలు - వోహో! తమరేనా! నాయనా! శ్రావణభాద్రపదాలు? మా ఆయన మీరాకను గూర్చి చెపుతూనే వుండేవారు. సమయానికి వారు వూళ్లో లేకపోవడం తటస్థించింది రేపో యెల్లుండో వస్తారంటూ చెపుతూ ఆదరం కనపఱచేటప్పటికి మీ ఆయన మాకు వచ్చే త్రోవలో కనపడ్డారనిన్నీ వారు వచ్చేవఱకున్నూ వుండి మఱీ వెళ్లవలసిందనిన్నీ తొందర పనిమీఁద యెక్కడికో వెడుతున్నాననిన్నీ మఱీ మఱీ చెప్పారనిన్నీ చెప్పి అక్కడే తిష్ఠవేసి- అమ్మా మీవంటి శిష్టాచార సంపన్నుల గృహాల్లో మాకు స్వయంపాకంతో అవసరంలేదు. నీవు మహాయిల్లాలవు, నీచేతి ప్రసాదమంటే? సాక్షాత్తూ అన్నపూర్ణాదేవి ప్రసాదమే అని స్తుతిచేసి వుబ్బించి దేవతార్చనలు చేసుకుంటూ సుఖంగా భోజనం చేస్తూ గృహయజమాని వచ్చేవఱకున్నూ ఆయన కూడఁబెట్టిన సామానంతా వ్యయపరచి యజమాని వచ్చిన సడి కనిపెట్టి మెల్లిగా పప్పుజాఱినట్టు జాఱినారు. ఆయన యిల్లు చూసుకుంటే "అయ్యవార్లంగారి నట్టిల్లు" లాగేవుంది. అపట్లాన్ని పదార్థమంతా యేమయిందని భార్య నడిగేటప్పటికి ఆ వెఱ్ఱి యిల్లాలు... మీరు చెప్పినవారు మీరూ గ్రామాంతరం దయచేసిన వుత్తర క్షణంలోనే వచ్చారుసుమండి! యింకా యిక్కడేవున్నారు. యిప్పుడే యెక్కడికో వెళ్లారు. అంటూ యేమేమో చెప్పుతూవుండగా పాపం! ఆగృహస్థు- నిర్ఘాంతపోయి నీయమ్మకడుపు బంగారం గానూఁ నేను చెప్పినవారెవరే? అని అడిగేటప్పటికి "మఱచిపోయారు కాఁబోలును. శ్రావణభాద్రపదాలు ఇద్దరు" అని బదులు చెప్పింది. దానితో ఆయన ఎవరో మోసంచేసి తినిపోయారనుకొని పోనీ "సర్వం బ్రహ్మార్పణం" అని

సరిపెట్టుకొని పెళ్లాము తెలివి హీనతకు విచారపడి "స్త్రీలకు విద్యావాసన లేకపోవడంవల్ల కొన్నియిలాటి ప్రమాదాలు వస్తా" యనుకొని శ్రావణభాద్రపదాలు రెండు మాసాలున్నూ యీ యింటిమీఁద కాకి ఆ యింటిమీఁద వాలడానికి వీలులేకుండా వర్షాలు కురిసేరోజులనిచెప్పి గృహస్థులు సాధనసామగ్రి జాగ్రత్త పెట్టుకుంటారు. అవి మాసాలు. యీమాత్రము నీకు తెలియదని నేను అనుకోలేదని చెప్పేటప్పటికి ఆ యిల్లాలు తన తెలివితక్కువకు తనలోతానే సిగ్గుపడి భర్తను క్షమాపణ నేడుకొన్నట్టు పుక్కిటిపురాణంగా యెవరో చెప్పఁగా చిన్నప్పుడు విన్నాను. యీ యితిహాసాన్నిబట్టే అనుకుంటాను యానాం సమీపంలోవున్న వొకపల్లెటూళ్లో కొంచెం పప్పుభొట్లుమాత్రం వచ్చిన వక బ్రాహ్మణ సోదరద్వయాన్ని శ్రావణభాద్రపదాలని వేళాకోళంగా మాఱుపేరుతో వాడుతూ వుండేవారు. ఆ సోదరద్వయం వేఱువేఱు స్థలాల్లో వొకటేరోజున రెండు బ్రాహ్మణార్థాలు చేసేటట్టున్నూ అదికూడా మోసంలోకే చేరుతుంది కనుక యీపేరు వాళ్లకు వచ్చినట్టున్నూ చెప్పఁగా వినడం. మొత్తం యీతిబాధల్లో అతివృష్టి మొట్టమొదటిదన్నమాట. యీరోజుల్లో సన్న్యాసులుకూడా సంచారం చేయరు. యీతిబాధలు లేనిదేశమే నివాసయోగ్యమైనది. అట్టిది ప్రపంచంలోకల్లా మనభరతఖండమే అని చెప్పుకుంటారు. అలాటి దేశంకూడా యితరదేశ సంపర్కంవల్ల యిప్పుడు యెన్నో యీతిబాధలకు కొత్తకొత్తరకాలకు స్థానభూతం కావలసి వచ్చిందికదా! అని విచారం కలుగుతుంది. దీపం దగ్గిఱనుంచీ యిప్పుడు మనం పరదేశాలమీఁద ఆధారపడి జీవించవలసిన దుస్థితిలో వున్నాము. పంపులున్నాయని నూతులు కప్పేసుకుంటూ వున్నచోట్లెన్నో కనపడతాయి. యేకారణంచేతేనా పంపు మరమ్మతుకు వస్తే అది సవరణ అయేదాఁకా దాహానికి నీళ్లు సున్నా అన్నమాటేకదా! మోటార్లూ, సైకిళ్లూ కాలినడకకు స్వస్తిచెప్పాయి. మరబియ్యం దంపుడు బియ్యానికి కొక్కెట్టాయి. డబ్బాపాలు తల్లిపాలని తోసిరాజన్నాయి. యిలా వ్రాస్తే యెన్నిటినో వ్రాయాలి. పూర్తిగా జీవనం పరాధీనమైపోయింది. రాజకీయ విద్యలకు ధనాపేక్ష విధాయకమే అనుకుందాం. స్వదేశ విద్యలకుకూడా దానితో సంబంధం కలిగింది. ఆ యీ సందర్భాలన్నీ పూర్వంకంటేకూడా యిప్పుడు ప్రపంచాన్ని యీతిబాధామయంగా చేసివేసినట్టు తోస్తుంది. విస్తరించినకొద్దీ యీ విషయం పెరుఁగుతూనే వుంటుంది. ప్రస్తుతస్థితిని బట్టిచూస్తే సంసారజీవితమంతా యీతిబాధలతోనే నిండివుంది. పట్నవాసం కంటె పూర్వం పల్లెటూరు కొంత యీతిబాధారహితంగా వుండేది. ఇప్పుడో అక్కడవుండే సదుపాయాలు పల్లెటూళ్లల్లో కనపడవుగాని అక్కడవుండే యీతిబాధలు మాత్రం కనపడతాయి. కొన్నివూళ్లకి కోఁతులబాధ విశేషించి కనపడుతుంది. యీ కోఁతులు తాటాకు కొంపలవాళ్లకన్నా పెంకుడు కొంపలవాళ్లని యెక్కువగా బాధిస్తాయి. కొన్ని వూళ్లవాళ్లు వీట్లకుజంకి పెంకుటిళ్లు

కట్టుకోవడమే మానుకున్నారు. యివి యెంతబాధ పెట్టినాసరే యేదో బెదరించడమేకాని వీట్లను చంపడానికి మన హిందువులలో యెవరున్నూ వప్పుకోరు. దీనిక్కారణం రామాయణ కాలంలో యీజాతి శ్రీరాములవారికి చేసిన సాయమే అనితోస్తుంది. సుమారు యేడెనిమిదేళ్లనాఁడు మావూళ్లో వక కోఁతి ప్రవేశించి గృహస్థుల నందఱినీ అల్లకల్లోలపెట్టి బొత్తిగా నిలవనిచ్చిందికాదు. కోఁతులు కుక్కలకు భయపడడం సర్వ సామాన్యంగా కనపడుతుంది. ఆ కోఁతి కుక్కలను లక్ష్యపెట్టేదికాదు సరికదా వాట్లని పట్టుకొని చెంపకాయలు కొట్టేది. కోఁతిజాతి పగలేగాని రాత్రి చెట్టుదిగిరాదు. యీ కోఁతి రాత్రికూడా సంచరించేది. యిద్దఱు ముగ్గురుంటే తప్ప మనుష్యులమీఁద తిరగబడేది. యెక్కడో వక పిల్లిపిల్లను సంపాదించి దాన్ని వకకాలుతో పట్టుకొని తక్కిన మూఁడు కాళ్లతోటీ రెండు మూఁడురోజులు ప్రతి యింటిమీఁదను తిరుగుతూ వుండడంచూచి యిది చంటిపిల్లలినెక్కడ యెత్తుకుపోయి యీలాగే తిప్పుతుందో అని గ్రామం గ్రామమంతా హడలిపోయారు. తుదకు ఆ పిల్లిపిల్ల దానిచేతిలోనేచచ్చింది. చెప్పేదేమిటంటే? యింత దుర్మార్గంగా వర్తించినప్పటికీ దాన్ని చంపడానికి యెవ్వరూ అంగీకరించలేదు. పట్టుకొని గోదావరి దాఁటిస్తే వాళ్లకు కొంత సొమ్మివ్వాలని గ్రామస్థులు యేర్పఱచుకున్నారు. యెవళ్లో వచ్చి అందుకు ప్రయత్నంచేస్తూ వచ్చారు కాని వాళ్లకున్నూ అది దొరికిందికాదు. పట్టు కోవడమంటే మాటలా? మా గ్రామానికి అంటుమామిళ్లతోపాటుగా చాలాకాలాన్నుంచి దొంగలవల్లకూడా కొంత పేరు ప్రతిష్ఠలున్నాయి. దొంగలంటే? సామాన్యంగా కన్నాలేసే దొంగలున్నూ తోవలుకొట్టే దొంగలున్నూకారు. రాజులచేత మెప్పుపొంది మడిమాన్యాలు గడించిన దొంగలు. ఆ మాన్యాలు యింకా అనుభవిస్తూవున్న కుటుంబాలు కొన్ని వున్నాయి. గర్భాధానంరోజున రాజుగారి కొమార్తె కట్టుకొన్న చీరెను చమత్కారంగా దొంగిలించి తెచ్చినప్పుడు అట్టి సమ్మానం జరిగినట్టు చెప్పుకుంటారు. ఆ క్రీడాగృహానికి బల్లసరంబీ చేసివుంది. ఆ సరంబీమీఁద సాధన సామగ్రితో యేలాగో ప్రవేశించి చిన్నరంధ్రం చేసి తద్వారాగా తామర తూఁడుగుండా నిద్రాసమయంలో ఆమె కట్టుకున్న చీర తడిసేటట్టు చేయడముతోటట్టుగానే అది చాకిరేవుకు రావడం కలిగిందనిన్నీ అక్కడ నుంచి దొంగిలించడానికి సులువు కలిగిందనిన్నీ చెప్పుకుంటారు. ఆలాటి చమత్కారపు దొంగతనాలు కుటుంబాలవాళ్లు మాతండ్రులరోజుల్లో యెవళ్ల దగ్గఱేనా తృణమో పీసమో అప్పుచేయవలసివస్తే "యేలా తీరుస్తా?"వని అడిగే ఋణదాతకు - కోటిపల్లి తీర్థానికో - అంతర్వేది తీర్థానికో తీరుస్తానని చెప్పడం కూడా యెఱిఁగినవాళ్లు నిన్న మొన్నటిదాఁకా వున్నారు. వీళ్లు బ్రాహ్మలు వేదం చెప్పుకొనేచోట యెందుకో కూర్చున్నట్టు కూర్చుని కొన్నిపప్పుభొట్లు సంగ్రహించి పరదేశాలకు వెళ్లి బ్రాహ్మణవేషంవేసుకొని సంపన్నులయిన బ్రాహ్మణగృహాల్లో దేవతార్చనబ్రాహ్మణులుగా చేరి గుట్టూమట్టూ కనిపెట్టి వీలిచ్చినప్పుడు

వెండిబంగారాలు అంకినంతమట్టుకూ సంగ్రహించుకురావడం జరిగేదని చెప్పుకుంటారు. యీ బాపతు వాళ్లిప్పుడు యేస్వల్పమో తప్ప లేరుగాని యిప్పటికి పన్నెండేళ్లకు పూర్వం వొక దొంగ చాలా దారుణమయినవాఁడు వుండేవాడు. మృచ్ఛకటిక నాటకంలో వున్న శర్విలకుడికన్నా వాఁడి సామర్థ్యం హెచ్చని నేను అనుభవ పూర్వకంగానే వ్రాస్తూన్నాను. – వాణ్ణియెన్నోసార్లు ఖయిదులో పెట్టినా మళ్లావచ్చింది మొదలు ఆ పనే చేసేవాఁడు. కేళీలను పరీక్షించడం పోలీసువారికి తప్పనిసరి గనుక బీటుతిరిగే పోలీసులు వాణ్ణి పరీక్షించడానికి వెళ్లేటప్పుడు వొంటిప్రాణంతో వెళ్లవలసివచ్చేది. ఆ సమయంలో వాఁడు తాగివున్నట్టాయెనా వీళ్లను సుఖసుఖాల వదలిపెట్టక యేదో అమర్యాదచేసే వాఁడు. వాఁడంటే వీళ్లకుభయం. మొండివాఁడు రాజుకన్నా బలవంతుఁడు గదా! తాపీపనిలోచాలా గట్టివాఁడయివుండికూడా వాఁడు అది నౌకరీ అనిపించుకుంటుందని కాఁబోలును మళ్లామళ్లా యీవృత్తిలోనే తిరిగేవాఁడు – "నిక్కమ్ముగ నొక్కనిన్ గొలుచుకొన్నను దొంగతికమ్ముతక్కువే" అన్న మృచ్ఛకటికకు వాఁడే యిటీవల వుదాహరణంగా కనఁపడతాడు. మనిషిని చంపడమంటే వాఁడికి కోడినికాదు దోమనిచంపడంకన్నా యెక్కువకాదు. వాఁడి జీవితంలో కొన్ని హత్యలయితేచేశాఁడు కానివాఁడికి వురిశిక్షపడలేదు. పట్టపగలు మారోడ్డున వంటెద్దుబండి వెడుతూవుంటే అందులో నగలూ నాణేలూ వున్నాయంటే యెందరు చూస్తూవున్నాసరే! దొంగించాఁడన్నమాటే. చూచినా చూచినట్టు సాక్ష్యం చెప్పేటట్టయితే శిక్షలోనుంచి వచ్చాక చంపేస్తాఁడనే భయంచేత సాక్ష్యం చెప్పేవారుకారు. సుమారు వాఁడికి అఱువై యేళ్లు దాఁటేదాఁకా యీలాగే నడిచింది. అసలింటికాపులని యెందఱినో యేమిరా అనే పిలిచేవాఁడు. యేపొలాన్నుంచేనా వచ్చేటప్పుడు నేనుకనక వాఁడికి తారసిస్తేయెంతో వినయంగా నమస్కారాలు చేస్తూ వెంటఁబడేవాఁడు. ఖయిదులో వున్న రోజుల్లో యితర జిల్లాల ఖయిదీలున్నూ తానున్నూ కలిసికొని మాట్లాడుకొనేటప్పుడు తనవూరు కడియమని తెలియడంతోటట్టేవాళ్లు నన్నుఁగూర్చి అడిగేవారంటూ కూడాచెప్పేవాఁడు. ఖయిదులో వున్నరోజులలో తానుచేసే చిత్రవిచిత్ర చర్యలు వర్ణిస్తూ యింటిదాఁకా వచ్చేవాఁడు. తాగికూడా వుండడంచేత సుఖసుఖాల వదిలిపెట్టేవాఁడుకాఁడు. వదలించుకోవడానికి ప్రయత్నిస్తే కనిపెట్టి అనేవాఁడుకదా? "అయ్యా! నేను దొంగననే హేతువుచేత మీరు భయపడుతూన్నట్టున్నారు నేను దొంగనే అనుకోండి నిజమేకాని సామాన్యులయిళ్లల్లో నేనెన్నఁడూ దొంగతనం చేయను సుమండీ!" అనేవాఁడు. తుదకు ఇప్పటికి 13 ఏళ్లన్నాఁడు కోరుకొండ తీర్థంతోవలో వొక దొంగతనంచేసి వచ్చి దాన్నిగుటించి వూళ్లోవాళ్లు సాక్ష్యం తనకు అనుకూలంగా యివ్వమనేటప్పటికి వాళ్లనందఱినీ నఱకడానికి సంకల్పించుకొని మేదరాణ్ణి బెదిరించి కత్తి సంపాదించి వొకణ్ణి నడిరోడ్డుమీఁద పడవరేవుదగ్గిఱ మొగంకడుక్కుంటూ వున్నప్పుడు నఱికి యింకోఆఁడమనిషి యెప్పుడో అఱువడిగితే బియ్యం

యిచ్చింది కాదని దాన్ని జెబ్బమీఁద నతికి వూరంతా 5-6 గంటలు అట్టుడికినట్టు వుడికించి యేకచ్ఛత్రాధిపత్యంగా ప్రభుత్వం సాగించి పోలీసువారు వస్తూన్నారని తెలిసి వొక చెట్టెక్కి సాయుధుఁడుగా కూర్చున్నాఁడు. ఆ చెట్టుయెక్కడంలో యేకోఁతిన్నీ వాఁడికిపోలదని నేను అనుకున్నాను. వాణ్ణి పట్టుకోవడానికిశక్యమయిందికాదు. తుదకేలాగయితేయేమి కిందపడేటట్టు చేశారు. చేతులోవున్న బ్రాందిబుడ్లు పగిలి గాజుముక్కలు గుచ్చుకొని చచ్చాఁడన్నారు. చెప్పేదేమిటంటే? వానరజాతిగూడా యించుమించు నరజాతికి దీటయిందే: కాదుకాదు లాఘవంలో చాలాఅతిశయిస్తుంది. దాన్ని పట్టుకో వలసివస్తే సుఖసుఖాల జరుగుతుందా; దానిచేత గాయాలుపడి చాలామంది ఆసుపత్రిలో కట్టుకట్టించుకోవలసి వచ్చింది. తరవాతయెవళ్లో పట్టుకుంటామన్నారు. యిఱవైయైదు రూపాయీలిమ్మన్నారు. దస్తుచేసి యిచ్చుకున్నాము. సకలచిక్కులుపడి యేలాగయితే యేమి ప్రాణావశేషంగా వున్నప్పుడే పట్టుకున్నారు. కొవ్వూరు ప్రాంతంలో వదిలిపెట్టినట్టున్నూ తరువాత అది అక్కడ మరణించినట్టున్నూ విన్నాము. చెప్పేదేమిటంటే? యెంత చిక్కువచ్చినా కోఁతినిగాని పందికొక్కునుగాని చంపడానికిఁగాని చంపించడానికిఁ గాని మన హిందువులు సమ్మతించరు. మాంసభక్షకులు స్వహస్త పరహస్తాలచేత యేవో కొన్ని జంతువుల చావుకు సమ్మతించేవారే అయినా పయి జంతువుల విషయంలో బ్రాహ్మణులతోపాటువారే. యీ విషయంలో పాశ్చాత్యులే అయితే లేశమున్నూ వెనుదీయరు. వారికిదానివల్ల ప్రత్యవాయం కలిగినట్టున్నూ వినం. మనకయితే వెంటనే కలిగి తీరుతుంది. దానితోపదిమందిన్నీ- "అదుగో ఆ పనిచేశాఁడు. వెంటనే దృష్టాంతం కనపడిం"దంటారు. "యదనంతర" న్యాయాన్ని బట్టి అదీనిన్నీ సరిగానే తోస్తుంది. పూర్వం యేదేనా ఘోరకృత్యం చేయవలసివస్తే యేకచ్ఛత్రాధిపత్యంగా యేలే చక్రవర్తికూడా జంకేవాఁడు. యిప్పుడో పేరుకు గుళ్లో ప్రముఖులెవరో కొందఱుగా వుండడం చేత ప్రత్యవాయజనకమైన పనులు చేసినా వాట్లవల్ల వచ్చే ప్రత్యవాయాలు సంఘముమీఁద "తిలాపాపం తలో పిడికెఁడు"గా సర్దుకుపోతూ వున్నాయి. కాని బాధిస్తూ వున్నట్టు లేదు. యేదో ప్రసక్తాను ప్రసక్తంగా యింత వ్రాశాను. గృహస్థుకు యీతిబాధారాహిత్యం చాలా అవసరం. అట్టి యీతిబాధలను కొన్నిటిని కనపఱిచి వ్యాఖ్యానించివున్నాను. మఱికొన్ని యింకా లేకపోలేదు. అవీ వ్రాస్తాను. భగవంతుఁడు సర్వదయాపరుఁడు. అట్టియీతిబాధలను తొలగించి తనప్రజలకు సర్వవిధాలా సుఖప్రదాత అగుఁగాక అని ఆశీర్వదిస్తూ దీన్ని ముగిస్తున్నాను.

★ ★ ★

# కొత్తరకం ఈతి బాధలు

యిదివరలో మన పూర్వులు ఆకాలాన్ననుసరించి చెప్పిన యీతి బాధలని గూర్చి వక విపులమైన వ్యాసాన్ని వ్రాసివున్నాను. యిప్పటి దేశకాల పాత్రాలనుబట్టి చూస్తే యెన్నో యీతిబాధలు కొత్తరకాలు కనపడతాయి. యివన్నీ చాలాభాగం యీ యిరవయ్యో శతాబ్దంలోనే యెక్కువ వ్యాప్తిలోకి వచ్చి గృహస్థులను పట్టి పీల్చి పిప్పిచేస్తూ వున్నాయి. యీ బాధలు పట్నవాసాలలో వుండేవాళ్లకి చెప్పనే అక్కరలేదు. పల్లెటూళ్ల వాళ్లని కూడా కొంతవఱకు బాధిస్తూవున్నాయి. వీట్లని యిన్నీ అన్నీ అని చెప్పడానిక్కూడా శక్యంగావున్నట్టు తోఁచదు. యివి యెప్పటికప్పుడు వృద్ధివిస్తూ సంతానవంతులకి మఱీ బాధకరంగా వున్నాయి. వాఁడు బ్రతికి బట్టకట్టే యీడు వచ్చేలోఁగానే వాఁడికి రోజు వక్కంటికి వొకటో రెండో పెట్టెలు సిగరెట్లు లేక బీడీలు వుండితీరాలి. అందులో అనేకరకాలు. వొక్కొక్కటి రు.0-3-0 అణాలుకూడా ఖరీదు వుండే సిగరెట్లు (పెట్టి కాదుసుఁడీ) వుంటాయనిన్నీ అట్టివి తప్ప తనకు పనికిరావనిన్నీ వక వైదికబ్రాహ్మణ కులస్థుఁడు, పూర్వపురకం ప్లీడరీలో బాగా సంపాదించిన ప్రయోజకుని పౌత్రుఁడు, విదేశాలకు వెళ్లి అక్కడి విద్య మాత్రం వినాగా తక్కిన అలవాట్లలో చాలాభాగం అబ్బినభాగ్యశాలి చెప్పఁగా విన్నాను. అసలు మనదేశంలో వుండే ప్రజలలో వొక్కొక్కనికి యావరేజిని రోజుకి 6పైసలో, 7 పైసలో! ఆర్జన కనపడుతుందని యెవరోప్రాజ్ఞులు వ్రాయఁగా యేదో పత్రికలో యెప్పుడో చదివినట్టు జ్ఞాపకంవచ్చి అనుకున్నానుగదా!- యీయన పితామహుఁడు బాగాగడించి ఇచ్చి పోయినాఁడు కనక ఈ అగర్భ శ్రీమంతుడు, ఈ అదృష్టశాలి ఇంత వెలగల సిగరెట్లురోజూ కాల్చుకుంటూ ఆయన ఆర్జనకు సార్థక్యాన్ని కలిగిస్తూవున్నాఁడు, ఇతరులగతియేలాగ? అనివిచారపడ్డాను. ఈలాటివాళ్ల కోసం నానాపాపాలకూ లోఁబడి ఆర్జించడం ఎంతేనా అనుచితంకాకపోదు. అయితే బీదలు యీలాటి అభ్యాసాలే మానుకుంటారేమో? అని సమాధానం చెప్పుకోఁబోయాను, గానికుఱ్ఱకారులో సిగరెట్లు నోట్లోలేని వ్యక్తేనాకు కనుపించిందికాదు. సుమారు యిప్పటికి యెనిమిదేళ్లనాఁడు గుడివాడ నుంచి స్వగ్రామానికి జరూరుపనిమీఁద రావలసివచ్చి శివరాత్రి రేపనేనాఁడు చిక్కుగా వుంటుందని యెఱిఁగికూడా రైలెక్కాను. కోటప్పకొండ అడావిడి రోజవడంచేత ఆవేళ రైలులో వున్న తొడితొక్కిడి వ్రాయడానికి వశంకాదు. ఆ రైలులో వక బ్రాహ్మణ కుఱ్ఱవాఁడు అంతకు మునుపు

తెచ్చుకొన్న సిగరెట్లు అయిపోవడమున్నూ స్టేషనులో యెక్కడేనా కొనుక్కుందామంటే, వున్నచోటునుంచి కదలడానికి వీలులేకపోవడమున్నూ తటస్థించి పడ్డబాధ నేను చూడలేకపోయాను. యెందఱినో "అగ్నేయంతి" చేశాఁడుగాని యెవళ్లూ భిక్షపెట్టలేదు. ఆ కుఱ్ఱాఁడి వయస్సు సుమారు పదేళ్లు. అప్పుడు నా వద్ద మారెండో చిరంజీవి అదే యీడువాఁడున్నాఁడు. వాఁడుకూడా చాటునామాటునా అప్పటికే అలవాటు పడ్డాడేమో? అని నాకు అనుమానం వుండడంచేత- "చూచావా, నాయనా! ఆ పిల్లాఁడు పడేబాధ చూచావా?" అంటూ యేవో నీతివాక్యాలు కొన్ని బోధించాను. ఆకారణంచేతో యేమో వాఁడుమాత్రం యీ అలవాటుకు లోఁబడలేదు. బీడీలు యింతింత వెలగల వున్నాయో లేవో కాని మన దేశంలో వాట్ల ప్రచారమున్నూ ఆబాలవృద్ధంగా వ్యాపించేవుంది. మా చిన్నతనంలో చుట్టలేకాని యివిలేవు. డబ్బు 1కి యిరవైచుట్టలదాకా యిచ్చేవారు. సిగరెట్లూ, బీడీలు వచ్చాక చుట్టలేమేనా చవకైనాయేమో? అనుకుంటే అదిన్నీ కనపడదు. అవి డబ్బు 1కి రెండుమూఁడుగా వున్నాయి. మొత్తం యీ మూఁడుగాని యిందులో రెండుగాని అధమం వకటిగాని అభ్యాసం లేని బాలవ్యక్తి నూటికి యే వొకటో తప్ప కనపడనే కనపడదు. కాస్త నాగరికత కలవాళ్లు మాత్రం చుట్టజోలికి రారు. యేబ్రాసులుగా వుండే పైల కాపుకుఱ్ఱాళ్లు చుట్టలూ కాలుస్తారుగాని వీట్లల్లో యేదో మహావిశేషం వుందని యీ నాగరికపు చుట్టలు (సిగరెట్లు, బీడీలూ) కూడా పండుగ పబ్బాలు తటస్థించినప్పుడు మాధానంగా కాల్చుకుంటూ వుంటారు. యిది యిప్పటికాలానికి సామాన్యసంసారులకు వక యీతిబాధగానే కనపడుతుంది. కొంచెం వైదికవేషంగా వుండేవాళ్లకో? చెప్పనే అక్కరలేదు. యిది చుట్టకంటేకూడా అనారోగ్యమనిన్నీ యింగ్లీషుడాక్టర్లు చెప్పడమే కాకుండా పత్రికలలో కూడా వ్రాస్తూవుంటారు. కాని ఆ మాటలు యెవరూ పాటిచేసినట్టు కనపడదు. యితరుల మాటదాఁకా యెందుకు? ఆ డాక్టర్లే సిగరెట్లను శరపరంపరగా కాలుస్తూవుంటే, యేమనుకోవాలి? పాశ్చాత్య నాగరికతకు యిది వక శిరోభూషణంగా వున్నట్టు ఆ నాగరికతకు అలవాటుపడినవారి ప్రవృత్తివల్ల గోచరిస్తుంది. యెందరో యిది నోట్లో వుంటేనేకాని మాట్లాడనేలేరు. మనదేశస్థులలో చుట్టకంటె నస్యానికి సభాపూజ్యత వున్నట్టే ఆదేశంలో సిగరెట్లకున్నూ సభాపూజ్యత వున్నట్టు కనబడుతుంది. యెంతవఱకు సత్యమో? కాని కొన్ని బ్రాహ్మణాగ్రహారాలల్లో నవనాగరికత ముదిరిన బాలికలుకూడా పేకాడుకుంటూ సిగరెట్లు కాల్చుకుంటూ ఆనందంగా కాలక్షేపం చేస్తూవున్నట్టు వినడం. అయితే నవనాగరికులు స్త్రీస్వాతంత్ర్య ప్రథమ సోపానంగా భావిస్తారనుకొంటాను దీన్ని. చుట్ట కాల్చడంకూడా పూర్వం స్త్రీలలో అంతో యింతో లేకపోలేదుగాని ఆ స్త్రీలు వేశ్యలూ యింకా తక్కువ తరగతివాళ్లుగాని బ్రాహ్మణాగ్రహారాల కర్మం యీలా కాలినట్టు తెలియదు.

కొంచెం వెలమ జమీందారులలో కూడా యీ కాల్పు వుందని వినికి. విజయనగరం సంస్థానంలో యేడువందల బ్రాహ్మణా గ్రహారాలున్నట్టున్నూ శ్రీ ఆనందగజపతి మహారాజులుంగారి తండ్రో, లేక తాతగారో, ముత్తాతో వక పరియాయం ఆ అగ్రహారాలు చూడడానికి వెళ్లేటప్పటికి వేదశాస్త్రప్రచారం కలికంలోకి కూడా కనపడక యెక్కడచూచినా చుట్టకాల్పులున్నూ వీట్లకు సంబంధించిన పరికరాలున్నూ కనపడేటప్పటికి ఆయన చాలా నొచ్చుకొని- "అన్నా! తుట్టతుదకు అలాటి వంశస్థులంతా యీ స్థితికి వచ్చారుగదా! అని చింతపడి దీనికి వుపాయం యేమిటని ఆలోచించి వెంటనే- "అగ్రహారాలన్నీ జప్తుచేశా"మని ప్రకటించేటప్పటికి యే కొంతమందో రాజుగారి దర్శనం చేసుకొని మనవి చేసుకోవడానికి అర్హతకల తలకాయలు అక్కడక్కడ విత్తనాలలాగ ఇంకా వున్నారు కనుక వారువచ్చి నెత్తీ నోరూ మొత్తుకుంటే మహారాజులుంగారు- "మీకు యీ అగ్రహారాలు యెందుకైతే పుట్టివున్నాయో ఆ స్థితిలో వుండేపర్యంతమున్నూ వక్క పైసాకూడా మీకు ముట్టదు. యీలోఁగా మేం వసూలుచేసి మంచిస్థితికి వచ్చినవెంటనే యావత్తున్నూ మీకు యిచ్చి వేస్తాము" అని శాసించేటప్పటికి "జహద్దేవరా" అని మళ్లా అగ్రహారాలవారందఱూ తల తడిమిచూచుకొని వేదశాస్త్రాలలో కృషిచేసినారనిన్నీ మహారాజులుంగారి మెప్పునుపొంది మళ్లా అగ్రహారాలు నిలబెట్టుకున్నారనిన్నీ వినడం. యిప్పుడు అలా శాసించి మనలని బాగుచేయడాని కెవరున్నారు? అన్నింటికీ కాంగ్రెస్సువారే కనపడతారు. వారు యెన్నిటికని కలగఁజేసు కుంటారు పాపం! వొకజిల్లాలో మద్యపాన నిషేధానికి వుపక్రమిస్తే 24 లక్షలు బడ్జెట్టులో లోటు కనిపిస్తూవుందిగదా? యీ సిగరెట్ల దిగుమతీని నిషేధిస్తే యెంతలోటు కనిపిస్తుందో? యివన్నీ పూడ్చాలంటే శక్యమో? కాదో? అదిన్నీకాక ఆ యీ వస్తువులు లేకుండా చేసి మాన్పించడమనేది కొత్తపంథ. మన పూర్వుల పంథ యిది కానే కాదు. నీతిచేత మనుష్యులు దుర్వ్యసనాలనుంచి తప్పించుకోవలసిందనే కాని, స్త్రీలను లేకుండాచేసి పురుష వ్యభిచారాన్నీ, పురుషులను లేకుండా చేసి స్త్రీ వ్యభిచారాన్నీ, మద్యం లేకుండా చేసి తాగుణ్ణీ తగ్గించడం కానేకాదు. సమస్తమూ వుండనే వుంటాయి. వున్నా యెవఁడు యోగ్యుఁడుగా వుంటాఁడో వాఁడే గణనీయుఁడని వాళ్ల తాత్పర్యం. అట్టి యోగ్యత కలగడం యేమహావ్యక్తులకోతప్ప దృశ్యాదృశ్యం. కనక పదార్థం దొరక్కుండా చేస్తే- "పురుషాణా మభావేన సర్వానార్యః పతివ్రతాః" అనే మాదిరి నేఁటి ప్రాజ్ఞులు సదుద్దేశంతోనే వక కొత్తమార్గం తొక్కుతూ వున్నారు. దీన్ని కాదనడానికి అంతకన్నా మంచిమార్గం చూపించే వారయితే తప్ప చేతఁగాని ఆక్షేపకులకు యుక్తంకాదు. కాఁబట్టి యీ యీతిబాధను తప్పించడానికి యీ సిగరెట్ల దిగుమతీ లేకుండా ఏదేనా సదుపాయం యిప్పటి గవర్నమెంటు చేస్తే చాలా విధాల బాలకులు బాగుపడతారని నాకు తోస్తుంది. కల్లు దుకాణాల స్థానంలో

"టీ-కాఫీ" వగైరా పానపదార్థాలు విక్రయించే దుకాణాలు వెలిశాయంటూ కొన్ని పత్రికలు సంతోషాన్ని వెలిపుచ్చాయి. కాని ఆ సంతోషం కొంత ఆపాతరమణీయంగా లేకపోలేదుగాని బాగా విచారిస్తే మన పూర్వజీవితానికిన్నీ మన ఆంధ్రదేశానికిన్నీ యివీ అనర్థాపాదకాలే అవడంచేత- "ముల్లు వుచ్చి కొఱ్ఱుడఁచిన" చందమే అనుటకు సందేహంలేదు. కాని ప్రపంచదృష్టిలో మాత్రం యిది "గుడ్డిలో మెల్లగా" కనబడుతుంది. అయితే యీ వుద్యమాన్ని నడిపేవారు దాక్షిణాత్యులు కావడంచేతనేమి, వారికి "కాఫీ-టీ" పానం అనుశ్రుతంగా వున్నదే అవడంచేతనేమి దీనికి వారు సంతోషించారంటే వింత కనపబడదు. మనదేశంలోకూడా యజ్ఞంలో శ్రౌతులదగ్గిఱ నుంచిన్నీ సర్వదా సదాచారాలలో అసిధారావ్రతంగా సంచరించే వితంతువుల దగ్గిఱనుంచిన్నీ పితృకార్యాలలో నిమంత్రితులైన భోక్తల దగ్గిఱనుంచిన్నీ దీనికి అలవాటుపడి పవిత్రమైన దాన్నిగా భావిస్తూ వుండడంచేత విధిలేక దీనికి మన ఆంధ్రులున్నూ సంతోషించతగ్గదే. మొత్తం యీ కాఫీ-టీలుకూడా గృహస్థులకు వక విధమైన యీతిబాధలలోకే చేరతాయని నా వూహ. అయినా మద్యపానమంత బట్టవిప్పుకొని నాట్యంచేయించే శక్తివీట్లయందు లేదు కనక తదపేక్షయా దీన్ని యీకాలంలో అంగీకరించక తీరదు. నల్లమందు అలవాటయినవాళ్లకు సమయానికి అది పడకపోతే కాళ్లూ చేతులూ లాగడం వగయిరా దుర్దోషాలు బయలుదేటినట్టే యీ కాఫీ-టీలు కూడా సమయానికి పడకపోతే తలనొప్పి వగయిరా దుర్దోషాలు కనపడతాయని వారువారు అనుకుంటూవుంటే విన్నాను. నల్లమందు బాలవృద్ధాతురుల రోగాలకు మందుగా అనాదిగా. మనదేశంలోనూ యితర దేశాలలోనున్నూ వాడుతూ వున్నవిషయం యెఱిఁగిన్నీ దాన్ని నిషేధింపఁ బూనినవారు తత్తుల్యమే అయిన దీన్నికూడా క్రమంగా నిషేధిస్తారనే వూహించాలి. యిఁక సబ్బునుగూర్చి మాట్లాడుకుందాం. పైపదార్థాలలాగ యిది లోపలికి సేవించే దైతే కాదు గాని బీదలకు దీనివల్ల కొంత అనవసరపుఖర్చు కల్పిత మవుతూవుంది. నాలుగు కుంకుడుకాయలో, కాస్త సీకాయో వుపయోగించే దానికి పట్నాలు సరేసరి, ప్రతీపల్లెటూరు గృహస్థులున్నూ దీన్ని విశేషించి వాడుతూ వున్నారు. దీనిలోనూ సిగరెట్టులోలాగే అనేక రకాలు ఉన్నాయి. అందులో హెచ్చువెలకలవి యెన్నో వున్నాయి. ధనికులు ఆలాటివాట్లను తృణప్రాయంగా వాడి చాలా సొమ్ము వృథాచేస్తూన్నారు. కాని అది వారి కొకలక్ష్యంలోది కాదు- "పులినిచూచి నక్కవాఁత పెట్టుకుం"దన్నట్టు పల్లెటూరి బీదలుకూడా ఆలాటి సబ్బులకే ప్రయత్నిస్తూన్నారు. ముఖ్యంగా వీట్ల అవసరం స్త్రీలకు. వాళ్లనాగరికత గడియకొకరీతిని మారుతూవుంది. పాశ్చాత్యుల భార్యలు నవనాగరికతకు తగ్గ వస్తువులు తేలేక యెందఱో బ్రహ్మచారులుగానే వుంటారని వినడం. ఆయోగం యీ కొత్తనాగరికతను అవలంబించే స్త్రీలవల్ల మనభారతీయులకుకూడా తారసిస్తుందని

తోస్తుంది- దీనితో కొన్ని పొదర్లుకూడా చూచుకోవాలి. పూర్వం యీమాత్రం నాగరికత లేకపోలేదుగాని అది సార్వత్రికం కాదు- యీ పొదరుకు బదులుగా లోధ్రపుష్పచూర్ణాన్ని వాడేవారని- "నీతా లోధ్రప్రసవరజసా పాండుతా మాననేశ్రీః" అనే మేఘసందేశంవల్ల తెలియవస్తుంది. ధనికుల కేవిన్నీ బాధించవుగాని సామాన్యగృహస్థులకు యివన్నీ యీతిబాధ తరగతిలోవే. అధమం నెలకు నూఱురూపాయిలేనా సంపాదించేవాఁడయితే తప్ప అయీ నాగరికతకు సంబంధించిన సామాన్య సంసారాన్ని యీఁదఁజాలడు. మా చిన్నతనంలో నెలకు పదిరూపాయిలు తెచ్చుకునే గృహస్థుచక్కఁగా సంసారాన్ని యీఁదుకోఁగలగడమే కాకుండా పైఁగా అతిథి అభ్యాగతులనుకూడా శక్తికొలఁదిని ఆదరించేవాఁడు. యిప్పుడు నూఱురూపాయిల జీతగాఁడు పిడికెఁడుబియ్యం ముష్టికూడా పెట్టలేకపోతూ వున్నాఁడు. అప్పుడు యీ కాలంలోవుండే దుబారాఖర్చులు యేవీలేవు సరిగదా! ధాన్యాదుల వెలలు చాలాతక్కువలో వుండేవి. నా స్వానుభవవిషయం వకటి వ్రాస్తూవున్నాను. నేను 1903లో బందరు హైస్కూలులో తెలుఁగు పండితుఁడుగా రు 25-0-0 రూపాయిల జీతంమీఁద హఠాత్తుగా ప్రవేశించాను. అప్పటికి నాకు రూపాయి వడ్డీమీఁద రు. 600-0-0ల రూపాయిలు అప్పువుంది. అప్పు మాన్యంమీఁద వచ్చే రు. 100-0-0 శిస్తువల్లను శ్రీనూజివీటి రామచంద్రాప్పరావుగారు ప్రతియేఁటా వెళ్లినా వెళ్లకపోయినా తప్పకుండా యిచ్చే నూటపదహార్ల వార్షికంమీఁదనూ తీరుతుంది గదా అనిన్నీ రు. 25-0-0 ల జీతంతో పట్నవాసంలో నేనూ భార్యా యెవరో తోవాసం వకపిల్లవాఁడున్నూ మొత్తం ముగ్గురువుండే నా కుటుంబమున్నూ, యింటివద్ద మాతల్లిదండ్రులూ, యెల్లప్పుడూ తఱచుగా యీ ఇంటనే వుండే యిద్దఱు తోఁబుట్టువులూ, వాళ్లపిల్లలూవుండే పెద్ద కుటుంబమున్నూ యేలోపమూ లేకుండా చక్కఁగా జరిగేది. దీనిక్కారణం ముఖ్యమైన ఆహారపదార్థాలు. ఆముదందీపాలు, యెప్పుడో అవసరమైతే నాకవిత్వ రచనకు మాత్రం కొవ్వొత్తిదీపం, దొడ్లో ఆకూ కూరా వగయిరాలతో యింట్లోవున్న పాఁడితో సంసారం నడుపుకోవడమే. యిప్పుడో ఈ రెండు కుటుంబాలకున్నూ, రు. 25-0-0 రూపాయిలు కాఫీ-టీ-సిగరెట్లకుకూడా సరిపోవనుకోవాలి. యీ వాతావరణం పూర్తిగా వేళ్లు నాటుకుపోయింది. ప్రతి పల్లెటూళ్లోకూడా కాఫీహోటళ్లు వెలిశాయి. కాఫీహోటళ్లంటే జ్ఞాపకం వచ్చింది. ఆమధ్య వక సంవత్సరంకింద వక అతిథి, మా యింటికి వచ్చాఁడు. ఆయన మైసూరు ప్రాంతం వాణ్ణని చెప్పాఁడు. యేంపనిమీఁద యీదేశం వచ్చావని అడిగాను. "కాఫీ" హోటలు పెట్టుకోవడానికి ఏదేనా వూరు వెదుక్కొవడానికని బయలుదేఱాను. యెక్కడా ఖాళీగావున్న పల్లెటూరు దొరకలేదన్నాఁడు. యీ హోటలుగాని అన్నంపెట్టే హోటలుగాని పెట్టుకోవడం మన ఆంధ్రులకు పూర్వం చాలా నీచంగా వుండేది; ఇప్పుడు దీన్ని అవలంబిద్దామన్నా

అవకాశమే కనపడడంలేదు, సుమారు 40 యేళ్లనాఁడు గద్వాలనుంచి వస్తూ గుంతకల్లు స్టేషనులో హోటలు భోజనం చేయవలసి వచ్చింది. తీరా భోంచేసేవేళకు- యజమాని కనపడి మమ్మల్ని ఎంతో ప్రత్యుత్థానం చేసేటప్పటికి హోటలుకీపరేమిటి? యీ ప్రత్యుత్థాన వాక్యాలేమిటి? పైఁగా యీ బ్రాహ్మడి తేజస్సు హోటలు పెట్టుకోవడానికి తగ్గదిగా లేదనుకొని కొంచెం కదిలించి చూస్తిమి గదా! ఆయనకు వేదం అశీతిద్వయమున్నూ చక్కఁగా వచ్చును. ఇట్టి శుద్ధశ్రోత్రియుఁడికి యీగతి పట్టడానికి కారణమేమిటో? అని అట్టే విచారిస్తే అనారోగ్య హేతువును బట్టి విధిలేక జీవనార్థం యీ అకార్యంచేస్తూ వున్నానని విచారిస్తూ ఆయనే చెప్పారు. యెందఱో దాక్షిణాత్యులు యింగ్లీషులో పెద్ద పెద్ద పరీక్షలు ప్యాసయికూడా యీ హోటలువృత్తిని అవలంబించి గొప్పగొప్పస్థితులు సంపాదించి గౌరవజీవనం చేస్తూవున్నట్టు కనపడుతుంది. "శ్లో. అట్టశూలాజనాపదాః... అట్ట మన్న మితి ప్రోక్తంశూలో విక్రయ ఉచ్యతే" అంటూ విష్ణుపురాణాదులలో యీ అవస్థ భవిష్యత్కాలంలో కలుగుతుందని వ్రాయడమున్నూ తుదకది ప్రత్యక్షం కావడమున్నూ చూస్తే ఆ ఋషుల దీర్ఘదర్శిత్వం అవగతమవుతుంది. చెప్పొచ్చే దేమిటంటే? పూర్వరీతిగా దుబారా ఖర్చులు లేకుండా మితంగా కాలక్షేపం చేదామని ఏగృహస్థేనా ప్రయత్నించినప్పటికీ ఆయీ హోటళ్లు బీడి- సిగరెట్లతోపాటు సర్వత్రా అలుముకున్నాయి. గాంధీగారు జీవితచరిత్రలో వ్రాసుకొన్నట్టు కొందఱు యీ సిగరెట్లు కొనుక్కోవడానికి శక్తిలేక చిలకకొట్లద్వారా తమ వ్యామోహాన్ని తీర్చుకొనేవాళ్లున్నూ- కనపడతారు. యీ దురవస్థ తల్చుకుంటే దుర్వ్యసనం యేలాటి అకార్యాలు చేయిస్తుందో స్పష్టపడుతుంది-వాళ్లమాట యేలావున్నా కాస్త గౌరవంగా- మప్పితంగా కాలక్షేపం చేదామన్న - గృహస్థుకు - యివన్నీ యీతిబాధలు గానే కనపడుతున్నాయి.

నా చిన్నతనంలో తోడి బ్రాహ్మణ పిల్లలతోపాటు నేను డబ్బుకూ దస్కానికీ సంభావనకి వెళ్లకపోయేటప్పటికి మా తల్లిదండ్రులు "నీకు ముందుముందేలా గడుస్తుంది. యెక్కడికీ వెళ్లవనేవారు. దానికి "నాకేం నెలకు పదిరూపాయీలు యిప్పుడు చదువుకున్న చదువుకే యిస్తా"రని గర్వంతో జవాబు చెప్పేవాణ్ణి. అప్పటికి నా చదువు "తెలుఁగుస్కూల్లో లోవర్‌ప్రైమరీ సర్టిఫికట్టు" కలిగివుంది. ఆ కాలంలో ఆ మాత్రం చదువున్నూ అక్కఱ లేకుండానే యినస్పెక్టర్లు స్కూలు మాస్టరీ యిస్తూండేవారు. అట్టి స్థితిలో నేను పల్లెటూరి మాస్టరీకే వెళ్లవలసివస్తే యినస్పెక్టర్లు నన్నెంత ప్రేమిస్తారో ఆలోచించండి. యేంకర్మమో? కాని అప్పుడు వంటబ్రాహ్మలు స్కూలుమాస్టర్లుగా వుండే స్కూళ్లల్లో చదివికూడా బాలురు మంచి భాషాజ్ఞానం కలవాళ్లుగా వుండేవారు. యిప్పుడు మంచి మంచి పరీక్ష లిచ్చినవాళ్లు మాస్టర్లుగావుండే స్కూళ్లలో చదివికూడా ప్రధాన పదార్థం సర్వ శూన్యంగానే కనపడుతుంది.

విద్యావిషయాన్ని విచారిస్తే యిప్పటి స్కూళ్లుకూడా యీతిబాధలకిందకే వస్తాయి. అప్పుడు సంవత్సరానికి వకసారి. కొన్నింటికి రెండుసార్లు కాఁబోలు పరీక్ష చేసేవారు యినస్పెక్టర్లు. యిప్పుడో "ముద్ద ముద్దకీ బిస్మిల్లా" అన్నట్టు యెప్పుడూ పరీక్షలే, అయినా ప్రయోజనం శూన్యం. అయిదేళ్లు యెలిమెంటరీ స్కూలులో చదివిన వొకపిల్లవాఁడికి రఘువంశం మొదలెట్టి చెప్పవలసివస్తే వర్ణక్రమం దగ్గిఱనుంచీ, చెప్పవలసివచ్చి "సన్యాసాడిపెళ్లికి జుట్టుదగ్గిఱనుంచీ యెరు" వన్నట్టు కనపడింది. విద్యాశాఖకు అవుతూవున్న వ్యయం బోలెఁడు కనపడుతుంది. విద్యగతి యిలావుంది. పూర్వంకన్న విద్య చాలా వ్యాపకస్థితిలో వున్నట్టు రిపోర్టులవల్ల పై అధికారులు తెలుసుకొని తృప్తిపడుతూవుంటారు. అయితే వకటిమాత్రంవుంది. పూర్వకాలంలో ప్రతివ్యక్తికిన్నీ చేవ్రాలుచేసే శక్తి కూడా వుండేదికాదు. యిప్పుడాలాకాదు. నూటికి యేభై మందికేనా మాతృభాషలోనేకాదు; హూణభాషలోకూడా చేవ్రాలుచేసే శక్తి మట్టుకేనా కనపడుతుంది యెంతోసొమ్ము గవర్నమెంటు వ్యయపఱచ డానికి యిదేఫలిత మయేయెడల–"మహతా ప్రయత్నేన లట్వాఽఽ ఽకృష్యతే" అన్నట్టవుతుంది. అంటే? పెద్ద బ్రహ్మాండమంత ప్రయత్నంచేసి వకచిన్న పిట్టను పట్టుకొన్నాఁడన్నట్టయింది. కాఁబట్టి యిప్పటి పల్లెటూరి స్కూళ్లున్నూ యీతిబాధలలోకే చేరతాయి. యిఁక ముందు నిర్బంధ విద్యా విధానంకూడా వస్తే యితరత్ర చదువుకొని బాగుపడేవాళ్లుకూడా యీ స్కూళ్లలోకి వెళ్లి చెడిపోవలసిన దుస్థితి తటస్థిస్తుంది కాఁబోలును. యెక్కడో నూట నాట తప్ప యింట్లోకాని అన్యత్రగాని చదువుకొని బాగుపడవలసిన వీళ్లు కూడా నశించి చాలాకాలమయింది. నా చిన్నతనంలో పల్లెటూళ్లల్లోనే కాదు; పట్నవాసాల్లో కూడా ప్రైవేటుట్యూషన్లంటూ వున్నట్టెఱుఁగను. యిప్పుడో శివారు గ్రామాల్లోకూడా యీ ట్యూషన్లు వ్యాపక స్థితిలో వున్నాయి. వకటీ, రెండూదాఁకా జీతాలున్నూ యిస్తారు. యీ సందర్భంలో జ్ఞాపకం వచ్చింది. నేను రఘువంశం మొదలెట్టేముందు వకతేలీ గృహస్థు నన్ను తనపిల్లవాఁడికి రోజూవచ్చి కాస్తసేపు చదువు చెప్పవలసిందని కోరాఁడు. వకనెల్లాళ్లు కాఁబోలు చెప్పాను. నా సరదా తీరేదాఁకా గానుగబల్లమీఁద యెక్కితిరిగేవాణ్ణి. అర్ధరూపాయి కాఁబోలును జీతం యిచ్చేవాఁడు. యిప్పుడామాత్రం చదువుకు జీతం హెచ్చుగానే దొరుకుతుంది కాని అప్పుడు ఆ అర్ధరూపాయితో జరిగినపనిలో యిప్పుడు యెన్నో వంతూ రెండురూపాయిలతో జరగదు. ఆ కాలంలో రూపాయికి యెనిమిది సేర్లబియ్యం అమ్ముతున్నారంటే? పెద్దకరువు వచ్చిందన్నమాటే! అలా అమ్ముతూ వున్నరోజుల్లోనే దత్తమండలాన్నుంచీ, గుంటూరు డిస్ట్రిక్టు నుంచీ యెన్నో కుటుంబాలు మా గోదావరిజిల్లాకు వలసవచ్చాయి. ఆ కుటుంబాల నన్నిటినీ వకయేడో రెండేళ్లో శ్రీ బచ్చు రామేశంగారు పోషించి పరలోకంలో శాశ్వతమైన వున్నతస్థానాన్ని సంపాదించుకొన్నారు. కాకినాడ

అవధానంనాఁటికి యింకా యీ విషయం లోకానికి అంతముఱుపు తగలలేదు. యెవరో అడిగారు యీ పద్యం చెప్పాము.

శా. "ధారాపాతము లేక సస్యవితతుల్‌తప్తమ్ము లయ్యెన్ గడున్
జేరెన్ సర్వజనంబు నీపురమునే జీవింప, వా రెల్లరన్
శ్రీరామేశఘనుండు ప్రోచి మును దా శ్రీవృష్టి నాక్షామమున్
బాఱందోలెను దానిఁ గోర మరలన్ బాగెట్లగున్ దెల్పుమా?"

యీయన చేసిన యీవుత్తమ కార్యానికి గవర్న మెంటువారు కూడా చాలా ఆశ్చర్యపడ్డట్టు వినికిడి. అప్పటి శ్రీ పిఠాపురం రాజాగారు యేదో గవర్నరు సభకు వెళ్లినప్పుడు కాకినాడ ప్రశంసవచ్చి గవర్నరుగారు- "ఓహో! బచ్చురామేశం వున్న వూరు కాదా?" అనేటప్పటికి రాజాగారికి అవమానంగా కనపడి-"రామేశం మాయెస్టేటు గ్రామాలలో వక వూళ్లో వక వీధిలో వక వైపునవుండే వక గృహస్థు" అని జవాబు చెప్పినట్టు చెప్పుకోవడం. యీ రాజాగారేమో నాఁటిరోజుల్లో దానకర్ణుఁడని ప్రసిద్ధివహించి కోట్లకొలఁది ధనమున్నూ పుట్లకొలఁదిభూమిన్నీ సద్వినియోగంచేసిన మహావ్యక్తి. రామేశంగారి కీర్తి యీ మహావ్యక్తి కీర్తినికూడా మఱపించింది. కారణం ఆలోచిస్తే యిది మఱీ అవసరమెటిఁగిచేసిన దానం కావడమే. ప్రస్తుతకాలంలో కోట్లకొలఁది వెచ్చిస్తూవున్న ధనదాతలు వున్నప్పటికీ యిట్టి యుక్తవ్యయం చేసేదాతలు మిక్కిలీ మృగ్యమవడంకూడా యీతిబాధలకిందికే వస్తుంది. మునుపు మార్గస్థులకు; అందులో ముఖ్యంగా కాశీ రామేశ్వరాలు వెళ్లే యాత్రీకులకు సత్రాలంటూ వుండేవి. రైళ్లమూలాన్ని అవి వెనకబట్టాయి. అక్కడక్కడ యింకా కొన్నయితే మిక్కిలీ స్వల్పంగా శేషించి వున్నాయి. కాని అవి దాతల వుద్దేశాన్ని నెఱవేర్చక అన్యథాగా నడుస్తూవుండడంచేత యిప్పుడు కొత్తగా యెవరేనా ధనాఢ్యులు లోకోపకారార్థం అలాటి ధర్మాలు చేయడానికి వెనుకఁదీస్తూ వున్నారు. దాతలవుద్దేశానికి పూర్తిగా అన్యథాగా ప్రవర్తించే యజమానులు ధర్మ సంస్థలకు దాపరించడముకూడా యీతిబాధలోనే చేరుతుంది. వక గ్రామములో దేవాలయాదాయము లోన్నుంచి వేదశాస్త్ర పాఠశాల నడిపిస్తూ వుండేవారు. యిటీవల దానియాజమాన్యం వోట్లలెక్కనుబట్టి బ్రాహ్మణేతరులమీఁదకి వచ్చింది. ఆయన అధ్యాపకుణ్ణి, బ్రాహ్మణేతరుల క్కూడా వేదం చెప్పవలసిందని శాసించారు. అధ్యాపకుఁడు, ఛాందసుఁడు చెప్పనన్నాఁడు. దానిమీఁద ఆ యజమాని అసలు వేదానికే సున్నచుట్టినట్టు యీ మధ్యనే విన్నాను. అసలు ధనదాతవుద్దేశమేమో తప్పో? వొప్పో? శాస్త్రీయమైన కార్యాలకు వినియోగించడమే కాని అన్యంకాదు. తుదకి మధ్యవచ్చిన యజమానులవల్ల ఆ వుద్దేశం మాటి యేలా

పరిణమించిందో చూడండి. యీ యాజమాన్యాలు "మూణ్ణాళ్ల ముచ్చట్లు" దీనిలో యిన్ని వికారాలు, వేదాధ్యయనానికి వుపనయనం కావాలాయె. ఆ వుపనయనం ఆబ్రాహ్మణ చండాల పర్యంతమూ జరగఁదగ్గదిగా కనిపించడం లేదాయె. "లేకపోయేదేమిటి? చేసుకుంటే – వుంటుందని చేసుకుంటారా? చేసుకోండి, ఉత్తమత్వప్రాప్తికికదా! యవరేపని చేసుకున్నా, అట్టివుత్తమత్వం అశాస్త్రీయ కార్యాలవల్లకూడా కలిగేయెడల సంతోషమే. కానివ్వండి" అంటే తీరిపోయే దానికి కొందఱు బ్రాహ్మలు యేదో పుట్టి మునిఁగినట్టు దీనికోసం పరితపిస్తారు. అదిన్నీకాక యెవరికి అధికారంవుందో వారిలో యెందఱు వేదం చెప్పుకుంటూ వున్నారు? వేదం దాఁకా యెందుకు? అధమం సంధ్యావందనమేనా చెప్పుకుంటూ వున్నారా? అట్టిరోజుల్లో యీవిధినిషేధాలెందుకు? యీ వేదశాస్త్రాలు ద్విజులవల్ల యేలాగా కాపాడబడేటట్టులేదు. ద్విజేతరులవల్లనేనా కాపాడఁబడతాయేమో? అని బ్రాహ్మలు ఆలోచిస్తే యేమయ్యేదోగాని ఆలా ఆలోచిస్తూ వున్నట్టు కనపడదు. బాహాటంగా హరిజనులక్కూడా వేదశాస్త్రాలు చెప్పడానికి ఛాందసులు సిద్ధపడేటట్టయితే యేమవుతుందో? చూడాలని నాకు యెంతో కుతూహలం వుంది. యీలాటి ఆలోచనలవల్ల కాదుగాని కొందఱు కడుపుకక్కుర్తివల్లమాత్రం అక్కడక్కడ ద్విజేతరులకు చెపుతూ వున్నారేమో? అన్నట్లు చెప్పడమెందుకు? అచ్చుపుస్తకాలుండనే వున్నాయికదా! వాట్లవల్లనే ఆ వేదాన్ని వారు సాధించవచ్చు ననుకుంటాను. అయితే అది శ్రుతికదా! అది శ్రవణంవల్ల సాధించవలసివుంటుందే? అవన్నీ యెవరిక్కావాలి? ఏదోవిధంగా సాధించడమేకావలసింది. శాస్త్రాన్ని వుల్లంఘించి చేసేపనికి మళ్లా ఈ విషయంలో శాస్త్ర ప్రతిబంధక మెందుకు? ఆ పక్షంలో యెవరికీ వచ్చేదీలేదు యేమీలేదుగాని ఆవేదం మాత్రం చెడుతుంది. దీన్నిబట్టి ఆలోచిస్తే ఈమూమెంటు వేదంపాలింటికి యీతిబాధగానే కన్పిస్తుందిగదా! ప్రస్తుతకాలంలో దేన్ని పడితే అదే యీతిబాధగానే కన్పిస్తుందే! పూర్వం విశ్వామిత్రసృష్టి అంటూ చెప్పుకోవడం. అవి యివే అంటూ ఆకాశంమీఁద యేవో కొన్ని నక్షత్రాలు కనపరచేవారు. భూమిమీఁద ఆ విశ్వామిత్ర సృష్టిబాపతు పదార్థాలేవో వివరంగా తెలియదు. ఆవులకు గేదెలనిన్నీ, హింసకు పావురాలనిన్నీ పెద్దలు కొన్నిటిని చెపుతారు. మిరియాలకు మిరపకాయలు విశ్వామిత్ర సృష్టిగానే చెపుతారు. యిటీవలికాలంలో జరిగిన విశ్వామిత్రసృష్టి చాలావుంది. దానిలో కాళ్లనడక్కి బదులు సైకిళ్లనడక వగయిరాలు. వీట్లవల్ల యెన్నో వుపకారాలయితే లేకపోలేదుగాని గజానికీ అరగజానికీ కూడా దీనిమీదేగాని సొంతకాళ్లతో నడవడం యెఱుఁగనివాళ్లను చూస్తే యేమిటో యిబ్బందిగా కనపడుతుంది. దీనివల్ల కొన్ని వ్యాధులు పుడతాయంటారుగాని పుడితే పుట్టనివ్వండిగాని దీని వుపయోగం, అందులో వైదీకంలో తుట్టతుద జరిగే కర్మ చేయించేవారికి పట్నవాసాలలో వున్న వుపయోగం

యింతా అంతా అని చెప్పడానికి వీలు కనపడదు. నేను బందరులో వుండేరోజులనాఁటికి యింకా లౌక్యవృత్తిలో వుండే పూర్వరీతివారుకూడా యేదో గుఱ్ఱబ్బండో, యెద్దు బండో యెక్కి వారివారి గమ్యస్థానానికి చేరడానికే యిష్టపడేవారుగాని దీన్ని యెక్కడానికి సంకోచపడేవారు. సుమారు రెండుమైళ్ల దూరాన్నుంచి హిందూ హైస్కూలుకు రావలసిన హెడ్మాస్టరుగా రొక రుండేవారు. ఆయన తఱచుగా నడిచే వచ్చేవారు. కొందఱు ఆయన్ని- "మీరు సైకిలుమీఁద వెళ్లరాదా?" అంటే?- "సైకిలుమీఁద నేను బయలుదేఱితే అంతా నన్నుచూచి నవ్వుతారు" అని జవాబు చెప్పడం నేను యెఱిఁగిందే. ఆ రోజుల్లో దీన్నిగూర్చి వక అవధానంలో అడిగేటప్పటికి యీ పద్యం చెప్పాము-

శా. "నీరుం గోరదు గడ్డినడ్గ దొక కొన్నే నుల్వలన్ వేఁడ దే
వారే నెక్కినఁ గ్రిందఁ ద్రోయఁ దొకఁడుం బజ్జన్ భటుం డుంట చే
కూరంగా వల దౌర! బైస్కిలునకున్ గోప మ్మొకింతేని లే
దౌరా! వాజికిఁ (గుఱ్ఱానికి) దుల్యమైన యిది విశ్వామిత్ర సృష్టంబొకో?"

(అప్పటికి సైకిలు అనేపేరు దీనికి వున్నట్టు నాకు తెలియదు. బైస్కిలు అనే వినడం.)

దీన్ని విన్నవారిలో కొందఱు శంకించారుగదా! "యెందఱో దీన్ని యెక్కేవారు పడడమూ ఆస్పత్రిలో చికిత్స చేయించుకోడానికి పడివుండడమూ అనుభూతంగా తెలుస్తూవుంది. మీరీలా చెప్పారే?" మన్నారు. దానికి సమాధానం-అది దాన్ని యెక్కేవాళ్ల తెలివితక్కువగాని ఆసాధనం చేసే పనికాదని జవాబు చెప్పాము. యీ శంకల కేమిటి? చెప్పేవాఁడుంటే అడుగుతూనే వుంటారు. యింకా దీనిలో- "నీటిన్" అనక 'నీరున్' అన్నా రేమనికూడా ప్రశ్న మాత్రం యింతవఱకు యెవరూ అడగలేదు గాని అడిగే అవకాశమూ లేకపోలేదు. చెప్పడానికి జవాబున్నూ లేకపోలేదు. యింతకూ కాలినడక్కు కొంతమందికిన్నీ, అశ్వాది సాధనాలకి బదులుగా కొంతమందికిన్నీ, యిది విశ్వామిత్రసృష్టిగా బయలుదేఱింది. అయితే యిది కొత్తరకం యీతిబాధల్లో కెందుకు చేర్చవలసివచ్చిందంటే? సామాన్య సంసారంలో ఆఁడవాళ్లుకాక మొగాళ్లు యెందఱయితే వుంటారో, అందఱికీ మనిషి వక్కంటికి వొక్కొక్కటి చొప్పున యిది వుంటేనేకాని కాలం గడవడం లేకపోవడంచేత యిదికూడా గృహస్థుకు వకయీతిబాధే! దీన్ని వకపర్యాయం కొని పడేస్తే అంతతో తీరిపోదు. మధ్యమధ్య బోలెఁడు మరమ్మత్తులు. అయితే గుఱ్ఱానికి బదులుగా దీన్ని వాడుకొనే సంపన్న గృహస్తులకు కొంత దీనివల్ల లాభంవుందంటే వొప్పుకోవచ్చునుగాని ఆపూఁట కాపూఁట యెట్లో కాలక్షేపం జరుపుకొనేవాళ్లకి మాత్రం యిది తప్పక వక యీతిబాధే. అన్నింటికీ మించింది యింకోటి కనపడుతూ వుంది. అది "సినిమా". యీ సినీమా 'యెనీమా'

మాదిరిగా ప్రతి సామాన్య గృహస్థుకున్నూ వున్నదంతా తుడిచిపెడుతూ వుందనడంలో అతిశయోక్తి లేశమున్నూ కనపడదు. యిది సామాన్య గృహస్థులకు మాత్రమేకాదు; పెద్దపెద్ద సంపన్న గృహస్థులకు కూడా నానావిధాల యీతిబాధ. బాగా ఆర్జించి నిలవచేసిన ప్లీడర్లు వగయిరాల కొడుకులు యెక్కడోగాని మళ్లా తండ్రులమాదిరిని వుద్యోగాదికం చేసి సభ్యత్వాన్ని సంపాదించడం కష్టం. ఆలాటివాళ్లు తండ్రితాతలు సంపాదించిన ద్రవ్యంతో యీ సినిమా "ఫిల్ములు" తయారుచేయించడానికి పూనుకొని 'యెనీమా' వల్ల వచ్చేఫలితాన్ని పొందుతూవున్నట్టు వింటున్నాను. అది వర్తకం కనక దానిలో లాభమూ వకప్పుడు రావచ్చు, నష్టమూ రావచ్చు ననుకొందాం. యితర గృహస్థుల తాలూకు ఆఁడవాళ్లు యీ ప్రదర్శనాలకు 'వేలంవెఱ్ఱి'గా యెగబడడం యేలాటి యీతిబాధో, ప్రతివారికిన్నీ అనుభూతమే కనక విస్తరించి వ్రాయనక్కఱలేదు. యింటిల్లిపాదీ తలుపు తాళంవేసి ఆఁడాళ్లూ మొగాళ్లూ పసిపిల్ల దేభీలు సినిమా మహోత్సవానికి వెళ్లడం కనిపెట్టి యిదేసందనిచెప్పి దొంగలు కొంప 'అయ్యవార్లంగారి నట్టిల్లు' చేయడంవల్ల కలిగే హాన్నికూడా గణించనివా రెందఱో గృహస్థులు కనపడతారు. కాంగ్రెసు మంత్రులు మద్యనిషేధాన్ని గూర్చి ముందుగా ప్రయత్నిస్తూ వున్నారుగాని అంతకంటే మున్ముందుగా-"ఆదౌ పూజ్యోగణాధిపః" అని 'సినిమా' నిషేధానికి వుపక్రమించడం అవసరమని నాకు తోఁచింది. యీ సినిమా సంబంధమైన టిక్కట్లు అంతగా ధనవ్యయాన్ని కలిగించేటట్టు లేదుగాని దీన్నిమిత్తం రాకపోకలకు బళ్లు వగయిరాలు 'సెట్టిసేరు, లింగం సవాసేరు' అనే లోకోక్తి స్మారకాలుగా కనపడతాయి. స్త్రీలకేమి? పురుషులకేమి? యీ సినిమాలవల్ల అలవడేదుర్నీతి విశేషంగా కనపడుతుంది. కొందఱు యీకథాభాగాలు, సంస్కరించాలనే వారున్నట్టు పత్రికల్లో వుండే రాఁతలవల్ల గోచరిస్తుందికాని కల్లుదుకాణాలను సంస్కరించడం యేలాటిదో యిదిన్నీ ఆలాటిదే అనుకుంటాను. యీ బాపతు యితివృత్తాలు కొన్ని పురాణ ప్రసిద్ధాలు లేకపోలేదు. గాని అందులో మధ్యమధ్య నేఁటివారు కల్పించిచేర్చేవి యెన్నో దుర్నీతి ప్రధానంగానే వుంటాయి. యెప్పుడో స్త్రీ స్వాతంత్ర్యం రావాలనీ, వస్తుందనీ కొందఱు వుఝ్ఝాఁతలూగుతూ అనుకుంటూ వున్నారుగాని నేను పట్నవాసాల్లో కించిన్న్యూనంగానున్నూ పల్లెటూళ్లలో చాలా న్యూనంగానున్నూ అది యిప్పటికే వచ్చిందని తలుస్తాను. యెన్నో దుర్వ్యసనాలతో నిండివున్న యీ ప్రపంచాన్ని సంస్కరించడం అంటే, "యెలుఁగ్గొడ్డు తంటసప్పని" గానే కనపడుతూవుంది. అట్లని వుపేక్షించడం సంస్కర్తల ధర్మంకాదు. శాయశక్తులా ప్రయత్నించక తప్పదు. యీ దుర్దోషాలన్నీ జ్ఞానంవల్లనే కాని నివర్తించవు. ఆ జ్ఞానం విద్యవల్లతప్ప లభించదు. ఆ విద్యకూడా యీ కాలంలో అనేక యీతిబాధలతో మిళితమై వుండడంచేత యేలా ప్రపంచానికి శ్రేయస్సు కలుగుతుందో? యెన్ని విధాల ఆలోచించినా, ఆలోచనే

పాలుపోవడంలేదు. దీన్నిబట్టి చూస్తేప్రపంచక స్వభావమే అనాదిగా యీలాగు వుందనిన్నీ, అది యెవడు యెన్నివిధాల సంస్కరించినా స్వస్వభావాన్ని వదులుకోదనిన్నీ తేలుతుంది. కాని పాశ్చాత్యుల బుద్ధి చాకచక్యం మన భారతీయుల లాగ దేని స్వభావాన్ని దానికి వదిలిపెట్టి వూరుకునేది కాకపోవడంచేతానున్నూ, వారిగాలి పూర్తిగా సోఁకిన బుద్ధిమదగ్రేసరులు సంస్కర్తలుగా వుండడంచేతానున్నూ అస్మదాదులకు "యేటి కెదురీఁదడం" వంటిదిగా తోఁచే సంస్కారాలు నెలకొల్పుతూ వున్నారు. వీట్లని కాదనడంకంటె ఆమోదించడమే మంచి పద్ధతి. మనలోకూడా-ఉ. "దైవమనంగ నెట్టిదగు దానిని జూచినవాఁ డెవండు? కార్యావసరంబు పట్ల నలసాత్ములు పల్కెడిమాట గాక!" అని దైవనిర్ణయానికి అనఁగా ప్రకృతి శాసనానికి అన్యథాకరించే తలంపు కలవారు పూర్వమందుకూడా కొందఱున్నట్టు గ్రంథ ప్రమాణం కనపడుతుంది. కాని ప్రకరణాన్ని బట్టి ఆలా సాహసించేవారు అసుర ప్రకృతి కలవారుగా కనబడతారు. యింతేకాదు. దైవం మీఁద సమస్త భారాన్నీ వుంచి ప్రవర్తించే మహావిజ్ఞానులుకూడా అంతతోగత్వా-"దైవం నిహత్యకురు పౌరుష మాత్మశక్త్యా యత్నే కృతే యది నసిద్ధ్యతి కోఽత్రదోషః" అని పురుష ప్రయత్నానికే ప్రాధాన్యాన్ని యిస్తూ వచ్చారు. అనేక యీతిబాధలతో చేరివున్న యీ ప్రపంచ దురవస్థను చూచి శాంతి ప్రియులైన నారదాదులు యెప్పటికప్పుడే "కేనోపాయేన చైతేషాం దుఃఖనాశో భవేద్ధ్రువమ్ ఇతిసంచింత్య మనసా విష్ణులోక ముపాఽఽగమత్" (మనకు విష్ణులోకం అంటే లండనే అనుకోవాలి) అంటూ పురాణాల్లో యెంతో ప్రయత్నంచేసి వాట్ల శాంతికై వ్రతాలూ దానాలూ జపాలూ తపాలూ వుపదేశించినట్టు కనపడుతుంది. యిప్పుడో? ఆ మార్గం బొత్తిగా ఆదరించేకాలంగా కనపడక కాఁబోలు, యేయేవస్తువులు యీతిబాధాకారకాలుగా కనపడుతూ వున్నాయో, ఆయా వస్తువులు దొరక్కుండా చేయడానికి ప్రయత్నిస్తూ వున్నారు. అందులో మఱీ ముప్పుగా వున్నదాన్ని మొట్టమొదట యెత్తుకున్నట్టు తోస్తుంది. క్రమంగా నేనిందులో వుదాహరించిన బీడి, సిగరెట్లు, సినిమా లోనైనవాట్లకుకూడా యత్నిస్తారని వ్రాయనక్కఱలేదు. వక్క సిగరెట్లకే కోట్లకొలఁదిగా గృహస్థుల సొమ్ము వమ్మవుతూ వున్నట్టు యేపత్రికలోనో చదివినట్టు జ్ఞాపకం. గాంధీ మహాత్ముని దృష్టిలో యివన్నీ యిదివఱకే పడివున్నాయి. అయినానేనిందులో వ్యాఖ్యానంచేయడం చూస్తూచూస్తూ వూరుకోలేక కాని మఱో ప్రయోజనానిక్కాదు. పూర్వులు చూపిన యీతిబాధలకీ యిప్పుడు నేను కొత్తగా చూపిన యీతిబాధలకీ కొంచెం భేదం కనపడుతుంది. యివి చేతులో ప్రభుత్వం వుందికనక యే కాంగ్రెస్సుమంత్రులో వారిస్తే వారింపఁబడతాయేమో? అని అనుకోవడానికి వీలుగా కనపడతాయి. అతివృష్టి వగయిరాలన్నీ కాకపోయినా అందులో కొన్ని బొత్తిగా మనుష్యప్రయత్నానికి లోఁబడడానికి అవకాశం లేనేలేనివి. లేనివెంత

సాధ్యపడతాయో వున్నవీ అంతే సాధ్యపడతాయని, కొందఱయితే అంటారు. కాని అట్టనిచూస్తూ వూరుకోవడం ప్రాజ్ఞులలక్షణంకాదు. శంకరాదులు వారి జీవితమంతా పారమార్థికంలో వినియోగించుకొన్నారు. సరే అంతతో తృప్తిపడి వూరుకోలేదుకదా! లోకకల్యాణం కోసమని వారివారి అభిప్రాయాలు గ్రంథరూపంగా స్థిరీకరించికూడా ప్రయత్నించారు. దానివల్ల అంత ప్రపంచమూ కాకపోయినా యేకొంతో అప్పుడే కాకుండా యిప్పుడుకూడా పారమార్థికాన్ని నేర్చుకుంటూ ఉంది. ఆలాగే యిప్పటి సంస్కర్తల ప్రవృత్తులున్నూ యేకొంతమందికో వుపకరించి తీఱతాయని చెప్పకతప్పదు. కేవలమూ శంకరాదులలాగ నీతిబోధచేయడం మాత్రమే కాక ప్రభుత్వం చేతులో వుండడంవల్ల దాన్నికూడా దీనికి జోడించిపనిచేస్తూ వున్నారు కనక– "దండం దశగుణం భవేత్" అనే అభియుక్తోక్తి సార్థకమై పూర్వపు సంస్కర్తల ప్రయత్నంకన్నా యిప్పటి సంస్కర్తల ప్రయత్నం యెక్కువగా జయప్రదమై లోకకళ్యాణ దాయకం అవుతుందేమో అని తోస్తుంది. శంకరాదులుకూడా దుర్నీతినివారణానికి అప్పటి ప్రభువుల తోడ్పాటును కైకొన్నట్టే చరిత్రజ్ఞులు చెపుతూవుంటారు. విద్యాధికుల విషయంలో చేసే సంస్కారాల కయితే దండోపాయ సహాయ్యంతో పని వుండదుగాని తదితరులను సంస్కరించవలసి వస్తే కేవల నీతివాక్యోపన్యాసాలు పనిచేయవని వ్రాయనక్కఱలేదు. అప్పుడే మద్యనిషేధం ప్రారంభించిన సేలం జిల్లాలో యెందఱో తాగుబోతులు ఆదురలవాటుమాని దానిఫలితాన్ని గ్రహించి తమతమ అభినందనాలు సంస్కర్తలకు తెలుపుతూ వున్నట్టు పత్రికల వల్ల నైతే తెలుస్తుంది గాని యీ పత్రికల వ్రాఁతలు వారివారి పక్షగతాభిప్రాయాన్నిబట్టి వుంటూ వుండడం ప్రాయశః కనపడడంచేత పూర్తిగా విశ్వసించడానికి అవకాశంలేదు. వ్యతిరేకాభిప్రాయం కల వకపత్రిక వకమద్యపాయి యింకా నిషేధం అమల్లోకి రాకపూర్వమే ఆత్మహత్యవల్ల ప్రాణాన్ని గోల్పోయినట్టురాసిన రాఁతకూడా చదివాను. భవతు. దానికేమి? యేమైనా పూనినపూనికి మంచిది. యిది నెగ్గితే మఱి కొన్నింటికి వారు పూనడానికి వారికి వుత్సాహం కలుగుతుంది కనక దీన్ని నెగ్గించవలసిందని లోకం భగవంతుణ్ణి ప్రార్థించవలసివుంటుంది. యేలాగో పదమటిగాలిద్వారా మన భరతఖండంలో యీ శతాబ్దంలో వ్యాపించిన యీతిబాధలు తొలఁగితే తప్ప సామాన్యగృహస్థులు జీవయాత్ర గడపడం పొసఁగనే పొసఁగదనే నిశ్చయంతో నేను ఆయాయీ యీతిబాధలను యిచ్చట పేర్కొనవలసివచ్చింది. యిందులో కొన్నిగాని, అన్నీగాని ఆహ్లాదకరాలంటూ వాదించే వారుంటారనిన్నీ యెఱుఁగుదును. ఆలా వాదించే ఎడల మద్యంకూడా ఆహ్లాదకరమే అని అంగీకరించవలసి వస్తుందికదా! లోలంబరా జీయం అనే వైద్యగ్రంథంలో దుఃఖనివారణకు మందేమిటంటూ ప్రశ్నించుకొని దానికి మద్యపానాన్ని మందుగా వ్రాశాఁడు గ్రంథకర్త. కూసుమతం అనే

వామాచార వైష్ణవమతంలో చనిపోయినవాళ్ల దినవారం తుట్టతుదను చాత్తాని వైష్ణవులున్నూ చనిపోయిన వ్యక్తితాలూకు బంధుమిత్రులున్నూ యధేష్టంగా మద్యాన్ని సేవించడం యిప్పటికిన్నీ ఆచారంగా జరుగుతూ వుంది. దీనిపేరే "తొల్లక్కం" అంటారు. దీనిపేరునుబట్టి విచారిస్తే యీ ఆచారము అఱవదేశం బాపతని తేలుతుంది. దీన్నిబట్టి యిది దుర్వారమైన దుఃఖాన్నికూడా పోఁగొట్టే శక్తికలదని యేదో వకమతం వారు భావించడం కనపడుతూ వుందిగదా! అయినా సేవించిన పిమ్మట దీనివల్ల కలిగే చెడుగులు ఎక్కువగా వుండడంవల్ల దీన్ని సేవించిన వాఁడు పంచమహాపాతకులలో వకఁడుగా పరిగణింపఁబడ్డాఁడు. పాతకం మాటకేంగాని ప్రత్యక్షంలో యీపానం సంసారికి అన్ని యీతిబాధల కన్నా యెక్కువ యీతిబాధగా కనబడుతుంది. యిట్టి పాతకకార్యాలు చేయించేవి గాకపోయినా సిగరెట్లు వగయిరా లోఁగడ నేను వుదాహరించినవన్నీ యీతిబాధలనడానికి సంశయంలేదు. ఇవి అనాదిగా అపరిహార్యాలుగావున్న యీతిబాధలేమో అంటే, ఆలాటివికావు. యితరదేశ సంపర్కంవల్ల మనదేశానికి రవాణా అయి యీ దేశాన్ని, ఆరోగ్యాన్నీ భంగపఱిచి యితరదేశాన్ని పోషించడానికి వుపయోగ పడుతూ వున్నాయి. కనక సంస్కర్తలకు భగవంతుఁడు తోడ్పడి యీదేశ కల్యాణాన్ని సంపాదిస్తే యెందఱోగృహస్థులు సంతోషిస్తారు. అమితవ్యయం తగ్గుతుంది. ధనాఢ్యులు వీట్ల నిషేధానికి తోడ్పడరు కాఁబట్టి దీనివల్ల వచ్చే ముప్పుసామాన్యులకు ఏలాగా తప్పదు. దీనికి వక విధమైననైతికశక్తి సామాన్య గృహస్థులలో అంకురించడమే వుపాయం. అట్టి మహాభాగ్యం సామాన్య గృహస్థులకుకూడా సర్వేసర్వత్ర కలగడమనేది చిత్తశాంతివల్లనే గాని అన్యథాగా కలగదు. అట్టి చిత్తశాంతి కలిగేయెడల యీ "కల్పనారుచు"ల యందుండే వ్యామోహం తగ్గుతుంది. కాని అదిచాలా దుర్ఘటం. దానికై పత్రికలున్నూ వుపన్యాసకులున్నూ శాయశక్తులా ప్రయత్నించవలసి వుంటుంది. యీ అభిప్రాయము నాకిప్పుడు కలిగింది మాత్రమే కాదు; యిప్పటికి సుమారు నలభైయేళ్లనాఁడే కలిగింది. దాన్ని మా మొట్టమొదటి కామేశ్వరీశతకంలో వుదాహరించి కూడా వున్నాను. ఆ పద్యాన్ని యిక్కడ వుటకించి దీన్ని ముగిస్తాను-

మ. "అనుమానింపక కల్పనారుచులపై నాసల్ పిసాళించునె
మ్మనముం ద్రిప్పఁగలేక దుర్విషయముల్ మన్నించుచున్సాధు స
జ్జనసాంగత్యము వీడినట్టి పరమాజ్ఞాని న్ననున్ శుద్ధ వ
ర్తనకుం దార్చిన నీకృపారస మపారం బంబ! కామేశ్వరీ!"

★ ★ ★

# గర్భాధానం

దీన్నిగుఱించి నాల్గుమాటలు వ్రాస్తునా? “యేమంత నూత్నవిషయం యిది, దీన్ని గుఱించి వ్రాయడాని” కనుకుంటారేమో? చదువర్లు. అందఱూ యెఱిఁగిందిన్నీ అనుభూత మయిందిన్నీ అయినప్పటికీ యిది రానురాను యెన్ని విధాల వ్యవహరింపఁబడుతూ వచ్చిందో, ఆలా నానావిధాల వ్యవహరింపఁబడడానికి కారణమేమిటో సర్వసాధారణంగా అందఱికీ అవసరమైనా కాకపోయినా కవిత్వం చెప్పుకొనేవాళ్లకు మాత్రం చాలా అవసరం అందుచేత వ్రాయవలసివచ్చింది.

కొన్ని మాటలు పృథివి పుట్టేటప్పటికి యేలా వున్నాయో? యిటీవలకూడా ఆలాగే వున్నాయి, వుంటాయికూడాను. కొన్నో? పాశ్చాత్య వైద్యంలాగ దేశాటనం చేసేవాళ్ల మనోభావాలలాగ క్షణేక్షణేమాఱుతూ వుంటాయి. అందుకువుండే కారణాలు కొంతవఱకు అక్కడక్కడ సూత్రప్రాయంగా వివరించే వున్నాను. దాన్నే యిందులో విస్తరించతలఁచి యీ వ్యాసానికి ఆరంభం చేశాను. గర్భాధానం మొదలైనపదాలు మాఱడం అంటే తత్సమతద్భవాలలాగ కాదు. చాలా దూరదూరంగా మాఱడానికి మొదటికారణం సిగ్గు అఁపడానికి సరిగా అర్థం చెప్పవలసివస్తే గర్భ = కడుపు యొక్క లేక - గర్భమందువుండే వొకానొక జంతువుయొక్క, ఆధానం అంటే? చేయడం యిది వ్యాకరణశాస్త్రానికి లోపం రాకుండా “కర్తృకర్మణోఃకృతి” అనే సూత్రప్రకారం చెప్పే అర్థం. యిఁక సామాన్యంగా చెప్పేపిండితార్థమో? “కడుపుచేయడ” మనియ్యేవే. యీఅర్థం స్త్రీలకే కాదు పురుషులక్కూడా లజ్జాకరంగానే కనపడుతుంది. యిట్టిలజ్జాకరమైన మాటను వుచ్చరించి వూళ్లో పిన్న పెద్దలని ఆహ్వానించడానికి స్త్రీ పురుషాదులు బాజాబజంత్రీలతో బయలుదేఱడం నానాఁటికి హేయంగా తోఁచడంచేతనే కాఁబోలును! క్రమంగా గర్భాధానపదానికి దాదాపుగా వుండే యితర పదాలతో ప్రస్తుత శుభకార్యాన్ని వ్యవహరించడం మొదలు పెట్టినట్టు తోస్తుంది. వైదిక పదంమాత్రం అనాదిగా గర్భాధాన మనియ్యేవే. గర్భాధాన ఖండ లోనైన వుదాహరణాలు “గర్భాధానాఖ్యం కర్మ కరిష్యమాణః” అని సంకల్పంకదా! అయితే యింకొకటి కల్పి తప్పేరు తప్ప దీనికి ప్రత్యేకించి పేరు పుట్టినట్టులేదు. నిషేకమనేది వకటి వుంది గాని అది రజస్వలాత్పూర్వం జరిగే నూత్నదంపతుల సమావేశానికే రూఢంగా మా వైపున వాడడం. గర్భాఽఽధాన పదం గర్భ + ఆధానం. అని రెండిటి కూడికవల్ల

యేర్పడ్డదని వేఁతే వ్రాయనక్కఱలేదు. జ్యోతిష గ్రంథాల్లో "గర్భాధాన మరిష్ట మష్టమ విధౌ" అంటూ యీ కల్పితప్పేరునే వాడుకొన్నారు. కాళిదాసుగారు "గర్భాఽఽధానక్షణ పరిచయాత్" అన్నారు మేఘసందేశంలో. అప్పటికింకా ప్రజలకుదీనియందు లజ్జాకరత్వం ప్రసక్తించినట్లులేదు; యద్వా ప్రజలకు లజ్జాకరంగావున్నా దానిని కాళిదాసు లెక్కించనే లేదో? కాళిదాసు ప్రజల వ్యవహారానికి వ్యతిరేకంగా వాడిన పదం యింకొకటివుంది. అది "అవిధవే" అనేది; ఆ పదానికి మగడు బ్రతికివున్నదానా? అని అర్థం. యక్షుఁడు తన పెండ్లానికి తన క్షేమ వార్తను పంపుతూ మేఘుఁడిచేత ఆలా పిల్వమని చెప్తూతాఁడు. ఆ పిలుపులో కలిగిన లాభం తనభర్త బ్రతికివున్నట్టు వెంటనే యామెకు తెలియడమే. వాల్మీకికూడ ఆంజనేయులచేత శ్రీరామమూర్తికి సీతామ్మవారి వార్త తెల్పడంలో యీలాటిసొగసే కనపఱిచాడంటూ వ్యాఖ్యాతలు చెపుతారు. "సీతాదృష్టా" అనక "దృష్టాసీతా" అన్నాడఁట! ముందుగా సీతాపదశ్రవణం జరిగేయెడల నష్టావా భ్రష్టావా అని పరిపరివిధాల రాముడు ఆందోళన పడవలసివచ్చునఁట? ఆయీ విశేషాలు వ్యాఖ్యానాలవల్ల తెలియ వస్తాయి. ఆంజనేయుడు కోఁతిగదా యింత తెల్వితేటల కవకాశం లేదనుకోకండి. మహాకవి, నవ వ్యాకరణవేత్త హనుమన్నాటక మంటూ వకటి స్వయంగా శ్రీరామాయణ గాథను పురస్కరించుకొని రచియించివున్నాఁడు. అందులోదే యీ శ్లోకం-

శ్లో. "కస్త్వం వానర! రామరాజభవనే లేఖార్థసంవాహకో
యాతః కుత్ర పురాగత స్సహనుమా న్నిర్దగ్ధ లంకాపురః
బద్ధో రాక్షస సూనునే తికపిభి స్సంతాడిత స్తర్జిత
స్సవ్రీడా త్త పరాభవో వనమృగః కుత్రేతి నజ్ఞాయతే."

యిందులో ఆంజనేయుఁడు తన్నుగూర్చి యెంతో నైచ్యంగా వ్రాసుకొని వున్నాఁడు. అందుచేత యిది అతని కవిత్వమే అని విజ్ఞులంటారు. యిది అంగదరాయబార ఘట్టంలోది. యిది యిలా వుంచుదాం, వెధవ కానిదానా! అని యేపుణ్యస్త్రీనైనా మనం పిలిస్తే బాగుంటుందేమో చూడండి. కాళిదాసు నాఁటికి గర్భాధాన పదంలాగే యీ సంబోధనకూడా హృదయంగమంగావుండే దేమో? అదంతా యిక్కడ చూపవలసివస్తే వ్యాసం చాలా చేదస్తంగా వుంటుంది. ప్రస్తుతం కాళిదాసుగారు "ఓ వెధవ ముండ కానిదానా" అనే అర్థంయిచ్చేమాట అవిధవే అని యక్షుఁడి పెండ్లాన్ని మేఘుఁడిచేత సంబోధింపచేయడం ఆవిడకు భర్తృ క్షేమం తొలుదొల్తనే చెప్పినట్లనడాని కంటూ వ్యాఖ్యాతలు స్వారస్యాన్ని నిర్వచించడం యీ నిర్వచించడమయితే చాలా యుక్తియుక్తంగానే వుంది గాని వాల్మీకి "దృష్టా సీతా" అన్నచోట వున్న సొగసిక్కడ కనపడడం లేదని నాకు తోస్తుంది. యిక్కడ వక చిక్కుంది. యేమిటంటే? "ఓ వెధవముండకానిదానా!" అని కాళిదాసుగారు

సంబోధింపజేసినట్టే మనంకూడా యేగృహస్థురాలినో సంబోధిస్తే యేలా వుంటుందో? పైcగా దానిమీcద మనకు జరిగే మర్యాద యెట్టిదో? ఆలోచించి చూడండి. నిషధయోగ్యుcడుగా వుండే యేమర్యాదస్థుణ్ణేనా మనం "అయోగ్యుcడవు కాకుండా వుండే వో మహానుభావా!" అని సంబోధిస్తే యేలా వుంటుందో? ఆలోచించండీ? అయితే కాళిదాసంతవాcడు ఆలా సంబోధింపచేస్తే, మనమా దాన్ని విమర్శించే వాళ్లమంటే చెప్పే జవాబు లేదు. శంక యుక్తంగా వుందో లేదో సహృదయులు పరిశీలించాలి. కాళిదాసుగారు మఱోచోటకూడా యీలాగే వాడివున్నారు. రఘువంశంలో-

"అపాంసులానాంధురి కీర్తనీయా" అని సుదక్షిణాదేవికి విశేషణం చేశారు. పాంసులా అంటే? కులట. తద్భిన్నురాలు, అపాంసుల. అనగా? లంజకానిది. అంటే? మహాపత్రివ్రత అన్నమాట. అట్టివారలలో అగ్రగణ్యురాలు సుదక్షిణాదేవి అని తాత్పర్యము. మహాపతివ్రత అని చెప్పడానికి ముందు లంజపేరెత్తుకొని ద్రావిడ ప్రాణాయామం చేయడంలో వున్న విశేషమేమిటో నాకు బోధపడలేదు. యెవరేనా విజ్ఞులు తెలిపితే తెలుసుకో తగ్గస్థితిలో వున్నాను. పిడివాదానికి వుపక్రమించే ప్రకృతి నాది కాదని సహృదయులకు నమ్మికవుంటే తెలుపుతారని నావిశ్వాసము. యిది విషయాంతరం. ప్రస్తుతం మనం మాట్లాడుకుంటూ వున్నది గర్భాధానాన్ని గూర్చి. యీపదంలో స్త్రీలకు ముఖ్యంగా లజ్జాకరమైన అర్థం వున్నట్టు యిటీవలివారు భావించి దీనికి పర్యాయపదాలు కొన్ని కల్పించుకోవడం సర్వానుభవసిద్ధమే అయినా కొంచెం వ్యాఖ్యానం చేస్తాను. దానిలో మన దేశంలో వైదికకుటుంబాలల్లో బయలుదేఱిన పదం, బహుశః ఔపాసన అనేదనుకుంటాను. గర్భాధానంరోజున పగలు అగ్నిహోత్రం వుంచి ఆ దంపతులచేత హోమాలు చేయించడం సుప్రసిద్ధం. అందుచేత ఈమాటలో దీనికి సుమారు పది పంద్రెండు గంటలకాలంలో జరగcబోయేదాన్ని వాడితే అంత లజ్జాకరంగా వుండదని ఆలోచించి అలా లాక్షణికపదంతో వాడడం మొదలెట్టారని తోస్తుంది. కాని క్రమంగా ఆపదం కూడా అవయవార్థజ్ఞాన శూన్యంగా లజ్జాకరమైన అర్థాన్నే యివ్వడం మొదలుపెట్టింది. అంతట్లో, ఆ పదాన్ని వదలుకొని "పునస్సంధాన" పదంతో ఆ గర్భాధానాన్ని వాడడం మొదలుపెట్టేరు. ఈ పదం వాడేవారి అభిప్రాయం యేలాటిదో. నేను బాగా నిశ్చయించలేను గాని తోcచింది వ్రాస్తాను. వివాహంలో అగ్నిహోత్రాలు వుంచి సంకల్పం చేయడంలో - "యావజ్జీవం హోష్యామీత్యావయో స్సంకల్పః" అని వుపక్రమించడమేకాని యే వొకరో తప్ప మళ్లా ఆ అగ్నిహోత్రాలవిషయం తలపెట్టినట్టే కనపడదు. కాని గర్భాధానంనాcడు మళ్లా, అగ్నిహోత్రం వుంచి హోమం జరిగిస్తారు. ఆ జరిగించడానికి ముందు చేసే సంకల్పంలో- "విచ్ఛిన్న మగ్నిం పునస్సంధాస్యే" అని సంకల్పం జరుగుతుంది. దానికి అర్థం, వివాహానంతరం అనcగా

శేషహోమంతో పరిసమాప్తి పొందిన అగ్నిహోత్రాన్ని మళ్లా సంధానం చేస్తూన్నాను అని. కనుక ఆ పదంతో అంటే "పునస్సంధాన" పదంతో వ్యవహరించవలసి వచ్చిందను కుంటాను. యీ అర్థాన్ని నేను కొందఱు సంప్రదాయవేత్తలైన పండితులు వున్న సభలో వుపన్యసించి వున్నాను వారు సమ్మతించినట్లే తోచింది. కాని ఆ పండితులకు, శిరోమణి అని కాని "ఉరోమణి" అని కాని బిరుదాలు లేక 'డిగ్రీ'లు వున్నట్టు లేదు. పూర్వపు రకంగా వేద, వేదాంగాలు అభ్యసించి యనేక తరవాయులు శిష్యులకు చెప్పిన మహామహులు. యిప్పుడు ఆ పండితులకు అంతగా గణ్యత కనపడదు. చూడండీ- "అమవసనిసి యన్నమాట" అనే సందర్భంలో యీమధ్య వక శిరోమణిగారు ఆలంకారిక సమయాలెన్నో చూపివున్నారు. పైగా బ్రహ్మదేవుడికి లక్ష్మీగర్భవాసత్వాన్ని కూడా ఆ సందర్భంలో ఆపాదించారు. ముఖ్యంగా నాకు ఆలాటివారి పాండిత్యమంటే భయంవేస్తుంది. వారిని తలపెట్టకపోయినా కలగచేసుకొని యేదో వారు వ్రాయకమానరు. కాబట్టి మంగళార్థంగా వారిని కొంచెం స్మరించి వ్రాసుకొనేది వ్రాసుకోవడమే యుక్తమనుకొని ఆలా స్మరించి ప్రస్తుతాన్ని వుపక్రమిస్తాను. "ఔపాసన" పదంవంటిదే పదమున్నూ కాని కొంచెం శంకకుమాత్రం అవకాశం లేకపోలేదు. పెండ్లికొడుకు గర్భాధానకాలం వఱకున్నూ జీవత్పితృకుడుగా వుంటే యీలోఁగా అగ్నిహోత్రంతో ప్రసక్తివుండదుగాని అన్యథా అయే పద్ధతిని తండ్రి తద్దినం లేక తల్లి తద్దినం తటస్థించినప్పుడు సమంత్రకంగా పెట్టేఎడల అగ్నిహోత్రంతో సంబంధంతప్పదు. అప్పుడు ఈ శుభకార్యానికి వాడే "పునస్సంధాని" పదం ఆబ్దికానిక్కూడా వాడవలసివస్తుందేమో? అని శంకయితే ఇప్పుడు నాకే కలిగిందిగాని లోకంలో గర్భాధానానికే కాని ఆబ్దికానికి అట్టివాడుక లేకపోవడంచేత అదిప్రస్తుతానికి బాధకంగాదు. అన్నిటికంటే వ్యవహారం ప్రబలమని ముందు తేలుతుంది. కాబట్టి విస్తరించేదిలేదు. దీని కోసం యితరోదాహరణాలు చూపవలసివస్తే అమరమూ, దాని వ్యాఖ్యానమూ పూర్తిగా వుదాహరించవలసివస్తుంది కనక స్పృశించి వొదులుతూ వున్నాను. యిప్పటికి, గర్భాధానం, ఔపాసనగానున్నూ పునస్సంధానంగానున్నూ కొన్నాళ్లకు లాక్షణికపదంగా మాఱినట్లయింది. గద్వాల ప్రాంతంలో యీ పదాలతో యీ మహోత్సవాన్ని వాడుతూవున్నట్లులేదు. వారు "ప్రయోజనం" అనేమాటతో వాడుతూ వున్నారు. మేము శ్రీ ఆత్మకూరి రాజుగారికి కృతిగా ఆంధ్రీకరించిన శ్రీనివాసవిలాసంలో మంగళ పద్యంలో-

"తన పునస్సంధానకాలమ్మునన్"

అని వాడేటప్పటికి ఆ సంస్థానపండితులు, పునస్సంధానమంటే యేమిటి? అనడానికి ఆరంభించారు. మేము "యిదేమిటండీ యీమాటకే అర్థం తెలియదా?" అని

ఆశ్చర్యపోయాము. అప్పుడు "మాదేశంలో యీ పదంతో దీన్ని వాడడంలే"దని వారు చెప్పేటప్పటికి యేదేశంలో వుండే రాజుకు మేం కృతిపెడుతూన్నామో, ఆ దేశస్థులకు తెలిసేపదం- "ప్రయోజనం" అనేదాన్ని వుపయోగించడమే యుక్తంగా వున్నప్పటికీ తీరా మా దేశంలోనికి వచ్చాక యెవరేనా- "యీ ప్రయోజన మేమిటి తిథిప్రయోజనమా?" అని ఆక్షేపిస్తారేమో? అని అమంగళార్థవ్యంజకమైన ఆ ప్రయోజనపదాన్ని కూడా వదలుకొని మఱోమోస్తరుగా సద్దుకున్నాము. ప్రయోజనంతో దీన్ని వాడేవారి తాత్పర్యం వివాహానికి గర్భాధానం ప్రయోజనం కనక అలా గోప్యంగా వాడుకుంటూ వున్నారని తేలుతుంది. యేమైనా మనకంటె కొంత అనాగరికమైన దేశమైనప్పటికీ గర్భాధానపదం ఆదేశంలోకూడా క్రమంగా మార్పునే చెందిందిగాని నిలిచివుండలేదనేది యిక్కడ ముఖ్యంగా గమనించవలసిన అంశం. ఆయీ మాటలన్నీ రజస్వలా త్పూర్వం జరిగే వివాహాలను పురస్కరించుకొని పుట్టినవే. రజస్వలాత్పూర్వమందు జరిగే వివాహాలవారిలో నాగరిక ముఖ్యులుగా వుండే వెలమ జమీందారులు వగయిరాలు యీ శుభకార్యాన్ని "నగరుఁబెండ్లి" అనేపదంతో వ్యవహరిస్తూ వున్నారు. ఆయీ సందర్భాన్ని బ్రాహ్మణేతరులు అంతప్రధానంగా పరిగణిస్తూవున్నట్లే కనపడదు; అంటే, పీఁటల మీఁద దంపతులను కూర్చోపెట్టడం వగయిరా తంతు జరపడం లేదన్న మాట. షోడశకర్మలలోను యీ గర్భాధానం ప్రథమకర్మగా పరిగణింపఁ బడవలసిందే. అయినను పూర్వకాలంలో "నాన్‌బ్రామిన్సు" అంతగా లెక్కించినట్లు లేదు. కాని ప్రస్తుతం కేవల బ్రాహ్మణులు యే వొక్కరో తప్ప తక్కిన యావన్మందిన్నీ సంధ్యా వందనానికి సమేతు స్వస్తిచెప్పడంచేత ధర్మశాస్త్రప్రకారం వారికి శూద్రత్వం వచ్చితీరుతూవుంది కనక వారికిన్నీ అనఁగా కర్మలోపశూద్రులనఁబడే ఆ నామమాత్ర బ్రాహ్మలకిన్నీ జన్మశూద్రులకున్నూ భేదంలేదంటూ యీ మధ్య సద్బ్రాహ్మణ పురోహితసభలో నెవరో ముచ్చటించిన మాటలను నేను మిక్కిలిగా అభినందిస్తూ వున్నాను. నేఁటి బ్రాహ్మల యెడల ఆ సద్బ్రాహ్మణులు ఆపాదించినదోషము సర్వవిధాలా పడుతూ వున్నది. కాఁబట్టి నిజమైన హృదయంకలవా రెవ్వరున్నూ నేఁటివారు పైయాక్షేపణకు అభిమాన పెట్టుకోఁగూడదని తలుస్తాను. "యీ వక్కటికేనా మీరు అభినందనాన్ని తెలిపేది" అని యెవరేనా శంకిస్తారేమో? ఆ సద్బ్రాహ్మణులు నా అభినందనాన్ని అభిలషించరు కనక ఆ విషయాన్ని విస్తరించనక్కఱలేదు. వారిప్రచారం వకవిధంగా నేఁటి బ్రాహ్మణ నామధారులకు వుపకరిస్తుందేమో అనుకుంటే కాలదౌర్భాగ్యం అందుకుకూడా వొప్పు కుంటుందని తోఁచదు. యిది విషయాంతరం. యిప్పటికి గర్భాధానం యెన్నో అవతారా లెత్తినట్లయింది. కొన్నిటికి వివరించడం అయింది. దీనికే రజస్వలాత్పూర్వం జరగవలసివస్తే నిషేకం అంటూకూడా యింకో మాట వాడుతూవున్నారు- అనే సందర్భం యిదివఱకే

సూచించాను. నాన్‌బ్రామిన్సులో కొందఱు నాగరికులు యీమాటలేమీ వాడక "మా అల్లుణ్ణి తీసుకువస్తా"మని మాత్రమే వాడతారంటూ బందరులో చెప్పఁగా విన్నాను. ఎంత శాస్త్రీయమైనదయినా ఎంత ఆవశ్యకమయినదయినా యీకార్యం అన్ని వర్ణాలవారూ అంతో యింతో లజ్జాకరంగానే భావిస్తూవున్నారు. రాజులలో యింకో ఆచారం వుంది. అదేమిటంటే? భార్య పుట్టింట వున్నప్పుడు ముసలితనంలోనేనాసరే అత్తవారింటికి అల్లుఁడు వెడితే చాలాతప్పు. అందుచేత వెళ్లనేవెళ్లఁడు. వక్క గర్భాధానాన్ని గూర్చే యేకొంచెమో వ్రాశాను. కాని దీనిలాగే అనేకావతారాలెత్తిన వెన్నో వున్నాయి, అవి లజ్జాప్రయుక్తమైన మార్పులుకావు. వాట్లనిగూర్చి మఱోమాటు ప్రసంగించుకొందాం. గర్భాధానం యెత్తిన అవతారాలలోనే "శోభనం" అనేదికూడా చేరుతుంది. సర్వశుభకార్యాలకున్నూ పర్యాయంగా వాడుకోవలసిన "శోభన" పదాన్ని యెన్నాళ్లనుంచి వాడుతూ వున్నారో పెద్దలు విడమరిచి చెప్పలేముకాని, ఓల్డు గోదావరి, విశాఖపట్నం, గంజాం జిల్లాలలో సర్వత్రా వ్యవహరిస్తూ వున్నారనిమాత్రం చెప్పనక్కఱలేదు. ఈ అంశం ప్రతివ్యక్తిన్నీ యెఱిగిన విషయమే. కొందఱు విమర్శకులు యీపదముతో గర్భాధానాన్ని వాడడానికిన్నీ అనుమోదించరు కాని వారి మతంలో 'దామోదర' పదాన్ని "దరిద్ర" పరంగా వాడిన కవుల వాడకం కూడా సమన్వయించదు. అలా వాడిన ప్రయోగాలు రెండు మాత్రం జ్ఞప్తిలో వున్నవి చూపుతాను.

(1) "ఆలుబిడ్డలు తెచ్చు ప్రఖ్యాతిగాని మొదలనుండియు నీవు దామోదరుఁడవె! చిత్రచిత్రప్రభావ!"

(2) "అవక్రవిక్రమ విరాజద్రాజదోర్దండమండిత సామ్రాజ్యవధూటి చేరఁజనునే? నిర్భాగ్య దామోదరున్,"

యింకా వున్నాయి. యెంత పరీక్షించినా దామోదరపదానికి దరిద్ర పరమైన అవయవార్థం కనపడదు. కాని యేకారణంచేతో యీ అర్థంలో లోకంలో వాడుక కలిగింది. దాన్ని కవులు గ్రంథాల్లోకి యెక్కించారు. సంస్కృత భాషాకవులకన్న యీలాటి విషయాలకు దేశభాషాకవులు మిక్కిలిగా స్వతంత్రిస్తారు. కవిత్వమనేది తన హృదయాన్ని యితరులకు విప్పి చెప్పే వుద్దేశంతో పుడుతుంది. అలా చెప్పడానికి నిఘంటువులు వగయిరాల వల్ల తెలిసేపదాలకన్న వ్యవహారంలో వుండే అగ్రామ్యపదాలు యెక్కువగా వుపకరిస్తాయి. గ్రామ్యపదాలున్నూ వుపకరిస్తాయి కాని అవి గ్రామ్యదోషాన్ని ఆపాదిస్తవి. యీ సందర్భం దేశభాషాకవులకు మాత్రమే కాదు; సంస్కృత కవులకున్నూ. కనుకనే శాబ్దబోధోపకరణాలలో - 'వ్యవహారతశ్చ' అని చేర్చివున్నారు. దాన్నిబట్టే మేము మా దేవీభాగవత పీఠికలో- "కేవల గ్రామ్యపదముల నేవగించి, జనులు వాడెడి పదములు సమ్మతములు." అని

వ్రాయడము తటస్థించింది. శాబ్దబోధోపకరణాలలో లాక్షణికులు వుదాహరించిన సామగ్రిలో వ్యవహారమే అగ్రస్థానాన్ని వహిస్తుందంటే వొప్పనివారుండరు. యిలా వ్రాయవలసివస్తే యెన్నో పదాలకు వ్రాయవలసి వుంటుంది. దీన్ని వుపలక్షణంగా పెట్టుకొని తక్కినవాటిని గ్రహిస్తారని ప్రస్తుతం దీనితో ముగిస్తూ యీవక్కమాటా వ్రాస్తాను. గర్భాధానం యెత్తిన అవతారాలు యెన్నో వున్నా అందులో మిక్కిలీ మృదువైనదిన్నీ, ఆంధ్రదేశంలో చాలా వాడుకలో వున్న దిన్నీ శోభనమనే అవతారమే కనక దాన్ని వదలుకోకూడ దని భావికవులను హెచ్చరిస్తున్నాను. దీనికి మహాకవి ప్రయోగంకూడా ఉందని శ్రీగిడుగు వారనఁగా విన్నాను. కాని దీనికి ప్రయోగంతో కూడా అవసరమే లేదని నా తాత్పర్యం. కృష్ణా డిస్ట్రిక్టులో కార్యమనికూడా అనడం కలదు. బహుశః యీ కార్యం గుంటూరు డిస్ట్రిక్టులోనున్నూ వ్యవహరించేదే కావచ్చును! యింకా దీన్ని గూర్చి చర్చిస్తే మఱికొన్ని యిలాటివే దొరికితే దొరుకుతాయేమో కాని వీటికన్నిటికిన్నీ శిరోమణి శోభనపదమే. యీ శోభనపదము సర్వశుభకార్యములకున్నూ వాచకమే అయిననూ ప్రస్తుతాన్ని విశేషించి చెప్పడం యోగరూఢిచేతనని విజ్ఞులకు తెలప నక్కఱలేదు. పంకజపదము అవయవార్థమును పుచ్చుకొనే పక్షంలో నత్తగుల్లకుకూడా వాచకం కావలసి వున్ననూ రూఢిని పురస్కరించుకొని పద్మమాత్రమందు శక్తమయినట్లే అని వ్రాయనక్కరలేదు గదా? వ్యాసం విస్తరిస్తూవుంది. గర్భాధానపదం మోటుతనంగావుందని తోఁచకపోతే దాన్నే వాడుకోండి, తోస్తే "శోభన"పదాన్నే వాడుకోండి. అసలు నిఘంటులలో భుక్తికి, నిద్రకు కొన్ని పేళ్లున్నాయి. గాని దీనికిమాత్రం లేవు. యభనం వగయిరాలు వున్నాయంటారా? అవి బూతులలో చేరతాయి. అందుచేత శోభనమే ఆధారం. దీన్ని వదలుకోవడమనేది నేల విడిచిన సాముచంటిదని మనవిజేస్తూ ముగిస్తున్నాను.



# మద్యనిషేధం అవసరమే!

మద్యపానదోషాన్ని గుఱించి కొంత వ్రాస్తాను. యెందుకంటే కొన్నిసంవత్సరాల నుంచి ప్రతీ పత్రికలోనున్నూ దీన్ని మానిపించే ప్రయత్నాలు జరుగుతూ వున్నట్టు తఱుచు కనపడుతూవుంది. యిది చాలా సంతోషించ తగ్గవిషయం. మన పూర్వులు సప్తవ్యసనాలంటూ– "వెలఁది జూదంబు పానంబు వేఁట" ఇత్యాదిగా పేర్కొన్నవాటిలో పానాన్ని మూఁడోదాన్నిగా పరిగణించారు. కాని మహమ్మదీయులేమో అన్ని దుర్వ్యసనాలనున్నూ యిదే ప్రోత్సహిస్తుందని చెప్పి దీన్ని మొదటి దాన్నిగా పరిగణించి పూర్తిగా నిషేధించి వున్నట్టు ఆమతంలో వేత్త లైనవారివల్ల విని వున్నాను. పైఁగా యీ కథకూడా వారివల్లనే యెప్పుడో విన్నాను–వొకానొక విజ్ఞాని మోక్షం పొందడానికి బయలుదేఱినట్టున్నూ, తీరా ద్వారాన్ని సమీపించాక అక్కడ నాల్గుతోవలు వేఱు వేఱుగా వున్నట్టున్నూ, అందులో వకచోట సర్వాంగసుందరి వొకానొక యౌవనవతి సర్వాభరణ భూషితురాలయి కూర్చుని యితణ్ణి చూచి లేచి అడ్డమయి "యెక్కడికి వెడతా" వని అడిగినట్టున్నూ, యీ ముముక్షువు "నేను మోక్షానికి వెడుతున్నా"నని చెప్పినట్టున్నూ, దానిమీద ఆ సుందరి–"సరే, వెడుదువుగాని నాతో యీరోజు మాత్రం శృంగారాన్ని అనుభవించితేనే తప్ప యీ మార్గాన్ని వెళ్లడానికి అవకాశంలే"దని చెప్పినట్టున్నూ, దానితో మనమోక్షగామి– "యీ పని చాలా తప్పుకాబట్టి నేనిందు కంగీకరించేది లేదు, మఱో తోవను వెడతా" నని మళ్లీ మఱో తోవను పోతూవుండఁగా ఆ తోవలో వొకఁడు వొక మేకపోతునుచూపి– "యీ తోవను వెళ్లేటట్టయితే దీన్ని చంపి యీ మాంసాన్ని భక్షించి మఱీ వెళ్లవలసిం"దని అడ్డగించినట్టున్నూ, దానిమీఁద మన ముముక్షువు– "యిది జీవహింసతో చేరివుంది, కాఁబట్టి ఈపని నేను చేసేదిలేదు, యింకోతోవను వెడతా"నని మళ్లీ మఱో తోవనుపోతూ వుండఁగా అక్కడ వొకఁడు జూదానికి సంబంధించిన పరికరాలన్నీ చూపించి "కొంచెంసేపు నాతో జూదమాడి వెడితే వెళ్లవలసిందే కాని లేనిపక్షాన్ని యీ మార్గాన్ని వెళ్లడానికి వల్లఁగా"దని అభ్యంతరం చెప్పేటప్పటికి మన నిషధయోగ్యుఁడు– "జూదం ఆడడం చాలా తప్పుపని, యీ దుష్కార్యం చేయడానికి నాకు బొత్తిగా యిష్టం లే" దని చెప్పి మఱో త్రోవను పోవడానికి మళ్లి వెడుతూవుండఁగా ఆ త్రోవలో అలంకరించిన కల్లుకుండలతో వక మనిషి కూర్చుని – "అయ్యా! వెడుదువుగాని, ఈలా రా కూర్చో

చాలా పరిశ్రమపడి యెంతో దూరాన్నుంచి వచ్చావు. కొంచెం యీ మద్యాన్ని దాహం పుచ్చుకుని మరీ వెడుదువుగాని" అంటూ ఆతిథ్యానికి ఆహ్వానించేటప్పటికి మనవిరాగి- "అబ్బే! యీ పని పంచమహాపాతకాలలో హిందువులు చేర్చి నిషేధించి వున్నారు, మహమ్మదీయులుకూడా దీన్ని చాలా తప్పుపనిగానే చెప్పి దూషించారు. కాఁబట్టి యీపని నేను చేసేదిలే" దనేటప్పటికి – "ఆపద్ధతిని యీ మార్గాన్ని వెళ్లడానికి అవకాశం లే" దని ఆ పురుషుడు "ఖణేరావు" చెప్పడంతొటే మన పరమార్థవేది అనుకున్నాఁడు గదా! యేమనంటే? "వున్న మార్గాలేమో నాలుగే కనపడతాయి. నాలుగింటిలోనూ నాలుగు ప్రతిబంధకాలూ సిద్ధమయినాయి. వీట్లల్లో స్థూలసూక్ష్మాలు విచారిస్తే కొంత వీలుగావున్నది కల్లుపుచ్చుకోవడమే. యేమంటే? యిందులో హింసాదోషంలేదు. యిది వొకచెట్టునుంచి పుట్టేది. పూర్వులయితే దీన్ని కూడా నిషేధించారుగాని నిషేధించినా దీన్ని అంగీకరించడంలో గుడ్డిలోమెల్లగా వుండడంచేత అట్టేతప్పుగాతోఁచదు. అంగీకరించని పక్షాన్ని మోక్షానికి వెళ్లడానికి యింకోతోవ కనపడడమే లేదుగదా!" అని చర్చించి యెట్టకేలకు మనస్సు సమాధానపఱచుకొని ఆమద్యాన్ని సేవించడంతోటట్టుగానే అంతకుముందు వుండే విజ్ఞానం యెక్కడికో పటాపంచలై పాఱిపోయింది. దానితో వెనకచూచిన మేఁకపోతును చంపి మాంసభక్షణ చేయవలసివచ్చింది. దానితో "తాటితో దబ్బనం"గా ఆ సర్వాంగసుందరి అవసరం అయింది. పిమ్మట ఆవిడతో జూదం ఆడడంకూడా అవసరమయింది. తుట్టతుదకి "నీవిమోక్షోహిమోక్షః" అనేవాక్యానికి ప్రథమోదాహరణంగా మన ముముక్షువు పరిణమించాఁడు. మహమ్మదీయులలో ప్రాజ్ఞులవల్ల విన్న యీ యితిహాసం వల్ల తేలిన సారాంశం – అన్ని దుర్వ్యసనాలకున్నూ మూలకందం సురాపానమే అని స్పష్టమయింది. కాఁబట్టి పానం వర్జించడం మహమ్మదీయులక్కూడా అంగీకారమే. యూరోపియన్‌లుకూడా దీన్ని వర్జించేవిషయంలో అద్భుతగలరు కాని వారిదేశంలోవుండే శీతోష్ణస్థితినిబట్టి మితంగా దీన్ని అంగీకరించవలసిందంటారు. కాని కొలఁదికాలంకిందట అమెరికాలోకూడా యీ మద్యపానాన్ని పూర్తిగా నిషేధించడానికి ఆరంభించారు. కృతకృత్యత్వాన్ని కూడా పొందడమైతే జరిగిందఁట గాని మళ్లా ప్రారంభించినట్టు తెలుస్తూవుంది. ఆ ఖండంవారికిన్నీ మనకిన్నీ వుండే భేదం యేమిటంటే? మన ఆర్యులు యెంతో ఆలోచించి కాని యే విధినిన్నీ యే నిషేధాన్నిన్నీ అమల్లో పెట్టరు. పెట్టితే అది యుగాలకొలఁది నిల్చిపోవలసిందే కాని మళ్లా వెంటనే 'నాబొడ్డుకుతూ' అంటూ మాఱడం అంటూవుండదు. మనవారు విధించే కార్యాలకున్నూ పుణ్యానికిన్నీ లంకిసా ఆలాగేవుంటుంది. నిషేధానికిన్నీ పాపానికిన్నీ లంకిసా వుండి తీరుతుంది. యీ విషయంలో మహమ్మదీయులుకూడా మన మార్గాన్నే చాలా వఱకు అనుకరిస్తారు, కాని మనం పాపమనుకొనే కార్యాలు చాలా వఱకు వారికి

పాపంగా కనపడవు- అందుచేత వాటిని వారు ఆచరిస్తూనే వుంటారనుకోవాలి. యెక్కువ ప్రాజ్ఞతకలవాళ్లతో ప్రసంగిస్తేమాత్రం మతవిషయంలో వుండే విశేషాలు కొన్ని కర్మ కాండబాపతు తప్ప యితరాచారాలలో మనకున్నూ వారికిన్నీ అంతగా భిన్నాభిప్రాయాలు కనపడవు-దయా సత్యశౌచాలు మూఁడింటిలోను మూఁడవదానిలో వారికిన్నీ ఆర్యులకున్నూ చాలా భేదం కనపడుతుంది - ప్రస్తుతం మనక్కావలసింది పానాన్ని గూర్చిన నిషేధం - నేను వుదాహరించిన యితిహాసాన్ని బట్టిచూస్తే మహమ్మదీయులు పానాన్ని పూర్తిగా నిషేధించేవారే - మన ఆర్యులలో యెప్పుడో యిక్ష్వాకుల కాలంలో ఈపానం బ్రాహ్మణులు కూడా మంచి నీళ్లతో పాటు ఆమోదించినట్లు కనపడుతుంది. కాని దీనివల్ల వచ్చే నష్టిని స్వానుభవంచేత కనిపెట్టి శుక్రాచార్యులు నిషేధించినట్టున్నూ భారతంవల్ల స్పష్టమవుతూ వుంది-

క. "భూసురు లాదిగఁగల జను లీసుర సేవించిరేని యిది మొదలుగఁబా
పాసక్తిఁ బతితు లగుదురు చేసితి మర్యాద దీనిఁజేకొనుఁడు బుధుల్"

యిందులో వున్న "ఇది మొదలుగ" అనే పదంవల్ల అంతకు ముందు మద్యపానం మహాపాతకాల్లో చేరలే దనుకొందామా? అయితే మహాపాతకాలు నాలుగే కావలసి వుంటుంది. కాఁబట్టి ఆపదానికి అంత ప్రాముఖ్యం యివ్వడానికి వల్లపడదు. యీ కథలన్నీ అర్థవాదాలు. మొత్తం మద్యపానం నిషిద్ధ మనియ్యేవే మనం తెలుసుకోవలసింది. కాని రాజర్షు లనిపించుకొనే కుటుంబాలల్లో జన్మించినవారుకూడా శృంగారరసానుభవానికి హంగుగా దీన్ని ఆమోదించినట్లు మహాకవుల గ్రంథపోకడలు విశదపఱుస్తూవున్నాయి. కాని సంసారు లనిపించుకొనే సంపన్న గృహస్థులు దీన్ని ఆమోదించినట్టు కనపడదు. సంపన్న గృహస్థుల శృంగార రసానుభవానికిన్ని తదితరుల శృంగారానుభవానికిన్ని రతిరహస్యాదిగ్రంథాలు యెంతో భేదం కనపరచివున్నాయి- "పురుషభావవషట్కృతి వర్జితం వనితయా నిజయా సు కృ తీ కృ తీ, మణితహీనరతోత్సవమాచరేత్" వగయిరా శ్లోకాలు చూడఁదగు- మద్యపానం చేయడం తప్పనే బ్రాహ్మణజాతి మనదేశంలో దానిస్థానంలో మఱోవస్తువును సేవిస్తూ వున్నట్టు అంతగా కనపడదు, గాని ఉత్తరదేశంలో భంగుపానం చేయడం సర్వసాధారణంగా కనపడుతుంది. భంగు పుచ్చుకొనేవారికేనా చిలుములో గంజాయి వుంచి పొగఁ బుచ్చుకోవడం చాలా దూష్యంగా ఆదేశంలో కనపడుతుంది. దీని స్థానంలో నల్లమందు కొన్ని దేశాల్లో వాడతారని వినడమైతే వుంది కాని మనదేశంలో నల్లమందు వాడడం మాత్రం యేదో వ్యాధిని పురస్కరించుకొనియ్యేవే కాని వినోదార్థం తీరికూర్చుని వాడడం కనపడదు. సంపన్న గృహస్థులకు తప్ప యితరులకు అందులో

ముఖ్యంగా నిమ్నజాతులకు రెండే మందులు వున్నట్టు కనపడతాయి. అందులో వకటి నల్లమందు, రెండోది తెల్లమందు. తెల్లమందంటే? రసకర్పూరం. నిమ్నజాతుల్లో చాలామంది రెండేసియేళ్లకూ మూఁడేసి యేళ్లకూ యేరోగము లేకుండానే రసకర్పూరం వేసుకుంటూ వుండడం యీ దేశంలో చాలామంది యెఱిఁగిన విషయమే. వాళ్ల ఆయుర్దాయాన్ని కాపాడడం యీ తెల్లమందుమీఁదే ఆధారపడివుందని ఖండితంగా చెప్పవచ్చును. యిదంటూ లేనిపద్ధతిని యిప్పటికాలంలో వైద్యులు చేసేబిల్లు యిచ్చుకోతగ్గవాళ్లు వాళ్లల్లో వొకళ్లున్నూ వుండరని వేఱే చెప్పనక్కఱలేదు. వాళ్లు కూలీ నాలీ చేసి యావజ్జన్మమూ సంపాదించిన సంపాదన వొక్కసారి జ్వరమో గిరమో వచ్చినప్పుడు డాక్టరుచేసే బిల్లుకుఁగాని విజిటింగుచార్జీకిఁగాని ఎన్నో వంతుకున్నూ రానేరాదు. అదిన్నీ కాక సంపన్న గృహస్థులమీఁదకి వచ్చినంత త్వరగా చొరవచేసి వాళ్లమీఁదకి ఆయావ్యాధులు తఱుచు రానేరావు - దానిక్కారణం వాళ్లు తప్పనివిధిగా పొట్టకోసంచేసే శరీరపరిశ్రమమే అని అందఱూ యెఱిఁగిందే. యెప్పుడేనా అనారోగ్యం కలిగితే తెల్లమందే వాళ్ల కాధారం. కొన్నింటికో? నల్లమందు. యీ రెంటితోటిన్నీ నూటికి తొంభై మంది జీవిస్తూవున్నారు. యీనల్లమందు కొన్ని సామాన్య క్షత్రియకుటుంబాలవారు తగిన హేతువు లేకుండానే వుగ్గుబాలతోపాటు పిల్లలకుకూడా తమతోపాటు వాడుకచేయడం క్వాచిత్కంగా కనపడుతుంది. యీ కారణంచేతనే "భోజనం చేశారా?" అని అడగడానికి బదులు వారిలో - "నల్లమందు వేసుకొన్నారా?" అని అడగడం ఆచారమయింది - బ్రాహ్మణులలో 'దేవతార్చన అయిందా - శివపూజ అయిందా?' అని భోజనానికే పర్యాయపదంగా వాడడం యిదివఱలో వుండేది. క్రమంగా కాలదౌర్భాగ్యంవల్ల ఆ ప్రశ్నలకు అవకాశం చాలా వఱకు నశించింది. యిది విషయాంతరం. మొత్తం, యే చైనా దేశంలోనో తీరి కూర్చుని నల్లమందు బెత్తికలకు బెత్తికలే తెలకపిండి అచ్చులమాదిరిగా తినడాన్ని గూర్చి నేనుచెప్పలేనుగాని మనదేశంలో మాత్రం దీనిని వాడేవారు వ్యాధిగ్రస్తులే అని ధ్రువంగా చెప్పవచ్చును - యీ మద్యపాన నిషేధంతోపాటు నల్లమందునుకూడా నిషేధించేయెడల యెందఱో ముసలివాళ్లు మిక్కిలి చిక్కులో పడతారు - యీ నల్లమందు ఆనాఁటికానాఁడు ధర పెరిఁగిపోతూ వుండడంచేత రోగగ్రస్తులుగా వుండే బీదలు ఇప్పుడే మిక్కిలి చిక్కుపడుతూవున్నారు - దీన్ని యిజారాపాడేవాళ్లు వొక్కొక్కచోట మఱీ ధర హెచ్చించి బాధిస్తూవున్నారు. యీనిషేధం నల్లమందు క్కూడా వస్తే వైద్యులకుతప్ప యితరులకు యిది దొరకడం కష్టసాధ్యమవుతుంది కాఁబోలునని కొంచెం నల్లమందుతో అవసరమున్న నేను భయపడుతూ వున్నాను. పత్రికల్లో దీన్ని కూడా నిషేధించినట్టే కనపడింది. గాంధీగారు ద్వంద్వాతీతులు. యెంతటి ద్వంద్వాతీతుఁడున్నూ కాకపోతే మోఁకాలు దిగని

అంగోస్త్రంతోటిన్నీ అలాటిదే పైమీఁదితుండుగుడ్డతోటిన్నీ లండనులో అందులోనున్నూ వార్ధక్యంలో కాలక్షేపం చేయడమంటే మజాకాకాదు. ఆయన మన పురాణాల్లో పుట్టలు వగైరాలలోవుండి తపస్సుచేసిన ఏఋషులకూ తీసిపోయే వ్యక్తికాదు. ఆయన సంకల్పం లోకకల్యాణదాయకం అని చెప్పక తప్పదు. కాని కొంతకాలందాఁకానేనా నల్లమందుమట్టుకు దొరకడం బాలవృద్ధాతురులకు అవసరం. సరే తాలూకా ఆఫీసులలో కాఁబోలును దొరుకుతుందని వ్రాశారు. కొందఱయితే అక్కడికివెళ్లి తెచ్చుకోఁగలరు. గాని కొందఱందుకున్నూ సామర్థ్యంలేనివాళ్లున్నారు. ఆ ఆఫీసుకు పూఁట బత్యాలు కట్టుకుని వెళ్లలేరు. సరికాదా. ఏకంగా తులమూ అఱతులమూ కొనుక్కోవడానికి త్రాణలేనివాళ్లే చాలామంది. కాంగ్రెస్సు మంత్రులు ఆలాటిదీనులను ప్రత్యేకించి వక్కకంటితో చూడాలి. వాళ్లు మత్తుకోసం నల్లమందు అభ్యసించిన తెగలోవాళ్లు కారని యేప్రమాణంపడితే ఆ ప్రమాణంచేసిచెప్పవచ్చును. ఆలాటివాళ్లకు వుపకారంనిమిత్తం యీ మీఁద నల్లమందు వెల చాలాసులభం అయేటట్టుకూడా చేస్తే యెందఱో దీనులు ఆశీర్వదిస్తారు. అయితే కొందఱు “నల్లమందులాగే బ్రాందిన్నీ వ్యాధినివారకమే, అందుకోసమే మేమున్నూ అభ్యసించా”మనే వారున్నూవుంటారు. కాని అది నిజమా? కాదా? అని విచారణచేస్తే తేలకపోదు. మద్యపానం శుక్రునికాలన్నుంచిన్నీ నిషేధింపఁ బడుతూనేవుంది కాని నశించినట్టు మాత్రం లేదు. పయిఁగా వృద్ధికూడా పొందిందేమో? జారత్వచోరత్వాదులకన్న దీనికి యెక్కువ గౌరవం మనవారు యివ్వరు. యూరపుఖండ వాసులు మితిమీఱితే పానాన్ని మనతోపాటు చూస్తారే కాని మితిలోవుంటే దానిజోలికి పోరు. పూర్వకాలంలో నల్లమందుజోలికి ప్రభుత్వం వెళ్లినట్లాధారాలు కనపడవు. దాన్ని వ్యాధిగ్రస్తులు తప్ప యితరులు వాడినట్టు గ్రంథ దృష్టాంతాలున్నూ కనపడవు. వ్యాధిగ్రస్తుల విషయంలో మత్తు పదార్థాలకేకాదు; యే పదార్థాలకున్నూ విధినిషేధాలున్నట్టు యేమతంలోనూ కనపడదు. యింకా కొందఱు నిష్ఠాపరులు మన ఆర్యులలోనే వుల్లి వగయిరా నిషిద్ధవస్తువుల భక్షణానికి ప్రాణాపాయ సమయంలోకూడా సందేహించి మానుకున్నవారు కనపడతారు. యీ మత్తుపదార్థాలనుండి తప్పించడమనేమిషతో ప్రభుత్వంవారు ద్రవ్యార్జనచేసినట్టు పూర్వం కనపడదు. అందుకు ఆరంభించింది మహమ్మదీయ ప్రభుత్వం అని తోస్తుంది, “అబ్కారీ” అనేమాట వల్ల యిది తెలుస్తూవుంది. కాని ఆ ప్రభుత్వం నల్లమందు, గంజాయి వగయిరాలకు విశేషించి పన్ను విధించినట్టు కనపడదు. నా చిన్నతనంలోకూడా వీట్లకు పన్ను లేనట్టే యిప్పుడుకూడా మన్యంలో వుండేవాళ్లకు కాఁబోలును యీ పన్నులేదని చెప్పుకుంటారు. పోనీ యీ పదార్థాలు మత్తుకలిగిస్తాయనే కారణంచేత పన్నువేశారనుకుంటే? ఉప్పు చేసుకున్న పాపమేమిటి? బాగా ఆలోచించిచూస్తే ప్రతిమనిషిన్నీ అంతో

యింతో గవర్నమెంటుకు సహాయపడడం ఆవశ్యకం కనక ఈ ఉప్పుపన్ను ద్వారా అట్టి సహాయాన్ని గవర్నమెంటు పొందుతూ వుందనుకోవాలి. పూర్వపురాజులకు ఋషులు కూడా పన్ను చెల్లించినట్టు "తాన్యుంఛ షష్ఠాంకితసైకతాని" అనే కాళిదాసుగారి శ్లోకపాదంవల్ల అవగతమవుతుంది. ఔషధంగా యీ దేశంలో "బాలవృద్ధాతురులు" వాడుకొనే నల్లమందు నానాఁటికి మతీ హెచ్చుధరలో వుండడమనేది సాధుబాధగా పరిగణించవలసిందే కనక మన కాంగ్రెస్సు మంత్రులవల్ల యేమేనా వుపకారం జరిగితే బాగుండును - యేమందుకూ లొంగనికొన్ని బండవ్యాధులు దీనికి లొంగి కాలక్షేపం జరగడానికి పెద్దపెద్ద డాక్టర్లే వప్పుకుంటారు. యెవరిదాఁకానో అక్కఱలేదు పెద్దడాక్టర్లలో వొక్కరుగా పరిగణించతగ్గ వారున్నూ కాంగ్రెస్సు ప్రముఖులలో అగ్రగణ్యులలో వొకరున్నూ అయిన మన భోగరాజుగారే నల్లమందు మాహాత్మ్యానికి అంగీకరిస్తారు- యే చీనావాళ్లో దీనిని తీరికూర్చుని అభ్యసిస్తే అభ్యసిస్తురుగాక. మనదేశస్థులుమాత్రం అలా అభ్యసించి వుండరనియ్యేవే నానమ్మకం. అందుచేతే యింతగావ్రాయడం. అయితే మద్యం దొరకని పద్ధతిని ఆబాపతు జనమంతా యీ మీఁద దీనికి యెగఁబడతారేమో? అనేదిన్నీ విచారణీయమే యెగఁదీస్తే బ్రహ్మహత్య దిగఁ దీస్తే గోహత్యగా, కనపడుతూవుంది. అయినా మొట్టమొదట యీ దీనుల నిమిత్తం దీన్ని సులభసాధ్యంచేసి పిమ్మట చిక్కువస్తే మార్గాంతరం తొక్కడం యుక్తమేమో? రోగులకుఁగాని యిది యివ్వబడ దనేయెడల సర్టిఫికెట్టు తెచ్చుకోవలసివస్తుంది. అది ద్రవ్యైకసాధ్యం. దానితో ధనవంతులందఱూ సర్టిఫికెట్టు ద్వారా రోగులే అయి తంజావూరు సోమరి సత్రాన్ని జ్ఞప్తికి తెస్తారు. వుప్పుంటే గంజిలేకా, గంజుంటే వుప్పులేక తిప్పలు పడే బీదలు సర్టిఫికెట్టుకు ప్రెయివేటుగా యిచ్చుకునేఫీజు తెచ్చుకోలేని రోగుల జాబితాలో చేర్చఁబడతారు. పిడిరాయిలాగ తిరుగుతూవున్న వాళ్లెందరో డాక్టరు సర్టిఫికెట్టు సంపాదించుకొన్న పద్ధతిని వుద్యోగం చేయకుండా సెలవులోవుండి జీతం పుచ్చుకోవడమున్నూ నిజంగా రోగులైనవాళ్లు దాన్ని సంపాదించుకోలేక పనిచేస్తూనే వుండడమున్నూ సర్వానుభూతమే కాఁబట్టి నల్లమందు యెవరికివ్వాలో యెవరికి వద్దో తెలుసుకోవడం కష్టం, పెద్దచిక్కేవచ్చింది. దీనిలోవున్న తత్త్వం బుద్ధి మదగ్రేసరులు మంత్రులకు తెలియకపోదు. కాఁబట్టి విస్తరించేదిలేదు. కొనసాగుతోందో లేదో చెప్పఁజాలం గాని గాంధీమహాత్ముఁడు పూనిన యీ వుద్యమంవల్ల జగత్తుకు కలిగే వుపకారం యింతా అంతా కాదు. స్త్రీలు కూడా తాగుమోతులు లేకపోలేదుగాని స్త్రీలలోకన్న పురుషులలో యీతెగ విస్తారంగావున్నట్టు తెలుస్తుంది. అందులో కూలిజనంలో యిది మిక్కిలి యెక్కువ. ఆ కూలి జనంలోనున్నూ మన ప్రాంతాల్లో వుప్పర్లు సంపాదించుకునే కూలి కొంచెం అదనంగానే వుంటుంది కాని అది సర్వమూ దీనికిందే వినియోగం. పంచమహాపాతకాలలో

చేరిన యీ తాగుడు పూర్వకాలంలో అగ్రజాతుల్లో లేనేలేదని చెప్పడానికి సందేహం లేదుగాని యిటీవల పడమటిగాలి సోకిన తరవాత దీనికి అగ్రజాతులేమి జమీందార్లేమి పూర్తిగా అలవాటు పడ్డారు. యెంతో యోగ్యులైన జమీందార్లు, ప్లీడర్లు - వకరేమిటి? ఐశ్వర్యం వున్నవాళ్లు చాలామంది దీనివల్ల మానప్రాణాలు గోలుపోవడం నేను కళ్లారా చూచివున్నాను. వారివారి పేళ్లు యిందుదాహరించడం న్యాయంకాదు. కాఁబట్టి వుదాహరించలేదు, పాణిగృహీతలోవకపద్యం దీన్ని గూర్చి వ్రాయఁబడింది. దాని వుదాహరిస్తాను.

శా. "అన్నా! వైనఁట! బ్రాందియంట! విసికీ యం టక్కటా! నీకునీ
విన్నాణం బెటు లబ్బెరా? ద్విజకులావిర్భూతియున్ బానమున్
మున్నెచ్చో వినలేదు నీదుతలనే మున్గెన్ మహాపాప; ము
చ్ఛిన్నం బయ్యెఁ గులమ్ము నీకతన సీ! సీ! గోత్రవిధ్వంసకా!"

యజ్ఞయాగాదులు చేసిన సత్కులమందు పుట్టి పైపద్యానికి ప్రథమ లక్ష్యంగామాతిన పాశ్చాత్యవాసనావాసితు లెందఱో మనదేశంలో వున్నారు. యీ మద్యపాననిషేధం గనక తుదనెగ్గితే అట్టివారంతా మంచి స్థితికి వస్తారనడానికి సందేహం లేదు.

మద్యపానం నశించడానిక్కూడా యుక్తాయుక్తజ్ఞానమే. అట్టి యుక్తాయుక్తజ్ఞానం ప్రతిమానవవ్యక్తికిన్నీ కలిగించాలంటే అది కష్టసాధ్యమే కాదు. కేవలమూ అసాధ్యమే అన్నమాట. అందుచేతే గాంధీ మహాత్ముఁడు నిర్బంధవిధానాన్ని మద్యపానం విషయంలో అవలంబింపచేసేటట్టు తోస్తుంది. నిర్బంధవిధానమంటే? అసలు ఆమద్య పదార్థవ్యుత్పత్తినే ఆటంకపఱచడం. యిదికొంత అనాలోచనగానున్నూ వుంటుంది గాని గాంధీమహాత్ముని వంటి మహాఋషి-పైఁగా రాజకీయనీతి ధురంధరుఁడు- మొదలు పెట్టినదాన్ని కాదనడానికి మనబోట్ల కధికారం లేదనుట నిర్వివాదాంశము. ఆయన మొదలు పెట్టినవాట్లల్లో నాకు అసాధ్యంగా మొట్టమొదటనుంచిన్నీ తోఁచింది యీ మద్యపాన నిషేధమే కాని నేను కూడా అప్పటినుంచి యిప్పటివరకున్నూ తాళ్లు కల్లుగీఁత కివ్వడంలేదు. దానివల్ల వచ్చే లాభాన్ని అంతో యింతో "వుడతాభక్తి" స్మారకంగా వదలుకొన్నవాణ్ణే. పదివేలూ యిరవైవేలూ వదులుకున్నవారు వదులుకుంటూవుంటే నేనున్నూ వదులుకొనడాన్ని గూర్చి యిందులో తెల్పడం పరిహాసాస్పదంకాకపోదు - అయితే "ఢిల్లీకిఢిల్లే పల్లెకుపల్లె" కదా? యీ వుద్యమం నెగ్గడం యేలాగ? అని సందేహమే కాని నెగ్గితే సంతోషించని ప్రాజ్ఞుఁడంటూ వుండనే వుండఁడు. నేను కోరేదల్లా మద్యపానంతో పాటు నల్లమందుకూడా నిషేధిస్తే యెందఱో

బాలవృద్ధాతురులు చిక్కుపడతారు. కనక దాన్ని మినహాయించడమే కాకుండా దాని వెల కూడా యిటీవల అభివృద్ధి పొందిన స్థితినుండి తగ్గించి తేలికచేయవలసిందనిన్నీ దీని కెన్నో ఉదాహరణలు చూపవచ్చును. వ్యాసం చాలా విస్తరించింది. కళల మాట దేవుడెఱుఁగును గాని ప్రకృతం మద్యంతోపాటు నల్లమందు కూడా దొరక్కుండాచేస్తారేమో అనే భయంతో నేను దీన్ని మొదలుపెట్టి వున్నాను. సుమారు 16 సంవత్సరాలనుంచి నేను దాని సహాయంతోటే జీవయాత్ర గడుపుతూ వున్నాను. యీదేశంలో నావంటి వాళ్లెందఱో ఉండి ఉంటారు. వీళ్లెవళ్లూ షోకేళాగా దీన్ని అభ్యసించినవాళ్లు కారు. అందుచేత దాన్ని తేలికవెలకు కాకపోయినా యిప్పటి వెలకేనా దొరికే టట్టుగాచేస్తే చాలునని కాంగ్రెసుమంత్రులను కోరుతూ యీ వ్యాసాన్ని ముగిస్తూవున్నాను.

★ ★ ★

# సస్యగర్భభూదానం

పెద్దలు దానాలవిషయంలో చాలా గ్రంథాల్లో వ్రాసివుంచారు. స్వీకరించడానికీ యివ్వడానికీకూడా బ్రాహ్మల కధికార ముందనిన్నీ క్షత్రియాదులకు యివ్వడానికి మాత్రమే కాని పుచ్చుకోవడానికి అధికారం లేదనిన్నీకూడా వారే వ్రాసివున్నారు. కాని యీ యిరవయ్యో శతాబ్దంలో బ్రాహ్మణేతరులు తిరగఁబడి దాన్ని విశ్వసించడంలేదు. ముఖ్యంగా ఆ యా పురాణాలేమి ధర్మశాస్త్రాలేమి మీ బ్రాహ్మలే వ్రాసుకున్నారు. కాఁబట్టి మీకు అనుకూలంగా వ్రాసుకున్నారు. అంటూ ఆపాతరమణీయమైన యుక్తి నొకదాన్ని చెప్పి పైవిషయాన్ని బ్రాహ్మణేతరులు తృణప్రాయంగా ఖండిస్తూ వున్నారు. నేనుకూడా బ్రాహ్మణ్ణే అవడంచేత దీన్ని గుఱించి యింతకన్న ఎక్కువగా వ్రాసినప్పటికి వృథా పరిశ్రమమే కాని ప్రయోజనం వుండదని యెంచి ఆజోలికిపోక ప్రస్తుతాంశాన్ని గూర్చి రెండుమాటలు వ్రాస్తూవున్నాను.

దానాలలో చాలా విధాలున్నాయి. వాట్లలో చాలాభాగము యిచ్చేవాళ్లకు పుణ్యాన్ని సంపాదించే విన్నీ పుచ్చుకునేవాళ్లకు పాపాన్ని సంఘటించేవిన్నీ అని గ్రంథాల్లోనే వ్రాయఁబడివుంది. బ్రాహ్మలు బ్రాహ్మలకోసం రాసుకున్నారని చెప్పేవారికి అనుకూలించని సంగతులుకూడా ఆ గ్రంథాల్లోనే కనబడుతూ వున్నాయి బోలెఁడు. నిజమైన బ్రాహ్మఁడు. లేశమున్నూ ప్రతిగ్రహమే చేయకూడదని పలుచోట్ల వ్రాసివున్నారు. "పౌరోహిత్యం రజనిచరితం" అంటూ కొన్నిటిని యేకరుపెట్టి యివి నాకు జన్మజన్మాలకూ వద్దని భగవంతుణ్ణి ప్రార్థించినట్లు అభియుక్తులశ్లోకాలు కనపడతాయి.

ఆ యీ నిషేధం కన్యాభూసరస్వతులనుగూర్చి యెక్కడా వున్నట్లు లేదు. అన్నాన్ని కూడా యితరత్ర స్వీకరించడానికి మనపూర్వులు వప్పుకోనేలేదు. "తస్మాదన్నం నగృహ్ణీయాత్ ప్రాణైః కంఠగతై రపి" ఆ కారణంచేతనే శ్రీ బులుసు పాపయ్యశాస్త్రులవారి వంటి మహాపండితులు కొందఱు యీ విషయంలో చాలా అసిధారావ్రతంగా ప్రవర్తించినట్లు వింటాము. కన్యకను వకరివల్ల స్వీకరిస్తేనేకాని ప్రపంచప్రవృత్తే సాఁగదు కనుక దాన్ని నిషేధించలేదు. భూదానం పుచ్చుకోకపోతే కన్యాదానానికి వచ్చే చిక్కువంటి చిక్కు లేదుగాని యెందుచేతో దాన్ని నిషేధించలేదు. సరస్వతీదానం అంటే విద్యాదానం. దీన్ని నిషేధిస్తే లోకం అంధకారంలో పడిపోవలసి వస్తుంది. గనక దీన్ని కూడా వుభయతారకంకిందనే మనపూర్వులు జమకట్టివున్నారు.

ప్రస్తుతం రాయదలచుకొన్నది భూదానాన్ని గురించి, అట్టి భూదానాన్ని గ్రహణాది సమయాలలో యిస్తే దానివల్లవచ్చే పుణ్యం కోటిగుణిత మవుతుందని గ్రంథాలలో వ్రాసివుండడంచేత పూర్వరాజులు అగ్రహారాలు వగైరా అట్టి సమయాలలోనే యిచ్చినట్లు మనకు వారివారి శాసనాలవల్ల తెలుస్తూవుంది.

అట్టిభూమి సస్యగర్భంగా వున్నప్పుడు దానమిస్తే మరీ పుణ్యమని యెక్కడో వ్రాసివుండడంచేత వక సామాన్య గృహస్థురాలు యే పురాణ శ్రవణ సమయంలోనో ఆ సందర్భాన్ని విని సస్యగర్భభూదానం చేదామని సంకల్పించుకుందని వింటాము. అయితే యీ దానం అన్నది వారి వారి స్థితిగతుల ననుసరించి ఫలప్రద మవుతూవుంటుంది కాని యెక్కువ యిస్తే యెక్కువ పుణ్యమనిన్నీ తక్కువయిస్తే తక్కువ పుణ్యమనిన్నీ లేదు. అనగా వక మహారాజు వక అగ్రహారం దానమిస్తే ఎంతపుణ్యమో వక సంపన్న గృహస్థు వక యెకరం నేల దానమిస్తే అంతేపుణ్యం. యీలాగే వక లక్షాధికారి వక వేయి రూపాయిలిస్తే యెంతో వకభిక్షాధికారి వక కాని ధర్మంచేస్తే అంతేఅని గ్రంథాలు వప్పుకుంటాయి. యుక్తికిన్నీ పైసంగతి అనుకూలిస్తుంది. కాని లక్షాధికారి భిక్షాధికారి చేసినట్లుమాత్రం చేస్తే యుక్తంకాదు. అందుకే తన శక్తికొలదిగా దానం చేయవలసిందని చెపుతూ "విత్తశాఠ్యం నకారయేత్" అనికూడా పలుచోట్ల వ్రాసివున్నారు. అదల్లా వుంచుదాం.

యిపుడు జనశ్రుతిగా వచ్చుచున్న వక సామాన్యగృహస్థురాలుచేసే సస్యగర్భ భూదానాన్ని గురించి మాట్లాడుకుందాం. పాపం ఆ అమాయకురాలికి యథాశాస్త్రంగా సస్యగర్భభూదానం చేయాలనివుంది. పండినభూమి నెక్కడతెస్తుంది? అందుచేత యెవరినో ఆశ్రయించి నాల్గు మూడు పండిన వరివెన్నులతో కూడుకొన్న వక పెద్ద మంటిగడ్డను సంపాదించింది. దాన్ని జాగ్రత్తగా విడిపోకుండా వక పళ్లికతట్టలో పెట్టుకుని యేపుష్కర పుణ్యకాలమందో లేక యే సూర్యగ్రహణ చంద్రగ్రహణ కాలమందో యే కోటిలింగక్షేత్రానికో వచ్చి స్నానంచేసి డబ్బో దస్కమో దక్షిణతో ఆసస్యగర్భభూమిని దానంచేసి తరించినట్లు తృప్తిపడి యింటికి వెళ్లింది. విచారించిచూస్తే ఆ అమాయకురాలికి పుణ్యంవస్తే రావచ్చునేమో కాని అది సస్యగర్భభూదానం అనిపించుకుంటుందా? యీ మట్టి గడ్డను పుచ్చుకొన్న బ్రాహ్మఁడు దక్షిణే దక్కుట అనుకొని దాన్ని అక్కడే పారవేస్తాడు. గాని యింటి కేమేనా తీసుకువెళ్లి యేటేటా తాను పండించు కుంటాఁడా? అది ఆలా పండించుకోవడానికి వీలవుతుందా? కాదు గదా? అయితే ఆవిడకు పుణ్యం మాత్రం యేలావస్తుందని శంక రావచ్చును. ఆమె బుద్ధియందు లేశమున్నూ కళంకం లేదు. కాఁబట్టి– "భావనా యదిభవే త్ఫలదాత్రీ మామకం నగరమేవహి కాశీ" అన్నట్లు ఆమె భావనను పట్టి ఆమెకు సుకృతం కలిగితే కలగవచ్చు ననుకుంటాను.

ఇప్పుడిట్టి సస్యగర్భభూదానాలే జరుగుతూ వున్నట్లు లేదుగాని యీలాటివి మాత్రం కొన్ని జరుగుతూవున్నాయి. వాటినే కొందఱు విమర్శనాదక్షులు విమర్శించి ఖండిస్తూవున్నారు. వారికి నేచెప్పే సమాధానమేమిటంటే : మేడున్నవారు మేడెక్కేరనుకోండి. అది లేనివారో గోడే యెక్కి సంతోషిస్తారు. దూరాన్నున్న వస్తువు మేడమీఁదవారి కెంత గోచరిస్తుందో గోడమీఁదవారికిన్నీ అంతే గోచరిస్తుంది. కాఁబట్టి వృథాగా మీరు విమర్శించి ఖండించడం యెందుకు? అంటాను. అంటే వారు వింటారూ? యేమేమో యుక్తులు చెప్పడానికి మొదలుపెడతారు. వారి యుక్తులున్నూ తోసివేయడానికి శక్యంకాదు. యెందుచేతంటారా? మేడమీఁదెక్కడమున్నూ గోడమీఁదెక్కడం వకటే అంటే మాత్రం బాగా వుంటుందా? ఆలాగయితే బోలెఁడు ద్రవ్యం వ్యయం చేసి మేడ లెందుకు కట్టుకోవాలి? దేని గౌరవం దానిదే. సస్యగర్భభూదానం ఆవిడ చేసింది కూడా అయితే నిజమైన సస్యగర్భభూదానం యొక్క గౌరవం యెవరికేనా కనపడుతుందా? యిప్పటి మెడల్సులాగే పదడయిపోదా? కాఁబట్టి దీన్ని గుఱించి బాగా ఆలోచించాలి. ఇంతే నేను వ్రాసేది.

★ ★ ★

# భీష్మ బ్రహ్మచారి గురుశిష్యవివాదం న్యాయసమ్మతమేనా?

భీష్ముణ్ణి గురించి నాలుగుమాటలు వ్రాస్తాను. భారతంలో యితని చరిత్ర సమగ్రంగా వున్నప్పటికీ అక్కడక్కడ వెదికితేనే తప్ప వొకటే చోట వుపలబ్ధం కాదు. యితఁడు శంతన మహారాజుకున్నూ గంగా దేవికిన్నీ జన్మించినవాఁడు. గంగ వొకానొకనది కదా! ఆ నదికిన్నీ మనుష్యుఁడైన శంతనుఁడికిన్నీ దాంపత్యం యెట్లా? అంటూ శంకిస్తే జవాబు చెప్పవలసింది లేదు. యీలాటి దాంపత్యాలు మన ఆర్యుల చరిత్రల్లో చాలా వున్నాయి. శ్రీ కృష్ణమూర్తికి కాళింది భార్యకావడం వగయిరాలు చూచుకోండి. వసుమహారాజుభార్య గిరికాదేవికూడా నదీసంతానమే. కాని అక్కడ ఆశుక్తిమతీనదికి భర్త మనుష్యుఁడుకాఁడు; కోలాహల పర్వతం. కనక యింత విరుద్ధంగా వుండదు ఆ కథ.

రెండున్నూ జడపదార్థాలే. వస్తుతః మన ఆర్యుల మతంలో కుల పర్వతాలుగాని, మహానదులుగాని కేవల జడపదార్థాలు కావనిన్నీ, వీటికి అంతరాత్మ దేవతగా వుంటుందనిన్నీ నిశ్చయింపఁబడినట్లు తేలుతుంది.

"శ్లో. అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా హిమాలయః."

అంటూ కాళిదాసంతటి మహాకవి చెప్పడం సాధారణంగా తటస్థించదుకదా! కాళిదాసు పరిశీలన సామాన్యమైనదంటే ప్రాజ్ఞులెవ్వరూ విశ్వసించరని వేఱే చెప్పవలసి వుండదు. కాఁబట్టి సూర్యచంద్రాది ఖగోళస్థ పదార్థములేమి, నదీపర్వతాది భూగోళస్థ పదార్థములేమి కేవలజడములుగా సామాన్యదృష్టికి గోచరించినప్పటికీ విశేషజ్ఞుల దృష్టిలో వీటికన్నిటికిన్నీ అంతరాత్మ వుండడం సిద్ధాంతమే. కర్ణుఁడు సూర్యపుత్రుఁడై నట్లే భీష్ముఁడు గంగా పుత్రుఁడే. ఒకచోట తల్లి మానుషి, తండ్రి దేవత, వేఱొకచోటో తండ్రి మనుష్యుఁడు తల్లి దేవనది. ఆయీ భీష్ముఁడు తల్లివద్దనే బాల్యంలో పెంపఁబడ్డాడు. యేలా పెంచిందో యేలా పెరిగాడో వివరించడానికి భారతంలో కూడా తగినంత ఆధారం కనపడడంలేదు. తల్లిద్వారాగానే వసిష్ఠుణ్ణి శుశ్రూషించి వేదాదికాన్ని అభ్యసించాఁడు. పరశురాముణ్ణి శుశ్రూషించి ధనుర్వేదాన్ని అభ్యసించాడు. భీష్ముఁడికి తెలిసినధనుర్విద్యలో వక్కమోహనాస్త్రం తప్ప

యావత్తుశస్త్రాస్త్రాలున్నూ పరశురాముఁడు ద్వారాగానే వచ్చినట్లు భారతంవల్లనే తేలుతుంది. అర్జునుఁడికో? అలా కాదు. ముందత్తిగా బడిచదువు ఓనమాల మోస్తరు శస్త్రవిద్య కృపాచార్లగారి వద్ద జరిగింది. తరువాత చాలాగ్రంథం ద్రోణాచార్లగారివద్ద జరిగింది. ట్రయినింగుకూడా ద్రోణాచార్లగారివద్దనే అనుకోవాలి. ద్రుపదుణ్ణి కట్టి తీసుకురావడం ఆ ట్రయినింగులోకే చేరుతుంది. ఇంతతోకూడా యితని విద్య సమాప్తం కాలేదు. శ్రీ పరమేశ్వరుఁడు, దేవేంద్రుఁడు మొదలైన దిక్పాలకులు వీరంతా అర్జునుఁడికి అంతో యింతో గురుత్వం చేసినవారే, ప్రధానగురువైన ద్రోణాచార్లగారికికూడా తెలియని మోహనాస్త్ర ప్రయోగంకూడా మన అర్జునుఁడికి తెలుసును. యిది భీష్ముఁడికి సోదర ప్రాయులైన వసువుల ద్వారాగా సంక్రమించింది. అర్జునుఁడికి దీన్ని తాతగారుపదేశించినట్లు భారతంలో కనపడదు. బహుశః స్వర్గంలో యింద్రాదులు కొన్ని అస్త్రాలు ప్రసాదించిన తరుణంలో వసువులు దీన్ని ప్రసాదించి వుంటారని తోస్తుంది. నన్నయ్యగారు -

"...పాశుపతాదిక దివ్యబాణముల్
హరసుర దేవరాజ నివహమ్ములచేఁ బడసెంగ్రమమ్మునన్."

అని సంగ్రహంగా చెప్పివున్నారు. ఏమైనా అర్జునుఁడు మాదిరిగా భీష్ముఁడు చాలామందివల్ల ధనుర్వేదాన్ని అభ్యసించలేదు. ఒక్క పరశురామునివల్లనే సమస్త ధనుర్విద్యను సంపాదించుకున్నాఁడు. తండ్రిగారికి ద్వితీయ వివాహం చేయవలసివచ్చి ఆ సందర్భంలో అవసరమవడంచేత బ్రహ్మచర్యవ్రతాన్ని పూని గురువుగారికి సర్వవిధాలా దీటయిన శిష్యుఁడని పించుకున్నాఁడు. పరశురాములవారు ఆజన్మబ్రహ్మచారిగా యెందుకు వుండవలసివచ్చిందో? చూచినంతలో నాకు యేగ్రంథంలోనూ వుపలబ్ధం కాలేదు. మురారి నాటకంలో - "శ్లో॥ ఆజన్మ బ్రహ్మచారీ" అని వ్రాయఁబడివుంది. బహుశః యెక్కడో ఈ విషయం పురాణాలలో వుండేవుంటుందనుకోవాలి. అదిన్నీ కాక ఆయనకు కాస్త గోఁచీ పెట్టేవయస్సు వచ్చింది మొదలుకొని యెవళ్లతోనో రాజులతో పోట్లాటలతోనే సరిపోయింది. అందులో యెదురుకున్నవాళ్లే లేరుకదా! తుదకు శ్రీరామమూర్తివారు కాఁబోలును కాస్త క్షత్రియతేజాన్ని చూపించారు. ఉభయులున్నూ విష్ణుతేజస్సంభవులే అవడంచేత అందులో అంత అవమానం వున్నట్టు ఆయనా భావించుకొన్నట్టులేదు; చరిత్రకారులున్నూ భావించు కోలేదు. కాని అది మొదలుకొని వైరాగ్యానికి దిగి యేదో తపోగోష్ఠితో మహేంద్రపర్వతం మీఁద కాలక్షేపం చేయడంతప్ప ఆయనకి యితర ప్రసక్తి లేనేలేదు. చాలాకాలం యుద్ధాలే. పిమ్మట తపస్సు. యిఁక వివాహ ప్రసక్తికి అవకాశం యెక్కడ?

ఈ పరశురాముడు సాక్షాత్తూ పరమేశ్వరుఁడి దగ్గిఱ శస్త్రవిద్యాభ్యాసం చేసినట్టున్నూ, ఈశ్వరుఁడున్నూ, పార్వతీన్నీ యీయన్ని కుమారస్వామి కన్నా మిన్నగా ఆదరించినట్టున్నూ తఱుచు నాటకాలలో కవులు వ్రాస్తూవచ్చారు. పురాణాలలో ఈ విషయం యెక్కడవుందో తెలియదు. అంతో యింతో ఈశ్వరశిష్యరికం అర్జునుఁడికిన్నీ కూడా వుండడంచేత పరశురాముఁడున్నూ అర్జునుఁడున్నూ సతీర్థులనికూడా అనుకోవచ్చును. భీష్ములవారో యీశ్వరుఁడికి ప్రశిష్యుఁడు. ఇంతటిస్వార్థత్యాగి అప్పుడేకాదు యెప్పుడున్నూ లేఁడని చెపితే వొప్పనివారుండరు. స్వార్థత్యాగులలో శ్రీరాములవారు ప్రథమగణ్యులే, కాని ఆయన వివాహాన్ని కూడా మానుకున్నవారుకారు. రావణవధానంతరం చాలాకాలం రాజ్యంకూడా చేసివున్నారు. భీష్ముఁడో వివాహాన్నీ వదలుకున్నాఁడు, రాజ్యాన్నీ వదలుకున్నాఁడు. అట్లని తపస్విగా వుండలేదు. కుల ధర్మమైన క్షాత్రాన్ని నిర్వహిస్తూ బ్రహ్మచర్యాన్ని అవ్యాహతంగా నడుపుతున్న మహానుభావుఁడు.

"... ... ... ... ... ... ... ... ....జ
న్మావధి చచ్చునంతకు రవంతయు లోటునులేనివారి నెం
దేవినియుంటిమే? ... ... ..."

అని యీయన్నిగూర్చి అశ్వమేధంలో మేము ప్రశంసించివున్నాము. యిట్టి భీష్మునికి సకల ధర్మవేత్తకు అంతో యింతో కాక తన యావత్తు ధనుర్విద్యకున్నూ మూలభూతుఁడైన పరశురామునితో యుద్ధం చేయక తప్పింది కాదు. దైవతంత్ర మనివార్యం కదా! యే కొంచెం గురుశిష్యభావం వున్నా గురువును యెదిరించడానికి శిష్యుఁడికి అధికారం లేనట్టు మన ఆర్యులమతం చెప్తుతుంది. అట్టిస్థితిలో భీష్ముఁడు చేసినపని స్థూల దృష్టిని విచారిస్తే సమర్థనీయం కాదు. అయితే పరశురాములు కేవలం ఆశ్రితపక్షపాతాన్నే పురస్కరించుకొని చేయఁదలఁచుకొన్న వుపకారానికి భీష్మణ్ణి తోడ్పడవలసిందని విధించాఁడు. ఆపనిచేస్తే భీష్ముఁడు కేవలం నింద్యుఁడు కావలసివస్తుంది. అందుచేత అందుకు అంగీకరించలేక పోయాఁడు. దానితో శీఘ్రకోపి కావడంచేత పరశురాములు మండిపడి తనతో యుద్ధానికి రమ్మన్నాఁడు. భీష్ముఁడు యెన్నోవిధాల బతిమాలుకున్నాఁడు కాని పరశురాములు వినలేదు. తనగండ్రగొడ్డలికి యెందఱో యిదివఱలో క్షత్రియులు బలి కావడంచేత భీష్మణ్ణికూడా ఆలాగే చేయఁగలనుకదా! అని ఆయనకి పూర్తి ధిమాకువుంది. భీష్ముఁడికో? గురువుగారు తన్నయితే వోడించలేరని తెలుసునుగాని ఆయనికి యెదురుగా వుండి యుద్ధంచేయడం ధర్మం కాదని సంశయింపవలసివచ్చింది. అందుచేత బతిమాలు కోవడానికి మొదలు పెట్టాఁడు. పోనీ గురువుగారు చెప్పినట్టు చేస్తేనో? యిహపరాలు రెండూకూడా చెడతాయి.

అందుచేత అంబా వివాహానికి వప్పుకోలేక పోయాడు. గురువుగారు "కత్తేస్తావా? బద్దేస్తావా?" అంటూ గండ్రగొడ్డలి చూపిస్తూ ప్రాణగొడ్డంగా భయపెట్టడానికి వుపక్రమించారు. 'చూపిస్తే చూపించారుగాక? ఆయన పెద్దలు' అని వెనుకదీస్తే కులధర్మానికే లోటు రావలసివచ్చింది. యెట్లో బతిమాలు కుందామంటే బతిమాలినకొద్దీ బిఱ్ఱబిగిసి కయ్యానికి కాలు ద్రవ్వడం జరిగింది. దానిమీఁద కొంచెం బెడిదంగా జవాబుచెప్పి చూచాఁడు. ఆ బాపతు పద్యం వకటి వుదాహరిస్తాను.

క. క్షత్రియులఁ దొల్లి యలుకకుఁ
బాత్రముచేసితటె? నాఁడుబలియుఁడు గంగా
పుత్రుఁడు పుట్టమిఁ గా కిది
యీ త్రయినింకేల? చెల్లు నెఱుఁగవె? నన్నున్.

యిలా కొంచెం బెడిదంగా మాట్లాడింది సర్వసన్నద్ధుఁడై వచ్చిన తరవాతనే. అంతకుముందు యింతకంటె కొంత మృదువుగానే మాట్లాడి చూచాఁడు.

"ఇట్టి కృత్యం బాచరించుటకంటె నీచేత నెట్లయినను లెస్స"

అన్నాఁడు. అని వూరుకోలేదు; అక్రమంగా, అధర్మంగా, అనవసరంగా నన్నుమీరు యుద్ధానికాహ్వానిస్తూవున్నారు. యిందులో నేను మిమ్ముల్ని వోడించవలసివస్తుందని సంశయిస్తానేమో అని మీ అభిప్రాయమేమో? అట్టి సంశయంతో నాకు లేశమున్నూ అవసరం లేదు. అయొచ్చేది పయొచ్చేదీ ఆలోచించకపోవడమే కాకుండా ధర్మాధర్మ విచక్షణకూడా చేయకుండా నన్ను మీరు ఆహ్వానిస్తున్నారు. అని యీ క్రింది మాటలు పలికినాఁడు.

తే.గీ. "గర్వియై కార్యమిట్టి దకార్య మిట్టి
దని యెఱుంగక లోకంబు చనుపథమునఁ
దిరుగ కున్మదవృత్తి వర్తించునట్టి
వాని గురునైన దండింపవలయు నండ్రు"

పయికిట్లు చెప్పడమైతే చెప్పినాఁడు విధిలేక కాని భీష్మునికి సుతరామున్నూ గురునితో యుద్ధం చేయడం యిష్టంలేదు. లేకపోతే మాత్రం తప్పుతుందా? గురువుగారు మూర్ఖప్పట్టు పట్టి కూర్చున్నప్పుడు. సరే యేలా గయితే యేమీ "అంగీకృతా గ్లానిర్నదోషాయ" అనుకొని యుద్ధరంగంలోకి ప్రవేశించాఁడు. చాలా రోజులు యుద్ధం జరిగింది. తుట్టతుదకు మోహనాస్త్ర ప్రయోగంతో శిష్యుఁడు గురువుగారిని విజితుణ్ణి చేయడానికి సిద్ధపడుతూ వుండఁగా నారదాది మహాఋషులు- "ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః" చెప్పి గురువుకు

చెప్పేమాటలు గురువుకూ, శిష్యుఁడికి చెప్పేమాటలు శిష్యుఁడికి చెప్పి యెట్లాగయితే యేమి రాజీచేశారు. ఈ యుద్ధానికి కారణ భూతురాలైన అంబనే శిఖండిపదంతోటి ఇటీవల భారతంలో వాడింది. ఈలాటి అకార్యాన్ని పురికొల్పిందని కాఁబోలు ఈశిఖండి పదం లోకంలో తిట్టుగాకూడా యిటీవల మాఱింది. "గండా మొండి శిఖండి బండలకు లెక్కల్లేని నాల్కల్గదా!" లోనైన వాటివల్ల పైసంగతి తేలుతుంది. వూరికే అంబను దూషిస్తారుగాని నిజానికి లోపమంతా పరశురాములదే. అయితేనేమిగాక! పరశురాముఁడు నిజమైన శూరాగ్రేసరుఁడవడంచేత శిష్యుఁడి ప్రజ్ఞకు సంతోషించాఁడు, కౌగిలించుకున్నాడు ఆశీర్వదించాడు కూడాను. భీష్ముఁడు తనకు జయం కలుగుతూ వున్నప్పటికీ యీ జయం జయంకింద చూచుకోకూడదని యెఱిఁగినవాఁడవడంచేత నారదుఁడున్నూ తనతల్లి గంగాదేవిన్నీ చెప్పిననీతికి ప్రతిచెప్పక అంగీకరించి పరశురాముఁడిదగ్గరకు వెళ్లి సాష్టాంగ నమస్కారం చేశాఁడు, క్షమాపణ చెప్పాఁడు. జయలక్ష్మీ శోభితుఁడై కూడా వినయ వినమితుఁడైన శిష్యుణ్ణి యెంతగౌరవించాలో అంతా గౌరవించి పరశురాముఁడు ఆదరించాఁడు. పరశురామునితో గంగ చెప్పే వుపశమనవాక్యాలలో కొంచెం తన కొడుకు ప్రవర్తనకు అనుకూలంగానే స్ఫురించేటట్టు మాట్లాడింది. ఆమాటలు వుదాహరిస్తాను.

"నీ శిష్యుండు దేవవ్రతుఁడు, వానియెడ నలుగందగునే? వాఁడు తగవు మాలినపనిఁ జేయంజాలక పెనంగె, నింతియకాని విరోధిగాఁడు."

పైమాటలవల్ల లోపమంతా గురువుగారియందే వుందని గంగ తేల్చినట్లయింది. అయినప్పటికీ యథార్థం వప్పుకోవడం సజ్జనలక్షణమున్నూ, శూరలక్షణమున్నూ కనక పరశురాములు ప్రతి చెప్పక చట్టన శిష్యుణ్ణి ఆదరించి బుజ్జగించాడు. గురువుగారి ఆజ్ఞను శిరసావహించి భీష్ముఁడు యుద్ధానికి సిద్ధపడ్డాఁడు గనుక ఆయీ చరిత్ర లోకంచేత యింతగా మన్నించఁబడుతూవుంది, కాని భీష్ముఁడు యుద్ధానికి వెనుతీయడమే జరిగితే ఆ యీచరిత్రకు లేశమున్నూ గౌరవమే లేకపోయేది. యితరులమాటెందుకు? పరశురాములుకూడా "అయ్యో! యేలాటి పిఱికిపంద నాకు శిష్యుఁడైనాఁ"డని తనలో తాను సిగ్గుపడేవాఁడు. శూరత్వప్రసక్తి వచ్చినప్పుడు గురుశిష్యులేకాదు, పితాపుత్రులే కాదు తమ తమ ప్రజ్ఞావిశేషానికి ప్రాధాన్యం యివ్వవలసిందే. కాని బంధుత్వానికి ప్రాధాన్యం యివ్వడానికి అవకాశం లేదని లోకానికి యీ చరిత్రేకాదు, అర్జున బభ్రువాహనుల చరిత్రకూడా చెపుతూవుంది. బభ్రువాహనుఁడు యెంతో వినయంగా దర్శనానికి వచ్చి నమస్కరిస్తే అర్జునుఁడేలాటి జవాబు చెప్పినాఁడోచూడండి–

ఉ. నాకొమరుండ వంచు నెటునమ్ముదు? నశ్వముఁ గట్టిపెట్టితో
వీఁక నెదిర్చితో? యిదియు విందగునే నరపాలసూతికీ
రాక గనుంగొనంగ నిను రాకొమరుండ వటన్నమాటకే
లోకము విశ్వసింపదెటులో? యిఁకనాకొమరుండ వన్నచో.

శూరునకు శూరుఁడుకాని కొడుకునం దెలా గౌరవం వుండదో వీరునకు వీరుఁడుకాని శిష్యునియందున్నూ ఆలాగే గౌరవం వుండదని చెప్పనక్కరలేదు. వేయిమంది అగస్త్యభ్రాతలకు గురు వనిపించుకోవడంకన్న భీష్మునివంటి వొక్కనికి గురువనిపించు కోవడమే గురువుకు సంతోషదాయకము. అట్టి గురుత్వానికే అందఱూ ఆశించతగ్గది. మురారి మహాకవి యేమన్నాడు?

"స్థానే స్వశిష్యనివహై ర్వినియుజ్యమానా విద్యాగురుం హి గుణవత్తర మాతనోతి"

అన్నాఁడు. యెక్కువ అదృష్టవంతులైన గురువులకుఁగాని వారిని మించిన శిష్యులున్నూ, కొడుకులున్నూ వుండితీరవలసిందిగా కవులనాదిగా అభిప్రాయపడుతూన్నట్లు యెన్నో చరిత్రలు సాక్ష్యమిస్తాయి. నిజంగా అట్టి శిష్యులూ, కొడుకులూ వున్నారో లేదోగాని వున్నట్లు కవులు వ్రాస్తూ వున్నారు. ఆలా వ్రాస్తేనేకాని కవులకు సంతుష్టి వున్నట్లు తోఁచదు. "పార్థ ఏవ ధనుర్ధరః" అనిపించుకొన్న అర్జునుణ్ణి కొడుకు బభ్రువాహనుఁడు వోడించిన సందర్భానికి గంగాశాపం కారణంగా వుంది. కనక అంతగణనీయం కాకపోయినా శ్రీరాముణ్ణి పసికుఱ్ఱలు కుశలవులు వోడించినట్టు కవులు చిత్రించారే! యిది విశ్వసనీయమేనా? అట్టి కవులమీఁద శ్రీరామునికి కోపం రావడానికి మాఱు అనుగ్రహమే వున్నట్లు తోస్తుంది. ఎందుచేత? ఇట్టి కల్పనాచమత్కృతిగల కవులే లేకపోతే శ్రీరాముఁడు అదృష్టవంతులలో అగ్రేసరుఁడు కాకపోవలసివస్తుంది. తన కొడుకులు తన పేరు ప్రతిష్ఠలమీఁదనే ఆధారపడడానికి కవుల కెవ్వరికీ యిష్టం లేనట్టు కనపడుతుంది. అందులో పిల్లల మఱ్ఱికవి యీ విషయంలో వ్రాసినపద్యం మఱీ అద్భుతంగా వుంటుంది. యిదివఱలో వకటి రెండుసార్లు వుదాహరించినదే అయినా ఆ పద్యాన్ని మళ్లా వుదాహరిస్తాను.

క. అనిచదివి లవుఁడు రాఘవ
మనుజేంద్రుని తల్లి వీరమాతఁట సీతా
జనని కుశలవుల నిరువురఁ
గనియు నకట! గొడ్డువోయెఁ గడపట ననుచున్.

ఇక్కడ సర్వాత్మనా గ్రంథకర్తతాత్పర్యం రాముణ్ణి అధఃకరించడం కాదు. రాముణ్ణి సర్వోత్కృష్టుణ్ణి చేయడమే "పుత్రాదిచ్ఛేత్పరాజయం" అన్నసూక్తికి వుదాహరణం కాని

శూరుఁడుగాని, పండితుఁడుగాని అంతగా గణనీయుఁడు కాడనియ్యేవే ఆయా కవుల తాత్పర్యం. గురు శిష్యుల విషయంకూడా యీలాగే చూచుకోవలసి వుంటుందని మురారి మహాకవి ప్రవృత్తివల్ల గోచరిస్తుంది. పరశురాముఁడుకూడా భీష్ముని విషయంలో యీ అంబా ప్రసక్తిదాఁకా మంచి హృదయంతోటే వుండేవాఁడు. ఆసందర్భం యీ పద్యం చెపుతుంది.

> మ. విలువిద్దెం బలుమంది కిచ్చితిని మీ పృథ్వీశులందేమి పా
> ఱులయందేమి నినున్ బలెన్మదికి నేరున్ మోదమున్ గూర్పరీ
> యిలనిన్నున్ బలెఁ గీర్తికిన్ దెరువులై యేపారఁ బో రొక్కరున్
> గలిగెన్నాకు భవద్వశంబున యశఃకల్యాణ లీలాగతుల్."

యేదో హేతువు కలిగేదాఁకా హృదయం యెవ్వరికీ మంచిగానే వుంటుంది. హేతువు కలిగినప్పుడుకూడా హృదయం చెడకుండా వుంటేనే అది కవివర్ణ్యం అవుతుంది. హేతువు కలిగినప్పుడేనా పరశురాముఁడు యుద్ధానికి రమ్మన్నాఁడు కాని అంతకంటె అనుచితమైన సంభాషణ లేశమున్నూ చేయలేదు. ముఖ్యంగా యీ అంశం మనం గమనించాలి. యుద్ధంలోనేనా పరశురాముఁడు సుఖసుఖాల వోడేవాఁడు కాఁడు. కాని బొత్తిగ తనకు తెలియని మోహనాస్త్రం వకటి శిష్యుఁడికి తెలియటంచేత వోడిపోవలసి వచ్చింది. బహుశః అది యిప్పటి విషవాయు ప్రయోగం వంటి దనుకుంటాను. అప్పుడు మాంత్రికాలన్నీ నేఁడు తాంత్రికాలుగా మాఱి మన కాయా పురాణ వాక్యాలయందు విశ్వాసాన్ని కల్పిస్తూవున్నాయి. ఇటువంటివే లేకపోతే ఇప్పటివారిలో అనేకులు పురాణాలన్నీ పుక్కిటిగాథలే అనటానికి సందేహం వుండదు. పురాణాలలో కొన్ని అర్థవాదాలు లేకపోలేదు. గాని అన్నీమాత్రం అర్థవాదాలుకావు. అర్థవాదమంటే దేన్నోబల పఱచడానికి యేదోవకకథ కల్పించి చెప్పడం. సత్యాన్ని బలపఱచడానికి వూరికే "సత్యం వద"అని బోధించడంకంటె, హరిశ్చంద్రోపాఖ్యానంద్వారాగా బోధిస్తే బాగా వంటపడుతుందికదా! ప్రతివిషయంలో నున్నూ యిట్టివున్నాయి. సంగీతంలో యేదో వకరాగానికి స్వరాలు "రిగపధసా" అని వున్నాయనుకోండి. ఆ అక్షరాలు అయిదున్నూ వుపదేశించి వూరుకుంటే శిష్యుఁడికి బాగా తెలియదు. దాన్ని వక వర్ణంద్వారాగానున్నూ, కృతిద్వారాగానున్నూ బలపరిస్తే ఆరాగం బాగా శిష్యుఁడికి వంటపడుతుంది. యీ అర్థవాదాల మతంలో కథలన్నీ కల్పనకిందకే వస్తాయి. ప్రస్తుతం మనం యేకథను గూర్చి ముచ్చటించుకున్నామో ఆ కథానాయకుఁడు భీష్ముఁడుగాని ఆయన గురువుపరశురాముఁడుకాని మరికొన్ని పాత్రలు యీకథకు సంబంధించిన యితరాలుగాని లేనేలేవనుకోవాలి. అట్టే చెప్పేదేమిటి? "గజంమిథ్య

పలాయనంమిథ్య"గా వుంటుంది. గురువును మించిన శిష్యులుంటారనిన్నీ బొత్తిగా గురువు ధర్మేతరంగా తొక్కుకు వస్తూవుంటే ధర్మబద్ధమైన యుద్ధానికి శిష్యుఁడు అంగీకరించ వచ్చుననిన్ని దీనివల్ల తెలుసుకోవలసి వుంటుంది. చాలాకథలు యీలాటి అర్థవాదాలుగా పుట్టినట్టే మనలో విజ్ఞులు అభిప్రాయపడతారు; భారతంలోకూడా కొన్ని కథలు అర్థవాదాలు అంటే కేవల కల్పితాలు లేకపోలేదు. గాని ప్రధానకథకు సంబంధించిన భీష్మాదిపాత్రలు మాత్రం యీ తెగలోకి చేరేవికావు. పరశురామ భీష్ములకు సంబంధించిన చరిత్రను గూర్చి లోకంలో యింకోవిశేషం కనపడుతుంది. యెక్కడోతప్ప బాహుపరాక్రమంచేత క్షత్రియులను వోడించిన బ్రాహ్మణులు లేకపోవడంచేత కొందఱు క్షత్రియులకు ఆ కథాభాగం పురాణం జరుగుతూ వున్నప్పుడు వినడం చాలా కష్టంగా వుంటుంది. అట్టి సమయంలో గంభీరహృదయులు కొందఱు యేలాగో పైకితేలకుండా కాలక్షేపం చేస్తారుగాని కొందఱుమాత్రం త్వరగా కానివ్వండి అంటూ పౌరాణికులను తొందరపెట్టడం ద్వారాగా తమ అసూయను ప్రకటించడంకలదు. భీష్ముఁడు పరశురాముణ్ణి వోడించే ఘట్టంలో యీలాటి తొందర వారు కనపఱచరనిన్నీ వింటాను. దీన్నిబట్టి అనాదిగా జాత్యభిమానం మనదేశంలో కనబడుతుందని విస్పష్టం. యీ మాదిరిదే అని చెప్పఁజాలంగాని యేదోమాదిరి జాత్యభిమానం ఖండాంతరాలలోనున్నూ కనపడుతూనే వుంటుంది. ఆయా విషయం యీ మధ్య ఎడ్వర్డు చక్రవర్తిగారి వివాహంలో అందఱికీ విస్పష్టం అయిందే. కాఁబట్టి విస్తరించనక్కఱలేదనుకుంటాను. నిన్న మొన్నటినుంచి యీ జాతిబాధ కవిత్వానిక్కూడా కనపడుతూవుంది. సంబంధబాంధవ్యాలకు జాతిభేదం పాటింపని సంఘాల క్కూడా తక్కిన విషయాలకు యిది బంధిస్తూనే వుంటుందని ఖండాంతరాలవారి ప్రవర్తనవల్ల తేటతెల్లమవుతూ వుండడంచేత బాగా ఆలోచిస్తే మనహిందువుల యేర్పాటే బాగుందేమో? అనిపిస్తుంది. యిది విషయాంతరం. మనకు ప్రస్తుతం భీష్ముని చరిత్ర. యింత జ్ఞాని, యింత శూరుఁడు, యింత ధర్మాత్ముఁడు, రాజులలోనే కాదు యితరులలో కూడా లేడంటే వప్పనివారుండరు. యీతని పరమపదారోహణంకూడా మిక్కిలి వర్ణనీయంగా వుంటుంది. ఆ సందర్భం అశ్వమేధంలో కొంత విస్తరించి వుంది. ధర్మరాజుకు ధర్మబోధ చేయడానికి శ్రీకృష్ణభగవానులుయీయన్ని నియమించడంవల్ల బాగా ఆలోచిస్తే శ్రీకృష్ణ భగవానునికి తెలియని ధర్మ సూక్ష్మాలు యీయనకు తెలుసునని మనం నిశ్చయించు కోవచ్చును. అట్టి ధర్మజ్ఞుఁడు కనుకనే శ్రీకృష్ణునికన్న మిక్కిలి వృద్ధయియుండిన్నీ కృష్ణుఁడు భగవదవతారమని యెఱిఁగినవాఁ డవడంచేత మోక్షార్థియైన భీష్ముఁడు శ్రీకృష్ణభగవానుణ్ణే శరణ్యునిగా స్తుతిస్తూ వచ్చాఁడు. ధనుర్ధరుఁడై శ్రీకృష్ణుణ్ణి బాణాలతో చాలా నొప్పించినప్పటికీ భక్తిని కనపఱుస్తూనే వుండేవాఁడు. యుద్ధధర్మ సర్వస్వవేది కావడంచేత కృష్ణుణ్ణి బాణాలచే నొప్పించియున్నాఁడు.

గాని లేకపోతే అట్టిపనికికూడా అంగీకరించేవాఁడు కాఁడు. ఆయీ అపరాధానికి తుట్టతుదను క్షమాపణ చెప్పినట్టు మా పాండవాశ్వమేధంలో వ్రాసి వున్నాము. ఆ పద్యం వుదహరించి యీ వ్యాసాన్ని ముగిస్తాను.

చ. మృదువగు వెన్నవంటిది శరీరము నీయది యెప్డు కష్టమ
న్నది సయిపంగనేరదు పదారు సహస్రములిందుకై సదా
మరి జపియింత్రుగోపికలు మాధవ! నిష్కరుణుండనైననా
ప్రదరము లిందునాటి యపరాధ మొనర్చె ననుగ్రహింపవే.

శ్రీకృష్ణునియందు భీష్మునికివున్న భక్తిపారవశ్య మెట్టిదో తెలుసు కోవాలంటే పోతరాజుగారి భాగవతపద్యాలవల్లనే తెలుసుకోవాలి. తిక్కన్న గారి భారతంలో వక పద్యం కాఁబోలును-

ఆ.వె. "బలము నీవ నాకు భక్తుండ నీయెడ నాలు బిడ్డ లేనియట్టివాఁడ"

అనేది యున్నది. పోతరాజుగారు చాలా పద్యాలు వ్రాసి భీష్మపాత్రలో తాను ఏకీభవించిన తన్మయత్వాన్ని ప్రకటించియున్నారు- "తెరలిచనుదెంచు దేవుండు దిక్కునాకు" అనే పద్యం వగయిరాలు పలువురు భక్తులకు కంఠపాఠమే. కనక వుదాహరించ నక్కఱలేదు. "లోకుల రసనలె, యాకులుగా నుండునట్టి యవివో! కవితల్" అనే భాగ్యం పట్టిన కవులలో పోతరాజుగారు మొట్టమొదటివారు. యీయన భీష్ముని భక్తిని వర్ణించినట్లు తిక్కన్నగారు వర్ణించలేదు. పూర్వకవులతోపాటు పేరు తెచ్చుకోవాలంటే తరువాతవారికి వక వుపాయం కనబడుతుంది. యేమిటంటే? వారు విస్తరించని విషయా లేమేనావుంటే వాట్లని పెంచి వ్రాయడమే. ప్రస్తుతం భీష్ముని విషయమై పోతన్నగారు చేసినపని అదే. అయితే అసలు వాణియందు రసమంటూ వకటి వున్నప్పుడే యీ వుపాయం పనిచేస్తుందిగాని అది లేని కవిత్వాలకు ఆయీ వుపాయాలు లేశమున్నూ పనిచేయవు. బాణుఁడికి పూర్వమందున్న కవులకేమీ చిక్కులేదుగాని తరవాత బయలుదేఱిన కవులకు-

"బాణోచ్ఛిష్టం జగత్సర్వమ్" అనే చిక్కు వచ్చింది. ఇది స్థూల దృష్టులమాట. యేదో మార్గాంతరాన్ని పురస్కరించుకొని శ్రీనాథాదులందఱూ పేరుతెచ్చుకొన్నారా, లేదా అంటే జవాబు లేదుకదా! పోతరాజుగారు బాణుఁడికి తరవాతివారే అయినా రసవంతమైన వాణి వుండడంచేత పేరు వచ్చింది. ఈలాగే పలువురు పేరుపొంది వున్నారు. దీన్ని గూర్చి మఱొకప్పుడు మాటాడుకుందాం. భీష్ముణ్ణిగూర్చి యెవరు వ్రాసినప్పటికీ పోతరాజుగారు వ్రాసినట్లుండదన్నది ప్రస్తుతం. భీష్ముఁడు చేసిన ప్రతిపనిన్నీ శాస్త్రసమ్మతమే అయిన దన్నందుకు ఆయనకు తటస్థించిన వుత్తమలోకావాప్తి సాక్ష్యమిస్తూ వుంది.

స్థూలదృష్టులేమో యితణ్ణి కృతఘ్నుఁడంటారు. అది సత్యదూరం. యితఁడు కృతాన్ని లేశమున్నూ మఱచింది లేదు, లేనేలేదు. శిష్యుణ్ణి కాదన్నాడా? లేదుకదా? దుర్యోధనుని తరఫునవుండి యుద్ధంచేస్తూ పాండవులకు తనగుట్టూ మట్టూ చెప్పడం యుక్తంకాదని స్థూలదృష్టులనడం కలదు. కాని సూక్ష్మదృష్ట్యా విచారిస్తే అదిన్నీ యుక్తంగా కనపడదంటాను. వుభయులున్నూ భీష్మునికి బాంధవ్యంలో వొక మాదిరివారే. ప్రవర్తనలో పాండవులు, ప్రేమించతగ్గవారవడంచేత భీష్మునికి పక్షపాతం చూపవలసి వచ్చింది. మొదటినుంచీ ఆ పక్షంలో వుండి తీరా యుద్ధ సమయానికి అక్కడనుంచి తప్పుకొనేయెడల యింకోమాదిరి అపయశస్సు వస్తుందికదా? అందుచేత ఆ పక్షాన్నే వుండి యుద్ధం చేయవలసివచ్చింది. అయినా తన శక్తిని లేశమున్నూ దాఁచుకోలేదు. దుర్యోధనుఁడికి యిచ్చిన వాగ్దానాలన్నీ నెఱవేర్చాఁడు. అదిన్నీకాక పదిరోజులు యేకాధ్వరంగా యుద్ధంచేశాఁడు శతవృద్ధు. అప్పుడేనా శిఖండిబాధ లేకపోతే అర్జునుఁడికి సాధ్యంకాకపోవునేమో? యిది యిలా వుంచుదాం. కర్ణుణ్ణి అర్ధరథులలో చేర్చడం భీష్ముఁడికి తీరని కళంకంగా చాలామంది భావిస్తారు. నిజానికి కర్ణుడు అర్జునునికన్న బాహుబలాదుల చేతఁగాని, జన్మచేతఁగాని తీసిపోయేవాఁడు కాఁడని భారతంలో పలుచోట్ల కనబడుతుంది. ఆ సందర్భం భీష్ముఁడు యెఱుఁగని వాఁడున్నూ కాఁడు. కనుకనే నిష్కారణంగా అవమానించినట్లయింది. దీనికి తగినజవాబులేదు. భవితవ్యం యెఱిఁగి వుండడంచేత దుర్యోధనుణ్ణి అనుత్సాహపరిస్తే యుద్ధం ఆఁగిపోతుందేమో? దానివల్ల జనక్షయంకావడం తప్పుతుందని భీష్ముఁడలా ప్రవర్తించవలసి వచ్చిందనుకోవాలి. భీష్ముఁడు కర్ణుణ్ణి యిటీవల తాను శరతల్పగతుఁడైన పిమ్మట మాట్లాడే సందర్భంలో యెంతో గౌరవించినట్లున్నూ భారతంలోనే కనపడుతుంది. పైకి యితరులతోపాటుగా భీష్ముఁడున్నూ కర్ణుణ్ణి సూతపుత్రుఁడంటూ నిరసించినా అసలు రహస్యం యెఱిఁగే వున్నాఁడు. యెఱిఁగిన్నీ ఆలా అపవదించడాన్ని సమర్థించవలసివస్తే సూతకులంలో చేరివుండడాన్ని పట్టి సమర్థించాలి. ప్రతీవారి చరిత్రానికిన్నీ యేవో నీహారలేశాలు వుండనే వుంటాయి. అవి ప్రాజ్ఞులంతగా గణించరు. మొత్తంలో యెక్కువగా సుగుణాలుండడమే కావలసింది. భారతవీరులలోనే కాదు యితరత్రకూడా యింత వుత్తమచరిత్ర కల మహనీయుఁడు మృగ్యుఁడు. యీయనవల్ల నేర్చుకోదగిన విశేషాలు లోకాని కెన్నో వున్నాయి. యెంతవాఁడూ కాకపోతే యీయన్ని గూర్చి కర్మఠులు ప్రతివత్సరమున్నూ మాఘమాసంలో తర్పణాలు వగైరాలు తమతమ పితృదేవతలకు విడిచినట్లు విడవడం తటస్థించదు కదా! విస్తరించవలసి యున్నప్పటికీ సంగ్రహంగా వ్రాసి యిప్పటికి దీన్ని ముగిస్తున్నాను.

★ ★ ★

# పశ్చాత్తాపము

సత్రాజిత్తుపేరు యెవరోగాని యెఱక్కుండా వుండగు యింతటి పరమోత్తముండు వేలకు వొక్కండుంటాండో వుండండో!

లోకంలో యెంతటి యోగ్యునికీ, యెంతటి బుద్ధిశాలికీ ప్రమాదం వుంటుంది. ఆ ప్రమాదం కొందఱికి కాలాంతరమందు తమకే గోచరిస్తుంది. కొందఱికో? యెవరో సూచించాక గోచరిస్తుంది. కొందఱికి యేవిధంచేతా గోచరించదు. అధవా గోచరిస్తుందే అనుకుందాం. తాను చేసిన తప్పిదాన్ని పశ్చాత్తాపంద్వారా తొలంగించుకొని నిర్దోషత్వాన్ని సంపాదించుకోవడం, "పెద్ద అవమానంగా" తోచి తన మనస్సు తనకు మంచిగా బోధిస్తూవున్నా, దానిబోధకు కట్టుపడక "తాంబట్టిన కుందేటికి మూండేకాళ్లు" అనే ధోరణిలోకి దిగి మొదటచేసిన దోషాన్ని వేయింతలుగా పెంపు చేసుకోవడమే తఱచుగా లోకంలో అనుభూతం. రాజ్యాదులు వున్న వారిని గూర్చి యీ విషయం మఱీ అనుభూతం. రాజుగారు తప్పుచేసినా దాన్నియెవరూ తప్పని తెలుపంగూడదు ప్రత్యుత, వొప్పుగా సమర్థించాలి. రాజసేవకులు మంత్రి, మొదలు కాళ్లు పిసికేవాండిదాంకా యీ గుణం వుంటేనేగాని వాండు యెందుకూ పనికిరాడూ. యీ గుణం గృహస్థుభార్యలకున్నూ ఆవశ్యకమే. భర్తచేసే తప్పులను భార్య బాగా తెలుసుకొన్నప్పటికీ చట్టన సూచించకూడదు. సూచిస్తేయెంతో ప్రాజ్ఞుండైతే తప్ప సర్వసాధారణంగా భర్త కోపోద్దీపితుండవుతాడు.

"పాతివ్రత్య" ధర్మాలు చాలా కఠినధోరణిలో వుంటాయి. ఆయీ ధర్మాలు భర్త పరమశుంఠగా వున్నా, దుర్మార్గుండుగా వున్నా, అప్రయోజకుండుగా వున్నా ఆయనపట్ల భార్య చెల్లించవలసినవే, పైకి అడగి మడంగి చెల్లించినా హృదయంలో భర్తయొక్క "అపాత్రత్వం" గోచరించకపోదు. కాని ఆలా గోచరించడంకూడా తప్పిదమే అన్నారు. విషయం విషయాంతరములోకి దూంకుతూవుంది. అసలు వ్యాసం-

"సత్రాజిత్తు" యోగ్యతనుగూర్చి ఆరంభించాను. ఇతండు పెద్ద తప్పిదాన్ని చేశాండు మొట్టమొదట; ఆ తప్పిదంయొక్క స్వరూపం అక్షరాస్యులందఱూ యెఱింగిందే, అయినా వివరిస్తాను. సూర్యోపాస్తి ద్వారా తాను- "శ్యమంతకమణిని" సంపాదించుకుంటే, అది కృష్ణమూర్తి అపహరించినట్లు అభిప్రాయపడి ఆ హరిమీద "నీలాపనింద" ఆరోపించాడు.

పిమ్మట దాని తత్త్వాన్ని కృష్ణమూర్తి తెల్పడం జరిగింది. ఆలా యథార్థం తెలిసినా మఱొకఁడే అయితే యింకా యేవో శషభిషలు కల్పించి వంకర త్రోవలు తొక్కేవాఁడేమోకాని సత్రాజిత్తులేశమూ అట్టి మార్గంలోకి దిగక పశ్చాత్తాపాన్ని పొంది యీ విధంగా పరితపించాఁడు పాపం?-

మ. మితభాషిత్వము మాని యేల హరిపై మిథ్యాపవాదంబు బూ
న్చితి నీ దేహము. ... ... (తరువాయి భాగవతంలో చూ.)

క. పాపాత్ముల పాపములన్
బాపంగాఁ జాలునట్టి పరమాత్మునిపై
పాపము గలదని పలికిన
పాపాత్ముని పాపమునకుఁ బారముగలదే.

యింకా యీవిషయం భాగవతంలోకన్న స్కాందంలో విస్తరించివుంది. సత్రాజిత్తు పశ్చాత్తపించి కూఁతురు సత్యభామను మాణిక్యంతో సహా శ్రీహరికి కానుకగా సమర్పించాడు. కాని శ్రీకృష్ణుడు శ్యమంతకాన్ని మళ్లా యిచ్చేశాఁడు. యిటీవల "శతధన్వుఁడు" కాఁబోలును ఆ యీ మణికోసం సత్రాజిత్తును వధించడం జరిగింది. ఆ సమయానికి శ్రీకృష్ణ భగవానుఁడు ద్వారకలో లేఁడు. సత్యభామ తన తండ్రికి జరిగిన ఘోరాన్ని స్వయంగా హస్తినాపురంలోనున్న కృష్ణునకు తెల్పినట్టున్నూ పిమ్మట కృష్ణబలరాములు కల్పించు కున్నట్లున్నూ శతధన్వుఁడు పాటిపోయినట్లున్నూ వెంబడించి పట్టుకోఁబోయేటప్పటికి యీ లోగా గమనాయాసంచేత శతధన్వుఁడు మరణించినట్టున్నూ స్కాందంలోవుంది.

"శ్యమంతకాన్ని" అక్రూరునివద్ద దాఁచి శతధన్వుఁడు పాటిపోవడంచేత శతధన్వుని వద్ద మాణిక్యం దొరకలేదు. బలరాముడు తనకు తెలియకుండా దాన్ని తమ్ముఁడు అపహరించినట్టనుమానపడి కృష్ణుణ్ణి ద్వేషించడం వగైరా స్కాందంలోవుంది. మనం ముఖ్యంగా ఆ యీయితిహాసంవల్ల నేర్చుకోతగ్గనీతి పశ్చాత్తాపం. పొరపాటు యెంతవానికీ వస్తుంది. దాన్ని పురస్కరించుకొని యెవరిమీఁదేనా 'దోషాన్ని' ఆపాదించడం జరిగితే దాని తత్త్వం తెలిసే వఱకే కాని తెలిశాక దాని సమర్థనానికి ప్రయత్నించడంకంటె ప్రాజ్ఞులకు పశ్చాత్తాపాన్ని సూచించడం ఉత్తమ ధర్మం. దానివల్ల ఆ పాపం నశిస్తుంది. ఆత్మకు శాంతి కలుగుతుంది. ఉత్తముని హృదయం బహు కోమలంగా వుంటుంది. అట్టి హృదయం గల మహనీయుఁడు నిజమైన విషయంకూడా యితరుణ్ణి బాధించేదిగా తోస్తే వుదహరించడానికి జంకుతాఁడు. అట్టి స్థితిలో సందిగ్ధాంశాన్ని గుఱించి చెప్పనక్కఱలేదు. వున్న దోషాన్నేనా ఉత్తములు చెప్పుకోడానికి జంకుతారు. దానిక్కారణం ఆలా చెప్పుకోవడం

ఆ దోషం అసలు చేసిన వ్యక్తిని వదిలి చెప్పుకొనేవారికి సంక్రమిస్తుందని అభియుక్తులు చెప్పఁగా వినడం, మన ధర్మాలుచాలా "అసిధారావ్రతం" మాదిరిగా వుంటాయి. అతిథి పూజ ప్రతి గృహస్థుకూ తనకు వున్నంతలో అవశ్యాచరణీయంగా ధర్మ శాస్త్రాలు చెపుతాయి. అసలు గృహస్థు యింట్లో వండే వంట ఆత్మార్థంగా చేయనే కూడదన్నారు.

"యతీచ బ్రహ్మచారీచ పక్వాన్న స్వామినౌ" అని వుంది అతిథి ప్రకరణంలో. యితర ఖండవాసులు దీన్ని చూచి యీ శాస్త్రకర్తకు మతి లేదని సిద్ధాంతీకరిస్తారు. యింకోవిశేషం, పగలు వచ్చిన అతిథిని అవకాశం లేకపోతే యింకోచోటికి వెళ్లవలసిందని చెప్పవచ్చును గాని రాత్రి తీరా భోజనంవేళకు వచ్చిన అతిథినో? ఆలా వెళ్లమనడానికి వల్లకాదన్నారు. అతనిపేరు "సూర్యోఢుఁడు". అతణ్ణిలేదు పోవలసిందని ప్రత్యాఖ్యానంచేసే పక్షంలో అతఁడు నిరాశుఁడై వెడుతూ ఆ యీగృహస్థు ఇంతకు లోఁగడ చేసుకున్న యావత్తు సుకృతాన్నీ (అణా పైసలతోసహా) తీసుకుపోతాఁడట. ఆ యీ సూర్యోఢుణ్ణిగూర్చి యింత గౌరవించడానిక్కారణం యేదో వూరుగాని వూరునుంచి వచ్చి ఎవరో ఫలానా వారింటికెడితే అన్నం దొరుకుతుందనిచెప్పిన మాటమీఁద వారింటికెడితే వారు లేదుపొమ్మంటే ఆ చీకటిలో లేదా వెన్నెలే అనుకుందాం, ఆ అతిథి యెక్కడికి వెళ్లఁగలుగుతాఁడు పాపం అందుచేత యింత నిక్కచ్చిగా శాసించాఁడు ధర్మ శాస్త్రకర్త. మనదేశం యీ అతిథి పూజలకు పెట్టుకుంది పేరు. యిప్పటికీ యెందఱో వున్నారు. అజ్జాడ ఆదిభొట్ల అన్నయ్యగారినే (పేరు బాగా జ్ఞప్తికి లేదు) కాఁబోలును యెంతో గొప్పగా చెప్పుకుంటారు, డొక్కా సీతమ్మ గారిని సరేసరి, యెన్నో దానాలున్నా "నాన్నోదక సమందానమ్"

సరే యిది విషయాంతరం. యీలాటి సుకృతాత్ములను పేర్కోవడంవల్లకూడా పుణ్యంవస్తుందని చెప్పినట్లే, నిజమైన పాపాత్ముల పాపాలనుగూర్చి ప్రసంగించుకోవడం కూడా పాపాన్ని సంపాదిస్తుందని మన పెద్దలు వుపేక్షిస్తారు.

"కథాఉపిఖలు పాపానామల మశ్రేయసే"

అట్టి స్థితిలో యేవ్యక్తిమీఁద నేనా వృథాగా "అపాండవం" కల్పించి దాన్ని వ్యాప్తిలోకి తేవడం మన పెద్దలే కాదు ఎవరిపెద్దలూ అంగీకరించరు. ప్రస్తుతం సత్రాజిత్తు శ్రీకృష్ణ భగవానుణ్ణిఁగూర్చి అపోహపడడానికి కొంత అవకాశంవుంది. శ్రీకృష్ణుఁడు అతని దృష్టికి (చుట్టమవడంచేత) మనుష్య మాత్రుఁడుగానే తోఁచివుంటాఁడు. కృష్ణుని జీవితకాలంలో ఆయన్ని భగవదవతారంగా గుర్తించినవారు భీష్ముఁడు, విదురుఁడు, అక్రూరుఁడు మొదలైన కొందఱుమాత్రమే. శిశుపాలుఁడు, దుర్యోధనుఁడు, లోనైనవాళ్లు ఆమరణాంతమూ యథార్థాన్ని గుర్తించనే లేదు. ఆ యీ సందర్భం యీ పద్యం తెల్పుతుంది.

మ. భగవంతు డితఁడంచు స్పష్టపడియెన్ బాహాబల ప్రౌఢిచే
నగధారిత్వముచే విశిష్టముని మాన్యత్వమ్ముచే విశ్వరూ
పగతిన్ జూపుటచే ననేకగతులన్ బ్రహ్మాదులర్చించు లో
కగురున్ జిష్ణుని విష్ణునక్కటకటా? గైకోఁడు వీఁడంధుఁడై

యీ వాక్యం భీష్మునిది. కొన్ని మానవచర్యలు చూచి సామాన్యులు మానవుఁడే యని భ్రమించుట కవకాశం లేకపోలేదు, ఆ సందర్భాలు ఋషులు చర్చించి తత్వాన్ని అక్కడక్కడ పురాణాలలో నిరూపించి వున్నారు. సత్రాజిత్తు శిశుపాలాదులంబలె ద్వేషికాకున్ననూ తాను కష్టించి ఆర్జించుకొన్న మాణిక్యాన్ని అతఁడు అపహరించాడనే అపోహవల్ల మొట్టమొదట కొంత అవ్యక్తప్రసంగం చేస్తే చేశాఁడుగాక. తుదకు యథార్థం గోచరించిన ఉత్తర క్షణమందే ఆ దోషనివృత్తిని చేసుకుని పరిశుద్ధుఁడవడంచేత సత్రాజిత్తు యింతగా శ్లాఘ్యుఁడైనాఁడు. లోకంలో యిట్టి నిషధయోగ్యుల సంఖ్య చాలా తక్కువగా వుంటుంది. పూర్వంమాట చెప్పలేంగాని యీ కాలంలో అబద్ధాలాడడానికి అవకాశాలు చాలా యేర్పడ్డాయి. ఆఖరికి అబద్ధమేదో సుబద్ధమేదో? నిర్ణయించడానికి అవకాశమే లేకుండా పోయింది. ఆలాటి చిత్రవిచిత్రమైన రూల్సు బోలెడు ఆవిర్భవించాయి. వీట్లనిగూర్చి మఱొకప్పుడు చూచుకుందాం.

సత్రాజిత్తు వంటి సత్పురుషులు యీ కాలంలో తక్కువగా వుంటారని మాత్రం తెలుసుకుందాం. ముఖ్యంగా పిడివాదాలు వాదించే కవులూ, పండితులూ ఆ యీ సత్రాజిత్తు మార్గం తెలుసుకుంటే "పాండిత్య వాదాలు" విస్తరించి పెరగవు. మొదట దేనినేనా తప్పంటా మనుకోండి, అలా అనడం తెలియకపోవడంచేత యెంతటివాఁడికీ అనివార్యమే. తరువాత యే భారతమో! యే రామాయణమో అది తప్పు కాదని బోధిస్తుంది. అంతటితో "ఆ వాదం" వదలుకొని ఉన్న యథార్థాన్ని ప్రకటిస్తే దానితో అది ఆఁగిపోతుంది. అప్పుడు ఆ పండితులు సత్రాజిత్తువంటి వారవుతారు. తమ తప్పును వొప్పుకున్నంతట్లో వచ్చే అగౌరవం లేశమూ వుండదు. ఆయావిషయంలో మనకన్నా పాశ్చాత్యులు శ్లాఘ్యులేమో అని నేననుకుంటాను. ఆ దేశ చరిత్రలు బాగా తెలిసినవారుగాని నా అభిప్రాయాన్ని నిర్ణయించలేరు. ఉత్తములు ప్రతి ఖండంలోనూ వుంటారు.

తేభ్యో మహద్భ్యోనమః

★ ★ ★

# ఏది అహింస?

అహింసను సర్వోత్కృష్టంగా అంగీకరించని వేదంగాని, పురాణంగాని, మతంగాని, జాతిగాని లేదనే చెప్పవచ్చునుగాని యేదో విధంగా అందఱూ చేస్తూనే వున్నారు. దక్షిణ హిందూస్థానంలో వుండే పంచద్రావిళ్లు (బ్రాహ్మలు)న్నూ, చాలామట్టుకు వీరి ఆచారాలనే ఆచరించి దినకృత్యాలు నడుపుకొనే వైశ్యులున్నూ, విశ్వబ్రాహ్మణులలో కొందఱున్నూ, యీ హింసకు దూరంగా వర్తిస్తున్నారని చెప్పవచ్చును. బ్రాహ్మణులలో శిష్టులు "వైశ్వదేవం" చేయటం తప్పని విధిగా జరిగే స్వల్పజంతుహింసవల్ల సంభవించే దోషాన్ని పోఁగొట్టు కోవడానికే.

"పంచసూనాలు" అనేవి తప్పక సంఘటిస్తాయి. చీమలు, చెదపురుగులు, నల్లులు, పేలు, దోమలు మొదలైనవాట్లను బుద్ధిపూర్వకంగా కాక పోయినా హింసించకుండా జీవితం నెఱవేఱదు. వీటిలో నల్లులూ పేలూ అనే వాట్లను చంపకుండా కాలక్షేపం జరుగుతుంది. పందిరి పట్టిమంచాలు వగయిరాలు వదులుకొని చర్మాలమీద పరుండడంవల్ల నల్లులపీడ తప్పుతుంది. కాని ఆ పద్ధతిని చర్మాలకు గిరాకీ యెక్కువగా తగిలి యింతకన్న పెద్ద పాపానికి అవకాశం కలిగించుకున్నట్లవుతుంది. స్థూలదృష్టిని పోవలసిందేగాని యీ "అహింసను" సూక్ష్మదృష్ట్యా విచారిస్తే మఱీ అయోమయంలో పడ్డట్లవుతుంది. మార్వాడీలలో "జైనమతస్థులు" రాత్రి దీపం పెట్టకపూర్వమే భోజనం నెరవేర్చుకుంటారు. నల్లులున్న మంచానికి కొంచెంసేపు తమ శరీరాన్ని విందుగా అర్పిస్తారు. వారిలో సన్యాసులు కట్టిన వస్త్రం వుతకరు. దంతధావనం చేయరు. సూక్ష్మ జంతువులేవో కొన్నిటికి హాని కలుగుతుందనియ్యేవే. యేదేనా అతిలోకిపోతే వెఱ్ఱిగా కనపడుతుంది, అందుచేతనే-

"అతి సర్వత్రవర్జయేత్" అన్నారు అభియుక్తులు. యీ అహింసా విషయంలో దాక్షిణాత్య బ్రాహ్మణులు (పంచద్రావిళ్లు) అవలంబించిన మార్గమే శ్లాఘ్యంగా కనపడుతుందిగాని ఆయీ అయిదు తెగలలోనూ ఆంధ్రులున్నూ ద్రావిళ్లున్నూ యజ్ఞాలలో ప్రత్యక్ష పశుహింస చేయడం (వేదసమ్మతమే అయినా) ఘోరంగా కనపడుతుంది. ఆయీ హింసకు వేదసమ్మతివున్నదని యెఱిఁగిన ఋషులే కొందఱు నిషేధించినట్లు ఆ పురాణవాక్యాలే రుజువిస్తాయి.

క. కర్మము లను నెపమున దు
ష్కర్మమ్మగు హింస సలుపఁగాఁజేయుచు నం
తర్మదమువెంచు నాగమ
మర్మమ్ముల నామనంబు మసలదు తండ్రీ.

ఇది శ్రీశుకుని వాక్యం. ఇంతేకాదు "జన్నములు పెక్కు పశుహింస సలుపకుండ" అని శౌనకుఁడు సూతునితో ప్రసంగించే ఘట్టంలో కనపడుతుంది - కాఁబట్టి హింసకు మనస్సంగీకరింపక పూర్వ ఋషులు పిష్టపశువుతో యజ్ఞాలు సాగించుకొన్నట్లు స్పష్టంగా గోచరిస్తుంది. ఆయీ ఋషుల మతాన్ని వైదికమతానుయాయులు ద్వైతులూ, విశిష్టాద్వైతులూ (కొందఱుమాత్రమే) అవలంబించారుగాని అద్వైతులుమాత్రం అవలంబించలేదు. అయితే వీరు దయాదూరు లేమో అంటే, అట్టివారు కారు. వేదమును అతిక్రమించి చేసే యజ్ఞం నిష్ఫలమన్ని వీరి తాత్పర్యం. పిష్ట పశువుతో కర్మకలాపాన్ని నిర్వర్తించుకొనే ద్వైతమతస్థులు లోనైన వారి మీఁద వీరుకొన్ని పూర్వపక్షాలు చేస్తారు. కాని అవి యుక్తియుక్తంగా వున్నట్లు తోచినా ఆదరణీయాలు కావు. కనకనే జీవహింసకు జంకేవారెవ్వరూ పాటించినట్లులేదు. మాంసభక్షకులు మనుష్యేతర జంతువులన్నీ మనుష్యుని కుక్షిని పూరించడానికే జన్మించినట్లు చెప్పడం యేలాటిదో అద్వైతుల పూర్వపక్షాలున్నూ అట్టివే. వేయి చెప్పండి యీ విషయంలో బుద్ధుఁడే ఆశ్రయణీయుఁడు. మనువు "న మాంస భక్షణే దోషం" అని వ్రాసిన మాట సత్యం. అప్పటికి సర్వులూ మాంసభక్షకులే కనక ఆలా వ్రాయవలసి వచ్చిందని తోస్తుంది. దానితోపాటు మఱి రెండుకూడా సమ్మతించి, వెంటనే-

"ప్రవృత్తి రేషా భూతానామ్" అని అనువదించి పిమ్మట తన అభిప్రాయాన్ని యీవిధంగా నిర్వచించాఁడు. "నివృత్తిస్తు మహాఫలా" ఆయీ తుదివాక్యం వల్ల దానినుండి తప్పుకున్నవారు ధర్మాత్ములు అని తేలింది. దీన్ని పురస్కరించుకొనే "మ్రానను రాతనుంగలదె? మాంసము ప్రాణుల మేనఁగాక" అని భారతంలో నిషేధం కనబడుతుంది. భీష్ముడంతటివాఁడు దీన్ని ఖండితంగా నిషేధించలేక మనువులాగే మానడం మంచిదని వూరుకున్నాడు, కాని మొత్తం ప్రపంచంమీఁద యావత్తు ఖండాలలోనూ పరిశీలిస్తే ప్రతిరోజూ యెన్నికోట్ల జీవరాసులు (కోళ్లు, మేకలు, యెద్దు వగయిరాలు) మానవుల కుక్షిలో జీర్ణిస్తున్నా ఆయాజాతులు దినదినాభివృద్ధిగా పెరుగుతూ వుండడం చూస్తే మాంస భక్షకుల యుక్తికూడా సమంజసమేమో అనిపిస్తుంది. అంతేకాదు, బుద్ధుని అభిప్రాయం ప్రకారం యావన్మందీ శాకభక్షకులే అయితే ఆయీ జంతువులు నివసించడానికిన్నీ ఆహారం సంపాదించుకోవడానికిన్నీ మఱికొన్ని ద్వీపాలను సృష్టించవలసివస్తుందేమో సృష్టికర్తకు

అనిన్నీ స్థూలదృష్టులకు గోచరిస్తుంది. కానిఅట్టి అవసరమే కలిగితే 'యిచ్ఛామాత్రం ప్రభోస్సృష్టిః' కనక ఆ పరమదయాకరుడు అట్టి సదుపాయాన్ని చేయనే లేడా? క్షణంకూడా ఆయీ పనికి ఆయనకు పట్టదు. కనక మాంసభక్షకులు చెప్పేయుక్తి ఆపాతరమణీయమే కాని విమర్శకాని విమర్శనాసహంకాని కాదు. మాంసంతినే వారిలో బహుమంది సమ్మతిలేకుండా తినేవారుగానే వుంటారు. వారివారి గృహావరణలో యీహింస జరగకపోవడంచేత వారికి అంతగా మనస్సు చలింపదు. వేఁటలో ప్రవర్తించే జమీందార్లు వగయిరా దయాశీలురే అయినా "పిల్లికి చెలగాటం" సామెతగా వారి కది హింసగానే తోఁచదు. దీని బాధముఖ్యంగా "కసాయీలకు" గోచరిస్తుందనుకోవాలి; కాని వారి కది నిత్యకృత్యంగాయేర్పడడంచేత దుఃఖ జనకం కాదనుకోవాలి. పాపం పంచుకోవలసివస్తే మాత్రం "మాంస భక్షకులకు" హింసకులతోపాటు భాగం తప్పదనే అనుకోవాలి–

"చత్వారస్సమభాగినః" నాకు యింకోశంక తోస్తుంది. యేదోవొక ప్రాణికి వేఱొక ప్రాణివల్ల హింస తటస్థిస్తే బోలెఁడు పాపం వస్తుందని నిర్ణయించి దానికై ఎన్నో నరకాలు అనుభవించాలని శాస్త్రకర్తలు వ్రాశారుకదా? నేటి "డిక్టేటర్లు" కారణంగా యెన్నికోట్ల ప్రాణులో హతమవుతూ వున్నారుకదా? ఆయీ కారకులకు సరిపడ్డ నరకాలు యెన్ని కల్పాల కాలంలో సృష్టికర్త నిర్మించగలుగుతాడో పాపం!

అన్నిటికీ ఒకటే జవాబు – 'ఇచ్ఛామాత్రం ప్రభోస్సృష్టిః' పాపమంటూ భయపడేవానికే భయంగాని అది లేనివానికి భయమేలేదు.

"నరకేసతి కో దోషో, మరణే సతి కిం భయమ్" వొకఁడేమో వరుసగా యేడు కఱవులు వస్తాయని భయపడుతూ వుంటే వేఱొకఁడు చూచి, వొరేఁ ఆ కఱవులలో మొదటిదానిలోనే మనం నశిస్తే తక్కిన ఆఱింటివల్ల మనకేం భయం కలుగుతుంది, అన్నాఁడని పెద్దలు చెబుతారు. అందుచేత లోకనాశకారకుల శిక్షానిర్ణయాన్ని కూర్చి భగవంతుఁడు భయపడవలసినదే గాని అనుభవించేవాళ్లు లేశమూ భయపడరు.

"కర్మణో గహనాగతిః" అన్నట్టు దేన్ని గుఱించేనా పైపైని చర్చించి వూరుకుంటే తప్ప లోలోపలికి పోయివిచారిస్తే దురవగాహంగానే కనపడుతుంది. "ఈశ్వరస్సర్వ భూతానాం హృద్దేశేஉర్జున తిష్ఠతి" అనేమాట తోసివేయతగ్గదికాదు. ఏనుగులో వున్నట్టే దోమలోనో యింకా కింది తరగతి సూక్ష్మజంతువులోనో యీశ్వరసత్తను–

"అణోరణీయాన్ మహతో మహీయాన్" కనక వొప్పితీరాలి. నల్లికి మరణభయం వుందని దానిచేష్టలవల్ల గోచరిస్తుంది. చీమలు వగైరా సూక్ష్మజీవులలో యీభయం

అన్నిటికీవున్నా నల్లిని పేర్కొనడానిక్కారణము అక్కడ బాగా గోచరిస్తుందనియ్యేవే. కర్మఠులు ఆయీ సూక్ష్మజంతువులనుకూడా బుద్ధిపూర్వకంగా చంపరు కాని అప్రయత్నంగా విధిలేక కొన్ని తమవల్ల చచ్చుట తప్పదని తద్దోష పరిహారానికి యేదో వుపాయం-

"వైశ్వదేవం" లోఁగడ వుదహరించాను. దానిచేవారు 'యదహ్నాత్కురుతుపాపం తదహ్నాత్ప్రతి ముచ్చతే' అని నరకభయవిదూరులై జీవించుచున్నారు. దీనినిబట్టి చూస్తే ఆయీ వైదికమతం యెంతపుణ్యం చేసుకున్నవాళ్లకోగాని సంఘటింపదని చెప్పనక్కరలేదు. కాని అయితే యేం లాభం. ఆయీ మతస్థులుగా జన్మించిన్నీ, యే నికృష్టులూ చేయని పనులుచేసే సంతతినిగని భ్రష్టులమగుచున్నాం గదాయని విచారించవలసి వచ్చింది. ఆయీ విపత్తు యుగదోషం కింద జమకట్టి వూరుకున్నారు ధర్మశాస్త్రకర్తలు. యుగదోషానికి అంగీకరిస్తూ కృతయుగం పుణ్యభూయిష్ఠమే అయినా క్వాచిత్కంగా అక్కడక్కడ- "పాపాత్ములు" వున్నట్టే యీకలిలోకూడా "పుణ్యపురుషులు" వుండే వుండవచ్చునని పురాణవాక్యాలు కనపడుతూన్నాయి. యిది విషయాంతరం. ప్రస్తుతం "అహింస" దీనికి యెంతదగ్గిరలో సంచరిస్తే అంత పుణ్యజన్మ అనడంలో విప్రతిపత్తిలేదు. శాక భక్షకులకు కూడా "హింస" అనివార్యమని కొందఱంటారు. చెట్లకు, లతలకు, వీట్లకు నోరులేదుగాని "సుఖదుఃఖాలు" కలవనే పరిశీలిస్తే తోస్తుంది.

"పృథివ్యా ఓషధయః, ఓషధీభ్యోన్నం" అనడంవల్ల భగవంతుఁడు మనకు జీవనోపాధిగా యేర్పఱచిన "అన్నం" ఓషధులవల్లనే నిష్పన్నంకావాలి. అందుచేత అహింస తప్పదనుకోవాలి. అన్నీ హింసలే అయినా వాట్లలో- "తారతమ్యం" వుంటుంది. యేనుగుకూ దోమకూ భేదం పాటించక తప్పదు. "అతిసర్వత్ర వర్జయేత్" తోటకూరవంటిదే గోవూ అని వాదిస్తే లాభంలేదు. తనకు వీలున్నంతలో "అహింసాపరుఁడై" వర్తించేవాఁడు యేజాతివాఁడైనా ధన్యుఁడు! ధన్యుఁడు! ధన్యుఁడు!

★ ★ ★

# అతిక్షమ దైన్యాపాదకమా?

క. "క్షమ మేలగు నైన నతి
క్షమదైన్యము దెచ్చు నెదురు గర్వించినఁగ
య్యముమొడిచి గెలిచి యరిశే
షమునెడసదయక్షమావిశదుఁ డగుటొప్పున్"

అంటూ శ్రీమహాభారతములోవుంది. దీనితాత్పర్యం యెఱుఁగనివారే వుండరు. యేముంది యిందులో? శాంతిగా వుండడమైతే చాలా మంచిదేకాని- "అతి సర్వత్ర వర్జయేత్" కనుక మిక్కిలీ శాంతిమాత్రం పనికిరాదు సుమా! అని ఫలితార్థం. యీసందర్భం మనఋషులందఱూ పాటించేవున్నారు. కాని యెప్పుడో వకప్పుడు ప్రతిఋషిన్నీ వ్రతభంగంచేసుకున్నట్టుకూడా కనపడుతూనే వుంటుంది. అంతమాత్రంచేత వారు శాంతిధనులు కారనుకోవడానికి వల్లకాదు. ఆ మహర్షులకు యీశాంతి వక్కటి మాత్రమేకాదు; దీనితోపాటు ఇంకా మఱికొన్ని సుగుణాలు యెప్పుడూ యెడఁబాయకుండా వున్నట్లు గ్రంథాలవల్ల గోచరిస్తుంది.

శా. "ఆలస్యంబొకయింతలేదు శుచి యాహారంబు నిత్యక్రియా
జాలంబేమఱ మర్చనీయు లతిథుల్ సత్యంబ పల్కంబడున్
మేలై శాంతియు బ్రహ్మచర్యమును నెమ్మిందాల్తు మట్లొటనె
క్కాలమ్ముం బటు మృత్యురోగ భయశంకల్ వొంద మే మిమ్ములన్."

ఈ పద్యంలో వున్న లక్షణాలన్నీ సత్త్వగుణానికి సంబంధించినవే. యిట్టి సాత్త్వికవృత్తి యిహపరలోకములు రెండిటికిన్నీ మెప్పు సంపాదించేదే. చతుస్సముద్ర ముద్రితమైన ధరామండలాన్ని, లేదా స్వర్గమర్త్య పాతాళలోకాలు మూఁడింటినిన్నీ పరిపాలించడంకన్న యీశాంతి మహా సామ్రాజ్యాన్ని పరిపాలించడమే పరమోత్కృష్టమంటే విజ్ఞులెవరూ కాదనరు కాని త్రిలోకాధిపత్యాన్నేనా సంపాదింపవచ్చు నేమోకాని దీన్ని సంపాదించడం కష్టసాధ్యమూ కాదు అంటే కేవలమూ అసాధ్యమే అనుకోవాలి. భారతపద్యంలో శాంతినయితే సామాన్యతః విధించడం జరిగిందిగాని వొక్కొకప్పుడు అశాంతిని వర్జించడానికి కూడా అభ్యనుజ్ఞ యిచ్చినట్లు తేలుతూవుంది. ఆ పద్ధతిని లోకంలో అందఱూ శాంతులే అనిపించుకుంటారు.

యెవరో తప్ప తగినంత అవసరం కలిగేదాఁకా సర్వులూ శాంతంగానే వుంటారు. భారవి మహాకవికూడా భారతా న్ననుసరించే యీ క్రిందివిధంగా శాంతినిగూర్చి వ్రాశాఁడు -

శ్లో. "శుచి భూషయతి శ్రుతం వపుః ప్రశమస్తస్య భవత్యలంక్రియా,
ప్రశమాభరణం పరాక్రమస్స నయాపాదిత సిద్ధిభూషణః"

దీనిలో పరాక్రమాన్ని శాంతికి భూషణంగా భారవిగారు చిత్రించారు కానీ అది రాజనీతికి విరోధించకూడదని వకవిశేషణంద్వారా కనపతిచారు. దీన్నిబట్టి యిది క్షత్రియ విషయమని స్పష్టమే. యేమైనా అవసరానవసరాలనుబట్టి శాంతి వహించనూవచ్చు, పరిత్యజించనూవచ్చు అని తేల్చినట్లయింది.

మొత్తం మనగ్రంథాలు యెన్ని పరిశీలించినప్పటికీ యీ శాంతి విషయము "ఉదితానుదిత హోమం" వలెనే పాక్షికంగా వుంటుంది కాని సార్వకాలికంగా కనపడదు. పోనీ ఆచరణలోనేనా నిత్యత్వం కనపడుతుందేమో అంటే? అదిన్నీ మృగ్యమే. చ్యవనుఁడంతటి బ్రాహ్మణుఁడు మహాతపస్వి మహావృద్ధు, దేహాభిమానంకూడా వదులుకొన్నవాఁడు యెఱక్క సుకన్య చేసిన అపచారాన్ని సహించక సుకన్యనే కాకుండా ఆమె తల్లిదండ్రులనూ ఇంకా వుండే వారి పరివారాన్నీ కూడా మలమూత్రబద్ధంచేత బాధపడేటట్టు శపించాఁడు కదాఁ! వసిష్ఠ విశ్వామిత్రాదులనుగూర్చిన యితిహాసాలు కూడా యింతకన్నా అధ్వాన్నంగానే వుంటాయి. వాట్లని యిక్కడ వుదాహరించి కథ పెంచడం అనవసరం. వొక్క శమీకుఁడు కాఁబోలును! పరీక్షిత్తుచేసిన అపచారానికి లేశమున్నూ శాంతిని గోలుపోలేదు సరికదా! పైఁగా తన కొడుకు శైశవావస్థలో వుండి చేసిన కార్యానికికూడా చాలా విచారించి "తండ్రీ! యీ అకార్యాన్ని యెందుకు చేశా?" వంటూ చాలా పశ్చాత్తాప పడ్డట్టు భాగవతంవల్ల మనకు అవగత మవుతుంది. యింకా యీలాటి శాంతిపరు లెవరేనా వున్నారేమో? గ్రంథాలు వెదికి చూడాలి. పరీక్షిత్తు చేసిన పని చాలా నీచప్పని. మహారాజకుటుంబంలో, అందులో నున్నూ పరమ ధార్మికులనిపించుకొన్న పాండవుల వంశంలో పుట్టినవాఁడు చేయదగిందికాదు. యింతకూ ఆ ఋషి చేసిన అపచారం లేశమున్నూ కనపడదు. తపస్సమాధిలోవుండికదా తనకు ఆతిథ్యాన్ని యివ్వకపోవడం తటస్థించింది! అట్టి సందర్భంలో మృతసర్పాన్ని తెచ్చి ఆ తపోధనుని మెడకు తగల్చడం మిక్కిలీ కొంటెపని. ఇట్టి పనులు యెవ్వరి పరిపాలనలోనూకూడా జరిగి వుండవేమో? కొన్ని కథలు తులసిమొక్క మొదలైనవాట్లకు సంబంధించినవి మనవాళ్లు చెప్పుకుంటూ వుంటారు. ఆ కథలు నిజమే అయితే ప్రస్తుతాన్ని అవి అనుకరిస్తాయి. ఆర్యక్షత్రియుఁడు చేయవలసిన పనికాదు కదా అది! అనార్యుఁడు చేయడానికిఁగాని

చేసినవాణ్ణి క్షమించడానికిఁగాని వీలైనపనికూడా కాదది. అయినా ఆ పనిని ఆ పరీక్షిత్తు రాజుగా వుండి యేలాగో చేశాఁడు. ఆశమీకుఁడు యేలాగో క్షమించాఁడు. అంతకు పూర్వకాలంలోగానీ, యిటీవలికాలంలోఁగానీ ఆ శమీకుని వంటివాళ్లు లేనే లేరనుకుంటూ వుంటే లేకేం వున్నాఁడని చెప్పుకోవడానికి మహాత్మాగాంధీగారు అవతరించారు. ఈయన శాంతికిన్నీ మన భారతంలో వున్న దానికిన్నీ పోలిక లేనేలేదు. "అతిక్షమదైన్యం తెస్తుం"దని మన మహాభారతం చెపితే చెప్పిందిగాక యీ మహాత్ముని ప్రవృత్తి దాన్ని అన్యథాకరించి దైన్యం తేవడానికి బదులు దైన్యాన్ని పాఱఁదోలుతుందని వొప్పుకోక తప్పని విధి అవుతూ వుంది.

గాంధీగారి సిద్ధాంతాలన్నిటినీ ఆమ్నాయాలుగా శిరసావహించే వాళ్లు చాలామంది వున్నారు. యేకొందఱో వారి సిద్ధాంతాలంటే అంగీకరించనివాళ్లున్నూ వున్నారు. నే నీరెండో తెగలోవాణ్ణి. దేవాలయాలు పుట్టడానికి మూలం ఆగమాలు. ఆ ఆగమాలు వర్ణవ్యవస్థ వగైరాలకు కట్టుబడి "వారికి అంతవఱ"కనిన్నీ "వీరికింతవఱ"కనిన్నీ దేవతాసాన్నిధ్య గమనాన్ని గూర్చి వ్రాసివున్నాయి. ఆ వ్యవస్థను పూర్తిగా గాంధీగారు తొలగించివున్నారు. ప్రజాబాహుళ్యాభిప్రాయాన్ని తోసివేయలేక అర్చకులు ఆగమాలమాట తలపెట్టక జీవనోపాధి చెడుతుందని అన్నిటికీ సిద్ధపడవలసినవాళ్లయినారు. ఆయీ సందర్భాలుకూడా శాంతి పురస్సరంగానే త్రికరణశుద్ధిగా మహాత్ముఁడు నడిపినప్పటికీ బాగా ఆలోచించిచూస్తే యిందులో కొంత పశుబలంవుందిగాని లేకపోలేదు. "చండాలోఽస్తు సతుద్విజోఽస్తు గురుః" అనే శాంకరవచనం గృహస్థ విషయంకాదు. సర్వసంగ పరిత్యాగం చేసిన సన్న్యాసులవిషయం. గాంధీగారు నిజమైన సన్న్యాసు లనిపించుకునే యెవరికిఁగాని దీసిపోరు సరిగదా! పైపెచ్చు వారినందరినిన్నీ అతిక్రమిస్తారేమో! అని కూడా వారి ప్రవర్తనవల్ల గోచరిస్తుంది. అట్టివారికి దేవాలయాలు సర్వే సర్వత్ర అందఱికీ సమానమైన హక్కుకలవిగా కనపడ్డప్పటికీ గృహస్థులకు యితరభేదాలతో పాటు యిక్కడకూడా కొన్ని భేదాలు వుండకతప్పదు. దేవీ భాగవతంలో జనకుఁడు శుకుణ్ణిగూర్చి ఆయీ సందర్భాన్ని కొంత విశదంగా ముచ్చటించియున్నాఁడు. మొత్తం తేలే సారాంశం - గృహస్థులకు భార్యా పుత్రికాది భేదాలతోపాటు కులభేదాలున్నూ పరిత్యజించకుండా వుండవలసినట్టు కనబడుతుంది. అద్వైతంలో కూడా పరమార్థావస్థలో అభేదం వుపాదేయంగా సిద్ధాంతిక మైనప్పటికి వ్యవహారావస్థలోభేదాన్ని అంగీకరించ వలసిందే అని స్పష్టంగా కనబడుతుంది. "ప్రతిమాస్వల్పబుద్ధీనామ్" అనడంవల్ల సామాన్యులకుఁగా యేర్పడ్డ దేవాలయాలు భేదోపాధిని తోసివేయడానికి లేశమున్నూ అంగీకరించవని వ్రాయనక్కఱలేదు. యిది విషయాంతరం.

మనకు ప్రస్తుత మేమిటంటే? భారతాదులలో చెప్పిన శాంతికంటె మించిన శాంతి వహించి దానివల్లవున్న ప్రయోజనాన్ని ఋజువుచేసిన - చేయుచున్న - చేయనున్న మహాపురుషుఁడు ఈ కాలంలో గాంధీగారనిన్నీ యీయనకు దీటగుశాంతి వక్క శమీకుని యందు గోచరిస్తుం దనిన్నీ యిట్టి మహాపురుషుఁడు మృగ్యుఁడనిన్నీ యీయన్ని పురస్కరించుకొని మనం "మాలోయిట్టి మహాపురుషుఁడున్నాఁ"డని గర్వించవలసిందే కాని సర్వవిధాలా ఆయన్ని అనుసరించడం బొత్తిగా సంభవించ దనిన్నీ, ఆచరించేయోగ్యత వుంటే అతిక్షమకూడా దైన్యాపనోదనమే అనేది భారతానికి అతీతమైన సిద్ధాంతం అనిన్నీ తెలుసుకోవలసివుంటుంది. ప్రతీ సందర్భంలోనున్నూ యీలాటివిశేషాలు కొన్ని వుంటూనే వుంటాయి. వాట్లను వదిలిపెట్టి సామాన్య సందర్భాలే సర్వజనాచరణ యోగ్యాలుగా మనం చూచుకోవాలి. భారతంకూడా అదేతాత్పర్యంతో శాంతిని వప్పుకుంటూ కూడా అతి శాంతిని మాత్రం వప్పుకోలేదనుకోవాలి. దీన్నే మనవాళ్లు- "తొక్కినా కఱవకపోతే బురదతొస్సురా" అంటారని సామెతగా చెప్పుకుంటూవుంటారు.

కొందఱుపైకయితే చాలా శాంతులుగానే కనపడతారు గాని వారి అంతస్సుమాత్రం చాలా అశాంతంగానే వుంటుంది. బహిశ్శాంతికంటె అంత శ్శాంతికే వేత్తలైనవారు యెక్కువ గౌరవాన్ని యిస్తారు. శాంతితగ్గిన మనస్సుతో యెవరుగాని యెవరితోఁగాని ప్రసంగించడం యుక్తంకాదు. వ్రాఁతకి దిగడంకూడా ఆలాగే. కోపంతో వకప్పుడేదేనా వ్రాసినప్పటికీ తిరిగీ దాన్ని శాంతికలిగినపిమ్మట పరిశీలించి సవరించు కుంటే అంతచిక్కుండదు. పరిశీలించకుండానే ప్రకటించేయెడల దానివల్ల వచ్చేచిక్కుకు పరిమితంటూ వుండదు. దాన్ని సమర్థించుకోడానికి బ్రహ్మకూడా తరంకాదు. యీ విషయం వాదోపవాదాలలో ముఖ్యంగా గమనించడం ఆవశ్యకం. తాత్కాలికంగా పొంగినపొంగుతగ్గి మనస్సు శాంతించాక చెప్పేసమాధానం వఱదకాలం దాఁటిన తరువాత వుండే నదీజలంలాగ నిర్మలంగావుండి లోకులు ఆస్వాదించడానికి అర్హత కలిగివుంటుందని నేననుకుంటాను. కోపంవచ్చీ రావడంతోనే వ్రాఁతకు వుపక్రమిస్తేనో? అదితొలకరిలో చెత్తాచెదారం మట్టీమట్టాతోటీ వచ్చే వఱదలాగా ఏదో మాదిరిగా వుండవలసివస్తుంది.

ధర్మాలు వేఱు, ధర్మసూక్ష్మాలు వేఱు, అంతో యింతో ధర్మాలు తెలియనివా రంటూ వుండనే వుండరు. ధర్మసూక్ష్మాలు తెలిసినవారో యెక్కడోగాని వుండరు. ఉదాహరణకోసం కొందఱిని వుటంకించి కొంచెం మాట్లాడుకుందాం. రాముఁడు మహాపురుషుఁడు, సాక్షాత్తుగా భగవదవతారం - మహావీరుఁడు. అట్టివాఁడు భవిష్యత్కార్య గౌరవాన్ని పురస్కరించుకొని వాలివధలో కొంత అనుచితం చేయక తప్పిందికాదు. దాన్ని

సవరించడానికి యెందఱో మహాకవులు యెన్నో తోవలు తొక్కివున్నారు. కాని అదిమాత్రం వజ్రలేపంగా నిలిచిపోయింది. యింక భీష్ముఁడు బ్రహ్మచారి, మహాజ్ఞాని, శాంతియుక్తమైన పౌరుషం కలవాఁడు. అయితే యేమి? తనయావద్ధనుర్విద్యకును మూలభూతుఁడైన పరశు రామునితో యెదురుకొని యుద్ధంచేయక తప్పిందికాదు. శాస్త్రాలో! "ఏకాక్షర ప్రదాతారం" అని చెపుతూ వున్నాయి. అది స్వకులధర్మ మవడంచేత, సామాన్య ధర్మాన్ని ధర్మసూక్ష్మం అపవదించిందనుకోవలసి వచ్చింది. స్వకులధర్మమైన యుద్ధం హింసాత్మకమైనప్పటికీ యజ్ఞంలో జరిగే పశుహింసలాగే "ధర్మాదనపేత" మవడంవల్లనే భీష్ముఁడు యెందఱినో చంపినీన్నీ నరకానికి వెళ్లినట్లు భారతంలో కనపడదు. గురువుగారితో చేసిన యుద్ధంకూడా దానికిందనే జమకట్టడంచేత కాఁబోలు భీష్మునకు అదిన్నీ నరకాన్ని కల్పించలేకపోయింది. అర్జునుఁడు "పితృసమోజ్యేష్ఠః" అనే శాస్త్రాన్ని ఉల్లంఘించి ధర్మరాజును చంపడానికి వుద్యమించడం, స్వప్రతిజ్ఞా భంగనిర్వహణాని కవడంవల్ల కాఁబోలు! సమర్థనీయమే అయింది. అంతో యింతో ప్రతిజ్ఞా నిర్వహణ ప్రసక్తి వున్నప్పటికీ కేవలం విరుద్ధంగా వున్న కారణంచేత కాఁబోలు ధృష్టద్యుమ్నుఁడు చేసిన ద్రోణవధ యెంత సమర్థించినా సమర్థింపఁబడడంలేదు. గురువు ఆయుధాన్ని ధరించి తనతో పోరాడుతూన్నప్పుడే అయితే ధృష్టద్యుమ్నుఁడొనర్చినకృత్యం సమర్థింపఁబడేది. పనిపడితే పరలోకంలో యమధర్మరాజుతో "నేను నిర్దోషినే" అని సమర్థించుకోవడానికి తగ్గధైర్యం యిచ్చివుండేది. కాని అది కేవలం కసాయి వాని కృత్యంగా వుంది. సత్యవతి, కుంతి, మొదలైనవాళ్ల చారిత్ర స్ఖాలిత్యాలుకూడా ధర్మసూక్ష్మా లెఱిఁగిన పెద్దలకు ధర్మాదనపేతాలుగానే కనపడతాయి. సామాన్యులదృష్టికి అన్యథాగా కనపడ్డప్పటికి అంతమాత్రంచేత అవినింద్యాలు కాఁజాలవు. ప్రతి శరీరానికిన్నీ వాతపిత్తాదులతోపాటు సత్త్వరజస్తమోగుణాలు జీవసంబంధం వున్నంత కాలమున్నూ వుండితీరుతాయి. వీట్లకూ వాట్లకూ కూడా అప్పుడప్పుడు ఒక్కొక్క దానికి వుద్రేకం కలగడం సహజం. దాన్ని ఔషధదులచేతా పరిశీలకత్వంచేతా వారించుకోవడమున్నూ వుంది. ఒక్కొక్కప్పుడు అవి ప్రతిక్రియకు లొంగక విజృంభించి హానికరాలు కావడమున్నూ సర్వానుభవ సిద్ధమే. సత్త్వగుణం యెంత విజృంభించినా కలిగే హానిలేదుగాని తక్కిన రెండున్నూ అలాంటివికావు. వాతాదులకు ఔషధప్రయోగంలాగే జ్ఞానంకూడా వ్యర్థం కావలసివస్తుంది. వొక్కప్పుడు ప్రస్తుత విషయంలో అలాటప్పుడే చెప్పఁదగ్గ జవాబు కనపడక దానికి కర్మని కారణంగా పెట్టుకొని గ్రంథకర్తలు– 'కర్మణో గహనాగతిః' అని వూరుకుంటూ వుంటారు. భవితవ్యం అనివార్యం అంటేనేకాని మనకి కుదురని సందర్భాలెన్నో కనపడతాయి. శ్రీరామునివంటి ధీరోదాత్తుఁడు, శూర్పణఖకు వైరూప్యాన్ని ఆపాదిస్తూవున్న లక్ష్మణుణ్ణి వారించకపోవడం భవితవ్యతామూలకం కాక యేమనుకోవాలి? అవైరూప్యా

పాదనమే సీతాపహరణాది చిక్కులకు కారణమయినట్టు కనపడుతుందిగదా! యేదో విధంగా భయపెట్టి పొమ్మంటే అంత చిక్కు రాకపోయేదేమో? త్రిలోకాధిపత్యాన్ని నిర్వహిస్తూవున్న రావణాసురుఁడి సోదరీమణి కదా ఆశూర్పణఖ. తుట్టతుదను మండోదరి సంధిమాటలు చెప్పినప్పుడు రావణుఁడు చెప్పినమాట చూడండి యేలా వుంధోను :-

చ. "ఎఱిఁగి యెఱింగి మున్నతఁడె యెగ్గొనరించిన దానికైకదా!
చెఱఁగొని వచ్చితిన్ బిదప సీత, వృథా కథలింక నేల? పెం
పఱ బ్రదుకింతతీయనె? ఖరాదుల చావున కేమిగాని నీ
మఱఁదలి బన్న మేపగిది మానిని? యీఁగుదుసంధి చేసినన్"

యింతటి విపత్తు కలిగిస్తుంది. అని మొట్టమొదట లక్ష్మణుడికిగాని రాముడికిఁ గాని యేలేశమేనా గోచరించేయెడల శూర్పణఖను అంతగా అవమానించడం జరిగేది కాదేమో?

ఆ యీ సందర్భాలు పరిశీలించిచూస్తే వొకఁడు శాంతుఁడుగా వుండడానికి కాని, మఱివొక్కఁడు అశాంతుఁడుగా వుండడానికిఁగాని కారణం వక్కభవితవ్యత తప్ప వేఱొకటి కనపడదు. అయినప్పటికీ సర్వ సామాన్యంగా ప్రతీవిషయానికిన్నీ దీనితో సంబంధం కలపడమనేది ఆచారంలోలేదు. పూర్వజన్మకృత పుణ్యాపాపాలతో సంబంధం ప్రతీదానికీ వున్నప్పటికీ వాట్లకే ప్రాధాన్యం యిచ్చేయడల యెవఁడున్నూ దోషిగాఁగాని, నిర్దోషుఁడుగాఁ గాని యెక్కడా ప్రపంచంచేత వాడుకోఁ బడడానికి అవకాశమే వుండకపోవలసివస్తుంది. అప్పుడు కొన్ని వ్యవహారాలకుచాలా చిక్కువస్తుంది. అందుచేత ఆ తోవ వదలుకొని మంచిచెడ్డలకు కర్తృత్వం మనదే అనుకొని మాట్లాడుకొందాం. యీలామాట్లాడుకొనే పక్షంలో యెవఁడికేనాసరే శాంతుఁడుగా వుండడంకన్న వుత్తమమార్గం కనపడదు. శాంతికన్న సౌఖ్యాన్ని యిచ్చేది వేఱేదిన్నీ వున్నట్టు తోఁచదు. శ్రీకృష్ణ భగవానులుకూడా,

"శ్లో. యస్మాన్నోద్విజతేలోకో లోకా న్నోద్విజతే చయః।
హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యస్స చ మే ప్రియః"

అని తెల్పివున్నారు. త్యాగరాయలవారు "శాంతము లేక సౌఖ్యము లేదు." అంటూ పైసందర్భాన్నే గానంచేసి ఉన్నారు. అందుచేత సర్వవిధాలా శాంతిసంపాదనానికై శాయశక్తులా ప్రయత్నంచేయడం ప్రతిమనిషికిన్నీ ఆవశ్యకమైనపని. యెట్లో పెద్దల సేవవల్లనో గ్రంథావలోడనంవల్లనో అట్టిశాంతి సంప్రాప్తమయితే కావచ్చును గాని సంప్రాప్తమైన ఆ మహాధనాన్ని కాపాడుకోవడం చాలాకష్టసాధ్యం. యీ మహావస్తువును

అపహరించడానికి యెన్ని విధాల దొంగలో యేర్పడివున్నారు. "శ్లో. అర్థా నా మార్జనే దుఃఖమార్జితానాంచ రక్షణే" అన్న శ్లోకార్థం ప్రసిద్ధమే. యౌవనావస్థలో వుండే శాంతిధనాన్ని అపహరించే దొంగలు స్త్రీలు. వార్ధకావస్థలో శాంతి కాపాడుకోవడం కొంతసులభమే అని చాలామంది అభిప్రాయపడతారు గాని యితర వయస్సులే అంతకన్న శాంతిని కాపాడుకోవడానికి యుక్తంగా వుంటాయని అనుభవజ్ఞులంటారు. యేమంటే? వార్ధక్యంలో కోపం సహజంగా ప్రతిమనిషికిన్నీ వుత్పన్నమవుతుంది. యేదో అవధానంలో చిరకాలంనాఁడు యెవరో అడిగితే చెప్పిన పద్యాన్ని యిక్కడ వుదాహరిస్తాను...

> "చూపుతగ్గుట దేహదార్ఢ్యము సున్నయౌట మనమ్ములోఁ
> గోప మబ్బుట చిన్నికుఱ్ఱలకున్ హితంబులు చెప్పుటల్
> 'శ్రీపతీ! సుగుణాకరా! ననుఁజేరి ప్రోవర!' యంచు న
> య్యాపదుద్ధరు వేఁడి కొంటయు నబ్బు వృద్ధత గూరినన్."

వృద్ధత్వంలో యితరులు చేసే ప్రతీపని యందున్నూ తనకుయేదో విధమైన దోషమే పొడకడుతూ వుంటుంది. ఆకారణంచేత ఆయా పనులను నిషేధించబోతే ఆవలివాళ్లు వినరు పైఁగా తిరస్కరిస్తారు దానిమీద మఱీ కోపం హెచ్చుతుంది. దీన్ని గుఱించి వ్యాఖ్యానం చేయవలసివస్తే చాలాపెరుఁగుతుంది. మనకు ముఖ్యమైన అంశం యేవయస్సులోఁగాని శాంతిని కాపాడుకోవడం కష్టమే అనిన్నీ, అందులో వార్ధక్యంలో చెప్పనక్కఱే లేదనిన్నీ మాత్రమే, సమస్త విషయాలున్నూ పరిత్యజించిన సన్యాసులకుకూడా వొకప్పుడు కోపంవస్తుంది. ఆ సన్యాసిని యెవరేనా బ్రహ్మవిషయాన్ని గూర్చి ప్రశ్నించడం తటస్థిస్తే ఆయన చెప్పినమాటలన్నిటినీవిని తలపూఁపితేతప్ప - తెలియకే అనుకుందాం - అడ్డదిడ్డ ప్రశ్నలు వేయడానికి మొదలు పెడితే ఈ సంగతి స్పష్టపడుతుంది. యిఁక గృహ స్థాశ్రమంలోవున్న పండితులనుగాని, కవులనుగాని యెవరేనా ధిక్కరిస్తే చెప్పనే అక్కఱలేదు. పండితులకన్నా కవులసంగతి యీ విషయంలో మఱీ అగమ్యగోచరంగా వుంటుంది. కవికిస్వార్థంకంటే పరార్థం యెక్కువ. అందుచేత కవులకు లోకులతో యెక్కువ సంబంధం వుంటుందిగదా! అట్టి కవికి మనస్సులో తనరచన చూచి అందఱూ ఆనందించాలని వుంటుంది. కాని "లోకోభిన్నరుచిః" కనుక కొందఱు ఆనందించేవాళ్లున్నూ, కొందఱు యీసడించేవాళ్లున్నూ వుండకతప్పనివిధి అవుతుంది. కొన్ని కవిత్వాలకో? నూటికి 99 గురు యీసడించేవాళ్లే వుంటారు. దానితో అట్టివాళ్లమీఁద గ్రంథకర్తకు కోపం రావడం జరుగుతుంది. కొంచెం గడుసుతనం వున్నవారి కోపమైతే లోలోపల యిమిడి వుంటుంది. అదిలేని కవికోపమో? చీమిడి పాకంతప్పి తనకెంత అపకారం చేయాలో అంతా చేసితీరుతుంది.

క. "కోపము చీకటికూపము
కోపము పాపముల కాదిగురువగు హింసా
ధూపము కోపముగావునఁ
గోపింపంగూడ దేరికొఱకయిన సఖా!"

అంటూ నారాయణముని నరమునిని మందలించినట్లు దేవీభాగవతంలో కనపడుతుంది. కోపం వచ్చినప్పుడు మన మేపనిచేసినా ఆ పని అధ్వాన్నంగా పరిణమిస్తుంది. అందులో విద్యావిషయకమైన వాదోపవాదాలు మొదలు పెడతామనుకోండి. యెంతచండాలంగా వుండాలో అంతచండాలంగా నున్నూ వుండవలసి వస్తుంది. వాట్ల సవరణకొఱకు మనం యెన్ని అనుచితాలకో సిద్ధపడవలసివస్తుంది. కాని ఆ అనుచితాలేవిన్నీ కార్యకారులుకావు. "భక్షితేఽపి లశునే నరోగశాంతిః" అన్నట్లు పరిణమిస్తాయి. కోపం వక్క యుద్ధరంగంలో పనికి వస్తుంది కాని యితరత్రా యుద్ధవీరునికి కూడా అది పనికిరాదు. తీరా యెదటివానితో చేయీ చేయీ కలిపిన పిమ్మట తీవ్రమైన కోపమూ దానికితగ్గ ధైర్య స్థైర్యములూ, తగినంత వుపాయమూ వుండేటట్టయితే జయాన్ని కలిగించడం తటస్థిస్తుందేమో కాని వక్కకోపం మాత్రమే అయితే అప్పుడున్నూ పనిచేయదు. బాగా ఆలోచించి చూస్తే రామాదిమహావీరులు క్వాచిత్కంగా తప్ప యుద్ధరంగంలోకూడా శాంతిప్రధానంగానే వర్తించినట్లు కనపడుతుంది. యెన్నివిధాలఁ జూచినా శాంతికి మించిన ఆత్మరక్షణోపాయం కనబడదు. యిదంతా మనస్సులో పెట్టుకొనే కాఁబోలును! భర్తృహరి-

శ్లో. క్షాంతిశ్చే త్కవచేన కింకిమరిభిః క్రో ధోస్తి చేద్దేహినామ్"

అన్నాఁడు. అంటే అన్నాఁడు గాక దీన్ని పాటించే వ్యక్తులుమాత్రం మిక్కిలీ తక్కువ. అట్లని కష్టసుఖాలు యెఱిఁగినవాళ్లు "ఓం శాంతి శ్శాంతిః" అంటూ చెప్పడం మానతారా? మానరు.

సర్వథా శాంతి ఆవశ్యకమనిన్నీ అది యెవరి ప్రకృతికో కాని సహజంగా అలవడదనిన్నీ దాన్ని పెద్దల సేవవల్లా వారువారు వ్రాసిన గ్రంథాల వల్లా అభ్యసించేనా సంపాదించడం అత్యావశ్యక మనిన్నీ కనపడుతుంది. సహజంగాఁగాని, ప్రయత్న పూర్వకంగాఁ గాని సంఘటించిన శాంతిని కాపాడుకోవడం మాత్రం సుఖసుఖాల జరిగేదికాదనిన్నీ భారత పద్యతాత్పర్యం. వదల వలసిన సమయాలల్లో యెంతో యిక్కట్టుగా వుండేది ప్రతిదీ తప్పచేరదు. సత్యాన్ని అతిక్రమించడాన్ని గూర్చి - "ప్రాణవిత్తమాన భంగమందు" అనే వాక్యానికి విపరీతార్థ కల్పనచేసి ప్రతీక్షణమందున్నూ అబద్ధాలాడే వాళ్లలాగ దీనిక్కూడా

విపరీతార్థం చెప్పుకోవడం సహృదయ సమ్మతంకాదు. అసలు గ్రంథకర్త తాత్పర్యాన్నిబట్టి వ్యాఖ్యానం చేసుకోవాలి గాని మనకు అనుకూలించేటట్టు చేసుకొని ధర్మప్రవృత్తిని అధర్మ ప్రవృత్తిగా మార్చుకొని చెడిపోయేవాళ్లనివద్దనేవాళ్లెవరు? అట్టివిపరీత ప్రవర్తనమే కావాలనుకొనే వాళ్లకుశాస్త్రంతో అవసరమే వుండదు కదా! అబద్ధం ఆడాలనుకొనే వాళ్లు ఆడవలసిందేకాని దానికోసం "నాఽనృతంవదేత్" అనేశ్రుతికి, నా = మనుష్యుఁడు అనృతం = అసత్యాన్ని, వదేత్ = చెప్పవలసింది అంటూ అపార్థకల్పనకూడా చేసి మఱింత దోషం చేయడం యెందుకు? సర్వథా సత్యంవలెనే శాంతిన్నీ కళ్యాణదాయకమైనది. దాన్ని అవలంబించడం యిహపరసాధకం అని తెలుసుకుందాం. యెప్పుడూ శాంతంగానే వుందాం. యెప్పుడో అత్యవసరమైన విషయం యేదేనా తారసిస్తే తప్ప అశాంతికవచ ధారణాన్ని యేమఱకుండానే కాలక్షేపం చేద్దాం. భగవంతుణ్ణి సర్వదా శాంతినే ప్రసాదించవలసిందని ప్రార్థించుకుందాం. వుభయలోక సమ్మతంగా జీవించుదాం.

క. "ఈలోకమయగుఁగొందఱ
కాలోకమకొందఱకు నిహంబునుబరమున్
మేలగుఁగొందఱ కధిపా!
యేలోకములేదుసూవె! యిలఁగొందఱకున్"



# సోమరిసత్రాలు

సోమరిసత్రాలు పూర్వం తంజావూరు రాజ్యంలో ఆ కాలపు రాజులు వేసినట్టు వినడం. ఆలా వేయడానిక్కారణం ఆ కాలపు రాజుగారికి యెప్పుడో వకనాఁడు సోమరితనం కలిగినట్టున్నూ దానివల్ల యెన్నో రాచకార్యాలు చెడిపోయినట్టున్నూ చెప్పుకుంటారు.

దానితో రాజుగారికి యేం తోచిందంటే? "సరే! మనబోట్లకు సోమరితనం కలిగితే యెన్నో పనులుచెడ్డాయి. చెడ్డప్పటికీ యీ నష్టాన్ని భరించతగ్గ సామర్థ్యంకూడా వుందికనక అంత చిక్కులేదనుకుందాం. లోకంలో యెందఱో నిఱుపేద లుంటారుగదా! వాళ్లలో యెందఱో సోమరులున్నూ వుంటారు. వాళ్లగతి యేమి?"టని ఆదయాళువైన ప్రభువు ఆలోచించి "అట్టివాళ్లను పోషించడం మనకు సుకృతం" అనుకొని మంత్రులతో - "సోమరిపోతులనిమిత్తం కొన్ని సత్రాలు యేర్పాటు చేయవలసిం"దని ఆజ్ఞాపించి నట్టున్నూ, మంత్రులు రాజాజ్ఞచొప్పున అట్టి సత్రాలు యేర్పఱచి నట్టున్నూ, స్విష్టకృతుగా ఆ సత్రాల్లో భోజన సదుపాయం జరుగుతూ వుండడంవల్ల యెందఱో ఆ సత్రాల్లోచేరి సుఖిస్తూ కాలక్షేపంచేస్తూ వున్నట్టున్నూ, అంతట్లో కొన్నాళ్లకు ఆ రాజుగారికి తాము యేర్పాటు చేసిన సత్రాలు యేలా వున్నాయో చూడాలని బుద్ధి పుట్టినట్లున్నూ ఆలా బుద్ధిపుట్టి మంత్రులతోసహా ఆ సత్రాలను చూడడానికి వెళ్లేటప్పటికి యీ కింది విధంగా కనపడ్డట్టున్నూ చెప్పుకుంటారు - యేం జరిగిందంటే? ఆ చుట్టుపట్లనే కాదు; రాజధానికి కొంతదూరంలో వున్న జనం కూడా పిల్లలతో పాపలతో ఆసత్రాల్లోచేరి తింటూవున్నారట! ఆ జనాన్ని చూచేటప్పటికి రాజుగారు పరమాశ్చర్యం కలిగి మంత్రులతో - "యేమీ? మనరాజ్యంలో యింతమంది సోమరిపోతులున్నారా?" అని మంత్రులను అడిగేటప్పటికి ఆ మంత్రులలో వక బుద్ధిశాలి - "అయ్యా! వీళ్లందఱున్నూ నిజమైన సోమరిపోతులుగారు. యిందులో పరీక్షకి నిల్చేవాళ్లు పట్టు మంటే నూటికి వకరో యిద్దఱో వుంటారేమో?" అని జవాబు చెప్పాఁడట! రాజుగారు ఆ మాట విని "వీళ్లని పరీక్షించటం యేలాగ?" అని ప్రశ్నించారఁట. సెలవైతే క్షణంలో నేను పరీక్షించి నిజమైన సోమరిపోతులెవరో తేలుస్తానన్నాట్ట! రాజుగారు కానిమ్మన్నారఁట! అప్పుడు మంత్రి - యీ రీతిగా దండోరా వేయించాట్ట, యేమనంటే? "యింక వొక్క గంటలో యీ సత్రాలన్నీ తగలఁబెట్టఁ బడతాయి కనక మీరంతా వెంటనే వెళ్లిపోవలసిందోహో" అని ముమ్మాటికీ చాటింపు చేయించేటప్పటికి అది వినీవినడంతోటట్టుగానే డబ్బాడవాలీ, చెంబూ చేంతాడు చేతఁబుచ్చుకొని పిల్లా జెల్లాతో

నూటికి తొంభైతొమ్మందుగురు ఆ పాకలు వదలిపెట్టి వెళ్లారcట! కాని తక్కినవాళ్లు కొందఱు ఆలాగే వుండిపోయారcట! యేర్పఱిచిన కాలానికి సరీగా ఆ పాకలు అంటించారcట! అంటించాక మంట కనపడ్డాక కొందఱు లేచి వెళ్లారcట! మఱికొందఱు యింకా మనమున్న చోటికి మంటరాలేదంటూ కదలకుండా పేకో, చదరంగమో, పులిజూదమో ఆడుకుంటూ అలాగే నిలిచిపోయారcట! కొందరు సోమరిపోతులు నిద్రపోతూ లేవనేలేదcట! అప్పుడు మంత్రి నిష్కారణంగా చచ్చిపోతారని భయపడి వాళ్లను బలవంతంగా రాజుగారి నౌకర్లచేత యీవలికి లాగించి – "అయ్యా! నిజమైన సోమరిపోతులంటే వీళ్లుమాత్రమే" అని చెప్పేటప్పటికి రాజుగారు వీళ్లకు యావజ్జీవమున్నూ అన్నవస్త్రాలు జరిగేటట్టు సత్రాలు వేయించడం మనకు విధి అని అలా వేయించారంటూ యెవరో చెప్పcగా యెప్పుడో విన్నాను. బహుశః ఆసత్రాలే కొంతమార్పుతో యిప్పటికిన్నీ జరుగుతూ వున్నా యనుకుంటాను. కాని ప్రస్తుతం జరిగే సత్రాలు తిరువాన్‌కూరు రాజ్యంలోవి. ఆ సత్రాలకు పేరు తంజావూరు సత్రాలు అని వినcబడుతుంది. ఆకాలంనాటికి తంజావూరున్నూ తిరువాన్కూరున్నూ వకటే రాజ్యంగా వుండేవోయేమో? చరిత్రజ్ఞులకుcగాని బాగా తెలియదు. యిప్పుడుకూడా ఆ సత్రాల్లో సామాన్య కుటుంబాలవారి మాటలావుండcగా 60 రూపాయలకు లోపు జీతంగల వుద్యోగులు కూడా వచ్చి సకుటుంబంగా భోంచేసి వెళ్లడమే ఆచారమని చెప్పుకోcగా విన్నాను. అంతో యింతో దక్షిణాది వాసనవున్న వేంకటగిరిలో వున్న సత్రంలో ఆవీధివాళ్లొకనాcడూ యీ వీధి వాళ్లొకనాcడూగా గ్రామస్థులే తినడం నేను చూచి వున్నాను. కాశీలో యిప్పుడెలావుందో చెప్పలేనుగాని ఆ యీ మహారాజులున్నూ మఱికొందఱు సంపన్న గృహస్థులు కోటీశ్వరులున్నూ వేయించిన సత్రాల్లో వకపూcట నిరాఘాటంగా భోజనం దొరకడం నేను స్వయంగానే యెఱుcగుదును. కొన్ని సత్రాలల్లో "యింతమందికి మాత్రమే" అనే నియమం వుంది గాని కొన్నిటిలో ఆనియమంలేనేలేదు. ఆలాటి నియమంలేని సత్రాలల్లో వకటి అన్నపూర్ణసత్రం. దీన్ని మహారాష్ట్ర ప్రభువు శ్రీమంతుడు వేయించినట్టు చెపుతారు, యిది పన్నెండు గంటలవేళ అన్నం పెట్టే సత్రం. రెండు గంటలప్రాంతంలో యిదేమాదిరిగా "సర్వమోకళా"గా పెట్టే సత్రం సింధ్యా సత్రం. రామనాథపురం మహారాజా సత్రం ఉదయం యెనిమిదీ తొమ్మిదీ మధ్యనే పెట్టేది. రాత్రిమాత్రం యేసత్రంలోనూ అన్నంపెట్టరు. ఆయీ సత్రాలుండcబట్టే కాశీలో యితరదేశపు విద్యార్థులకు వకపూcటేనా అన్నం దొరకడం వుంది కనక విద్యాభ్యాసం అనాదిగా జరుగుతూ వచ్చింది. ఆంధ్ర ద్రవిడ కర్ణాట విద్యార్థులకు రాత్రికూడా మారోజుల్లో అన్నసదుపాయం వుండేది. యిప్పుడు ఆలాటి సదుపాయాలన్నీ క్రమంగా అంతరించినట్టు చెప్పుకుంటారు. సోమరిపోతు సత్రాలను గుఱించిన యితిహాసం నిజంగా జరిగేవుందో! లేక పుక్కిటి పురాణాల్లోనే చేరుతుందో నిశ్చయించడానికైతే అంతగా ఆధారంలేదుగాని లోకంలో

నిరతాన్నదానం చేసేవారి యిళ్లను "తంజావూరి సత్రం" అంటూ చెప్పడం యిప్పటికిన్నీ వినబడడంచేత యిందులో కొంత కల్పనవున్నప్పటికీ కొంతేనా యథార్థం వుండకపోదని నానమ్మకం. నిజమైన సోమరులెవరో తేల్చడాన్ని గూర్చిన యితిహాసంవంటిదే నిజంగా సంగీతం విని ఆనందించడం యెట్టిదో, వూరికే తల తిప్పడం యేలాటిదో, తేల్చడానికిక్కూడా వకకథ చెప్పుకుంటారు. పనిలో పనిదాన్ని కూడా వుదహరిస్తాను. యెవరేనాసంగీతం పాడేమగవాళ్లుగాని, ఆఁడవాళ్లుగాని సభలో పాడుతూవుంటే చాలామంది ఆ పాటలోవున్న సారం బాగా తమకు తెలిసినట్టు తల వూఁపుతూ ఆ సమీపంలో కూర్చోవడంకలదు. సోమరుల విషయంలో తంజావూరు మహారాజుక్కలిగినట్టే యీ తలత్రిప్పేవారిని గూర్చి యే మహారాజుకో సంశయము కలిగి మంత్రిని ప్రశ్నించేటప్పటికి మంత్రి వకవుపాయం చేసినట్టు చెప్పుకోవడం. ఆవుపాయం యేలాటిదంటే?...

"అయ్యా! యీవేళ సంగీతసభలో యెవరున్నూ తలతిప్పఁగూడదు. నిశ్చలంగా వింటే అభ్యంతరంలేదు. తలతిప్పేయెడల వారిపేళ్లు నోటుచేసుకొని తరువాత వారిని టుపాకితో కాల్చివేయడం జరుగుతుంది. కాఁబట్టి జాగర్తా!" అని ముందు చెప్పి సంగీతకచేరీ జరిగించారఁట! యిదివఱలో తలతిప్పేవారిలో నూటికి తొంభైతొమ్మండుగురు అసలు ఆ సభకు రానేలేదఁట! వచ్చిన వాళ్లల్లోకూడా అందఱూనిర్జీవ ప్రతిమలలాగే కూర్చున్నారఁట! కాని యేకొందఱో అప్పుడుకూడా తలతిప్పడంమానలేదఁట! ప్రాణం పోతుందనే భయాన్నికూడా మఱచిపోయి సహజంగా కలిగే ఆనందాన్ని వెలిపుచ్చడంవల్ల నిజంగా సంగీతరసం తెలిసినవాళ్లు వీళ్లే అనిన్నీ, తక్కినవాళ్లు– "గతానుగతికో లోకోనలోకః పారమార్థికః" అనే తెగలో వాళ్లే కాని నిజంగా గానం తెలిసినవాళ్లు కారనిన్నీ నిశ్చయించుకొన్నారఁట! ప్రతివిద్యలోనూకూడా అనుకరించేజనం చాలా వుంటుంది. తత్త్వం తెలిసినవాళ్లు మిక్కిలీ తక్కువగానే వుంటారు. యీ అనుకరణాన్ని గూర్చికూడా వక యితిహాసం మఱోవిషయంలో పెద్దలవల్ల విన్నాను. దాన్నికూడా సంగ్రహంగా వ్రాస్తాను. వక బ్రాహ్మఁడు యేదో పుణ్యకాలంలో యేనదికో స్నానానికి వెళ్లాఁడఁట! స్నానం చేయడానికి నదిలోకిదిగి వచ్చేలోపున తనజారీచెంబు యెవళ్లేనా తస్కరిస్తారేమో? అనే అనుమానంచేత ఆ వొడ్డుమీఁద వుండే యిసుక పోగుచేసి వకలింగాకారంగా తనజారీ లోపలభద్రపఱిచి యేర్పఱచి స్నానానికి నదిలోకిదిగి యథాశాస్త్రంగా యావత్తున్ను నెరవేర్చుకొని వొడ్డుమీఁదకువచ్చి చూచేటప్పటికి యెక్కడ చూచినా లింగాలే కనబడ్డాయఁట! కారణమేమిటంటే? యీయన విద్వాంసుఁడయి వుండడంచేత లింగంచేసి స్నానానికి దిగడాన్ని బట్టి యీ పుణ్యకాలంలో యీలాచేయడం విధికాఁబోలు ననుకొని మఱికొందఱుకూడా లింగాకారాలు నిర్మించడానికి ఆరంభించేటప్పటికి, వారిని చూచివారూ,

వారినిచూచి మఱికొందఱూ లింగాలు నిర్మించేటప్పటికి మొట్టమొదట ఆయన చేసిన లింగమేదో తెలియకపోవడంచేత ఆబ్రాహ్మఁడు యీ కింది శ్లోకం చెప్పినట్టు వినడం...

శ్లో. గతానుగతికో లోకో నలోకః పారమార్థికః
గోదామహానదీతీరే నష్టం మే తామ్రభాజనమ్."*

దీని తాత్పర్యం, "యెవఁడేనా యేపనేనాచేస్తే వాఁడు ఆపని యెందుకు చేశాఁడో ఆలోచించకుండా తానుకూడా ఆపనిని చేయడమేకాని యథార్థవిచారణ చేయడం లోకంలో కనపడదు. అందుచేత నిక్షేపంవంటి నారాగిచెంబు లేక జారీ వృథాగా పోయింది" అని- దీనికి సంబంధించిందే యింకో యితిహాసం వుంది. వక బ్రాహ్మఁడు యింటివద్ద భార్య ప్రతీరోజున్నూ పెసరపప్పే వండి తిండి పెడుతూవుంటే విసుగుపుట్టి పొరుగూరికి వెడితే ఆవూళ్లోకూడా "దైవాద్వా" ఆ రోజున పెసరపప్పే వండటం తటస్థించింది దేవతార్చన చేసుకొని సంచిలోకట్టి ఆపట్లాన్ని ఆ బ్రాహ్మణుఁడు వడ్డించిన ఆ విస్తరంటకు మూడు ప్రదక్షిణాలుచేసి భోజనానికి కూర్చునేటప్పటికి ఆయన పంక్తినివున్న మఱికొందఱు బ్రాహ్మలుకూడా అదేరీతిని ప్రదక్షిణాలకు ఆరంభించారఁట! అదిచూచి ఆబ్రాహ్మఁడు యేమండీ? మీయిళ్లల్లోకూడా ప్రతిరోజున్నూ పెసరపప్పేనా? యేమిటి? అని ప్రశ్నించేటప్పటికి ఆబ్రాహ్మలందఱూ వెలవెల పోయారఁట! ఇంకా యీవిషయమై యీలాటి కథలు మఱికొన్ని వున్నాయి. యింకోటిమాత్రం వుదహరించి యీవ్యాసాన్ని ముగిస్తాను. అప్పయ్య దీక్షితులవారు వకరోజున నదీతీరంలో సంధ్యావందనం చేసుకుంటూ వుండఁగా దైవవశాత్తూ కచ్చ జాఱిపోయిందఁట! గతాఽనుగతికులుగా వుండే మఱికొంతమంది బ్రాహ్మణులుకూడా కచ్చవూడఁదీసికొని సంధ్యావందనానికి ఆరంభించారఁట! అన్నీ నిజమైనవిగా వుండవుగాని యీలాటి కథలలో యేకొన్నో నిజమైనవికూడా వుంటాయి. "మహాజనో యేన గతస్స పంథాః" అనడంచేత సామాన్యులు గొప్పవారి ఆచారాన్ని చట్టన అనుకరించడంతఱుచు అనుభూతం. అందుచేతే ఆచార్యపురుషులుగా వుండేవారు తమ వర్తనాన్ని చాలాభద్రంగా కాపాడుకుంటూ వుండాలని పెద్దలు చెపుతారు. యీవిషయము శ్రీకృష్ణభగవానులు గీతలలో వ్యాఖ్యానించే వున్నారు. మనం, ప్రస్తుతం ఆరంభించింది సోమరిసత్రాలను గుఱించి. వకదానిలోనుంచి యింకోదానిలోకిన్నీ యింకోదానిలోనుంచి మఱోదానిలోకిన్నీ ప్రసక్తిసంక్రమించింది. పూర్వకాలంలో సోమరిపోతులనుకూడా పోషించేరాజులుండేవారన్నమాట. యిప్పుడు మాత్రం అన్ని రాజ్యాల్లోనూ ఈ సోమరిపోతుతనాన్ని పూర్తిగా నశింపచేయడానికి యత్నం జరుగుతూవుంది. బీదలలో యెవళ్లో కాని

---

* యీ శ్లోకంలో "ఏలామహానదీ" అనేపాఠం నేను విన్నాను. ఏలానది మహానదికాదని "గోదా" అని దిద్దినట్లు చదువరులు గమనించాలి.

సోమరులుగా వుండనే వుండరు. యిప్పుడు చేసేయత్నం ధనికులు కూడా సోమరులుగా వుండకుండావుండడానికే. రష్యాలో యీ ప్రయత్నం నెగ్గినట్టుచెప్పుకుంటారు. కొందఱేమో ఆదేశంలో అవలంబించిన సామ్యవాదంలోకూడా కొన్ని అతివ్యాప్త్యవ్యాప్తులు వచ్చి మళ్లా మఱోమాదిరిగామార్చాలనే అభిప్రాయంకలుగుతూ వున్నట్టు చెప్పుకుంటారు. అందఱినీ సమానంగా వుంచడం భగవంతుని వుద్దేశమే అయితే కొందఱి నాలాగా కొందఱినీలాగా సృష్టిచేయడమే తటస్థింపదేమో? దీన్నిబట్టి భగవదుద్దేశం యిందుకు అన్యథా వుందనుకోవాలి- "నానాగతి విధికృత సృష్టియందకనపడునుగదా!" మన పండితులందఱూ యీసిద్ధాంతానికి కట్టుపడేవారే. పాశ్చాత్యులో- "యత్నే కృతే యది న సిద్ధ్యతి కోఽత్రదోషః" అనే పంథలో వారు-భగవంతుఁడున్నాఁడని వప్పుకుంటారుగాని వారివుద్దేశ్యాని క్కూడా భిన్నంగా పనిచేసి నెగ్గఁగల మనో ధైర్యం కలిగివుంటారు. మనవారో? యీ విషయంలో యేకారణంచేతైతేయేమి పూర్తిగా సోమరితనాన్నే కనపఱుస్తారు-

> శ్లో. "కనకశిబికారూఢాః ప్రౌఢాధిరాజ్యపదేస్థితాః
> కతిచిదతులంమన్యా ధన్యాశ్చరంతి య దిందిరే!
> యదపిచవహం త్యేతాన్ దీనాస్పరే ఫల మంబ! త
> ద్ద్వయమపి తన స్తోకా లోకాన్వయవ్యతిరేకయోః"

యీశ్లోకముఖ్యతాత్పర్యం లోకంలో కొందఱు పల్లకీ యెక్కడానికిగాని మఱికొందఱు ఆ పల్లకీ మోయడానికిఁగాని భగవత్కటాక్షం వుండడమున్నూ, లేకపోవడమున్నూ కారణం గాని స్వప్రయోజకత్వాప్రయోజకత్వాలు లేశమున్నూ కారణంగావు అని ప్రాజ్ఞులో? అప్రాజ్ఞులో? మన పూర్వులు అందఱూ యేకవాక్యతగా పై సిద్ధాంతాన్ని ఆమోదిస్తారు. కొందఱికి భగవత్కటాక్షం వుండి కొందఱికి వుండకపోయే పద్ధతిని దయామయుఁడైన భగవంతుఁడికి వృథాగా పక్షపాతదోషం తగులుతూవుందనీ ఆదోషనివారణకోసం వాళ్లువాళ్లు చేసుకున్న పుణ్యాపాపకర్మలనుబట్టి భగవదనుగ్రహం వుండడమూ, వుండక పోవడమూ కలుగుతుందన్నారు. దీనిమీఁదకూడా శంకలయితే లేకపోలేదుగాని వున్నా యింకోమార్గం కంటె యీమార్గం కొంత కట్టుదిట్టంగా కనబడుతుంది. ధనధాన్యాల విషయంలో సామ్యవాదపరులు అందఱినిన్నీ యేకరీతికి తేఁగలుగుతారేమో కాని తెల్విఁతేటలలో, అందచందాలలో, బలాబలాలలో యింకా యెన్నిటిలోనో తేలేరని వ్రాయనక్కఱలేదు. యిది విషయాంతరం. సోమరిపోతులకు సత్రాలుపెట్టి సోమరితనాన్ని వృద్ధిపఱచిన నిర్వ్యాజ కరుణాశాలులకన్న దాన్ని నశింపఁజేయడానికి ప్రయత్నించేవారిని సర్వథా అభినందించడం యుక్తమే అని చెపుతూ దీన్ని ముగిస్తాను.

★ ★ ★

# బ్రాహ్మణశాఖలు

"భూమిన్ బ్రాహ్మణశాఖలం దొకటియై పొల్పొందు నెంతేని నారామద్రామిడశాఖ... భారద్వాజ గోత్రమ్మునన్"

"తనకుమాలిన ధర్మంలేదు" కనక ముందుగా మాశాఖపేరు చెప్పుకున్నాను. ఆయీ పద్యంలో "ఎంతేని నారామ" అనే దానిలోవున్న సంధినిగూర్చి ప్రస్తుతం అంతగా ప్రసక్తి లేకపోయినా అవకాశాన్నిబట్టి జిజ్ఞాసువుల కొఱకు వ్యాసాంతమందు కొంత చర్చిస్తాను. ద్రవిడ, ద్రమిడ అనే రూపాలు రెండూవున్నాయి గనక ఆశబ్దం శంకించవలసి వుండదు. ఆ యీ "బ్రాహ్మణశాఖలు" అవాంతరాలు కాక ముఖ్యమైనవి పది యేదో వ్యాసంలో– "ఆంధ్రద్రవిడ కర్ణాట మరాటా ఘూర్జరాస్తథా సారస్వతాః కాన్యకుబ్జా గౌడా ఉత్కల మైథిలాః"

ఆ యీశ్లోకం వుదాహరించినట్లే జ్ఞాపకం. యిందులో, తథా అనే రెండక్షరాలూ తప్ప తక్కినపదాలన్నీ "బ్రాహ్మణశాఖల" నామధేయాలు, వీట్లని రెండుగా విభజిస్తే పంచద్రావిళ్లూ పంచగౌడలూ అని తేలుతుంది. గౌడలలోవుండే అవాంతరభేదాలు ఆదేశ వాస్తవ్యులకు తెలిసినట్లు తదితరులకు తెలియవు కనక దానిజోలికి పోయేదిలేదు. బాగా తెలియని విషయం పెట్టుకొని అపహాస్యాస్పదుణ్ణి కావడం కంటె తూష్ణీంభావమే యుక్తం. యింకనల్లా– "పంచద్రావిళ్లు" మిగులుతారు. యిందులోకూడా అవాంతరంగావున్న ద్రవిడశాఖను గూర్చి దాక్షిణ్యాత్యులకు తెలిసినట్లు మనకు తెలియదు.

"పంచద్రావిళ్లు"లో అవాంతరంగాద్రవిడులున్నట్లే – పంచగౌడలలో కూడా గౌడలున్నట్లు పయిశ్లోకం తెలుపుతూనే వుంది. సరే; మొదటివారిలో మైసూరు ప్రాంతంలోవుండే కర్ణాటకులలో ఉండే అవాంతరభేదాలుగాని, మరాటులలోనూ ఘూర్జరులలోనూవుండే అవాంతరభేదాలుగాని మనకుబాగా తెలియవు. కనకవారిని కూడా వ్రాసేదిలేదు. ఆ సందర్భాన్ని తెలిపే పుస్తకాలు కూడా వున్నట్లు గోచరింపదు. మహారాష్ట్రులు అయుధ జీవులన్నంత వఱకు పాణినీయసూత్రంవల్ల గోచరిస్తుంది. దానికి తథ్యంగా కొంతకాలం వారురాజ్యాన్ని పాలించారు– "పుబ్బలో పుట్టి, మఖలో మాడింది" రాజ్యం యెప్పుడూ ఆయుధబలాన్ని పురస్కరించుకొని వుంటుంది. "వీరభోజ్యము సుమ్ము రాజ్యము" "దెబ్బకు దెయ్యం జంకుతుంది" యితరులనుపట్టి పీడించే పిశాచాలుకూడా ఆయుధానికి

జంకి పన్ను చెల్లిస్తాయన్నమాట. ఘూర్జరులు విశేషించి వర్తకులేమో? వీరిలో పాండిత్యము వల్ల పేరందిన వారి పేళ్లు శ్రుతంకావడంలేదు. వేంకటాధ్వరి- "కేవా ఘూర్జరసుభ్రువా మవయవాయూనాం న మోహావహాః" (విశ్వగుణాదర్శం) అనడంచేత ఆయీ బ్రాహ్మణులు ఐశ్వర్యవంతులని సాక్షాత్పరంపరయా బోధిస్తుంది... "యత్రాకృతిస్తత్రగుణాః, యత్ర గుణాస్తత్ర సంపదః" అయితే వేంకటాధ్వరి యావత్తుజాతినీ బోధించే ఘూర్జరపదాన్ని ప్రయోగించడంచేత దాన్ని కేవలం బ్రాహ్మణ పరం చేయడం సమంజసంకాదనే శంక కవకాశంవున్నా, బ్రాహ్మలతోపాటు యితరులు కూడా ఐశ్వర్యవంతులు కావలసివస్తుంది. కాని అంతకంటే వచ్చే విప్రతిపత్తిలేదని తెల్విడి. అయినా మనకు బాగా తెలియని విషయంలో యేదో వ్రాతకుదిగి, తెలిసీ తెలియని వ్యాఖ్యాతలవలె అపహాస్యాస్పదులం కావడంకంటే యేకొంచమేనా తెలిసిన విషయంలోనే కొంత వ్యాకరించడం సమంజసం కనక ప్రస్తుతం అట్టిది- "ఆంధ్రబ్రాహ్మణ జాతి" కనక దాన్ని గూర్చే తెలిసినంతలో కొంతవ్యాకరిస్తాను. యీపేరు వీరువసించే దేశం ఆంధ్రదేశం కావడంచేత వచ్చివుంటుంది. యిదేకాదు తక్కిన ద్రవిడ, కర్ణాట, వగైరా పేర్లుకూడా డిటో, యీ పేరుగల బ్రాహ్మణులలో అవాంతరభేదాలు చాలావున్నాయి. (1) తెలంగాణ్యులు (2) వేగినాట్లు (3) వెల్నాట్లు (4) కాసలనాట్లు (5) ములికి (ముల్కి, నానాటికి మురికిగా పరిణమించింది) నాట్లు, (6) కరణకమ్మలు వీరు వైదికులమని వ్యవహరించుకుంటారు. అన్యోన్యమూ వీరిలో వీరికి పంక్తిభోజనాలు (ఆహితాగ్నులకుతప్ప) కలవు. మంచప్పొత్తు (వివాహాలు) మాత్రం యేలేశ్వరోపాధ్యాయుల నాటినుండి లేదు. అంతకుపూర్వం వున్నట్లే వూహించాలి. ఉపాధ్యాయులుగారి కొమార్తెకు విశ్వబ్రాహ్మణుడు భర్తగా (ప్రమాదంచేత) తటస్థపడ్డాడనిన్నీ ఆ కారణంచేత శ్రుతిస్మృతి సందర్భంలేని యీ వివాహనిషేధం బ్రాహ్మలలో ఆచారంగా పరిణమించినదనిన్నీ చెప్పుకుంటారు. "ఏలేశ్వరోపాధ్యాయులు" గారు చాలా గొప్పవారని తోస్తుంది. ఆయన వెల్నాటిశాఖీయులే. ఆ యింటిపేరివారు ఆశాఖలో మొగల్తుర్తి గ్రామంలో నేడున్నూ వున్నారు. ఇతరత్రకూడా వుండివుంటారు. నాకు అక్షరాభ్యాసానంతరం (రెండో గురువులు) యేలేశ్వరరావు శ్రీరామశాస్త్రుల్లుగారే. ఆయీ వంశీకులు వుపాధ్యాయులుగారి కొమార్తెకు ప్రమాదవశతః ఘటించిన "విశ్వబ్రాహ్మణ జామాతృకత్వం" కారణంగా ఆయీ శాఖవారికి వెలి (బహిష్కారం) వచ్చి తద్వారా వీరువెలినాట్లుగా ఏర్పడి తుదకు వెల్నాట్లుగా వ్యవహరింపబడుతూ వున్నారని వొక పుక్కిటి పురాణము శ్రుత మవుతుందిగాని అది యుక్తి సహము కాకపోవడముచేత అనాదరణీయము. యెవరో వృథా శాఖాభిమానులు "దురభిమాన గ్రహావేశ ధూమధూపితులు" కల్పించి వుంటారు. పాకనాడు, కాసలనాడు, వేగినాడువగైరా పేళ్లవంటిదే యీవెలనాడున్నూ. వెలనాడు అనేది విదర్భదేశానికి

నామాంతరమని వినికిడి వుంది. ఆదేశ వాసులు బ్రాహ్మణులు వెల్నాటివారు. అయితే ఆదేశంలో వసించే క్షత్రియాదులుకూడా వెల్నాట్లు కావద్దా? అనే శంక కవకాశం లేకపోదు. ఆశంక యితర నాడులకూ వుంది, "అయం నిరుత్తరః పూర్వః పక్షః" -యేకారణమో? బ్రాహ్మణులకు మాత్రమే ఆయీ పేరు కలిగింది -యింతే యిప్పటికి చెప్పేసమాధానం. వెలనాటి చోడుడు అనేపేరుతో వొకరాజు వున్నట్టు దేనిలోనో చదివిన జ్ఞాపకం. ఆయీ ఆంధ్ర బ్రాహ్మణులలో వుండే యావత్తు అవాంతర శాఖలూ వొక ప్రక్కా, వెల్నాటివా రొకప్రక్కా వుండేటట్లు విభజించి తూకం వేస్తే యింకా, వెల్నాటివారే మొగ్గుతారని తోస్తుంది. యీ శాఖ సంఖ్యాబాహుళ్యానికే కాదు, పూర్వం -"వేదశాస్త్ర సంపత్తికే" కాదు, ఐశ్వర్యానికే కాదు, అన్నిటికీ ఆంధ్రబ్రాహ్మణశాఖలలో అగ్రగణ్యంగా కనపడుతుంది ఆఖరికి ఆంధ్ర కవిత్వానిక్కూడా నిన్నమొన్నటి నుంచి యీ శాఖకే, తిరుపతిశాస్త్రిగారివల్ల యెక్కువ గౌరవం కల్గింది. అతనిదే యీ వాక్యం-

"వెలనాటివాడ గవితకు వెల నాటిన వాడ" అన్నాడు తిర్పతిశాస్త్రి, ఏదో సందర్భములో. యింకా కొందఱు వీరిలో కవులున్నారు. కాని "నఖలు సర్వోపి వత్సరాజః". అనేకకారణాలవల్ల వెల్నాటివారికి అగ్రతాంబూలం యీవలసి వస్తుంది. ఆ శాఖలో -ఆ-బూ-చే-లు మఱీ సుప్రసిద్ధులని గోదావరి జిల్లాలో చెప్పగా వినడం. ఆ అంటే ఆకెళ్లవారు, బూ అంటే బులుసు, చే అంటే చేవలి. యీ యింటి పేర్లవారు వేదశ్రౌతాలలో అందెవేసిన చేతులనిన్నీ, వీరు లేని యజ్ఞమంటూ వుండదనీ చెప్పుకోగా వినడం. "బుల్బుసులేని యజ్ఞం" "బలుసులేని తద్దినం" అనే లోకోక్తి స్పెషలుగా బులుసువారికే సమన్వయించేది సరేసరి, సర్వత్రాకాదు గాని కోనసీమలో మాత్రం అన్నివిధాలా "పెద్ద ద్రావిళ్లు" వెల్నాట్లకు తీసిపోరని చెప్పుకుంటారు. (యీ పెద్ద ద్రావిళ్లకు పేరూరు ద్రావిళ్లు అని నామాంతరం) యివన్నీ గతకాలపు మాటలు. యిటీవల అందఱూ రాజకీయ విద్యలోకి దిగారు. లోగడ, శాస్త్రీ, అవధానీ వగైరాల స్థానాలని రావు పదం ఆక్రమించింది. కాని యిప్పుడేనా విత్తనాలు (వేదశాస్త్రాలకు) కావలసివస్తే ఆ ప్రాంతంలోనే సకృత్తుగా దొరుకుతాయి. పూర్వకాలంలో వేదశాస్త్రాలకు పేరు పడ్డ కుటుంబాలు కొన్ని, రాజకీయ విద్యలో కృషిచేసి దానిలో పేరుప్రతిష్ఠలు గడించడం అభినందనీయమేగాని, కొన్ని కుటుంబాలు కాలమహిమచేత యేదీలేకుండా, శుంఠతావచ్ఛేదకాలుగా తయారవడం శోచనీయం.

"తేషాం నిందా న కర్తవ్యా యుగరూపాహితే ద్విజాః" యెవరో స్వాములవారు అప్పటికి పూర్వం పుష్కరకాలం నాడు చూచిన చూపునకూ, తాత్కాలికంగా చూచిన

చూపునకూ, భేదం కొంత కనపడితేనే –"అహో పేరూరి దౌర్భాగ్యం వ్యాఖ్యాతా సూపశంకరః" అన్నారని చెప్పుకుందురుగదా! ఆస్వాములవారికి గ్రహాయుర్దాయం కాక యోగాయుర్దాయం పట్టి యిప్పుడు వచ్చిచూస్తే యేమనుకోవలసి వస్తుందో? అనిపిస్తుంది నాకు. ఇది గతజల సేతుబంధనం. ఆంధ్రబ్రాహ్మణులలో సర్వవిధాలా వెల్నాటివారు అగ్రగణ్యులు. పేరూరి ద్రావిళ్లు లేదా పెద్దద్రావిళ్లు యీ "ఈషదసమాప్తౌ కల్పప్రత్యయః ఆయీ "కల్ప" తౌల్యాన్ని చెప్పేటప్పుడే ప్రత్యయంగాని, వేదాంగాన్ని చెప్పేటప్పుడు స్వతంత్రశబ్దమే (కల్పశ్చేతి షడంగాని. చూ.) యీచర్య. 'చుం' ను గూర్చి వేఱొకవ్యాసంలో విస్తరించడంచేత స్పృశించి విడుస్తున్నాను. అయితే యీరెండు శాఖలూ తప్ప యితరశాఖలు యెందుకూ పనికిరానివికావు. వారిలోకూడా లోకోత్తరులైన పండితులు వుండేవారు.

(1) భాగవతుల హరిశాస్త్రుల్లుగారు (2) ఇంద్రగంటి విశ్వపతిశాస్త్రుల్లుగారు (3) కొవ్వూరు గోపాలశాస్త్రుల్లుగారు (4) శిష్టు కృష్ణమూర్తిగారు (5) ఆణివిళ్ల వేంకటశాస్త్రుల్లు గారు (6) నడివింటి మంగళేశ్వరశాస్త్రుల్లుగారు (7) పుల్లేదక్షిణామూర్తి శాస్త్రుల్లుగారు (8) ఇంద్రగంటి గోపాలశాస్త్రుల్లుగారు (9) మంత్రవాది లక్ష్మీనారాయణశాస్త్రుల్లుగారు.

ఈలా యేకరువు పెట్టవలసివస్తే వందలకొలదిగా పెరుగుతుంది. జాబితా గతించిన వికారివత్సరం చాలామంది పండితులను మాట దక్కించుకుంది గాని, లేని పక్షంలో యింకా యిప్పటిక్కూడా చాలామంది వుండేవారే. ఆ వికారి సం॥రంలో సప్తగ్రహకూటం తటస్థించింది. అది దేశానికి అనేకవిధాల అరిష్టాపాదకమని మాపరమ గురువులు, కొవ్వూరులో శాంతికి వుపక్రమించి చాలా పనిచేశారు. వారు ఆ దీక్షలోనే పరమపదించారు–

> "కలిమానం బొక యైదువేలరుగ నేకత్రస్థ సప్తగ్రహ
> మ్ములకున్ శాంతి యొనర్చుచున్ శ్రమలవమ్మున్ లేకయే బ్రహ్మము౦
> గలసెన్ బ్రహ్మగురూత్తముండు దశమీ కంజాప్తవారంబు నా
> ద్య లసత్పక్షము కార్తికమ్మును వికార్యబ్దమ్మునుం గూడగన్"

జాబితాలో వుదహరించిన నామధేయాలన్నీ యితరశాఖల పండితులవే. వెల్నాటిశాఖ విస్తరించి వుండడంచేత వారిలో పండితసంఖ్య కూడా విస్తరించే వుండేది. యితరశాఖా సంఖ్యనుబట్టి పండితసంఖ్య యితరశాఖలలోనూ వుండేదన్నమాట. శాఖలన్నిటిలోనూ మా ఆరామ ద్రావిడశాఖ సంఖ్యలో చాలా తక్కువది. కవులూ, పండితులూ, యజ్ఞకర్తలు కూడా యీశాఖలో చాలా తక్కువేగాని, యజ్ఞకర్తలకూ ఋత్విక్కులకూ వుపకరించే గ్రంథం ఆణివిళ్ల అనేది కాకరపర్తి వాస్తవ్యులు ఆణివిళ్ల వేంకటసోమయాజులుగారు రచించడంచేత ఋత్విక్కులలో వారిపేరు యెఱుగని వారుండరు.

యీ సోమయాజులుగారు, అప్పరాయ యశశ్చంద్రోదయం అనే అలంకార గ్రంథం కూడా రచించారు. యీయనకవిత్వం అగ్రహారాలు చాలా సంపాదించింది. ఆఖరు వయస్సులో పెద్దాపుర సంస్థానంవారు వీరికి అగ్రహారం యిస్తూవుండగా మంత్రి పాణంకిపల్లి రామచంద్రుడుగారు చెడగొట్టినట్టు చెప్పుకుంటారు. దానికి కారణం రామచంద్రుడుగారు సోమయాజులు గారిని విందుకు ఆహ్వానిస్తే యాజులుగారు అంగీకరించపోవడమే. సోమయాజులువారు యితరులు వండినది యేలాగూ తినరు. అందుకు దివానుగారికి కోపంరాలేదు. "అయ్యా! మీరు చేసుకునే స్వహస్తపాకం, మాగృహంలో, మాపదార్థంతో చేసుకుంటే మాకు సంతుష్టి. తద్వారా మా పెద్దలు తరిస్తారు మేమూ తరిస్తాం" అని ప్రాధేయపడితేకూడా సోమయాజులుగారు, దానిలో యేం లోపంవస్తుందో వైదీకానికి? అందుకుకూడా వు, హు, ససేమిరా, అని ఛాందసంగా బిఱ్ఱబిగియడంచేత రామచంద్రుడు గారికి వొళ్లుమండి ఆయీ అపకారం చేసినట్లు చెప్పుకుంటారు. కత్తిపోటుకన్నా కలంపోటు మిన్నగా పనిచేస్తుందన్నమాట వూరికే పుట్టలేదు. ఆయీమాటను ప్రస్తుతగాథ వ్యాఖ్యానిస్తుంది. సోమయాజులుగారు రాజుగారి మీద, కంకణబంధం కాబోలును రచిస్తే దానికి రాజుగారు సంతసించి మీకేంకావాలీ, కోరుకోవలసిందని అడిగారనిన్నీ, దానిమీద సోమయాజులు గారు వారి గ్రామం కాకరపర్తికి అతిసమీపంలో వసిష్ఠానదికి తూర్పువొడ్డున వున్న గౌతమీవసిష్ఠా మధ్యస్థం నారికెలమిల్లి గ్రామాన్ని అగ్రహారంగా కోరారనిన్నీ, రాజుగారు దివానుగారిని పిలిపించి దానపట్టా వ్రాయవలసిం దనేటప్పటికి లోగడ జరిగిన విందుప్రసక్తి మనస్సులో వుండడంచేత మంత్రి రాజుగారితో- "అయ్యా నెలరోజులలో గొప్ప సూర్యగ్రహణం రానైవుంది, ఆ గ్రహణకాలంలో యీలాటి దానాలు యివ్వడం కోటి గుణితంగా యీలాటి పండితులే సెలవిస్తారు కనక అప్పుడు మనం అక్కడికి వెళ్లి ఆ వసిష్ఠలోనో, గౌతమిలోనో, స్నానంచేసి యీ దానంచేస్తే బాగుంటుందేమో? సోమయాజులు గారితో సంప్రతించవలసి"నదని కడు వినయవిధేయతలతో మనవి చేసేటప్పటికి, మంత్రిగారి మాట టక్కున టంకప్పొడిలాగ అతుక్కోవడంచేత "మహాబాగా వుందోయి రామచంద్రుడూ! నీ మాట" అని రాజుగారు సమ్మతించి అప్పటికి ఆ ప్రయత్నం విరమించారనిన్నీ, పిమ్మట గ్రహణమైతే వచ్చింది, రాజుగారు స్నానానికి ఆ ప్రదేశానికి దయచేసి వెళ్లీవెళ్లడంతోనే సోమయాజులు గారినైతే ఆహ్వానించడానికి యెవరినో పంపడంమట్టుకు జరిగింది; కాని అప్పటికి చాలా వృద్ధాప్యంలోవున్న సోమయాజులుగారు స్వర్గంలో-రంభగారి లోగిట్లో వున్నట్లు తెలిసి అన్నా యెంతమోసం జరిగింది అని రాజుగారు విచారిస్తూ- "అన్నా! రామచంద్రుడూ? పాపం మూటకట్టుకున్నావు గదా;" అని మృదువుగా మందలించా రనిన్నీ చెప్పుకోగా వినడం. ఆ యా వేంకటసోమయాజులుంగారే కూచిమంచి

జగ్గకవిగారి చంద్రరేఖావిలాపంలో చంద్రరేఖకి తండ్రిగా అపలపింపబడ్డవారు. జగ్గకవి వేంకట సోమయాజులు గారిముందు గడ్డిపోచగాకూడా మాఱడు. ఆయన వేదవేదాంగ పారంగతుడు. పైగా సంస్కృతంలో మహాకవి. జగ్గకవి తెలుగు కవిత్వానికి కావలసినంత సంస్కృత పాండిత్యం వున్నవాడు. వీరిద్దరున్నూ యేటికొప్పాక జమీందార్లవద్ద తారస పడడంలో యేదో వైరకారణం కలిగివుండాలి. "యాచకో యాచకశ్శత్రుః" జమీందార్ల వద్ద జగ్గకవికి తా ననుకున్న లాభం లభించకపోవడంమాత్రం సత్యం. దానికి సోమయాజులుగారు కారకులో కారోగాని, జగ్గకవిగారికి సోమయాజులుగారే కారకులనే నిశ్చయం కలిగినట్లు విలాపంవల్ల గోచరిస్తుంది. ఆ కాలంలో సంస్కృతపండితులు, యద్వా కవులు, తెలుగు కవులను తోటకూరలోని పురుగులమాదిరిని చూడడం మాత్రం అప్పుడేకాదు యిప్పుడుకూడా సంస్కృతపండితులకూ కవులకూ తెలుగుకవులంటే చాలా యీసడింపే! యిట్టి యీసడింపు సోమయాజులుగారు, జగ్గకవిగారిపట్ల కనపఱిచే వుంటారు. విలాపంలో కొన్ని వాక్యాలు యీ మర్మాన్ని వ్యాకరిస్తాయి.

(1) "పెద్దయేనుగుకాలంత... ... ఇట్టి సౌందర్యనిధి భువి బుట్ట జేసినట్టి తామరచూలి నేర్పుఅయదరమె? చాల జదివిన వేంకటశాస్త్రికైన"

(2) "డాయను భీతిఁ బొంద మగడా?యను సొమ్ములుదాల్చు... డా? యను... ... వేంకటశాస్త్రి నేఁడు రాఁ డా? యను వానికేమి పుఱుడా? యను నేగతి దేవుఁడా యనున్"

ఆయీ వేంకటశాస్త్రిగారే వేంకటసోమయాజులుగారు. యీయన చేసిన యజ్ఞశాలలోనే రాజుగారు చంద్రరేఖతో మొదటి కన్నెర్కం జరిగించినట్లున్నూ, ఆ చంద్రరేఖ సోమయాజులుగారి సంతానమైనట్టున్నూ జగ్గకవిగారు కోపంకొద్దీ ఔచిత్యానౌచిత్యాలు పాటించక వ్రాస్తే వ్రాశారుగాక ఆ వ్రాతవల్ల సోమయాజులుగారికి లాభించింది. యెందుచేతనంటే, రాజుగారికి చంద్రరేఖ అనే వుంపుడుకత్తె వుంటే వుండుగాక, ఆమె వేంకటశాస్త్రిగారికి కూతురే అగుగాక, రాజుగారికి మిద్దెలూ, మేడలూ యెన్నో వుంటాయి గదా! అట్టిస్థితిలో యీ యజ్ఞశాలలోనేనా ప్రథమసమాగమభాగ్యం కావలసివచ్చింది? అనే విప్రతిపత్తి గోచరించి ఆయీ గాథయావత్తూ కాకపోయినా, సోమయాజులుగారి చుట్టరికం చంద్రరేఖ తల్లికి వుందనే టంతవరకేనా అసత్యమని తేలుతుంది.

చంద్రరేఖా విలాపంలో వున్న విషయం యావత్తూ కల్పితమేకాని రాజుగారికి చంద్రరేఖ వుంపుడుకత్తె అనే టంతవఱకు యథార్థం కాకపోదు. జగ్గకవి అఖండ శివపూజా ధురంధరుడైన తిమ్మకవిగారికి సాక్షాత్తూ సోదరుడు. అట్టి సద్వంశీయుడు యీ అనుచితానికి

దిగడం శోచ్యంకాకపోదు. గాని, దానికి తగినంతకారణం లేకపోలేదు. రాజుగారు-జగ్గకవిని నౌకర్లచే కొట్టించినట్లు వినికిడి. మొదట రచించినది చంద్రరేఖా విలాస మనిన్నీ, వేంకటశాస్త్రిగారి యీసడింపుల వల్ల ఆ కృతికి సత్కారం జరగలేదనిన్నీ, క్రమక్రమంగా ఆయీ వైషమ్యం యీ విధంగా పరిణమించిందనిన్నీ వినికి. యిందులో యేకొంతో సత్యంకాకపోదు. నేను ఆయీ రాజుగారి గ్రామం నేటికి 48 సంవత్సరాలనాడు వెళ్లి వున్నాను. రాజుగారి వంశీకులు నన్ను బాగా సత్కరించారు. మొదట రచించిన చంద్రరేఖావిలాసం యెక్కడేనా లభిస్తుందా? అని వారు ప్రశ్నించారు కూడాను. యింతకూ జగ్గకవిగారి కవితాధార చాలా ధారాళమయినదే కాని ఆయనకు నామరూపాలు కలిగించేది యే పుస్తకమూ లేదు.

(1) జగన్నాథమాహాత్మ్యం (2) సుభద్రాపరిణయం- యీ రెండూ సోమదేవ రాజీయంతో సహా మూడు అచ్చుపడ్డాయి. చాలాకాలంనాడు నేను చూచాను. యీ విలాపం ముందఱ అవి దివిటీముందు దీపాలు. "పాపకృత్యేఽపికీర్తిమ్" అన్న జాతకగ్రంథ శ్లోకానికి ఆయీ విలాపం ప్రథమోదాహరణం. కోపంమీద వ్రాసినవ్రాత కనక ఆవేశపూరితంగా నడిచింది. కొన్ని పద్యాలు చూస్తే ఆ కాలంలోకూడా, వైదిక నియోగ కక్షలు వున్నట్లు తెల్లమవుతుంది. కొంచెం యీయనకు భోగినీదండకం (పోతనామాత్యప్రణీతం) మార్గదర్శకంగా వుంటుంది గానిదానిలో ఔచిత్యం వుంది. దీనిలో అది బొత్తిగా లేదు. జగ్గకవిగారి తరవాత మళ్లా యీ శతాబ్దంలో యీలాటి ఔచిత్య దూరంగా వ్రాసేకవి కవిత్వం వుంది. అది రచనవల్లనే లోకానికి గోచరిస్తుంది కనక పేరు వివరించవలసి వుండదు. ఆ రచనకన్న జగ్గకవిది అనేక వేలరెట్లు నాణెంగావుంటుంది. యేదో ప్రసక్తాను ప్రసక్తంగా చాలాదూరం వచ్చాం. వేంకటకవిగారి స్వహస్తపాక నియమంతుదకు అగ్రహారాన్ని ముట్టకుండా చేసిందన్నది పరమార్థం. పనిలో పని శ్రీ కూచిమంచి గోపాలకృష్ణమ్మగారు యీ స్వయం పాకస్థులను యేవిధంగా సమ్మానించేవారో? దాన్నికూడా చదువరుల వినోదార్థం టూకీగా వివరించి ప్రధానగాథలోకి వస్తాను.

గోపాలకృష్ణమ్మగారు చిన్న జమీందార్లని వినికి. బహుశః కోన సీమప్రాంతం పలివెల వీరి నివాసమై వుండాలి. వేదవేత్తలు, శాస్త్రకోవిదులు,కవులు వారి దర్శనానికి రావడంలో ఆశ్చర్యం వుండదు. వీరిలో కొందఱు ఆహితాగ్నులు వుండకపోరు. వారిని ముందుగా గోపాలక్రిష్ణమ్మగారు యీ విధంగా హెచ్చరించేవారట. అయ్యా తాము మాపంక్తిని భోంచేయరు కాబోలును, స్వయంపాకానికి యేర్పాటు చేయవలసిందంటారా? అనేటప్పటికి చిత్తం అలాగే అని యీ ఆహితాగ్నులు సవినయంగా తలవూపే వారనిన్నీ, తరువాత

వారికి కావలసింది తవ్వెడో మానెడో బియ్యమూ, దానికి సరిపడ్డ పప్పూ, ఉప్పూ వగైరా అయినా పంపడం మాత్రం యే పాతిక ముప్ఫైమందికో సరిపడ్డంత పంపేవారనిన్నీ, అది చూచి వారు "అయ్యా యింతపదార్థం అవసరం ఉండదు" అని త్రిప్పివేయబోతూ వుండగా కిష్టమ్మగారు "అయ్యా, మీ స్వయంపాకంలోనే యీవేళ మేంకూడా భోంచేసి పునీతులం కావడానికి మాకు అభ్యనుజ్ఞ నిప్పించాలని అతి వినయంగా (అతి వినయం ధూర్తలక్షణం) కోరేవారనిన్నీ దానికి యీ ఛాందసులు యేమీ ప్రతి చెప్పలేక, ఆహితాగ్నులు వంటబ్రాహ్మలుగా మారి భోజనానంతరం వారిచ్చే సంభావన పుచ్చుకొని జమీందారు గారి యుక్తికి ఆశ్చర్యపడుచూ వెళ్లేవారనిన్నీ చెప్పుకుంటారు. ఆయీ సంగతి యెన్నాళ్లనాటిదో కాదు గాని నాపుట్టుకకు కొంచెం పూర్వపుదై వుంటుంది. కనక యెనభైయేళ్లనాటిదై వుంటుంది. అయితే గోపాల క్రిష్ణమ్మగారు యీ విధంగా వీరిని సమ్మానమనే పేరుతో అవమానించడం యెందుకు? అనే శంక ప్రతివారికి ఉత్థితాకాంక్షగా కలుగుతుంది. ఆయన తాత్పర్యం యిది : ఆహితాగ్నులకు తగిన శుచిశుభ్రాలు లేని చోట, స్వహస్తపాకం చేసుకుంటారు సరే, మా యింట్లో యే విధమైన ఆచారలోపమూ లేదుగదా? వీరికీ తెగనీలుగెందుకు? కనక వీరికిది ప్రాయశ్చిత్తంగా పరిణమించుగాక! అని కావచ్చును. యేమేనా కిష్టమ్మగారి ఆతిథేయత్వం అభినందనీయంగాదు. దీనికి "వీరభద్రపళ్యానికి హనుమత్పళ్లెం"గా బులుసు వెంకట సోమయాజులుగారు వొకయుక్తిచేసి మృదువుగా మందలించినట్లు విన్నాను.

యెప్పుడో దైవికంగానో, లేక ప్రత్యేకించి పనిగట్టుకొని యిందుకోసమో, వెంకప్ప సోమయాజులుగారు దయచేసేటప్పటికి యథాపూర్వంగానే సామగ్రి వెళ్లేటప్పటికి స్వయంపాకం యేలాచేస్తే ప్రస్తుతానికి అనుకూలమో, ఆలాగు "పచా మ్యన్నం చతుర్విధం"గా తయారుచేసి యింత పచ్చిపులుసుమాత్రం చేసి, కూరలు వారు పంపినా వాట్లజోలికి పోక దేవతార్చన ముగించి "అయ్యా! అభ్యవహారానికి దయచేయండి" అని జమీందారు గారిని ఆహ్వానించేటప్పటికి వారు దయచేశారు. సోమయాజులుగారు విస్తళ్లలో పదార్థం వడ్డించారు: అది సరిగా వుడకలేదు సరికదా, పైగా దాన్నిండా మసిబొగ్గులూ, మట్టిబెడ్డలూ వగైరాలతో యేలా వుండాలో, చెప్పేదేమిటి? ఆలావుండేటప్పటికి జమీందారుగారు తెల్లబోయి "యేమి?? సోమయాజులుగారూ యీలా వుంది? పొయి మండిందిగాదా? అయ్యో పాపం యీవేళ దీన్ని యేలా భోంచేస్తారు" అంటూ నిజమైన విచారం తోటే వుపచారవాక్యాలు పలికేటప్పటికి సోమయాజులుగారు యెటిగుండిచేసిన కొంటెతనమేకనక నిర్వికారచిత్తంతో సగౌరవంగా సంబోధించి– "కాలే కడుపుకి మండేబూడిది" యిది మాకు నిత్యమూ జీతపాటే. యెప్పుడోగాని మాకు యీ స్వహస్తపాకము తప్పదు. సుకుమారముగా

వుండే మీరు కూడా నేడు యీ "తదన్నంతద్రసం" లోకి రావడమూ, మాకష్టసుఖాలు తెలుసుకోవడమూ వచ్చింది కదా? అని లజ్జిస్తున్నా ననేటప్పటికి జమీందారుగారు తాము చేసినపనికి చాలా పశ్చాత్తపించి యీలాటి మహర్షులపట్ల యేలావుండాలో యెఱిగివుండిన్నీ అపచారం చేశాంగదా? అని నొచ్చుకొని, క్షమాపణచెప్పి వారి ఆశీర్వచనాన్ని పొందినట్లు చెప్పగా వినడం. యిందులో యేకొంచెమో. యిటీవలి వారికల్పనైతే కావచ్చుగాని యావత్తూ కల్పనకాదు. యీ గోపాలకిష్ణమ్మగారికి పండితులతోటీ కవులతోటీ యెక్కువ పరిచయం వున్నట్టు ఆయీ స్వయంపాకగాథే కాదు, ఖలకర్ణ విషాయణం అనే ప్రబంధంకూడా సాక్ష్యమిస్తుంది. యీ పుస్తకం పేరు వినడమేకాని దీన్ని చూడలేదు. పన్నాల రామబ్రహ్మ శాస్త్రుల్లుగారు ఆయీ ప్రబంధం రచించారని మా విద్యార్థిదశలో వినికిడి. కవికర్ణ రసాయనాన్ని పట్టి యీ పేరు పుట్టి వుంటుంది. యిది గోపాలకృష్ణమ్మగారిని దూషించేదిగా వుంటుందని పేరువల్ల గోచరిస్తూవుంది. కవికీ యీయనకీ యేదో కలహకారణం కలిగి వుండాలి.

అసలు తోవలోనుంచి వ్యాసం మఱోతోవలోకి వచ్చి చాలా సేపయింది. శ్రీనాథమహాకవి "పాకనాటింటివాడవు" అన్నాడుగదా! వీరు నియ్యోగులా? వైదికులా? అని ప్రశ్నించుకుంటే; ఆ పుస్తకంలోనే- "కమలనాభామాత్య చూడామణి" అని తనతాత గారికి వేసిన అమాత్య బిరుదం సంశయాన్ని తీర్చివేస్తుంది. ఆ యీ పాకనాటివారికి ప్రాజ్ఞ్నాటు వారనే నామాంతరం కూడా శ్రుత మవుతూ వుంది. వీరు నెల్లూరుమండలంలో కొంత విస్తరించి వున్నట్లు నావూహ. ఆఱువేల వారికంటే వీరిశాఖ చాలా తక్కువ సంఖ్య గలదే. వీరికీ వారికీ యిచ్చి పుచ్చుకోవడాలు యీనాడే కాదు, ఆ నాడూ వున్నాయను కుంటాను. కంకంటి పాపరాజుగారు "విద్యావినోదు లార్వేలవారు" అంటూ వొక సీసపద్యం చక్కనిది వ్రాసి శాఖాసౌభాగ్యాన్ని వ్యాకరించి వున్నారు. (యీ పద్యం ఉత్తర రామాయణంలో చూ.) శ్రీనాథుడు తనశాఖనుగూర్చి వ్రాస్తే బాగుండేది. కాని వ్రాసినట్టులేదు. మేమైతే "తురగవిద్యా ధురంధరత గోటలనైన దాటనేర్తురు పాకనాటివారు" అంటూ వొకసీసం రచించాంగాని ఆపాక నాటివారు (ఆయీ పద్యం శ్రీనివాసవిలాసంలో చూ.) గద్వాల, ఆత్మకూరు, ఆయీ సంస్థానాధిపతులైన రెడ్డిరాజులుగాని బ్రాహ్మణులుగారు. నా బాల్యగురువులు- వెల్నాటివారు అని వొక సీసం స్వశాఖా సౌభాగ్యాన్ని గూర్చి వ్రాసి వున్నారు. అది శ్రీకృష్ణభారతంలో వుంది. యిక్కడికి "ఆంధ్రద్రవిడ" అన్న శ్లోకంలో వున్న ఆంధ్రావాంతర భేదాలు తెలిసినంతలో వివరించినట్లయింది.

ద్రావిళ్లలో పుదూరు ద్రావిళ్లూ పుట్టగుంట ద్రావిళ్లు అనే వారిని పేర్కోలేదు, గాని తక్కినవారిని గూర్చి తెలుగుదేశంలో వుండేవారిని పేర్కొన్నట్లే. యీ పుదూరు, పుట్టగుంట

వారు నెల్లూరుప్రాంతంలో వున్నారు. చెన్నపురిలోనూ కనబడతారు. (1) వావిళ్లవారు, (2) చదలు వాడవారు, (3) వేదంవారు యీ మొదలైన సుప్రసిద్ధులు ఆయీద్రావిళ్లే. ఆయీ శాఖకు చెందినవిద్యార్థి – వేదం వేంకటేశ్వరశాస్త్రి నావద్ద కొన్నాళ్లు చదువుకున్నాడు. చెన్నపురిలో తన బంధువులు కొందఱితో నన్ను చూడడానికి వచ్చినపుడు సయితము విభూతిధారిగానే కనపడ్డాడు గాని, బంధువులు తిరుమణి తిరుచూర్ణ ధారులుగా వున్నారు. అప్పుడు ప్రశ్నించలేదుగాని తరవాత అతణ్ణి యీవిషయమై ప్రశ్నించాను.

"యీ ప్రాంతంలో మాశాఖీయులు కొందఱు యీ విధంగా వుండడం ఆచార" మన్నాడు. కీ.శే. వేదం వేంకటరాయశాస్త్రుల్లుగారు వగైరా మహామహులేకాదు, లౌకైక ప్రసిద్ధులు అల్లాడివారు లోనైనవారుకూడా యీ శాఖవారే అని విన్నాను.

తుని మొదలుకొని బరహంపురందాకా దెవిలిద్రావిళ్లు అనే శాఖవుంది. వీరు పేరూరిద్రావిళ్లేకాని అన్యులు కారు. రజస్వలా వివాహం చేయడంవల్ల స్వశాఖనుండి విడిపోవలసి వచ్చిందని వినికిడి. ఆలాటి వివాహంయెందుకు చేశారో అన్యత్ర వ్యాఖ్యానించాను.

తూర్పున - పుట్టనంబులు అంటూ గంజాం డి. ప్రాంతంలో వొక శాఖ వుందనిన్నీ వారు చెప్పుకోవడం – ఆరామద్రావిళ్లుగా చెప్పుకుంటారు గాని ఆరామద్రావిళ్లు కారనిన్నీ మా శాఖీయులు తూర్పుదేశీయులు చెప్పగా విన్నాను. యెంతవఱకు సత్యమో కాని వీరు కోళ్లను పెంచుతారని యెవరో చెప్పగా విన్నాను.

వీరిలోకూడా మంచి విద్వాంసులున్నారు. వెల్నాటివారో లేక పేరూరిద్రావిళ్లో వీరికన్యను వివాహంచేసుకున్నారని విన్నాను. కాని ఆ వివాహం సంఘసంస్కర్తలకు సంబంధించింది, (పునర్వివాహం) కావడంచేత తావన్మాత్రంవల్ల ఆశాఖకీ యీ శాఖకీ బాంధవ్యం నిరాఘాటమనడానికి వీలు కాదు, కుక్కుటములూ, పిల్లులూ, కుక్కలూ యీ మూడింటి పెంపకమూ–

> "శ్వాన కుక్కుట మార్జాల పోషకస్యదినత్రయమ్
> ఇహ జన్మని శూద్రత్వం చండాలఃకోటిజన్మసు".

అనే ధర్మవచనాన్ని పట్టి నిషిద్ధమే అయినా, కోళ్లను పెంచడం బ్రాహ్మలకు యెక్కువ దురాచారంగా పాటిస్తున్నారు. పిల్లులు బాహాటంగా యింట్లోమనుషులతోపాటు యెంతటి శిష్టుల గృహాలైనాసరే గాలితోపాటు తిరుగుతూనే వుంటాయి. మడి గట్టుకొన్నప్పుడుకూడా వాట్లను ముట్టుకోవడం దుర్వారమే. అవి పదార్థాలను ముట్టుకుంటూనే వుంటాయి.

బంగాళీల యిండ్లలో వీటికి మఱీ చనువు. వారు మత్స్య భుక్కులు గనక మత్స్యశేషాలు వారికి పనికిరానిబాపతు వీట్లకు వుపయోగపడుతూ వుంటాయి. వారు కోళ్లను పెంచుతారని వినలేదు. బంగాళీలు తమ పిల్లలతోపాటుగా పిల్లులను ప్రేమించి వాట్లకు తమసిరి ననుసరించి ఆభరణాలుకూడా అలంకరిస్తారని వినడం. కుక్కలను శిష్టులు పెంచరుగాని బాగా నాగరీకం ముదిరిన బ్రహ్మబంధువులు పెంచుతూనే వున్నారు. వీరేనా కోళ్లను పెంచరు, మొత్తం త్వరలో శూద్రత్వం సంపాదించుకోవాలంటే యీ యిండియన్ గడియారాలని పెంచడమే మంచి వుపాయం. ప్రస్తుతకాలంలో నాన్ బ్రామిన్సుతనం నౌకరీ సంపాదనకు సాధనం గనక బ్రాహ్మలు దీన్ని అవలంబిస్తే పై అధికార్లు గౌరవిస్తారేమో? బ్రాహ్మలు యెందఱో పాపం! యీ దిక్కుమాలినకులంలో యెందుకు పుట్టవలసి వచ్చిందో అని విచారించేవారున్నారు. పూర్వం దేనికి దేనికి గౌరవమో, యిప్పుడు దానికి దానికి అది లేదు. వెధవ పొట్టకోసం యెంతటి అనౌచిత్యానికైనా సరే సర్వులూ ఆలాయపడే కాలందాపరించింది. శాంతం పాపం! ప్రకృతమనుసరామః. కోళ్లను పెంచడంవల్ల బ్రాహ్మణ్యానికి వచ్చే హాని యెక్కువది అని తేలింది. శాస్త్రం కంటె కొన్ని విషయాలలో ఆచారం ప్రబలంగా కనపడుతుంది.

> "తాల హింతాల ఖర్జూర నారికేళ మధుద్రుమాః
> ఏషాం ఫలాని భోజ్యాని న మద్యంతు కదాచన."

అని వొకాయన చదివి తాటిముంజలు తినడానికి అభ్యంతరం లేదన్నారు. శ్లోకం యాజ్ఞవల్క్యస్మృతిలోని దన్నారు. దేవతా నివేదనకు కొబ్బరికాయ, ఖర్జూరం, యిప్పపువ్వు, యివి వాడినట్లు తాటిపండుగాని, యీతపళ్లుగాని వాడరు. కొబ్బరికాయనీళ్లు శివునికి అభిషేకం చేస్తారు. తాగుతారు కాని కొబ్బరికల్లు నిషిద్ధమే. యీలా విచారణ చేసినకొద్దీ శాస్త్రానికీ, ఆచారానికీ వున్న తేడాపాడాలు కనపడతాయి. కోళ్లని పెంచడంచేత పుట్టనంబులకూ, మాఆరామద్రావిడానికీ బాంధవ్యం లేకపోయిందనే (యీకుక్కుటపోషణ కల్పితమో, యథార్థమో విచారించాలి.) ప్రసక్తిలో యితర విషయం కొంత నడిచింది. ఆయీ నంబులుకూడా ఆంధ్రబ్రాహ్మణ జాతీయులే.

యిక శివార్చకులూ, వైఖానసులూ ఆయీ రెండుశాఖలవారూకూడా ఆంధ్రులలో అంతర్భవించే బ్రాహ్మణులే. ఒకరికి ఆగమం ప్రమాణం; వేరొకరికి ప్రత్యేకించి సూత్రములు (ఆపస్తంబాదికం కాక వుంది. దానికి కర్త–విఖనోఋషి) యీ యిరుతెగలవారూ విగ్రహారాధనకు ప్రధానులు. సగుణోపాసకులు. విష్ణువు నారాధించడమూ, తిరుమణి తిరుచూర్ణ ధారణమూ యివి రెండున్నూ శ్రీ వైష్ణవులతోపాటే వైఖానసులకి; తక్కిన

సందర్భాలలో కలవదు- "యెవరికి వారే యమునాతీరే" వీరికి కంచప్రొత్తుకుగాని, మంచపొత్తుకుగాని స్వశాఖేగాని అనుకూలించేది మఱొకటిలేదు. వీరుతప్త చక్రాంకణం అంగీకరించరు. గర్భస్థశిశువుకు చూలాలిగర్భంమీద తిరుమణితో ఆయీ సంస్కారం కొందఱు శిష్టులు నెఱవేర్చడం కలదు. వీరు గర్భవైష్ణవులని శ్రీనివాసస్మృతిలో వుంది. అహమేవ గురుస్తేషాం గర్భవైష్ణవ జన్మనామ్ - శివార్చకులు శివభక్తులే కాని లింగధారణం అంగీకరించరు. ఆదిశైవులమంటారు. అంటే ఆరాధ్యశైవులకంటే ప్రాచీనులైన శైవులన్న మాట. వైఖానసుల వైష్ణవంకూడా వీరి శైవంవంటిదే కాని, ఆదిపదంచేర్చి వారు వ్యవహరించుకోవడంలేదు. వీరికి పొత్తు స్వశాఖీయులతోమాత్రమే. దక్షిణదేశంలో అందులోనూ - చిదంబర క్షేత్రంలో వీరిశాఖ విస్తరించి వుండడమే కాకుండా, వుద్దాలమైన పండితులుకూడా వున్నట్టు వినికిడి. వీరిని దీక్షితులంటారనిన్నీ, వీరి వర్తన ఆపేరుకు తగినట్టుగా వుంటుందనీ చెప్పగావిన్నాను. యీదేశంలోకూడా వీరిలో ఆగమాలు తెలిసిన పండితులు కొందఱువున్నారు. యిక్కడ ఆంధ్రదేశస్థులలో ఉండే అవాంతర బ్రాహ్మణులను గూర్చి సంగ్రహంగా తెల్పినట్లయింది.

సత్యాషాఢశాఖీయులు మిక్కిలి విరళంగా తెలుగుదేశంలో యేలూరుప్రాంతంలో కనపడతారు. అసలు వీరు యేడుగోత్రాలు మాత్రమే వుండేవారనిన్నీ యిటీవల రెండు గోత్రాలవారు నిస్సంతవడంచేత నేడు అయిదుగోత్రాలవారే వున్నారనిన్నీ ఆకారణంచేత వివాహాదులు కష్టసాధ్యం కావలసివచ్చిందనిన్నీ ఆచిక్కు తొలగడానికి తెలగాణ్యశాఖవారిని కోరితేవారు వీరిని కలుపుకొన్నారనిన్నీ వినికిడి మాత్రమేకాదు. నేను స్వయంగా ఆయీ శాఖాద్వితయానికి జరిగిన వివాహం కీ॥శే॥లు కలువలపల్లి రంగనాథశాస్త్రుల్లుగారింట చూచి వున్నాను. ఆయీ శాఖలో యితర శాఖలో యెక్కడోగాని లేని - 'సప్తార్షేయప్రవరులు' కూడా వున్నారు. మాలో తి॥శా॥కి బాల్యగురువులు కీ॥శే॥లు శ్రీబూర్ల సుబ్బారాయుడుగారు యీశాఖీయులే. నాశిష్యవర్గంలో ప్రధానులలో వొకడుగా గణింపదగిన చి॥మంచావఝ్ఝల సీతారామశాస్త్రి యీసత్యాషాఢ శాఖీయుడేకాని, ఇతడు జన్మతః తెలగాణ్యుడై సత్యాషాఢ శాఖవారికి దత్తుడయినాడు. భవతు.

యికనల్లా వెల్నాటిపూజార్లు తప్ప అవాంతరబ్రాహ్మణశాఖలన్నీ అంతో యింతో (ఆంధ్రదేశంలోని) వ్యాకరించినట్లయింది. యేరాజుల కాలంలోనో యేడుగోత్రాలవారు వెల్నాట్లు శివార్చన చేయడానికి అంగీకరించి కేటాయింపబడడంచేత తక్కినశాఖవారు వారితో యౌనసంబంధం మానుకొన్నట్లు కనబడుతుంది. భోజన ప్రతిభోజనాలు (శిష్టులకువినా) యితరశాఖలతో జరుగుతూనేఉన్నాయి. భగవంతుణ్ణి పూజించడం

పరమోత్కృష్టమైన కార్యమే అయినా అది ప్రతిఫలశూన్యంగా వుండాలి కాని, అన్యథాగా అయితే దానికి గౌరవం లేకపోవడమేకాక, దేవలకత్వాన్ని సంఘటిస్తుందనిన్నీ ఆ దేవలకత్వం పాంక్తేయత్వానికి భంజకమనిన్నీ ధర్మశాస్త్రకర్తలు ఋషిపుంగవులు నిర్వచించి వున్నారు.

యిక నల్లామిగిలినవారు ఆంధ్రదేశీయులలో (1) విశ్వబ్రాహ్మలు (2) దేవబ్రాహ్మలు, (3) కళింగబ్రాహ్మలు – యీ మూడు తెగలవారూ కనపడతారు. వీరిలో నెంబరు వన్‌వారు కృష్ణా, గోదావరి, గుంటూరు, మండలవాస్తవ్యులు. యీవన్నందీ ఆహార విషయంలోనూ సదాచార సంపత్తిలోనూ బ్రాహ్మణులతోపాటుగానే వుంటారు. వారిలో వారికే యెన్నో సందర్భాలు కుదిరితేగాని పంక్తిభోజనాలు సందర్భించనప్పుడు యితరులతో సందర్భించవని వ్రాయవలసి యుండదు. రెండో నెంబరు వారిలో యెవరోతప్ప తక్కినవారు మత్స్యభుక్కులే కాక మాంసభుక్కులు కూడా అని చెప్పగావినడం. మూడోనెంబరువారు తూర్పున సికాకుళం ప్రాంతంల్లోవున్నారు. వీరి బ్రాహ్మణ్యాన్ని గురించి మనకు బాగా తెలియదు, వోఢ్ర బ్రాహ్మణ్యానికి సంబంధించి వీరి ఆచారాలు వుంటాయని తోస్తుంది. యిక్కడికి, శ్లోకములో వున్న వొకటి రెండు నెంబర్లను గూర్చి యే కొంచెమో వ్యాకరించినట్లుయింది.

యిక కర్ణాటకులను గూర్చి వ్రాయాలి. వీరందఱూ ద్వైతమతస్థులు. మాధ్వులని వీరికి నామాంతరం. వీరిలోనూ వైదీకులున్నారు. వారు ఆచార్యపదంతో వ్యవహరించ బడతారు. లౌకికులు పంతులు పదంతో వ్యవహరింపబడతారు. బ్రాహ్మణజాతిలో మొట్టమొదట లౌకికోద్యోగాలలో ప్రవేశించినవారు వీరే. వ్యాపారులు అనేపేరు వీరికి ఆకారణంచేతనే వచ్చి వుంటుంది. వీరికి అద్వైతులంటే చాలాద్వేషం. అది మతవిషయం లోనే. యితరత్ర వారూ వీరూ మమేకంగానే వుంటారు. చాలా భాగం లౌకికులే కావడంచేత యేమాత్రం వైదికవిద్యాప్రవేశం వున్నా ఆ వ్యక్తికి వీరిచ్చే గౌరవం అపారం.

"అబ్రవీ త్పురాణగాథ" వీరు పూజించే స్వశాఖాపండితులను గూర్చి ప్రతిపక్షులైన స్మార్తపండితులు కల్పించిందే. వీరిలో యితర శాస్త్రాలకన్నా తర్కశాస్త్రం చదివిన విద్వాంసు లధికంగా వుంటారు. వీరి వేదాంతం చాలా భాగం ఆశాస్త్రాన్ని పురస్కరించుకొని వుంటుంది. జగత్ప్రసిద్ధులగు భీమాచార్యులవారు ఈ శాఖీయులే.

వీరిల్లో అవాంతరభేదాలు నాకు బాగా తెలియవుగాని లోకైకప్రసిద్ధతార్కికులు కీ॥శే॥లు శ్రీకర్ణాట సీతారామశాస్త్రుల్లుగారుకూడా యీ శాఖలో అవాంతరీయులే కావాలి. వీరిలో స్మార్తులలో మాదిరిగా గ్రామపురోహితులు లోనైనవారు లేకపోలేదుగాని బాహుళ్యంమీద లౌకికులే హెచ్చు. పంతుల పఠాణీవేషాలు అనే పాత్రద్వయంలో వున్నపంతులు యీశాఖవారే. బ్రాహ్మణులు నాగరీకం ముదిరితే వుండే విశేషాలు ఆవేషాలవల్ల సులువుగా

బోధపడతాయి. హాస్యాన్ని నికృష్టంగా చూస్తారు. గాని, నీతిని బోధించడానికి నవరసాలలో దాన్ని పోలిన రసం లేనేలేదంటాను నన్నడిగితే. వీరికి మాధ్వనామం మతగురువునుబట్టి వచ్చినదని తెల్విడి.

యికవైష్ణవులనుగూర్చి తప్ప తక్కిన మన దేశపు బ్రాహ్మణశాఖలని గూర్చి వ్రాసినట్లయింది. వీరిలో అవాంతరభేదాలు చాలావున్నాయి. అవన్నీ వివరించవలసివస్తే చాలా గ్రంథం పెరుగుతుంది. ముఖ్యంగా రెండు భేదాలు అందఱికీ తెలిసినవున్నాయి. (1) తెళహ, (2) వళహ - అని రెండుతెగలుగా విభజిస్తేచాలు. మతవిషయంలో అనగా ముక్తివిషయంలో కూడా యీ రెండు తెగలవారికీ భేదం సరేసరి, బొట్టులోకూడా యత్కించి ద్భేదం వుంది, ఆయీ భేదం చాలా ఆయువుపట్టు. వళహలు పాదం లేని బొట్టు ధరిస్తారు. తెళహలు పాదంతో ధరిస్తారు. పాదం అంటే కనుబొమ్మలమధ్యను దాటి ముక్కుమీదికి రావడం. కాంచిలో ఆయీ రెండు తెగలవారూ కూడా వున్నారు. వరదరాజ స్వామినికూడా ఆయీ భేదానికి గుఱిచేస్తూ వుంటారని వినడం. అంతేకాదు యీ నామం కోర్టులదాకా వెళ్లించడం కూడా చేస్తుందిట. వీరిలో వీరికి దక్షిణాదిని యిచ్చిపుచ్చుకోవడం వుంది. కాని అల్లుడిబొట్టు అల్లుడిదే; మామగారి బొట్టు మామగారిదే నేడు కమ్యూనిష్టులూ, కాంగ్రెసువారూ యేలాగో, వీరూ వారూ ఆలాగే గమ్యస్థానం వొకటే అయినా సికపట్లకు లోనవుతూ వుంటారు. వళహవారు వేదానికి స్మార్తులిచ్చినంత గౌరవాన్నీ యిస్తారు. అనగా యజ్ఞయాగాదులు పిష్టపశువుతో కాకుండా ప్రత్యక్షపశువుతోటే చేస్తారు. గత భర్తృకలైన స్త్రీలకు. శిరోముండనం ఉంది. తెళహవారికి యీ రెండూ లేవు. యజ్ఞమంటూ యెవరూచేసినట్లు లేదు. కేవల భక్తికే ప్రాధాన్యం యిస్తారు. మతకర్తయూ, భాష్యకర్తయూ అయిన శ్రీరామానుజులవారు తెళహలే అని వీరు చెపుతారు. వారు వళహవారే అని వారంటారు. రామానుజులతరువాత మళ్లా రామానుజులంతో అంతకెక్కువో అని వారే కాక యితరమతస్థులుకూడా విశ్వసించదగిన వేదాంతదేశికులు వళహలే. మహాకవీ యాగకర్తా అయిన వేంకటాధ్వరి వళహే. తెళహలు ద్రావిడ వేదానికిచ్చినంత గౌరవం ఋగ్యజురాది వేదాల కివ్వరు. వళహలు యించుమించు ఋగ్యజురాదులవిషయంలో స్మార్తులే కాని ద్రావిడవేదాన్ని కూడా గౌరవిస్తారు. ద్వైతులకు కన్నడం రాకపోవడం గౌరవభంజకమైనట్లే వీరికి అఱవం రాకపోవడంకూడా డిటో. వీధిలో దేశభాష మాట్లాడినా యింట్లో లేదా వంటయింట్లోనేనా అఱవం మాట్లాడేవారు చాలా ప్రశస్తమైనవారుగా అంగీకరింపబడతారు. దీనిక్కారణం భగవత్కాలక్షేపానికి వుపయోగపడే తాత్త్వికగ్రంథం (ఉపనిషత్సారం) యావత్తూ ఆళ్వారులు అఱవంలో అనువదించడమే. యెన్నివేదాలువచ్చినా నాలుగు పాశురాలేనా రాకపోతే ఆ వ్యక్తికి, గౌరవం లేదన్నమాటే. వేదం వచ్చినవారు

వశహాలలో నూటికొకరేనా ఉంటారుగాని తెళహాలలో వుంటారో లేదో? పుస్తకాపేక్షే. దివ్యదేశాలలో చాలా నికృష్టంగా చూస్తారు. వీరు కూడా వారిని అదేవిధంగా చూడాలను కొన్నా వారు వీరికి చిక్కరు. వారు శివాలయంలోకి యెన్నడూ రానేరారని వ్రాయనక్కఱలేదు. మానవులందఱినీ తరింపజేయడానికి అవతరించినట్లు విశ్వసించడానికి శిష్యసంచారమే సాక్ష్యమిస్తుంది గాని, అది నానాటికి యేదో విధంగా పరిణమించి ప్రకృతం కొనవూపిరితో కూడా వుందనడానికి ధైర్యంలేదు. అద్వైతులకన్నా ద్వైతులకన్నా వీరు నిమ్నజాతులకు తరణోపాయం చూపడంలో వుదారులు. ఆళ్వారులలో కొందఱు అంత్యజులేవున్నారు. వీరిలో యతీశ్వరులున్నారు. (రామానుజులవారు యతిరాజులే కదా? కాని, అద్వైతసన్న్యాసానికీ, వీరి సన్న్యాసానికీ యేతాంపెట్టుగా వుంటుంది. యితరమతస్థులు (స్మార్తులు వగైరా) చట్టన పాశ్చాత్యనాగరికతకు లొంగి మాఱినా, వీరుమాత్రం మతచిహ్నాలింకా పరిత్యజించలేదనేది చాలా అభినందనీయం. క్రాఫింగువగైరాలు వీరిలో నూటికి 99 మందికి లేవనే చెప్పవచ్చు. పాండిత్యాన్ని వేషంచేత భూషించడం వీరికి తెలిసినట్లు యితరులకు తెలియనే తెలియదు. యితరులలో పాండిత్యం హెచ్చిన కొద్దీ వేషం తగ్గుతూంది వీరిలో వేషమూ హెచ్చుతుంది.

శ్రీమాన్ పరవస్తు రంగాచార్యు లయ్యవార్లంగారు విజయనగర సంస్థానానికి ఆయీ కారణం చేతనే వెళ్లలేదని మా పరమగురువులవల్ల విన్నాను. కొంచెం వివరిస్తాను: అయ్యవార్లంగారు కోటలోకి సవారీమీద వెళ్లడమూ, ద్వారం దాటిన పిమ్మట సవారీ దిగి పావుకోళ్ళతో సభాస్థానందాకా వెళ్లడమూ సభలో వారి స్వంత చిత్రాసనంమీద కూర్చుండడం ఆచారం. మహారాజావారు సవారీ మర్యాదకు అంగీకరించారుగాని తక్కిన దానికి అంగీకరించలేదు. కారణం యేమిటంటే: అది వారి ఆస్థానపండితులకు అవమానకర మన్నారు. ఆలాగయితే మీ సంస్థానానికి మేము రానే రామన్నారు (తృణీకృత బ్రహ్మపురందరులు) ఆచార్లుగారు. మహారాజా వారు మీ చిత్తం అని వూరుకున్నారు. యివన్నీ యిప్పటివారికి యేదో విధంగా కనపడతాయి. యించుమించుకు తత్త్వాలకు సంబంధించిన మర్యాదలవంటివే యివి. యిప్పుడు దొడ్డితుడిచే వ్యక్తికికూడా గారు పదం చివరతగులుస్తూ వున్నాం. ఆలా తగల్చకపోతేనో? "డిఫర్‌మేషన్" దాఖలయిందన్న మాటే.

యేదో స్వల్పంగా వ్రాయడానికి ఆరంభించి అవాంతరసందర్భాలవల్ల కొంత పెరిగి పెద్దదయింది. యెన్నో సంగతి సందర్భాలు యింకా వ్రాయవలసినవి వున్నాయిగాని వోపిక లేక యింతతో ముగిస్తున్నాను.

★ ★ ★

# "యెనీమా"వల్ల కడుపు తేలికపడ్డట్టే సినీమావల్ల యిల్లుతేలికపడుతుంది

సినీమా పేరు వినబడడం ప్రారంభమై మూడు పుష్కరాలు దాటిందనుకుంటాను. అంతకు పూర్వం యివి లేకపోలేదుగాని "తోలుబొమ్మలు" అనే పేరుతో వున్నాయి. 10 గాని, 5 గాని రూపాయిలిస్తే రామాయణమో? భారతమో? (అంతాకాదు) ప్రధానభాగం వినికి చేసేవారు. వొంటెద్దుబళ్లు తుట్టతుదకు మోటార్లుగా మాఱినట్లే నాగరికత హెచ్చిన కొలదిని ఆ తోలుబొమ్మలు యీవిధంగా – అంటే "సినీమాల"గా మాఱిపోయి లోకానికి ఉపకారమో, అపకారమో చేస్తూన్నాయి. మొట్టమొదట ప్రసిద్ధమైన పట్నాలలో యేవొకటో వుండేది ప్రదర్శించే హాలు; అప్పటికి వట్టిబొమ్మలే కనబడేవి. అభినయంకూడా కనపడేది. వాక్కులేదు. అందుచే యింతగా జనం విరగబడేవారుకారు. చిన్నతనంలో నేను "తోలు బొమ్మలాటలు" చాలా చూచినవాణ్ణే అవడంచేత "అదే యిది" అనే ఉపేక్షా బుద్ధి కలగడంచేత ఆయీ ఆటకు వెళ్లడమందు యిచ్ఛకలిగిందేకాదు. ఆ స్థితిలో యెవరో బలవంతపెట్టి తీసుకువెళ్లి కూర్చోపెట్టడం జరిగింది. కాని నాకేమోగాని విశేషాదరం కలుగనే లేదు. యీ మహాప్రపంచంలో సర్వులూ భార్యలతో (ఘోషాకూడా త్యజించి) పిల్లలతో పిల్లులతోకూడా (కొందఱు యింటికి తాళం పెట్టికూడా అన్నమాట) వెళ్లిచూచి ఆదరిస్తూవుంటే నా బోటికి దానియందు ఆదరం కలక్కపోతే అది గణనీయంకాదు. కాని అంతోయింతో విద్యాప్రవేశం వున్న నన్ను ఆయీ సినీమా యెందుకు ఆకర్షించలేక పోయిందో? సుంత విచార్యం కాకపోలేదు! దీన్ని యిలా వుంచుదాం. ఆ యీ విషయంలో నేను కనిపెట్టింది కొత్తవిషయం వొకటి వుంది, యెప్పటికప్పుడు యేదో క్రొత్త నాటకం కల్పించడమనేది సామాన్యంకాదు. యిప్పటికి కొన్ని వందలేనా కల్పింపబడి వుంటాయి యీబాపతునాటకాలు. రోజు 1 కి మూడు ఆటలు వేసినా పట్నం 1 కి పది సినీమాశాలలు వున్నా అన్నింటికీ అన్నిఆటలకీ సమృద్ధిగా "ఆడియన్సు" వెడుతూనే వున్నారు. పైగా టిక్కట్టు దొరక్క తిరిగి వచ్చే ప్రజ కనపడడంచేత యీ "సినిమాల గౌరవాన్ని" వ్యక్తపరుస్తూ వుంది. కృష్ణా పత్రిక యెంతో ఆవశ్యకమైన విషయమైతే తప్ప ప్రచురించదని వినడం. ఆయీ విషయం తఱచుగా ఆ పత్రిక ప్రచురించి విమర్శిస్తూ వుంటుంది. అట్టి విచిత్రమైన విషయంలో నాకేమో బుద్ధి

తగులుకోనేలేదు. మా చిరంజీవులు అప్పుడప్పుడు దీని ప్రాశస్త్యాన్ని గూర్చి ప్రసంగించి ప్రశంసిస్తూంటారు. అయినాసరే నా బుద్ధి మామూలుగానే వుంది. యిది పలువురు స్త్రీలకు (ఆటపాటల నేర్పున్నవారికన్న మాట) పురుషులకు విపరీతంగా ధనం పంచిపెడుతూవుంది. యెందఱో దీనివల్ల లాభం పొందుతూ వున్నారు. యింతవఱకు దీన్ని యెవరుగాని కాదన్నవారు లేరు, అయినా సరే నా బుద్ధి మాఱుపుంతలోనే నడుస్తూవుంది. యీ మధ్య యెవరోచెప్పగా విన్నాను.

మా పట్నంలో యింకో సినీమాహాలు వెలుస్తూవుంది అని, ఆమాట విన్నప్పుడు నాకీ క్రిందివాక్యం యెప్పుడో నలభైయేళ్లకు మున్ను విన్నది కాదుకాదు బుద్ధిరాజు ఈశ్వరప్పగారు ఆనాటిపత్రికలలో హాస్యప్రధానంగా వ్రాసింది జ్ఞప్తికి దగిలింది. ఆవాక్యం యిది.

"వచ్చే వత్సరం మావూళ్లో యింకో కల్లుదుకాణం పెట్టిస్తారట" నా బుద్ధి వీట్ల విషయంలో యీ విధంగా వుండడాని కేం కారణమో యింకా విచార్యమే. అంతో యింతో ధనంకూడా ఆయీ సినీమాకారణంగా నాకు వచ్చిందికూడాను. అయినాసరే దీన్ని నామనస్సు ఆమోదించడంలేదు. ఆ యీ విషయంలో యితరులమాట ఆలా వుండగా కవులలోనేనా నాతో యేకీభవించే వారుంటారో వుండరో వోటుకు పెడితే పుస్తకాపేక్ష కనక అందుకు సాహసించేదిలేదు. యీవిషయంలో నాబుద్ధి-

"వూరంతా వొకత్రోవా, వులిపికట్ట వొకత్రోవా," అనే సామెతకు ప్రథమోదాహరణంగా నాకే కనపడుతూ వున్నప్పుడు యితరులకు కనపడడంలో ఆశ్చర్యంలేదు. అద్భుత విషయాలలో విచారిస్తే పరమాద్భుతం రేడియో కాని సినీమాకాదు. అర్థంలో అంతగా పోలిక లేకపోయినా శబ్దంలో "యెనీమాకీ" దీనికీ పోలిక కనపడుతుంది. యేలాగంటే! యింటికి తాళంపెట్టి యావన్మందీ దీనికోసం వెడితే దొంగలు ప్రవేశించి యిల్లు గుల్లచేసినట్లు కొన్ని వార్తలు వినవస్తున్నాయి. వొకానొక గృహస్థు కొడుకు ఆ దొంగలింకా ఇల్లు వదిలి వెళ్లకపూర్వమే, వచ్చి వాళ్లతో కలియబడి హతుడైనట్లు కూడా విన్నాను. అయితే రైలుగాని, విమానంగాని, యెక్కి యెవరో వాట్లకు ప్రమాదం వచ్చి హతులైనారన్నంతలో ఆ ప్రయాణాలే మానుకుంటారా? కనక అంతమాత్రంచేత యీ విషయంలోకాదర పాత్రం కాకపోదు. దీనివల్ల పుణ్యపురుషుల చరిత్రలేమి, పతివ్రతల చరిత్రలేమి, చదువురాని పామరులకుకూడా సులువుగా బోధపడతాయి. కాని సుప్రసిద్ధ పురాణగాథలు- "సినీమా కవుల" స్వకపోలకల్పనలవల్ల యేదోవిధంగా మాఱిపోతూ వుండడం శోచనీయం. అది అలా వుంచుదాం. సుమారు అయిదాఱేండ్లనాడు కాంగ్రెసు మంత్రులు- "మద్యపానము"

నిషేధించారు. దానికి ముఖ్య ప్రయోజనం, కూలీ నాలీ చేసుకొని జీవించేవాళ్లు యింట్లో పెళ్లాం బిడ్డలకు అన్నంలేకుండా తెచ్చికొన్నకాస్తా త్రాగుడుకింద వినియోగిస్తున్నారు. కనుక దీన్ని నిషేధిస్తే ఆలాటి సంసారులు కొంత సుఖిస్తారని చెప్పివున్నారు. ప్రస్తుతం బీదలే విశేషించి దీనికి హాజరయ్యేవాళ్లు. కనక దీన్ని నిషేధిస్తే దానితోపాటు కొంత బీదలను సంరక్షించినట్లవుతుందేమో అని నేననుకుంటాను. యేపల్లెటూరునుంచో సకుటుంబంగా దీన్ని చూడడానికి వచ్చే సంసారులు చాలా భాగం వుంటారు. వారికి బళ్లు స్వంతంగా వుంటాయి. వాట్లమీద ప్రయాణం చేస్తారు, వచ్చేది పట్నవాసం కనక అవసరం వున్నా వుండకపోయినా యేదో సామాను కొంత కొంటారు ఆడవాళ్లు. సినీమా ఖర్చు కొంచెమే అయినా ఆ యీ ఖర్చు దానికి యెన్నిరెట్లో తగులుతుంది. ఆ యీ సినీమావల్ల "దుర్నీతి" సునీతికన్న మిక్కిలి అభివృద్ధి అవుతూవున్నట్లు గోచరిస్తుంది. మాటవరసకి- "మాలపిల్ల సినీమా వుంది కదా? దానివల్ల నేర్చుకోవలసింది "దుర్నీతి" అందామా? సునీతి అందామా? కొడుకు, వాడికి నచ్చిన కన్యకను వరించి తీసుకువస్తే తండ్రి ఆమోదించవలసిందనేనా? దానివల్ల తేలేఫలితార్థం. ఆయీ సినీమా నోరులేని బ్రాహ్మణ జాతిని అవమానించేది కనక సాగిపోయింది, ఆలాగే కాక మతాభిమానంగల యే మహమ్మదీయులకో, క్రైస్తవులకో యిబ్బంది కలిగించేదే అయితే మఱునాడే నిషేధం తగిలేదే. నాటకరచనలో రసాన్ని భంగించే విషయాలు వుంటే, ఆ విషయం తొలగించి రసానుగుణంగా కథాకల్పన చేయడం సమంజసమని లక్షణ కర్తలు నిర్వచించారు. మచ్చు చూపుతాను, ద్రోణవధ ఘట్టంలో ధర్మరాజు "అశ్వత్థామ హతః" అని అవసరాన్ని బట్టి అబద్ధం ఆడివున్నాడు. దీన్ని వున్నట్టే ప్రదర్శిస్తే ప్రేక్షకులు దుర్నీతిపరులై చెడిపోతారు కనక- "అన్యాథావా ప్రకల్పయేత్" అనే లాక్షణికోక్తినిబట్టి మార్పుచేయడం యుక్తం. యిప్పుడు సినీమాలో మార్చేమార్పులు యిలాటివికావు. "పోతన్నగారు" అభిమానశాలి, అయాచకుడు, గర్భవ్యావసాయకుడు, శ్రీరామభక్తుడు అని మాత్రమే కవి పరంపర చెప్పుకోవడం. సినీమాలో "అఖండ దాత" అని చిత్రించారు. యిది సుగుణమే అయినా యిట్టి ప్రతీతి లేకపోవడంచేత రుచించదు. యెన్నో యీలాటి వున్నాయి. విస్తరించేదిలేదు. వీట్లవల్ల చరిత్రవిజ్ఞానం పూర్తిగా తబ్బిబ్బవుతూ వుంది. అన్నిటికన్నా మొగుడుతో చెప్పకుండా పెండ్లామూ పిల్లలూ యింటికి తాళంవేసి హాజరవడమనేది ఆర్యుల కుటుంబాలకు బొత్తిగా రుచించేదికాదు. "స్త్రీ స్వాతంత్ర్యం" దీనివల్ల పూర్తిగా వ్యాపిస్తూ వుంది కనక పాశ్చాత్యాపచార వాసన వంటబట్టిన వారికి యిది బాగా రుచించినా ముదుసలి తాతలకు యేదో వెగటుగానే కనపడుతుంది. "విడియాకులు" వగయిరా నూతనాచారాలు అచిరకాలంలో రానైవున్నాయి కనక, దానికియిది "ట్రయినింగు" స్కూలుగా పరిణమించుననడానికి నాకులేశమూ సంశయము

కనపడడంలేదు. యేవిధంచేత చూచినా సామాన్యగృహస్థుల జీవనం చాలా దుర్భరంగా మాఱడానికి నూతననాగరికత కారణంగా కనపడుతూవుంది. ప్రతివృత్తికీ అడ్డంకికల్గింది. తుదకు క్షౌరంచేసుకొని జీవించే జాతికికూడా అడ్డంకి. అనగా యేదోదానికి విశ్వామిత్ర సృష్టి యేర్పడింది. చిత్రంగా ప్రపంచం మారిపోయింది. ప్రతీదీ మనకి అలవాటయేవఱకూ తేలికధరలో యేర్పడుతుంది. అందులోకి తియ్యనీటి చేపలాగు అలవాటుపడతాం. తరవాత దాని వెల యెంత పెంచినా దాన్ని మనం మానలేం. దీనికి యెన్నో వుదాహరణాలు చూపవచ్చు. పోస్టుకార్డు చూచుకోండి 3 పైసలు మొదటవుండేది. యిపుడు మూడురెట్లు పెరిగింది. తుదకు మూడు రూపాయలదాఁకా పెరిగినా దాన్నిమానలేము. యీ కార్డులు లేనికాలం మనం యెఱుగం. కాని మనతాత ముత్తాతలెఱుగుదురు. వారు తాటాకులతోటే కష్టించి గ్రంథాలు వ్రాసుకొని చదువుకొని మహాపండితులైనారు.

"పుస్తకేషు చ యావిద్యా" అన్న యోగం మనకు పట్టింది. వారి పాండిత్యమో? "వాచోవిధేయం" పైపై మెఱుఁగులు చూచి భ్రమించే వారికి సమాధానం చెప్పలేంగాని ఆ వెనుకటికాలం మళ్లావస్తే చూదామనుకొనే నాబోటి "చేదస్తులు" అక్కడక్కడ యింకా వుండకపోరుగాని ఆ కాలం "భద్రముగలనాటి రోజు లిఁకరా విఁకరా విఁకరావు నెచ్చెలీ!"

మ. అనుమానింపక కల్పనారుచులపై నాసల్ పిసాళించు నెమ్మనమున్.

త్రిప్పుట పెద్దపెద్దలకే వశముకాదు. అట్టిస్థితిలో సామాన్యులను గూర్చి చెప్పేదేమిటి. యేదో "సినీమాను" గూర్చి వ్రాస్తూ చాలాదూరం వచ్చాం, యెందుచేతో యిది నన్ను ఆకర్షించిందికాదు. కారణం గోచరించలేదు. బహుశః వార్ధక్యమే అనుకుంటాను.

క. కూరిమి విరిగిన సతిపై
నేరమి దోఁచుగతి విషయ నిస్పృహమతి యై
కోరిక లుడిగినవానికి
నూరక విశ్వమ్ముపైని నొల్లమి వుట్టున్?

(కవికర్ణరసాయనము) - స్వస్తి



# ఆచారభేదాలు

పూర్వకాలంలో కఱవులు వచ్చాయంటే వాట్లకు కారణం వర్షాలు కురవకపోవడం అనుకొని వారుణ జపాలు చేయించడమూ, సహస్రఘటాభిషేకాలు చేయించడమూ యీరీతిగా రాజులు ఆ రోజుల్లో దైవాన్ని నమ్మి దేవతారాధనలు చేసి ఆ వుపద్రవాన్ని తొలగించుకునేవారు – విరాటపర్వం యేకదీక్షగా ఉదయంస్నానం చేసుకుని పారాయణ చేయడంకూడా వర్షాన్ని కురిపించేది.

నా విద్యార్థిదశలో కిర్లంపూడిలో మాగురువుగారూ మేమూ ఆసంస్థాన వార్షికానికి వెళ్లినప్పుడు ఆ సమీపగ్రామం గెద్దనాపల్లి కాపురస్థులు ఆయీ పారాయణనిమిత్తం మీ శిష్యులలో యెవరినేనా వొకరిని పంపవలసిందని కోరితే విద్యార్థులలో అల్లులలో మల్లుగావున్న నన్ను పంపించారు గురువుగారు. చెఱువువొడ్డున కూర్చుని పారాయణ చేసేటప్పటికి యెక్కువగా కాదుగాని వొక అఱదుక్కి చినుకులు వెంటనే (తిడితే గుద్దినట్టు) పడ్డాయి. యదనంతరన్యాయంచేత ఆ వర్షం నా పారాయణకు ఫలితంగా ఆ వూరి గృహస్థులు భావించి నన్ను సత్కరించారు.

నేను యేడెనిమిదేళ్ల వయస్సులో వుండగా వొక కఱువువచ్చింది. దాన్నే ధాత యీశ్వర కఱువుగా ఇప్పుడు మనవాళ్లు చెప్పుకుంటారు. రు. 1 టికి పదిమానికలు అంటే పది సేర్లుబియ్యం ఇచ్చేవారు. ఆ కాలానికదే పెద్ద కఱువు. కాలం బాగుంటే రు. 1కి అయిదూ ఆఱూ కుంచాలుబియ్యం యిచ్చే ధర్మకాలంగదా అది? పంటవిస్తరించి పండేటట్టయితే యెక్కడి ధాన్యం అక్కడే ముక్కిపోయే రోజులు అవి. సుమారు పుట్టెడు నువ్వులు మాతాలూకు కొనేవాళ్లు లేక నుసికావడం నా చిన్నతనంలో నేనే యెఱుగుదును. బందరులో స్కూలుపండితుడుగా వుండేరోజులలో వేసంగి సెలవులకు గుడివాడమీదుగా నూజివీడు రైలుస్టేషనుకు (అప్పటికింకా బందరురైలు తయారు కాలేదు) ప్రయాణంచేస్తూ చోరభయంచేత యేవూరుదగ్గఱ పొద్దుగుంకితే ఆ వూళ్లోనే మకాం చేయవలసివచ్చేది. కానుమోలు వగయిరా వూళ్లుకొన్ని ఆ రోడ్డున తగిలేవి. అక్కడ వంటచేసుకోవలసివచ్చేది. మజ్జిగ కొనుక్కోవడానికి సంసారుల వీథికి వెడితే అమ్మకానికి దొరికేదేకాదు. కావలిస్తే

వూరికే పోస్తామనేవారు ఆ సంసారుల ఆడవాళ్లు. ఆ వూళ్లన్నీ యీకఱువు రాకకు పూర్వమే మాఱిపోయాయి. యిప్పుడు చెప్పనే అక్కఱలేదు. కొందఱు రైతు గృహస్థులు రైలుస్టేషనుల దగ్గఱికి తమ నౌకర్లద్వారా మంచి మజ్జిగ దాహానికి పుణ్యంకోసం సమీప స్టేషనులకు పంపడం వుండేది. యివన్నీ యీ యుద్ధపు కఱువుకు పూర్వమే అంతరించాయి. మనకి కఱువంటూ రావడం యే యాభైయేళ్లకో లేక పోలేదుగాని దాని క్కారణం వర్షాభావమే.

పురాణాల్లో ద్వాదశవర్షక్షామాలు వినపడతాయి. గౌతమమహర్షి ఆలాటి క్షామాన్ని గాయత్రీ మంత్రజపం మూలంగా జయించి తన ఆశ్రమాన్ని తంజావూరు సత్రంగా మార్చినట్టు దేవీభాగవతంలో ఉంది. నివారణ యేలాజరిగినా రావడాని క్కారణం వర్షాభావమే. వొకటి రెండేళ్లు పుష్కలంగా వర్షాలు లేక పంట బాగా పండకపోయినా మన మాతృదేశం తన బిడ్డల్ని పోషించుకోగలదుగాని బ్రహ్మరాక్షసిలాగ మన పాలిటికి రైలువచ్చి పట్టుకుంది. అయితే రైలువల్ల యెన్నో సదుపాయాలున్నాయిగదా? అది లేకపోతే బతకడం యెలాగ అంటారేమో? అది లేని రోజుల్లో బతికినవాళ్లే మన తాత ముత్తాతలు. అదేకాదు–తుదకు సిగరెట్లు లేదా; సబ్బులు లేదా! టీ, ఇంకా యెక్స్‌ట్రాలు యేవీ లేకపోయినా మన బతుకు పుస్తకాపేక్షే. మన తండ్రులలో పలుమంది ఆ రైలు యెఱుగని వాళ్లే. యెంత వర్షం కురిసినా యెంత పంట పండినా ఆ బ్రహ్మరాక్షసి యెక్కడికో పట్టుకుపోయి మాయం చేస్తుంది. అందుచేత "సాహెబుకు సవారాజ్యం అబ్బినా బీబికి కుట్టుకాడలే" అనే సామెతకు మనం గుఱికావలసిందే.

పూర్వపు కఱువల్లావొక్క బియ్యానికి మాత్రమే. కట్టుకోవడానికి గుడ్డలు లేవని విన్నట్టులేదు. యింకా అపరాలు లేకపోవడమూలేదు. పాశ్చాత్య నాగరికత బాగా వ్యాప్తిలోకివచ్చి యాభైయేళ్లకంటె ఎక్కువ కాలేదు. క్రమంగా దేశం యేవిధంగా తయారయిందంటే? సర్వత్రా– (1) కాళ్లువున్న కుంటివాళ్లూ, (2) కళ్లువున్న గుడ్డివాళ్లూ యీ విధంగా తయారయింది. సావిట్లోనుంచి వంటయింట్లోకి తిండికి పోవలసివస్తే సైకిలు వుండవలసిందేకదా? అయితే సైకిళ్లు, మోటార్లు వగయిరా యంత్రాలవల్ల వున్న లాభాలు వదిలిపెట్టి యేదో స్వల్పదోషాన్ని బయడపెట్టడము న్యాయమా?– అంటే వినండి!

లాభాలు ప్రత్యక్షంగా కనపడుతూవుంటే నేను లేవనగలనా? లౌకికంగా సంచరించే టీచర్లు వగయిరాలకే కాదు – పల్లెటూళ్లలో పైల కాపర్లుకూడా సైకిలుతోనే నడకసాగిస్తూ వున్నారు. ఆఖరుకర్మ చేయించే పురోహితులు పట్నాలలో దీనిద్వారా యెక్కువలాభం (తహసీల్ దారీ జీతం) పొందుతూన్నారు; యెఱుగుదును. కాని ఆయా సాధనాలు

వుపకారంకంటె అపకారాన్ని యెక్కువచేసినట్టు కనపడుతూ వుందంటాను. నేడో, రేపో – మన భారతదేశం క్షామదేవతకు గుడికావలసి రావడం ఆయీ సాధనాలలో రైలుమూలాన్నే అని తోస్తుంది. దీని బారినుండి తప్పించుకోడానికి కొందఱు చెప్పే వుపాయం – ముఖ్యంగా సంతాన నిరోధము. ఆ వుపాయము చెప్పినవారు పాశ్చాత్యులే. ఆ వుపాయము వల్ల పుట్టబోయే సంఖ్య తగ్గుతుంది. కాని యిప్పటికే పుట్టిన వాళ్లగతేలాగ? రైతులకు నాలుగు డబ్బులు కనపడడమే కావలసింది. షావుకార్లకు వర్తక లాభమే కావలసింది. యింకో విశేషం : వీరికి రేపు కూడులేక చచ్చేవాళ్లలో మనంకూడా భాగస్వాములం కావలసి వస్తుందనే వివేచన వున్నట్టే లేదు. రైతు తనమట్టుకు నిలవచేసుకుంటాడే అందాం. తన చుట్టుపట్ల కొంపల్లో వాళ్లకు డబ్బుక్కూడా పదార్థం దొరకనప్పుడు ఆ సంసారిని వీళ్లు మెక్కనిస్తారా? అందుచేత వెల హెచ్చుగా అమ్మే పద్ధతినేనా రైతులు షావుకార్లకు యివ్వక తమ వూళ్లోనే నిలవచేస్తే బాగుంటుందిగాని అట్టివివేకం రైతులకు వున్నట్టులేదు. అందుకే ప్రభుత్వం కలుగజేసుకోవడంగాని, లేకపోతే యీ పరిశ్రమ ప్రభుత్వానికి తగిలేది కాదు. అయితే సాక్షాత్తుగా పెద్ద అధికార్లు అవాంతరంగా జరిగే మోసాలు కనిపెట్టడానికి అవకాశం వుండదు. యెన్నో మోసాలు జరుగుతాయని మాత్రం వారికి తెలుసు, అక్కడికి ఆ మోసగాళ్లకోసం యేదో ఒక వల తయారుచేశారు. ఆవలవల్ల ఆర్జించిన ఆర్జకులకు నష్టి కలిగినా సామాన్య ప్రజకేంలాభం? గతంలోవలె కాక యికముందు క్షామం రాబోతుంది అని కనిపెట్టి నివారణోపాయాలు వెదుకుతూవున్నారు. వేరుశనగపిండి దగ్గఱనుంచి ఆహారానికి వుపయోగించ వలసిందన్నారు. యింటి దొడ్ల దగ్గఱనుంచీ దున్ని పండించవలసిందన్నారు. తినగలిగితే గడ్డిక్కూడా అభ్యనుజ్ఞ వుంటుందో వుండదో కనుక్కోవాలి. యేం జరుగుతుందో? తుదకు జనాభా పెరగడం కారణంగా భావించి సంతానం ఆపవలసిందనే వారి వూహ. ఆపాతరమణీయంగా కనపడినా నిన్న మొన్నటిదాకా సరిపడి హఠాత్తుగా తన బిడ్డలను పెంచుకొనే శక్తి భారతమాతకు తగ్గిపోవడం అనుభవవిరుద్ధం కనక దీనికి కారణం రైలుద్వారా జరిగే యెగుమతులే కాని అన్యంకాదు. ప్రతీదీ ఒకదానికి లాభంగా వుండేది వేఱొకదానికి నష్టిని కలిగించడం సహజం. "బాబుకు పెళ్లి అయిందని సంతోషిస్తే సవతితల్లిరావడానికి విచారించవలసే వస్తుంది."

లోకం యావత్తు తియ్యనీటికి చేపల మాదిరిని పాశ్చాత్యనాగరికతకు అలవాటు పడింది. కుంకుడుకాయలు వాడకం తగ్గింది. ఆ స్థానంలో చాలాభాగం సబ్బు ప్రవేశించింది. చల్దివణ్ణం నాగరిక కుటుంబాల్లోనే కాదు కూలీనాలీ చేసుకునే నిమ్నజాతుల కుటుంబాల్లోనూ

నూటికి తొంభైపాళ్లు లోపించింది. ఆ స్థానానికి కాఫీ లేదా, టీ ఆదేశంగా ప్రవేశించింది. పైలకాపు కుఱ్ఱలదగ్గిరనుంచీ పొగాకు చుట్ట కాల్చడానికి బదులు సిగరెట్లు వ్యాపించాయి. ఆశ్చర్యం వేస్తుంది. సాలుకు పాతికో ముప్పయ్యో రూపాయలు వ్యయించి యే దినపత్రికనో తెప్పించుకుంటే దానిలో చెరిసగం, సిగరెట్ల అడ్వర్టేజుమెంటో, లేదా సబ్బు అడ్వర్టేజుమెంటో తప్ప యితరం కనపడదు. సబ్బుదానిలో తారలు కనపడతారు. చూచి యువకులు ఆనందిస్తారు. అందుకుగా వ్రాసిన మాటలకు అర్థం తెలుస్తుంది. కాని సిగరెట్లదానిలో వుండే బొమ్మలకు, అర్థం మాబోట్లకు గోచరించదు. రేషనింగు బియ్యానికి పెడుతున్నారు గాని సిగరెట్లకు పెడుతూవున్నట్టు లేదు. దారిద్ర్య కారణంచేతనూ కరువు చేతనూ ఆరోజు కడుపుకు అన్నం లేకపోయినా సినిమా ఖర్చు తప్పదు. గాంధీగారు రాట్నం వొడుక్కోవడాన్ని బోధిస్తారుగాని సినిమాఖర్చు తగ్గించుకోండని గాని సిగరెట్లుమానండని కాని బోధించరు. అంతమాత్రంచేత మహాత్మునికి ఆ యీ దుర్వ్యయాలిష్టమనికాదు. ఆయన బోధించే విషయాలన్నీ సంసారుల శ్రేయస్సుకు వుపకరించేవే కాని వినేదెవ్వరు? అందులోనల్లా వొక్క అస్పృశ్యతను గూర్చిన బోధ మాత్రమే అమల్లో పెడతారని తోస్తోంది. యెందుచేతంటే? దానికి చేతిడబ్బువదలదు కనుక. భగవంతుడవతరించి బోధించినా యీ దేశానికి మంచిరోజు లున్నట్టు తోఁచదు.

మొదటి యుద్ధానంతరం ఫ్రాన్సు దేశంలో జనాభా తగ్గిందనే కారణముచేత, దాన్ని పూర్తిచేయడానికి ఆడవాళ్లందఱూ సంతానం (ఏవిధంగా నేనాసరే) కనితీరవలసిందే అని శాసనం చేశారు. పాపం? అంతకుమున్ను మతవ్యాప్తిన్నీ ధర్మవైద్యమున్నూ చేసే బ్రహ్మచారిణులు (నన్సు) దేశం వదలిపోనేనాపోవాలి. లేదా సంతానమేనాకనాలి. అని చెప్పుకున్నారు. కొందఱు స్త్రీలు కేవలం గొడ్డుతాళ్లుగానే సృజింపబడతారు. అనేకులతో చుట్టఱికం వుండిన్నీ ఆబాపతు స్త్రీలు "పద్మపత్రమివాంభసా" అన్న గీతా వాక్యానికి వుదాహరణంగా వుంటారు. యీలాటి కఱువులుకోటి వచ్చినా వాళ్ల భర్తలకు చిక్కులేదు. యెప్పటికీ లింగీలింగడే గదా? ఆ శాసనం ఆ స్త్రీలపట్ల యేలా అమలు జరిగిందో తెలుసుకోలేదు.

మన భరతఖండంలో యే యే ఆచారాలు హేయంగా మనం భావిస్తామో, అవసరమయితే అవన్నీ యూరపుఖండం నిరాఘాటంగా ఆమోదిస్తుంది. ఆఖండవాసులతో యీ ఖండవాసులు దేనికీ పోటీచేసి నెగ్గలేరు. యీ ఖండం యెప్పటికేనా బాగుపడాలంటే వారి నాగరికతకు వొకదణ్ణం పెట్టి వర్తించడమే మార్గం. అయీ మాటకు యితర

లోకులమాటల్లా వుండగా యింట్లో పెళ్లాంబిడ్డలే చెవి వొగ్గరు. వారు మనకు-స్వరాజ్యం యిచ్చి యేలుకోండని దూరంగా కూర్చున్నా - వారినాగరికత మనమీద అనుగ్రహించి దూరంగా తొలగితేనే తప్ప మనం బాగుపడం, వారికి నామకః మతమంటూ వున్నప్పటికీ క్షణంలో వారు దాన్ని త్యజిస్తారు. ఆచారవ్యవహారాలలో ఉత్తరధ్రువానికీ దక్షిణ ధ్రువానికీ వున్నంతదూరంగా పైకి కనపడినా మనతోపాటు మతవిశ్వాసం కలవాళ్లు మహమ్మదీయులే. నిన్న మొన్నటిదాకా రష్యాలో దేవుడు లేడు; నేడు మళ్లా వున్నాడని వినవస్తూవుంది. యెల్లుండి మళ్లాఉండడు. ఆవలెల్లుండి వుంటాడు. "మదధీనా తవస్థితిః" అని ఎవరో ఆచార్యపురుషులు దేవుణ్ణిగురించి - అన్నారంటారుగాని అది యూరపుఖండంలో చాలా కాలంనాడే అమలుజరగడానికి ఆరంభించింది. కొన్నాళ్లు ముస్సోలినీ దేవుడు, అంతకంటేకూడా పెద్దదేవుడు... హిట్లరు. గుఱ్ఱపు జట్కావాడు బాగా నడిచే తన గుఱ్ఱాన్ని హిట్లరు పదంతోటి వాడేవాడు. మీసాన్ని గుఱించి చెప్పేదేమిటి? హిట్లరు అంతరించినా ఆ మీసాలు కనబడుతూ వున్నంతకాలం అతడు వున్నట్టే. నాజీజం నశించినా ఆ మీసం నశించదు. యే కాలంలోనూ నేటి భారతీయులవంటి ప్రజలు వున్నట్లు గ్రంథ దృష్టాంతం కనపడదు. ఆడవాళ్ల నాగరికత యెన్ని వెఱ్ఱితలలువేసిందో! వేసింది. యిప్పటికి సుమారు యిరవైయేళ్ల నాడు "యజ్ఞోపవీతం బుజ మెక్కు జందెం" దగ్గిఱికివచ్చి రవికె గౌరవం నిల్చింది. యిది యేదేశాన్నుంచి రవాణా అయిందోగాని పాశ్చాత్య నాగరికతబాపతుకాదు. వారిది చలిదేశం. వొంటినిండా బట్టలేనిదే బతకలేరు. కఱవును గూర్చి వ్రాస్తూ మాఱుపుంతలోపడ్డాం.

ధాన్యం పుష్కలంగా మనకు పండినా అన్ని ఖండాలూ పండితే తప్ప మనకు కఱువు తగ్గదు. వర్షాభావంచేత ధాన్యం వగయిరాలు పండ లేదుకనక వాటివెల హెచ్చిందను కుందాం. తోళ్లవెల యెందుకు హెచ్చాలి? సినీమా టిక్కట్టువెల యెందుకు హెచ్చాలి. నల్లమందువెల యెందుకు హెచ్చాలి? భోగంమేళాల వెలదగ్గిరనుంచీ హెచ్చడానికి ధాన్యంవెల హెచ్చడమేనా కారణం? యేమో దీనిలో కొంత "వేలాంవెఱ్ఱి" వుండితీరుతుంది. మంగలి బుఱ్ఱగొఱగడానికి చార్జీ హెచ్చించడంవంటిదేనా సినీమా టిక్కెట్టుకు వెల పెంచడం, వాడికి ఆ డబ్బులలో బియ్యం కొనుక్కుంటేనే కాని పొయికిందకీ పొయిమీదకీ పదార్థం దొరకదు. సినీమావారికి యెక్కువ ధనం వుండడమేకదా యీ వ్యాపారం ఆరంభించడానికి కారణం. వారిని యీ ధాన్యపుకఱువేం బాధిస్తుంది? యీ కఱవురోజుల్లో బియ్యానికి పెట్టిన రేషనింగు సినీమాలకుకూడా పెడితే కొంత బీదలపిల్లలకు కూడు అర్ధాకలిగానేనా దొరకేదేమో?

"కలవు దరిద్ర మాబ్ధికముకల్గె నొకప్పుడు" అన్నట్టు యిప్పటి కఱువుకు సినీమాల పీడకూడా సంప్రాప్తించింది. వొకటేమిటి? గృహస్థుల జీవితం యెన్నివిధాల దుర్భరం కావాలో అన్ని అన్నివిధాలా దుర్భరంగా తయారయింది. కఱువు తగ్గేదాకా సంతాననిరోధం అమల్లో పెట్టినా తరవాత మళ్లా కంటాడుగదా? అలా కనడంలో ఆడపిల్లల్ని కన్నట్టయితే పెళ్లి కొడుక్కి కట్నం పన్ను చెల్లించలేక చస్తాడు.

దానికి కంట్రోలు గవర్నమెంటు పెట్టకపోయినా గృహస్థేపెట్టుకోవాలి. యెవ్వడూ ఆచరణలో పెట్టడంలేదుగాని ఋషులు చక్కనికట్టుబాటు యీ విషయంలో రేషనింగును మించినదాన్ని చేసేవున్నారు. ఆరీతిగా దంపతులు ప్రవర్తిస్తే తప్పక ఆయీ బాధలో చాలావఱకు తగ్గుతుంది. యెన్నో నిషేధాలు ధర్మశాస్త్రాల్లో వున్నాయి. యేంలాభం? ఆచరించేవాళ్లు అగ్రవర్ణాలలోనే కనపడరు. నిమ్నజాతులే కొంతమెరుగు. అంతకంటే కూడా చతుష్పాద జంతువులు మెఱుగు, వాట్లకంటె జ్ఞానానికి మనిషి యెక్కువ అనుకోవడమేకాని, సంతానం కనడంలో వాట్ల ఆచారమే అభినందనీయం. వొక్క రష్యా తప్ప యితర ఖండాలలో లేదా యితర దేశాలలో జనాభా హెచ్చి వొకళ్లు వేఱొకళ్ల దేశాన్ని ఆక్రమించడానికి యత్నించడమూ, తద్ద్వారా రక్తపాతమూ, తన్మూలకంగా క్షామమూ వస్తూన్నట్టు యీ కాలంలో స్పష్టమవుతోంది. కోట్లకొలది జనం చచ్చినప్పుడు, యుద్ధానికి పూర్వం సమృద్ధిగా సరిపోయే పంట యిటీవల మిగలవలసింది, ఆలాకాక తల కిందుగ పరిణమించింది. కొన్ని దేశాలు యుద్ధకారణంగా ఆనకట్టలువగైరా చెడి నీటి వసతులు పాడయి వ్యవసాయానికి లాయకుకాకపోవడంచేత దారిద్ర్యానికి గుఱికావడంవల్ల అక్కడికి మన పదార్థాలు యెగుమతి కావడంచేత మన దేశానికి యీ క్షామబాధ సిద్ధించింది. దీని క్కారణం రైలే. "కుంభకోణేకృతం పాపం కుంభకోణే వినశ్యతి" అన్నట్లు రైలువల్ల వచ్చిన చిక్కు రైలువల్లనూ, స్టీమర్లవల్ల వచ్చిన చిక్కు స్టీమర్లవల్లనూ తీరాలిగాని అన్యథా తీరే వుపాయం కనపడదు. యెందఱు యెన్ని చోట్లకు రాయబారాలుగా వెళ్లినా పదార్థమంటూ వుంటే తప్ప ప్రయోజనం వుండదుగదా! యిప్పుడు సమృద్ధిగా వర్షాలు కురిసినా కరువు వెంటనేపోదు. వచ్చే సంవత్సరం పోవాలి. వొక్క వర్షంతోటే లేదు, యింకా యెన్నో యోగాలు అనుకూలించాలి. యితర దేశాలుకూడా బాగా ఫలించాలి, లేకపోతే మననోటికి మన పంట అందదు. మనషావుకార్లు మన దేశానికి అరిష్ట గ్రహాలుగా పరిణమిస్తారు. యెన్ని విధాల అవయోగాలు వుండాలో అన్నీ సమకూడి వున్నాయి!

"స్వరాజ్యం" వస్తే మాత్రం వీట్లని తట్టుకోగలదా? పాపం, యేమో. "తినబోతూ రుచులెందుకు?" హరిజనులు వ్యవసాయదారుణ్ణి యిప్పుడే పీల్చుకుతింటూన్నారు. బస్తా 1కి రు. 20-0-0 లేనా వెల వుంటేనే కాని రైతుకు విత్తనాలుకూడా మిగలనిచ్చేటట్టులేదు కూలిధోరణి. అంతా కూలీల కింద మాఱితే బాగుంటుందనిపిస్తూవుంది. కాని ఆ పద్ధతిని వ్యవసాయం చేసి గవర్నమెంటుకు పన్నెవరు చెల్లిస్తారు? మాట్లాడేటప్పటి కల్లా సమ్మె. అక్కడినుంచి కాల్పులు, పేల్పులు, యీ దేశానికి మంచి కాలమంటూ భవిష్యత్తులోవుందా? అనిపిస్తుంది. యెందుకన్నాడో నన్నయ్య భట్టారకుడు "గతకాలము మేలు వచ్చు కాలము కన్నన్" అన్నాడు - మహానుభావుడు, నిత్య సత్య వచనుడు, మత్యమరాచార్యుడు. "సత్కవి వాక్యము రిత్తవోవునే".

★ ★ ★

# కళలకోసరం దేవదాసీజాతి

విత్తమాత్రోపాధికమైన వేశ్యాసమాగమాన్ని కవులు పూర్తిగా యీసడించే వున్నారు. కాని మృచ్ఛకటికలోమాత్రం ఆవిషయాన్ని యెత్తుకొని మిక్కిలి చక్కఁగా రసపోషణ చేసివున్నాఁడు శూద్రకమహాకవి.

అందులోవున్న నాయిక వసంతసేన సంపదను వొక మహారాణీ సంపదగా వర్ణించాఁడు – అట్టి వసంతసేనను కేవల గుణానురక్తనుగా నిరూపించి ఆపెయందే పాతివ్రత్యాన్ని ఆపాదించి వున్నాఁడు కాని అట్టిది స్వీయగానే పరిగణింపఁబడుతుంది గనక వేశ్యాకులంలో పుట్టినంతమాత్రం చేత వేశ్యనుగా ఆపెను పరిగణించకూడదని పలువుర అభిప్రాయం. అనాదిగా మనలో ఈ జాతికి కొంత ప్రాధాన్యం వుంటూనే వుంది బ్రాహ్మణ కులంలో పుట్టి బ్రాహ్మణజాతికి విహితమైన స్నానసంధ్యాదినియమాలు లేకపోయినా ఆ వ్యక్తిని బ్రాహ్మడుగానే పరిగణించడమున్నూ పై నియమాలు వున్ననూ, అన్యుణ్ణి బ్రాహ్మడుగా పరిగణించకపోవడమున్నూ భారతాదికంవల్ల విస్పష్టమే. అలాగే సంసారిగా వుండేవేశ్యను సంసారిగా పరిగణింపక వేశ్యగానే పరిగణించడమని గమనింప వలసివుంటుంది. వేశ్యావృత్తిని నిర్మూలించడానికి మద్యపాన నిర్మూలనోద్యమం కంటే కొంత పూర్వమే సంఘసంస్కర్తలు ప్రారంభించారు. ఆ వృత్తి యెంత వరకు నిర్మూలింప బడిందో కాని ముందుగా దేవాలయాల్లో జరిగే నృత్తాదులు పూర్తిగా రూపుమాశాయి. ఆ నౌకరీ భూములు జిరాయితీలోకి చేర్చి పన్ను గట్టడమువల్ల గవర్నమెంటుకు దానివల్ల కొంత లాభము కలిగింది గాని గవర్నమెంటువారు స్వతహాగా యీ స్వల్పలాభానికి అపేక్షించారని అనుకోవడానికి అవకాశం లేదు. శారదాబిల్లువలెనే యీ బిల్లున్నూ మనలో ప్రముఖుల కోరికమీఁదనే గవర్నమెంటు ఆమోదించడం జరిగింది. ప్రతిరోజున్నూ భగవదారాధన చేసుకునేజపితలు తుట్టతుదను– "నృత్తం దర్శయామి, గీతంశ్రావయామి" అనడం సర్వానుభవసిద్ధం. దీన్ని బట్టే మహారాజులు, ఆయా ఆలయాలల్లో నృత్తగీతాది వాద్యాదులకు వృత్తులేర్పటిచి వున్నారనుట సత్యదూరం కాదు. అయితే యీ నృత్తగీతాలు మొగవాళ్లవల్లఁగాని లేదా సంసారి స్త్రీలవల్లఁగాని యెందుకు భగవత్సన్నిధిలో జరిగించకూడ దంటూ కొందఱనవచ్చును. సంగీతవిద్యలో మహావిద్వాంసు లనిపించుకొనే వాళ్లందఱున్నూ మొగవాళ్లే కాని రంజకత్వంమాత్రం స్త్రీగాత్రమందే కాని పురుష గాత్రమందు అంతగా వుండదు. నాట్యం విషయంలో చెప్పనే అక్కఱలేదు. మృచ్ఛకటికలో యీ విషయాన్ని

శూద్రకమహాకవి బాగా వివరించివున్నాఁడు. నాట్యాభి నయాలేమి, గానమేమి అవి స్త్రీలకు జన్మహక్కుగా వొప్పుకోవలసి వుంటుంది. స్త్రీవేషధారులుగా వుండి రంజింపజేసిన పురుషులున్నూ కొందఱు వుంటారు. పురుషవేషాన్ని ధరించి రంజింపఁజేసే స్త్రీలున్నూ కొందఱు వుంటారుకాని, అది సార్వత్రికంగాదు కనక ఆ యీ విషయం అంత గణించతగ్గది కాదు. అందుచేత నృత్తగీతాలకు భగవత్సన్నిధిని గాని యితరత్రా జరిగే శుభ కార్యాల్లోగాని, స్త్రీలే వుండవలసివస్తుంది. ఆ పద్ధతిని స్వతంత్రత్వంతో సంబంధించిన స్త్రీలు, అవివాహితులు తప్ప పనికిరారు- అందుకోసం యీ వేశ్యాజాతి యేర్పడ్డట్టు తోస్తుంది- “సగం చచ్చి సంగీతమూ, అంతాచచ్చి హాస్యమూ” అంటూ వక లోకోక్తి వుంది. అంటే సంగీతానికి లజ్జాత్యాగం అవసరం. అట్టి త్యాగం కులస్త్రీధర్మంకాదని వ్రాయనక్కఱలేదు. అభినయానికి బొత్తిగా సిగ్గుంటే పనికిరాదు కాఁబట్టి యీ విద్యలో పేరు ప్రతిష్ఠలు సంపాదించడం అనాదిగా కుల స్త్రీలలో లేకపోవలసి వచ్చింది. యెక్కడో ఒకరిద్దఱు స్త్రీలు యుద్ధం కూడా చేసినట్టు చరిత్రజ్ఞులు వ్రాస్తూ వున్నారు. దాన్ని కాదనవలసి వుండదు. అంతమాత్రంచేత స్త్రీలందఱూ మిల్టరీలో చేర్చుకోతగ్గవారే అవుతారా?- “కడవంత గుమ్మడికాయా కత్తిపీటకు లోఁకువ” అనే సామెత వినలేదా? యీశ్వరుఁడు బ్రహ్మదేవుణ్ణి మహిషాసురుఁడికి స్త్రీలచేతిలో తప్ప యితరుల చేతులో చావు లేకుండా వర మిచ్చినందుకు యేలా మందలిస్తూ వున్నాఁడో, చూడండీ!

> ఉ. “తెచ్చితి వీయనర్థమును దేవత లందఱకున్, వరంబు ము
> న్నిచ్చి; యిఁ కేమి సేయనగు? నెవ్వరికేనియు వాఁ డవధ్యుఁడౌ
> నచ్చపలున్ వధింపఁదగు నంగన లెవ్వరు? నీతలోదరిన్
> బుచ్చెదొ? నాతలోదరిని బుత్తునొ? పుత్తుమొ? వాసవాంగనన్.”

యీశ్వరుని భార్య మహాకాళి యుద్ధసమర్థురాలే అయినా జనరల్ మీఁద స్త్రీ స్వభావం యుద్ధానికి అనుగుణమయినది కాదు కనుక యీశ్వరుఁడు అలా చెప్పినట్టు విస్పష్టమే. సంసారి స్త్రీలల్లో వేశ్యలతోపాటుగాని అంతకన్నా మిన్నఁగా గాని గానాభినయాలు అభ్యసించతగ్గ వ్యక్తులు కొందఱు వుంటే వుందురుగాక, ఆ స్త్రీలను ఆయా సభలకు పంపి తద్వారా ఆయా భూములను అనుభవించడానికి యే గృహమేధిన్నీ ఆమోదించడం సర్వథా అసంభవం గనక యీవృత్తికై మన పూర్వులు వకజాతిని యేర్పఱిచినట్టు విస్పష్టమే. అవివాహితలైన కారణంచేత ఆ స్త్రీలను కొందఱు పురుషులు ప్రేమించడం వగయిరాలు కలిగినాయి. దానివల్ల కొంత అనర్థమున్నూ కలిగింది. అంతమాత్రంచేత ఆ జాతి దూష్యమనిన్నీ, వ్యభిచారానికే యేర్పడ్డదనిన్నీ భావించి “యితర ఖండాలలో యిట్టి జాతి లేదు; మన ఖండానికే తటస్థించింది యీ లజ్జాకరమైన ప్రారబ్ధం” అంటూ మనవారు యేవగించుకోవడం చూస్తే కొంత ఆశ్చర్యంగా వుంటుంది. ఆ దేశంలో వున్న లజ్జాకరత్వం

ఆ దేశీయులు అన్యథాగా కమ్ముదల చేసుకుంటూ వున్నారు- అనాథశరణాలయాలు యెందుకోసం ఆ దేశంలో పుట్టఁబడ్డాయి? వేశ్యాపుత్రులకు తండ్రి యెవఁడో తెలియకపోవచ్చును గానీ తల్లి యెవరో తెలుస్తుందిగదా! ఆ శరణాలయంలో చేర్చఁబడ్డ వాళ్లకు తల్లినిగూర్చి గూడా తెలియదుగదా! ప్రతి జాతికిన్నీ యిట్టి కర్మం తటస్థింప చేయడంకంటె దీనికోసం వకజాతిని నిర్బంధం లేని పద్ధతిని యేర్పాటు చేసుకోవడమున్నూ, ఆ జాతికి ప్రధానజీవనం గీతాభినయాల మీఁద జరగడానికి వృత్తులు కల్పించడమున్నూ యుక్తంగా వుందేమో చూడండీ! అయితే యీ వృత్తియం దెంతో తప్పిదం కనపడుతుంది కనక దీన్ని నిర్మూలిస్తేనేకాని వల్లకాదంటారా? అనండి. కసాయివ్యాపారం అంటూ వుందికదా? వెనుకటి రాజులు వగయిరాలు మాంసాన్ని తింటే తిన్నారుకాక, జంతు వధకంటూ శాలలు నిర్మించినట్టు గ్రంథాల్లో కనపడదు- యే అడవిలోనో వేఁటాడి తెచ్చిన మాంసాన్ని అమ్ముకునేవాళ్లు అమ్ముకొనేవారు. కొనుక్కుతినేవాళ్లు తినేవారు. అంతే. భారతంలో ధర్మవ్యాధుఁడు చెప్పిన మాటలుకూడా యీ అర్థాన్నే బోధిస్తాయి. జంతువుల వధ్యస్థానానికిన్నీ, వేశ్యాగృహానికిన్నీ చాలా భేదం వుంటుంది. మాంసం తినేవాళ్లంటూ లేకపోతే ఆవృత్తికి వకజాతితో అవసరం వుండేదేకాదు. ప్రస్తుతంకూడా పురుషు లందఱూ నీతిపరులే అయితే వీళ్లుకూడా అవివాహితులుగా వుండికూడా బ్రహ్మచారిణులుగానే వుండేవారేమో? కొందఱి అభిప్రాయం యీజాతి కులస్త్రీల పాతివ్రత్యాన్ని కాపాడడానికి యేర్పడ్డట్టుగా కూడా కనపడుతుంది. యీ అభిప్రాయాన్ని పురస్కరించుకొనియ్యేవే పాండవప్రవాసంలో మేమీ పద్యం వ్రాసింది-

చ. "చపలులులేరె? యెందుఁ బెఱచానలె కావలెనే? స్వకాంతలే
ల పనికిరారు? రా రనుము లంజలులేరె? భవాదృశుల్ నృపా
లపశువు లంగనాజనములన్ గికురింతు రటంచుఁగాదె? శు
ద్ధపశుసమానజాతి నొక దానిని ధీవరు లొప్పిరో జడా!"

యీ పద్యం ధర్మరాజు సైంధవుణ్ణి మందలించే ఘట్టంలోది- పైపద్యంలో వేశ్యలు పశుతుల్యులుగా పేర్కోఁబడ్డారు. అందుకు ఆధారం "పశువేశ్యాదిగమనే ప్రాయశ్చిత్తం సమాచరేత్" అనే ధర్మశాస్త్రం. యిప్పుడు లోకంలో స్త్రీలు వాళ్లంతట వాళ్లు యితరదేశాల నాగరికతకు లోఁబడి తమతమశీలానికి భంగంతీరి కూర్చుని తెచ్చుకుంటూ వున్నారే కాని ప్రభుత్వంగాని, అందులోవుండే ప్రముఖులుగాని దుర్నీతిపరత్వానికి లోఁబడి బలవంతంగా స్త్రీల శీలాన్ని లేశమున్నూ భంగించడం లేదు - వెనకటికాలం ఆలాటిదికాదు. వకజమీందారున్నాఁడంటే వాఁడికి వాఁడి గ్రామాల్లో వుండే స్త్రీ లందఱున్నూ అవసరమైతే భార్యాత్వానికి అంగీకరించవలసిందే -యీ విషయం యిప్పుడు తగ్గిందేమో కాని నైజాంలో వుండే యెస్టేట్లు కొన్నిటిలో నిన్న మొన్నటి వఱకూ తఱుచుగా అమల్లోనే వుండేది.

శా. "ఆ రాజేంద్రుఁడు రాత్రియుం బవలుఁ గామాసక్తిచే నూరిలో
నీరేజేక్షణలన్ బలాత్కృతిగ నెంతే బాధ పెట్టంగ నా
యూరన్ గాఁపుర ముండువార లొకరోజొక్కొక్కఁ డాత్మీయ యా
దారం బంపెద నన్న నొప్పెనఁట! యాతం డెంత ధర్మాత్ముఁడో?"

రాజులూ, రాజపురుషులూ పూర్వం బకాసురుఁడులాగ నిన్న మొన్నటిదాఁకా సంసారి స్త్రీలను బాధించడం వుండేది. ఆగర్భ శ్రీమంతులుగా పుట్టి దుర్వినీతులైన నౌకర్లచేత పెంచఁబడి దుర్వినీతులై యెందఱో జమీందార్లు లోకబాధకులుగా వుండడం చూచే అనుకుంటాను. ఆనాఁటి విద్వాంసులు రాజులకు ప్రతి వుపచారానికిన్నీ స్త్రీలనే యేర్పఱచినట్టు కనపడుతుంది. కాదంబరివగైరా గ్రంథాలిందుకు వుదాహరణంగా ఉంటాయి. మహా నీతిధురంధురుఁడైన బుద్ధభగవానులుకూడా యీ స్త్రీమయమైన బోనులో కొంతకాలం యితరరాజులవలెనే ఆయా వుపచారాలు అనుభవించి వున్నాఁడు. యెక్కడో తప్ప రాజులకు తఱచు దాసీ సంపర్కం తప్పదన్నమాటే! యెందుచేత? ప్రతిక్షణమందున్నూ వాళ్ల సాన్నిధ్యం కలిగి వుంటుందిగదా? - "కలుగనే కలుగదు కలిగెనేనియును రాజునకు దాసస్త్రీ గమనము గల్గు" అని మేము వ్రాసిందికూడా పైసందర్భాన్ని మనస్సులో పెట్టుకొనియ్యేవే. మొత్తం చామరగ్రాహిత్వం మొదలు పాదసంవాహనకృత్యందాఁకా పూర్వపురాజులకు స్త్రీలవల్లనే జరగడానిక్కారణం చూస్తే వీరిబాధ పతివ్రతాలోకానికి తప్పించడానికేమో అనుకుంటాను. వాళ్లనే రాజదాసీలంటారు. అగ్నిమిత్రుఁడు పెండ్లాడిన మాళవిక యీ తెగలోదే కనక నా వూహను కొంత బలపఱుస్తుంది. కాని ఆపెను రాజకుమారికగా కాళిదాసు సమర్థించివున్నాఁడు. అది నాటక సాంప్రదాయపు మార్పనుకోవాలి. వీళ్లలో యెక్కడో తప్ప విద్యావంతులుండరు. విద్యతో సంబంధించినజాతి దేవదాసీజాతి. ఆ జాతికే వేశ్యాది శబ్దాలు వర్తిస్తాయి. దక్షిణాదిని యీ కుటుంబాల్లో యెక్కడోతప్ప దేవాలయపు నౌకరీ వుండకుండా వుండదని విన్నాను. స్త్రీలల్లో అనాదిగా నాట్యాభినయాలేమి గానమేమి యీ జాతివల్లనే కాపాడఁబడుతూ వుంది. మేము రంభవంశంవాళ్ల మనిన్నీ, వూర్వశి వంశంవాళ్ల మనిన్నీ, మేనక వంశంవాళ్ల మనిన్నీ చెప్పుకొనేవాళ్లు పలువురు యీ జాతిలో వున్నారు- "రహి వుట్ట జంత్ర గాత్రముల ఱాల్గరఁగించు విమల గాంధర్వంబు విద్య మాకు" అని పెద్దన్నగారు అప్సర స్త్రీ అయిన వరూధినిచేత చెప్పించివున్నారు. కాదంబరిలో వీళ్ల వంశాలనిగూర్చి చాలా విస్తరించి వుంది. ఆ వంశ వృక్షాలు ఆ కవిస్వకపోలకల్పితమో పూర్వాధారం యేమేనా వుందో ఆలోచించాలి- ఆ వంశ వృక్షాలు అప్సరసలకు సంబంధించినవి. ప్రస్తుతం మన దేశంలో వేశ్యాజాతి ఆ జాతికి సంబంధించిందో కాదో చెప్పలేము. బ్రాహ్మణాదులు ఋషి వంశజుల

మని చెప్పినట్లే వాళ్లున్నూ చెపుతారు. అందఱూ సానులుగానే వుండాలనే నియమంగాని, నిర్బంధంగాని లేదు– సంఘ సంస్కర్తలు ఆయీ జాతి స్త్రీలకు పెండ్లి చేసుకొనే అధికారాన్ని కొత్తగా కల్పించలేదు. ఆ అధికారం అనాదిగానే ఆ యీ జాతికి వుంది. యిప్పుడల్లా దేవాలయాల నౌకరీమాత్రం తప్పించినట్టయింది. పయిఁగా సంగీతకళనున్నూ, దానిలోనే అంతర్భూతమైన నాట్యకళ నున్నూ నిర్మూలించడానికి సంకల్పించినట్టు పరిణమిస్తూంది – యే కొంచెమో యీ కళలు సంసారులవల్ల అభ్యసింపఁబడినా ప్రత్యేకించి యిందుకోసం వక జాతి అంటూ వుంటేనే తప్ప యీ కళలు నశించిపోక తప్పదు. వ్యభిచారం నశింపచేయడానికి బ్రహ్మక్కూడా తరంగాదు. వేశ్యాజాతి దాన్నిన్నీ దేవాలయాల్లో నాట్యాలున్నూ మానివేసినంతలో లోకంలో వ్యభిచారం నశిస్తుందన్న మాట సర్వకల్ల – కాఁబట్టి సంగీతంకోసమున్నూ, అభినయం కోసమున్నూ యీజాతి వకటి వుండడానికి అంగీకరించడం యుక్తమే అని నేననుకుంటాను– దుర్నీతి విషయంలో యితర దేశాలలో కంటే మనదేశంలో సదుపాయాలు తక్కువగానేవున్నాయని ఋజువుచేయడం మిక్కిలీ సులువు. గానాభినయాలకోసమంటూ వకజాతి రిజర్వు చేయఁబడ్డదై ఉన్నంతమాత్రంచేత దుర్నీతి హెచ్చుడానికి అది ఉపోద్బలకంకాదు. జారత్వ చోరత్వాలు రెండున్నూ వకటే తరగతిలోవికదా! జారత్వానికి మనదేశంలో వకజాతి యేర్పడి వుందే అనుకుందాం, చోరత్వానికి పెద్దలచేత అలా యేర్పఱచఁబడి లేదుకదా? లేనప్పుడు అది యెందుకు వృద్ధి పొందాలి? యీ రెండున్నూ నశించవలసివస్తే జ్ఞానంవల్లనేతప్ప "అన్యథా శరణం నాస్తి".

సంగీతమున్నూ, అభినయమున్నూ అవసరమైన కళలే అని అంగీకరించే యెడల యిదివఱకువున్న వేశ్యాజాతి కాకపోతే మానెఁగాని యింకో జాతినేనా స్త్రీజాతిని స్వతంత్రమైన దానిని దానికోసం రిజర్వు చేసి పెట్టడం అవసరమనియ్యేవే. సంసారిణులవల్ల మాత్రం ఆ కళలు యే కొంచెమో నామమాత్రావశిష్టంగా నిలిచి కొనవూపిరితో నిల్వఁగలిగినా పూర్ణవికాసాన్ని పొందడంమాత్రం పుస్తకాపేక్షే అని నా తలంపు. "యీ కళలే అక్కఱలేదు, వీట్లవల్ల కలిగే ప్రయోజనం లేనేలే" దంటారా? అట్టి వారికి చెప్పవలసిన జవాబేలేదు – వకవేళ – శ్లో. సంగీతసాహిత్య రసాఽనభిజ్ఞ స్సాక్షాత్పశుః పుచ్ఛవిషాణ శూన్యః" అంటూ అభియుక్తులు పూర్వం చెప్పివున్నారని నేను ఉదాహరించినా అట్టివారు అఱక్షణంలో దాన్ని ఖండిస్తారని యెఱుఁగుదును. వొక మంచికోసం యింకో చెడ్డని అంగీకరించ వలసివస్తూ వుంటుందని వేఱే వ్రాయనక్కఱలేదు.

★ ★ ★

# కళలను ప్రదర్శించే స్త్రీలు స్వతంత్రలుగా వుండాలి

"వేలంవెట్టి"గా యీ యిరవయ్యోశతాబ్దంలో ఆయా జాతులు తమతమ జాత్యౌన్నత్యాన్ని గూర్చి మిక్కిలిగా కృషి చేస్తూవున్నాయి. ఆ కృషికి కొందఱికి యే అభ్యంతరాలున్నూ లేవుగాని కొందఱికి కులవృత్తులకు సంబంధించిన స్థిరరూపకమైన ఆస్తులు అడ్డుతగలడమంటూ వకచిక్కు యేర్పడింది.

దాన్ని యేదో విధంగా తొలగించడానికి కొంత ప్రయత్నించడం జరిగింది. అలా జరగడానిక్కారణం అది నోరులేని దేవుఁడికి సంబంధించిన దగుటచేతనున్నూ, ఆ దేవుణ్ణి నమ్మివుండే ప్రాచీనాచారపరాయణులు నోరున్న వాళ్లైనా వాళ్లకు సంఘబలం లేకపోవుటచేతనున్నూ, ప్రస్తుత స్థితిగతులనుబట్టే కాక యీ యుగమందు "సంఘేశక్తిఃకలౌ యుగే" అను అభియుక్తోక్తి ప్రకారము నడుస్తూవుండడం చేతనున్నూ ప్రతీ వ్యక్తికీ పూర్వులన్నా, వారికట్టుఁబాట్లన్నా బొత్తిగా నిస్సాకారంగా చూడడం సామాన్యమై పోయింది. పూర్వం వర్ణాశ్రమాచారాలకూ, ప్రభుత్వానికీ సంబంధంవున్నట్టు యిప్పుడు లేదుకదా! దానికితోడు పత్రికలన్నీ వారి అభిప్రాయాన్నే పురస్కరించి యేవ్యక్తి యేవ్యక్తిని యెంత తూలనాడినా అది పూర్వులకు సంబంధించిందైతే సమ్మతించి ప్రచురించడమున్నూ, నవీనులకు సంబంధించిందైతే దాన్ని "బుట్టదాఖలు" చేయడమున్నూ తటస్థించింది. పూర్వుల అభిప్రాయాలను ఆమోదించే పత్రికలంటూ లేనేలేవు. వుంటే అవి తగ్గంత ప్రచారం కలవిగాలేవు. అదిన్నీకాక పూర్వాచారపరాయణు లందఱూ వారి కర్మాన్ననుసరించి వారు వర్తిద్దామనే వారే కాని యితరుల వాదాలతో ప్రసక్తి పెట్టుకోవడానికి అంగీకరించే వారుగా లేరు. యెవరో యేవో కొంచెంగా వ్రాస్తూ వుంటారే అని కొందఱనవచ్చును. ఆ వ్రాసేవారు.సామాన్యులుకాని పెద్ద పెద్దలు కారు. వారు అదృష్టవశంచేత రంగస్థలంలోకి అవతరించడం లేదు గాని అవతరించడమంటూ వస్తే వారి మాటలు యెవరిదాఁకానో యెందుకు? వారి వారి సంతానంకూడా యీ రోజుల్లో ఆదరించే స్థితిలోలేదు. అందుకే వారు వూరుకున్నారుగాని చేతకాక కాదు. శ్రీ కాశీ కృష్ణాచార్యులుగారు మొదలైనవారు కొంతవఱకు యేదో విషయంలో కలిగించుకున్న వారున్నారు. వారి ధర్మోపదేశానికి తగినంత

సహాయం కలిగినట్లు కనిపించదు. యిప్పుడల్లా "పూర్వాచారాలు దుష్టాలు. ఆకట్టుఁబాట్లను యేర్పఱచిన ఋషులు మూర్ఖులు" అనేతోవలో వాక్కునుగాని, లేఖినినిగాని నడిపిస్తే దానికి యెంతవిలువవుండాలో అంతవిలువా వుంటుంది. నవీనమార్గాలనుగూర్చి యేమాత్రం కాదన్నా వాఁడిమీదికి లేచి యేంచేసినా ప్రపంచకం చేసిందన్న మాటే! యీ స్థితంతా తెలిసివుండీ కూడా దేవతోద్దేశకంగా సేవ నిమిత్తం పూర్వపు మహారాజులు వగైరా పరలోకంలో వుత్తమ గతి సంపాదించుకొనే వుద్దేశంతో యిచ్చిన మాన్యాలు వృథాగా పోవడాన్ని గురించి పూర్వ గ్రంథానుసారంగా యేవో కొన్ని మాటలు నేను వ్రాసివున్నాను. అవేనా నాఅంతట నేను వ్రాయలేదు; కొందఱు యోగ్యులు వ్రాయవలసిందిగా కోరితే నే వ్రాశాను. ఆ వ్రాయమన్న వారిపేళ్లు యిందుదాహరిస్తే యిప్పుడు నన్ను దూషించిన మహావ్యక్తి వారిని కూడా దూషించడానికి వెనుతీయడు కనక వుదాహరించలేదు. యిప్పుడు వారువారు తొక్కేమార్గాలు యెంత వఱకు నెగ్గుతాయోకాని, ప్రస్తుతం యెందఱికో యెన్నో విధాల నష్టాన్ని కలిగిస్తూవున్నాయి. వకటి వుటంకిస్తాను.

సుమారు యిరవైయైదేళ్లనాఁడు శృంగారగ్రంథాలు బహిష్కరించవలసిందని వొకరు కొంఁదఱి సహాయంతో గవర్నమెంటులో రూలొకటి పుట్టించారు. అది యెందఱికో యెన్నో విధాల బాధించింది. తుదకవి నిషేధించబడ్డాయేమో అంటే అన్నీ అమ్ముతూనేవున్నారు. యెవళ్లోభయస్థులు మాత్రం ఆ నష్టిని అనుభవిస్తూ వున్నారు. యిప్పుడు మళ్లా ఆ నిషేధం తొలఁగించడానికి పెద్దపెద్దలు ప్రయత్నిస్తూ వున్నారు. ఫలితం యేమవుతుందో? తెలియదు. మొదట ఆ ప్రయత్నం యెందుకు? ఇప్పుడు యీ ప్రయత్నం యెందుకు? శారదాబిల్లంటూ వకటి పుట్టించారు. అది పుట్టినపిమ్మట బాల్యవివాహాలు మఱీ చెలరేగుతూ వున్నాయి. ఆలాగని యే పిచ్చి బ్రాహ్మఁడేనా తప్పులేదు కాఁబోలు నని బాల్యవివాహం చేశాఁడా యే సంఘసంస్కర్తలో కాస్త కలిగించుకుంటారు. వాఁడి హవిష్యమూ, భవిష్యమూ తీసిపాఱవేస్తారు. దేవదాస్యానికి ఏర్పడ్డ మాన్యాలేమో బిల్లు ద్వారా క్షణంలో అంతరించాయి. యెందుకోసం యీఅంతరించడం కావలసివచ్చిందో ఆకార్యం ఏమాత్రమూ కొనసాఁగినట్టు లేదు! పోయినట్టు లేదంటావు గదా! ఋజువుచేస్తావా? అని ప్రశ్నవస్తుంది. అది యెవడి శక్యం? ప్రభుత్వంవారికి జాతిమత భేదంతో అవసరం లేదనే రహస్యం యెప్పుడైతే ప్రపంచానికి సర్వేసర్వత్ర గోచరించిందో అప్పుడు యేదో సంఘ మంటూ పేరుతో బయలురేఁటి వారివారికోరికలను తీర్చుకోవడానికి ప్రపంచం ప్రయత్నిస్తూ వున్నట్టు తోస్తుంది. నాట్యకళకోసం దేవదాసీ లనిమాత్రమే అక్కఱలేదు. మరివకళ్లయినాసరే స్వతంత్రం కలవాళ్లుండాలని నేను వ్రాస్తే వొకావిడ నన్ను ఎన్నో ఆడిపోసింది. దానిలోబోలెఁడు శ్లేషలు! స్వాతంత్ర్యం స్త్రీలకి సర్వేసర్వత్ర వుండాలని మళ్లా యెందఱో యెన్నో వ్యాసాలు

వ్రాస్తూవున్నారు. నేను నాట్యాభినయాలు వినియోగించేవాళ్లకి మాత్రమే కదా! స్వాతంత్ర్యం వుండాలన్నది. అట్టి స్వాతంత్ర్యం యిష్టం లేనివాళ్లు ఆ కళలు వదలుకోరాదా? వదలుకోవడమంటే పూర్తిగా కాదు: మహాసభలలో వినియోగించడం మట్టుకే. యింతకూ ఈ విద్య స్త్రీలమీఁద ఆధారపడి వుండఁదగ్గది కానేకాదనికూడా ఆవిడ అభిప్రాయమేమో? పోనీ తోఁచినమాటలు వ్రాసి వూరుకుంటే బాగుండును; వుల్లికుట్టు మాటలతో దూషించింది. వ్యక్తిగతంగా చేసిన దూషణవల్ల ప్రధాన విషయం గట్టెక్కుతుందా? గాంధీమహాత్ముని మాటకన్నా పాటించతగ్గ మాటంటూ వుంటుందా? ఆయన దేవాలయంలో హరిజనులను ప్రవేశపెట్టాలన్నారు. అందఱూ అంటే పూర్వాచార పరాయణులే అందాం అంగీకరించారా? యింక ముందేనా అంగీకరిస్తారా? పైఁగా వ్యభిచారాన్ని రూపుమాపడానికి మేం ప్రయత్నం చేస్తూ ఉంటే యీ శాస్త్రుల్లు దాన్ని వృద్ధిపొందించడానికి దోహదం చేస్తున్నాఁడనిన్నీ వక అపాండవం వేయడానికి ప్రతీవాఁడున్నూ భయపడి తీరవలసిందేకదా? ప్రస్తుత విషయంలో. అందుచేత నోరుమూసుకు వూరుకోవడంకన్న కర్తవ్యం కనపడదు. ఆ వ్యభిచారాన్ని దోహదం చేయడానికి యీయనకేదో స్వార్థం అందులో వుందంటూ వక అపాండవమా? భవతు, దానికిన్నీ వప్పుకుందాం, "జగమెఱిఁగిన బ్రాహ్మఁడికి" వచ్చే చిక్కేమిటి? కాటికి కాళ్లుచాచుకొన్న రోజుల్లో ఆ స్వార్థాన్ని పురస్కరించుకొని వ్రాయవలసిన అగత్య మేముంటుందో విచారించవలసిందని బుద్ధిమంతుల నడుగుతాను. "వయసి గతే కః కామవికారః" యీలాటి అపాండవం ఆరోపించినంతమాత్రంలో పూర్వుల అభిప్రాయాల యందు నాకు వున్న నమ్మకాన్ని వదలుకొని నేను నవీనాచారాలకు దాసోహమంటానా? సర్వే సర్వత్ర సద్వృత్తిలో లేక దుర్వృత్తిలోనే వుంచుదామని, లేక యేదేనా వక శాస్త్రీయమైన మతమందు వుంచుదామని యెవరేనా ప్రయత్నించి కృతకృత్యులైనారా? అయితే యిన్ని మతా లెందుకుండవలసి వచ్చింది? బుద్ధుఁడు ప్రాణిహింసను మాన్పవలెనని చేసిన ప్రయత్నంకంటే యెవరే ఘనకార్యాన్ని నిర్వహించడానికి పాటుపడ్డారు? దాని ఫలితం రవ్వంతేనా కనపడుతూ వుందా? చైనా జపాను వగయిరాలన్నీ బుద్ధమతంలో చేరినవే కదా! అతఁడు దేవుఁడులేఁడని చెప్పింది మాత్రం వారందఱూ అమల్లోవుంచి ఆదరిస్తూ వున్నారు. హింస చేయకూడదన్నది అప్పుడే దులిపేసి "సెనగలు తిని చేతులు కడుక్కున్నారు" ప్రస్తుత విషయంకూడా అంతే. అయ్యో ఆజాతివారు నేఁటికి కన్నుతెఱిచి దుర్వృత్తిని వదులుకోవాలనుకుంటూ వుంటే దిక్కుమాలిన దేవస్థానం నౌకరీ మాన్యాలు వచ్చి అడ్డుతగులుతూ వున్నాయని దయతలఁచి ఆ పీడకాస్తా తొలగించారు సమర్థులు, దానితో పూర్వదాతల నెత్తి కొట్టినట్టయింది. తక్కిన విషయాన్ని అడిగేదిక్కేదీ? అడిగితేమాత్రం "యిందులో నీకేదో స్వార్థంవుం" దంటూ వ్రాయడానికి చేతకాదా? భవతు. యేదేనా

ఘనకార్యం చేయవలసివస్తే కొంత స్వార్థత్యాగం అవసరం కదా! అట్టి సందర్భంలో యీ దేవదాసీలు ఆమాన్యాలను కూడా వదలుకొని వుత్తమశీలాన్ని అలవఱచుకోవడానికి యేల ప్రయత్నించరాదు? ఆ మాన్యాలేమో అనుభవించాలీ? ఆ దేవతా సాన్నిధ్య నవుకరీమాత్రం వదులుకోవాలీ? యిది మాత్రం యుక్తిసహంగావుందా? పోనీయండి యీ నాట్యకళ సంసారి స్త్రీలకుకూడా వుపాదేయమే అయినట్టు యిప్పటి సంస్కర్తలు కొందఱు అభిప్రాయపడుతూవున్నారు. అలాటి వ్యాసంకూడా నిన్న మొన్న వకటి చూచాను. ఆ పద్ధతిని సంసారిణులుగా మాఱి కూడా దేవదాసీలు దేవద్రోహం లేకుండా ఆ దాస్యాన్ని నిర్వర్తించుకోవచ్చునే! దేవతాదాస్యం పాపకృత్య మనే తాత్పర్యంతో కాదు గదా యీ "మూమెంటు" ప్రారంభించింది? యెన్నో సందర్భాలు నావ్యాసంలో చర్చించే వున్నాను. మళ్లా యిక్కడ చర్విత చర్వణం చేయనక్కఱలేదు. నాట్యకళ పురుషులు కూడా నేర్చినా స్త్రీవేషం ధరించినప్పుడు తప్ప పురుష స్వరూపంతో దానికంతగా శోభరాదు. పురుషుఁడుగానే వుండిచేసే అభినయ విషయం చాల తక్కువ. సాంబమూర్తి యేస్వరూపంతో నటించినా అది వకరిని సంతోష పెట్టడానికి కాదు. దాన్ని చూచినదల్లావక్క పరశక్తి మాత్రమే. నాట్యకళ వినయ విధేయతలతో సిగ్గు బిడియములతో భయభక్తులతో కొన్ని కట్టుఁబాట్లతో వున్న స్త్రీలవల్ల ప్రదర్శింపఁ దగ్గదని యెవ్వరున్నూ చెప్పరు. యిప్పుడు మాత్రం చెప్పేవారు లేకపోలేదు. వారికి పదివేల నమస్కారాలు. అట్టి స్త్రీలు యేజాతిలోనుండి బయలుదేఱినాసరే, స్వతంత్రంగా వుండఁదగ్గవారే కాని అన్యథాగా వుండఁదగ్గవా రెన్నఁటికీకారు. "నస్త్రీస్వాతంత్ర్యమర్హతి" అని వ్రాసిన మనువు మూర్ఖుఁడని అనేవారు యిప్పటిసాహసులలో కొందఱున్నా అస్మదాదుదలకు అంతటి సాహసంలేదు. స్త్రీ స్వాతంత్ర్యం గృహమందే తప్ప సభల కెక్కడానికి యేమనిషిన్నీ తుదకు యుక్తాయుక్త పరిశీలనగల యే ప్రాచీనాచార పరాయణుఁడైన మనిషిన్నీ అంగీకరించఁడు. గృహమందుకూడా స్త్రీ స్వాతంత్ర్యం యేవో కొన్ని సందర్భాలయందు మాత్రమే – "స్త్రీపుంవచ్చ ప్రచలతి గృహేతస్య గేహం వినష్టమ్" అన్న కాళిదాసు అప్రాజ్ఞుఁడని పూర్వ సాంప్రదాయవేత్తలు చెప్పలేరు. యిప్పటి సంస్కర్తలు తొక్కేతోవలు దేవుఁడంటూ వకఁడున్నాఁడనే నమ్మికతో తొక్కేవికావు. పాశ్చాత్య బుద్ధిమంతులు ప్రకృతిశాస్త్రం యెంత చదివి వశం చేసుకొని దానివల్ల యెన్ని అద్భుతకార్యాలు లోకానికి కనపఱచి, లోకాన్ని భ్రమింపఁజేసినా అవి అన్నీ క్షణికంగా వుండే యీజీవితకాలానికి సంబంధించినవేకాని కళ్లుమూసుకున్న పిమ్మట పనికి వచ్చేవికావు. స్త్రీకిఁగాని, పురుషునకుఁగాని పరమంటూ వకటివుందనే నమ్మికలేనప్పుడే యథేష్ట సంచారం అర్హమవుతుందిగాని అది వుంటే అర్హం కాదని చెప్పనక్కఱలేదు. విషయం విషయాంతరం లోకి దూఁకుతూ వుంది. చెప్పొచ్చేదేమిటంటే? నాట్యాభినయాలు కుల స్త్రీల కర్హంగావు.

యెందుచేత? 'సలజ్జాగణికా నష్టా నిర్లజ్జేవ కులాంగనా' అని కట్టుఁబాటులో వుండే వాళ్లవల్ల ప్రదర్శింపవలసిన వెన్నఁటికీ కాకపోవడంచేతనే అందుకోసం స్వేచ్ఛా ప్రచారంగల స్త్రీకోసం అవి పుట్టినట్టయింది - లేదా వాట్లకోసం అట్టి స్త్రీలేనా పుట్టినట్టనుకోవాలి. అట్టి జాతి యిదివరలో అనాదిగా అంటే పురాణాలెప్పుడు పుట్టాయో అప్పటికింకా పూర్వాన్నుంచే వకటి యేర్పాటయింది. ఆ జాతికి యిప్పుడు యితర కారణాలవల్ల ఆ విద్య వదులుకోవాలని అభిప్రాయం ప్రాయికంగా కలిగింది. వదులుకోవడానికి పూర్వకాలంలో అయితే రాజకీయ ప్రతిబంధం వుండవలసివచ్చేదేమో కాని యిప్పుడట్టి ప్రతిబంధం లేశమున్నూలేదు. ఆ వదులుకొనే వారిని సంస్కర్తలతోపాటు నేనుకూడా అభినందించేవాణ్ణే. కాని దేవతోద్దేశకంగా మహా పుణ్యాత్ములైన దాతలు పూర్వం తమకు ప్రసాదించిన మాన్యాలతోకూడా వదులుకోవలసిందంటాను. ఆ మాన్యాలు గత కళంకాన్ని జ్ఞప్తికి తెస్తాయనేనా భయపడడం యుక్తం. మాన్యాలేమో అనుభవించడమా? నౌకరీ వదులుకోవడమా? శాంతం పాపం! యీరీతికి అర్చకులుకూడా వస్తేగతేమిటి? దేవుఁడు రాయేకదా! దేవుఁడికి గతెవ్వరు? పండితులేగదా!

శ్లో. "ఐశ్వర్యమదమత్తోఽసి మాం న జానాసి దుర్మతే!
పరైః పరిభవే ప్రాప్తే మదధీనా తవ స్థితిః."

అని వేదాంతాచార్యులవారు చెప్పిన శ్లోకార్థంవల్ల పండితులకున్నూ, గుళ్లో వుండే దేవుఁడికిన్నీ వుండే సంబంధం యేలాటిదో తెలుస్తుంది. అయితే యిప్పుడు పండితులకు ధర్మనిర్ణయంలో స్థానంలేదు. యేలాటి పండితులకు? వెనకటి భారతీయశాస్త్ర వాసనతో వున్నవారికి. పాశ్చాత్య విజ్ఞానం కలవారే సర్వధర్మ నిర్ణయానికి నియంతలుగా వుంటూ వున్నారు. వారి వుద్దేశాలకిన్నీ, వీరివుద్దేశాలకిన్నీ వుత్తరధ్రువ, దక్షిణధ్రువాల కున్నంతే సంబంధం. మళ్లా విషయం విషయాంతరంలోకి దూఁకుతూ వుంది. దేవతా ద్రోహం తప్పు. అది లేని పద్ధతిని దేవదాసీలు తమ సంస్కారాన్ని నిర్వర్తించుకోవడం యుక్తం. ఒక్కళ్లుకూడా పూర్వవృత్తిలో వుండనక్కఱలేదు. ఆ వృత్తిలో హేయత్వం వున్నమాట సత్యమే! ఆ వృత్తిలోనే కాదు; జీవనార్థంగా లోకులు ఆచరించే అన్నివృత్తులలోనున్నూ అంతో యింతో హేయత్వం వుండే తీరింది. అయినా వారువారు యెందు కాయా వృత్తులు అవలంబిస్తూ వున్నారంటే?- "పొట్టకు పట్టెఁడు కూటికే సుమా!" పూర్వవృత్తులలో కంటేకూడా యిప్పుడు మహాగౌరవమైన వనుకొనే వృత్తులలోనున్నూ దోషాలుమితిమీటి వున్నాయి. ప్రస్తుతం దేవదాసీలు యేవగించుకుంటూ వున్న వృత్తిలోవున్నంత యేవం కాకపోవచ్చును గాని కొంత యేవమున్నూ, యెంతో ఘోరమున్నూ వున్న వృత్తులు మఱికొన్ని

వున్నాయి. కాని యింకా వారువారు ఆ వృత్తులను యేవగించుకొన్నట్టు లేదు. లేక వారిలోఁగూడ కొందఱు యేవగించుకొని మానుకొన్న వృత్తులు కొన్ని వుంటే వున్నాయేమోగాని అవచ్ఛేదకావచ్ఛేదేనా ఆయావృత్తులు చేసేవారిలో యీలాటి చలనం కలిగినట్టులేదు. దేవదాసీలలోనే యీలాటి సంచలనం కలిగింది. యిందుకు యెవరుగాని అడ్డంకి చెప్పకూడదు. వారు యెంత తొందరగా నేనా ఆయావృత్తులు సర్వమూ వాట్లకు సంబంధించిన ఫలితాలతోకూడా వదులుకుంటే బాగా వుంటుంది. వీట్ల కన్నింటికీ అంగీకారం యేజాతివారికేనా అయితే ఆ జాతిలోన్నుంచి కొందఱు గాని, లేకపోతే అందఱూకాని యీ ఖాళీఅయిన చోటును ఆక్రమిస్తే ఆక్రమించవచ్చును. లేదా ఆ పోస్టు ఖాళీగానే వుంటుంది. మునిఁగిపోయిందేమిటి? ఆ విచారంతో పనిలేదుకాని ప్రపంచ చరిత్రలో యేవృత్తికాని ఖాళీపడి యెవరికోసమున్నూ నిరీక్షించిందని చెప్పుకోవడం నాకు తెలియదు. "ధాతా యథాపూర్వ మకల్పయత్" యింకా వ్రాస్తే చాలావ్రాయాలి. యింతదాఁకా వ్రాయుటకు వక తపస్విని తొదరపాటు కారణం. ఆపెకోసమైతే యింత దాఁకా వ్రాయనక్కరలేదు. ఆపె తొందరపాటు నిమిత్తమాత్రంకాని ఆయా విషయాలు యితర సోదరులకొఱకేనా యెవరో వ్రాయవలసినవే కాని, వ్రాసి సంపాదించే ప్రయోజనం మాత్రం లేదు. యెందుచేత? యిప్పుడు యిట్టి మాటలయందు యెవరికోతప్ప విలువలేదు. కొందఱు యెవరీ వ్రాసిందంటూ విచారిస్తారు. "వ్రాసినవ్యక్తి లాటీచార్జీ రుచిచూచిన వాఁడేనా? శ్రీకృష్ణ జన్మస్థానానికి యెన్నిమాట్లు వెళ్లి వున్నాఁడు?" అంటూ విమర్శిస్తారు. ఆ విమర్శనకు యేమాత్రమేనా ఆఁగితే తప్ప వాడిమాటకు "వాల్యూ" వుండదు. యిప్పుడు ముఖ్యంగా కావలసిన "క్వాలిఫికేషన్సు" అవిమాత్రమే యింతవఱకు నాకుదెలుసును. తెలిసిన్నీ నాకు తోఁచినమాటలు వ్రాస్తూ వుంటాను. అవి యెవరినిగాని బాధించే తాత్పర్యంతో వ్రాసేవికావు. కాకపోయినా ప్రస్తుతం వొకతపస్వినికి బాధకంగా కనపడ్డాయి. ఆపె వేశ్యావృత్తియందు వుండేయే వాన్ని బాగా తెలుసుకొని ఆ సంఘాన్ని అభివృద్ధికిఁ దెచ్చే తలంపుతో శాయశక్తులా పాటుపడుతూ వున్నవారిలో వొకవ్యక్తి; ఆపెవుద్యమాన్ని ఆమోదించేవాళ్లలో నేను మొదటివాణ్ణి. అందులో వుండే యేవం ఆమెకు యెంత తెలుసునో అంతకన్న నాకు పదిరెట్లు యెక్కువ తెలుసును. నేను ఎందఱికో ఆవృత్తిని వదులుకోవలసిందని సలహాలుయిచ్చి వున్నాను... ఆసందర్భం గ్రంథాల్లో కొంత కనపఱచికూడా వున్నాను. అంతవఱకు ఆవిడకూడా వప్పుకుంటూనేవుంది. యిఁక మా యిద్దఱికీ అభిప్రాయభేదం యెక్కడంటే? దేవతానౌకరీభూములు తేరగా అనుభవించడం దగ్గిఱ. ఆపెకువేశ్యలలో యిప్పటికప్పుడే పూర్తిగాకాకపోయినా నూటికి తొంభై వంతులు దుర్నీతివదలుకొని సంసారిస్త్రీమార్గం అవలంబించడం జరిగిందనే నమ్మకం పూర్తిగావుంది, అలావుండడం

తప్పున్నూకాదు. యెవరేనా వకకార్యాన్ని పూనుకొని నిర్వహించేటప్పుడు ఆ నిర్వహణంలో "ఆవగింజలో అఱపాలు" గూడా కాకుండావున్నా చాలావఱకు జరిగిందనే నమ్మికవుంటేనే కాని దానిలోవారు పనిచేయడానికి సాహసోత్సాహాలుకలగవు. వెనకయెవరో బ్రాహ్మఁడు పరమామాయికుఁడు సముద్రం దోసిళ్లతో తోడుతూవుండడమూ, అలా పది పదిహేను రోజులు జరిగాక "యేమాత్రం సముద్రం తరిగిం"దని ప్రశ్నరావడమూ, ఆ ప్రశ్నకు జవాబుగా ఆ పిచ్చిబ్రాహ్మఁడు "నూటికి తొంభైతొమ్మిదివంతులు తరిగింది. రేపోనేఁడో పూర్తిగా సముద్రంవట్టిపోతుం"దని సంతోషపూర్వకంగా చెప్పడమూ అన్యత్రా వ్రాసే వున్నాను. ఆమె యొక్క విశ్వాసానికిన్నీ, ఉద్యమానికిన్నీ, నా వ్యాసంలో భంగించేమాట వక్కటికూడా లేదు. కళలకోసం యిప్పుడున్న వేశ్యలే వుండి తీరాలనే అభిప్రాయాన్ని నేను నా వ్యాసంలో యెక్కడా వెల్లడించలేదు. యేజాతిలోన్నుంచేనాసరే కొందఱు వుండవలసి వస్తుందని మాత్రం అభిప్రాయం సూచించాను. కాని, "కళలు అంతరిస్తాయి కనక వారుగాని మరొక జ్ఞాతివారుగాని వాట్లను సంరక్షించడానికి కొంత దుర్నీతితో సంబంధించిన దేవదాసీత్వాన్ని, లేక వేశ్యాత్వాన్ని స్వీకరిస్తే గాని వల్లకాదని గవర్నమెంటు ద్వారాగా బిల్లు చేయించవలసి వుంటుంది గనక అందుకోసమై గవర్నమెంటులో పలుకుబడి కలవారికి విన్నపమంపుకోవలసిం"దనియే సంఘాన్నీ నేను పురికొల్పలేదు. యిట్టిస్థితిలో ఆమెకు నామీఁద ఆగ్రహమెందుకో? నా వ్యాసం "వుపసంహరించుకోవలసిం"దని శాసించడం ఎందుకో? అగమ్య గోచరంగా వుంది. ప్రతివృత్తిలోనూ మంచిచెడ్డలు రెండూ మిళితమై వుంటాయి. విధిలేక - పాలకోసం రాయిమోసినట్టు ఆమంచికోసం చెడ్డనుకూడా ఆమోదించవలసి వస్తుంది. దీన్నే "ధాన్యపలాల న్యాయం" అంటారు. ప్రపంచకంలో వేయింటికి యేవొక్క వ్యక్తికో తప్ప మాంసభక్షణతో అవసరం సర్వత్రా కలిగేవుంది- "మ్రానను రాతనుం గలదె? మాంసము ప్రాణులమేనఁగాక" అందుచేత గోవు మొదలుకొని అన్ని జంతువులనూ అందులో ముఖ్యంగా అందటికీ పనికివచ్చే మేఁకలనూ, ఆ గొఱ్ఱెలనూ వధించవలసివుంది. ఆయీ జంతువులకు (సోల్) ఆత్మ లేదని చెప్పే పాశ్చాత్యులకెంత కరుణ వుందో? వాట్ల యందు మనలో లాగే ఆత్మ వుందని అంగీకరించక తప్పదు. యిట్టి నిష్కరుణత్వం సహింపలేకో మాంసభక్షణం రుచింపకో యెందఱో ఆ వంశాలకు సంబంధించినవారు పూర్తిగా శాకాహారులుగా మారివున్నారు. వారిని - "మీరు మాంసభక్షణం చేస్తేనే కాని వల్లకా"దని యెవరూ నిర్బంధించినట్టులేదు. అలాగే వేశ్యాత్వాన్ని గూర్చిన్నీ నిర్బంధించేవాళ్లంటూ వుండరు; ప్రోత్సహించేవాళ్లున్నూ వుండరు. యిక్కడ వ్రాయవలసిన ప్రధానంమాట వ్రాయనేలేదు. ఆ జంతువధ వక్కరోజున ఆవ్యాపారస్థులు సమ్మెకట్టి చేయకపోతే యెందఱో వుపవాసము చేయవలసివస్తుంది. కాని ఆవధకు

కులక్రమాగతంగా అలవాటుపడ్డవారే తప్ప యితరులు మాంసభక్షకులే అయినా అవలంబించలేరు. అంతటి ఘోరకృత్యానికి వారుగాని, వేరొకరుగాని సిద్ధపడడం యెందుకు? లాభాపేక్షచేతే కదా? ఆ లాభాపేక్ష మాత్రం అందఱినీ ఆ పనిలోకి" దిగనిస్తుందా? అలాగే ప్రస్తుత విషయమున్నూ – యిందాఁకా యెందుకు? పరమపవిత్రమైన యజ్ఞంలో పశుహననం చేయడంలో ఆరితేరిన శ్రౌతిపేరు శమిత. ఆశమిత వక నర మేధంలో పశువుగా యేర్పడ్డ మనిషితండ్రే కావలసివచ్చింది. యెందుచేత? యజ్ఞానికి సమ్మతించికూడా ఆపనికి యితరశ్రౌతులు సమ్మతించారు కారు. అప్పుడు ఆ నరుణ్ణి కన్నతండ్రి – "మరికొంత ధనాన్ని యిస్తే నేనే ఆశమితృవ్యాపారాన్ని నిర్వర్తిస్తా" నన్నాడు. యింతకన్న ప్రకృతవిషయంలో యెక్కువ వ్రాయనక్కఱలేదు. అన్ని దుష్కృత్యాలూ ధనంచేయిస్తుంది.

ఉ. "దేవతలన్ యజింత్రు పర దేశములన్ జరియింత్రు దాతలై
కోవిదకోటికిన్ ముదము గొల్పుదు రుత్తము; లల్పలోభులో?
జీవుల హింస సేయుదురు చేయుదురెంతయుఁ జౌర్యమున్ దగన్
భావనసేయఁగాఁ బరధనమ్ము హరించెడి త్రోవ లిన్నియున్."

దానికోసం పలువురు పలువృత్తులను అవలంబించారు. అందులో కొన్ని వృత్తులలో మంచికన్నా చెడ్డ తక్కువ వుంటుంది. కొన్ని వృత్తులలో చెడ్డకన్నా మంచే యెక్కువగా వుంటుంది. కొన్నిట్లో రెండూ సమంగా వుంటాయి. యావత్తుగాని, కొంతేగాని మంచితో చేరడమున్నూ చెడ్డే చేరడమున్నూ ఏ వృత్తిలోనో కాని సంఘటించదు. అట్టిస్థితిలో ఆయా వృత్తులు వారి వారి యోగ్యతానుసారం అనాదిగా అవలంబించి – "కులవృత్తికి సాటిలేదు గువ్వల చెన్నా!" అన్న గుడ్డి విశ్వాసానికి దాసులై కొందఱు అలాగే పడివున్నారు. వారివారికి భారతంలో వున్న ధర్మవ్యాధుఁడు వగయిరాల ధర్మవాక్యాలున్నూ, భగవద్గీతలోవుండే – స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః" అనే శ్రీకృష్ణ పరమాత్మయొక్క అభిప్రాయమున్నూ, ఆధారంగా కనబడుతుంది. కొత్తతోవ తొక్కేవారికో? "తాతస్యకూపోఽ యమితి బ్రువాణాఃక్షారం జలం కాపురుషాః పిబంతి" అనే వాక్యం తోడ్పడుతుంది. ఆయావ్యక్తులు తమ తమ వృత్తియందుండే నైచ్యాన్ని యేవగించుకొని క్వాచిత్కంగానే అనుకుందాం, ఆవృత్తిని వదులుకోవడానికి ముఖ్యకారణంగా నాబుద్ధికి యిలా తోస్తుంది. యేవో రెండు పరీక్షలు ఆయా నీచవృత్తులలోనే వుండి సంపాదించిన ధనంతోనే తమ తమ సంతానానికి తల్లిదండ్రులు అంటేటట్టు చేస్తే తద్వారాగా గౌరవ జీవనం యే కొందఱికో కలగడం చూచి యితరులు కూడా స్వవృత్తిత్యాగానికి ప్రయత్నిస్తూవున్నారు. కాని ఆలాటి

పుణ్యకాలం గతించి చాలాకాలం అయింది. దానికి అపేక్షించి కులక్రమాగతమైన వృత్తిని వదులుకుంటే విచారించవలసిన రోజులు ఆసన్న మయినాయి.

నావద్ద చదువుకోవడానికి వచ్చిన బ్రాహ్మణ విద్యార్థులలో అనాదిగా పౌరోహిత్యాలు వున్నవాళ్లు కొందఱు ఆపౌరోహిత్యమందు వుండే నైచ్యాన్ని బట్టి దాన్ని యిఁకముందు వదులుకునే లేఁత ఆలోచన చేస్తూ వుండేవారు.

శ్లో. "పురీషస్యచ రోషస్య హింసాయా స్తస్కరస్యచ
ఆద్యక్ష రాణి సంగృహ్య చక్రేధాతా పురోహితమ్."

అంటూ వకశ్లోకం యెవరోమహాకవి చెప్పింది లోకంలో శిష్టపరంపర చదవడం కలదు - ఈశ్లోకార్థం వివరించడంకంటె వివరించకపోవడమే కొంత గంభీరంగా వుంటుందని వదిలేశాను - యింతేకాకుండా -

"పౌరోహిత్యం రజనిచరితం గ్రామణిత్వం నియోగమ్" అంటూ వక శ్లోకంలో యెన్నో వృత్తులను అవలంబిస్తే అంతగా ఆక్షేపణ లేని వాట్లను యెత్తుకొని- "మాభూ దేవం మమ పశుపతే! జన్మజన్మాంతరేఽపి"

అంటూ వకకవి దూషించివున్నాఁడు. కవులకేంపని వుంది? ప్రతీదాన్నిన్నీ అగ్రస్థానానికి యెక్కించాలంటే యెక్కించాగలరు! అధఃపాతాళాని కంటించాలంటే అంటించాగలరు. బిల్హణుఁడు కవులశక్తినిగూర్చి విక్రమాంకదేవచరిత్ర 18వ సర్గలో కాఁబోలును యెత్తుకొని 'రావణాసురుఁడు దుర్మార్గుఁడనుకోవడానిక్కాని, రాముఁడు సన్మార్గుఁడనుకోవడానిక్కాని కవులయొక్క ఆగ్రహానుగ్రహాలే కారణం'గా సమర్థించి వున్నాఁడు - స్తనశల్యపరీక్ష చేయడానికి వుపక్రమిస్తే జీవనార్థం యేవృత్తినీ అవలంబించడానికి అవకాశం లేకపోవలసి వస్తుంది. తుట్టతుదకు శిలోంఛాది వృత్తులుకూడా విమర్శిస్తే ఆఁగనే ఆఁగవు. యీసందర్భం నేను "మల్లేశ్వర షట్ప్రుతి" అనేదానిలో విస్తారంగా విమర్శించి అనేకులు నింద్యవృత్తిగా అభిప్రాయపడ్డ అర్చకత్వాన్ని యితర వృత్తులకన్న యిహపర సాధకమైన వృత్తిగా సమర్థించివున్నాను. విస్తరభీతిచేత ఆయాపద్యాలు వుదాహరించలేదు. ప్రస్తుత మేమిటంటే? పౌరోహిత్యం వదులు కోవాలనుకున్న ఆయా విద్యార్థులకు నేను వదులుకోవద్దని హితబోధ చేసివున్నాను. ఆయా విద్యార్థులు ఆ పౌరోహిత్యంమీఁదనే యిప్పుడు సుఖ జీవనం చేస్తూ నన్ను తల్చుకుంటూ వున్నారు. యీ రోజుల్లో వేదశాస్త్రాలకు ఆమాత్రం మంచివృత్తి మఱొకటి వున్నట్టు నాకు తోఁచదు. యేవ్యామోహంవల్ల బ్రాహ్మణాది వర్ణాలవా రందఱూ స్వకులోచితవృత్తులు వదులుకొని వున్నారో ఆ వర్ణాలవారందఱూ

ఆయా వృత్తులకోసం మళ్లా పాఁకులాడవలసిన కాలం తారస మవుతూవుందనే అంశం ఆ వ్యామోహం శూన్యం కావడంవల్ల అందటికీ అనుభవంలోనే వుంది కనక విస్తరించను. నిన్న రాత్రి నేను పిఠాపురంలో వక సంపన్న గృహస్థులయింట విందుకు వెళ్లాను. అక్కడవున్న వంటబ్రాహ్మఁడు మెట్రిక్యులేషను చక్కఁగా అన్ని సబ్జెక్టుల్లా ప్యాసుచేసినవాఁడు. పూర్వకాలంలో వంటబ్రాహ్మలు యిట్టివారున్నారా? యీకాస్త ప్యాసుకూ వున్న నాలుగెకరాల భూమీ చెట్టెక్కింది. పనిపాటలు యమ్ యేలకే లేనప్పుడు మెట్రిక్యులేషనుకు దొరకడం యెక్కడ? అందుచేత పాపం! యీవృత్తి చేసుకుంటూ వున్నాఁడు. బ్రాహ్మఁడు కనక పనిపాటులు దొరకలేదనుకుందామా? అక్కఱలేదు. నాన్ బ్రామిన్సు క్కూడా ఇదే అవస్థ. కాస్త ఆలస్యంగా రాఁదలచి వున్నట్టు సూచనలు కనపడుతూవున్నాయి. "బబ్బావళ్యా మంతక స్సన్నివిష్టః" బ్రాహ్మణులను బ్రాహ్మణేతరులు అణఁగఁదొక్కితే వారిని హరిజనులు అణఁగఁద్రొక్కుతారని సూచనలు కనపడుతూ వున్నాయి- వక సంపన్న గృహస్థు మా బంధువులలోనే వుండేవాఁడు. ఆయన కావడానికి పురోహితుఁడేకాని యెందటినో పోషించాఁడు. కొడుకు లందటికీ యింగ్లీషు చెప్పించాఁడు. వాళ్లు పౌరోహిత్యం చేయరుకదా! పనిపాటులో యెక్కడనుంచి వస్తాయి?- "యితోభ్రష్టస్తతో భ్రష్టః" అయింది. తుదకి పౌరోహిత్యం యితరు లాక్రమించుకున్నారు - అయితే వేశ్యాత్వం వకరు ఆక్రమించు కుంటారేమో? అని భయపడి స్వీకరించడంలోదికాదు. వేశ్యలందఱూ సంసారిణులుగా మాఱినా లోకానికి వచ్చేచిక్కున్నూ స్థూలదృష్టిని లేదనుకుందాం. ఆవృత్తిలో వున్న ప్రధానదోషం అందఱూ యేవగించుకోతగ్గది బహుపురుష సాంగత్యం. యే అదృష్టవంతురాలికోతప్ప వక్కడితో జీవితం తెల్లవారనిమాట సత్యం. యిదిపాశ్చాత్యకవులు రసాభాసంగా పరిగణించారో లేదో కాని మన కవులందఱూ రసాభాసమే అన్నారు - యీ దోషం యిప్పటిస్త్రీలందటికీ సంక్రమింపచేయడానికి తగ్గబిల్లు విడాకులచట్టం వకటి రాఁబోతూవున్నట్టు అందఱూ యెఱిఁగినదే. అట్టిస్థితిలో ఆదోషాన్ని యేవగించుకోవడం యేమంత ప్రయోజనకారిగా వుంటుంది; కొద్దిభేదంవుంటే వుండనివ్వండి గాని ఆచట్టంవచ్చాక పాతివ్రత్యమనే మహాపదవి వేశ్యలతోపాటు యితరస్త్రీలల్లో కూడా నూటికి తొంభైపాళ్లు పోవలసిందే. యేపురుషుణ్ణి కట్టుకుంటే ఆ పురుషుఁడితోటే వుండడం పాతివ్రత్య మనిపించుకుంటుంది. ఆ పురుషుఁడి జీవిత కాలంలోఁగానీ, అనంతరమందు గానీ దానికి అన్యథాత్వం కలిగితే ఆ వ్రతానికి భంగం కలగక తప్పదు. భారతీయుల శాస్త్రాలన్నీ ఆసూత్రానికి కట్టుపడేవున్నాయి. అయితే యింత అసిధారావ్రతంగా బ్రతకడం దుర్ఘటంకాదా? అంటారేమో? అందుచేతే ఆ బిరుదును యేకొలఁదిమందో తప్ప, అందఱూ పొందలేక పోవడం. పొందలేకపోతే "పొందలేక పోయాంగదా" అని విచారించేవారు

పూర్వం వాళ్లు. యిప్పుడో యితరులకు్కూడా లేకుండా చేయడానికో అన్నట్టు కొన్ని ప్రయత్నాలు చేస్తూవున్నారు. విడాకులచట్టమంటూ వచ్చినా ఆలాంటి పతివ్రతలు చలించరుగాని, ఆచట్టాన్ని కంఠంముడి పట్టుకొనేలాగ సవరించి- "యేస్త్రీగాని బ్రహ్మచారిణిగా వుండకూడదు. వుంటే శిక్షకు పాత్రురాలవుతుంది." అని శాసించడంకూడా తటస్థిస్తే చేసేదేమిటి ఆలాటి దురన్యాయం వుంటుందా? అనడానికి వీలులేదనుకుందామా ఫ్రెంచిదేశంలో ఆమధ్య అనాదిగా నివసిస్తూవున్న "కన్యస్త్రీలు" ఆ దేశంలో వుండడానికి వల్లకాదన్నారంటూ పత్రికల్లో చదివినట్టు జ్ఞాపకం. యిదంతా విషయాంతరం. ప్రస్తుతం పూర్వాచారపరాయణులకు నిలవనీడ లేకుండా పోయేశాసనాలను భారతీయులే ప్రభుత్వం వారినికోరి చేయిస్తూ వున్నారని తెల్సుకోవడమే ఆయీ సోదెకంతకూ ఫలితం. ఆ శాసనాలు కొన్ని కొందఱిని బాధించినా, కొందఱికి వుపకారాలుగా వున్నాయి. అందులో దేవాలయపు మాన్యాలు అంతరించడానికి పుట్టించిన శాసనం యెవళ్లకీ బాధించినట్టు బాహ్యదృష్టికి కనపడకపోయినా, అంతర్దృష్టిని విచారిస్తే క్రమేణా అది పూర్తిగా దేవాలయాలనే అంతరింపచేస్తుందేమో? అని గోచరింపకపోదు. పంచములను దేవాలయాలలో ప్రవేశపెట్టడం జరిగాక, యింకా వాట్ల సత్తకోసం విచారింపవలసివుండదు. "యిప్పటి సంస్కారంవల్ల వేశ్యలు కులస్త్రీలుగా మాఱడమేకదా! జరిగింది. దానివల్ల కొంత సునీతికే అవకాశం యేర్పడిందిగాని దుర్నీతికి అవకాశం లేశమూ లేదే" అనేవారికి జవాబు చెప్పడంకష్టం. అందుచేతే దేవాలయంమాన్యాలు అంతరించవలసి వచ్చింది. "పాపం! యీ మాన్యాల మూలాన్ని యీ జాతికి యీ దురవస్థ తొలఁగడానికి అవకాశం లేకపోతూవుంది" అని శాసనసభ్యులు కరుణించారు. దేవుఁడు రాయేకనక యెవరికీ వానిబాధ లేకపోయింది. జరగవలసినదేమో జరిగింది. యీ బిల్లు ప్యాసుకాలేదే అనుకుందాం; యిదివఱలోవున్న ప్రకారమే ఆయీ కట్టుఁబాట్లు వున్నాయే అనుకుందాం. అప్పుడు మాత్రం వేశ్యావృత్తియందు యిష్టంలేని వనితామణులు తమతమ సంతానానికి వివాహాలుచేసి కులస్త్రీమర్యాదలను సంపాదించడానికి అభ్యంతర మేమేనావుందా? అలా వివాహాలు అనాదిగా జరుగుతూనే వున్నాయి కదా! కులస్త్రీలకన్నా యెంతో మిన్నగా సదాచార సంపత్తితో వారు వర్తిస్తూనే వున్నారుకదా! యిప్పుడు దేవ ద్రోహంతప్ప వచ్చిన విశేష మేమిటని నాప్రశ్న. జాతియావత్తున్నూ నిష్కళంక జీవనానికి రావడమే విశేషమని ఆవలివారి ప్రత్యుత్తరం. సర్వేసర్వత్ర వకటేనీతికి కట్టుపడడం అసంభవమని చెప్పవలసివున్నా చెప్పక అందుకుకూడా వప్పుకుంటాను. యే యితర సంఘాన్నుంచో కొందఱు దీనికి ఆలాయపడి తీరుతారనిన్నీ, మూలోచ్ఛేదం యెన్నటికీ సంభవించదనిన్నీ నా తలంపు - యెన్నెన్ని గాలివానలు. యెన్నెన్ని కలరాలు, యెన్నెన్ని ప్లేగులు, యెన్నెన్ని యుద్ధాలు వచ్చి

యెంతెంత జనాన్ని నాశనంచేసినా జనాభివృద్ధి నామమాత్రావశిష్ట మయిందా? ఆలాగే ఆయాదుర్వృత్తులున్నూ, అని దేశచరిత్రవేత్తలకు తెలియనివిషయం కాదు. అందులోనూ ప్రస్తుతవిషయం మరీ దుర్ఘటం. యిది వొకరి తోడ్పాటక్కఱలేకుండానే వారివారి ఆత్మబలం వల్లనే నెగ్గఁదగ్గది. ఆ వృత్తి యందుండే దుర్నీతిని యెఱిఁగే కొందఱు దానివల్ల వుండే లాభాపేక్షచేత వదలలేకుండా వున్నారుగాని మఱో కారణం చేతకాదు. అందఱికీ దేవాలయనవుకరీలు లేవుకూడాను – లేనివారందఱూ ముందుగా దుర్నీతిని వదిలి సునీతిలోకి వస్తే వున్నవారు ఆఫలాపేక్షను వదులుకొని వెంటనే – "నలుగురితో నారాయణా, కులంతో గోవిందా" గా మాఱడం తటస్థించేది. యిప్పుడు ఆలా జరగలేదు. "ముక్కు కోసుకుంటే దేవుఁడు కనపడతాఁ"డన్నట్టు దేవతామాన్యాల చిక్కుతీర్చడంజరిగింది. యితరం యెంతవరకు కొనసాగిందో మాన్యాలు పోఁగొట్టుకున్న ఆ భగవంతుఁడికే తెలియాలి. యే సంఘమేనా నీతిమీఁద ఆధారపడి సునీతికి రావాలి. ఆలాటినీతిని పాటించేవారు యే సంఘంలోనేనా, యే కాలంలోనేనా కొలఁది మందిమాత్రమే వుంటారు. వారు తమతోపాటుగా మఱికొందఱిని తమ మార్గంలోకి రప్పించుకుందామని యత్నించడం యుక్తమే. దాన్ని నిషేధించడంతప్పు. ముమ్మాటికిన్నీ తప్పు. అట్టితోవ నా వ్యాసంలో లేశమున్నూ లేదు. కొన్ని విద్యలకు యే దుష్కార్యంతోటిన్నీ అవసరంలేదు. గాని కొన్ని విద్యలకు అట్టి చిక్కువున్నది. మృదంగం వగయిరా చర్మకట్టు వాద్యాలకు చర్మాలతో అవసరం. అది స్వయంగా చచ్చిన జంతువుల చర్మంతోకూడా సాధించవచ్చునేమో కాని జపతపాలు చేసుకొనేవారికి కృష్ణాజినం కావలసివస్తే అట్టిది పనికిరాదు. అట్లని యే వేఁటకాఁడితోటి గాని నాకొక చర్మం బలవంతంగా చంపిన జంతువు తాలూకు కావాలని చెప్పనూకూడ దన్నారు. అది యెట్లో వీరి ప్రేరేపణ లేకుండా చంపినది దొరికితే స్వీకరించవలసిం దన్నారు. యిది విషయాంతరం. కొందఱు ఋషులైతే సంగీతాన్నిన్నీ, దాన్ని పాడేవారినిన్నీ కూడా పూర్తిగా నిషేధించి వున్నారుగాని నారదాదులు గానాన్ని పూర్తిగా ఆమోదించి వున్నారు. పైఁగా దానివ్యుత్పత్తి సామవేదాన్నుంచి పుట్టినట్టుకూడా ప్రమాణాలు కనపడుతూవున్నాయి. అట్టి సంగీతం పురుషులనోటితో వినడంకన్న స్త్రీల నోటితో వినడమే ఎక్కువ రసవత్తరంగా వుంటుందని కాఁబోలును ఆ నారదాదులు అప్సరసలకు దాన్ని వుపదేశించినట్టు తోస్తుంది. గానంతో పాటు అభినయం. అది నాట్యంతో చేరిందే. యివన్నీ స్త్రీలవల్ల కళగట్టి నట్టు పురుషులవల్ల కళగట్టేవి కాకపోయినాయి. రాజాధిరాజులు ఆయా విద్యలను మిక్కిలిగా ఆదరించేరోజుల్లో యేదో సంఘాన్నుంచి వారివారి తలిదండ్రుల సమ్మతినిబట్టి కొంత ఫలాపేక్షతో దీనికిఁగా తమతమ కొమార్తలను కొందఱిని వదిలిపెట్టడం తటస్థించింది. వాళ్లకు స్వతంత్రత్వం లేకపోతే ఆయా

విద్యాభ్యాసాదులు కొనసాగవు కనక వివాహం లేకపోవడం తటస్థించింది. కాని రాజసభలలో విద్వాంసులు వగయిరాలతోపాటు వకస్థానం గౌరవాపాదకంగానేవుంది. పైఁగా దేవాలయాలల్లోను స్థానం వుంది. చాతుర్వర్ణ్యం తరవాత దేవాలయాలల్లో తీర్థప్రసాదా లివ్వడం వుంది. వ్యభిచార దోషం వకటి వుందిగాని అది యితర స్త్రీలకు పరలోకంలో బాధించినట్టు బాధించదని చెప్పవచ్చు. యెందుచేత? అగ్నిసాక్షికంగా వకభర్తకి వివాహితురాలై ఆపె అందుకు తప్పి సంచరించింది కనక దండింపతగ్గ దోషం చేసినట్టయింది- యిక్కడ అట్టిదోషంలేదు. కాని తనకుయేర్పడ్డ ప్రవర్తనలో అన్యథాగా సంచరిస్తే ఈవిడకూడా దండ్యురాలే. వక వేశ్య మూఁడురోజులు వకరితో వుండుట కేర్పరచుకొని ఆ మూఁడురోజులలో ఆయన స్వర్గతుఁడు కాఁగా సహగమనం చేయబోవడం వగయిరా పురాణగాథలవల్ల బహు భర్తృకత్వాన్ని అంగీకరిస్తూ దానిలోకూడా నియతవర్తనంవుంటే పరలోకహానిలేనట్టు తేలుతూవుంది. యిహలోకంలో దేహారోగ్యం చెడగొట్టుకోవడం, యితరులది చెడగొట్టడం అనేది యీలాటిజాతి యేర్పాటుగా లేని దచ్చి దేశాన్నుంచి దేశానికి దిగుమతి అయిన వ్యాధుల పేరులవల్ల తెలుస్తుంది. అసత్యం లేకుండా జరగనివృత్తులు కొన్ని వున్నాయి. అందులో యిది వకటి. యిట్టిదాన్ని అవలంబించికూడా సత్యతత్పరత్వంవుంటే ఆపె కులస్త్రీ, అందులో పరమోత్తమురాంఁడ్రు పొందే సద్గతినే పొందుతుందని పూర్వ గ్రంథాలవల్ల తేలుతుంది. యిప్పుడు ఆ గ్రంథాలయందుఁగాని వాటిని చదువుకొన్నవారియందుఁగాని గౌరవంలేదు. వారు యే మెంబరు పదవికిన్నీ యెన్నడూ ప్రయత్నించే స్వభావం కలవారుగానూ వుండరు; వకరెవరేనా ప్రయత్నించినా వారికి వోట్లూరావు. కాఁబట్టి వారికి సభ్యత్వం లేదు. సభ్యత్వం వున్నవారున్నూ ప్రాజ్ఞులే కాని వారు భారతీయమైన శాస్త్రాలయందు కృషి చేసినవారుకారు. మాటవరసకి వక సంగతి వ్రాస్తాను. కుక్కలున్నాయనుకోండి. వాట్లని చంపవలసిందని యేభారతీయ విద్యా నిష్ణాతుఁడున్నూ కొంత ఫండు ధర్మబుద్ధితో యేర్పాటుచేయఁడు. యెవరో వకయూరోపియన్ అట్టిధర్మకార్యానికి కొంతఫండు నిలవచేసినట్టువింటాను. మునిసిపాలిటీలలో కుక్కలని చంపించడం అంతా యెటిఁగిందే. యివన్నీ ధర్మాలుగా వప్పుకొనే సంస్కారులు గానాభినయాలు ప్రధాన జీవనోపాధులుగాఁ బెట్టుకొని ఆ విద్యలు స్వాతంత్ర్యంతో సంబంధించినవవడంచేత అవివాహితలుగా వుండి ఆకారణంచేత వ్యభిచారదోషానికి గుఱికావలసివచ్చిందని వారిని యేవగించుకొంటూ వున్నారు. కొందఱు నవనాగరికులనే కారణంచేత ఆ విద్యలతోపాటు సమస్తమూ వదులుకొనదలఁచుకొని పాటుపడుతూ వున్నారు. సంతోషమే! అట్టిస్థితిలో నౌకరీ చేస్తే అనుభవించతగ్గవిన్నీ, పద్ధతిని వదులుకోతగ్గవిన్నీగా వున్న మాన్యాలు వదులుకోకపోవడమే యుక్తంగా వుందా? మాతంగ

స్త్రీలంటూ గాన విద్యాపరిశ్రమ కలవారు వున్నట్టు హరిశ్చంద్రోపాఖ్యానంలో కనపడుతుంది. ఆలాటివాళ్లెవరు ఆ మాన్యాలు పుచ్చుకొని ఆ దేవుఁడి నౌకరీకి సిద్ధపడుదురేమో? యిప్పుడు గాంధీగారి యేర్పాటుప్రకారం వాళ్లకు దేవాలయప్రవేశానికి ప్రవేశమున్నట్టుకూడా కనపడదుగదా! లేదా ఆభూములు మఱివకసత్కార్యానికి దేవాలయ ధర్మకర్తలు వినియోగించుకుంటారు. వీరికెందుకు? యిప్పుడు వితంతువివాహం చేసుకొనే కన్యకకు పూర్వ భర్త తాలూకు ఆస్తియందు వుండే హక్కు పోఁగూడదనే శాసనానికి కొందఱు దయాళువులు ప్రయత్నిస్తూ వున్నట్టు వినడం. ప్రస్తుత విషయంకూడా అట్టిదే. దీన్ని గురించి యెవరుగాని, యేదిగాని వ్రాయకూడదు. వ్రాస్తే మాటదక్కదు– "బుధ జన ఇవ గ్రామ్యసదసి." ప్రధానవిషయాన్ని వదలిపెట్టి యేవో తోఁచిన మాటలతో దూషించి వ్రాయడానికి యేతపస్వినేనా మొదలుపెడుతుంది. ఆవిడకు జవాబు వ్రాయక వూరుకుంటే వకచిక్కు వ్రాస్తే వక చిక్కు. అందుచేత ఆవిణ్ణి యిలా ప్రార్థిస్తే బాగుంటుందను కుంటాను– "అమ్మా! నేను జనరల్‌గా కళలనుగూర్చి యెవరికి అధికారంవుందో వారిని గూర్చిన్నీ, దేవాలయ మాన్యాలు వృథాగా అయిపోవడాన్ని గుఱించిన్నీ వ్రాశానుగాని ఆయా విద్యలు వేశ్యలు వదులుకోవద్దనిగాని. వదులుకోవద్దని యెవరేనా బోధించవలసిందనిగాని వ్రాయలేదు. యెన్నో సంగతులు పూర్వకాలంలో వుండేవి వ్రాసి నా వ్యాసంలో చర్చించి వున్నాను. నీవు వాట్లను స్పృశించనేలేదు. వక్క మాన్యాలను గూర్చిన్నీ, కళలను గూర్చిన్నీ మాత్రమే యెత్తుకున్నావు. వాట్లను గూర్చి నేను నాస్వీయాభిప్రాయాన్ని లేశమున్నూ వ్రాయలేదు. పూర్వుల అభిప్రాయాన్ని నేను అనువదించానుగాని అందులో నా అభిప్రాయము లేశమున్నూలేదు. నన్ను వుపసంహరించుకొమ్మన్నావు నీవు నన్ను దూషిస్తావనే భయంచేత వుపసంహరించుకున్నానే అనుకో? ప్రాచీన గ్రంథాలని యేంచేస్తావు?– పంచాంగాలు చింపేస్తే నక్షత్రాలు పోతాయా? అందుచేత వొకవుపాయం చేస్తే బాగుంటుంది. లీగల్‌గా వొక నోటీసు యిప్పిస్తివా, వెంటనే దానిమీఁద వ్యాసం వుపసంహరించుకోవడమేకాదు, క్షమాపణే ప్రచురిస్తాను. కొందఱు యీమధ్య యిలాటి విషయాలకు వుపవాస దీక్షలు ప్రారంభిస్తూవున్నారు. అవికూడా పనిచేస్తూనే వున్నాయి. యీ మధ్య వక స్వాములవారు యేదో ధర్మశాస్త్రానికి సంబంధించిన విషయాన్ని పురస్కరించుకొని యేదో పుస్తకం వ్రాస్తే అది యే సంఘంవారికో బాధకంగా కనపడిందనిన్నీ ఆ గ్రంథాన్ని రద్దుపరచవలసిందని గవర్నమెంటు వారికి విన్నపాలంపుకుంటూ వున్నారనిన్నీ పత్రికలలో కనపడుతుంది. ఆయన జగదేకగురువు ఆయన రచనయందు అంతటి గౌరవం వున్నా వుండవచ్చు. కాఁబట్టి ఆసంఘంవారు యత్నించారన్నా బాగుంది. నేను సామాన్యుఁడను, నేను వ్రాసినదానికి నీవంత భయపడనక్కఱలేదు. యెన్నఁడుగాని

వేశ్యాజాతికి వివాహాలు పనికిరావనే కట్టుఁబాటున్నట్టు లేదు. నా వ్రాఁతవల్లకూడా పూర్వంవున్న అధికారం పోవడంలేదు. యిప్పుడు సంస్కర్తలు వేశ్యాజాతికి కలిగించిన కొత్త లాభమల్లా దేవునిసొత్తు అపహరించడానికి అర్హత తప్ప, తక్కిన స్వాతంత్ర్యమంతా పూర్వపు విజ్ఞులున్నూ యిచ్చే వున్నారని పలుచోట్ల వ్రాసేవున్నాను- వకాయన దేవుఁడికి ధర్మకర్తగావుండి తద్వారాగా మహదైశ్వర్య సంపన్నుఁ డైనాఁడనిన్నీ, యెవరేనా దేవస్వాపహారం తప్పిదంకాదా? అని తెగించి మాట్లాడితే యెవఁడికేనా దేవుఁడివ్వవలసిందే, నాకున్నూ దేవుఁడేయిచ్చాఁడు మీకు కడుపుబ్బు యెందుకంటూ జవాబు చెప్పేవాఁడనిన్నీ, బందరులో వున్నప్పుడు విన్నట్టు జ్ఞాపకం. ఆ పద్ధతిని దేవస్వాపహారదోషం ప్రతీవ్యక్తికీ తటస్థిస్తుంది. దీన్ని యిలాక్కాకపోయినా యింకోవిధంగా భారతీయవిజ్ఞానులు అంగీకరించే వున్నారు- ఆ కారణం చేతనే శిష్టులందఱూ దేవుఁడికి నివేదించి కానీ భుజించరు. ఆయీపదార్థ మంతా తమకు దేవుఁడిచ్చిందే కనక ఆయనకు సమర్పించకుండా భుజిస్తే స్తేనత్వం అనఁగా చోరత్వం తమకు సంఘటిస్తుందనే తాత్పర్యమే. అలా నివేదించడాని క్కారణం. దేవతా మాన్యాలను హరించడానికి దేవదాసీ సంఘానికి తోడుపడ్డవారెవరూ అలా నివేదించేవారుకారు సరిగదా! అలా నివేదించి భుజించేవారి జ్ఞానాన్ని అభినందించే వారుకూడా కారు. కాఁబట్టి ఆ ద్రవ్యం అనుభవించేటప్పుడు ఆ పనికూడా ఆ దేవదాసీ జాతివారు చేయనక్కఱలేదనుకుంటాను. తీగఁదీస్తే డొంక కదులుతుంది. పూర్వాచారాలలోఁ గానీ, నవీనాచారాలలోఁగానీ, యేకట్టుఁబాటులోఁగాని యేలేశానికి అంగీకరించకపోయినా అంతకీ ముప్పు సంభవిస్తుంది. అట్లని ఆకట్టుఁబాట్లన్నీ ఆచరణలో పెట్టడం మాత్రం సంభవిస్తుందా? అదిన్నీ సంభవించదుగాని శక్యమైనంతవఱకు ఆచరణలో పెడుతూ శక్యంకాక చేయలేకపోయిన దాని విషయంలో పశ్చాత్తాపాన్ని పొంది తన్నివృత్తికై భగవన్నామస్మరణ చేయవలసివుంటుందని పూర్వుల ప్రవృత్తి తెలుపుతుంది. "క్షంతవ్యో, మేఽ పరాధశ్శివశివశివభో! భోమహాదేవశంభో?" యిత్యాదులవల్ల పైసందర్భము తేలుతుంది. యివన్నీ ఆనకట్టకు పూర్వం మాటలు. యిప్పుడు యీ మాట్లయందు గౌరవంలేదు. లేకపోయినా వ్రాయడం వ్యర్థం. యిప్పుడల్లా యేదో పత్రిక నిండటానికి మేటరు వ్రాయడమే కావలసింది. తారతమ్య జ్ఞానంతో అవసరంలేదు. యెవరినేమాటేనా సరే వ్రాసి పత్రికకు పంపితే "వారూవారూ చూచుకుంటారు మనకేమి?" అని పత్రికవారు ప్రకటిస్తారు. అందుచేత జంకి పెద్ద పెద్దలు "వయం మౌనవ్రతాలంబినః." అని వూరుకున్నారు. నాకు ఆపెద్దలంతటి పాండిత్యంగానీ, యోగ్యతగానీ లేకున్నప్పటికీ ఆయీ ఆచారవ్యవహారాల విషయంలో వారితోపాటు నేనున్నూ వూరుకొనేవున్నాను. యేదో వ్రాస్తూవుంటే దేవుఁడిమాన్యాలు వృథాకావడం మనస్సుకి తగిలింది. దాన్ని పురస్కరించుకొని

వ్రాసిన మాటలకు మళ్లా యింత వ్రాయవలసివచ్చింది. ఆ మాటలవల్ల వారిసంఘం ముందుకురాక వెనక్కి మళ్లా మళ్లుతుందేమో అని వక సంఘసంస్కర్త్రికి అనుమానం కలిగింది. కాని ఆ అనుమానం సరి అయిందికాదు. యింతమాత్రం చేత అది వెనకడుగు వేయదు. కాని భగవంతునికికూడా శక్యంకాని సంస్కారాలు కొందఱు యిప్పుడు ఆరంభిస్తూ వున్నారు. అవి శక్యమైనవే అయితే భగవంతుడిదివఱకే చేసివుండేవాఁడేమో? యిన్ని విధాలుగా సృష్టివుండేదే కాదేమో? కొందఱు బలవంతులు, కొందఱు బలహీనులు, ధనవంతులు, ధనహీనులు, సౌందర్యవంతులు, సౌందర్యహీనులు, నీతిమంతులు, నీతిశూన్యులు యీలాటి భేదం లేకపోయేదేమో? అని బుద్ధిమంతులు చర్చించి, చర్చించి తేలక తుట్టతుదకు విసిగి ఆలోపం భగవంతుఁడిమీఁద పెడితే మఱీ చిక్కు వస్తుందని భయపడి వాఁడివాఁడికర్మాను సారంగా ఆయీ భేదాలు కలిగినట్టు స్థిరపఱచుకున్నారు. ఆ కర్మలు వొక మోస్తరుగా వుండవు. కనక చాలాభాగం వారికి సంతుష్టి కలిగింది. అట్టిస్థితిలో అందఱినీ వక్క తాటిమీఁదకు తేవడము యేలాగ? యెక్కడో సామ్యవాదం బయలుదేఱిందంటారు. అక్కడ కూడా కొన్ని విషయాలలోనే కాని అన్నివిషయాలలోనూ ఆ సిద్ధాంతం అమల్లోకి వచ్చినట్టుగాని, రావడానికి వీలున్నట్టుగాని, కనపడదు. యేమేనా ఇప్పటివారి సిద్ధాంతాలు యేటికెదురీఁదే తోవలో వుంటాయి. నామట్టుకు దేవదాసీల సంస్కరణం కూడా అలాటిదే. వ్యక్తిగతంగా మంచికి రావడానికి యిదివరకే ఆధారం వుందని పలుచోట్ల వ్రాసే వున్నాను. సర్వే సర్వత్ర వక తాటిమీఁదికి రావడం శక్యం యెన్నటికీ కాదు- కాకపోయినా యత్నించేవారు యత్నించడం మానకూడదు. యత్నించవలసిందే. విద్యలు పోతాయని భయం వారికి అవసరంలేదు. వాట్లవల్ల లాభం వుంటే, ఆ లాభం అవసరమే అయితే అందులోకి యెవరో మరివకరు ప్రవేశించి తీరుతారు. దొడ్డి వూడ్చడం దగ్గరనుంచి ఖాళీలేకుండా నడిపిస్తూవున్న భగవంతుఁడు యీకళల నిమిత్తం యేదోవక జాతిని యేర్పరచలేకపోతాఁడా? యేదేనా వృత్తి వకటి ఖాళీ కావడమే తడవుగాని అయేట్టటయితే అందులో వుండే దోషాన్ని గణించకుండా ప్రవేశించేవాళ్లు యీ కాలంలో లేకపోతారనుకో నక్కఱలేదు అథవా! లేకపోతారే అనుకోండి. "అత్తా! అత్తా! నీకొడుకు ఆఁకలికి ఆఁగలేఁడుసుమా!" అన్న సామెతగా అందుకోసమని ఆవృత్తిని వదిలిపెట్టి వెళ్లే వారు ఆఁగుతారా? అందుచేత వారివారికి తోఁచినట్లు హేయమనితోఁచిన వారివారి వృత్తులను వదులుకోవలసిందే. పరమోత్తమస్థానాన్ని అలంకరించవలసిందే. అట్టి స్వాతంత్ర్యాన్ని అరికట్టడానికి వుంటే గవర్నమెంటుచట్టాలకు వుండాలి కాని యే యితరపండితుల వ్యాసాలకూ వుండదు - యెవరికి తోఁచింది వారు వ్రాస్తూవుంటారు - "ఉపసంహరించుకో వలసింది" అని వ్రాయడం పొరపాటు. వితంతూద్వాహాన్ని

మనదేశంలో శ్రీ వీరేశలింగం పంతులుగారు ప్రారంభించినప్పుడు యెందఱో పండితులు అది శాస్త్రవిరుద్ధమని వ్రాసివున్నారు. వారివారిని “మీమీ వాదాలు వుపసంహరించు కోవలసిం”దని ఆ పంతులవారు శాసించినట్టుమాత్రం లేదు. ఆయనకు తోఁచిన వుపపత్తులను ఆయన చూపుతూ వచ్చారు. పండితులకు తోఁచిన అనుపపత్తులను పండితులు వ్రాస్తూ వచ్చారు. పూర్తిగా పంతులవారి వుద్యమం నెగ్గినట్టూ లేదు? పండితులదీ నెగ్గినట్టూలేదు; శాస్త్రమేమో పండితుల కనుకూలంగా వుంది - “మును చచ్చినట్టి మగని తద్దినం బెట్టులు?” అనే మీమాంస తేలక కర్మసిద్ధాంత బద్ధులగు పండితులు వూరుకున్నారు గాని దయలేకకాదు - జడ్జీ యెంత దయాశీలుఁడైనా లాప్రకారం వురిశిక్షవేస్తూవున్నాఁడు. మేజస్ట్రేటు యెంత దయాశీలుఁడైనా దగ్గఱవుండి వురితీయిస్తూ వున్నాఁడు. ఆవురిలో ఆ వ్యక్తిని దగిలించేవాళ్లు యెంత దయావంతులైనా ఆ వృత్తిని అవలంబించి వున్నవాళ్లవడంచేత ఆపనిచేస్తూ వున్నారు. ఆతగిలించేవాళ్ల వంశస్థులు ఆవృత్తియందు వాళ్లకు దోషం వుందని మానుకుంటే యెవరు వద్దనఁగలరు? మానుకున్న తత్క్షణం ఆవుద్యోగానికి యెన్నో దరఖాస్తులు వచ్చి పడతాయి. కనక వేశ్యలందఱూ యితరవృత్తితోపాటు కళలుకూడా వదులుకోవచ్చును. అందుకు నావ్యాసం భంగిస్తుందనుకో నక్కఱలేదు. యిదివఱలో యింత విస్పష్టంగా తెలుసుకోకపోయినా యిప్పుడేనా తెలుసుకోవచ్చు ననుకుంటాను- దేవుఁడు మాత్రం దిక్కు లేనివాఁడై, నోరులేనివాఁడై తన మాన్యాలనుగూర్చి అడగలేకపోయాఁడు. దానితో వట్టిరాయే అని స్పష్టమయింది. ఆ పట్లాన్ని హరిజనులకు లోఁకువ చిక్కింది. నేఁడో రేపో అర్చకులు వుడాయిస్తారు. యిఁక నైవేద్యంకూడా వుండదు. ఆపైని కట్టడాలు కొన్నాళ్లవఱకూ మిగిలితే మిగులుతాయి. లేదా యీలోఁగా అవి యేసంస్థకేనా వుపయోగపడిచేయెడల వారి వారి ద్రవ్యంతోటి మరమ్మత్తు జరుగుతుంది కనక మఱికొంతకాలంకూడా వుండవచ్చు. దేవతానౌకరీకి యేర్పడ్డ మాన్యాలుపోతే వుపేక్షించడంలో సూత్రప్రాయంగా యింత అర్థం యిమిడివుంది. యిదే యే మహమ్మదీయుల మసీదుకు, సంబంధించిందేనా అయితే వారూరుకోరు. యెంత ఆందోళన చేయాలో అంతా చేస్తారు. సాధించితీరుతారు. లోఁకువసంఘానికి సంబంధించిందవడంచేత దీనిగతి యీలాపట్టింది. సాధించేదీలేదు, అఘోరించేదీ లేదు గాని అయ్యో! యీలాజరిగిందే అని యెవఁడేనా అనుకుంటే అనుకోవడానిక్కూడా వీలులేకుండా ఆమాన్యాలవల్ల లాభంపొందిన సంఘాన్నుంచి యెవరో వక మహావ్యక్తి తారతమ్య జ్ఞానంతో పనిలేకుండా సాహసోక్తులతో శాసించడం వకటి తటస్థిస్తూవుంది. అందుచేత భర్తృహరి చెప్పినట్టు- “జీర్ణ మంగే సుభాషితమ్” అని చెప్పి వూరుకోవలసిందే! యింతే యెంత వ్రాసినాయింతే, నావ్యాసంమీఁద ఆకొండివారొకరు వారికి తోఁచినమాటలు వ్రాసివున్నారు. ఆయన మతాన్ని

ఆయన తెలిపినారే కాని లేశమున్నూ అనుచిత ప్రసంగానికి ఆయన చోటివ్వలేదు. ఆయన యిప్పటి ఆచారాలకు ప్రాధాన్యం యిచ్చేవారు. నేనో? పూర్వుల ఆచారాలు ఆచరించినా ఆచరించకపోయినా వాట్లయందే ఆదరం కలవాణ్ణి. అందుచేత ఆయనకూ నాకూ మతభేదం వుండవలసి వచ్చింది. యీవిడ నన్ను స్వార్థపరుఁడని సూచించింది. బాగా ఆలోచిస్తే దేవస్వాపహారానికి సమ్మతించని నన్ను దూషించడంవల్ల ఆదోషం ఆవ్యక్తియందే వుందేమో? ప్రాజ్ఞులు విచారించకపోరు.

★ ★ ★

# పుక్కిటి పురాణ కథలు

ఈపుక్కిటి పురాణాలను గుఱించి కొంత వ్రాస్తాను. యివి వినేవాళ్ల కెంతో ఆహ్లాదకరంగానైతే కనపడతాయి గాని వీట్లలో సత్యంమాత్రం సున్నకి సున్న, హళ్లికి హళ్లీగా వుంటుంది. కొన్ని మనలో యీలాటి కథలు లేకపోలేదు, గాని అన్నీ ఈలాటివిమాత్రం కావు. తెనాలి రామలింగానికిన్నీ, పెద్దన్నగారికిన్నీ, భట్టుమూర్తిగారికిన్నీ, ముక్కుతిమ్మన్నగారికిన్నీ సంబంధించిన కథ లెన్నో వున్నాయి. ఆ కథలు, వీరంతా వొకటే కాలంలో వున్నారంటేనేకాని నిలిచేటట్టులేదు. యితరాధారాలని పుచ్చుకుని వీరు సమకాలికులే కారంటూ వీరేశలింగం పంతులవారు సిద్ధాంతీకరించి యీ కవిసంఘానికి సంబంధించిన కథ లన్నిటినీ తోసేశారు. వీరేశలింగం గారు పైసిద్ధాంతాన్ని బయలుదేఱదీసే దాఁకా పైకథలన్నీ అమల్లోనేవున్నాయి, యిప్పుడున్నూ వున్నట్టే. గురుజాడ శ్రీరామమూర్తి గారు ఆ కథలన్నిటినీ విశ్వసిస్తూనే కవిజీవితాలు వ్రాసివున్నారు. రాయలకాలపు కవులకు సంబంధించిన గాథలకే కాదు యీ దురవస్థ; భోజరాజ కాళిదాసులకు సంబంధించిన గాథలకున్నూ పట్టింది. భోజకాళిదాసులిద్దఱేకాక, దండి భవభూతులే కాక, బాణుఁడు కూడా ఒకటేకాలంవారన్నట్టు యితిహాసాలెన్నోవున్నాయి. ఇటీవల వారి వారి కాలనిర్ణయాలు సప్రమాణంగా ఋజువుచేస్తే ఆ యితిహాసాలన్నీ పుక్కిటిపురాణాలక్రింద తేలిపోయాయి. భవభూతి తన వుత్తరరామ చరిత్రాన్ని కొడుకు ద్వారాగా కాళిదాసుగారు వేశ్యాగృహంలో వుండఁగా వినిపింపఁజేసినట్టున్నూ, కాళిదాసుగారు విన్నట్టున్నూ వకకథ చెపుతారు. భవభూతి శుద్ధశ్రోత్రియకుటుంబంలోనివాఁ డన్నట్టు ఉత్తరరామచరిత్ర పీఠికలో – "శ్రోత్రియ పుత్రః" అనే మాటవల్లనే తేలుతుంది. అట్టి శ్రోత్రియపుత్రుఁడు వేశ్యాలోలుఁడైన కాళిదాసుకు తన నాటాకాన్ని వినిపించడానికి వేశ్యాగృహానికి వెళ్లడం యెలాగ? అందుచేత కొడుకును పంపి వినిపింపఁజేశాఁడనిన్నీ, అనంతరమందు కాళిదాసు విని యేమన్నాఁడని కొడుకును అడిగితే "యేమీ అనలేదు, ఆహ్లాదంగా ప్రియురాలున్నూ, తానున్నూ విన్నా" రనిన్నీ కొడుకు చెప్పినట్లున్నూ దానిమీఁద భవభూతి "యేమిన్నీ అననేలేదా?" అని అట్టే గుచ్చి గుచ్చి అడిగేటప్పటికి కొడుకు–

శ్లో. "కిమపి కిమపి మందం"

అనే శ్లోకంలో నాలుగో చరణాంతం- "రాత్రిరేవం వ్యరంసీత్" అనేచోటమాత్రం వకమాట అన్నాఁడని చెప్పఁగా ఆమాట యేమాటో చెప్పవలసిందని భవభూతి తన కొడుకు నడిగినట్టున్నూ, కొడుకు యీలా చెప్పినట్టున్నూ పండితపరంపరలో చెప్పుకుంటారు. దాన్ని వుదాహరిస్తాను-

"నాన్నా! కాళిదాసుగారు నాటకాన్ని వినిపించేటప్పుడు ఆయన సాని సున్నం రాసి యిస్తూవున్న తమలపాకులు వేసుకుంటూవున్నారు. ఆ సందర్భంలోపైని వుదహరించిన- "కిమపి కిమపి మందం" అనే శ్లోకచతుర్థచరణం వింటూ సానితో "సున్నం, ఎక్కువయింది" అని మాత్రం అన్నారు. యింతకన్న వక్కమాటకూడా నాటకం వినిపించేటప్పుడు కాళిదాసుగారు మాట్లాడినట్టే లేదు" అని కొడుకు చెప్పేటప్పుడు "రాత్రి రేవం వ్యరంసీత్" అనేచోట "ఏవం వ్యరంసీత్" అనడంకంటె "ఏవ వ్యరంసీత్" అంటే యెక్కువ సరసంగా వుంటుందని కాళిదాసుగా రభిప్రాయపడ్డట్టు భవభూతి తెలుసుకొని అలాగు సవరించు కొన్నట్టు వినికి. యీ పాఠంలో వున్న స్వారస్య మేమిటంటే? స్నిగ్ధ దంపతులైన సీతారాములు యేవో తలా తోఁకా లేనిరీతిగా మాటలాడుకుంటూ పరస్పరాలింగన మహోత్సవాన్ని అనుభవిస్తూ వుండఁగా, రాత్రి య్యేవే విరామాన్ని పొందిందిగాని వారిగోష్ఠి యింకా విరామాన్ని పొందనేలేదు- అనేది- అసలు పాఠంలో సున్నవుంటే, "ఏవం" అని వుంటుంది. కనక ఏవం అంటే? ఈ ప్రకారంగా సీతారాములకు రాత్రి గడిచిపోయింది అని మాత్రమే వస్తుంది. ఆ పాఠంకంటే యీపాఠం సొగసుగా వుంటుందని కాళిదాసుగారు "సున్నం" యెక్కువయిందనే మిషతో సూచించినట్టయింది కాని యీ కథ యిటీవల వారికల్పన కాని మఱోమాదిరిదికాదు. యేమంటే, కాళిదాసు తెలుఁగు దేశస్థుఁడు కాదు కాఁబట్టి తెలుఁగుపదమైన "సున్నం" అనే పదంతో ఆలా చమత్కరించడం సంభవించదుకదా! కాఁబట్టి యెవరో బుద్ధిమంతులు ఆశ్లోకంలో ఆసవరణను వుపపాదించి యీకథాకల్పనచేసి కాళిదాసుకు అంటగట్టినమాట సత్యదూరంకాదు. యీలాటివే యింకా కొన్ని కథాకల్పనలున్నాయి. వక నాఁడు దండిమహాకవిన్నీ, కాళిదాసుగారున్నూ ధారాపట్టణ వీథమ్మట షికారు వెడుతూవున్నారనిన్నీ, ఆలా వెళ్లేటప్పుడు దండిగారివద్ద తమల పాకులున్నూ, చెక్కలు వగయిరాలున్నూ వున్నాయనిన్నీ, సున్నం లేకపోవడంచేత ఆ వీథిలోవున్న ఒకానొక వేశ్యాగృహం గుమ్మంలో వున్నవక వేశ్యబాలికను వుద్దేశించి- శ్లో."తూర్ణ మానీయతాం చూర్ణం పూర్ణ చంద్రనిభాననే!" అని దండి శ్లోకపూర్వకంగా ఆజ్ఞాపించినట్టున్నూ, కాళిదాసు గారివద్ద తమలపాకులుకూడా లేకపోవడంచేత- శ్లో."పర్ణాని స్వర్ణవర్ణాని కర్ణాంతాఽఽ కీర్ణ లోచనే!"

అని ఆజ్ఞాపించినట్టున్నూ, ఆ బోగంపిల్ల తమలపాకులున్నూ, సున్నమున్నూ తెచ్చి కాళిదాసుగారికి ముందుగా యిచ్చి తరవాత దండిగారికి సున్నాన్ని తెచ్చి యిచ్చిందనిన్నీ, ఆపట్లాన్ని దండి "నేను ముందుగా నిన్ను సున్నం తెమ్మన్నానుకదా, నాకు ముందుగా సున్నాన్ని యివ్వక కాళిదాసుగారికి తమలపాకులు ముందుగా యిచ్చి నాకు తరువాత సున్నాన్ని యివ్వడానికి కారణమేమిటి?" అని విలాసంగా అడిగేటప్పటికి ఆ పిల్ల- "అయ్యా మేము వేశ్యలం, మాకు వకఅణా యెవరెక్కువిస్తే వారిని ముందుగా గౌరవిస్తాం. కాళిదాసుగారు అయిదు అణాలు యిచ్చారు. మీరు మూఁడు అణాలే యిచ్చా"రని జవాబు చెప్పిందనిన్నీ దానితో దండి దాని తెల్వితేటలకు సంతోషించి వూరుకున్నాఁడనిన్నీ వక కథ విద్వత్పరంపర చెప్పగా వినడం. ణకారాన్ని "అణా" అని చిన్నప్పుడు కుఱ్ఱాళ్లకు అక్షరాలు చెప్పేటప్పుడు మన తెలుఁగు దేశంలో పలకడంవుంది. యీ పలుకుబడి యితరదేశాలలోకూడా వుంటే వుందేమో కాని 'అణా' అనేది నాల్గుడబ్బుల పరిమాణం కల ద్రవ్యాన్ని చెప్పడం వుండివుండదు. కాఁబట్టి యీకథకూడా ఆంధ్రదేశంలో పుట్టినకథే అనుకోవాలి. కథ కల్పితమే అయినప్పటికీ అప్పటికాలంలో వేశ్యలుకూడా సంస్కృతంలో మంచి ప్రవేశం కలవాళ్లనే అంశమేకాకుండా కాళిదాసుగారితోపాటు దండిమహాకవి కూడా అంతో యింతో విలాస పురుషుఁడే అనే అంశం దీనివల్ల ధ్వనితం అవుతుంది. పైఁగా దండికన్నా కాళిదాసే అధికుఁడనే అంశం తాత్కాలికలుగావుండే బోగంకన్యకలకు కూడా తెలిసినదే అనికూడా ధ్వనిత మని తెలిసికోవలసి వుంటుంది. ఎన్నోకథలు కాళిదాసున్నూ, దండిన్నీ, భవభూతిన్నీ వకటేకాలంవాళ్లన్నట్టు చెప్పుకొనేవే వున్నాయి. అందులో కొన్నిటిని తోసేయడం మఱీ చిక్కుగా వుంటుంది. చూడండీ యీ కింద వుదాహరించే కథలు- శ్లో. కవి ర్దండీ కవి ర్దండీ కవిర్దండీ నసంశయః" అని కాళీమహాదేవి కాళిదాసుతో అన్నట్టున్నూ, దానిమీఁద కాళిదాసుకి కోపంవచ్చి "వొళ్లెఱుఁగనిశివం"గా అమ్మవారిని వుద్దేశించి, "కోఽహం రండే!" అని అడిగినట్టున్నూ, దానిమీఁద అమ్మవారు తన పొరపాటును సవరించు కోవడానికి దయతో- "త్వమేవాఽహం త్వమేవాఽహం త్వమేవాఽహం న సంశయః" అని జవాబు చెప్పినట్టున్నూ వినడం. యేక కాలికత్వం దండికాళిదాసుల కుండకపోతే యీకథ కుదరదు. లేదా? కాళిదాసుకంటే దండి పూర్వుఁడేనా అయివుంటే కొంత సమన్వయం అవుతుంది. మఱిన్నీ భోజరాజుగారు ఉపరిసురతాన్ని కాళిదాస భవభూతు లిద్దఱికీ వర్ణ్యంగా యేర్పఱిచి ప్రశ్నించినప్పుడు చెఱివకశ్లోకం చెప్పడమున్నూ, అందులో కాళిదాసుగారిశ్లోకమే మెఱుఁగుగా వున్నట్టు ఒకవిశేషణంవల్ల భోజరాజుగారు అభిప్రాయపడేటప్పటికి భవభూతి తనదే బాగా వుందని వృథా వివాదకు వుపక్రమించడం తోనే కాళిదాసు "మనకీ వివాద మెందుకు? మనమన శ్లోకాలు

సమానతూఁకం గల తాటాకుల మీఁదవ్రాసి శారదా దేవ్యాలయంలో అమ్మవారి యెదుట తూఁచుదాము. అందులో యేది యెక్కువ తూఁగితే ఆకవిత్వం అతిశయించినట్టు నిర్ణయమవుతుం"దని చెప్పినట్టున్నూ అందుకు భవభూతికూడా వొప్పుకున్నట్టున్నూ తుదకు ఆలా తూఁచేటప్పుడు భవభూతిగారిశ్లోకం వున్నవైపు తేలికగా పైకితేలిపోతూ వుండివుండడంలో అమ్మవారు స్వల్పవిషయంలో మహాకవికి, పరాభవం యెందుకు రావాలని కాఁబోలు! తనచెవు సందున అలంకారార్థం ధరించిన యెఱ్ఱకలువపూలు తాలూకో, తామరపువ్వుతాలూకో మకరందాన్ని భవభూతిశ్లోకం వున్న వైపున చిలికినట్టున్నూ దాన్ని కనిపెట్టి కాళిదాసు- శ్లో॥ "అహో! మే సౌభాగ్యం మమచ భవభూతేశ్చ ఫణితిం। ధటాయా మారోప్య ప్రతిఫలతి తస్యాం లఘిమని। గిరాం దేవీ సద్యశ్శ్రుతికలిత కల్హార కలికా। మధూళీమాధుర్యం క్షిపతి పరిపూర్త్యై భగవతీ." అనే శ్లోకం చెప్పి ఆ రహస్యాన్ని బయటఁ బెట్టినట్టున్నూ విద్వత్పరంపరవల్ల వినడం. ఇందులో భవభూతి పేరుకూడా వుంది కాని యీ శ్లోకం కాళిదాసే చెప్పాఁడనడానికి ఆధారంలేదు. ఆ పద్ధతిని భవభూతికిన్నీ మఱివక కవికిన్నీ యిట్టి వివాదం తటస్థించడమున్నూ, అందులో భవభూతికి వోడురావడమున్నూ తటస్థిస్తుంది. వొక్క కాళిదాసుకు భవభూతి యే స్వల్పంగానో తీసిపోవడానికి విద్వల్లోకం అంగీకరిస్తుందికానీ మఱో కవికి తీసిపోవడానికి ఎంత మాత్రమున్నూ అంగీకరించదు. కాఁబట్టి ఆకల్పన కుదరదు. అదిన్నీ కాక, కొన్ని విషయాలలో కాళిదాసు భవభూతికి యత్కించితు తీసిపోయినప్పటికీ ఉత్తరరామ చరిత్ర రచనలో కాళి దాసుకన్నా, అంటే అతని శాకుంతల రచనకంటే కూడా మిన్నగానే వున్నట్టు కాళిదాసే వప్పుకున్నట్టు యీక్రింది శ్లోకం చెపుతుంది- శ్లో॥ "నాటకేషుచ కావ్యేషు వయంవా వయమేవవా, ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే" అంటూ యెప్పుడో సర్టిఫికట్టు యిచ్చినట్టు వినికి. ఏక కాలికులు కారు వీరనేవారు యీశ్లోకాన్ని కూడా యెవరికో అంటఁగట్టవలసి వస్తుంది. యింకా యెన్నో వున్నాయి. వీరిద్దఱే కాక దండికూడా భోజుని సభలో వుండేవాఁడనడానికి సంబంధించిన కథలు. అవన్నీ భోజ చరిత్రలో యెవరో వుటంకించే వున్నారు. భోజచరిత్ర వ్రాసిన కవి యెవరో తెలియదు. మాఘకవినికూడా ఆ భోజచరిత్ర భోజుఁడి కాలంలో వున్నట్టు చెపుతుంది. కాలపరిశీలకులు ఆ భోజచరిత్రాన్ని బొత్తిగా విశ్వసింపరు. కాని కొన్ని కథలుమాత్రం ఆ పరిశీలకులకు కంఠం ముడిపట్టుకొనేవి లేకపోలేదు. కొందఱు కాళిదాసు విక్రమార్కుని సభలోవున్నట్టు సప్రమాణంగా ఋజువుచేస్తున్నారు. శాకుంతలంలో ప్రస్తావనలోవున్న- "అభిరూపభూయిష్ఠా పరిష దియమ్" అనే వాక్యాన్ని "విక్రమార్కభూయిష్ఠా" అని వున్నట్టు చెపుతూవున్నారు. కాళిదాసకృతము లనుకొనే రఘువంశ కుమార సంభవాది కావ్యాలున్నూ, శాకుంతల

విక్రమోర్వశీయాది నాటకాలున్నూ రచించిన కాళిదాసులు వేఱువేఱుగా వున్నట్టున్నూ చెపుతూ వున్నారు యిప్పుడు కొందఱు పరిశీలకులు. ఆ చెప్పడంలో రఘువంశ కుమారసంభవాలు రెండున్నూ యేకకవికృతాలు కావనేవారికి వకచిక్కు వుంది. రఘు వంశంలో యిందుమతీ పరిణయఘట్టంలో వున్నశ్లోకాలు, కుమారసంభవంలో పార్వతీపరిణయఘట్టంలో కొన్ని తూచా తప్పకుండా పడివున్నాయి. భిన్నకర్తృకగ్రంథా లయితే ఆలా పడడానికి సమాధానం వుండదు. అందుచేత ఆ రెండు గ్రంథాలమట్టుకేనా యేకకర్తృకత్వం వప్పుకోవాలని నేననుకుంటాను. యిద్దఱు కాళిదాసులు వున్నట్టు వ్రాసేవారికిన్నీ ఆధారాలు లేకపోలేదు. అవి ఖండించాలంటే సుఖసుఖాల తేలేపని కాదు. కాని లోకంలో వున్న ప్రతీతియందు వున్నంత మూఢవిశ్వాసం మాత్రం పరిశీలించి చేసిన సిద్ధాంతమందు లోకానికి కలగదు. అందుచేత మూఢవిశ్వాసాన్నే నేను అవలంబిస్తూ వున్నాను. యింకా కొందఱు కాళిదాసులైతే వున్నారు. కాని వారు 'అభినవ' అనేపదం పూర్వమందు కలవా రవడంచేత అంతగాని కొంతగాని బాధించరు. "అభినవపదపూర్వః కాళిదాసః ప్రగల్భః" ఇత్యాదులు చూచుకోఁదగును. మొత్తందండి భవభూతి కాళిదాసులు, సంస్కృత కవితాప్రపంచకంలో పేరు మ్రోగిన త్రిమూర్తులు. దండి భవభూతులు కాళిదాసుకన్న ముందే భోజరాజుగారి ఆస్థానమందు వుండి యెవ్వరినిన్నీ ఆరాజుగారి ఆస్థానానికి చేరనిచ్చేవారు కారంటూ కొన్ని కథలు వున్నాయి. వాట్ల నిజానిజాలు నిర్ణయించడం చాలా దుర్ఘటం. కాళిదాసునుకూడా వీరిద్దఱున్నూ చేరనిచ్చే వారే కారనిన్నీ కాళిదాసు యేదో వెఱ్ఱిగా శ్లోకాలు చెప్పుకొంటూ వీరిని ఆశ్రయించేటప్పటికి రాజుగారికి తమయందు వుండే అపోహని తొలగించడానికి యీ కాళిదాసుని రాజుగారి ముందఱ పెట్టారనిన్నీ వకకథవుంది. ఆకథకు సంబంధించిందే యీ క్రింది శ్లోకం.

శ్లో. "అస్థివద్భకవచ్చైవ చల్లవ ద్వెల్లకుక్కవత్
రాజతే భోజతేకీర్తిః పున స్సన్యాసిదంతవత్"

యీ శ్లోకంలో వున్న "చల్ల, వెల్లకుక్క" శబ్దాలు గౌడదేశీయుఁడైన కాళిదాసు శ్లోకంలో పడడం అసంభవం కాఁబట్టి ఆంధ్రదేశీయుల కల్పనాకథగా మనం భావించాలి. లోకంలో వక రాజును గూర్చిగాని, ఒక కవినిగూర్చి గాని మనం మాట్లాడుకోవలసివస్తే ఆ వ్యక్తులు మొట్టమొదటనుంచిన్నీ మహాయోగంలోనే వున్నట్టు చెప్పుకోవడంలో వినడానికి అంత ఆదరం వుండదు, చూడండీ! విశ్వదాతగారినిగూర్చి లోకం యెంత సంతోషంగా చెప్పుకుంటూ వుంటుందోను యీయన వొకప్పుడు 0-4-0 అణాలు తనచేతులో లేక యెంతో చిక్కుపడ్డట్టు కూడా వింటే ఆయన ముఖతః విన్నానేమో? లేక మఱి వకరివల్ల

విన్నానో జ్ఞప్తి చాలదు. అసలుమాత్రం యథార్థం కాకపోలేదు. అలాగే విద్యాభ్యాస కాలంలో మ్యునిసిపల్ దీపాల సహాయం యీయనకుపకారం చేసినట్టున్నూ వినడం. యీదీపాల సహాయం శ్రీ భాష్యం అయ్యంగారు వగైరా కొన్ని మహావ్యక్తులకున్నూ జరిగినట్లు వినడం కలదు. అట్టి నాగేశ్వరరావుగారు యేరోజు కారోజు చేసే దానం యెంత వుంటుందో? లెక్కవేస్తే తేలదు. ఆయీ విషయం నేను కొంత కళ్లారా చూచిందే. యీయన ఆగర్భ శ్రీమంతుఁడై వుండి చిన్నప్పటినుంచీ యిలాటి దాతగానే వుంటే లోకానికి కలిగే ఆదరాతిశయం వేఱు, యిప్పుడు కలిగే ఆదరాతిశయం వేఱు. మన కాళిదాసుగారు మొట్టమొదట భోజరాజ దర్శనానికి వెళ్లేటప్పుడు కవిత్వంలో నిరుపమానుఁడే అయినప్పటికీ తగినంత పేరుప్రతిష్ఠలు కలవాఁడుగా లేనట్టున్నూ, రాజదర్శనానంతరం పెద్దయోగం పట్టినట్టున్నూ చెప్పుకోవడంలోనే విశేషం వుందని వేరే వ్రాయనక్కఱలేదు. దండి భవభూతులు ఏకసంథా, ద్విసంథా గ్రాహులనిన్నీ కాళిదాసుగారు భోజరాజుగారి మీఁద చెప్పిన శ్లోకాలు వెంటనే వారు చదివి యివి మేమిదివఱలో చెప్పినవే కాని నూతనాలు కావని చెప్పడానికి మొదలు పెట్టేటప్పటికి వారి ధారణకి లొంగని మాదిరి శ్లోకాలు, శ్లో. 'వాశ్చారేడ్ధ్వజధ గ్ధృతోద్వధిపతిః కుధ్రేడ్జజానిః" అనే పాషాణపాక శ్లోకాలు రచించి వారికి శృంగభంగం చేసి కాళిదాసు భోజుని ఆస్థానంలో స్థిరపడిపోయాఁడనిన్నీ వకకథ చెప్పుకోవడం వుంది. యింకా భోజుఁడికిన్నీ, కాళిదాసుకిన్నీ సంబంధించిన వెన్నో కథలున్నాయి. భోజరాజుగారి వుంపుడుకత్తె కాళిదాసుగారికి వలపుసానిగా యేర్పడ్డట్టున్నూ, తుదకు ధనాశచేత ఆవేశ్య కాళిదాసు మెడకోసి చంపినట్టున్నూ వకకథ వుంది.

శ్లో. "కుసుమే కుసుమోత్పత్తి శ్శ్రూయతే నతుదృశ్యతే" అని భోజరాజుగారు వేశ్యా కేళీగృహపు గోడమీఁద వ్రాసి దీన్ని పూర్తిచేసిన వారికి అర్ధరాజ్యం యిస్తామని వ్రాసినట్టున్నూ, ఆ అర్ధరాజ్యం తాను పుచ్చుకునే వుద్దేశ్యంతో ఆశ్లోక పూర్తిని కాళిదాసుచేత- "బాలే! తవముఖాం భోజే దృష్ట మిందీవరద్వయమ్" అని చేయించి కాళిదాసు నిద్రపోతూ వుండఁగా "మర్దరు" చేసి మిడిమిడిజ్ఞానపాండిత్యం కల ఆ వేశ్య "బాలే" అన్న పదం తీసివేసి, "రాజే" అని చేర్చి రాజుగారిని అర్ధరాజ్యం యివ్వవలసిందని కోరఁబోతూ వుండగా, ఆ పూర్తియందువున్న మోసాన్ని "రాజే" అనే అసంగత మార్పువల్లనే గ్రహించిన మహాకవి భోజరాజు- "కాళిదాసుని చంపేశావా యేమిటి? నీతల్లి కడుపుకాలా!" అని ప్రశ్నించాఁడనిన్నీ, అది యథార్థం వప్పుకోక విధిలేక వప్పుకొని శవాన్ని చూపిస్తే అప్పుడు భోజరాజు తనకు కూడా మృత్యువు సమీపించడాన్ని తెలిసికొని యేకొంచెమో శేషించివున్న తన ఆయుర్దాయాన్ని విభజించి సగం కాళిదాసుకుయిచ్చి యిద్దఱున్నూ కలిసి శ్రీవాల్మీకిరచిత రామాయణగాథననుసరించి రామాయణ చంపూరచన కారంభించి సుందరకాండవఱకున్న

రచించేటప్పటికి ఆయుఃపరిమితి సరిపోయిందనిన్నీ, అందుచేతే యుద్ధకాండ మతివకరు రచించడం తటస్థించిందనిన్నీ వక కథ చెప్పుకుంటారు. యీ కథకు సంబంధించి - "శ్లో. అద్య ధారా నిరాధారా... అద్య ధారా సదాధారా" అనే శ్లోకద్వయం కనపడుతుంది. ఆయీ కథలు కొన్ని పురాణాల్లో వుండే సందర్భాలను అనుసరించి కనపడతాయి. భోజరాజుగారి శిరస్సులో అంటే మెదడులో యేదో కప్పపిల్ల చేరినట్టున్నూ, దాన్ని అశ్వనీదేవతలు "ఆపరేష"ను చేసినట్టున్నూ వక కథ వుంది. యిప్పటికాలంలో అయితే ఆ "ఆపరేషను" దేవతలదాఁకా వెళ్లవలసిలేదుగాని అప్పుడు దేవతలదాఁకా వెళ్లింది. ఆయీ కథల నిజానిజాలు తేల్చడం చాలాకష్టం. యింతదాఁకా వుదహరించిన కథలవల్ల కాళిదాసుగారు వేశ్యాలోలుఁడైనప్పటికీ కేవల శ్రోత్రియపుత్రుఁడున్నూ, శ్రోత్రియుఁడున్నూ అయిన భవభూతి ఆయన యెడల యెక్కువ ఆదరాన్నే చూపించేవాఁడనిన్నీ, తన వుంపుడుకత్తెకున్ను, కాళిదాసుకున్నూ సంబంధం వుందనే అంశం భోజరా జెఱిఁగీకూడా అతనియందు ప్రేమగానే వుండేవాఁడనిన్నీ తేలడమేగాకుండా అంతటి మహారాజున్నూ మహాకవీనిన్నీ అయిన భోజుఁడు వుంచుకొన్న సానికి కూడా కాళిదాసురసికత్వం మనశ్చాంచల్యాన్నయితే కలిగించి ప్రేమింపచేసింది కాని తుట్టతుదకు అర్ధరాజ్యాపేక్ష అట్టి వలపు మగణ్ణికూడా చంపించివేసిందనిన్నీ యెన్నో విశేషాలు ధ్వనిమర్యాదచేత బయలుదేఱతాయి, ఆయా మాదిరి విశేషాలు ధ్వనించేకథ లింకా వీరికి సంబంధించిన వున్నాయి. వ్యాసం పెరిగిపోతూవుంది. అందుచేత వాట్లను వదులుకొని చదువరుల వినోదార్థం వొక శ్లోకానికి సంబంధించిన పుక్కిటి పురాణకథను వుదహరిస్తాను-

యీ కథ నేను విని యిప్పటికి 48 యేండ్లు దాఁటవచ్చింది. కథ మాత్రం నిజం కాదేమోకాని శ్రోత్రపేయంగామాత్రం వుంటుంది. యీకథే కాదు; మనవారి మతంలో యెన్నో పురాణగాథలు యీలాటివే, అంటే అర్థవాదాలే. అర్థవాదాలంటే లేని అర్థాన్ని ప్రయోజనాంతరాపేక్షతో వుపన్యసించడమే. ఆశ్లోకం తుట్టతుదను వుదాహరిస్తాను. కథ మొదలెడ్తూ వున్నాను - వొకానొక మహాకవి భోజరాజుగారి దర్శనం నిమిత్తం బయలుదేఱి ధారానగరానికి వచ్చాఁడఁట! వచ్చి వూరు వెలపల డేరా వేసుకొని మకాం చేశాఁడఁట! "కవులకు డేరా లుంటాయా?" అని సందేహిస్తారు కాఁబోలును! సందేహించకండి, యిప్పటి అస్మదాదులనుబట్టి వెనుకటి మనకవులందఱినిన్నీ యీలాటివాళ్లే అనుకోకండి. ఆ కవులు విదేశీయ ప్రభుపరిపాలనలో వున్నవాళ్లు కారుకదా!- "ఎదురైనచోఁ దన మదకరీంద్రము డిగ్గి కేలూఁత యొసఁగి యెక్కించుకొనియె" అనే పద్యం వగయిరాలు జ్ఞాపకం తెచ్చుకోండి. అంతదాఁకా యెందుకు? తురగా రామకవి యీకాలాని కెంతోపూర్వుఁడు కాఁడు - అతనిదే యీ క్రిందిపద్యం-

ఉ. "రాతిరి మేము పస్తుహయరత్నము పస్తు కవీంద్రగాయక, వ్రాతముపస్తు
నర్మసచివాగ్రణి పస్తు... ముద్దుకోమలి... పస్తింక నేమి సెప్పుదున్?"

యీ పద్యంలో మొదట కొంతజ్ఞాపకంరాక బొట్టుపెట్టి వదలేశాను. వ్రాయకుండానే తెలుస్తుందని కొంత వదిలేశాను. కవులు గుఱ్ఱాలతో మఱికొందఱు కవులతో గాయకులతో నర్మసచివులతోకూడా బయలుదేఱేటప్పుడు సొంత డేరా వుండవలసిందే కాని మహారాజావారి దర్శనము అయి వారి సప్లయి అందేలోపున సొంతడేరా వుండకపోతే కొత్తవూళ్లో వీరిని భరించతగ్గ గృహస్థెవఁడుంటాఁడు? అందుచేతేకదా! పూర్వము యెవరో కవి యేనుఁగునున్నూ, కవీశ్వరుణ్ణీ రాజు భరించవలసిందే కాని తదితరులు భరించ లేరని చెప్పివున్నాఁడు– "సుకవితా యద్యస్తి రాజ్యేనకిమ్"– అనే భర్తృహరి వాక్యంకూడా మహాకవుల సంపత్తి సామాన్యం కాదని తెలుపుతుంది. భర్తృహరివాక్యాని కిది అర్థంకాదని కొందఱనవచ్చును. కాకపోవుఁగాక– "సుకవీంద్ర బృంద రక్షకుఁడెవ్వఁడనిన వీఁడను నాలుకకుఁ దొడవైనవాఁడు" అనే సీసచరణం వగయిరాలు కవుల ఐశ్వర్యాన్ని తెలుపుతూ వున్నాయి కదా! అది అలా వుంచుదాం. కవిగారు వచ్చి డేరాలోదిగారు. కాళిదాసుకు ముందే ఈసంగతి తెలిసి దేవిని ప్రార్థించాఁడు, దేవి "ఆకవి నీకన్న వొకజన్మం యెక్కువగా నన్ను వుపాసించాఁడు, నీకుసాధ్యుఁడు కాఁడు, ఉపాయాంతరం చూచుకొ"మ్మంది. ఆ పట్లాన్ని కాళిదాసుకు యేమీ తోఁచిందికాదు. తానేమో తొమ్మిదిజన్మాలల్లో దేవిని వుపాసించినట్టున్నూ, ఆ కవి పదిజన్మాలల్లో వుపాసించినట్టున్నూ దేవిస్పష్టంగా చెప్పింది. ఆలోచించి, ఆలోచించి కాళిదాసు వకగడ్డి అమ్ముకునేవాఁడివేషం వేసుకుని పచ్చగడ్డికావిడి బుజాన్ని పెట్టుకొని కనుచీఁకటి పడుతూవుండఁగా ఆ కొత్తకవిగారి డేరా దగ్గిఱికివచ్చి తొంగిచూస్తూ వున్నాఁడఁట! అప్పుడు ఆ కొత్తకవీశ్వరుఁడు "గడ్డికావిడి యెంత కేస్తా?" వని బేరమాడేటప్పటికి మనకాళిదాసన్నాట్ట, "అయ్యా! యీ గడ్డి కాళిదాసుగారి గుఱ్ఱానికి వాడుకగా ప్రతీరోజూ అమ్ముకునేదండి. మీకమ్మేదిలే"దన్నాట్ట! అనేటప్పటికి ఆకవి "వోరీ! మేము యిప్పుడే యీవూరికి వచ్చాము. మా గుఱ్ఱానికి నీవు అమ్మకపోతే కొత్తవూళ్లో గడ్డి సంపాదించడం కష్టం, కాళిదాసుగారు నీ కిచ్చేదానికంటె రెట్టింపుఖరీదు యిస్తా" మంటూ బతిమాలేటప్పటికి మనగడ్డి కావటివాఁడు (కాళిదాసు) "బాబూ! ఆరు నాకు రోజూ రాత్రి కూడుకూడా పెట్టిస్తా"రన్నాట్ట! దానిమీఁద కవిగారు "మేమున్నూ పెట్టిస్తా" మన్నారఁట! అనేటప్పటికి మొగమాట పడ్డట్టు నటించి కాళిదాసు గడ్డికావడి వారికి వేసి అక్కడే భోంచేసి "బాబూ!" యీ రేతిరిక్కడే తొంగుంటానని చెప్పి ఆ కవిగారిగుట్టూ మట్టూ కనుక్కోవడానికి అక్కడే పడుక్కున్నాఁడఁట! తర్వాత తెల్లవాఱుగట్ల చంద్రాస్తమయం అవుతూ వుండఁగా ఆ కవిగారు మేలుకుని ఆ చంద్రుణ్ణి యీ విధంగా వర్ణించడానికి మొదలెట్టారఁట!

శ్లో. "చరమగిరికురంగీశృంగకండూయనేన, స్వపితి పునరిదానీ మంతరిందోః కురంగః" అంటే అర్థమేమిటంటే? పడమటి కొండ అనఁగా, అస్తగిరియందు వుండే ఆడలేడి తనయొక్క కొమ్ముతో గోకుతూవుంటే, ఆ సౌఖ్యాన్ని అనుభవిస్తూ చంద్రమండలంలో వుండే మొగలేడి సుఖిస్తూ వుందని వర్ణించాఁడన్నమాట. ఫలితార్థం చంద్రాస్తమయం అవుతోవుందని తేలింది. యిన్ని తికమక లెందుకు చంద్రాస్తమయ మవుతూందనే చెప్పరాదా? అని శంకిస్తారేమో? ఆ తికమకలు వుంటేనే ఆ రచన కవిత్వమనిపించుకుంటుందని తెలుసుకోవాలి. సరే ప్రస్తుతం వ్రాస్తాను. కాళిదాసు కవిగారి గుట్టూ మట్టూ తెలుసుకోవడానికి ప్రచ్ఛన్నంగా వచ్చి వున్నావాఁడే కనక ఆ రచనలో వుండే లోపాన్ని కనిపెట్టి - "బాబూ! ఆఁడలేడికి కొమ్ము లుంటాయాండి?" అంటూ మెల్లిగా శంకించాడు. శంకించేటప్పటికి కవిగారు తాను పడ్డ పొరపాటును గ్రహించుకున్నారు. అన్నా! గడ్డి అమ్ముకొనేవాఁడికి కూడా దొరుకడ్డాంకదా? అని మనస్సులో విచారం పుట్టింది. దానితో సవరణ తోఁచింది కాదు సరికదా! ఉత్తరార్ధంకూడా స్ఫురించిందికాదు. ఆ కంగారంతా మన కాళిదాసుగారు కనిపెట్టి అయ్యా! "శృంగ" అనేచోట- "తుండ" అంటే కుదురుతాదండి. అన్నాఁడఁట! అప్పుడు అర్థం. ముట్టితో గోఁకడం కనక సరిపోతుందన్న మాట. ఆ సవరణ వినేటప్పటికి కవిగారికి మరీ గాబరా పుట్టిందఁట! ఆ గాబరామీఁద ఉత్తరార్ధం అసలే స్ఫురించక "బ్రే" కేసినట్టయిందఁట! అది కాళిదాసు కనిపెట్టి- "తరవాయి సెలవిప్పించండి బాబూ! యింటా" నన్నాట్ట. కవిగారు కంగారుతో - బెల్లంకొట్టిన రాయిలాగ వుండిపోయారనిన్నీ, అదంతా గ్రహించి కాళిదాసు - 'అయ్యా! సెలవైతే తరవాయి నాను పూర్తిచేసుకుంటా' నన్నాఁడనిన్నీ, కవిగారు ఆమాటవిని అత్యాశ్చర్యపడి- "యేమీ నీవు కవిత్వం కూడా చెప్పగలవా?" అని అడిగారనిన్నీ దానికి కాళిదాసు- 'బాబూ! బాగా చెప్పలేనుగాని యీమాత్రం నేనే కాదండి; మా కాళిదాసుగారి నౌకర్లందఱున్నూ చెపుతారండి' అంటూ వుత్తరార్ధాన్ని- శ్లో॥పరిణతరవిగర్భ వ్యాకులా పౌరుహూతీః దిగపి ఘనక పోతీహుంకృతైః క్రన్దతీవ" అని పూర్తి చేసినట్టున్నూ దానితో కాళిదాసును జయించాలని డబ్బా డవాలీ కట్టుకొని పెద్ద అట్టహాసంగా బయలుదేఱి వచ్చిన కవిగారు హడిలిపోయి "కాళిదాసుగారి నౌకర్లే యింతింత కవులయితే ఆయనయెంతవాఁడో?" అనుకొని- "చచ్చినంత కలగంటే పెందరాళే మేలుకో" మన్నారనుకొని డేరా సామాను బళ్లకెక్కించి వుదయం కాకుండానే వచ్చినతోవను ప్రయాణం కట్టినట్టు గోదావరి డి. అమలాపురం. తా॥ కాట్రేవుకోన కాపురస్థులు శ్రీమల్లాది నరసింహశాస్త్రుర్లుగా రనేవారు చెప్పఁగా విన్నాను. ఆయన బహుశః నాయీడువారే అని జ్ఞాపకం. ఆయీ శ్లోకం యే గ్రంథంలోనో యిటీవల చూచినట్టు కూడా జ్ఞాపకం. ఆ గ్రంథం కాళిదాసు చేసినదని జ్ఞాపకం లేదు. యే మహాకవిదో? యీ శ్లోకాన్నిబట్టి యింత

పుక్కిటిపురాణాన్ని యేమహానుభావుఁడు కల్పించాఁడో? కాని వినడానికి మాత్రం చాలా సొంపుగావుంది. కాళిదాసును జయించే యిచ్ఛతో వచ్చి దేరాలో మకాంచేసిన ఆకవిపేరు యెవ్వరో విన్నట్టు జ్ఞాపకం లేదు. అసలు చెప్పినవారు చెప్పినట్టేలేదు. చెప్పేవుంటే యింతవఱకూ జ్ఞాపకంవుండి ఆకాస్తాజ్ఞాపకం వుండకపోదు. మనకు ఈ కథవల్ల మహాకవులనిపించుకొనేవా ళ్లందఱూ కొన్ని జన్మలయందు దేవీ వుపాసన చేసివుంటారనిన్నీ, అట్టివారు వొకరిని వొకరు జయించి పేరు పొందవలసివస్తే వుపాసనాబలిమికంటేకూడా వుపాయం యెక్కువ అవసరమనిన్నీ ప్రస్తుతం కాళిదాసుకు అంటఁగట్టిన కథవల్ల తెలుసుకోవలసివుంటుంది. ఉత్తరార్ధానికి అర్థం కొంచెం వ్రాస్తాను. తూర్పుదిక్కనే వొకానొక సంపూర్ణ గర్భవతి సూర్యుఁడనే శిశువును కనఁబోతూ ప్రసవవేదన పడుతూ వుందా? అన్నట్టు ఆఁడపావురాపిట్టలధ్వని వినబడుతూందని వుత్తరార్థతాత్పర్యం. యీలాటికథలు నాచిన్నతనం మొదలు బందరులో నేనుస్కూలు టీచరీకి ప్రవేశించేవరకూ దేశాటనం చేయడంలో ఎన్నో వినివున్నాను. యెన్నో ప్రాస్తావికాలు, శ్లోకాలూ పద్యాలూ వినివున్నాను. అవన్నీ బందరు ప్రవేశించేవరకూ వాచోవిధేయంగా వుండేవి. క్రమంగా బందరు టీచరీ రోజుల్లోనే ఆయీగాథలున్నూ, వీట్లకి సంబంధించిన శ్లోకాలూ, పద్యాలూ నున్నూ అంతరించాయి. యిప్పుడేకొంచెమో జ్ఞప్తిలో వున్నాయి. పనిలోపని యీలాటి కల్పనే యింకొకటి కాళిదాసుకు సంబంధించిందే వుదహరించి యీ వ్యాసాన్ని ముగిస్తాను. వొక రోజున కాళిదాసుగారికిన్నీ, భోజరాజుగారికిన్నీ వాదం వచ్చిందఁట! యేమనంటే? "ఐశ్వర్యం యెక్కువా? కవిత్వం యెక్కువా?" అని - భోజరాజుగారు "ఐశ్వర్యానికే" అగ్రస్థానాన్ని యిచ్చి వాదించడానికి మొదలెట్టారు. కాళిదాసుగారో? "కాదు కవిత్వానికే అగ్రస్థానం యివ్వా"లన్నారు. సరే! యిది తేలడం యేలాగ? తేల్చుకోవడానికి దేశాలమ్మట బయలుదేఱారు. భోజరాజుగారు వస్తూవున్నారంటే ప్రతీరాజున్నూ యెదురుగా వచ్చి గౌరవంచేసి గౌరవంచేసి తీసుకు వెళ్లి పెద్ద పెద్ద మేడలూ, పువ్వులతోఁటలూ బసయేర్పఱచి సమస్తసదుపాయాలున్నూ జరిగించేవాఁడు. కాళిదాసుగారిని యేరాజున్నూ రమ్మన్నట్టేలేదు. యేపండితుఁడి యింట్లోనో యింత "తదన్నంతద్రసం"గా కాలక్షేపం చేస్తూ శ్రమపడుతూ తిరుగుతూ వున్నాఁడు. మధ్య మధ్య భోజరాజుగారు "యేం నీవాదం వోడిపోయిందా?" అని డెకాయిస్తూ వుండేవాఁడు: కాళిదాసు- "యింకా పదండి ముందు చెపుతా" ననేవాఁడు. యీలా కొంతదేశం తిరిగారు. అంతట వొకానొక మకాం సింహళంలో రాజధానిలో పడింది. దీన్నిబట్టి ఆకాలంలో మనదేశస్థులు "సిలోనుకు" కూడా వెళ్లేవారని తెలుతుంది. అక్కడ జరిగిన విశేషమేమిటంటే? ఆదేశపుప్రభువు కొన్ని మాసాలనుంచి పూరూ పేరూ లేనివ్యాధిలో వున్నాఁడఁట! యెందఱో ఘనవైద్యులు వస్తూనూవున్నారు, చూస్తూనూవున్నారు. 'తమకువున్న

బాధయేమిటి?' అని ప్రశ్నిస్తే ఆయన 'సాతత్ర చిత్రాయతే' అని మాత్రం జవాబు చెపుతారు. మళ్లా మళ్లా గుచ్చిగుచ్చి అడిగితే మళ్లా మళ్లా ఆలాగే జవాబు చెబుతాడు. యీ వ్యాధికి వైద్యులు చేసే వైద్యమేమీ కనపడలేదు. రాణీగారేమి, మంత్రులేమి చేయవలసిన ప్రయత్నాలు యెన్ని చేయాలో అన్నీ చేస్తూవున్నారు. గ్రహజపాలు, భూతవైద్యజపాలు వకటేమిటి? మహారాజుకు లోటేముంటుంది కనక? దేశదేశాలనుంచి వైద్యులు వస్తూ వున్నారు. నెత్తిన గుడ్డేసుకొని వెఱ్ఱిమొహాలతో నిష్క్రమిస్తూనూ వున్నారు. ఆసమయంలోనే మన భోజరాజుగారు దయచేశారు. పేరు వినీవినడంతోటట్టుగానే మంత్రులు వగయిరాలు యెదురువెళ్లి గౌరవించారు. తగిన బస యేర్పఱిచారు. యేముంది?

'సాతత్ర చిత్రాయతే" అన్న వాక్యాన్ని విన్నారు. కర్తవ్యం తోఁచలేదు, వూరుకున్నారు. కాళిదాసుగారికి ఆలాటి సమయంలో దర్శనంయేలా అవుతుంది? కవి నని లేదా? కాళిదాసు ననే చెపుతాఁడనుకోండి! ఆ సమయంలో కవిత్వం యెవరిక్కావాలి?

"ఆతురస్య భిషఙ్మిత్రమ్" అనికదా! అభియుక్తులు చెపుతారు. అందుచేత మనవాఁడు- నేను వైద్యుణ్ణియ్యేవే చెప్పాఁడు. విన్నవాళ్లు "పోవయ్యా! నీతాతవైద్యులంతా వచ్చారు, బోల్తాగొట్టి పోయారు." అంటూ యీసడించడానికి మొదలుపెట్టారు. 'కాదు నేను తప్పకుండా రాజుగారి వ్యాధిని కుదురుస్తాను! నా ప్రజ్ఞ చూడండి. యెందఱినో చూచామన్నారుకదా! పోయిందేమిటి? నన్ను కూడా చూడండి!' అంటూ రాజ పురుషులని బతిమాలడాని కారంభించాఁడు. కాని ఆదరించినట్టు లేదు. తరవాత మెల్లిగా అంతఃపుర పరిచారికలలో కాస్త పెద్దగా తల తిప్పుకొనే దాసీలను ఆశ్రయించడానికి మొదలు పెట్టాఁడు. అందులో యెవత్తో వకత్తి అమ్మగారిచెవిని బడేసింది. "పోనీ యీయన వైద్యాన్ని కూడా చూద్దా"మని ఆపత్తులో వున్న రాణీగారు ఆయన్ని వెంటఁబెట్టుకు రావలసిందని ఆ దాసీకి ఆజ్ఞాపించారు. కాళిదాసుగారు కోటలోకి దయచేశారు. రాజుగారి దర్శనానికి వెళ్లారు. ప్రాణమాత్రావశిష్టులై మంచంమీఁద పరుండివున్న రాజుగారిని అందఱూ అడిగినట్టే "యేమిటి? తమకు వున్న బాధ" అని ప్రశ్నించారు- రాజుగారు యథాపూర్వంగానే- 'సాతత్రచిత్రాయతే' అని జవాబిచ్చారు. కాళిదాసు దేవీ ప్రసాదలబ్ధ కవితావైభవుఁడవడంచేత పరేంగితజ్ఞత్వం కలవాఁడుకనుక, ఆ వ్యాధివారికి యెలా కలిగిందో అంతా క్షణమాత్రంలో అవగతంచేసుకున్నాఁడు. యిక్కడికి రాకపూర్వమే సర్వే సర్వత్రా యీ- 'సాతత్ర చిత్రాయతే' పాట "రోళ్లా రోకళ్లా" పాడుతూనే వున్నది కనక యిదివఱకే దాని ముక్కామూలమూ కాళిదాసుకు అవగతమైవుందనుకోవలసి వుంటుంది. ఆపట్లాన్ని వైద్యం ఆరంభించాఁడు. యేలాగంటే? ఆ వైద్యం యీ శ్లోకమే- శ్లో. చిత్రాయ త్వయియోజితే తనుభువా సజ్జీకృతం

స్వం ధను। ర్వర్తిం ధర్తు ముపాగతేఽ౦గులియుగే బాణాగుణే యోజితాః। ఆరబ్ధే త్వయి చిత్రకర్మణి తదా తద్బాణభగ్నా సతీ! భిత్తింద్రా గవలంబ్య సింహళపతే! (సా తత్ర చిత్రాయతే) అని సమస్యాపూర్తి యథార్ధ చరిత్రతోటి చేసేటప్పటికి సింహళపతిగారు లేచి కూర్చున్నారు, వ్యాధి కుదిరిం దన్నారు, కాళిదాసుగారిని కౌగిలించుకున్నారు. యెంత గౌరవం జరగాలో అంతా జరిగింది. చాటుగా వుండి రాణీగారు సర్వమూ చూస్తూవున్నారు. "ఔరా! బక్క బ్రాహ్మఁడెంత మహానుభావుఁడూ?" అని అత్యాశ్చర్యపడుతూ వున్నారు. కోటకోటంతా ఆనందమయం అయిపోయింది. భోజరాజుగారు బిక్క మొగంతో వెలవెలపోతూ చూస్తూ వున్నారు. అప్పుడు యీయన రాజఠీకాన్ని చూచేదెవరు? కాళిదాసుగారు– "యేమి రాజా! ఐశ్వర్యానికా అగ్రస్థానం? లేక కవిత్వానికా!" అన్నాఁడు. భోజరాజుగారు ముమ్మాటికీ 'కవిత్వానికే' అని వొప్పుకున్నారు. రాణీగారు 'వోహో! వీరిద్దఱూ లోకంలో సర్వేసర్వత్రా చెప్పుకునే భోజకాళిదాసులు కాఁబోలు! వీరి వివాదంవల్ల మనకు యీలాటి లాభం కలిగింది. కవుల వివాదాలు కూడా లోకోపకారకాలు అవుతాయనడంయీలాటిదే అనుకుని సంతోషించారు. కథ కంచికి వెళ్లింది. మనం యింటికి వచ్చాం. కాని యీ శ్లోకానికి తాత్పర్యం కొంచెం వ్రాసి మఱీ వ్యాసాన్ని ముగిస్తాను. అసల కథేమిటంటే? సింహళ దేశాధీశ్వరుఁడు యేదో పనిమీఁద యెక్కడికో వెళ్లాఁడు. అక్కడ వొక పట్నంలో వక సుందరి యీయన్ని చూచి మోహించింది. వెంటనే యీయన విగ్రహాన్ని చిత్రించడాని కాలోచించింది. మన్మథుఁడు ధనుస్సుకు నారి తగిల్చాఁడు. వ్రాసే కుంచె రెండు వేళ్లతోటీ పట్టుకుంటూ వుంది. పాపం! అంతట్లో మన్మథుఁడు పూవు బాణాలను నారితో చేర్చాఁడు. ఆ సుందరి చిత్రరచన కారంభించింది. ఆరంభించీ ఆరంభించడంలోనే బాణపాతం జరిగింది. దానితో తన సమీపమందు వున్న గోడను ఆనుకొని – ఆ సుందరియ్యేవే వక చిత్తరువుగా మాఱిపోయింది. తుట్టతుదనివున్న మాటకు చిత్తరువుగా మాఱిపోయిందనేమాటే అర్థం. అయితే ఆయీ సంగతి జ్ఞాపకం తెచ్చినంతట్లో రాజుగారికి వ్యాధికుదరడ మేమిటంటారేమో? వినండీ. ఆ కన్యకామణికి శృంగారరసావేశం వచ్చి చిత్రాకృతి యేలా ప్రాప్తించిందో యీ రాజుగారిక్కూడా తన్మయత్వంలోగతం అంతా మఱుపు తగిలింది. కాళిదాసుగారివల్ల మళ్లా ఆయాసంగతులు జ్ఞప్తికి వచ్చాయి. దానితో జ్ఞానోదయం కలిగింది. గనక య్యీపైన కర్తవ్యాన్ని గూర్చి ఆలోచించుకోవడానికి కావలసినంత అవకాశం వుంటుందన్నమాట. అన్యోన్యమున్నూ ప్రేమ కలిగే వున్నారన్న అంశం తేలిందికదా? యీ పైన వీరిద్దఱున్నూ దాంపత్యధర్మమును పొందినట్లు తెలిస్తేనైతే బాగుండేది కాని ఆ విషయం నాకు చెప్పినవారు చెప్పలేదు. అందుచేత నాకున్నూ తెలియదు. యీ శ్లోకానికి సంబంధించిన కథకూడా యెవరిచేతో కల్పించబడిన బాపతే అని నేననుకుంటాను. శ్లోకంలో

వున్న విషయం కల్పితం కాకపోచవ్చును కాని భోజ కాళిదాసుల వివాదమున్నూ, వారిద్దఱున్నూ దీనికోసం ఆయాదేశాలు తిరగడమున్నూ, అందులో ద్వీపంగాని ద్వీపం ఆరోజుల్లో పనికట్టుకొని వెళ్లడమున్నూ యీ సమస్తమున్నూ కల్పనే అని నా అభిప్రాయం. కాని వినేవాళ్లకు నిశ్చయంగా ఈలా జరిగివుంటుందేమో? అనే భ్రాంతినిమాత్రం పుట్టిస్తుంది. యింతకున్నూ ఈ రెండో కథవల్ల తేలేసారాంశం ఐశ్వర్యంకన్న విద్యకే యెక్కువ గౌరవం యివ్వవలసి వుంటుందనియ్యేవే. యీ మాట అందఱున్నూ అంగీకరించేదే కాని యెవరోతప్ప విద్వాంసులలో చాలామంది ఐశ్వర్య వంతులను ఆశ్రయిస్తూనే వుంటారు. "మహాభాష్యం వా పాఠయేత్ మహారాజ్యం వా పాలయేత్" అంటూ అనాదిగా వినఁబడుతుంది. భవతు. యెందరో రాజులు జ్ఞానులై రాజ్యపరిత్యాగం చేసిన కథలున్నూ వున్నాయి. యెందఱో విద్వాంసులు అజ్ఞానులై ధనార్థం చేయరాని పనులుకూడా చేసినట్టున్నూ కొన్ని కథలు వున్నాయి. వాట్ల విషయం చర్చించడానికి యీ వ్యాసాన్ని వుపక్రమించ లేదు కనుక స్పృశించి వ్యాసం ముగించఁబోతూ వున్నాను. కవికి భాషాజ్ఞానమున్నూ, వ్యాకరణాది జ్ఞానమున్నూ యెంత అవసరమో, యీలాటి పుక్కిటిపురాణాలు దేశాటనంవల్ల మఱీ యెక్కువగా తెలుస్తాయి. మఱచిపోయినవి మఱచిపోఁగా యింకా కొన్ని పుక్కిటి పురాణాలు జ్ఞప్తిలో వున్నాయి. అందులో కొన్ని అసభ్యపుగాథలుకూడా వున్నాయి. అవి అసభ్యులు చెప్పుకుంటూవుంటే విన్నవే. కవికి సభ్యమనీ అసభ్యమనీ అంటూ భేదంతో పనివుండదు. సర్వమున్నూ వినవలసిందే, తెలుసుకోవలసిందే. యీమాట వక సందర్భంలో వక సంస్థానంలో వ్యాఖ్యానించే వున్నాము. ఆ మాటలు వుదాహరించి వ్యాసాన్ని ముగిస్తాను–

(నానారాజసందర్శనమునుండి)

> "శ్రీ వెలయంగ సత్కవిత చెప్పెడివాఁడనఁ బండితుండునుం
> గావలె లౌకికోత్తరుఁడు గావలె బుద్ధివిశేషధుర్యుఁడుం
> గావలె భోగి యోగియును గావలెఁ గొంటెలలోనఁ గొంటెయున్
> గావలె మంచి చెడ్డలనకన్ సకలంబు నెఱుంగఁగావలెన్
> గావున నెల్లరున్ గవులు గాఁదగ రట్టికవీంద్రుభావముం
> గేవలు లాదరింతురె? ... ... ... ... ... ... ..."

చాలును. అవసరమైనంతవఱకే వుదాహరించాను. యిందులో– 'అనకన్' అనేచోట వ్యతిరేకక్త్వార్థకం కళగదా? దానికి ద్రుతమేలా చేరిందంటూ కొందఱు శంకిస్తారు. దీనికి ప్రౌఢవ్యాకరణంలో నన్నయభట్టుగారి ప్రయోగాన్ని చూపి చేసిన సమర్థనం వుంది.

కావలసినవారు దానిలో చూచుకుంటారు. కనక దాన్ని గూర్చి యిక్కడ చర్చించేదిలేదు. గ్రంథకర్త యెటిగిన్నీ ప్రయోగించినప్పుడు దానికేదో బలవత్తరమైన ఆధారం వుంటుందనుకోవలసిందే కాని వృథాగా శంకించి పని కల్పించకూడదని విజ్ఞప్తి. ప్రస్తుతం రెండుశ్లోకాలకు సంబంధించిన పుక్కిటిపురాణగాథలు వివరించఁబడ్డాయి. మరొకటికూడా పనిలోపనిగావుదాహరించి మఱీదీన్ని ముగిస్తాను. కాదంబరి వ్రాసిన బాణమహాకవికూడా కాళిదాసుగారి రోజుల్లోనే వున్నట్టున్నూ, తానురచించిన కాదంబరిని కాళిదాసుకు వినిపించిరమ్మని వేశ్యాగృహంలోకి తనకుమారుణ్ణి పంపించినట్టున్నూ, కొడుకు వినిపించివచ్చాక "యేమన్నాఁడు కాళిదాసు?" అని కొడుకును అడిగినట్టున్నూ, అంతా విని– "యీఁగలు ముసురుతూ వున్నాయి కాదంబరికి" అన్నాఁడు కాళిదాసని చెప్పినట్టున్నూ, "కాళిదాసు యీసడించిన కవిత్వం యేం కవిత్వ"మనుకొని ఆ గ్రంథాన్ని తగలఁబెట్టి నట్టున్నూ, తరువాత యీ సంగతి కాళిదాసు విని చాలా నొచ్చుకొని– "నేనేమో? కాదంబరీ (యీఁతకల్లు) శబ్దగతమైన శ్లేషార్థాన్ని పురస్కరించుకొని ఆలా చమత్కరించి అన్నమాట సత్యమే. ఆమాట ప్రశంసకు సంబంధించిందే కాని యీసడింపుగా భావించడానికి కాదు. నీకావ్యం సర్వవిధాలా సర్వోత్కృష్టంగా వుంది. అట్టే చెప్పేదేమిటి?– 'బాణోచ్ఛిష్ట మిదం జగత్' అని చెప్పవలసి వుంది". అని చెప్పి "సరే నేను విన్నంతమట్టుకు నేను మళ్లా యేకరుపెడతాను వ్రాసుకోవలసిం"దని అలా చేసినట్టున్నూ, వినిపించని భాగం మాత్రం కొంచెం వుండఁగా బాణుఁడు స్వర్గానికి వేంచేసినట్టున్నూ, తరువాయి అంటే? ఉత్తరకాదంబరిని బాణుఁడి కొడుకు పూర్తిచేసినట్టున్నూ చెప్పఁగా విన్నాను. దీన్నిబట్టి బాణ కాళిదాసులు వొకటే కాలంలో వుండవలసి వస్తుంది. కాలాన్ని సహేతుకంగా పరిశీలించేవారు దీన్ని బొత్తిగా అంగీకరించరు. యీ పుక్కిటి పురాణకథను బట్టి అంత మహాకవికి బాణుఁడికి కూడా కాళిదాసంటే, యెంతో గౌరవం వుండేదని తెలుసుకోవడమే ఫలితం. యీ గౌరవం వుండడానికి యేక కాలీనత్వంతో అవసరం వుండదు. ఆ యీ కథలన్నీ కాళిదాసుని పోలినకవి– 'న భూతోనభవిష్యతి" అని తెలుసుకోవడానికే పనికివస్తాయి. కాళిదాసు "కేకసంథాగ్రాహి అనేకాక ఆ యేకసంథాగ్రాహిత్వం ఛందోబద్ధవిషయమే కాదు; వచనంలో కూడా" అని పైకథవల్ల తేలుతుంది. యీ విషయం యితర భాషలలో కూడా సమర్థించాఁడు మన తెలుఁగువాఁడు పండిత రాయలు. పైపనినే కోర్టులో వొకానొక దావాలో సుమారు నెలరోజులు తానిచ్చిన సాక్ష్యాన్ని మళ్లా తూ–చా తప్పకుండా అనులోమంగానూ, విలోమంగానూ కూడా వొప్పఁజెప్పి "అభినవ పండితరాయ" బిరుదాన్ని పొంది వున్నారు నిన్న మొన్నటిదాఁకా సజీవులుగా వున్న శ్రీమాన్ మాడభూషి వేంకటాచార్యులవారు. బాణుఁడున్నూ, భవభూతిన్నీ సభలో విద్యావిషయంలో

వివాదపడ్డట్టున్నూ అపుడు బాణుఁడు - శ్లో. నిశ్వాసోఽపి న నిర్యాతి బాణే హృదయవర్తిని, కిం పునః ప్రకటాఽఽటోపపదబద్ధా సరస్వతీ" అని తన పేరును శ్లేషించి భవభూతిని తిరస్కరించి నట్టున్నూ, దానిమీఁద భవభూతికి కోపంవచ్చి - శ్లో. హతా దాక్షృష్టానాం కతిపయపదానాం రచయితా। జన స్స్పర్ధాళుశ్చే దహహ! కవినా వశ్యవచసా। భవే దద్య శ్వో వాకిమిహ బహునా పాపిని కలౌ। ఘటానాం నిర్మాతు స్త్రిభువనవిధాతు శ్చకలహః" అని భవభూతి బాణుణ్ణి యీసడించినట్టున్నూ వక కథ వుంది. యీ కథలని పట్టిచేస్తే ఆ యీ కవులు యేకకాలికులు కాకపోయినా, వొకవేళ యేకకాలికులే అయితే వొకరికి వొకరు తీసిపోయేవారు కారనే ఫలితార్థం తేలుతుంది. అలా తేలడంలో కాళిదాసంటేమాత్రం ఆయీ పెద్ద పెద్ద కవులందఱూ శిరసా వహించేవారే అనిన్నీ కొన్నిటివల్ల తేలుతుంది. ఆంజనేయులు రచించి కారణాంతరంచేత చించి పాఱవేసినబాపతు రామాయణంలో చిలక్కొట్లు దొరకడమున్నూ, వాట్లని దండి భవభూతి కాళిదాసులు వారి వారి కల్పనలతో పూరించడమున్నూ, అందులో తారతమ్య నిర్ణయమున్నూ భోజరాజసభలోనే జరిగినట్లు చెప్పుకుంటూ ఆనందించడం నేను బహుధావినివున్నాను. యేకకాలీనులు కానిపక్షంలో కూడా అలాటి పూర్తి జరగడానికిన్నీ, భోజరాజుకాకపోతే మఱివకరాజేనా ఆ విషయాన్ని గూర్చి తనసభలో చర్చ జరిగించడానికిన్నీ అభ్యంతరం వుండదనిన్నీ, దాన్ని సుప్రసిద్ధుఁడుకనక భోజుఁడికి అంటఁగట్టారనిన్నీ మనం సమన్వయించుకోవచ్చునని నేను అనుకుంటాను. బాణుఁడు కాళిదాసురోజుల్లో వున్నాఁడనేకథలు అంతగా లేవుగాని దండిభవభూతులను గూర్చినవి మాత్రం చాలా వున్నాయి. కాళిదాసును గూర్చి అతనితో సమకాలికులేకాక అతనికి పూర్వీకులుగా వుండే ఋషులుకూడా వొప్పుకొన్నట్టే కొన్ని కథలు- "చకారకుక్షిగాఁడు" అనే వాక్యానికి సంబంధించినవి వగయిరాలు కనపడతాయి.

"అయి ఖలు విషమః" అనేదాని పూర్తివిషయంలో కాళిదాసు ఆంజనేయుఁడికన్నా విశేషజ్ఞుఁడని తేలుతుంది. మొత్తంమీఁద, కాలమ్మాటదేవుఁ డెఱుఁగునుగాని కాళిదాసు పేరు చెప్పుకొంటూ మన ఖండంలోనేకాదు; యూరపుఖండంలోకూడా ఆనందిస్తూవుండడం అనుభవసిద్ధంగా కనపడుతుంది. విషయభేదంవుంటే వుండనివ్వండిగాని కాళిదాసుకన్న కూడా మిన్నగా ఖండాంతరాల్లో గౌరవింపఁబడేపేరు మళ్లా కవర్గాదిలోనే- "గాంధీ" గారికి కనపడుతుంది. రామకృష్ణాదులనేనా యితరఖండవాసులు యీసడిస్తారేమో కాని పై పేళ్లవారిని మాత్రం యీసడిస్తారని తోఁచదు. కల్పనా కథలు యథార్థచరిత్రం వున్న వారి విషయంలోకూడా బయలుదేఱుతూనే వుంటాయి. వాటిని ఆఁపడానికి శక్యంకాదు. యీ బయలుదేఱడాన్ని గూర్చి మఱొకప్పుడు విస్తరిస్తాను, యిప్పుడు దీన్ని ముగిస్తాను.

★ ★ ★

# సామెతలు

వీట్లని లోకోక్తులనడమూ వుంది. ఇవి యెన్ని వున్నాయో నిష్కర్షించి దాదాపుగానేనా నిర్ణయించలేము. కొన్ని ఆయా దేశప్రాంతాలకే కాక గ్రామ ప్రాంతాలకు మాత్రమే సంబంధించి వుంటాయి.

1) వింజరానికి తగవులేదు, కోలంకకి మాఱువీథీలేదు.

2) ఆలిలేనివాడికి ఆత్మకూరు - యివి ఆయా గ్రామప్రాంతాల వారికే సమన్వయిస్తాయి. ఇందులో రెండోది గద్వాల ప్రాంతంలో విన్నది. మొదటిది యానాం (ఫ్రెంచి టవును) ప్రాంతంలోది.

3) ఆలీ బిడ్డలులేని వానికి ఆంజనేయులు గతి.

కర్నూలు ప్రాంతంలో ప్రతి పల్లెలోనూ ఆంజనేయులగుడి వుంటుంది. సాధువులు ఆ గుడి ఆవరణలో మకాం చేస్తూ వుంటారు. మఱికొన్నీ కొన్ని సామెతలు భిన్నభిన్నంగా పయికి వుంటాయిగాని, వొకటే అర్థాన్ని బోధిస్తాయి. వ్యాసాంతమందు జ్ఞప్తికిఁదెచ్చుకొని యీ అంశం వివరిస్తాను. దేశద్రిమ్మరితనంచేత, నాకు అక్కడక్కడ విన్నవి చాలా సామెతలయితే వచ్చునుగాని అవి యేదేనా గ్రంథరచనకు పూనుకొన్నప్పుడు తన్మయత్వంలో స్ఫురిస్తాయిగాని, తీరికూర్చుని జాబితా వ్రాయవలసివస్తే స్ఫురించవు. వీట్లను ఆంధ్రభాషా పరిషత్పత్రిక కొలఁది యేళ్లనాఁడు కొన్నిటిని జాబితాగా ప్రచురించింది. మీమాంసకులు న్యాయాలుగా వీట్లను వ్యవహరిస్తారు.

1) ఖలేకపోతన్యాయం 2) తృణజలూకికాన్యాయం 3) భ్రమర కీటన్యాయం 4) తిలతండులన్యాయం. మనకు ప్రస్తుతం వీట్లకు పర్యాయంగా వుండే సామెతలు (లోకోక్తులు) యేదో వొకటి వుదాహరించి చర్చిస్తాను. 'కుక్కలు కూసుకుంటే జంగం పరువుపోతుందా?' కుక్కలూ జంగమూ యీ ద్వయాన్ని గూర్చి వ్యాఖ్యానిస్తాను. ఆయా సామెతల కెప్పుడూ పరార్థ ప్రవృత్తేగాని స్వార్థమందు ప్రవృత్తి వుండదు. అంటే? యేమన్నమాట.

శ్లో. ఏతే సత్పురుషాః పరార్థ ఘటకా స్స్వార్థాన్ పరిత్యజ్యయే॥

- భర్తృహరి

సజ్జను లెంతసేపు తమ ప్రయోజనాలను వదిలికొని పరుల కార్యములు (పరోపకారార్థ మిదం శరీరం) నిర్వహిస్తూవుంటారు. (తుదకు సామెతలు సజ్జనులవంటివని తేలింది) ఆలాగే యివీని అన్నమాట. అంటే? యేమిటి? కుక్కంటే కుక్కాకాదు. జంగమంటే జంగమూకాదన్నమాట. సోదిచెప్పే యెఱకల దానిభాషలో యీలాటి వ్యాఖ్యానం వినఁబడుతుంది. వ్యాకరణ గ్రంథాలలో యింకా యీ విషయమై విపులంగా చర్చవుందిగాని, అది తీసుకువస్తే అసలు మూలాన్ని మరవవలసి వస్తుంది. అయినా చూపుతాను కొంచెం. "తేషాం పారార్థ్యాత్" అంటూ వుంటారు వ్యాఖ్యాతలు. తేషాం - ఆసంజ్ఞా పరిభాషా శాస్త్రములకు, పారార్థ్యాత్ - పరప్రయోజన మగుటవల్ల నుంచి అని అక్షరార్థం - పిండి తార్థమో? -

సంజ్ఞావిధాయక శాస్త్రములకున్నూ, పరిభాషాశాస్త్రములకున్నూ, విధిశాస్త్రం కోసం పాటుపడడం అనఁగా రాజునిమిత్తం భటులు యుద్ధం చేసినట్లు యింకా యిందులో కొంత స్వార్థంవుంటే (చావకబ్రతికి బయటఁబడితే పెన్షన్ వగైరా) వుంటుందేమో! యింకో దృష్టాంతం చూపుతాను. కాశ్మీరగర్దభాః అంటే? ఆ దేశపు గాడిదలన్నమాట. వీట్లమీఁద ఆ దేశంలో పైరయ్యే విలువగల కుంకుమపువ్వును పొలాలనుంచి యింటికిఁగాని వొక చోటునుంచి యింకోచోటికి (వర్తకం) గాని తీసుకు వెడతారు గాని వాట్లకు ఆకుంకుమ పువ్వులో లేశమున్నూ ఆహారంగా పెట్టరు. చాలాదూరం వచ్చాం యీ పరార్థత్వాన్ని గూర్చి వ్రాస్తూను. క్రియలోమాట; సామెతలకు అర్థం యేదో యితరం వుంటుందిగాని, దానిలో. మాటలకు సంబంధించి వుండదని పిండితార్థం; అయితే ప్రస్తుత సామెతలో జంగంఅంటే యెవరో గౌరవనీయమైన వ్యక్తిగా గ్రహించాలి. గౌరవనీయవ్యక్తులు ప్రపంచకంలో యెందఱోవుంటే జంగం అని బిచ్చగాణ్ణి వుటంకించడానికి హేతువెట్టిది? అని విచారణచేయవలసివస్తే, గ్రంథం చాలా పెరుగుతుంది. టూకీగా వ్రాస్తాను. ప్రతాపరుద్రాదుల ప్రభుత్వ కాలంలో శైవమతం రాజ్యంజేసిందంటే, విశ్వసించని వారుండరు. అప్పుడు జంగాలంటే సాక్షాత్తూ మహేశ్వరులే. అందుచేత ఆపదంతో గౌరవనీయులను వాడినట్లయింది. యీ సామెత ఆ రోజులలో పుట్టిందే. యిఁక కుక్కలు యెవరో నీచులు ఆపదంతో వాడబడ్డట్టయింది. ఈసామెతలో కూసుకుంటే, అనేది ఆత్మనేపదం.. గ్రామంలో కొను ధాతువు బాగా వినబడడంలేదు. కాని దానిలో ఉంది. దానివల్ల అంతకు ముందు లోకంలో జంగానికివుండే పూజ్యతలో లేశమున్నూ తగ్గదని తాత్పర్యార్థం. జంగం శబ్దానికి యీ కాలంలో సామాన్యంగా అయే అర్థమే మనం చూచుకోకూడదు. ఆ కాలంలో వుండేదే చూచుకోవాలి. వ్యంగ్యార్థం విచారించ వలసివస్తే తనవెంటఁబడి మొఱుగుతూవుంటే... కుక్కలను... తనదగ్గఱ దండంవున్నా, దానితో

కొట్టడంగాని, తుదకు బెదిరించడంగాని, చేయకుండా, చక్కాపోతాఁడని స్ఫురిస్తుంది. దీనిక్కారణం ఆ మొఱిగేవి కుక్కలు అవడమే! అనఁగా? తత్తుల్యమైన మనుష్యులు యెన్ని నీచపు మాటలు వినియోగించినా, గౌరవ భాజనంగా ఉండేవాళ్లు తూష్ణీభావము వహించడమే యుక్తంగానీ వాళ్లతో మాటకు మాటగా జవాబు చెప్పరాదని, ఫలితార్థం. యీలా చెప్పకపోతే స్పష్టంగానే నీచులు తన్నెంత దూషించినా ఘనులు ప్రతి చెప్పరు అనే అనఁగూడదా? అంటే, వినండి కవిత్వానికి వాచ్యంకంటే వ్యంగ్యమే ముఖ్యం (అఱవెత గుబ్బచన్నవలె. చూ.) అందులోనే అందంవుంటుంది. బట్టవిప్పేసినట్లుంటే రసం లేదు.

"జీవితం వ్యంగ్య వైభవమ్" అన్నారు సహృదయులు!! కవిత్వ పదార్థం లోకోక్తులలో విస్తరించి వుంటుంది. ఆ వ్యంగ్యంలో ఉత్తమ మధ్యమాధమత్వాలున్నాయి. ఆయీ విషయం వ్యాఖ్యానించ వలసి వస్తే చాలా పెరుగుతుంది. సామెతలు వాడడంలోనే కవిత్వానికి జీవభూతమైన వ్యంగ్యం బాగా స్ఫురిస్తుంది అని తెలిసికొందాం. ఉ. కుక్కలు కూసికోఁ జెడునొకో మఱి జంగము పర్వు – మొట్ట మొదట హెడ్డింగుగా వుంచిన సామెతనే గ్రాంథిక భాషలో మాఱిస్తే ఆయీ విధంగా తేలింది. మఱి అనే పదం అధికంగా చేరింది. కొన్ని సామెతలు కవులు యథాశ్రుతంగానే వాడుకున్నారు పాలు విఱిగితే పెరుగగునే? వగయిరాలు యీ ప్రకారం వాడేటప్పుడు వ్యాకరణ ప్రకారం తప్పొప్పులు పట్టకూడదు. అనుకరణం లేకపోయినా వున్నట్టే. ఆయీ విషయం పలుచోట్ల నాచేత వ్యాఖ్యానింపఁబడ్డదే కనక స్పృశించి విడుస్తున్నాను. వొక్క సామెతలో యెంతో అర్థం యిముడుతుంది.

'తెగితే లింగఁడు రాయి', చూడండి. యెనిమిదక్షరాలలో యెంత అర్థం యిమిడిందోను, "నాకు కోపం వచ్చేవఱకే కాని కోపంవస్తే గౌరవా గౌరవాలు చూసేవాణ్ణి కాను జాగ్రత్త" అని వొక అర్థం స్ఫురిస్తూవుంది. యింకా కొన్ని అర్థాలు పాఠకులే చూచుకోండి. అసలు అక్షరార్థం చెప్పవలసి వస్తే – మెడలో వున్నంతసేపే ఆ రాతిముక్కకీ పరమేశ్వరుఁడనే పూజ్యతగాని అది ఆచోటు వదిలి క్రిందపడ్డట్టయితే దాని గౌరవంవుండదు అని మాత్రమే. దీనికిప్పుడు నేను చెప్పిన విధంగా కాక యింకా కొన్ని విధాల వ్యాఖ్యానం చేయవచ్చును. విస్తరభయంచేత వ్యాకరించలేదు. (స్థాన భ్రంశే నశోభంతే. చూ.) శ్రవణానందంలో "తెగితే లింగఁడు ఱాయియంచును జనోక్తి న్నమ్మె నేమో కదా" అని వాఁడబడింది. ఆపద్యం చదువుతుంటే ఆయీ సామెతకు వుండే యావత్తాత్పర్యమూ బోధపడుతుంది. సంస్కృతకవులుకూడా కొన్ని దేశ సామెతలు సంస్కృతీకరించి వాడుకున్నారు. యే కవిత్వంలో సామెతలు విశేషించి వుంటాయో ఆ కవిత్వం యెక్కువ హృద్యంగా వుంటుంది. దానిక్కారణం భాషాజ్ఞానం లేనివాళ్ల క్కూడా దేశసామెతలు సుళు

వుగా అర్థమవడమే యెంత మంచి కవిత్వమేనా నిఘంటులు దగ్గిఱ పెట్టుకుంటేనేగాని సమన్వయించేది గాకపోతే చట్టన ఆనందాన్ని కలిగించదు. ఆయీ మాటకు కొందఱు పండితులు సమ్మతించరు, వారికి బాగా సంస్కృతపదజటిలంగా వుండటమే కావలసింది. మృదంగాది ధ్వనులవంటివి కవిత్వాలుగా అభియుక్తులుగణింపరు. యిది విషయాంతరం. ఆ యీ సామెతలు. "బేవారసాస్తి" వంటివి. ఒకకవి వాడినంత మాత్రంచేత యింకొక కవిదాన్ని వాడుకోరాదనే నియమంలేదు గాని కొన్ని సామెతలుయే శార్దూలంలోనోతప్ప యితర పద్యాలలో యిముడవు. ఆ పక్షంలోమాత్రం దానిజోలికిఁ పోఁగూడదు. మచ్చుచూపుతాను.

"జ్ఞాతిశ్చే దనలేన కిమ్మనెడి వాచారూఢి సత్యమ్ముగన్"

దీనిని మఱోకవి వాడుకోవడానికి హక్కు లేకపోదు గాని, భట్టు మూర్తి శార్దూలంలో పెట్టినట్లే ఆకవిన్నీ శార్దూలంలోనే పెట్టాలి. అది గ్రంథచౌర్యం కాకపోయినా గ్రంథచౌర్యంగా పరిణమిస్తుంది. ఆ యీ సామెతలు కవి నివసించే మండలాన్ని బట్టి వుంటాయని లోఁగడ వ్రాసే వున్నాను. యెంతపాండిత్యంవున్నా ఆ సామెతకు సంప్రదాయార్థం తెలియకపోతే పద్యం యొక్క అర్థం అడ్డుతుంది. వొకటే అర్థమిచ్చేవి దేశ భేదం చేత రెండు మూడు సామెతలు వుంటాయని లోఁగడ సూచించేవున్నాను, మచ్చు చూపుతాను.

"ఒజ్జల పుచ్చకాయ గావలయు" అని పింగళి సూరన్నగారు వాడినారు. యీ సామెత కర్నూలు ప్రాంతంలో చంటిపిల్లలకు కూడా అర్థమవుతుంది. గోదావరి మండలంలోఁగానీ, గంజాం విశాఖపట్నం మండలాలలోఁగాని అర్థం పెద్ద పండితులకే కాదు, కర్నూలు ప్రాంతంలో పుచ్చకాయ వుల్లిపాయిలతో (సకలంజం భక్షయేత్) పాటు నిషిద్ధవస్తువు. దీనితోపాటు సొరకాయా, నీటివంకాయఁ, గోళికాయ (గోరుచిక్కుడు) వగయిరాలునూ నిషిద్ధం. కాని పుచ్చకాయంత నిషిద్ధం మాంసంతప్ప వేఱొకటికాదు. దానిక్కారణం ఆయీ పుచ్చవిత్తనం ఖురాసాని దేశాన్నుంచి తురుష్కులు తెచ్చినట్లు కనఁబడుతుంది. ఆముక్తమాల్యదలో "ఖురాసాని పుచ్చలు వోదున్ని" అనే వాక్యం గలపద్యార్థం బాగా తెలిస్తే యీ పుచ్చకాయల హిస్టరీ బాగా తెలుస్తుంది. కాని ఆపద్యం తెలుగే అయినా కూర్పు యిమిడిక భాషాంతరంలాగు కనపడుతుంది. కడప, కర్నూలు ప్రాంతంలో మాంసాశనులు తప్ప పుచ్చకాయ తినరు. తింటేనో? మాంసం తిన్నట్లే. యింత నిషేధం వున్నా అపుచ్చకాయలు అగ్రవర్ణస్థులుకూడా చాటునా మాటునా (మన దేశస్థులు వుల్లివలె) తింటూనే వుంటారు కనకనే యీలోకోక్తి పుట్టింది.

"ఒజ్జల పుచ్చకాయ" అన్నంతలో యేం తెలుస్తుంది? గురువుగారి పుచ్చకాయ' అన్నంతవఱకే తెలుస్తుంది. లోగడ చేసిన వ్యాఖ్యానాన్ని అనుసరించి కొందఱికి తెలిసినా యింకా కొంత వివరించాలి. గురువుగారేమో? తినడానికని పుచ్చకాయ తెచ్చుకొని దాచుకున్నారు. ఆ సంగతి శిష్యు లెఱుఁగుదురు. యే యెఱుఁగని కుఱ్ఱలో ఆ పుచ్చకాయ బయటికి తీశారు. అదిచూచి పెద్దలు లేదా యెఱిఁగిన శిష్యులు మందలిస్తున్నారు.

ఒజ్జల పుచ్చకాయరా అది అని; నిషిద్ధవస్తువే అయినా అది గురువు లామోదించడంచేత జాగ్రత్తగా కాపాడాలి, ఆక్షేపించనూ కూడదు వారితోపాటు మనం తినాకూడదు. (యా న్యస్మాకం సుచరితాని... నోయిత రాణీ, చూ) అని దాని తాత్పర్యార్థం. సూరన్నగారు యేదో పురవర్ణనా సందర్భంలో. కల్పనాచమత్కృతి ద్వారా భగవంతుఁడు బొత్తిగా నిషిద్ధమయిన దివాసంభోగాన్ని చేస్తున్నట్టు కల్పించి ఆ యీ ఘట్టంలో దీన్ని వాడినారు. ఈ లోకోక్తికి సంప్రదాయార్థం తెలిస్తేనేగాని ఆ పద్యార్థం తేలదు; ఇదేవిధంగా వక్కొక్క లోకోక్తిని వ్యాఖ్యానించవలసివస్తే గ్రంథం బళ్లతో తోలవలసివస్తుంది. కాగితాల కరువుదినాలలో యే పత్రిక భరిస్తుంది? ఇప్పటికి–

(1) కుక్కలూ – జంగమూ

(2) ఒజ్జల పుచ్చకాయ.

అనేవి రెండుమాత్రం పూర్తిగా వ్యాఖ్యానించడం జరిగింది. రెండు మూడు వుదహరించడం జరిగింది – యీ "ఒజ్జల పుచ్చకాయ" సామెత గోదావరి మండలంలో యెవరేనా కళాపూర్ణోదయం ద్వారా యెఱిఁగినవారుంటే వుంటారు (అది లెక్కేమిటి,) గాని సర్వేసర్వత్ర యీ అర్థంలో – "గురువులోరి పొగచుట్ట" అని నిమ్నజాతులవారి సహజభాషలో వాడుకుంటారు – దీనికీ కాస్తవివరణం వ్రాయాలి. ఆ కడప ప్రాంతంలో ఆ పుచ్చకాయ నిషిద్ధం. మా ప్రాంతంలో పుచ్చకాయ అంతగాని కొంతగాని నిషిద్ధంగా వున్నట్లు లేదు గాని – పొగచుట్టమాత్రం (అదేనా యిప్పుడుకాదు) బాగా నిషిద్ధం, యేదో సందర్భంలో నేను యేభైయేళ్లకు పూర్వం వ్రాసిన పద్యం జ్ఞాపకంవచ్చింది. వుదాహరిస్తే పొగచుట్ట యేలాటిదో తెలుస్తుంది.

క. "ఇంజరము గాదు, రైల్వే,
యింజననన్ యోగ్యమగు నదే మనఁజుట్టల్
పుంజముగఁ గాల్చి పొగచే
రంజిపం గలుగు ద్విజులరాయిడికలిమిన్"

ఆయీ పొగచుట్టలలో చిలక కొట్లు వుండడం గలదు - చిలకకొట్లు అంటే కొంతవఱకుకాల్చి తక్కినశేషం కాలాంతరమందు కాల్చుకోవచ్చునని భద్రపరచిన బాపతన్న మాట. ఆలాటివాటిని నిమ్నజాతి బీదలు వాడతారు. చిలకకొట్టు యే ద్వారబంధం సందులోనుంచో కిందఁబడితే దాన్ని చీపురుకట్టతో తుడిచివేస్తూ వుండఁగా అది గురువుగారు దాఁచుకున్న దన్నసంగతి యెఱిఁగిన శిష్యుఁడు నివారిస్తున్నాఁడు. యేమన: "అది గురువులోరి పొగచుట్ట" అని. ఆయీ వ్యాఖ్యవల్ల ఒకటే అర్థాన్ని బోధించే సామెతలు రెండూ లేక మూడూ మండలభేదాన్ని బట్టి వుంటాయని తెల్పినట్లయింది. కొన్ని సామెతలు శుద్ధపచ్చి బూతులుగా వుండిన్నీ మంచి అర్థాన్ని యిస్తాయి. అయితే మాత్రం యేలాగ వుదాహరించడం? మనుచరిత్రలో "కెలకులనున్న తంగెటి జున్ను గృహమేధి" అనివుంది. యెవరికోగాని తంగెటిజున్ను అంటే తంగేడుచెట్టు కొమ్మకు పట్టిన తేనె పట్టు అని తెలియదు. యీ అర్థంలో యింతకన్న అందమైనది. అదృష్టవంతునికి... తేనెపట్టు పట్టింది అనేది. ఆంధ్రభాషకు యతులేమి ప్రాసలేమి సహజాలంకారాలు గనక యతిజ్ఞానంవల్ల పూర్తిగా బోధపడుతుంది. శ్రమలేకుండా అదృష్టం ఫలించి భాగ్యవంతుడైనాఁడన్నమాట.

యిచ్చేది కాసు... తాసు, యిది నైజాంలో సర్వేసర్వత్ర వాడతారు. తాసు అంటే? గంటన్నరకాలంగా నైజాంలో వాడతారు. మఱివొకప్పుడు సామెతలను గూర్చి యింకా విపులంగా వ్రాస్తే వ్రాస్తాను, యీపని అవసర నైవేద్యాలతో తేలేది కాదు. స్వస్తి.

★ ★ ★

# "నా౽నృషిఃకురుతేకావ్యం"

అంటూ వొక అభియుక్తోక్తి వుంది. యిది యే పుస్తకం లేదో తెలియదు.

శ్లో. "నా౽నృషిః కురుతే కావ్యం । నా౽గంధర్వ స్సురూపధృత్
నా౽దేవాంశో దదా త్యన్నం । నా౽విష్ణుః పృథివీపతిః"

అనే శ్లోకం నా చిన్నతనంలో మా ముత్తాతగారి ప్రాస్తావిక పద్య రత్నావళిలో చూచాను. యిటీవల చాలామంది పండితుల నోట విన్నానుకూడాను. ఋష్యంశసంభూతుఁడు కానివాఁడు కవి కానేరఁడనిన్నీ, గంధర్వాంశ సంభూతుఁడు కానివాఁడు అందగాఁడు కానేరఁడనిన్నీ, దేవాంశ పెట్టి పుట్టనివాఁడు అన్నదాత కానేరఁడనిన్నీ, విష్ణ్వంశ పెట్టిపుట్టనివాఁడు రాజు (ప్రజాపాలకుడు) కానేరఁడనిన్నీ దాని తాత్పర్యం. (దీన్నిబట్టే మన భారతీయులు రాజును రెండో దేవుణ్ణిగా భావించేవారు.) ఆ యీ నాలిగింటిలో మొట్టమొదటిదాన్ని గూర్చి నాలుగుమాటలు వ్రాస్తాను. కవిగావడానికి ఋష్యంశ ఆవశ్యకమని చెప్పడంవల్ల మొదటి కవులు ఋషులే అని వేఱే చెప్పవలసివుండదు – వేదంలోకూడా కొంతభాగం ఋషిప్రోక్తం వున్నట్టు కనపడుతుందిగాని, ఆ పక్షంలో వేదాలు అనాది అనే వాదానికి భంగం వస్తుంది కనక, ఆయా భాగాలు ఆయా ఋషులు కనిపెట్టారుగాని రచించలేదని వ్యాఖ్యాతలు సమన్వయిస్తూ వచ్చారు. వేదాలు అనాదిగా వున్నాయని చెప్పేవారి వాదం స్థూలదృష్టులకు మూఢ నమ్మకంగా కనపడుతుందిగాని, తుట్టతుదకు నిల్చేది ఆ సిద్ధాంతమేకాని యితరంకాదు. వేదంలో వుండే విశేషాలు పుచ్చుకొని ఋషులు ధర్మశాస్త్రాలు, పురాణాలు రచించారు. పురాణగాథలన్నీ జరిగినవే అనుకోవడానికిన్నీ వీలు కనపడదు, జరగనివని అనుకోవడానికిన్నీ వీలు కనపడదు. ఆంజనేయులు నూఱామడ సముద్రం వొక్క దాఁటుగా దూఁకాఁడా అంటే? (అయిదేళ్ల కృష్ణుడు గోవర్ధనం యెత్తడం వగయిరాలు చూ) మన మన శక్తులతో పోల్చి చూచుకుంటే విశ్వాస్యంగా కనపడదు. సంజీవి పర్వతం (అంతా కాదే అందాం) కొంతే అంటే? అవసరమైనంతేనా కొన్ని గంటల కాలంలో తేఁగలిగాఁడా? అంటే? యింకా యీ యిరవయ్యో శతాబ్దంలో యేదో జవాబు (రేడియోలు విమానాలు వున్నాయికదా) చెప్పడానికి పూనుకోనేనా వచ్చునుగాని, లోఁగడ వారికి ఆధారం లేదు కాని జనులయందు విశ్వాసరాహిత్య తీర్మానాలు లేకపోఁబట్టి పెద్దలు

చెప్పిన అంశాలను ప్రజలు- "విస్సన్న చెప్పినది వేద" మన్నట్టు విశ్వసించే తరగతిలో వుండేవారు. కనక, అప్పటి బోధకులకు అట్టే పరిశ్రమ కలిగేది కాదు. ఋషులుగాని, కవులుగాని ఆయా గ్రంథాలలో చెప్పిన భాగాలు చాలాభాగం (మ. ధరణీ మండలి దిర్దిరం దిరిగెc బాతాళమ్ము ఘూర్ణిల్లెలోనైన వన్నమాట) అతిశయోక్తి కింద జమకట్టుకుంటే- "నచ శంకా నచోత్తరం" గాని, ఆంజనేయులు సముద్రం దాcటి లంకలోకి వెళ్లడమూ, లంకా పట్టణం తగులపెట్టడమూ యివన్నీ అతిశయోక్తులుగానే సమన్వయించుకుంటే-

ఉ. సీతయు లేదు రావణుని చెల్లెలు లే, దలరాముc డబ్ధిలో
సేతువు గట్టలే, దతని చే దివిజారులు చావలేదు, సా
కేతపురమ్ములే, దచటc గేకయపుత్రియు లేదు సర్వము
న్నూ తనసృష్టియే యన జనుల్ విని నవ్వుదు రెమ్మొగమ్మునన్.

(ఇటీవలిచర్య)

కనుక, అన్నీ అతిశయోక్తులే అనుకోవడంకన్న అనాలోచితం వుండదు. కవులు యేపట్నాన్ని గుఱించి వర్ణిస్తారో ఆయా విశేషాలు అక్కడే వుంటాయని చెప్పలేంగాని, మఱోచోటేనా అంతా కాకపోయినా చాలా భాగం వుండి తీరతాయి. (టాజ్మహల్ వగైరా చూ) కాళిదాసాదులకు మార్గదర్శకులు ఋషులు, ఋషులకు మార్గదర్శకాలు వేదాలు. భోజరాజు "మధుమయఫణితీనాం మార్గదర్శీ మహర్షిః" అని వాల్మీకిని గూర్చి తన రామాయణ చంపులో కృతజ్ఞత్వాన్ని ప్రకటించి వున్నాడు. సామాన్యదృష్టితో చదువుకునే విద్యార్థులకూ, తత్తుల్యులుగానే వుండే పండితులకూ, కవులకూ, భోజచంపు రుచించినంత సొగసుగా వాల్మీకి కవిత్వం రుచించనిమాట సత్యం. దానిక్కారణం చెప్పవలసివస్తే యింతలో తేలదు. ఋషులు చాలా తేలిక శైలిలో వ్రాస్తారు. తఱచు అనుష్టుపులే వుపయోగిస్తారు. యిటీవలి కవులో ఆలా కాదు. దానికి భిన్నంగా ప్రవర్తిస్తారు. పంపా తీరంలో రాముcడు వున్నప్పటి రామాయణ కవిత్వం చాలా ప్రౌఢంగా అలంకారభూయిష్ఠంగా వుంటుంది. కొన్ని భాగాలు పేలపిండి మాదిరిగా వుండేవిన్నీ వుంటాయి. పునరుక్తి భూయిష్ఠంగావుండే భాగాలున్నూ వుంటాయి ఋషుల కవిత్వాలలో; అంత మాత్రం చేత ఋషులకు యిమిడ్చి సంగ్రహంగా రచించే శక్తి లేదనుకోవడంకంటే స్థూలదృష్టిత్వం వుండదు. ఆ పద్ధతిని బ్రహ్మసూత్రాలూ, వ్యాకరణ సూత్రాలూ, రచించినవారు ఋషులు కారనుకోవలసి వస్తుంది. అందుచేత ఋషులు సర్వశక్తిసంపన్నులని వొప్పక తప్పదు. వారి రచనలో కవిత్వ విశేషాలన్నీ వుంటాయి.

శ్లో. "సర్పాధినా ధౌషధినాథయుద్ధ క్షుభ్యజ్జటా మండల గహ్వరాయ,
తుభ్యంనమస్సుందరతాండవాయ యస్మి న్నిదం సంచవిచేతి సర్వమ్."

ఆయీ శ్లోకం వేదపాదస్తవంలోది, జైమినిమునికృతం. యిందులో మొట్టమొదటి విశేషణంలో యెంత అందంవుందో సహృదయులు పరిశీలించాలి. ఆ అందం సమాసంలో యిమిడిందంటే, మతీశ్లాఘ్యం. సాంబమూర్తి జడలో సర్పరాజున్నూ, చంద్రుఁడున్నూ యుద్ధం చేస్తున్నారఁట! దానివల్ల బోలెడు గందరగోళం జరుగుతూ వుందఁట! చంద్రుడికీ సర్పానికీ పోట్లాట క్కారణం రాహువు సర్పరూఁపుడే కదా! యెక్కడో వొక్కటికాదు, యిలాటివి యెన్నోశ్లోకాలు ఋషుల కవిత్వాలలో వుంటాయి.

శ్లో. "మృతా మోహమయీ మాతా జాతో బోధమయ స్సుతః,
సూతక ద్వయసంప్రాప్తౌ కథం సంధ్యా ముపాస్మహే?"

ఋది మైత్రేయోపనిషత్తులో వున్న శ్లోకం. కవిత్వం యెంత రసవత్తరంగా వుందో, యెంత అలంకారమయంగా వుందో సహృదయులకి గోచరిస్తుంది. యిప్పటివారు వీట్లని (ఉపనిషత్తులు) నిన్న మొన్నటి వాట్లనుగా చెప్పటం వుంది. వేద ప్రామాణ్యవేత్తలు ఆలాటి కాలనిర్దేశాన్ని వినరు, వింటే చెవులు మూసుకుంటారు కూడాను. "యస్య నిశ్వసితం వేదాః" అని మన ప్రాచీనులు విశ్వసిస్తారు. పరమాత్మకు ఆదిలేనట్టే, వేదాలక్కూడా ఆదిలేదనియ్యేవే వారి తాత్పర్యం. అట్టి అనాదిభూతమైన వేదంలో వుండే శ్లోకం యెంత మార్గప్రదర్శకంగా వుందో భావికవులకు పరిశీలిద్దాం, అజ్ఞానమయమైన తల్లి చనిపోయిందఁట! (పాపం) పైఁగా జ్ఞానమయమైన పుత్రుఁడుకూడా జన్మించాఁడఁట! ఆలా చూస్తే మృతాశౌచం (మైల) యిలాచూస్తే జాతాశౌచం (పురుడు) యిట్టి స్థితిలో సంధ్యా వందనం చేయడం యేలాగ? (జాతాశౌచ మృతా శౌచాలలో యేది తటస్థించినా, సంధ్యావందనం అసలే చేయకూడదని వొక మతం. అర్ఘ్యప్రదానం మట్టుకు చేసుకోవచ్చునని వొకమతం) సంధ్యావందనానికి నాయకమణి గాయత్రి. అపవిత్రస్థితిలో దాన్ని వుచ్చరించడం మహాదోషం. దాన్ని పురస్కరించుకొని పైశ్లోకార్థం ప్రవర్తించింది. యెంత అందంగా వుందో చూడండి. దీన్ని కవిత్వరీత్యా విచారిస్తే వ్యాసం చాలా పెరుగుతుంది. అజ్ఞానావస్థలోవున్న కర్మఠులకే కాని, జ్ఞానులకు సంధ్యావందనాదికంతో పనిలేదన్నది పిండితార్థం. యింకా బాగా వివరించవలసివస్తే సారాంశం ఈవిధంగా తేలుతుంది. సంధ్యావందనమనేది రోజులో యేవో కొన్ని గడియల కాలంలో మాత్రమే చేసుకొనేది. యితరకాలమంతా సాంసారికగోష్ఠిలో పడి విరామంలేక కొట్టుకొనే వాళ్లకి తరణోపాయంగా యేర్పడింది. జ్ఞానులంటే, సన్యాసులు సర్వదా ఓంకార (సర్వవేదసారభూత మన్నమాట) జపంతో

కాలక్షేపం చేస్తారు. వారికి దీనితో పనేముంటుందని చెప్పడానికి? వేదపురుషుఁడు జాతాశౌచామృతాశౌచాలతో సంబంధం కల్పి, యెంత చక్కగా చమత్కరించాఁడో. యింతకంటే, రసవత్తరంగా కాళిదాసాదులు చెప్పఁగలరా? (బాణోచ్ఛిష్టమా, యీ జగత్తు వేదోచ్ఛిష్టమా?) దీన్ని బీజంగా వుంచుకునే అనుకుంటాను లీలాశుకుడు,

శ్లో. "సంధ్యావందన భద్ర మస్తుభవతే...
స్మారంస్మార మఘం హరామి"

అన్నాఁడు. సర్వకాల సర్వావస్థల యందున్నూ, భగవన్నామాన్ని మనన చేసేవాళ్లకోసం సంధ్యావందనాదికం పుట్టలేదన్నది పరమార్థం. దాన్నే వేదపురుషుడు (ఆదిమకవి) పూర్వోక్త రీత్యా చమత్కరించాడు. సాహిత్య రత్నాకరకర్త అలంకారాలన్నిటికీ వేదంలోనే బీజాలు వున్నాయని వ్యాఖ్యానించాఁడు యీ ఘట్టంలోదే యిదిన్నీ.

శ్లో. హృదాకాశే చిదాదిత్య। స్సదా భాసతి భాసతే.
నాఽస్తమేతి నచోదేతి। కథం సంధ్యా ముపాస్మహే?"

సంధ్యావందనానికి యేర్పఱచిన కాలమేమోసూర్యోదయ సూర్యాస్తమయాలు. స్థూలదృష్ట్యా కనపడే సూర్యుఁడికి ఉదయాస్తమయాలువుంటే వున్నాయిగాని, జ్ఞానసూర్యుఁడు హృదయమనే ఆకాశమందు సర్వకాల సర్వావస్థలయందూ వొకటే విధంగా ప్రకాశిస్తూ వుంటే, సంధ్యావందనం చేయడం యేలాగ? అన్నాఁడు. వెనకటి శ్లోకానికీ దీనికీ రచనలో కొంచెం భేదం కనపడుతూ వున్నా, తాత్పర్యంలో భేదంలేదు. అవ్వాగుఱ్ఱమూ వకటే. (ప్రమాణానా మనేకత్వేఽపి ప్రమేయస్యై కత్వాత్) కొన్ని శ్లోకాలు కొంత మార్పుతోనున్నూ, కొన్ని యథామాతృకంగా నున్నూ ఋషులు (కాళిదాసాదులు కూడా) అనువదించుకున్నారు.

శ్లో. "మన ఏవ మనుష్యాణాం। కారణం బంధమోక్షయోః"

యిది అమృతబిందూపనిషత్తులో యేలావుందో, భగవద్గీతలోనూ ఆలాగే వుంది.

శ్లో. "యదా చర్మవదాకాశం। వేష్టయిష్యంతి మానవాః,
తదా శివ మవిజ్ఞాయ। దుఃఖస్యాఽన్తో భవిష్యతి"

యిది శ్వేతాశ్వతరోపనిషత్తులో ఏలావుందో, దేవీభాగవత సప్తమ స్కంధంలోనూ, ఆలాగే వుంది. ధర్మాన్ని చుట్టచుట్టి (చంకని పెట్టుకొన్నట్టన్నమాట) నట్టు ఆకాశాన్ని చుట్టగా చుట్టగలిగినవాళ్లకు శివపరిజ్ఞానం లేకుండానే దుఃఖనివృత్తి కలుగుతుంది అని దీని అర్థం. తాత్పర్యమో, అది యేలా అసంభవమో; యిదిన్నీ ఆలాగే అసంభవం అని తేలుతుంది.

"మరువ దుశీనరేషు జలం" అన్న మాదిరిని సమన్వయించుకోవాలి. ఉశీనరదేశాల్లో నీటి సదుపాయం యేలా వుంటుందని ప్రశ్నిస్తే - మరుప్రదేశంలో వున్నట్టే అని జవాబు. మరుప్రదేశం (అరేబియా యిసుకపట్టు)లో జలమేలా దుర్లభమో? ఆలాగే ఉశీనరదేశంలోనూ దుర్లభమని ఫలితార్థం. లేదని చెప్పడానికి వుందని జవాబు చెప్పినా ఫలితార్థం లేకపోవడమే పయిశ్లోకం. యథామాతృకంగానే వ్యాసులవా రనువదించి వున్నారని లోఁగడ వ్రాసే వున్నాను. యింతమాత్రంచేత గ్రంథ చోరత్వాన్ని ఆపాదించకూడదు. ఆ విషయం వేదంలో వున్నట్టుగానే వుటంకిస్తే, మతీ ప్రమాణ ప్రమితంగా వుంటుందని ఆలా చేసి వుంటారు. కొన్ని యత్కించితు మార్పుతోటీ వుంటాయి - చూపుతాను.

శ్లో. "ఘృతమివ పయసి నిగూఢం భూతే భూతేచ వసతి విజ్ఞానమ్."

యీ శ్లోకం యింతమట్టుకు యథామాతృకంగానూ ఉత్తరార్థం పదాలు కొంచెం తాఱుమాఱుగా (అర్థం వొకటే) నున్నూ వుపనిషత్తు నుంచే దేవీభాగవతంలో అనువదింపఁబడివుంది. యింకా యిలాటివెన్నో కనపడతాయి. ఇది విషయాంతరం. ఋషుల కవిత్వాలలో కూడా ఎన్నో చమత్కారాలు కనపడతాయనేది వ్యక్తవ్యాంశం,

శ్లో. "మాతామహ మహాశైలం, మహాస్త దపితామహమ్
కారణం జగతాం వందే కంఠా దుపరి వారణమ్."

ఇదిన్నీ జైమినీ విరచితమే. దీనిలో శబ్ద చమత్కారమే కాదు, అర్థచమత్కారమున్నూ వుంది: దీని పూర్వార్ధంలో మ-హ, అనే అక్షరద్వయం నాలుగుమాట్లు ఆవృత్తమయింది. ఉత్తరార్ధంలో - రణం - ద్విరావృత్త మయింది. అర్థంలోనో? మాతామహుఁడే వున్నాఁడుగాని, ఆ తేజస్సుకు పితామహుఁడు లేఁడఁట! యిదీ యిందులో చమత్కారం. పార్వతీ కల్పిత పుత్రుఁడైన గణపతికి తాత (మాతామహుఁడు) హిమవంతుడు గావచ్చును గాని పితామహుఁడెక్కడ దొరుకుతాడు? శివుడు కూడా యెవరికేనా కొడుకుగా వుండేపక్షంలో గణేశ్వరుఁడికి పితామహుఁడు వుండివుండేవాఁడు. ఈశ్లోకంలో చేస్తే కొన్ని శంకలు చేయవచ్చు. అవి వెట్టిగా వుంటాయి. ఆ వెట్టిశంకల స్వరూపం కొంచెం చూపుతాను. సర్వాదిగా వుండే పరశక్తికి హిమవంతుఁడు తండ్రిగా వున్నట్టే, యీశ్వరుడికి కూడా బ్రహ్మ తండ్రి కావచ్చునుగదా? దీనికి పురాణగాథ ఆధారం వుంది. ఆ పక్షంలో మాతామహుడిఁతోపాటు గణపతికి పితామహుడు కూడా వుండవచ్చునే అంటే వినండి. గ్రంథకర్త పరమశివుణ్ణి వుద్దేశించి ఆలా చమత్కరించాఁడుగాని శివుని అంశంవల్ల అవతరించిన రుద్రులను కాదంటే సరిపోతుంది. కవి వుద్దేశాన్ని పట్టి వ్యాఖ్యాతలు ప్రవర్తించాలి. వక్తవ్యాంశం కాళిదాసాదుల కవిత్వాలలోనే కాక, చమత్కారాలు ఋషుల

కవిత్వాలలో కూడా వుంటాయన్నదే. ఆ యీ శబ్దచిత్రాలుగాని, అర్థచిత్రాలుగాని ఋషులు అంతో యింతో సూచిస్తే యిటీవల వాట్లను తదితర కవులు విస్తరించారనేది పరమార్థం. వొక్క బంధకవిత్వం మాత్రం ఋషుల కవిత్వంలో ఎక్కడా వున్నట్టు తోఁచదు. అక్షరాలు విడఁదీయడమూ వొక్కొక్క అక్షరానికి వొక్కొక్క అర్థం చెప్పడమూ వేదంలోనే కనబడుతుంది. అవధూతోపనిషత్తులో—

శ్లో. అక్షరత్వాత్ (అ) వరేణ్యత్వాత్ (వ)
ధూతసంసార బంధనాత్ (ధూ)
తత్త్వమస్యాది లక్ష్యత్వాత్ (త)
అవధూత ఇతీర్యతే."

అని వొక్కొక్క అక్షరమే విడఁదీసి, వ్యాఖ్యానించే మాదిరిని కూడా చెప్పడం సూచింపఁబడింది. సర్వవేదసార భూతంగా వుండే ఓంకారానికి వ్యాఖ్యానించడం యీ మార్గంలోనే ఋషులు చూపి వున్నారు. అయితే వొక్కొక్కరు వొక్కొక్క మార్గంతొక్కి వ్యాఖ్యానించారు. కాని అందఱూ అక్షరాలు విడదీయడంలో యేకీభవించే వున్నారు. కొందరు శివాధిక్యాన్ని, కొందరు కేశవాధిక్యాన్ని - కొందరు శక్త్యాధిక్యాన్ని - యిలా వారి వారి మతాన్ని పోషించుకుంటూ వ్యాఖ్యానించి వున్నారు - దేవీ భాగవతం శక్తి ప్రాధాన్యాన్ని వివరించేదికనక, అందులో యీ విధంగా వుంది.

శా. ఓంకారమ్మున నాద్యకారమున వాచ్యుం డయ్యెజుం, డయ్యుకా,
రాంకుం డాతని తండ్రి విష్ణువు, మకారాంకుండు శంభుండు త,
త్సంకేతమ్మున నుత్తరోత్తరము ప్రాశస్త్యమ్ము వాటిల్లు ని
శ్శంకన్ బైదగు నర్ధమాత్ర చెలఁగున్ శక్తిస్వరూపమ్ముగన్."

ఆయీ పద్యం సంస్కృతానికి మా (తి. వెం) అనువాదం. ఓంకారంలో (అ. ఉ. మ్) అకారోకారమకారాలు మాత్రమే స్థూలదృష్ట్యా శ్రుతమవుతూ వున్నాయి. మూఁడక్షరాలు ముగ్గురుమూర్తులకూ వాచకాలుగా వుపనిషత్తులు కొన్ని వ్యాఖ్యానించాయి, కొన్ని మాత్రం మూఁడక్షరాలూ కాక, పైని అర్ధమాత్రంకూడా శ్రుతమవుతూందనిన్నీ, ఆ అర్ధమాత్రత్రిమూర్త్య తీతమైన శక్తికి వాచకమనిన్నీ వ్యాఖ్యానించాయి. దేవీ భాగవతం తుట్టతుది వ్యాఖ్యానాన్ని బట్టి ప్రవర్తించింది. లలితాదివ్య సహస్రనామాల్లో "అర్ధమాత్రార్థరూపిణీ" అని వుండడం దీన్నిబట్టే అనుకుంటాను. అర్ధమాత్రేమిటో, తత్స్వరూపమేమిటో ఆయీ రహస్యం మహా యోగులకేగాని అనుభవంలేని పండితులకు గోచరించేటట్టు లేదు. నేను జగత్ప్రసిద్ధులయిన

పండితులను యీ విషయం ప్రశ్నిస్తే తేలింది కాదు. అప్పుడు యోగులకు గాని ఇది తెలియదనుకున్నాను. సరే! ఇది విషయాంతరం. అక్షరాక్షరానికీ విడఁదీసి వ్యాఖ్యానించే మర్యాద వేదంనుంచి వచ్చిందేకాని, యిటీవలి కవులు కల్పించింది కాదని దీని వల్ల స్పష్టమయింది. (వొకటేమిటి? మన విజ్ఞానం సర్వమూ వేదమూలకమే) కాని, యీ మార్గం కావ్యకవిత్వంలో యెక్కడో తప్ప కవులు ఆమోదించలేదు. భారవి ప్రథమసర్గలో "తవాభిధానాత్" అన్నచోట "తశ్చ వశ్చ" అని తకారవకారాలకి ద్వంద్వ సమాసంచేసి, తార్క్ష్యవాసుకులని (నామైకదేశే నామగ్రహణం) వ్యాఖ్యానించడం అందరూ యెఱిఁగిందే: ఆ వ్యాఖ్యానం కేవలవ్యాఖ్యాత కల్పితమో, గ్రంథకర్త వుద్దేశమో? సహృదయులు గుఱితిస్తారు. కవితా సంప్రదాయంలో ఈలాటి పంథా కూడా వకటి వున్నప్పటికీ కవుల ప్రవర్తనంవల్ల దీనికి వైరళ్యం స్పష్టపడుతూ వుంది. కనక, ఇది ఋషులు సూచించినదే అయినా, కవులకు ఆదరణీయం కాకపోయిందని మనం తెలుసుకోవాలి. (వె = వెయ్యేళ్లు, ధ = ధనంతో, వ = వర్ధిల్లుము అనేది దీన్నిబట్టి పుట్టిందే) కొన్ని అక్షరాలు చేరి అయిన రామాదిశబ్దాలకే కాక, ప్రతి అక్షరానికీ కూడా అర్థం వుండడం మహాభాష్యకారులే అంగీకరించారు. (అర్థవంతో వర్ణాః యూపస్సూపః కూః) అయితే, ఆయీ భాష్యం ప్రకృతానికి అనుకూలించేదేనా? అంటారేమో, యే కొంచెమో సందర్భిస్తుందేమోగాని (ద్రావిడ ప్రాణాయామంగా అన్నమాట) నేరుగా సంబంధించదని యెఱుఁగుదును. వొక్క అక్షరాన్ని తీసి దాని స్థానంలో ఇంకో అక్షరాన్ని ఆదేశించినంతలో యెంతో మార్పు కలుగుతుందని తెల్పడానికే యీభాష్యం పుట్టింది. ఆ పక్షంలో అట్టి విలక్షణశక్తి యేకైకాక్షరమందు వుండితీరాలి కదా అని నేను ఆ భాష్యాన్ని వుదాహరించాను. భాష్యందాఁకా యెందుకు? ప్రస్తుతాంశానికి నానార్థ రత్నమాల చాలదా? ఆ నిఘంటువులో అకారాదులకు యెన్నెన్నో అర్థాలు వ్రాయడానికి ఆధారమేమి? ఋషుల పోకడలే. యెన్ని విధాలఁ జూచినా ఋషులకూ, కవులకూ పరస్పర బాంధవ్యం స్ఫురిస్తూనే వుంటుంది. భావనా శక్తి ఋషులయందు చాలాప్రబలంగా వుంటుంది. అంతో యింతో యీ శక్తి ప్రతీకవియందూ వుంటుంది. ఋషులకు వేదం ఆధారం, కవులకు ఋషులు ఆధారం, అస్మదాదులకు కాళిదాసాదులున్నూ, ఋషులూ కూడా ఆధారం. కొందఱు పద్యాలకి పద్యాలే, చరణాలకిచరణాలే పూర్వ కవులవి తమకవిత్వంలో పెట్టుకుంటారు. కొందఱు కొంచెం తలవిఱుపులతో పెట్టుకుంటారు. యివి రెండూకూడా ఆక్షేపణీయాలే. లోఁగడ అమృతబిందూపనిషత్తునుంచి "ఘృతమివపయసినిగూఢం" అనే శ్లోకంయొక్క పూర్వార్ధాన్ని మాత్రం వుదాహరించాను. వుత్తరార్ధం వుదాహరిస్తాను. "సతతం మనసి మథయితవ్యం

మనోమంథానభూతేన” ఇది వుపనిషత్పాఠం. దేవీభాగవతంలోనో? “సతతం మంథయితవ్యం మనసా మంథానభూతేన” అని వుంది. యింకా మఱికొన్ని యీలాటివి వున్నాయి. శ్రుతులను అనువదించే విషయంలో యత్కించిద్భేదంగానో, యథామాతృకం గానో అనువదించడం గత్యంతరాభావాత్ ఆక్షేపణీయంకాదు గాని కల్పనలు మాత్రం వొక కవిని మఱొకకవి అనువదిస్తే గ్రంథచోరుఁడు కాకపోఁడు. శ్రీనాథుని పద్యాలమాదిరిని పెద్దన్నగారి పద్యాలనడక వుండడంగాని, తిక్కన్నగారి పద్యాలమాదిరిని శ్రీనాథుని పద్యాలనడక వుండడంగాని ఆక్షేపణీయం కాదు. ఆలా అయ్యేపక్షంలో యెవఁడూ కవిత్వానికంటూ కలం చేతపట్టడానికే వీలు పడదు. ఆయీ తాత్పర్యం మనస్సులో పెట్టుకునియ్యేవే వొకమహాకవి - చ. “హృదయగతిన్ బురాతన కవీశ్వరు లేగని త్రోవ లేదు నే - తదనుగతిన్ రచించు కృతితాత్వికులన్ గరగింపకుండునే! మదగజరాజయాన మదమంథర బంధురయాన మానముల్” అని సమాధానం చెప్పాఁడు. కవిత్వం పుట్టింది మొదలు యిప్పటిదాఁకా ప్రస్తుతవిషయంలో యింత చక్కని సమాధానం యెవ్వరూ చెప్పలేదు. కేవలపట్టపగటి దొంగతనాలు కనఁబడుతూనే వుంటాయి. అవే ఆక్షేపణీయాలు గాని, యేమాత్రమో పోలిక వున్నంత మాత్రంచేత ఆక్షేపణీయంకాదు. యేదేనా అలంకారం వచ్చేటట్టు యేకవేనా యేపద్యమో వ్రాస్తే, ఆ పోలిక యితర కవుల కవిత్వంలో అలా వుండఁగా అలంకార శాస్త్ర (ప్రతాపరుద్రీయాదులలో) గ్రంథాలలోనేనా వుండక తప్పదుగదా? ఆ పక్షంలో అదిమాత్రం గ్రంథచౌర్యంకిందకి రాదా! అందుచేత కవులమీఁద యీ దొంగతనాన్ని ఆపాదించేవారు చాలా పరిశీలించిగాని ఆపాదించకూడదు. నన్నయగారు “నిండుమనంబు” అనేమాట వాడివున్నారు. తిక్కన్నగారున్నూ వాడివున్నారు యీశబ్దాన్ని. అంతలోనే గ్రంథచౌర్యాన్ని ఆపాదించడమా? యింతేకాదు యెఱ్ఱన్నగారు వొకచోట-

‘నీ యింద్రియజయము కీర్తనీయముతండ్రీ!’

అని కాఁబోలును వాడివున్నారు. యేకొంచెమో తేడాగా యీవాక్యం నన్నయ రచనలోనున్నూ చూచినట్టు జ్ఞాపకం. యిదికూడా గ్రంథచౌర్యంగా భావించరాదు. యిదేమేనాకల్పనకి సంబంధించింది కాదుకదా! సామాన్యమైనమాట, ఆయన నోటమ్మటారావచ్చు యీయన నోటమ్మటా రావచ్చు. అంతమాత్రంచేత- “గ్రంథచోరులు గాని కవులు గారు” అని గ్రంథచౌర్యాన్ని ఆపాదించడం అవిచారమూలకంగా భావించాలి. బుద్ధి పూర్వకంగా కాకపోయినా, యెవరికి యెవరి కవిత్వమందు విశేషాదరం వుంటుందో

వారికి వారికవిత్వపోలికలు కొంచెం కవిత్వంలో పడక మానవు. కాళిదాసంతవాఁడికే యీవిషయం అనుల్లంఘనీయంగా కనపడితే, యితరుల మాట చెప్పేదేమిటి? ప్రాచీనంగా వుండే కవుల కవిత్వాలను అనుకరించడం అనాదిగా వున్నట్టే కనపడుతుంది గాని, కొందఱు సమకాలీనుల కవిత్వాలను కూడా అనుకరించడం మాత్రమే కాదు, తలవిఱుపుల్లు పెట్టి, ప్రచురించుకోవడం కూడా కనపడుతుంది. గ్రంథచౌర్యంకింద అలాంటి దాన్ని చేర్చవలసి వుంటుంది. ఋష్యంశ సంభూతులైన మహాకవులెవ్వరూ యీలాటి అనుచితప్పని చేయరు. నమః కవిభ్యః.



# కవుల కష్టసుఖములు

నాయెఱిఁగిన కష్టసుఖాలనుగూర్చి శిష్యప్రశిష్యులకూ, ఏకలవ్యశిష్యులకూ కొంచెం వ్యాఖ్యానించడం చాలా ఆవశ్యకమంటూ ఆంధ్రపత్రికాధిపతి తఱచు హెచ్చరిస్తూ వుంటారు. ఆయన యీ విధంగా నన్ను ప్రోత్సహించడానికి కారణం నావార్ధక్యమే. అయితే యేకొంచెమో మిగిలి వున్నాయేమో కాని తక్కినవి అక్కడక్కడ చాలాభాగం వ్యాకరించే వున్నాను.

రచన అనేది సుబోధంగా వుండా లనునది ముందు జనించి పిమ్మట నా జననమని నన్ను మన్నించువారు సంభావింతురుగాక. యేమంటే కవిత్వమనేది తన మనస్సులో వుండే అభిప్రాయాన్ని యితరులకు తెలుపుడు చేయడానికి పుట్టింది కాబట్టిన్నీ ఆ యితరులలో భాషాపాండిత్యం యెక్కువగా వున్నవారే కాక, తక్కువగా వున్నవారూ వుంటారు కనుకనున్నూ యీ అభిప్రాయం పండితులలో చాలామందికి రుచించదు.

"ఉద్దామద్యుమణిద్యుతి వ్యతికర ప్రక్రీడదర్కోపల
జ్వాలాజాలజటాల జాఙ్గలతటీ నిష్కూజకోయష్టయః"

యీశైలి వారి నోటికి రుచించినట్లు–

"శైశవేఽ భ్యస్తవిద్యానామ్"
"రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజాం
అయోధ్యా మటవీం విద్ధి గచ్ఛ తాత యథాసుఖం."

ఆయీ శైలి రుచించదు. బాల్యంలో నేనుకూడా ఆ త్రోవలోనే సంచరించానుగాని యౌవన మంకురించు రోజులలోనే నా రచనకు వార్ధక్యం ప్రారంభమై దానికి సూచకంగా,

తే.గీ. తనకు నాల్గునిఘంటు పదములు వచ్చు
నను చుఁ బదిమందికిని దెలియంగ మాఱు
మూలపదములు గుప్పిన ముచ్చటగునె?
ప్రతిపదమ్మున రస ముట్టిపడినఁగాక."

ఆయీ పద్యాన్ని చెప్పించి యిట్టి రచనవలన పేరుప్రతిష్ఠలు గడించిన మహనీయుల నామములను,

సీ. నన్నయకవి పెట్టినాఁడుకదా? తిక్క
నాది కవీంద్రుల కాదిభిక్ష...

గీ. వారలును వారిమార్గమ్ముఁగోరి యాంధ్ర
కృతుల నొనరించి బహుబహూకృతుల నలరు
వారలును మాకుఁ బూజ్యులు వారికన్న
నితరకవిసత్తముల జోలియేలమాకు?"

అనేపద్యంలో మజ్జిళార్థంగా యేకరు పెట్టించి, లోకంలో నూటికి తొంభైమంది మెచ్చుకునే రచన వసుచరిత్ర మనుచరిత్రకంటె కొంత లొచ్చు వాదంలోకి దింపింది. కాని ఈ వాదం యెంతేనా యుక్తం న్యాయం కాకపోదుగాని ఆత్మైకవేద్యంగావుండే యీ విషయం ప్రతివాదులు యెంతో సహృదయులుగా వుంటేనే తప్ప జయం దుర్లభం.

భట్టుమూర్తిరచనలో పెద్దన్నగారి రచనవంటి రచన క్వాచిత్కంగా
"మాయాశీలురు చంచలాత్ములు... మహీపాలు ర్మహావైభవ
శ్రీయోగాంధులు చెప్పనేల? మగవారి న్నమ్మఁగా వచ్చునే."
"పకపకనవ్వి యోవసు నృపాలక? బాలికదూఱెదేల?

సుదతిన్ మనోజుబారికి నెఱజేసి లోఁ గనికరింపని వారివి గాక నేరముల్"
"ఆ పద్మోద్భవునోలగంబునకు... దా రోపోరా!....
యే పద్మాసనఁ జూచినన్ జెలియ, నిన్వీక్షించినట్లుండ దే
లా? పల్మాటలు పూర్వజన్మకృతముల్ గాఁబోలు నీనెయ్యముల్"

నెలతలలోఁ ద్రిలోకనుత నిర్మలకీ ర్తికలాప ధన్య యీ
కులగిరి రాజకన్య... వేడుకమీ కచిరంబ కల్గెడున్."

నానాగాయన గాయనీమణుల గానం బుర్వి నాలింపమో... వినమో? అందైన నెందైన నెందైన విందై నాదంబొనఁగూర్చునే..."

ఆయీ పద్యాలే కాదు. మఱికొన్నికూడా అప్రయత్నసిద్ధమైన ధాటిలో భట్టుమూర్తివి పెద్దన్నగారి-

"ఈ పాండిత్యము నీకుఁదక్క మఱి యెందేఁగంటిమే...
....పం క్తి కివెపో? మీ సంప్రదాయార్థముల్."

పద్యాలమాదిరివి వుంటాయి కాని యెక్కడో కొంచెం శబ్దాలంకారానికో, మఱో విశేషానికో యత్నించినట్లు గోచరిస్తుంది. పెద్దన్నగారో-

"అబ్బురపాటుతోడ నయనాంబుజముల్... ...చూచె నలకూబరసన్నిభు..."

ఎన్నిభవమ్ములన్ గలుగు నిక్షుశ రాసనసాయక వ్యథా
ఖిన్నతవాడి వత్తలయి కేలఁగపోలములాని... పయిగాలి సోఁకినన్
వెన్నవలెన్ గరంగు నలివేణులఁ గౌఁగిటఁ జేర్చు, భాగ్యముల్."

ఈ చర్చలోకి దిగితే యెంతో సహృదయతవుండాలి. కనక యింతతో ఆపి నా విద్యావంశం వారికిచ్చే నా సలహా, లేదా సందేశం యేమిటంటే "కవియశః ప్రార్థులైన ధీమంతులారా! మీరు పెద్దన్నగారి రచన ఒజ్జబంతి (వరవడి) గాఁ బెట్టుకుంటే కొంత గాకపోతే కొంతేనా రసజ్ఞ లోకంయొక్క "రసనలె ఆకులయి" గా నుంటారేమోకాని వసుచరిత్రను వరవడిగా పెట్టుకుని రచన సాగించే పక్షంలో లాభం లేదనియ్యేవే. వసుచరిత్ర రచనలోని ప్రతి అక్షరాన్ని అనుకరించిన వారెవరో నేఁటివరకెవరు గాని పేరు ప్రతిష్ఠలు గడించినట్లులేదు. ఇది నా అనుభూతి; మీకు వివరిస్తూన్నాను.

ఉ॥ మ్రొక్కిన నెవ్వ రేమనఁడు మోమటువెట్టుక చక్క ఁబోయె... వీఁడెక్కడి వైష్ణవుండు... మన మేటికి మ్రొక్కితి మమ్మ! అక్కటా... నిద్దరవోయినవాని కాళ్లకున్."

చ॥ ప్రకటజితేంద్రియుల్... స్త్రీలకు వశు లంతకన్న... మగకచ్చ బిగ్గకట్టుకొనఁగ నీతఁడెంత శుకుఁడో? హనుమంతుఁడొ? భీష్ముఁడో? వినాయకుఁడొ? తలంచుకో..."

"అకలంకస్థితి నాఁటనుండియును శూ
ద్రాన్నంబు వర్జించి మా
ధుకర ప్రక్రియ బ్రాహ్మణాన్న మె భుజిం
తున్... స్వయంపాకంబు శ్రీరంగశా
యి కృపన్ వెళ్లెదినంబు లీక్రియను స్వా
మీ? నేఁటిపర్యంతమున్."

శా. "ఆ విప్రోత్తము వజ్రపంజరనిభంబై నిశ్చలంబైన స
ద్భావంబు... పూవై తన్మకరందమైకరగెఁబోపో నీటికిన్ బల్చనై."

ఆయీ సారంగు తమ్మయ్య కవీంద్రుఁడు యెవరినీవరవడిగా పెట్టుకొన్నట్లు నాకు గోచరించదు. శ్రావ్యమైన ధోరణిలో యావత్తూ సాగించాఁడు. యితని కితఁడేసాటి. మనువస్వాది చరిత్రలున్నా యితని రచన పఠించేవారు చాలామంది వుంటారు.

"వలపించుటే కాని వలచి దక్కవుగదా
కుసుమబాణునికైనఁ గోమలాంగి!
బయటిమాటలెకాని భావమీయవుగదా
అల కళానిధికైన నలరుబోడి!..."
"కొడుకులు గల్గుదాఁక నొక కొన్ని దినమ్ములు చింత... ...
... ... ... ... ... ... తను నోలి భజించని చింత తండ్రి కె
ప్పుడుగడుఁ జింత సేయుదురు పుత్రులు శత్రులుగాక మిత్రులే."

ఆయీ పద్యాలు కవిరాజమనోరంజనంలోనివి. కనుపర్తి అబ్బయామాత్యుని రచన. యితఁడు పేరుదగ్గిరనుంచినిన్నీ, కవికర్ణరసాయనాన్ని (సంకుసాల కవికృతం) అనుసరించినట్లు స్థూలదృష్టికి గోచరించినా, అతని రచన కన్న యితని రచనే మృదువైనది. కొన్ని ఘట్టాలు చదివితీరాలి. యే కొన్ని పద్యాలలోనో, యితరుల పద్యాలపోలిక లుండిన నుండుఁగాక. అంతమాత్రం చేత కవిని సహృదయులు తోసిరా జనరు. అసలు గ్రంథకర్త స్వకపోల కల్పితం కూడా కొంత వున్నదా, లేదా అని పరిశీలించాలి. భవతు. వుపక్రమించి నది కవుల కష్టసుఖాలు. వ్రాస్తూవున్నది మఱొకటీ కావడం లేదు గదా? లేదు. ఏ రచయితను గూర్చికాని మీరు (మిడిమిడి జ్ఞానంతో) ఆక్షేపించకండి. అందులోనూ తెలుగురచన విషయంలో మఱీ జాగ్రత్తగా వుండాలి సుమండీ!

"తెలుఁగు తెలుగఁని యద్దాన దిగుటెకాని
సంస్కృతమ్మనకన్న కష్టమ్ము హెచ్చు"

యీ మాట నేను యెంతో అనుభవం మీఁద వ్రాసిందిగా తెలుసుకోండి.

"కేవలగ్రామ్యపదముల నేవగించి
జనులు వాడెడి పదములు సమ్మతములు
కలవు లేవని పెనగ శక్యంబె? భార
తాదులను లేని పదములు నవనిగలవె."

(దేవీ భాగ. 1 స్కం. చూ.)

యీ చిన్న పద్యానికి వివరణం వ్రాయవలసివస్తే, గతం గతమైనా వున్న ఆయుర్దాయంచాలదు. సంస్కృతానికి ఘంటాపథా లెన్నో వున్నాయి. తెలుక్కి కేవలం దడియీతే తప్ప గతిలేదు. యెందఱో దీనిలో బొందబడ్డ వారున్నారు. దీనిబండారం యావత్తూ లక్ష్యజ్ఞానాన్ని పురస్కరించుకొని వుంటుంది. ఆ యీ జ్ఞానం నూట నాట యెవరికో గాని వుండదు. గొప్ప గొప్ప లక్షణజ్ఞులందఱూ తుదకి మహాభాష్యకారులు సహా లక్ష్యజ్ఞానానికే గౌరవాన్ని సూచించారు. యెంతసేపూ మీరు లక్ష్యజ్ఞానానికే ప్రయత్నించండి. లక్షణజ్ఞానం యెంత వున్నా చాలును.

"వైయాకరణాః పిశాచాః ప్రయోగమంత్రేణనివారణీయాః"

యింకొకటి యెందఱినో తెలుగు కవులను పొరపెడుతూవున్న రహస్యం నేను మీకు సందేశిస్తున్నాను. యిది తెలుగు చెప్పేవారు సంస్కృతం చెప్పడం ఆరంభిస్తే తటస్థపడుతుంది. గణాలు వగైరా తెలుక్కీ గీర్వాణానికీ వొకటే రీతిని వుంటాయి. కాని, వొక్క విషయంలో మాత్రం చాలా భిన్నంగా వుంటుంది. తెలుగుకవి తత్సమ సమాసం నాలుగు చరణాలూ కలిపి రచించినా ఆక్షేపించేవారుండరు (అట జని కాంచె భూమి సురుండంబర... కలాపిజాలమున్... చూ.) గాని సంస్కృతరచనలో ఆ ధోరణి తగిలితే చాలా అపహాస్యాస్పద మవుతుంది. సమాసమే కాదు. సంధికూడా అంతే. సంధికి ఉదాహరణం:

"శరదిందు వికాసమందహాసాం స్ఫురదిందీవరలోచనాభిరామామ్
అరవిందసమాన సుందరాస్యా మరవిందాసన సుందరీ ముపాసే."
ఆయీ శ్లోకంలో ద్వితీయచరణాంత్యం "రామామ్" అన్న దానికిన్నీ

"అరవిందసమాన" అనే దానికిన్నీ సంధిచేయలేదు. చేస్తేనో శుద్ధతప్పు.

"అర్ధాంతవర్జ మఖిలేష్వపి వృత్తకేషు"

అని వుంది. దీని వుత్తరార్ధం నా కిప్పటికిరాదు. నాకు చెప్పినవారికి వచ్చివుంటుంది.

నేను చదువుకోడానికి కాశీ వెళ్లివచ్చిన కొత్తఱికంలో (అహమేవ పండితః) వొక అష్టావధాన సభలో ప్రసక్తాను ప్రసక్తంగా అంతకు కొద్ది మాసాలనాఁడు పోటాపోటీగా గణేశ్వరునిమీఁద ఆరభటీవృత్తిలో రచించిన శార్దూలవిక్రీడితశ్లోకాలు నాల్గు చరణాలకూ సమాసం కల్పినవి చదివేటప్పటికి సంప్రదాయజ్ఞులైన వొకానొక వృద్ధులు "నాయనా, ఆసమాసం సంప్రదాయం యెఱిఁగినవారు అంగీకరించరు" అన్నారు. నేను ఆయన్ని బుకాయించి "అయ్యా! యిది తెలుఁగనుకున్నారేమో? సంస్కృతం. మీకు విషయం కాదు."

అనేటప్పటికి తెలుగులో తప్ప సంస్కృతంలో విశేషించి ప్రవేశంలేని ఆయన పాపం, (వీడితో టేమిటని) వూరుకున్నారు. సభలో మట్టుకు ఆయన్ని బుకాయించినా నాకు ఆయన ఆక్షేపణ సరియైనదే యేమో అనే శంక మాత్రం బాధిస్తూనే వుండడంచేత యెక్కడేనా నా శ్లోకంమాదిరి సమాసం కల్పినవి, లేదా, సంధి కల్పినవి మహాకవిప్రయోగాలు దొరుకుతాయేమో అని యెంతో శ్రద్ధగా గాలించడమే కాదు, కొందఱు పండితులను ప్రశ్నించాను కూడా. కాని నా సందేహం తీరనేలేదు. తుదకు అప్పటి నివాసగ్రామం యింజరానికి సుమారు కోసుదూరంలో వున్న కోలంకగ్రామకాపురస్థులు, శ్రీగోవిందవఝ్ఝుల రాజన్న శాస్త్రుల్లుగారు నా సందేహాన్ని తీర్చారు. వారుదాహరించిన కారికను (అర్థాంత వర్ణం)లోగడ వుదాహరించే వున్నానుగదా? తెలుగులో ధారాళంగా కవిత్వం చెప్పేశక్తి సామర్థ్యాలు కలవారు, అంతకన్నా కట్టుబాట్లు చాలా తక్కువగా (యతిప్రాసాదులలో) వుండే గీర్వాణకవిత్వం చెప్పక చెప్పక ఎప్పుడేనా జన్మానికల్లా శివరాత్రిగా వొక శ్లోకం రచించడం సంభవిస్తే యీ విధమైన చిక్కుకు లోనుగావలసి వస్తుంది. ఉభయభాషలలో కవిత్వం చెప్పేవారున్నూ పూర్వాపరాలు స్మార్తంచేయించే పురోహితులున్నూ వొకటే మాదిరి వారు. ఆ పురోహితులు పెండ్లిసదస్యం చేయిస్తూ వున్నారనుకోండి. అందులో సభాస్తారులనుగూర్చి–

"సర్వత్ర ఇమా న్యాసనాని సుఖాసనాని.
ఓం తథా ప్రాప్నువంతు భవంతః"

... ... ... ... ... ... ... ...

ఆయీ అన్యోన్య వాక్ప్రసారంలో ఆబ్దిక మంత్రపు కవులలోకి దారి తీసి అశ్లీలాన్ని ఆపాదించడం కద్దు. అందుకే యెంతటి స్మర్తలూ ఆయీ వుభయానికి యాజకత్వాన్ని వహించరు. ప్రస్తుతం మనకు ఉభయ కవిత్వ రచన, ఆయీ రచన తెలుగులో రెండుమూడు చరణాలకు సంధి కల్పడం దోషంకాదు. కనుకనే పెద్దన్నగారు కాదు నన్నయ్యగారు,

"దేవసములైన యనుజుల–తో విప్రులతో రథాళితో వచ్చి, అర
ణ్యావాసము చేసెదు ధర–ణీవల్లభ నీవు ధర్మనిశ్చితబుద్ధిన్.

యిందులో రెండవ చరణం చివరకున్నూ, మూడవచరణం ఆదికిన్నీ (అరణ్యావాసము చూ.) సంధి కల్పబడింది. ఆంధ్ర రచన కనక యిది నిర్దుష్టమే. లోగడ,

"శరదిందు... లోచనాభిరామామ్,
అరవింద... సుందరీ ముపాసే"

అనే దానిలో, "లోచనాభిరామా మరవింద" అజ్భిన్నం పరేణ సంయోజ్యం కల్పితేనో? చెప్పేదేమిటి కవి సంప్రదాయజ్ఞుడు కాడని-

"మీ మొగము చెప్పక చెప్పెదు నద్దిరయ్య'

అవుతుంది. సంస్కృత రచనలో యతి లేకపోలేదుగాని అక్కడికి పదం విరిగిపోవాలి. "కశ్చిత్కాంతా విరహగురుణా" యిందులో కాంతాశబ్దం 'తా'దగ్గర ఆపక, కాం, దగ్గర ఆపితే యతిభంగదోషం పడుతుంది. భర్తృహరి శ్లోకవ్యాఖ్యలో "సికతాసు తైలమసి" అని వుదాహరించాడు, వృత్త రత్నాకరంలో పృథ్వీ వృత్తంలో యిది కూడా అంగీకరించవచ్చు నన్నట్లు కనపడుతుంది. నేను బాల్యాదారభ్యాదీన్ని గూర్చి విచారిస్తూనే వున్నాను. వృత్తరత్నాకరంలో "యతిభంగో యథా" అనడానికిన్నీ, దానికి శ్లోకాన్ని వుదాహరించ డానికిన్నీ వుపపత్తి గోచరించనేలేదు. పృథ్విలో తప్ప యితర (శార్దూల విక్రీడితాదులలో) శ్లోకాలలో ఆయీ యతిభంగం కావలిస్తే జాతక గ్రంథాలలో తరచు (శనిరాహుభ్యాంతు కృష్ణాంగకః) దొరుకుతవి. ప్రకృతం ద్వితీయచరణాంత్య తృతీయచరణాదులకు సంధి కల్పవచ్చునా అనేది. అవాంతరంగా పదమధ్యేపాదావసానం వచ్చిచేరింది. ఇది సంస్కృత కవిత్వానికయితే చాలా ఆక్షేపణీయమేగాని తెలుక్కి చాలా సుగుణం అనిపించుకుంటుంది. కనకనే కవిబ్రహ్మగారు నీ కవిత్వంలో "మిన్నగా వుండే పద్యాన్ని" చదవవలసిందని యెవరో అడిగేటప్పటికి-

"సింగమ్మాకటితో గుహాంతరమునంజేట్పాటుమైనుండి మా
తంగ... నో జంగాంతార... వచ్చెంగుంతీసుత మధ్యముండు"

అనే పద్యాన్ని చదివినట్లు కవిపరంపర చెప్పుకుంటారు. ఈ పద్యంలో ఆదిచరణంలో సింగం అనేది తప్ప, తక్కినవన్నీ పదమధ్యే పాదావసానంగానే కుదరడం చాలా గౌరవనీయం. ఇట్టి కూర్పు తిక్కన వంటి కవికిగాని కుదరదని ఆంధ్రమహాకవులు యావన్మందీ యేకవాక్యంగా అంగీకరిస్తారు. సంస్కృత రచనలో రెండు మూడు చరణాలకు సంధి కల్పినవి యెక్కడా దొరకవని నా విద్యార్థి దశలో యెవరో నన్ను ఆక్షేపించడంవల్ల తెలుసుకున్నానుగాని, అలాగే కాకపోతే యీ రహస్యం తెలుసుకోకుండానే జీవ సమాప్తి పొందవలసిందే. విజయనగరం మహారాజులుంగారి దర్శనంనాటికే యీ రహస్యం తెలుసుకోవడం జరిగింది. అప్పటి నా వయస్సు 24 సంవత్సరాలు. ఆ మహారాజావారి మీదఁ జెప్పిన పద్యాలలో,

"ఒక్కొకచోట నొక్కొకనియొద్ద నొకొక్కొక మాట చొప్పునన్
జక్కఁగ సంగ్రహించితిమి ... ... ... ... ... ... ... ...
ఇక్కడఁదాపనేల వచియించితిమున్నది యున్న రీతిగన్"

అనే పద్యం కొంచెము మా పడిన పరిశ్రమను సూచిస్తుంది. యీ పద్యం మాత్రమే కాదు-

"చదువఁగావలె శబ్దశాస్త్రాదికమ్మును వీక్షింపఁగావలె విద్యలెల్ల.
... ... ... ... ... ... ... ... ... ... ... ...
కవులు కవులన్న మాత్రాన కవులుగారు
... ... ... ... ... ... ... ... ... ... ... ...
శ్రీమదానందగజపతి క్షితితలేంద్ర!"

అనే పద్యం కూడా మా కవితా సామగ్రిని తెలిపేదే. శ్రవణానందంలోని-

"కవితచెప్పఁగనేర్చుఁగఁ అవుదీఱఁగ వేయి గంటాలకైన నిష్కంటకముగ, ... ... ... అమ్మధుసూదనుండు."

అనే పద్యం కూడా మా దృష్టిలో కవిగా నెట్టి వ్యక్తి స్ఫురిస్తాడో తెలిపేదే. ప్రసక్తానుప్రసక్తంగా చాలా దూరం వచ్చాం. సంస్కృతంలో (సాధువు కాకపోయినా) రెండు మూడు చరణాలకు సంబంధం కల్పినది ఆధునికులది చూపి యీ వ్యాసాన్ని ముగిస్తాను.

"అపరాధ సహస్ర సహస్రకరా,
నపి భక్తవరాన్భవదంఘ్రినతి
ప్రవరా నవసీకృత మీశ్వరమాం."

యీ శ్లోకంలో రెండవ చరణం భవదంఘ్రినతి అనే పదంతో ముగిసింది. ఆ పదంతోటి-ప్రవరాన్ అనేపదం కలిపి సమాసం చెయ్యడం తెలుగు కవితాసంప్రదాయం. ఆయీ రహస్యం నేను పెద్దలవలన విని తెలుసుకున్నాను. మీకు తెల్పుతున్నాను. ప్రాచీనకవులలో నిట్టి రచన దొరకదు. నవీనులలో కూడ మృగ్యమే. సమాసమందు సంహిత నిత్యం. 'నిత్యా సమాసే' అని వుండడంచేత వివక్షాధీన మనడానికిన్నీ అవకాశం లేదు. నేను కష్టించి తెలిసికొన్న రహస్యం గదా! అని దీన్ని మీకు వ్యాఖ్యానించానుగాని యిప్పుడు-ఉభయ కవితా ప్రవీణులు లేనేలేరు. ఆంధ్రకవులు మాత్రమే వున్నారు. వారిలో కూడా పలువురు, ఛందోవ్యాకరణాది కట్టుబాట్లను ఉల్లంఘించడమందు కుతూహలం కలవారే. యితరుల దాఁకా యెందుకు నామట్టుకు నేను ఛందోవిషయంలో కొంతకున్నూ,

వ్యాకరణ విషయంలో కొంతకున్నూ సున్నచుట్టే కుతూహలం కలవాణ్ణే. చూడండీ యీ పద్యంలో యతి మ్రొక్కుబడి చెల్లించుకున్నట్టే వుందో మఱి యేలా వుందోను.

శా. "కేదారేశు భజించితిన్... పద్మాక్షు సేవించితిన్-యాదో నాథ సుతాకళత్రు బదరీనారాయణున్..." యతి సజాతీయ వర్ణశ్రవణం యేదో విధంగా కావడమేకాదు. భవతు. దీన్ని గుఱించి మఱొకప్పుడు మాట్లాడుకుందాం.

ద్రుతప్రకృతి సంధికి యెన్ని చోట్లనో ఆసీమాంతం చెపితే యెంతో అనుకూలంగా వుంటుందనుకుంటాను. అపార్థాలు అశ్లీలాలు రావడానికి ఆయీ సంధి కారణం. విద్వాంసులు చదువుకునేకబ్బాలలోవుంటే వుంటుంది గాక, స్కూలు విద్యార్థులు ఫైనలు లోపున చదువుకునే పుస్తకాలలోనైనా తగ్గించి ముద్రిస్తే చాలా బాగు. ముద్రణంలో తగ్గించినా టీచర్లు ఆయీ చోట్ల ఫలానా సూత్రంవల్ల ఫలానా విధంగా మారవలసివస్తుంది. ఆ మార్పు శ్రవణసుఖంగా వుండదని చేయలేదని బోధించడం వల్ల కొంత వ్యాకరణ జ్ఞానం కూడా అలవడుతుంది.

"తొలంగిచనియె నేమి చెప్పుదున్ గురునాథా!" అన్నచోట వింటూ వున్నవాడు కురునాథుడే కనక సరళంగా కాక పరుషం (కురు)గా విఱుచుకోవడం సుగమమే అయినా కుమ్మరి గురునాథుణ్ణి స్ఫురింప జేసికొని కవి బ్రహ్మగారికి ఆయీచోట రచన సాగలేక పోవడం వగైరా వొక చిన్న యితిహాసం కల్పించి గురునాథునికి విద్వత్పరంపర యిచ్చే పాండిత్య గౌరవం నాకూ యిష్టమే కాని అంతటి మహాకవికి యీ స్వల్ప సందర్భం దగ్గిర ధార ఆగడమంటే యేదో మాదిరిగా వుంటుంది. ఈలాటి తపనాలు లేకుండా కురునాథా! అనే వ్రాస్తే, 'నచ శంకా నచోత్తరమ్' ... ... గదా! భవతు. యీలా వ్రాస్తూవుంటే పెరుగుతూనే వుంటుంది. గ్రంథం.

కవులు చాలావరకు స్కూలుబాలుర పాఠ్య పుస్తకాలలో స్పష్టప్రతిపత్తికొరకు కొన్ని సంధులు విడుచుట చూస్తున్నాము. అది చాలా అభినందనీయంగా వుంది. అంతమాత్రంచేత గ్రంథకర్తకు ద్రుతప్రకృతిక సంధి కూడా తెలియదని అనుకునే ప్రాజ్ఞులు వుండరు. విద్యార్థులకు దానివల్ల కలిగే వుపయోగాన్ని వ్రాసేవున్నాను. శ్రీ శంభుప్రసాదుగారు నన్ను నేటి రచయితల గూర్చి సందేశాన్ని యివ్వవలసిందని చాలాసార్లు కోరివున్నారు. నా సందేశం "ముది మది తప్పితే మూడు గుణాలు" అనే లోకోక్తికి స్ఫోరకంగా వుంటుంది. దీన్ని లోకం యెంతవరకు విశ్వసిస్తుందో నాకు తెలియదు. ఆయన మాట తీసివేయలేక యీ కాస్త్రా వ్రాసాను. లోకం దీన్ని ఆదరిస్తే పిమ్మట యింకా వ్యాసాలు యీలాగే వ్రాస్తూవుంటే చూచుకుందాం.

★ ★ ★

# పదకవులు

అనఁగా గేయాలు రచించిన కవులు. వీరిలో మిక్కిలి రసవంతమైన వాక్కు కలవారు కనపడతారు. కాని ఆ రసం తెలుసుకోవలసివస్తే కొంత సామగ్రి సహాయంతో చక్కఁగా పాడేవ్యక్తి పాడినప్పుడే అవగతమవుతుందిగాని యెవరు పడితేవారు దాన్ని పద్యాలలాగా చదివితే అవగతం కాదు. (పద్యమేనా గాత్రమాధుర్యం బొత్తిగా లేని వారు చదివితే పదడయి పోతుందిగాని యేమేనా దీనిలాగ పదడుకాదు) దాన్నిబట్టి ఆ రసం సంగీతానికి సంబంధించిందే కాని అసలు దానికి సంబంధించింది కాదని కవులు పదకవిత్వాన్ని యీసడించారని తోస్తుంది. యీసడించడంలోనున్నూ యింతా అంతా కాదు. శ్రీనాథుఁడు యేలా యీసడించాడో చూడండి.

క. ముదివిటులు విధవలంజలు - పదకవితలు మాఱుబాసబాపనివారల్
చదువని విద్వద్వర్యులు - కదనార్భటవీరవరులు కడిదిపురమునన్.

యీ పద్యంలో నాలుగోచరణానికి అర్థం నాకిప్పటికీ తెలియనే లేదు. (యేదేనా పాఠాంతరం వుందేమో తెలియదు) గాని మొత్తం యేదో దురర్థం చెప్పక తప్పదని మాత్రం ప్రకరణాన్నిబట్టి తెలుసుకున్నాను. యెందఱో మహనీయులు పదకవులలో కనపడుతూవున్నా, శ్రీనాథుఁడంతవాఁడు యింత నికృష్టంగా యీసడించడాని క్కారణం గోచరించడమేలేదు. పద్యకవిత్వం కూడా శ్రుతితాళ సమన్వితంగా కుశలవులు పాడి శ్రీరామచంద్రుని మెప్పును పొందినట్టుగా పండితులు పరంపరగా చెప్పుకోవడం సర్వులూ యెఱిఁగిందే. పద్యకవిత్వానికి మొట్టమొదటి కవిత్వం వాల్మీకిరామాయణానికే కీర్తనలవలె పాడడంవల్ల గౌరవం కల్గినప్పుడు అసలు రాగతాళ సంబంధంగా రచియించినదాన్ని శ్రీనాథుఁడు యెందుకు యీసడించవలసి వచ్చిందో! అని నాకు సందేహం కలుగుతూ వుంది. పోనీ యీ పదకవిత్వాన్ని యే పామరులో తప్ప పండిత కవులు ఆదరించలేదేమో అనుకుంటే జయదేవుఁడు గీతగోవిందాన్ని రచించి యెంతో యశస్సును పొందివున్నాఁడు. గీతగోవిందంలో అక్కడక్కడ లయతో అవసరంలేని శ్లోకాలున్నూ వున్నప్పటికీ ప్రాధాన్యం కీర్తనలకే కనపడుతుంది. మనదేశంలో యీ గీతగోవిందాన్ని సక్రమంగా పాడేవారు లేరు. ఉత్తరదేశంలో వున్నట్టు వినడం. ఇప్పుడిప్పుడు ఆ దేశస్థులవల్ల విని మన దేశస్థులు కూడా కొన్నిటిని పాడుతూ వుంటే యెంతో హాయిగా గ్రామఫోను ప్లేట్లల్లో వింటున్నాము.

"ధీరసమీరే, యమునాతీరే, వసతి వనే వనమాలీ"

దీన్ని పూర్వం మన దేశంలో రేగుప్తిరాగంలో పాడేవారు. ఆపాడడం భాగోతపుకత్తుగా వుండేది. ఇప్పుడు యేదో రాగంమీఁద ఆతాళం మీఁదే పాడినది ప్లేట్లలో వింటే దానికిన్నీ దీనికిన్నీ సహస్రాంతం వారకనపడుతూ వుంది. దీన్నిబట్టి పదకవిత్వానికి గానంవల్ల యెక్కువ సారస్యం కలుగుతుందని వొప్పుకోక తప్పదుగాని అసలు సరుకు మంచిదికాకపోతే కేవలగానం యేంపనిచేస్తుంది? అసలు వంకాయలు గిజరు వంకాయలయితే వంటబ్రాహ్మఁడెంత ఆఱితేఱినవాఁడయితే మాత్రం ప్రయోజన మేముంటుంది? కాని ఆలా తోసివేయడానికిన్నీ వీలుకాదు. యేమంటారా? "తుమ్మచెట్టుమీఁద కాకి వాలింది తుపాకిదేరా కొడదాము" అనే గేయంలో యేం రసముంది? లేకపోయినా శ్రుతిలయలతో మేళగించి యేదో రాగం మీఁద పాడితే యెంతో హాయిగా వుండడమున్నూ అనుభూతమే. "తత్తదిమిత దిద్ది యని సదా, శివుఁడాడినాఁడె" అనే పల్లవిలో కవిత్వపు మాధుర్యం యేమి వుంది? వుండకపోయినా గాయకులు లోకాతీతంగా పాడి మెప్పిస్తారు. అంతమాత్రంచేత గేయకవిత్వంలో రసం వుండనేవుండనక్కఱ లేదనిన్నీ, శ్రుతిలయలే ఆభారాన్నంతనీ వహిస్తాయనిన్నీ అనుకోవడం యుక్తంకాదు. 1) గీతగోవిందం, 2) తరంగాలు, 3) అధ్యాత్మరామాయణకీర్తనలు, 4) ప్రహ్లాదనాటకం, 5) రామనాటకం యివి కొంత ప్రాచీనాలు. గరుడాచలనాటకం వగయిరాలు కొన్ని నవీనాలున్నూ వున్నాయి. వీట్లలో అధ్యాత్మరామాయణకీర్తనలు రచించిన కవి కవిత్వం తెలుఁగులో ఉత్తమస్థానాన్ని అలంకరిస్తుంది.

### రేగుప్తి - అట

ఈ సంశయము వారింపవే! జగదీశ! నన్ను
మన్నింపవే! భాసమానవిలాస! నేనిదె
నీ సత్కృపావలోకనమున, నీ సమయమునఁ
దెలియవలసినదే సమస్తమిదే ప్రశస్తము ॥ఈసం॥

తెలుఁగులో పద్యకవిత్వానికి భారతాని కున్నంత గౌరవమున్నూ, పదకవిత్వంలో ఆధ్యాత్మ కీర్తనలకు వుందంటే కాదని యే విజ్ఞులున్నూ అనరు. అంత్యనియమాదులతో మంచి లయపిక్కట్టుగావుండే యీ కీర్తనలు వేదంలాగు గురుముఖతః చెప్పుకొనిపాడేవారు నా చిన్నతనంనాటికి కొందఱు వుండేవారు 1) ఉప్మాక బ్రహ్మన్నగారు 2) ముక్కామల జోగయ్య గారు 3) చక్రవర్తుల చిట్టెయ్యగారు వగయిరాలు. కాని ఆ సంప్రదాయంగా పాడేవారు యిప్పుడు క్రమంగా అంతరించినట్లు కనపడుతుంది.

## సురట - ఆది

'చేరి వినవే! శౌరిచరితము గౌరి సుకుమారి గిరివరకుమారి'

యిది పరశురాములవారి యుద్ధాన్ని గూర్చిన కీర్తన. దీనిలో వుండే పదాలపొందిక వగయిరాలు గ్రంథకర్త సామర్థ్యాల్ని పూర్తిగా తెల్పుతాయి. యిందులో వుండే అంత్యప్రాస నియమం-

"బెండువంటి విల్లు నడిమికి రెండుచేసి పెల్లు"

అని ప్రారంభించి చాలా భాగం నడిపి నడిపి అఖరికి

"నా విల్లు దండివైరులకు ముల్లు"

అని ముగించి అంతతో కూడా ఆపక మల్లాదురితాన్ని ఉపక్రమించి అప్పుడు చరణాన్ని ముగించాడు. పద్యం వ్రాయడానికి కావలసిన సామగ్రి కంటె దశగుణంగా సామగ్రి వుంటేనేకాని ఆ యీ మాదిరి రచనతుదనెగ్గదు. (యీ కీర్తన వొక్కొక్కటి వొక్క శతకం అంత వుంటుంది) ఆ యీ పరిశ్రమ శ్రీనాథుడివంటి మహాకవికి తెలియకపోదు కనుక "ముదివిటులు" అని లోగడ వుదాహరించిన యీసడింపు ఎవరిదో అయివుంటుంది కాని బహుశః శ్రీనాథుండిది కాదేమో! అని నేను అనుమానిస్తాను. అయితే ఆధ్యాత్మకీర్తనలు శ్రీనాథుండి కాలానికి చాలా యిటీవలివై వుండడంచేత ఆయన యిది చూడక యేవో లాకలూ కాయల బాపతు "అక్షయపాత్రకు వచ్చినాయి మమ్మాదరింపుఁడమ్మా. మూతులు విఱవక ముక్కులువిఱవక ముష్టి పెట్టరమ్మా" అనేమాదిరి కీర్తనలుచూచి అలా యీసడించి వుంటాఁడేమో! అని కొందఱు అభిప్రాయపడతారనిన్నీ యెఱుఁగుదును. కాని అధ్యాత్మకీర్తనలు చూడకపోయినా వాల్మీకి రామాయణశ్లోకాలు కుశలవులు (కుశీలవౌ కుశలవ నామధేయౌ) గానంచేసి రాముణ్ణి మెప్పించారన్న విషయమేనా శ్రీనాథుఁడికి అవగతంకాకుండా వుంటుందా? అయితే కుశలవులు ఆ రచనను గేయంగా మార్చుకొన్నా అవి శ్లోకాలేకాని పుట్టుకచేత కేవల గేయాలుకావు కనుక వాట్లకియీ "ముదివిటులు" అనే పద్యపు యీసడింపు తగలదనిన్నీ కొందఱనవచ్చును. కాని యిప్పుడు ఖిలసంహితలాగు అంతరించిపోయినా శ్రీనాథుఁడి కాలానికి యీఅధ్యాత్మ కీర్తనలవంటి గేయరచన యేదోకొంత పూర్వకవులది వుండకుండా వుండదు. అలా వుండడమే తటస్థించి దాన్ని ఆ మహాకవి చూడడమే తటస్థిస్తే అలా ఆయన యీసడించడం పొసగదనే నేననుకుంటాను. శ్రీనాథుఁడిమాట అలా వుంచుదాం. వేణుగోపాల శతకం రచించిన కవి యెన్నాళ్లనాటి వాఁడోకాఁడు. అతఁడు ఆయీ ఆధ్యాత్మ రచన చూచేవుంటాఁడు. దీన్నిచూచినట్టి ఆధారం వెదికితే కాని చట్టన దొరకదుగాని తాళ్లపాకవారి గేయాలు చూచినట్టు-

"అల తాళ్లపాక చిన్నన్న రోమములైతె తంబురుదండెకు తంతులౌనె?"

అనే సీసచరణంవల్ల స్పష్టపడుతూవుంది. ఈచరణంలో వున్న- "రోమములు" కీర్తనలే. (తాళ్లపాక చిన్నన్నగారి గేయాలు యెంత మధురంగావున్నా ఆకవికి యిష్టంలేదన్నమాట) ఆయీ చరణం వున్న సీసం చాలా అందంగానే వుంటుందిగాని తక్కినచరణాలు- ఏలేశ్వరో పాధ్యాయుల - భట్టరాచార్యులు "అలరాచబిడ్డ-" అనేవి చాలా ముదురు పాకంలో వుండడంచేత వుదాహరించలేకపోయాను. యీ కవి పేరు తెలియదు. యీ వేణుగోపాల శతకం తప్ప యేపుస్తకం వ్రాశాఁడో అంతకంటే తెలియదు. గాని యితనికి వున్నంత ప్రపంచకజ్ఞానం యెక్కడోగాని సర్వసాధారణంగా యితరకవులకు లేదనేచెప్పవచ్చును. శతకాలలో యితని శతకం అగ్రస్థానాన్ని వహిస్తుంది. ఇతనికి కీర్తనల కవిత్వమే కాదు ద్విపద కూడా రుచించదు. అందుచేతే-

"ద్విపదకావ్యంబు ముదిలంజ దిడ్డిగంత"

అంటూ యేకడానికి మొదలు పెట్టాఁడు. (ఆయీ యీసడింపు వున్నప్పటికీ ద్విపదకవులను కవులచరిత్ర స్వీకరించిందిగాని గేయకవులను మాత్రం వెలివేసినట్టు బహిష్కరించింది. ప్రత్యేకించేనా యీ కవులచరిత్ర వ్రాస్తే బాగుంటుంది.) భవతు. అంతమాత్రంచేత జయదేవాదులు ఆమోదించిన పద కవిత్వం మట్టిగొట్టుకు పోవలసిందేనా? కొందఱు శ్లోకాలనూ, పద్యాలనూ కీర్తనలకింద మార్చి ఆనందించడంలో కొంత అర్థంవుందిగాని లేకపోలేదు. నిన్న మొన్న కీ॥ శే॥ లయిన అల్లంరాజు పేర్రాజు (కృష్ణగానచటికాభాగవతులుగారు) శ్రీకృష్ణ కర్ణామృత శ్లోకాలలో చాలా వాటికి చక్కని మట్లు యేర్పరచి శ్రవణానందంగా పాడడం చాలామంది యెఱిఁగిన విషయమే. అందులోనూ

## భైరవి - రూపకం

సజలజలదనీలం, వల్లవీ కేళిలోలం ॥సజల॥

అనేది పల్లవిచేసి పాడుతూవుంటే దీక్షితులవారి

"చింతయ మాకంద మూలకందం"

అనే కృతిని జ్ఞాపకం తెచ్చేది. కుశలవులు గాయకులు కూడా అనే సంగతి "కుశీలవౌ కుశలవ నామధేయౌ॥" అనేదానివల్ల స్పష్టమవుతూ వుందని లోఁగడ సూచించే వున్నాను. వాక్యరూపంగానో, ఛందోబద్ధంగానో వున్న వేదాన్ని సామవేదులు గానంతో మిళితం

చేయడం అనాదిసిద్ధంగానే కనపడుతూవుంది. అట్టిస్థితిలో మొట్టమొదటనే లయబద్ధంగా రచించిన గేయాల యెడల యిటీవలివారికి అనాదరం యెందుక్కలిగిందో బోధపడడంలేదు. అయితే అక్కడక్కడ వ్యాకరణ విరుద్ధ ప్రయోగాలుండడాన్ని బట్టి యీసడించారనుకుందామా అంటే; అదిన్నీ తగినంత హేతువుగా కనపడదు. 1) జగమేలే పరమాత్మ, 2) అంతారామమయం॥ మాదిరి ప్రయోగాలు పద్యకవుల కవిత్వాలలో కూడా కనపడుతూనే వున్నాయి.

చ॥ ఒకని కవిత్వమం దెనయు నొప్పులుఁదప్పులు నాకవిత్వమం దొకనికిఁ
దప్పుపట్టఁ బనియుండదు॥

అని సప్రతిజ్ఞంగా గర్జించిన రామలింగమే కాక అతని కంటె పూర్వ మహాకవులున్నూ పిమ్మటి మహాకవులున్నూ శనగపప్పులాగ వాడికొన్న క్త్వార్థక సంధిని వ్యాకరణం నిషేధించింది కదా? అంతమాత్రంచేత ఆయా కవిత్వాలయందెవరికేనా యీసడింపు కలిగిందా? అందుచేత అదిన్నీ కారణంగాదు.

ఆ. వె. గురువు లఘువుఁజేసి కుదియించి కుదియించి
లఘువు గురువుఁ జేసి లాగిలాగి
కవితఁ జెప్పినట్టి కవిగులామును బట్టి
ముక్కుఁ గోయవలయు ద్రొక్కిపట్టి.

అంటూ వొక ఆక్షేపణాన్ని తెల్పే పద్యం యెవరు చెప్పిందోగాని నా బాల్యగురువులలో శ్రీ కానుకుర్తి భుజంగరావు పంతులవారు చదువుతూ వుంటే విని వున్నాను. యీ ఆక్షేపణ గానమనే పేరు చెప్పేటప్పటికల్లా "తాటితో దబ్బనం" లాగు వుండేదేగాని దీన్నిబట్టే యీసడించేటట్టయితే సామవేదానిక్కూడా యీ యీసడింపు వర్తించవలసి వస్తుంది. ఆ వేదం గానం చేసేవారు తీసేదీర్ఘాలు యేగాయకులూ తీయనేతీయరు. కాబట్టి పద కవిత్వాన్ని పద్యకవులు యెందుకు యీసడించవలసి వచ్చిందో అని విచారిస్తే తగినంత హేతువు గోచరించడమే లేదు. తగినంత రసవత్తరమైన రచన పదకవిత్వంలో లేదేమో అనుకుంటే క్షేత్రయ్యకంటే రసవత్తరమైన కవిత్వాన్ని రచించిన పద్యకవులంటూ వున్నారా? ఈయన వెళ్లినన్ని శృంగారపోకడలు యే మహాకవి కవిత్వంలోనూ కనపడవు. ఈయనేకాదు యెందఱో రసవత్తరమైన కవులు పదకవిత్వం చెప్పినవారిలో వున్నారు.

"అలిగితే భాగ్య మాయె మరేమి వాఁ ॥డలిగితే॥
తలిరుబోఁడిరొ! వాని దండింప! గలన వాఁ ॥డలిగితే॥

యీలాటి సరసమైన కవిత్వం యే పద్యకవి రచించాఁడో వొక్కఁడి పేరు చెప్పవలసిందంటే చెప్పఁగలమా? యేదో వొక్కటి మచ్చుకు కనపఱిచాను. (రేపూ వత్తువుగాని పోరా నేఁటికి తాళి, వగయిరాలు చూచుకోండి) క్షేత్రయ్య కవిత్వంలో యిలాంటివి కొన్ని వందలున్నాయి. క్షేత్రయ్య శృంగార భక్తికోసం అవతరించిన మహాకవి. సంస్కృతంలో జయదేవ లీలాశుక నారాయణతీర్థ లేలాటివారో తెలుఁగులో క్షేత్రయ్య అలాటివాఁడు. పద్యకవుల కవిత్వంలో శ్రవణకటు ప్రయోగాలు- "శ్రోత్ర ఘచ్చటలు" వగైరాలు కుప్పతెప్పలుగా దొర్లుతాయిగాని పద కవుల కవిత్వంలో అలాటి శ్రవణకటువులు యెంతో వెదికితే యేమోగాని చట్టన దొరకనే దొరకవు. అసలే దొరకవని కూడా చెపుతాను.

హాస్యకవిత్వం చెప్పిన కవులు నలువురు వున్నారు.

"ఇందుకా? నీకుపంచాంగము చెప్పింది, యిన్నాళ్లనుసరించి యెద్దు తాకటఁబెట్టి మిద్దెటింటికి నిల్వుటద్దము తెచ్చింది పెద్దలఋణమటె! ముద్దుఁబెట్టు మటంటె మోము దిప్పుకొనేవు, కద్దటే యీరీతి కంచిగరుడసేవ ॥ఇందుకా॥"

యీ గేయంలో ప్రతీచరణం చివరా వొక్కొక్క లోకోక్తి వాడఁబడింది. యీలాటి హాస్యరస గీతాలేకాక జాతీయగీతాలు-

"అగ్గితిరుణాళ్లంట : అర్జునకతలంట"

అనే మాదిరివి చెప్పిన కవులున్నూ వున్నారు. కవి యేలాంటి వాఁడైనా సరే గేయం రచించడమంటూ వస్తే అది కైశికీవృత్తిలోనే నడుస్తుందిగాని యితర పెటుకు వృత్తులలో నడవకపోవడం వొక విశేషం.

"అనఘ! రాఘవ! కాముకుఁడనై అతివవలలను జిక్కితిని విను, వనమునకు ననిచి ప్రాణము లీ తనువునను మనవనెను భూపతి"

యిది అధ్యాత్మరామాయణంలోదే. దీనిలోనల్లా రెండు ఘకారాలున్నూ, వొక భకారమూతప్ప తక్కినవర్ణాలు గానానుకూలాలే. క్షేత్రయ్య కవిత్వంలో యీమాత్రమూ వత్తక్షరాలు పడవని చెప్పవచ్చును.

"తెలివి యొకరి సొమ్మా? యెందుకె విభుని తిరుగ పొమ్మంటినమ్మ"

యిందులో వక వొత్తక్షరం మాత్రమే కనపడుతుంది. ఇతనిగేయాలకు "మువ్వగోపాల పదాలు" అని వాడుక. యిదేపోలికలో వున్న మరి కొన్ని గేయాలుకూడా యితని పేరుతోనే వ్యవహరింపఁబడుతూ వున్నాయి.

"ఏరీతి బొంకేవురా! లేదని నాతో" ॥యేరీతి॥

యీ పదంలో "వేణంగిరాయ" అనే పేరుతో కృష్ణుణ్ణి వ్యవహరించడంవల్ల యిది క్షేత్రయ్యది కాదని విస్పష్టం. నవీనులలో రంపూరి సుబ్బారావుగారంటూ వకరు వుండేవారు. ఆయన రచించిన గేయాలకు "సింహపురి జావళీలు" అనిపేరు. కొంచెం పాకం పచ్చిగావున్నా శృంగార భావాలు యీ రసికాగ్రేసరుఁడు చిత్రించి గేయవాఙ్మయాన్ని పెంపొందించాఁడు. యీయన కాలంలోనే గబ్బిట యజ్ఞన్న లేక యజ్ఞనారాయణగారున్నూ వుండేవారు. ఆయన రచన కూడా శ్రవణపేయంగానే వుంటుంది. శ్రీదాసు శ్రీరాములుగారు పద్యకవులై ప్రసిద్ధివహించినా, పదకవిత్వాన్ని యీసడించి వదలిపెట్టలేదు. వీరి జావళీలు కూడా తెలుఁగుదేశంలో బాగా వ్యాపించే వున్నాయి. (పూర్వం పదాలని వాడేవాట్లని యిటీవల జావళీలని వాడడం మొదలుపెట్టారు. రచనలో కూడా యీ రెంటికీ భేదం వుంటుంది) ఆయీ కాలంలోనే సుప్రసిద్ధ హరికథకులు ఆదిభట్టవారున్నూ బయలుదేరి వున్నారు. వీరు ప్రాచీనపు మట్లలోనే రచన సాగిస్తూ యెక్కువరక్తిని కలిగించే గేయాలు ఆయా కథానుగుణంగా రచించి, గేయవాఙ్మయాన్ని పోషించి వున్నారు. త్యాగరాయకృతుల మోస్తరుగానే వీరి గేయాలు కూడా గురుశుశ్రూషా పూర్వకంగా అభ్యసిస్తేనే తప్ప కేవల వినికివల్ల స్వాధీన పడేవికావు. యీయన రచనను కొంచెం వుదాహరిస్తాను.

"బాలచంద్రమౌళి పాదముల్ విడక
కాలు నోర్చి వేగమె రమ్ము కొడుక! ॥బాల॥

అంగముశైత్యపైత్యము లంటనీక
గంగాభవాని నిన్ గాపాడుగాక ॥బాల॥

పవలు రేయి తాపము జెందనీక
రవిచంద్రములు నిన్ను రక్షింత్రుగాక ॥బాల॥

యింకా చరణాలు కొన్ని వున్నాయేమో? యీ గేయస్వారస్యాన్ని బట్టి నాకు యెప్పుడో విన్నంత మాత్రంచేత యిది ధారణకు వచ్చింది. ఇది ఆయనగాని, ఆయన శుశ్రూష చేసిన మరికొందఱు శిష్యులుగాని పాడుతూవుంటే వొళ్లు పరవశమైపోతుంది. (యీయన రచనలో యిలాంటివి యింకా యెన్నో వున్నా "తత్రాపిచ చతుర్థోఽఙ్కః" అన్నట్టు నాకు యీగేయం యెక్కువగా నచ్చింది) యీయనకు సంస్కృతాంధ్రాలయందేగాక మఱికొన్ని విదేశభాషలయందుకూడా మంచి పాండిత్యంవున్నా దాన్ని ఆయీ గేయాలలో చూపక తేలికశైలిలోనే రచించడంచేత యింతటి హాయిని కలిగించడానిక్కారణ మయిందని నేననుకుంటాను. మొత్తంమీఁద ఆలోచించిచూస్తే పండితకవి కానివ్వండి, కేవల

కవికానివ్వండి పదకవిత్వమంటూ చెపితే అది తేలిక పాకంలోనే వుంటుందిగాని, కఠినపాకంలో మాత్రం వుండదని నా అనుభవంమీఁద కనిపెట్టాను. మహా మహోపాధ్యాయులూ షడ్దర్శనీపార దృశ్వులూ అయిన శ్రీమాన్ పరవస్తు రంగాచార్యుల అయ్యవార్లంగారు రచించిన గేయాలే యిందుకు నిదర్శనం.

"స్వాంత మనెడి చంచరీకమా! స్వామిచరణ సరసిజముల పైని వ్రాలుమా! చంచరీకమ! సరసిజముల పైనివ్రాలుమా॥ రంగుగ నీవెల్లప్పుడు మంగళకరు శ్రీనివాసు, గాంగేయాంబరధారుని రంగార్యావన యనుచును. ॥స్వాంత॥

సంగీతానికి ముఖ్యంగా వత్తక్షరాలూ, ద్విత్వాక్షరాలూ అనుకూలించవు. వుదాహరించి చూపుతాను.

శ్లో. అభినవనవనీత స్నిగ్ధ మాపీతదుగ్ధం
దధికణపరిదిగ్ధం ముగ్ధ మంగం మురారేః
దిశతు భువనకృచ్ఛ్రచ్ఛేది తాపింఛగుచ్ఛ
చ్ఛవి నవశిఖిపింఛాలాంఛితం వాంఛితం నః॥

యీ శ్లోకం కృష్ణకర్ణామృత శ్లోకమే అయినా ఆయన శ్లోకాలలో నూటికి తొంభై తొమ్మిది శ్లోకాలు గానానుకూలాలే అయినా యిదిమాత్రం గానానికి విరోధిగాపడింది. యెక్కడేనా వొక అక్షరం వొత్తక్షరం పడితే చిక్కుండదుగానీ, విశేషించి పడితే చిక్కు వస్తుంది. వూపిరంతా దానికే వినియోగించవలసి వస్తుంది. (వొత్తక్షరాల ద్విత్వాలే కటువుగా వుంటాయి కాని యితరద్విత్వాలు కటువుగా వుండవు. రచించే కవి యివన్నీ పరిశీలించకపోయినా గేయాలలో మృదువర్ణాలే పడతాయి) తరంగాలలో యీ నియమాన్ని అంతగా పాటించినట్లు లేదు.

"రక్ష రక్ష అసురశిక్ష రాజీవదళాయతాక్ష
అక్షీణ కృపాకటాక్ష ఆశ్రితపక్షసంరక్ష"

వగయిరాలవల్ల పయిసంగతి స్పష్టపడుతుంది. యీ క్షకారం అంత కటుకుగాదు కాని అసలు కటువు కాకపోదు. చాలా మృదుపాకంలో నడిచినవీ వున్నాయి. వుదాహరిస్తాను.

కలయే యశోదే, తవ బాలం, వ్రజబాలక ఖేలన లోలమ్॥
కలయ సఖి సుందరం బాలకృష్ణం ॥కలయ॥
కృష్ణం గతవిషయ తృష్ణం జగత్ప్రభవిష్ణుం సమస్తలోక జిష్ణుం ॥కలయ సఖి॥

దీనిలో షకార ణకారద్విత్వం వున్నప్పటికీ లోఁగడ శ్లోకంలో చూపిన గకారధకార ద్విత్వానికిన్నీ చకార రేఫద్విత్వానికిన్నీ ఖర్చయినంత ప్రాణవాయువు దీనికి ఖర్చుకాదు. అంతేకాదు ఆద్విత్వాలు సక్రమంగా పలుకవలసివస్తే యెదటివాళ్ల మొగాలు చల్లబడవలసి వస్తుంది. కనక దీన్ని గూర్చి విస్తరించనక్కరలేదు. కవిత్వ విశేషాలలో శబ్దాలంకారం కూడా వొకటి కనక ఆ శ్లోకంలో వున్న ద్విత్వఘటితాను ప్రాసాలు కవులకు అభినందనీయాలేకాని గాయకులకుమాత్రం కావని చెప్పవలసివచ్చింది. జయదేవుఁడు సంస్కృతభాషలోనే రచించినా అష్టపదులు-

> నకురు నితంబిని గమనవిలంబనం అనుసర తం హృదయేశమ్
> ధీరసమీరే, యమునాతీరే॥

యే జయదేవునివంటి అవతారపురుషుఁడో సంస్కృతంలో కూడా గానానుకూలంగా రచన సాఁగించి లోకాన్ని మెప్పించినా, సర్వసాధారణంగా తెలుఁగుభాష గానానికి అనుకూలంగాని సంస్కృతం కాదని చెప్పక తప్పదు. అందుచేతే త్యాగరాయలవారు వుభయభాషా సాహిత్యం కల మహానుభావుఁడే అయి కూడా తెలుఁగులోనే రచన సాగించి తద్వారా తెలుఁగు దేశీయులనే కాకుండా అరవదేశీయులని కూడా తరింపఁజేశాఁడు. (కాని అఱవవారి నోళ్లల్లో బడడంచేత ఆయన సుప్రయోగాలెన్నో గాడిద గత్తఱగామాతి అర్థశూన్యాలు కావలసివచ్చింది,) కొంచెం వుదాహరించి వ్యాసం ఆపుతాను. 1) రామ నీ సమాన మెవరు? 2) రాముఁ డెందుఁ దాగినాఁడో 3) జగమేలే పరమాత్మ! యెవరితో మొఱలిడుదు ॥నగుమోము గనలేని॥ 4) చక్కని రాజమార్గము లుండగ సందులు దూరనేలనే వోమనస 5) కద్దన్నవారికి కద్దు, కద్దని మొఱలిడిన పెద్దలబుద్ధులు నేఁడబద్ధ మవునే ॥కద్దన్న॥ 6) నీనామరూపములకు నిత్యజయమంగళం 7) ఉపచారము చేసేవారున్నారని మఱవకురామ 8) శ్రీరఘువర సుగుణాలయ॥

ఇన్నికృతులలో పల్లవులుదాహరిస్తే వొకదానిలో కాఁబోలును "ఘు" అనేది వత్తక్షరం దొర్లింది. అదేనా ద్విత్వంగా (వాఘ్ఘురిః) వుపయోగించే పక్షంలో గానాన్ని నిర్బంధిస్తుందిగాని కేవలంగా ఉపయోగిస్తే బాధించదు. ఆయీ విశేషం సప్తస్వర బోధకాలుగా యేర్పడ్డ అక్షరాలలో - ధ - అనేది వొకటి వుండడంవల్ల కూడా మనం తెలుసుకోవచ్చును. కాని అవసరమైనప్పుడు మహాగాయకులు ఆ ధకారాన్ని దకారం చేయడమే గాదు, షడ్జ స్వరానికి బోధకంగా వుండే - స - అనే అక్షరాన్ని - చ - అని దంత్యంగా ఉచ్చరించడం గాయకులందఱూ యెఱిఁగిందే. గానమనేదిన్నీ శృంగారమనేదిన్నీ యెంతసేపూ మార్దవాన్ని సహిస్తుందిగాని పారుష్యాన్ని సహించదు. మహాక్రూరాలుగా వుండే వ్యాఘ్రాదుల ప్రవృత్తివల్ల

మొదటి విషయం గుర్తింపవచ్చును. రెండో విషయం గాయనులనుండి (గాయకుల నుండికాదు) తెలుసుకోవచ్చును. మృచ్ఛకటికలో ఖండితంగా – "ఆడదాని సంస్కృతమున్నూ, మొగాడి గానమున్నూ నచ్చదు" అన్న సిద్ధాంతం తోసివేయఁదగ్గది మాత్రం కాదు. పాండిత్య విశేషాదులు పురుషులయందే వున్నాయెక్కడోగాని స్త్రీ గాత్రమందు వుండే మార్దవం పురుష గాత్రమందు వుండదు. పురుషులు స్వరకల్పన చేసేటప్పుడు యెంతో పారుష్యం కనపడుతుంది కాని కీర్తన రచనకంటూ మొదలుపెడితే దానిలో మాత్రం యే పదకవికీ పారుష్యం దొరలడంలేదనే నా అనుభవం.

"హరా! నిన్ను నే నమ్మినాను గదరా
కరుణాకర పురహర ॥హరా॥

హరా నమ్మినానురా । కరుణఁ జూ
డరా మ్రొక్కుచుంటిరా । ముదమ్ముతో ॥హరా॥

వరాలతండ్రి నా మొరాలకింపవు
నిరాదరణకేమిరా? కారణము ॥హరా॥

యీకీర్తన నిట్టల ప్రకాశంగారిది. యీయన అత్యాశువుగా రచించడమున్నూ, యితరులు వ్రాసికోవడమున్నూ నేను స్వయంగా చూచిందే. ఇందులో పారుష్యాన్ని కలిగించే అక్షరాలు లేశమున్నూ లేవు. (ప్రతాప రుద్రీయాదులలో లాక్షణికులు వ్రాసిన పారుష్యాన్ని బట్టి చూచుకోకూడదు. విశేషించి వత్తక్షరాలు లేకపోవడమే చూచుకోవాలి) యింకో విశేషం. పద్యకవులతోపాటు యతిప్రాసలబాధ వీరికిన్నీవుంది. వుండడమంటే సీసగీతాదులలోవలె యేదో వొకటి వుంటేనే చాలును. చంపకమాలాదులలోవలె రెండూ వుండనక్కరలేదు. యిన్ని అక్షరాలకు యతి పెట్టవలసిందనే నియమం లేదుగాని "యత్రతాళ స్తత్రయతిః" అనే నియమం మాత్రం వుంది. అయితే ఆతాళం యెన్ని అక్షరాల పరిమితి కలదిగా వుంటుందో దాన్ని బట్టి యతిపెడుతూ వుంటారు. యీ పదకవులు కొందఱు కొన్ని గేయాలలో అర్ధావృత్తానికే యతి పెడుతూ వుంటారు. కొన్నింటిలో పూర్ణావృత్తానికి పెట్టడమున్నూ కలదు. క్వాచిత్కంగా నాలుగైదు ఆవృత్తులదాఁకా యతిలేనివిన్నీ కనపడతాయి. దీనికి లోఁగడ వుదాహరించిన – రేపు వత్తువుగాని – అన్నది వుదాహరణం. మాఱుమూలయతులు వీరెక్కడా వాడరు. వొక్కవర్గయతితోటే వీరి రచన యావత్తూ సాగిపోతుంది. ఏకతరయతి అనఁగా (యేఅక్షరానికి ఆ అక్షరమే యతిగా పెట్టేది) విశేషించి వాడతారు. పద్యకవులలాగ సులక్షణసారాదులు చదువవలసిన ఆవశ్యకత్వం కూడా వీరికి కనపడదు. "పద్యం పద్యస్య లక్షణమ్" అన్నట్టే యీ పదకవులు అందఱూ కాకపోయినా

చాలమంది "గేయం గేయస్యలక్షణమ్"గా రచన సాఁగిస్తారు. యిది నా అనుభవాన్నిబట్టి వ్రాసే వ్రాత. నేను యేవిధమైన లక్షణమూ యెరక్కుండానే యేవో గేయాలు చిన్నప్పుడు వ్రాసేవాణ్ణి యిటీవల వాట్లను పరిశీలిస్తే లక్షణానికి సరిపడే వుండేవి. "ఉపచారము చేసేవారున్నారని మఱవకు రామ॥ ఉప॥ "రామ నీసమాన మెవరు; రఘువంశోద్ధారకా॥ రామ॥"

యీకీర్తనలు త్యాగరాయలవి. వీట్లలో యే అక్షరానికి ఆ అక్షరమే యతిస్థానంలో పడింది. దీన్నే యేకతర యతి అని అన్నాను నేను; (అప్ప కవి రేఫకు రేఫ యతి చెల్లితేనే యేకతర యతి అన్నాఁడు ఇతరం కూడా కావచ్చునని నేననుకుంటాను) వర్గయతికంటే కూడా పదకవులు దీన్నే యెక్కువగా వాడతారు. అంతేనేకాని యేదోవిధంగా యతి సరిపెట్టే రచన, అంటే :-

శా. కేదారేశు భజించితిన్ శిరమునన్ గీలించితిన్ హింగుళా
పాదాంభోజములన్ బ్రయాగనిలయున్ బద్మాక్షు సేవించితిన్
యాదోనాథసుతా కళత్రు బదరీనారాయణున్-

అనేమాదిరిని శాస్త్రరీత్యా సరిపడిన్నీ అనుభవానికి సరిపోని యతులు యెన్ని వేలకీర్తనలు వెతికినా దొరకనే దొరకవని సప్రతిజ్ఞంగా చెప్పొచ్చును. దీన్నిబట్టి చూస్తే తెలుఁగుభాషతోపాటు- "తాటితో దబ్బనంగా" పుట్టిన యతిప్రాసలనే సహజాలంకారాన్ని వదలకుండా ధరిస్తూవున్నది పదకవిత్వమేగాని పద్యకవిత్వం కానేకాదంటే తప్పేమి? పద్యకవిత్వం కంటే కూడా ముందుగా పదకవిత్వమే పుట్టిందేమో? అని నేననుకుంటాను. కాని దీనికీ నీకేమిటాధారమంటే తగినంత తృప్తికరమైన జవాబు చెప్పడం కష్టం. కవిత్వం సంస్కృతంలో చెప్పినా కవి తెలుఁగుదేశస్థుఁడైతే అందులో యతిప్రాసలు వుండడం కూడా అనుభూతంగా కనపడుతూ వుంది. తరంగాలు చూచుకుంటే యీ విషయం బోధపడుతుంది.

1. ఏహి ముదందేహి శ్రీకృష్ణ! కృష్ణ! మాం
   పాహి గోపాల బాలకృష్ణ! కృష్ణ! ॥ఏహి॥
2. రామకృష్ణ గోవిందేతి నామసంప్రయోగే॥
3. స్వజనాదయాధృత దేహతయా
   విహరంత మమర మిహ భూతలే
   వ్రజభువి రాససమయరసపండిత
   గోపవధూకృతమండలే ॥పరమిహ॥

ఇంకా తరంగాలలో యిట్టివెన్నో వున్నాయి చూచుకోండి. ఆయీ సందర్భం పదకవిత్వ రచనానికి మాత్రమే, పద్యరచనకు సంబంధించదు, పద కవిత్వమేనాసరే కవి తెలుగు దేశీయుఁడుకాకపోతే అతఁడు యతిప్రాసలకోసం ప్రాకులాడఁడు. యిందుకు జయదేవుని (ఇతడు ఓఢ్రుడు) గీత గోవిందం చూచుకోండి "ధీరసమీరే" అన్నది లోఁగడ వుదాహరించేవున్నాను. ఆదేశపు కవులు హిందీ సంప్రదాయాన్ని బట్టి పోతారు. అందులో అంత్యప్రాస ముఖ్యం. దాన్ని జయదేవుఁడున్నూ ఆమోదిస్తాఁడు. అధ్యాత్మ రామాయణంతో పాటు గౌరవించతగ్గ పదకవిత్వం మృత్యుంజయ విలాసం వొకటి వుంది. ఇది గోగులపాటి కూర్మకవి రచించింది. మనదేశంలో యిప్పటి లాగ హరికథలు లేనప్పుడు యిదే ఆ స్థానాన్ని అలంకరించేది. ఇప్పటి హరికథకుల కవిత్వాలేవీ దీనితో దీటుకావు. కాని పాతిక ముప్పయ్యేళ్ల నుంచి దీనిప్రచారం చాలా తగ్గిపోయింది. పద్యకవిత్వాలకంటె పదకవిత్వాలు గుర్వపేక్ష లేకుండా చదువుకొని అర్థం చేసుకోడానికి వీలుగా వుంటాయి. నాకు ఆంధ్రానికి గురువులీ పదకవిత్వాలే. వ్యాకరణం స్కూల్లో చదివిన వెంకయ్య వ్యాకరణమే. తరువాతేనా భారతం ప్రత్యక్షరమూ చదివి వ్యాకరణపులోటు తీర్చుకున్నానుగాని బాలవ్యాకరణం చదివికాదు. నేను తెలుఁగు పండితుఁడుగా పనిచేసే రోజుల్లో యెన్నఁడూ సూత్రాలమీఁద శిష్యులకు వ్యాకరణాన్ని బోధించనేలేదు. సాలు ఒకటికి రెండు మూడు రోజుల కంటె దీనికోసం ఖర్చుపెట్టేవాణ్ణి కాను. యెవళ్లకోగాని యీ గొడవ తలకెక్కదు. యిది కంగా బంగా రావడంకంటే అసలు రాకపోవడమే మంచిది. యీకంగాబంగా వచ్చి పూర్వపక్షాలకు వుపక్రమించేవారు వృథాగా తుదకు చిక్కులో పడతారని ప్రాజ్ఞలోకానికి యిదివఱకే తెలుసును. కనక విస్తర మనవసరం. పదకవిత్వం తప్పుల తడకగా వుంటుందని అనాదిగా అప్రతిష్ఠ వుంది. కనకనే జయదేవుఁడికంటే పూర్వుఁడు గోవర్ధనాచార్యులు.

"కి మపభ్రంశేన భవతి గీతస్య... కిం దారిద్ర్యేణ భవతిదయితస్య" అన్నాఁడు. కాని పదకవిత్వంలో వుండే తప్పులు చాలాభాగం గాయకులవిగాని అసలువారివి కావు. అందులోనూ త్యాగరాయాది మహాగాయకుల కొంప తీసినవారు దాక్షిణాత్యులు. పద్యకవులు ఆమోదించిన వ్యావహారికాలు పదకవులు బహుస్వల్పంగానే ప్రయోగించి వున్నారు. రసగ్రహణ పారీణులు వాటిని గణించరు. పద్యకవుల తలదన్నే పదకవులు (త్యాగరాయాదులు) యెందఱో వున్నారు. శ్రీహరినాగభూషణంగారి వంటి సంగీత సాహిత్య పరిపూర్ణులెవరేనా పదకవుల జీవిత చరిత్ర వ్రాస్తే బాగుంటుందని నాతలపు. నారాయణదాసుగారు వ్రాస్తే మరీ బాగా ఉంటుందిగాని ఆయన నాకన్నా చాలా వృద్ధు. వీరేశలింగంగారు కవి జీవితాల్లో వీనిని అసలే స్పృశించక పోవడం యెందుచేతో. భవతు. పృథక్పాకానికి అవకాశం కల్గించినట్లయింది. కనుక సంతోషిద్దాం.

★ ★ ★

# కవిసన్మానం

స్వదేశోద్యమం ప్రారంభమైనాక మన ఆంధ్రదేశంలోనే కాదు; యితర దేశాలలో కూడా కవులకు సన్మానాలు జరుగుతూవున్న సంగతి అందఱూ యెఱిఁగిందే. ఆ సన్మాన సందర్భంలో ఆయా కవులకు కొన్ని బిరుదాలుకూడా యివ్వడం కొన్నిచోట్ల జరుగుతూ వుంది. ఆ బిరుదాలు పూర్వకాలంలో వుండే బిరుదాలను అనుసరించే వుంటూ వున్నాయి గాని వాట్లను వ్యతిరేకించి మాత్రం వుండడంలేదు. ఇట్టిస్థితిలో 6వ అక్టోబరు 1937 సం॥ ఆంధ్ర వారపత్రికలో "కుక్కలవల్ల లాభమేమిటి?" అనే శీర్షిక కింద కొన్ని మాటలు కుక్కలనుగూర్చి వ్రాస్తూ ఆ వ్యాసకర్త బుద్ధి పూర్వకంగా కాదేమో? కాని కవులకవిత్వానికిన్నీ కుక్కల అఱపులకున్నూ అసకృదావృత్తిగా పోలికను వుపపాదిస్తూ జనరల్‌గా కవుల నందఱిని కుక్కలనుచేసి వదలిపెట్టారు. "న దుఃఖం పంచభిస్సహ" కనక సర్వసామాన్యంగా వున్న వ్యాసకర్తగారి వుల్లేఖానికి యెవరుగాని విచారింపవలసి వుండనప్పుడు ఆ కుక్కల్లో వకకుక్క కలగఁజేసుకొని యేవో రెండఅపులు అఱవడం అవసరమే అయినను అసలు నేను అరవజాతిలో వాణ్ణి కావడంచేత కొంచెం అఱిచినందుకు వ్యాసకర్తగారు నన్ను క్షమించవలసిందని ప్రార్థిస్తాను. వ్యాసకర్తగారి వ్యాసంలో వున్న కొన్నిమాటలు మచ్చుచూపుతాను.

1) ఓ కుక్కకు యేం దురద పుట్టిందో? ... ... మొదలు పెట్టింది <u>కవిత్వం.</u>
2) అందులోనుంచి జంటకవివచ్చి అందుకుంది రెండో<u>పాదం</u> మఱో కుక్క.
3) చివరపాదంలో పేరుతో సహా ఝుమాయించి కొట్టింది పద్య<u>పాదాలన్నీ.</u>
4) మఱో శ్వానకవితల్లజుఁడు బయలుదేరాఁడు తీర్పుదిద్దడానికి.
5) ఆపళంగా వేఁడెక్కింది కవిత్వవాతావరణం. వీటి దుంపతెగా! వూరుకుంటయ్యా? పంచరత్నాలు, నవరత్నాలు వ్రాసుకొచ్చినయి.
6) అదికాదండీ కవిత్వం ప్రపంచానికి అంత అవసరమే అయి...

వోహో పొరపాటు చేస్తున్నానే! వ్యాసకర్తగారి మాటలు చూపడానికి మొదలుపెట్టాను. వ్యాసమంతా యీ కుక్కల అఱపును కవిత్వంతో అభేదంగా సమర్థించడంతోటే

ప్రవర్తించింది. వుదాహరించవలసి వస్తే నాలుగుకాలాలున్నూ వుదాహరించవలసి వస్తుంది గదా! అందుచేత ఆ పని పనికిరాదు. యీలా వ్రాయడం యేదో ప్రౌఢత్వం అనే తాత్పర్యంతో వ్యాసకర్తగారు వ్రాసివుంటారు కాని యేవ్యక్తినిగాని యే సంఘాన్ని కాని మనస్సులో పెట్టుకొని వ్రాసినట్టు నాకు తోఁచదు. "ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః" ఆపద్ధతిని వ్యాసకర్త వుద్దేశ్యము విమర్శనార్హం కాదు. కాని "శుచిర్విప్రశ్శుచిః కవిః" అంటూ వేదందగ్గిరనుంచీ పరిశుద్ధపదార్థంగా అంగీకరిస్తూ వున్నకవిజాతిని పరమాపవిత్రమైన కుక్కలనుగా లోకానికి ప్రదర్శించడానికి యేర్పడ్డ యీవ్యాసాన్ని పరిశీలించకుండా పత్రికాప్రవర్తకు లేమని ప్రకటించారో? కొంచెం విచారించవలసి వుంటుంది. కాని వారు మాత్రం ప్రతీవ్యాసాన్ని పరిశీలిస్తూ వుంటారా? గవర్నమెంటువల్ల చిక్కువచ్చే వ్యాసాలే కొన్ని ముందు ప్రచురించి తరవాత చిక్కు తెచ్చుకుంటూ వుండేవి వుంటూ వుంటాయికదా! అందుచేత వారిని అడిగినా ప్రయోజనం లేదు. వ్యాసకర్తగారి వుద్దేశాన్ని గురించే మనలో మనం కొంత చర్చించుకుని చూదాం.

శ్లో. "విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే గవిహస్తిని
శుని చైవ శ్వపాకేచ పండితా స్సమదర్శినః"

అన్న గీతవాక్యాన్ని బట్టి గోవున్నూ, కుక్కనూ వకటేరీతిగా చూడడం దోషాపాదకం కాదని తేలడమే కాకుండా పైఁగా విజ్ఞానుల తాత్పర్య మైనట్టుకూడా కనపడుతూవుంది. కనక విజ్ఞానాగ్రేసరులైన వ్యాసకర్తగారు కవులను కుక్కలుగా చిత్రించివుంటారా? బహుశః ఆశ్లోకతాత్పర్యం తక్కువ జంతువును కూడా యెక్కువ జంతువులతోపాటు సమ్మానించడమే కనక,

శ్లో. శ్వాన కుక్కుట మార్జాల పోషకస్తు దినత్రయమ్
ఇహజన్మని శూద్రస్స్యా చ్చండాలః కోటిజన్మసు.

అనేరకంతో చేరిన కుక్కలకు గౌరవం కలిగించడమే వ్యాసకర్తగారి తాత్పర్యమనుకుంటే ప్రస్తుత కాలానుగుణ్యంగా కూడా వుంటుందిగాని వ్యాసకర్తగారి కొన్నివాక్యాలు దీనికిన్నీ అనుకూలించడంలేదు. "1) వీటి దుంపా తెగా, 2) వీటితాడు తెగా వీటిని యెట్లా పుట్టించేఁడో? దేముఁడు" ఇత్యాదివాక్యాలు వ్యాసకర్తగారికి కుక్కలను గొప్పచేయాలనే తలఁపున్న దనడానికి వప్పుకోవు. యీ ఘట్టంలో కొన్ని వాక్యాలు కవుల కొంపలకే కాక గాయకుల కొంపలకు కూడా వ్యాసకర్తగారు అగ్గిదాఁకొల్పే వుద్దేశంతో వున్నట్టు కనపడతాయి. వకటి వుదాహరిస్తాను.

1) "ఒకసమయం సందర్భం లేకుండా ఒకటేరాగం, ఒకటే మెడపట్లు, ఒకటే తదరినాంతోం; పైఁగా త్యాగయ్య మాదేశంలో పుట్టాcడని గర్వం"

కవులను గురించిన వాక్యాలకన్న ఈ వాక్యం యీ వ్యాసకర్తగారికి కొంత వుద్దేశం లోపల వున్నట్టే సూచిస్తుంది. త్యాగయ్య పుట్టినదేశం అఱవదేశం కనక ఆ మాటనుబట్టి దక్షిణాదిగాయకులను తట్టాబాజీచేసే వుద్దేశంతో వ్యాసకర్తగారి లేఖిని ప్రవర్తించిందను కోవడానికి అవకాశం వుంది. మొత్తం వ్యాసకర్తగారికి, కవులన్నా గాయకులన్నా బొత్తిగా పడదని ఆయా వాక్యాలు చెపుతూవున్నాయిగాని కొన్ని మాటలవల్ల యీయన అంతో యింతో యీ రెండిటియందున్నూ ప్రవేశం కలవారనికూడా తేలుతూవుంది. కవులకూ కుక్కలకున్నూ పోలిక చెప్పడానికి యింతవరకు నాకు ఆధారం అంత పనికివచ్చేది కనపడలేదుగాని గాయకులకుమాత్రం వకాయన చెప్పిన సంగతి జ్ఞాపకం వస్తూవుంది. దాన్ని వివరిస్తాను. భైరవరాగమంటూ వకరాగం వుందికదా! ఆరాగం కుక్కల ధ్వనులనుబట్టే ఏర్పడ్డదని శ్రీకృష్ణగానచటికా భాగవతులు సెలవిస్తూవుంటే విన్నాను. భైరవశబ్దం కూడా దాన్ని తెలుపుతూనే వుంది. ఆ రాగాన్ని పాడని గాయకులు వుండరు కనక యీ "బదరీబాదరాయణ" సంబంధాన్నిపట్టి వ్యాసకర్తగారి రచన కొంత సమర్థనీయంగా తోస్తుంది. వ్యాసకర్త సంస్కృతాంధ్రాలు అప్రధానంగా నున్నూ, యింగ్లీషు ప్రధానంగానున్నూ అభ్యసించినవారుగా తోస్తారు. సంస్కృతాంధ్రాలు చదివినవారికంటె యింగ్లీషు చదివినవారి రచన మృదువుగా వుంటుందని పలువురంటారు. నాకు ఇంగ్లీషు రాకపోవడంచేత వ్యాసకర్తగారి రచనయందుండే మార్దవం పొడకట్టడం లేదేమో? ఆసంగతిని వ్యాసకర్తగారే వివరిస్తారు కనక విస్తరించేది లేదు. కవులను కుక్కలను చేయడానిక్కూడా వక ఆధారం దొరికింది. సుమారు యిప్పటికి యిరవై యేళ్లనాcడు వొకానొక సంస్థానంలో దివాన్‌జీగారి యింటివద్ద దివాన్‌జీ గారికి సూత్రభాష్యం పాఠం చెప్పడానికి వొక విద్వత్కవిశిఖామణి దయచేశారు. ఆ సమయంలో అక్కడ ఒక వుద్యోగి మంచి వాచాలకతాశక్తి కలవాcడు, అంతో యింతో కవిత్వంచెప్పేవాcడు, హాస్యప్రాయంగా మాట్లాడేవాcడు, దివానుగారితో బాగా చనువున్నవాcడు కూర్చుని వున్నాcడు. యీయన వచ్చిన కవిశిఖామణిని "దయచేయండి కవిశునకంగారూ!" అని సగౌరవంగా ఆహ్వానించేటప్పటికి దివాన్‌జీగారు నిలువునా నీరయిపోయి– "సరిలే! నేర్చుకున్నావు, నీకు సమయా సమయాలుగాని, యెవరి నేమాట అనాలో, యెవరిని యేమాట అనకూడదో అనే పరిశీలనగాని బొత్తిగా తెలియదు, యెల్లప్పుడూ వొకటేహాస్యం దిక్కుమాలినహాస్యం" అంటూ చీవాట్లు పెట్టడానికి ఆరంభించేటప్పటికి, ఆ తాబేదారు లేశమూజంకక– "యేమిటీ? నాకా తెలియకపోవడం మీకా? వినండి. పూర్వపు రాజులు వేలకువేలు వెచ్చించి యేనుcగులను కొని వాట్ల

పోషణకు వేలకువేలు ఖర్చుపెట్టేవారు. ఇప్పుడో? వున్న యేనుఁగులను అమ్మివేయడమే కాకుండా వేలకువేలు ఖర్చుపెట్టి రకరకాలు కుక్కలను కొని వాట్ల పోషణకు వేలకువేలు ఖర్చుచేస్తూ వున్నారు. ఆకాలంలో సమర్థులైన కవులను అష్టదిగ్గజాలని వాడడం గౌరవంగా వుండేది. యీ కాలంలోనో? ఆపేరుకు గౌరవంలేదు. రాజానుమతోధర్మః కాఁబట్టి శునకపదమే బాగుంటుందో? మరోపదంబాగుంటుందో చూడం"దని వుపన్యసించడానికి మొదలుపెట్టేటప్పటికి దివాన్‌జీగారు 'పక్కున' కడుపు పగిలేటట్టు నవ్వారఁట! యీ యితిహాసాన్ని బట్టి చూస్తే వ్యాసకర్తగారి రచన సమర్థనీయంగా తోస్తుంది. యింకా లోఁతుకు పోయి విచారిస్తే - "నానృషిః కురుతే కావ్యమ్" అని వుండడంచేత కవులు ఋష్యంశ సంభూతులని తేలుతుంది. ఆఋషి తండ్రిపేరు శునకశబ్దంకాకతీరదు. యిదిన్నీ శునశ్శేఫ-శునఃపుచ్ఛ-శునోలాంగూలపదాలతో వ్యవహరింపఁబడే ఋషులు వేదకాలంలోనే వున్నట్టు వేదమే ప్రమాణంగా కనపడుతుంది. యీ శబ్దాలు సాధించడానికే "శేఫ పుచ్ఛలాంగూలేషుశునః" అంటూ పాణిన్యాచార్యుల వారు వకసూత్రాన్ని నిర్మించి వున్నారు. యీ కాలంలో క్రమంగా ఋషికులజులైన బ్రాహ్మణుల గౌరవం తగ్గినట్టే పూర్వకాలంలో ఋషులంతగా గౌరవించిన శునకగౌరవం కూడా తగ్గిపోయిందని వ్యాసకర్తగారు ఆలోచించి మళ్లా వాట్ల గౌరవం వాట్లకు నిలిపే వుద్దేశంతో రచన సాగించి వుంటారేమో? మొత్తం యివన్నీ వుత్ప్రేక్షలు, అన్యబుద్ధి అప్రత్యక్షంకదా! యిప్పటి వాళ్ల కవిత్వం బొత్తిగా నచ్చక వ్యాసకర్తగారు వారి యేవగింపును యీద్వారాగా వెలిపుచ్చినట్టు తోస్తుంది. గాన విషయం కూడా డిటోగానే తోస్తుంది. అయితే వారి అభిప్రాయం యిది కాదేమో? కాదని వారు చెపితే మాత్రం వచ్చేసువాసన ఆఁగుతుందా? ఆఁగదు. అయితే సర్వజన సాధారణంగా ఆహ్లాదానికి యేర్పడ్డ సంగీత సాహిత్యాలమీఁద వ్యాసకర్తగారికీ ద్వేషాని క్కారణమేమో? అదిన్నీ విచారణీయమే. దానికి సమాధానం కనపడుతుంది, యేమిటంటే ఆ విద్యలను వీరు ద్వేషించడంలేదు. ప్రస్తుతం ఆవిద్యలను ప్రకటించేవారి ప్రజ్ఞాలోపాన్ని ద్వేషిస్తున్నారంటే సరిపోతుందిగా! ఆ సరిపోతుంది. కాని ఆయన తరపున మనమా? జవాబు చెప్పడం. ఆయనే చెపుతారు, లేదా? పత్రికవారేనా చెపుతారు. వారూ చెప్పరు. వీరూ చెప్పరంటారా? యీ కాలంలో కవులకున్న గౌరవ మింతే కాఁబోలు ననుకోవడమే. వ్యాసకర్తగారి వ్యాసాన్ని పలువురు కవులు చదివి వుంటారుకదా! వారెవరున్నూ కిక్కురుమనక వూరుకుంటే మీరే దీన్ని కదపడం యెందుకు? అనే ప్రశ్నకు జవాబు చెప్పడం నామీఁద వుంటుంది. జవాబు కేముంది? యెవరు దీన్ని కదిపితే ఆ ప్రశ్న వారికే వస్తుంది. తగినంత వుద్దేశం లేకపోయినా వ్యాసకర్తగారికి కవులంటే పరమాసహ్యం అన్నంత వరకు దొంగాఁడి చేతులో పెట్టినా సారం తేలకమానదు. పయిగా ఆయన వుద్దేశాన్ని బట్టి చూస్తే కవి గాయకులంటే

గడ్డిపరకలకన్నా కనిష్ఠంగా కనపడుతూ వున్నట్టు విస్పష్టమవుతుంది. అలా కనపడితే కనపడనివ్వండిగాని ఆసంగతిని బయట పెట్టడం యెందుకో? నాకు గోచరించడంలేదు. అంత నీచంగా కనపడుతూవున్న కవుల సన్మానాల్లో పాలుగొనకపోవచ్చును, లేదా? జరిగే సన్మానాలను తగినంత యత్నంచేసి ఆఁపుచేయవచ్చునుగాని దిక్కుమాలిన కుక్కలతో సామ్యం చెప్పడం యెందుకోసమో? కొందఱు యెక్కువ ప్రౌఢంగా మాట్లాడడానికి మొదలు పెట్టి తుదకు– "టెంకాయ పిచ్చికొండ" చేయడమున్నూ లోకంలో కనపడుతుంది. ఇది ఆ తెగలోకే చేరుతుందేమో? కొందఱు భక్ష్యపదార్థాలను పోల్చి మాట్లాడడం కలదు. ఆలాగే కుక్కల అఱుపుతో కవుల కవిత్వాలకు చుట్టరికం కల్పివున్నారేమో? వ్యాసకర్తగారు. యేమేనా యీవ్యాసం వ్రాయడం కవులని తిట్టడానికి తప్ప కుక్కలని తిట్టడానికని కనపడడం లేదు. చూడండీ! యీ వాక్యాన్ని–

"ఎప్పటినుంచో ఉన్నవాణ్ణి పండితుణ్ణి నేనిక్కడ వుండఁగానేనా? మీ ఆటలు సాగడం అంటూ మిఠాయిదుకాణం పొయిలోనుంచి దూకింది మఱోకుక్క"

యీ వాక్యం పండిత కవులమీఁద వ్యాసకర్తగారికి వున్న కోపాన్ని పూర్తిగా వెల్లడిస్తూ వుంది.

"ఇంతలో మొరుగుడు శాస్త్రంలో మర్మం తెలిసిన మఱో కవి తల్లజుడు" అనే వాక్యం చెప్పనే అక్కరలేదు. వెనక శ్రీనాథుగారు కొండవీటిలో యెక్కడపడితే అక్కడే కవిత్వం చెప్పేవాళ్లు బయలుదేరడం చూచి వక గాడిదను వుద్దేశించి – కొండవీటిలో గాడిద! నీవునున్ గవిని గావుగదా? అంటూ ఒక హేలగా వక పద్యాన్ని చెప్పినట్టు వినడం. అయితే ఆయన లోకోత్తరుఁడైన కవి కనక ఆయన దృష్టిలో సామాన్యులు నచ్చక ఆలా చెప్పినా కొంత సమర్థనీయం కావచ్చు. వ్యాసకర్తగారు అలాటి మహాకవి అని తోఁచడంలేదు. అంతటి మహాకవి కాదు కొంతటికవేనా అయివుంటే – "తపోచిహ్నాలు" అని వ్రాయ తటస్థించదనుకుంటాను. వ్యావహారికభాషలో యెలా వ్రాస్తే యేముంటాది వ్యావహారిక భాషలోనేనా యీలాటిలోపాలు సహ్యాలు కావు. వాటి జవాబు చూస్తేనేకాని యీ వ్యాసం వారెందుకు వ్రాసిందీ తేలదు. జవాబులుగా వ్రాసిన మాట మాత్రం సత్యం. యెవరుగాని దీన్ని– "కాలినిపోయేదాన్ని నెత్తినిరుద్దుకో" వలసి మాత్రం లేదుగాని మొత్తం కవులందఱు కలిగించుకోవలసినంత అనాలోచన లేదా? తొందరపాటు దీనిలో కనబడుతూంది. కవుల తరువాత గాయకులకున్నూ, వారి తర్వాత సన్యాసులకునూ కలిగించుకోవలసిన ప్రసక్తి దీనిలోవుంది. యెవరిక్కావాలి? దీరి కూర్చున్నవాణ్ణి కనక తోఁచీ తోఁచని యీ మాటలు రెండూ నేను వ్రాశానుగాని యితరులు కలగఁజేసుకోరు. ఆలా అనడానికిన్నీ వల్లకాదు.

వెనక "ఆంధ్రకవుల అపరాధాలు" అంటూ బయలుదేరితే ఊరుకున్నారా యెంతవఱకు చేయాలో అంతవఱకున్నూ చేశారుగదా? యీ వ్యాసకవిగారు యేదో వక విధమైన కవిత్వం లోకాన్ని వుద్ధరిస్తుందనే నమ్మకంకలవారుగా వారి వ్యాసాంత మందలి యీ కింది వాక్యంవల్ల తెలుతుంది దాన్ని వుదాహరించి రెండు మాటలు వ్రాసి ముగిస్తాను.

"కుక్కలు మొరుగుతూనే వుంటాయి. ఏనుఁగులు పోతూ వుంటాయి. అని దాని అభిప్రాయం. ఇదే ప్రకృతి విరుద్ధం అయిన కవిత్వమంటే? ఇల్లాంటి కవిత్వమే మన హిందూదేశం ఇంత నీచస్థితిలో వుండడానికి కారణం."

యీ వాక్యం ఆయన యేలాటి కవిత్వాన్ని మనసులో పెట్టుకొని వ్రాశారో? చట్టన గోచరించకపోయినా ఆయనకి యేమాదిరి కవిత్వ మందో ఆదరాతిశయం వుందనిమాత్రం తెలుపుతుంది. దీన్నిబట్టి కవిబాంధవులని తేలుతుంది. ఆలాటి కవిత్వాన్ని యిప్పటి కవులలో వకరు కాకపోతే మరివకరేనా చెప్పకపోవడంచేత పట్టరానికోపం వచ్చి కవులందఱినిన్నీ కుక్కలుగా చేసి కృతకృత్యులైనట్టున్నూ పత్రికవారు దీని తత్వాన్ని అశ్రద్ధవల్ల పరిశీలించక లోకానికి అందించినట్టున్నూ నాకు తోస్తుంది. యీ విషయం అంత అత్యావశ్యకమే అయితే వ్యాసకర్తగారు స్వయంగానే ప్రకటించుకొనేవారు. ఆలా ప్రకటించుకోతగ్గ దీన్ని పత్రికవారు పేక్షిస్తే కొంత బాగుండేదేమోనని నేననుకున్నాను. యీ వ్యాసకర్తగారు తమ పేరును వుదాహరించే వున్నారుగాని అల్లా వుదాహరించినా "ఫలానా" అని నాకు గోచరించలేదు. కాని సుప్రసిద్ధులై వుంటారన్నది మాత్రం నిర్వివాదాంశం. యీవ్యాసం వ్రాయడంలో వారికివున్న అంతరంగాభిప్రాయం యెట్టిదో తెలిపితే సంతోషం, లేదా అంతకంటే సంతోషం. యెంత సవిమర్శంగా దీన్ని చదివిచూచినా యిది కుక్కలకే సంబంధించిన వ్యాసంగా మాత్రం నాకు తోఁచడంలేదు. కుక్కలు ఆ మాదిరిగా మొరగడాన్ని గూర్చి లోకానికి తెలపవలసినంత ఆవశ్యకత వుంటుందని తోఁచదు. అది సర్వసామాన్యమైన విషయం. వ్యాసమన్నప్పుడు అందులో యేదో కొత్త విషయం వుండి అది తాను మాత్రమే కనిపెట్టిందయితే "ఏకస్స్వాదు న భుంజీత" అనే న్యాయాన్ని బట్టి యితరులకు కూడా ఆ మహా రహస్యాన్ని బోధించే తలంపుతో పత్రిక కెక్కించవలసి వుంటుంది. అట్టి రహస్యం దీనిలో వుంటే వ్యాసకర్తగారు తెలుపుతారని తలుస్తాను.

★ ★ ★

# కవులు భిక్షాటకులేనా?

కవులు భిక్షాటకులేనా? అని ప్రశ్నిస్తే జవాబు చెప్పడం కష్టం.

"భిక్షాటకులే" అందామా? అప్పుడు కొంత చిక్కు వుంది. కారు అంటే కొంత చిక్కుంది. కొంతసేపు "భిక్షాటకులే" అని జవాబిచ్చి చూద్దాం. దీనికి కొన్ని ఆధారాలు కనపడుతూ వున్నాయి. "మాంతు భిక్షాటనమ్" అన్నాఁడు కాళిదాసు. భోజరాజును స్తుతిస్తూ చెప్పిన శ్లోకంలో చిట్టచివరది పైవాక్యం. శివుణ్ణి ఆశ్రయించిన గంగ, చంద్రుఁడు, వాసుకి, సర్వజ్ఞత్వం, అధీశ్వరత్వం, భిక్షాటనం వగైరాలలో నిన్ను అధీశ్వరత్వ, సర్వజ్ఞత్వాలు పొందినవనిన్నీ తుట్టతుదనున్న "భిక్షాటనం" నన్ను (కాళిదాసుని) ఆశ్రయించిందనిన్నీ కాళిదాసు స్వయంగా వొప్పుకుంటూ వున్నాఁడు. శ్లోకంలో వున్న తక్కిన అంశాలు మనకు ప్రస్తుతాలు కావు కనక వ్యాఖ్యానంతో పనిలేదు. యెవరేనా ఆశ్రయించి జీవించేవాళ్లు ఆశ్రయపదార్థం అంతరిస్తే నఖముఖాలా చెదిరిపోయి మఱొక ఆశ్రయాన్ని చూచుకోవడం లోకంలో వుంది. కనక ప్రస్తుతం కాళిదాసు ఆ రీతిని చమత్కరించాఁడు. శ్రీనాథుఁడు-

"కస్తూరికా భిక్షాదానము సేయరా" అని తెలుంగురాయలను-

"సాంపరాయని తెలుంగాధీశ!" అని సంబోధిస్తూ యాచించాఁడు. ఆ కస్తూరి తన భార్యగాని, కోడలుగాని, కూఁతురుగాని ప్రసవిస్తేవుపయోగపఱచడాని కేమో? అంటే అందుకుగాదు యిందుకే అని ఆ పద్యంలోనే వ్యాఖ్యానించాఁడు.

"ద్రాక్షారామపురీవిహారవరగంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయ కుంభికుంభములపై వాసించు నవ్వాసనల్"

యిక్కడ యీ ప్రభువెవ్వరో కొంత విచారిస్తే బాగుంటుంది.

"రంభ గూడెఁ దెలుంగురాయ రాహుత్తుండు
కస్తూరికేరాజుఁ బ్రస్తుతింతు"

అనే సీసచరణంలో తుట్టతుది సమయములో స్మరింపఁబడ్డవాఁడీ మహారాజే. యితని తండ్రిపేరుతో వున్న గ్రామం వొకటి, గోదావరిజిల్లా రామచంద్రపురం సమీపంలో వుంది. కొమరగిరి, రాజోలు, వేమవరం, పోలవరం యిత్యాదులన్నీ పూర్వం రాజ్యమేలిన

రాజులపేర్లతో పుట్టిన వూళ్లే. యిందులో కొన్ని వూళ్లు అసకృదావృత్తిగా కూడా (పోలవరాదులు) వున్నాయి.

"పోలయవేమా!" అంటూ పద్యాలు కొన్ని శ్రుతమవుతూ వున్నాయి. వేమభూపాలుని తండ్రిపేరు పోలయ్య. ఆయన పేర పుట్టిన గ్రామం "పోలవరం" ప్రస్తుతం శ్రీనాథునికి కస్తూరికా భిక్షాదానంచేసి తదనుగుణమైన రంభా సంభోగాన్ని చూరగొన్న శృంగార రసారాధకుఁడు పాలించిన భూభాగానికి రాజధానిగా వుండేపట్నం పేరేదో చారిత్ర విజ్ఞాతల ద్వారా తెలుసుకోవాలి. సంస్కృత కవులలో "కాళిదాసు" భిక్షాటకుఁడుగా రుజువైనట్లే తెలుఁగు కవులలో శ్రీనాథుఁడు కూడా భిక్షాటకుఁడుగా రుజువైనది. అయితే కాళిదాసు భిక్షాటకత్వానికీ, శ్రీనాథుని భిక్షాటకత్వానికీ చాలా వార కనఁబడుతూవుంది. బాగా పరిశీలిస్తే శ్రీనాథుణ్ణి భిక్షాటకుఁడుగా సమర్థించడానికి పైని చూపిన పద్యపాదాలు పనిచేయవు. ఆయీ పద్యపాదాలు శ్రీనాథుని నిరాఘాటప్రవర్తనాన్ని సమర్థించడానికి మాత్రమే వుపకరిస్తాయి. అంతకంటే "కైలాసగిరి పండె మైలారువిభుడేగి దినవెచ్చ మేరాజు తీర్చఁగలఁడు" ఆయీ చరణం భిక్షాటకత్వాన్ని సమర్థించడానికి కొంచెం తోడ్పడుతుంది.

"చిన్న ముష్టీ, పెద్ద ముష్టీ" అనే భేదం తప్ప యేదేనా చేయి చాఁచడం భిక్షాటనం కిందకే వస్తుందికదా! నిరాఘాటత్వానికి "తురగా రామకవి" ముందర యే శ్రీనాథుఁడూ చాలఁడు. పెద్దాపురం సంస్థానం అంతరించడాన్ని గూర్చి పరంపరగా వినేయితిహాసం (పెద్దాపురపుఁగోట పెద్దమ్మకిల్లోట కవివరేణ్యుల కోపకలనఁగాదె, శ్రవణా. చూ.) విశ్వాస్యమే అయితే, తురగా రామకవిగారి ప్రభుత్వం ముందు శ్రీనాథుఁడి ప్రభుత్వం శతాంశమూ కాదు. రామకవిగారు తఱచు దేశాటకులైనా అసలు నివాసం తునిగాని ఆ ప్రాంతంలో వుండే యేదో పల్లెటూరుగాని కావాలి. అప్పటి సంస్థానాలలో రామకవిగారికి "వర్షాశనాలు" వున్నాయి. వర్షానికి ఒక్కసారి వచ్చే ఏర్పాటుతోవుంటాయి కనక ఆపేరు ఆమామూళ్లకు సార్థకం. రామకవిగారు వార్షికానికి వచ్చి పదో అయిదో రోజులు రాజుగారి కోరికమీఁద వుండి వర్షాశనం పుచ్చుకొని వెళ్లి మళ్లా స్వల్పకాలంలోనే వచ్చి దివాణంలోకి కబురుచేసి నట్టున్నూ, రాజుగారు దర్శనమివ్వక అనాదరించినట్టున్నూ దానిమీఁద వెంటనే మసిబొగ్గుతో కోటద్వారం గోడమీఁదో తలుపుమీఁదో (పద్యమంతా పిమ్మట వ్రాస్తాను. వుత్తరార్థం మాత్రం యిక్కడ వుటంకిస్తాను) పెద్దమ్మ నాట్యమాడెను, దిద్దిమ్మని వత్సవాయి తిమ్మని యింటన్.

అని వ్రాస్తూవుండఁగా రాజుగారికి తెలిసి సగంసగం స్నానంచేస్తూ వున్న తడిబట్టతోనే వచ్చి శాంతింపఁజేసి,

"మహాత్మా! తాము మొన్ననేకదా దయచేసి వార్షికం పుచ్చుకొని వెళ్లి వున్నారు, మళ్లా సంవత్సరానికిఁ గాని దయచేసే ఆచారంలేదని నేను తమ రాకను నమ్మకపోవడంవల్ల తమకాగ్రహం కల్గించినందుకు క్షమించి శాపాన్ని మళ్లించవలసింది."

అని బతిమాలి వారు వచ్చిన పని అంతగాని, కొంతగాని సమంజసమైనది కాకపోయినప్పటికీ నెరవేర్చేటప్పటికి రామకవిగారికి మోమోటం కలిగి - అద్దిర! శ్రీ భూనీళలు ముద్దియలా హరికిఁ గలరు ముగురమ్మలలోఁ "బెద్దమ్మ నాట్యమాడెను."

అని సవరించి అంతతో వూరుకోక తన మొదటి శాపం ఖోర్సు పూర్తిగా యింత మాత్రంతో శాంతించదనీ యెఱుఁగును కనక అది, "నీ నాఁడు గాదు నీ మనుమని నాఁడు అమలు జరుగు" నని చెప్పినట్టున్నూ చెప్పుకుంటారు. యీ మనుమని నాఁడు, అని వున్న పద్యం కూడా నేనుయెప్పుడో వినే వున్నాను కాని అది యిపుడు సరిగా నోటికి వచ్చిందికాదు. ఆయన వాక్శుద్ధి యెట్టిదో కాని అదేప్రకారం ఆ రాజుగారి మనుమనిరోజులు కొంతవరకు బాగా జరిగి తుట్టతుది రోజుల్లో వొక్కొక్క ముతా చొప్పున అమ్మకానికి ఆరంభమైనట్టున్నూ ఆయన స్వర్గతి పిమ్మట భార్యలు ముగ్గురూ చాలవఱకు అనప్పిండి విస్సన్నగారి దివాన్‌గిరీ రోజులలో భర్తగారు ప్రారంభించిన విక్రయ వ్యాపారాన్ని పూర్తిచేశారనిన్నీ చెప్పుకోవడం.

అనప్పిండివారు ద్రావిడ బ్రాహ్మణులు. కోనసీమ నివాసులు. ఆ యీ యింటివారి పేరు కోనసీమలో అనాతవరంలో కాఁబోలును యిప్పటికీ వున్నారని వినడం. యెవరో వొక గేస్తురాలు-

"అనప్పిండి విస్సన్నగారిదీ బట్టతలే, మా వారిదీ బట్టతలే"

అందనిన్నీ లోకోక్తులలో చెప్పుకుంటారు. అదృష్టవంతులలో యీయన్ని పేర్కొనడం ఆ రోజుల్లో విశేషించి వుండేదని పైలోకోక్తివల్ల అవగతమవుతుంది.

"అనప్పిండివిస్సా ... ... తుస్సా" అంటూ వొక పెద్దదండకం భట్రా జెవరో చెప్పినట్లు వినికిడి. క్రియలోమాట రామకవిగారి వాక్కు రెండో భీమకవిగారి వాక్కే. "నానృషిః కురుతేకావ్యం" అనే అభియుక్తోక్తి రామకవిగారిపట్ల సమన్వయించినట్లు యేనన్నయ తిక్కనాదులకుగాని సమన్వయించదు.

"ఉంగుటూరిళ్ల రాకాసు లుండవచ్చు"

అనే పద్యపాదానికి సంబంధించిన యితిహాసంకూడా రామకవి మహర్షులలో పరిగణింపతగ్గవాఁడు గాని కవిమాత్రుఁడుకాఁడని చెపుతుంది. అయీ రాకాసుల

పద్యంలోవున్న శాపానికి యేకొంచెమో అపరాధం ఆవలి వారి (తల్లాప్రగడవారు) వల్ల కనఁబడుతుంది. పెద్దాపురం విషయంలో అట్టి అపరాధం లేశమూ వున్నట్టు లేదు. రామకవిగారు వార్షికం పుచ్చుకువెళ్లి మళ్లా వెంటనే (నెలకో రెండు నెలలకో అన్నమాట) రావడానికి చెప్పుకొనే మాటలు విమర్శించడానికి అర్హంగా వుండవు. ఉదార హృదయులకు బొత్తిగా రుచించవు కూడాను. అయినా ప్రధానాంశమైనశాపానికీ వాట్లకూ లంకెగా వుండడంవల్ల వుదాహరిస్తాను. రామకవిగారికి వేశ్యాసంపర్కం వున్నట్లు-

(1) భూతలమందు ధాతకు నపూజ్యత గల్గెను.

(2) చూడఁగ నల్పుగాని పరిశోభిత దివ్యకురంగనాభి.

(3) పెండెలనాగి చెక్కులను పెద్దికటిస్థలి గంగిగుబ్బ చన్గొండల

అనే పద్యాలు ధ్రువపరుస్తాయి. యీ మూగురు సానులలో నొకదాని నివాసం తుని. ఆపెనేమో బంధువులు "నీవేమో నేనమ్మాతురగారామ కవిగారి సానినని విఱ్ఱవీఁగుతావు! నీకేమేనా పాయకరావుపేఁట సేలువులు కప్పివున్నారా? (పాయకరావుపేట తునికి మైలులో వుంటుంది. ఆకాలంలో సేలువులకు ప్రసిద్ధి) లేకపోతే పెద్దాపురం మహారాజావారి కైజారుపిడిమీఁద వుండే రత్నాలు తెచ్చి నీ సవరపు కొప్పెమీఁద తాపడం చేయించారా?" అని యెత్తిపొడిచే టప్పటికి ఆ అనాత్మజ్ఞురాలు ప్రియుణ్ణి, ఆ రత్నాలు తెస్తావా? చస్తావా? అని పట్టుపట్టి కూర్చుండేటప్పటికీ రామకవిగారు తప్పని విధిచేత వార్షికం తెచ్చుకున్న అచిరకాలంలోనే, పెద్దాపురం వెళ్లవలసి వచ్చిందని చెప్పుకుంటారు. కైజారులో వుండే మాణిక్యాలు వూడదీయించి కవిగారికి సమర్పించడంచేతనే మనమడి తరందాఁకా రాజ్యం ఆగినట్టున్నూ చెప్పుకుంటారు. ఆ యీ శాపప్రదానానికి హేతువు అంతగాని కొంతగాని సరిగా కనపడదు. దీనికే కాదు, పౌరాణిక శాపాలలో కూడా నూటికి తొంభైవంతులు యీలాగే వుంటాయి. యీమాదిరి యాచకులను మనం, భిక్షాటకులుగా విశ్వసించడం యేలాగ? యిస్తే పుచ్చుకోవడమూ, యివ్వకపోతే చక్కాపోవడమూ 'భిక్షుకుల' లక్షణం. (అవమానం పురస్కృత్యమానం కృత్వాతు పృష్ఠతః చూ.)

అదిన్నీ కాక యేదో "నిజదార సుతోదర పోషణార్థం" బియ్యమో, వడ్లో, జొన్నలో? అథవా రొక్కమో? అయితే భిక్షాటనంగా భావించడానికి అవకాశం వుంటుంది, గాని నా సానికి పూయడానికి కస్తూరి కావాలి, నాసాని సవరపు కొప్పెలో చెక్కించడానికి రత్నాలు (ఆ రత్నాలుకూడా అలాయిదాగా యిస్తే వల్లకాదు) మీ కైజారుపిడిలో వున్నవి కావాలి, అనే భిక్షాటనం భిక్షాటన మవుతుందా? "నమ్మిన నమ్మకున్న నది నా వశమా?" అన్నారు దాసువారు. నే విన్నమాటలు వ్రాశాను, కథలకు కాళ్లూ ముంతలకు చేతులూవుండవు.

క్రియలోమాట తురగా రామకవి పద్యాలు చూస్తే తెలుఁగు కవులలోనే కాదు, సంస్కృతకవులలో కూడా అంతటి తృణీకృత బ్రహ్మ పురందరుఁడు లేడనే తోస్తుంది. అతని ధారలోనే వొక విధమైన "వైశిష్ట్యం" కనపడుతుంది. చూడండి.

ఉ॥ రాతిరి మేము పస్తు, హయరత్నము పస్తు, కవీంద్ర యాచక వ్రాతము పస్తు, నర్మసచివాగ్రణి పస్తు (పైభాగం కొంత జ్ఞాపకం లేదు. ఉన్నదానిలో కొంత అసభ్యమగుటచే వుటంకించలేదు) ... ... పస్తికనేమి చెప్పుదున్॥

ఇది రామకవిగారి పద్యమే. దీనిలోవున్న సిబ్బందీ చూస్తే పూర్వం కవులు (అందఱూ కాదు కొందఱే) మతగురువులలాగు దేశం తిరిగి వసూలు చేసేవారేమో? అనిపిస్తుంది. నిగ్రహానుగ్రహదక్షులుగా వుండడంచేత వారికి ఆవిధంగా సాఁగిందనుకోవాలి. తురగా రామకవి ఆ యీ దక్షులలో నెంబర్‌వన్. ఇతనివి లోకంలో లెక్కకి చాటువులు పదికంటే ఎక్కువ చిక్కవు. కాని మహాగ్రంథాలు రచించిన నన్నయాదులతోపాటు భాషా ప్రపంచంలో యితనికి పేరు వుంది. ఇత డెంతవాఁడో చెప్పడానికి వశంకాదు. ఇంతవఱకు వ్రాసిన చర్చవల్ల కవులు, "భిక్షాటకులు" కారనే తేలుతుంది. వూరకే వినయార్థం కాళిదాసు– "మాంతు భిక్షాటనమ్" అని అనివుంటాఁడు. కవులుభిక్షాటక తరగతికి చెందినవారే అయితే–

"ఎదురైనచోఁ దన మద కరీంద్రము డిగ్గి
కేలూఁత యొసగి యెక్కించి కొనియె"

ఇట్టి గౌరవం జరగడం అసంభవం కదా! మంత్రిత్వంలో లోపాయికారీగా అనుభవించే ఐశ్వర్యం యెక్కువగా వుంటే వుంటుంది. పైకి కవికున్న గౌరవం, మంత్రులకు వుండదు. మంత్రి నవుకర్ల తరగతివాఁడు. కవి యే తరగతివాఁడూ కాఁడు. యెంత ఐశ్వర్యం అనుభవించినా మంత్రికి జగ్గప్పా అనే సంబోధన. కవిని అలా యేకవచనంతో యే మహారాజు పిలుస్తాఁడు, పైగా -

1. ఎదురైనచోఁ దన మదకరీంద్రము డిగ్గి కేలూఁత యొసఁగి యెక్కించుకుంటాడు.
2. పురమేగఁ బల్లకి తనకేలఁబట్టి యెత్తుతాడు.

యింకోటి. మంత్రి రాజుకు నమస్కరించాలి. కవికో రాజే నమస్కరించాలి. కవులలో రెండు తరగతు లుండడం యెఱుఁగుదురు గదా!

1) కేవల కవులూ, 2) విద్వత్కవులు అనే యీ రెండు తెగలలో సంస్కృతకవులు సర్వులూ విద్వత్కవులే. శాస్త్ర జ్ఞానంతో మిళితమైన సాహిత్యం వుంటేనే తప్ప సంస్కృతంలో వొక్క అనుష్టుప్పు సైతం నడవదు. తెలుఁగో అలాటిది కాదు. మాతృభాష వుగ్గుబాలతో

ప్రతీవాఁడికీ వచ్చివుంటుంది. దానితో- శుద్ధ సురన్నది రుద్రరూపమై అని ప్రారంభిస్తాఁడు. తేలిన సారాంశం, తెలుఁగులోనే కాని- కేవల కవీ - విద్వత్కవీ అనే భేదం సంస్కృతంలో పాటింపవలసి వుండదు. వెలివేసినట్టు పూర్వులు కేవల కవులను కేటాయించి- "కేవల కవయస్తు కేవలం కపయః" అన్నారు. అంటే అన్నారు గాక యీ కాలంలో - సంఘేశక్తిః

ఇది విషయాంతరం. కవులు భిక్షాటకులుగా స్థూలదృష్టికి గోచరించినా, భిక్షాటకులు కారనే మనం తెలుసుకోవాలి. పైఁగా రాజులను (రాజ్య మదమత్తులను) భిక్షాటకులుగా చేసినట్టు - వేములవాడ భీమకవిగారి చరిత్ర ఘోషిస్తూవుంది.

సీ. "రాజకళింగగంగ్రాజు భిక్షకుఁడౌట కవివరేణ్యుల కోప కలనఁగాదె?... కరుణగల్గిన యిల్లు బంగారమౌను కరుణ దప్పిన నడవియౌగడియలోన బ్రహ్మకొడుకైన గవులకు భయముఁజెందు" (శ్రవణా) ఆ యీ సందర్భాన్ని ఋజువు చేసిన కవులు పూర్వులలో చాలామంది వున్నారు.

కాని యిటీవలివారిలో పిండిప్రోలికవిని చెప్పవలసి వుంటుంది. ఈయన పెద్ద విద్వత్కవి కాకపోయినా నిగ్రహానుగ్రహసమర్థుఁడు. విద్వత్కవులు గల సభలో నిర్భయంగా తన కవిత్వాన్ని వినిపించగలవాఁడు. యీయనకున్నూ, శిష్టు కృష్ణమూర్తి విద్వత్కవిగారికిన్నీ తఱచుగా యుక్తి ప్రయుక్తులూవాదోపవాదాలూ జరుగుతూవుండేవి. వాట్లలోయీపిండి ప్రోలికవియెప్పుడూ తీసిపోయినట్టు లేదు. దీన్ని బట్టి ఈయన నేఁటి కేవల కవుల వంటి వాఁడు కాడఁని స్పష్టం. దావు దమ్మన్నగారు యీయన లంకభూమిని యేడు పందుములు (24 యకరాలన్నమాట) పశుబలంచేత అపహరించేటప్పటికి లంకావిజయం అనేపేరుతో వొక ద్వ్యర్థి కావ్యం రచించి తనభూమిని (కోర్టుకువెళ్లకుండానే) తిరిగీ సంపాదించుకున్న అభిమానశాలి. ఆద్వ్యర్థి కావ్యానికి రావణదమ్మీయం అనినామాతరం వుంది. లంకావిజయం అనే పేరుకన్న రెండో పేరేలోకంలో మిక్కిలిగా వ్యాప్తిలోవుంది. రాములవారి భార్యను అపహరించిన రావణాసురుఁడికి పట్టిన దుర్గతే దమ్మన్నగారికి పట్టిందని చెప్పఁగా విన్నాను. నాచిన్నతనం నాఁటికి యీ లక్ష్మణకవిగారిని ప్రత్యక్షంగా యెఱిఁగిన వృద్ధులు కొంతమంది వున్నారు-

(1) మర్ల పేరు సోమయాజులుగారు (యానాం ఫ్రెంచిటవును)

(2) ఉప్పులూరి రామజోగన్న సిద్ధాంతిగారు (కొత్తపల్లి ఐలండు)

వీరిద్దరివల్లనూ నాకు లక్ష్మణకవిగారినీ శిష్టుకృష్ణమూర్తిగారినీ బాగా తెలుసుకొనే భాగ్యం కలిగింది - యిందులో 1) కృష్ణమూర్తిగారు. వేదం, శాస్త్రం, సంగీతం యింకా

చాలా విద్యలలో ప్రవేశంకల మహావిద్వాసులు, మంచి కవులూను, గొప్ప రాజాస్థానాలలో పేరు ప్రతిష్ఠలు పొందిన వారున్నూ, సంస్కృతంలోనూ తెలుఁగులోనూ కొన్ని గ్రంథాలు రచించారు. చిరకాలం జీవించారు. చిన్నయసూరి, కోరాడ రామచంద్రశాస్త్రుల్లు గారు (బందరు) మొదలైనవారు వీరి శిష్యులు. దివ్యమైన అత్యాశువులో ఆకాశపురాణం (సంస్కృతంలో) చెప్పే అసదృశ ప్రజ్ఞకలవారు. కాని లక్ష్మణకవి గారి పేరు భాషా ప్రపంచంలో శాశ్వతంగా నిల్చినట్లు – (అంతఘాటుగా నన్నమాట) కృష్ణమూర్తిగారి పేరు నిలవడానికి ఆస్కారం లేకపోయింది.

1. యక్షోల్లాసం, 2. సర్వకామదా పరిణయం వగయిరాలు ఉభయ భాషలలోను ప్రబంధాలున్నాయి వీరివి. మంచిచాటువులున్నూ వున్నాయి. వున్నప్పటికీ లక్ష్మణకవిగారివి యిందులో యెన్నోవంతూ లేకపోయినా భాషా ప్రపంచంలో లక్ష్మణకవిగారు నేఁటి తారలలో వొకరుగా నిల్వఁగల్గినారు. కృష్ణమూర్తిగారు వారి జీవిత కాలంలో యెంతగా ప్రకాశించినా ఒక్కపద్యం కూడా (చాటువులు తప్ప) గ్రంథాల తాలూకు కృష్ణమూర్తిగారివి నోటికి వచ్చినవారుకనుపడరు. లక్ష్మణకవిగారి రావణదమ్మీయం (చాలాచిన్న పుస్తకంలో) పద్యాలు చాలామందికి కంఠోపాఠంగావచ్చును. దీనికి లంకభూమిని, అపహరించిన దమ్మన్న (ధర్మారావు) గారేకారణం. ఈపుస్తకం తప్ప లక్ష్మణకవిగారు మరియేదిన్నీ రచించినట్టులేదు. ఇదికొందరు తిట్టు కవిత్వంగా యీసడించినా మృదుమధుర పాకంలో వుంది. పేరు నిల్పింది. దీని రచనకు యీయనకు–

ఛ. "హయ మది సీత, పోతవసుధాధిపుఁ డారయ రావణుండు ని
శ్చయముగ నేను రాఘవుఁడ సహ్యజ వారిధి మారుఁ డంజనా
ప్రియ తనయుండు సింగన విభీషణుఁ డా గుడిమెట్ట లంక నా
జయమును బోతరక్కసునిచావును నేడవనాఁడు చూడుఁడీ"

అనే పద్యం (యెవరిదో జ్ఞాపకం లేదు) మార్గదర్శకం, లక్ష్మణ కవికి ఆ యీ పద్యంలో వున్న – సింగన్న పేరు కూడా తోడ్పడింది. యింతకూ చెప్పేదేమిటంటే? తగిన 'మేటరు' దొరకడంచేత లక్ష్మణ కవిగారి పేరు నిల్చేకవిత్వం వుదయించింది. కృష్ణమూర్తిగారికో అట్టి భాగ్యం పుట్టిందికాదు.

"తద్వచసైవ సార్థం విచ్ఛేదమాప భువి యస్తు కథా ప్రబంధః" అన్నాఁడు బాణమహాకవి కొడుకు.

యింతకూ లక్ష్మణకవిగారు పని పడితే ఆయుధం చూపి కార్యాన్ని సాధించేఁకవేగాని – భిక్షాటకుఁడు కాఁడని ఫలితార్థం. అయితే నాకబలి పళ్యాలకు లక్ష్మణకవిగారు వెళ్లడం

వొకటి వుంది. యీ పళ్యాలంటే యేమిటో యిప్పటివారికి తెలియనే తెలియదు. నాకు యిరవై యేళ్లు వచ్చే వఱకున్నూ కవులకు, తోలుబొమ్మలకు, హాస్యగాళ్లకు, యింకా యెక్సెట్రాలకు కోమట్ల యిండ్లల్లో జరిగే వివాహాలలో పళ్యాలు (సన్మానాలన్నమాట) కంపల్‌సరీగా యిచ్చే ఆచారం వకటి వుండేది. ఆ యేర్పాటు మన పూర్వ జమీందార్లు యేర్పఱచి ఆయా విద్యలకు పట్టాలిచ్చివున్నారు. అందుచేత యిచ్చితీరవలసిందే కాని యెగ్గొట్టడానికి వీల్లేదు. నేను కూడా వొకటి రెండు పళ్యాలు యెత్తినవాణ్ణే. మా వంశం కవితావంశం కావడంచేత ఆ గౌరవం మా ప్రాంతంలో మా వంశస్థులకు (కవిత్వం చేతకాని వాళ్లకు కూడా) వుండేది. యిటీవల కోమట్లు తెలుఁగుమీరి యివ్వడం మానేశారు. పిఠాపుర ప్రాంతం గొల్లప్రోలుగ్రామంలో కోర్టుదాఁకా వెళ్లింది యీ విషయం. దానిలో కోమట్లే గెల్చివుంటారు. పిండిప్రోలు కవిగారు పెళ్లిఅయిన సంవత్సరంలోగా యెప్పుడేనా వెళ్లి వసూల్లుచేసే వారఁట! సకాలంలో మీరు రాలేదు గనక యిచ్చేదిలేదని వొక కోమటి నిర్భయంగా శతాయించి కూర్చునేటప్పటికి మన కవిగారు - పిండీప్రోలూ లేకుండా నీయింట్లో పెండ్లేలా జరిగింది? బాగా ఆలోచించుకో జాగ్రత్త - అని కళ్లెఱ్ఱఁజేసేటప్పటికి ఆ వర్తకుఁడు భయపడి కాలదోషశంక వదలుకొని పెండ్లిమామూలు యిచ్చి పంపించినట్టు చెప్పఁగా విన్నాను.

యీయన మాటలు అన్నీ యీలాగే వుంటాయి. యీయనపుట్టుకతోనే ద్వ్యర్థికవి.

(1) కుళ్లుముండా గుద్దుతుక్కుంటాను, బండముండా రాయియ్యవే.

(2) కమ్మకుమ్మొచ్చి పట్టుకుంది.

(3) మాదిగవల్లి శివరావెక్క డున్నాఁడు నాయనా!

యీవాక్యాలన్నీ యీయనవే. సమస్య-

'ఈశునకము కృష్ణమూర్తియే యెన్నంగన్.'

అని శిష్టు కృష్ణమూర్తిగారికి తగిలివచ్చేటట్టు వొకసమస్య యిచ్చేటప్పటికి కృష్ణమూర్తిగారికి కోపంవచ్చి -

క. "దాశరథీశబ్దమ్మును
దాశరథిపరమ్ముఁ జేయుద్వ్యర్థికిదు
ర్ధీశక్తి బిడాలమునకు
నీశునకము కృష్ణమూర్తియే యెన్నంగన్"

అని పూర్తిచేశారఁట! అసలు నల్లటికుక్కనుజూచి యీసమస్యను యిచ్చాఁడఁట! తరువాత ఈశునకము (బాణము) కృష్ణమూర్తి శ్రీ మహా విష్ణువు (త్రిపుర విజయంలో నన్నమాట.) ఆయన జీవితమంతా యీలాటి ప్రసంగాలతోటే వుంటుంది. రామలింగం తరువాత యీయన రెండో రామలింగమని యీ చరిత్రను బట్టి చెప్పుకుంటారు.

విస్సన్నచెప్పింది వేదం అనే లోకోక్తి యేమహావిద్వాంసుణ్ణి పురస్కరించుకొని పుట్టిందో అట్టి యింద్రగంటి విశ్వపతి శాస్త్రుల్లుగారిని కూడా లక్ష్యపెట్టని యుక్తిశాలి యీ లక్ష్మణకవి.

మామా! వీదీస్తే శ్వపతివి (కుక్కవు) శ్వాదీస్తే విపతివి (వీనాం పక్షిణాం పతిః) అన్నాడట యేదో సందర్భంలో;

యీలా వ్రాస్తూవుంటే పెరుఁగుతూనే వుంటుంది. ప్రధానాంశం లక్షణకవిగారు నాగవల్లి పళ్యాలకు వెళ్లేవాఁడవడంచేత భిక్షాటకులలోకి వస్తాఁడనే వారిమాట పాటించతగ్గది కాదనియ్యేవే. ఆ పళ్యాలు కూడా క్విటురెంటు భూములవంటివిగాని యాయవారంబాపతు కావు. కాని అవి పోనుపోను నీచస్థితిలోకి వచ్చాయి.

క. "నాఁకబలి పళ్లెరమ్ముల
నాఁకట జీవించు కుకవు లరుగుదురె"

అని మే మనడానికి క్కారణం మా రోజులనాఁటికి వాట్ల గౌరవం తగ్గిపోవడమే. కృష్ణమూర్తిగారి జీవిత కాలంలో ఆయనకున్నంత గౌరవం యేకవికీ లేకపోవడంచేత ఆయన పెద్దగా భూవసతి సంపాదించి పిల్ల జమీందారుగా ప్రకాశించారు. జీవిత కాలంలో ఆయన గొప్పవాఁడు. జీవితాంతం ఈయన (లక్ష్మణ కవి) గొప్పవారు. క్రియలో మాట - యీ వుభయులలోనూ యెవరిప్రసక్తి వచ్చినా రెండోవారి ప్రసక్తిరావడం తప్పదు. ఆయన మహా విద్వత్కవి అయినా ఆమాటను నిల్పేకవిత్వం యేదీ కనపడకపోవడంచేత "పిల్లఃకవిరహం విద్వాన్" అన్నట్టు వ్యవహరించవలసి వుంటుంది. లక్ష్మణకవి విద్వత్కవి కాకపోయినా రచన విద్వత్కవి సమ్మతమే. కనక నేఁటి కేవల కవుల పంక్తిలో చేర్చకూడదు. యితని భిక్షాటనం "పట్టుకోకెట్టమని పెళ్లికూతురివారంటారు, పట్టుకో కెట్టమని మే మంటాం, యీ తగాయిదా తీరితేగాని పెళ్లి స్థిరపడేటట్టు లేదు." అనే వైఖరిలో వుంటుంది. యీ మాట వినీ వినడంతోడనే పట్టుచీర కూడా తెప్పించి యిచ్చి పెండ్లికి పంపించారఁట. అప్పటి పిఠాపురం జమీందారు నీలాద్రి రాయణింగారు మా ముత్తాత "రావు వేంకట నీలాద్రి రాయనృపతి, చేత సత్కృతి చెందు విఖ్యాతయశుఁడ" అని వ్రాశాఁడు. మా ముత్తాతగారికన్న కొంచెం లక్ష్మణకవిగారు చిన్నలయితే కావచ్చును. వీరిద్దరూ కలుసు కొన్నట్లు కొందరు చెప్పగా విన్నాను. అంతేకాదు.

శ్లో. "కచభారాత్కుచ భారః కుచభారాద్భీతిమేతి కచభారః
కచకుచభారాజ్జఘనం కోఽ యంచంద్రాననే; చమత్కారః"

అనే శ్లోకంలో కొంతవివాద పడ్డట్టున్నూ విన్నాను. లక్ష్మణకవిగారు గౌరవభంగం లేకుండా రాజులవల్లనూ సంపన్నగృహస్థుల వల్లనూ జీవితయాత్ర గడుపుకొన్న మనస్వి. మామిత్తాత జమీందారు స్వయంగా తన దగ్గిఱకువచ్చి కోరుకోవలసినది అని ప్రార్థించినా కోరుకోని యశస్వి. వీరిపదవులన్ని మంత్రిపదవికి చాలా పైమెట్టులోనే వుంటాయి. భీష్ముండేమన్నాడు?

"అర్థస్య పురుషోదాసః" అనలేదా? మనువేమన్నాడు; "నశ్య వృత్త్యాకదాచన"

యెంతపెద్ద ఐశ్వర్యాన్ని అనుభవించే వారైనా, "శాకం పచతి స్వేగృహే" తెగలోవుండే నిస్పృహులకు (నిస్పృహస్య తృణంజగత్) దాసోహం అనడానిక్కారణం అందరికీ గోచరమే.

మాగాపు శరభకవిగారిపేరు వినడమేకాని పెద్దాపురపు రాజుగారు సదరు కవిగారిని యెప్పుడూ సందర్శింపని కారణంచేత రాజుగారు స్వయంగా ముమ్మిడివరం దాపునవున్న మాగాంగ్రామానికి వెళ్లేటప్పటికి పుట్టగోచీ పెట్టుకొనిదొడ్లో అరఁటితోఁటలో యేవోపాదులకు గొప్పుతవ్వుతూ (రాజరు దెంచునప్పటి కరంటులతోఁటకుగొప్పు) శరభకవిగారు కనపడేటప్పటికి రాజాగారు కవి వినేటట్టు "ఇతఁడేనా శరభకవి" అనేటప్పటికి కవికి మనసునొచ్చి అరవైపద్యాలు యీక్రింది శైలితో ఆశువులోచెప్పి రాజుగారిని నిర్ఘాంతపోయేటట్టుచేసేట్ట. అందులోవొకపద్యం మాత్రం నాకిప్పుడు కొంచెం తరువాయిగా జ్ఞాపకంవుంది. శైలికి వుదాహరిస్తాను.

మ. "ఇతఁడా రంగదభంగసంగరచమూ హేతిచ్ఛటాపావకో
ద్యత కీలాశలభాయమానరిపురాడ్ధారా శ్రుధారా నవీ
నతరంగిణ్య బలాసమా (కొంతమఱచాను) ... ... ...
... ... ... ... ... వత్సవయి తిమ్మక్ష్మావిభుండీతఁడా?"

యెందు కీలా చెప్పవలసి వచ్చిందో స్పష్టంగా తెలుస్తూనే వుంది. అయినా కొంచెం వివరిస్తాను. తనకు నేను నౌకరునుగాను. ఇండిపెండెంటు తరగతిలో వాణ్ణి. యెప్పుడూతన దర్శనానికి వెళ్లలేదు. కనక నన్ను చూడడానికి రావడం బాగానేవుంది. కాని, ఈయనా? అని అనక, నిస్సాకారంగా నన్ను ఇతఁడా? అని అంటాఁడా? సరే! ఆయన నన్ను వొక్క సారి – ఇతఁడా అన్నాఁడు కనక అయన్ని నేను 60 సార్లు "యితఁడా?" అంటే సరిపోతుంది అని శరభకవిగారు ఆ విధంగా తన సామర్థ్యాన్ని ప్రకటించారని చెప్పుకుంటారు. ఆ యీ ధార చూస్తే శంకరకవిగారి హరిశ్చంద్రోపాఖ్యానంలో వున్న-

మ. "అకటా! చేరెఁడునేలకున్ దగఁడె? సప్తాంభోధివేష్టిభవ,
త్సకలద్వీపకలాప భూపమకుటాయ త్పద్మరాగోజ్వల
త్ప్రకటానర్గళ నిర్గళత్సుభగ శుంభత్పాదుఁడై నట్టి రా
జకుమారుండని యేడ్చెఁ గన్నుఁగవనశ్రుల్ కాల్వలై పాఱఁగన్."

అనే పద్యానికికూడా మించినశైలితో వొకటిగాదు రెండుగాదు 60 పద్యాలు నిల్చున్న పాళాన్ని నిల్చున్నట్లుగానే ఆశువులో రచించిన శరభకవికి యెంతటి విద్వత్తువుందో యెవరునిర్ణయిస్తారు? అట్టిశరభ కవికి తగినప్రసక్తి యేదీ తటస్థంకాక యేదీ రచించినట్లు కనపడదు. లేదా, రచించినప్పటికీ, ఆ రచన కాలగర్భంలో లీనమైపోయిందో! మనకు కావలసింది ఆ యీ మాదిరి కవులు రాజులను అవసరాన్నిబట్టి యాచించినప్పటికీ భిక్షాటకులుగా పరిగణింపఁ బడరనియ్యేవే. తగిన పాత్రం దొరకని రాజులు తరించడానికి వీరే ఆధారభూతులుగా వున్నట్టు కనపడుతుంది. ధర్మాత్ములుగా వుండే మహారాజులు అయిపుట్టినవాళ్ల కాళ్లు గడగడానికి సమ్మతింపక వేదాధ్యయనపరులకూ, శాస్త్రజ్ఞులకూ, మహాకవులకూ అగ్రహారాదులు సమర్పించినట్లు కనపడుతుంది. కొన్నితరాలనుండి ప్రతిగ్రహ దోషం యెఱుఁగనివారిని – అప్రతిగ్రహీతలుగా వాడతారు. అలాటివారిని జమీందారులు కొందఱు మోమాటపెట్టి భూమివగైరాలు స్వీకరింపచేసిన యితిహాసా లెన్నో ఉన్నాయి. పెద్దాపురపు రాజుగారు చాలాభూములు ఆవిధంగా యిచ్చినవే. అయితే ఆరోజులలో పదిరూపాయలు యివ్వడం కంటె పదికుంచాలో, పదియెకరాలో యివ్వడమే తేలికగా వుండేదని చెప్పేమాట కూడా కొట్టేయ తగ్గదికాదు. సామాన్యులకందఱికీ అన్వయించే మాట కాదు గాని కాస్త నామరూపాలుగల కవులెవ్వరుగాని – భిక్షాటకులు కారనే చెప్పవలసివుంటుంది. అగ్రహారాలు వుండిన్నీ అవితిన్నగా ఫలించకపోవడంచేత యాచనకు గురికావలసివచ్చిన కవులు కొందఱు వున్నట్టు కనపడుతుంది.

చ. "గరిసెలప్రాఁతె కాని యొకగంటెఁడెఱుంగను మన్నెదేశముల్
దిరిగి సమస్త వస్తువులు దెచ్చిభుజింతును సార్వకాలమున్
సురుచిర సత్కవిత్వనిధి సూరకవీంద్రుని కేలగల్గెఁగం
చరయును, రేగ మేకమెడచన్నుల పోలిక రెండు గ్రామముల్॥"

ఆయీపద్యం తురగా రామకవిగారికి సమకాలీనుఁడు అడిదం సూరకవిగారిది. దీనిలోవున్న – కంచర – రేగ ఈరెండుపల్లెలున్నూ సూరకవి గారి సర్వదుంబాల అగ్రహారాలు. వీట్లపంటకు సంబంధించిన చెరువుకు చుట్టరికంగలవే "కదులుమిట మాని దివ్యగంగాభవాని" అనేమకుటంగల సీసాలు. ఆచెరువు నీటిముంపువల్ల తన అగ్రహారానికి

చిక్కువచ్చి చెరువు నీరు కొంత తగ్గించే వుపాయం చేయవలసిందని సూరకవిగారు కోరితే జమీందారులు తమ రయితులకు దానివల్ల నష్టం తగులుతుందని అంగీకరించారు కారనిన్నీ, ఆపిమ్మట పైని వుదహరించిన మకుటంతో కొన్ని పద్యాలు చెప్పి ఆ వుపద్రవాన్ని తొలగించు కున్నారనిన్నీ, చెప్పుకోవడం పలువురు యెఱిఁగినదే. ఆ పద్యాలు జ్ఞాపకంలేక వుదహరించ లేదు. గతమైన కవుల వృత్తాంతాలు పరిశీలిస్తే కవులు భిక్షాటకులుగానూ కనపడతారు, భాగ్యవంతులుగానూ కనపడతారు.

"సుకవితా యద్యస్తి రాజ్యేనకిమ్" అనివుండడంచేత ధనద్రవ్యాదుల మూలకంగా కాకున్నా కవిత్వంచేతనే కవులు భాగ్యవంతులు అనిసరిపెట్టుకుంటే సరిపోతుంది. లోకంలో ధనార్జనకు యేర్పడ్డవృత్తులు నాల్గేకనపడుతాయి—

శ్లో. "వాణిజ్యే వర్తతేలక్ష్మీ స్తదర్థం కృషికర్మణి,
తదర్థం రాజసేవాయాం భిక్షాయాం నైవనైవహి."

లోకంలోవున్న వృత్తులలో కవులుచేసేవృత్తి నాలుగోదిగానే కనపడుతుంది. కొందఱు కవులు రెండోవృత్తిని అవలంబించిన వారున్నారు. కాని వారు దానిలో ధనవంతులు కాలేదు.

1) "తదఖిలం త్యక్త్వాశ్రితస్త్వామహం" అన్నాఁడు వ్యావసాయకుఁడుగా మాఱిన కుట్టికవి దున్నపోతు ప్రభువునుగూర్చి అతఁడే—

"శిష్టం మే త్వలమల్లకం" అనిన్నీ అన్నాఁడు తుట్టతుదకు. అలమల్లకంఅంటే, కౌపీనం. శ్రీనాథుఁడేమో:—

"బొడ్డుపల్లెను గొడ్డేరి మోసపోతి, నెట్లుచెల్లింతుఁదంకములేదునూర్లు"

అంటూ విచారించాఁడు, పోతరాజుగారేదో విధంగా

"పంచమేఽహని షష్ఠేవా శాకం పచతి స్వేగృహే"

అనేశ్లోకార్థానికి లక్ష్యభూతులై కాలక్షేపం చేశారు. బాగాపరిశీలిస్తే కవులవృత్తి కాళిదాసుగారు నిర్ణయించిన భిక్షాటనంగానే తేలుతుంది. యేకొందఱు కవులకో రాజులు అగ్రహారాలుయిచ్చి సన్మానిస్తూ వుండటంకలదు గాని అది క్వాచిత్కం. యెవరోపెద్దన్న గారివంటివారు "కోకట గ్రామాద్య నేకాగ్రహారాలను" సంపాదించినవారున్నా, అందఱూ (నఖలు సర్వోఽపివత్సరాజః) తాదృశులు కారు. యీవిషయంలో కవులకూ, గాయకులకూ యెంతోతేడా వుండదు. కవులకంటె గాయకులే అదృష్టవంతులని ఎవరో కవి చెప్పిన శ్లోకంవల్ల గోచరిస్తుంది. దాన్ని కొంచెం వుదాహరిస్తాను.

శ్లో. "నవటా నవిటా నగాయకాః
నచ సభ్యేతర వాదచుంచవః
నృప మీక్షితు మత్ర కేవయం
స్తన భారానమితా నయోషితః"

యీ అర్థాన్నే బోధిస్తుంది వొక పద్యం.

మ. "కవితల్ నేర్చినఁ బాటపాడిన వృథా కష్టంబు లోకమ్ములోఁ
బువుఁబోడుల్ కడుభాగ్యశాలినులహో! పుంస్త్వంబు ... ...
చవివుట్టన్ సొగ సిచ్చి యించుక ... ... బెట్టి పుట్టింప నీ
యవనీశాళి సమస్త మిచ్చును గదా; హా! పాపపున్ దైవమా!

కుట్టికవి మహిషశతకాన్నిబట్టి చూచినా మహాకవులలో నూటికి 19 మంది దారిద్ర్య దోషానికి గుఱి కావలసి వచ్చినట్టే కనపడుతుంది.

1) శ్లో. "ఆర్య శ్రీధర మంబుదీక్షిత మిమౌ దృష్ట్వా మహాపండితౌ,
... ... ... ... ... ... సకలం త్వం మే లులాయప్రభో"

2) శ్లో. "ఖ్యాతః కుట్టికవిస్తు దుర్ధనిగృహ ద్వారేషు నిద్రాయతే"

3) శ్లో. "తేషాం వక్త్రవిలోక నాత్తవవరం ... కోశేక్షణమ్"

ఇత్యాది శ్లోకాలు పరిశీలిస్తే లోకోత్తరులైన కవులందఱూ ధనికుల నాశ్రయింప వలసినట్లే కనపడుతుంది. కవులకన్న గాయకులకు యింకో చిక్కు, కవియెక్కడికో కట్టుగుడ్డలతో – 'లేడికి లేచిందే ప్రయాణం' అన్న విధంగా వెళ్లి యే దాతనో–

సీ. "బళిబళీ! మీతాత బల్లెమ్ము చేఁబూని పుల్లాకు తూటుగా బొడిచినాఁడు"

అంటూ స్తోత్రం చేసి దుడ్డో దుగ్గాణో తెచ్చుకుంటాఁడు. పాపం గాయకునికి అట్టి వీలులేదు.

1) "అగస్త్యుఁ డొకయెత్తూ, కమండలం వొకయెత్తూ, 2) సెట్టి సేరూ లింగం సవాసేరూ" అన్నమాదిరి, తంబూరాగాని, వీణగాని, ఫిడేలుగాని మోసుకుపోవాలి. యెక్కడి క్కడ మద్దెగాఁడు కుదరాలి. కుదిరితే మాత్రం, వాఁడికీవీఁడికీ జత కుదరాలి. యిదంతా కుదిరి పాటకచేరీ జరిగితే–

"ఈ సభలో నింతకు లాభ మేమొ యనుచున్ సందేహం". అందు చేతనే అనుకుంటాను గాయకులు వారివారి సంతతికి యే యింగ్లీషు ముక్కలో చెప్పిస్తారుగాని

గానంలో ప్రవేశపెట్టడం సకృత్తుగాకనపడుతుంది. యే హరి నాగభూషణం వంటిఛాందస గాయకులో తప్ప తమ తమ సంతానాన్ని గానంలో ప్రవేశపెట్టడమే లేదు - నాగభూషణంగారేనా నామాదిరిని కొడుకులకు - ఏ.బీ.సీ.డీ.లు కూడా రాకుండే పద్ధతిలో వుంచలేదు. కొంచెం రాజకీయ విద్యలోనూ పరిచితి వుందనిపించినట్లె. నాగభూషణంవంటి గాయకులు యీ కాలంలో అరుదనే చెప్పాలి. ఏమంటే ఇంగ్లీషులో బీ.యే. ఫస్టుగ్రేడు ప్లీడరూ, అసలు బి.యల్. ప్యాసయి అడ్వొకేటు అనిపించుకో తగ్గవాఁడే, కాని దానికి అంతకుముందు గర్భంలో పడ్డ రోజుల్లోనే అవలంబించిన సంగీతం బాధించి, అంటే (అంతాయింతా కాదు. 'సంగీతముచేత బేరసారము లుడిగెన్" అన్నమాదిరి నన్నమాట.) ఫస్టుగ్రేడు ప్లీడరు కావలసి వచ్చింది. అంతవరకూ సంగీతానికీ యింగ్లీషుకీ సమంగానే తన కాలాన్ని వినియోగపఱచేవాఁడు. కాని ఆ చెన్నపట్నంలో యెవరో - అయ్యరుగారి ఫిడేలుబాణీ విని ఆమాదిరిని వాయించాలని దీక్ష కలిగి యింగ్లీషు చెట్టెక్కించడంచేత - రాజకీయ విద్యలో మార్కులు లోపించాయి. బీ.యల్. కాలేకపోయి పిదప ఫస్టుగ్రేడుగా మాఱేఁడు. యీలాటివారు నామిత్రవర్గంలో యింకొకరున్నారు. వారు పూర్వాశ్రమంలో కే.టీ. రామారావుగారు - వీరు యమ్.యే. డిగ్రీపొంది కాలేజీలో లెక్చరరుగా రు.100-0-0ల జీతంలో వుండిన్నీ, బి.యల్. పరీక్షకు చదివేనిమిత్తం చెన్నపురి వెళ్లి అక్కడ ప్రస్థానత్రయం చదవడాని కారంభించి తుదకు తత్ఫలితం అనుకూలించి "పరమహంసలు"గా పరిణమించి ధన్యులైనారు. నాగభూషణంగారు యిటీవల - ప్రస్థానత్రయ శాంతిచేశారు. చాలా నిష్ఠాగరిష్ఠులు, సంస్కృతంలో మంచి పాండిత్యం, ఉభయ భాషలలో కవిత్వం వొకటేమిటి? మన ప్రాంతంలో యిన్ని విద్యలు వచ్చి యింత సదాచార సంపత్తి కలిగిన శిష్టులింకొకరు లేరేమో (ఛాందసత్వం సరేసరి) అనిపిస్తుంది. గానంలో చెన్నపట్నం వెళ్లకముందే నా ముందర తుంబురు నారదులు పనికిరారనే అభినివేశం వుండేది. (ఆయీ విషయం యితరత్రభంగ్యంతరంగా వ్రాసినట్టే జ్ఞాపకం) గాని నేనూ, కే.టీ. రామా రావుగారూ, యింకా కొందఱూ యీతనికి ప్రతిపక్ష గాయకులను అభిమానించే తెగ. 'యెడ్డెమంటే? తెడ్డెం'గా వాదిస్తూ వుండేవాళ్లం. ధనకోటి, నాగరత్నం, భవాని మొదలైన సుప్రసిద్ధ గాయనీమణుల సంగీత సభలు జరిగినప్పుడు శ్రీయుతులు సుసర్ల దక్షిణామూర్తి శాస్త్రులవారికీ గఱకపర్తి కోటయ్య దేవరగారికీ ఫ్రీ టిక్కెట్లు పంపించడం సరేసరి కాని, వారితోపాటు నాకూ, శ్రీ కే.టీ. రామారావుగారికీ కూడా వచ్చేవని జ్ఞాపకం.

నాగభూషణంగారు అప్పటికీ సుమారు యిరవైయేళ్ల వయస్సులో వుండేవారు. బహుశః, బి. యే. క్లాసు విద్యార్థిదశలో వుంటారని తోస్తుంది. యీయనకు - ఫ్రీ టిక్కెట్టు పంపేవారు కారు. పోనీ అని గుట్టుగా వూరుకో వచ్చునా? అలా వూరుకోక అస్మదాదులతో

కొంత సంఘర్షించడం వుండేది. దాన్ని గురించి వ్రాయవలసివస్తే చాలా పెరుగుతుంది. నేనూ, రామారావుగారూ యీ నాగభూషణంగారిని చాలా తేలికగా చూచేవాళ్లం అనేది భూతార్థం. యిటీవల నాగభూషణంగారు విశిష్టత్వాన్ని గానంలో సంపాదించాక కూడా దానిలో రహస్యాలు మాకేం తెలుస్తాయి–

ఉ. "చేరువవాడపల్లి నరసిమ్ముఁడితీరత మోయి బోగమ
మ్మోరులయాట సుస్తివరిముంగల దేముఁడదెంత యిద్దెలో
తీరుపయాసగంటి నొకతిత్తిని గుక్కిడఁకూఁదువాని కా
లూరక మొక్క బుద్ధగు నహో! యను మూర్ఖుఁడు చంద్రశేఖరా!"

అన్నట్టుంటుంది మాబోట్ల రసజ్ఞత్వం. ఆయన కొంతసేపు గానకచేరీ చేసి నాదబ్రహ్మముగా మారిపోయి పీఁటదగ్గిఱమాత్రం కమాను ఏకొంచెమో నడిపీ నడపనట్లు నడుపుతూ వుండే వైఖరి నూత్నదంపతులు క్రీడాగృహంలో సల్లాపిస్తూన్నట్లు – అనఁగా?

శ్లో. "కిమపి కిమపి మందమంద మాసత్తియోగా
దవిరళిత కపోలం జల్పతోః" (భవభూతి)

అన్నట్టుగా వుండిన్నీ యావత్తు సభకూ వినపడుతుంది. ఆ వినికికి కారణం సభవారు నిస్తరంగసముద్రులుగా మాఱడమైనా కావచ్చును. ఆలా మాఱడాని క్కారణం యేమిటంటే, వేఱే చెప్పనక్కఱలేదు. ఆ సమయంలో యేమాత్రం యెడమచేతి వ్రేలు ప్రమాదానికి గుఱి అయినా – గోవిందా! అని గాయకుఁడు పాతాళ గర్తంలో కూలవలసిందే. ఆ జ్ఞానమంతా యెడమ చేతిదే, పాపం! భగవంతుఁడు ఆ చేతియందే తన తేజాన్ని లోపింపఁ జేశాఁడు. ఆ యీ తన పోకడ కొడుకుల కలవాటు పడక పూర్వమే యీ అపకారం జరిగింది. ఆ అపురూపపు పోకడ (దక్షిణ దేశంలో కాదు) మన తెలుఁగుదేశంలో పోయేవారున్నారో లేదో? ఉంటారే అనుకుందాం, యిది గానంగాని కవిత్వం కాదు. మర్మం విడిచి కొడుక్కు కూడా గాయకులు చెప్పరని కింవదంతి. అట్టి స్థితిలో యెవరు చెపుతారు–

శ్లో. "యాతే దివం పితరి తద్వచసైవ సార్థం
విచ్ఛేదమాప భువి యస్తుకథా ప్రబంధః"

అన్నాఁడు బాణమహాకవికొడుకు ఉత్తరకాదంబరిలో – అక్కడ బాణుఁడు స్వర్గానికి వెళ్లడంచేత ఆ దుర్యోగం పట్టింది. ప్రస్తుతం, నాగభూషణంగారు సజీవులై దీర్ఘాయుష్మంతులై కొంత ఆరోగ్యంలో (ఫిడేలుకు మాత్రం పనికిరానిస్థితి) వుండఁగానే దుర్యోగం పట్టింది. యిప్పుడెవరేనా నాగభూషణంగారిని నీకు సంగీతంలో యేమీ రాదని అన్నా వూరుకోవలసిందే. శ్రీరాముఁడేమన్నాఁడు పరశురాముణ్ణి –

"పటచ్చరీభూతా ఖల్వియం కీర్తిపతాకా, నన్విదానీమేవ ద్రష్టవ్యమ్"

రామునివంటి నిషధయోగ్యుఁడే ఆవిధంగా ప్రశ్నించినపుడు యితరులు ప్రశ్నించరను కోవడానికి వీలుంటుందా? మనదేశానికి పేరుతెచ్చిన శ్రీనారాయణదాసుగారు, నాయుఁడుగారు లోనైనవారిలో - నాగభూషణంగారొకరు. సంగీతానికి వుపయోగించక పోయినా యితర గాయకులలో (నారాయణదాసుగారికి వినా) పలువురికిలేని ప్రజ్ఞలు నాగభూషణంగారికి వున్నాయి-

'ఇదం బ్రాహ్మ్య మిదం క్షాత్రం' అనే శ్లోకానికి నాగభూషణం గారు ప్రథమోదాహరణం కావడంలో అత్యుక్తి వుండదు కాని ఆ యితర విద్యలే యీయన్ని అస్మదాదుల తరగతిలోకి ఆకర్షించి - భిక్షాటకులా? అనే శీర్షిక కింద వుదాహరించి కొంత వర్ణించడానికి అవకాశం కలిగించినది. యీయన కవి, ప్లీడరు, సాహితీవేత్త, వేదాంతి, ఛాందసుఁడు. ఆ యీ లక్షణాలలో ప్లీడరీ తప్ప తక్కిన చిహ్నాలు అస్మదాదుల తరగతిలోకే ఆకర్షిస్తాయి. ఆకర్షిస్తే ఆకర్షించనివ్వండి, నాకు ఆ యీ తరగతియందే యెక్కువ ప్రేమ. అందుకే

 మ. "పరమాదృష్టము పెట్టి పుట్టినటులేభావించి గర్వింతు, దు
స్తరమీ హూణశకమ్మునం దితరభాషన్ బొట్టకై నేర్వకే
సురభాషన్ బఠియించి యక్కతన సంస్తుత్యుండనై మించితిన్
సిరియున్ సంపద కూడ నీ కరుణచేఁ జేకొంటిఁ గామేశ్వరీ."

యేదో యీ విధంగా వున్నదానితో సంతృప్తి పడాలిగాని గొంతెమ్మ కోరికలు కోరడం మొదలిడితే "మనోరథానా మతటాః ప్రవాహాః".

భర్తృహరి యేమన్నాఁడు? "మనసిచ పరితృప్తే కోఽర్థవాన్ కోదరిద్రః" అనలేదా? యీ మనస్సుకు తృప్తంటూ వుందా? తృష్ణకు అంతమంటూ వున్నట్టు తోఁచదు. "తృష్ణా నజీర్ణా, వయమేవ జీర్ణాః"

కవులూ, గాయకులూ ఐశ్వర్యానికి వొక విధమైన నోమే నోఁచినా చిల్లరదుకాణం పెట్టడానికి సంశయించకపోతే గాయకులకు పట్నవాసాలు కొంచెం జీవనాన్ని (శిక్షల ద్వారా) కలిగిస్తాయి. యిప్పుడు పెండ్లికూఁతురుకు కావలసిన క్వాలిఫికేషనులో సంగీతం వొకటి. నిన్న-మొన్నటిదాఁకా సంగీతం వుంటే సరిపోయేది. ఇటీవల మఱొకటి చేర్చారు. యింగ్లీషు స్కూలు ఫైనలు దాఁకానేనా వుండాలి. పూర్వం యెవరో కవి "కన్యా పితృత్వం ఖలు నామ కష్టం" అని తన మనోదుఃఖాన్ని వెలువరించాఁడు. అప్పటికింకా యీ చిక్కులు గోచరించనేలేదు. అయితే కొంచెం దూరాలోచన చేసి చూస్తే ఆయీ క్వాలిఫికేషన్సు కల కన్యలకు వివాహంచేసేభారం తల్లిదండ్రుల మీఁద వుందనుకోవచ్చును.

"అఙ్భిన్నం పరేణ సంయోజ్యం" అన్నట్టు స్కూలులో వుండఁగానే యెవరో స్వయంవరంగా పరిగ్రహించడం తటస్థించే యెడల తండ్రి వరాన్వేషణానికని, హైస్కూళ్లూ కాలేజీలూ పరిశీలించడానికి ఆయా తరగతుల టీచర్లనీ, లెక్చెరర్లనీ ఆశ్రయించడం బాధ నూటికి 99 పాళ్లు తప్పిపోతుందని సంతోషించవచ్చు ననుకుంటాను. అప్పుడల్లా వివాహంచేస్తే సరిపోతుంది. కుల గోత్రాదులు పెట్టుకోనక్కఱలేదు. ఆ యీ పద్ధతి అమల్లోకే వస్తే గేస్తులు కణ్వమహర్షులుగా పరిణమిస్తారు. యిది మన భారతదేశాచారమేకాని ఖండాంతరాచారం కాదనడానికి శకుంతలాసతియే చాలును. శారదాబిల్లు వచ్చి అయిదురోజుల పెళ్లిని వొకరోజులోకి తెచ్చింది గాని ఆవొకరోజేనా యేవో మంత్రాలు తంత్రాలూ మంగళ వాద్యాలూ చుట్టాలూ పక్కాలూ భోజనాలూ పిండివంటలూ యింకా తప్పడంలేదు, యీ పిమ్మట లోఁగడ వుదాహరించిన క్వాలిఫికేషన్సు పద్ధతి అమల్లోకి వస్తే "కరగ్రహః ప్రథమమభియోగః" అన్న గోవర్ధనాచార్యుల సప్తశతిశ్లోకమే పురోహిత స్థానాన్ని అలంకరిస్తుంది.

మన నాగరికత "ప్రతిక్షణ విజృంభణాదుభయ బాహుకూలం కషస్తనత్రుటిత కంచుకం నమత యౌవనం యోషితామ్" అన్నరీతిని విజృంభించడం చాలా అభినందనీయం. యీ సందర్భమేనా నిర్బంధ కట్నాలను వారిస్తే బాగుండును. కొన్ని శాఖలలో విద్యనిబట్టి, ధనాన్ని బట్టి, భూమినిబట్టి గౌరవాన్నిబట్టి కట్నాల తారతమ్యం వుంటుంది. కొన్ని శాఖలలో విద్యాదులేమీ ఆవశ్యకంలేదు. పెండ్లి కొమారుఁడు, అనేడు ప్రత్యయానికే అట్లీస్టు నాలుగువేలు పయిగా చెల్లించాలి. ఆయీ మహాఘోరం యిరవయ్యో శతాబ్దారంభాన్నుంచి మొలకెత్తింది. యిప్పుడుబాగా పెరిఁగిపోయింది. యీ కట్నం అడగడంలో అడగనట్లు అభినయించే వారు కొందఱు. మచ్చు చూపుతాను, ఒక వియ్యాలవారంటారు కదా? "అయ్యా! మాకు యేమీ కట్నంతో అవసరంలేదు. ఉభయఖర్చులు పెట్టి పెండ్లి సలక్షణంగా చేసి పంపండి. అల్లుఁడు కట్నం కోరలేదు గనుక పెండ్లికూఁతురుకు నగలు పెట్టండి. మీరే మీ పిల్లకు నగలు పెట్టుకోండి." యిది కవుల భిక్షాటనానికంటే కూడా పైతరగతిలోకి డేఁకుతుంది. యేదో వ్రాస్తూ దేనిలోకో వచ్చాం. అసలేమో వ్యాసం కవుల భిక్షాటనాన్ని గుఱించి ఆరంభం. ముగించే సమయానికి గాయకులు వచ్చి కలిశారు. అంతలో నేఁటి పెండ్లి కట్నాలు వచ్చి కలిశాయి. మంగళాంతంగా వ్యాసం ముగించడం శ్రేయః ప్రదమే కదా! కవులు భిక్షాటకులు కారని సమర్థించడానికి కలం చేతఁబట్టినా తుదకు అభీష్టార్థసిద్ధి కాలేదనుకుంటాను. భిక్షాటకులు కాకపోతే రసజ్ఞ లోకానికి మంచి కవిత్వం వుదయించదు, యేమంటారా? ఆపక్షంలో కవి యిల్లు కదలనే కదలఁడు. అప్పుడు–

1) శ్లో. "మద్గేహే మశకీవ మూషికవధూర్మూషీవ మార్జాలికా,
మార్జాలీవ శునీ శునీవ గృహిణీ వాచ్యాః కిమన్యే జనాః."

2) శ్లో. "క్షుత్తృ డాశాః కుటుంబిన్యో, మయి జీవతి నాఽన్యగాః;
తా సా మంత్యా ప్రియతమా, తస్యాశ్శృంగార చేష్టితమ్"

3) శ్లో. "ఆరనాళగళ దాహశంకయా మన్ముఖాదపగతా సరస్వతీ"

4) క. "శీతల సలిలస్నానము
భూతలమున శయ్యయొంటిపూట మెతుకులు
న్నాతిగల బ్రహ్మచర్యము
నాతరమా? రోజు గడపనారయభూపా!"

5) శా. "వేధన్ దిట్టఁగరాదుగాని భువిలో విద్వాంసులన్ జేయనే
లాధీచాతురిఁ జేసెఁ జేసిన గులా మాపాటుతోఁబోకక్షు
ద్బాధాదుల్ రచియింపనేల? అది కృత్యంబైన మూఢాత్ములన్,
ఛీ! ధాత్రీశులఁ జేయనేమిటికయా! శ్రీకాళహస్తీశ్వరా!"

6) "శా. సంతోషించితిఁ జాలుఁజాలు బహురాజ ద్వారసౌఖ్యములన్
శ్రాంతిన్ జెందితిఁ జాలుఁజాలు రతిరాజ ద్వారసౌఖ్యమ్ములన్
శాంతిన్ జెందెదఁ జూపు బ్రహ్మపదరాజ ద్వారసౌఖ్యంబు ని
శ్చింతస్వాంతుఁడ నౌదు నీ కరుణచే శ్రీకాళహస్తీశ్వరా!"

7) "తిండికైతె పదిమంది వసంతి, తండులాలు గృహమందునసంతి
రండనా కొడుకు లెల్ల హసంతి కొండగోగులు గృహేవిలుఠంతి"

కవులు ఆగర్భశ్రీమంతులుగా వుండే పక్షంలో ఆ యీపూర్వోక్త రీతిని చక్కని కవిత్వం వెలువడ దని ఆలోచించే అనుకుంటాను బ్రహ్మదేవుఁడు కవులను నొకవిధమైన భిక్షాటన తరగతిలో సృజిస్తాఁడు. బ్రహ్మ దేవుఁడు ఆలోచించి, ఆలోచించి కవులనూ, గాయకులనూ పూర్వోక్త విధంగా సృష్టించినా ఆ యీ రెండు తెగలలోనూ కొందఱు తమ స్వాతంత్ర్యాన్ని నిల్పుకుంటూనే జీవయాత్ర సాగించినట్లు కనపడుతుంది-

చ. "నిరుపహతి స్థలంబు రమణీ ప్రియదూతిక దెచ్చి యిచ్చుక
ప్పురవిడె మాత్మకింపయిన భోజనముయ్యెల మంచ మొప్పుఁదఱ
ప్పరయురసజ్ఞు లూహదెలియంగల లేఖకపాఠకోత్తముల్
దొరికినఁగాక యూరకకృతుల్ రచియింపు మటన్న శక్యమే"

ఆ యీ పద్యం రాయలకు యేదో సందర్భంలో పెద్దన్నగారు యిచ్చిన జవాబు. దీనిలో కవి తనకుఁగల స్వేచ్ఛను వెలువరించాఁడు. శ్రీ విజయనగర సంస్థాన గాయక శిరోమణులలో వొకరైన, కీ.శే. శ్రీ కలిగొట్ల కామరాజుగారిని గూర్చి చిత్రంగా చెప్పుకుంటారు. పల్లవిలో ఈ మహనీయుఁడు అద్వితీయుఁడని చెప్పఁగా వినడం. ఆ యీ గాయక శిరోమణి తనకు తోఁచినప్పుడేగాని ప్రభువు కోరినా పాడే ఆచారం లేదని వినికిడి. శ్రీ పరవస్తు రంగాచార్లయ్యవార్లంగారు, తమ యేర్పాటు ప్రకారమైతేనేగాని విజయనగర సంస్థానంవారి ఆస్థానానికి వెళ్లడానికి వొప్పుకొనేలేదు - ఆ యేర్పాట్లు. 1) సవారీతో కోటద్వారం వఱకూ వెళ్లడం. 2) అక్కడ సవారీ దిగి పాదుకలతో సభవఱకూ వెళ్లడం. 3) అక్కడ పాదుకలు వదలి సభకు వెళ్లి సభలో చిత్రాసనంమీఁద కూర్చోవడం.

ఆ యీ మూఁడింటలోనూ మూఁడవదానికి శ్రీ మహారాజావారు చెప్పిన అడ్డంకి యేమిటంటే? స్వామీ! సభలో మీరు చిత్రాసనం మీఁద కూర్చుండడానికి మాకేమీ అభ్యంతరం లేదుకాని ఆ సందర్భం మా పండితుల కవమానకరంగా వుంటుంది గనుక అంగీకారం కాదన్నారనిన్నీ, ఆ పద్ధతిని - మేము రానే రాము అని ఆచార్యులవారు నిరాకరించా రనిన్నీ మాపరమ గురువులు చెప్పఁగా విన్నాను - యెవరోతప్ప మహావిద్వాంసులు గాని మహాకవులుగాని మిథ్యాస్తవాలు చేయరు, ఒక షట్ఛాస్త్రవేత్త మహాపండితునకు, ఒక మహాసంపన్నుఁడు నూటపదహాఱు పెద్దకాసులూ సేలువులూ యిచ్చి సన్మానించాఁడు. ఆ యీ సన్మానం వేఱొక పండితుని ప్రయత్నంమీఁద జరిగింది. ఆ ప్రయత్నించిన పండితుఁడు ఆ గృహస్థుని గూర్చి కొంచెం శ్లాఘించవలసిందని హెచ్చరించే టప్పటికి ఆ మహావిద్వాంసుఁడు శ్లాఘించిన వాక్యం యిక్కడ వుదాహరించేది లేదు - తాత్పర్యం వ్రాస్తాను.

మీ యిల్లు యిల్లులాగ లేదు. అనఁగా, యేదో మహారాజు గృహం లాగవుందని శ్లాఘించినట్లయింది. కాని దానిలో నుంచి వ్యంగ్యం తీస్తే ఆగృహస్థు యేకులంవాఁడో ఆ కులాన్ని యీసడించి నట్లయింది. అష్టకష్టాలు లోకంలో ప్రసిద్ధం. అందులో మిథ్యాస్తవం చేరలేదు, కాని చేరతగ్గదే. దానిలో యేకొంచెమో గుణంవుంటే "పరగుణపరమాణూన్ పర్వతీకృత్య" అనేది పెంపుచేసి ప్రసంగించవచ్చును గాన కేవలం నిర్గంధ కుసుమాలని గూర్చి ప్రశంసించడం చాలా కష్టం. ఆ యీ బాధ కవుల కప్పుడప్పుడు కలుగుతూ వుంటుంది.

1) "మాతర్నాతః పరమనుచితంయత్ఖలానాంపురస్తా దాస్తాశంకం జఠరపిఠరీ పూర్తయే నర్తితాని" (లీలాశుకుఁడు)

2) "అరసికాయ కవిత్వనివేదనం శిరసి మాలిఖ మాలిఖ" చూ

యీవిధంగా పలువురు కవులు తమ పశ్చాత్తాపాన్ని వెలిబుచ్చి వున్నారు, యేమైనా సరే అంతో యింతో కవి భిక్షాటకుఁడుగా వున్నప్పుడే కొంత అందం వుంటుంది. ఆగర్భ శ్రీమత్త కవిత్వానికి సహాయపడదు.

"తిరుగంగవలె దేశదేశాల వెంబడి
పడవలెఁ బడరాని పాటులెల్ల... ... ... ...
కవులు కవులన్న మాత్రాన కవులుగారు
విజయనగర మహారాజ విపులతేజ!"

★ ★ ★

# శిష్టావారి విశిష్టత్వం

ఎట్టిదో నాకు గోచరించినంతలో కొంచెం వ్రాయవలసిన ప్రసక్తి కలిగింది. ఏ మహావ్యక్తిని గూర్చి వ్రాయవలసిన ప్రసక్తి కలిగిందో, ఆ వ్యక్తికిన్నీ నాకున్నూ సుమారు ముప్పై మూఁడేండ్ల కాలమునుండి గాఢమయిన పరిచయం వుంది. యీ పరిచయాని క్కారణం నేను బందరు (ప్రస్తుతం కాలేజీగా మాఱిన) హైస్కూలుకు తెలుఁగు పండితుఁడుగా వెళ్లడమే. వ్రాయఁదలఁచుకొన్న మహావ్యక్తిషడ్దర్శనీ పారగులు శ్రీ శిష్టానరసింహ శాస్త్రులుగారు. వ్రాసే వ్యక్తి యేదో మాదిరిని నాలుగు తెలుఁగు ముక్కలూ నాలుగు సంస్కృతపు చెక్కలూ కలగాపులగంచేసి నలుగురి నోళ్లల్లో ఎలాగో పడి పైకి వచ్చిన నేను. యెవరినేనా మెచ్చవలసివచ్చినా లేక యీసడించవలసివచ్చినా ఆవలివారిని యే విషయంలో ఆయా పనులకు గుఱిచేయవలసి వస్తుందో ఆయా విషయాలలో యీవలి వ్యక్తికి ఆవలివారిని మించిన పాండిత్యం వుండడం ఆవశ్యకం. అదిలేని పద్ధతిని మెచ్చిన మెప్పుగాని యీసడించిన యీసడింపుగాని విజ్ఞలోకం ఆదరించదు. ప్రస్తుతం యెవరిని గూర్చి నేను యీ అభినందనం వ్రాయవలసి వచ్చిందో ఆ నరసింహ శాస్త్రుల్ల గారికి "షడ్దర్శనాలయందున్నూ మహారాజాస్థానాలలో పరీక్ష యిచ్చి పొందిన సర్టిఫికెట్లు వున్నాయి. నాకు ఆలాటి సర్టిఫికెట్లు లేవు. నా ప్రధాన గురువు బ్రహ్మయ్య శాస్త్రుల్లుగారు మాత్రం షడ్దర్శనీవేది చర్ల బ్రహ్మయశాస్త్రి గురువరేణ్యుఁడు ధరాభరణ! మాకు" ఇత్యాదులు చూడఁదగు. దీనివల్ల నాకు– "సంధ్యావందనం నమ్మగురువు కిల్లా" అనే దోషం తొలఁగినట్లయిందే కాని ఆ మహావ్యక్తిని గూర్చి అభినందించే యోగ్యత కలగనే లేదు. యిట్టి స్థితిలో నేను బందరు శిష్యుల కోరికమీఁద యిటీవల షష్టిపూర్తి దరిమిలాను బందరుకు మూడోసారి తలవనితలంపుగా వెళ్లడం తటస్థించింది. వెళ్లిన మూఁడోనాఁడే అపారమైన పడిశభారంతో నలగడంవల్ల ఆంధ్రజాతీయ కళాశాలావరణంలో కూప కూర్మంవలె వుండవలసిన వాణ్ణయినాను. పలువురు ఆప్తులు రావడంలో శ్రీ శాస్త్రులుగారున్నూ దయచేయడం తటస్థించింది. వారు కొత్తగా రచించిన "ఇందిరాపరిణయం" అనే నాటకాన్ని నాకు యిస్తూ వారికి నాయందు వుండే అవ్యాజమైన ప్రేమకు స్ఫోరకంగా వుండే మాటలు వాక్రుచ్చినారు, ఆ మాటలు నేను "యథావద్వస్తు వర్ణనం" గానే జమకట్టుకొనే యెడల నాకు వుండే అధికారం యే యూనివర్సిటీకి కూడా వుండకపోవలసి వస్తుందని

భయపడుతూన్నాను. యింకోటి : అలా నేను సంతోషించే పక్షంలో నావంటి అమాయకుండంటూ ప్రపంచకంలో లేకపోవలసి వస్తుంది కూడాను. అందుచేత నాశక్తిని గుర్తెఱింగినయ్యేవే నేను శాస్త్రుల్లుగారి కవిత్వాన్ని గూర్చి నాల్గు మాటలు వ్రాయవలసి వ్రాస్తున్నాను.

శాస్త్రుల్లుగారు తెలుంగులోకూడా కొన్నిపొత్తములురచించియున్నారు. కాని ప్రస్తుతం నాకభిప్రాయార్థంగా యిచ్చింది సంస్కృత నాటకం. దీన్ని గూర్చి సంక్షేపరూపంగా భగవంతుఁడు తోపించిన అభినందనాన్ని మిక్కిలిగా క్రోడీకరించి వ్రాస్తున్నాను. సంస్కృత పత్రికకే పంపితే యెన్నో రెట్లు వ్రాయవలసిన నాటకమిది యనుట నిర్వివాదము. యీశాస్త్రుల్లుగారు "షడ్దర్శనీపారగు" లనేసందర్భాన్ని లోకంతోపాటు నేనున్నూ విశ్వసించేవాణ్ణే గాని, యేమాత్రమో కవనం అల్లఁగలరనే తప్ప సంస్కృతంలో యింతటి ధారాశుద్ధి గలవారనే విశ్వాసం నాకు యితః పూర్వంలేదు, లేనేలేదు. అందుక్కారణం వారిగ్రంథాలు నేను శ్రద్ధగా చదవకపోవడమే. వీరుకవులనే కాదు, మహాకవులని, అందులో ఆధునికుల పుంతలోనివారు కారని, యే మురారి మహాకవి ధారతోనో పోల్చతగ్గధార వీరిదని వీరి యిందిరా పరిణయం నాకుబోధించింది. యిట్టినిరాఘాటమైన ధారతో నిర్దుష్టంగా కవిత్వం చెప్పేవీరికి ప్రపంచకంలో కవులలో స్థానం యెందుకు లేకపోయిందా! అని సంశయం కలుగుతూవుంది. కాని శాస్త్రజ్ఞులెవరున్నూ కవులనిపించుకోడానికి చాలా అభిజాత్యం పెట్టుకుంటారనిన్నీ నాచిన్నప్పుడెఱుఁగుదును. శాస్త్రం చదువుకున్నవాళ్లంటే కవిత్వం చెప్పుకొనే వాళ్లకు యెంతోగౌరవం వుండటమున్నూ, కవిత్వం చెప్పేవాళ్లంటే శాస్త్రజ్ఞులకు యీసడింపున్నూ సర్వసామాన్య విషయాలే కాని నాచిన్న నాఁటికి కొత్తవికావు. అందులో తెలుఁగులో కవిత్వం చెప్పేవాళ్లంటే సంస్కృతపండితులు బొత్తిగా తోఁటకూరలో పురుగువంతుగా చూడడం నేను అనుభవ సిద్ధంగానే యెఱుఁగుదును. యీ కారణం చేతనే మా పరమ గురువులు బ్రహ్మయ్యశాస్త్రులుగారికి జంకుతూ జంకుతూ చాటునా మాటునా మేము శాస్త్రాభ్యాసకాలంలో కవిత్వాన్ని సాగించేవాళ్లం. దానిక్కూడా వారు అంగీకరించేవారు కారన్నమాట. అందుకే మేము శాస్త్రవ్యాసంగానికి అడ్డుతగలని పద్ధతిని కవిత్వం చెప్పుకోడానికి అభ్యనుజ్ఞ పుచ్చుకోవలసి వచ్చింది. ఆపద్ధతి కవిత్వమే మా ధాతురత్నాకరరచన. ప్రస్తుతం శిష్టాకవిగారు - కాదు, పండితుడుగారు - నిరాఘాట రచనాధురంధరులై వుండికూడా యేసంస్థానానికిన్నీ కవినని వెళ్లినట్లు కనపడదు. అప్పయ్య దీక్షితులంత వారిక్కూడా యీతలతిక్క వున్నట్టు- "పిళ్ళః కవిరహం విద్వాన్" అనే వాక్యంవల్ల స్పష్టపడుతుంది. పూర్వకాలంలో మాట నేను చెప్పలేనుగాని నావిద్యాభ్యాస కాలానికి కవి అనిపించు కోవడంకంటె పండితుఁడనిపించుకోవడమే గౌరవాపాదకమని నేను బాగా

యెఱుఁగుదును. గద్వాలాదులలో కవికి పూర్ణసమ్మానం రు. 12లు వార్షికం. శాస్త్రజ్ఞులకు పూర్ణసమ్మానం రు18లు వార్షికం. కవికి శాస్త్రజ్ఞులతోపాటు సమ్మానంలేదు సరిగదా, గాయకులతో పాటుకూడా సమ్మానంలేదు. యీ దురన్యాయాన్ని సహించలేకే వనపర్తి సంస్థానంలో-

క॥ గానమ్ముకన్న కవన - మ్మేనాఁడేనియును తక్కువే?

అంటూ నేను రాజుగారితో వివదింపవలసివచ్చింది. విషయం విషయాంతరంలోకి పోతూవుంది. ప్రస్తుతం మనకు ముఖ్యంగా కావలసింది, పండితులు కవిత్వాన్ని చెప్పినప్పటికి కవినామధారణకు లజ్జపడతారనే దియ్యేవే. షడ్దర్శనీవేత్తలుగావున్న మన శిష్టాశాస్త్రుల్లుగారు కూడా ఈకారణాన్ని పురస్కరించుకొనియ్యేవే "కలౌషష్టి" అతిక్రమించే వఱకున్నూ యేచిల్లర మల్లరలో తప్ప పుస్తకరూపంగా యేవిషయాన్నీ ప్రచురించినట్టు లేదనుకుంటాను. ఆ మధ్య కాళిదాసకృత మేఘసందేశాన్ని ఆంధ్రీకరించి నట్లెఱుఁగుదును. దానివల్ల వీరు బాల్యాదారభ్యా అభ్యసించినవిద్య సంస్కృతమైనా, ఆంధ్రంమాతృభాష అనే హేతువుచేతో, కాలేజీలో ఆంధ్రాని క్కూడా వీరు వుపాధ్యాయులుగా వుండవలసి వచ్చో, దానిలో కూడా కృషి చేసినట్లు విస్పష్టమే. వీరి కవితాధార ఆంధ్రంలో కూడా ధారాళంగానే నడుస్తుంది. అయితే వీరి ఆంధ్రీకరణానికి లోకంలో తగినంత వ్యాప్తి కలిగిందా అంటే మాత్రం తగిన జవాబు లేదు. శాకుంతలాంధ్రీకరణానికి వీరేశలింగం పంతులవారికిన్నీ, మేఘసందేశాంధ్రీ కరణానికి వ -సు. రాయుఁడు గార్కిన్నీ కొంత పేరు వచ్చినట్లు లోకంవల్ల తెలుస్తుందే కాని తక్కిన వారి కెవరికిన్నీ అంతటి అదృష్టం పట్టినట్లు కనపడదు. అంతమాత్రంచేత వారివారి ఆంధ్రీకరణాలు వ్యర్థాలనడానికి వలనుపడదుగదా? ఇంతటి మహాశాస్త్రవేత్త కవి కావడమే దుర్ఘటం, ఆ కావడంలో సంస్కృతంలో అయితే కావచ్చుఁగాక దేశభాషలోకావడం మిక్కిలి అభినందనీయం. యిది హరినాగభూషణంగారి వంటి మహాగాయకుఁడు, లేదా శిరోమణి పనిపడితే గజ్జకట్టి నారాయణదాసువలె హరికథాకాలక్షేపం చేయడం వంటిది. వెనక శ్రీ శిష్టు కృష్ణమూర్తిగారు వేదం వచ్చి, వేదాంగములున్నూ వచ్చి ఉభయ భాషా కవియై కులవిద్యయైన వీణలో అఖండుఁడై, సన్నాయి కూడా వాయించుట డోలు కూడా వాయించుటవంటిదిగా భావించవలెను. వెనుక శ్రీమదహోబల శాస్త్రుల్లుగారు శ్రీ చింతామణి గణపత్యుపాసకులు కాశీలో చెప్పులు కుట్టుటలోకూడా పాండిత్యమును కనపఱచి తజ్జాతీయునిచే సర్టిఫికెట్టు పుచ్చుకొన్నట్లు గురువులవల్ల విన్నాను. యాయన ఆంధ్రుఁడు. కాశీలో నెల్లపండితులను జయించి "కాశ్యా మేకః కాశినాథోఽ వశిష్టః" అని విరమించినట్లు వినికి. కాశీలో విద్యార్థులు నేఁటికిన్నీ

యేటేటా పూజించే గణపతి యీ శాస్త్రులుగారు ప్రతిష్ఠించిన దైవతమే. ఆ పూజ ఆంధ్ర విద్యార్థుల యాజమాన్యం మీఁదనే మా విద్యార్థి దశ వఱకున్నూ జరిగేది. బహుశః యిప్పుడుకూడా డిటో ప్రకారమే జరుగుతూ వుందనుకుంటాను. మన ఆంధ్రులలో కాశీని కూడా వకమూలకు తెచ్చిన విద్వాంసులుండేవారని పయిసంగతి సాక్ష్యమిస్తుంది. నిన్న మొన్నటిదాఁకా సజీవులైవున్న శ్రీ మహామహోపాధ్యాయ భట్టాచార్య గంగాధర శాస్త్రుల్లుగారు కూడా ఆంధ్రులే. ఇట్టివారు బహుమంది మన ఆంధ్రులలోవున్నారు. ఆకాలంలో వేదశాస్త్ర శ్రౌతాలల్లో వ్యాసంగం చేసి లోకాతీతులనే పేరు పొందేవాళ్లుండేవారు. ఈ కాలంలో రాజకీయ భాషల్లో పాండిత్యం సంపాదించి ఖండాంతరాల్లో మహా మహోపాధ్యాయ స్థానాన్ని అలంకరిస్తున్నారు. ఉదాహరణం లేక ప్రథమోదాహరణం, శ్రీ రాధాకృష్ణన్. శ్రీ శిష్టాశాస్త్రుల్లుగారు బందరువారు కాకపోయినా కొంచెం పైకి వచ్చింది మొదలు తమ పాండిత్యాన్ని బందరుకే వినియోగించిన కారణంచేత బందరు పౌరులు వీరిని శ్రీయుతులు నాదెళ్ల పురుషోత్తమ కవివతంసునితోపాటు తమవారినిగా పేర్కొని గర్వపడుటకు శంకింపనక్కరలేదు. పురుషోత్తమ కవిగారు గురు శుశ్రూషవినాగా అనేకవిద్యలలో నాటితేటిన ప్రజ్ఞావిశేషమును సంపాదించుటయేకాక దానినంతటినీ పట్టణవాసులకొఱకు నిర్వ్యాజముగా నుపయోగించిన విద్యా వయోవృద్ధులు. "ప్రినిసిపల్డుమేన్" అనే యింగ్లీషుభాషావాదుల టైటిల్సుకు వీరు ప్రథమోదాహరణం కాఁదగ్గవారు. నరసింహ శాస్త్రులు గారు "తప్పించుక తిరుగువాఁడు ధన్యుఁడు సుమతీ" అనే మాదిరివారు. వీరు చాలాభాగం తమతండ్రి శ్రీ సీతారామశాస్త్రులవారి యొద్దనే విద్యాభ్యాస మొనర్చినట్లు వ్రాసుకొని యున్నారు. ఆశ్లోకమునుదహరిస్తాను.

శ్లో. విద్వన్మత్తేభపంచాననబిరుదధరో దక్షిణస్యాం తథైంద్ర్యాం
భూయష్షట్కృత్వ ఊరీకృత నిగమశిరోరత్న భూషాకలాపః
శ్రీ సీతారామ విద్వద్గురు చరణసమారాధనావాఽప్తవిద్యో
వ్యద్యోతిష్టాఽష్టదిక్షుస్వయ మతులయశా శ్శిష్టవంశ్యో నృసింహః॥

యీ సీతారామ శాస్త్రులవారి సాహిత్యం మిక్కిలి సుప్రసిద్ధం. వీరు కేవలసాహితీపరులు మాత్రమేకారు. వీరివల్ల ప్రస్థానత్రయశాంతి చేసిన వారెందఱో కలరు. సదరు శాస్త్రులవారి దర్శనం నేను గుంటూరులో చేసివున్నాను. మాటలాడడంలోకూడా యీశాస్త్రుల్లుగారు బహు చమత్కారులు. వీరు వార్ధక్య దశలోకి వచ్చారనే కారణంచేత గుంటూరుకాలేజీ ప్రిన్సిపాలు "వుల్లు" దొరగారు రిటైరు కావలసిందని చెప్పడానికి పూర్వరంగ ప్రశ్నగా "శాస్త్రుల్లుగారూ? మీకెన్నియేళ్లు" అని అప్పుడప్పుడు అడుగుతూ వచ్చేవారఁట. దానికి

సీతారామ శాస్త్రుల్లుగారు తడుముకోకుండా "తొమ్మిదేళ్లు" అనే చెపుతూ వుండేవారంట. కొంచం తెలుగు మాట్లాడడం చేతనైన సదరు ప్రిన్సిపాల్ "వుల్లు గారు" "వాటీజ్ దట్" అని తనలో తానే ముసిముసినవ్వులు నవ్వుకొని వూరుకునేవారంట! తుట్టతుదకువకనాఁడు ప్రిన్సిపాల్‌గారు గట్టిగా నిర్బంధించి అడిగేటప్పటికి- "తొమ్మిదేళ్లంటే అఱువై మూఁడేళ్లు" అని సమాధానం చెపితే దొరగారు చాలాసంతోషించి మళ్లా కొన్నాళ్లు వుండడానికి ఆర్డరు ప్యాసుచేశారంట. ఆ శాస్త్రుల్లుగారి వాక్చాతుర్యాన్ని వర్ణించవలసివస్తే చాలాగ్రంథం పెరుగుతుంది. దీన్ని బట్టి మనకథానాయకుఁడు నరసింహ శాస్త్రుల్లుగారి వంశం అనాదిగా విద్యావంశమని మనం సంతోషింపవచ్చు. కథానాయకుని కుమాళ్లలో కొందఱు ప్లీడర్లుగానూ, కొందఱు ఉపాధ్యాయులుగానూ వున్నారు. విమర్శనాలు వగైరాలలో పాల్గొన్నవారున్నూ వీరిలో వున్నారు. వాగ్బంధం బ్రహ్మాస్త్రం మొదలైన పేళ్లతో అవి అచ్చయి వున్నాయి. మొత్తం శాస్త్రుల్లుగారికి సర్వైశ్వర్యాలున్నూ ఫలించాయన్నమాట. తుదకు "నాటకాంతం కవిత్వమ్" అనే అభియుక్తోక్తి సార్థక పడేటట్టు యీ "ఇందిరాపరిణయ" నాటకాన్ని రచించారు. ఇది సముద్రమథనంతో ప్రారంభమయింది. నృసింహావతార కథతో పరిసమాప్తి చేశారు.

శ్లో. ఛన్నం వ్యోమతలం విమాననిచయై రభ్రైరివ ప్రావృషి
శ్రావ్యాదిక్షు చరంతిదుందుభిరవా వర్షాసు నిర్హ్రాదవత్
విద్యుత్పఙ్క్తినిభాశ్చరంతి వనితా దివ్యాఃప్రియైస్స్వైరితో
బ్రహ్మాఽండం నిరవద్య మద్య లలితం పాణిగ్రహే శ్రీహరేః.

ఉదాహరించిన శ్లోకద్వయం వల్లనే గ్రంథకర్త ధారాశుద్ధి యెట్టిదో విజ్ఞులు గురుతింపగలరు. యెంతపరిశీలించినా పాదపూరణార్థకములైన చ. వై. తు. హి న, లోనగునవి కనపడవు. సుబంధు మహాకవి యే మన్నాఁడు!

"సత్కవికావ్యబంధఇవ, అనవబద్ధతుహినః"

అన్నాఁడు. యేసందర్భంలో? వసంతర్తు వర్ణనా సందర్భంలోనో, లేక గ్రీష్మర్తు వర్ణనా సందర్భంలోనో, ఋతుపక్షంలో మంచువుండదని గ్రహించుకోవాలి. మఱివక శ్లోకంకూడా చూపుతాను.

శ్లో. కీరాః కోరకితేషు కల్పతరుషుప్రారబ్ధవేదాక్షరా
వాతా శ్చందనవాటి కాంగణచలద్గంగాఽఽపగాంభ స్స్పృశః
కించైతే విరువంతి పంచమరవం చూతేషు పుంస్కోకిలాః
కుంజేషు ప్రతిబద్ధఝుంకీతిరవా ధావంత్యమీ షట్పదాః.

నేను ఉదాహరించిన శ్లోకాలేవీ, ఆలోచించి వెదకి వుదాహరించినవి కావు. యెక్కడపట్టినా ధార అనర్గళంగానే నాబుద్ధికి కనపడుతూ ఉంది. అందుచేత గ్రంథమంతా నాకుధారాశుద్ధికి వుదాహరణంగానే కనపడుతూవుంది. యిందు మిక్కిలీ సులభంగా వేదాంతబోధ సాధించcబడింది. హరి హర వైషమ్యము లేకుండా కథావస్తువు కల్పింపcబడింది. తెలుcగుపత్రికలో యింతకన్న శ్లోకాలు వుదాహరిస్తే వ్యాసము చేదస్తపు తరగతిలోనికి చేరవలసివస్తుంది. అయితే యీనాటకంలో శాబ్దికదోషాలేమీ లేనేలేవా? అని పురోభాగులు ప్రశ్నిస్తారేమో? వున్నాయి. లేకపోలేదు. కాని అవి అచ్చుపొరపాట్లున్నూ కావు. గ్రంథకర్తగారి వ్రాతలోనే ఆపొరపాట్లు పడివున్నాయి. ప్రాచీన పండితులందఱున్నూ వ్రాయడం అలాగే వ్రాస్తారు. యీ అంశం తాటాకు గ్రంథాలు పరిశీలిస్తే స్పష్టపడుతుంది. దాన్నివారి పాండిత్యలోపం క్రింద పరిగణించుకోవడం ప్రాజ్ఞ లక్షణంకాదని నా తలంపు. మాముత్తాతగారి స్వదస్తూరి పుస్తకాలలో వారిపేరు నృసింహశాస్త్రుల్లు అనే వ్రాయcబడివుంది. అంతమాత్రంచేత ఆయనకు సింహశబ్దవ్యుత్పత్తి తెలియదని యెట్లనుకునేది? యిట్టివితప్పు పనిపడితే నిల్వతగ్గవి కనపడలేదు. ఒక్కటికాcబోలు నాకు ప్రష్టవ్యంగా కనపడింది. తీరా దాన్ని బయటపెడితే "ఫణిపయితాహే - కణపయితాహే" అన్న మాదిరిగా యేంజవాబు వస్తుందో అని భయపడి వూరుకున్నానని విజ్ఞులకు విన్నవించుకుంటాను. మఱిన్నీ వీరియింటిపేరే కొంచెం మార్పుతో మఱివకటివుంది. అది శిష్ట్లా. యింకొకటివుంది, అది శిష్టు. ప్రస్తుతం మనంమాట్లాడుకున్నది శిష్టావారినిగూర్చి. శిష్టువారినిగూర్చి యింకొకసారివ్రాస్తాను. అవ్రాసేటప్పుడే తాటితో దబ్బనంగా పిండుప్రోలు వారున్నూ వస్తారు. మాప్రాంతంలో వీటిద్దఱికీ సంబంధించిన కథలు చాలా వున్నాయి. కొన్నిటిని శ్రీగురజాడ రామమూర్తి పంతులుగారు కవిజీవితములు అనే చరిత్రగ్రంథంలో యెత్తుకున్నారు. ఇంకాకొన్ని పల్లెటూళ్లల్లో పెద్దలవల్ల నేను విన్నవున్నాయి. మఱొకప్పుడు వ్రాస్తాను. ప్రస్తుతం శిష్టావారికి నమస్కరిస్తూ దీన్ని ఆపుతున్నాను.

★ ★ ★

# పౌరాణికులు నీచులా?

ఈ వాక్యము గూర్చి ప్రపంచకము పుట్టింది మొదలు నేఁటివఱకు ఎవరికినీ వివరించవలసిన ప్రసక్తికలిగినట్టు వినలేదు. గ్రహచారవశాత్తూ ప్రస్తుతం నాకుకలిగింది. పౌరాణికులు నీచులే అయితే వారిలో మొట్టమొదటివాఁడైన సూతుఁడు బ్రహ్మఋషులైన శౌనకాదులచేత అర్ఘ్యపాద్యాదులిచ్చి సమ్మానించబడడం జరిగివుండదు (సూతసంహిత చూ.) అయితే బలరాముఁడు సూతుణ్ణి తల బద్దలుకొట్టి యెందుకు చంపాలి? అని ప్రశ్నిస్తారేమో? ఆచంపడం బ్రహ్మఋషులతో సమానంగా తారతమ్యం లేకుండా కూర్చున్నాఁడని కాని అతఁడు పౌరాణికుఁడగుటచేత నీచుఁడని కాదు. ఆ కాలంలో బ్రాహ్మణులయితే సరి అందఱికంటే యెక్కువ అనేభావంతో క్షత్రియాదులు గౌరవించేవారు.

"కాషాయ దండమాత్రేణ యతిః పూజ్యః" అన్నట్లే జందెంవున్నంతలో బ్రాహ్మఁడు పూజ్యుఁడుగా చెలామణి అయేవాఁడు. బలరాముఁడు మూఢభక్తులలోవాఁడుగాని శ్రీకృష్ణునివంటి పరిజ్ఞాత కాఁడు. పైగా హాలాపానలాలసుఁడు. ఆరింగ (మైకం) లో వున్నాఁడేమో అట్టి సమయంలో శౌనకాది బ్రాహ్మణ ఋషి సమాజంలో అగ్రపీఠాన్ని అలంకరించి కూర్చున్న సూతుణ్ణి చూచీ చూడడంతోటట్టే వొళ్లు భగ్గునమండి చేతులోవున్న ముసలంతో వొక్క పెట్టుపెట్టేటప్పటికి పాపం! ఆ తపస్వి స్వర్గం అలంకరించాఁడు. శౌనకాదులు ఆ పనికి అంగీకారం లేనివారే అయినా మాట్లాడితే మనపనికూడా పడతాఁడేమో (త్రాగుబోతుకదా) అని కిక్కురు మనకుండా వూరుకున్నారనుకోవాలి. దెబ్బకు దెయ్యం జంకుతుంది, లేదా జరిగిపోయిన పని శౌనకాదులు మందలిస్తే మాత్రం కలిసివస్తుందా? రాదుకదా; బలరామునివద్ద యీ దుర్గుణం తప్ప యితర దుర్గుణాలు లేవు. దేవ బ్రాహ్మణ భక్తుఁడు. అమాయకుఁడు. యీ సురాపాన దుర్గుణం వొక్క బలరామునికే కాదు. యాదవులందఱికీ వున్నట్లే భాగవతంవల్ల ధ్రువపడుతుంది. ఇతఁడు వారిలో "తత్రాపిచ చతుర్థోంకః" అనుకోవాలి. భవతు. ప్రస్తుతాంశాన్ని మఱిచి వ్రాస్తున్నాననుకుంటాను. ఈ ప్రమాదం నాకు అనాదిగా వుంది. ఇప్పుడు మఱీ అధికమయి నా పని "గానుగు రోకలిసిద్ధిపిడి" అనే స్థితిలోకి వచ్చింది. ఇట్టి స్థితిలోవున్న నన్ను అప్తులు సభలకు ఆహ్వానిస్తారు. వెళ్లే శక్తిలేక మానుకుంటే యేలాగో లాక్కుపోతారు. అక్కడ యేప్రమాదం వస్తుందో అని వారు ఆలోచించరు. వెళ్లి వూఱికే బెల్లంకొట్టిన

రాయిమాదిరిగా కూర్చుంటే యేలాగ? యేదో మాట్లాడవలసివస్తుంది. ఆ మాటలలో యేమీ దురర్థం లేకపోయినా వుందని భ్రమించడం అక్కడనుంచి - "పంచశుభం పంచాశుభమ్" లోకి దిగడం, యెందుకీకర్మం అని వూరుకున్నా తప్పడంలేదు. ప్రారబ్ధం భోగతో నశ్యేత్, యిది "యావజ్జీవం హోష్యామిగా" పని జరగవలసిందే. మళ్లా ప్రస్తుతం దేనిలోకో పోయింది అనుకుంటాను. భవతు. బలరాముఁడికి ఆ రింగ (మైకం) తగ్గిన తరవాత పశ్చాత్తాపం కలిగింది. ఆయీ దోషం యేలా నివర్తిస్తుంది అనే చింత వుదయించింది. ఆ బ్రాహ్మఋషులను ప్రశ్నించాఁడు. వారు నిర్మొగమాటంగా జవాబిచ్చారు. యేమని?

సూతుఁడు జన్మత శ్శూద్రుఁడయినప్పటికీ జ్ఞానతః బ్రాహ్మఁడు కాఁబట్టి నీకు బ్రహ్మహత్యాదోషం తగిలింది అని స్పష్టంగా చెప్పి దానికి తగ్గ ప్రాయశ్చిత్తాదికం విధించారు. వారి వాక్యానుసారంగా బలరాముఁడు తీర్థయాత్రాదులు సేవించడం జరిగింది. మనకు ప్రస్తుతం కావలసింది "పౌరాణికులు నీచులు"కారు, పరమపూజ్యు లనేదియ్యేవే. వ్యాసులవారికి వేదాలు నాలుగేకాక శిలసంహితలున్నూ, మహాపురాణాలు పద్ధెనిమిదిన్నీ, ఉపపురాణాదులు పద్ధెనిమిదిన్నీ హృత్కవిలిగదా? ఇన్నిపురాణాలకీ కర్త వ్యాసులేనా? వేఱువేఱుగావున్నారా? అనేవిచారం యిప్పుడు పెట్టుకోవద్దు.

"పౌరాణికులు నీచులా" అను విషయాన్నే చర్చించుకుందాం. వ్యాసులవారు వేదాల ప్రచారానికి కొందఱు శిష్యులను వినియోగించారనిన్నీ, పురాణ ప్రచారానికి సూతుణ్ణి నియోగించారనిన్నీ ఆ పురాణాలలోనే కనపడుతుంది. ఆ పురాణ వేత్తృత్వమే సూతుణ్ణిబ్రహ్మ ఋషిని చేసిందని వేఱే వ్రాయనక్కఱలేదు. అట్టి పురాణాదులయందు నీచత్వాన్ని ఎవ్వరాపాదిస్తారు? శాంతం పాపం. విధించిన బ్రహ్మహత్యా ప్రాయశ్చిత్తమే వేయినోళ్లతో ఘోషిస్తూవుంది. అట్టి పురాణాలను లోకులకు బోధించే సాహిత్య పరులు నీచులు అనడానికి యే ప్రాజ్ఞునికి నోరాడుతుంది. అసలు వేదార్థం చెప్పేవారికి

"శిక్షా వ్యాకరణం ఛందో నిరుక్తం జ్యోతిషం తథా
కల్పశ్చేతి షడంగాని వేదస్యాహు ర్మనీషిణః"

అనే షడంగాలున్నూ తెలిసి వుండాలి. ఈలాటి షడంగవేత్తలు యింకా కొంచెం శేషించి వున్నది మన ఆంధ్రదేశమే. అఱవదేశంకూడా ఆయీ భాగ్యంకలదే అని వినికి. భవతు. యిన్ని ప్రజ్ఞలు వున్నా పురాణాలు, చూడకుండా వేదార్థం చెప్పడాని కేమహావిద్వాంసుఁడేనా వుపక్రమిస్తే అప్పుడు ఆవేదం పాపం గడగడ వొణికిపోతుందఁట! ఆయీరహస్యం నేను ఆమహా విద్వాంసుల ముఖతః విన్నదేకాని స్వకపోలకల్పితం కాదు. అట్టి పౌరాణికులు నీచులు అని అపవదించడానికి యెవరికి వుంటుంది సాహసం. భారత

రామాయణాలు రెండూ పురాణాలు కావు. భారతం యితిహాసం, రామాయణం కావ్యం. వేదానికి కూడా అపౌరుషేయత్వాన్ని పలువురు వొప్పరని తెల్విడి. వాల్మీకి మొదటికవి, వ్యాసులు రెండోకవి.

"ఏనాతి ప్రియశిష్యుఁడా నాకు సంభవుం
డటుమీఁది శిష్యుండు వ్యాసమౌని" (శ్రవణా)

వీరిద్దఱూకూడా యించుమించుపురాణకర్తలే. యిక తెలుగులోనికి వద్దాం. నన్నయ్య, తిక్కన్న, యెఱ్ఱన్న వీరుముగ్గురూ పురాణాంధ్రీకరణం వల్లపౌరాణికులే. లోకంలో ఆంధ్రదేశంలో యీత్రితయానికి వున్నగౌరవం యెవరికీ లేదుగదా? అట్టివారిని, నీచులుగా అపవదించే వారుంటారని నేననుకోను, వేయిమాటలెందుకు? పురాణాల యందు పూర్వకవులకెంత గౌరవం వున్నదీ పెద్దన్నగారి వాక్యమే తెల్పుతుంది.

(1) "అతుల పురాణాగమేతిహాసకథార్థ"

(2) "బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాన నిరతు"

ఇందు రెండోది నన్నయ్యభట్టారకునిది, విస్తరమెందుకు? పురాణాలయందుఁగాని, పౌరాణికులయందుఁ గాని నైచ్యభావంకల ప్రాజ్ఞులున్నట్లు నేను ఎఱుగను నాకు పౌరాణికులయందు చాలా గౌరవభావమే వుంది. పురాణాలయందున్నూ చాలా గౌరవభావమే. కనుకనే దేవీభాగవతమును దెలిఁగించాను. దాన్ని యెవరేనా యెక్కడేనా పురాణం చెపుతూవున్నారంటే అది నాకు సంతోషాన్ని కలిగిస్తుంది. ఇతరులకుకూడా ఆలాగే అని నేను అనుకుంటాను. పౌరాణికులంటూ లేకపోతే సంస్కృత పురాణాలుగాని, ఆంధ్రపురాణాలుగాని బూజుపట్టిపోవలసిందే. సర్వేసర్వత్ర ఈ యిరవయ్యో శతాబ్దంలో అంతో యింతో అక్షరజ్ఞానం వుండడంచేత యెవరంతటవారు ఆయాపురాణాలు చదువుకుంటూ వున్నారుగాని యిప్పటికి కొంతవెనక కాలంలో పౌరాణికులే ఆయాచరిత్ర జ్ఞానానికిన్నీ, వాట్ల వ్యాప్తికిన్నీ దిక్కు. అట్టివారు నీచులని యెవరపవదించినా అది నేను వినలేను. వినినచో దుఃఖింతును. పౌరాణికునిద్వారా వ్యాప్తికి రావడం గ్రంథానికి న్యూనతాపాదకమే అయితే బట్టులద్వారా వ్యాప్తికి రావడం అంతకన్నా అధ్వాన్నం గావాలిగదా! చూడండీ శ్రీనాథుని చాటువు.

క. కవితాకన్యకు నలువురు
కవి జనకుఁడు బట్టుదాది గణుతింపంగా
నవరసరసికుఁడె ధవుఁడగు
నవివేకియె తోడఁబుట్టు వనవేమనృపా.

దీనిలో బట్టురాజులద్వారా ఆరోజులలో జరిగే కవితావ్యాప్తిని శ్రీనాథుండు తెల్పి వున్నాండు. ఇప్పుడు అచ్చు రాంబట్టి పూర్వపురీతిని వ్యాపించ నక్కఱలేదనుకోవచ్చును.

"నోటంబడు తుంపురులేనియు నిప్పు
డచ్చువచ్చినకతనన్ జగాన విలసిల్లెడి"

అయినా నాటకాలకు ప్రదర్శకు లేలాటివారో పౌరాణికులు పురాణాల కాలాటివారే. తఱచు పౌరాణికులు బీదవారుగా వుంటారు కనక నైచ్యాన్ని ఆపాదించవచ్చునందామా? సమ్మతమే. కాని ఆ పక్షంలో యీ దోషం పౌరాణికులకన్నా ముందుగా కవులకే తగులుతుంది కదా! నీచులు రచించినట్టున్నూ, నీచులు వ్యాప్తినందిస్తూ వున్నట్టున్నూ తేలుతుంది. అందుచేత ఆ హేతువుచే నైచ్యాన్ని ఆరోపించడం పొసంగదు! ఆ దారిద్ర్యాన్ని కూడా మహాకవులు వొక ఆభరణంగానే అలంకరించుకున్నారు-

(1) మాంతుభిక్షాటనమ్.

(2) శ్లో. నాఽ స్మాకం శిబికా... విద్యానవద్యాస్తినః

(3) శ్లో. ఆరనాళగళ దాహశంకయా మన్ముఖా దపగతా సరస్వతీ.

కవులు దరిద్రులనడానికి మనహిందువులే కాదు ఆంగ్లేయులు, పారశీకులు లోనైనవారంతా వొప్పుకుంటారు. అంతమాత్రంచేత ఆ కవిరచనకు నైచ్యంరాదు. శ్లో. "భిక్షుణా కక్షనిక్షిప్తః కిమిక్షు ర్నీరసోభవేత్"

అని పూర్వులే సమాధానమిచ్చియున్నారు. కవిరచనకు నైచ్యాన్ని సంఘటించేది గ్రంథంలో ప్రతిపాద్యమైన విషయంగాని, కవినిష్ఠదారిద్ర్యాదికం కాదు. కేవలమూ ప్రతిపాద్యాన్ని బట్టే గౌరవం రావడమూ కష్టమే. యిది మఱొకప్పుడు చూచుకుందాం. కవికి ఆగ్రహం కలిగి వ్రాసేవ్రాంతలో కూడా ఔదార్యం వుండాలి. అంతేకాని హేయ ప్రసంగం వుండకూడదు. తిడితే తిట్టినాండుగాని మృదువుగావుంది అని రసజ్ఞులు మెచ్చుకోవాలి. చంద్ర రేఖావిలాపంలా వుంటే అది హేయంగా కనపడుతుంది. ఈ విషయంలో దొరకకుండా వుండడం చాలాకష్టం. ప్రస్తుతం నాదృష్టిలో పౌరాణికులు గాని, పురాణాలుగాని, పురాణకర్తలుగాని, ఆంధ్రీకర్తలుగాని, శ్రోతలు గాని వీరందఱూ పరమపూజ్యులుగానే తోస్తారు. వీరిని నీచులుగా పరిగణించి కవికవిత్వాన్కి నైచ్యాన్ని ఆపాదించేవారివూహ నాకు నచ్చక లేని వోపిక తెచ్చుకొని యీ నాలుగు మాటలూ వ్రాశాను. ఐశ్వర్యానికీ, కవిత్వానికీ ఎంతచుట్టటికమో దారిద్ర్యానికీ, కవిత్వానికీ అంతే

చుట్టరికం. ఒక్కొక్క కవివాణి వొక్కొక్కరికి నచ్చుతుంది. ఒక్కొక్కరికి నచ్చదు. భిన్న రుచిర్హి లోకః. యెవ్వరికీ నచ్చనిదంటూ వుంటుందని నేననుకోను.

"లోకులరసనలె యాకులుగా నుండునట్టియవివో కవితల్" (కవికర్ణ)

ఈ వైభవం పట్టడం కష్టం. కేన్వాసింగు వల్లకూడా యీ వైభవం పట్టదు. దీనికికూడా సమర్థనం భవభూతి చూపించాఁడు.

"ఉత్పత్స్యతే మమతుకోపి సమానధర్మా? కాలోహ్యయం నిరవధిర్విపు లాచ పృథ్వీ" అన్నాఁడు. ఈవిషయం సహృదయైకగమ్యంగాని వైతండికులతో వాదించి తేల్చదగ్గదికాదు. తనమనస్సులో నొకటిపెట్టుకొని పైకినొకటి మాట్లాడువారు సహృదయు లెన్నటికిన్నీ కారు. విషయం విషయాంతరంలోకి దూకుతూవుంది. ప్రస్తుతం పౌరాణికులను గూర్చి కదా వుపక్రమించాను. వారు బీదవారే యగుదురుగాక. వారు నా దేవీభాగవతాన్ని పురాణం చెప్పి వ్యాప్తికి తేవడం నారచనకు గౌరవాపాదకమే. దానివల్ల నారచనకు నైచ్యంరాదని నానమ్మిక. ప్రత్యుత గౌరవమే. నారచనలో వ్యాకరణాది దోషాలుంటే అట్టిదోషం తగులుతుంది. దానికి పౌరాణికులు కారణంకాదు. నేను ఛందోమాత్ర పరిజ్ఞానంతో రచనకు దిగితే... "వ్యాకరణాదివిత్" అని వుండడంచేత అట్టిదోషం తగులుతుంది. కేవల లక్ష్యజ్ఞానం మీఁదగాని లక్షణ జ్ఞానం మీఁదనే గాని కవి ఆధార పడకూడదు. రెంటినీ అనుసరించాలి. అందులో లక్ష్యమే ప్రధాన స్థానానికి వస్తుంది. వ్రాస్తేచాలా వ్రాయాలి. కొంచెం దిక్ప్రదర్శనం చేస్తాను. శ్రీమాడభూషి వేంకటాచార్యులువారు (అభినవ పండితరాయలు) అక్షిభ్రువ అని ప్రయోగించారు. వారి సమకాలికులే బాగా కవిత్వం చెప్పేవారే 'చక్షుర్భ్రువ' అని ప్రయోగించారు. చక్షుః భూః, యీరెండున్నూ కల్పితే అకారాంత యేలా అయిందని ఎవరో అడిగితే, యీయనకు వ్యాకరణం రాదు కనుక ఆచార్యులవారి 'అక్షిభ్రువ' అనే ప్రయోగాన్ని చూపించారు. (వైయాకరణాః పిశాచాః ప్రయోగమంత్రేణ నివారణీయాః) అయితే ఆరూపం పాణినీయ సూత్రం (అచతుర, చూ) లో నిపతించ బడివుంది గాని రెండోరూపం నిపతించబడి లేదు. కనక అక్షికిచక్షుః అని మార్చిస్తే ప్రాణం మీఁదకి వస్తుంది. ఆయీరహస్యాలు చిరకాల గురుశుశ్రూషా సాధ్యాలుగాన యితరథా యెంతటి బుద్ధిశాలులకున్ను అంకేవికావు. ఆయీచూపిన అక్షిభ్రువ – చక్షుర్భ్రువ అనే రూపాలవల్ల కేవల లక్ష్యాధారంగా రచన సాగిస్తే నవ్వులపాలు కావలసివస్తుందని వ్యాకరించినట్లయింది. యింకోటి కూడా చూపి దీన్ని ముగిస్తాను. యీగోల యెందతో మహాకవులకే చాదస్తంగా (తెలియక సుమండీ) కనపడుతుంది. పత్రికాపాఠకుల కీగోల రుచింపదని యెఱిఁగిన్నీ ప్రసక్తి కలగడంచేత జిజ్ఞాసువుల కుపకరిస్తుందని కొంచెం వ్రాస్తున్నాను.

ఇంద్రాణి అంటే (ఇంద్రస్య - భార్యా) ఇంద్రుని భార్య. వితంతువు అనే అర్థం వేదపరిభాషగాని శాస్త్రతః వచ్చేదికాదు. దీన్ని గూర్చి (పల్లెటూళ్ల పట్టుదలలు చూ.) అన్యత్ర చిరకాలంనాఁడు వ్యాకరించాను. ఇంద్రుని పెళ్లాం ఇంద్రాణి అయినట్లే ఇంద్రవాచకమే అయిన శక్రపదానికి శక్రాణి అనే రూపాన్ని పుట్టిస్తే యేం జరుగుతుందో వైయాకరణులు చెపుతారు. అది కవులపనికాదు. అయితే రుద్రాణి, భవాని, శర్వాణి, మృడాని యీ నాలుగున్నూ శివుని భార్యను చెపుతాయి. ఇంద్రుని భార్యను చెప్పేది ఇంద్రాణి ఒక్కటే. శివుని భార్యను శివాని అనేపదంతో వాడితేనో యేముంది. యద్దేవా దేవహేళనమ్. యిందుకోసమే "ఛందోవ్యాకరణాదివిత్" అన్నారు. ప్రస్తుతానికి వద్దాం. నాదృష్టిలో పౌరాణికులు ఘనులు. నీచులుకారు. నీచత్వఘనత్వాలకు దారిద్ర్యం కారణం గాదు. పౌరాణికుల వల్లనే గ్రంథకర్తకు గౌరవప్రదమే. తన రచనవల్ల పలువురు జీవించడం కన్న గ్రంథకర్తకు కావలసిందేమిటి?

మా నాటకాలు ప్రదర్శించి తద్వారా పలువురు జీవిస్తున్నారని విని నేను సంతోషించేవాణ్ణి. మనదగ్గిఱ డబ్బూ దస్కమూ పుచ్చుకోకుండానే ప్రదర్శించడానికి మఱీ సంతోషం కలిగేది. యిటీవల ఆ ప్రదర్శకులవల్ల ప్రదర్శనానికి "యింత" అంటూ మాకు ఫీజు యివ్వడం కూడా జరుగుతూ వుంది. యిది నా మనస్సుకు అంతగా నచ్చుబాటు లేకపోయినా పుచ్చుకుంటూ వున్నాను. కాని వెనుకటికాలం వాళ్లకు హోటల్ పద్ధతిలాగే యిదీ నచ్చదు. యెవరి రచన పదిమంది విద్వాంసులు నిర్వ్యాజంగా చదువుకుంటారో ఆ రచనే అదృష్టవంతము. ఆరచయితే అదృష్టవంతుఁడు. అట్టిసుయోగము ఆ గ్రంథ నిష్ఠమైన రసాన్నిపట్టి ఉంటుంది. యీ సందర్భం ప్రబంధాలకి సంబంధించేమాట. పురాణకవిత్వం పదిమందీచదవడం తన్నిష్ఠమైన పుణ్యగాథలనిబట్టిగాని రచననుబట్టి మాత్రమే కాదు. పురాణ కవిత్వం చాలా భాగం అనాదిగా చేదస్తంగానే వుంటుంది; వున్నా పౌరాణికులు దాన్ని మన్నిస్తూనే వుంటారు. పౌరాణికులు పూజ్యులు, గౌరవనీయులు, నమ్యులు.

★ ★ ★

# వికటవిమర్శనం

కవుల కవిత్వాన్ని గూర్చి విమర్శించడం ఏలా వుండకూడదో తెల్పితే, యేలా వుండాలో తెల్పినట్టే అవుతుంది. కనక దాన్ని గురించి నాకు చేత నైనంతలో కొన్ని మాటలు వ్రాస్తాను. అయితే యీ విషయం చిరకాలంనాఁడే "అపూర్వ కవితా వివేచనం" అనే పేరుతో మాచేత తెల్పఁబడింది. యింకా కొన్ని వ్యాసాలలో కూడా తెల్పఁబడి వుంది. ఆకారణంచేత చర్వితచర్వణప్రాయమే అయినప్పటికీ, కవిలోక మూర్ధన్యుఁడైన కాళిదాసు గారి కవిత్వాన్ని గూర్చి వ్రాయడం గనక కొంత నూతనంగానే వుంటుందనుకుంటాను. యెందఱో కవులు యెన్నో కావ్యాలు వ్రాసినా కాళిదాసుకు వచ్చిన పేరుప్రతిష్ఠలు యెవ్వరికిన్నీ రాలేదంటే కాదనే వారెక్కడా వుండరు గదా! ఆ పేరుప్రతిష్ఠలకు కారణం ఏమిటో తెలిసిన వారు లోకంలో చాలా తక్కువగానే వుంటారు. నామట్టుకు నాకు నిన్న మొన్నటివఱకున్నూ కాళిదాసు కవిత్వం కంటే కూడా మఱికొందఱు కవుల కవిత్వమందే ప్రీతివుండేది. కాని యెందఱో ప్రాజ్ఞులు మెచ్చుకొన్న కాళిదాసు కవిత్వాన్ని మెచ్చుకోకపోతే అవమానం వస్తుందనే భయంచేత నేను ఎక్కడా అన్యథాగా ప్రచారం చేసేవాణ్ణికాను. నేను మెచ్చుకొనే కవిత్వాలు యేలా వుండేవో? కొంచెం మచ్చుచూపి మఱీ ప్రస్తుతం వుపక్రమిస్తాను.

శ్లో. "ప్రాతరంబుజవిడంబిలోచనాం
మాతరం త్రిజగతా ముపాస్మహే
శీతరమ్య కరుణావలోకనై
ర్యా తరంగయతి మంగళాని నః"

యీ శ్లోకం శ్లేషయమక చక్రవర్తి శ్రీ వేంకటాధ్వరి లక్ష్మీసహస్రంలోనిది. యిందులో ప్రాతర మాతర శీతర యాతర అని యెంతో శ్రవణానందంగా నాలుగు చరణాలలోను వుండడం నాకు చాలా శ్రవణా నందంగా వుండేది. కాళీసహస్రంలో యీ మాదిరి కవిత్వాన్ని చెప్పడానికి కొంత ప్రయత్నించడం కూడా జరిగింది. యెంతవఱకు కృతార్థత్వం కలిగిందో చెప్పలేను. మొట్టమొదట సంస్కృత కవిత్వానికి ఆరంభించినప్పుడు కాళిదాసుగారి

శ్లో. "ద్వైపాయనప్రభృతి శాపాయుధ త్రిదివ సోపాన ధూళిచరణా"

అన్న శ్లోకాలను వరవడిగా పెట్టుకొని మేము

శ్లో. "నాళీకజాద్యదితిజాళీ శిరఃకలిత మౌళి ప్రభాంచిత పదా"

అంటూ కొన్ని శ్లోకాలు యిష్టదేవత కాళికను గూర్చిన్నీ

శ్లో. "బాలం సమస్త జగదాలంబ మంబుధర నీలం బలారివినుతం."

అంటూ శ్రీకృష్ణ భగవానుణ్ణి గూర్చిన్నీ వ్రాసివున్నాం. కాని యెక్కడి కెక్కడ? యమకంలోకూడా కాళిదాసుగారి రచనలో కొంత చక్కనిభావం యిమిడివుంది. మా రచనలోనో? యే కొంచె మే మాత్రమో భావం వుందేమో కాని అట్టిభావం లేదు సరిగదా! అట్టి సమాసకూర్పు సమేతమున్నూ లేనేలేదు. యీ సంగతి రచనాకాలంలో మాకు పొడకట్టలేదుగాని యిటీవల క్రమక్రమంగా పొడకడుతూ వచ్చింది. అయితే యీ రహస్యం యెఱుఁగనివారు చాలామంది మమ్మల్ని యీ రచనను పురస్కరించి ప్రశంసించడం కలదు. యెవరికోకాని యీ తేడాపాడాలు పొడకట్టవు. అందుచేతే "కోవేత్తి కవితాత్త్వమీశ్వరో వేత్తివానవా" అన్నారు పెద్దలు. ప్రాచీనత్వ నవీనత్వాలు దీనికి కారణంగానైతే కొందఱు పెద్దలు చెపుతారుగాని దానికి కాళిదాసే వొప్పుకోలేదు. దీన్ని గూర్చి నారోజుల్లోనే అనుభూతమైన వొకసంగతిని చదువరుల వినోదార్థం వుదాహరిస్తాను. వొకరైల్వే స్టేషనువద్ద పెద్దవుద్యోగంలో వున్నవొక పంతులుగారు కూర్చుని వున్నారు. వారిదగ్గర వొకాయన వొకప్రాచీన గ్రంథంలో వున్నశ్లోకాలు చదువుతూ అందుండే చమత్కారాన్ని వివరిస్తూ "యిలావుండాలి కవిత్వమంటేను. ఇప్పటికవిత్వాలు వెధవకవిత్వాలు" అనడానికి మొదలెట్టేసరికి, నాకేమో కొంతయిబ్బందిగా తోఁచి "అయ్యా! యిదెవరికవిత్వమండీ!" అంటూ మెల్లిగా ప్రశ్నిస్తూ సమీపానికిచేరి వకటిరెండు నిమిషాలు వారివెనకాల హంగుచేసి తర్వాత "అయ్యా మీరిప్పుడు మెచ్చుకుంటూవుండే కవికికూడా పూర్వం కొందఱుకవులు వుండి వుంటారుకదా। ఆ కవుల కవిత్వాన్ని మీవంటి ప్రాజ్ఞులెవరో యీలాగే పఠించి ఆనందించడం జరక్కపోదుగదా! ఆసమయంలో తాత్కాలికపు కవుల కవిత్వాన్ని మీలాగే నిందించడం జరిగే యెడల మీరిప్పుడు మెచ్చే కవి కవిత్వంకూడా "వెధవ కవిత్వ" పదానికి గురికావలసి వస్తుందేమో? ఆలోచించండీ!" అంటిని. దానితో ఆయనకు కోపమైతే వచ్చిందిగాని ఆకోపాన్ని ఆఁపుకొని "మీరెవ?" రంటూ నన్ను ప్రశ్నించారు. సమీపంలో వున్నవా రెవరో "ఫలానా" అని చెప్పారు. అంతటితో మాకూ మాకూ స్నేహభావం కుదిరింది. చెప్పొచ్చేదేమిటంటే? ప్రాచీన నవీనత్వాలు కవిత్వాన్ని మెచ్చడంలో లేశమూకూడా వుపకరించవు. కాని సర్వసామాన్యంగా ప్రాచీనుల కవిత్వాన్ని అభినందించడమున్నూ నవీనుల కవిత్వాన్ని యీసడించడమున్నూ కనబడుతుంది. యెవరెన్ని వుదాహరణాలు చూపినా ఆ వ్యవహారం అమల్లో వుండేదే కాని పోయేదికాదు.

యింకో వూళ్లో యింకో చమత్కారం జరిగింది. టూకీగా దాన్ని కూడా వుటంకిస్తాను. వొక ప్లీడరుగారుండేవారు. ఆయనకి యింగ్లీషురాదుగాని సంస్కృతంలో మంచి పాండిత్యం వుండేది. భాష్యత్రయశాంతికూడా చేశారు. సదాచార సంపత్తిలో కూడా అగ్రగణ్యులు. వేటే చెప్పేదేమిటి? స్నానం చేసిన తర్వాత ఆయన బ్రాహ్మణేతరుణ్ణి చూస్తే మళ్లా స్నానం చేయవలసిందే. పార్టీలతో స్నానానికి పూర్వం యేం మాట్లాడేవారో అంతే. ఆయన కవులను మెచ్చడంలో వాడే మాటలుకూడా వకమాదిరిగా వుండేవి. భవభూతిని గూర్చి మెచ్చేటప్పుడు, "అమ్మ మొగుడు" అనిన్నీ, కాళిదాసుని మెచ్చేటప్పుడు, "అమ్మమ్మ మొగుడు" అనిన్నీ అంటూవుండేవారు. చెప్పేదేమిటంటే? ఆయనకు నవీన కవిత్వం అంటే బాగున్నదేనా సరే తావన్మాత్రంచేత యీసడించడం అలవాటు. దానికి మేమొక వుపాయం చేశాం. యేమిటంటే? మా స్వంతకవిత్వంలోవే యేదో ప్రసక్తిలో కొన్ని వినిపించాం. "యిది యెవరి కవిత్వ?" మంటూ ఆయన పృచ్ఛచేశాఁడు. ప్రాచీన కవి పేరునే చెప్పడం జరిగింది. దానితో "అమ్మమొగుడు" పదంతో అభినందించడమున్నూ జరిగింది. అప్పటికి వూరుకొని వొకటి రెండు రోజులైనాక యథార్థాన్ని చెప్పి, ప్రాచీనత్వ నవీనత్వాలు కవిత్వ ప్రాశస్త్యానికి హేతువులు కావని కాళిదాసుగారన్న మాటలను స్మరింపఁజేసి వుభయులమున్నూ స్నేహభావంతో ప్రవర్తించాం. యింక యీ యితిహాసాలల్లోన్నుంచి ప్రధానాంశానికి వస్తున్నాను. సర్వోత్తరమైన కాళిదాసుగారి కవిత్వాన్ని నేను ఏదోమాదిరిగా అపవదిస్తాను. లోకం నన్ను క్షమించాలి. నేను చూపే ఆక్షేపణలు సరియైనవైతే కావుగానీ సామాన్యుల దృష్టికి సరియైనవే కాఁబోలును అనే భ్రాంతిని కలిగిస్తే కలిగిస్తాయేమో? నిశ్చయంగా చెప్పలేను. కథలోకి దిగుతూన్నాను - రఘువంశం ప్రథమస్సర్గ ౪౭ వ శ్లోకంలో -

"అపి లంఘిత మధ్వానం బుబుధే న బుధోపమః"

అనివుంది. దిలీపమహారాజు వసిష్ఠాశ్రమానికి ప్రయాణమై వెడుతూ భార్యకు తోవలోవున్న ప్రకృతి చిత్రాలు చూపుతూ తాను అప్పటికి ఎంతమేర ప్రయాణం చేశాఁడో తెలుసుకోలేకపోయాఁడు అని వర్ణించాఁడు కాళిదాసు. అట్టి సందర్భంలో - "బుధోపమః" అన్న విశేషణం దిలీప మహారాజుకు వాడడం యెందుకో? ఆ విశేషణం లేకపోతే వచ్చేలోపమేమిటో? విచారించవలసివుంది. నా మట్టుకు ఆ విశేషణం కేవలం "చవై తుహి చవైతుహి" అనే మాదిరిగా తోస్తూవుంది. దానికి పాదపూరణంకంటే అతిరిక్తఫలం కనపడడంలేదు. వ్యాఖ్యాత యేదో సార్థక్యం వున్నట్టయితే కొంత కష్టించి తేల్చాఁడుగాని అది అంత నచ్చుఁబాటుగా లేదు. దీని తరువాత శ్లోకంలో-

"సదుష్ప్రాపయశాః ప్రాపదాశ్రమం శ్రాంతవాహనః"

అన్నచోట- "దుష్ప్రాపయశాః" అనే విశేషణంకూడా పైతరగతిలోకే చేరుతుంది. దీనికి సమాసం మాత్రమే ప్రదర్శించి వ్యాఖ్యాత వూరుకోవడంకూడా నావూహనే బలపరుస్తూవుంది. పైఁగా యీశ్లోకం ఉత్తరార్ధంలో... "మహిషీసఖః" అని దిలీపమహారాజుకు వేసినవిశేషణం నిరర్థకమైతే కాదుగాని మహిషీశబ్దానికి రాజభార్య అనే అర్థంకన్న గేదె అనే అర్థమే శీఘ్రంగా వుపస్థితం సర్వానుభవసిద్ధమే కనక దానికి సఖుఁడనడంవల్ల దిలీపుఁడు దున్నపోతు వంటివాఁడనికూడా ధ్వనితమవుతూ విజ్ఞులు విచారించవలసివుంటుంది. ఈ మహిషీ సఖత్వం (దున్నపోతు వంటివాఁడవడం) యింతటితో శాంతించదు. యితఁడు దున్నపోతు వంటివాఁడు కనకనే వసిష్ఠుఁడు పశుప్రాయులకు విహితకృత్యంగా వుండే పసులకాపరితనాన్ని ఆజ్ఞాపించాఁడని కూడా వకదోషాన్ని ఆపాదిస్తుంది. పూర్వకాలంలో అంతటితో శాంతిస్తుందేమో కాని యీ రోజుల్లో యింకా కొంతదాఁకా దేకుతుంది. యేమిటంటారా? బ్రాహ్మలు అనాదిగా బ్రాహ్మణేతరులను అవమానించడానికే పూనుకొనేవా రనిన్నీ అందుచేతనే కాళిదాసు దిలీపునికి - చక్రవర్తికి అలాటి విశేషాన్ని వాడి వున్నాఁడనిన్నీ వసిష్ఠుఁడు సర్వ మంత్రద్రష్ట అయివుండిన్నీ, "కర్తు మకర్తు మన్యథాకర్తుం" శక్తికలవాఁడై వుండిన్నీ కూడా తన్ను సంతానార్థం ప్రార్థించిన మహారాజుకు పశులకాపరితనాన్ని అందులో తనయింటి పసులకాపరితనాన్ని ఆదేశించాఁడంటూ అపవదించడానికి అవకాశాన్ని యిస్తూవుందో? లేదో? విజ్ఞులు విచారించవలసిం దని విషయాంతరాన్ని వుపక్రమిస్తాను -

"వాచమాదదే వదతాంవరః" (56 శ్లో)

"దిలీపుఁడు మాటాడెను" అనడానికి, "వాక్కును స్వీకరించెను" అని కాళిదాసు వ్రాశాఁడు. ఆదానమంటే స్వీకరించడం అర్థంకదా! స్వీకరించడమంటే? ప్రతి గ్రహించడమేనా కాదా? అయేయెడల ప్రతిగ్రహించడానికిన్నీ యివ్వడానికిన్నీ సంబంధం నియతంగా వుండాలి. కాళిదాసు యే తాత్పర్యంతో ఆ వాక్యం వ్రాశాఁడో? అలాటి అర్థం రాదుసరిగదా! బొత్తిగా లగించని అర్థం మఱొకటి వస్తూవుంది. యెవరో తనకు దానం చేస్తేవారి వాక్కును దిలీపుఁడు పరిగ్రహించాఁడనే అర్థం రాకుండా చేసేవారుం టారనుకోను. సహృదయత్వమంటూ వుంటేనో! "నచశంకావచోత్తరమ్."

"గురుణా బ్రహ్మయోనీనా" (౬౪ శ్లో)

యిక్కడకూడా మహిషీ శబ్దానికి తగిలే దోషం వంటిదే శీఘ్రోపస్థితమైన అర్థంచేత తగిలి తీరుతుందని పైకి వెడుతూన్నాను.

శ్లో. "కింతు వధ్వాం తవైతస్యాం" (౬౪ శ్లో)

యీశ్లోకంలో దిలీపుఁడు తన భార్య అయిన సుదక్షిణాదేవిని తన పురోహితుఁడైన వసిష్ఠమహామునికి కోడలుగా నిరూపించి మాట్లాడుతున్నాఁడు. దీనివల్ల వచ్చే దుర్వ్యంగ్యం యెంతోవుంది. దిలీపుని తల్లి వసిష్ఠుఁడికే దిలీపుణ్ణి కన్నదనే ధ్వని దుర్నివారంకదా! అక్కడక్కడ రాజకుటుంబాలకు సంతానలోపం తటస్థించినప్పుడు పురోహితులద్వారాగా ధర్మసంతానం కలిగించుకోవడం ప్రస్తుతధ్వనికి సహకారి కావడం తోడవుతుంది కూడాను. విచారిస్తే యింకో దురర్థంకూడా తీయవచ్చును. వధూశబ్దానికి కోడలనే అర్థమే కాకుండా కేవలము స్త్రీ అని అర్థం చెప్పేటట్టయితే నీ భార్య అని తేలుతుంది. పురుష వాచక శబ్దానికి స్త్రీ వాచకం అంటే స్త్రీ పర్యాయంతో సంబంధం కలిపినప్పుడు భార్య అనే వస్తుందిగాని మఱివకలాగు రాదు. యిది ప్రసిద్ధ విషయము గనక వుదాహరణా లక్కఱలేదు. ఆ యీ దురర్థాలన్నీ కాళిదాసు లోపాలో? కావో? సహృదయులు విచారింపఁగలరు.

శ్లో. "...సుప్తమీన ఇవహ్రదః" (౭౩ శ్లో)

యీ శ్లోకంలో కన్నులు మూసుకొని ధ్యానిస్తూవున్న వసిష్ఠుణ్ణి నిద్రపోతూవున్న చేఁపలు కల సరస్సుతో కాళిదాసు పోల్చివున్నాఁడు. వసిష్ఠుని నేత్రాలకున్నూ చేఁపలకున్నూ వుపమానం ధ్వనిస్తూవుంది. స్త్రీ నేత్రాలకు చేఁపలతో సామ్యం ప్రసిద్ధంగాని పురుషనేత్రాలకు ప్రసిద్ధంకాదు కనక యిది ఆక్షేపణీయంకాకపోదు. మఱిన్నీ చెడుకంపుతోవుండే చేఁపలతో పరమ పవిత్రంగా వుండే ఋషి నేత్రాలకు సామ్యం చెప్పడం బొత్తిగా వొప్పుకో తగ్గదికాదు. సహృదయులు విచారింతురుగాక.

శ్లో. "పురాశక్ర ముపస్థాయ" (౭౫ శ్లో)

యీ శ్లోకంలో "ఉపస్థాయ" అనేది ల్యప్ప్రత్యయాంతంగా కాళిదాసు ప్రయోగించి వున్నాఁడు. ఆ పక్షమందు అర్థం "ఉపాసనచేసి" అని వస్తుంది. అందులో ఆక్షేపణ లేశమున్నూ వుండదు. కాని అది అకారాంత శబ్దమనుకోవడానికి కూడా అవకాశం వుండడంవల్ల అశ్లీల రూపమైన దోషం తటస్థిస్తూవుంది. "రథోపస్థ ఉపావిశత్" ఇత్యాది ప్రయోగాలు ప్రత్యేకించినవే వున్నప్పటికీ ఆక్షేపకులు అంగీకరించమంటారు. పైఁగా ఆ ప్రయోగాలకి కూడా యిదే ఆక్షేపణంటారు. దీన్నిగూర్చి కూడా సహృదయులు ఆలోచించవలసిందే. దీనితోపాటు ౨౭వ శ్లోకంలో వున్న "ఉపస్థితేయం కల్యాణీ" అనేశ్లోకంలో యత్కించి న్న్యూనంగావున్న శబ్దశ్రవణాన్ని గూర్చిన ఆక్షేపణకూడా ఆలోచించ తగ్గదే అని నాకు తోస్తుంది.

శ్లో. "వన్యవృత్తి రిమాం శశ్వదాత్మానుగమనే నగాం" (౮౮ శ్లో)

యీ శ్లోకంలో గోవును అనుగమించడం వుపదేశించారు వసిష్ఠుల వారు. యీ అనుగమించడంకూడా కొంచెం అశ్లీలార్థానికి తోవతీస్తుందని నా ఆశయం. దానికి "వన్యవృత్తిః" అనే విశేషణం కొంత సహాయం కూడా చేస్తుంది. నందినీధేనువు వన్యములైన గడ్డి వగయిరాలవల్ల జీవనం చేసేదే కనక నీవున్నూ వన్యములైన కందమూలాదులతో జీవనంచేస్తూ దాన్ని అనుగమించ వలసిందని వుపదేశించినట్లు తేలుతుంది. సహృదయులు బాగా ఆలోచింతురుగాక! యీ అర్థంవల్ల తోఁచే అపార్థాన్ని దీని తర్వాత శ్లోకం "ప్రస్థితాయాం" అనేది పూర్తిగా బలపఱుస్తుందని చెప్పనక్కఱలేదు. విస్తరభీతిచే దానికి దోషోపోద్బలకంగా వ్యాఖ్యానించి చూపలేదు.

శ్లో. "... విససర్జోర్జిత శ్రియం." (౬౩ శ్లో)

దీనిలో "ఊర్జిత శ్రియం" అనే విశేషణం దిలీప మహారాజుకు కాళిదాసు వుపయోగించాఁడు. బహువ్రీహిసమాసం చెప్పక కర్మధారయ సమాసం చెప్పుకొంటే అపార్థం వస్తుంది. బహువ్రీహి అన్యపదార్థప్రధానం, కర్మధారయ ఉత్తరపదార్థ ప్రధానం. కాఁబట్టి బహువ్రీహ్యాపేక్షయా కర్మధారయ చెప్పుకోవడంలో గురుత్వం తక్కువకనక శాస్త్రజ్ఞులు సమ్మతిస్తారు. యీ అర్థంలో అపార్థం ఏమిటంటే? వెనక "స్రష్టు" అనే పదం వుంది కనక దానికి "బ్రహ్మయొక్క" అనే అర్థం మామూలుగానే చెప్పుకొని, "బ్రహ్మయొక్క శోభను వదిలిపెట్టెను" అని అర్థం చెప్పుకొంటే "వసిష్ఠుఁడు బ్రహ్మ తేజస్సును గోలుపోయినాఁడు" అని పిండితార్థం తేలుతుంది. యెందుకు వసిష్ఠుఁడు బ్రహ్మతేజస్సును గోల్పోవలసి వచ్చిందంటే? రాజర్షి అనిపించుకుంటూవున్న దిలీప మహారాజుకు ప్రాయశ్చిత్తార్హమైన పశుగమనాన్ని వుపదేశించడంవల్ల వసిష్ఠునకు యిట్టి దుర్దశ ఘటించిందని సుగమంగా తేలుతుంది. వసిష్ఠుఁడు యీ దోషాన్ని ఎఱుఁగఁడేమో? అంటే ధర్మశాస్త్రకర్త అయివుండి శ్లో. "పశువేశ్యాది గమనే ప్రాయశ్చిత్తం విధీయతే" అన్న అక్షరాలు తెలియకుండా ఉంటాడా? అయితే "స్రష్టుః" అనే పదం 'సూనుః' అనే దానికి సంబంధిస్తుంది గాని శ్రియం అన్నదానికి సంబంధించ దంటారేమో? అదినాకున్నూ తెలుసును. అక్కడ అన్వయించాక కూడా ఆవృత్తిచేత యిక్కడిక్కూడా తీసుకు వచ్చి యీ అపార్థాన్ని కల్పిస్తాననియ్యేవే నేను మనవి చేసేది. పోనివ్వండి. దీన్ని యేలాగో నా కనుకూలించకుండా తప్పిస్తారే అనుకోండి. నేనిదివఱకెన్నో చూపియున్నాను గదా! వాట్లని యెలాతప్పిస్తారో? సెలవు దయచేయ వలసిందంటాను. స్థాలీపులాకన్యాయంగా విమర్శిస్తే ప్రథమ స్సర్గలో యిన్ని వ్యత్యాసాలు కనపడుతూ వున్నాయి. యిదేరీతిగా ద్వితీయ స్సర్గలోకూడా విమర్శించి చూస్తాను.

శ్లో. "నిశమ్యదేవానుచరస్యవాచం" (౧౨ శ్లో)

యీ శ్లోకంలో "దేవానుచరస్య" అనేపదం యీశ్వరునికి నవుకరయిన సింహము అనే అర్థంలో కాళిదాసుచేత ప్రయోగింపఁబడింది. వ్యాఖ్యాతకూడా అలాగే వ్రాశాఁడు. కాని యీసింహము నందినీ ధేనువుచేత కల్పించఁబడ్డ సింహంగాని ఈశ్వరుని నౌకరుకాదు. దిలీపుని హృదయాన్ని పరీక్షించడానికి తానేమో ఈశ్వర భృత్యుణ్ణనిన్నీ, తనపేరు కుంభోదరుఁడనిన్నీ తనకు యీ సింహాకారాన్ని యీశ్వరుఁడే అనుగ్రహించాఁడనిన్నీ మాయమాటలు చెప్పినది నందినీధేనువుచేత కల్పితమైన సింహమేకాని యీశ్వరభృత్యుఁడుకాఁడు. ప్రస్తుతవాక్యం కవివాక్యంగాని మతివకటి కాదు. కవిచెప్పే వాక్యం యథార్థబోధకంగా వుండవలసింది. దిలీపునికి యిది కల్పిత సింహమని తెలియక పోవచ్చును గాని కవికి తెలియకపోవడం యెలాగ? యిది యిదివఱలో చేసిన శంకలవంటిది కాదని విజ్ఞులు కొన్ని వున్నప్పటికీ గ్రంథవిస్తర భయంచేత వాట్లను చూపలేదు. తృతీయసర్గలో.

శ్లో. "శ్రుతస్య యాయాదయ మంతమర్భకః"

అని రఘుమహారాజును గూర్చి గొప్ప విద్వాంసుఁడవుతాఁడనే అభిప్రాయంతోటే వ్రాసినప్పటికీ యిందులో మొదటిమాట వదిలిపెట్టి చదువుకుంటే అశ్లీలార్థానికి తోవతీస్తూవుంది. నామకరణ సందర్భంలో యీలాటివాక్యం ప్రయోగించడం యుక్తం కాదనుకుంటాను.

శ్లో. "మహోక్షతాం వత్సతరః స్పృశ న్నివ ద్విపేంద్రభావం కలభః శ్రయన్నివ" (౩౨ శ్లో)

యీ శ్లోకంలో రెండు పోలికలున్నూ, పశుత్వజాతికే సంబంధించినవి చెప్పడంచేత రఘుమహారాజునకు పశుప్రాయత్వం ధ్వనిస్తూవుందా? లేదా? అంటే కాళిదాసుగాని వేఱొకరుగాని చెప్పే జవాబేమిటో? దిలీపునకు పశుప్రాయత్వాన్ని ఆపాదించే ధ్వనివిషయం కొంత లోఁగడ కనపఱచివుండడంచేత పశుప్రాయుఁడి కొడుకు అట్టివాఁడే అయినాఁడనుకోవడంకూడా కొంత యుక్తిసహంగా వుంటుందో లేదో? విజ్ఞులు విచారించఁగలరు. - శ్లో. "అథా஽స్యగోదానవిధేరనంతరం" (౩౩ శ్లో) యిందులో, 'అస్య-గోదానవిధేః' అనడంచేత అమంగళార్థస్ఫూర్తి కలుగుతూవుంది. వివాహానికి పూర్వం గోదానవిధి జరగడం శాస్త్ర సమ్మతమే అయినా అంతమాత్రంచేత అది యీ అమంగళార్థాన్ని వారించలేదు. దీన్ని వారించవలసివస్తే సహృదయత్వం వక్కటే, "అన్యథాశరణం నాస్తి" అదివుండేయెడల యిట్టి ఆక్షేపణలకు వుపక్రమించడమే తటస్థింపదు కనక విస్తరించనక్కఱలేదు.

శ్లో. "హరేః కుమారోఽపి కుమారవిక్రమః" (౫౫ శ్లో)

యిందులో మొట్టమొదట వున్న "హరేః" (దేవేంద్రునియొక్క) అనేపదం దగ్గిఅవున్న కుమారశబ్దంతో అన్వయించడం యుక్తంగాని, యెక్కడో దూరంగా మూఁడో చరణంలో వున్న "భుజే" అనేసప్తమ్యంతంతో అన్వయించడం యుక్తంకాదు. "పాఠక్ర మాదర్థక్రమో బలీయాన్" అనే న్యాయాన్నిబట్టి ఆలాఅన్వయిస్తామే అనుకున్నా దూరాన్వయదోషం తగిలి తీరుతుంది. కనక విస్తర మనవసరం. న్యాయంగా "హరేః" అన్న దాన్ని దగ్గిరగావున్న "కుమార" శబ్దంతో అన్వయించేయెడల రఘుమహారాజు దిలీపుని సంతానం కాక దేవేంద్రుని సంతనాం కావలసి వస్తుంది. దానితో సుదక్షిణాదేవి అహల్యవంటిది కావలసివస్తుంది. దానితో లోఁగడ సుదక్షిణాదేవికి ద్వితీయస్సర్గలో కాళిదాసువాడిన - "అపాంసులానాం ధురికీర్తనీయా" అన్న విశేషణం 'నేతిబీరకాయ' కావలసి వచ్చి కాళిదాసు గారికి స్వవచోవ్యాఘాతం తటస్థిస్తుంది. విజ్ఞులు విచారించవలసివుంటే విచారింతురుగాక-

శ్లో. "శరేణ శక్రస్య మహాశనిధ్వజమ్" (౫౬ శ్లో)

యిందులో రఘుమహారాజు దేవేంద్రునియొక్క అశనిధ్వజాన్ని అంటే వజ్రాయుధ రూపమైన జెండాను బాణంతో కొట్టినట్టుగా కవి చెప్పి వున్నాఁడు. కాని అక్కడ 'శనిధ్వజం' అనే అర్థం ఝుడితి స్ఫూర్తి కలిగి వుంది. దేవేంద్రుఁడి ధ్వజంమీఁద శని వుండడంవల్లనే రఘుమహారాజుకు లొంగిపోయినాఁడనే అర్థాన్ని కలిగిస్తూ ఉండడంచేత రఘుమహారాజు పరాక్రమానికి రాఁదగ్గంత గౌరవం రాకపోవడమే కాక యింకా చాలా దోషాలు ప్రసక్తిస్తాయో? లేదో విజ్ఞులు విచారించాలి.

శ్లో. "సుదక్షిణాసూను రపి న్యవర్తత" (౬౨ శ్లో)

యిందులో దిలీపపుత్రుఁడని చెప్పక తల్లిపేరు చెప్పడం లోఁగడ వుదాహరించిన దోషాన్ని కొంతబలపఱచినట్టయిందో? లేదో? విజ్ఞులు విచారించవలసివుంది.

శ్లో. "మనుప్రభృతిభి ర్మాన్యై ర్భుక్తా (౭ వశ్లో. ౪ సర్గ)

యిందులో రఘుమహారాజుచే పరిపాలింపఁబడుతూవున్న భూదేవి యిదివఱలో యితని పూర్వులచే పరిపాలింపఁబడ్డప్పటికీ యితని విషయంలో కొత్తదానివలెవుంది. అని వర్ణించాఁడు. పూర్వుల పరిపాలనకంటే కూడా యీతని పరిపాలన చాలా బాగావుందనే తాత్పర్యంతోటే కాళిదాసు పైశ్లోకాన్ని వ్రాసి వున్నాఁడు, కాని, స్త్రీలింగసారస్యం వల్ల రాజుకున్నూ, భూమికిన్నీ భార్యాభర్తృభావం ధ్వనించడానికి లేశమున్నూ అభ్యంతరం లేదు కనక తన తండ్రి మొదలైనవారిచే అనుభవింపఁబడ్డ స్త్రీనియ్యేవే తానున్నూ

అనుభవించడమనే దోషం తగిలి రఘుమహారాజులకు, 'అమ్మ మగఁడు. నాయనమ్మ మగఁడు' వగయిరా దోషాలను సంఘటిస్తుందనుకుంటాను. కుల క్రమాగతమైన రాజ్యపరిపాలనాన్ని ఆమోదించే రాజుల కందఱికీ యీ దోషం తగిలే తీరుతుంది. గనక యీ ఆక్షేపణ చేయఁగూడదంటారేమో? ఆక్షేపకులెవ్వరూకూడా మఱికొందఱికికూడా తగులుతుందన్నంతమాత్రంలో ఆక్షేపించడాన్నుంచి విరమించరు సరికదా! మీకు మఱీ మంచిది అలా తగలడమనికూడా జవాబు చెపుతారు. కాఁబట్టి విజ్ఞులు మార్గాంతరం విచారించాలి.

శ్లో. "కుంభయోనే ర్మహౌజసః" (౨౧ శ్లో)

యిందులో అగస్త్యుఁడనే అర్థంయిచ్చే కుంభయోనిపదం కుంభమువంటి... అని ఉపమానపూర్వ పదకబహువ్రీహిగా చెప్పుకోవడంవల్ల అశ్లీలార్థం యిచ్చి తీరుతుంది. కుఱ్ఱ వాళ్లకు పాఠం చెప్పడంలో చాలాచిక్కు కలిగిస్తుంది కాఁబట్టి 'కుంభసూతేః' అని సవరించాలంటాను.

శ్లో. "విశాంపతి ర్విష్టరభాజమారాత్" (౩ వశ్లో - ౫ సర్గ)

ప్రజా పాలకుఁడు అనే తాత్పర్యంతో యీ శ్లోకంలో వాడిన 'విశాంపతిః' అనే పదం దురర్థాన్ని కూడా యిచ్చేదిగా వుండడంచేత చింత్యం కాక తప్పదు. ప్రయోగాలు కావాలంటే -

శ్లో. "విడ్జాలసమవిడ్జాలం భాతి పెద్దాపురం"

ఇత్యాదులు పెక్కులు. యీలాంటి విమర్శన చేయకూడ దనియ్యేవే నా అభిప్రాయం గాని నిజంగా కాళిదాసుకవిత్వం దోషభూషితమని లేశమున్నూకాదు. అయితే యీవ్రాఁత - పాదువ్రాఁత - యెందుకు వ్రాశా? వంటారేమో? కాళిదాసాదులలో కూడా సహృదయత్వం లేనివారికి యిట్టి అపార్థాలు కనపడేటప్పుడు అస్మదాదుల మాట లెక్కేమిటి? అని చూపడానికే కాని వేఱుకాదు. కనక సహృదయులు నన్ను క్షమించాలి!!

★ ★ ★

# చొప్పదంటు శంకలు

వికట విమర్శనం అంటూ కొన్ని పనికిమాలిన శంకలు నేను చేయడమే అవకతవకగా వుంటే దాన్ని కొంత బలపఱుస్తూ యేవో కొన్ని మాటలు వ్రాసిన శ్రీయుతులు జటావల్లభుల వారు మఱో శ్లోకాన్ని కూడా వుదాహరించడానికి నేను మఱీ విచారపడుతూ వున్నాను. కాళిదాసుగారికివుండే పాండిత్య కవిత్వాది ప్రజ్ఞల మాట అలా ఉంచుదాం.

లోకజ్ఞానంలో యెన్నో వంతున్నూ కూడా యే విమర్శకులకుఁగాని, ఏ కవులకుఁగాని వుండవంటే అంగీకరించనివారెవ్వరు? అట్టి సందర్భంలో ఆయన కవిత్వంలో చొప్పదంటు శంకలకు వుపక్రమించడంకన్న సాహసం వుంటుందా? ముఖ్యంగా భూమిని నాయికగా రూపించుకోవడంవల్ల వొక్కొక్క రాజు, అమ్మ మొగుడుగా, నాయనమ్మ మొగుడుగా కావలసివస్తుందనే భావాన్ని నేను తీసినమాట సత్యం. యీభావం ప్రతికవి కవిత్వంలోనున్నూ అంతో యింతోవస్తుంది. యీమాత్రం జ్ఞానంలేక ఆయా కవులు ఆరీతిగా చిత్రించలేదు. వారికి పూర్తిగా తెలుసును. కాని రూపకాలంకారరీత్యా (Metaphor) ఆరోపితమైన నాయికాత్వం విషయంలో యిట్టి అపార్థ కల్పన చేయడం లేశమున్నూ సమంజసం కాదని ఆయా కవులెఱుఁగుదురని వేఱే వ్రాయనక్కరలేదు. యిది చాలా కల్పించడమనేది మన అజ్ఞతను ప్రకటించుకోవడం తప్ప మఱొకటి కాదని తెల్పడానికే నేను భంగ్యంతరంగా ప్రవర్తించానని పూర్తిగా శ్రీజటావల్లభులు గ్రహించేవున్నారు. కనక విస్తరించేదిలేదు. యీ శంకలవంటివే నన్నయ్యగారి భారతంలో–

“చెప్పుము నాకుఁ బయోరుహానన!” అనేచోట గరుత్మంతుఁడు తల్లిని “పయోరుహానన!” అంటూ సంబోధించడం బాగులేదనే ఆక్షేపణమున్నూ, యముఁడు సావిత్రినిగూర్చి “తనులతాంగి! భవదుదారవాగ్భంగికి, మెచ్చువచ్చె” అనేచోట “తనులతాంగి!” అని సంబోధించరాదనే ఆక్షేపణమున్నూ, యీ రెండు స్థలాలలోనున్నూ అవయవార్థ వివక్ష చేసుకోరాదని గ్రంథకర్తల తాత్పర్యమని వేఱే వ్రాయనక్కఱలేదు. ఒకచోట “అమ్మా!” అనిన్నీ, వేఱొకచోట, “అమ్మాయీ!” అనిన్నీ మాత్రము అర్థంగాని అన్యంకాదు. నన్నయ్యగారు ద్రౌపదీ వివాహఘట్టంలో అర్జునుఁడి చేత కర్ణుణ్ణి “కానీన” అని సంబోధింప చేయడంకూడా అవయవార్థం చెప్పుకోవలసిందనే తాత్పర్యంతోకాదు. “కానీన” అంటే? ఓ కర్ణా! అని మాత్రమే అర్థం చెప్పుకోవలసిందనియ్యేవే. అంతేకాని కన్యకావస్థలోవున్న

కుంతికి జన్మించినవాఁడా! అనే అర్థం లేశమున్నూ వివక్షింపవలసిందని కాదు. పద్యకవిత్వ మర్యాద యెఱిఁగినవా రందఱికి ఆ యీ స్వల్పాంశాలు హృత్కవిలే కనక విస్తరించవలసింది లేశమున్నూలేదు. కనక విస్తరించేదిలేదు. కవితాకన్యకను చాలామంది కవులు కూఁతురుగా రూపించుకొన్నారు. కొందఱో? భార్యగా రూపించు కొన్నారు. ఒకరిభావన వొకరికి బాధించదు సరికదా! వొక కవే వొకచోట వొకలాగున్నూ, మఱోచోట మఱివకలాగునున్నూ భావించడంకలదు. ఆ భావనకూడా వకదాన్ని వొకటి బాధించదనియ్యేవే నా అభిప్రాయం. గద్వాల శతావధానంలో శ్రీరాజాగారు అడిగిన ప్రశ్నలో "స్త్రీలకు శృంగార రసోపయుక్తము లయిన అవయవాలన్నీ యెదటి భాగంలోనే వున్నాయిగదా! జడకూడా అట్టిఅవయవాలలోదే. యిది వెనకవుండడాని క్కారణమేమో చెప్పవలసిం"దని అడగఁబడింది. అప్పుడు ఈకిందిపద్యం చెఱివక చరణంగా చెప్పఁబడింది. దాన్ని వుదాహరించి కొన్ని మాటలు వ్రాస్తాను.

"సీ. పురుషాయిత మొనర్చుపూఁబోఁడి కటిమీఁద
నాట్యంబుసల్పు పుణ్యంబు కొఱకొ?
ఘననితంబస్థలంబను పెన్నిధానంబు
బహుభద్రముగను గాపాడుకొఱకొ?
తానాశ్రయించు కొంతకు వెన్కభాగమ్ము
ననుగూడ సౌందర్య మనుచుకొఱకొ?
పదిమంది దృష్టులు పడిన "కంటక" మంచు
నూహించి కనుపడకుండుకొఱకొ?

తే.గీ. వేణి కాంతలవెన్నంటి వ్రేలుచుండె
లేకయుండిన నిధువనలీల కుపచ
రించు నంగమ్ము లెదుటనే సంచునించ
దాని కట్లుండ నే యుపద్రవము వచ్చె?"

అని చెప్పేటప్పటికి శ్రీరాజావారన్నారుగదా! "యేదో వుపద్రవం వచ్చినట్టు చెప్పఁగలరా?" అన్నారు. దానిమీఁద యీపద్యాన్ని చెప్పాము.

"మ. ఎదుటన్ వర్తిలునట్టి యంగముల కెంతేని న్నఖాదిక్షతా
పద పల్మాఱును గల్గు సంగతిని దాఁ బ్రత్యక్షముం జూచి నె
మ్మదిలో భీతిలి చాటుచోటనుచు సంభావించి వెన్నంటుచున్
బొదలంబోలును వేణి, లేకునికిఁ దా ముందుండ కట్లుండునే?"

యీ పద్యార్థాన్ని విని శ్రీ రాజావారు "సరే దాక్కుందనుకోండి యిప్పుడు మాత్రం కొన్ని సందర్భాల్లో జడను పట్టుకోవడం ఆయా సమయాల్లో తప్పిందా?" అని ప్రశ్నించారు. దానిమీఁద "అయ్యా! కవిత్వ మంటేనే అబద్ధం. దానిలోవున్న నిజం చాలాలోఁతులో వుంటుంది. ఆ నిజాన్ని గ్రహించేవారు క్వాచిత్కంగా వుంటారు. సెలవైతే యింకో అబద్ధం ఆడమంటే ఆడతాము" అన్నాము. రాజావారు రసికులు గనుక, "చాలును సంతోషించా" మన్నారు. అసలు యీ ప్రశ్న యిప్పటి నైజాంగారి తండ్రి మహబూబుపాదుషా (యీయనకవి) సంస్థాన కవులనేమో అడిగివున్నారఁట : వారు వురుదులో పూర్తిచేశారఁట! అదికూడా మా రచనతో సరిపోయి వుందఁట! ఆశువులో యిట్టిరసవిషయాన్ని చక్కఁగా సమర్థించి నందుకు రాజావారు ఆనందించారు. ఇది విషయాంతరం. ఆయా సంస్థానాల్లోయేమి, అవధానాల్లోయేమి చెప్పిన మాపద్యాలనుగూర్చి యీలాటి పూర్వోత్తర సందర్భాలు యెన్నోవ్రాయవలసి వుంటుంది. యింతకూ తేలిందేమిటంటే? కవిత్వం అంటే ఆహ్లాదానికి పుట్టింది. ధర్మశాస్త్రాన్ని పురస్కరించుకొని ప్రవర్తిస్తుందనుకో కూడదు. అలాగే అయితే శకుంతలా దుష్యంత సమాగమం మహాభారతంలో మాట అలా వుండనివ్వండి. అది యథార్థకథనం గనక తప్పులేదనుకుందాం. కాళిదాసు గారు ఆ అనౌచిత్యాన్ని సవరించాలంటే? సవరింపవచ్చునుగదా! యెందుకు సవరించలేదో? మిట్టమధ్యాహ్నామే సమాగమాన్ని చిత్రించడమేమో? ఆలోచించండి. ధర్మశాస్త్ర, వైద్య శాస్త్రాలకు విరుద్ధ మన్నమాట కాళిదాసెఱఁగఁడనుకోవడంకంటె పామరత్వం వుంటుందా? అక్కడ సమాధానం శృంగారరసానికిన్నీ, ధర్మశాస్త్ర, వైద్యశాస్త్ర విరోధానికిన్నీ లేశమున్నూ సంబంధం లేదనియ్యేవే. యింకా యిలాటి వెన్నో వ్రాయవలసి వుంటాయి. మొత్తం కవిత్వంలో వుండే ఆరోపణలు పుచ్చుకొని వరుస వావులు నిర్ణయించడం పామరత్వంలోనే చేరుతుం దన్నది ముఖ్యాంశం. ఆ అభిప్రాయంతోనే నేను ఆ విషయం యెత్తుకున్నాను. శ్రీ పురుషోత్తంగారు నాకన్నా బలవత్తరమైన స్థలాన్ని యిచ్చివున్నారు. యింకా బలవత్తరమైనదాన్ని నేను వెదికి యివ్వడం యిక్కడ అవసరంకాదు. మొత్తం యిలాటిచోట కావ్యార్థగ్రహణం చేయడం యిలా కాదని తెల్పడమే మావుభయుల తాత్పర్యమున్నూ. ఆవలివారిజ్ఞానం యెంతో పరిశీలించి మఱీ పూర్వపక్షం యెత్తాలి. అందుకే నేను ఆ వ్యాసం వుపక్రమించాను. దాన్నే శ్రీయుతులు బలపఱిచారు. అంతే కావలసింది. దీన్నిబట్టి వెఱ్ఱి వెఱ్ఱిగా కావ్యార్థాన్ని గ్రహించేవారు వారివారి అభిప్రాయాలు మార్చుకోవడమే మాయిద్దఱికిన్నీ కావలసింది.

"కోవేత్తి కవితాతత్త్వ మీశ్వరో వేత్తివానవా" అనే శ్లోకార్థం బాగా తెలుసుకొనిగాని, యేవిమర్శకులుగాని మహాకవుల కవిత్వాలజోలికి పోకూడదని నాతాత్పర్యం. మురారి మహాకవికి అర్థవిషయంలోకన్న శబ్ద విషయంలో చాలా పట్టుదల వుండడంచేత కాఁబోలు!

భరతవాక్యంలో యితర నాటకకర్తలకన్న భిన్నంగా వకమాట వ్రాశాఁడు. దాన్ని వుదాహరించి దీన్ని ముగిస్తాను.

"నశబ్దబ్రహ్మోత్థం పరిమళ మనాఘ్రాయచజనః
కవీనాం గంభీరే వచసి గుణదోషౌ రచయతు"

ఆయీ మురారి కవివాక్యంకూడా "కోవేత్తి కవితాతత్త్వం" అనే సూత్రాన్ని పురస్కరించుకొన్న భాష్యప్రాయమే అని విజ్ఞులు గుఱుతింతురుగాక!

★ ★ ★

# వెనకటి పండితులు

వీరు చాలా అసిధారావ్రతంగా జీవయాత్ర గడుపుకున్నారని గురువులవారు చెపుతూవుంటే వినడమేకాదు కొందఱిని నాబాల్యంలో ప్రత్యక్షంగా చూచికూడా వున్నాను. ముఖ్యంగా వీరి జీవయాత్రకు కావలసింది నీటి సదుపాయం. అదేనా వ్యవసాయానికి వుపకరించేది కాదు, స్నానపానాలకు మాత్రమే. యిచ్చేదాతలు బహుమందివున్నా ప్రతిగ్రహణమంటే వీరికి చచ్చిన చావుగా వుండేది.

"పయః ప్రసృతిపూరకం కిమున ధారకం సారసమ్"

అన్నమాదిరిగా కాలాన్ని వెళ్లిద్దామనేకాని స్విష్టకృత్తుగా ఉదరాన్ని పూరించుకుందా మనేవాంఛ వీరిలో యేకొందఱికో తప్ప వుండేదేకాదు. కాలేకడుపుకు మండే బూడిద సామెతగా కాలం గడిపేవారు. యెంతసేపూ శిష్యులూ, వాళ్ల పాఠాలూ యేలోపమూ లేకుండా జరగడమే వీరికి కావలసింది. వీరి జీవయాత్రను యీపద్యం చెబుతుంది.

మ. చదువుల్ విస్తరికుట్లు జందెపుఁబనుల్ చాపల్ మఱిన్ దొడ్లలోఁ
బొదలుం గూరలుగాఁగ వర్తిలిరి తద్భూమీసురుల్ నేఁటిసం
పద "మోటారులు" మేడ లోడలునుగా మాఱెంగదా? వీరి కు
న్నదె యవ్వారల తృప్తి వారిసుఖమానందంబుఁ గామేశ్వరీ.

ఆయీ మాదిరిని కాలక్షేపం చేసేవారిని ప్రత్యక్షంగా నేను చూచి వున్నాను. రఘువంశం చదువుకొనేరోజుల్లో వొకరిదగ్గర పరాయత్పన్నాలు చెప్పుకోవడానికి శుశ్రూషకూడా చేసివున్నాను. ఆ వొజ్జగారి జీవయాత్రా విధానాన్నే పైపద్యంలో నేను వుటంకించాను. అటుతరువాత శుశ్రూషచేసిన గురువులు కూడా పైపద్యానికి వుదాహరణంగా వుండేవారే గాని మఱోమాదిరివారు కారు. రఘువంశపు గురువుగారు (కానుకుర్తి భుజంగరావు పంతులుగారు) మాత్రం ఆగర్భశ్రీమంతులు కావడంచేత దేవతార్చన స్వయంగా చేయడం యెప్పుడోగాని తటస్థించేదికాదు. దానికోసం వొక బ్రాహ్మణుఁడు నియమితుఁడు వుండేవాఁడు. ఆ పండితులకి మనకి సంసారం యేలా గడుస్తుందనే ఆందోళన వున్నట్టు కనపడేదికాదు. మా పరమగురువు చర్ల బ్రహ్మయ్యశాస్త్రుల్లు

గారి జీవయాత్ర మఱీ ఆశ్చర్యకరంగా వుండేది. యింకా ఆయన్ని యెఱిఁగిన ఆకాలపు మనుష్యులు కొందఱు అక్కడక్కడ వుండఁబట్టిగాని లేకపోతే నేను ఆయన్నిగుఱించి వ్రాసేవాక్యాలు శుద్ధ అబద్ధాలే అనుకుంటారు యిప్పటివాళ్లు. అయ్యయ్యో ఆజీవితానికిన్నీ యిప్పటి వారి జీవితాలకీ లేశంకూడా పోలికేలేదు. యిప్పుడు భాధాంతం తర్కం చదివినా సరే, భాష్యాంతం వ్యాకరణం చదివినాసరే, వారిని ఆదరించేవారు లేకపోవడంచేత మళ్లా భాషా ప్రవీణపరీక్షకు చదివి ప్యాసై అక్కడినుంచి వారినీ వారినీ ఆశ్రయించి సిఫారసుత్తరాలు సంపాదించుకొని యేస్కూల్లోనేనా పండితపదవి సంపాదించుకోడానికి యజమానులదగ్గరకి కాళ్లరిగేటట్లు తిరిగినిన్నీకృతార్థులు కాలేనివారినిచూస్తే యెంతో విచారం వేస్తుంది. యింకోవిశేషం : ఆ యీ వుద్యోగప్రదాతల్లో కొందఱు నిన్నా నేఁటిదాఁకా నిషధయోగ్యులుగా వుండి ఆఖరికి పంచతంత్ర మార్జాలాలుగా మారడంచేత కొందఱిస్థితి మఱీ శోచనీయంగా మాఱింది. పాపం పెళ్లాం పుస్తే పూసా అమ్మి వారిని సంతోషపెట్టాక ఆయీ సంతోషపెట్టిన వాళ్లలో కొందఱికి ప్రతిఫలం కలిగించేటంతలో – "భాషామంజరీ సమాప్తా" అన్నట్లుగా యేదో అవాంతరం వచ్చి వారికివున్న అధికారంకాస్తా వూడి పోవడం (అధికారాంతము నందుఁ జూడవలదా! ఆ యయ్య సౌభాగ్యముల్) తటస్థమై తక్కినవాళ్లగతి – "రెంటికి చెడ్డ రేవణ" కావడం వింటే యెవరి మనస్సుకేనా విచారం కలక్కపోదుగదా? వెనకటి పండితుల్ని యెన్ని విధాల బలవంతపెట్టినా, బతిమాలినా భృతకోపాధ్యాయత్వానికి "ససేమిరా" అనడమేకాని ఆమోదించడమంటూ వుండేదే కాదు. యిప్పుడో ఆ మహా పదవికి లంచపంచాలుకూడా సమర్పించడమే కాకుండా పడరాని పాట్లన్నీ పడడంచేస్తే, పృథివి పుట్టింది మొదలు యీలాంటి దరిద్రదశ పాండిత్యానికి పట్టలేదనే అనుకోవాలి. యీలాటి వారిని ఆవుద్యోగప్రదాతలు యీసడించారంటూ చాటునా మాటునా వీరు సణుక్కోవడం చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. ఆయీ యీసడింపు "నాన్ బ్రామిన్సు మూమెంటు" మూలంగా వచ్చిందంటూ కొందఱు సణుక్కుంటారు. యివి మఱీ పిచ్చి మాటలుగా నాకు కనపడతాయి. పండితుఁడు వుండవలసినవిధంగా వుంటే యే "మూ మెంట్లూ" వారిని యీసడించకపోను. వృథాగా అన్యాయ ప్రవర్తనకు అధికారికి మార్గం చూపే యీపండితులమీఁద గౌరవం "నాన్ బ్రామిన్సు" కే కాదు "బ్రాహ్మిన్స్"కు మాత్రం యేలావుంటుంది? ఆకాలపు పండితులు బుఱ్ఱపోయినా సరే లౌకికవ్యాపారాల్లోకి అడుగుపెట్టేవారు కారు. చామర్ల కోట భీమవరంలో గుండుచేన్లుగారంటూ వొక వుద్దాలప్పండితులు వుండేవారఁట. ఆయనకి వసతివాడు లేమీలేవు. ఆకాలంలో వారుయత్నిస్తే యే జమీందారులేనా ఆదరించి వసతివాడులు కల్పించి పూజించేవారే. కాని అందుకు ఆయనకి లేశమూ యిష్టం లేకపోవడంచేత కుటుంబపోషణకి యాయవారం

చేయడం మొదలుపెట్టారని విన్నాను. "చామర్లకోటలోఁ జదివితి రాఘవాచార్యు సన్నిధిని" అనే రాఘవాచార్యులవారు యీ చేన్లుగారి శిష్యులే. అయితే యాయవారం మాత్రం ప్రతిగ్రహణంకాదా! అని కొందఱు అనుకుంటారేమో? యేదో విధానాన్ని కుటుంబపోషణ జరగాలి కనక అప్పటి పండితులు, "యదహ్నాత్కురుతే పాపం" గా ఆ యీ వృత్తిని ఆశ్రయించడానికి సమ్మతించేవారు. (కుక్క దానం పట్టి కుటుంబాన్ని పోషించమని సామెత.) బులుసు అచ్చయ్యగారు నప్రతిగ్రహీతలుగా (పదేసి వేలు, యిరవైయేసి వేలు ఆయాచితంగా యింటికి స్వయంగా పట్టుకువచ్చి యిచ్చే దాతలు వుండఁగా కూడాను) వుండి వుండి ఆఖరికి జన్మానికల్లా శివరాత్రిగా వొక్కమాటు కాఁబోలు హైదరాబాదా దివాన్ చందోలాలాగారి వద్ద వొక నిలువు చెంబెఁడు పూల వరహాలు పరిగ్రహించారని వినడం. అదేనా యెందుకు తటస్థించిందంటారు? భార్య వీధిగుమ్మం అలుకుతూ వుండఁగా అచ్చయ్యగారు యీవాళ యింట్లో శాకపాకాలేమిటి అని ప్రశ్నించారనిన్నీ, దానిమీఁద ఆ మహాయిల్లాలు హేలగా "యేమున్నాయి, యిత్యర్థల పులుసూ, యితిభావల కూరా" అన్నదనిన్నీ అది విని ఆవిడహృదయం ధనాశా విద్ధంగా వున్నట్టు (పరేంగితజ్ఞానఫలాహి బుద్ధయః) గ్రహించి సదరు అచ్చయ్యగారు (యీయనకీ వేదశాస్త్రాలు యావత్తూ వచ్చివుండడంచేత యే పేరూ చివర తగుల్చుకోడానికి వీలుగాక పుట్టుపేరుతోనే వుండిపోయారని చెప్పుకుంటారు) నీవు ఎంతసొమ్ము తెచ్చియిస్తే సంతోషిస్తావో ఆసంగతి మళ్లామళ్లా కాక ఒకమాటే విధిస్తే తెచ్చియిస్తానని ప్రతిజ్ఞచేశారనిన్నీ, ఆ అమాయకపు యిల్లాలు ఆ సమయానికి తన చేతిలోవున్న నిలువుచెంబు (యా ఖర్వేణపిబతి తస్యై ఖర్వః అని వేదం) చూపి దీఁనెడు వరహాలు కావాలందనిన్నీ, తరువాత ఆ చెంబు చేత పుచ్చుకొని ఆపూటే ప్రయాణమై హైదరాబాదులో అన్ని వరహాలూ దివాన్‌జీగారివద్ద పరిగ్రహించి తెచ్చియిచ్చి ఆవిడకి సంతుష్టిని కలిగించారనీ చెప్పుకుంటారు. అచ్చయ్యగారు అంతకంటె అధికంపుచ్చుకోక పోవడంచేతఁగాని చందోలాలాగారి యీవి అంతమాత్రంతో ఆగేదికాదు. యిచ్చేవాఁడు దొరికాఁడుకదా అని యావత్తుకూ ఔపాసన పట్టేవాఁడైతే అచ్చయ్యగారు చరిత్రపురుషుఁడెలా అవుతాఁడు? అస్మదాదులకు వారిని గుఱించి ముచ్చటించుకొనే అధికారం కూడా లేదనిపిస్తుంది నాకు. చేన్లు గారి యాయవారంలో అచ్చయ్యగారు అవాంతరంగా వచ్చి తగిలారు. ఆయన యాయవారానికి బయలుదేరారంటే? యేమన్నమాట? సాక్షాత్తు ఈశ్వరుఁడు (అణిమాద్యష్టైశ్వర్యోపేతుఁడు) వెండికొండ గుహలో నివసించేవాఁడు బంగారుకొండ చేతులో కలవాఁడు ప్రత్యక్షమైనాఁడన్న మాటేకదా? యింక చూడండీ! కుంచాలక్కుంచాలతో కమ్మయిల్లాండ్రు గుమ్మరించేవారు బియ్యాన్ని. అవి సమాప్తమయే దాఁకా ఆయన మళ్లా బయలుదేతేవారే కారు. బహుశః వారానికోసారి

వెళ్లవలసి వచ్చేదేమో? అయితే బయలుదేరిన రోజున వొక బస్తా బియ్యానికేనా చావు లేదుగదా? వీట్లని చేన్లుగారే మోసుకునేవారా? అంటారేమో? వారెందుకు మోసుకోవాలి? కూడా శిష్యులున్నారుగదా బోలెడుమంది. బస్తా కాదు యెన్ని బస్తాలేనా మోస్తారు. ఆదృశ్యం నేనైతే చూడలేదుగాని చూడవలసిన దృశ్యం మాత్రం అవును. పండితుఁడైన వాఁడికి నెత్తిమీఁద తట్టతలపాగా తగుల్చుకొని భృతకోపాధ్యాయత్వాన్ని ఆచరించడంకంటె యాయవారం యెత్తుకోవడమే శోభస్కరంగా వుండేదేమో? అప్పటి కాలంలో, యెవ్వరో అలాంటి మహనీయులు అవలంబించే ఆ వృత్తిని యిప్పుడు బడుద్ధాయిలందఱూ అవలంబించారు. తత్తథాస్తాం. ఈ కాలపు ఉపాధ్యాయత్వమంటారా? శ్లో. అర్థానా మార్జనే దుఃఖ మార్జితానాంచ రక్షణే. అనే శ్లోకార్థానికి సంబంధించి వుంటుంది. పూర్వపండితులు వీట్లని నిరసిస్తారని చెప్పడంతో అవసరమే లేదు. యీగతి "డిగ్రీలు" సంపాదించి ఆర్జించుకొన్న వుపాధ్యాయత్వానికి సంబంధించినది- పూర్వపండితులలో ఎవరో తప్ప దీనికి ఆమోదించేవారు కారని వ్రాసే వున్నాను. యేనుగులను పట్టుకొని తీసుకువచ్చేవాళ్లు వాట్లకి మొట్టమొదట నల్లమందు అభ్యాసం చేస్తారనిన్నీ దానికి అలవాటు పడ్డాక దానికోసం అవి స్వాధీనపడి వాళ్లకి లొంగిపోయి "దాసోహం" అంటాయనిన్నీ చెప్పఁగా వినడం. అలాగే పూర్వపండితులలో యేకొందఱో భృతకానికి అలవాటుపడిదీర్ఘా యుర్దాయం పట్టడంవల్ల జీవితకాలంలోనే ఆనల్లమందు ప్రదాతలచేత పాఠశాలనుండి తొలఁగింపఁ బడవలసి వచ్చినప్పుడు యెంతో దైన్యానికి గురికావలసి రావడం అందఱూ యెఱిఁగిందే కనక విస్తరించేది లేదు. (యీ దైన్యం అనుభవించినవారిని పేర్కోవలసివస్తే చాలా విస్తరిస్తుంది వ్యాసం) భృతకో పాధ్యాయత్వానికే కాదు. మహారాజాస్థానంలో పండితపదవి కూడా ఆకాలప్పండితులలో చాలామంది అంగీకరించడం అరుదుగానే వుండేది. కొవ్వూరు గోపాలశాస్త్రుల్లుగారినీ, భాగవతుల హరిశాస్త్రుల్లుగారినీ విజయనగరం మహారాజులుంగారు కాశీనుంచి పెద్ద ప్రయత్నంచేసి తీసుకువచ్చారని తజ్ఞుల వల్లవిన్నాను. విజయనగర సంస్థానంలో పండితులకు వుండేగౌరవం అసాధారణం. కొందఱు జమీందారులు పండితుల్ని గౌరవవేతనాలిచ్చి పోషించడమైతే వుంటుందిగాని అది మనోవర్తి (భరణం) మాదిరిని వారు అనుభవిస్తూ వుండడంమట్టుకేగాని వారి గోష్ఠికి ఆ జమీందారులు అవకాశం యివ్వడం వుండనే వుండదు. విజయనగరప్పద్ధతి అలాటిదికాదు. ప్రతిదినమూ పండితగోష్ఠి కంటూ కొంతటైము రిజర్వుచేసి వుంచి ఆ టైముకు రాజుగారికి యితర తొందర పనులేవేనా వున్నట్టయితే ఆ పండితులసభకు వచ్చి నమస్కారాది సంభావనలు జరిపి ఆశీర్వచనాన్ని పుచ్చుకొని వారి ఆజ్ఞను పొంది ఆవలి రాచకార్యానికి వెళ్లడం ఆచారం. ఈ ఆచారం

యిప్పుడేమేనా మాటిందేమో కాని ఆనందగజపతి మహారాజులుం గారి ప్రభుత్వకాలంలో లేశమూ మాటలేదని యెఱుఁగుదును. సంస్థానగౌరవంగాని, పండిత గౌరవంగాని మన ఆంధ్రదేశంలో ఆనందగజపతితో అంతరించిందంటే అంగీకరించనివారుంటారని నేను అనుకోను. ఆ కాలంలో వుండే పండితుల మర్యాదలు యిప్పటివారికి మతికొందఱికి అంతగారుచించవని యెఱిఁగిన్నీవొకటి యిక్కడ వుటంకిస్తాను. మహామహోపాధ్యాయ (పూర్వం యీ బిరుదు యీలాటి వుద్దండులకు వుండేది) శ్రీ పరవస్తు రంగాచార్యుల వారు విజయనగరానికి సన్నిహితంగా వుండే విశాఖపట్టణ నివాసులైవుండి కూడా ఆ సంస్థానానికి వెళ్లనేలేదు. దానిక్కారణం వారి మర్యాదలకు సంస్థానంవారు సమ్మతించక పోవడమే. ఆచార్లవారికి వారి మర్యాదలకు సంస్థానంవారు సమ్మతించకపోవడమే. ఆచార్లవారికి వుండే మర్యాద లేలాటివంటే! కోట ఆవరణదాఁకా సవారీమీఁద వెళ్లడమున్నూ, రాజసభలోకి పాదుకలతో నడిచి వెళ్లి ఆస్థానంలో స్వంత చిత్రాసనం మీఁద కూర్చోవడమున్నూ. బాగా ఆలోచిస్తే పాండిత్యానికి తగ్గ వేషభాషలంటే వైష్ణవులవే. యిందులో చివరదానికి మహారాజులుంగారు సమ్మతించఁ జాల మన్నారఁట. యెందుచేతనంటే? మీవంటి పరమపూజ్యులను మేము మీ ఆచారప్రకారం పూజించడానికి అభ్యంతరం లేదు గాని అది మా సంస్థానపండితులకు అవమానకరంగా వుంటుంది కనక అంగీకరించమన్నారఁట. ఆ పద్ధతిని మీ సంస్థానానికి మేము రాజాల మన్నారఁట ఆచార్యులవారు. (ఆ యీ సంగతులు నేఁటివారు పిచ్చిగా భావిస్తారు) అంటే. అంతతో కథ ముగిసింది. "సా కిం న రమ్యా నచ కిం నరంతా బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా." వుర్లాం పేరుకు చిన్నజమీనే అయినా పండితసత్కారం పరీక్షించి చేసేది కావడంచేత మన దేశంలో దాని పేరు ప్రతిష్ఠలు చాలా వ్యాపించాయి. యే యూనివర్సిటీకికూడా దానికున్నంత అధికారంలేదు. ఇచ్చేదేమో సా 1 కి 12-0-0 రూపాయిలు మాత్రమే కాని చేసే పరీక్ష మాత్రం నూటికి నలభై మార్కుల బాపతుకాదు. నూటికి నూరూ రావడం విధి. దీనిలో యేమాత్రం తగ్గినా దానిలోటు యిచ్చే రు 12-0-0 లలో అణో అర్ధణో కానో తుదకి పైసో తగ్గించి మఱుసటి సంవత్సరం ఆలోటు భర్తీ అయిన తరవాతే పూర్తి వార్షికం యిచ్చేవారు. ఆ సంస్థానంలో పరీక్షాధికారులుగా వుండే పండితులకు మాత్రం నూటపదహార్లు వార్షికము వుండేది. రంగాచార్లవారు శాస్త్రాలకు పరీక్షాధికార్లు. వీరిని వంచించాలని కొందఱు పండితులకు కుతూహలం కలిగి మంత్రవాది లక్ష్మీనారాయణ శాస్తుర్లుగారిని ప్రోత్సహించినట్లున్నూ, వారు వారి కుతూహలానికి అనుగుణంగా రెడ్డిగం వేసుకొని కూర్చున్నట్లున్నూ, జమీందారు బసవరాజుగారు అది చూచి - "అయ్యా!

రంగాచార్లగారు దయచేస్తున్నారు. రెడ్డిగం తీసివేయవలసిం" దనేటప్పటికి వినీ విననట్లు అనాదరించి శాస్త్రుల్లుగారు వూరుకున్నారనిన్నీ, తరువాత క్రమంగా అది ముదిరి నన్ను జయించే పండితులు వచ్చేటప్పుడుగాని యీరెడ్డిగం నేను తీయవలసి వుండదని లక్ష్మీనారాయణ శాస్త్రుల్లుగారు జవాబు చెప్పడం తటస్థించిదనిన్నీ యింకా యేమో యేమో పండితులు చెప్పుకోఁగా విన్నాను. రంగాచార్లవారు షడ్దర్శనీపారంగతులు, లక్ష్మీనారాయణ శాస్త్రుల్లుగారు వ్యాకరణ శాస్త్రంలో మిక్కిలీ అభిమానంగల మహాపండితులు. అంతమాత్రమే కాదు, ఆయన సభలో సంస్కృతం మాట్లాడుతూవుంటే సాక్షాత్తూ మహాభాష్యాన్ని మఱపించే వుండేదఁట వాక్యరచన. రంగాచార్లవారికి అభిమానశాస్త్రం తర్కం. నాఁటి సభలో లక్ష్మీనారాయణ శాస్త్రులుగారు రంగాచార్యులవారికి అభిమాన శాస్త్రమైన తర్కంలోనే రంగాచార్లగారితో శాస్త్రార్థంచేసి పండితులను మెప్పించినట్లు చెప్పుకోఁగా విన్నాను. ఆలాటి సర్వతోముఖ పాండిత్యాలు క్రమంగా కాలదోషమో? ఏమో? చెప్పఁజాలంగాని "గానుగ రోకలి సిద్దిపిడి"గా మార్పుచెంది నానావిధ దైన్యాలకి పాల్పడుతున్నాయి. ప్రతి విషయంలోనూ ఆనాఁటి పండితులకు కొన్ని నియమాలు వుండేవి. అపరగౌతములని ప్రసిద్ధి వహించిన కీ॥ శే॥ శ్రీపాద రామశాస్త్రులుగారికి (వీరు తమ్ములున్నూ, శిష్యులున్నూ అయిన లక్ష్మీనరసింహ శాస్త్రులు గారు సజీవులు, చాలావృద్ధులు, మళ్లా అన్నగా రంతవారు, పిఠాపురాస్థాన విద్వాంసులు) వొక నియమం వుండేది. గృహస్థు (యెంత ఐశ్వర్యవంతుఁడైనా సరే) ఒకరూపాయికంటె అతనివద్ద యెక్కువ పుచ్చుకోమని నియమం. జమీందారువద్ద రు 10-0-0 కంటె అధికం పుచ్చుకోమనీ నియమం. వారి జీవితం ఆ నియమం భంగం లేకుండానే జరుపుకున్నారు. వారిని నేనుస్వయంగా యెఱుఁగుదు. యీ దేశంలో యిప్పుడెవరేనా నైయాయికులు వుంటే వారికి శిష్యులో ప్రశిష్యులో అయివుంటారు. యీ మధ్య కలకత్తా ప్రెశిడెన్సీ మిద్నపు ప్రాంతంలో "శ్రీరామకృష్ణమిషన్" లో విద్యాభ్యాసం చేస్తూన్న విద్వాన్మైలవరపు పూర్ణానందం నాపేర వుత్తరం వ్రాస్తూ, వ్రాశాఁడుకదా మీ విద్యార్థిదశలో మనదేశంలో విద్యాభ్యాస పద్ధతి యేలాగు వుండేదో యేదేనాపత్రికకు వ్రాయవలసిందంటూ కోరివున్నాఁడు. దీన్నిబట్టిచూస్తే మనకు పూర్వం యెలా చదువుకొనేవారో కూడా యిప్పటివాళ్లకు పుస్తకాలదగ్గిటికి వచ్చిందని తేలుతూవుంది. అతనికోరికనుబట్టి పనిలోపని ఈ మాటలూ వ్రాస్తూన్నాను. గురువులు యే సామాన్యులోతప్ప సుప్రసిద్ధభృతకోపాధ్యాలుగా వుండడానికి యిష్టపడేవారు కారు. "పంచమేఽ షష్ఠేవా శాకం పచతి స్వేగృహే"గా జీవయాత్ర సాఁగిస్తూ పరమ బుద్ధితో శిష్యులను సుతనిర్విశేషంగా ఆదరించి విద్య చెప్పడమే వారి కృత్యం. (పైఁగా కడుపునిండా అన్నం తినడానికి తగ్గంత

వసతి వారు సంపాదిస్తే ముందువాళ్లు చదువుకోక చెడిపోతారని వారికి పెద్ద భయం వుండేది.) శిష్యులు చేసే ముఖ్య శుశ్రూష (ఉపచారమన్నమాట) గురువు గారి నీర్కావిబట్టలు వుతకడం, విస్తళ్లకు ఆకులుకోసి పట్టుకురావడం (అదేనా అనాధ్యాయాలలోనే) యింత మాత్రం మట్టుకే. శిష్యులు కొందరు వారాలు చేసుకొనిన్నీ, మఱికొందఱు మాధుకరం చేసుకొనిన్నీ క్షున్నివకావించుకుంటూ చదువుకొనేవారు. మావారణ గురువుగారి గ్రామం (కడియె మిక్కిలి కుగ్రామం కావడంచేత శిష్యుల పోషణాన్ని గురువుగారే భరించేవారు. అలా భరించడంచేతనే "తిండికై యిల్లిల్లు తిరగనీయక మేయన్నదాత మాకింటనిడియె" అని వ్రాశాము. మా గురువులకు పూర్వకాలంలో మాట చెప్పలేము గాని, ఆ కాలంలో మాత్రం అన్నంకూడా విద్యాదానం చేసిన గురువులు మా పరమ గురువుగారు మాత్రమే. అయితే వీరు అగ్రహారీకులుగానీ వసద్దారులుగాని కారు.

ఉ. ఉన్నది రెడ్డిసీమ తమకుండెడి దించుక వృత్తిదానికె
న్నెన్నియొ యోగముల్ కుదిరెనేని ఫలించు ఫలించు దానిలోఁ
దిన్నదిగాక తారయితు దెచ్చి యొసంగు ఫలం బదెంత హె
చ్చున్నను వీరి కొక్క నెల యోపునొ? యోపదొ? సందియమ్మగున్.

ప్రస్తుతానికి యీ పద్యం వొక్కటీ చాలును. యింకా కావలిస్తే జాతకచర్యలో చూచుకోండి. మా గురువుగారికి కుటుంబంకంటే కూడా శిష్యవర్గపోషణబాధ్యతే హెచ్చు. వీళ్ల పోషణమాత్రమే కాదు, పెళ్లి పేరంటాల విషయంలోకూడా తఱుచు వారే జోక్యం కలిగించుకొనేవారు. "పెండ్లిపేరంటముల్ ప్రియ మెలర్పఁగఁజేసి యే గుణనిధి మమ్ము బాగుచేసే" అనే సీసపద్యం పైసందర్భాన్ని వ్యాఖ్యానిస్తుంది. 'ఉదార హృదయానాంతు వసుధైవ కుటుంబకమ్' మా గురువుగారి గ్రామానికి నాతి దూరంలోనే వుంది జల్లిసీమ. ఆసీమ ధ్యానప్పంటకి పెట్టింది పేరు. ఆరోజుల్లో కాటాబస్తా వెల రు 2-0-0 లకు మించివుండేదికాదు. యుక్త కాలంలో మా గురువుగారు ఆసీమకు సంచారార్థం సవిద్యార్థికంగా బయలుదేతేవారు. వీరు వెళ్లడమే తడవుగా ఆసీమ వాస్తవ్యులు క్షత్రియులు వారివారి శక్త్యనుసారంగా ధాన్యం పోగుచేసి పడవకి యెగుమతీకూడా స్వంతమనుష్యుల చేతనే చేయించేవారు. ఆ రాజులు మా గురువుగారెప్పుడు వస్తారా? అని ప్రతీక్షిస్తూ వుండేవారు. ఒక బస్తాకంటె తక్కువ యిచ్చిన గృహస్థును నేను యెఱుఁగను. సరే సంవత్సరానికీ సరిపడ్డప్రధాన పదార్థం గాదెలో నిలవుండేది. కూరా నారా స్వంత పెరట్లోనే పండేవి. యింక చెప్పేదేమిటి?... "మహాభాష్యంవా పాఠయేత్, మహారాజ్యంవాపాలయేత్" అన్నట్లు కాలక్షేపం జరిగేది. పెంకుటిళ్లు కట్టుకుందామనిగానీ వస్తువాహనాలు

సంపాదించుకుందామనిగాని వారికి వాంఛ వున్నట్టే లేదు. పెట్టెబేడా వున్నట్టు లేదు. విభూతిసంచి మాత్రం వొకటి వుండేది, అందులోనే రూపాయి, అర్ధా వుంటే నిలవచేయడం.

ఉ. పెట్టెలు లేవు కల్గినను బీగమునున్న విభూతిసంచియే
పట్టుదొకండు భూతి నిడు బంగరపున్ గనిగాఁగ రాజు రా
జట్టులు శిష్యవర్గమున కన్నము విద్యయు నిచ్చు వేలుపుం
జెట్టుల మద్గురూత్తములఁజెప్పి మఱొక్కరి నెట్లు సెప్పుదున్.

ఆయీ విశేషాలు వ్రాస్తే చాలా వ్రాయాలి. మఱొకప్పుడు చూచుకుందాం. తెల్లవారుజామున పాఠాలకు ప్రారంభం చేసేవారు. తక్కువ పాఠం వాళ్లకి ముందు ప్రారంభం. ఆ పాఠాన్ని పై తరగతివాళ్లంతా వినడం ఆవశ్యకం. యీ నియమం శాస్త్రపాఠాలకి మాత్రమే. కావ్యపాఠాల వాళ్లకి గురువుగారు చెప్పడంలేదు. విద్యార్థులలో పెద్దతరగతివాళ్లే చెప్పేవారు, గురువుగారివద్ద చెప్పుకొన్న శాస్త్రపాఠాన్ని క్రిందితరగతి వాళ్లకి పై గ్రంథాలు చదువుకొనే విద్యార్థులు చింతన చెప్పేవాళ్లు. ఆయీ విధంగా కష్టిస్తేనే తప్ప శాస్త్రం స్వాధీనంకాదు. యీ విధంగా అభ్యసించి నప్పటికీ యేకొందఱికోతప్ప సర్వేసర్వత్ర శాస్త్రం స్వాధీనంకాదు. (శ్లో. కేచిద్భగ్నాః ప్రక్రియారంభకాలే... సర్వేభగ్నాః కారక ప్రక్రియాయామ్) యీలాటి శాస్త్రాన్ని చదవకుండానే చదివినట్లు (పుస్తకం మాత్రం సంపాదించి స్వయంగా చూచుకొని అన్నమాట) నటించేవారికి శాస్త్రం యెంతవఱకూ స్వాధీనపడుతుందో వ్యాఖ్యానించనక్కఱలేదు. తర్క పాఠాలకు కూడా విధానం అంతా యిలాగే వుంటుంది. మా గురువుగారికి సమకాలీనులు శ్రీపాద రామశాస్త్రుల్లుగారిని గూర్చి లోఁగడ వుదాహరించే వున్నాను. వారి శిష్యులలో అగ్రేసరులు సంగమేశ్వర శాస్త్రుల్లుగారు. వీరి గ్రామం యేదో నాకు బాగా తెలియదుగాని శిష్యులకు అన్నోదకాలు నిరంతరాయంగా దొరకే గ్రామమని చెప్పి వీరు కాకరపర్తిలో ప్రత్యేకించి మకాంపెట్టారు. వొక పుష్కరకాలం సుమారు వీరు ఆ గ్రామంలోనే వుండి ఆ గ్రామవాస్తవ్యులకే కాక యితర గ్రామాలనుంచి వచ్చిన విద్యార్థుల క్కూడా పుష్కలంగా విద్యాదానం చేశారు. ఆ రోజుల్లోనే రేగిళ్ల అబ్బిశాస్త్రుల్లుగారి శిష్యులు మహాప్రసిద్ధులు మంధా చెన్నయ్యశాస్త్రుల్లుగారు పేరూరు గ్రామంలో విద్యార్థులకు పాఠాలు చెప్పేవారుండేవారు. తర్కశాస్త్రంయావత్తూ అనర్గళంగా పాఠంచెప్పేవారే అయినా ప్రకరణాలు మాత్రం వారు చెప్పినట్టు యెవ్వరూ చెప్పనే లేరనేప్రతిష్ఠ వారికి రిజిష్టరయి వుండేది. అక్కడ ప్రకరణాలమట్టుకుచదువుకొని తరవాయికి సంగమేశ్వర శాస్త్రుర్లుగారి దగ్గిఱికి వచ్చేవారు. విద్యార్థుల భోజన సౌకర్యం కొఱకు గురువులు స్వగ్రామం వదిలిపెట్టి వలస

వెళ్లేవారనడంచేతనే అప్పటి గురువులకు విద్యార్థులందుండే వాత్సల్యం యెలాటిదో తెలుసుకోవచ్చును. యీ సంగమేశ్వర శాస్త్రుర్లుగారు తర్కశాస్త్రంలో వొక క్రోడగ్రంథం కూడా రచించి పండిత సమ్మతిని పొందిన మహావిద్వాంసులు. వీరితో మన దేశంలో గ్రంథకర్తృత్వం దాఁకావచ్చిన పండితులు ఆఖరయినారని అనుకోవచ్చును. వ్యాకరణానికి రాయుఁడు శాస్త్రుల్లుగారితో స్వస్తి. తర్క వ్యాకరణాలు యిప్పుడు కూడా క్రొత్తమార్గంలో డిగ్రీ సంపాదన పరమలక్ష్యంగా పెట్టుకొని అభ్యసిస్తున్నవారు లేకపోలేదుగానీ, యీ బాపతునుంచి గ్రంథకర్తలదాఁకా వచ్చేవారుంటారని తోఁచదు. (భాషామంజరీ సమాప్తా) సరికదా? అసలు చదివిన గ్రంథాలేనా వీరికి అవగతమై వుంటాయో లేదో అని సంశయించవలసే వుంటుంది. విద్యావిధానంలో వొకటేమిటి? యిప్పుడు సర్వమూ మాఱింది. విద్యార్థివర్తన యెంతమార్పు చెందిందో చెప్పలేము. శాస్త్రం చదువుకొనే విద్యార్థులుగాని, చెప్పే గురువులుగాని చాకింటి బట్టకట్టు కోవడం నేనెఱుఁగను. అట్లనిమురికి బట్టలు కట్టుకొనేవారేమో అంటే అదిన్నీ లేదు. "గన్నేరు పూవన్నె గల్గిన కట్టుదోవతుల నీర్కావిసంపద నటింప" అనే శ్రీనివాసవిలాసపు సీసపద్య చరణాన్ని జ్ఞాపకంచేసే శుభ్రవస్త్రాలు కట్టుకొనేవారు. యేపూటకాపూటగాని లేదా యేరోజు కారోజుగాని వుతికి ఆఱవేసిన బట్టలు కట్టుకోవడమేగాని పాచిబట్ట కట్టుకోవడం గాని బారగోచీ పెట్టడంగాని ఆనాఁటి విద్యార్థులలో వుండేవి కావు. క్రాపింగులు వగైరాలు అప్పటికింకా సర్వేసర్వత్ర ప్రారంభం కానేలేదు. ఆ తెగవాళ్లు యెక్కడేనా వున్నా వెలేసినమాదిరిగా వుండేవాళ్లు. ఆ విద్యార్థుల వా క్కెంత పవిత్రంగా వుండేదో ముఖవర్చస్సూ అంత పవిత్రంగానే వుండేది. ఆలాటి మహా విద్యార్థులతో ఆనాఁటి పండితులు బయలుదేఱి వస్తూవుంటే పురాణాల్లో చదువుకొన్న ఋషులు జ్ఞాపకం వచ్చేవారు. యిప్పుడు పాశ్చాత్యవాసన ఆ యీ విద్యార్థులని మాత్రమేకాదు, గురువులనికూడా ఆవరించింది. వీని బాస వేరన్నాఁడు భారతంలో వొక సందర్భంలో నన్నయ్యభట్టు, అలాగే యిప్పటిచదువున్నూ పరిణమించింది. దేశాటనం చేసి, కుటుంబ భరణం యథాకథంచిత్తుగా చేసుకునే పండితులే యిప్పుడు కనపడరు. ఆలాటివారు వున్నట్టయితే ఆదరించే గృహస్థులున్నూ కఱవైనట్టే. యిప్పుడల్లా ప్రయివేటు ట్యూషను చెప్పుకొనేవారు కనపడతారు. ఉచితంగా విద్యార్థికి విద్య చెప్పే పండితులున్నూ చాలాభాగం అంతరించారు. యీ విద్యలగతి – "హా సీతే! కిం భవిష్యసి" అన్న దగ్గఱికి వచ్చింది. వారిది భిక్షాటకప్రాయమైన జీవనమే అయినా గౌరవనీయంగానే వుండేది. యిప్పుడో? యీ విద్యకు యెంత దైన్యం పట్టాలో అంతా పట్టింది. యెక్కడో, కనీసం యెలిమెంటరీ స్కూల్లోనే అనుకుందాం, మాస్టరీ సంపాదించుకోవడానికి యిప్పటి డిగ్రీల పండితులు పడేపాట్లు వర్ణించడానికి వశంకావు. మునుపు దండం పెడితే పుచ్చుకోని

పండితులు యిప్పుడు ఆయావ్యక్తులకు నమస్కరించినా ఫలితం కనపడడంలేదు. ఒకటేమిటి, చూస్తూ వుండఁగా యెన్నో సందర్భాలుయెంతో మార్పు చెందాయి. పెళ్ళిళ్లు చూడండి! యెంత చిత్రంగా మారిపోయాయో? అయిదురోజులలో కావలసిన బ్రహ్మవివాహం అయిదు గంటలలో ముగుస్తూవుంది. యెక్కడా సదస్యం అన్నమాట లేనేలేదుకదా? యింక కొన్నాళ్లకు.

ఉ. లేవరు లెందు లెండనిన లేచిన వారయినం దటాలునం
బోవరు పొందుపొండనినఁ బోదుము పోదుము పోదుమంచుఁదా
మీవరు సందు గేస్తునలయింతురు పెండిలిలో సదస్య సం
భావనవేళఁజూడవలె బాపనసాముల సాములన్నియున్॥

అన్న దాసువారి పద్యం శుద్ధ అబద్ధంగా పరిణమిస్తుందేమో అనుకుంటాను. విష్ణుపురాణాదులలో వర్ణాల కేదో ముప్పు మూడుతుందంటూ వ్రాసివుంటే ఆ ముప్పు బలాత్కారమూలంగా తటస్థిస్తుంది కాఁబో లను కొనేవాణ్ణి. కాని పాపం ఆయా జాతులు అలాటి దౌర్జన్యం యీ క్షణం వఱకు యెక్కడఁగాని చేసినట్లు లేదు. అగ్రజాతులే యేదో లోక కల్యాణాన్ని అభిలషించి ఆయీ కాశ్మల్యాన్ని ఆపాదిస్తున్నారు. "విధం చెడ్డా ఫలమేనా దక్కితే" కొంత బాగుండును. తుదకు అది పూర్ణానుస్వారంగానే కనఁబడుతూవుంది. "జగతి శిరచ్ఛేద సమయమందునఁ దనకుండలమ్ముల యానఁగొనె ననంగ" అన్నట్టుంది మనంకోరే లోకకళ్యాణం. భోగలాలసత్వానికి దాసులై కొందఱు వారిలోవారికి భాగాలు తెగకతుదకి "మూలచ్ఛేదీ తవపాండిత్య ప్రకర్షః" దగ్గటికి వచ్చింది ప్రపంచకస్థితి. యిది యెప్పుడో గుర్తించే అనుకుంటాను మనఋషులు పూర్తిగా దీన్ని నిషేధించి వర్ణిస్తూ యితరులకుకూడా తమప్రవృత్తిని బోధించి వున్నారు. వారు బోధిస్తే మాత్రం "సానిమెఱుఁగూ సంతమెఱుఁగూ"గా భ్రమను కలిగించే నాగరికత ముందర ఆబోధ పనిచేఁగలుగుతుందా? అయినా కొందఱు సనాతన పండితులు పడరాని పాట్లు పడి పూర్వపు విద్యలు నిల్పడానికిన్నీ, పూర్వాచారాలని పోకుండాపట్టడానికిన్నీ, యత్నిస్తున్నారు. నానాఁటికి అధోగతికి వెళ్లవలసిన కాలంలో వారిప్రయత్నం సఫలంకావడం కలలో వార్తే అయినా, "యత్నేకృతే యది నసిధ్యతి కోఽత్ర దోషః" కనక వారిని అభినందిచక తప్పదు.

"శా. వ్యాసాదుల్ ఋషులై నిజమ్ములయి తద్వాక్కుల్ భవిష్యద్గతిన్
బూసం గ్రుచ్చినరీతిఁజెప్పు టదియున్ బోకుండి యోరౌర వీ
రే సారజ్ఞులు? వీరి కయ్యెడల లేనేలేదు విశ్వాస మీ
యీసట్లే నెటులుండు భ్రష్టులగువారే తన్మతోద్ధారకుల్."

అని యీ విషయాన్ని చిరకాలంనాఁడే చమత్కరించి వున్నాం. మంచికాలం దాపయి వుందంటూ యెవరో జ్యోతిర్వేత్తలు వ్రాసినట్టు కొందఱువ్విళ్ళూరుచున్నారు. కాని అట్టి పుణ్యకాలం రావడానికి యింకా లక్షల కొలఁది సంవత్సరాలు పట్టవలసివస్తుందని వెనకటి పండితుల తాత్పర్యంగా కనపడుతుంది. వొకటి రెండు వత్సరాలలోనే అలాటి పుణ్యకాలం వస్తుందనే అర్థాన్ని వెనకటి పండితుల వాక్యానికి పాండిత్య బలంచేత యిప్పటి వారెవరో సంపాదించఁగల్గినా అది వారి పాండిత్యాతిశయాన్నే వ్యక్తంచేస్తుంది గాని ధర్మకాలాన్ని తీసుకురానేరాదు. నమో ఋషిభ్యః స్వస్తి.

★ ★ ★

# మా ముత్తాత

"పెద్ద కవీంద్రుఁడై పేరుచెందినవాఁడు పిన్న ముత్తాత నర్సన్నగారు" అని దేవీభాగవతములో వంశవర్ణనారంభమందు పేర్కోబడ్డ నరసన్నగారు మాముత్తాతలు ముగ్గురిలోనూ ఆఖరువారు. మొదటివారు కామయ్యగారు, రెండవవారు అన్నయ్యగారు. వారిరువురినీ వదలి ముందుగా ఈయన పేరెత్తడానికి కారణం విద్యావృద్ధత్వమే. ఈయన యిప్పటికి సుమారు నూటపదకొండు సంవత్సరములకు పూర్వము, అనఁగా స్వభాను సం॥ ఫాల్గున శు 3 గురువారం నాటితో పూర్తిగా వ్రాసికొని ముగించి ఆ తేదీని తుట్టతుద చేవ్రాలుతోసహా వ్రాసిపెట్టిన "ప్రయోగ ముక్తావళి" అనే ధర్మశాస్త్రం, తాటాకుల ప్రతి యిప్పటికిన్నీ మా యింట్లో ప్రతి నవరాత్రులలోనూ పూజింపఁబడుతూ చెక్కుచెమర్పకుండా భద్రంగా వున్నది. ఈయన జీవించిన కాలపరిమితి సుమారుగా వినికివల్ల యాభై నాలుగు. లేక యాభై అయిదు అని యెఱుఁగుదును. దాన్నిబట్టి చూస్తే ఆ ధర్మశాస్త్రం వ్రాసికొనే కాలంనాటికి సుమారు నలభై యేండ్లవయస్సు వాఁడు కావచ్చునని వూహించుకోవచ్చు. ఈ వూహ సరియైనదే అయితే, ఈయన జననం యిప్పటికి, అనగా క్రీ॥ శ॥ 1934 సం॥రముకు సరియైన భావ సం॥ ఆశ్వయుజ శుద్ధ తదియా గురువారం నాటికి, నూటయాభై యొక్క వత్సరప్రాంతంలో వుంటుంది. ఆ వత్సరాన్ని గూర్చిన చర్చ అవసరమైతే చదువరులే నిర్ణయించుకుంటారు కాఁబట్టి దీన్ని గూర్చి విస్తరించేదిలేదు.

ఈయన తన నివాసగ్రామమగు కడియానికి సుమారు మైలున్నరలో నున్న వేమగిరినివాసులు మేడవరపు కోనయ్యగారివద్ద తెలుగు చదువుకొన్నట్లు ఈయన కృతులలో ముఖ్యకృతియగు యామినీపూర్ణ తిలకావిలాసములో కనఁబడుతుంది- "కోనయాఖ్యాంధ్ర గురుకీర్తిఁ గూర్తు మదిని" అని పై పుస్తకాన్ని యీయన మొదట మూఁడాశ్వాసాలుగా రచించి అందులో దోషాలు విస్తారంగా వున్నట్టుతోచి, సంస్కృత సాహిత్యం కోసం కాకరపర్తిగ్రామం వెళ్లి అక్కడ శ్రీవేదుల వెంకట శాస్త్రులుగారివద్ద వ్యాకరణం చదివి, మళ్లా ఆ పుస్తకాన్ని సంస్కరించి ఆఱు ఆశ్వాసములు దాన్నిగా చేసినట్లు విన్నాను. దీనికితథ్యంగా ఆ మూఁడాశ్వాసాల చిత్తుప్రతి నా బాల్యంవఱకూ ఆయన పుస్తకసామగ్రిలో నిల్చివుంది. నాకు సంపూర్తిగా ఈ చిత్తుప్రతి మాత్రమే ఈయన స్వహస్తలిఖితం చూడడం తటస్థించింది గాని, సంస్కృత పాండిత్యం ముదిరిన మీఁద ఆఱాశ్వాసాలుగా మార్చి

కూర్చిన నిర్దుష్టప్రతి చూచే అదృష్టం కలగనేలేదు. కారణమేమంటే, మా తాతగారు, వెంకన్నగారు, ఈ నరస కవిగారి పెద్దన్న కామయ్యగారి కొడుకగుటచే, ఈయన అనంతరం ఈయనకు పురుషసంతానం లేకపోవడంచేత ఈయన తాలూకు యితరాస్తితోపాటు పుస్తక సామగ్రిని కూడా వశం చేసికొన్నారు. ఈయనవద్ద బాగా చదివినట్టయితే మా తాతగారు ఈయన ప్రతిష్ఠని పూర్తిగా నిలపదగ్గ వాగ్ధాటీ, వాఙ్మాధుర్యమూ కలవాఁడేకాని, మనస్పర్ధలు కలిగి కాళి దాసత్రయం లోపునే చదువు చాలించారని వినికి. మనస్పర్ధకు కారణం; నాఁటికాలపు పిఠాపురపు ప్రభువు శ్రీ నీలాద్రిరాయనింగారికి మా ముత్తాత నరసకవిగారి ముఖ్యశిష్యులైన చింతపట్ల వేంకటరాయ, మాధవరాయనింగార్లనే సోదరులు మేనమామలయిన హేతువుచేత, వారు చాలాసార్లు మేనల్లుడి దర్శనానికి తీసుకువెళ్లడానికి ప్రయత్నిస్తే, అప్పటి కాలపు పండితులలో యెవరో తప్ప సర్వసామాన్యంగా నిస్పృహులుగావుండి, "పంచమేహని షష్ఠేవా శాకంపచతి స్వేగృహే" అనే శ్లోకార్థాన్ని గుఱి చేసికొని వర్తించేవారే అవుటచేతనూ, మా ముత్తాతగారుకూడా ఆ తెగవారిలో అగ్రేసరులై వుండడంచేతనూ, యెన్నడున్నూ స్వగ్రామం వచ్చి యున్నప్పటికీ ఆ ప్రభువును చూడడానికి వెళ్లనేలేదనిన్నీ, దానిమీఁద శిష్యులు మేనల్లుడితో విస్తరించి యీయన్ని గుఱించి తఱుచు చెప్పి వుండడంచేత నేమి, ఆ ప్రభువు రసజ్ఞుఁడైన కారణంచేత నేమి, యెట్లో యీయన్ని చూచి యీయన ముఖతహా కొంతవిని యీయన్ని సమ్మానించాలని బుద్ధిపుట్టి మేనమామలతో దానిని సంఘటించవలసిందిగా కోరితే, వారు "మనయింటికి శాస్త్రులవారు తఱచు దయచేస్తూనే వుంటారు, తాము దయచేస్తే వారిధోరణి విని యానందించడం తటస్థిస్తుంది." అని చెప్పేటప్పటికి, మంచిదని ఆ ప్రభువు తమదివాణానికి సమీపంలోనే వున్న మేనమామల యింటికి వచ్చి చాటుగా కూర్చుండి అంతకు ముందే ఆసమీపపుగదిలో గ్రంథకాలక్షేపం చేస్తూవున్న మా ముత్తాతగారి వాగ్ధోరణివిని, ఆనందించి, అప్పుడు యెదురుకుండా వచ్చి సగౌరవంగా ఆదరించి "కోరుకోవలసిం" దన్నారనిన్నీ, దానికి మా ముత్తాతగారు "మీదయవల్ల సమస్తమూ వుంది (మనసిచ పరితృప్తే కోఽర్థవాన్ కోదరిద్రః) లోటు లేదు." అని చెప్పి యేమిన్నీ కోరలేదనిన్నీ, తరువాత రాజుగారు బలవంత పెట్టఁగా, దానం పట్టడానికి బొత్తిగా ఇష్టంలేక "అయ్యా! మాకు సుమారు మీ జమీందారిలో వున్న భూమి అయిదుపుట్లలో (అనగా నలభై యకరాలలో) నామూడోవంతుకు పుచ్చుకొనే కట్టుబడిపన్ను కొట్టివేయించవలసిం"దని మాత్రం కోరేరనిన్నీ, ప్రభువు ఆలాగే చేశారనిన్నీ, వినికి. ఈయంశం గీరతంలోకూడా టూకీగా వుదాహరించాను. ఇందులో నిజమెంతో, కల్పితమెంతో నిశ్చయించడానికి ఆధారం తక్కువ. ఆలాకొట్టి వేయడానికి పూర్వం యెంతపన్నువుండేదో తెలుసుకొందామంటే వీలుచిక్కిందికాదు. రాజదర్శనానికి

వెళ్లకపోవడానికి కారణం, ఈయనకి కొంచెం సభాకంపం వుండేదనిన్నీ కొందఱు చెప్తారు. అయితే యిదికూడా సత్యమేయేమో. ప్రభువు మేనమామలింటికి వచ్చినప్పుడేనా చదివేటప్పుడు చాటుగా వుండి వినేటట్టేవారు సంఘటించడానికి ఇదే కారణమనిన్నీ కొందఱివల్ల విన్నాను. అయితే ప్రభువు కోరవలసిం దన్నప్పుడు ఏదో కోరనే కోరేడుకదా! హెచ్చు కోరిక కోరడానికి మాత్రం సభాకంపంబాధించి, తక్కువ కోరడానికి బాధించలేదనుకుందామా? బాగా ఆలోచిస్తే ప్రతిగ్రహదోషానికి సంశయించినట్లే నాకు తోస్తుంది. ఈయనేకాదు. ఆకాలంలోనేకాదు, నిన్న మొన్నటిదాఁకా, ఈసంశయం కలవారు పండితులలో మనదేశంలో పలువురున్నారు. వుదాహరణకి వొక్క పేరిస్తాను. బులుసు అచ్చయ్యగారు. ఇంతపండితులు "నభూతో నభవిష్యతి." వీరు నప్రతిగ్రహీతలై. "ఇత్యర్థలు పులుసూ, ఇతిభావలు కూర" అన్నరీతిని జీవితం గడిపినట్లు ప్రతివారున్నూ చెప్పుకొంటారు. ప్రకృత ముపక్రమిస్తాను. మా ముత్తాత గారు కోరిన కోరిక యావత్తు భూమికిన్నీ సంబంధించక, ఆయనవంతుకి మాత్రమే సంబంధించడంచేత, మా తాత గారికి పాండిత్యం అంతంతలో ఆగిపోయిందన్నది మనకు ప్రస్తుతం.

ఆ స్వల్ప పాండిత్యంతోపాటు స్వల్పంగా కవిత్వం కూడా మాతాతగారు అల్లేవారట కాని,యేమీ గ్రంథరూపంగా రచించినట్లులేదు. చాటువులున్నూ దొరకలేదు. "అలా రామస్వామీ! యాలా! పండితులతోటి యద్వాతద్వాల్" అనే కందపద్యభాగం మాత్రం మాతాత చెప్పినదని మానాన్నగారు చెప్పఁగా విన్నాను. దీన్నిబట్టి తెలుగు పాండిత్యం కూడా వ్యాకరణ పాండిత్యంతో మిళితమైనది కాదని స్పష్టమే. ఏమైనా ఈమాత్రమేనా విద్యాప్రవేశం వుండడంచేతనే, పినతండ్రిగారి తాలూకు విద్యాధనం యిరువదినాల్గు తాటాకుల పెట్టెల పుస్తకాలున్నూ బహుజాగ్రత్తగా ఈయన భద్రపరచారు. పోయిన సూత్రాలు అప్పుడప్పుడు మరమ్మత్తు చేస్తూ, చివికిపోతూ చెదతింటూవున్న పత్రాలు క్రొత్త తాటాకులమీఁద యెత్తి వ్రాసి సంపుటాల్లో చేరుస్తూ, ప్రతి సంవత్సరమున్నూ చిత్తకార్తి యెండలో యెండబెడుతూ, ఆ యీ పుస్తకధనాన్ని మా తాతగారు భద్రపరచినందుకు, తుదకిది ఆంధ్రభాషాప్రవేశానికి వొకరివద్ద శుశ్రూష చేయకుండా కొంతవఱకు నాకు గురుత్వం చేసింది.

చిత్తకార్తి యెండలో యెండబెట్టిన సందర్భంలో ఒక పర్యాయం పిఠాపురాన్నుంచి వచ్చిన ఠాణాదారు అప్పలరాజుగారు (ఇంటిపేరు మఱపు తగిలింది) మా యింటిప్రక్కవున్న కరణాలసావిట్లో బసచేసిన కారణం చేత, ఈ పుస్తకాలు ఆయన చూచారు. చూచి ఆసక్తితో ఆయా సంపుటాలు తిరగవేస్తూ వుండఁగా, ఆఱాశ్వాసాలుగామార్చి సాపువ్రాసిన సంపుటం

యామినీపూర్ణతిలకావిలాసం కనపడ్డది. అప్పటికప్పుడే ఈ గ్రంథం పేరు చాలా వ్యాప్తిగా వుండడంవల్ల, కనపడేటప్పటికి "ఇప్పుడే చూచియిస్తానని పుచ్చుకొని, తుదకు స్వగ్రామం పట్టుకువెళ్లి వ్రాసికొని పంపిస్తానని చెప్పి, యియ్యనేలేదు. గట్టిగా మాట్లాడితే అధికారితో పని. అప్పటి కాలంలో అధికార్లంటే వుండేభయం ఇప్పటివారికి బాగా తెలియదు. అప్పుడు కరణాలన్నా, ఠాణాదార్లన్నా చాలా భయపడేవారు. అందుచేత మళ్లా గట్టిగా అడగాలేదు, ఆయన యివ్వాలేదు.

"పుస్తకం వనితా విత్తం, పరహస్తగతంగతం" అనే యోగంపట్టి నా బాల్యంనాటికి ఆచిత్తుప్రతే గతి అయింది. తరువాత ఆ అప్పలరాజు గారు గతించారు. నేను చామర్లకోటలో మాధుకరం యెత్తుకుంటూ చదువుకొనే రోజుల్లో చాలసార్లు పిఠాపురం యిందుకోసమని వెళ్లి యీశుద్ధ ప్రతికొఱకు ప్రయత్నించాను గాని, వారి వంశస్థులవల్ల నాకది లభించనే లేదు. ఇంకొక శుద్ధప్రతి మా ముత్తాతగారి స్వహస్తలిఖితమే ఆపుస్తక సామగ్రిలోనే కనపడ్డది. దానిలో కొన్ని మార్పులున్నూ, కొన్ని కొత్త పద్యాలున్నూ వున్నాయి. గాని అందులో రెండాశ్వాసాలకు లోపుగానే గ్రంథం వుంది. బహుశః ఎందుకేనా మంచిదని మఱొక ప్రతి వ్రాయడానికి మొదలుపెట్టి పూర్తికాకపూర్వమే మధ్యకాలంలో పరలోక గతులైరని వూహించవలసి వుంటుంది. ఏమంటే, ఈయన అత్తవారి వూరుకాకరపర్తి వెళ్లి, అక్కడ హఠాత్తుగా మరిడీజాడ్యంవల్ల స్వర్గస్థులైనట్లు విన్నాను. ఈ హఠాన్మరణహేతువుచేతనే, అన్నదమ్ములు అంతకుముందు పంచుకొన్ననూ ఈ గ్రామంలోవున్న రికార్డుయావత్తూ మాతాతగారికి చేజిక్కి, సమష్టి అని వాదించడానికి అవకాశం కలిగింది. అప్పటికి నరస కవిగారికి పురుషసంతానం నష్టమైననూ, స్త్రీ సంతానం కలదు. వ్యష్టి అవడంవల్ల ఆయన వాటా ఆపెకు వెళ్లడం న్యాయం. అయినా మా తాతగారు సమష్టివాదం పెట్టి కోర్టులో గెల్చుకున్నారట. అందుచే నరసకవి గారి భార్య మనోవర్తిదారురాలయింది. ఈమె పేరు గవరమ్మగారు. ఈవిణ్ణి నేను ఎఱుఁగుదును. ఈమె నరసకవిగారికి రెండవభార్య. మాతాత గారిని నాయెదుటకూడా శపిస్తూ వుండేది యీవిడ.

అయితే యింకొకటి విన్నాను. నరసకవిగారు కాకరపర్తి వెళ్లేటప్పుడు మా తాతను పిల్చి "పుస్తకాలు జాగ్రత్తా" అని చెప్పి వప్పగించి వెళ్లినట్లు చెప్తారు. ఆలా వప్పగించడాని క్కారణం, ఆయనకు జ్యౌతిష ప్రవేశంకూడా వుండడంచేత మృత్యుకాలం తెలిసి మరణం నిమిత్తమే వసిష్ఠానదీతీరమైన కాకరపర్తికి వెళ్లి వుంటారనిన్నీ, అందుచేతనే ముగ్గురు సోదరులకూ మొత్తం వారసుగావున్న మాతాతగారికి వప్పజెప్పితే తప్ప ఆడవాళ్లవల్ల యీ పుస్తకాలు భద్రపఱుపబడవనిన్నీ వూహించి అలాచేసి వుంటారనిన్నీ, కొందఱనగా విన్నాను.

మరణానికి అక్కడికి వెళ్లడమెందుకంటే : మా గ్రామం, గౌతమీభాగాల్లో వకటైన తుల్యభాగా తీరమే అయినా, వింధ్యపర్వత భాగంలో చేరుతుంది. అందుకే శ్మశానప్రదేశాన్ని తుల్యభాగకు అవతలి వొడ్డున మాగ్రామస్థులు యేర్పఱచుకొన్నారు. వింధ్యపర్వత సంబంధం వున్నచోట ప్రాణం విడిస్తే గాడిదజన్మం వస్తుందని పూర్వులకు భయం. మహాగౌతమీ తీరమైనప్పటికి రాజమహేంద్రవరానిక్కూడా ఈ దోషం వుందట. బజారు వీథివఱకున్నూ ఫరవాలేదని కొందఱు, అంతేకాదు అయిదుక్రోసులవఱకున్నూ గౌతమీతీరంలోనే లెక్కని మఱికొందఱున్నూ చెప్తారు. ఈ సంశయంతో మనకేంపని అని మాముత్తాతగారు నిస్సంశయప్రదేశానికి రాబోయే మరణాన్ని గమనించి వెళ్లేరేమో అని నాకు తోస్తుంది. యేలాగైతేనేమి పుస్తకాలతోపాటు పారీఖత్తులుకూడా మాతాతగారి చేజిక్కడంచేత ఆయన కొమార్తెకు వెళ్లవలసిన ఆయన తాలూకువాటా భూమి మాకే సంక్రమించింది. నేను నరసకవిగారికి అన్నమునిమనుమడను. కాని మాచిన్న పిన తండ్రి కుమారుడు చిన్న వెంకటశాస్త్రులు నావలె మాత్రమేకాక తల్లి ద్వారాగా సాక్షాన్మునిమనమడుకూడా అయియున్నాడు. కారణం, అతని తల్లి నరసకవిగారి దౌహిత్రురాలు.

ప్రస్తుతానికి వద్దాం. ఇంతకూ మాతాతగారు యెంత భద్రంగా జాగ్రత్తపెట్టినా ఆయన కాలంలోనే మా ముత్తాతగారి కవిత్వంలో ముఖ్యమైన యామినీపూర్ణతిలక శుద్ధప్రతి నాకు దొరక్కపోయింది. ప్రయత్నించగ తుదకు వకమంగలి, విద్యాసక్తుఁడు యెక్కడో వ్రాసుకున్న ప్రతి నా బాల్యగురువులలో నొకరైన మధునాపంతుల సూరయ్యగారు సంపాదించి యథామాతృకగా వ్రాసుకున్నారు. అది నాకు వారు వ్రాసుకొనడానికిచ్చారు. కాని దానియందున్నూ దురుద్ధరమైన లోపాలున్నాయి. యేమయినా "లేనిబావకంటే గుడ్డిబావ మేఱు" గని దానినిబట్టి వక ప్రతి నేను కావ్యాలు చదువుకొనే రోజుల్లో వ్రాసుకున్నాను. అంతట్లో తునిలో భాగానగరం గురులింగదేవర అనే జంగమ కులస్థుఁడు దీనిని అచ్చువేస్తూ అయిదాశ్వాసాలు మాత్రమే దొరకినట్టున్నూ, ఆఱోది తనకు దొరకనట్టున్నూ, నాపేర దానిని యిప్పించవలసిందని ప్రార్థనగా వుత్తరం వ్రాయగా, నా దగ్గఱనున్న ప్రతినిబట్టి వ్రాసి ఆయనకు నేను ఆఱవది పంపించాను. ఆ అచ్చుప్రతే వీరేశలింగం పంతులవారికి దొరకినదిన్నీ. ఎవరి తప్పులో నిర్ణయింప శక్యంగాదుగాని, ఆ అచ్చుప్రతి నిండా తప్పులు కుప్ప తెప్పలు. ఇటీవల మాముత్తాతగారి వేంకటేశ్వరవిలాసం నేను ముద్రిస్తూ యామినీపూర్ణతిలకను కూడా ముద్రిద్దామని అనుకున్నానుగాని, తప్పులు సవరించడానికి నాతరం కాకపోయింది. బాగా ఆలోచిస్తే ఆ తప్పులలో వ్రాత పొరపాట్లు కానివిన్నీ యెన్నో వున్నాయి. అవి గ్రంథకర్తవేగాని అన్యులవి కావని నాకు పూర్తిగాతోచి, సంస్కరణానికి లొంగని హేతువున ఆ వుద్యమాన్నుంచి విరమించి వూరుకొన్నాను. ఇప్పుడు లోకంలో ఆ

తప్పులన్నీ ఆ జంగందేవర నెత్తిని రుద్దడానికి స్థూలదృష్టుల కవకాశం కలిగింది. లేకపోతే ఈ అవకాశానికి హేతువుండదు. ఆ తప్పులలో మాదిరి కొకటి చూపుతాను.

"ఆ రాజేంద్రునిసగు భా। ర్యా రతిశాస్త్రానురూప." ఈ పద్యంలో, "భార్యా" శబ్దాన్ని హ్రస్వం చేయకుండా ప్రయోగించడం కవికృతంగాని యితరులదికాదు. ఇది దిద్దవలసివస్తే యెట్లా! అసాధ్యస్థలంలో వుంది. దిద్దవీలైనవికొన్ని వేంకటేశ్వరవిలాసంలో దిద్దాను. చూడండి.

"అలరు మందాకినీ యార్యాసహాయుఁడై పొలుపొందు సర్వజ్ఞ మూర్తియనఁగ" ఇందు మందాకినీ + ఆర్యా, అన్నచోట, సంస్కృత సంధి యణాదేశం రావాలి. ఆయన కీమాత్రమున్నూ తెలియదా? తెలిసినప్పటికి మొదట తెలుగు కవిత్వాని కలవాటు పడడంచేత తెలుగు వ్యాకరణ మర్యాదగా యడాగమం పడ్డది. ఇది పూర్వాపరాలు చేయించే పురోహితుడికి అందులో మంత్రాలిందులోనూ, ఇందులో వందులోనూ దొరలడం వంటిది. ఈసంగతి అనుభవజ్ఞులకు తెలుస్తుంది. ఇంతమాత్రంచేత ఈయనకు కౌముది రాదనుకోవడం యుక్తంకాదు. యేమంటే : స్వదస్తూరీతో వ్రాసికొని చదివిన కౌముది ఆయన పుస్తకసామగ్రిలోనే వుందే? నేను దానిమీదనే కదా వ్యాకరణం చదవడాని కారంభించింది? ఎఱిఁగి కూడా తప్పువ్రాస్తేనే ప్రమాదమనుకోవాలి. ఈలాటి చోట్లనే "ప్రమాదోధీమతామపి" అని సమాధానం చెప్పుకోవడం. అచ్చులో "మందాకిన్యహార్యజా యుక్తుఁడై" అని సవరించి ముద్రింపించాను. ఈయన బుద్ధిపూర్వకంగా సమ్మతించి ప్రయోగించిన అఖండయతులేమి, కొన్ని తెలుగు వ్యాకరణ విషయాలేమి, మొట్టమొదట నాకు నచ్చినరీతిని వేంకటేశ్వరవిలాసంలో సవరింప మొదలుపెట్టి కొంత ముద్రణం జరిగినమీద ఈ పని అంత వుచితంకాదని మానివేశాను. కాని దిద్దిన భాగమే యెక్కువ.

మహాకవి, పండితకవి అయిన ఈయన కవిత్వమందు అన్ని లక్షణవిరుద్ధా లెందుకున్నాయి. అని ప్రాజ్ఞులు శంకింపవచ్చును. వినండి : ఈయన కాలంనాటికి పుస్తకాలింకా సులభంగా అచ్చుపడి దొరకడంలేదు. ఎవరినో ఆశ్రయించాలి, సంపాదించాలి. అట్టిస్థితిలో ఆంధ్రలక్షణ గ్రంథాల్లో ముఖ్యమైన అప్పకవీయం ఈయనకు దొరకనేరదు. "అప్పకవీయంలోని కొన్ని యతిప్రకరణాలు" అనే శీర్షికగల సుమారు జానెడు పొడుగు తాటాకులు ఆఱో, ఆఱున్నొకటి మాత్రమో గల చిన్న పుస్తక మీయన పుస్తకసామగ్రిలో కనబడుటచే ఈయన కాధారం సులక్షణసారం వగయిరాలని స్పష్టంగా నిర్ణయింప వీలయింది. సంస్కృత వ్యాకరణ విరుద్ధాలు కూడా దీర్ఘసమాసాలలో క్వాచిత్కంగా లేకపోలేదు. ఏమంటే వయస్సు కొంత ముదిరినపిమ్మట కౌముది చదివినప్పటికీ యీయనకు

అది యెంతవరకు అనుభవంలో వుందో అని నాకు సందేహం. ఈ సందర్భాలన్నీ స్తనశల్యపరీక్ష చేసేవారికిగాని స్థూలదృష్టి వారికి యింత సలక్షణకవి ప్రపంచంలో పుట్టనేలేదన్నంత గౌరవంకలదు. ఆ నమ్మకం యెవరికో యెందుకు? నా గురువులలో వకరున్నూ, కేవల సాహిత్యపరులున్నూ అయిన మధునాపంతుల సూరయ్యగారికే వుండేది, ఇటీవల నే నెప్పుడేనా ఆయీ విచారణాంశాలు ముచ్చటిస్తే, "తాతా,. యింకా ఆలోచించాలేమో" అనేవారు. ఈ ఆలోచించడంలో నాకున్న చేదస్తం యెవరికోగాని వుండదు. రామశబ్దం సర్వసమ్మతమైనా అదికూడా నిరాఘాటంగా ప్రయోగించడానికి నేను సందేహించడం కలదు. అట్టి పరమచాదస్తుణ్ణి నేను; గ్రంథమో, మా ముత్తాత కవిత్వం. అట్టి స్థితిలో ఇతరులెవరేనా తప్పంటే పోట్లాడవలసిన దానికి నేను తప్పంటానా? పేరెందుకు వ్రాయడం. బందరులోనే మా ముత్తాతవంటివారో, ఇంకా గొప్పవారో, ఒక విద్యావయోవృద్ధులు, మహాకవులు వుండేవారు. ఆయన పాండిత్యం, అసదృశం. చాలా గ్రంథాల్లు వ్రాశారు. ఆయన కుమాళ్లు కూడా ప్రాజ్ఞులే. తండ్రిగారి కవిత్వమందేమి, తండ్రిగారియందేమి, మిక్కిలి భక్తులు. వారి కవిత్వములోనున్నూ మా ముత్తాతగారి కవిత్వంలోవలెనే ప్రమాదాలు విస్తరించి వున్నాయి. అంత గొప్ప పండితుల కెందుకుండాలి? అనకండి, నా అనుభవంలో పాండిత్యంవేఱు, పరిశీలన వేఱు, పరిశీలనగలవారు నూటనాటగాని పండితులలో తఱుచుగా వుండరు. హరిశాస్త్రులవారి శిష్యులు ఒకరు మహావైయాకరణులై కూడా తప్పుల కుప్పగా వ్రాసిన పుస్తకాన్ని నేను చూచాను. ఎవరేనా చెప్పితేనే గాని అంతవఱకూ ఆయనకు తప్పని తెలియనే తెలియదు. ఏమనుకోవాలి? ప్రస్తుతానికిరండి. అవి ప్రమాదాలని యెవరేనా అంటే, వారి కుమాళ్లు, జవాబు చెప్పడానికి ఆధారం లేకపోయినా, వప్పుకొనేవారు కారు. ఎవరికుమాళ్లు! బందరులోవారి కొమాళ్లు. నేనుకూడా మా ముత్తాతగారి యెడల అట్టి భక్తినే చూపవలసివుండగా చూపలేకపోతిని గదా అని విచారిస్తున్నాను. వీరేశలింగంపంతులవారు కూడా ఆముక్తమాల్యద వగయిరాలలో తప్పులున్నాయన్నారు గాని, మా ముత్తాతగారి విషయంలో కలం ఆ ధోరణికి తిప్పనేలేదు. ఈ "తాతామనుమల వరస" నాకే తటస్థించింది. ఇంతమాత్రంచేత నేను మా ముత్తాతగారియందు గౌరవంలేనివాడనని పాఠకలోకం భావించకూడదు. "పెద్దకవీంద్రుండై" అని యెత్తుకున్నాను గానా? ఇంకా చూడండి-

"మ. అనఘుండై, మదనాభిరామనృపకన్యాచిత్రచారిత్రమున్
జననుత్యమ్మగు వేంకటేశ్వరవిలాసంబున్ దగంజెప్పి రా
మున కర్పించి పరంబుగన్న మహితున్ముమ్మాటికిం గొల్తు నా
పినముత్తాత నగణ్యపుణ్యవిభవాబ్ధి న్నారసింహాఖ్యునిన్."

అన్న దేవీభాగవతంలోని పద్యం పాఠకలోక మెఱుగదా? ఈ పద్యంలోవున్న, మదనాభిరామనృపకన్య, అనే ఆవిడే యామినీపూర్ణ తిలక అని చదువరు లెఱుగుదురుగాక, బిల్హణీయంలోవున్న కథా, ఇదిన్నీ ఒకటే. ఈ రెండు పుస్తకాలేకాక, ఈ కథ, పూర్ణచంద్రోదయం అనే పేరుతో మఱివకటి వుంది. అదిన్నీ బిల్హణీయంవలె మూడాశ్వాసాలే. అది కూడా మా ముత్తాతగారి గ్రంథసామగ్రిలో నేను చిన్నప్పుడు చూచినదే. ఇప్పుడా గ్రంథాల్లో యేమూడునాల్గో గాని, తక్కినవన్నీ పోయినాయి. ఆ పూర్ణచంద్రోదయం అచ్చైనట్టున్నూలేదు. ఆహాహా? ఈలాటి పుస్తకాలెన్ని అంతరించాయోగదా! చాలావఱకు మా ముత్తాతగారు వ్రాసుకొన్నవన్నీ అచ్చుపడ్డవే అని నేను అశ్రద్ధచేశాను. నాప్రయత్నం తుదకు నెగ్గలేదు. గాని కావ్యాలు చదువుకొనే రోజుల్లో అనాధ్యాయాల్లో గురుకులంనుంచి యింటికివచ్చి మాయింట్లోవున్న తాటాకుల పుస్తకాలన్నీ కాగితాలమీద వ్రాయడానికి మొదలుపెట్టేను. కొన్ని వ్రాశాను. అంతట్లో దీనిలో మనకు కృతార్థత కలగడం దుర్లభమని తోచి విరమించాను. ఆ మాత్రం వ్రాయడంవల్లనే నాకు అంతో యింతో బాల్యంలోనే తెలుగు సాహిత్యం కుదిరింది. అచ్చుపడ్డ పుస్తకాల్లో యెన్నాళ్లు చదివినా సరిగా పాండిత్యం కుదరదనిన్నీ, చదువుకొనే పాఠం వ్రాసికొని గురువుదగ్గఱ చదువుకుంటే చాలా త్వరగా పాండిత్యం కుదురుతుందనిన్నీ నాకు నమ్మకం. పూర్వుల పాండిత్యాలన్నీ ఆలాంటివే. ఇప్పుడో– "పుస్తకేషుచ యా విద్యా పరహస్తేషు యద్ధనమ్" అన్న మోస్తరు పాండిత్యాలే నూటికి తొంబది తొమ్మిది. ఇక "విద్వాను" లోనైన డిగ్రీలు పొందిన వారిని గూర్చి వ్రాయడమెందుకు?

ప్రకృతానికి వద్దాం. బిల్హణీయపు గాథను కావ్యంగా వ్రాసినవారిలో తుట్టతుదివారు మా ముత్తాతగారే. వీరేశలింగంగారు వీరి కవిత్వానికే యెక్కువ విలువ యిచ్చారు. ఈయన చాలవఱకు యితరుల ననుకరించే స్వభావం కలవారు. ఆ పద్యాలని వదిలిపెట్టి స్వతంత్రంగా వ్రాసినవి చాలా బాగుంటాయి. ధార మిక్కిలీ ధారాళంగా వుంటుంది. వసుచరిత్రని వరవడిగా బెట్టుకోవడంచేత కాబోలు, చేదస్తానికి మితిలేదు. ఈయనేకాదు ఈయనకు కొంచెం పూర్వులుగా వుండే కూచిమంచి తిమ్మకవిగారు లోనైనవారంతా వసుచరిత్రను వరవడిగా పెట్టుకున్నవారే. యమకానికి మాత్రం మా ముత్తాతగారు అందఱినీ అతిక్రమిస్తారు. అందులో అనేక రకాలు; వుదాహరించడానికి మొదలుపెడితే తెమలదు. అయినా మచ్చుకి వకపద్యం వుదాహరించడం మంచిదికదా?

చ. మగువపదంబు కోకనదమానదమా? నదమా? ప్రణాభి, న
మ్మగనగురూపు భాగ్యకరమాకరమా? కరమా? మృదూరు వెం

చంగఁ గటిసీమ మోహదరసా? దరసాదరసాధుకంతలీ
లగళనినాద మెన్నఁ బికలాపికలాపికలా? కచాళియున్.

దీని సమన్వయము నేను చిన్నప్పుడు సంప్రదాయజ్ఞులవల్ల విన్నాను. స్వంతంగా అయితే తెలిసికోనేలేనేమో? ఇప్పటివారిలో దీనిని అన్వయించేవారెందఱుంటారో చెప్పజాలను. అవసరమని యెవరేనా కోరితే పత్రికలో ప్రకటిస్తాను. దీనిని యిలావుంచి యింతకాలంనుంచి అనేక గ్రంథాలు చూస్తూ వున్నా యే గ్రంథంలోనూ చూడని క్రొత్తమోస్తరు పద్యం వకటి మా ముత్తాతగారి కవిత్వంలో వుంది. చూడండి వుదాహరిస్తాను-

మ. మదభసలాళివంటి కచమా? మృదురంభలవంటి యూరులా?
మదనదరంబువంటి గళమా? ముకురమ్ములవంటి చెక్కులా?
కదలని మించువంటి తళుకా? విరిబంతులవంటి గుబ్బలా?
మదవతిజవ్వనం బమృతమాధురి సేయదె? యెంతవారికిన్.

దీనియందున్న క్రొత్తపోకడ అనుభవజ్ఞులు గమనిస్తారు. ఇట్టి చక్కని శైలిగల యిమ్మహాకవి ఏవో లేనిపోని వెట్టివెట్టి యమకాలకు లోనై దిఙ్మాత్రముగాకాక వాట్లకే యెక్కువ చోటిచ్చి గ్రంథాన్ని చదివే వారికి విసుగు పుట్టించు మాదిరిగా రచించడానికి విచారించవలసి వచ్చింది. ఈయన దస్తూరీ చాలా చిన్నయక్షరాలుగా వ్రాస్తారు. అట్టి వ్రాతలో యేడెనిమిది తాటాకులు రోజువక్కంటికి స్వకవిత్వంతో నింపేవారని విన్నాను. దీనివల్ల అత్యాశుకవి యనుకోకతప్పదు. అయితే ఈయన ఆస్తితోపాటుగా అంతో యింతో కవిత్వంరీతికూడా నాకు సంక్రమించినట్లు చదువరు లనుకోకమానరు.

ఈయన ఆశుకవి యనడాని కింకొక యితిహాసం : సంస్కృత వ్యాకరణం చదువుకోవడానికి కాకరపర్తి వెళ్లినప్పుడు, గురువుగారు, "నరసన్నా! నీవు కవిత్వం చెబుతావట? ఏదీ చూదాము, ఈవృత్తంలో ఈవిషయం ఆశువుగా రచించూ" అని యేదో వృత్తం పేరుచెప్పి విషయంతో సహా ప్రశ్నించారనిన్నీ. దానిమీద-

శ్లో. కమలాగృహతోరణారరాణాం
ఘటనాపాటనయో స్సమర్థకైః
అసురారిదృగంచలప్రసారై
ర్ఘనమజ్ఞానతమో నిహన్యతాం మే.

అనే యీశ్లోకాన్ని రచించి గురువుగారికి వినిపించారనిన్నీ, గురువు గారు అది తాము నిర్దేశించిన వృత్తంకాని హేతువుచేత, "వృత్తం మాత్రం మఱొకటయిందన్నారనిన్నీ,

దానిమీద మా ముత్తాతగారు వృత్తంకూడా సరిగానే చెప్పినానని నిర్భయంగా బదులు చెప్పేరనిన్నీ, అయితే లక్షణం చదువుమన్నారనిన్నీ, వెంటనే కల్పనచేసి గురువుగారన్న వృత్తానికే తాను చెప్పినది సరిపడేటట్లు లక్షణం కూడా ఆశువులో రచించి సరిపెట్టేరనిన్నీ, అది అసత్యమైనప్పటికీ మొదట చెప్పిన వర్ణనకంటె ఇది చాలా శ్లాఘాపాత్రమని గురువులచే మెప్పించుకున్నారనిన్నీ జనశ్రుతి. ఇదెంత సత్యమో నిర్ణయింప నాధారంలేదు. గురువు కోరిన వృత్తం పేరేదో తెలియదు. ఈయన చెప్పిన లక్షణ శ్లోకమున్నూ వుపలబ్ధం కాలేదు. ఈయన రచించిన వృత్తం పేరు వసంతమాలిక. గురువుగా రడిగినదిమాత్రం ఈ పేరు కలదికాదని వినికిడివల్ల యెఱుగుదును. దీనివల్ల అత్యాశుకవియని మాత్రం మనం తెలిసికోవచ్చును.

ఇదివరలో వ్రాసిన రాజబంధువులుకాకా, మాగ్రామంలో పేరు ప్రతిష్ఠలుగల వెలంవారు మఱికొన్ని కుటుంబాలవారు పూర్వకాలంలో వుండేవారు. వారుకూడా కొందఱు మాముత్తాతగారివద్ద శుశ్రూషచేసిన శిష్యులే. మా ముత్తాతగారికి ఆదొండకాయకూర చాలా యిష్టమవుటచేత ఆ వెలమశిష్యులు తఱచు ఆ కాయలు తెప్పించి పంపించడం కలదట. వకనాడు దానిమీద పద్యం చెప్పవలసిందిగా కోరేటప్పటికి ఈ పద్యం చెప్పేరట!

మ. రవణింతున్నుతి దైవతప్రమదదార్ఢ్యన్మోహినీనీరభృ
చ్చ్యవమానామృతశీకరాభనవబీజప్రాంతరౌపమ్య స
ద్భువనాజాండకు షడ్రసప్లుతసముద్యత్స్వాదుమత్ఖండకున్
అవితుంగోద్భవకాండకున్ సరసమోహాఖండ కాదొండకున్.

ఈ పద్యాన్ని తెనాలి రామలింగకవికృతంగా నెవరో కొన్నాళ్ల క్రిందట యేదో పత్రికలో ప్రకటించినట్లు జ్ఞాపకం. ఎవరిదాకానో యెందుకు? మా శిష్యుడు ప్రభాకరశాస్త్రే ఈయన పద్యం రామలింగకవిదని వ్రాసినట్లు జ్ఞాపకం. బహుశా, ఆ పద్యం కూడా ఇదేనేమో. సుమారిప్పటకి నలభైయేళ్లనాడు, యెవరో జ్ఞాపకంలేదు గాని, మా ముత్తాతగారి గ్రంథంలో మిక్కిలి ప్రసిద్ధి చెందిన "సీ. శరదంబువేణికి శాంతభావముచెందె." అనే పద్యాన్ని రామలింగకవి కర్తృకంగా వ్రాశారని జ్ఞాపకం. రామలింగకవికృతమైన పద్యము "సీ.ద్విరదంబు నడతోడ" అనేది. దాన్ని వరవడిగా బెట్టుకొని మా ముత్తాతగారు రచించినది పైపద్యం. యథార్థ మీలా వుండగా ఎవరో యేదోరీతిని వ్రాస్తే దాన్నే లోకం నమ్ముతోంది. నిన్న మొన్నటిచరిత్రలను గూర్చిన నిజస్థితులే ఇలా తారుమారవుతూవున్నాయి. యిక ప్రాచీనాలని గురించి వ్రాయవలసిందేమి? అంతదాకా యెందుకు? వర్తమానకాలికమైన మా జీవితాన్ని గురించి వ్రాస్తూ వున్నవారి వ్యాసాల్లో కూడా వ్యత్యస్తాలు బోలెడు కనుపడుతున్నాయి. అది అలా వుంచుదాం.

మీ ముత్తాతగారి నాటికి మాకు గ్రామంలో పౌరోహిత్యం వుండేదట. నరసకవిగారి అన్నగారు అన్నయ్యగారు దాన్ని చూచేవారట. ఈయనకి ప్రాజ్ఞతవచ్చిన తర్వాత పట్టుబట్టి దాన్ని మానిపించి దానికిగాయేర్పడ్డ మడిమాన్యాలసహితం పొన్నావారనే యింటిపేరుగల వారికి వశం చేయించినారట. ఇప్పటికిన్నీ ఆ పౌరోహిత్యం వారే నిర్వహిస్తూవున్నారు. దీన్నిబట్టికూడా ఈయన "నప్రతిగ్రహీత" అని తేలుతుంది. అయితే యిక "తేభ్యమెక్కడ తెత్తునయ్యా? తెల్లవారింది" ఎట్లా జరిగేదంటే : పెద్దన్నగారు కామయ్యగారున్నారే, వారు మెరకపొలం యావత్తూ స్వంతకృషిచేసి బాగా జొన్నలు పండించేవారట. ఇప్పుడా భూమి అంతా అంటూమామిళ్లమయమై యున్నప్పటికీ, పూర్వప్పేరు జొన్నపొల మవుటచే ఆపేరు పోనేలేదు. జొన్నపంట వున్నచోట పాడివుండుట ప్రసిద్ధమే. ఇక నేంకావాలి? పాడిపంటలకు లోటులేదు. కూరనారల కంతకుముందే లోటులేదు, తక్కిన షోకుల కప్పటివాళ్లలవాటు పడేవారేకారు. మా ముత్తాతగారు స్వేచ్ఛగా కవిత్వం చెప్పుకుంటూ, వచ్చిన శిష్యులకు పాఠాలు చెపుతూ, యెప్పుడో మనకు వస్తుందనుకునే స్వరాజ్యం అప్పుడే చేసుకుంటూ హేలగా కాలక్షేపం చేసేవారట? పొలంలోకి వెళ్లేవారేకారట. యెప్పుడేనా వెళ్లినా పుస్తకాల నిమిత్తం తాటాకులు కొట్టించుకునే నిమిత్తం తప్ప వ్యవసాయప్పనికి అన్నగారికి లేశమున్నూ సాయపడడం లేనేలేదట, పాపం! ఈయన ముందు బయలుదేరేవాళ్లకోసమని పుస్తకాలకు పనికివచ్చే రకం తాటిచెట్లు అయిదాఱు వందలదాకా పాతించారు. అవి యిప్పుడు చాలపెద్దవై వృద్ధాప్యంలో వున్నాయి. ఈ కాలంలో వాటి వుపయోగం లేకపోయింది.

అయితే పైరీతిగా ఆయన బొత్తిగా గృహకృత్యానికి సాయపడకుండా భోజనవేళకి "పాత్రేసమితుడు"గా సిద్ధపడడానికి అన్నగారికి లేశమున్నూ కష్టంగా తోచకపోయినా, వదినగారు సరమ్మగారికి యిబ్బందిగా వుండి, ఒకరోజున గట్టిగా కంకడానికి మొదలు పెట్టేటప్పటికి, మా ముత్తాతకవిగారికి కోపంవచ్చి, మిట్టమధ్యాహ్నంవేళ సకుటుంబంగా గ్రామాంతరానికి ప్రయాణం కడుతుండగా, ఆ వీధి వెలమశిష్యులు బతిమాలి ఆపుచేసి. అప్పుడే వక పెద్దస్థలం యిచ్చి, తక్షణమే దానిలో పర్ణశాలవేసి, వంటచేసుకొనేటట్టు చేసేరట, ఈయన స్వార్జితం ఆ స్థలం మాత్రమే కనపడుతుంది. ఇప్పుడా స్థలం మా పినతండ్రిగారి కుటుంబం వారిక్రింద వున్నది. వదినగారి కారణంచేత ఈయన అన్నగారితో విడిపోయినట్టయింది. అన్నగారియందు మిక్కిలి భక్తితోనే యిటీవలకూడా వున్నట్టు వేంకటేశ్వరవిలాసంలోని యీ పద్యంవల్ల తెలుస్తుంది.

క. కామయనామసుధీమణి
భూమిం గడునింపెసంగ భూతదయార్ద్ర
శ్రీమహితుండనఁగను బర
భామావిముఖవ్రత ప్రభావుండనఁగన్.

ఈయన యామినీపూర్ణతిలకావిలాస, వేంకటేశ్వర విలాసాలేకాక, అహల్యాసంక్రందన విలాసము, ఏకాంతసేవాకలాపము, ఏకప్రాసకంద గోపాలశతకము అను పొత్తములుకూడ రచించి యున్నారు. ఇందు తుట్ట తుదిదికాక తక్కిన రెండున్నూ యక్షగానములు. ఏకాంతసేవ మావూరి జనార్దనస్వామివారికి సంబంధించినది. ఆ యీ గ్రంథాలన్నీ నా చిన్నతనందాకా భద్రంగానే వున్నాయికాని, యిటీవల నేను బందరు ప్రవేశించిన రోజుల్లో కొన్ని నశించాయి. నశించినా అందులో చాలా భాగం అచ్చుపడడంచేత దొరికేవే. చేసినపాపం చెపితే పోతుందంటారు కదా! నేను బొత్తిగా చిన్నతనంలో వున్నప్పుడు లోకల్‌ఫండు స్కూల్లో ప్రవేశించిన కొత్తతికంలో, నాకు పలకా, యేదో వకపుస్తకం, యింతకంటే యెక్కువ సరుకు లేకపోవడంచేత, నాదస్తరం యెత్తుగా వుండకపోవడం నాకు అవమానంగా తోచి యింట్లో తేరగావున్న తాటాకుల పుస్తకాలు కొన్ని దస్తరంలో వేసి పెద్దదిగా కట్టుకొని స్కూలుకు వెళ్లేవాణ్ణి. ఆకట్టుకోవడంలో పొడుగు తగ్గించవలసి వచ్చేది. ఈ కారణంచేత కొన్ని నాచేతులారా ధ్వంసంచేసి వుంటానని నాకు తోస్తోంది. ఆ సందర్భంలోనే తుట్టతుది మూడు పుస్తకాలూ పోవలసినా, యిటీవల కూడా నేను చూచినట్లు జ్ఞాపకంవుంది. ఏలాపోయినాయోగాని, అవి యిప్పుడు కానబడవు. సుప్రసిద్ధ ప్రబంధాలు రెండుమాత్రం యిప్పటికీ వున్నాయి. యామినీపూర్ణతిలక వేయిపద్యాలకు మించుతుంది. వేంకటేశ్వరవిలాసం అయిదువందలకు లోగానే వుంటుంది. వంశాన్ని గురించి రెండోదానిలోనే కొంతవిస్తరించారు. దీన్నిబట్టే నేను దేవీభాగవతంలో– "కులవిధమ్మునెల్లను పిన్న ముత్తాత తనదు గ్రంథముల విస్తరించె నాకన్న" అని యీయన పుస్తకానికి బరాతం పెడుతూ, ఈయన తరం దగ్గిఅనుంచి మాత్రమే యెత్తికొన్నాను. ఇంటిపేరు వచ్చిన సందర్భంకూడా ఈయన– "ప్రవరుల్ కొందఱు మేలుకోట గల చెల్వపిళ్లరాయండు" అనే పద్యంలో విస్తరించుటచే నేను దాన్ని గుఱించి మళ్లా యెత్తుకోక– "ఇంటి పేరెఱుఁగఁ జెప్పెదను చెళ్లపిళ్లవారు" అని మాత్రం వ్రాసి వూరుకున్నాను. మా ముత్తాతగారు వ్రాసిన వ్రాతనుబట్టి యింటిపేరు మొదట చెల్వపిళ్ల వారనిన్నీ, అదే వాడుకలో చెళ్ళపిళ్లగా మాఱిందనిన్నీ తేలుతుంది. మా ముత్తాతగారేనా వంశం అంత తప్పీలుగా వ్రాయనేలేదు. తప్పీలుగా వ్రాసేయెడల, మాకు వారసత్వరీత్యా సాలువక్కంటికి రెండు మూడువేల రూపాయిాల రాబడిగల స్థిరాస్తి కలవడాని కవకాశ మిచ్చేది. దానికి యిప్పుడు యత్నం చేస్తే యీయన వ్రాతలో ఆధారం స్పష్టంగా లేకపోవడంచేత యేమవుతుందో అని సందేహించి వూరుకోవలసి వచ్చింది.

మా తాతగారు మా తండ్రులలో రెండవఆయనకు నరసకవిగారి పేరు పెట్టేరు కాని, చేవ్రాలుతప్ప ఆయనకేమీ విద్య అంటిందికాదు. ఈయనకు మాత్రమే కాదు, ఈయన

సోదరులు తక్కిన యిద్దతికీకూడా ఈయనతోపాటే. అయినప్పటికీ తక్కిన యిద్దతినీ యేమీ అనక "మహా పండితుడి పేరు పెట్టినందుకేనా వీడు పండితుడు కావద్దా" అని కాబోలు, నరసకవిగారి పేరింటి కొమారుణ్ణి మా పినతండ్రిగారిని మా తాతగారు తఱుచు తిడుతూ వుండేవారట. అయితే మా తండ్రుల విద్యాశూన్యతకు కారణం మాతాతగారే అనికూడా తెలుస్తుంది. అందఱు కొడుకులనీకూడా చిన్నప్పటినుంచీ వ్యవసాయంలోనే పెట్టేరట. ఎవరేనా. "ఏమండీ! వెంకన్నగారూ! మీ అబ్బాయిలకు చదువేల చెప్పించ"రని అంటే. "మావాళ్లకి చదువెందుకు? నామాటలు నేర్చుకుంటే చాలదా" అని జవాబు చెప్పేవారట. నాకు నాలుగేళ్ల వయస్సులో వారు యెనభయ్యో పడిలో కాలంచేశారు. విగ్రహాన్నిమట్టుకు యెఱుగుదునుగాని, ఆయన వాగ్ధోరణి యెట్టిదో తెలిసికోదగ్గ జ్ఞానం నాకప్పటికిలేదు. పైగా యింకొకమాట అనేవారట. చదువుకుంటే వకళ్లని వెళ్లి మనంచూడాలి. వ్యవసాయం చేసుకుంటే మనలనే వచ్చి వకళ్లు చూస్తారనేవారట. అప్పటి మాటెట్లాగైనా, బ్రహ్మణులకు వ్యవసాయం చేసుకుంటేనే బాగుంటుందనేకాలం యిపుడు వచ్చినట్టు తోస్తుంది. మా తాతగారికి, కొడుకులకు చదువు చెప్పించలేదనే అపకీర్తి వున్నది. నేను మాపిల్ల వాళ్లకు చిన్నప్పటినుంచీ విద్య చెప్తూతూ వున్నా,నాకున్నూ ఆకళంకుతప్పలేదు. యేమంటే నేను చెప్పే విద్య "అకారంతః పుంలింగో" యీ కాలంలో విద్యకాదు కనుక, నేనా కళంకానికి మా తాతగారితోపాటు గుఱికాక తప్పిందికాదు. కానీ యీ మధ్య కొందఱు యింగ్లీషులో కృషిచేసి కృతార్థులయికూడా నిరుద్యోగడిపార్టుమెంటుకు ప్రసిడెంటులైవున్నవారు నన్ను అభినందించడానికి మొదలుపెట్టేరు. ఆ కారణంచేత నేను కొంత సరిపెట్టుకో గల్గుచున్నాను. లేకపోతే యింగిలీషు చదివించలేదనే కారణంచేత నన్ను లోకులు యెంతగా నిందించేవారో చెప్పశక్యం గాదుగదా?

అయితే ప్రతి బ్రాహ్మణుడున్నూ "అకారాంతః పుంలింగో"కి సిద్ధపడితే బాగుంటుందని నా తాత్పర్యంకాదు. సిద్ధపడితే చెప్పేవారు లేరు. పూర్వకాలంలో ధర్మార్థంగా ఈ విద్యలుచెప్పే గురువులుండేవారు. వారికి తిండిపెట్టేవారున్నూ వుండేవారు. వారందఱూ యిప్పుడు గతించారు. శేషించినవారున్నా యేపట్నమో ఆశ్రయించారు, యెట్లోపొట్ట పోసుకుంటూ వున్నారు. సబ్బు కుంకుడుకాయలనూ, కిర్సనాయిలు ఆముదాన్నీ తొలగించినట్లే, పూర్వపు విద్యలను ఇంగ్లీషువచ్చి "తోసిరాజు" చేసింది. ఇంట్లోవున్న చదువు కనుక నేను నా కొడుకులకి చెప్పడానికి వీలిచ్చింది. ప్రతివారున్నూ ఈలా చేయడానికి వీలుండదుకదా. కాబట్టి లాభమున్నా లేకపోయినా ఇంగ్లీషే చదివితీరాలి. అది ద్రవ్యసాధ్యం. ఆర్థికస్థితి ప్రస్తుత మడుగనక్కరలేదు. ఇక ముందువారి కేవిద్యాకూడా లేకపోతుందేమో. ఔరా! కాలగతి! "కొత్తనీరువచ్చి పాతనీరును కొట్టుకుపోయింది." "హా సీతేకిం భవిష్యసి!"

ప్రకృతానికి వద్దాం. ఇంతవఱకు నాపిల్లల్ని స్కూలుకెవళ్లనీ పంపనేలేదు. అక్షరాభ్యాసంతోటే రామశబ్దం మొదలుపెడుతూవున్నాను. రామశబ్దానికి కాకున్నా, అక్షరాలకేనా స్కూలు పనికిరాదా? బాగా ఆలోచిస్తే పనికిరాదు. పనికిరానేరాదు. ముమ్మాటికీ పనికిరాదు. కారణాలు వ్రాయమనకండి, నా మనవి చిత్తగించి మీరే అనుభవంలోకి తెచ్చుకోండి, "ఈమీప్రతిజ్ఞ యికముందు సాగుతుందా?" అంటారా? ఆలా అడగండి. రూల్సువస్తే, టీకాలతోపాటు దీనికిన్నీ తలవగ్గుతాను. శారదాబిల్లు రజస్వలావివాహానికి సిద్ధంచేయడంలేదూ? ఆలాగే ఇదీ అనుకోండి, తప్పో వొప్పో నాకున్న అభిప్రాయం వ్రాశాను. మా ముత్తాతగారి ముచ్చటలో ఈసోదెందుకు? ఎందుకా? ఆయన ఆత్మ సంతోషించడానికి.

ఇక ఆయన పద్యాలు స్వల్పంగా వుదాహరించి యీ వ్యాసాన్ని ముగిస్తాను :-

ఉ. డాలు కడానిమేను, మరుడాలునెదుర్కొనుఁజూపు, చంద్రఖం
డాలు నఖంబు, లేర్పుపగడాలు రదచ్ఛదకాంతు, లేన్గుతొం
డాలు తొడల్, మదాళిజగడాలుకురుల్, నునుదమ్మికెంపుతం
డాలు రదాళి, బర్నిబిరడాలు కుచాగ్రము లవ్వధూటికిన్.

పద్యము యామినీపూర్ణతిలకలోనిదే. యెంతమృదువుగానున్నదో చూడండి. ఈయనధార యెంతో మృదువైనది. కాని సహజమైనధారను వదలికొని యితరుల ననుకరించడానికి మొదలుపెట్టేటప్పుడు మాత్రము యీ సొగసు పోగొట్టుకొంటాడు.

ఈయన, లోగడ నుదాహరించిన యక్షగానరచనవల్లనే సంగీత ప్రవిష్టుడని తేలుతుంది. అయినా దాని కుపోద్బలకంగా యింకొకపద్యం వుదాహరిస్తాను. దీనివల్ల యీయనకు గానమున నెంతయభిమానమో తెలుసుకోవడానికి వీలవుతుంది.

ఆ.వె. సరసులకును మోహసంపద లొదవించెఁ
బూలుపూచెఁ దరులు, రాలు గరగె
నేమిచెప్పవచ్చు నేలోకముననైన
గానమునకు సాటి గానఁగలదె?

గానమందీయన, చెట్టుక్రింది ప్లీడరువంటివాడేకాని, "సంగీత కళా రహస్యనిధి" యైన వసుచరిత్ర కవివంటివాడు మాత్రం కాడు. యేమంటే భట్టుమూర్తి కాంభోజీరాగంతో నాయకురాలిని యేడిపిస్తే, మా ముత్తాతగారు కళ్యాణీరాగంతో యేడిపించారు. దీన్నిబట్టి ఆలోచిస్తే గాలిపాటపాడే వారేకాని, రహస్యజ్ఞులు కారని తోచకమానదు. కాంభోజివలె కళ్యాణికి కరుణరసమును బ్రకటించు శక్తిలేదనుకుంటాను. అయిననూ యింకా దీన్ని గురించి గానవిద్యానిష్ణాతులు ప్రష్టవ్యులు.

నాకు చేతనైనంతలో మా ముత్తాతగారి కవిత్వాన్ని గూర్చి వ్రాశాను. ఆయన యేమనుకుంటారో?

తే.గీ. పుత్రవతిరీతి పృథుకసంభూతిసమయ
గర్భనిర్భర వేదనావిర్భవంబు
వంధ్యలెఱుఁగుట యెట్లు? కావ్యప్రయాస
సుకవులకుఁగాక తెలియనే? కుకవితతికి. అనిన్నీ,

"కవి చమత్కార గౌరవంబు"

తే.గీ. మనసెఱుంగునుగాక యెవ్వనితరంబు?
పాటిదెల్పఁగ నాత్మానుభవమురీతి
కాన ధారాప్రకల్పనకౌశలముల
ఫణితిఁదెలియుఁడి కవిసార్వభౌములార! అనిన్నీ.

యామినీపూర్ణతిలకలో భవిష్యద్విమర్శకులనుగూర్చి వుటంకించియున్నారు. ఆయన యాత్మలో నన్నేమనుకొనునో! తోచింది వ్రాశాను. ఇప్పుడీలాటి వ్రాతలకేకాబోలు, "రిసర్చి" అనే టైటిల్సు వస్తున్నాయి. కాని దీన్ని దానివంటిదాన్నిగా చదువరులు భావింపరను కొంటాను. అది యింకా లోతుగా వుంటుంది. తుందూతుపాకీగూడా యెగిరిపోతూ వుంటుంది. దాని ధోరణిలో భారతాంధ్రీకరణం రాజరాజనరేంద్రుఁడిదే అయిపోతుందొ కప్పుడు. కాబట్టి దానివంటిది యిది కాకూడదు.

ఈయన రచించిన ప్రబంధరాజములలో మొదటిది యామినీ పూర్ణతిలక. రెండవది వెంకటేశ్వరవిలాసము. యిది తుట్టతుది దినములలో రచించినదగుటచేత దీని రచనయే ప్రౌఢవిమర్శకు లగువారికి హృదయంగమంగా వుండవలసి వున్ననూ, పేరుమాత్రం యెక్కువగా మొదటిదానికే వచ్చింది. వేంకటేశ్వరవిలాసం రచించినట్లే నిన్న మొన్నటిదాకా లోకు లెఱుగరు. వీరేశలింగంగారు మొదటిదాన్నేకాని రెండోదాని పేరెత్తనేలేదు. మొదటిదానిశైలి చూపినాను. రెండవదానిశైలికై కొన్ని వుదాహరిస్తాను.

క. భాష్యంబు చెప్పి సకలమ
నీష్యగ్రణు లెన్నఁబ్రౌఢి నేర్పెద నీకున్
దూష్యంబులేదు దీనను
శిష్యా! ఆచెలియ జాడఁజెపుమా మాకున్.

తే.గీ. చెల్లబోదిఁక నీమాయ లెల్లఁదెలిసె
గామిడంబులు మాని చక్కంగ మసలు
వేగిరించుట పనిగాదు వినుము, చెంచు
వారికట్టడి బలుపెద్దతీరుసుమ్మ.

చ. తొకతొకమానినీసవతి దోకొనివచ్చినయప్పుడూరకుం
డక యొకచాయఁ బెద్దగగలంబముఁ జేయవె? యవ్వ! యంతనుం
డిఁకఁ గడు మంచిబుద్ధిగని నిక్కము నిన్‌బతిమాలుకొంట మ
చ్చికదిరలాడకుంటె నను "సింగిహులిక్కిది" యంచు నెంచుమీ.

తే. గీ. గామిడము సేసినాఁడవో కలిసికట్టు
సేసినాఁడవొ సామి! సెంచితయె నీకు
నిచ్చకమె పల్కిపానంబు లిచ్చినిల్పెఁ
గాకయుండిన నీమాటగానవచ్చు.

భిన్నభిన్న స్థలాలనుంచి ఉదాహరించిన పద్యాలవల్ల గ్రంథకర్త కవిత్వం చాలా ప్రసాదగుణవిశిష్టంగా వుంటుందనే కాకుండా జాతీయంగా కూడా వుంటుందని స్పష్టంగా తెలుస్తుంది. యమకానికేమి, చిత్రానికేమి, ఇంకా అనేక విధమైన త్రికమలకేమి, ఈయన పుట్టినిల్లే కనుక, ఆమోస్తరు పద్యా లుదాహరించి గ్రంథం పెంచలేదు.

కవిత్వం మావంశంలో ఈయన తరంలోనే పుట్టిందనుకోవడానికి వీలులేదుగాని, ప్రబంధరూపాన్ని తాల్చిందనిమాత్రం చెప్పక తప్పదు. ఈయనగద్యలో "కామకవిపుత్ర" అని వ్రాసుకోవడంవల్లనూ, "అశ్వత్థ నారాయణా" అనే మకుటంగల శతకం వకటి ఈయనకు పూర్వమందే మావంశస్థులు వ్రాసినట్లు ప్రతీతి వుండడంచేతనూ, ఈయనకన్న పూర్వం కూడా మావంశమందు కవిత్వం అంతోయింతో వుందనుకోక తప్పదు. పైశతకాన్ని గుఱించి మాతాతగారితో ఆయన మేనత్తకూతురు చెపుతూ వుండడమే కాకుండా, భక్తితో ఆపె వొక రావిచెట్టుకూడావేసి పెంచింది. నిన్న మొన్నటిదాకా ఆరావిచెట్టు "అమ్మిరావిచెట్టు" అనే పేరుతో వ్యవహరింపబడుతూ, జీవించివుండడం నేనున్నూ యెఱుగుదును. ఆవిడపేరు అమ్మి కనుక ఆవిడ వేసిన చెట్టుకు ఆపేరు వచ్చింది. బహుశః ఆ శతకం నేను స్కూల్లో చదువుకొనే రోజుల్లో పెద్దక్లాసువాళ్ల దస్తరంపాటుతో నాదస్తరం పెంచడానికి చేసిన తెలివితక్కువ పనిలో నశించిందేమో? ఈ సంగతి లోగడ వుదాహరించే వున్నాను.

నాకు పూర్వం చాలామంది మా వంశస్థులు కవులున్నారనే నమ్మికచేత నేను– "కవితారంభప్రియంభావుకంబై మావంశము వొల్చు" అని దేవీభాగవతంలో వ్రాయ సాహసించాను. నాతరంలో నాపినతండ్రి కొడుక్కూడా కవిత్వం చెప్పేవాడు. వట్టికవిత్వమే

కాకుండా దానికి తగ్గ పాండిత్యం కూడా అతనికి వుండేది. దేవీభాగవతంలో దశమస్కంధం అతడే తెలిగించాడు. అతడెక్కుడు పేరు ప్రతిష్ఠలు సంపాదించేవాడే కాని, అల్పాయుష్కుడై యిప్పటికి యిరువైయేండ్లనాడు ముప్పైయేండ్ల వయస్సులో స్వర్గస్థుడైనాడు. మంచిగాని, చెడ్డగాని వంశమం దున్నట్టయితే అది అనుశ్రుతంగా వస్తుందన్నందుకు నేను వ్రాసిన సంగతులు కొంత దృష్టాంతం కావచ్చును. తిరుపతిశాస్త్రిగారి తరంలోతప్ప వారి వంశమందీ కవిత్వం వున్నట్టులేదు. మళ్లా తిరుపతి శాస్త్రి కొడుకు పెద్దవాడు కవి. పోనీ తండ్రి కవిగనుక అతనికది సంక్రమించిందనుకుంటే, అతని అన్నకొడుక్కూడా కవి. దీన్నిబట్టి వంశంలో వుండనే అక్కర్లేదనిన్నీ తోస్తుంది. కొడుకులే అక్కఱలేదు. కవుల కూతుళ్లుకూడా కవిత్వం చెప్పడం కలదు. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రులవారి కొమార్తె యిందు కుదాహరణం. వాళ్లు అయినా కాకపోయినా, తండ్రికి మాత్రం తనవిద్య తన సంతానానికి రావాలి అనే కోరిక వుంటుంది. దాన్నిబట్టిసాధ్యమైనంతవఱకు దాన్నే అభ్యసింప చేయాలని ప్రయత్నం తండ్రిచేస్తాడు. ఇప్పటికాలంలో మాత్రం లాభాపేక్షచే చాలా మంది తండ్రులు ఈ వుద్యమాన్ని వదలుకొన్నారు. ఇంకా నాబోటి చాదస్తులు ఈ వుద్యమంలోనే వున్నారు.

నిన్నమొన్నటినుంచి నావంటి చాదస్తులనికూడా అభినందించేవారు రాజకీయ విద్యాభ్యాసం చేసినవారిలో కనపడుతూన్నారు గాని, యింతకు ముందు మాత్రం అట్టివారు బొత్తిగా లేరు అని వ్రాసేవున్నాను. కాని ఆలాటి రోజులలోనే నేను ఫ్రెంచి చదువుకుంటూ వుంటే, బెజవాడ బాపనయ్య నాయడుగారనే ఆయన మా తండ్రిగారిని పిలిచి "మీపూర్వులు కవీశ్వరులు, మీ అబ్బాయి కిదెందుకు? కులవిద్య చెప్పించండి, (కులవిద్యకు సాటిరావు గువ్వలచెన్నా)" అని ప్రోత్సాహపరచి శ్రీకానుకుర్తి భుజంగరావుపంతులువారివద్ద నన్ను వప్పగించారు. ఈ బాపనయ్య నాయడుగారు నామమాత్ర శూద్రులు. తేజస్సుచేతనేమి, తెల్వితేటలచేతనేమి, ఈయన కెంతటిమహారాజులున్నూ సాటికారు. ఈయన యానాం కాపురస్థులు. ఫ్రెంచిరాజ్యంలో ఈయన వుద్యోగధర్మంచేత ఏకచ్ఛత్రాధిపత్యం చేశారు. మిక్కిలి భగవద్భక్తులు. నేను భీష్ముణ్ణి చూడలేదుగాని, ఈయన విగ్రహం తలపులో పొడకట్టినప్పుడు భీష్ముడే యీలా అవతరించినట్లభిప్రాయపడతాను. నాకు కులవిద్య రావడానికి మా ముత్తాతగారి ప్రతిష్ఠతో పాటు ఈ నాయడుగారుకూడా కారణం గనుక కొంచెం కృతజ్ఞతను తెల్పడానికి కొన్ని పంక్తులు ఈయన్ని గుఱించి యిక్కడ వ్రాశాను. మా పిల్లల్లో కూడా ఈ కవిత్వం అంతో యింతో వ్యాపించేటట్టు తోస్తుంది. దీనికంతకూ కారణం మా ముత్తాతగారే కనుక, ఆయనకు మాటి మాటికీ నమస్కరిస్తున్నాను. తరవాత పండితులవుతారో, కారో అది భగవదిచ్ఛగాని మోటుగా వుండే "శాస్త్రి" పేరే వుంచాను. భగవంతుడు వాళ్లను సర్వదా ఫలానా వంశస్థులనునట్లు అనుగ్రహించుగాక!

★ ★ ★

# నా గురుపరంపర

అయిదోవత్సరం దాటకుండా నాకు అక్షరాభ్యాసం జరిగింది. అక్షరాభ్యాస గురువు మా తండ్రిగారికి అక్షరాభ్యాసం చేసిన ధనుకొండ వెంకన్నగారనే వృద్ధులే. నేను మఱునాడే బడికి వెల్లకపోవడంచేత అక్షరాభ్యాసానికి ద్వితీయవిఘ్నమే తటస్థించింది. ప్రతిరోజున్నూ ఆ బడికి సమీపంలోవున్న మాపెద్దమేనత్తగారింటికి మజ్జిగ పట్టుకెళ్లడం నామీదవుండేది. ఆ కారణంచేత బడిపిల్లలు అప్పుడప్పుడు నన్ను బలవంతంగా సాయంపట్టుకు తీసుకు వెళ్లడానికి ప్రయత్నించేవాళ్లు. కాని, ఆలాటి చిక్కులో వున్న నన్ను మా మేనత్తగారి కూతురు వచ్చి వాళ్లని పాఱదోలి తప్పించేది. ఈలా అయిదారునెలలు బడికి వెళ్లకుండానే గడిచి పోయాయి. అంతట్లో మా అమ్మగారి పెద్దమేనత్తగారు చనిపోయినట్లు కబురువచ్చింది. ఎప్పుడేనా వీథులో కర్మంచాలక బడిపంతులుగారు కనపడి, "యేమిరా బడికి రావడంలే" దంటే, "మాకు మైలవచ్చింది" అని చెప్పేవాణ్ణి. అది ఆయన మనస్సుకు నచ్చక, కారణం అడిగేవారు. నేను మా అమ్మ మేనత్తగారి సంగతి చెప్పేవాణ్ణి. "వోరి! అలాగట్రా?" అని ఆయనలో ఆయన నవ్వుకొని వెళ్లేవారు.

ఆ యీ వంకలతో చాలారోజులు గతించాయి. వ్యవసాయం తొందరచేత మా నాన్నగారు నా బడిసంగతి కనుక్కొనేవారేకారు. తుదకు యేడాదికో, యేణ్ణర్థానికో బడికి వెళ్ళడం మొదలెట్టేను. గుంటవానమాలు వ్రాసియిచ్చారు. అప్పటికే పలకలు వచ్చాయిగాని, పూర్వపురకం బళ్లలో యింకా వాటిని వాడడంలేదు. ఓనమాలూ, అఆలూ, అయిదుబళ్లూ, గుణింతం, పేర్లూ నాకు త్వరగానే వచ్చాయి. పుస్తకం పట్టించారు. "వాగీశాద్యా" వగయిరా బాల రామాయణం శ్లోకాలు వ్రాసియిచ్చారు. ఇంకా ఆశ్లోకాలు వప్పగించకుండానే నా చదువు లోకల్‌ఫండు స్కూలుకు మాఱింది. యేమంటే : అంతకు పూర్వంనుంచిన్నీ అప్పటి లోకల్‌ఫండు స్కూలు మాస్టరుగారు యేలేశ్వరపు శ్రీరాములుగారు మా తండ్రిగారిని నన్ను తమస్కూలుకు పంపించవలసినదని కనపడ్డప్పుడల్లా ప్రేమతో అడుగుతుండేవారు. ఆ కారణంచేత లోకల్‌ఫండు స్కూలు విద్యార్థినిగా మాఱడం తటస్థించింది. "కాకుదీర్ఘమిస్తేకా" వదలిపెట్టి "కకారా కారములు కా" లోకి చదువున్నూ మాఱింది. కొత్తపద్ధతి అయినా నాకంత చిక్కుగా కనిపించలేదు. మొదటిరోజులోనే ఆమార్పు వంటికి పట్టింది. మాస్టరుగారికి నామీద అనుగ్రహం కలిగింది. మఱునాడే ఫస్టుక్లాసులో చేర్చేరు.

అప్పుడు ఆస్కూల్లో నాలుగుక్లాసులు వుండేవి. నాలుగోక్లాసు పిల్లలు ఇప్పటి మెట్రిక్యులేషన్ విద్యార్థులకు భాషలో నేమాత్రమున్నూ తీసిపోరు. కాని నా అదృష్టంవల్ల బ్రాహ్మణపిల్లవా డొకడు కొంచెం ముసలాగ్రబుద్ధి వుండేవాడు. అతన్నియేదో వర్ణక్రమం అడిగేరు మాష్టరుగారు. అతడు సరీగా చెప్పలేకపోయాడు. యేం తోచిందో; ఆ మాటకి వర్ణక్రమం నన్నడిగి చూచారు. నేను సరిగా చెప్పేను. దానితో మాస్టరుగారికి అనుగ్రహం మఱింత హెచ్చింది. నిన్ను నేడే సెకందు క్లాసులో వేసేమన్నారు. సెకందుక్లాసులో వున్నప్పుడు కూడా ఆవిద్యార్థిని అడిగిన వర్ణక్రమప్రశ్న అతడు తప్పినప్పుడల్లా నన్ను అడుగుతుండేవారు. నేను చెబుతూండేవాడను. ఆలాచెప్పడంతో ఆ విద్యార్థికి సిగ్గురావాలని కాబోలు. నాకేం తెలుస్తుంది? అతనిచేత నాకు ప్రదక్షిణ నమస్కారాలుకూడా చేయిస్తూవుండేవారు. అది పొందడం నాకిష్టం లేకపోయినా, మాస్టరుగారి భయంవల్ల విధిలేక అనుభవించేవాణ్ణి. అతడిప్పటికిన్నీ బాగానే వున్నాడు. నాకంటె నాలుగైదేళ్లు పెద్ద.

ఈళ్లా రొండోక్లాసు చదువు జరిగింది. అంతలో మూడోక్లాసు. ఈక్లాసులో నాకు తక్కినవి బాగానే వచ్చేవి గాని, లెక్కలుమాత్రంనట్టేవి. నాలుగోక్లాసు ప్రవేశించడంతోనే భిన్నపులెక్కలు అప్పటి స్కూళ్లల్లో చెప్పేఆచారం. ఈ లోపుగా వుండేలెక్కలన్నీ మూడో క్లాసుతోనే సమాప్తికావాలి. నాకు లెక్కలంటే అప్పటికీ, యిప్పటికీ కూడా సగమెఱుకే. ఈ లెక్కల టయిము, ప్రతిరోజున్నూ మధ్యాహ్నం వచ్చేది. తఱుచు నే నెగబెట్టడంచేతనేమి, మాస్టరుగారు చదరంగమాడుకొంటూ యెప్పుడోగాని మధ్యాహ్నం స్కూలుకే రాకపోవడంచేతనేమి, చాలాభాగం నాకు లెక్కల గండం తప్పేది.

నా చిన్నతనంలో మా వూళ్లో చదరంగం విస్తారంగా వుండేది. ఈ యాటలో తఱుచు వ్యసనం కలిగివుండడంచేత, లోకల్‌ఫండువారిచ్చే జీతంకాక, వారి గ్రామంలో వున్న బడి అనే అభిమానంచేత శ్రీ పిఠాపురం జమీందార్లు అదనంగా యిచ్చే జీతం మా మాస్టరుగారికి యెవరో అర్జీ యిచ్చి ఆపుచేయించారు. అలా జరిగినప్పటికీ మా మాస్టరుగారు లక్ష్యం చేయనేలేదు. అప్పటి మాస్టర్లు తృణీకృత బ్రహ్మపురందరులు తఱుచు బళ్లోకి రాకపోయినా అప్పటిమాస్టర్లు వచ్చిన నాలుగ్గడియలూ చెప్పే చదువువల్లనే పిల్లలు చక్కగా ప్యాసయేవారు. మా మేస్టరుగారు అంటే ఇప్పటి బోర్డు పల్లెటూరువారివంటివారు కారు. ఇప్పటి కాలంలో బి.యే.క్లాసుకుకూడా వారు పాఠం చెప్పదగ్గవారని నేననుకొంటాను. వారు స్వదస్తూరీతో వ్రాసుకొన్న నీతిచంద్రిక (చిన్నయసూరి గారిది) నాకు వారెప్పుడో అనుగ్రహం కలిగి యిచ్చారు. ఇప్పటికీ అది నా వద్ద నిల్వవుంది. అది చూచినప్పుడల్లా వారి విగ్రహం నాకు జ్ఞాపకం వస్తూ వుంటుంది. ఆ వాగ్ధోరణీ, ఆ బ్రహ్మతేజస్సూ, ఆ సదాచారసంపత్తీ, ఇప్పుడెక్కడ చూడగలం? ఆ కాలం పోయింది. ఆయన యేలేశ్వరోపాధ్యాయులుగారి

వంశంవారు. ఆ వంశంలో కల్లా ఆయనే తక్కువపండితులు. పెత్తండ్రిగారు వగయిరా మిక్కిలీ పెద్ద పండితకోటిలోవారు. తక్కువవారు కనకనే స్కూలు మాస్టరీకి వచ్చారు. వారి పాండిత్యం తక్కువ మా అదృష్టాని క్కారణమయింది. వారప్పుడప్పుడు తఱుచుగా భారతమో, రామాయణమో పురాణమో చదువుతూండేవారు. చిన్నప్పటినుంచీ ధారణ శక్తి వుండడంవల్ల వారు చదివిన కథంతా కొన్ని చిన్నపద్యాల సహితం నాకు ధారణకు వచ్చేవి. పైగా వారు చదివే ధోరణి కూడా కొంత పట్టుబడేది. కాని పదిసంవత్సరాల లోపుసంగతి అవడంచేత వారు చదివే ధోరణి మాత్రం యిటీవల నాయందు నిలవలేదు.

పదేండ్ల వయస్సులో నాచదువు ఫ్రెంచిటవును యానాముకు మాఱింది. అందుచేత కడియం మాస్టరుగారివద్ద మూడోక్లాసువఱకే చదువున్నూ పల్లెటూరు ఆటలు, గోళీకాయలు, గుట్టాటా, ఒకమాదిరి కోతికొమ్మచ్చీ, బంతీ, ఈ ఆటలున్నూ, కొంచెం చుట్టకాల్చడమున్నూ మాత్రమే కడియంలో నాకు తటస్థపడ్డాయి. తుట్టతుది దురభ్యాసానికి కారణం యింట్లో విస్తరించి పుగాకుండడమే. అట్లా వుంచడానికి హేతువు మా తండ్రిగారి అమాయికత్వం. ఒకరైతు ఒక గృహస్థు దగ్గఱ అరవైరూపాయిలు ఋణం పుచ్చుకొంటున్నాడు, ఆ యిచ్చేటప్పుడు మా తండ్రిగారు అక్కడ వున్నారు. ఋణదాత "యేమండీ, కామయ్యగారూ, యితనికిస్తున్నాను, యివ్వవచ్చునుగదా?" అన్నారట. "అభ్యంతరమేమి" అని తల వూపేరట. ఈ మాత్రం తల వూపినందుచేత ఆ కాపువల్ల వసూలు కాని ఆ ఋణము మా తండ్రిగారు వారికి తీర్చారు. దానికై కృతజ్ఞత చూపుతూ ఆ రైతు తనంతటతాను రెండుపుట్ల పొగాకున్నూ, రెండుకాళ్ల లేత దుక్కి గిత్తలున్నూ మా యింటికితోలిపెట్టేడు. ఆ కాలం యేలాంటికాలమో చూడండి. ఆ పొగాకు ఇప్పటి రోజుల్లో రెండువందలకు తక్కువ ఖరీదుండదు. ఆ యెడ్లు నాలుగున్నూ ఈ రోజుల్లో నూఱేనా చేయకపోవు. ఇదంతా కోర్టుద్వారా జరిగిందికాదు. గ్రామంలోనే. తమంతట తమకు తోచిచేసిన పనేగాని, వక తగవరీ గిగవరీ చెపితే చేసిన పనిన్నీకాదు. ఆ పొగాకు మా యింట్లో వుండడంచేత, ఆయా పదార్థాలు కొనడానికి చేతికి వచ్చినంత మా అమ్మగారు వాళ్లవాళ్లకి యిస్తూవుండేవారు. నేనున్నూ స్కూలుపిల్లల సహవాస దోషంవల్ల వాళ్లసహితంగా పొగాకును వాడుకోవడం తటస్థించింది. ఒకనాడు మా అమ్మగారు కనిపెట్టి మందలించారు. అంతతో అది ఆగిపోయినట్లయింది. కాని పూర్తిగా ఆగిందనడానికి వల్లకాదు. ఇటీవల కొన్ని యేళ్లకు కావ్యాలు చదవడం ఆరంభించాక పూర్తిగా ఆగింది.

యానాంలో ఫ్రెంచి స్కూల్లో ప్రవేశించాను. ఇప్పటి ఇంగ్లీషు స్కూళ్లలోవలెనే ఆ స్కూల్లో తెలుక్కంత ప్రాధాన్యంలేదు. సాతాని జియ్యన్నగారు తెలుగుమాస్టరు. ఫర్మా, విజే అను యిద్దఱు దొఱలు ఫ్రెంచి మాస్టర్లు. ఫర్మా హెడ్మాస్టరు. విజేగారు నాకు గురువు.

చాలా దయాశాలి. ఇంగ్లీషులో త, ద లోనగు కొన్ని వర్ణములవలెనే, ఫ్రెంచిలో ట, డ లోనగు కొన్ని వర్ణములు పలకవు. నన్ను ఆ మేస్టరు గారు "సెలపిల యెంకతసలం" అని పిల్చేవారు. ఆ బడిలో పిల్లలు జీతమివ్వనక్కరలేదు. పుస్తకాలు వారే యిచ్చేవారు. పైగా యెక్కువ తెలివితేటలుంటే ప్రజంట్లు కూడా యిచ్చేవారు. మాలా - మాదిగా అందఱూ వుండేవారు గాని, యెవళ్లబెంచీ వాళ్లదే. ఒక హాల్లో మాత్రం కూర్చోవడం తప్పదు. వారానికి రెండు రోజులు పూర్తిసెలవు. కాని వరుసగా మాత్రం కాదు. గురువారమున్నూ, ఆదివారమున్నూ, పిల్లలుచేసిన తప్పేదైనా వుంటే వారాని కొకమాటు శిక్షించడం. దానిపేరు "పటుసారి" అనేవారు. డ్రాయరుమీద పడుక్కోబెట్టి తప్పునుబట్టి బెత్తంతో కొన్ని దెబ్బలు కొట్టడం.

ఆస్కూల్లో అయిదాఱు మాసాలకన్న యెక్కువరోజులు చదివినట్లు జ్ఞాపకంలేదు. "అల్ఫాబెత్తు" అనే మొదటి పుస్తకంలో కొంత అయింది కాబోలును. తెలుగు కడియంలో వచ్చిందెంతో అంతేకాని వృద్ధికాలేదు. అంతలో భగవదనుగ్రహంవల్ల, ఆ ప్రభుత్వం రిపబ్లికు ప్రభుత్వం కనుక, మాలమాదిగలనుకూడ అందఱితో కలిసి కూర్చోనివ్వాలి అనే రూలు ప్యాసయింది. దానితో అన్ని వర్ణాలపిల్లలూ మానేశారు. నేను మాత్రం కొలదిమంది పిల్లలతో ఆ అవకాశంలో ఆ వూరికి సమీపంలోవున్న ఇంగ్లీషు గ్రామం నీలపల్లెలో లోకల్‌ఫండు స్కూల్లో ప్రవేశించాను. పిల్లలంతా మానుకోవడంచేత మళ్లా ఫ్రెంచి స్కూల్లో ఆ రూలు తీసివేశారు. తీసివేసినా తక్కినవాళ్లు ప్రవేశించారు గాని, నేనున్నూ మఱికొందఱున్నూ ప్రవేశించలేదు.

ఆ నీలపల్లె స్కూల్లో ముగ్గురు మాస్టర్లూ సుమారు అయిదాఱువందల పిల్లలూ వుండేవారు. నాలుగో క్లాసులో అఱవై, డెబ్భై మంది వుండేవాళ్లం. ఆఱువేల నియోగులు చేమర్తి వేంకటాచలంగారు హెడ్మాస్టరు. శేషయ్య వ్యాకరణం, హిందూదేశ చరిత్ర, సుఖాధారప్రకాశిక, విభక్తి చంద్రిక, శబ్దలక్షణం, ఇత్యాదులు పాఠ్యపుస్తకాలు, శేషయ్య వ్యాకరణం ఇప్పుడెక్కడా కనపడడంలేదు. అది వెంకయ్య వ్యాకరణానికి బదులుగా బయలుదేరింది. వీరభద్రపల్లెనికి హనుమత్పళ్లెం వంటిది. శేషయ్య అనే ఆయన వ్రాశారని తోస్తుంది. వెంకయ్య వ్యాకరణం మాత్రం వెంకయ్య అచ్చువేయించింది గాని రచించిందికాదు. అయితే ఆయనపేరుతో వ్యవహరించబడడం "పుణ్యైర్యశో లభ్యతే" అన్న అభియుక్తోక్తి కుదాహరణం అనుకోవాలి. నన్నయభట్టీయ సూత్రాలకు బాలసరస్వతి వ్రాసిన టీకను విడదీసి తాడినాడ వెంకయ్యగారు అచ్చువేయించినారు. ఇప్పటికిన్నీ అది ఆ పేరుతోనే వ్యవహరింపబడుతూ వుంది. ఇట్లాగే హైదరాబాదులో హుసేనుసాగరం అనే చెఱువొకటి వుంది. అదికూడా హుసేను తవ్వించింది కాదు. అతడొక నవుకరు. ఆ చెఱువు తవ్వించే

రోజుల్లో ఆ పనిలో కాస్త పెద్దగా వుండి వుండును. ఈ యప్రస్తుతప్రశంస శేషయ్య వ్యాకరణంమీద వచ్చింది. ఆ వ్యాకరణంలో "తటం, ఏతటం" అంటూ రెండు సంజ్ఞలు వుండేవి. వాట్ల అర్థం అప్పుడు తెలియలేదు సరిగదా. ఇప్పటికీ తెలియనేలేదు. పుస్తకం కనపడితే ఇప్పుడు తెలుస్తుందేమో కాని అది దొరకడం మానేసి చాలా వత్సరాలయింది.

ఈ మోస్తరు పుస్తకాలతో నీలపల్లెలో "లోవరుఫోర్తు" అనే పరీక్ష యిచ్చి సర్టిఫికెట్టు పుచ్చుకొన్నాను. సర్టిఫికెట్టు యివ్వడం ఇనస్పెక్టరుగారే. అప్పుడు యినస్పెక్టరు జిల్లాకు వక్కరుగా వుండేవారు. వారి పేరు క్రోవి దక్షిణామూర్తి శాస్త్రులుగారు. జిల్లాకూడా ఇప్పటి కృష్ణలో చాలాభాగం తూర్పుగోదావరిలోనే వుండేది. ఇనస్పెక్టరుగారు సవారీ బోయీలతో వచ్చేవారు. నేను ప్యాసైన లోవర్‌ఫోర్తుప్యాసైతే స్కూలు మాస్టరీ చులాగ్గా యిచ్చేవారు. ఇదికూడా ప్యాసుకాకుండా యెంతోమంది మాస్టరీపని సంపాదించినవాళ్లు ఆ రోజుల్లో వుండేవారు. యినస్పెక్టరుగారి అనుగ్రహం సంపాదిస్తేచాలు, ఆ రోజులవి. ఈ రోజులను గూర్చి యెఱుగనివారు లేరు గాన విస్తరింపనక్కఱలేదు. ఆ నీలపల్లెలో చదివేటప్పుడు మమ్మల్ని పొరుగూరువాళ్లమనే కారణంచేత మధ్యాహ్నమున్నూ, సాయంకాలమున్నూ సుమారు వక గంట ముందుగా వదలిపెట్టేవారు. ఆ టయిములో మేము త్రోవలోవున్న శీతాఫలపుతోటల్లోనూ, జామతోటల్లోనూ యథేచ్ఛగా కాలక్షేపం చేసేవాళ్లం.

ఈరీతిగా నీలపల్లె చదువు ముగిసింది. తరువాత యానాంలోనే మాకు దగ్గఱచుట్టాలు చక్రవర్తుల బాపయ్యగారి బడిలో ప్రవేశించాను. ఈయనకు అంతో యింతో ఫ్రెంచి, ఇంగ్లీషుకూడా వచ్చును. తెలుగులో మంచిసమర్థులు. కొంతజ్ఞానం ఈబళ్లో కలిగింది. ఈ బళ్లో చదివే రోజుల్లోనే కాగితపు అట్టలతో తోలుబొమ్మలుచేసి, నేనున్నూ, ఇంకొక సాతానుల పిల్లవాడున్నూ తొలుబొమ్మలాటాడించడం మొదలు పెట్టేటప్పటికి ఈ సంగతి శ్రీ మన్యం మహాలక్ష్మమ్మ జమీందారుగారికి తెలిసి మమ్మల్ని పిలిపించి ఆడించారు. ఏదోకొంచెం సమ్మానం కూడా చేసినట్టు జ్ఞాపకం. బాపయ్యగారిబళ్లో వకరోజున డిక్టేషన్ వ్రాయడంలో కామాలో, పులుస్టాపులో పెట్టడం పొరబడ్డది. ఆయన దానికి కోప్పడ్డారు. ఆ మఱునాడు ఏమితోచిందో యిప్పుడు జ్ఞాపకం లేదుగాని, ప్రతీ అక్షరానికీ, కామా, లేదా, పులుస్టాపు - యిల్లా వుంచాను. దానిమీద పూర్తిగా మందలింపు తగిలింది.

ఈపైన కాపులపాలెంలో శ్రీ భుజంగరావుపంతులవారిదగ్గఱ రఘువంశం చదవడం, ఈ చదివేరోజుల్లో వక వైష్ణవునివద్ద సంగీతం గాలిపాట అంతోయింతో నేర్చుకోవడం, ఈయన యింటిపేరు పురాణంవారు. పేరు నరసింహాచార్యులు. ఈయన నాకు రఘువంశం చదవటంలో సహాధ్యాయి. ఈయన వుపదేశాన్ని బట్టినేను ఆ రోజుల్లో వైష్ణవమతస్థుడుగా వుండేవాణ్ణి. పైకి ఆ మతచిహ్నాలు ధరించకపోయినా శివుడంటే ద్వేషంగా వుండేవాణ్ణి.

శివాలయంలోకి వెళ్లినా, ప్రసాదం పుచ్చుకొన్నా, దాన్ని మాత్రం తినేవాణ్ణిగాను. ఈ మతంబాధ క్రమంగా మాఱింది కాని కొన్నాళ్లు మాత్రం చాల పట్టుదలగా వుండేవాణ్ణి. ఆయన నాకు వుపదేశించిన వుపదేశమేనా అంత విస్తారమేమీలేదు. ఇద్దఱిని ఆశ్రయించడం వల్ల యేమీ లాభం వుండదు, వారు రక్షిస్తారని వీరు వూరుకొంటారు. వీరు రక్షిస్తారని వారూరకొంటారు, తుదకు భక్తుడు వ్యర్థుడైపోతాడు అని చెప్పేవాడు. ఆయన సహాధ్యాయిగా వున్నది స్వల్పకాలంమాత్రమే గురుత్వంవల్ల నైతేనేమి, సహపాఠిత్వంవల్ల నైతేనేమి, నాకు ముక్కుపొడుం పీల్చడం అభ్యాసమయింది. అది యిప్పటిదాకా నిల్చివుంది. ఇంకనూ వుండేటట్టేవుంది.

ఈ రోజుల్లోనే నేను నృసింహదేవర సుబ్బారాయుడుగారివల్ల కాపీ పెట్టించుకొని దస్తూరీ కొంత బాగుచేసుకొన్నాను. ఈయన దస్తూరీ చాలామంచిది. ఈయన భార్యయున్నూ, మా తల్లిగారున్నూ పినతండ్రి పెత్తండ్రి బిడ్డలు. ఈయన అత్తవారి గ్రామం యానామే కనుక తఱుచు వస్తూండేవారు. ఆ సమయంలో నా కీ వుపకారం జరిగింది. ఈ రఘువంశం చదివే రోజుల్లోనే కుమ్మరి కామయ్య అనే మార్దంగికునివద్ద కొంచెం మద్దెలవరసలు చెప్పుకొన్నాను. సేవమోళాపాటకులున్నూ, శ్రుత పాండిత్య పౌరాణికులున్నూ అయిన ముక్కామల జోగయ్యగారివద్ద నీలపల్లెవెళ్లి స్వరాలుకూడా మొదలెట్టేనుగాని, యీ రెండున్నూ కొన్ని రోజుల్లోనే ఆగిపోయినాయి. ఈ జోగయ్యగారు తఱచుగా దేవతా కార్యాలూ, సంతర్పణలూ జరిగిస్తూ జీవితం గడపిన పుణ్యపురుషులు. యీయన్ని గుఱించి వ్రాస్తే చాలా వ్రాయాలి. ఆ రోజుల్లోనే కొంచెం కుస్తీ వగయిరాలల్లోకూడా కొంతకృషి జరిగింది. పేకాట చెప్పనే అక్కఱలేదు. వున్న స్నేహితులందఱూ ఆటలకు సంబంధించినవాళ్లే అయినా, యేనాల్గు రోజులకో కాపులపాలెం రఘువంశ పాఠానికి తప్పకుండా వెళ్లేవాణ్ణి. ఆ గురువుగారు, వెళ్లినప్పుడు పాఠం చెప్పడమేగాని, నిన్న వచ్చేవు కావేమని యెప్పుడూ అడిగేవారే కారు. వారిది నవాబుచూపు. సదాచారసంపత్తిలో ఏ విధమైన లోపమున్నూ లేదుగాని, వారికి కొంచెము మాదుం అభ్యాసం. ఆ మాదుంలో గంజాయి కొంచెం పడుతుంది. ఆ కారణంచే నవాబుచూపుగా వుండేవారు. వారువైదిక పండితుల వంటివారుకారు. ఆగర్భశ్రీమంతులు, ప్రతివత్సరమూ అయిదారు వేలరూపాయీలు ఆరోజులలో రాబడికలవారు. రాత్రి తెల్లవార్లూ విద్యా గోష్ఠితో మేలుకోవడము, అప్పుడు పరుండి పగలు పదకొండు రమారమీని మేల్కోడం. అప్పుడు దేవతార్చనబ్రాహ్మడు దేవతార్చన చేశాక వీరు స్నానాదికృత్యాలు జరిగేక సాలగ్రామతీర్థం పుచ్చుకొని భోంచేసేవారు. చదువే కాకుండా నా భోజనం కూడా చాలారోజులు వీరింట్లోనే. పంతుల వారిభార్య పంతులవారికన్నా నన్ను పుత్రప్రేమగా చూసేవారు.

ఆరోజుల్లోనే ముక్కవిల్లి జగ్గన్నదీక్షితులుగారివద్ద సంధ్యావందనపు తప్పులూ, అపస్వరాలూ దిద్దించుకొన్నాను. వీరిది గోదావరితీరం కోరుమిల్లి కాపురం. మన్యంవారి సంస్థానంలో జపతపాలకై అప్పుడప్పుడు వస్తూవుండేవారు. మన్యంవారి పురోహితులు గాదేపల్లి సుబ్బావధాన్లుగారు కాపులపాలెంలోనే వుండేవారు. కాబట్టి, వీరు వారింటిలో మకాంగా వుండేవారు. ఆ కారణంచేత ఆ వూరు వెళ్లినప్పుడు వీరి శుశ్రూష నాకు లభించేది. గాదేపల్లి సుబ్బావధాన్లుగారి కుమాళ్లు వెంకటరామయ్యగారి వద్దనూ, మర్ల జోగయ్యగారి వద్దనూ అద్దరి మురుమళ్ల కొత్తపల్లి కాపురస్తులు వుప్పులూరి రామజోగన్న సిద్ధాంతిగారి వద్దనున్నూ యేవకటి రెండు శ్లోకాలో చదివికొన్నట్టు జ్ఞాపకంగాని, యేమైననూ రఘువంశ గురుత్వం సర్వమున్నూ కానుకుర్తి భుజంగరావు పంతులవారి ప్రసాదమే. చిన్నప్పుడు పడుగులో సంధ్యావందనం చెప్పుకున్నప్పటికీ ప్రతీపూటా సరిగా వార్చుకపోవడంచేత మరచిన చోట్లున్నూ స్వరదోషాలున్నూ చాలాభాగం జగ్గన్నదీక్షితులవారి శుశ్రూష పోగొట్టింది. శేషమేమేనా వుంటే అది యిటీవల ప్రధాన గురువు బ్రహ్మయ్య శాస్త్రులవారి పాఠశాలలో శ్రీ గోరుగంతు శ్రీరామావధాన్లుగారివద్ద వేదంచెప్పుకునేటప్పుడు పోయివుండాలి. ఇంకా మిగిలితే ఇవి యిప్పటికిన్నీ మిగులే. ఈ సంధ్యావందనం విషయం నాబోట్లలెక్కేమి? పెద్ద పెద్ద వేదపండితులలో కూడా నూటికి తొంబది మందికీ చిక్కున్నదే. కారణం నోరు నలగనప్పుడు చెప్పుకోవడమే. వేదంలో యేపన్నాలో కొన్నాళ్లు సంత చెప్పుకుంటేనే గాని నోరు నలగదు.

ఈ రఘువంశం చదివేరోజుల్లోనే యింజరంలో రామడుగుల వేంకట సుబ్బరాయావధాన్లుగారి శిష్యులలోచేరి జంద్యాలవడుకుతోపాటు కొన్ని పరాయాతప్పన్నాలు సంతచెప్పుకొన్నాను. కాని జంద్యాల వడుకు మాత్రం నేర్చుకొన్నట్టయింది. కొంచెం నోరున్నూ నలిగింది. కాని ఆ పన్నాలు పూర్తికాలేదు. ఆ జంద్యాల వడుకునుగూర్చి కొంతవ్రాస్తాను. గురువుగారు సంతచెపుతూ పత్తివిడదీసి పింజెలుచేసి శిష్యులకి యిస్తూ వుంటారు. శిష్యులు చేతితోవడుకుతూ నోటితో సంత చెప్పుకుంటూ వుంటారు. అధమం వొక్కొక్క శిష్యుడు రోజు వక్కంటికి అర్ధణానూలేనా వడుకుతాడు. నెల వక్కంటికి రూపాయిజీతం యిచ్చినట్లవుతుంది. ఈలాంటి శిష్యులూ, ఆలాంటి గురువులూ మా విద్యార్థి దశనాటికింకా వుండేవారు. యిప్పుడున్నట్టు తోచదు. చదువంటే యెంతో తేలికగా అప్పుడు వుండేది. యిప్పుడు వేలకొలది కొన్నిటికీ, లక్షలకొలది కొన్నిటికీ పెట్టుబడిపెట్టి పాఠశాలలు స్థాపిస్తూ వుంటారు. విద్య అంతకన్నబాగా జరుగుతూన్నట్టు కనపడదు. దానికీ దీనికీ యెంతభేదం ఉందో చూడండి. అన్నిటిమాటా అలా వుంచుదాం. ఈ జంద్యాల వడుకు పాఠశాలలు మన గాంధీగారు చూస్తే వుబ్బితబ్బిబ్బైపోతారు. ఈ రీతిని మాకు

గురుత్వం చేసిన అవధాన్లుగారు ఆ గ్రామం పైమీద బట్టతో మాత్రం వచ్చినవారైనా ఆ వూళ్లో వుండే సంపన్నులలో వకరై యిప్పుడు పుత్రపౌత్రసంపత్తుతో తులదూగుచూ యజ్ఞయాగాదులు చేసిన కర్మిష్ఠులై చయనం చేసేకుతూహలంతో వున్నారు. రమారమీ యెనభై యేండ్ల వయస్సులో నలభై యేండ్ల వయస్సులో వున్నట్లుంటారు. వీరి పేరుగల వీరి మనుమడికే నేను చి॥ సౌ॥ మా రెండోపిల్ల నిచ్చివివాహం చేశాను. ఆ కుఱ్ఱవాడే ఆ మధ్యను షష్టిపూర్తి సభలో ఘనపనస చెప్పినవాడు. ఇప్పుడు పదకొండేండ్ల వయస్సులో నున్నాడు. ఆ అవధాన్లగారే కాదు, ఈయన పెద్దకొడుక్కూడా యజ్ఞం చేశాడు. నేనైతే కర్మిష్ఠిని కానుగాని, కర్మిష్ఠులను చూస్తే నాకు చాలా సంతోషం. అందుచేత ఇక్కడ కొన్నిపంక్తు లెక్కువగా వ్రాశాను. పశుహింసలేకుండా ఈ కర్మిష్ఠులు యజ్ఞాదికర్మలు జరిగిస్తే మఱీ సంతోషిస్తాను. కాని నా మాట వారు వినరు. ఏమన్నా అంటే, "వచనాత్ప్రవృత్తిః వచానాన్నివృత్తిః" అని చదువుతారు. దేవీభాగవతంలో ఋషులు పశుహింసలేని యజ్ఞాలే చేశామని చెప్పుకొన్నారు. వారికి పైవాక్యాలు తెలుసునో లేదో!

ప్రకృతానికి వద్దాం. ఇతరవిద్య లప్రధానంగా, కావ్యాలు ప్రధానంగా, యేలాగైతేనేమి రెండేండ్లలో మూడుసర్గలు రఘువంశం చదవడం అయింది. కాని వల్లించుకోవడానికి మాత్రం అవకాశం వుండేదికాదు. ఆ వూరినుంచి వచ్చేటప్పుడు తోవలో గురువుగారు చెప్పిన పాఠం చదువుకోవలసిందేకాని, ఇంటికి వచ్చాక తీరుబడి వుండేదికాదు. త్రోవలోకి యెదురుగుండా స్నేహితులు వచ్చేవారు. ఇక చదువెక్కడ? ఆటలే ఆటలు, మేమే మేము. రఘువంశపు చదువిలా దాటింది. అంతలో యానాం గ్రామంలో నేమి, నీలపల్లె, తాళ్లరేవు, కోరంగి మొదలైన ఆ ఉప్పుటేటి ప్రాంతం గ్రామాల్లోనేమి, సర్వసాధారణంగా వుండే బోదకాలు వగైరా వ్యాధులలో వకటయిన "వరిబీజం" అనే వ్యాధి నా భవిష్యదభివృద్ధికి సూచకమై అంకురించింది. ఏవో కొన్ని వైద్యాలు చేసినప్పటికీ గుణం కనపడిందికాదు, గ్రామంవదిలేస్తే తప్పక కుదురుతుందని తోచి యానాముకు సుమారు నాలుగైదు మైళ్లలోవున్న పిల్లంక చదువుకోవడానికి మకాంగా ఏర్పఱచుకొన్నాను. కాని, నదీపాత మయిన కారణంచేత ఆ గ్రామం పునస్సృష్టమైన కారణంచేత ఇళ్లు దూరదూరంగా పొలాల్లో వుండేవి. చిన్నతనం గనక రాత్రి ఆయాచోట్లకు వారాలకి వెళ్లలేక ఆ వూరుకూడా వదులుకోవలసి వచ్చింది.

తరువాత అల్లంరాజు సుబ్రహ్మణ్యకవిగారితో చదువుకోవడానికి మా వూరునుంచి యింట్లో చెప్పకుండా చేబ్రోలుకు బయలుదేరి వెళ్లేనుగాని, త్రోవలో కాకినాడలో చదువుకొమ్మని చెప్పి ఆయన ఆ వూళ్లో దిగబెట్టి వెళ్లిపోయారు. ఆ వూళ్లో కల్లూరి గణపతి శాస్త్రులవారు పాఠం చెపుతామన్నారుగాని, వారాలు కుదరటం తటస్థించిందికాదు. అప్పుడు

అంతకు మున్ను వకనెల్లాళ్లనాడు మా మేనత్తకూతురు వివాహానికి కాటవరం గ్రామం వెళ్లినప్పుడు ఆ గ్రామవాస్తవ్యులు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రులుగారు సుమారు నాకన్న రెండుమూడేండ్లు పెద్దవారు నిర్వ్యాజమైన ప్రేమతో, అబ్బాయి, నీవీవూరువస్తే నీకు చదువు చెపుతానని చెప్పివుండడంచేత, కాకినాడనుంచి కాటవరానికి మకాం యెత్తేశాను. మేనత్తగారి వూరవడంచేతనేమి, గురువుగారి ప్రేమాతిశయంచేతనేమి ఆవూరునాకు పొరుగూరనిపించనేలేదు. కాటవరం వెళ్లేటప్పటికి నాకు కుమారసంభవంలో మొదటిసర్గలో యేనాలుగైదు శ్లోకాలో పిల్లంక అనంతాచార్యులవారివద్ద అయినాయి. తెలుగులో స్కూల్లో చదివినది తప్ప ఇతరమేమీ రాదుగాని, జావళీలూ, భజనకీర్తనలూ, కొన్ని తరంగాలూ, కొంచెం అధ్యాత్మకీర్తనలూ, మువ్వగోపాలపదాలూ ఈ సరుకుమాత్రం కొంత విస్తరించివుండేది. ఏదో కొంచెం పదకవిత్వంకూడా కంగాబంగాగా అల్లేవాణ్ణి. ఏదో చిన్నతనంచేత చెపితే అందులో తమకు సంబంధించిన దూషణ వుందని రఘువంశం చదివేరోజుల్లోనే నామీద వకరు కేసుకూడా పెట్టేరు. విచారణకర్త, ఫ్రెంచిదొర "వీడు పోయట్ అంటే నేను వప్పుకోను," అని కేసుకొట్టేశాడు. కృష్ణమూర్తిశాస్త్రులుగారివద్ద కుమారసంభవంలో వకటి, మూడు, అయిదు సర్గలు చాలవఱకున్నూ, మేఘసందేశంలో పూర్వభాగంలో కొంతవఱకున్నూ చదవడమే కాకుండా, వారున్నూ వారి సహాధ్యాయులు మధిర సుబ్బన్నదీక్షితులు గారున్నూ, లక్షణవిషయాలు చర్చించుకొనేటప్పుడు వినడంవల్ల కొంచెం లక్షణజ్ఞానంకూడా సంపాదించుకొన్నట్టయింది. పైగా చదరంగం నడకలేకాకుండా కొంత వఱకా ఆటలోకూడా ప్రవేశం వారే కలిగించారు. అంతతో ఆవూరు చదువుకు విఘ్నంవచ్చింది.

ఆపైని కాజులూరు విద్యార్థిత్వం. ఆ వూళ్లో మేఘసందేశ పూర్వభాగంలో తరవాయి మాత్రం జరిగింది. చదరంగంలో కొంత పాండిత్యం అతిశయించింది. సులక్షణసారం స్వయంగానే చూచుకొని కవిత్వం పద్యాల్లో చెప్పడంకూడా ఆవూళ్లోనే మొదలు పెట్టాను. ఆ వూళ్లో గురువులు ముగ్గురు : రేగిళ్ల కామశాస్త్రులుగారు, పప్పు సోమయ్యగారు, పప్పు సోమనాథశాస్త్రులుగారు. వీరెవరున్నూ కవులుగారు. మొదటి గురువు భుజంగరావు పంతులుగారు గ్రంథాలేమీ వ్రాయలేదు గాని, వారు మాత్రం కవులే. తరువాత కాటవరంలో శుశ్రూషింపబడ్డ గురువులున్నూ కవులే. వారివారివద్ద నేను కవిత్వానికి సంబంధించిన కృషి చేయలేదు. ఏదో తోచినట్టు అల్లడానికి మొదలు పెట్టేనన్నదే ముఖ్యాంశం. అందుచేత లక్షణంలో యెన్నో సంశయాలు కలుగుతూవుండేవి. యెవరేనా తటస్థించినప్పుడు కనుక్కుంటూ వుండేవాణ్ణి. కాజూలూరులో ఒక విశేషం. వారాలు యెంతో గౌరవంగా యిచ్చేవారు. వున్నచోటికి వచ్చి పిల్చేవారు కూడాను.

ఈలావుండగానే కాశీ ప్రయాణం. ఆ ప్రయాణం విశాఖపట్నంతోనే సమాప్తమై వెనక్కి వచ్చి చామర్లకోటలో ప్రతివాది భయంకరం రాఘవాచార్యులుగారి సన్నిధిని చదువుకోవడం, అక్కడనుంచి మళ్లా స్వగ్రామంవచ్చి కొలదికాలం పిల్లంకకూ, పల్లెపాలెముకూ వెళుతూ చామర్లకోటలో చదివిన లఘుకౌముది తరవాయిన్నీ, భారవి తరవాయిన్నీ అనంతాచార్యులుగారి యొద్దనున్నూ, మధునాపంతుల సూరయ్యగారివద్ద నున్నూ చదవడం వగైరాలు కొంత తపిసీలుగా జాతకచర్యలో వుండడంచేత యిక్కడ విస్తరించలేదు.

ఇటీవల చాలాకాలానికి విజయనగరం మహారాజావారి దర్శనానికి వెళ్లినప్పుడు, దర్శనం చాలా ఆలస్యంగా కాని కాలేదు. వృథాగా వుండడమెందుకని అంతోయింతో ఫిడేలుమీద స్వరాలుమట్టుకు, కట్టు సూరన్నగారివద్దనూ, సాలగ్రామ గోపాలంగారివద్దనూ చెప్పుకొన్నాను. వీరుకూడ "యేకాక్షర" న్యాయంచేత గురువుగా స్మరింపవలసినవారే. లెక్కపెడితే బ్రహ్మయ్యశాస్త్రులవారి సన్నిధికి కడియెద్ద గ్రామం ప్రవేశించేటప్పటికి యెందఱు గురువులైనారో చదువరులే లెక్కపెట్టుకొంటారు. బ్రహ్మయ్య శాస్త్రులుగారివద్ద చదువుకొంటూ కాశీ వెళ్లినప్పుడు అంతోయింతో వ్యాకరణం నోరి సుబ్రహ్మణ్యశాస్త్రులవారి వద్ద పఠించాను. అందఱు గురువులకన్న విస్తరించి చదివినది శ్రీ చర్ల బ్రహ్మయశాస్త్రుల వారివద్ద మాత్రమే. చాలామందికి గురుశుశ్రూష చేసినట్లు పలుచోట్ల సూచించి వున్నాను. చూడండి -

ఉ. ఒక్కొక్కచోట నొక్కొకరియొద్ద నొకొక్కొకమాట చొప్పునన్.
(నానారాజ సందర్శనంలో శ్రీ విజయనగరము చూ.)

కారణం చెప్పలేనుగాని, నా చదువు తఱుచుగా కకారాదిగ్రామాలలో జరిగింది. కడియం, కాపులపాలెం, కాటవరం, కాజులూరు, కడియెద్ద, కాశీ, కాకినాడ, ఈ తుదిప్రదేశంలో చదవలేదుగాని చదువుకోడానికి కొంత ప్రయత్నించాను. వరిబీజం భవిష్యదభివృద్ధికి కారణమైనట్టు ఇటీవల తటస్థించిన విద్యాభివృద్ధివల్ల తెలిసికోవచ్చును. "ఒక యిక్కట్టున విద్య" అని వ్రాసిన ఆరోగ్యకామేశ్వరిలో పద్యానికంతకూ ఈలాటి కారణాలున్నాయి. మొదటిమాటకర్థం పైనుదహరించిన ఇక్కట్టే గ్రామం వదలడంవల్ల విద్య వృద్ధి అయిందనిన్నీ, వరిబీజం తగ్గినదనిన్నీ తెలుసుకోవలెను. విద్యార్థిదశలో కాదుగాని, యిటీవల బందరు స్కూలులో టీచరీ వదులుకొని వచ్చేరోజులలో జంధ్యాల గౌరీనాథశాస్త్రుల వారి వద్ద నలభైయాఱో వత్సరంలో కొంచెం సూత్రభాష్యం పఠించాను. ఆ యా గురువులలో చాలామందిని గూర్చి వ్రాస్తే చాలా వ్రాయవలసివుంటుంది. ఎవరున్నూ సామాన్యులుకారు. అందఱున్నూ చారిత్రకపురుషులే. వీరందఱిలోనూ మఱీ విలక్షణ పురుషులు

భుజంగరావుపంతులవారు. వీరెవరి వద్ద నేమిచదివిరో తెలుసుకోవాలని యెంతో కుతూహలం వుండేది. వక పర్యాయం అడిగేనుకూడా. శ్రీమద్భాగవతంలో పదకొండు శ్లోకాలు ఓగిరాల జగన్నాథంగారివద్దనో, రంగయ్యగారివద్దనో అన్వయం చెప్పుకొన్నట్టు చెప్పారు. ఆ సోదరులు నీలపల్లె కాపురస్థులు. వారు పూర్వకవుల తరగతిలో తుట్టతుదివారు. వీరివద్ద సంస్కృతం చదివిన దింతమాత్రమేయైనా పంతులవారు సాహిత్యగ్రంథాలన్నీ పాఠంచెప్పేవారు. తెలుగులో సరేసరి. కొంచెం ఇంగ్లీషు, జ్యోతిషం. యివన్నీ యీలా వుండగా వైద్యం ఇప్పుడు పంచాంగాల్లో భుజంగరాడ్వైద్యశాల అనేదానిలోవున్న భుజంగ రావుగారు వీరే. ఔషధాలు స్వబుద్ధినే కల్పనచేసి ఆ శిష్యుడు కిచ్చారు. దానివల్ల ఆ శిష్యుడు లక్షకో, కొన్నివేలకో అధికారైనాడు. అది అలా వుంచండి. ఒక భేదం మాత్రం వుండేది. అందఱిపాఠం ఒక మోస్తరు. వీరిపాఠం మరియొక మోస్తరు. దాన్నిబట్టి శిష్యులకు చిక్కుగా వుండేది. ఏమంటే! మిమ్మల్ని ఎవరేనా పరీక్షించినప్పుడు మా గురువుగారు చెప్పినట్టే ఆ పండితులకి పరీక్ష యిచ్చేవాళ్లం. దానిమీద వారు, "యిది పంతులవారి శిష్యరికంలే" అని హేళనగా అనేవారు. ఆ మాటకు మాకు యిబ్బందిగావుండేది. ఏమండీ? పండితులు యిలా అంటారని గురువు గారిని అడిగేం కూడాను, దానిమీద పంతులవారన్నారుకదా! "వారే! వాళ్లు శుద్ధ ఛాందసులు. వాళ్లకీ సుళువులు తెలియవు. విద్యార్థిని బాగుచేసే తోవలు కొన్ని వున్నాయి. ఆ మెళుకువలు తెలియక పైగా వెక్కిరిస్తారు. "సీతాపతినా రామేణ" అని వుంటే, వాళ్లు, 'రామేణ కదంభూతేన' అని ఆకాంక్షించుకొని, రాముడెటువంటివాడు అని చెప్తారు. అది తప్పుకాదుగాని, మనంచెప్పే 'యెటువంటి రామునిచేతను' అన్నదే వీలయిన మార్గం, యేమంటే, అర్థంలోకూడా విద్యార్థికి అది తృతీయావిభక్తి అని తెలుస్తుంది' అని ఇలాటి సూక్ష్మాలుచెప్పి వారిపద్ధతిని చక్కగా సమర్థించేవారు. ఈ మహాసముద్రంముందు ఆనాటి పండితులలో నెవరోగాని నిలవ బడనేలేరు. కాని అక్కడక్కడ ఆక్షేపణమాత్రం చేస్తూవుండేవారు. వీరు ఆగర్భశ్రీమంతు లవడంచేత వీరి విద్యార్థులతో తప్ప ఇతర పండితులకు యే సదస్యపు సభలలోనూ వీరితో సాక్షాత్తూ సంబంధం కలిగేదే కాదు. అందుచేత పరస్పరవాదాల కవసరం పట్టలేదు. వేయేల? మా పంతులవారు అప్పటి పండితులలో "సుల్తాను" అంటే సరిపోతుంది. "ప్రపేదిరే ప్రాక్తనజన్మ విద్యాః" అన్న కాళిదాసోక్తి కీలాటివారే ఉదాహరణం. ఆ విగ్రహం చూస్తే సమస్త విద్యారాశి అని తోచకపోదు. విద్యకు మించిన ఐశ్వర్యం. అది అనాదిసిద్ధం కూడాను. తరువాత పలువురివద్ద చదివినా, ఈ గురువుగారే నా విద్యకు పునాది. శిఖరం బ్రహ్మయ్యశాస్త్రులుగారు.

★ ★ ★

# నేనూ-మా తిరుపతి శాస్త్రుల్లూ

తిరుపతి శాస్త్రిగారు ప్రజోత్పత్తి సం. ఫాల్గునమాసంలో జన్మించాఁడు. నేను ప్రమోదూత సం. శ్రావణమాసంలో పుట్టడంచేత నాకన్న రమారమీ వత్సరంమీఁద యేడుమాసాలు చిన్న. నేను శ్రీ చర్ల బ్రహ్మయ్య శాస్త్రుల్లుగారివద్ద చదువుకోవడానికి వెళ్లేపర్యంతమున్నూ మాయిద్దఱికీ యేవిధమైన సంబంధమూ లేకపోవడమే కాక, ఒకరివూరు పేరు వేఱొకరికికూడా తెలియనే తెలియదు. శాఖకూడా ఒకటికాదు. "అడవియుసిరికాయ" పద్యం చూచుకోండి. నేను శ్రీ శాస్త్రులవారి విద్యార్థిత్వానికి ప్రవేశించిన "టయిము" సర్వధారి సం. ఆషాఢమాస మవడంచేత, అప్పటికి నావయస్సు రమారమి 19 టికి లోపు. నాకంటే సుమారు 4-5 మాసాలు ముందుగానే అతఁడు ప్రవేశించాఁడని అన్యత్ర వ్రాసేవున్నాను. ఆలోగా అతఁ డెక్కడెక్కడ శిష్యత్వం చేసిందీ, యేమేమి చదివిందీకూడా అన్యత్ర వ్రాసేవున్నాను. అతఁడు తీవ్రమైన బుద్ధిశాలి. ఆ బుద్ధి తీవ్రత అతని పురాకృత పుణ్యలబ్ధమే అయినా పితృప్రసాద మనికూడా అనుకోకతప్పదు. అతని తండ్రిగారు ఘనాంతస్వాధ్యాయపరులున్నూ, షోడశకర్మాధి కారులున్నూ అయి వుండికూడా తిరుపతిశాస్త్రికన్నా మిన్నా అని వప్పుకోఁ దగ్గంత బుద్ధిసూక్ష్మత కలవారుగా యేదేనా శ్లోకం అన్వయించవలసి వచ్చిన సందర్భంలో కనపడేవారు. ఛాందసులలో యెక్కడోగాని సాహిత్యపరులు వుండరు. వీరు ఛాందసులుగా వుండి కూడా తగుమాత్రం సాహిత్యం కలవారుగా వుండి పెద్దపెద్ద సాహితీ పరులకన్న మిన్నగా అన్వయించే శక్తి కలిగి వుండేవారు. దాన్నిబట్టి వారి బుద్ధివిశేషాన్ని నే నింతగా కొనియాడవలసి వచ్చింది. అంతేకాని తిరుపతిశాస్త్రి యందుండే అభిమానంచేత మాత్రం కాదు. యిందులోతప్ప ఛాందసులకు వుండే ఛాదస్తాలు అన్నింటిలోనూ యితరఛాందసులకు లేశమూ తీసిపోయేవారు కారు సరిగదా, అతిశయించేవారుకూడాను. మొఖం యొక్క ఆకారమున్నూ కాటుకకళ్లున్నూ, బుద్ధి చాకచక్యమున్నూ, మఱికొన్ని పట్టుదలలున్నూ తిరుపతిశాస్త్రికి పిత్రియమైనసొత్తే. "కన్యా పితృముఖీ ధన్యా ధన్యోమాతృముఖ స్సుతః" అన్నశాస్త్రం యిక్కడ తారుమాఱయింది. తగుమాత్రం కావ్యపఠనంలో తండ్రిగారే గురువులు; కొంతవఱకు స్కూలు మాస్టరుగారు. అప్పటిస్కూలు మాస్టర్లలో కొందఱు నికరమైన సాహిత్య పరులుండేవారు. మన తి.శా.గారి మాస్టరు వారిలోవొకరు. వారినియిటీవల నేను సందర్శించి వున్నాను, యితనిబుద్ధి

చాకచక్యాన్ని గూర్చి వారెచెప్పఁగా విన్నానుకూడాను. తరవాత గంకలకుఱ్ఱు వగయిరా గ్రామాలల్లో తరవాయి కావ్యాలున్నూ, తగుమాత్రం నాటకాలూ భాణాలూ చదవడం జరిగాక కొంచెం తర్కంలో ప్రవేశించి వేలెట్టి యేకొంచెమో చదివి శ్రీ బ్రహ్మయ్యశాస్త్రుల్లుగారు కాశీనుంచి దేశానికి వచ్చి విద్యార్థిపోషణార్థమై జల్లిసీమకు ప్రయాణమై రావడంలో వీరివూరు యండగండి వెళ్లడంలో వీరింటివద్దనే శాస్త్రుల్లుగారు మకాం చేశారు. ఆ గ్రామానికి యెంత మంది అతిథులు వచ్చినా వీరియింటనే అన్నప్రదానం జరిగేది. ఆ సందర్భాన్ని పట్టే మన తిరపతి శాస్త్రి "అన్న మెన్నం డేరికైన లేదనని యుత్తమురాలు తల్లి శేషమ సుసాధ్వి" అని వ్రాసి వున్నాఁడు. ఆ యిల్లాలిని నేనున్నూ బాగా యెఱుఁగుదును. మాయిద్దఱికి అనుబంధం యేర్పడ్డ తర్వాతకూడా ఆమె చాలా కాలం జీవించే వుంది. తండ్రిగారుకూడా డిటో. వారిద్దఱూకూడా నన్ను కొడుకు తిరపతిశాస్త్రికన్నా యినుమిక్కిలిగా ప్రేమించేవారు. తిరపతి శాస్త్రి సోదరులు మఱినలుగు రుండేవారు. వారుకూడా నన్ను ఒక సోదరుఁడుగానే భావించేవారు. మేనమామ లోనయిన బంధువులందఱూ వాడికంటేకూడా నన్నే మిక్కిలిగా ప్రేమించేవారు. మే మిద్దఱమూ యేదేనా విద్యావిషయంలో వాదం పెట్టుకున్నప్పుడు తి.శా. గారి తండ్రి వేంకటావధాన్లు గారు తీర్చవలసివస్తే నిష్పక్షపాతంగానే తీర్చేవారు కాని కొడుకని లేశమున్నూ పక్షపాతం చూపేవారు కారు. ఆ కాలానికీ సర్వత్రా వ్యాపకంలో వుండే శాఖాపక్షపాతంకూడా ఛాందసులైనా వారి దగ్గిఱ లేశమున్నూ నా విషయంలో వుండేది కాదు. దానికి తార్కాణం వారి తండ్రిగారి ఆబ్దికానికి వెల్నాటిశాఖీయులు పలువురు వున్నా నన్నే భోక్తగా నియంత్రణ చేసేవారు. "వారే! నీవు కాళిదాసువురా" అని నన్ను శ్లాఘిస్తూ వెనక వ్యాసులూ, కాళిదాసూ యెక్కడో బ్రాహ్మణార్థం చేసినకథ వుపన్యసిస్తూ వుండేవారు. దీన్ని యిలా వుంచుదాం.

మన కథానాయకుఁడు బ్రహ్మయ్యశాస్త్రుల్లుగారి శుశ్రూషకు ప్రవేశించడం యేలా తటస్థించిందో అంతవఱకు ప్రస్తుతాంశం వ్రాసినట్లయింది. అతఁడు ప్రవేశించిన నాల్గు లేక అయిదు మాసాలకు నేను కంటిజబ్బు కొంత కుదుర్చుకొని శాస్త్రులవారి శుశ్రూషకు ప్రవేశించాను. అప్పటికి సిద్ధాంతకౌముది శబ్దాధికారం పూర్తిఅయింది తిరుపతిశాస్త్రికి. నాకు చామర్లకోట గురువులవద్ద లఘుకౌముదిలో అంతవఱకున్నూ అయిందికాని సహాధ్యాయిత్వం కుదరడం యేలాగ? విషయం ఒకటే అయినా సిద్ధాన్తకౌముది చదివినవాఁడితో లఘుకౌముది చదివినవాఁడు సరిసమానంగానే కాదు, యేతాం పెట్టిగా కూడా తూఁగఁడు. ఆ కౌముది చదవడానికీ యీకౌముది చదవడానికీ భేదం వంటిపూఁటి తిండికీ ఆబ్దికపు బ్రాహ్మణార్థానికీ వున్నంత తేడా వుంటుంది. అందుచేత మఱికొన్నాళ్లదాఁకా మే మిద్దఱమున్నూ సతీర్థ్యులమే కాని సహాధ్యాయులం కావడం జరగలేదు. నాకు

సంస్కృతాంధ్రాలలో సంగీతధోరణిగా పురాణం చెప్పేశక్తీనిన్నీ, అంతో యింతో కవిత్వం అల్లేశక్తీనిన్నీ వుండేవి. పయిగా నేను ఫ్రెంచి టవును యానాంవాణ్ణి. పురాణంమట్టుకు సంగీతధోరణితో కాకపోయినా చెప్పేశక్తి అతనికిన్నీ వుండేది. అతఁడు శుద్ధపల్లెటూరివాఁడు. మే మిద్దఱమూ కలవడానికి యితరవిద్యార్థులకూ తిరుపతి శాస్త్రుల్లుకీ అప్పట్లో వుండే పార్టీకలహాలు ప్రతి బంధకాలుగా కూడా వుండవలసివచ్చింది. నేను అతని యెదుటిపార్టీ విద్యార్థులకు నాయకుణ్ణిగా వుండవలసి వచ్చింది. నేను వచ్చేలోపున తిరుపతిశాస్త్రి తెల్వితేటలను చూచి వోర్వలేని విద్యార్థులు అతణ్ణి సర్వవిధాలా ద్వేషిస్తూ, యెందుకూ తమతో కలియ నిచ్చే వారుకారు. వ్యాకరణంలో అయితే ఆ విద్యార్థులు తిరుపతిశాస్త్రికంటే చాలా గ్రంథం అధికంగా అయినవాళ్లేకాని వాదం వస్తే యితఁడు చదువుకున్న భాగంలోనేకాక చదువుకోని భాగంలో కూడా ప్రతిపక్షులను బుకాయించి వోడించేవాఁడు. "బూకారిగాని... ...బోలరయా మితభాషులు" అని వుందికదా! దానితో వాళ్లకు కడుపులో మంటగా వుండేది. యితనివాదం న్యాయమైనదిగా వుండడం దృశ్యాదృశ్యమే కాని యేదో అగమ్యగోచరప్పుంతగా వాదించి ఆవలివాళ్లకు వాగ్బంధం కలిగించేవాఁడు. వాదంలోనే కాదు, మావాడి నడకకూడా అలాటి మార్గంగానే వుండేది. ప్రయాణాలల్లో "అతణ్ణి ముందుతోవ తీయనీయవద్దు, ముళ్లత్రోవ తీస్తాఁ" డనేవారు గురువుగారు. శాస్త్రులుగారు కూడా తగవుదిద్దితే వకపట్టాన్ని సుఖసుఖాల సమ్మతించడం వుండేదికాదు. యిదంతా మనస్సులో పెట్టుకొనియ్యేవే.

"తోడకలార్థు లే ధూర్వహుతెల్వి కీ
ర్ష్యవహించి కలహముల్ సల్పుచుంద్రు"

అని అతని నిర్యాణానంతరం ఒకసభలో చెప్పినపద్యాలలో వ్రాసి వున్నాను. నేను ప్రవేశించిన రెండు నెలలదాఁకా మా యిద్దఱికీ అంతమైత్రిగాని, అంత వివాదంగాని లేదు. ఒక మాదిరిగా కాలక్షేపం జరుగుతూవుంది. త్వరగా త్వరగా చదివి వ్యాకరణంలో అతనితో నేను కలుసుకుందామంటే అతనిపాఠం అతఁడున్నూ త్వరగానే చదువుతాఁడుకదా? అందుచేత నే నెంత పెద్దపాఠం చదివినా ప్రయోజనం లేదు. కాని అతఁడెప్పుడూ చదివినపాఠాన్ని మళ్లా చూడడమంటూ వుండేదికాదు. (ఎవఁడెన్నఁడును పొత్తమెలమి విప్పకయె వ్యాకరణపాండిత్య ప్రకర్షమూనె) నేనో? చదువుకున్న పాఠాన్ని బాగా స్వాధీనపఱచుకొనేవాణ్ణి. యీ స్థితిలో వుండ గణపతినవరాత్రాలు వచ్చాయి. ఆ వుత్సవాన్ని చేయడానికి యాచనకంటూ బయలుదేఱి వెళ్లడం జరిగింది. అందులో శాస్త్రుల్లుగారు నన్ను నాయకుణ్ణి చేశారు. కారణం యేవో నాల్గుడబ్బులు సంపాదించడానికి అనుకూలించే

సభారంజకత్వం అప్పటికే నా దగ్గిఱ వుండడమే. వట్టి శాస్త్రంలో యెంత ప్రవేశమున్నా అది ధనార్జనకు సాధకం కాదుగదా! సరే, నలుగురం కలసి వెళ్లి లక్కవరంలో ఒకరోజు పురాణం చెప్పడానికి సభ జరిగించాం. తి. శా. గారు చదవడం, నేను రాగధోరణితో అర్థం చెప్పడం. విరాటపర్వం ఉత్తరగోగ్రహణం పురాణం జరుగుతూ వుంది. గంట గంటన్నఱ జరిగాక, యెవరో వక సభ్యుఁ డన్నాఁడు కదా "అయ్యా! మీరే చదివి కొంతసేపు మీరే అర్థం చెపితే వినాలని కొందఱు కుతూహలపడుతున్నా"రన్నాఁడు. వినీ విననట్టు మేము మామూలుగా చెప్పుకుపోతున్నాం. మళ్లా అలాగే అన్నాఁడాయన. దానిమీఁద తి. శా. పుస్తకం నాచేతికిచ్చేశాఁడు. మఱి కొంతసేపు నేనే చదివి నేనే అర్థం చెప్పడం జరిగింది. సమ్మానమున్నూ జరిగింది. కాని నామనస్సులో తి. శా. కి కష్టంగా వున్నట్టు అనుమానం వుదయించింది. దానికి తథ్యంగా ఆమర్నాడు నేను యాచనకు పనికివచ్చేలాగు చెప్పిన "శ్రీసుధాంశునిఁ బోల్పఁగా సరియౌ" అనే పద్యంలో మూఁడోచరణం, అంటే "భార్గవుండీ దనఁబరఁగు భార్గవునకుఁ గ్రోధాపవాదంబు కూడదేని" అనే చరణంలో వున్న పరశురాముణ్ణి దానవిషయంలో పోల్చడం కవి సమయవిరుద్ధ మంటూ పోట్లాట కారంభించాఁడు. చాలాసేపు పరశురాముఁడు మహాదాత నిన్నీ, రాజుల నందఱినీ వధించి భూమి యావత్తూ బ్రాహ్మలకు ధారపోశాఁడనిన్నీ నేనున్నూ వాదించాను. కాని "అయితే అయింది కాక; అంతమాత్రంచేత లాభంలేదు. పూర్వకవు లెవ్వరూ వాడలేదు కనక వొప్పేదిలే"దన్నాఁడు. తుదకి "త్వం శుంఠా త్వం శుంఠా" "ముష్టియుద్ధం పునః పునః" దాఁకా వచ్చింది. కొట్టుకోవడంకూడా జరిగినట్టే జ్ఞాపకం. మఱి యిద్దఱుకూడా వున్నారు కనక జుట్లు వదిలిపించారనుకుంటాను. యీవాదంలో "నిన్ను మట్టు పెట్టకపోతే నన్నీపేర పిలవనే వద్ద"న్నాఁడు తి. శా. నాకు అప్పటికి పూర్వరకం గిరజాలు వుండేవి. మీసం వస్తూవస్తూవుంది. సిద్ధంగా వున్న ఆస్తి గిరజాలు కనక "నేను వోడిపోతే గిరజాలు గొఱిగించుకుని అప్పుడు ఆచరణం దిద్దుతానుకాని యీలోగా దిద్దేదిలే"దన్నాను నేను. గురువుగారిదగ్గిఱికి వెడితేనే కాని యీ తగవు తీరదు. ప్రస్తుతం ప్రయాణంలోవున్నాం. ఒకరికీ వకరికీ "పచ్చగడ్డేస్తే భగ్గు" మనే స్థితిలో వుంది. "యీలాటి తప్పుడు కవిత్వం చెప్పే నీతో నేను కలిసివచ్చేది లే"దన్నాఁడు తి. శా. "నీవు రానేవ"ద్దన్నాను నేను. అప్పుడు యింకొక విద్యార్థిన్నీ, అతఁడున్నూ కలసి జంగారెడ్డిగూడెం వెళ్లారు. నేనున్నూ, మఱోవిద్యార్థిన్నీ కామవరపుకోట వెళ్లాము. తి. శా. వెళ్లినచోట ద్రవ్యార్జనకు మంచిది కాని ఆదాత ఆసమయానికి తాగి వున్నాఁడు. అందుచేత శుద్ధశూన్య మయిపోయింది. కామవరపుకోటలో దుకాణానికి డబ్బూ, రెండు డబ్బులూ ముష్టెత్తి యేస్వల్పమో గణించుకొని నియమితకాలానికి గురుసన్నిధానానికి చేరుకున్నాం. మేం తెచ్చిన ద్రవ్యం కొంచెమే అయినా

గురువుగారు సొంత ద్రవ్యంతో నవరాత్ర ప్రారంభం చేశారు. వెళ్లింది మొదలు గురువుగారి దగ్గఱ మాతగవు ప్రారంభమయింది. వారు శాస్త్రాలల్లోనే కాని యీలాటివిషయాలు ఆదరంగా చూచేవారు కారు.

అందుచేత యెవరికీ అనుకూలించేమాట చెప్పక "యిందులో యేముంది? పోనిస్తురూ. స్నేహంగా వుండి చదువుకోండి, బాగుపడండి" అంటూ సబోరీమాటలు చెప్పేవారు. అందుచేత తగవు తగవులాగే వుండిపోయింది. (కాని పరశురాముణ్ణి దాతృత్వానికి వుపమగా తీసుకోవడం కవిసమయసిద్ధమే. చెప్పడం మొదలెడితే ప్రయోగాలు బోలెడున్నాయి) మళ్లా మాట్లాడుకుంటూనే వుండేవాళ్లం. యితరులతో వాదాలు మా కిటీవల తటస్థిస్తూవచ్చాయి. కాని మొట్టమొదటినుంచీ మాలో మాకే వాదాలు యెప్పుడూ పడుతూవుండేవి. అప్పుడు విరోధంవచ్చి శంకించాఁడుగాని స్నేహంగా వుండి గ్రంథరచనచేసే రోజుల్లో కూడా అడ్డదిడ్డశంకలు చేయడం తి. శా. కి అలవాటు. "కాదన్నవాఁడు కరణం" అన్నట్లు శంకించడమే అతనిపని. దీన్నిగుఱించి వ్రాస్తే యెన్నో వ్రాయాలి. మే మిద్దఱమూ కలసి, క్షీరనీరన్యాయంగా రచన సాగిస్తూ వున్న రోజుల్లో జరిగిన వక సందర్భంమాత్రం వుదాహరిస్తాను. ఆత్మకూరు సంస్థాన గజారోహణోత్సవానికి హేతుభూతమైన శ్రీనివాసవిలాసాన్ని ఆంధ్రీకరించడాన్ని గూర్చి చాలా సంగతులు నానారాజ సందర్శనంలో చదివే వుంటారు చదువరులు. అక్కడ పండితులతో మొట్టమొదట విద్యావివాదం జరిగిన పిమ్మట ఆ రాజుగారు మా శక్తి తెలుసుకొనే తలఁపుతో ఆంధ్రీకరణానికి గ్రంథం యిచ్చి ఆరు మాసాలు మాత్రమే గడువు యిచ్చారు. మంచిదని వొప్పుకొని దేశానికి వచ్చేశాము. "యీ భాగం నీవంతు, యీ భాగం నావంతు" అని గ్రంథాన్ని ఆంధ్రీకరణ విషయంలో తోవలోనే విభజించుకొని యెవరిగ్రామానికి వాళ్లం ప్రవేశించాము. యిఁక 15 రోజులలో కృతి యివ్వడానికి ప్రయాణ మనఁగా యిద్దఱమున్నూ కలుసుకొని, పిఠాపురంలో శ్రీవాడ్రేవు వేంకటరత్నంగారికి అతిథులుగా వుండి ఆదరించఁబడుతూ వారి పెరట్లో వున్న దివాన్ బంగాళామీఁద కూర్చుని సాపువ్రాఁత కుపక్రమించాము. యెప్పుడూ నేను స్వహస్తంతో వ్రాసుకోవడమే గాని యెవరిచేతా వ్రాయించడం అలవాటులేదు. యీ రోజు వణకున్నూ వోపిక లేకపోయినా, చేయి వణుకుతూ వున్నా ఆలాగే జరుగుతూ వుంది. అతని దస్తూరీకూడా వీలైనదే అయినా శ్రద్ధగా వ్రాయఁడనే కారణంచేత అతఁడు చెపుతూవుంటే నేను వ్రాయడమే జరుగుతూ వుంది. యేవో శంకలు చేస్తూవుంటే, సమాధానం చెపుతూ వ్రాస్తూవున్నాను. ఒక్కొక్కశంక మఱీ తలతిక్కగా వుండేది. వున్నాసరే వోపికపట్టి సమాధానం చెపుతూ వ్రాస్తూవున్నాను. రాజుగారి వంశ వర్ణనదాఁకా గ్రంథం సాపువ్రాయడం జరిగింది. ఆరంభంలో వక పద్యంలో

"సచ్ఛూద్ర" పదందగ్గిఱ "సచ్ఛూద్రా గోపనాపితా" "యోగాద్రూఢిర్బలీయసీ" అని వుండడంచేత గొల్లలో, క్షౌరకులో అర్థం కావలసివస్తుంది కాబట్టి దిద్దాలన్నాఁడు. "నీశంక యుక్తమే కాని భారతంలో ఉత్తమశూద్రులు అనే అర్థంలో వాడివున్నారని సమాధానం చెపితే కూడా తృప్తిపడక పిడివాదానికి ప్రారంభించేటప్పటికి గత్యంతరం కనపడక సాపుఁవ్రాసే కాగితాలున్నూ, చిత్తుప్రతిన్నీ ఆంధ్రీకరణానికి రాజుగారు యిచ్చిన మాతృకసంస్కృతమున్నూ రెండేసి తునకలుగా చింపి ఆ మేడకింద వున్న తూముకాల్వలోకి విసిరేసి "యిక మనం ఆ రాజు గారిదగ్గిఱికి వెళ్లావద్దు, కృతి యివ్వావ"ద్దని అక్కడినుంచి లేచి యివతలికి వస్తూవుండఁగా, నవ్వడానికి మొదలెట్టి, సరే! నీకు మళ్లా చేతి నిండా పని కల్పించడానికే నే నిలా చేస్తూవుంటాను. తెలిసిందా? యింకో మాటు వ్రాస్తే దస్తూరీ మఱీ బాగుంటుంది" అంటూ ఆ తునకలన్నీ పైకి తీసి "మళ్లా చెపుతాను. రాఁతకు మొదలెట్ట" మన్నాఁడు. యిఁక నువ్వు వ్రాయవలసిందే నేను వ్రాసేది లేదన్నాను. "ఓ, యింతకంటే వుందా? నాకేం చేతకాదా? అలాగే వ్రాస్తా"నన్నాఁడు. "వ్రాస్తే సంతోషమే. తప్పులుపడితే తప్పు 1కి యింత అని యేర్పాటుచేసి మఱీ మొదలెట్టా"లన్నాను. "అది నావల్లకాదు, ఆ పద్ధతిని మళ్లా నీవు వ్రాసుకోవలసిందే" అన్నాఁడు. యీలాగే మాలో మేము కిందా, మీఁదా పడుతూ ఆయాగ్రంథాలు రచించడమూ, చించడమూ జరిగేది. యిద్దఱమ్మాత్రం వున్నప్పుడే యీ తలతిక్క వాదాలుగాని యితరులతో వాదం వచ్చినప్పుడు సాధ్యమయినంతవఱకు నామీఁదే వదిలేశేవాఁడు. తనవాదం ప్రామాణికవాదం కాదని అతనికి పూర్తిగా తెలిసే, పనిపడ్డప్పుడు నామీఁదే భారం వుంచేవాఁడు. ఆయాలక్ష్యాలు కష్టపడి వెదకడం అతనికి పట్టేదికాదు. వోపిక లేకకాదు గాని యెందుచేతో ఆపని పెట్టుకొనేవాఁడు కాఁడు. ప్రయాణాలల్లో వున్నప్పుడు యెవరేనా వచ్చి, యేదేనా లక్ష్యాన్ని గుఱించో, లక్షణాన్ని గుఱించో అడగడానికి వస్తే వారికి నన్నుచూపించే వాఁడు గాని లేశమున్నూ అందులో కలగచేసుకునేవాఁడే కాఁడు. ఆమరణాంతమూ యీ విషయం యిట్లాగే జరిగింది. యెప్పుడు గాని ఖండన మండనాలను గుఱించి యేపత్రికకూ మేటరు పంపేవాఁడే కాఁడు. వొక పర్యాయం కాఁబోలును ఆర్యమతబోధినికి వకరి కవిత్వాన్ని వెక్కిరిస్తూ వ్యాసం వ్రాసి పంపి, ఫయినల్ ప్రూఫు మాత్రం బందరులో వున్న నాపేర కాకినాడ నుంచి పంపడం జరిగింది. అది చాలా అందంగానూ, యుక్తియుక్తంగానూ వుందికాని ఖండిస్తే నిలిచేస్థితిలో లేదు. ఆ సంగతి తెలుపుతూ దాన్ని ప్రచురించవద్దని వ్రాశాను. దానితో ఆమేటరు పత్రికలో ప్రచురించలేదు. ఆ ప్రూఫుకాగితాలింకా నావద్ద వెదికితే దొరుకుతాయేమో? ఆయీకారణాలచేతనే అతఁడు సాహసుఁడనిన్నీ, శ్రద్ధ తక్కువ వాఁడనిన్నీ నేను అన్యత్ర వ్రాశాను.

శ్లో. ఆస్థా స్వాస్థ్యే యదిస్యాతాం । మేధయా కిం ప్రయోజనమ్
తే ఉభేయది నస్యాతాం । మేధయా కిం ప్రయోజనమ్.

పూర్వజన్మసుకృత బలిమిచేతనే పుస్తకం విప్పి పాఠం వల్లించకుండానే వ్యాకరణపాండిత్యాన్ని ఆర్జించాడు.

"ఎవఁడెన్నఁడును బొత్తమెలమి విప్పకయె వ్యా
కరణపాండిత్యప్రకర్షమూనె."

అని సానుభూతిసభలో నేను వ్రాసినదాన్ని యిదివఱకే వుదాహరించి వున్నాను. గురువుగారు చెపుతూవుంటే వినేవాఁడు. అదేనా ఒకప్పుడు ఆయనక్కూడా గంగవెఱ్ఱులెత్తించే శంకలుచేసి వేధించేవాఁడు. ఆలాటప్పుడు గురువుగారికి కోపమైతే వచ్చేదిగాని, అంతరంగంలో సంతోషంకూడా కలిగేది. యెందుచేత? కొన్ని శంకలు పిచ్చిశంకల్లా వున్నా కొన్ని శంకలు యేభాష్యంలోనో, యేశేఖరంలోనో వున్నవిగా వుండేవి. (యీ విషయంలో యితఁడు బందరు "దుందుం" వంటి వాఁడు. ఆయనను గూర్చి అన్యత్ర వ్రాశాను) అప్పటికి ఆ గ్రంథాలు చదవకుండా వున్న వాఁడినోట ఆలాటివిశేషాలు వెలువడుతూవుంటే యే గురువునకు సంతోషం కలగదు? యీలాటిశిష్యులను గూర్చే "గురూపదేశం ప్రతిభేవ తీక్ష్ణా" అని నైషధంలో వ్రాసివున్నాఁడు. తీవ్రమైనబుద్ధి గురువు చెప్పేదాఁకా నిరీక్షించలేదని దానితాత్పర్యం. ఆ లక్షణం మన తి. శా. గారి బుద్ధికి పూర్తిగా పట్టింది. కాని అట్టి గ్రహింపుతోపాటు కొంచెం మననం చేయడంకూడా వుంటే యింకా యెక్కువ వుపయోగపడేది. అది లేక పోవడంచేత యెప్పటికప్పుడు దాఁటుకునే మార్గాలు త్రొక్కి ప్రతిపక్షులకు లొంగకపోవడమే తటస్థించేది గాని దాన్ని గ్రంథరూపంగా ప్రచురింపవలసివస్తే చిక్కురాక తప్పేదికాదు. యీ విషయం అతనికి పూర్తిగా తెలుసును. తెలిస్తేమాత్రం యేంచేస్తాడు? మొదటినుంచీ అలవాటు ఆలా పడింది.

యిది విద్యావిషయంలో మాత్రమేకాదు. శరీరారోగ్యవిషయం కూడా యీలాగే వుండేది. తుట్టతుదిరోజుల్లో అతిమూత్రవ్యాధి కనపడిందని నాపేర వుత్తరం వ్రాస్తే నూజవీటిసంస్థానాన్నించి నానిమిత్తం తెచ్చి వుంచుకున్న మంచి మందును పంపించాను. కొన్నాళ్లువాడి, వ్యాధి నివారణయిందని సంతోషిస్తూ జవాబు వ్రాశాఁడు. దానికి జవాబు వ్రాస్తూ వ్రాశానుకదా - అయితే అయిందిగాని యింకమీఁదట కాఫీ అలవాటు పూర్తిగా తగ్గించవలసిందని కఠినంగా వ్రాశాను. అంగీకారం తెలుపుతూ జవాబు వ్రాశాఁడు. మళ్లా అన్నవరం కొండమీఁద సత్యనారాయణ స్వామివారి వుత్సవసందర్భంలో కలుసుకున్నాం. అక్కడ ధర్మకర్తగారు వగయిరాలు కాఫీ పుచ్చుకుంటూ వుంటే వీఁడుకూడా

సిద్ధపడ్డాఁడు. అప్పుడు నే నన్నానుగదా – "తొందరగా నిష్కారణంగా యెందుకు చస్తావురా? మళ్లా కాఫీ మొదలెట్టి" అన్నాను. దానికి వాఁడిమనస్సు చివుక్కుమంది. దానిమీఁద కాఫీపుచ్చుకొనేదైతే మానలేదుగాని 'వొరేయి! నీనోరు విషపునోరు. నువ్వల్లా అనకురా!' అని మాత్రం అన్నాఁడు. వాఁడికి నావాక్కునందు 'తథాస్తుదేవత' లుంటారనే నమ్మకం పూర్తిగా వుండేది. పైకి 'యేమిరా' అనే పిల్చేవాఁడే అయినా వుత్తరాలల్లో "గారూ, నమస్కారాలూ" పెట్టేవాఁడు. నే నెప్పుడో వొకప్పుడు అతనికి కూడా "గారూ, నమస్కారాలూ" పెట్టి వ్రాస్తే యెంతో నొచ్చుకుని "యిఁక యెన్నఁడూ యిట్టి అకార్యాన్ని చేయవ"ద్దని వినయపూర్వకంగానే మందలించాఁడు. నావాక్కునుగూర్చి వాఁడనుమాన పడ్డట్టే సత్యనారాయణ కొండమీఁద పూర్వోక్తమైన ఆ ప్రసంగం జరిగిన ఆఱుమాసాలకు అతఁడు స్వర్గతుఁడైనాఁడు. సకాలమందు వ్రాసిన జాతకం లేకపోవడంచేత అతని స్వర్గతికాలం గుఱితించడానికి వీలిచ్చిందికాదు. యిటీవల 20 వత్సరాల ప్రాయంలో తల్లిదండ్రులను కనుక్కుంటే జననకాలాన్ని వొక రొకలాగా, మఱొకరు మఱోలాగా చెప్పడం తటస్థించింది. దాన్నిబట్టి వేస్తే యేం రుజువిస్తుంది? ఆ జాతకాన్నిబట్టే అయితే యిప్పటిదాఁకానే కాదు. యింకా కొంత కాలందాఁకా అతఁడు సజీవుఁడై వుండి కొడుకుల సంపాదన తినవలసినవాఁడని అనుకొనేవాణ్ణి. అతడు *కుంభలగ్న జాతకుడు, పంచమాధిపతి అయిన శుక్రుఁడు అంటే సంతానస్థానాధిపతి మీనమందు ఉచ్ఛపట్టి వున్నాఁడు. యీ శుక్రదశ రాకుండానే, మధ్య కేతుదశ ప్రారంభించిందో లేదో అనుకునే కాలంలో మారకం జరిగింది. అవసానానికి కొంచెం ముందుగా నాపేర వ్రాసిన ఉత్తరంలో "కేతుదశ ప్రవేశించినట్టున్నది" అని వ్రాసేవున్నాడు. ఆ వుత్తరం అతని జీవితచరిత్రలో వుదాహరించి వున్నాను. ఆ కేతుదశ యేడేళ్లు జరిగాక, శుక్రదశ 20 సంవత్సరాల్లో అధమం పద్దెనిమిది యేళ్లదాఁకానున్నూ, వెరశి 25 యేళ్లు అతఁడు వుంటాఁడనిన్నీ, నేను 60 వత్సరాల ప్రాంతంలోనే అస్తమిస్తాననిన్నీ, అందుచేత నాకన్న అతని ఆయుర్దాయం హెచ్చనిన్నీ అనుకొనే వాణ్ణి. కాని 49 వత్సరాలు దాఁటకుండానే అతఁడు స్వర్గతుఁడైనాడు. నాకంటే కూడా అతఁడు చాలాకాలం సన్నంగానే వుండేవాఁడు. కాని ఆత్మకూరు సంస్థానానికి కృతి యివ్వడానికి

---

* ఆయా సంపుటంలోని "అతడు కుంభలగ్న జాతకుడు. పంచమాధిపతి అయిన శుక్రుడు అంటే సంతానస్థానాధిపతి మీనమందు ఉచ్ఛపట్టి ఉన్నాడు" అనే వాక్యాలు వ్యాసరచయిత పరిశీలనలోని ప్రమాదపతితాలే కాని వేరుకావు. కుంభలగ్నమునకు పంచమ (సంతాన) స్థానాధిపతి బుధుడేకాని శుక్రుడుకాడు. మీనం బుధునకు ఉచ్ఛరాశికాదు. ఈ జాతకం ఇప్పుడు లభ్యపడనందున ఈ ప్రచురణలోనే ఆవిషయం సవరింప వీలుచిక్కినదికాదు. ఈ విషయం భోగట్టాచేసి పునర్ముద్రణలో సవరింతును– దుర్గేశ్వరశాస్త్రి.

వెళ్లిన సందర్భంలో మే మందఱమూ సర్వసేనా మూర్ఛగా జ్వరపడడం తటస్థించి దానితో సుమారు రెండేళ్లు తీసుకు తీసుకు తేఱుకున్నపిమ్మట నేను యథాపూర్వకంగానే వున్నానుగాని, అతఁడుమాత్రం కొంచెం స్థూలకాయుఁడైనాఁడు. యెప్పుడూకూడా దేహారోగ్యానికంటూ యే మందులో మింగుతూ వుండడం నాకు అలవాటు కాని, అతఁడికి లేశమూ ఆలాటి అలవాటులేదు. పైఁగా నన్ను "అస్తమానమూ ఏపాడుమందులో మింగడమే నీపని" అని తిడుతూ వుండేవాఁడు కూడాను. యెప్పుడో స్వల్పంగా లంఖణాలు చేసినా అది వక లెక్కలోనిదికాదు. జబ్బు అంటూ యెఱక్కుండానే యావత్తుజీవితాన్ని గడిపాఁడు. యింక జాముకో, అఱజాముకో జీవితం చాలిస్తాఁడనఁగా, కొడుకుచేత వ్రాయించిన పద్యత్రయంలో యీ సందర్భం అతఁడే చెప్పి వున్నాఁడు.

"మ. జననంబెత్తిన దాదిగా నెఱుఁగ నే జాడ్యంబు."

అనే పద్యం జీవితచరిత్రలో వుదాహరించి వున్నాను. మరణకాలం నాఁటికి అతని వయస్సు 50కి లోపే గాని అతఁడు తుట్టతుదకు చెప్పినట్టు "పంచాశాబ్దమేగంగ" అన్నది కాదనికూడా వ్రాసివున్నాను. ఇతఁడు తన వయఃపరిమాణాన్ని గూర్చికూడా యిదమిత్థమని నిర్ణయించే శ్రద్ధకలవాఁడు కాఁడని, జీవితకాలంలో జాతకం వుండికూడా పరిశీలించ లేదనిన్నీ, యిటీవల అన్యులు ఆ నిర్ణయం చేయవలసివచ్చిందనిన్నీ విస్పష్టమేకదా! ఆ కారణంచేతనే యితఁడి విద్యావిశేషం సమస్తమున్నూ ప్రతిభాయుక్తమే కాని "ఆస్థాస్వాస్థ్య" ప్రయుక్తం కాదని నేను వ్రాయవలసివచ్చింది. "ఆస్థాస్వాస్థ్యము" లకు బొత్తిగా దాసుఁడుగాక లోకంలో నెవ్వనికిని లక్ష్యపెట్టనంతటి విద్యావిశేషం కలవాఁడు కావడానికి యెట్టి ప్రతిభ అంటే, "నవనవోన్మేషశాలిని" గా వుండే ప్రజ్ఞ అవసరమో చదువరులు గమనింతురుగాక.

నావలె యే రహస్యంగాని యితరులతో చెప్పే స్వభావం అతడిది కాదు. చాలా గుట్టుగా వుండేది అతని నడవడి. వొకవేళ యితరులవల్ల తెలిసి నేను అడిగినాకూడా "శనగలు తింటూ ఆముదాలు చేతులో పెట్టడానికే" శక్యమైనంతవరకు ప్రయత్నించేవాఁడు. అవధానాదులలో కొన్ని విషయాలు కొత్తరకాలు ప్రవేశపెట్టాలని అతనికి వుత్సాహం వుండేది. వాట్లకు నేను వొప్పుకునేవాణ్ణి కాను. యెందుచేతనంటే – ఆ విషయాలు గారడీబాపతులో చేరతాయి గాని కేవలం ప్రతిభైకస్ఫోరకాలు కావు. సార్వత్రికంగా కాకపోయినా క్వాచిత్కంగానేనా ఆ విషయాలు యితరులున్నూ చేసే కిటుకులు, మనం అవధానంలో ప్రవేశపెడితే ఆ కిటుకు కాస్తా బయటఁ బడ్డప్పుడు మన అవధానమంతా యీలాటిదే అనే అపప్రథకు అది కారణం కావలసివస్తుందని నాకుభయం. అతఁడు అప్పటికప్పుడు దాఁటుకుపోవడమే చూచేవాఁడు కాని, భవిష్యత్తునుగూర్చి విచారించేవాఁడే కాఁడు.

మా యిద్దఱికీ యీ విషయంలో చాలా ప్రభేదం. దీన్ని పలువురు యెఱిఁగే వుంటారు. అతఁడు నిరామయుఁడు గానే యావజ్జీవితమున్నూ గడిపినట్లువ్రాసి వున్నాను. కాని, ఆతనికి తలనొప్పివకటిన్నీ, వికారం ఒకటిన్నీ ఆశ్రయించుకు వుండేవి. అవి పొంటెద్దు బండిగాని, గుఱ్ఱపుజట్కాగాని యెక్కినప్పుడు తప్ప కనబడేవి కావు. యీ రెండిట్లో యేది యెక్కియేమాత్రం ప్రయాణంచేయవలసి వచ్చినా దిగేపర్యంతమూ అవి తోలేవాళ్లతో పోట్లాట తప్పేది కాదు. ఇంతకు తప్ప అతఁడు వ్రాసినట్టు యే జబ్బున్నూ అతఁడెఱుఁగనే యెఱుఁగఁడు. అతనిపేరు చెపితే జబ్బులు జంకుతాయనేవాఁడు. ఆమాట నిజమే. చిడుమూ, మొలగజ్జీమాత్రం విద్యార్థిదశలో అతణ్ణి సర్వదా ఆశ్రయించి వుండేవికాని, వీట్లనుగురించి లేశమున్నూ అతఁడు శ్రద్ధపుచ్చుకునేవాఁడే కాఁడు. శాస్త్రుల్లుగారే యెప్పుడేనా "యేమిటయ్యా! యేదో మందు రాసుకోరాదా?" అని కూకలేసేవారు. ఆత్మకూరి చలిజ్వరంమాత్రం తప్పించుకోవడానికి వీలులేనిది కనక, అందఱితోపాటు అతఁడుకూడా అనుభవించాఁడు! ఇంతకు తప్ప యే వ్యాధిన్నీ యెఱుఁగని జీవితమంటే అతనిదే. యేదో మాదిరి వంట అతనికి నచ్చేదికాదు. తగినంత పాకనైపుణ్యం వున్నవాళ్ల పాకంగాని కవిత్వంలాగే ఆతనికి సొక్కేదికాదు. అయితే పని పడితే "నలపాక భీమపాకా" లన్నట్టు ఆతఁడు తయారుచేసే నేర్పుకలవాఁడు. ఎక్కడేనా వండుకోవలసిన కర్మం తటస్థిస్తే నేను పైవనిన్నీ, అతఁడు ప్రధానకార్యమున్నూ నెఱవేర్చేవాళ్లం. యెప్పుడోగాని మా ప్రయాణాలలో యీఅవస్థ తటస్థించేదే కాదు. అతనికి లేని ప్రజ్ఞలలో అంతో యింతో కూనిరాగం తీయడం నాకున్నూ, నాకు లేని ప్రజ్ఞలలో పాకశాసనత్వం అతనికిన్నీ వుండేవని చదువరులు గమనించాలి. అయితే అతనికి యిటీవల సంగీత విషయంలో రాగాలు గుఱితించేశక్తి కొంత వుండేది. రేఁగుప్తిమీఁదా, శుద్ధసావేరిమీఁదా పద్యం చదివేశక్తిన్నీ వుండేది. కల్యాణి, కేదారగౌళ వగయిరా రాగాలమీఁద కూడా పద్యాల్ని చదివేవాఁడు. ధాటీగా పద్యం చదివేవాఁడుకాని, యేమైనా వంశపరంపరగా వేదం వచ్చిన కుటుంబ మవడంచేతనో యేమో, గానవిషయం యేకొంచెమో పద్యం చదవడానికి మించి అలవడిందికాదు. కవిత్వం యేలాటి సహజవిద్యగా చెపుతారో గానంకూడా ఆలాటిదే. కాని, 18 సంవత్సరాలదాఁకా కవిత్వమంటే యెఱుఁగని అతనికి వొకటేమాటుగా "కుండజల" లాగ ఆ మహాధార బయలుదేరింది. దాన్ని గూర్చి కాళీసహస్రంలో వకశ్లోకంలో అతఁడే వివరించివున్నాఁడు.

శ్లో. "సాహిత్యాం గురుపాణినీయజనితా పౌరాణ సంవర్ధితా,
దేశాలోకన పుష్పితాచ కవితా కన్యా మయి ప్రత్యయాత్,
వవ్రే మాం స్వయమేవ."

ఈ శ్లోకంలో వున్న "పుష్పితా" అనే విశేషణం తి. శా. గారి కిన్నీ, కవితాకన్యకకున్నూ జరిగిన వివాహం శారదాబిల్లు రాఁబోతూవుంది కనక, భవిష్యత్తులో, ఆ భయం మనస్సులో పెట్టుకుని చేసుకున్నదే గాని, నాలాగ బాల్యవివాహం చేసుకున్నట్టు లేదని విస్పష్టమే. పైఁగా "స్వయమేవ వవ్రే" అనడంచేత కన్యకకు 14 యేండ్లు నిండడం మాత్రమే కాదు, యింకా కొసరు నాలుగేండ్లు కలుపుకోవలసి వుంటుందనికూడా ధ్వనిత మవుతూ వుంది. ఈ విషయం అతఁడు పలుచోట్ల సూచించి వున్నాఁడు.

(1) "గోచిపెట్టకమున్న కోమలకవితచె
ప్పినవాఁడు సహపాఠి వేంకటకవి."

(2) "గోణము వెట్టుటాది బుధకోటి నుతింపఁ గవిత్వవైదుషీ
వేణిక యౌచుఁ బేర్పడిన వెంకటశాస్త్రికి."

ఆయా తి. శా. గారి వాక్యాలవల్ల మా మా కవితావివాహాల స్వరూపం స్పష్టమే కనక విస్తరించను. అయితే యిటీవల యింత లోకోత్తరమైన కవి కావలసినవాఁడు సుమారు 18 యేళ్ల పర్యంతమున్నూ, యేమాత్రమూ రచనే యెఱుక్కుండా యెలా వున్నాఁడన్నది విచార్యంకాకపోదు. దీనికి జవాబు చెప్పడం కష్టం. ఒక్కొక్క గ్రహదశ వచ్చేటప్పటికి వొక్కొక్క యోగం బయటికి రావడానికి జాతకశాస్త్రం అంగీకరిస్తుంది. యిప్పుడు హస్తసాముద్రికం కూడా యోగాయోగాలకు సంబంధించిన కొన్ని రేఖలు పడుతూ నశిస్తూ వుండడాన్ని చెపుతూవుంటారు. తద్రీత్యా సమన్వయించుకోవలసిందే కాని గత్యంతరంలేదు. అంతకు మునుపే కవిత్వం చెపుతూవున్న నా సహవాసం కారణం అని స్థూలదృష్టు లనుకోవచ్చును. కాని యితనితోపాటుగా మాగురువుగారి వద్ద యెందఱు విద్యార్థులు లేరు? వారి కెవరికీ నా సహవాసం కవిత్వప్రాప్తిని కలిగించక యితనికే కలిగించడమేమీ అనే ప్రశ్నకు సమాధానం లేదు. కాఁబట్టి అది అతని పూర్వజన్మసంస్కార విశేషమేకాని, మఱొకటి కాదని విశేషజ్ఞులు నిర్ణయిస్తారు.

(1) "రెండుభాషలలోఁ దత్కృపం గవియయ్యె"

(2) "మావెంకటశాస్త్రి నేఁ బొగడెదన్ శిష్యస్వరూపమ్మునన్"

(3) "కవితాసద్గురు వేంకటాభిధుని వక్కాణింతు నెక్కాలమున్."

(4) "ఆకవిరాజశిష్య పరమాణువు డీకొన మారుమూలలన్, డేఁకిన పాఱుఁబోతఁట?"

(5) "వేంకటేశకవిదేశికు సన్నుతిసేతు నిచ్చలున్." లోనైన తి. శా. గారి వాక్యాలు ప్రతి విషయానికీ అంతఃకారణం దైవమే అయినా బాహ్యకారణాన్ని కూడా చూపవలసి వుంటుంది కనక ఆలా చూపి వున్నాఁడేకాని అన్యంకాదు. సంతానానికి బాహ్యకారణం స్త్రీపురుష సమాగమమే కాని అంతఃకారణం దైవమే. అతఁడు నమస్కరించి వుత్తరంవ్రాస్తే నేనుకూడా నమస్కరించి వ్రాయడానికి అతఁడు అంగీకరించకపోవడమే కాకుండా "చిరంజీవి" పదంతో వ్రాయవలసిందనడం కూడా పైకారణానికి అంటఁగట్టవలసిందే. వొకవేళ యేలక్షణపద్యాలో యెవరివద్దో యెవరో యేకొన్నో అభ్యసిస్తే మాత్రం యిటీవల వారికన్నా మిన్నాశక్తికలవారై వున్నప్పుడు లోకం వారిలో యెవరి కెంత గౌరవం యివ్వాలో అంతా యిచ్చి తీరుతారు. కాని నామకః జరిగిన ఆస్వల్పగురు శుశ్రూషను పురస్కరించుకొని యితరాన్ని అధఃకరించడం తటస్థింపదు. ఆలాటి సందర్భాలల్లోనే.

"గురువు శిష్యుఁడయ్యె శిష్యుఁడు గురువయ్యె"

అనుకోవలసి వస్తుంది. ద్రోణాచార్యులవారివద్ద శుశ్రూష చేయడం విస్తారమే అనుకుందాం. అర్జునుఁడు కృపాచార్లవారివద్దనో? యే కొంచెమోతప్ప శుశ్రూషచేసింది లేదుకదా! ఆకృపాచార్లవారికంటే అర్జునుఁడు తక్కువవాఁడని యెవరేని అనుకోఁగలరా? యీలాటి వుదాహరణాలు నేను చూపనక్కఱలేదు; చదువరులే చూపుకోఁగలరు. మాలో వుండే తారతమ్యాన్ని నిర్ణయించుకోవడానికి యీవ్రాసిన విషయం అకించిత్కరం. యింకేవేనా వుంటే అవి యథార్థదూరాలు కాకపోతే పనికివస్తాయి.

ఆ విషయంలో యీ వ్యాసానికి కారకులైన యేకలవ్యశిష్యుఁడు గారు వ్రాసిన వుత్తరంలో కొన్ని మాటలు మిక్కిలి ఆదరించవలసి వుంటాయి.

సంస్కృతసమాసాలువున్న కవిత్వం తి. శా. గారిదనిన్నీ, తెలుఁగు జిలుఁగుపదాలు వెం. శా. గారిదనిన్నీ అనుకొనేవారు చాలా అమాయకులు. అలా వ్రాసేవారి వ్రాఁతలు ఆదరించే యెడల తి. శా. గారికి చాలా అన్యాయం జరుగుతుంది. చూడండి!

ఉ. "దగ్గఱ లేరు మామయును దండ్రియు, ద్రోణునితోడిపోరు కాఁ
దగ్గది, భార్య గర్భవతి, తల్లి సుభద్ర త్వదేకపుత్ర, నీ
పగ్గె నిరంకుశంబు, పసిపాపవు, పాపులు వారు మేనికిన్
గగ్గురుపాటు పుట్టెఁ గొడుకా! నిను యుద్ధభరంబు పూన్పఁగన్"

చ. "పెనుగదఁ బూని మొత్తములు పిప్పియొనర్చుట తప్పు నెన్నడుం
బనిఁగొని యిట్టివ్యూహములు పన్నుట విప్పుట నే నెఱుంగ నీ
వనిమొన వాఁడిసూఁదిమొన యంత గదల్చితివేని చొచ్చి య
మ్మొన గలగుండు వెట్టి పడమొత్తెద మత్తగజంబుచాడ్పునన్."

చ. "ఒరులకుఁ జేతఁకాదు, చనె నొండెడ కర్ణునుఁ డంచుఁ జిత్తమం
దరసి గురుండు పన్నిన మహాకపటం బిది మొగ్గరమ్ములోఁ
జొరుటకు దారిచూపి మము శూరులఁ జేయఁగదయ్య నేటిసం
గరమునఁ గుంతిభోజసుత కంటెను గోడలు వీరమాతగన్."

యెన్నని వుదాహరించేది? ఈలాటి బంగారమంతా నాకింద జమకట్టి యేవో నాతాలూకు పాషాణాలు "శాంతింపుడని రాయబారమౌరా" అనేవి అతనికి అంటఁగట్టి గౌరవాన్ని సంపాదించడానికి యత్నించేవారు నిజమైన విమర్శకులు గారు. సమాసభూయిష్ఠమైన రచన అతనిది బోలెఁడు వుంది. దాన్ని లోకాభిరామాయణంలో "అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు" అనే పదంతో వుంటుంది చూచుకోండి. అందులో యేకొంచెమో నాదిగాని చాలాభాగం అతనిదే. అదీ రచిస్తాఁడు, యిదీ రచిస్తాఁడు. ఆయాఘట్టాలకు అనుగుణంగా ఆయాధార నడుస్తుంది కాని అతనికి యెక్కువప్రీతి తెలుఁగు పదాలతో రచించడమందే. దానికి కొన్ని పద్యాలు చూపివున్నాను; యింకోటికూడా చూపి తరవాయి అందుకుంటాను.

చ. "బ్రతికిన నాల్గునాళ్లు ఋతవాది యుధిష్ఠిరుఁ డన్న మేటికీ
రితి గలవాఁడనై ధరఁ జరించి తుది నృపకోటి మెచ్చ దు
ర్గతి గనకుండ స్వర్గమునఁ గాఁపురముండఁదలంచునాకు నీ
యతు కొనరించెదే కటకటా యదునందను పేరుమీఁదుగన్"

పుక్కిటిపురాణాలు అనాదిగా కవులను గుఱించేకాదు, అన్యులను గుఱించిన్నీ వుంటాయి. వాట్లకు తలా తోఁకా అంటూ వుండదు. సరియైన హేతుహేతుమద్భావమున్నూ వుండదు. అవి యెన్నటికీ అంతరించవు.

అయితే యీవ్రాయడం యెందుకంటే? ఆ యేకలవ్యశిష్యుణ్ణి అనాదరించ లేకేకాని యింకెందుకూ కాదు. యెంతో యెవరితోనో యీ విషయం రాఁబట్టే ఆయన వున్నదున్నట్టు వ్రాయుమని కోరివుంటాఁడు కాని వూరికే నా కీ పరిశ్రమని వార్ధక్యంలో కల్పించేవాఁడు కాఁడనియ్యేవే.

కవిత్వం సంగతి కొంత తెల్పినట్టయింది. యిఁక పాండిత్యం. దీన్ని గుఱించి అతని జీవితచరిత్రలో తెల్పేవున్నాను. అయినా ప్రసక్తి కల్గింది గనక మళ్లా వ్రాస్తాను. నేనున్నూ, తిరుపతిశాస్త్రిన్నీ కలుసుకునే టప్పటికి తిరుపతిశాస్త్రికి నాకంటే సంస్కృతసాహిత్యం హెచ్చు. అప్పటి కప్పుడే కొన్ని నాటకాలూ, చంపులూ కూడా అతఁడు గురుముఖతః చదివి బ్రహ్మయ్యశాస్త్రులవారి వద్దకు వ్యాకరణాధ్యయనానికి వచ్చాఁడు. నేనో? గురుముఖతః భారవివఱకే చదివి వచ్చానన్నమాట. యీ సందర్భాన్నిబట్టి మేమిద్దఱమూ కలుసుకొనే టప్పటికి, నాకంటే అతనికి సంస్కృతసాహిత్యం హెచ్చని వేఱే చెప్పనక్కఱలేదు. నేను ఆ స్థితిలోనే యావజ్జీవమూ నా సంస్కృతసాహిత్యాన్ని వుంచుకొనేయెడల యిప్పటి విమర్శకుల యుక్తులు సరిపోతాయి. ఆలా వుంచుకోలేదుగదా! అయితే ఆ పిమ్మట యే గురువుగారిదగ్గర సాహిత్యగ్రంథాలు అభ్యసించావు అంటే వినండి. ఆకాలంలో మా గురువుగారి దగ్గిరికి చాలామంది విద్యార్థులు వస్తూవుండేవారు. వ్యాకరణపాఠం తప్ప కావ్యపాఠాలు చెప్పడం నామీఁదా, తి. శా. మీదా వుండేది. చదువుకొన్నమీఁదట సమన్వయించి చెప్పే పాఠం తిరుపతిశాస్త్రిది. నాదో? కేవలం బుద్ధిని వినియోగించి చెప్పేది. ఆ కారణంచేత నేను చదవని మాఘకావ్యం వగయిరాలు పాఠంచెప్పేటప్పుడు యెక్కడేనా అసంప్రదాయపుతోవ యే కొంచెమో దొర్లేది. ఆలాటి సందర్భంలో అతని శిష్యులు నా శిష్యుణ్ణి ఆక్షేపించడం జరిగేది. అది వెంటనే అంటుకునేది; మా యిద్దరికీ వాదం పడేది; గురువుగారిదాఁకా వెళ్లేది. సంప్రదాయసిద్ధమైనదేదో వారు చెప్పేవారు కాని, మళ్లా యీవలికి వచ్చాక మాపిడివాదం మేము చేస్తూనే వుండేవాళ్లం. కాని యథార్థం ఆ గందరగోళంలో గోచరించడం జరిగేది. అప్పటిమట్టుకు "నాదేన్యాయం నాదేన్యాయం" అని బుకాయించినా యిటీవల సంప్రదాయ సిద్ధమైనదేదో తెలిసిపోయేది. యీలాటి వాదోపవాదాలు నాకూ తిరుపతిశాస్త్రికీ మాత్రమే కాదు. యింకా మఱికొందఱు విద్యార్థులతో కూడా వచ్చేవి. ప్రత్యేకించి పనికట్టుకొని కొన్ని వూళ్లు దీనికోసం వెళ్లడంకూడా జరిగేది. ఆ విద్యార్థులకి వ్యాకరణంలో చింతనచెప్పడం మా యిద్దఱిలో యెవరో చెప్పవలసివచ్చేది. ఓపికపట్టి చెప్పడానికి అప్పుడే కాదు, యిప్పటికీకూడా నన్ను చెప్పి యితరులను చెప్పవలసి వుంటుంది. అందుచే నాపార్టీ యెక్కువగా వుండేది. అక్కడక్కడ మళ్లా యీచింతన చెప్పుకొనే విద్యార్థులు మమ్మల్ని యిద్దఱినీ వెక్కిరిస్తూ వుండేవారు కూడాను. కొట్టుకోవడం పర్యంతమూ జరుగుతూ వుండేది. వొక గాథ వుదాహరిస్తాను. మేమిద్దఱమూ కలిసి కవిత్వం చెప్పడం మొదలు పెట్టాక ధాతురత్నాకరపీఠికలో వక శ్లోకం.

శ్లో. 'పశుపతిదయితాతృతీయపుత్రౌ । తిరుపతివేంకటశాస్త్రిణౌ కవీంద్రౌ'

అని వ్రాసుకున్నాము. మా యిద్దఱికన్నా సాహిత్యంలో యెక్కువ గ్రంథాలు చదివి వ్యాకరణం చదువుకోవడానికి వచ్చిన వక కోనసీమ విద్యార్థి యీ శ్లోకాన్ని ఆక్షేపించడానికి బదులు మా యిద్దఱిదగ్గిఱా కావ్య పాఠం చెప్పుకొనే విద్యార్థులను “వీరు పశుపతి దయితా (పార్వతీదేవికి) “తృతీయ పుత్రులు” అంటూ వెక్కిరించడం మొదలు పెట్టడమే కాకుండా యిద్దఱిలోనూ వకరు తృతీయపుత్రులైతే రెండోవారు చతుర్థపుత్రులు కావలసివస్తుం దంటూ ఆక్షేపించడం జరిగింది. దీన్ని సమర్థించిన విధానం యిక్కడ వ్రాస్తే చాలా పేజీలు పెరుఁగుతుంది గనక వుపేక్షిస్తాను. యీ అభిప్రాయం న్యాయంగా సమర్థించతగ్గదే గాని పిడివాదం చేసి సమర్థించేది కాదని చదువరులు తెలుసుకోవాలి. సారాంశం పార్వతీదేవికి పుత్రులిద్దఱే అనిన్నీ, అందు వొకఁడు విఘ్నేశ్వరుఁడనిన్నీ, రెండు కుమారస్వామి అనిన్నీ, మూఁడు తి. వెం. కవులనిన్నీ, ఆరోపిత పుత్రత్వానికి అందఱూ అర్హులే కనక, యెవరు ఆలా ఆరోపించుకుంటే వారందఱున్నూ ప్రత్యేకించి ప్రత్యేకించి మూఁడోవారుగానే పరిగణింపఁబడతారు. భగవంతుణ్ణి ప్రార్థించేటప్పుడు వక పురుషుఁడు. ‘తండ్రీ’ అని సంబోధిస్తాఁడు. ఆ పురుషుఁడు కొడుకుకూడా “తండ్రీ” అనే సంబోధిస్తాఁడు. అంతేకాని తండ్రికి తండ్రి కనక వాఁడికి భగవంతుఁడు తాత కావాలనే శంక యేలాటిదో పైశంకా ఆలాటిదే. అయితే వ్రాసేది లేదని కూడా కొంచెం వ్రాశాను, యింకా వ్రాయాలి. దాన్ని వాదోపవాదనిష్ణాతులైన చదువరులే పూరించుకుంటారని తలుస్తాను. చెప్పొచ్చేదేమిటంటే? యీలాటి ‘కైకురుబొయికురు’ పోట్లాటలతో బ్రహ్మయశాస్త్రులుగారివద్ద చదువుకున్న ఐదారేళ్లున్నూ రేయింబవళ్లు కాలంనడిచింది. దానితో నా సంస్కృతసాహిత్యంకూడా దిట్టపడింది. (వారి విద్యార్థిత్వం యెంత సేపూ సంస్కృతానికే తప్ప తెలుక్కి సంబంధమే లేదు. కాలేజీలో ఇంగ్లీషుమాదిరిగా తెలుసుకోండి.) దీనికంతకీ బ్రహ్మయ్య శాస్త్రుల్లుగారి శుశ్రూషే కారణమవడంచేత గురువు లెందఱో వున్నా శ్రీహరిని ప్రధానంగా స్మరించడం. గాని “గురుభ్యోనమః” అనకుండా నేర్చుకున్న భాగంకూడా కొంతవుంది. దానికి గురువులు తోటివిద్యార్థులు. ఆ విద్యార్థులకూ మాకూ “అన్యోన్యం గురవోవిప్రాః” అనేమాదిరి గురుశిష్యభావం వుందనుకోవాలి. అంతేనేకాని వ్యాకరణంతోపాటు బ్రహ్మయ్య శాస్త్రుల్లుగారు నాకుఁగాని, ఇతరులకుఁగాని సాహిత్యగ్రంథాలు చెప్పలేదు. వారికి వాట్లలో అంతగా అభిరుచీలేద్ధు, తీరికాలేదు. యేమంటే! గురువుగారు రాత్రి సుమారు రెండుగంటలప్పుడు విద్యార్థులకు పాఠాలు చెప్పడానికి ఆరంభిస్తే పగలు 12 గంటలప్పటికి ఆఖరుపాఠమవడానికి అవకాశం కలిగేది. తక్కువపాఠం ప్రథమం ప్రారంభించడం సంప్రదాయం. యెక్కువ పాఠం వాళ్లందఱూ తక్కువ పాఠాలు వింటూ వుండాలి. యీలాటివిషయాలే స్వయంకృషివల్ల విద్య సాధించేవారికి తెలియకపోయేవి. యీలాటివిన్నీ,

మఱికొన్నిన్నీ నేను బ్రహ్మయశాస్త్రుల్లుగారి శుశ్రూషాకాలంలో నేర్చుకున్నాను. అన్యోన్య సహాయంవల్ల నేను సంస్కృతంలో సాహిత్యం నేర్చుకున్నట్టయింది. తిరుపతిశాస్త్రి కూడా యిలా నేర్చుకున్నది కొంత లేకపోలేదుగాని యేమేనా నాకంటే కొంత శుశ్రూష సంస్కృతకావ్యనాటకాలకు అధికకాలంచేసి వున్నాఁడు. తుదకి "అవ్వాగుఱ్ఱమూ" వకటేఅయినప్పటికీ లోకంలో మొట్టమొదటపడ్డ అభిప్రాయం నిలిచివుంటుంది కనక పాండిత్యంలో వారికీ, వీరికీ యేమాత్రమో భేదంవుంటుందని అనుకోవడమున్నూ సయుక్తికమే. "వామనఇతి త్రివిక్రమ మభిదధతి దశావతారవిదః" కదా! వొక్క సంస్కృత వ్యాకరణమున్నూ, భారవిదాఁకా కావ్యములున్నూ తప్ప నేను గురుశుశ్రూషవల్ల సంపాదించిన విద్య లేశమున్నూలేదు. తక్కినదంతా స్వయం కృషివల్లా, అన్యోన్యస్పర్ధవల్లా సంపాదించినదే అనడంలో అతిశయోక్తిలేదు. "లక్ష్యాలు వెదకడంలోగాని, తప్పులు వెదకడంలోగాని నీబుద్ధికి యేపుస్తకం చూచినా తప్పులే కనబడతాయిరా. నాబుద్ధికో? అన్నీ వొప్పులుగానే కనపడతా" యనేవాఁడు. అందుకే ఖండనమండనాలకర్మం అంతా నామీఁదే వుండేది. దీన్నిగురించి వ్రాయనక్కరలేదు. పలువురెఱిఁగినదే. యెవరేనా "అయ్యా! కాస్త నాగ్రంథాన్ని సంస్కరించి పెట్టవలసిం"దని మావాఁడికి పుస్తకం యిస్తే యేదో పదిరోజులు దగ్గఱ పెట్టుకొని "సర్వోత్కృష్టంగా వుం"దని యిచ్చేసేవాఁడు. తిరుపతిశాస్త్రులు గారు పరిష్కరించారుగదా అని గ్రంథకర్త అచ్చువేసుకోవడం జరిగేది. దానితో "తాడు తెగి తప్పేలా నూతులో పడేది". వొక మహాపండితుఁడు వొక సంస్కృతగ్రంథాన్ని రచించి ఇతణ్ణి పరిష్కరించడానికి ప్రార్థించడమున్నూ, పైరీతిని మోసపోవడమున్నూ జరిగింది. అచ్చు పూర్తి అయిన పిమ్మట "లోకమో పాడో" అన్నట్టు వక పుస్తకం నాకు పంపించాఁడాయన. ఆ సమయానికి నాదగ్గఱ మా పూర్వకాలపు సతీర్థ్యుఁడొక పండితుఁడున్నాఁడు. పుస్తకం విప్పీవిప్పడంతోటే ఆయన వక శబ్దాన్ని తప్పనడానికి మొదలుపెట్టాఁడు. నేను ఆయనతో "అయ్యా! దాన్ని రచించినవారు మహావిద్వాంసులు. తొందరపడకండి" అని వారించాను గాని ఆయన నన్నుకూడా ధిక్కరించాఁడు. పుస్తకం నాకు అందిచ్చిన పురుషుఁడు యిదంతా విని గ్రంథకర్తగారితో యేంచెప్పాఁడో, నేనేమో ఆయన పుస్తకంలో తప్పులున్నాయని అన్నట్టు తేల్చారు. మీ తి. శా. గారే దీన్ని సంస్కరించార్ఠంటూ ఆయన నన్ను అనడం మొదలెట్టారు. ఆ పుస్తకంలో మొత్తం వ్యాకరణ విరుద్ధాలు నూటికన్నా యెక్కువే వున్నాయి. ఆ విరుద్ధాలు తీసి చూపేటప్పటికి ఆయనకీ తెలిసినవే కనక ఆయన అంగీకరించారు పాపం! "తత్త్వార్థేనచ పండితమ్" కదా! తరవాత తి. శా. ని నేను కలుసుకున్నప్పుడు "యిదేం కర్మం. ఆయనపుస్తకం ఆలా సంస్కరించా?" వంటే అన్నాఁడుకదా! యీబాదఖావుచాకిరీ యెవఁడికి పట్టింది? నీకుగాని నాకీలాటి

వోపికలేదు, యేదో చూడమన్నాఁడాయన, చూస్తానన్నాను- చూచేదేమిటి, ఆయనకూడా పండితుఁడేకదా అనుకున్నాను. సరస్వతీప్రెస్సులోనే కాఁబోలును అచ్చుపడింది. ప్రూఫులు ప్రూఫురీడరు దిద్దినట్టున్నాఁడు" అంటూ జవాబు చెప్పాఁడు. అతఁడు యితరుల గ్రంథాలవిషయంలోనే కాదు, మాసొంతాల విషయంలో కూడా యింతే; శ్రద్ధచూపేవాఁడు కాఁడు. కొత్తపల్లి సూర్యారావుగారు యింకా జీవించే వున్నారు. వారిని అడిగితే యింకా యీ విషయం సవిస్తరంగా తేలుతుంది. సరస్వతీ పత్రికకు మేటరివ్వడానికి ఆయన్ని పెట్టే తిప్పలు వగయిరాలు ఆయనే చెప్పాలి. వున్న పాండిత్యాన్ని శ్రద్ధపట్టి వినియోగించడంలో అతనికి వున్న పాలుమాలిక వాచామగోచరం. ఆపాలుమాలికవల్ల కలిగిన "జితకాశి"కే నేడు "చెళ్లపిళ్ల వెంకటయ్య"కు "దేవాదేవేషు" అంటూ నెల్లూరిపత్రికలలో వివాదాలు పడడమూ, వానికి నేను నోరు మూసుకు వూరుకోవడమూ యెవరో వెలమకన్ని శతావధానిగారు కల్పించుకొని కొంత వ్రాయడమూ ఆమధ్యతటస్థించింది. "జితకాశి" శబ్దానికి అర్థం శబ్దరత్నాకరంలో సమేతూవుంది. కాని దాన్ని కూడా చూచేపాటిశ్రద్ధ అతనికి వుండేదికాదు. ఆబుద్ధి చాకచక్యానికి శ్రద్ధ అనేదే వకటి వుంటే యీలోకమేకాదు, పద్నాలుగు లోకాల్లో వుండే బుద్ధిమదగ్రేసరులు యేకీభవించినా అతనిముందు నిల్చేవారేకారన్నది అతిశయోక్తికాదు. యెప్పుడో సమయం వచ్చే దాఁకా అతఁడు తనబుద్ధికి పనిచెప్పేవాఁడే కాఁడు. అందుచేతే యేకొంచెమో వయస్సు ముదిరినపిమ్మట బుద్ధితీక్ష్ణత తగ్గినా యావజ్జీవమున్నూ అంతో యింతో అవధానం చెయ్యడానికి వెనుదీసేవాఁడు కాఁడు. నాకో, సర్వదా బుద్ధికి పని చెపుతూ వుండడంవల్ల బందరు ప్రవేశించే ప్రాంతంలో బుద్ధితీక్ష్ణత చాలా తగ్గింది. యీవిషయం యిటీవల గుంటూరిసీమ అవధానాలు చూచిన వారికి విశదమే. వెనకటిసంగతులు వ్రాయవలసి వస్తేకాని, చెప్పవలసి వస్తేకాని యీ 68 యేళ్ల వయస్సులో కూడా పూసగుచ్చినట్టు అట్టపుట్టాణాళ్లతో నాకు మూఁడేళ్లవయస్సులో జరిగిన కథలదగ్గిరనుంచి వ్రాయడానికి జ్ఞాపకశక్తి వుంది. కాని ఆశక్తి యాదృచ్ఛికంగా వినియోగించడానికేగాని యేదేనా నిర్బంధంగా పనిపెట్టుకుంటే మాత్రం పనిచేసేస్థితిలో లేకపోవడం ఆరంభమై అప్పుడే యిరవైయేళ్లు కావచ్చింది. యేదేనా తన్మయత్వం తటస్థిస్తేమాత్రం యిప్పుడుకూడా అన్నాహారాలు తోచకుండా కవితాధార నడుస్తుందన్నందుకు నిన్న మొన్న రచించిన "జయంతిన్నీ," "క్షమాపణమున్నూ" లోకానికిసాక్ష్యమీయడానికి సందేహంలేదు. యిదే నాప్రకృతిలో వున్న విశేషం. ఇట్టి పట్టుదలగాని, తన్మయత్వంగాని ఆతని ప్రకృతిలో లేదు. వొక్కప్పుడు తాత్కాలికంగా ఈ గుణాలుకల్గినా అవి తుట్టతుద వరకున్నూ నిల్వక అంతంతలోనే అంతరించేవి. ఆ కారణంచేతే కొన్ని గ్రంథాలు మొదలుపెట్టి చక్కనిశైలిలో కొంత వ్రాసినపిమ్మట ఆఁగిపోవడం తటస్థించేది.

"సువర్ణపాత్రికం" రెండంకాల ప్రాంతంలో ఆఁగడమున్నూ, "వ్యసనవిజయం" కూడా డిటో స్థితిలోనే ఆఁగిపోవడమున్నూ పైదాన్ని సమర్థిస్తాయి. యింకా మఱికొన్ని యీలాటి చిలకకొట్లయితే వున్నాయిగాని అవి చక్కనిశైలిలో లేవు. ఆ మొదటి రెండు గ్రంథాలూ అవసానకాలంలోనికి కావు; అవసాన కాలానికి సుమారు పుష్కరకాలానికి పూర్వపువే. మొదలు పెట్టేటప్పుడే పర్యవసానం ఆలోచించుకొని మొదలుపెట్టడం అతనిపంథకాదు. ఆరంభించి, తోఁచినట్టు వ్రాసి, యెక్కడ తోఁచకపోతే అక్కడ విరమించడమే అతని ఆచారం. పై పుస్తకాలు రెండూ తరవాయి నన్ను పూరించమని నా కిచ్చాఁడు. అవి ప్రకరణాలుగా తయారు కావలసినవి. పది అంకాలు వుంటేనే కాని ప్రకరణానికి పూర్వలాక్షణిక పద్ధతిని వొప్పించడానికి వీలు కనపడదు. "పై కథావిధానానికి నీమనస్సులో యేమి వూహ పెట్టుకున్నా" వని అడిగాను నేను. "యేమీ పెట్టుకోలేదు. నీవు చూచుకో వలసిందే" అన్నాఁడు. "అలాగైతే అవి అలా వుండవలసిందే. నీకులేని వూహ నాకెక్కడనుంచి వస్తుం"దని నేనన్నాను.

"పరిణతి రవధార్యా యత్నతః పండితేన" అనే భర్తృహరి వాక్యాన్ని ప్రతికవిన్నీ అనుసరించి తీరాలి. అది అతఁడు యే విషయంలోనూ పాటించేవాఁడు కాఁడు. గ్రంథారంభం చేసేటప్పటికే ముగింపు మనస్సులో నాటుకుపోవాలి. కాని ముగింపును గూర్చి యెప్పుడో ఆలోచిద్దామంటే కార్యకారికాదు.

అతణ్ణి నేను గీరతంలో, "తిరుపతిసింహ మొక్కమొగిఁ దీవ్రతరమ్ముగవచ్చి" అని రూపించి వున్నాను కాని అంకుశంతో సంబంధించిన గజప్రకృతిగా నిరూపించవలసిన ప్రకృతిగా నేను అనుభవపూర్వకంగా యెఱిఁగివుండడంచేత కొన్నిచోట్ల ఆభావాన్నీ వెల్లడించివున్నాను.

చ. "తిరుపతి యేన్గుగాఁగ గడి దేఱినశిష్యు లనేకు లొప్పుమైఁ
బొరిఁబొరి రోఁజుచున్ దనదు పొంతను బెబ్బులిపిల్లలట్టు చూ
పఱులకుఁదోఁపఁ గేల నొక పాటిది బెత్తము పూని వేంకటే
శ్వరుఁడు శతావధాన మను సర్కసుఁజూపెడిఁ జూడుఁడో బుధుల్!"

అని నేను తన్ను యేనుఁగుగా రూపించి పద్యం చెప్పేటప్పటికి దానికి అంతగా అంగీకారం లేకో యేమో.

చ. "తిరుపతి వ్యాఘ్రమై బయలు దేఱినశిష్యులు గున్న యేన్గులై
వఱలఁగఁ దేఱఁగాఁ దగిన వారలు బెబ్బులిపిల్ల లెల్లమా

ర్తురు కవికుక్కురమ్ములయి తోఁపఁగ వేంకటశాస్త్రి వీరకే
సరిగ శతావధాన మను "సర్కసు" చూపితివమ్మ! శాంకరీ!

అని సవరణచేసివున్నాఁడు. మొత్తం యెవరో వెనకాల వుండి ముల్లుకఱ్ఱతో పొడుస్తూవుంటేనే తప్ప రచన సాగించడం వుండేదికాదన్నది ఫలితార్థం. ప్రాచీనకవుల లోనేకాదు, నవీనకవులలోనేకాదు యేదో తప్ప యెవళ్లకవిత్వమూకూడా అతనికి నచ్చడమంటూ వుండేదికాదు. అందుచేతే నే నెవరికేనా సర్టిఫికట్టు యిస్తే విధిలేక దానిలో చేవ్రాలు పెట్టడమైతే జరిగేదిగాని అది వొక్కొక్కప్పుడు అన్యథాగా పరిణమింపచేసేవాఁడు. గుంటూరుసీమ గందరగోళానికి అదేకదా కారణమయింది – పోట్లాట తేవడంలో అంతలో తెచ్చేవాఁడు. తరవాత శాంతుఁడుగా వుండేవాఁడు. దాన్ని పట్టి పల్లార్చేదాఁకా నేను విరమించడం వుండేది కాదు. "ఆసీమాంత" పద్యం చూచుకోండి. యీ విషయం పలువురు యెఱిఁగిందే కనక విస్తరించేది లేదు. సర్వసామాన్యంగా మాత్రం "వెంకట శాస్త్రి పట్టుదలమనిషి" అనే పేరు నాకు వచ్చింది. పట్టుదల నాకు వున్నమాట సత్యమే కాని,ముందుగా కలహం తేవడంమట్టుకు అతఁడు తెచ్చేవాఁడు. అది నానెత్తిని బడేది. అందులోనుంచి బయటికి వచ్చేటప్పటికి రక్తమాంసాలు క్షీణించేవి. యెప్పుడేనా నాలుగుపద్యాలు పంపితే పంపేవాఁడు; లేకపోతే లేదు ఉపేక్షాభావంతో వూరుకొనేవాఁడు. "యెవరితోఁగాని వివాదము లేకుండా మనకార్యం మనం నెఱవేర్చుకుందా"మని నేను మనస్సా అనుకొనేవాణ్ణి. కాని యెక్కడోగాని నా కోరిక నెఱవేఱేదికాదు. ఆఖరికి కలహప్రియుఁడనేమాట నాకు వచ్చేది. యిది యీరసంలో మాత్రమేకాదు; రసాంతరాల్లో కూడా డిటో ప్రకారమే. అవన్నీ వివరిస్తే గ్రంథం చాలా పెరుఁగుతుంది. అందుకు సంబంధించిన పద్యాల రికార్డుకూడా వుంది. ఆ పద్యాలు యిక్కడ వుదాహరించడంకన్న యితరుల వల్ల భవిష్యత్కాలంలో చదువరులు తెలుసుకోవడం వుచితంగా వుంటుంది.

మా యిద్దఱిలోనూ అతఁడు అమాయకుఁడని పలువురి అభిప్రాయం. యెవరిదాఁకానో యెందుకు? శ్రీ పోలవరపు జమీందారుగారే వొకమాటు యీ విషయం తేల్చారు. కాని, అతఁడు అమాయకుఁడు కాఁడు; చాలా గడుసువాఁడు. కవిత్వంలో ఎంత గడుసుతనం వుండేదో, ప్రవర్తనలోకూడా అంత గడుసుతనమూ వుండేది. అతి సాహసం కలవాఁడు. యేదేనా వివాదసందర్భపు పద్యాలల్లో నేను పద్యం వ్రాయవలసివస్తే మొట్టమొదట ఘాటుగా నడిచినా యెంతో తటపటాయించి, యెందఱికో వినిపించి, ఘాటు తగ్గించిగాని ప్రకటించేవాణ్ణిగాను. యీ విషయాన్నే శ్రీ వేమవరపు లాయరుగారు ఆ మధ్య చెన్నపురిసభలో వ్యాఖ్యానించి వున్నారు. అతఁడో? నాకు మాత్రం వినిపిస్తే వినిపించేవాఁడు.

ఒకప్పుడు నాకూ వినిపించేవాఁడు గాఁడు. "ఏటికి నాకు నీదురద" అంటూ వ్రాసి జమాయించి ప్రచురించేవాఁడు. సమయోచితంగా తప్పించుకునేశక్తి అతనికివుండేది. నాకు వున్నదున్నట్టుగా చెప్పి వొప్పించవలసిందేకాని సమయోచితంగా నడిచేశక్తి యిప్పటికీకూడా లేదు. అందుకే వక్రమార్గం తొక్కే వారికి శరణంటాను.

యీలాటిభేదాలు వ్యక్తిగతాలు కొన్ని వుండకుండా యెక్కడా ఐక్యం తటస్థించదుగదా! సభాముఖంలో వంకరమార్గం త్రొక్కి, ముఖపిధానంచేసి, యెదటివాళ్లకు నోరాడనివ్వక పోవడంలో అతనికి మంచి శక్తి వుండేది. కాని అది తావన్మాత్రంలో ఆఁగిపోతే యేంలాభం? మర్నాడు మళ్లా అడిగితేకూడా నిలిచే పద్ధతివాదంగాని పనికిరాదనేవాణ్ణి నేను. అందుకోసం తాత్కాలిక విజయానికి యెన్నఁడూ ప్రయత్నించక, వొక్కొక్కదానికి యెన్నో ప్రయోగాలు వెదికివెదికి వేసారి అప్పుడు దాన్ని బయటికి పెట్టడమే అప్పటికీ యిప్పటికీ నా ప్రకృతి. యిందుకోసం అతఁడు నాయందు ఆంతరంగికంగా చాలా కృతజ్ఞత చూపేవాఁడు. నా మాటను పరమప్రమాణంగా భావించేవాఁడు. పోట్లాడినప్పుడు పోట్లాడేవాఁడే అనుకోండి. పోట్లాడినా ఆంతరంగిక విశ్వాసం మాత్రం యెక్కువగా వుండేది. ఆ కారణంచేతనే పయికి "కైకురుబొయికు" ర్లాడుకుంటూవున్నా మా మైత్రికి అప్పుడేకాదు, యెప్పటికిన్నీ భంగంకలుగ లేదు. భంగంకలిగించాలని మా బాల్యంలో ప్రయత్నించిన పుణ్యజనులు కూడా కొందఱు కొంత ప్రయత్నించి విఫలు లైనారు.

వేంకటగిరిలో అలవేళ - అంటే, అబోధవేళదాఁకా అవధానంలో కూర్చో పెట్టడంచేత కొంచెం లోపం వస్తుందేమో అనే సందేహం సభ్యులకే కాదు నాకున్నూ కలిగింది. అది శ్రీ ముద్దుకృష్ణయాచేంద్రులవారి సభ. అంతకుపూర్వం శ్రీ చెలికాని గోపాలరావుగారు చేయించిన సభలో నేను అవధానం చేసివున్నాను. అది యేలోపమూ లేకుండా నెఱవేఱింది. యీసారి వంతు తిరుపతిశాస్త్రిది; కనక అతఁడు చేయవలసివచ్చింది. అక్షరం అక్షరంవంతున చెప్పడమూ, మూఁడేసి వ్యస్తాక్షరులు వేఱువేఱుగా యివ్వడం వగయిరాలు నేను చేసిన అవధానానికీ వున్నాయి. దీనికీ వున్నాయి. భేదమేమిటంటే - సమయం ఉదయం 8 గం. మొదలు సాయంకాలం ఆరుగంటలవరకున్నూ నా సభకు తటస్థించింది. తి. శా. చేసేదానికి మధ్యాహ్నం 4 గంటలు మొదలు రాత్రి వంటిగంటవరకూ చెప్పవలసివచ్చింది. రాజుగారికేమి, ముఖ్యులైన సభ్యులకేమి, అవధానంచేసే మాకేమి రాత్రిభోజనం లేనేలేదు. పయిగా అవధానం ముగించేవేళ అబోధవేళ అయింది. కొన్నిటిలో ఈషద్వైషమ్యం కలిగింది. అట్టి సమయంలో వక కలహప్రియుఁడు నన్ను చాటుగాపిల్చి "మీయిద్దఱిలో కుడీ యెడమభేద మేమేనా వుందా? అని శ్రీరాజావారు కనుక్కోమన్నారు"

అంటూ ప్రస్తావించాడు. అప్పుడు నేను "మాలో కుడియెడమభేదం లేదుగాని మా ఇద్దఱిసభలకూ యేర్పరచిన టయిములో పూర్తిగా కుడియెడమ భేదం వుం"దని జవాబు చెప్పాను. (అవధానవిషయంలో కాదుగాని రసాంతరవిషయంలో కిర్లంపూఁడి సంస్థానోద్యోగి యీలాటి ప్రశ్ననే నన్ను అడిగి తగిన జవాబు పొందడం జరిగింది. విస్తరభీతిచే వుటంకించలేదు.) ఆప్రశ్న రాజుగారిమీఁదపెట్టి అతఁడు స్వయంగా అడిగిందేగాని, మఱోటి కాదని తరువాత రాజావారి అభినందన వాక్యాలవల్ల విస్పష్టపడింది.

సమయాసమయాలు ప్రతి మంచి కార్యానికిన్నీ, ప్రతి చెడ్డకార్యానికిన్నీ అవసరమే కాని, అందులో కవిత్వానికి - అందులోకూడా అవధానానికి మఱీ అవసరమని చెప్పనక్కఱలేదు. "ఊహగలయంగల లేఖక పాఠకోత్తముల్, దొరికినఁగాక యూరక కృతుల్ రచియింపుమటన్నశక్యమే?" అనే పెద్దన్నగారి పద్యంలో వున్న సదుపాయంలో "వుయ్యాలా" వగయిరాలు కొన్ని అవధానులకు అవసరం లేదుగాని, వేళకు భోజనం వగయిరాలు అవసరం. అవధానిమనస్సే వకవుయ్యాలలాగా వుంటుంది; కనక వేఱే వుయ్యాలా అక్కఱలేదు. యీ ప్రసంగం జరిగిన కొంత సేపటికి అవధానం ముగిసింది. యేకొంచెమో పుష్పగణన వగయిరాలలో తబ్బిబ్బు కలిగింది. అప్పుడు వక దివాణంనవుకరు - మంచి ప్రాజ్ఞుఁడు - వృద్ధు లేచి రాజావారితో అన్నాఁడు కదా; "బాబూ! శ్రీమాడభూషి వెంకటాచార్యులవారు శ్రీ పిఠాపురపు సంస్థానంలో చేసిన అష్టావధానాన్ని నేను ప్రత్యక్షంగా చూచివున్నాను. ఆ అవధానానికీ, దీనికీ చాలా తేడావుంది. దానిలో పద్యాలు యెన్మిదిమాత్రమే. దీనిలో పద్యాలు యేభైకంటే కూడా యెక్కువ. ఇదే మాదిరిగా వ్యస్తాక్షరి వగైరాలు త్రిగుణంగానూ, చతుర్గుణంగానూ దీనిలో వున్నాయి. సుమారు నెలరోజులనాఁడు శ్రీ బావగారి (శ్రీ చెలికాని గోపాలరాయణింగారి) సభలో వెంకట శాస్త్రుల్లుగారు చేసిన అవధానంలో ప్రతీవిషయమూ త్రిగుణితమయిందిగాని యిందులో అంతకంటేకూడా అతిక్రమించింది. కాఁబట్టి అష్టావధానం యీలా పెంచడం న్యాయం కా"దని ధైర్యంగా మనవిచేశాఁడు. దానితో రాజావారు "వారిశక్తి తెలుసుకోవడానికి యీలాపెంపుచేసి పెట్టవలసివచ్చింది కాని మఱోటికా"దని పరిహారోక్తిగా సెలవిచ్చారు. ఆసభ నేనే చేసేదైతే మొట్టమొదటనే యిది వీలుకాదని చెప్పి నిషేధించేవాణ్ణి.

యెంత బరువేసినా పరిశీలించకుండా లొట్టిపిట్టలాగ భరించడమే కాని అతని ప్రకృతిలో దాన్ని తప్పుకుందామనే కోరిక వుండేదేకాదు. పయిగా దాన్ని నిషేధించే లౌకికోక్తి నైపుణ్యమున్నూ తక్కువే . లొట్టె మీఁద బరువు వేసేటప్పుడు కాళ్లకింద యిటుకలు పెట్టి ఆ యిటికలు చితికేదాఁకా వేస్తారనిన్నీ, చితకడంతోటట్టే వేయడం చాలించి అది

చూస్తూవుండఁగా యే వీసెఁడో, అఱవీసెఁడో తీసేస్తారనిన్నీ, దానితో అది యావత్తూ తీసేశారనుకొని కార్యక్రమాన్ని జరుపుతుందనిన్నీ వినడం. దానికి ఆమాత్రం తీసివేయడమేనా అపేక్షితంగాని మావాఁడికి ఆమాత్రమున్నూ అవసరం వుండేదికాదు. యెంత బుద్ధిశాలీ కాకపోతే అంతకుముందు గోచీపెట్టీపెట్టని వయస్సునుంచిన్నీ కవిత్వం చెపుతూ లోపాయి కారీనైతేయేమి, పబ్లీకుగాఅయితేయేమి కొన్ని పండితసభలలో కొన్ని అష్టావధానాలు చేసివున్న నాతో కాకినాడ సభలో సంపూర్ణ శతావధాన శకటాన్ని నడపడానికి కొలఁదికాలంనుంచి మాత్రమే కవిత్వవ్యాపారంలో ప్రవేశించిన తిరుపతిశాస్త్రి సమానంగానో, నాకన్న అధికంగానో పూని పనిచేయఁగలఁడా?

చెపితే నమ్ముతారో లేదోగాని కాకినాడ అవధానానికి ప్రారంభించేటప్పటికి అది చలికాలమైనా వొళ్లంతా చెమటతో తడిసిపోయింది. అప్పటికి మాకింకా శాలువులులేవు. సామాన్యమైన నూలుబట్ట పూర్తిగా కప్పుకున్నాను. ఆబట్టంతా తడిసిపోయింది. అతనికిమాత్రం యీ అవస్థ కలగలేదు. అతఁడు మహా సాహసుఁడు అని నేను వ్రాయడానికి యీలాటి వెన్నో కారణాలు అనుభూతాలే వున్నాయి. "గుండెలు తీసిన బంటు" అంటే అతఁడే. ముమ్మాటికీ అతఁడే. ఈ విషయాన్ని సమర్థించవలసి వస్తే చాలా సంగతులు వ్రాయాలి. యేదో వకటిరెండు ప్రస్తుతోపయోగంకలవి స్పృశించి విడిచాను. యింతకూ మా మైత్రిని భంగిద్దామని కొందఱు పుల్లింగాలు పెట్టఁదలఁచినా మామా శక్తులయందు మాకుమాకు వుండే గాఢమైన నమ్మికనుబట్టి వారి వారి పుల్లింగాలు విఫలమై మా మైత్రి ఆలాగే వజ్రలేపంగా నిలిచిపోయిం దనియ్యేవే.

యెల్లప్పుడూ పనిచేసి లక్ష్యలక్షణాలు సేకరించి సభలో ప్రతివాదులను ప్రమాణప్రమితమైన వాదంతో అరికడతాననిన్నీ, సభారంజకతాశక్తి కలవాఁడననిన్నీ అతనికి నాయందు అమితమైన ప్రేమ వుండేది. బందరులో టీచరుగా ప్రవేశించాక యెక్కడికీ సభార్థం వెళ్లడానికి నాకు పూర్వంలాగ అవకాశంలేక "అబ్బాయీ! నువ్వు వెళ్లి వారిని సంతోషపెట్టి రారాదా?" అంటే దానికి అతఁడు నాకు వ్రాసిన జవాబు ఆతనికి నాయందు వుండే గాఢవిశ్వాసాన్నే కాక నిష్కపటత్వాన్ని కూడా వెల్లడిచేస్తుంది. గుంటూరు ఆహ్వానవిషయంలో అతణ్ణివెళ్లి రమ్మంటే వ్రాస్తాడు కదా, "నేను వెడతాను. అవధానాదిక మున్నూ చేస్తాను. యెవరోవైదికప్పేరంటాలు వచ్చి వెళ్లిందంటారు. (యీమాట తలుచుకుంటే నాకు యిప్పుడు నవ్వు, యేడుపూ రెండూకూడా వస్తాయి.) కనక నువ్వు వచ్చేదాఁకా వెళ్లేదిలే"దన్నాఁడు. శ్రీరావు చెల్లయ్యమ్మారావు బహద్దరువారి షష్టిపూర్తినాఁటికి నేను అప్పటికప్పుడే మూఁడు మాసాల నుంచి చలిజ్వరంతో కొట్లాడుతూవున్నాను. పైఁగా

యింట్లో లేకలేక కలిగే సంతానానికి పురుడువచ్చే రోజులు, వున్నదేమో పరదేశం. అట్టి సమయంలో నేను వెళ్లడానికి యెలా కాళ్లాడతాయి? అందుచేత రాలేనంటే "డాక్టరు శేషగిరి నీ శిష్యుఁడేకదా. అతన్ని వెంటఁబెట్టుకొని రా. వచ్చి వూరికే సభలో కూర్చో. లేదా, సభలోనే పడుక్కో. సర్వమూ నేను నిర్వహిస్తాను" అని పట్టుపట్టి రప్పించితీరాఁడు కాని వదిలిపెట్టలేదు. పైఁగా నేనున్నానంటే చాలు, యేమీ చేయనక్కఱలేదు. మొట్టమొదటినుంచీ అతనికి ఆలా అలవాటయింది.

తీరా ఆ సభ జరిగేటప్పుడు మామూలు ప్రకారం మొదటిచరణం నీవే చెప్పాలన్నాఁడు. చెప్పేశక్తి నాకులేదు. స్వరం హీనస్వరంపడి అప్పటికప్పుడే నెల్లాళ్లయింది. అయినా తప్పదన్నాఁడు. ధారణ పట్టనక్కఱలేదులే అన్నాఁడు. అప్పుడే నే నీ పద్యాలు చెప్పవలసివచ్చింది :

చ. "దినదినమున్ జ్వరార్తిమెయి దేహబలమ్ముడివోయి యున్నప
ట్టున ననుఁ జెల్లయాంబిక కడున్ ముదమారఁగఁ బిల్వనంపుటల్
మనమున ఖేదమోదము లమర్చుకతమ్మున "లంఘనమ్ములన్
మనుగుడు" పన్నసామెతకు మంచియుదాహృతి చిక్కె నేఁటికిన్.

చ. జ్వరపడియున్న హేతువున సాయము నీ కొనరింపఁజాల నో
తిరుపతిశాస్త్రి! నీకు నలదేవి పరాంబిక యుండ వేంకటే
శ్వరుఁ డొనరించుసాయ మొక బ్రాఁతియె? నీవు దలంచినన్ ధరా
ధరములు ముక్కముక్కలగు ధారుణి క్రుంగు నభం బభం బగున్.

ఉ. పూనుము కార్యభారమును "బూన సుదర్శన" మన్న దేవకీ
సూను కథావిధానమును జూపఁఖు లాత్మల సంస్మరింప నే
మౌనము పూని నీ శుభ సమగ్రతకై జపియించుచుందు నీ
పై నొకచూపు తక్కుసభపైనొక చూపునుగా మెలంగుదున్."

యిాలా యెంతచెప్పినా మొదటిచరణం నీవే మొదలుపెట్టాలని బలవంతపెట్టాఁడు. ముఖ్యకారణం గుట్టువిడిచి వ్రాస్తూవున్నాను. అవధానానికి ధారణాశక్తి ప్రథమసోపానం. పాండిత్యం వుంటే పండితులను సంతోష పెట్టవచ్చు – ప్రయోగవిశేషాలద్వారా. లేదా, లేకపోతుంది. అనేకులు అడ్డదిడ్డంగా ప్రశ్నిస్తారు. ముందు చరణంలోనే ఆ చిక్కులన్నీ వుంటాయి. వాళ్లమనస్సు నొచ్చకుండా మృదువుగానే వాళ్ల ప్రశ్నలు తప్పని వాళ్లకు బోధించేలాగు పరాక్రమించాలి. ఈ విషయంలో వుండే తెల్విని యేమని పేర్కొనాలో

నాకు యిప్పటికీ తెలియదు. అది నావద్దనే కాని యెక్కడా లేనేలేదని అతనికి పిచ్చినమ్మకం వుండేది. అందుచేత అసమర్థుఁడుగా వున్నాసరే నన్ను ఆలా బలవంతపెట్టడం తటస్థించేది. దానికి తథ్యంగా నేను ఆవేళ చేసిన ఘనకార్యాన్ని కూడా వ్రాస్తూవున్నాను. దీన్నినేను యెంత మభ్యపెట్టి వ్రాసినా ఆత్మోత్కర్షగా వుండకపోదు. యేంచేసేది? "రోట్లో తల దూర్చి రోఁకటి పోటుకు జంకితే యేమవుతుంది?"

సరే! చెప్పడానికి ప్రారంభించాను. కొన్ని ప్రథమచరణాలు చెప్పడం జరిగింది. అంతా పండితులూ, కవులే పృచ్ఛకులు. అందులో వక పృచ్ఛకుఁడు పిచ్చివాఁడుగా వుంటాఁడు. కాని మంచి సాహితీపరుఁడున్నూ, కవిన్నీ, అతఁడు అడిగినప్రశ్న లక్ష్మీదేవిని పృథ్వీ వృత్తంలో వర్ణించవలసిందని మాత్రమే. ఇందులో కష్టం లేశమున్నూ లేదు, సాబీగానే చెపితే తీరిపోతుంది. కాని "వుత్పన్నమందబుద్ధ" లన్నట్టు తాత్కాలికంగా కన్నుమూసి తెఱచేలోపుగా పుట్టే అనేక చిత్రవిచిత్రాలు ప్రతిఫలించే బుద్ధిగల నేను వక అగమ్యగోచరప్పుంతగా ప్రథమచరణం అరంభించాను. అవూహ అంతలో నాకెలా తట్టిందో యిప్పటికీ నేను చెప్పలేను. యెవరేనా చెపుతారేమోకాన యిఁక ముందున్నూ నేను చెప్పలేను.

"సరోజనిలయాం సరోజనికరామ్"

అని చెప్పాను. యిది పృథ్వీవృత్తపాదం అనుకోవడానికి అవకాశం లేనేలేదు. యేలాటి లాక్షణికుఁడున్నూ పృథ్వీవృత్తపాదంగా మాఱుతుందని అనుకోఁడు. నాకేనా పాదారంభంలో యీలా మోసంచేదామనేదురూహలేదు. కాని 'సరోజనిలయాం' దాఁకా చెప్పేసమయంలో చట్టనయీ దురూహ పుట్టింది. యిది దురూహే అనండి, లేదా సదూహే అనండి. యీలాటి చణుకులు సభలో - అందులో అవధానసభలో - మిక్కిలిగా వుపకరిస్తాయి. ఆ వుపకరించడం యేలాంటిదో వివరిస్తాను. యెప్పుడయితే నే నీచరణాన్ని చెప్పి పృథ్వీవృత్తపు నడకలోకాక వేఱొక వృత్తపు నడకలో లయవేసి చెప్పడానికి ఆరంభించానో, వెంటనే పృచ్ఛకుఁడు "బావా! వృత్తం తప్పిం"దన్నాఁడు. నేను "తప్పితే తప్పిందిలే. తరువాత తి. శా. సవరించుకుంటాడులే. వ్రాసుకో"మన్నాను. యిదంతా నా కొంటెతనపు నటనే. "కొంటెలలోనఁ గొంటెయున్ గావలెఁ" గదా! దానిమీఁద శివరామశాస్త్రి (శిష్యుఁడు) అన్నాఁడుకదా : "మళ్లా తి. శాస్త్రిగారు సవరించుకోవడమెందుకు? తమరేసవరించండి" అన్నాఁడు. "నాకు వోపిక లేనిసమయంలో తి. శాస్త్రిగారి బలవంతాన్ని పట్టి చెప్పే చెప్పడంలో యింతకంటె అనుకూలంగా చెప్పడం కుదరదు. "పుణ్యానికి పెట్టే అమ్మా, నీ మొగుడితో సమానంగా పెట్ట"మంటే యెలాగ? సవరించఁబోతే మఱీతప్పుతుందేమో" అన్నాను అతనితోటి. దానిమీఁద తిరపతిశాస్త్రి అన్నాఁడు కదా- "బాగుందిరోయ్! మొట్టమొదటినుంచీ

మొదటిచరణం నువ్వు చెప్పడం ఆచారం కనక చెప్పమన్నాను కాని చేతకాక కాదు. తప్పని తెలుస్తూ వున్నప్పుడుకూడా తప్పులే చెప్పమన్నానానే" నన్నాఁడు. యిక్కడికి "సభంతా గొల్లలే" అన్నట్టయిందా? అయినా యింకా యెవరేనా యీగుట్టు తెలుసుకున్నవారు సభలో వున్నారేమో అని "అయ్యా! తప్పిందని మావాళ్లందఱూ అంటూ వున్నారు. నాకు తప్పలేదని తోస్తూవుంది; మీ రేమంటా"రన్నాను. వారున్నూ "తప్పినట్టే వుం"దన్నారు. "అలా అయితే యిప్పుడు చూడండీ" అంటూ "వరాం భాస్వరామ్" అనే అక్షరాలు తుట్టతుదనుచేర్చి స్వరంకాదు, గమనాన్ని మార్చి చదివేటప్పటికి పృథ్వీవృత్తపాదంగా కనపడడంతోబట్టే అందఱూ డిల్లపోయారు.

ఈ వ్రాతకు ఫలితం నాకు సంబంధించిన వుత్తరకుమారప్రజ్ఞలను ఈ "ముదిముప్పన బాలపాపచిన్నె"గా లోకానికి వెల్లడిచేసి తద్ద్వారాగా అపహసించబడడమేనా? నాటి అవధానాని కేమేనా వుపకరిస్తాయా? అంటే, నాకు తోఁచినమాటలు వ్రాస్తాను వినండి. యీపోకడ తప్పుకాని దాన్ని తప్పుగా కొమ్ములు తిరిగిన పండితకవులను, అందులో నాకన్నా మిన్నా అనుకోతగ్గ తిరుపతిశాస్త్రి అంతటివాణ్ణి నమ్మించి మళ్లా వొప్పుకింద వొప్పించడం జరిగింది. కనక, యీపైని నిజమైన తప్పుచెప్పినా పృచ్ఛకులు తలవంచుకొని కిక్కురుమనక వ్రాసుకోవడమేగాని మళ్లా నోరు మెదపడం అంటూ వుంటుందా? దానితో అవధానభారం యెంతో తేలికవుతుంది.

యీలాటి లబ్జులు నావద్ద వుండడం తి. శాస్త్రికి బాగా తెలుసును. నా సహవాసం వల్లకూడా యివి అతనికి అబ్బలేదు. యివి యేలాటివి? అంటే "పుట్టి నేర్చుకొనెనొ, పుట్టక నేర్చెనో చిట్టి బుద్ధు లిట్టిపొట్టి వడుగు" అని పోతరాజుగారు చెప్పినమాదిరివి. ఆ యీ చిట్టిబుద్ధులకు సంబంధించిన యితిహాసాలు యింకా చాలా ఉన్నాయి. వీట్లనుబట్టే మాతిరుపతి శాస్త్రికి నాయందు యెక్కువగౌరవం వుండేది. దాన్నే నేను అతని అనంతరమందు జరిగిన సానుభూతిసభలో

"ఎవఁడు నా కెక్కుడయ్యు నాయెడలఁ గార
ణాంతరమ్మున గురుభావ మంతరంగ
ముననెకాక పయికిఁగూడఁ గనఁగఁజేసె
నట్టి తిర్పతికవి దివికరిగె నకట."

అని గూఢంగా, సూత్రప్రాయంగా వుటంకించి వున్నాను.

యీలాంటి "వుత్పన్నమందబుద్ధులకు" సంబంధించిన నా చేష్టలను బట్టేనేను "అభినవ రామలింగ బిరుదాంకుఁడను" అంటూ వక రాజసభలో వొకానొక సందర్భంలో ప్రత్యేకించి

నన్నుఁగూర్చి పేర్కొని వున్నాను. మాకు వున్న బిరుదులన్నీ వుమ్మడి దమ్మడిగా వుండవలసినా యిదివొక్కటీ పృథక్కుగా వుండడానికి కారణం యీ "వుత్పన్న మందబుద్ధులే" అని విజ్ఞులరయుదురుగాక! యీ సందర్భాలు నేను వ్రాయడం అపహాస్యాస్పదమయినా వ్రాయవలసి వచ్చింది, క్షంతవ్యమని కోరుతాను.

తిరుపతిశాస్త్రులుగారు ముక్కుకు సూటిగా వెళ్లేవారేకాని యీ మార్గంలో వారు కారన్నంతలో ఆయనకి వచ్చేలోటులేదని నా నమ్మకం. దీనివల్ల అధఃకృతి రాకపోవడమే కాక పురస్కృతికూడా కలుగుతుందనే ధైర్యంతో దీన్నిందు పేర్కొన్నాను.

కలహం యెవరితోనేనా సంఘటించినా నేను దాన్ని పాటించకుండా ఆవలివారు మాట్లాడితే మాట్లాడడానికి యిష్టపడతాను. మావాఁడికి అదికిట్టేదికాదు. కొప్పరపువారిని తిరుపతిశాస్త్రితో సంప్రతించకుండానే అభినందన పద్యాలు వ్రాసి బందరుకు అవధానార్థం రావలసిందని ఆహ్వానించింది నేనుమాత్రమే. ఆ విషయం "అయ్యా! కొప్పరపుం గవీశ్వరులు" అనే పద్యాలు చెపుతాయి. అతనిసమ్మతికూడా వున్నట్టు అందలి "తిరుపతి వేంకటేశ్వరులు" అనే చేవ్రాలు చెప్పినా అది మా అచార ప్రకారం చేసిన చేవ్రాలేకాని అతనిసమ్మతిని నిరూపించేదికాదు. అప్పుడే కాదు యిప్పుడే కాదు, వారియందు నాకు పరమాదరమే. వారికున్న శక్తి సామర్థ్యాలను యెంతవఱకు గౌరవించాలో అంతవఱకేకాక హెచ్చుగా గౌరవించడం నాకు యిష్టమే. అయితే యేంచేసేది? మా తిరుపతి శాస్త్రికి సమకాలికులలో యెవరికవిత్వమూ నచ్చేదికాదు. అందులో వారి కవిత్వమంటే మఱీ యెదురు తిరిగాఁడు. "ముసుఁగులో గుద్దులాట" తటస్థించింది. యెవరికేనా "సర్టిఫికట్టు" యివ్వవలసివస్తే "బ్రహ్మిష్ఠో బ్రహ్మం" మీఁద నాతో పాటు చేవ్రాలుచేసేవాఁడే కాని మనఃపూర్వకంగా కాదు. (యీ సర్టిఫికెట్టుగాథకు సంబంధించిన వక చిత్రమైన విషయం నెల్లూరులో జరిగిందివుంది. దాన్ని శ్రీ వేమూరి శ్రీరామశాస్త్రులుగారు బాగా యెఱుఁగుదురు. వారు చెపితే వినఁగలందులకు కోరుతాను.) "నీకు బాగుండని కవిత్వమంటూ లేనేలేదు. అన్నీ బాగానేవున్నాయంటావు. నీమాటకు విలువేమిటి?" అని నన్ను సణిగిపోసేవాఁడు. యెంత సణిగినా చేవ్రాలుమాత్రం చేసేవాఁడు. యీ విషయంకూడా ఆలాగే జరిగిపోతుం దనుకున్నాను. పూర్తిగా పట్టుపట్టాఁడు. ఆ కవీశ్వరులున్నూ, మఱికొందఱు పెద్దలున్నూ వచ్చి మమ్మల్ని విందుకు ఆహ్వానించే సందర్భంలో నేను వారిని అభినందిస్తూ వుంటే అనభినందనానికి ప్రారంభించాఁడు. యేంచేసేది? మళ్లా అతని వాక్యాలు ఖండించి అభినందనానికే వుపక్రమించాను. కాని మళ్లా పూర్తిగా యెదురు తిరిగాఁడు "తోఁటకూరలో పురు"గన్నట్టుగా వారి ఆశుధారాప్రజ్ఞను యీసడించడానికి ఆరంభించాఁడు. నాకు

"ప్రాణగొడ్డం"గా కనపడింది. తరవాత వూరువెలపలికి వెళ్లి రహస్యంగా మందలించాను. కాని ప్రయోజనం లేకపోయింది. తలతిక్కపట్టు పట్టి కూర్చున్నాఁడు. 'ససేమిరా' అన్నాఁడు. ఆ యీ విషయం 'గుంటూరిసీమ'లో సూత్రప్రాయంగా వివరించే వున్నాను. పలువురు యెఱిఁగిందికూడాను. తుదకు సభలో యేదో యితఁడు రసాభాసు చేస్తాఁడని నాకు పూర్తిగా భయంకలిగింది. దానికి తథ్యంగా ఆసనచర్చ వచ్చింది. అప్పుడు అతఁడు చేసే రసాభాసు ముందు జరగఁబోతుందని యెఱిఁగివున్న నేను - అంతకంటే కొంత పాయంటు వున్నది గదా అని చెప్పి నేనే ప్రాచీనావీతిమార్గం త్రొక్కి సభలో తినవలసినతిట్లూ, దీములూ నేనే భరించవలసివచ్చింది. అతఁడుమాత్రం నిస్తరంగ సముద్రంలాగ వూరుకున్నాఁడు సమయానికి. అతఁడు చేయఁదలఁచిన రసాభాసేమిటంటే; అది నాకు ముందే వివరించాఁడు- "వారు గనక యీవేళ సభలో మనలనుగుఱించి అభినందన పద్యాలు ఆశువులో చెప్పేయెడల అవి రసవంతంగా, నిర్దుష్టంగా వుంటే వూరుకుంటాను. ఆలా వుండకపోతే వారిని నే నేమీ అనేది లేదు గాని 'నారాయణ! నారాయణ!' అంటూ చెవులు మూసుకుంటా"నన్నాఁడు. అయ్యా! యెంతటి మహా కవికేనా గంటకు వందలకొలఁదిగా లెక్క వచ్చేటప్పుడు రసం రావడమున్నూ, నిర్దుష్టత్వమున్నూ సాధ్యమవుతుందా? పయిఁగా వారు మమ్మును అభినందించే సందర్భంలో వారిని యీసడించడం యెక్కువ రసాభాసుగా వుంటుందని నాకు భయంవేసింది. యెంత చెప్పినా తోవలోకి రాలేదు. యీలాటి పెంకెపట్టుపట్టడం అతనికి తఱుచు వుండేది. అది అతని అన్నలదగ్గిరా వుంది. యింకా యిప్పటికీ వక అన్నగారు జీవించే వున్నారు. ఆయనతో కొత్తగా మాట్లాడవలసివస్తే విధిగా పోట్లాటవచ్చి తీరుతుంది. కాని యెంతో మంచివాఁడు. ఆ మంచి యెవరికి తెలుస్తుంది? అందఱికీ తెలిసేది "తలతిక్కపట్టే". యీ విషయం మనస్సులో పెట్టుకొనే

> చ. "తిరుపతిసింగమున్ సరిగఁద్రిప్పి ప్రశాంతమొనర్ప వేంకటే
> శ్వరునకుఁ దక్క నీయనుఁగు బావకు గీవకు నోజగూర్చు నీ
> గురునకుఁ జర్ల చంద్రునకుఁగూడ వశం బెటు లయ్యెడున్ దురు
> ద్ధర మది నేను దానిబలు ధాటికి నొక్కొకవేళ జంకెదన్"

అని గీరతంలో వ్రాసివున్నాను. సర్కసులో సింహాలను ఆడించే మానేజరుకి దినదినగండంగా వుండడం అంతా యెఱిఁగిందే. ఒక్కొక్కప్పుడు యితఁడు యెదురు తిరిగితే నాగతికూడా ఆలాగే వుండేది.

సరే! గుంటూరువిషయం తుదకి నామీఁదకే వచ్చింది. అంతా నన్నే దుషించారు. తిరుపతిశాస్త్రి మంచివాఁడే అయినాఁడు. యేదో జరిగిపోయింది. ఆ తర్వాతకూడా కొప్పరపు

సోదరులకు నాయందు అంతరంగప్రేమ పోలేదు. వారిని నేను యెంతో ప్రేమతో ఆహ్వానించినవాణ్ణని వారు గుర్తించకుండా వుంటారా? దానికి తార్కాణంగా యిటీవల కొన్నాళ్లకు శ్రీ రాజా మంత్రిప్రగడ భుజంగరావుగారి కుమార్తె వివాహంలో తారసించాము. అన్నదమ్ములందఱూ అప్పటికి బాగానే వున్నారు. భోజనాలవేళ కలుసుకున్నాం. క్షేమసమాచారం అడిగారు. ప్రీతిగా మాట్లాడారు. నాకూ యెంతో సంతోషమయింది. ఆ కాస్తసేపూ చక్కగా ఒక్క కడుపునఁ బుట్టినవాళ్లలాగ మాట్లాడుకున్నాం. తిరుపతిశాస్త్రి ఆ పెళ్లికి అసలే రాలేదో, అక్కడికింకా రాలేదో బాగా జ్ఞాపకంలేదుగాని, పెళ్లిలోకాక మళ్లా జరిగిన యింకోకొత్త పెండ్లిసభలో శ్రీ జమీందారుగారు కవిత్వ సభా యాజమాన్యాన్ని నామీఁదే వుంచారు. వారిని, మమ్మల్నీ అందఱినీ సమానంగా గౌరవించారు. మావాఁడి వుద్దేశం వారికీ మనకీ గౌరవంలో యేదో కొంచెమేనా తేడా వుండాలని. నాకున్నూ యీ చేదస్తం లేకపోలేదుగాని, యిదేమేనా పరీక్షార్థం యేర్పడ్డసభ కనకనా ఆలాటి తేడాపాడాలకు? భోజనంలో అందఱికి అన్ని పిండివంటలూ సమంగా వడ్డించడం యేలాటిదో, యిదీ ఆలాటిదే అని సరిపెట్టుకోవడం నా తాత్పర్యం. అందుచేత నాకేమీ లోటుగా కన్పించలేదు. యితఁడేనా యేమీ అంటాఁడనుకోలేదు నేను. అంతట్లో జమీందారుగారిని అభినందించడానికే అనుకున్నాను వకపద్యం ప్రారంభించాఁడు. దాని చివరచరణాలలో వివాదాంకురబీజాల్ని నాటుతూ "పులులన్ మేఁకల నొక్క చెర్వున జలమ్ముంద్రావఁగాఁ జేయు చర్యలు చూపించితివయ్య!" అన్నాడు. ఆపట్లాన్ని కొప్పరపుసోదరులలో పెద్దాయన అనుకుంటాను, అందులోవున్న "మేఁకలు" అనేది తమ కన్వయించుకోవలసినదిగా అనుమానపడి యేదో పద్యం మళ్లా ప్రారంభించి "గజంబుల సింగంబుల నొక్క చెర్వున జలంబున్ ద్రాగఁగా" అని చదివి తమయందు సింహత్వం సంపాదించుకొని సంతుష్టిపడవలసివచ్చింది. అంతట్లో ఆవిషయం అప్పటికయితే ముగిసింది. కాని, లోపాయికారీని యింకా వీరికి లోలోపల రగులుతూనేవుంది. నేనైతే "అనవసరం, గతించిందేమో గతించింది. మళ్లా యెందుకురా" అని దిగపీఁకుతూనే వున్నాను కాని, బసలో నామీఁదికి యెదురుకొని గర్జిస్తూ "గోరీ కట్టింపనె? కాకవిప్రతతి కర్థిన్నేఁడు హేలాపురిన్" అని దూఁకుతూవున్నాఁడు. ఆ సందర్భంలో కర్మం చాలక నే నన్నానుగదా "దీనిపేరే వెట్టివెల్నాటీయం" అనిపించుకొంటుందన్నాను. దానితో తోఁకతొక్కిన తాచులాగ నామీఁదకి లేచి "క. వెలనాటివాఁడఁ గవితకు, వెలనాఁటినవాఁడ" అని హుంకరించాఁడు, కొడతాఁడేమో అనికూడ భయపడ్డాను. ఆయాపద్యాలన్నీ "సందర్శనం"లో వుంటాయి చూచుకోండి. మా శివరామశాస్త్రి బావమఱది మైలవరపు కృష్ణమూర్తిగారి గృహంలోనే యీ కోలాహలమంతా జరిగింది. తుట్టతుదకు జమీందారుగారి దాఁకా వెళ్లి యీ

పద్యాలువినిపించే దాఁకా ఆతని ఆవేశం అఁగిందేకాదు. “యేదో మావాఁడు తొందర మనిషి ఆయీపద్యాలు చెప్పాఁడు. చెప్పినవి మీకువినిపించకపోతే ప్రకటనానికి అర్థం కాపని వినిపించవలసి వచ్చిం”దంటూ సబోరీగా జమీందారు గారికి నచ్చఁజెప్పాను.

యింతటితో యిది ముగిసినట్టే. కాని ఆ యేలూరులో తత్కాల మందు శ్రీ వేమూరి శ్రీరామశాస్త్రి శతావధానిగారు నివాసంగా వున్నారు. ఆయన శ్రీ. వ. సు. రాయకవిగారినీ, శ్రీ కొప్పరపుసోదరకవులనూ, మమ్మల్నీ, శిష్యుఁడు శివరామశాస్త్రినీ విందుకు పిల్చారు. ఆ విందుకు వెళ్లడం అతనికి సుతరామున్నూ యిష్టంలేదు, తుదకు యేలాగో రావడం వచ్చాఁడు. మొత్తం యేలాగయితేయేమి, శివరామశాస్త్రిని విడఁదీశాఁడు. “మా యిద్దఱికీ యీపూఁట భోజనం అవసరంలేదు. అజీర్తిగావుం”దన్నాఁడు. కాదుకూడదని బలవంతంచేస్తే మఱింతచెడి రసాభాసులోకి దిగుతుందని నాకు పూర్తిగా తెలిసేవుండడంవల్ల అసలు కుల్లస్సు యెఱిఁగిన నేనుకూడా “వాళ్లని బలవంతపెట్టకండి ‘అజీర్ణే భోజనంవిష’ మన్నారుకదా?” అని వాళ్లమాటలనే బలపఱిచాను. వారిద్దఱూ వినాగా భోజనం జరుగుతూవుంది. అప్పుడువచ్చి “అబ్బా! మా మిక్కటంగా ఆఁకలవుతూఉంది. త్వరగా వడ్డనకావా”లంటూ ప్రారంభించాఁడు. యీలాటి ప్రయోజనం మాలిన కొంటెతనాలు ఆమరణమూ ఆతన్ని వదలనే లేదు.

శృంగారంలో అంతగా రచించిన రచన అతనిది లేదుగాని కొంటెతనపు పద్యాలుమాత్రం కొన్నివున్నాయి. అవి రికార్డులో యిప్పటికీ జాగ్రత్తపెట్టఁబడే వున్నాయి గాని, వుదాహరిస్తే యీకాలపు నాగరీకం అంతగా ఆమోదించదేమో!

“ఒంటిమిట్టను గాఁపురం బున్నయట్టి । సిద్ధిసానికి సంకల్పసిద్ధిరస్తు,
చెలఁగిమాఁమీఁదఁ బద్యమ్ము చెప్పినట్టి । పాపరాజుకు నిధువనప్రాప్తిరస్తు”

అనే కంకంటివారి పద్యం మాదిరిలో కొన్ని వుంటాయి. కొన్ని యింకా ముదరపాకంలో వుంటాయి. వాట్లకుపోలిక –

చ. “వదలక మ్రోయునాంధ్రకవి వామపదమ్మున నున్న నూపురం
బుదితమరాళకంఠ నినదోక్తుల నేమని పల్కెఁ బల్కుఁడీ
గుదియలసాని ... ... ... ... ... ... గల భాగ్యరేఖ నీ
నుదుటను లే దటం చమర నూత్నపురంధ్రులతోడఁ బల్కెడిన్.”

అనేపాకంలో వుంటాయి. యీ పద్యం అల్లసాని పెద్దన్నగారిని గూర్చి శ్రీకృష్ణదేవరాయలు పెద్దన్నగారి మరణానంతరం ప్రశ్నించినప్పుడు రామలింగం వేళాకోళంగా పెద్దన్నగారి శృంగారానుభవస్ఫోరకంగా చెప్పినట్టు చెప్తూతారుగాని

కృష్ణదేవరాయలు పెద్దన్నగారి మరణానంతరం జీవించివుంటేనేకాని ఆయీవిషయం సమన్వయించదు. కృష్ణదేవరాయల మరణానంతరం పెద్దన్నగారు చెప్పిన "ఎదురైనచోఁ దన మదకరీంద్ర" పద్యం అందఱూ యెఱిఁగిందేకనక విస్తరించను. "పుక్కిటిపురాణ" వ్యాసంలో యీలాటి విషయాలెన్నో చర్చించివున్నాను. ఆ కవుల జీవితానంతరం వారినిగూర్చి పుక్కిటిపురాణాలెన్నో బయలుదేరాయి. కాని మమ్మల్ని గురించి మా యిద్దఱి జీవితకాలంలోనే యెన్నో పుక్కిటిపురాణకథలు బయలుదేఱాయని మే మిద్దఱమున్నూ యెఱుఁగుదుము. ఇటీవల అతని జీవితానంతరం మఱికొన్ని బయలుదేరడం యింతకుపూర్వమే నేను యెఱుఁగుదును.

ఆయీరకం కొంటెపద్యాలు తి. శాస్త్రిగారివి కొన్ని వున్నాయనే ఘట్టంలో మన మిప్పుడు వున్నామనేది ప్రస్తుతం. ఆ పద్యాలల్లో వక్కటీ వుదాహరించకపోవడం యిప్పటి నాగరికులకు బొత్తిగా రుచించవనేకాని మఱొకటికాదు. ఆ పద్యాలల్లో కొన్ని శ్రీనాథుఁడు పల్నాటిసీమలో చెప్పిన వాట్లని పోలివుంటాయి. యీలా వూరించివూరించి వకటీ వుదాహరించకపోతే కొందఱు చదువరులు బొత్తిగా హతాశులవుతారు కనక, చాలా మృదుపాకంలో వున్నదాన్ని వకదాన్ని వుదాహరిస్తాను.

ఉ. "నన్నొకనాతి 'రేపటిదినమ్మునఁ బోయెదుగాక' యంచుఁ గ్రా
ల్గన్నుల నీరు జాఱ వికలమ్ముగ గద్గదకంఠి యయ్యెన
య్యన్నులమిన్నతోడ 'వల' దంచుఁ బెనంగిన మానదయ్యె నన్
మన్ననఁ జూడు రేపటి దినమ్మునఁ బోవుదమయ్య మిత్రుఁడా"

ఆ యీ రచనవల్ల తి. శాస్త్రిగారి శృంగార రచన యేలాటిదో రసజ్ఞులు తెలుసుకుంటారు. ఇందులో "మిత్రుఁడా" అనే సంబోధన నన్ను ఉద్దేశించినదని వ్రాయనక్కరలేదు. అతనికి నావలెనే విడివిడి పదాలతో రచన సాగించడమే యిష్టంకాని, యేవో సమాసాలతో పద్యాన్ని పూరించడం యిష్టంకాదు. అయితే రసానుగుణంగా సమాసభూయిష్ఠమైన రచన కావలసివస్తే "సంస్కృతం బుపచరించిన పట్టున భారతీవధూటీ తపనీయ" అని పెద్దన్నగారు అందుకున్నట్టు అందుకుంటాఁడు. అట్టిది, అతనిది అవునా కాదా అనేశంకకు అవకాశం లేనిది వకటి వుదాహరిస్తాను.

శా. "మాకన్నన్ మహనీయులైన కవులీ క్ష్మామండలిన్ లేకపో
రీకాలమ్మున యుష్మదీయకవితా ద్వీపమ్ము ముంచంగ న
స్తోకశ్రీక మదాశుధారకవితా తుంగార్భటీ ఘోరగం
గాకల్లోలవతీ ప్రవాహభరవేగ ప్రక్రియల్ చాలవే?"

అతని సమాసప్పోకడ యేలా వుంటుందో దీనివల్ల కొంత తెలుస్తుందా? అయినా యింకొకటికూడా వుదాహరిస్తాను.

చ. "గరువము మాటలందుఁ జెలఁగన్ జగమెల్లఁ జరిపఁజాలు ద్రి
మ్మరితన మేకవీంద్రులకు మైకొనజాలు నిరర్గళాద్భుతా
కరరసపుంజ మంజుల వికస్వర చారుకథా సుధాధురం
ధరబహుళ ప్రబంధ కవితా వనితా చతురోక్తి లేనిచోన్."

యివి రెండూ సమాసధోరణినేకాక విడిపదాలకూర్పునుకూడా తెలుపుతాయి. ఫలానావారి కవిత్వమని చెప్పకుండా వుండేపద్ధతిని యే నన్నయ్యభట్టు కవిత్వమో అనే భ్రమను కలిగించితీరుతుందో, లేదో పయిధార విజ్ఞులు విచారించడానికి అర్హులు. నన్నయ్యగారి పద్యంకూడా వకటి వుదాహరిస్తున్నా.

చ. "జలధివిలోల వీచి విలస త్కలకాంచి సమంచితావనీ
తలవహనక్షమం బయిన దక్షిణహస్తమునన్ దదున్నమ
ద్గళదురుఘర్మవారికణ క్రమకరాబ్జము వట్టి నూతిలో
వెలువడఁ గోమలిం దిగిచె విశ్రుతకీర్తి యయాతి ప్రీతితోన్."

యీ వుదాహరించిన నన్నయ్యగారి పద్యంగాని, తిరపయ్యగారి పద్యాలు రెండూగాని కేవలమూ పద్యమంతా యేకసమాసంగా వున్నవి కావు. అట్టివి యెన్నో వుభయులవీ వుంటాయి చూచుకోండి. ఉన్నప్పటికీ నేను వీట్లని వుదాహరించడానికి కారణం యేమిటంటే, జవాబు చెప్పలేను. చెప్పకపోయినా విజ్ఞులు తెలుసుకుంటారు. చెప్పినా తెలుసుకోలేరు తదితరులు. అందుచేత "మౌనవ్రతాలంబినః". యింఁక నా రచనల్లో నుంచి కూడా ఒకటిరెండుదాహరిస్తాను.

శా. "బాలమ్మన్యులపోరు కీర్తికరమో? ప్రాగల్భ్యసందర్భమో?
శీలాలంకృతియో? భవత్సుకవితా సీమంతినీ చారులీ
లాలాస్యాసుగుణంబొ? యేమిపనికై లాభించునో? తెల్పు మీ
యాలం బింతటఁ జాలుఁజాలు నిఁక నే లా తూలికాచాలనల్?

మ. మొనగాఁ డొక్కరుఁ డారుమాసములు సామున్ జేసి మార్మూలఁబం
బిన భీపెంపున డాఁగియున్న ముసలాపెన్ బోరికిన్ జీఱులా
గునఁ గూపస్థితదర్దుర ప్రకర దుర్గోష్ఠీ విరావార్భటీ
జనితాహంకృతిశాలివై పెనఁగు టే చందంబు నీబోఁటికిన్?"

గీరతం మందలింపుపర్వాన్నుంచి వుదాహరించిన యీ పద్యాలు కూడా నారచనలో పూర్తి సమాసధారను బోధించవు. దానికి "శాంతింపుడని రాయబారమవురా!" అనేవిన్నీ, లోకాభిరామాయణంలో వున్న "అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు" అనే పద్యాలలో కొన్నిన్నీ చూచుకోండి. ఆ "తిర్పతిద్విజుఁడు" అనే వాట్లలోమాత్రం నాలుగువంతులలో మూఁడువంతులు తిరపతిశాస్త్రివిగా తెలుసుకోండి అని గతంలో వ్రాసేవున్నాను. కవి యెవఁడుగాని, యెక్కడఁగాని సమాసం పెట్టాలని పెట్టడు, విడిపదాలేగా వ్రాయాలనీ వ్రాయడు, ఆయా రససందర్భాన్ని పట్టి "అర్థాశ్శబ్దచయాః" అని కుట్టికవి చెప్పినట్టు దొర్లుతాయి.

చ. "జిలిబిలిపల్కులున్ సొగసుఁ జిల్కెడి ముద్దులు తాఱుమారులున్
వలపులచోద్యముల్ మిగుల వన్నెలు చిన్నెలుగల్గు కౌఁగిలిం
తలు బతిమాలుటల్ కసరి తప్పులు వట్టుటలున్ జెలంగు కాం
తలరతమే రతంబు మఱి తక్కిన వెల్లఁ గ్రియాప్రధానముల్."

అనే పద్యం తెలుఁగుమాటలతో చెప్పాలని "చెప్పిందేనా?" కొన్ని పద్యాలు తెలుఁగు పదాలతోటే ప్రారంభమవుతాయి. అంతట్లో సంస్కృతంలోకి దూఁకుతాయి. ఆ పట్లాన్ని యిఁక సంస్కృతంగానే పద్యమంతా పూర్తి అవుతుంది. కాఁబోలు ననిపిస్తుంది. అంతట్లో మళ్లా తెలుఁగులోకి దొర్లుతాయి. దీనికి తల్లక్రిందులుగా కొన్ని నడుస్తాయి. యీ కర్మాలన్నీ వివరించవలసివస్తే చాలా పెరుఁగుతుంది. యీ తుట్టతుదిమాటలకు కొంచెం వుదాహరణంగా వుండే వకపద్యాన్ని వుదాహరించి విషయాంతరం వుపక్రమిస్తాను.

మ. "ఉరువేగ స్ఫురణాగపాటన పటుద్యోవాహినీ వార్ఝరీ
పరిణాహారభటీ పటాత్కృతులకున్ బ్రభ్రష్టసారంబులౌ
తరుషండమ్ములు నిల్చెనేని భవదుద్యద్వ్యాఘ్రరాసారపు
ష్కరకోలాహలమున్ సహింపఁగలుగున్గాకవ్యహంకారముల్"

యీ పద్యంలో తి. శాస్త్రిగారి కవిత్వాన్ని వెం. శాస్త్రి వర్ణిస్తున్నాఁడు. సమాసంతో ప్రారంభమైంది. మళ్లా విడివిడి తత్సమ పదాలు కొంచెం దొర్లాయి. మళ్లా సమాసం ప్రారంభమయింది. మళ్లా విడివిడి తత్సమాలతో పూర్తిఅయింది. "మొనగాఁడొక్కరుఁడు" అన్నదో కేవలం తెలుగుతో ప్రారంభమైంది. మళ్లా సమాసంలోకి దూకింది. మళ్లా విడివిడి పదాలల్లోకి వచ్చింది. ఆయీవిధానమంతా తిరుపతిశాస్త్రిగారివని వుదాహరించినవాట్లల్లో కూడా చూచికోండి. వ్రాసినకొద్దీ వ్రాయవలసే వుంటుంది. లోకాన్ని మోసపుచ్చడానికి వ్రాయాలంటే, కొన్ని సమాసాలు వ్రాయవచ్చును. అందులో అర్థం లేకుండా "దశదాడిమాది"

వాక్యంవలె వ్రాసినా యెవ్వరూ అసలు గ్రంథకర్త చెప్పేదాఁకా కనిపెట్టనేలేరు, యెందుచేత? "యేదో అర్థంలేకుండా వుంటుందా? మనకు గోచరించింది కా"దనుకుంటారు. అట్టిది శ్రవణానందంలో వకటి వ్రాశాను. యిక్కడ వుదాహరిస్తాను.

ఉ. "వేసవి వచ్చె భాస్కర నవీనగవీ నమితాఽమితాచ్ఛ గు
చ్ఛాసవ వాసనైక వలనా కలనా కులనాయికా సము
చ్ఛ్వాసన శాసనాదికృతి ఝుంకృతి సంకుల షట్పదావళీ
భాసుర శుష్కపుష్ప విటపప్రకర ప్రతిభాసమానమై."

యీ పద్యంలో అర్థంలేదని యెవ రనుకుంటారు? వుందే అనుకుంటారు. తీరా లేదని యెవరేనా సాహసించి అంటారే అనుకుందాం. యెవరో చెప్పి సమన్వయిస్తారు. మా జీవితకాలంలో అయితే మేమే చెపుతాము. దీనిపేరేమిటి? కవిత్వంకాదు; పాండిత్యం అనిపించుకుంటుంది. చూడండి, యీమధ్య బ్రహ్మశ్రీ చర్ల భాష్యకారశాస్త్రులుగారు "మేకాధీశా" అనే నాలుగక్షరాలు పల్లవిగాగ్రహించి, సుమారు క్రౌనుసైజులో అయిదారు వందల పుటలగ్రంథం వ్రాశారు. దానిలో భారత, భాగవత, రామాయణాదులన్నీ వ్యాఖ్యానించారు. యేమీ ఆలా యెందుకు వ్యాఖ్యానించకూడదు? ఓంకారంలో సమస్తవేదాలూ, స్మృతులూ, శాస్త్రాలూ అన్నీయిమిడి వున్నాయని ఋషులు చెపుతూవున్నారా, లేదా? అది అసత్యమా? కాదు. ఆలా వున్నట్టు నిరూపించడం యేమనిపించుకుంటుంది? కవిత్వమనిపించుకుంటుందా? అనిపించుకోదు, పాండిత్యమనిపించుకుంటుంది.

చాలాదూరం వ్రాశాను. బాగా విచారిస్తే కవిత్వం వేఱూ, పాండిత్యంవేఱూకాదు. కాఁబట్టే "సూరిః పండితః కవిః" అని అమర కారకుఁడు పర్యాయపదాలుగా వాడివున్నాఁడు, కాని కవిపదం వేదాల్లోకూడ తఱుచు వాడఁబడి వుంది. పండితపదం కూడా వాడఁబడి వుందేమోకాని కవిపదానికి వున్నంత ప్రయోగబాహుళ్యం దానికి లేదేమో? యేమీ వేదం రానివాళ్లకు కూడా "శుచిర్విప్రశ్శుచిః కవిః" "కవిం కవీనా ముపవశ్రమస్తమమ్" అంటూ బోలెఁడు ప్రయోగాలు దొరుకుతాయి.

యేమైనాసరే, క్రమంగా కొన్నాళ్లకు కవివేఱూ, పండితుఁడు వేఱూగా వాడకంలోకి దేఁకింది ప్రవృత్తి, సామాన్యుల ప్రవృత్తి అనుకున్నారేమో? మహాపండితుల ప్రవృత్తే. అందుచేతేకదా అప్పయ్యదీక్షితులవారు "పిళ్లః కవిరహం విద్వాన్" అనడం తటస్థించింది. యీ అనడంలో 'పిళ్ల'కుఁ యెక్కువగౌరవం యిద్దామనికాదు. కవికంటే విద్వాంసుఁడే మాననీయుఁడనే తాత్పర్యంతోనే దీక్షితులవారి నోటమ్మట ఆవాక్యం దొర్లింది. అప్పయ్యదీక్షితులు మహాకవి. అయినా ఆయనకు పండితుణ్ణనిపించుకోవాలనే కుతూహలం.

పిళ్ల అంటే వేదాంతదేశికులు. ఆయన మహాకవియై, మహావిద్వాంసుఁడు కూడా అయివున్నారు. ఆయనకు కవితార్కికసింహుఁడనే బిరుదం. ఆ కాలంలో మహావిద్వాంసులంతా యేకవాక్యతగా శిరసావహించినది వుంది. అట్టివాణ్ణికూడా కేవల కవులలో జమకట్టి తద్ద్వారాగా ఆత్మపాండిత్యోత్కర్షను వెల్లడించుకోవడానికి అప్పయ్యదీక్షితుల వారి ప్రయత్నం. యిందుకోసం కొంత స్వార్థత్యాగం చేయాలి. కనక తాను మహాకవియై వుండికూడా ఆ కవిత్వ ధనాన్ని త్యజించినట్లయింది.

యీ పండితుల ప్రవృత్తులు ఎంత విమర్శించినా తేలవు. వీరి తారతమ్యనిర్ణయం చేయడానికి యెవరికీ శక్యంకాదు. యెఱిఁగినవిజ్ఞులు క్వాచిత్కంగా లేకపోలేదు గాని, వారిమాటలు సామాన్యులు విని తాత్పర్యాన్ని అవగతంచేసుకోలేరు. వారి వారికి తోఁచినట్టల్లా ప్రచారం చేస్తూ వుంటారు. వారికి యెవరియందుఁగాని ద్వేషం వుండదు. "శివకేశవ"వాదంలాగ యీ వాదం యెడతెగకుండా యెల్లప్పుడూ జరుగుతూనే వుంటుంది. ఆ శివకేశవులు ప్రత్యక్షమై "నాయనలారా! మీ రెందుకు వాదించుకుంటారు? మా యిద్దఱికీ భేదం లేదు. "శివాయ విష్ణు రూపాయ... శివస్య హృదయం విష్ణుః" అంటూ నిష్కపటంగా బోధించినా ఆకాస్తసేపూ వూరుకొని మళ్లా "పూర్వేతి పూర్వా" అని మామూలు వాదాలకు దిగడం తప్పదు. హిరణ్యకశిప్వాదులు మహాసమర్థులై, మంచి రాజకీయధురంధరులై, యెంతో విజ్ఞానులై భగవత్సత్తనుమాత్రం 'తోసిరా' జని సర్వలోకాలూ పాలించడం జరిగింది. యజ్ఞయాగాల్లో హవిర్భాగాలు కూడా తమకే యిమ్మన్నారు. తుదకు ప్రహ్లాదుఁడుద్వారాగా భగవత్సత్త ప్రత్యక్షీకరింపఁబడ్డది. అంతతో ఆ అపోహ తొలఁగవలసిందేనా? తొలఁగిందా? తొలఁగలేదని చెప్పఁగలమా? తొలఁగా తొలగింది. యెన్నాళ్లు? కొన్నాళ్లుమాత్రమే, మళ్లా మామూలాటే! ఇప్పుడు మనలో దాన్ని నమ్మనివారెందఱు? ఆ నమ్మనివారు పండితులు కారా? విజ్ఞానులు కారా? పండితులూ, విజ్ఞానులూ అనిపించుకోవడానికి సంస్కృతభాష చదివితేనేకాని వల్లపడదా? యే భాష చదివినాసరే అనడానికి విజ్ఞులు అంగీకరిస్తారు. అట్టి విజ్ఞులు యిప్పుడు తొక్కేతోవలు చూస్తే భగవంతుఁడున్నాఁడనే నమ్మిక వారికి లేశమేనా ఆత్మలో వున్నట్టు కనఁబడుతుందా? ఓహో! ప్రసక్తానుప్రసక్తంగా చాలదూరం వచ్చాం. వెనక్కి మళ్లుదాం.

నేనున్నూ, తిరుపతిశాస్త్రులున్నూ యే స్థితిలోనైతే యేమి అవిచ్ఛిన్నంగా ముప్ఫైయేళ్లు కలిసి మెలిసి వర్తించాము. యెన్నో గాథలు వ్రాస్తే వ్రాయవలసివుంటాయి. ఆ పద్ధతిని వక మహాభారతమంతేనా వ్యాససమితి పెరుఁగుతుంది. అతఁడు మహావిద్వాంసుఁడు, మహాకవి. ఛాందసకుటుంబంలో పుట్టినా ఆ బాపతు ఛాందసం- "భోజనం దేహి రాజేంద్ర

ఘృతసూపసమన్వితమ్" వంటిది అతని కవిత్వంలో మచ్చుకు కూడా వుండదు. నడవడిలోమాత్రం కొంతేనా కనపడుతుంది. అభ్యాసకాలంలో యెవరికేనా లోపాలు వుండడమున్నూ, యెవరో సవరించడమున్నూ తప్పనిదే. దాన్నే "కావ్యజ్ఞ శిక్షయాభ్యాసః" అని లాక్షణికులు వ్రాక్రుచ్చారు. ఆ పరిశ్రమ నేఁటి బి. యల్. పరీక్షలో కృతార్థులైనవారు "అడ్వకేటు" పదవికి కృషిచేయడం వంటిది. ఆలా కృషిచేయనివారిలో కూడా పూర్వం భాష్యమయ్యంగారు మొదలైన మహామహులున్నారు. యితఁడు వారిలోవాఁడు కాఁడు. నేఁటి "అడ్వకేట్లు" తరగతిలోవాఁడు. కొంత వయస్సు అతీతమైనపిమ్మట కవిత కారంభించినా యితని కవిత "బలా దాకృష్యమాణా" కాదు, ముమ్మాటికీ కాదు. వయస్సతీతం కావడానికి వేఱు, దాన్ని వ్రాస్తాను కాని పలువురు విశ్వసించరు. జాతకనమ్మిక కలవారు విధిగా విశ్వసిస్తారు.

యివటూరి అయ్యన్నగారు పూర్వకాలపు ప్లీడరు వకరు వుండేవారు. ఆయన యింజరం అనే బ్రాహ్మణాగ్రహారంలో స్కూలుమాస్టరుగా వుండేవారు. అప్పటికి పెళ్లికాలేదు ఆయనకి. ఎవరేనా "అయ్యా! మీరింకా పెళ్లి చేసుకోలేదేమి, యీపాటికి పెళ్లిచేసుకోరాదా?" అని ఆప్తులు ప్రశ్నించి ప్రోత్సాహపటిస్తే ఆయన యేంచెప్పేవారంటే "యిదిగో! యిప్పుడు నా జాతకంలో కుజమహాదశ జరుగుతూ వుంది. వచ్చేవత్సరం కాక ఆవచ్చే పైవత్సరంలో రాహుదశ ప్రవేశిస్తుంది. అప్పుడు నాకు వివాహాది సమస్త వైభవాలూ వక్కమాటుగా పడతాయి. ఆ రాహువు ఆలాటివాఁడు. మిథునరాహువు" అని చెప్పేవారఁట. తుదకు రాహువు వచ్చాఁడు, అన్నట్టే జరిగింది. ఆయన్ని మేం బాగా యెఱుఁగుదుము. ఆయన భార్య సాక్షాత్తూ మహాలక్ష్మీ అవతారమే. ఆ పతివ్రతాత్వం వర్ణనీయం. దాన్ని యిప్పుడు అభినందించదు లోకం. శాంతం, పాపం! నా జాతకానికి కూడా రాహువు మిథునరాహువే. ఆ అయ్యన్నగారు నా జాతకంచూచి ఆలాగే యోగిస్తాఁడని చెప్పడం సందర్భంలో వెనక నేను వింజరంలో విన్నసంగతుల యాథార్థ్యాన్ని ఆయనముఖతః కూడా వినికాని వూరికే నమ్మి యిందు వ్రాయలేదు.

చెప్పొచ్చే దేమిటంటే? తిరుపతిశాస్త్రి మహాకవి కావలసినవాఁడై జన్మించినప్పటికీ సుమారు పద్ధెనిమిదేళ్లదాఁకా ఆ కవిత్వానికి కారకత్వంగల గ్రహదశ రాలేదనిన్నీ, అప్పుడు వచ్చిందనిన్నీ, ఆ సమయానికి యేదో బాహ్యకారణంకూడా వుండాలి కనక, అంతకు ముందే యేకొంచెమో అల్లుతూవున్న నాతో స్నేహం కలిగిందనిన్నీ అనుకోవాలి. సహజ కవి అతఁడు కాఁడనే అర్థం యిచ్చే మాటలు విమర్శనాదూరములు. నాకంటే అతఁడు యెక్కువ పండితుఁడనేవిషయం యేలాటిదేనా నేనుత్తరించతగ్గది కాదు. దానికోసం లోకం

కొట్లాడుకోవలసిందే. అది నా వల్ల యెప్పటికీ తేలేదికాదు. కొన్నిట్లో నన్నెక్కువగానూ, కొన్నిట్లో అతణ్నెక్కువగానూ చెప్పుకోవడమున్నూ "అది కాదు యిది, యిది కాదు అదీ" అని పోట్లాడుకోవడమున్నూ నిన్న నేఁడు పుట్టలేదు. చాలాకాలమై పుట్టింది. రామకృష్ణకవులేమో మమ్మల్ని యిద్దఱినీ ద్వేషించినప్పటికీ అందులో నాయందే వారికి ప్రధానద్వేషం అని అందఱూ యెఱిఁగిందే. అట్టివాళ్లు "...వేంకటేశ్వరుని యాదరణమ్మునఁ జేసి కాక ఆ తిరుపతి మార్గ మిట్టిదని తెల్ప నెఱుంగ నెవండెఱింగెడిన్" అంటూ అతణ్ణి అధఃకరిస్తూ వ్రాసారు. దానికి తి. శాస్త్రికి కొంచెం కోపం వచ్చి మళ్లా ఆలాటి శ్లేషతోటే జవాబిచ్చాఁడు. అవి పలువు రెఱిఁగినవే అయినా ప్రసక్తి కలిగింది కనక వుదాహరిస్తాను.

చ. "తిరుపతిఁ బట్టి నీకుఁ గల తేజ మటంచును, నిన్నుఁ బట్టియే
"తిరుపతి" కంచు మూర్ఖులు పదింబది తంత్రము లెన్నియేని యే
ర్పఱచినఁగాని మీర లవి పాటియొనర్పరు బ్రహ్మచేఁతలె
వ్వరు ప్రతిసేయఁగాఁ గలుగు వారలు తిర్పతివేంకటేశ్వరా!"

యీ పద్యంలోవున్న 'బ్రహ్మ' పదము గురువుగారైన బ్రహ్మయ్య శాస్త్రులుగారిని కూడా చెపుతుందని తెలుసుకోవలెను. వెం. రా. లు అతణ్ణి మాత్రమే అధఃకరించి వ్రాసినా నన్ను కూడా అధఃకరించి మాట్లాడుకొనే వారు అప్పుడున్నూ వున్నట్టు పద్యారంభంవల్లనే తేలుతూవుంది కనక యీ వివాదం కొత్తదికాదనిన్నీ, వెం. రా. లు మాత్రమే తెచ్చిపెట్టింది కాదనిన్నీ విస్పష్టం.

ఉ. "ఏగిరియందు నీవు వసియింతువొ? లీలలుచూపుచుందువో?
ఆగిరి పల్లెయైన జనులందుకు తిర్పతి యంచు దానితో
యోగమె గాని యేటికి వియోగము నీకు ఘటించు? "వీడినన్
భోగము లేదు నీ" కనుట మూర్ఖత తిర్పతివేంకటేశ్వరా!"

యిందులో ఆగిరి + పల్లె అనిన్నీ, "ఆగిరిపల్లె" అనిన్నీ వ్యస్తంగానూ, సమస్తంగానూ చూచుకోవాలి. (ఆగిరిపల్లె అనేది శ్రీ నూజివీటి వారి యిష్టదైవం శోభనాద్రీశ్వరుఁడు వున్నక్షేత్రం.) అనర్గళప్రవాహంగా యీలా కవిత్వం వ్రాసే తిరుపతిశాస్త్రి సహజకవి కాఁడనిగాని, యేదో ప్రయత్నించి చెప్పే కవులలో చేర్చతగ్గవాఁడనికాని యెవరేనా అనుకున్నా ఈ పయినేనా అనుకోరని నమ్ముతాను.

అయితే యెంత యేకీభావం మాయిద్దఱికీ వున్నా లోకమే కాక మాలో మేము కూడా యెఱిఁగిన కొన్ని భేదాలు లేకపోలేదు. అతఁడు నాలాగ యేపిచ్చిపడితే ఆపిచ్చిని

పట్టి పల్లార్చే స్వభావం కలవాఁడు కాఁడు. "సుగ్రీవబొబ్బ" అన్నట్టు వొక బొబ్బపెట్టి మళ్లా దాన్ని తలపెట్టేదే లేదు. నాచేదస్తం ఆలాటిది కాదు. అది తేలేదాఁకా నిద్రాహారాలు సమేతూ తోఁచకపోవడం నా ప్రకృతిలో వుంది. దీన్ని తప్పించుకోవాలని నేనైతే చాలా ప్రయత్నంచేసి చూచానుగాని ప్రయోజనకారి కాలేదు. దీన్ని అతఁడు యెప్పుడూ గర్హిస్తూ వుండేవాఁడు.

ఇంకోటి - తోఁచిందేదో చట్టనవ్రాసి పాఁతేయడమే కాని దాన్ని మళ్లా పరిశీలించడ మంటే అతనికి పట్టేదికాదు. నేను మళ్లామళ్లా చూడడమే కాకుండా వ్రాసినదాన్ని యెందఱికో వినిపిస్తేనేకాని నాకు తోఁచకపోవడంకూడా వుంది. (యీసంగతి లోగడ వ్రాసిందే.) యిది కూడా అతనికి సహ్యం కానిదే. వినిపించడం యెందుకనేవాఁడు.

య్రిాలాటి ప్రకృతిభేదాలు వేఱువేఱు వ్యక్తులైనాక యేలాగా వుండకుండా వుండవు. అప్పటంతకాకున్నా మాటాడితే "డిఫర్మేటరీ" లకు కొంచెంగానేనా సిద్ధపడే ఆ కాలంలో అతనికి ఆ లక్ష్యం లేశమూ వున్నట్టేలేదు. ఆలాటి పదాలుకూడా ప్రయోగించి "తీసేదామురా" అంటే ఫరవాలేదని, ఆలాగే వుండనిమ్మనేవాఁడు. అక్కడికీ నేను కొన్ని తీసేసి వాఁణ్ని. అతఁడు "సాహసుఁడు" అని నేను వ్రాయడానికి యిది వొక కారణం.

సరే పయిఘట్టానికి సంబంధించిందే యింకొకటికూడా వుదాహరిస్తాను.

> చ. "కలవు రసప్రవాహము లఖండఘనాగమశృంగ గౌరవం
> బులు గల వద్భుతాధికవి పోషణ జాతమహాఫలంబులుం
> గల వని యెంచి నీ కలిమి గల్పిరి తిర్పతితోడ దాని మూ
> ర్ఖు లెఱుఁగలేక గుట్ట యనుకొందురు తిర్పతి వేంకటేశ్వరా!"

ఆయీపద్యాల అర్థం బాగా విచారిస్తే తిరుపతి శాస్త్రులుగారు ఆత్మ గౌరవం చెడకుండా, నా గౌరవం చెడకుండా ప్రత్యర్థులకు వాకట్టు కల్పించడంలో యెంత నైపుణ్యాన్ని చూపిందీ విజ్ఞులు గ్రహిస్తారుగదా!

మాలో మేము మా మా తారతమ్యాన్ని గూర్చి వ్రాయవలసివస్తే యింతకన్న వ్రాయడం చేతకాదు, ఇతరులో? వ్రాస్తే వ్రాస్తారు. యీ మధ్య మా - అంటే కేవలం నాకుమాత్రమే - గురుపరంపరలోవున్న వకరు యీ విషయం యెత్తుకొని కొన్ని అక్షరాలు వ్రాశారు. యెంతో సుళువుగా మా తారతమ్మాన్ని అరఁటిపం డొలిచినట్టు తేల్చి చూపి వున్నారు. ఆ అక్షరాలవల్ల యిప్పుడు లోకంలో కొందఱు అనుకొనే మాత్రమేకాక యింకా యెంతో తేడాపాడాలు మాయిద్దఱికీ పాండిత్యంలోనే కాక కవిత్వంలో కూడా వున్నట్టయితే

స్పష్టమవుతూవుందిగాని ఆ బ్రాంతను లోకం అంతా విశ్వసించలేదని అవగతమవుతూవుంది. అంత విస్పష్టంగా వకరు మా యిద్దఱినీ యెఱింగిన పరమపూజ్యులు వ్యంగ్యంగా కాకుండా వాచ్యంగా కూడా తెల్పినప్పంటికీ తేలకపోతే యింకా తేలడం యేలాగ? బహుశః వారి వ్రాయడం అసూయాప్రయుక్తంగా తోసేసి, మళ్లా తెలుసుకోవడానికి ప్రయత్నిస్తూన్నా రన్నది సత్యదూరం కాదు. అయితే వినండి.

వ్యాకరణం యిద్దఱమూ సమానంగానే చదువుకున్నాం. మధ్య కాలంలో నేను కాశీ వెళ్లినా చాలామంది మహాపండితులను సందర్శించడంతప్ప దేశంలోవున్న తిర్పతిశాస్త్రికంటే విశేషం చదివిందేమీలేదు. మళ్లా దేశంలో యిద్దఱమూ కలిసే తరవాయిగ్రంథాలు మొదటి గురువు గారిదగ్గిఱే అభ్యసించాము. సంస్కృతంలో కావ్యనాటకాలు చదవడంలో నాకన్న అతని గురుశుశ్రూష హెచ్చు. నాశుశ్రూష ఆ విషయంలో అతని కంటె కొంచెం లొచ్చు. యీభేదం మేము కలుసుకొన్న కొన్నియేళ్ల వఱకు - అంటే, అధమం రెండేళ్లవఱకూ - వుండేది. పిమ్మట సరిసమానంగానే మామాసాహిత్యాలు తయారైనాయి. అతఁడు తీవ్రమైన బుద్ధిశాలి. అయినా నాలాగ సర్వదా విద్యావ్యాసంగాన్ని చేస్తూ దాన్నే వక తపస్సుగా పెట్టుకొనే స్వభావం కలవాఁడు కాఁడు. నేనో? సర్వదాదాన్నే మననం చేస్తూ కాలక్షేపం చేసే స్వభావం కలవాణ్ని. అందుచేత శుశ్రూషావిషయంలో తక్కువ అయినా పరినిష్ఠిత సాహిత్యంలో అతనికంటే కూడా అంతో యింతో నా శక్తి అతిశయించిందని పరిశీలకులు గుర్తించవలసివస్తుంది. యీ అతిశయం దేనిలోను? యేవేనా ఖండన మండనాల ప్రసక్తిలో మాత్రమే. దేన్నేనా అన్వయించడం వస్తే నాకన్న అతఁడే అధికంగా అన్వయించేవాఁడు. యీలాటి స్వల్పభేదం వున్నా అతనివాదం "యే యెండకు ఆ గొడుగు" గా వుండేదవడంచేత దురుద్ధరంగా పూర్వపక్షాలు చేయడానికే కాని శాశ్వతమైన సిద్ధాంతకల్పనకు పనికివచ్చేది కాదు. యీ వ్రాసిన సోదెవల్ల ముఖ్యఫలితం, సంస్కృత సాహిత్య విషయంలో అతనిది సర్వమూ అంతో యింతో గురుశుశ్రూషా లబ్ధం; కాని తక్కిన యావత్తూ స్వయంకృషిచేత, తోడివిద్యార్థులతో కయికురు బొయికురులాడడం వగయిరా వ్యాసంగంవల్ల సంపాదించుకున్నదనిన్నీ చదువరులు తెలుసుకోవలసి వుంటుంది. అందుకు మా కాలంలో వారినే వుదాహరణంగా చూపుతాను.

శ్రీయుతులు కాశీభట్ల బ్రాహ్మయ్యశాస్త్రుల్లుగారిని యెఱగనివారే లేరుగదా? వారితమ్ములు సుబ్బయ్య శాస్త్రుల్లుగారున్నూ సుప్రసిద్ధులే. బ్రహ్మయ్యశాస్త్రుల్లుగారు పూర్వపు మెట్రిక్కులేషన్ చదివి ఆ యింగ్లీషుతో పాటు యేమాత్రమో ప్రయివేటుగానో, లేక స్కూల్లోనో రఘువంశమో, కుమారసంభవందాఁకానో సంస్కృతంలోకూడా గురుముఖతః అభ్యసిస్తే

అభ్యసించారో, లేక ఆ మాత్రమో అభ్యసించనేలేదో - కాని యేదేనా విషయం వ్యాకరణశాస్త్రానికి సంబంధించింది వచ్చినాసరే, మఱో శాస్త్రానికి సంబంధించింది వచ్చినాసరే ఆయన దాన్ని గురించి వ్రాయవలసి వస్తే ఆ శబ్దాన్ని గూర్చి పాణిని మొదలుకొని మ॥ తాతారాయఁడు శాస్త్రుల్లుగారి పర్యంతమూ వున్న గ్రంథకర్తలు ఎక్కడెక్కడ యేయే పంక్తి వ్రాశారో దాన్నంతనీ సవిమర్శంగా వుదాహరించి, చర్చించి సిద్ధాంతీకరించేవారు. ఆ వ్రాఁత చూచినవారు వీరు పాణినీయం మొదలయిన శాస్త్రాలు పూర్తిగా గురుశుశ్రూషా పూర్వకంగా అధ్యయనం చేసిన వారే అని గోచరించేది. వారి తమ్ములు సుబ్బయ్యశాస్త్రుల్లు గారున్నూ, నేనున్నూ లఘుకౌముదిలో చామర్లకోట విద్యార్థిత్వంలో సతీర్థ్యులం. తరవాత ఆయన శ్రీ మహామహోపాధ్యాయ బిరుదాంకితులు, షడ్దర్శనీవేత్తలు, యింకా యెన్ని విశేషణాలు వేసి వర్ణించినా తృప్తికలగని పాండిత్యం వున్న శ్రీ పరవస్తు రంగాచార్యులవారి శుశ్రూషచేసి వ్యాకరణాన్ని సమగ్రంగా అభ్యసించారు. యింకా వీరు శ్రీనోరి సుబ్రహ్మణ్యశాస్త్రుల్లుగారి శుశ్రూషకూడా చేస్తే చేసివున్నారేమో? యిట్టి తమ్మునికన్న అన్న బ్రహ్మయ్యశాస్త్రుల్లుగారు చేసిన శుశ్రూష చాలా తక్కువ దనడానికి వొప్పనివా రుండరు. అయితే సుబ్బయ్యశాస్త్రుల్లుగారు కచేరీవుద్యోగం అప్రధానంగానూ, యీ వుద్యోగం ప్రధానంగానూ పెట్టుకోవడంచేత సర్వదా గ్రంథావలోకనంతో కాలక్షేపం చేయవలసి వచ్చింది. మాయిద్దఱికీ వుండే ప్రభేదంకూడా కొన్నాళ్లదాఁకా యీలాటిదే. పిమ్మట యీ ప్రభేదంకూడా లేదు.

"నేను చదవనిగ్రంథం పాఠం చెప్పవలసి వచ్చిం"దనుకోండి. గురుశుశ్రూషచేసి చదవని కారణంచేత "సపాదం భక్షయేత్" అని వుంటే "సః వాఁడు, పాదం కాలిని, భక్షయేత్ తినవలసినది" అని అసంప్రదాయార్థమే చెప్పాననుకోండి; వెంటనే నన్ను వెక్కిరిస్తారుగా! వెక్కిరించి వూరుకుంటారా? "అక్కడ సపాదం అనేది సమస్తపదం, సేరుంబావు అనే అర్థం చెప్పాలిగాని మీ గురువుగారు చెప్పింది సరిగాదు" అని వానితో అంటారు. అప్పుడు వుండే దశను పట్టి నాదే న్యాయమైన అర్థం అంటూ బుకాయించినా యథార్థం వాళ్లు చెప్పినదే అని గోచరించక పోతుందా? అయితే యీలాటి అసంప్రదాయాలు సర్వత్ర వుండడానికి నేను బొత్తిగా కావ్యాలే చదవనివాణ్ణి గానుగదా! ఆలాటి వాళ్లయితే "కుండంతా వోటుగా" వుండవలసి వస్తుంది. (లోకంలో వుండే సాహిత్యపరులేనా ప్రతీకావ్యమూ అంతా ఛదవడం వుండదు.) యీలాంటి సంప్రదాయాలు యెంత శుశ్రూషచేసిన వాళ్లకీకూడా పండితులవల్లనే కాక పామరులవల్ల కూడా తెలుసుకోఁదగ్గవి మఱికొన్ని యావజ్జన్మమూ తెలుసుకోవలసే వుంటాయి.

సంస్కృత కవిత్వంలో శ్లోకం నాలుగుచరణాలూ యేకసమాసం పెట్టడం తప్పనే సంగతి మాకు యేలాతెలుసుకోవలసివచ్చిందో ఆమధ్య బహుశః "మహదైశ్వర్యాభివృద్ధి" అనే వ్యాసంలో వివరించినట్టు జ్ఞాపకం. ఆవివరణఘట్టంలోనే "ఉ. ఒక్కొకచోట నొక్కొకనియొద్ద నొకొక్కొకమాట చొప్పునన్, జక్కఁగ సంగ్రహించితిమి" అనేపద్యంకూడా వుదాహరించినట్టున్నాను. ఆయీపద్యం శ్రీ విజయనగరం మహారాజులుంగారి మీఁద చెప్పిన పద్యాల్లో వుంటుంది చూచుకోండి.

విద్యాసంపాదనకు, నన్నడిగితిరా, గురుశుశ్రూష నిమిత్తమాత్రం కాని స్వయంకృషే ముఖ్యం. (శాస్త్రాలకు మాత్రం అల్లాకాదు "అనభ్యాసే విషం శాస్త్రమ్") సాహిత్యాదికానికి గురువు మార్గప్రదర్శకుఁడు. అంతేనేకాని సమస్తమూ చెప్పఁడు. ఆయన చూపిన మార్గాన్ని పట్టి శిష్యుఁడు స్వయంకృషితో పైకి రావాలి. భోజరా జేమన్నాఁడు? "మధు మయఫణితీనాం మార్గదర్శీ మహర్షిః" అన్నాఁడు, మా యిద్దఱికీ బ్రహ్మయ్య శాస్త్రుల్లుగారు పరమగురువు లంటే, యెందులోను? వ్యాకరణంలోనే. ఆంధ్రాని కెవరు? స్కూలుమాస్టర్లు, భాగోతాలు, వీధినాటకాలు, యివన్నీ యీలా వుంచుదాం.

యిప్పుడు యేశాస్త్రాన్నిగూర్చి వ్రాయవలసివచ్చినా దస్తాలకొలఁది నేను బరుకుతానుగదా! ఆయాశాస్త్రాలు నాకు వచ్చునా? రావు. నేను చదివింది వ్యాకరణం వొక్కటే. తరవాత నిన్న మొన్న బందరువుద్యోగం చాలించుకునివచ్చే రోజుల్లో శ్రీ జంధ్యాలగౌరీశాస్త్రుల్లుగారి వద్ద సూత్ర భాష్యాన్ని చతుస్సూత్రిదాఁకా చదివాను. చదివింది యింతే అయినా దానిలోకూడా "వుప్పులేనిదే ముప్పందుంగా" వుపన్యసిస్తాను, రాస్తాను. యిదంతా గురుశుశ్రూషాలబ్ధమేనా? దేవీభాగవతం పద్దెన్మిదివేల గ్రంథం ఆంధ్రీకరించడంలో యెంతో వేదాంతవిషయం వెడుతుంది. దానికి ఆ పురాణమే గురువు. దానిలోవున్న వేదాంతానికీ భగవద్గీతా వేదాంతానికీ యెక్కడో భేదంగాని అట్టే భేదం వుండదు. గీతలు నేను గురుముఖతః చదివింది లేదు. నూటయెన్మిది వుపనిషత్తులున్నూ ఆవేదాంతాన్నే భంగ్యంతరంగా బోధిస్తాయి. అవికూడా తిరగేస్తూవుంటే యెక్కడేనా సంప్రదాయార్థం తెలియకపోయినా అంతా తెలియకపోదు. ఆలాటిది వకటి చూపుతాను.

'శ్లో. "యదా చర్మవ దాకాశం వేష్టయిష్యంతిమానవాః
తదా శివ మవిజ్ఞాయ దుఃఖస్యాంతో భవిష్యతి"

యీశ్లోకం శ్రీ దేవీభాగవత సప్తమస్కంధంలోనిది. శ్వేతాశ్వత రోపనిషత్తులోనున్నూ వుంది. యిది ఆంధ్రీకరించే రోజుల్లోనే కాక యిటీవల జరిగిన ముద్రణనాఁటికి కూడా అర్థం - అంటే ముడి అర్థంకాదు. తాత్పర్యార్థం - మా యిద్దఱికీకూడా గోచరించిందే

కాదు. కొందఱు వేదాంతపండితులని అడిగాం; తేలలేదు. తుదకు "గోడమీఁది పిల్లి వాటం"గా అంగ్రీకరించాము. ఆ ప్రకారమే షష్టిపూర్తిముద్రణంకూడా జరిగింది. అప్పుడు నేను మతీ దుస్థితిలో వున్నాను. అందుచేత యీ విచారమే కాదు; యేవిచారమూకూడా అచ్చుకి సంబంధించింది నాకు పట్టనేలేదు. పిమ్మట యేదో కొంచెం ఆరోగ్యం కలిగాక యేదో గ్రంథం చూస్తూవుంటే యీశ్లోకం కొంత టిప్పణిసహితంగా కనపడింది. కాని దానివల్ల కూడా సంప్రదాయార్థం గోచరించిందేకాదు. తుదకి వకపిల్ల వాఁడు - వేదాంతశిరోమణికి చదువుకుంటూ వున్నవాఁడు - నా దగ్గరికి వస్తే అతణ్ణి అన్వయించ మన్నాను. చక్కఁగా అన్వయించాఁడు. యేముంది? "వడ్లగింజలోది బియ్యపుగింజ"గా తేలింది. ఆకాశాన్ని చర్మంలాగ యెప్పుడయితే మనుష్యులు చుట్ట చుట్టఁగలరో అప్పుడు శివుణ్ణి తెలుసుకోకుండా దుఃఖంయొక్క అనఁగా సంసారంయొక్క నాశం కలుగుతుంది. అనఁగా, ఆకాశం చుట్టచుట్టడమూ అసంభవమే; శివజ్ఞానం వినాగా దుఃఖం తొలఁగడమూ అసంభవమే అని తాత్పర్యం. "మరువదుశీనరేషు జలం" అన్నరీతిని అన్వయించుకోవలసి వుంది. దీనిలో నిజానికి అంతగా గూఢమైన విషయమున్నూ లేదు, స్వయంకృషిచేత ఆర్జించిన పాండిత్యాలవారికి యీలాటివి అక్కడక్కడ అడ్డు తగులుతాయి. అందుచేత "గురుశుశ్రూషయావిద్యా" అన్నారు. అందుచేతే "గురువులేని విద్య గ్రుడ్డివిద్య" అనుకోవలసి వచ్చింది. అట్లని సర్వమూ గురువు చెప్పడమూ, శిష్యుఁడు వినడమూ తటస్థిస్తుందా! అదల్లా వక్క వేదానికి మాత్రమే. తక్కిన విద్యలకో? యేకొంచెమో గురువు మార్గం చూపుతాఁడు; తక్కినదంతా శిష్యుని స్వప్రయోజకత్వానికి సంబంధించిందే. "శతశ్లోకేన పండితః" అని యెందుకన్నారు? కాళిదాసుగారి పూర్వోత్తర మేఘాలు రెండూ కల్పితే నూఱుశ్లోకాలకు కొంచెం సుమారు వుంటాయి. దానివ్యాఖ్యానంలో యెన్నో సంప్రదాయాలు వున్నాయి. ఆశ్లోకాలనాఁటికి వ్యాఖ్యానం చెపుతూనే పాఠంచెపుతారు గురువులు. అవి నూఱూ వ్యాఖ్యానంతో వల్లిస్తే వాఁడు పండితుఁ డవుతాఁడంటే, పరశ్లోకాన్వయజ్ఞానం చాలావఱకు కలుగుతుందన్నమాట.

పోతరాజుగారు యీ మాత్రమూ చదవనివారు కారు. కాని చదివి కూడా "సహజపాండిత్య" బిరుదాన్ని యెందుకు వేసుకున్నారనేది విచార్యం కాకపోదు. యింతమాత్రం చదివితే శ్రీమద్భాగవతం అనువదించడానికి కొఱకఁబడదు. నాకు తోఁచినమాటలు వ్రాస్తాను. రుచిస్తే అంగీకరించండి; లేదా, త్యజించండి. ఆయన పూర్వజన్మసంస్కారం మంచిది. కనుక యింతమాత్రం చదివేటప్పటికే శ్రీమద్భాగవతం పఠిద్దామనే వూహ కలిగివుంటుంది. ఆపట్లాన్ని ఆ గ్రంథం సంపాదించడం అవసరమయి వుంటుంది.

అప్పుడు అచ్చులు లేవు. దానికోసం యెవరినో ఆశ్రయిస్తే వారు పరశ్రేయస్సహనం వున్న యోగ్యులయితే రోజూ ఒకటో రెండో తాటాకులవంతున వారి సమీపంలోనే కూర్చుని రాసుకోవడానికి అనుగ్రహించి యిచ్చేవారు. యీ యివ్వడం వగయిరాలు నేను స్వయంగా నయితే నారోజుల్లో చూడలేదుగాని మాముత్తాతగారి గ్రంథాలు యెవరికేనా యివ్వవలసివస్తే మాతాతగారు యీలాగే యిచ్చేవారని మాతండ్రిగారు చెప్పఁగా విన్నాను. ఆ ధనాన్ని యింత జాగ్రత్తగా మా తాత తండ్రులు వంశస్థులకోసం భద్రపఱిస్తేకూడా అందులో ముఖ్యగ్రంథం మాముత్తాతగారి కవిత్వం "యామినీపూర్ణతిలకావిలాసం" చెట్టెక్కడం తటస్థించింది. "పుస్తకం వనితా విత్తం పరహస్తంగతం గతమ్" అనేమాట ఆకాలంలో బాగా అమల్లో వుండేది. యిప్పుడు పుస్తకానికి ఆబాధ పూర్తిగా తొలఁగింది. కాని విత్తానికి మాత్రం అప్పటికంటేకూడా యెక్కువ దురవస్థ తటస్థించి, "ఋణస్య దానస్య న కించిదంతరం మృతస్య సుప్తస్య న కించిదంతరమ్" అనేది పూర్వంకంటే యెక్కువ అమల్లోకి వచ్చింది. కాలపరిస్థితులని బట్టి యిట్టి అభియుక్తోక్తులు పుడతాయి. అవి మాఱిన పిమ్మట ఆయీ అభియుక్తోక్తులకు అర్థం అపార్థంగా కనపడుతుంది.

మునుపు మనదేశంలోనూ, యితర దేశాల్లోనూ జమీందార్లువారి వారి తాహతు ననుసరించి చిన్నదో, పెద్దదో కోట అంటూ కట్టుకొనేవారు. యిటీవల బ్రిటిషు ప్రభుత్వం వచ్చాక అన్యోన్యకలహాలు యుద్ధరూపంలో అమలుజరగడానికి వీలులేక. కోర్టుల్లో మొదలు పెడుతూ వున్నారు. అందుచేత ఆ కోటల మరమ్మత్తులో పనీ లేకపోయింది. పోనీ, వున్నదాన్నేనా నిలఁబెట్టుకుందా మంటే సర్వాధికారంకల చక్రవర్తి అందుకు అంగీకారం యివ్వడమూలేదు. ఇది విషయాంతరం.

పోతరాజుగారు ఆలాకష్టించి భాగవతం వ్రాసుకోవడంలో అంతకు ముందు యేస్వల్పంగానో వున్న సంస్కృతశ్లోకాన్వయజ్ఞానం పెచ్చు పెరిఁగి వుంటుంది. ఆలా పెచ్చు పెరిఁగినా యింకా సందేహాలు - యిందాఁకా నేను చూపినమాదిరివి, వ్యాఖ్యానసహాయం వున్నా తీరనివి వుంటే ఆ వ్రాసుకునేటప్పుడో, లేక అనువదించేటప్పుడో, "అయ్యా! యేమిటి యీస్థలంలో తాత్పర్యం?" అని అడిగి తెలుసుకొని వుంటారు. (లేదా వుపాస్య దైవం వల్లనేనా ఆ సందేహాలు నివర్తించివుంటాయనుకోవాలి) యిదంతా నీస్వకపోలకల్పితంగాన ఆలా జరగలేదంటారా? అయితే - "విబుధజనులవలన విన్నంత కన్నంత" అని పోతరాజుగారు కృత్యాదిని వ్రాసిన మాటకు తాత్పర్యం యేమిటో చెప్పండి;

యింతకూ ఫలితార్థం యేమిటంటే? కవికిన్నీ, యితరులకున్నూ విద్యాసంపాదనలో చాలా తేడా వుంటుంది. కవి "చూపితే పుచ్చుకుపోతాఁడు" యితరవిద్యార్థులో, గురువుగారు

"చింతచెట్టుకింద పిచికి సమర్తాడింది" అని పాఠం చెపితే దాన్ని జాగ్రత్తగా వల్లించి వొప్పగించడమే కాని, "పిచికేమిటి? సమర్తాడడమేమిటి? అథవా ఆడిందే అనుకుందాం. అది యితరులకు గోచరించడం యేలాగ?" అనే విచారణ అంతగా తగలదు. అందుచేతే "క. విద్యలలోపల నుత్తమ విద్య కవిత్వంబు" అని యెత్తుకొని పూర్వలాక్షణికులు "అది తెలియుట లోకమెల్ల నరయుటకాదే?" అని పరిసమాప్తి చేశారు. "వ్రతానా ముత్తమ వ్రతమ్" అన్నట్టుగా పై వాక్యాన్ని అర్థంచేసుకోకూడదు. కవికి యావత్తు సామగ్రిన్నీ హృదయంలో లీనమై వుంటుంది. దాన్ని వెలువరించడానికి గురువులున్నూ, ప్రపంచకమున్నూ సహాయపడడ మనుకోవాలి. యిది నా అనుభవంలో సంగతి.

నేను తిరుపతిశాస్త్రికి కవితాగురువునన్నా, నాకు తిరుపతిశాస్త్రి వగయిరా సతీర్థ్యుల సాంగత్యం సాహిత్యంలో గురువయిం దన్నా అదంతా యీలాంటిదే. అందుకే అతఁడు స్పష్టంగా నన్నుగూర్చి "తత్కృపం గవియయ్యు" అని వ్రాసినా, నేను అతని జీవితచరిత్రలో దాన్ని అన్యథాకరించి "అన్యోన్యం గురవో విప్రాః" అని వ్రాయవలసి వచ్చింది. అతఁడు ఆలా వ్రాయడమే యుక్తం. నేను ఈలా వ్రాయడమే యుక్తం. నేను అంత యథార్థంగా అహంకారనిరాసార్థం ప్రయత్నించినా అందులో యింకాయేదో కృత్రిమం చేసినట్టే ఒక పూజ్యులు "మూఁకవుమ్మడి మాట" ఒకటి వ్రాసి వున్నారన్నది అందఱున్నూ యెఱిఁగిందే. అట్టి స్థితిలో మాటదక్కాలంటే యేలా దక్కుతుంది? అందుకే "యేగతి రచియించిరేని సమకాలమువారలు మెచ్చరేకదా?" అన్నాఁడు అన్యాపదేశంగా విజయవిలాసగ్రంథకర్త. అందులోనూ ఆత్మ వంచకులను గూర్చి మఱీ భయపడాలి.

తిరుపతిశాస్త్రికీ నాకూ వుండేభేదం ఒక్క స్వయంకృషిలోనే. నేనెప్పుడూ - "చింత కవులందుఁ దపసుల చిత్తమందు" అని మొల్ల వ్రాసిన పద్యపాదానికి వుదాహరణంగా వుంటాను. అతఁడు నావలెకాక యెప్పుడో పనిపడ్డప్పుడు రచన చేసినా చాలాకాలం స్నేహితులతో యితర కాలక్షేపంతో వెళ్లించేవాఁడు. అందుచేతనే నాకంటే అతని ఆరోగ్యం బాగా వుండేది. నా ఆరోగ్యం యెప్పుడూ అంతంతగానే వుండేది. ఆరోగ్యంలో వున్నప్పటికంటే కూడా అనారోగ్యంలో వున్నప్పుడే నాకు విశేషించి రచన సాగడం అనుభూతం.

మేమిద్దఱమూ పట్టుదలకలవాళ్లమే కాని, నాకు ఎవరేనా ఎక్కడేనా శబ్దతప్పో, అర్థతప్పో పడితే దానికి సమాధానం వ్రాసేదాఁకా అన్నమూ పానమూ, నిద్రా గిద్రా యేమీ తోఁచదు. యీ బాధ అతనికి లేదు. యిప్పటికికూడా నా కీ పీడ వదలే లేదు, శేష జీవితంలో కూడా వదులుతుందని తోఁచదు. అట్లని 'పిడివాదా'నికి సిద్ధపడను. వొప్పు

తప్పంటేనే పరాక్రమిస్తాను గాని తప్పు తప్పంటే వొప్పుకుంటాను. తప్పుకూడా మార్గాంతరంగా సాధిస్తానుగాని, దానితత్వం యీలాటిది అని వెంటనే కాకపోయినా నిజం మఱి కొన్నాళ్లకేనా చెప్పేస్తాను. "నాఽమూలం లిఖ్యతే కించిత్" అని వ్రాసిన పెద్దిభొట్లుగారి వాక్యం నాకు యెక్కువగా ప్రాణపదం. ఆ "మూలం" కోసం యెంత వెదకాలో అంతా వెదకడం నాకు అలవాటు. యిప్పటివారిలో నాలాగ పరిశ్రమ చేసేవారు మిక్కిలి తక్కువగానే వుంటారో, అసలే వుండరో? ఆ విషయం నిర్ణయించుకొనే భారం లోకానిది గాని నాది కాదు. నేను వ్రాసుకోవడం మాత్రం –

> "శ్లో. పాపం భవేదపిచ పుణ్య మహం యథార్థం
> వచ్మీశ! మత్సమవయస్కజనేషు కోఽపి,
> నాఽతిక్రమే న్మమ పరిశ్రమ మాత్తవిద్యః
> కావ్యజ్ఞతావిషయ ఇత్యభితోఽస్తి గర్వః"

యీలా వ్రాయడం, కాదు వ్రాసుకోవడం తప్పయినా వ్రాశాను. యీమాట సాక్షాత్తు సర్వజ్ఞుఁడైన పరమేశ్వరుఁడితో చెప్పేమాటగాని మనుష్యమాత్రులతో చెప్పేదికాదు. నిన్న మొన్నవ్రాసిన "క్షమాపణ" గ్రంథంలోది. యిట్టి ధైర్యస్థైర్యాలు విద్యావిషయంలోనేనా నాకు యెంత వఱకూ వుంటాయంటే ఆవలివారు "లీగల్" చర్యలోకి దింపేవఱకే. అలా దింపడానికి వుపక్రమించిన వుత్తరక్షణమందే ఆవలివారు యేవిధంగా క్షమాపణ చెప్పమంటే ఆ విధంగా క్షమాపణచెప్పి విరమించడమే నాకృత్యం. అలా చెప్పడం గురుత్వం వున్న విషయంలోనే కాదు యితరవిషయంలోకూడా అంతే. యిది బొత్తిగా వోపికలేని హేతువు చేతనే అనుకో నక్కఱలేదు. వోపికవున్న రోజుల్లోనేనా ఆ విషయం విద్యావిషయానికి అర్థమయిందని నాకు విశ్వాసం లేదు. యిది విషయాంతరం.

చాలా సోదె వ్రాయడంవల్ల ముఖ్యాంశం తేల్చుకోవడం కష్టమవుతుందేమో అని సంశయంగా వుంది. అందుచేత ముఖ్యమైన అంశాన్ని యిక్కడ మళ్లా వ్రాస్తాను. తిరుపతిశాస్త్రిన్నీ, నేనున్నూ సమాన బుద్ధిమంతులం. వ్యాకరణంలో సమానంగా చదువుకున్నాము. సంస్కృత సాహిత్యం అతనిది యావత్తూ గురుశుశ్రూషా సంపాదితం. నాది కొంత శుశ్రూషాసంపాదితమున్నూ, కొంత స్వయంకృషి సంపాదితమున్నూ, స్వయంకృషిసంపాదితంలో నాకు తిరుపతిశాస్త్రి మొదలైన తోడివిద్యార్థుల గొండ్లాటలు గురువులు, నేనతనికి కవిత్వరహస్యాదులకు నామ మాత్రగురువును. నాకుసర్వదా కవిత్వమే వ్యాపారము. అతనికి దీనిలో నా అంతటి వ్యసనంలేదు. అలాగే అతనిక్కూడా వ్యసనం వుంటే మాగ్రంథాలు యింకా చాలా సంపుటాలు పెరిఁగేవి. ఆయీ ముఖ్యాంశాలు చదువరుల కొఱకున్నూ, భావివిమర్శకుల కొఱకున్నూ వ్రాయడం తప్పదని వ్రాశాను.

ఆ యీ సందర్భాలు మా గ్రంథాలు పరిశీలకతాదృష్టితో చదివిన వారికి విధిగా గోచరించేవే అయినా నేను వ్రాయడం పునరుక్తిప్రాయం.

లోకం యేమనుకుంటేయేం గాని, అతనిశక్తి నాకూ, నాశక్తి అతనికి యెంతా నచ్చకపోతే మామైత్రి అంత నిరంతరాయంగా సాఁగదుగదా. నేనా, గర్విష్ఠుణ్ణి. అతఁడా, ఆ విషయంలో నావృద్ధప్రపితామహుఁడు. యిట్టి మాకు విద్యావిషయంలో కలవడ మంటే, అన్యోన్యాన్ని బంధించే ప్రబలకారణాలు యెన్నేనా వుండితీరాలి. అతని పద్యాలవల్ల నన్ను అతను ప్రేమించడానికి, తగ్గహేతువులు యిదివఱకే చదువర్లు గుఱితించి వుంటారు. నావాట్లవల్లా అతణ్ణి నేను ప్రేమించడానికి తగ్గగుణాలు - అతనికి సంబంధించినవి - గుఱితించే వుంటారు. అయినా దిఙ్మాత్రం రెండింటికీ ఆధారాలు యింకా చూపుతాను.

"ఒరులు నచ్చని నాదుగరువంబు సడలింపఁ జాలె నెవ్వని మనీషాబలంబు" యీసీసచరణం యెంత అంతరంగశుద్ధితో వ్రాసిందో చదువరులు గమనించవలసి వుంటుంది. అతని బుద్ధి చాకచక్యము యెంతటిదీ కాకపోతే అతని మరణానికి సంబంధించిన సానుభూతిసభలో నైనాసరే నేను ఇంతగా పొగడడం తటస్థించదు. గురువుగారు అతణ్ని మెచ్చుకొనేవారని మొట్టమొదట యెత్తుకొన్న "గురుఁడు బ్రహ్మయశాస్త్రి కొనియాడు నెవనిఁ గర్నాట సీతారాముసాటిఁ జేసి" అనే సీసచరణానికి యెందఱికో సంప్రదాయార్థం తెలియదు. యీ కర్నాట సీతారామశాస్త్రులుగారు యీ లోకానికే కాక మూఁడులోకాలకీ సరిపడ్డ మహా తార్కికులు. యిట్టివారితో తిరుపతిశాస్త్రికి గురువుగారు పోలిక చెప్పడ మంటే సామాన్యంకాదు. ఆ సీతారామశాస్త్రులుగారి వాదమంటే అందఱూ 'యిది బంగారం' అంటే 'కాదు, మన్ను' అనిన్నీ, మట్టిఅంటే 'కాదు బంగారమే' అనిన్నీ సమర్థించేది. అట్టివాదం ప్రమాణప్రమితమా, కాదా అనే ప్రశ్న వేఱు. యిక్కడ పాండిత్య ప్రతిభనే విమర్శకులు గమనించాలి. "కర్తుమకర్తు మన్యథాకర్తుం సమర్థు" లంటే అట్టివారికే చెల్లుతుంది. "మయి జల్పతి కల్పనారినాథే రఘునాథే మనుతాం తదన్యథైవ" అనేది తర్కశాస్త్రజ్ఞుల ప్రతిజ్ఞావాక్యమే. కాశీ కాశీఅంతా యేకీభవించినా సీతారామశాస్త్రులుగారి వాదాన్ని భంగించలేక పోయినారని మా గురువులు సెలవిచ్చేవారు. నేనైతే కాశీ వెళ్లినప్పుడు సదరు శాస్త్రులుగారిని సందర్శించానేకాని, వారిసామర్థ్యం తెలుసుకోతగ్గంత వ్యక్తి విశేషం అప్పటికే కాదు యిప్పటికీ నాకు లేకపోవడం చేత ఆ యా విశేషాలు తపిసీలుగా వ్రాయఁజాలను.

అట్టి మహావ్యక్తితో తిరుపతిశాస్త్రిని గురువుగారు పోల్చి మాట్లాడడంకన్న జన్మకు యింకొక అదృష్టం వుంటుందా? అంతటివాఁడు కనకనే నేను అతణ్ణి ఆమోదించానని

వేటే వ్రాయనక్కఱలేదు. తి. శా. వాదం ప్రమాణ ప్రమితమా, కాదా అనేశంక యిక్కడ చేయకూడదు. వొక అప్సరస్త్రీని, లేదా భూలోకస్త్రీనే అనుకుందాం -

క. "ఈలలన వేలుపున్ జవ
రాలో? యచ్చరయొ? కిన్నరవధూమణియో
వ్యాళాంగనయో? కా కీ
భూలోకస్త్రీల కిట్టిపొంకము కలదే?"

అని వకకవి వర్ణించాఁడు. యిక్కడ అందాన్నే చూచుకోవాలి గాని, ఆపెహృదయం యథార్థంగా వుంటుందా, వుండదా అని విచారించడం, దుర్యోధనుఁడి కిరీటంమీఁద వుండే రత్నాలు దుల్లిపోయేటట్టు అర్జునుఁడు బాణాలతో కొట్టాడంటే అప్పుడు ఆరత్నాలు యెవరు యేఱుకున్నారని అడిగే ప్రశ్నవంటిది.

అతని బుద్ధి పాదరసంవంటిది. అది దేనిలో పడితే దానిలో పనిచేసేది అనేదే మనకు కావలసింది. నేనీమాట అభిమానంచేత వ్రాశానని అనుకోవడానికి అవకాశంలేదు. యీ మాట మాగురువుగారిది గాని నాది కాదుగదా! పైఁగా స్వశాఖీయుణ్ణి నేనుండఁగా అన్యశాఖీయుణ్ణి అలా పొగడడానికి అసూయపడవలసింది. అట్టిస్థితిలో వారి వాక్యాన్ని నేను అనువదించడంలో నాఅంతరంగాభిప్రాయం విస్పష్టమే కనక విస్తరించేదిలేదు. నాయందుకూడా అతనికి యెంతోగాఢమైన గౌరవం వుండేది. దాని ఫలితాన్ని పొందే అదృష్టం నాకు పట్టలే దనికూడా నేను ఆ సానుభూతిసభలోనే ఒక పద్యంలో సూచించాను.

మ. "మృతులంగూరిచి యేడ్చుపద్యములు నేనేనాఁడుఁ జెప్పన్ మహా
మతి! యో తిర్పతిసత్కవీ! త్రిజగతీ మాన్యాత్మ విక్టోరియా
సతి మున్నొమ్మృతు లెల్ల నీకతననే స్వర్గం బధిష్ఠించి రే
నతిపాపాత్ముఁడ నాకు నీకతన లేవాలాటిసౌభాగ్యముల్."

నన్నుఁగూర్చి అతఁడే సానుభూతిసభలో విచారాన్ని వెలిపుచ్చ వలసివస్తే యేవిధంగా వెలిపుచ్చేవాఁడో యిప్పు డేలా తెలుస్తుంది? ఆభాగ్యం నాకు పట్టింది కాదని నేను విచారించడం అయుక్తం కాదుకదా! అయితే ఆ విషయం మాత్రం కొంత సూచించడం మాత్రం జరిగింది. అట్టిదాన్ని ఒకదాన్ని వుదాహరిస్తాను.

ఉ. "చుక్కలు రాలలేదు రవిసోముల పోకడ మాఱలేదు న
ల్దిక్కులు కూలలేదు జలధిజ్వలనం బుబుకంగలేదు నేఁ
డక్కటఁ రామకృష్ణకవు లర్భకు లేగతిఁ జేయనేర్తు రా
ధిక్కృతవైరి వేంకటసుధీకవిమౌళికి శృంగభంగమున్?"

యిత్యాది పద్యములవల్ల అతఁడే నన్నుఁ గూర్చి ప్రసంగించవలసివస్తే యేలా ప్రసంగించేవాఁడో విస్పష్ట మవుతూవుంది. అయితే దైవం అన్యథాకరించాఁడు.

మామాసంబంధం యెట్టిదో నేను వివరించలేదు. కాని యిప్పటికీ కూడా మే మిద్దఱమూ కలిసి సభలు చేస్తూనే వుంటాము. అతఁడు గతించి 16 యేండ్లు కాఁబోలును అయింది. అయినా మా సాహచర్యం తప్పనేలేదు. జీవితకాలంలో నేనంటే అతనికి ఆంతరంగికంగా కొంత భయమూ, భక్తీ కూడా వుండేవి. పైకేమో "త్వంశుంతా త్వంశుంతా" గానే మాట్లాడేవాఁడు. యిప్పటి స్వప్నావధానాలల్లో కూడా అచ్చంగా ఆలాగే ప్రసంగం జరుగుతుంది. యీవ్యాసం వ్రాయడాని కారంభించాక అప్పుడే ఒక సభ జరిగింది. అతనికి యిప్పటికీ నామీఁద ప్రేమవున్న దన్నందుకు యిప్పటికి సుమారు పదియేళ్లనాఁడు జరిగిన ఒకగాథ వుదాహరిస్తాను.

అతనికి పురుషసంతానమే కాని స్త్రీ సంతానం లేదు. "ఒరేయ్! నేను కట్నం కానుకా పెట్టలేనని కాఁబోలును నాకు భగవంతుడు స్త్రీ సంతానాన్ని యిచ్చాఁడు కాఁ"డని చమత్కారంగా నాతో అనేవాఁడు. పయిఁగా "జన్మించి అంతరించినవాళ్లు కూడా కొందఱు మగవాళ్లేరా" అనేవాఁడు. అప్పటికింకా నాకును స్త్రీ సంతతి లేదుకాని, "లేకపోతే వకపిల్లనిపుచ్చుకోరా" అని అనేవాణ్ణే. మాకు శాఖాభేదంవున్నా శాస్త్ర విరుద్ధం గాని యితరశాఖాబాంధవ్యం అంగీకారమే. యేకులంతో పడితే ఆకులంతో చుట్టఱికం చేయడానికి తగ్గంత జ్ఞానం అతనికిఁగాని, నాకుఁగాని కలగలేదు. బ్రాహ్మలలో బ్రాహ్మల కేంచిక్కు? అందుచేతే నాకు సంతానంలేని రోజుల్లో నేను పెంచుకోవలసివస్తే అతని పిల్లవాణ్ణి పుచ్చుకుని మాశాఖపిల్లని పెళ్లి చేయాలనుకొనేవాణ్ణి. దీనికి మా తిరుపతిశాస్త్రి శిష్యుఁడున్నూ, మా గురువుగారి స్యాలకుఁడున్నూ, నా భార్యా మేనమామ కూఁతురిభర్తయున్నూ అయిన రాఘవభట్ల విశ్వనాథశాస్త్రి తనకు కూఁతురు కలిగితే సరేసరి, ఆలా కలక్కపోతే పెంచుకొనేనాసరే పిల్లనిస్తాననే వాఁడు. తుదకి యివేవీ జరగలేదు కాని మా మా అనుబంధం యేలాటిదో అంతా యెఱిఁగిందే అయినా యెఱఁగనివాళ్లు తెలుసుకోవడానికి వ్రాస్తూవున్నాను.

సరే, తి. శాస్త్రిగారికి స్త్రీ సంతతి లేదన్నది ప్రస్తుతం. ఆకారణం చేత అన్న సుందరరామశాస్త్రి కూఁతుళ్లలో మూఁడోదాన్ని తాను కన్యాదానం చేసుకుంటానని అనడమున్నూ, అందుకు అన్న వగయిరాలు ఆమోదించడమున్నూ జరిగింది. కాని ఆ పిల్లకు వివాహపు యీడువచ్చేదాఁకా తి. శా. జీవించడం తటస్థించలేదు. ఆకోరిక తీరకుండానే అతఁడు స్వర్గతుఁడైనాఁడు కాని యింకో శిష్యునిబాపతు ఆఁడపిల్లని దగ్గఱదీసి

పెళ్లి పేరంటాలుమాత్రం చేశాఁడు. చేసినా ఆత్మలో యీ కోరిక నిలిచే వుండడంచేత కాఁబోలును, యేపిల్లని తాను కన్యాదానం చేయాలని అనుకున్నాఁడో ఆపిల్ల పెళ్లిసమయానికి తిరుపతిశాస్త్రి ఆత్మవచ్చి ఆపిల్లని ఆవేశించింది. పిశాచమైనాఁ డనుకుందామా- అంతకు మునుపుకాని, యిటీవలఁగాని మళ్లా యెప్పుడూ యెవరికీ కనపడ్డట్టుగాని, పీడించినట్టుగాని లేదు. ఆ సమయానికి యింకా నేను ఆ పెళ్లిజరుగుతూవున్న "వుండి" అనే గ్రామానికి వెళ్లలేదు. నా భార్యా, పిల్లలూ మాత్రం వెళ్లివున్నారు. పూర్వకాలంలో యేవిధంగా మాట్లాడేవాఁడో అలాగే నాభార్యతోటి ఆ పెళ్లికూఁతురిద్వారాగానే మాట్లాడినట్టు తరవాత నాభార్యేనాకు చెప్పింది. వెం. శాస్త్రినికూడా చూచివెడతానని అన్నట్టున్నూ, అతఁ"డీరాత్రికిఁ గాని రాఁడు, వచ్చేదాఁకా నీ ఆవేశం వుంటే శుభకార్యం అడ్డడమేకాక మనిషి నలిగిపోవడం తటస్థిస్తుం"దని అన్నగారు వగయిరాలు కోరినమీఁదట తావన్మాత్రంతో ఆ ఆవేశం తగ్గినట్టున్నూ చెప్పఁగావిన్నాను. కాని నేను వెళ్లి చూచేటప్పటికికూడా యింకా ఆ పెళ్లికూఁతురు తేఱుకున్నట్టు కనిపించలేదు. ఆవేశపుమాటలలోకూడా నాప్రసక్తి కొంత వచ్చినట్టు తి. శాస్త్రి అన్నగారు వగయిరాలవల్ల విన్నట్టయితే కొంచెం జ్ఞాపకం వుందిగాని ఆ మాటలు తబిసీలుగా జ్ఞాపకంలేక వ్రాయలేదు. బహుశః అప్పుడు తిరుపతిశాస్త్రి పెద్దకొడుకు వేంకటావధానికూడా దగ్గిఱవుండి చూచినట్టే విన్నట్టు జ్ఞాపకం. నే వెళ్లినతరవాత యేవేనా కొన్నిమాటలు మాట్లాడించి చూదామనిన్నీ, తద్ద్వారాగా చిరకాలానికి మళ్లా ప్రాణస్నేహితుణ్ణి కలుసుకొని మాట్లాడినట్టు సంతుష్టి కలుగుతుందనిన్నీ ప్రయత్నించి చూచానుగాని, నేనంటే భయపడి మౌనం తాల్చినట్టు నాకే కాక అతని బంధువులందఱికిన్నీ తోఁచింది.

ఆత్మ నిత్యమనిన్నీ, దేహం నశించినంతలో అది నశించేది కాదనిన్నీ మన విజ్ఞానులందఱూ చెవి నిల్లుగట్టుకొని పోరడానికి యీలాటి విషయాలెన్నో అనుభవించి వుండడమే కారణమనుకుంటాను. యీలాటి ప్రబలాధారాలెన్నో వున్నా, నేఁటి సంస్కర్తలు పెడతోవలే పడతారు. మహాభారతయుద్ధంలో మృతులైన దుర్యోధనాదులనేమి, అభిమన్యాదులనేమి, వేదవ్యాసులు వారివారి సన్నిహితబంధుజాలానికి చూపినట్టు మహాభారతంలో స్పష్టంగా వుంది. ఆ భారతం పంచమవేద మని మనవిజ్ఞానులందఱున్నూ శిరసావహించినప్పటికీ యీకాలానికి అది పనికిమాలిన చెత్తకిందకూడా మాఱడంలేదు. వర్ణాశ్రమాచారాలకు సంబంధించిన ధర్మాలెన్నో అందులో "స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మోభయావహః" అన్న వాక్యానికి వ్యతిరేకించే సంస్కారాలకే యిప్పటి వారు సర్వత్రా ప్రాధాన్యం యివ్వడంవల్ల పై సంగతి విస్పష్టమవుతూ వుంది. అట్టే చెప్పేదేమిటి? మునుపు యేవేవి అకార్యాలో అవి యిప్పుడు చేస్తే యెంతో గొప్ప, యెంతో గౌరవం.

ఓహో! మొదలెట్టిన విషయం మళ్లా విషయాంతరంలోకి దూఁకుతున్నట్టుందే! తి. శా. స్వర్గస్థుఁడైనా నాకున్నూ అతనికిన్నీ వున్నసంబంధం విడిపోలేదనేది ప్రస్తుతం. అధమం నెలకొక మాటేనా మేమిద్దఱమూ కలుసుకుంటూనే వుంటాము. ఆయీ స్వప్నగాథలు వ్రాయవలసివస్తే గ్రంథం చాలా పెరుఁగుతుంది.

శరీరాలు పృథక్కుగా వుండడంచేత శారీరకధర్మాలు మాకువేఱు గావలసివచ్చింది గాని మానసికప్రవృత్తి కవితావిషయంలో మాయిద్దఱిదీ ఒకటిగానే వుండేది. కవితారచనకంటె అన్యవిషయాలలోనో? మనస్సులు కలవడమూవుంది. కలవకపోవడమూ వుంది. ఒకటి దీనికి వుదాహరిస్తాను. నేను చప్పట్లపర్వానికి పూర్వం కాకరపర్తి వెళ్లి వద్దాం రమ్మన్నాను. అక్కడ అల్లరి జరుగుతుంది, వద్దని అతఁడన్నాఁడు. ఆలా జరగడం ముందుగాథకు మనకు మఱీ మంచిది కనక వెళ్లితీరాలన్నాను నేను. అయితే నీకర్మం నీవొక్కఁడవే వెళ్లు, నేను రానన్నాఁడు. నేను చేసే ఆలోచన దూరాలోచనో, ఆతఁడు చేసేదే దూరాలోచనో చదువరులే పరిశీలించుకోండి. చదరంగంలో యెత్తులు మాదిరిగా యిల్లాటివిషయాలల్లో నా ఆలోచన ప్రసరిస్తుంది. అతనిది పేకాటవైఖరిగా నడుస్తుంది. "అడుసుతొక్కనేల? కాలు కడుగనేల?" అని అతనితాత్పర్యం. "తొక్కితే ములిఁగిపోయిం దేమిటి? పిమ్మట బాగా పాదప్రక్షాళన చేసుకుంటే, కొత్తదీ పాతదీకూడా మాలిన్యమంతా పోయి నిష్కళంక మవుతుం"దంటాను నేను. యింకోటికూడా వుదాహరిస్తాను. కొప్పరపువారికీ మాకూ, యేలాగయితేనేం కలహ మారంభ మయిం దనుకోండి. అందులోకి మనం స్వయంగానే వెళ్లాలి గాని మనశిష్యులను ప్రవేశించడానికి అంగీకరించకూడదని నావాదం. ఆలాకాదు, శిష్యులచేతనే వోడించే ప్రయత్నం మంచిదని అతనివాదం. నా వుద్దేశ మేమిటంటే సోదరకవులు చాలా కాలాన్నుంచి గంటకు వందలలెక్కని చెపుతూ వున్నారాయె. మన శిష్యులు కొత్తగా మొదలుపెట్టి ఆ భారాన్ని నిర్వహించఁగలరో, లేదో మన కీపరాధీనవ్యాపార మెందుకని నాతాత్పర్యం. శిష్యులు వోడినా మనం వోడినట్టే అనిపించుకోవలసి వస్తుందికదా! అందుచేత ఆతోవ మంచిది కాదని నావాదం. యీలా నేను చెప్పినా వాఁడికి తోఁచినట్టే చేశాఁడు చివరికి. శివరామశాస్త్రి చేతా, చౌదరిగారి చేతా "ఛాలెంజి" పద్యాలు నాతో చెప్పకుండానే తాను బాసటగా వుండి నడిపించాఁడు.

యిప్పటివారి కొత్తపోకళ్లు కొన్ని అతనికి యిష్టం, నాకు యేం కర్మమో, వాట్లయందు యిష్టం వుండేదికాదు. దీనికి వకటి వుదాహరిస్తాను, ఎవరితోటో విద్యావివాదం తటస్థించిందనుకోండి; ఫలానా తేదీని యిన్ని గంటల యిన్ని నిమిషాలకు ఆ వివాద జరిగేసభకు రావాలని యేర్పఱచుకొన్నా మనుకోండి. మేము ముందుగానే వెళ్లి సభలో

కూర్చున్నామనుకోండి. ప్రతివాదులు అనుకొన్నట యిముకు రానేలేదనుకోండి. ఆపట్లాన్ని ఆవలివారు వోడిపోయినట్టే. యింక మనం యిక్కడ వుండనక్కఱలేదు. పోయి యీలా పత్రికల్లో ప్రకటిద్దామనేవాఁడు. యీలాటి విద్యావిజయాలూ, కోర్టుద్వారాగా సంపాదించే విద్యావిజయాలూ, బాకీ తార్మానాలూ యివి యశఃకాములు అంగీకరించతగ్గవేనా? నోటుకు సహకాలదోషం పడితే ఘరానామనుష్యులు దాన్ని గణించక మళ్లీ తిరగరాసి యివ్వడమో, సొమ్మే యిచ్చి లేదనిపించుకోవడమో చేస్తారు. చేయరే అనుకోండి. అంతమాత్రంచేత ఋణంతీర్చినట్టు లోకం విశ్వసిస్తుందా? అని దానికి నేను సుతరాము వొప్పుకొనేవాణ్ణికాను.

అతఁడు నాకన్న చాలా విషయాలలో ఛాందసుఁడుగానే వుండేవాఁడు గాని, యీలాటి విషయాలు కొన్నిటిలో లౌకిక మర్యాదలకు లోఁబడేవాఁడు. నాకు యీలాటి విషయాలకేమి, వేషభాషలకేమీ ఛాందసుల ఆచారాలే యిష్టం. వాఁడికి యింగ్లీషు చదువంటే కొంత యిష్టం. అందుచేతే చిరంజీవులకందఱికీ దాన్నే చెప్పించాఁడు. నాకో, మనపూర్వపు చదువే చాలా యిష్టం. అందుచేతే- "పై జననమ్మందును నా కొసంగు మెటులో సంగీతసాహిత్యముల్" అని సంతానం కలక్క పూర్వం చెప్పిన కామేశ్వరిలోనున్నూ, కలిగిన తర్వాత చెప్పిన ఆరోగ్య కామేశ్వరిలో,

 మ. "కలిగెన్ లేదనుకొన్న సంతతియు భాగ్యం బబ్బె నానందని
స్తులమయ్యెన్ జని షష్టిపూర్తియును నాకున్ దాపు గావచ్చెనో
లలితాంబాఁ యింక నొక్కకోర్కె అది వాలాయంబు మద్విద్యల
ర్మిలి మత్పుత్రులయందమర్చుటయె సుమ్మీ తల్లి కామేశ్వరీ!"

అనిన్నీ వ్రాసివుండడమే కాకుండా, మా రెండో చిరంజీవి యేమాత్రమో కవిత్వం చెప్పడమే కాకుండా హైదరాబాదులో అవధానం చేసినట్టు యేకలవ్యశిష్యులు వ్రాయడానికి వుబ్బి తబ్బిబ్బై షష్టిపూర్తికి దరిమిలాను 'ఇటీవలిచర్య' అని వ్రాసుకుంటూవున్న నా జీవితచరిత్రలో ఒకపద్యం నా అభిప్రాయాన్ని తెలిపేదాన్ని.

క. "నాకొమరుం డే మాత్ర
మ్మో కవియై నా కొసంగు మోదమ్మును శ్రీ
"హైకోర్టు ఛీఫుజడ్జీ"
యైకూడ నొసంగనేరఁ డనుకొందు మదిన్."

అనే మాటలతో వ్రాసివున్నాను. యిప్పుడు యెన్ని పరీక్షలు ప్యాసైనా వుద్యోగభాగ్యం లేకపోవడ మనేది యెందఱో బ్రాహ్మలకు విచారకరమైనా నాకు సంతోషకరమే అయింది.

అలాగే కాకపోతే నాబంధువు లందఱూ నన్ను "కొడుకులకు యింగ్లీషు చెప్పించాఁడు కాఁడు యీచేదస్తుఁడు" అంటూ గాఢంగా దూషించడానికి అవకాశం యిచ్చేది. నేను జవాబు చెప్పలేక చిక్కుపడవలసి వచ్చేది. యిప్పుడు "అవ్వా గుఱ్ఱమూ ఒకటే" కావడంచేత నాకు ఆ చిక్కు తప్పిందని సంతోషిస్తూ వుంటాను.

నే నయితే కర్మిష్ఠినిగాను గాని వేదోక్తకర్మకలాపాన్ని ఆచరించేవారిని చూస్తే నాకు చాలా ఆనందం. అంతేకాదు- "స్వధర్మే నిధనం శ్రేయః" అనే భగవద్గీతావాక్యమందు నాకు యెక్కువ విశ్వాసం. దీనికి వ్యతిరేకించి చేసే సంస్కారాలు నాకు గిట్టవు. అందుచేత ప్రసక్తాను ప్రసక్తంగా నా అభిప్రాయాలు ప్రస్తుతలోకం పాటించదని పూర్తిగా యెఱిఁగుండీ కూడా వ్రాస్తూవుంటాను. ఆ వ్రాతవల్ల జరిగేపని గడ్డిపఱకంతకూడా లేకపోయినా యెందఱో ఖండనమండనాలకి వుపక్రమిస్తూ వుంటారు. కొందఱు గాఢంగా దూషిస్తారు కూడాను. ఆలా దూషించి అంతతోకూడా తృప్తికలగక కొందఱు యింకా యేదో "వక్రః పంథాః"లోకి దిగి వంచించాలని ప్రయత్నిస్తారు. నేను వ్రాసిన వాక్యాలను యింట్లో కూర్చుని సమర్థించ మంటే సమర్థిస్తాను కాని పడకకుర్చీ వదిలి యెక్కడికీ వచ్చి వక్రమార్గాలకు తగ్గ వక్రమార్గాలు తొక్కి సమర్థించే వోపిక నాకు అంతరించి అప్పుడే నాలుగైదేళ్లు కావచ్చింది. వోపిక వున్నప్పటికీ ధర్మాధర్మ నిర్ణయానికి గాని, యుక్తాయుక్తనిర్ణయానికికాని ఆలాటి "వక్రః పంథాః" ప్రకరణాలు కార్యకారులు కావని నానిశ్చితాభిప్రాయమని లోకానికి తెల్పుతూ ప్రకృతం వుపక్రమిస్తూవున్నాను.

మావాఁడికి పట్నవాసంలో వుండడం యిష్టం. నాకు పల్లెటూరి నివాసం యిష్టం. అతఁడు స్వగృహం లేకుండాకూడా కాకినాడలోనే యిటీవల శ్రీ పోలవరపు జమీందారుగారి నిర్యాణానంతరంకూడా నివసించడం పైకారణంచేతే అని చెప్పనక్కఱలేదు. పయిగా నన్ననేవాడు కదా "నేను నెల 1 కి రు. 10లో, లేక 8 రూపాయిలో అద్దెతో కాకినాడలో తక్కువ వ్యయంతో కాలక్షేపం చేస్తున్నాను. వేయిరూపాయిల మీఁద వచ్చే వడ్డీకన్న నా అద్దెకు అవసరం లేదు. నీవేమో సుమారు అయిదాఱువేలు ఖర్చుపెట్టి గోడిరాళ్లదిబ్బ కడియంలో యిల్లంటూ కట్టావు. నీకన్న మూర్ఖుఁడంటూ నాకు కనపడ" దనేవాఁడు. అయితే అతనివూహ యింటికి పెట్టిన అయిదాఱువేలూ వడ్డీకి వేసుకుంటే లాభకారిగా వుండే దనేకాని మఱోటి కాదు. నిజంగా ఆలాగే చేసుకొని వుండే టట్టయితే యిప్పటి కొత్తరూల్సుప్రకారం "ఉభయతో భ్రష్టత్వం" సంభవించేది. కాని అప్పటికి యీలాటి మహోపద్రవం వస్తుందని అతఁడు తెలుసుకోవడానికి అవకాశం లేదు కనక నాకంటే అతని ఆలోచన సర్వథా ప్రశంసనీయమే అని వొప్పుకోక తప్పదు.

యేవిద్యార్థేనా చదువుకోవడానికి వస్తే తెలివికలవాఁడా, కాఁడా అనే వివేచనతో పనిలేకుండా చెప్పడానికి మొదలుపెట్టడమే నాప్రకృతి-ఆతనిదో? దీనికి అంగీకరించేది కాదు. అందఱూ తనంతటి బుద్ధిమంతులుగానే వుంటే తనదగ్గిఱికి శుశ్రూష కెందుకు వస్తారని అతనికి తట్టేదే కా దనుకుంటాను. సరే! తనకి నచ్చిన విద్యార్థు లెక్కడ తటస్థిస్తారు? అందుచేత యెవఁడికోకాని తాను చెప్పడమంటూ వుండేదే కాదు. పయిగా నాదగ్గిఱ చదువుకొనేవాళ్లనూ, నన్నూ వెక్కిరించడం కూడా వుండేది. వెక్కిరించడం అంటే వట్టిమాటలతో మాత్రమేకాదు. పద్యాలతోటే!

 మ. "గురువై శిష్యులఁ జేర దీయునెడఁ దక్కుంజెయ్యు లెట్లున్నఁద
త్పరబుద్ధిం దిలకింపఁగా వలయుఁ "జెప్పందగ్గవాఁడౌనొ? కా
దొ? రహస్యంబులు, తెల్వియున్ గలదొ? లేదో?' యంచునావేంకటే
శ్వరశార్దూల మమాయికం బెఱుఁగ దీచర్చాప్రకారమ్ములన్."

యీ మత్తేభం వుపన్యసించే వుపన్యాసంలో వున్న శార్దూలం నేనే అని వేఱే చెప్పనక్కఱ లేదుకదా! తిరుపతి వెంకటేశ్వరుఁడితో అభేదాధ్యవసాయం చేస్తూ దాని వెనకాల వుటంకించిన వేంకటేశ్వరపదమే వ్యాఖ్యానం చేస్తూవుంది. పయిఁగా నన్ను వాఁడు "అమాయికుఁ"డని కూడా అనుకొనేవాఁడన్నదికూడా దీనివల్ల తేలుతూవుంది. బందరు హైస్కూలు హెడ్మాస్టరుగారు కూడా నన్ను వెఱ్ఱివాళ్లల్లోనే జమకట్టే వారు. యీ అమాయికత్వమూ, వెఱ్ఱివాలకంగావుండడమూ "స్వరాజ్యం నాజన్మహ"క్కని శ్రీయుతులు తిలకుగారు చెప్పినట్టు మాకు వంశపరంపరాహక్కుగా మా బంధువులు చెప్పుకుంటారు. కనక నేను దీన్నిగుఱ్ఱి మావాఁడితో యేమాత్రమూ చర్చపడలేదు. కాని నా అమాయకత్వం మాయ తెలియని అమాయికత్వం కాదనిన్నీ, అది తెలిసికూడా పరలోక భీతిచేత దాన్ని యెన్నఁడున్నూ వినియోగించేవాణ్ణి కాననిన్నీ జిజ్ఞాసువులు తెలుసుకోఁగోరుతాను. యీ అన్యాపదేశసందర్భంలోనే నన్నుఁ గుఱ్ఱి యింకోపద్యంకూడా వ్రాశాఁడు.

మ. "ఒడ లెల్లం బలుచార లుండుటయు వాలోపాంతమం దూని ముంద
దడుగుల్ మోవఁగఁ గూరుచుంటయును మున్నొచిప్పాముల్ కంటగ
న్పడురంగున్ దిలకించి మీసములచందమ్మున్ విలోకించి వీ
టిఁడిపిల్లిన్ దనశాఖలోని దనుచున్ బ్రేమించె శార్దూలమున్."

యీ రెండు పద్యాలు నన్ను "యద్దేవా" చేసేవే అయినా యెంత ప్రౌఢంగా వున్నాయో, యెన్ని విడివిడిపదాలతో కూర్చఁబడివున్నాయో, యెంత గమకంగా వున్నాయో చదువరులు

తెలుసుకొందురు గాక. యీ పద్యచమత్కృతి తెలపడానికే ప్రసక్తిలేని ప్రసక్తి కల్పించి యీ ఘట్టంలో వుదాహరించాను. అతఁడని అతఁడేకాదు వేఱొకరేనా యీలాటి పద్యాలతో నన్ను తిట్టినా నేను సంతోషిస్తాను. ఇది నా ప్రకృతి. యీ పద్యం నేను బందరు భైరవప్రెస్సుకు వుత్తరాన్నివున్న చవిటి అరుగు మీఁద బొత్తినకాళ్లు వూఁతగా కూర్చుని యేదో తదేకదీక్షతో ప్రూఫులు దిద్దుకొనేదృశ్యాన్ని చిత్రిస్తూవుంది కాని "వంటియందు చారలుండడం" యెందుకు చెప్పాఁడో యిప్పుడు గోచరించిందికాదు. వెనకేనా వాణ్ణి నేను అడిగి తెలుసుకున్నట్టున్నూ లేదు. లేక తెలుసుకునే మఱచిపోయానో? 'జీవితః కవేః ప్రష్టవ్యమ్' కదా! బహుశః అతనివుద్దేశంలో యీ 'చారలు' విభూతిరేఖలై వుంటా యనుకుంటాను. 'యద్దేవా' కవిత్వం చెప్పడానికేమి, వీరరసకవిత్వానికేమి, తగాయిదాలు తెచ్చే కవిత్వం చెప్పడానికేమి అతఁడు మంచి మొనఁగాడు.

శ్రీ ఆత్మకూరి రాజావారి మేనల్లుఁడుగారు "తిరిపపు... ... తమిదీరద యేచెలి నాశ్రయింతునో?" అని ఒక సమస్యను యెక్కడినుంచో సంపాదించినదాన్ని ప్రతిరోజూ మాకు వినిపించి "సామీ! నాకు దీన్నిపూర్తి చేసిపెట్టా"లని కోరుతూ వుండేవారు. యేరోజుకు ఆరోజు నేను "తిరుపతి శాస్త్రిగారికి యీలాటి పూర్తివిషయంలో మంచి ప్రజ్ఞకనుక ఆయన్ని తమరు కోరండి" అని తప్పించుకొనేవాణ్ణి, ఆలా సుమారు నెలపైదాఁకా జరిగింది కాలం. మా ప్రయాణం రోజులు సమీపించాయి. అట్టి సదర్భంలో ఆయన ఒకరోజున "యీవేళ పూర్తిచేస్తేకాని మిమ్మల్ని కదలనిచ్చేది లే"దని గట్టిగా పట్టుపట్టి కూర్చున్నారు. అనుచిత మైనదే అయినా పూరించడం తప్పిందికాదు. తి. శా. గారినే వప్పఁజెప్పాను. క్షణంలో పూరించి వ్రాసి యిచ్చాఁడు. యిచ్చిన సమస్యకు తగినభాషనే వుపయోగించాఁడు. రేఫప్రాస కనక "తిరుమణిఁ దాల్చు" అని ప్రారంభించాఁడు. శృంగారరసంలోనే దక్షిణనాయక-శృంగారం వర్ణించాఁడు. బాగానేవుంది, యెవరినీ దూషించే వుద్దేశం లేకపోయినా మాకు అక్కడ విరోధులుగా వుండే వైష్ణవులను గూర్చి అది చెప్పినట్టు వారిలో కొందఱు అభిప్రాయపడ్డారు. అది పూర్తిగా సత్యదూరమే అయినా "రంధికిమూలమే అంకులకోడలా!" అన్నట్టు అందులో మొట్టమొదటనే వారి ప్రధాన చిహ్నం "తిరుమణి" పడింది. యింకా కుంకుమ, విభూతి వగయిరాలు ఆ పద్యంలో వున్నా అవి ప్రథమంలో లేవు. దానితో ఆవూరివారేమీ కలిగించుకోలేదు గాని, గద్వాలలో మాకు ప్రతిపక్షులుగా వుండే వైష్ణవ పండితులు కలిగించుకొని మా యిద్దఱినీ నీచాతినీచోక్తులతో నిందిస్తూ ఒక చంపకమాల రచించి వారిశిష్యుఁడు భట్రాజు చేతికిచ్చి పంపించారు. అ భట్రాజు విద్యార్థి దూరంగానే నిల్చుండి "మా గురువులు దీన్ని మీ కిమ్మన్నారు" అనిచెప్పి మామీఁదికి విసిరేసి పాఱిపోయాఁడు. ఆ పద్యం చూచుకొని మేము నవ్వుకొని వూరుకున్నాము.

మా ప్రయత్నం లేకుండానే యీ సంగతి యేలాగో సంస్థానం వారికి తెలిసింది. అప్పుడు అమ్మగారు రాజ్యంచేస్తూవున్నారు. జడ్జీ ఒక మహమ్మదీయ పండితకవి. ఆయనకు తెలుఁగురాదు. అమ్మగారి సెలవు ప్రకారం మా యిద్దఱి పద్యాలూ మామావల్లనే అర్థం విని యోగ్యతా యోగ్యతలు విమర్శించారు. మా పద్యమేమో జనరల్‌గా వుంది. వారిదేమో కేవలమూ "తిరుపతి వేంకటేశ్వరుల" అని మా యిద్దఱిపేర్లతోనూ వుండడంచేత అందులో వున్న గ్రామ్యపుతిట్లన్నీ మాకే సంబంధిస్తూ వున్నాయి. దానికి ఆ పండితులు "యిది వీరికి సంబంధించిన దూషణకాదు; తిరుపతి వేంకటేశ్వరస్వామికి సబంధించిం" దంటూ అనాలోచనగా అర్థం చెప్ప మొదలేశారు. ప్రక్కనే తెరచాటున వున్న మహారాణీగారు విని "అయ్యా చాలించండి, మీరూ మీరూ మనుష్యులు తిట్టుకున్నా తిమ్ముకున్నా అంత చిక్కులేదు. దీనిలో దేవుణ్ణికూడా యెందుకు తిడతా"రని మందలించారు. మా పద్యంలో వక్క మాట మాత్రం గ్రామ్యదోషం తగిలేది వుంది. అదే లేకపోతే ఆ పద్యంలో లేశమూ అయుక్తం లేనేలేదు. ఆ మాట తెలఁగవడంచేత నధికారికి అయుక్తమనే సంగతి గోచరించిందికాదు. పైఁగా మేము వ్యాఖ్యానం చేయడంలో వేదాంతపరంగా ఆపద్యం మొత్తాన్ని వ్యాఖ్యానించి, ఆయన కూడా కవే కనక ఆయన్ని సంతోషపెట్టడం జరిగింది. ఆ పద్యంలో మూడక్షరాలు మాత్రం అనర్థంగా వున్నాయి గాని తక్కినదంతా మంచి పాకంలోనే వుంది. జనరల్‌గావున్న పద్యంలో కొన్ని అక్షరాలను మాత్రం పుచ్చుకొని తమమీఁద పెట్టుకొని మమ్మల్ని పేరెట్టి ఆడరాని మాటలు ఆడడం తప్పని అధికారికిన్నీ, అమ్మగారికిన్నీ పూర్తిగా బోధపడింది. అయినా ఆ సంస్థానాల్లో, యిప్పుడేమో చెప్పలేను గాని, అప్పటికింకా బ్రాహ్మలని శిక్షించతగ్గపని చేసినా శిక్షించడం లేదు. కనక వారికి యేమీ శిక్ష వేయలేదు. శ్రీ ఆత్మకూరిరాజావారి ముద్రను సృష్టించిన వక గ్రామకారణాన్ని ఖైదైతేచేశారుగాని ఏపూట కాపూట స్నానసంధ్యాద్యనుష్ఠానాలకిన్నీ, భోజనానికిన్నీ బ్రాహ్మణ గృహానికి తీసుకువెడుతూ వుండేవారు. పండితులందఱు సంస్థానానికి వార్షికాలకు వచ్చే వుత్సవ దినాల్లో ఆ కరణాన్ని మొదటిదర్వాజాలో సంకెళ్లసహితంగా కూర్చోపెట్టేవారు. ఒకనాఁడు రాజుగారున్నూ, మేమున్నూ కలిసి వచ్చే సమయంలో ఆబ్రాహ్మణ్ణి గూర్చి రాజుగారు మేము అడగకుండానే "స్వామీ! యేంచేసేది? బ్రాహ్మడు. మళ్లా మంచినిష్ఠాపరుఁడు. పెద్దహానికి తగ్గ పనిచేశాఁడు అందుచేత ఖయిదుచేయడం తప్పిందికాదు. కులాచారానికి మాత్రం భంగం కలిగించకుండానే జరుపుతూ వున్నాం" అంటూ సెలవిచ్చారు.

మన్వాది ధర్మశాస్త్రాలను ఆరీతిగా శూద్రప్రభువులుకూడా చెక్కుచెదరకుండా కాపాడుకొనివస్తే కలియుగంలోకూడా కొందఱు కాకపోతే కొందఱేనా ఆ ఆచారాలు యే కొంచెమో ఆచరించడం తటస్థించింది. క్రమంగా "కంచే చేనుమేయడం" దగ్గఱికి వచ్చింది.

కనక యింక ఆ ఆశ పూర్తిగా వదులుకోవలసిందే. యిట్టి సమయంలో సనాతనులు సభలు సాగించడం వగయిరాలు వృథాపరిశ్రమగా నాకు తోస్తుంది. అస్పృశ్యులు దేవాలయంలోకి వస్తే అభ్యంతరంపెట్టడంకూడా పొరపాటు. వొక్క ఆ యా ఆలయాలవల్ల జీవనం వున్న అర్చకులు తప్ప తక్కిన పూర్వాచారపు చేదస్తంగల చాతుర్వర్ణ్యంవారంతా తమకు యిష్టం లేకపోతే ఆ ఆలయాలలోకి వెళ్లడం మానుకొని హరిజనుల వశంచేస్తే యెంతో బాగుంటుందని నాకు తోస్తుంది. అయితే అడ్డంకులు కల్పించడానికి ప్రయత్నించే మహామహోపాధ్యాయుల పాదరేణువుకుకూడా నిజానికి సరిపోని నాకు తోఁచేమాత్రంవూహ వారికి తోఁచదనుకోడం కూడా పొరపాటులో మఱో పొరపాటు కాకపోదు. అయినా యింతకన్న కర్తవ్యం యీకాలానికి లేదని నాకు తోఁచి వెళ్లఁగక్కాను. అర్చకులు హరిజనులపాఠశాలల్లో వుండే బ్రాహ్మణ టీచర్లతో పాటున్నూ, అక్కడికి వెళ్లి పరీక్షించే యినస్పెక్టర్లతో పాటున్నూ ఆ ఆలయాలని కనిపెట్టుకునే వుండడానికి అంగీకారం వుంటే, అంతకుమించిన జీవనం మఱోటి లేకపోయిన పక్షంలో యింకా కొంతకాలం కనిపెట్టుకు వుంటారు. వారిని భోజనభాజనాదులలో యెవరుగాని నిషేధించకూడదు. జీవనార్థం యెవరేనా యేపనికేనా సిద్ధపడక తప్పదుగదా! తమకు దేవుఁడు కావలసివస్తే గృహదేవతార్చన యేమయింది! తన యింట్లోకి కూడా వచ్చి హరిజనులు అడ్డుతగిలేకాలం యింకా రాలేదు. కనక కొన్నాళ్లదాఁకా యీలా సంతృప్తి పడచ్చును. ఆస్థితికూడా వస్తేనో 'నందో రాజాభవిష్యతి' దీన్ని సవరించవలసివస్తే దేవుఁడు సవరించఁగలఁడేమో కాని పండితులూ, గిండితులూ యెన్ని వేదశాస్త్రాలు చదివి ఎంత కొమ్ములు తిరిగినవారైనా సవరించలేరు. పండితులన్నా, వారిమాటలన్నా యిప్పుడు లోకానికి పూర్తిగా యేవగింపు. దేవుఁడు కలంగఁజేసుకోని పద్ధతిని పండితులు తమవాదమే తప్పనుకొని ఆయా ధర్మశాస్త్రాల్లో వుండే నిషేధప్రతిపాదకస్మృతులను త్యజించి దైవసమ్మతమైన మార్గంలోనే తాముకూడా ప్రవర్తించడం యుక్తమని నాకు తోస్తుంది. దేవుఁడేమో యీ అనాచారానికి శిక్షిస్తాఁడనికదా వీరికి భయం. దేవుఁడే వూరుకుంటే యింక భయమెందుకు? యిది విషయాంతరం.

మా సమస్యాపూర్తి మహారాణీగారి యొక్కానున్నూ, వారి జడ్జీ యొక్కానున్నూ సమ్మతికి పాత్ర మయిం దన్నది ప్రస్తుతం. వారు మమ్మల్ని తిట్టినతిట్లకు బ్రాహ్మలవడం కాకుండా సంస్థానపండితులు కూడా అవడంచేత వూరికే వాచా మందలించడం జరిగేదే కాని జరిమానా వగైరా లేమీ జరగలేదు. అట్టి కోరిక మాకున్నూలేదు. అట్టిపని ఆ సంస్థానాలలో యెన్నఁడూ పండితుల విషయంలోనే కాదు, తదితర విషయంలోకూడా బ్రాహ్మలవిషయంలో జరగనే లేదని విన్నాను. అందులోనూ గద్వాలవిషయం మఱీ యెక్కువగా చూడాలి. దానికి కారణం కేశవభొట్లనే బ్రాహ్మణపిల్లవాఁడిద్వారా ఆ వైభవమంతా వారికి

తటస్థించినట్టు ఒక యితిహాసం విన్నాము. ఆపిల్లవాడి పేరుమీఁదనే దేవాలయం కట్టించి ఆ కేశవస్వామికి యేఁటేఁటా జరిగించే వుత్సవాల మిషమీఁదనే కార్తిక మాఖమాసాలలో వేద శాస్త్ర కవిత్వ గానాదివిద్యలకు యోగ్యతానుసారంగా సుమారు యేభైవేలదాఁకా ఖర్చు చేస్తారు. ఆభక్తి తాత్పర్యాలు వర్ణనాతీతాలు. యీ ధర్మఖర్చుకుగాను శ్రీనైజాం ప్రభువు ముజరాకూడా యిస్తారని వినడం. ఆకేశవభొట్లు బ్రాహ్మణ్యమందు వుండే గౌరవాన్ని పూర్తిగా ప్రదర్శించడంవల్ల ఆయీ సందర్భాలు కలిగాయి. ఆ యితిహాసం వ్రాస్తే చాలా పెరుగుతుంది. చాలామంది యెఱిఁగిందే. సుమారు రెండువందలేళ్లనాఁటిది. యిప్పుడు ఆ మాత్రం బ్రాహ్మలే లేరో? లేదా, అప్పుడు కూడా లేకపోయినా ఆ సంస్థానంవారు అమాయకులై యీబ్రాహ్మణపూజకు వుపక్రమించారో నేను నిశ్చయించలేను. యీ సందర్భమంతా ఒక్క గద్వాల సంస్థానానికి సంబంధించిందే. వీరు యేదో మిషమీద వేదాదివిద్యలను సమ్మానించి యశస్సుపొందుతూ తద్ద్వారా పరమార్థాన్ని సేకరిస్తూవున్నారు కదా అని సమీపంలోనేవున్న ఆత్మకూరు, వనపర్తి సంస్థానప్రభువులున్నూ చిరకాలాన్నుంచి గద్వాలవారితోపాటు యీవిద్వత్సమ్మానాన్ని ఆచరించి యశస్సును పొందుతూ వున్నారు.

మళ్లా ప్రసక్తి కలగడంచేత యితర విషయమే రాసినట్టయింది. తుట్టతుదకు పిశాచం పట్టుకొనీ మనుష్యులను కొట్టడానికి బదులు భూత వైద్యులు ఆ మనిషినీడను కొట్టినట్టు ఆ వైష్ణవపండితులను వదలి వారి శిష్యుణ్ణి భట్రాజును అరెస్టుచేసి శిక్షించికూడా మా సమ్మతిమీఁద వదలిపెట్టారు. యెన్నఁడూకూడా పాండిత్యం పాండిత్యంవల్ల తేల్చుకోవడమందేకాని వక్రమార్గాలచేత తేల్చుకోవడమంటే మాకు గిట్టదు. ఈ సందర్భమంతా కీ. శే. శ్రీ గద్వాల రామభూపాలుడిగారి సాంవత్సరికం నాఁడు అంటే, ప్లవ సం॥ మాఖ శుద్ధ ద్వాదశినాఁడు జరిగింది. "మ. ప్లవసంవత్సర మాఖమాసమున శుక్లద్వాదశిన్" అనే పద్యం సందర్శనంలో వుంటుంది. దాదాపు 40 యేళ్లనాఁటిది యీ ముచ్చట. ఆ సందర్శనంలో వుండేపద్యాలకు వొక్కొక్కదానికి యీలాగే యెంతో గాథ కొన్నిటికి వ్రాయవలసి వుంటుంది.

ఆయీ గాథలు యెందఱో యెఱిఁగే వున్నవే. ఎందఱో చెప్పుకొనేవేకాని యెన్నో మార్పులు చెందుతూ వుంటాయి. ఆదేశంలో మాకేమో ప్రయోగతంతు తెలుసునని చెప్పుకుంటారు. అది అసత్యం. యెవరిదాఁకానో యెందుకు? మా తిరుపతిశాస్త్రిచెప్పేటప్పుడే అక్కడి దిక్కడా, యిక్కడి దక్కడా పడవలసి వచ్చేది. సందర్శనపద్యాలు చదవవలసివస్తే అతనికి అంత వాచోవిధేయంగా వుండేవికావు. వల్లించడం నేనూ లేదు, అతఁడూ లేదు గాని తాత్కాలికధారణ తప్ప చిరకాలధారణా గుణం అతని బుద్ధిలో లేదనుకోక తప్పదు.

అందుచేత ఆయీ పద్యాలల్లో మధ్యమధ్య కొత్తవాక్యాలు చేరడమేకాక అసలు కథా సందర్భాలే మాఱడం తటస్థించేది. యిదేమిటంటే "యిదేం వేదమా? శాస్త్రమా? పోనీ పో" మ్మనేవాఁడు.

సుమారు ముప్పైయేండ్లకాలం కలిసి మెలిసి సంచారంచేసి సభలు చేసినవాళ్లం మేము. నన్నుగూర్చి అతఁడు వ్రాయవలసి వచ్చినా, అతణ్ని గూర్చి నేను వ్రాయవలసివచ్చినా వుభయుల చరిత్ర వచ్చేతీరుతుంది. యెన్ని పేజీలు వ్రాసినా తేలదు. యేదో తరవాయి వున్నట్టే కనబడుతుంది. పాండిత్యాల కేమి? యిద్దరమూ సమానులమే. బుద్ధికిన్నీ డిటో, కవిత్వానికీ డిటో, వంటిబలంలో మేమిద్దఱమూ కలఁబడవలసివస్తే అతఁడే నన్ను కొట్టేటట్టే మొదటినుంచీ వుండేవాఁడుగాని, పాపం, ఆలాటి ప్రసక్తి యెప్పుడేనా కలిగినా వూరికే దెబ్బ చూపించి ఆఁగిపోయేవాఁడే కాని కొట్టేవాఁడు కాఁడు. దానికి కారణం వ్రాయ నక్కఱలేదు. యిదివఱకు వ్రాసినదానిలో వుంది. "క. నాకన్న బుద్ధిబలమున నే కాదు తనూ బలమున" అని నేను సానుభూతిపద్యాలల్లో వ్రాసిన విషయం కొంత వ్యాఖ్యానాపేక్షతో చేరివుంటుంది. దానివ్యాఖ్యానం అతని జీవితచరిత్రలో చేసివున్నాను. తనూబలాన్నిగూర్చి గీరతంలో వివరించి వున్నాను. "చ. ఒడలిబలమ్మునన్ గెలుతు రొప్పితి నందునుగూడఁ దిర్పతిన్, దడఁ బడఁ గొట్టఁ జాల రొక "దద్దదదిందకట్టు" పట్టినన్ గెడపుదురు" నన్నెప్పుడూ కొట్టలేదుగాని మఱికొందఱిని కొట్టడమేకాదు, చార్జిదాఁకా రావడం కూడా జరిగింది. కొట్టేవాఁడు తొందరమనిషే. వెనకా ముందూ చూచేవాఁడు కాఁడు. చురుకుపాలు.

అతనికంటె అంతో యింతో నేను వయస్సా పెద్దవాణ్ణి, అందుచేత సభాస్థానాల్లో కాని, యితరత్రాకాని పెత్తనమంతా నామీఁదే నడిచేది అందుచేత అతఁడు కొంత అశ్రద్ధగా వుపేక్షాతాత్పర్యంగా వుండేవాఁడు. ద్రవ్యవిషయమైన వివాదాలు మా కెప్పుడూ లేవు. విద్యావిషయాలు కొన్ని తెల్పేవున్నాను. అతఁడు శ్రద్ధగా వుండడమల్లా అవధానంలో తనవంతు చరణం చెప్పవచ్చినప్పుడు మాత్రమే. అందులో పూర్ణమైన శ్రద్ధ వహించేవాఁడు. ఆలా వహించకపోతే అసలు ఆ శకటం నడవనే నడవదని వేఱే వ్రాయనక్కఱలేదుగదా! ఆ అవధానపద్యాలు వెంటనే మఱచిపోవడమంటూ వుండేది కాదుగాని యేమేనా కొన్నాళ్లకేనా "శనగలు తినిచేయి కడుక్కోవడం" జరిగేది. యిద్దఱమూ వుంటే అదో అందంగా వుండేది. ఆయాసభలలో వొక్కొక్కప్పుడు మాలో మేముకూడా "కయికురుబొయికురు" లాడుకోవడమున్నూ పలువురెఱిఁగిందే. నారాయణ దాసుగారు (ఆదిభట్ట) అన్న పేరన్నగారి వశంలో వున్నట్టుగానే అనుకోండి, తిరుపతి శాస్త్రిగారు నావశంలో వుండేవాఁడు. యిది నేను వినయంగా వ్రాసేదానికింద భావించకండి. సర్వవిధాలా సమర్థుఁడైన వక వ్యక్తి యింకొక వ్యక్తివశంలో వుండడం సామాన్యమైన విషయంకాదు.

మాయీ అనుబంధానికి యేవో కొన్ని బహిఃకారణాలు కనపడినా అంతఃకారణం దైవనిర్ణీతమయింది యేదో ఒకటి వుండితీరుతుంది. లోకం చెప్పుకొనే మాటలకేమి? కొన్ని నిజాలూ వుంటాయి. కొన్ని అసత్యాలూ వుంటాయి. అవి యెప్పుడూ అంతరించేవి కావు. సుమారు అప్పటి నా నివాసగ్రామం యానానికి ఆఱేడు ఆమడలదూరంలో వున్న అతనిపేరు తిరపయ్యేమిటి? నాపేరు వెంకన్నేమిటి? మేమిద్దఱమూ తిరుపతి వేంకటేశ్వరులుగా కలుసుకోవడ మేమిటి? యిది దైవనిర్ణయమంటారా. మనుష్య నిర్ణయ మంటారా? యిటీవల యెందఱో జంటకవులు బయలుదేఱినా యీ విధంగా పేరులు కలశాయా? కొందఱు నేఁటికికూడా "తిరుపతి" అనేది యింటిపేరనే అనుకునేవా రున్నారు. కొందరు తిరుపతిలో వుండే కవులు గనక తిరుపతికవులని అనుకొనేవారున్నారు. కొందఱు యీమా కడియం గ్రామానికి నాపేర వుత్తరం వ్రాస్తూ "తిరుపతి శాస్త్రులుగారికి" అని యిప్పటికీ వ్రాయడంకలదు. సుమారు పుష్కరకాలం దాఁటినా తిరుపతిశాస్త్రులు యింకా వున్నాఁడనుకున్నారనుకోవాలా? లేక స్వర్గతులైనవారు యీ యిద్దఱిలో యెవరో తెలుసుకోలేకపోవడంచేత యీ తబ్బిబ్బు కలుగుతూ వున్నదనుకోవాలా?

ఆయీ సందర్భాలన్నీ తిరుపతి వెంకటేశ్వరకవులకు వుండే ఐకమత్యం అనన్యసామాన్య మనే అంశాన్ని బోధిస్తాయి. తేడాపాడాలకేమి? యేవో లవలేశాలు వుండకపోవు, వాట్లని కొందఱోలాగా, మఱికొందరు మఱోలాగా చెప్పుకుంటూ వుంటారు. యెన్నో యింకా యీలాటి వున్నాయి. విస్తరభీతిచేత వదులుతూవున్నాను.

నావిషయం రాకుండా అతని విషయమే వ్రాయడానికి యేర్పడ్డ యీ వ్యాసంలో చాలాచోట్ల నావిషయంకూడా యేకొంచెమో కాక విస్తారంగానే తగులుతూ వచ్చింది. యెవరేనా వ్రాయవలసి వస్తే యింతకన్న బాగా వ్రాయఁగలరేమో? మాకూ మాకూ వుండే అనుబంధాన్ని బట్టి వకరిని తప్పించి వకరినిగూర్చే వ్రాయడానికి వీలిచ్చింది కాదు. అంతేకాని దీనిలో నా గొప్పతనాన్ని కూడా వెల్లడించుకోవాలని నేను ప్రయత్నించలేదు. అతణ్ణిగూర్చి వ్రాసేది సమస్తమూ విద్యకు సంబంధించిందయితే లోకం నాకూ అన్వయించుకుంటుంది. నన్ను గూర్చి వ్రాసేదీన్నీ అంతే. అట్టి స్థితిలో "యేడ్చినదాని మగఁడొస్తే యేకులొడికినదాని మగఁడూ వస్తా"డని వూరుకుంటే బాగుండదా? బాగుంటుంది. కాని చంద్రచంద్రికాన్యాయంగా సంచరించిన మా సంచారాన్ని ఆలా వ్రాయడానికి అవకాశం కలిగింది కాదు.

లోకులు అనుకునే స్వల్పభేదాలు వ్యక్తిభేదాన్ని బట్టి కొన్ని సత్యదూరాలున్నూ కావు. కొన్ని మాత్రం సత్యదూరాలే. యితరవిషయాలంటే? పాండిత్యభేదాన్ని గురించి మాట్లాడుకొనే

మాటలవల్ల వచ్చే చిక్కంతగా లేదుగాని జిలిబిలిపదాల కవిత్వమంతా నాసొత్తుగానూ, సమాసభూయిష్టమంతా అతని సొత్తుగానూ జమకట్టుకొనేవారిని మాత్రమే నేను సాంజలి బంధంగా "నాయనలారా! మీరు ప్రమాదపడుతూ వున్నా"రని విన్నవింపవలసి వచ్చింది. యీ విషయమే అతని జీవితచరిత్రలో యెత్తుకొని కొంత వ్రాశాను. ఆలా అనుకొనే మాటలవల్ల నాకే యెక్కువ లాభం కలుగుతుందని, నేనే కాదు కవితాసర్వస్వవేదులందఱూ ఒప్పుకుంటారు. కాని అది అంతా సత్యేతరమవడంచేత అంగీకరించడానికి వీలులేక యథార్థం తెలిపి అతని ప్రత్యేకరచనచేత దాన్ని నిరూపించవలసి వచ్చింది. కవిత్వమంటే యేవో నాలుగు సమాసాలు కూర్చడమే పరమావధిగా కలదికాదు. "సాధ్యోపిరసోయథాతథం కవిభిః" వున్నంతలో వోపిక తెచ్చుకుని వ్రాశాను. యిందులో తిరుపతిశాస్త్రినిగూర్చి 'మావాడు' కూడా వదులుకొన్న తరగతిలోనివి కదా? అట్టిస్థితిలో నేను వాటిని వాడడానిక్కారణం మామా సంభాషణ యేలా వుండేదో దాని స్వరూపాన్ని క్రొత్తవాళ్లకి తెల్పడానికే కాని అన్యంకాదు. మా విద్యార్థిదశనాటికింకా దేశం యింతటి మహోన్నతస్థితికి రాలేదు, యీనాటి నాగరికత వగయిరాలు యితరుల విషయం వ్రాయడంలో యేంచిక్కు వస్తుందో అనే శంకతో పనివున్నది కాదు కనక పాటించలేదు. 68 వత్సరాల వయస్సులో వున్న నన్ను యిప్పుడుకూడా తి. శా. అన్న మత్సమానవయస్కుడో లేక యేస్వల్పమో పెద్దో అయిన సుందరరామశాస్త్రి 'యేమిరా' అనేపిలుస్తాడు. నేనున్నూ ఆలాగే పిలుస్తాను. మా రోజులుమట్టుకు యీలాటి నాగరికత తోటే వెడితే మాకు సంతోషం. యిదే యిప్పటి నాగరికులను గూర్చినదయితే "లీగల్"గా తప్పుగా పరిణమిస్తుంది. సందేహంలేదు.

వకటి రాయడం మఱిచాను. యిటీవల వ్రాసిన తిరుపతిశాస్త్రి జాతకచక్రాన్నిబట్టి చూస్తే గురుఁడు వృషభంలో వుండడంవల్ల నా జాతకంలో మిథునంలో వుండడంచేత అతడు నాకన్న కొంచెం మాసాలో దినాలో పెద్ద కావలసివస్తుందేమో? యీ సంశయం యింతదాకా వ్యాసం వ్రాశాక తట్టింది. లేదా వక్రగతిచేత ఆలా తటస్థించిందా? అది కూడా గురుణ్ణి అంతదూరం లాగదు. అయినా యీకాకదంతపరీక్ష యిప్పుడెందుకు? అంతో యింతో నాకన్న వయస్సులో మాత్రం అతడు చిన్నవాడే.

★ ★ ★

# "పుణ్యైర్యశోలభ్యతే"

అంటూ తఱచుగా పెద్దలు వాడుతూవుంటారు. ఇది చాలా గమనించతగ్గది. యీ మాటే కాదు, తఱచుగా పెద్దలు వాడేవాట్లల్లో యేవిన్నీ అననుభూతమైన సంగతులు కనపడవు. ప్రస్తుతం యీ మాటనుగుఱించి నా అనుభవాన్ని కొంచెం వ్రాస్తాను. దీన్ని చూచి ప్రస్తుతం నాకు ప్రతి పక్షులుగా వుండేవారు గేలిచేయడం యేలాగా తప్పదనుకోండి. నాయందు ప్రేమాతిశయం కలవారిలో కూడా కొందఱు "యద్దేవ" చేస్తారని నాకు పూర్తిగ తెలుసును. తెలిసిన్నీ వ్రాయడమెందుకంటే దీనిలో కొంత "అహంకార నిరాసా"నికి పనికివచ్చే విషయాలుకూడా వుండడంవల్ల యెక్కువ పరిశీలకులైనవారు వాట్లను అభినందిస్తారనిన్నీ, యింతేకాక యింత వయస్సు వచ్చీకూడా యీ అంశాన్ని వ్రాయకపోతే పలువిధాలుగా అనుమానించే లోకులకు యథార్థం యేలా బోధపడుతుందనిన్నీ సాహసించి వ్రాస్తూవున్నాను.

లోకంలో ఆచారం యేలావుందంటే, యెవరేనా తన్ను గూర్చి "మీరు అంతవారు యింతవా"రని అన్నప్పుడు "సరి, నేనెంతవాణ్ణి, మీ పాదధూళినికూడా పోల" ననడమున్నూ "నీవు శుద్ధ శుంఠ" వని కర్మంచాలక యెవరేనా అన్నట్టయితే "నీవు శుద్ధ శుంఠ"వని యెదురుకొని తిట్టడమున్నూ అనుభూతంగా తెలుస్తూవుంది. పయికి వినయమెంత నటిస్తూవున్నప్పటికీ ఏదో విద్యలో ప్రవేశముండి నలుగురులో అంతో యింతో పేరున్నవాఁడికి యేకొంచెమో అహంకారం వుండితీరుతుందిగాని "నాకేం వచ్చును. నేను శుంఠను" అనే భావం మాత్రం వుండదు. దీనికి యెన్నో వుదాహరణాలు చూపవచ్చును. యెక్కువ తెలివితేటలు కలవాఁడైతే గంభీరంగా ఆత్మశక్తిని ప్రకటించుకుంటాఁడు. అవి కొంచెం తక్కువ వున్నవాఁడైతే వున్న దున్నట్లుగా ప్రకటించుకొని "గర్విష్ఠి" అనిపించుకుంటాఁడు. మచ్చుకు ఒక్కటి చూడండి. కాళిదాసేమన్నాడు?

"అభిరూపభూయిష్ఠా పరిషదియం, తదత్ర కాళిదాస గ్రథితవస్తునానవేన నాటకే నోపస్థాతవ్య మస్మాభిః".

అని కాఁబోలును తన ప్రజ్ఞావిశేషాన్ని గూర్చి గంభీరంగా తెలుపుకున్నాఁడు. దీన్ని లోఁతుగా ఆలోచించకుండా "యేమీ వ్రాసుకోనేలేదు కాళిదాసు, నిగర్వచూడామణి"

అనేవారిమాటలు నేను బహుధా వినివున్నాను. విమర్శించిచూస్తే దీనిలో స్వోత్కర్ష బోలెఁడు ప్రకటిత మవుతూ వుందని తేలుతుంది. పండితరాయలు కాఁబోలును -

'ఆమూలాద్రత్నసానోః...కోఽ స్తిధన్యోమదన్యః" అని పెళపెళమంటూ వక స్రగ్ధరావృత్తంలో స్వాతిశయాన్ని ప్రకటించుకోవడంచేత ప్రతివారికిన్నీ గర్విష్ఠుఁడుగా కనపడతాఁడు. వాచ్యంగా దీనిలో యెంత స్వాతిశయం ప్రకటితమవుతూఉందో, వ్యంగ్యంగా దానిలోనున్నూ అంత స్వాతిశయమున్నూ ప్రకటితమవుతుంది. సందేహంలేదు. మహావేదాంత గ్రంథంగదా భగవద్గీత - దానిలోకూడ శ్రీకృష్ణభగవానుఁడు సహా స్వాతిశయప్రకటనము చేసికొన్నట్లు తీయవచ్చు. యెందుచేత? వొక్కొక్క సందర్భంలో ఆలాచెప్పక విధిలేదు. కాఁబట్టి ఆలా చెప్పడం తటస్థించింది.

యిక ప్రస్తుత మేమిటంటే లోకులందఱూ చదువుకున్నట్టే తి॥వెం॥ కవులున్నూ చదువుకున్నారనిగాని, అంతకన్న కొంచెం తక్కువ చదువుకున్నారనిగాని చెప్పవచ్చు. అట్టిస్థితిలో వీళ్లిరువురున్నూ "సమానానా ముత్తమశ్లోకోస్తు" అనే శ్రుతికి వుదాహరణంగా వుండడం తటస్థించింది. దీనికి సంతోషించేవారు చాలామంది వున్నా, విచారించేవారు కూడా కొందఱు వుండడం తప్పదుగదా? అందుచేత వారిని విద్యార్థి దశనాఁటినుండిన్నీ పలువురు ద్వేషిస్తూవుండడం తటస్థించింది. కాని ఆ ద్వేషించేవారివల్లనే వీరి విద్యావృద్ధిన్నీ, దానితో యశోవృద్ధిన్నీ, దానితోపాటు ధనాభివృద్ధిన్నీ కలుగుతూవచ్చింది. దేశంలో మొట్టమొదట వీరికి విద్యావిషయమైన వాదోపవాదాలు అంతగా తటస్థించలేదుగాని నైజాంయిలాకా సంస్థానాలలో సుమారు 24-25 యేండ్ల వయస్సులో తటస్థిస్తూవచ్చాయి. ఈ దేశంలోనల్లా మొట్టమొదట ముమ్మిడివరంలో వకరితో వచ్చింది వాదం. ఆయనే కాకినాడలోకూడ అడ్డుతగిలి వోడిపోయారు. అదృష్టంవల్ల యశస్సు వస్తుందనడానికి యీ కాకినాడలో తటస్థించిందే ప్రథమోదాహరణము. యేమంటారా? మొదట వుపజాతి వృత్తాన్ని వుపజాతివృత్తంకాదనిన్నీ, సీతావివాహాన్ని సీతావివాహం కాదనిన్నీ ఆక్షేపించిన పండితుఁడి కెంతతత్త్వం తెలుసునో ఆ విషయంలో వీరికిన్నీ అంతే తెలుసును. తీరా ఆయన ఆక్షేపించాక యిందులో చిన్నప్పుడు చదువుకొన్న రఘువంశద్వితీయసర్గ మొదటిశ్లోకంవల్ల వృత్తాన్ని గూర్చి ఆయన ఆక్షేపించడం ఖండించఁబడ్డది. అప్పటికప్పుడే వ్యాకరణంలో చాలావఱకు గ్రంథాలు అయివుండడంవల్ల "ఏనాం" అనేదానిలో "సీతాకళ్యాణాన్ని" కుయుక్తిచే సాధించేప్రజ్ఞ అలవడింది. యిందులో చాలామట్టుకు అదృష్టబలమే కనబడుతూవుందా?

తరువాత విజయనగరంలో కాఁబోలును, అవధానంలో వక మహాపండితుడు వసుచరిత్రలోవున్న వక కల్పన యిచ్చి పద్యం చెప్పమన్నాఁడు. దానిమీఁద ఆ కల్పన

శుద్ధ తప్పుగా వుందికనక చెప్పకూడదన్నాం మేము. యిచ్చిందేదో చెప్పవలసిందేకాని మీరు దాన్ని ఖండించడానికి మీకు (అవధానులకు) అధికారం లేదన్నారాయన. అది సరికాదు, యిక్కడ వున్నవారికి యీ తప్పు తి॥ వెం॥ కవులదికాదు పృచ్ఛకులదే అని తెలుస్తుందికాని, యివి అచ్చై ప్రకటితమైన పిమ్మట యెవరిదీ కవిత్వ మంటే తి॥ వెం॥ కవులదంటారు, అప్పుడు దానివల్ల వచ్చే అగౌరవం మా నెత్తినే పడుతుంది. కాఁబట్టి యీ కల్పన వదలుకొని మఱొకటి అడగమన్నాము. దానిమీఁద ఆయన అన్నారుగదా:- "యీకల్పన నాదికాదు వసుచరిత్రలోదండోయి" అన్నారు. "అయితే దాన్నే మేమున్నూ ఆక్షేపించిందిన్నీ, మీరు సమర్థిస్తే యీ కల్పన పుచ్చుకొని పద్యం చెపుతాము, లేదా? మఱొకటడగండి" అన్నాము. సమర్థించలేక ఆయన ఆ కల్పన వదలుకున్నారు. దానితో మేమేమో ఆయన్ని జయించినట్లు పామరులకే కాక పండితులక్కూడా తోఁచింది.

యిఁక గద్వాలలో సంగతి. ఆ పండితులు ఋజుమార్గం విడిచి రాజుగారితో మా విద్వత్తునుగూర్చి అబద్ధాలు చెప్పడంవల్లనే తప్ప యేస్థలంలోగాని, అర్థంలో లేక శబ్దంలో విద్యాసంబంధమైన వాదోపవాదాలు లేశమూ జరిగినట్లు లేదు. ఆ కపటం యేలాగయితే నేమి రాజు గారికి కొంతకాలానికి బోధపడింది తుట్టతుదకు. పిమ్మట అవధానం చేయించి చూచారు, సంతోషించారు, సరిపోయింది. గద్వాలపండితులు సరియైన మార్గాన్ని అవలంబించేయెడల అందఱితోపాటేగాని, అక్కడ మాకు యెక్కువ సన్మానం జరిగివుండదు.

యిఁక ఆత్మకూరువిషయం. గద్వాలకు ఆత్మకూరు మిక్కిలి సమీపం. మూఁడుకోసుల దూరంలో వుంది. మధ్య కృష్ణానది మాత్రమే అడ్డు. గద్వాలకు వచ్చినవాళ్లెవళ్లుగాని ఆత్మకూరుకి వెళ్లడం మానరు. అట్టిస్థితిలో మేము వరుసగా రెండేళ్లు గద్వాల వెళ్లికూడా ఆత్మకూరికి వెళ్లకుండానే దేశానికి వచ్చేశేవాళ్లం. దీనిక్కారణం, యీవూళ్లో సన్మానింపఁ బడితేకదా యితరత్ర సన్మానానికి యత్నించడం అనుకోవడమే. రెండోయేట గద్వాలలో సన్మానం జరిగిందికాని అప్పటికప్పుడే ఆత్మకూరిలో వుత్సవం అయిపోయింది. అదిన్నీకాక యువరాజుగారి పట్టాభిషేకంవఱకున్నూ వుండవలసిందని గద్వాలరాజుగారు కొన్నాళ్లు ఆపుచేశారు. దానాదీనా "వేసవి దగ్గఱయ్యె" అనే పద్యంలో వుండే అర్థం స్ఫురణకువచ్చి రెండోయేడుకూడా ఆత్మకూరు వెళ్లనేలేదు. మూడోయేడు గద్వాలకు వెళ్లేము. తప్పక ఆత్మకూరు వెళ్లాలనిమాత్రం వుంది. ఆ సంస్థానంలో ఒక పండితుఁడున్నాఁడనిన్నీ, ఆయన నాల్గు శాస్త్రాలువచ్చినవారనిన్నీ, ఆశుకవిత్వం చెప్పేవారనిన్నీ, చాలా సమర్థులనిన్నీ చెప్పడం మాత్రం వింటూవున్నాము. ఆయనకున్నంత పేరు ఆ ప్రాంతంలో యెవ్వరికిన్నీలేదు. కాని మమ్మల్నిచూచి కొందఱు వీరికి ఆయన లొక్కుతారని అనుకొనేవారు. మాకు మాత్రం

"ఆయనకు వున్నన్ని ప్రజ్ఞలు మనకు లేవు కనక ఆయనకి మనమే లొక్కుతామేమో" అని మనస్సులో వుండేది. కాని యేమైనాసరే, వెళ్లడం మాత్రం తప్పదు. "యశోవా మృత్యుర్వా" అనుకుంటూ వుండేవాళ్లం. యితర విషయాలెట్లున్నా అవతలి పండితుఁడితో నాలుగు మాటలు మాట్లాడడం తటస్థించేయెడల ఆయన్ని మనం జయించేదీ మనల్ని ఆయన జయించేదీ, తెలుసుకోగలనని నాకు ఆ రోజుల్లోనేకాదు యెప్పుడున్నూ ఒక ధీమాకు వుండేది. అయితే ఆయన గద్వాలసంస్థానానికి వచ్చేదేలాగ? వస్తేనేకదా మనకు కనపడేది. యీ సంస్థానం వారితో ఆయనకు సరిపడదు. యీలావుండఁగా ఒకరోజు తెల్లవారు జామున మేము బసచేసిన యింటి అరుగుమీఁద దేవీభాగవతప్రథమ స్కంధం తెలుఁగుచేస్తూ యిద్దఱమున్నూ కూర్చున్నాము. దైవవశాత్తుగా ఆ పండితుఁడు చుట్టాలింటికి వచ్చి కాఁబోలును తిరిగి స్వగ్రామానికి వెడుతూ అక్కడ కొంచెం నిల్చుండి "ఓహో! మీరే వో తిరుపతి వేంకటేశ్వరులు?" అని గంభీరంగా పృచ్ఛచేశారు. అంతకుమునుపు ఆయన్ని చూడకపోయినా మేముకూడా "ఓహో! తామేనా ఫలానా ఆచార్లవారు?" అని లేచి దయచేయండి అని పిలిచాము. వచ్చారు. కూర్చున్నారు. యేమిటి వ్రాస్తూ వున్నారన్నారు. దేవీభాగవతం తెలిఁగిస్తూ వున్నామన్నాము. యేదీ వక పద్యం చదవమన్నారు. చిత్తం అని–

"చ. చదివితి వెల్లవేదములు శాస్త్రములం బరికించినాఁడ వి
యద్దను వివాహయోగమగునట్టిది గాన కళత్రమున్ వరిం
పఁదగు మఖక్రియల్ పొనరుపందగుఁ బుత్రులఁ గాంచఁగాఁదగున్
ముదమలరన్ మమున్ ఋణవిముక్తులఁ జేయఁదగుం గుమారకా!"

అన్న పద్యాన్ని అప్పుడే వ్రాసిన దానిని వినిపించాము. వినీ వినడంతోనే తుట్టతుదనున్న "కా" తీసివేస్తే బాగుంటుందన్నారు. చిత్తం, యిప్పుడేకదా వ్రాశాము, సాపువ్రాసేటప్పుడు మీ సెలవుప్రకారం సవరిస్తామన్నాము. తరువాత వారితోవను వారు దయచేశారు. మా వాడితో నే నన్నానుగదా, యీయన మనతో డీకొంటే తప్పక వోడిపోతాఁడురా అన్నాను. యేమన్నాఁడు, యేమో నా కల్లా తోఁచిందన్నాను. చెప్పాలన్నాఁడు. గంభీరుఁడుకాఁడు. తొందర మనిషి. ఎప్పుడూ చూడక చూడక చూచినవాళ్లంగదా మనం? విన్నది వకపద్యం. దానిలోవున్న కుమారకా అనేపదం బాల, బాలక, పుత్ర, పుత్రక వంటిదిగాని దోషజుష్టం కాదాయె. యేదో కొంత పేరున్నవాళ్లని వింటూన్నట్టు ఆయన మాటలవల్లే తెలుస్తూ వుందాయె. నిజమైన తప్పున్నా అపరిచితుల విషయంలో ప్రథమసమాగమంలోనే సవరణను ప్రతిపాదించవలసివుండదు. అట్టి స్థితిలో

యెట్టి సవరణతోగాని లేశమున్నూ అవసరంలేనిచోట సవరణ ప్రతిపాదించడంచేతనే నేనీ అంశాన్ని గ్రహింపఁగలిగానుగాని ఆయనకన్న మనం యెక్కువ చదివినవాళ్లమని కాదన్నాను. అయితే యిప్పుడే యెదురుకోలేదేమి, సవరిస్తానన్నావేమి? అన్నాఁడు. యిప్పుడే ఆయనతో కలహమెందుకు? ఆయనవున్న సంస్థానానికి మనం వెడుతూ యింకా వెళ్లడానికిముందే పోట్లాడడం ఆలోచనపని కాదు. వీలైనంత వఱకు తప్పుకోవడం మనపని. అంతకూ తప్పనివిధి అయితే- "త్వంశుంఠ, త్వంశుంఠ" యేలాగా తప్పదు, అన్నాను. తుదకు అక్కడికి వెళ్లడమూ, ఆయనతో వాదం రావడమూ, ఆయనకు వోడూ, మాకు జయమూ, గజారోహణోత్సవమూ, అందఱున్నూ యెఱిఁగినదే.

అక్కడేమీ పెద్ద శాస్త్రచర్చ జరుగలేదు. వ్యాకరణంలోతప్ప ఆయన మాకు లొంగరు. నాలుగు శాస్త్రాలువచ్చి సంస్కృతంలో బేబాగానున్నూ, ఆంధ్రంలో కచ్చాపచ్చాగానున్నూ కవిత్వం చెప్పఁగల ప్రజ్ఞవుంది ఆయనకు. అయితే ఋజుమార్గవర్తి మాత్రం కాకపోవడం ఒకటి లోటు, యేలాగయితేనేమి, తొందరపడి,

"ఉ. నా పలు కాలకింపుమ యనంత! గుణాలయనైనయట్టి నా
రూపముమాత్ర మొప్పుగ నిరూపణఁజేసి యెఱుంగుదీవు, దు
ష్ప్రాపము నీకు నిర్గుణత భాసిలు నప్పరదేవతామహా
రూపము, తెల్పె నాపె యిది రూఢిగ భాగవతాఖ్యమంత్రమౌ."

అన్న దేవీభాగవత ప్రథమస్కంధపద్యంలో "గుణాలయ" అనే చోట ఆక్షేపించి భారతోదాహరణమిస్తే దాన్ని దిద్దడానికి ప్రయత్నించి ఆయన వోడిపోయి మాకు గజారోహణోత్సవానికి కారణభూతులైనారుగాని మాప్రజ్ఞావిశేషం లేశమున్నూ లేదనుట నిశ్చయం.

యింతకు కొంచెం పూర్వం బులుసు పాపయ్యశాస్త్రులవారి మనుమరాలు, ప్రకాశశాస్త్రులవారి కొమార్త వివాహసందర్భంలో మనజిల్లాలోవున్న యావన్మంది పండితులున్నూ వచ్చివున్న సభలో ఒకగాయకుఁడు మంచి సంస్కృతసాహిత్యంకల దిట్ట, కవికూడాను, ఆయనతో కొంచెం మాకు 'వలచి' "పంకేరుహనేత్రి" అనే పదాలవిషయమై వాదం వచ్చింది. ఆయన తరఫున "అపరగౌతము" లనఁదగు ఒకానొక మహాతార్కికులు పూనుకున్నారు. వారితోపాటు కొందఱు వైయాకరణులు పూనుకున్నారు. యేంలాభం? వారు పట్టింది ములగకొమ్మ అవడంచేత, మమ్మల్ని వోడించడానికి అవకాశం లేకపోయింది. అంతేగాని ఆవిషయములోకూడా మాపాండిత్యం చేసిన పని లవమున్నూలేదు.

యెవరికవిత్వాన్నిగాని మా అంతటమేమై విమర్శించి, నిజమైనవిగాని, అబద్ధమైనవి గాని దోషాలువున్నట్టు యింతవఱకు ప్రచురించినట్లు నాకు జ్ఞాపకంలేదు. నాకు రామశబ్దం దగ్గఱనుంచీ ప్రయోగించడానికి సంశయమే. యెందుచేత? అందులో తప్పేముందో అనే శంకచేతనే. రామశబ్దమంటే రామశబ్దం కాదనుకోండి; నాదంత అనుమానం మనస్సన్నమాట. యెవరి కవిత్వంలోనేనా యేదేనా తప్పుగా తోఁచినప్పటికీ యే మహాకవి యెక్కడ వాడింది చూచి ఆయన ప్రయోగించారో అని అనుకుంటానుగాని చట్టన తప్పనేదిలేదు. యెంతో ఆలోచిస్తాను. యెందఱినో అడిగిచూస్తాను. అప్పుడుగాని దాన్ని రంగంలో ప్రవేశపెట్టేది లేదు. అదేనా యే సందర్భంలోనంటారు? మా మీఁద కెవరేనా "గిల్లి కజ్జా"కు దిగితే వారి శిరోభారం తగ్గించడానికితప్ప పనిలేని పాటగా యెవరిమీఁదకీ వెళ్లేది లేదన్నది చదువరులు జ్ఞప్తిలో వుంచుకోవాలి. ఆ కారణంచేతనే యింతవఱకు మేము వెళ్లిన వాదాలేవిన్నీ వోడిపోలేదన్నది ముఖ్యాంశం. అది కొంత యశస్సుకు కారణం.

యింకొకటి యిక్కడ వ్రాయాలి. మొదటినుంచిన్నీ మాకు పలువురు శత్రువు లుంటూవున్నసంగతి లోకవిదితమే. ఆ శత్రువులు మా పుస్తకాలలో తప్పులుపట్టి మమ్ము అవమానించడానికి పూనుకొని వ్యర్థులవడం తటస్థించడంకూడా లోకు లెఱిఁగినదే. అందులో కొంత న్యాయమైన మా ప్రతిభ లేకపోలేదుగాని దైవసహాయం చాలావుంది. వుదాహరణకి ఒకటి మనవి చేసుకుంటాను. మా పాండవాశ్వమేధంలో ప్రతిపంక్తికిన్నీ గీటులుంచి తప్పులని యెవరైతేనేమి ప్రకటించారుగదా! అందులో అన్నీ సమాధానం చెప్పఁదగ్గవే కావడమేమి? యే ఒకటి రెండో నిజమైన ప్రమాదాలు వున్నప్పటికీ అవికూడా అన్యథా మార్గాంతరంచేత సమాధానం చెప్పఁదగ్గవి కావడమేమి? "మరుద్భూపాలుఁడు" అన్నదానికి చెప్పినసమాధానానిక్కాఁబోలును, ఆకొండి వ్యాసమూర్తిశాస్త్రులుగారు నిర్ఘాంతపడ్డట్లు విన్నాను. యెంతసత్యమో? పూర్తిగా సమర్థించడానికే వీలులేని ప్రమాదాలు ఆ నాటకంలో మచ్చుకేనా లేకపోయాయా? వున్నాయి. యెన్నోలేవు. నాయెఱిఁగినంతలో ఒక్కటిమాత్రమే వుంది. అది మాప్రతిపక్షుల కెందుకు కనపడకపోవాలి? వారికేకాదు, వారి విమర్శనకున్నూ దానికిచ్చిన మాజవాబుకున్నూకూడ చాలా యిటీవల యెంతో కాలందాఁకా అది మాకున్నూ గోచరించనేలేదు. గోచరించినప్పుడేనా ఆ పుస్తకం చదివి పరిశీలించేటప్పుడు గోచరించలేదు. యేదో పనిమీఁద బజారుకువెళ్లి కృష్ణాప్రెస్సులో ఆలస్య మవడంచేతనూ, స్కూలుటైము అప్పటికే అతిక్రమించడంచేతనూ తొందరగా యింటికి వస్తూవుండఁగా శ్రీకాశినాథుని బ్రహ్మయ్యలింగంగారి యింటిప్రక్క సందులో నడుస్తూ వుండఁగా ఆ తొందరలో హఠాత్తుగా పాండవాశ్వమేధంలోవున్న నిజమైన మా ప్రమాదం

నాకు స్ఫురణకు వచ్చింది. యిది దైవసహాయంకాక యేమనుకోవాలి? ఆ తప్పుగల పద్యాన్ని వుదాహరిస్తాను.

తే. గీ. "వీర! చిత్రాంగదవిచిత్రవీర్యులకు వి
వాహ మొనరించితివి కష్టపడి జయించి
వారు నేఁటికిఁ బ్రత్యుపకార మిట్టు
లాచరించిరి నావంటి యధముకతన."

యిది భీష్మనిర్యాణఘట్టంలో ధృతరాష్ట్రుని వాక్యం. భీష్ముఁడు విచిత్రవీర్యునికే అంబికాంబాలికలను తెచ్చి వివాహం చేశాఁడుగాని చిత్రాంగదునికి చేయలేదు. ఆ వివాహకాలంనాఁటికే చిత్రాంగదుఁడు దివంగతుఁడైనాఁడు. యిది పెద్దతప్పు కాదనుకోండి. యేమైనా వైరు లాలా సరిపెట్టుకుంటారా? తి॥ వెం॥ కవులకు భారతం యేమీ తెలియదు, అని మొదలుపెడతారుగా? యీ మధ్య వక బుద్ధిశాలి, శుద్ధపత్రికలో సవరణ చూపినదాన్నే యెత్తుకొని, "చూపినా ప్రయోజనం లేదు. ఆ సవరణ వక కందపద్యంలో సవరించడానికి అవకాశం వుండ" దంటూ వ్రాశాఁడు. అప్పటికి ఆయన పునర్ముద్రణాన్ని చూడలేదుపాపం. నాయనా, ఆ కందపద్యంకూడా ఫలానాముద్రణంలో సవరింపఁబడివుంది చూడుమని వ్రాశాను. చూచి మళ్లా వ్రాస్తాఁడుగదా "చూచానుగానీ, యింకొక పద్యంలో సవరించలేదు, దానికి యేముద్రణాన్ని చూడమంటా" రంటాడు. యీ మోస్తరుగా వుండే వుదారులు విమర్శకులైనప్పుడు ప్రస్తుత "చిత్రాంగద" విషయం వదలిపెడతారా? యెంతో రంజస్సు చేస్తారు. దారికెవరో సహృదయులు మందలిస్తా రనుకోండి, అంతదాఁకాకూడా రాకుండానే దైవం చేశాఁడుగా! వాళ్లకు ఆస్థలాన్ని కనపఱచనేలేదు. గ్రంథకర్తకే అప్రయత్నంగా ఆస్థలాన్ని కనపఱచాఁడు. దానితో గ్రంథకర్త యీ అంశాన్ని వుదాహరించి "నాయనలారా, మీరు దైవోపహతులు, కాఁబట్టి మీకు నిజమైన తప్పులు కనఁబడవు" అని యీ మాటను సమర్థించడానికి పైపద్యం వుదాహరించి మందలించడానికి అవకాశం కూడా కలిగింది. ఈ విషయం పాశుపతం చూస్తే తెలుస్తుంది. కాఁబట్టి విస్తరించేదిలేదు.

యింతకూ వ్రాసే ముఖ్యసంగతి యేమిటంటే : తి॥ వెం॥ కవుల విజయాలల్లో నూటికి తొంబదులు దైవానుగ్రహ లబ్ధాలనిన్నీ మిగతా పదిన్నీ స్వప్రయోజకత్వంవల్ల వచ్చినవనిన్నీ మనవిచేసుకోవడానికి ఆయీ విషయాలు వున్నవివున్నట్లు వ్రాయడం. అప్పటికింకా ప్రథమ ముద్రణంలో సరస్వతీపత్రికలో ప్రకటితమైన "పాండవ విజయం" ద్వితీయముద్రణం కానికారణంచేత దానినిండా యెన్నో వ్యత్యాసాలు వున్నాయి. అట్టిదాన్ని వదలి పాండవాశ్వమేధాన్ని ప్రతిపక్షులు విమర్శించడానికి పూనుకోవడంకూడా

దైవహేతుకమే అని నా విశ్వాసం. పెద్ద పెద్ద పండితుల సాయంతో విమర్శిస్తూవున్న ఆ విమర్శనలో "క్షమాపణ" అనే పరిశుద్ధమైనశబ్దం "నింద్యగ్రామ్యం"గా లిఖింపఁబడడం కూడా దైవహేతుకమే అనుకుంటాను. ఆయీ సందర్భాలన్నీ దైవహేతుకాలేగాని, మా ప్రజ్ఞవల్లఁగాని, ఆవలివారి ప్రజ్ఞాలోపంవల్లఁగాని కలిగినవి కావని వ్రాయడంవల్ల కలిగే లాభమేమిటంటారా? లోకంతోపాటు అహంకారనిరాసను చూపడం వకటికదా? అబ్బో, యింతమాత్రం చేత తి॥ వెం॥ కవులు అహంకారపూరితులు కారనుకోదు లోకమంటే వినండి:- అదిన్నీ సత్యమే. యిపుడు నేను అనారోగ్యంగా వుండడం చేతనైతేనేమి, తి॥ శా॥ గారి సాహాయ్యం పోయి చాలాకాలం కావడం చేతనేమి, కొందఱు "గిల్లికజ్జాలకు" దిగుతూవున్నారు. వారికి యీలా మనవిచేసుకుంటే యేమేనా నచ్చుతుందేమో అని కూడా నా ఆశ. దైవోపహతులుతప్ప మామీఁదకు రారనిన్నీ మా విజయానికి కారణం దైవం గాని మా ప్రజ్ఞ లేశమున్నూ కాదనడానికే నేనీవ్యాసం వ్రాయడం. నీకు విజయమే లేదనిగాని, నీకు పేరుప్రతిష్ఠలే లేవని కాని యెవరేనా అనేయెడల వారు నాకు పరమోపకారులు. యెందుచేతనంటే అట్టిమాపుస్తకాలను వెక్కిరించడానికి యెవరున్నూ ప్రయత్నించరుకనుక ఆలాటి అభిప్రాయాన్ని వాళ్లకు కలిగించక మాపైకి 'గిల్లికజ్జా'కు పురికొల్పడమున్నూ దైవంపనే అని నా నమ్మకం. నా నమ్మకాన్ని సమర్థించేవి కొన్ని వుదాహరణాలు యిదివఱకే చూపివున్నాను. మరికొన్ని కూడా చూపుతాను.

(1) "మన కవిచంద్రుఁడుగారు శ్రీరాగమెత్తుకొని సభలలో నానా రాజసందర్శనము లోని పద్యములు చదువుచు నుపన్యాసము చేయునప్పుడు సభయంతయు వింజమాకిడి నట్లుండును. ఇది వీరి పూర్వపుణ్య విశేషము"

(2) అమేధ్యపదార్థములం దగుల్కొన్న యగ్నికి నశుచిత్వమంటనట్లును... తాను శుద్ధుఁడైనచో నెట్టి దుష్టులతో సహవాసము చేసినను... ..."

యీ రెండు వాక్యాలున్నూ వేం॥ శా॥ మీఁద యెంతో ఆగ్రహంతో వ్రాసే మహనీయుల వాక్యాలలో నుండి తీసినవి. ఇవి వ్రాసినవారు మహాకవులు. ఇందు వేం॥ శా॥ పూర్వపుణ్య విశేషం కలవాఁడనే అంశమే కాక అగ్నివంటివాఁడనికూడా స్పష్టంగా తేలుతూవుందికదా? యీ వూహ శత్రువులకు కలిగిందని నేను వ్రాయడానికి చదువరులు సమ్మతించే యెడల, అగ్నిహోత్రంలో దుముకుట యెట్టిదో వేం॥ శా॥ తో వివాదం పెట్టుకోవడం అట్టిదే అని శత్రువులుకూడా వొప్పుకున్నట్లయిందికదా?

ఇట్టి పూర్వపుణ్య విశేషం కల తి॥ వెం॥ కవులతో "గిల్లికజ్జా"కు దిగేవారు దైవోపహతు లనడానికి వప్పనివా రుండరనుకుంటాను. అయితే లోకంలో "నీకు అవమానం రాను"

అనడానికి బదులు "నీకు తి॥ వెం॥ కవులతో వాదంరాను" అంటే సరిపోతుందనుకుంటాను. వెనక యెవరో పాలెపు వెంకప్పగారని వక రుండేవారఁట. వారు సంతానం లేక పెంపకం చేసుకుంటే, యెన్నిసార్లు పెంచుకున్నప్పటికీ నిలిచింది కాదఁట! యీ కారణంచేత లోకంలో ఆ పెంపు వక తిట్టుగా పరిణమించిందఁట! అనఁగా "నీవు చచ్చిపోను" అనడానికి బదులు, "ఫలానావారు పెంచుకోను" అనడానికి మొదలెట్టారఁట! అలాగే ప్రస్తుత విషయమున్నూ.

తేలినసారం; మాకేమేనా నామరూపాలు లోకంలో వుంటే దానికి పూర్వపుణ్యవిశేషం అప్రత్యక్షకారణమున్నూ, ప్రత్యక్షకారణం మమ్మల్ని వృథాగా కదిపి "గిల్లి కజ్జా" పెట్టుకొనే శత్రువులనిన్నీ స్పష్టంగదా? యీ శత్రువులను మేము మిక్కిలిగా అభినందించడం తప్పదు. యితర విషయంలో పనిలేని పాటగా "స్త్రీలను" అనే ప్రయోగం తప్పంటూ వ్రాసి, అనఁగా - మహత్యర్థకానికి, సప్తమ్యర్థకముగా ద్వితీయ నుపయోగించాఁడనీ, గోర్కెలు అని యెత్వఘటితంగా ప్రయోగించాఁడనీ, "చూపఱు" అనడానికి "చూపరులు" అన్నాఁడనీ, యింకా యేమో అన్నాఁడనీ ఆక్షేపించడానికి మొదలుపెట్టారు. యీ ఆక్షేపణాలన్నీ ఆక్షేపకులకు అపజయాన్ని కలిగించేవే అని అన్యత్ర దిఙ్మాత్రం వ్రాసి వున్నాను. యావజ్జీవమున్నూ తి॥ వెం॥ కవులు వారిమీఁదకు వచ్చిన వారిని వోడించడమే అన్యంలేదు అనే యశస్సు సంపాదించిపెట్టడానికేగాని యితరవిషయంలో యీ అంశం ఆవలి మహనీయులు యెందుకెత్తుకుంటారో విజ్ఞులు విచారించండి,

కొంతమంది మమ్మల్ని తిట్టాలని కోపంతో వ్రాఁతకి మొదలెడతారు, దానిలోకూడా మమ్మల్ని గొప్పఁజేసే మాటలే పడతాయి. "గంధర్వలోకం"లో నుంచి ఒకాయన యేలా వ్రాశారో చూడండి.

'సత్కవీ!' 'నీదు ఘన గౌరవము' 'కవీశ్వర!' 'నీబోటి శతావధానపరిపూర్ణునకు' 'మహాత్ముఁడ!'

యిత్యాదులు ఆ గంధర్వలోకస్థుని దూషణవాక్యముల నుంచి జల్లిస్తే దొరికాయి. చూచారా, యిదేమనుకోవాలి? దైవ మాలా ఆయనచే అనిపించాఁడనేనా? లేక ఆ గంధర్వలోకస్థునికి వెం॥ శా॥ మీఁద గౌరవముండే అట్లా వ్రాశారంటారా? యివన్నీ యీలా వుంచుదాం. గద్వాలలో యేమి, ఆత్మకూరిలో యేమి, యేవిధమైన వాదోపవాదాలూ లేని పద్ధతిని యే పంద్రెండు రూపాయీలో యిచ్చి పంపడంతప్ప యితర గౌరవాలకు అవకాశం లేశమున్నూ లేదుకదా? ఆ వాదోపవాదాలు యితరుల కేల లేకపోవాలి? తి॥ వెం॥ కవులకే యేలా కలగాలి? దైవమే కారణ మనుకోవాలికదా? నరసారావుపేటలో

"పశ్యశబ్ద" ఘటితమైన సమస్య నెవరో యెవరినో అడిగి తెచ్చి సభలో అడగడమేమిటి? అడిగితే అడిగారుగాక, వెం॥ శా॥ తప్పనడమేమిటి? దానిమీఁద విధిగా తి॥ వెం॥ కవులు దొరుకద్దారనుకొని ప్రతిపక్షులు విజృంభించినకొద్దిన్నీ, తి॥ వెం॥ కవులు చేతఁగానివాళ్లవలె వెనక తగ్గినట్లు నటిస్తే ప్రతిపక్షులు మఱీ మఱీ తొక్కుకురావడమేమిటి? ఆవాదం అంతతో ఆఁగక ఆంధ్రదేశపు పండితులలో అనేకులను చుట్టుముట్టడమేమిటి? తుదకు దానిలో ఆవలివారికి మార్గాంతరం లేకపోవలసి రావడమేమిటి? కాశికామతాన్ని ఖండించడానికి తగ్గ లక్ష్యం ఛందోవ్యతిరిక్తమైనది అప్పటికే కాదు యిప్పటికిన్నీ ప్రతిపక్షులకు చిక్కక పోవడమేమిటి? యిదంతా దైవ విలాసం కాక మఱేమనుకోవాలి? అందుచే ప్రతిపక్షులు ఒకపని చేస్తే బాగుంటుందనుకుంటాను. తి॥ వెం॥ కవులు శుద్ధ శుంఠతావచ్ఛేదకకోటిలో వాళ్లు, వాళ్లకు దైవం సహాయం చేసి పేరు ప్రతిష్ఠలు తెప్పించింది. లేకపోతే మనముందు నిలుస్తారా? అనుకొని యెంతవఱకు సంతోషించాలో అంతవఱకు సంతోషించి తృప్తిపడడం యుక్తమనుకుంటాను. గుంటూరు వివాదాలలో ఒకాయన యేలా వ్రాశారో చూడండి-

సీ. ప్రబలగద్వాలభూపాలభర్మధరాధ
రమ్మున భూరివ్రజమ్ము గొనుట
ఆత్మకూర్ప్రాజ్యరాజ్యమదేభములనెక్కి
వీథులలో విఱ్ఱవీఁగి చనుట
గజపతిక్ష్మాపాలనిజకరార్పితకాంచ
నాదులఁగొని చింతలేది చనుట
పోలవరక్షమాలోలాభ్యుదయకీర్తి
కాంతమన్ననలను గాంచి మనుట

తే. గీ. సరససుకవిత్వసంధానచాతురీణ
ధీవిశేషపాణింధమశ్రీవిలాస
గరిమనని యెంచుచుంటిమక్కట! పురాణ
వాక్కలనఁ గాని యన్యమ్ము వలనఁగాదు.

మమ్మల్ని చూడనప్పుడు పొరఁబాటుగా తి॥ వెం॥ కవులంటే యేమో మిణికారు కాఁబోలునని అనుకొనేవారఁట ఆయన! తీరా చూచేటప్పటికి, పురాణం చెప్పి ఆయా సమ్మానాలు పొందినట్లు తెలిసికొన్నారఁట! యింతకూ ఆయనకు అప్పుడు కావలసిన ముఖ్యాంశమేమిటి? కవిత్వం తి॥ వెం॥ కవులకు బాగా తెలియదనేది. దాన్ని ఆ రీతిగా సమర్థించి ఆయన సంతుష్టి పడ్డారు. దాన్ని గుంటూరుసీమలో ప్రకటించి వున్నాము.

అలాగే యిప్పటి "గిల్లికజ్జా" సమాజంవారు కూడా యేదో విధంగా సమాధానపడవలసిందని మా ప్రార్థన. యీలాంటివారంటూ వుండఁబట్టే తి॥ వెం॥ కవులలో ఒకరేనా యింతకాలం జీవించివుండడం తటస్థించింది కాని లేకపోతే దిష్టికొట్టి యిద్దఱూకూడా యిదివరకే ఘయిసలయేవారేమో అన్నది సత్య దూరంకాదు. జరిగిన సంగతి ఒకటి జాతకచర్యలో గ్రంథవిస్తరభీతిచే బొత్తిగా యెత్తుకోనిది యిక్కడ వ్రాసి దీన్ని ముగిస్తాను.

మొట్టమొదట యేదో స్వల్పంగా వెం॥ శా॥ కాశీనుంచి రావడానికి వెం॥శా॥ తండ్రిగారు చేసిపంపిన ఋణాన్ని తీర్చుకొనేనిమిత్తం తి॥ శా॥ సహితంగా నవరాత్రాల ఆరంభంలో కాకినాడకు వెళ్లడం తటస్థించింది. ముందు భిక్షవకటి కుదరాలి కనుక యెవరింటికి వెడదామని అనుకుంటూ శ్రీ బోడా రాజుగారి మేడప్రక్కనున్న ఉత్తరపు వీథినుంచి పడమటగా రైలుసంచీలు చేతఁబట్టుకొని విద్యార్థులతో వెళ్లుచుండఁగా, శ్రీ వేమూరి సుబ్రహ్మణ్య సోమయాజులుగారి యింటివాఁకిటిలో తి॥ శా॥ గారి పినతండ్రిగారి అల్లుఁడు కనఁబడి తి॥ శా॥ గారిని పలకరించాఁడు. అక్కడికి వెళ్లేటప్పటికి మిక్కిలి ముసాలివృద్ధులు సుబ్రహ్మణ్యసోమయాజులు గారు మీ రెవరని అడిగి, ఫలానావారి శిష్యులమని చెప్పినపిమ్మట, నాయనా! మీ రీ నవరాత్రాలు వెళ్లేపర్యంతమూ మాయింటే వుండవలసిందని ప్రేమపూర్వకంగా ఆదేశించారు. వారి ఆజ్ఞప్రకారం అక్కడే వుండడం తటస్థించింది. వారింటికి సమీపంలోవున్న శ్రీదురిసేటి శేషగిరిరావుపంతులవారిని సందర్శించేటప్పటికి ఆయన స్వంతంగానే ఒక సభ వారి చావడిలోనే చేయించి, అష్టావధానం చూచి, వచ్చినపని అంతకుమున్నే మావల్ల వినివున్నారుకనుక ఆ ముప్పది రూపాయిల ఋణమున్నూ తీరేటట్టు సమ్మానించారు. వచ్చినపని అయిందికనుక మళ్లా చదువుకొనేచోటు ధవళేశ్వరానికి శ్రీ బ్రహ్మయ్య శాస్త్రులవారివద్దకు వెళ్లాలనుకుంటూ వుండఁగా యీ అవధానంసంగతి వారినోటా వారినోటా శ్రీబాదం వేంకటరత్నంగారి నోటీసులోకి వెళ్లింది. ఆయన కబురంపించి, అష్టావధానం చాలచోట్ల చూచాము, మీరు శతావధానంచేస్తే సభచేయిస్తానన్నారు. వెనకసంగతి లేదుగాని యిక్కడనుంచి టూకీగా జాతకచర్యలో వున్నది. ఆ సభ జరిగింది. చెప్పేమాటేమిటంటే; ఆ సభలో సమ్మానాన్ని పొందివచ్చినరోజున మమ్మల్ని మొట్టమొదట తమ యింటివద్ద నిలిపి ఆతిథ్యమిస్తూవున్న సోమయాజులుగారు గుమ్మందగ్గిఱకు మేము వెళ్లీవెళ్లడంతోనే అక్కడే నిల్వండి అని ఆఁపుచేయించి, దిష్టిపరిహారార్థమంటూ కొన్ని ప్రక్రియలు చేయించి కాని లోపల ప్రవేశించనిచ్చారుకారు. యీ కథ ప్రస్తుతాని కెంతవఱ కుపకరించినా ఆ మహాపురుషుని కృతజ్ఞతను వెల్లడించడానికేనా పనికివస్తుందని వుటంకించాను. ఆలాటివారు చేసిన దిష్టిపరిహారాలవల్లనేమి, కొందఱు ప్రతిపక్షులు చేసే ప్రయత్నాలవల్లనేమి, మాలో వకరేమేనా

యింతకాలం వుండడానికి అవకాశం కలిగిందనుకుంటానునేను. దీన్ని లోకం యెంతవఱకు విశ్వసిస్తుందో?

పుట్టెఁడాముదం వ్రాసుకొని పొర్లినా యశస్సు పూర్వపుణ్యం వుంటేనేకాని రాదు. యీ మాట నే నిప్పుడే వ్రాయడంలేదు. యిదివఱలో ఆరోగ్యకామేశ్వరిలో కూడా వ్రాశాను. శా॥ ఈజన్మమ్మునఁ గొంచెమేయనుము మున్నేజన్మమందైన నీపూజన్ బూర్తిగఁజేసె వీఁడదికతమ్ముంజేసియే లోకమున్ బూజించెన్... ...కామేశ్వరీ. తాదృశపుణ్య హేతుకమైన కీర్తిని పోఁగొట్టఁగలవారుంటే పోఁగొట్టుదురుగాక. వారికి కూడా పుణ్య పరిపాకం వుంటే కీర్తి కలుగుఁగాక. "పుణ్యైర్యశో లభ్యతే, నాన్యథా, నాన్యథా, నాన్యథా."

పూర్వపుణ్యమనడానికే కొందఱు జాతకబలిమి అనడం కలదు. ఆమాటకూడా నేను వకచోట సభలోనే వాడివున్నాను.

(వేమవరాగ్రహార శతావధానమునుండి)

చ. జననపులగ్నమం దలరు శక్రగురుండును శుక్రుఁడున్ గుజుం
దును నల రాహువు న్నను ఘనుంబొనరించెడి నంతెకాని యే
నును నొక సత్కవీశ్వరుఁడనో! తిరపయ్యయు నొక్క మేటియో!
యనఘ కవిగ్రహంబులు, గ్రహంబులు గవ్వనుజేయు వజ్రమున్.

యీ యంశాన్నే భంగ్యంతరంగా వకచోట కొలఁది కాలంనాఁడు వ్రాసివున్నాను. ఆ పద్యం "విక్రమ చెల్లపిల్ల" అనే వ్యావహారికభాషా పుస్తకంలో మీరు చదువుతారు. అయినా దాన్ని కూడా వుదాహరిస్తాను.

శా. నీ కారుణ్యమకాక యేనృపతిగానీ వీనిఁ బూజింపఁగా
నీ కాలమ్మున నెంతపాటికవియో! యేమంతవిద్వాంసుఁడో!
నీకే స్పష్టము, వీనిముం దొకరుఁడేని న్నిల్చి గట్టెక్కెనే?
మోకాల్బంటియె నీ కటాక్షమున నబ్ధుల్ నాకుఁ గామేశ్వరీ!

యెంత వినయం కోసం వ్రాసినా ఆయీ పద్యాలలో కొంత గర్వస్ఫూర్తి లేకపోలేదు. కొందఱు సకలశ్రమలూపడి యేవో గొప్పకు కావలసిన ప్రయత్నాలుచేసి వాట్లను అనుభవించే సభలో వినేవాళ్లు లోలోపల నవ్వుకుంటారనేనా ఆలోచించక, "నేను వట్టిచవటను, అభాగ్యుఁడను యేమో? యేమో? యేమో" అంటూ వినయాన్ని

ప్రకటించుకోవడానికి మొదలెడతారు. అట్టితోవ నాకు నచ్చదు. నేను ప్రకటించే వినయపుపద్ధతి చూపించనే చూపించాను. కాళిదాసాదులుకూడా ఆత్మనుగురించి అంత అవివేకంగా తిట్టుకొని వినయాన్ని ప్రకటించలేదు. "మందః కవియశఃప్రార్థీ" అన్న శ్లోక మెఱుఁగని అక్షరాస్యులెవరు? నిజంగా అంతచవటయు "అంత అభాగ్యుఁడు" న్నూ తానయివుంటే, అట్టివాఁడు యెంత ప్రయత్నించినా ఆ వ్యక్తిని సమ్మానించడమే తటస్థింపదుగదా? కాబట్టి స్వవచోవ్యాఘాతపు మాటలతో వినయాన్ని ప్రకటించుకోవడంలో విశేషించి కాని కొంచెంగాని ప్రయోజనం వున్నట్టు నాకు తోఁచదు. తాను వ్రాసే వ్రాఁతకున్నూ తన జీవితానికిన్నీ కొంత కాకపోతే కొంతేనా సంబంధం వుండడం అవసరమని నే ననుకుంటాను. అతివినయాన్ని మనపెద్దలు సుతరామున్నూ అంగీకరించలేదు. అంగీకరిస్తే – "అతివినయం ధూర్తలక్షణం" అని యెందుకు నిర్వచిస్తారు?

★ ★ ★

# నీలాపనిందలు

ఈ శబ్దం సాధువైనా కాకపోయినా నిర్హేతుకంగా ఆపాదించే అపవాదలను యీ శబ్దంతోనే పండితులూ, పామరులూ వాడతారు. దీన్ని దిద్దేయెడల నిరపనిందలు అని దిద్దవలసివస్తుంది. యెన్నో శబ్దాలు యీలా మాఱిపోయిన వున్నాయి. యీ శబ్దం యెంతో అపభ్రంశంగా మాఱికూడా సంస్కృతశబ్దమేమో? అనే భ్రమను కలిగిస్తూవుంది. నీలా + అపనింద = నీలాపనింద అన్న వ్యుత్పత్తి చెప్పి వొకప్పుడు వొక పద్యంకూడా చాలా కాలం క్రిందట చెప్పబడింది --

"నీలాపనింద యనఁగా, భూలోకమునం దబద్ధపుం బలుకగు నీ,
నీలాపనింద ప్రకృతము, నీలవలనఁ గలుగుకతన నిజమై తోఁచెన్"

ప్రస్తుతం మనక్కావలసింది నిర్హేతుకాపవాదలకు లోకంలో యీ పదం పర్యాయ పదంగా అందఱూ వాడుకుంటూ వున్నారన్నది. యీ అపవాదలువేసే జనులు కొందఱు ప్రతీకాలంలోనూ వుంటారన్నందుకు త్రేతాయుగంనాటి వొక చాకలాయన మనకు వుద్బోధకుడుగా కనబడతాడు. కాని సవిమర్శంగా ఆలోచిస్తే ఆ రజకుడు సీతాపాతివ్రత్యం దురుద్దేశంతో అపవదించినట్టు కనపడదు. యేమంటారా? రాములవారియందుగాని, సీతామహాదేవియందుగాని వాడికియేవిధమైన దురుద్దేశమున్నూ వుందని ఎవ్వరూ యింతవఱకు చెప్పగా యెవరేనా విన్నారా? లేదు, నిజానికి వాడు. "తెల్లని వెల్లా పాలూ, నల్లని వెల్లా నీళ్లు" అనుకొనే వాళ్లల్లోవాడు, పెళ్లామేమో తన యిల్లు విడిచి అన్యత్ర వుండడమే దోషంగా వానిక్కనబడ్డది, ఆ పట్టాన్ని "వెఱ్ఱి రాముణ్ణి కాను. యేలుకోవడానికి నేను" అంటూ ఉపమానవిధయా ప్రసంగించాడు, రాములవారి నౌకరు విన్నాడు. మనవి చేయడం తప్పక మనవి చేశాడు, దానితో కొంపమీదకే వచ్చింది. ప్రస్తుతం మనకది యావత్తూ విచారించ వలసిన అగత్యంలేదు. లోకంలో వుండే అపవాదకులు అపవదింపబడేవారిమీద యేదో వైరం వుంటే దాన్ని పురస్కరించుకొని యేవో అపవాదలు వేసి కసితీర్చుకుంటూ వుండడం వుందిగాని ప్రస్తుతపు రజకుడియందు అట్టిదోషం లేశమూ లేకపోవడం చేత యితణ్ణి యీ అపవాదకాపశదకోటిలో చేర్చవలసి వుండదని తోస్తుంది. సుమారు ముప్పైయేళ్లనాడు కాకినాడలో వెలువడే సరస్వతీ పత్రికలో – "అపవాదతరంగిణి"

అనే శీర్షికతో ఒక గద్యపుస్తకం వెలువడింది. కాని, అందులో వున్న విషయం ప్రస్తుతవిషయాన్ని బోధించేదిగా వున్నట్టులేదు దాని కాపేరు యెందుకు పెట్టవలసివచ్చిందో? అని ఆరోజుల్లో నాలో నేను అనుకున్నట్లుకూడా జ్ఞాపకం వుంది. నైజాం సంస్థానాలు చూచే రోజుల్లో వొక విద్వత్కవి మేం వెళ్లినప్పుడే అక్కడికి వచ్చాడు. యేదో సంస్థాన పండితులు పరీక్ష చేసేటప్పుడు మాతో ఆయనకూడా కూర్చున్నాడుగాని నాడు ఆయనకు దైవాత్తూ జ్వరం తగలడంచేత యేమీ వ్రాయలేదు. ఆయేడు ఆలా గడిచిపోయింది. మఱుచటివత్సరం అవధానసభ యేర్పాటుచేశారు. ఆయనకి ఆవేళ యేకాదశి. వుపవాసంతోటే ఆయన శతావధానాని కంటూ పృచ్ఛక ప్రశ్నలను వింటూ ప్రథమచరణం చెప్పడానికి మొదలు పెట్టారు. 25 మందికి 25 చరణాలు మొదటివి చెప్పిన అంతట్లో ఆయనకి యేం తోచిందో? మెడకు పైమీద కండువా చుట్టుబెట్టుకొని సభకు సాష్టాంగపడి- "అయ్యా! నాకు యీవేళ యేమీ స్ఫురించడంలేదు కనక క్షమించండి; మఱొవొకప్పుడు సభ చేస్తే అప్పుడు చేస్తాను అవధానం" అని చెప్పేటప్పటికి రాజుగారున్నూ, సభ్యులున్నూ, ఏకాదశీ ఉపవాసం దీనికి కొంత కారణమై వుంటుందని అనుకున్నారు గాని అంతకంటే యేమీ అనుకున్నట్లే లేదు. వెళ్లిపోయింది. యిది జరిగిన సంవత్సరం మన్మథ.

మఱి యేడెనిమిదేళ్లకు అనగా శోభకృత్సంవత్సరంలో నేను యేలూరులో సోమంచి భీమశంకరంగారికి, అతిథిగా వున్నప్పుడు ఆ నైజాం దేశీయులు యిద్దఱు బ్రాహ్మణులు నేత్రావధానంచేశేవారు వేద విద్వాంసులు సంచారార్థం వచ్చారు. సంపన్న గృహస్థులను చూచారు. వారికి కన్యకాపరమేశ్వరి ఆలయంలోనే అనుకుంటాను సభ యేర్పాటయింది. సభాదినంనాడు వారు నా బసలోకి నన్ను చూచే నిమిత్తం వచ్చి యేదో పిచ్చాపాటీ మాట్లాడుకోవడం జరిగిన తరువాత లోగడ గద్వాలలో సభకు సంబంధించిన వృత్తాంతాన్ని యెత్తుకొని "నాడు తమ అనుగ్రహాన్ని ఆయన కోరకపోవడంచేత ఆలా జరిగింది. అందుకోసమని తమదర్శనానికి వచ్చి ఆజ్ఞపొంది వెడదామని వచ్చా" మని మెల్లిగా చెప్పడానికి మొదలు పెట్టేటప్పటికి నిర్ఘాంతపడ్డాను. అప్పటిదాకా నాటి "ఏకాదశీ ఉపవాసపు సభావృత్తాంతం" యిలా పరిణమించిందని సుతరామూ నే నెఱుగను. మనదేశంకంటే ఆదేశం యీలాటి విశ్వాసం విషయంలో చాలా అగ్రగణ్యంగా వుంటుంది. అనేక గాథలు పూర్వపండితుల వాదోపవాదాలకు సంబంధించినవి యీలాంటివి విద్వత్పరంపర చెప్పుకొనేవిలేకపోలేదు. పోనీ, ఆయనకిన్నీ మాకూనున్నూ యేమేనా వాదోపవాదాలేనా జరిగాయేమో? అంటే అదిన్నీ లేదు. యిల్లా వున్న సంబంధం ఉభయులమూ కవులమవడం తప్పయితరంలేదు. యెవరు కల్పించారో మహాప్రబుద్ధులు ఆయన నాడు అవధానం చేయడానికి ఆరంభించి మధ్యలో విరమించడానికి మమ్మల్ని కారణంగా నిరూపించారు.

అలా నిరూపించినట్లు యీ వేదవిద్వాంసుల అమాయిక ప్రసంగం సాక్ష్యమిచ్చింది. దీన్ని యథార్థాన్ని చెప్పి పోగొట్టుకుందామంటే శక్యమౌతుందా? ప్రయత్నించినకొద్దీ మఱింత బలపడుతుంది. అయితే యిదికల్పించినవారికి మాయందేమేనా ద్వేషంవుండివుండునా? ద్వేషంలేదు సరిగదా, పైగా అంతో యింతో, అనుగ్రహమే వుండివుంటుంది. అందుచేత యీ "నీలాపనింద" అనుగ్రాహకులద్వారాగానే కల్పితమయిందనుకోవాలి. యిది జరిగిన మఱుచటి సంవత్సరమే ఆత్మకూరు సంస్థానంలో పండితులకూ మాకూ కొంత విద్యావివాదం జరిగింది. అందులో వుండగా ఆ సంస్థాన పండితులలో ప్రధాన పండితుడికి "గ్రహణి" వ్యాధి ప్రారంభించి చాలా చిక్కు పెట్టింది. అప్పుడు వారు దాన్ని "చేతబడి"గా భావించి దానికి ప్రతిక్రియలు చేయడానికి పెద్ద అట్టహాసం చేయడం రాజుగారికి తెలిసి "తగిన వైద్యం చేయించుకోండి, "చేతబళ్లు" వుంటే వుండనివ్వండిగాని ప్రస్తుతం ఆలాటి అనుమానంతో లేశమున్నూ అవసరంలేదు." అంటూ నివారించాడు. ఆ పండితులు ఆ దోషం మామీద ఆపాదించాలని బుద్ధిపూర్వకంగా పన్నిన పన్నుగడే కాని నిజంగా ఆ గ్రహణివ్యాధి మేము వారికి "చేతబడి" ద్వారాగా పంపిందని వారు విశ్వసించి వుండరని మే మనుకున్నాం. యిప్పుడంతగా లేదుగాని పూర్వకాలంలో కాస్త కుంకుమబొట్టు పెట్టేవాళ్లకల్లా యీ అపవాద వుండేది. నిన్న మొన్నటిదాకా జీవించి వున్న "పాలంకి రమణయ్య" గారికే కాక యిప్పుడింకా సజీవురాలై వున్న ఆయన భార్యకుకూడా యీ "చేతబడి" విద్యలో చాలా ప్రవేశమని దానికి సంబంధించిన చాలా గాథలు చెప్పుకోవడం వుంది. విస్తరభీతిచేత ఆగాథలు వుదాహరించలేదు.

పండితులకూ కవులకూ యీ అపనింద అంతగా లేదుగాని పగటి వేషాలవారికీ, భాగోతులకూ విశేషించి వుంది. యేదో గింజలు నోటిలో వేసుకొని సభలో యేమీ యెఱుగనివాడిలాగ కూర్చుని ఆ గింజలు పటుక్కున కొఱికేటప్పటికల్లా మద్దిలి పగిలిపోయిందనిన్నీ, భాంవేషగత్తె విరుచుకు పడిపోయిందనిన్నీ తరవాత యీ సంగతి కనిపెట్టి ఆ భాగోతుల్లోనే మఱొకడు (యీ చేతబడి విద్యలో ప్రవేశం కలవాడు) యేదో విభూతి మంత్రించి హ్రాం హ్రీం హ్రూం అని ఆ చేతబడి తిప్పిన తరవాత భాగోతం సక్రమంగా నెఱవేఱిందట! గాని తెల్లవాఱిన తరవాత భాగోతం చూడడానికి వచ్చిన జనమంతా యెవళ్ళిళ్లకువాళ్లు వెళ్లడం జరిగాక మొట్టమొదట చేతబడి చేసిన పురుషుడు అక్కడే కదలక మెదలక ఆగిపోవలసి వచ్చిందనిన్నీ, దానిక్కారణం భాగోతులు తమమీద కొట్టిన దెబ్బను (చేత బడినన్న మాట) తప్పించుకొని మళ్లా కొట్టడ మనిన్నీ వినడం. నాబాల్యం నాటికి బాగా యిలాటివి చెప్పుకోవడం వుండేది. అంతకాకపోయినా యిప్పుడు కూడా యీలాటి సందర్భాలు వింటూనే వున్నాము.

"సర్వా వెంకటశేషయ్య యమ్. యే." యితనికి యిట్టి ప్రయోగబాధ తటస్థించడమూ, యింకా నివర్తించకపోవడమూ గత సంవత్సరమే బందరులో విన్నాను. మంత్రశాస్త్రాన్ని విశ్వసించేవారికి యివి విశ్వసనీయాలే. భారత యుద్ధాలు, రామాయణం యివన్నీ మంత్రశాస్త్ర విశ్వాసంతో సంబంధించివుంటాయి. నిన్న మొన్నటిదాకా పూర్వపు యుద్ధాలలో వుండే ఆశ్చర్యాలనుగూర్చి మనం చాలావఱకు కవుల కల్పనకింద తోసేయడం జరిగేవి యిటీవల యూరపుఖండ యుద్ధాలలో ప్రత్యక్షంగా జరుగుతూవున్న ఆశ్చర్యాలు కాదనడానికి వల్లకాక పోవడంచేత పూర్వపు వాట్లకుకూడా కొంత యోగ్యత కలిగింది. యిప్పటిదానికిన్నీ, అప్పటిదానికిన్నీ వున్న భేదం యెంతోలేదు. అదంతా మంత్రబలమని వాళ్లు వ్రాశారు; కాదు "యంత్రబలమే" అని యిప్పటివాళ్లు ఋజువు చేస్తూన్నారు. యంత్ర బలం గొప్పదా? మంత్రబలం గొప్పదా? అని మనం విచారిస్తే మంత్రబలమే యెక్కువదిగా తేలుతుంది. మంత్రబలంచేత సాధించిన కార్యాన్ని మనం యంత్రబలంచేత సాధించగలిగినా, దానికున్నంత అమోఘత్వం దీనికి వుండదు. ప్రస్తుతం యీ విషయం విచార్యం కాదు.

యిప్పుడుకూడా "చేతబళ్లు" వున్నట్లు కొన్ని ప్రమాణాలు కనబడుతూనే వున్నాయని వ్రాసే వున్నాను. యివి తుచ్ఛదేవతోపాసనలవల్ల సాధించేవనిన్నీ, మహామంత్రోపాసకులు పరమార్థదృష్టితో వుపాసన చేస్తారే కాని యిట్టి తుచ్ఛఫలాన్ని అపేక్షించి తపస్సు వ్యర్థపఱచరనిన్నీ అందఱూ చెప్పుకొనే విషయమే. కీ. శే. నడివింటి మంగళేశ్వరశాస్త్రుల్లు గారికి సంబంధించిన చరిత్రలో యీ మంత్రశాస్త్ర విషయం చాలా ప్రధానంగా వుంటుంది. యేదో సంస్థానంలో రాజుగారు వీరిని "అయ్యా! మీరు "శివోఽహం, శివోఽహం" అంటూ వుంటారు కదా? పార్వతీదేవి మీకు భార్యే అవుతుందా?" అంటూ ప్రశ్నించేటప్పటికి శాస్త్రుల్లుగారు అప్పటికి వూరుకొని, రాజుగారి తల్లికి ఆబ్దికము నాడు వెళ్లి కూర్చుని, (తమకు అక్కడికి వెళ్లవలసిన ప్రసక్తితో సంబంధంలేక పోయినా) శాస్త్రులుగారు రాజుగారు చేసిన శంకవంటివే కొన్ని నిర్భాగమాటంగా, నిర్భయంగా చేసేటప్పటికి, ఆ శంకలు శుద్ధాంతానిక్కూడా అవమానకరమైనవిగా వుండడంచేత శౌర్యం పట్టజాలక "చూస్తారేం పట్టుకోండి" అని నౌకర్లను హెచ్చరించేటప్పటికి నౌకర్లు శాస్త్రుల్లుగారిని పట్టుకోవడానికి దగ్గిఱకు రాబోయేటప్పటికి ఆయనవద్ద సిద్ధంగానే వున్నవిభూతిని వాళ్లమీదకి వూదేటప్పటికి వాళ్లు "కుయ్యో, మొఱ్ఱో" అని పాటిపోవలసి వచ్చిందనిన్నీ తరవాత రాజుగారుకూడా స్వయంగా ప్రయత్నించి చూచారుగాని కృతార్థులు కాలేక లజ్జింపవలసి వచ్చిందనిన్నీ చెప్పుకుంటారు. ఆ యీ గాథలు యించుమించు 60 లేక 70 యేండ్లనాటివికాని, యుగాంతరాలనాటివి కావు. నిన్నమొన్న వొకానొక శాస్త్రుల్లుగారిని (వీరు పల్నాటి తాలూకా వారు) గూర్చిన మంత్రశాస్త్ర ప్రసక్తి అత్యాశ్చర్యకరమైనది చదివాను త్రిలింగపత్రికలో.

ఆయా నడివింటి శాస్త్రుల్లుగారికి సంబంధించిన మంత్రశాస్త్ర పాండిత్యం లోగడ మా ప్రధాన గురువువల్ల వినివుండడంచేత నాకు విశ్వాసంగానే కనపడింది. ఆయీ నడివింటివారి చరిత్రకు సంబంధించిన గాథలు చాలా వున్నాయి. మఱొకప్పుడు ముచ్చటించుకుందాం. సంస్కృతంలో అత్యాశుధారతో వీరు రచించిన శ్లోకాలు చాలా వున్నాయి. బొబ్బిలిలో వీరికి నాల్గోతరంవారో, అయిదో తరంవారో యిప్పుడు వున్నారు. అమలాపురం తాలూకా ముమ్మిడివరం ప్రాంతంలోనూ కొందఱు వున్నారు. సంస్కృతభాషాభ్యాసానికి మొట్టమొదట ప్రారంభించి చదివే శబ్దమంజరి వీరు రచించిందే. దానిలో "శ్రీమధ్య మందిరకుల" అన్నమాటకు సరియైన నడివింటి (నడివింటి - నడిమి + యిల్లు నడిమిల్లు) పదం కొంత సంప్రదాయజ్ఞులకుగాని బోధపడదు. నేను మా గ్రామాన్నిగుఱ్చి "కంకణ గ్రామంబు కాపురంబు" అని వాడివున్నాను. మా ముత్తాతగారు "వలయపురం" అంటూ వాడివున్నారు. యిది అనాదిగాకవుల ఆచారం. యీ శాస్త్రుల్లు గారి అల్లుడు రెడ్డి శాస్త్రుల్లుగారు ప్రాచీనకాలపు ప్లీడరు. కొంత సంస్కృతసాహిత్యం వున్నవారు. ఆయనకు సిద్ధాంతకౌముది చదవాలనే కుతూహలం వుండి మామగారిని కోరేటప్పటికి ఆయన మనఃపూర్తిగా ఆశీర్వదించినట్లున్నూ, ఆపట్లాన్ని కౌముది పేలపిండిగా రెడ్డిశాస్త్రుల్లుగారికి అన్వయమై నట్లున్నూ బహుమంది చెప్పగా వినడం. యివి అసత్యమనడానికీ వల్లకాదు. నిజమనడానికిన్నీ వల్లకాదు, కొన్ని యిప్పుడుకూడా వున్నాయి. కాని వాట్లని వ్రాస్తే కొందఱు సహృదయులు విశ్వసిస్తారు. గాని కొందఱో గేలిచేస్తారు కాబట్టి దీన్ని ఆపి ప్రస్తుతం అందుకుంటాను.

వీట్లల్లో కొన్ని గౌరవాపాదకాలుగానున్నూ, కొన్ని లాఘవాపాదకాలుగానున్నూ, కొన్ని ఉభయాపాదకాలుగానున్నూ వుంటాయి. శ్రీ శంకరాచార్యులవారు మద్యం పుచ్చుకోవడానికి సంబంధించిన కథ ఒకటి వుంది. చాలామంది చెప్పుకుంటూ వుంటారు. శిష్యులుకూడా వారిని అనుసరించి - "మనోజనో యేన గత స్సపంథాః" కనక మద్యపానం మొదలుపెట్టే టప్పటికి ఆచార్యులవారు దాన్ని వారించడానికి వొక కంచరి దుకాణంలో కరుగుతూవున్న సీసాన్ని కొంత మంచినీళ్లప్రాయంగా గడగడ తాగి మిగిలినదాన్ని శిష్యులకి యియ్యబోయేటప్పటికి యే శిష్యుడున్నూ దాన్ని గ్రహించక పాఱిపోయారనిన్నీ, తద్వారాగా ఆ శిష్యులకు బుద్ధివచ్చి మద్యపానాన్ని మానడం తటస్థించిదనిన్నీ చెప్పుకుంటారు. యిది నిజమైనదే అయితే నీలాపనిందలలో చేరదు. కానిపక్షంలో - అనగా కల్పితమే అయితే శంకరాచార్యుల వారియందు "కర్తు మకర్తు మన్యథా కర్తుం సమర్థత్వాన్ని" - ఆపాదించే వుద్దేశమే కాని యీ కథలో దురుద్దేశం లేశమున్నూ లేదు. బాగా ఆలోచిస్తే యీ కల్పనలు చేసేవారిలో సదుద్దేశపరులున్నూ వుంటారు; దురుద్దేశపరులున్నూ వుంటారు. వారివారి

వుద్దేశానుసారంగా వారి వారి కథాకల్పనలు వుంటూవుంటాయి. యేదో మహత్తు వుండడానికి అవకాశం వున్నవాళ్ల విషయంలో యీలాటి యితిహాసాలు పరంపరగా వస్తూ వుండడంచేతనే అనుకుంటాను, యిటీవల సామాన్యవ్యక్తులను గుఱించి కూడా యీలాటివి కల్పన చేస్తారు. యివి పామరముఖతః రావడమూ వుంది. పండితముఖతః రావడమూఉంది. మొదటిదానికంటె రెండోదాని యందుప్రామాణ్యం యెక్కువ వుంటుందని చెప్పనక్కఱలేదు. కాని వారు కూడా కొందఱు అతిశయోక్తి కల్పనలు చేస్తూనే వుంటారని నాఅనుభవంలో వున్నది వొకటి చూపుతాను.

నేను కావ్యాలను చదువుకొనే రోజుల్లోది యీ కథ; కాని నాకు షష్టిపూర్తి దాటిన తరవాత బయలుపడింది. లంక బ్రహ్మ సోమయాజులు అనే వక శిష్యునివల్ల విన్నాను. దాని స్వరూపం యిది; నే నేమో, గురువుగారివద్ద పాఠం కంగాబంగా చదవడమేగాని ఆ పాఠాన్ని వల్లించడమంటూ వుండేదికాదనిన్నీ, దాన్ని కనిపెట్టి వకనాడు ఆ గురువుగారు కూకలేసేటప్పటికి– "అయ్యా! నే చదువుకొనే పుస్తకంలో నన్నెక్కడ అడుగుతారో, అడగండి" అన్నాననిన్నీ, వారు అడిగారనిన్నీ, వందలకొలది శ్లోకాలు సవ్యాఖ్యానంగా వప్పజెప్పాననిన్నీ వొక గురువుగారు చెప్పినట్లు ఆ సోమయాజులు నాతో అనగా విని, యిది కేవలమూ ఆ గురువుగారికి నాయందు వుండే అనుగ్రహాతిశయంగా భావించి– "నాయనా, ఇది నిజంకాదు, నా పాఠమందు నేనెన్నడూ అశ్రద్ధగా వుండటమంటూ లేదు. విశేషించి వల్లన లేకుండానే నాకు శ్లోక వ్యాఖ్యానాలు స్వాధీనం కావడం మాత్రం నిజం. పై కథ దాన్ని అనుసరించి పుడితే పుట్టిందేమో? కాని నిజంమాత్రంకాదు" అని అతనితో చెప్పి వున్నాను. అతడు విశ్వసించాడో, లేదో? యెన్నో చోట్ల వున్న యథార్థాన్ని నేను ప్రకటిస్తూనే వున్నప్పటికీ మామూలు కథలు కథలుగానే నడుస్తూన్నాయి.

"అమంత్రోపాసకౌ సంతా వపి కాళీ దయాకరౌ!
తిర్పతి ర్వేంకటేశశ్చ పరస్పరహితౌచ యౌ"

అని కాళీ సహస్రంలో కంఠోక్తిగా, మాకు క్రమమైన ఉపాసన లేదని చెప్పబడి వున్నా, మంత్రోపదేశంకోసం మమ్మల్ని మోమోట పెట్టేవారెందఱో వుండడం అనుభూతం. వొకాయన కౌముదిదాకా చదువుకొని నా దగ్గిరికి విద్యాభ్యాసవ్యాజంతో (అసలు వుద్దేశం అదికాదు) వచ్చి అహోబలపండితీయం మొదలెట్టి చదువుతూ, నాలుగైదురోజులయిన తరవాత అసలు కోరికను బయలుపఱిచాడు. నాకు అలాటి శక్తియుక్తులు లేవంటే; ఉపదేశించడానికి అంగీకారం లేక ఆలా చెప్పినట్టు భావిస్తాడుగాని విశ్వసిస్తాడా? అందుచేత యథార్థం చెప్పినా ప్రయోజనంలేదు. కనక సరే దీన్ని చదువుతూ వుండు, మంచిరోజు

చూచి దానిసంగతి ఆలోచిద్దామని గంభీరంగా చెప్పి, మొదలెట్టిన పాఠాన్నే కొన్నాళ్లు సాగించి మతికొంత చనువు చిక్కిన తరవాత వున్న యథార్థాన్ని తెలిపాను. విశ్వసించాడో, లేదో? చెప్పలేను. అతడు మంచి కవి; ఆశుకవికూడాను. పండిత కవి. పేరు వ్రాస్తే అతడి కేం కోపంవస్తుందో అని దీనిలో వుదాహరించలేదు. మంత్రోపదేశానికి మిష కల్పించుకు వచ్చినవాడేకాని అతడు శిష్యకోటిలోవాడుకాడు. యీ మంత్రోపాసనా ప్రవాద యింతతో ఆగితే కొంత నయమే; ఆగలేదు. యిది "పీఠ్వా" దాకా దేకింది. అదిన్నీ నా చెవిని బడింది. యేమిటి చేసేది? "కథక్కాళ్లంటూ వుంటాయా?" అనుకొని వూరుకోవలసిందే. జీవితానంతరం యీలాటి కథాకల్పనలు బయలుదేఱడం కొంత సహజమే. జీవితకాలంలోనే బయలుదేఱితే కొంత యుక్తం. ఇవి ఆలాటివారి ద్వారా బయలుదేరినవిగా తోచవు. మొట్టమొదట వీటికి జన్మస్థానం ("ఏఱుల జన్మంబు" అన్నట్టు) యెక్కడో తెలుసుకోవడానికి వశంకాక యెవరో ప్రారంభిస్తారు. వారిద్వారా వీరూ, వీరిద్వారా వారూ దాన్ని వ్యాప్తిలోకి తెస్తారు. 'లోకము మూయను మూకుడున్నదే?'

తెనాలి రామలింగానికి పెద్దన్న, ముక్కుతిమ్మన్న, భట్టుమూర్తి యింకా కొందఱూ ఏక కాలీనులు కారని నేటివారు బాగా ఋజువు చేసినప్పటికీ వీరందఱితోటిన్నీ రామలింగానికి ముడిపెట్టి చెప్పుకొనే కథలు చెప్పుకుంటూనే వున్నారు. ఆలాగే పై నీలాపనిందలు సత్యేతరాలని యెంత గాఢంగా ఋజువుచేసినా చెప్పుకొనేవారు చెప్పుకుంటూనే వుంటారు. యీలాటి సందర్భాలనుగూర్చి కొందఱు విమర్శకులు కొంత కృషిచేసి తత్త్వ నిర్ణయానికి పాటుపడడం ఆవశ్యకమే కాని ఆ విమర్శకులు అంతతో ఆగక నల్వురూ శిరసావహించే భారత భాగవత రామాయణాల మీదికి కూడా తమ బుద్ధి చాకచక్యాన్ని ప్రసరింపజేసి ఆయా పుణ్యగాథలయందు లోకానికి అవిశ్వాసాన్ని కలిగించడం శోచ్యంగా వుంది. వేదంలో వుండే యితిహాసాలు గాని, పురాణాల్లో వుండే యితిహాసాలు గాని సమస్తమూ అర్థవాదలుగా (లేని కథలు కల్పించి సత్యం వగైరాలను దృఢపఱచడం పేరు అర్థవాదమంటారు మీమాంసకులు) నిర్ణయించే వున్నారుగాని, వాట్లవల్ల యిట్టి చిక్కురాదు. అది "గజంమిథ్య; పలాయనం మిథ్య" వంటిది కనక యెవరికోగాని అవగాహన చేసుకోతగ్గదిగా వుండదని తాత్పర్యం. ప్రతి ప్రసిద్ధవ్యక్తినిగూర్చిన్నీ యేదో నిందా కల్పన వున్నట్టే కనపడుతుంది. సంస్కృత గ్రంథంలో లేని నింద తెలుగు అనువాదంలో కనపడడం వుంది. ద్రౌపదీ స్వయంవరసమయంలో ఆ ధనుస్సు కర్ణుడు ఎక్కుపెట్టి మత్స్యయంత్రాన్ని కొట్టడానికి సిద్ధపడుతూవుండగా, పాండవులు మత్స్యయంత్రం తెగిపడ్డట్టే తలుస్తూవుండగా (మేనిరే పాండునందనాః) ద్రౌపది "నాऽహం వరయామిసూతమ్" అని నిరాకరించడంవల్ల కర్ణుడు రసాభాసశృంగారమందు యిష్టంలేని

ఉత్తమనాయకుడు కనక (ఏకత్రైవానురాగశ్చే ద్రసాభాసః) ఆ వుద్యమాన్నుంచి విరమించినట్లు సంస్కృతంలో వుంటే, తెలుగులో నన్నయ్యగారు అసలు ఆ ధనుస్సు యెక్కుపెట్టడమే తిలగింజంతగాబోలును తరవాయి వున్నట్టు వ్రాశారు. యిక్కడ నన్నయ్యగారికి కర్ణునియందు ద్వేషం వుందని యెవ్వరూ చెప్పరు. పోనీ కృతినాయకుడు రాజరాజనరేంద్రుణ్ణి సంతోషపెట్టే వుద్దేశంతో (రాజరాజ నరేంద్రుడు పాండవ వంశస్థుడనుకొనే పద్ధతిని) ఆలాటిమార్పు చేశాడేమో? - అనుకుంటే భారతకాలంలో వారికి యెవరికో తప్ప కర్ణజన్మ రహస్యం తెలియదుగాని రాజరాజ నరేంద్రుని నాటికి ధర్మరాజాదు లేలాటి పాండవులో కర్ణుడూ ఆలాటి పాండవుడే అనే సిద్ధాంతం సర్వవిదితమేకదా? అందుచేత ఆయా వూహలు పొసగవు. కర్ణుడుకూడా అభిమానపాత్రుడే అవుతాడు. ఆ శ్లోకాలు నన్నయ్యకు బాగా సమన్వయించలేదు. మనకే సమన్వయించాయి అనుకోవడం బొత్తిగా రుచించనిమాట. భారతప్రతులు నానాదేశాలలో నానారీతిగా ఉపలబ్ధం అవడాన్నిగూర్చి లోకంలో వివాదం లేదుకాబట్టి, నన్నయ్యగారికి లభించిన భారతంలో ఆలాగే (తిలమాత్రం యెక్కుపెట్టడం తరవాయి) వుందనుకోవడమే యుక్తిసహం. అయితే భారతాలు నానావిధంగా యెందుకు వుపలబ్ధం కావలసివచ్చింది? అనే ప్రశ్న ఒకటి యిక్కడ ప్రస్తుతమవుతూవుంది. యిది పెద్ద ప్రశ్న. దీన్ని గుఱించి పలువురు వ్రాసేవున్నారు. నేను వ్రాయవలసి వుండదు. భారతం బహు కర్తృకమనే ప్రవాదాన్ని వొప్పుకొనేవారికి యీ శంక క్షణంలో నివర్తిస్తుంది. యెవరు వ్రాసినా వారు ఆకాలీనులే అయినా యావత్తు సంగతినీ ప్రత్యక్షంగా చూచి వ్రాయడం అనుభవవిరుద్ధంకదా? కొంత ప్రత్యక్షంగా చూచి వ్రాసినా కొంతేనావిని వ్రాసినభాగం వుండితీరాలి. మత్స్యయంత్రం తెగ్గొట్టినపిమ్మట చాలాసేపటికే వచ్చారో వ్యాసులవారక్కడకి, యింకా మఱునాడే వచ్చారో? ద్రౌపదిని అయిదుగురికి పెళ్లి చేయడం యేలాగ? అనే ధర్మసందేహం తీర్చేటందుకు కదా- వ్యాసులవారు అక్కడికి వచ్చింది. అందుచేత వారు యేలా విన్నారో? ఆలా వ్రాసివుందురు. ప్రత్యక్షంలో చూచినవారెవరేనా అక్కడవుంటే ఆ భాగంలో వ్యాసులవారు వ్రాసినదానికి భిన్నంగా ప్రచారంచేశారేమో? ఆయా విషయం తేలేదికాదు. నా అనుభవాన్ని బట్టి కథకు సంబంధించిన వ్యక్తుల జీవిత కాలంలోనే కథలు తాఱుమాఱవుతూవుండగా కొంతకాలం పాతబడిన తరవాత తాఱుమాఱవడంలో అభ్యంతరం వుండదనియ్యేవే. నేటి పాశ్చాత్యయుద్ధవార్తలు మనకు సరిగా తెలుస్తూన్నాయా? అప్పుడిన్ని సాధనాలు కూడా లేవాయె తత్తథాస్తాం.

మా – “గీరతం” పుట్టి యిప్పటికి సుమారు ముప్పైయ్యేళ్లు కావచ్చింది. గుంటూరుసీమ పుట్టి కూడా యించుమించు అంతే. యిప్పటిదాకా (కొందఱు లోపించినా) ఆ గ్రంథద్వయానికి సంబంధించిన పాత్రలు చాలా వఱకు సజీవులే. యిట్టి స్థితిలో

అందులో సంగతులు (కొన్నే అనుకుందాం) సర్వాబద్ధం అని కొందఱు వ్రాయ సాహసించినవారు లేరా? అలాగే ఆ రోజులలోనున్నూ కొన్ని విషయములనుగూర్చి అపవదించేవారుకొందఱు వుంటే వుండవచ్చుననిన్నీ, క్రమంగా వారి అపవాదులు విని నమ్మిన ఆకాలానికి కొంచెం యిటీవలి కవులు గ్రంథంలో చేర్చి వుందురనిన్నీ నాకు తోస్తుంది. నా అనుభవాన్నిబట్టి నేను యిది "లక్కగేదె సామెతగా" వ్రాసే వ్రాత. ప్రత్యక్షంగా జరగడమే కాకుండా వాది ప్రతివాదులిరుపక్షాలుకూడా సుమారు ముప్పైయేళ్లు వూరుకొన్న దాని విషయంలోనే సాహసించి, అందులో ఒకదానిలోని ప్రధానాంశాన్ని గూర్చి- "నేను చెళ్లపిళ్లవారియొద్ద ఒక్క యక్షరమైనను చదువుకో లేదనియు" ఇంకా యేమో ఎక్స్ట్రాలు అనియు వ్రాసినట్లు వ్రాసేవారు కనపడ్డ నాకు పైవిషయాలలో అట్టి సందేహం కలగడానికి అభ్యంతరం వుంటుందా? అసలు వ్యక్తి "చదువుకోలేదు" అని వ్రాసెనో? మఱేవిధంగా వ్రాసెనో? పరిశీలించేవారు లోకంలో నూటికి యెంతమంది వుంటారో? విజ్ఞులు విచారించాలి. విమర్శించకుండా యీ వ్రాతనేనమ్మి ప్రచారం చేయడంవల్ల కొందఱు అలా చెప్పుకొనేవారున్నూ, కొందఱు యీలా చెప్పుకొనేవారున్నూ వున్నట్టు భవిష్యత్కాలం వారికి తెలియబడుతుంది. దానితో రెండుమతాలు వున్నట్టవుతుంది. దానితో అది నిజమా? ఇది నిజమా? అనే సంకటం యేర్పడుతుంది.

భవతు. యివన్నీ "నీలాపనిందలు" కావు. ప్రసక్తానుప్రసక్తంగా వాట్లకి కాస్త దగ్గిఱచుట్టఱికం కలవికూడా యిందులోవచ్చి చేరినట్లయింది.

బాగా విచారిస్తే పురాణగాథలన్నీ యీలాటి సంకటానికి లోబడినట్టే కనపడుతుంది. వాల్మీకి రామాయణంలో రావణకుంభకర్ణులిద్దఱినీ రాముడే వధించినట్లు కనపడుతుంది. భారతంలో కుంభకర్ణుణ్ణి లక్ష్మణ స్వామి వధించినట్లు వుంది. యీ భేదాలకూ ఆదీ అంతమూ వున్నట్టేలేదు. యేమైనా పూర్వ గాథలో కావడంచేత వీట్ల కీగతిపడితే పట్టిందనుకుందాం, మాగాథలు నిన్నా మొన్నా జరిగినవాయె, మామాచేతివ్రాతలతో నిండివున్నవాయె. ఎందఱో ప్రాజ్ఞులు యెఱిగివున్నవాయె. వీట్లను (యెప్పుడోకాదు ఉభయ పార్టీల జీవితకాలంలోనే) అన్యథాకరించి వ్రాయడానికి సాహసిస్తే యేం చేసేది? అలా అన్యథాకరించడంలో యెంతో నైపుణ్యం వుంటే బాగుండేది. అదిన్నీ కనపడదు; యీకర్మం యిప్పటి చరిత్రలను అపవదించేవారికే కాదు. పూర్వగాథలను అపవదించే వారికిన్నీ వున్నట్టు నా బుద్ధికి కనపడదు.

ఆనందరామాయణమంటూ వొకటి బయలుదేఱింది. అదిన్నీ వాల్మీకి కృతమనే కనపడుతుంది. గద్యమునుబట్టి చూస్తే దానిలో వున్నంత అనౌచిత్యమూ పరస్పర విరోధమూ,

యే గ్రంథములోనూ కనపడ్డట్టులేదు. యీ విరుద్ధ కల్పనలతో గ్రంథాన్ని లేవదీసినవారెవరో తెలుసుకుందామంటే ఆధారం కనపడదు. పేరు పెట్టుకోనేలేదు. మామా చరిత్రలలో గీరతానికి యీలాటిపీడ, ఆరోజులలో దాపరించినట్లు లేదుగాని, గుంటూరి సీమకు దాపరించింది. వాళ్లు "యథార్థవాది" - "సత్యవాది" యిత్యాది పేళ్లతో అసత్యాలు ప్రకటించడం వుండేది. ఆ "నీలాపనిందలు" మఱికొందఱు ప్రాజ్ఞుల వుత్తరాలద్వారా సమసిపోయేవి. ముప్పైయేళ్లు దాటిన తరవాత ఆయీ గాథలను బుద్ధిపూర్వకంగా అపవదించడానికి ఆరంభించారు కొందరు. వీరి "నీలాపనిందలు" చూస్తే ఆశ్చర్యంగా కనపడతాయి.

పూర్వం మనదేశంలో నీలిమందు తయారయ్యే రోజుల్లో ఆమందు గూనలుదిగడానికి యీలాటివార్తలుచేయడం వుండేదంటూ వినడం. ఆమందు తయారు కావడానికిన్నీ యీ అపవాదాలకీ వున్న కార్యకారణభావం యేలాటిదో? నాకు బాగా తెలియదు. ఆయీసందర్భాన్నిబట్టి యెవరేనా అబద్ధపు వార్తలు వ్యాపింప జేసినప్పుడు వాట్లతత్త్వం తెలిశాక వాట్లను "నీలివార్తలు" అనడంమాత్రం అందఱికి తెలుసును. యీ నీలి వార్తలే, నానాటికి "నీలాపనిందలు"గా వ్యాప్తిలోకి వచ్చాయి.

యిందులో నానా విధకల్పనలు వుంటాయి. కల్పనలు యేలాటివైనా పేరుమాత్రం వొకటే. వీట్లకి కాస్త నామరూపాలున్నవాళ్లే విశేషించి గుఱి అవుతూ వుంటారు. యెవళ్లు కల్పిస్తారు, ముఖ్యంగా అది యేనాల్గురోజులో లోకంలో కొంత వ్యాపించి కొందఱికి పరితాపాన్ని కలిగిస్తుంది. అంతట్లో మళ్లా యథార్థవార్త తెలిసి ఆపరితాపం వారికి తగ్గుతుంది. యెవరిమీద కల్పితమవుతుందో, ఆదుర్వార్త వారికి "పీడా పరిహారం", అయిందని చెప్పి సంతోషించడంకూడా జరుగుతుంది. అసలువాళ్లు యెవళ్లో చేసినపని తప్పుపనే అయినప్పటికీ దాన్ని మంచిపనిగానే జమకట్టి సరిపెట్టుకోవడం సర్వత్రా లోకంలో ఆచారంగా వుంది గాని యీ అపనిందను వేసినవ్యక్తి యెవడో వాడు "ఫలానా" అని తెలియడమంటూవస్తే లోకం ఆవ్యక్తిని సుఖసుఖాల క్షమించడమంటూ వుండదని వ్రాయనక్కరలేదు. వూరూ పేరూ తెలియకుండా బయలుదేఱే వాట్ల విషయమే బయటికివస్తే, సుఖసుఖాల క్షమింపరానిదిగా వుండేటప్పుడు వూరూ పేరూ కనబడేటట్టుగానే కొందఱు అపవాదాలు ప్రచురించడంచూస్తే, చాలా ఆశ్చర్యంగా కనపడుతుంది. యీ విషయంలో సజీవులకి సంబంధించినవి కొంత క్షంతవ్యాలే అనుకున్నా కీర్తిశేషులకు సంబంధించినవి బొత్తిగా క్షంతవ్యాలు కావు. ఆలాటివాట్లనుగూర్చి లోకం కలిగించుకోవడం ఆవశ్యకమయినా, కలిగించుకొన్నట్టు కనపడదు. అపవాదకుల వుద్దేశం కీర్తిశేషుడికి కళంకాన్ని ఆపాదించే

తాత్పర్యం కలది కాకపోయినా తుదకి కళంకాన్ని ఆపాదించేదిగా పరిణమించినప్పుడు "ఇది యుక్తమేనా? మీకు" అని నిర్మొగమాటంగా అడిగి యికముందేనా యిట్టి "నీలాపనిందలు" ప్రచారం చేసి లోకపరితాపానికి కారకులు కాకుండా వుండడానికి తగ్గ వుపాయం చేయకపోవడం లోకులతప్పుగా నాకు తోస్తూ వుంది. యిట్టి కుకల్పనల విషయంలో వారు పెద్దలనిగాని, కవులనిగాని ఆలోచించి వూరుకోవలసివుండదు. "శ్లో. యుక్తియుక్తం వచో గ్రాహ్యంబాలాదపి సుభాషితమ్, వచనం తత్తునగ్రాహ్య మయుక్తంతు బృహస్పతేః".

బాగా ఆలోచిస్తే లోకం ఆలాటివ్యక్తులని మందలించవలసి వుంటుందనడంకంటే యే కాలకర్మదోషంవల్లనో ఆలాటి కుకల్పన చేయడం తటస్థించినప్పటికీ, అడుగునబడివున్న తమ ప్రాజ్ఞతను బయటికి తెచ్చుకొని పశ్చాత్తాపపడి, ఆపశ్చాత్తాపాన్ని స్వయంగా లోకానికి తెల్పడంలోనే విశేషంవుంది. కాని బుద్ధిపూర్వకంగా చేయాలని చేసినపనికి ఆలాటి సుయోగం యేలా సంఘటిస్తుంది? యిట్టి అయుక్తకార్యాలుచేసే వ్యక్తులు వసించే దేశానికి చిక్కు కలుగుతూ వున్నట్టు యీమధ్య వొకానొక సందర్భంలో గోచరించింది. బంగాళాదేశంలో మహాత్ముణ్ణిగూర్చి చేసిన (చెప్పు విసరడం) అపచారానికి బాధ్యత ఆదేశంలోనేకాక భరతఖండంలో సర్వత్రా పేరుమోసి వున్న శ్రీబోసుమీదికి రావడం పత్రికా పాఠకులందఱూ యెఱిగిందే కనక విస్తరించవలసి వుండదు. చతుస్సముద్రాలు వుండగా దక్షిణ సముద్రానికే బంధనం తటస్థం కావడమనేది ఆ సమీపంలో రావణాసురుడు వుండడంవల్లనే అని వొక కవి చమత్కరించి వున్నాడు. సర్వథా దుస్సహవాసంవల్ల ప్రాణికోట్లకే కాదు, జడపదార్థాలకు కూడా కీడు మూడడం సర్వానుభవసిద్ధం కనుక యీ విషయం జాగ్రత్తగా గమనించవలసి వుంటుంది. యిప్పటికాలానికిన్నీ పూర్వకాలానికిన్నీ భేదం వుంటుందని విశ్వసిస్తే తప్పు, ఆకాలమూ యీ కాలంవంటిదే అయేయెడల, ఆనాటి చరిత్రలలో యే భాగం సత్యమో, యేభాగం సత్యేతరమో? నిర్ణయించడానికి మానవమాత్రుడు సమర్థుడుకాడు. జ్ఞానదృష్టి కలవారు అనగా అతీంద్రియజ్ఞానవిధులే? ఆయాగాథలయందు వుండే యథార్థ్యాన్ని నిర్ణయించతగ్గవారు. వ్యాసాదులు అట్టివారనే కారణంచేతనే భారతాదికం మనకు విశ్వాస్య మవుతూవుంది. లోకంలో "సత్యకాలం" అనే పదం వాడుకలోవుంది. కాని అది యెప్పుడు అమల్లో వుండేదో? సరిగా చెప్పలేము, క్రమంగా సత్యానికి దుర్దశ వచ్చివుంటుందిగాని అమాంతంగా ఒకటేసారి వచ్చి వుండదు. కొంతకాలం యీ దుర్దశ పామరజనంలో అక్కడక్కడ దృశ్యాదృశ్యంగా వుండి క్రమంగా అంటువ్యాధిలాగ అలుముకొని తరవాతతరవాత యిది పండితులనుకూడా ఆశ్రయించింది. పండితులనగా "యిది మంచీ యిది చెడ్డా" అనే వివేకం కలవారుకదా? అట్టివారిక్కూడా యిదేం కర్మమని అనుకోవడానికి

అవకాశంలేదు. యేమంటే కొన్ని అకృత్యాలు అవలంబించి తద్వారాగా పామరులు పొందుతూ వున్న తాత్కాలిక లాభాలు చూచి కళ్లుకుట్టి క్రమంగా ఆలాటి వ్యాపారాలలోకి పండితులుకూడా దిగుతూ వున్నట్టు యిప్పటి ప్రపంచకం సాక్ష్యమిస్తూనే వుంది గనక విస్తరించవలసింది లేదు. యిది ఆలాటిది కాకపోయినా అంటే? ఆ బ్రాహ్మణఛండాల పర్యంతమూ జంకవలసిందే. అయినాక్రమంగా జ్ఞానులలోకూడా వ్యాపించడానిక్కారణం యీ నీలాపనిందలకు యేవిధమైన అపకారమున్నూ దైవమూలకంగా వచ్చినట్టు లేకపోవడమే. దానితోటి "అసత్యకల్పన" మంటే సర్వసాధారణమైనట్టు కనపడుతుంది. యీ కల్పనకూడా వొకటే విధంగా వుండదు. కొందఱు లాభాపేక్షతో దీన్ని ఆశ్రయిస్తారు. కొందఱు యే ప్రయోజనమూ లేకుండానే దీనిలో వ్యాపకం చేస్తారు. యెవరెందుకు దీనిలోదిగినా, యెప్పుడో వొకప్పుడు యిది తగినంత ప్రాయశ్చిత్తముచేసి తీరుతుందిగాని వూరికేపోదు. కాస్త నలుగురిలో తలెత్తుకు తిరిగే యే వ్యక్తిన్నీ యీ నీలాపనిందా కారకత్వంలో పాల్గొనకూడదు. పాల్గొనడమే అనర్థదాయకమైనప్పుడు యావత్తు యాజమాన్యమూ వహించవలసివస్తే, యిక చెప్పేదేమిటి? యీ నీలాపనిందలకు గుఱియైనవ్యక్తులు చాలామంది వుంటారు గాని యీ కాలంలో తి॥ వెం॥ కవులు గుఱిఅయినంత యెవ్వరూ అయివుండరు. గీరతంలోనున్నూ, గుంటూరిసీమలోనున్నూ విశేషించి వుంటుంది. ఆ గ్రంథద్వయం లోనున్నూ యీ నీలాపనిందలకు ముఖ్యంగా పరిశీలించతగ్గది గుంటూరిసీమ. గీరతంలో-

ఉ. "కట్టుచునున్నవారు గృహకాండము నారకమందు" అనే పద్యాలు ప్రచురించిన తరవాతేనా అపవాదకులు భయపడి వెనక్కుతగ్గినట్టు కనపడుతుందిగాని, గుంటూరి సీమవిషయంలో తుట్టతుదదాకా వొకటే పోకడ; అయితే ఆ సీమలో పలువురు యోగ్యులు వుండి వెంటనే యథార్థాన్ని ప్రచురించి సహాయం చేయడంవల్ల కొన్నాళ్లకేనా ఆరొంపిలో నుండి బయట బడగలిగాం గాని లేకపోతే యేమయేదో? చెప్పజాలము. ఆయా వ్యక్తులందఱినీ కాదుగాని, అందులో వొకటి రెండు వ్యక్తులు జ్ఞాపకంవస్తే యిప్పుడుకూడా వొళ్లు జలదరిస్తుంది. యెప్పుడో ఆ కాలం అంతరించి పోయిందంటే "తుదకబ్బెరా తురకభాష" అన్నట్టు మళ్లా యిప్పుడు ఆలాటివారు బయలుదేరి యేవెట్టిమొట్టి అసత్యాలో వ్రాయడంచేత యేదో కొంత "పిల్లిమీదా యెలకమీదా" పెట్టి నాల్గు మాటలు వ్రాయడం; యింతే స్వస్తి-

★ ★ ★

# అపవాదలు

అనఁగా నెవరిమీఁదనేని లేనినిందను మోపుటయని సామాన్య జనుల వాడుక, కాని బాగుగ విమర్శించినచో నిందను మాత్రమేకాక లేని సుగుణము నాపాదించుట కూడా అపవాదమే యగునని పరిశీలకులకు, తోఁచకమానదు. ప్రస్తుత మీవిషయమై వ్రాయుటకుఁగల బీజము నుదాహరించి పిమ్మట దీనిం గూర్చి ప్రస్తావించెదను.

విశాఖపట్టణం డి॥ భీమునిపట్నమునుండి, బ్ర॥ శ్రీ॥ గడ్డం ఆదినారాయణశర్మ ఉపాధ్యాయుఁడుగారు 31-03-35 తేదీని నాపేర నిట్లు వ్రాసినారు-

"తమరు శతావధానము చేయునపుడు, ఏవిషయమైన స్ఫురణకు రానిసమయమున 'అంబా' యని అనుకొనుటయు ఆయమ్మ అనుగ్రహము వెంటనే కలుగుచుండుటయు, కలదని తెలిసిన పెద్దలవలన వింటిని. ఇది నిజమా?"

జవాబు

అయ్యా! ఇది నిజముకాదు, కేవలమసత్యము, స్ఫురణకురాకపోవుట కల్గినప్పుడు ఊర్ధ్వదృష్టిమీఁదఁగొండొకసేపు యోజించుట మాకేకాదు ప్రతిమనుష్యునకును స్వభావమే. అట్టి సమయములో, ఆస్తికుడగు ప్రతిమనుజునకును, ఇష్టదేవతను స్మరించుటకూడ సహజగుణమే కనుక మేముగూడ నెప్పుడేని మనస్సులో నట్లు ఇష్టదేవతయగు కాళికను స్మరించియుందుమేమో, దానింబట్టి ప్రపంచమునందలి పెద్దలలో మాయందు విశేషాభిమానముగల వారట్లనికొనియుందురు. అదియుంగాక మేము అవధాన మారంభించుటకుముందు-

శ్లో॥ నాళీకజాద్యదితిజాళీశిరఃకలిత॥

లోనగు నస్మత్కృతశ్లోకములు పఠించుటగూడ వారియూహను బలపరచి యుండును. ఈశ్లోకపఠనమేకాక, ఆయాయవధానములయందు తత్తత్కాలోచితముగా మేము-

"ఉ॥ ధారణనిల్చునా? నిలువదా?"

ఇత్యాది పద్యములు దేవియనుగ్రహము నభ్యర్థించుటను దెల్పునవి రచించుట కలదు. దీనివలననేమి, ఆత్మకూరు రాజుగారిచ్చిన గ్రంథమును తెలుఁగుజేయు సందర్భములో-

"మాకునెట్టి దుష్కరమగు కార్యమేని కొనసాఁగఁజేసెడి తల్లి
కాళియున్। బరమకృపారసంబు పయిపై వెదఁజల్లి యనుగ్రహింపదే"

అని నొడువుటంబట్టియేమి మఱికొన్ని పద్యములవలననేమి మీఁకు జెప్పిన పెద్దలకు-

"తిరుపతి వేంకటకవులకు శ్రీకాళీమహాదేవి తోడఁబల్కును"

అను నపోహ జనించియుండును. అహంకార నిరాసార్థము మనలో ననేకులు పెద్దలట్లు స్వకీయప్రజ్ఞా విశేషములను భగవంతునియం దాపాదించుట కలదు. శ్రీపోతరాజుగారు-

"క. పలికెడిది భాగవతమఁట! పలికించెడువాఁడు రామభద్రుండట!" అన్నారు. ఇట్లే పలువురు పలికిరి. మేమును అట్లే అనునది ముఖ్యాంశము. ఇంతమాత్రముచే మేము భగవద్భక్తిలేనివారమని కానీ, నాస్తికులమనికాని మీరుగానీ, లోకులుగాని భావింపకుందురు గాక. మనుష్యుడు నిమిత్తమాత్రుఁడనియు సర్వమునకు భగవంతుఁడే కర్తయనియుఁ జెప్పెడి సిద్ధాంతమును మేము శిరసావహించువారిలోఁ జేరినవారమే. కాని మాకు శ్రీకాళీమహాదేవి ప్రత్యక్షమను నపవాదమును మాత్రము మేము మోయఁజాలము. అసత్యమైనను మంచిదేకదాయని సంతసించి మిన్నకుందుమేని పిమ్మటఁ గొన్నిచిక్కులు కలుగవచ్చును. మొదటినుండి మముమంత్రోపదేశమునకుఁగా నాశ్రయించి పీడించువారితో ఒట్లు, సత్యములు పెట్టుకొని, మేము మంత్రశాస్త్రవేత్తలము కామని యెంత మొఱ్ఱపెట్టి చెప్పినను వారువిశ్వసింపక యీప్రవాదమును వ్యాపింపఁజేయుచు నుండెడివారు. ఒకపరి శ్రీఆత్మకూరు సంస్థానపు వివాదాల సందర్భములో, ఆగ్రామమున చలిజ్వరబాధ విశేషించి యున్నది. దానిబారిని రాజుగారుమొద లెల్లరును బడియేయుండిరి. మాకు, ప్రతికక్షియగు శ్రీ శ్రీనివాసాచార్యులుగారును దానిబారిఁబడి యంతంబోక రక్తగ్రహణిచేఁ బీడితులగు సమయమున ఆయనకే తోఁచినదో? లేక యెవరేని బోధించిరో? నిజము భగవంతున కెఱుక ఈరక్తస్రావమునకు కారకులు శతావధానులని యొకపుకారుపుట్టించి దాని నివారణకుఁగా నెక్కడనుండియో శాబరతంత్రజ్ఞులంబిలిపించి యేమేమో చేయించుసందర్భ మెట్లో శ్రీరాజావారికిఁ దెలిసి వారిట్లు మందలించిరి. "మీరు వ్యాధినివారణ కౌషధసేవ చేయుటకు బదులు నిరుపయోగమగుపని చేయుచున్నారు. శతావధానులకు మీరనుకొన్న ప్రజ్ఞ లేకపోలేదు, ఏప్రజ్ఞయు లేకున్నచో, ఇంతదూరమువచ్చి ఇక్కడవారికన్న నెక్కుడుగా సంస్థానపండితులతో ఢీకొని పోట్లాడగలరా? అగుచో "మా మీఁద వారి శక్తి నెందుకు ప్రయోగించలే" దందురేని, ఇక్కడ మాకు గ్రంథము కృతి యిచ్చి మా వల్ల వృత్తి (అగ్రహారము) కూడ స్వీకరించి మాకు ముఖ్యులైన మీ పట్ల దాని నుపయోగించునెడల మా మీఁద గూడ నుపయోగింపవలసినదే."

ఇట్లు శ్రీరాజావారు మందలించినమీఁద వారాయుద్యమమునుండి విరమించిరి, కాని మాకు మాత్రము కలిగిన అపవాదను రాజుగారుకూడ విశ్వసించినట్లేకదా, ఒకపరి గద్వాలలోఁగూడ నిట్టిదే జరిగినది. దానిఁగూడ నుదాహరించుట అప్రస్తుతము కాదు. మా శతావధానము జరిగిన మఱుచటి వత్సర మొకకవివర్యుఁడవధానమునకుఁ బూనుకొనెను. ఈయన శాస్త్రవేత్త, కవి. అవధానమెన్నఁడును జేసినవాఁడుగాఁడు సరికదా చూచిన వాఁడుగూడఁగాఁడని నేను అప్పటికి గతమైన వత్సరమే గ్రహించితిని, ఎట్లనగా ఈయన శతావధానము, గంటలేక రెండుగంటల కాలములోఁ జేయవచ్చునని నాతో నిష్కర్షగా నుడివెను. ఈమాట విన్నది మొదలు ఈయన వట్టి యమాయకుఁ డనియు, కవిత్వముచెప్పిన జెప్పవచ్చునేమో కాని అవధానము మాత్రము చేయనేరఁడనియు గ్రహించితిని. తుదకట్లే జరిగినది. ఎంతో మందికిఁగాదు. 25గురు మాత్రమే పృచ్ఛకులు. శ్రీ గద్వాలరాజావారికి మా అవధానము చూడని పూర్వము అవధానమనినచో నిష్టమేలేదు. చూచినపిమ్మట వేఱొకరిది చేయఁగలరని నమ్మకము లేదు. అందుచేత 25 గురినిమాత్రమే యేర్పఱచినారు. శ్రీ రాజావారి హృదయమునఁగూడ మాకు దేవి ప్రత్యక్షమనియే దృఢనిశ్చయము, ఈకవి 25 గురకే పూర్తిచేయలేక తప్పినతోడనే మేము ప్రస్తావవశమున–

"శతావధానకవితా సామ్రాజ్యపట్టాభిషేకముఁ బొందంగను మాకు, దక్కఁగలదే గద్వాలభూపాలకా!" (నానారాజసందర్శనము చూ.)

అను పద్యమును జదివితిమి. ఈ మాట శ్రీ రాజావారి వుద్దేశమును మఱింత బలపఱచి యుండనోపు. అది యటులుండె, గంటకో లేక రెండు గంటలకో, శతావధానము చేయఁగలమన్న వారింగూర్చి వ్రాసినమాలిక–

"బళి బళి యెంత వింతయొ"

అన్నది నానారాజసందర్శనములో నచ్చయి యున్నది. అది యీ కవిని గూర్చినదియే, సందర్శనములోని పద్యములలో ననేకముల కిట్టి యుపోద్ఘాతము వ్రాయవలసినది కలదు. అది తద్జ్ఞులవలన నెఱుఁగుదురని యందందుదాహరింప మైతిమి. ఉదాహరించినచో నెంత పెరుఁగునో చెప్పఁజాలము. ఇది యిటులుండె. మఱి యెనిమిదేండ్లకు కర్నూలు ప్రాంతమున నుండి యేలూరికి నేత్రావధానమున కనివచ్చిన వేదవేత్తలవలన, ఆగద్వాలలో నాఁటియవధానమున, ఆకవి తప్పినది మాప్రయోగతంత్రమువలననే, అని తేలినది. ఆయేలూరిలో వారి నేత్రావధానముకూడ నట్లగునేమోయని వారు నాబసకు వచ్చి నన్ను మిక్కిలిగాఁ బ్రార్థింపఁదొడఁగిరి. నాకు మిక్కిలి సిగ్గైనది. ఏమైన నేమి, యథార్థముచెప్పిన వారువిందురా? వినరు, ఇట్టివనేకములు. ఒకటి శతావధానసార పీఠికలో నుదాహరించియే

యున్నాము. అది గోదావరీమండలము. మండపేటకు సంబంధించినది. ఈభ్రాంతి వడినవారు ఆపాదుకాంతదీక్షాపరులు బ్ర॥ శ్రీ॥ ఆదిభట్ల రామమూర్తిశాస్త్రులవారు, "ఆపాదుకాంత" పదమువల్ల జ్ఞప్తికివచ్చినది. నన్నేమో, ఇట్టి మహానుభావులందఱును మంత్రశాస్త్రవేత్తనుగా.- అంతమాత్రమేకాదు, మంత్రసిద్ధిని పొందినవానినిగాఁ దలంచుచున్నారు కదా? నా ప్రజ్ఞ యెంతయో? ఈ విషయమున నీక్రిందిసంగతివలన విజ్ఞులరయుదురు గాక! నేను ఇప్పటికి 5, 6 సంవత్సరములకు పూర్వము వఱకును "ఆపాదుకాంతదీక్ష" అనఁగా పావుకోళ్లు తొడిగికొని సర్వదా నడచునంత గొప్పదనముగల మంత్రశాస్త్రజ్ఞులకు సంబంధించినదని యనుకొనుచుండు వాఁడను. సంప్రదాయార్థ మెటులున్నను, సామాన్యముగా, ఆపదమునకు తోఁచు నర్థముకూడ నిదియే. ఇటీవల నా కాపదమునకుఁగల యథార్థ మొక విజ్ఞుఁడు చెప్పఁగాఁ దెలిసినది. ఆ విజ్ఞుని పేరిపుడు జ్ఞాపకము లేదు. ఆయన మా తిరుపతిశాస్త్రి గారికి మంత్రశాస్త్రగురువు. మీరు మంత్రశాస్త్రవాసనయేలేదని చెప్పుచున్నారే? స్వవచో వ్యాఘాతముగా మరల తి. శా. గారికి మంత్రశాస్త్ర గురువున్నట్లు వ్రాయుచుంట కర్థ మేమందురా తి॥ శా॥ గారు అవసానకాలమునకు నాలుగేండ్లకు ముందు మంత్రశాస్త్రమున మిక్కిలిగాఁ బరిశ్రమ చేసిరి. అందువలన నతనికి గురువేర్పడియెను. ఆయన అన్నవరములో నొకపరి కన్పట్టి నన్నుఁగూడ నుపదేశము పొందవలసినదని ప్రస్తావించెను. నేను తపశ్శక్తిలోపమువలన నిరాకరించితిని. దీనితత్త్వమిది. ప్రస్తావనలో ఈ తిరుపతిశాస్త్రిగారి గురువువలన- "ఆపాదుకాంతదీక్ష" అనఁగా నేమొ తెలిసికొంటిని. తేలినసారము : మా యిరువురకుఁగూడ గద్వాలాదులు వెళ్లునప్పటికి మంత్రశాస్త్ర ప్రవేశము సుంతయులేదనియు తి॥ శా॥ గారికి మాత్రము అవసానకాలమున కించుకపూర్వము తచ్ఛాస్త్ర ప్రవిష్టతకల్గినది కాని నాకిప్పటికిని లేనేలేదనియు తేలినది. కాళీసహస్రములో "అమంత్రోపాసకౌసంతౌ" అని వ్రాసితిని. ఇట్లు కంఠోక్తిగా నచ్చుటచ్చుట నేను వ్రాసినను లోకము దీనియెడల నిశ్చయము లేకయేయున్నది. ఉపదేశమునకై వచ్చి యాశ్రయించు పలువురతోనే నీవిషయమును చెప్పుచునేయున్నాను, వారుమాత్రము విశ్వసించినట్లులేదు. ఇట్లు చెప్పుట మానలేదు. నాకుఁ దెలిసినదెంతో అంతే యొప్పుకొనుట సమ్మతము. కాని చాలమంది తెలియని విషయము తెలిసినట్లితరులకు నెక్కింపవలయునని మిక్కిలిగాఁ బ్రయత్నింతురు. కొందఱు కావ్యసాహిత్యముమాత్రమే సంపాదించుకొని కవిత్వరచన చేయుచుఁ బేరు ప్రతిష్ఠలు సంపాదించికూడ, అన్నా! మనకు శాస్త్రప్రవేశము లేదను నపవాదము తొలఁగు టెట్లని దానికై బ్రహ్మాండమైన ప్రయత్నము చేయుచుందురు. అంత మాత్రమున ప్రాజ్ఞలోకము వారిని శాస్త్రజ్ఞులనుగాఁ గైకొనదు. కైకొనకున్నను వారు ప్రయత్నము మానరు. లేనిప్రజ్ఞను, ఉన్నట్లు మేమును నొప్పికొంటిమే యనుకొందము. పనివడినప్పుడు ఆ ప్రజ్ఞను చూపఁగలమా? లేము. మేము గురుసన్నిధి

నభ్యసించినది వ్యాకరణము మాత్రమే. లోకులుకొందఱు మమ్మును, తదితరశాస్త్రములను గూడ వచ్చినవారినిగా వ్రాయుచుందురు. ఈ వ్రాఁతకూడ దేవీప్రత్యక్షపు కథవలెనే అపవాదమని లోకు లరయుదురుగాక. మేము మాత్రము "శబ్దశాస్త్రప్రశస్తప్రభావం బాతపత్రమ్ము దివ్యచారిత్ర మాకు" అనియు 'గురుపాదసేవనాదరలబ్ధ మగువిద్య నాగరాజ ముఖోదితాగమంబు' అనియు "అ ఇ ఉ ణ్ మొదలుగాఁగ" అనియు, అక్కడక్కడ శబ్దశాస్త్రమును మాత్రమే నేర్చితి మనునంశమునే ప్రకటించుచు వచ్చితిమి. ఇఁక నొకటి. మేము చదివిన దింతమాత్రమే యైనను మా ముఖ్య గురువరులు బ్రహ్మశ్రీ చర్ల బ్రహ్మయ్య శాస్త్రులవారి పాండిత్యముమాత్రము సర్వతోముఖమైనది. వారు వ్యాకరణపాఠము చెప్పుచున్నప్పుడు పూర్వమీమాంసాది శాస్త్రములయందలి విశేషాంశములు తఱచు దొఱలుచుండెడివి. మాకు గ్రహణధారణములు భగవద్దత్తములయి చిన్నప్పటినుండి యుండుటచే వారు నొడివిన విశేషములన్నియుఁ గాకున్నను గొన్నియేని జ్ఞప్తియందుండెడివి. అందుచేతనేమి, ఇటీవల దేవీభాగవతాంధ్రీకరణము వల్లనేమి. యేస్వల్పమో మఱియితరశాస్త్రప్రసక్తి యాత్మకుపకరించునంత కలిగినను అది ఇతరులకు గురుత్వ మొనర్చుపాటిదిగాదు. మా ప్రధానగురువు సర్వశాస్త్రవేత్త, వారివద్ద మే మభ్యసించినది మాత్రము వ్యాకరణ శాస్త్రము. స్వబుద్ధిచే నార్జించుకొన్నవి చాల విషయములు గలవు. అవి సాహిత్యమును బలపఱచునేకాని శాస్త్రమును బలపఱుపనేరవు. పనిచేసినచో నంతో యింతో మాకు, "శబ్ద శాస్త్రమువచ్చునుగాని తక్కు శాస్త్రములురావు" అనుట స్వభావోక్తి. పెద్దలెన్నినేర్చినను– "నహి సర్వ స్సర్వం విజానాతి" అని యూరక యనలేదు. సర్వజ్ఞత్వ మనఁగా? సర్వశాస్త్రవేత్తృత్వము సంభవింపదు. కావుననే, "సర్వజ్ఞనామధేయము శర్వునకే". "అనభ్యాసే విషంశాస్త్రమ్" అని పరంపరగావచ్చుచున్నది. శాస్త్రములనఁగా నన్నియు శాస్త్రములుగావు. తర్క, వ్యాకరణ, పూర్వోత్తరమీమాంసలే శాస్త్రములు. ఇందు మొదటి రెండును గురుశుశ్రూషచేసి సంపాదించినచోఁదక్కు రెండును గొంత సులభసాధ్యము లనుటకు సందియములేదు. ప్రసక్తాను ప్రసక్తముగా శాస్త్ర ప్రస్తావనలోనికి విషయము కాలిడుచున్నది. మాకు అమ్మవారు తోడఁబల్కుననునది ప్రవాదమాత్రముగాని నిక్కము గాదను నదిప్రధానాంశము. మాకాపెయందు భక్తి మాత్రము విశేషించి కలదు. దైవవశమున మా యిరువుర కుటుంబములును శ్రీకామేశ్వరి యిలువేల్పుగా గలవియేయైనవి, అయినను మా తిరుపతిశాస్త్రిగా రవధానములలోఁ దక్క దేవీవిషయమున నంతగా భక్తిందెలుపు కవనము రచింపలేదు. నాకు అవసరము కలుగుటచే 1. కామేశ్వరీ శతకము. 2. ఆరోగ్యకామేశ్వరి, లోనైనవి వ్రాయవలసి వచ్చినది. అందలి సంగతులన్నియు ఫలించినవనిగూడ వ్రాయుచున్నాను. ఇంతమాత్రమేకాదు. నాకు ఈ 65 వత్సరముల కాలమునందును జాలసార్లు స్వప్నప్రత్యక్షముకూడ జరిగినది. ఈస్వాప్నిక ప్రత్యక్షము

లనేకులకుఁ గలుగవచ్చును. అవి వారి వారి భావనల ననుసరించియుండును. అంతమాత్రమున వారికాదేవత ప్రత్యక్షమని వారుగాని, లోకులుగాని తలఁచుట యుక్తిసహముకాదని నేననుకొందును. ఆయీ భావనలుగూడ భిన్నభిన్నములు. శైవులకొకమాదిరి, వైష్ణవుల కొకరీతి, శాక్తేయుల కొకతీరు, మహమ్మదీయులకొకఫక్కీ, క్రైస్తవుల కొకతేవ. అంతమాత్రమున దేవతలు ప్రత్యక్షమైనట్లు వారు కాని ఇతరులుగాని నిశ్చయించుకోరాదనియే నేననుకొందును. స్వప్నమనఁగా సామాన్యముగాదు. మనుజుఁడు నిజముగా సుఖమునుగాని, దుఃఖమును గాని యనుభవింపవలసినచో స్వప్నమందే యనుభవింపవలయునుగాని జాగ్రదవస్థలో నేమున్నది. పుట్టమట్టి. వేదాంతశాస్త్రమంతయు స్వప్నమునే యాలంబించియున్నది. అదియటులుండె. నాకొకప్పుడు నూజివీటిలో నుండఁగా స్వప్నమున శ్రీకాళికావిగ్రహము పొడకట్టినది. ఆపెమోకాళ్లు పెద్దతాటియంత ప్రమాణముగ నున్నవన్నచో శిరస్సెంతవఱకుండునో వ్రాయనక్కఱలేదుగదా! ప్రత్యక్షమైనచోటొక మహారణ్యము. సమయము తెల్లతెల్లవారుతఱి. నేను భయసంభ్రమములతో గద్గదస్వరమునఁ గొన్ని పద్యములుకూడ నప్పుడు చెప్పుచు నామహాదేవి పాదములపైఁబడి నుతించితిని. కాని యీ పద్యములు మేల్కొన్నపిమ్మట జ్ఞప్తికిఁదగులవయ్యె. మోకాళ్లు మునుఁగువఱకును పూజకుసంబంధించిన పుష్పములును, కుంకుమయును రాశిపడియున్నది. అట్లు పద్యములతో నుతించునావీఁపుమీఁద నాదేవి తన చేతితో నిమిరి "వాఁడేఁడిరా" అని, తిరుపతిశాస్త్రిని గూర్చి యడిగినది. ఈమాటకేమి బదులు చెప్పితినో యిపుడుజ్ఞాపకములేదు. ఇంతవిలక్షణముగాఁగాకున్నను, చాలసారులిట్లే జరిగినది. ఇంతమాత్రమున దీనింబట్టి ప్రత్యక్షమైనదని యెవరను కొందురు? కాని యొకటి మాత్రమున్నది. ఇట్టి సంగతి జరిగిన కొలఁది కాలమున కేదో మంచి కలుగుట మాత్రము కలదు. ఇందులకు స్వప్నశాస్త్రజ్ఞు లంగీకరింతురు. ఈ నూజివీటి ప్రత్యక్షగాథ జరిగిన మఱునాఁడే నేను బందరు హైస్కూలు పండితుఁడనుగా నాహూతుఁడనై వెళ్లవలసి వచ్చినది. అక్కడనే గ్రంథ రచనాదులవలన నాకు విశేషించి మంచి కల్గినది. ఇంతమాత్రమున నాకు శ్రీకాళికాదేవి ప్రత్యక్షమని లోకుల ప్రవాదముతో బాటు నేనుగూడఁ జెప్పికొన మొదలిడినచో నెందఱకో యెన్నో చిక్కులు దీర్పవలసివచ్చును. అది చేతఁగాదుగదా? చదువని శాస్త్రము చదివినట్లు ప్రచురించు కొన్నవారు పాఠముచెప్పలేక పరాభూతులైనట్లే నేనును గావలసివచ్చును. కాన లోకులభిమానతిశయముచే నాయం దాపాదించు మహత్త్వమును నేనపవాదమునుగాఁ బరిగణించి యిందుమూలమునఁ దొలఁగించుకొను చున్నాఁడను. నేఁటికి సుమారు 16 యేండ్లనాఁడొక బ్రాహ్మణుఁడు నాయొద్దకువచ్చి, తాను కొన్ని వత్సరములనుండి దేవినుపాసించుచున్నట్లును, ఆయుపాసనకు సంబంధించిన సంతర్పణలక్రిందఁదనకుఁగల భూవసతి యావత్తును గడతేర్చినట్లు, చెప్పి ప్రస్తుతము మిగిలినది కడుస్వల్పమనియు,

ఇంతవఱకు నేమాత్రమును లాభము కలుగలేదనియు ఈమధ్యమాత్రము స్వప్నములో దర్శనమిచ్చి మీవిగ్రహమును జూపి: "నీకు వీరివలనఁ గృతార్థత కల్గును" అని చెప్పినదనియుఁ జెప్పి నన్నుఁబీడింపఁ జొచ్చెను. నాకేమియుఁ దెలియదని యాయనకెంత చెప్పినను నామాటలు చెవికెక్కలేదు. తుదకాయనకు దేవీభాగవతములోని కుమార్యర్చనా విధానమునుజెప్పి దీనివలన నీవు కృతార్థుఁడవగుదువని గంభీరముగ దీవించి పంపితిని. పిదప నేమిజరిగినదో కాని ఆయన మరల నాయొద్దకింతవఱకు రాలేదు. ఆయన గ్రామము మా గ్రామమునకు నాతి దూరమున నున్న రామచంద్రపురమునకు సమీపము నందలిదని జ్ఞాపకము. నా జీవితములో నన్నిట్లు పీడించి మోమోటపెట్టిన వారు పలువురుగలరు. వారిలో నేను పలువుర పేళ్లుగూడ నెఱుఁగుదును. వారిప్పుడు కవులై అక్కడక్కడ నెట్టెట్లో అవధానములుకూడఁ జేసి కొంత గౌరవమును సంపాదించుకొని యున్నవారగుటచే వారిపేళ్లిందుదాహరించుట యుక్తముకాదని మిన్నకుంటిని. ఏదోపూర్వజన్మమున నంతో యింతో దేవీపూజ చేసితిమేమో? లేనిచో ఈ నాలుగక్షరములును చిన్నమాట నప్రయత్నముగ రావేమో? మీవంటి వారిలోఁ బలువురాదరింపరేమో? అని మేమును అప్పుడప్పుడు మాలో ననుకొనుచుండువారము. ఇట్లనుమాన ప్రమాణము తప్పమాకుఁ బ్రత్యక్షప్రమాణము లేశమునులేదని లోకులకు మనవిచేయుచున్నాను. ఈయంశము మాపొత్తములలోఁ జాలచోట్ల నుపలబ్ధమగును. అయినను దిఙ్మాత్ర ముదాహరింతును-

శా. ఈజన్మమ్మునఁ గొంచెమేయనుము మున్నేజన్మమందేని నీ
పూజన్ బూర్తిగఁజేసె వీఁడదికతమ్ముంజేసియే లోకముల్ పూజించెన్!

(ఆరోగ్యకామేశ్వరి)

ఇంతయెందులకు - మన పెద్దలిట్లువ్రాసిరి.

శ్లో. యద్ద్వారేమత్త మాతంగా । వాయువేగాస్తురంగమాః
పూర్ణేందువదనా నార్య । శ్శివపూజావిధేఃఫలమ్"

దీని ననుసరించియే యీమధ్య మొన్న మొన్న వ్రాసినమృత్యుంజయస్తవములో నేనీపద్యమును వ్రాసితిని...

శా. ద్వారంబేరిది మత్తదంతి తురగస్థానంబొ? యెవ్వారి సం
సారం బాత్మజ సత్కళత్ర సకలైశ్వర్యాన్వితంబో? భవ
చ్ఛ్రీరమ్యాంఘ్రిసరోజ భక్తులని వారిన్నిర్ణయింపంజనున్
వేఱెచ్చో ఘటియించు నిట్టి మహిమల్ విశ్వేశ! మృత్యుంజయా!

విష్ణుభక్తులలో విశేషించి యైశ్వర్యవంతులు లేకపోలేదుగాని శివభక్తులలో మిక్కిలి మనకుఁ గన్పట్టుదురు. ఇందుల కుదాహరణము నైజాములోని పలువురు శైవులగు కోమట్లు. దక్షిణదేశమునందలి నాఁటకోట్లును అని యెఱుఁగఁదగును. దీనిమీఁదఁ బూర్వపక్షము లేకపోలేదు. కాని మన శాస్త్రములను నమ్మువారినిగూర్చియే యీ నాలిఖించుట. తక్కినవారు నాకు దేవీప్రత్యక్షవిషయమయి యడుగువారిలోఁ జేరరుగదా? మనవారు యజ్ఞములవలన వర్షములు గుఱియునని వేదమున నుండుటను విశ్వసింతురు. అగుచో యూరపుఖండమున, అమంత్రగోమేధములు తప్ప సమంత్రకములు లేశమును. లేవుగదా, అచ్చట వర్షము లేల గుఱియుచున్నవి యనుటకు సమాధానము దుర్లభము. ఇతరులు విశ్వసింపకున్నను, పైశంకకుఁగూడ మనవారు మనకు సమాధానము చెప్పఁగలరు. మే మొకఖండము నుద్దేశించి యజ్ఞము చేయలేదు. కనుక మాయజ్ఞములే ఆయాఖండములకుఁ గూడ వర్షమును కల్గించుచున్నవని రహస్యములో సంతసించుచుందురు. ఏకదేశమాత్రమున నెగ్గఁదగు జవాబుగల విషయములందుఁ జిన్ననాఁట నుండి నాకు విశ్వాసము లేదు. ఏ విషయము మనకుఁ దెలియునని యొప్పుకొందుమో, అందొకనికి జంకనియంత శక్తియేని యుండవలెను, ఏమిడిమిడి జ్ఞానమో పనికిరాదుఅని నేను దలఁతును. ఈయంశముకూడ నేనిప్పటికి నలువది యేండ్లనాఁడు వ్రాసిన కామేశ్వరీశతకములో వాక్రుచ్చియున్నాఁడను.

మ. పరగేహమ్మున భుక్తి, యన్యసతితో భాషించు బల్రక్తి, య
క్కఱకున్ గానిప్రసక్తి, వేఱొకనికిన్ గంపించుధీశక్తి, నీ
చరణమ్ముల్ గనలేనిభక్తియును నిస్సారమ్ము లీయైదిటిన్
మఱుఁగన్నీకుము మన్మనం బిదియె నిన్ బ్రార్థింతుఁ గామేశ్వరీ.

ఈ పద్యరచనకు ముఖ్యకారణము మొదటియంశమే కాని తక్కినవి కావు. తక్కినవి ప్రసక్తానుప్రసక్తములు. అంత్యప్రాసమును బురస్కరించుకొని చేరినవి. అయినను - "ప్రాసకోసమన్నానే కూసుముండా" వంటివి మాత్రముకావు. సార్థకమైనవియే మొదటిదానికిఁగల ప్రసక్తియెట్టిదో తెల్పుట అంతయప్రస్తుతము కాదనుకొందును. నేను మందసా సంస్థానమునకు వెళ్లినప్పుడు వెళ్లిననాఁడు మొదలుకొనియే నాకు గ్రహణీరోగ మారంభమై మిగులబాధించినది. సంస్థానపు దివాన్‌గారు నన్ను మిక్కిలిగా నాదరించి భోజనాది సదుపాయములు వారియింటనే జరిగించినారు. ఆయన శ్రీవిజయనగర సంస్థానమునుండి అయ్యెడ కుద్యోగమునకు వెళ్లినవారు. శ్రీమదానందగజపతి మహారాజులుంగారి తండ్రిగారిరోజులలో శ్రీవారిప్రయత్నము మీఁద విజయనగరము కేవలము ననేకసందర్భములలోఁ గాశీక్షేత్రముగా మార్చఁబడినది. ఆమార్పువలనఁ

గాశీక్షేత్రములోని భంగుపానము విజయనగరమునకు సంపూర్తిగాఁ గాకున్నను జాలవఱ కలవడినది. అది మన ప్రస్తుతపుదివాన్‌జీవారికిని ముఖ్యమగుటచే, ఆయనసాయంకాలము సుమారు 5 1/2 గంటలవేళ దానిని పుచ్చుకొని షికారుకు బయలువెడలి రాత్రి సుమారు 11 గంటలప్రాంతమునఁగాని భోజనమునకు వచ్చువారు కారు. నేను గ్రహణీరోగ పీడితుఁడనై యంతవఱకు భోజనమున కాగుట యెంతచిక్కో ఆలోచింపుఁడు. అట్టి సంకటస్థితిలో వ్రాసిన యీ పద్యము మొట్టమొదటి యంశమునే పురస్కరించికొని పుట్టినదనుట యుక్తమగుటచే నట్లుయథార్థమును తెలిపితినేకాని, యిందలి యంశము లన్నియు నుపాదేయములే. ఆ యీ చిక్కులన్నియును గాకున్నఁగొన్నియేనియు నప్పుడప్పుడు పడియున్నకతముననే "పడవలెఁబడరానిపాటులెల్ల" అని నేను వ్రాయవలసి వచ్చినది. ఆ యీ చిక్కులన్నియు కవిత్వమున కుపకరించునవియే యని లాక్షణికులు వక్కాణించియే యున్నారు. "అహోభారో గురుఃకవేః".

దీనిని విస్తరించుట కిది చోటుగాదు. చిక్కులుపడి కవియైనవాఁడు పిదపఁ గొంతకాలము మిగులవలెను. అది యెక్కడనోగాని ఘటింపదు. ఘటించినచో నతని రచనకుఁబైచిక్కులు చక్కని పనిచేయును. అది యటులుండె. మాకుఁ గాళిక ప్రత్యక్షమగుటగాని, తోడఁబల్కుటగాని లేదనునది వక్తవ్యాంశము. హృదయమందుండి ఆ యీ పద్యములనో, శ్లోకములనో అవధానాదులలో పలికించు నందురా? అగుచో నెల్లర హృదయమునందును భగవంతుఁడుండి పల్కించుచునే యున్నాఁడు. ఇచ్చటనే యననేల? అందులో విశేషము లేదుగదా?

శ్లో. ఈశ్వరస్సర్వభూతానాం హృద్దే శేऽర్జునతిష్ఠతి॥ (భగవద్గీత)

ఉపాధ్యాయుఁడుగారి మొదటిప్రశ్నమునకు నా యెఱిఁగినంతలో ఆత్మవంచన లేకుండ నుత్తరమిచ్చితిని. వారే ఇంకొక ప్రశ్నమునుగూడ నడిగిరి. అది భగవద్గీతలోని యంశము. అర్జునుఁడు మొఱ్ఱో నేను యుద్ధముచేయనని వెనుదీయుచుండఁగా శ్రీకృష్ణభగవానుఁడు చేయకతప్పదని పురికొల్పవచ్చునా? అది దేవుఁడు చేయఁదగిన పనియేనా అనునది. ఇదివారికి స్వయముగాఁ దోఁచిన శంకకాదనియు మతాంతరులు చేసిన ప్రశ్నమనియు వారేవ్రాసిరి. ఆమతాంతరులు భీమునిపట్నంలో నెవరైయుందురో? చెప్పకయే తెలిసెడిని. వారిలో నీప్రాంతములలో విశేషించి ప్రాజ్ఞులుండరు. "హేవూపేడా మీరుహల్కికొంటారు" తెగలోవారుందురు. వారిప్రశ్నలకు జవాబక్కఱలేదని యుపాధ్యాయులవారికి విన్నవించుకొనుచు నింతటితో ముగించుచున్నాఁడను.

★ ★ ★

# మఱొక అపవాద

అంటే ఇదివఱలో, తి. వెం. కవులకు సాక్షాత్తుగా దేవీప్రత్యక్షంవుంది అనే అపవాదనుగూర్చి "ప్రౌఢభారతి"లో కొంత వ్రాసివున్నాను. యిప్పుడు వ్రాసేది మఱో అపవాదనుగూర్చి కనుక, శీర్షిక అలా పెట్టవలసి వచ్చింది.

మొల్ల అనే కవయిత్రి పే రెఱుఁగనివారంటూ తెలుఁగు దేశంలో లేరుకదా. ఏమూర్ఖుఁడుగాని, యేపండితుఁడుగాని ఆపె కవయిత్రి కాదనిన్నీ, ఆపె తండ్రో, సోదరులో లేక భర్తో కవిత్వం చెప్పి ఆపె పేరు పెట్టి ప్రకటించి వుందురనిన్నీ చెప్పినట్లెక్కడనూ విన్నవారున్నట్లున్నూ లేదు. యీ అపవాద దైవవశాత్తు నాకేవచ్చింది. యేలా వచ్చిందంటే, యిప్పుడు నాకు శనిమహాదశ జరుగుతూ వుంది. వాఁడు చేసేకార్యాలు చాలావున్నాయి. అందులో మొదటిది. "మిథ్యాపవాద" అన్నది. ప్రస్తుతం నాకు సంభవించినదిన్నీ అదేకనక, గ్రహచారంవల్లనే యీ అపవాద వచ్చిందంటే యుక్తి సహంగా వుంటుంది. మొల్ల తండ్రిగాని సోదరులుగాని, భర్తగాని కవులుగా వుంటే, వెం. శా. అట్టి వుద్దేశం పడ్డాఁడనడానికేనా వీలుగావుండేది. అట్టి ప్రతీతి యెక్కడనూ లేదుగదా! అట్టి స్థితిలో వెం. శా. అలా వుపన్యసించాఁడెక్కడో అనే లోకులవుద్దేశం యెట్టిదైవుండునో! యీ మొల్లసంగతే నిలిచేటట్టులేదుకదా? యిఁక దీన్ని వుపజీవకంగా చేసికొని ధ్వనింపచేశాఁడన్న అంశాన్ని గుఱించి విచారించడమెందుకు? "నిమిత్తాపాయేనైమిత్తిక ప్యాప్యపాయః" కదా! కాఁబట్టి దాన్ని గుఱించి వ్రాసి కథ పెంచేదిలేదు.

మొల్లనుగూర్చి నాకుఁగల వుద్దేశాన్ని బందరు హిందూహైస్కూలులో నేను తెలుఁగుపండితుఁడుగా వుండేరోజుల్లో చదువుకున్న విద్యార్థులు పలువురెఱుఁగుదురు. నేను పండితుఁడుగావున్న పదమూడేండ్లలో రెండు సార్లుఁకాబోలును మొల్లరామాయణం స్కూలు ఫైనల్కు టెక్స్టుగా పడ్డది. అప్పుడు సీత రావణాసురునితో గడ్డిపరక మధ్యగాపెట్టుకుని మాట్లాడే పద్యాలు పాఠం చెప్పేటప్పుడు నాకు వొళ్లు తెలిసేదేకాదు. మొల్ల సాక్షాత్తుగా తానే సీతాదేవి ననుకోవడంచేత ఆలాటి కవిత్వం చెప్పఁగలిగిందని విద్యార్థులతో అనేవాణ్ణి. సాటిఆఁడుదానికిఁ గల్గిన పరాభవాన్ని గుఱించి ఆఁడుది చెప్పిన కవిత్వంకనుకనే కవిత్వం అంతపాకంగా వుంది అనేవాణ్ణి. వాల్మీకంలోగాని, భాస్కరాదుల కవిత్వంలోగాని యీ

పాకం లేనేలేదు అనేవాణ్ణి. నేను స్కూలులో వున్నాననే సంగతి మఱచిపోయి స్వేచ్ఛగా కంఠంవిప్పి చదివేవాణ్ణికూడాను. యిట్టిస్థితిలో మొల్లవిషయంలో వెం. శా. దురభిప్రాయం కలవాఁడనే అపవాదు గ్రహచారవశంకాక యెట్టిదనుకోవాలి?

ఈ గ్రహచారాన్ని నేను మిక్కిలిగా నమ్మడంవల్ల యితరులకంటె ఆ యీగ్రహాలు నామీద యెక్కువ అధికారాన్ని చూపి చెలాయిస్తున్నట్టు నాకు తోస్తూవుంది. దేవుఁడుగాని, గ్రహాలుగాని నమ్మితేనేగాని యేమీ చేయలేవంటారు పెద్దలు. త్యాగరాయలువారేమన్నారు, "కద్దన్నవారికి కద్దు, కద్దనిమొఱలిడిన, పెద్దలబుద్ధులు, నేఁడబద్ధ మగునె" అన్నారు. యీలాటి సందర్భంలో గ్రహాలు నన్ను లోఁకువచేశాయంటే చేయవు? చేయుఁగాక, నేను నమ్ముతూనే వుంటాను. నమ్మి నామీఁదవచ్చిన "అపవాద"ను, మిథ్యాపవాదనుగా ఆగ్రహస్థితినిబట్టే సమర్థించాను గనుక నా నమ్మకం కూడా నాకు వుపకారమే అయిందని సంతోషిస్తూ దీన్ని ముగిస్తాను. ముగిస్తూ నేనేపద్యాలు మొల్లరామాయణంలో పాఠం చెప్పేటప్పుడు మొల్లకు సీతతో ఐక్యంచెప్పేవాణ్ణో ఆపద్యాలు మాత్రం వుదాహరిస్తాను.

క. పతిదైవముగా నెప్పుడు
మతిఁదలఁచుచునుండునట్టి మగువలఁ జెఱుపన్
బ్రతిన గలయట్టి నీతోఁ
బ్రతివచనము లాడుకంటెఁ బాపముగలదే.

ఉ. సంగరరంగమందు నతిశౌర్యమునన్ రఘురాముతోడ మా
తంగతురంగ సద్భట శతాంగబలంబులఁ గూడి నీవు పో
రంగను నోప కిప్పుడు విరాధ ఖరాదులపాటు జూచియున్
దొంగిలి నన్ను దెచ్చితివి తుచ్ఛపుఁ బల్కులు వల్కఁబాడియే.

సీ. కూకటిముడికినై కురులు గూడనినాఁడె
బెదరక తాటకఁ బీచమడఁచె
గాధేయుఁ డొనరించు క్రతువును రక్షింపఁ
బెక్కండ్రు దైత్యుల నుక్కణంచె
నవనిపై విలసిల్లు నఖిలరాజన్యులు
వ్రేలఁజూపఁగలేని విల్లు విఱిచె
ఘోరాటవులలోనఁ గ్రుమ్మరునప్పుడు
ఖరదూషణాది రాక్షసులఁ జంపెఁ

తే. బాదరజమున నొకరాయిఁ బడఁతిఁజేసె
లీల మాయామృగంబును గూలనేసె
రాజమాత్రుండె మేదినీ రక్షకుండు
రామభూపాలుఁ డాదినారాయణుండు.

తే. అట్టిరామున కీయబ్ధి యనఁగ నెంత
లంక యననెంత, దనుజులపొంక మెంత
నీవనఁగ నెంత, నీలావుచేవ యెంత
చెప్పనేటికి నీవ చూచెదవుగాక.

శా. వీరాలాపము లాడనేల వినుమీ విశ్వప్రకాశంబుగాఁ
బారావారము గట్టి రాఘవుఁడు కోపస్ఫూర్తి దీపింపఁగా
ఘోరాజిన్ నిను డాసి లావుకలిమిన్ గోటీరయుక్తంబుగాఁ
గ్రూరాస్త్రంబుల మస్తముల్ దునిమి భుక్తుల్ వెట్టు భూతాళికిన్.

శా. ఆరూఢ ప్రతిమాన విక్రమకళా హంకార తేజోనిధిన్
శ్రీరామున్ సుగుణాభిరాముఁ దెగడన్ జేకొన్న ని న్నాజిలో
దారన్‌దొంగిలితంచు నిష్ఠురగతిన్ దండించి ఖండింప ము
న్నీ రెట్లైనను దాఁటివచ్చు నలుకన్ నేఁడెల్లి శాంతింపుమా!

★ ★ ★

# కీర్తి - అపకీర్తి

"పుణ్యైర్యశోలభ్యతే" అని యభియుక్తులు వచించినను, అంతకన్న కీర్తి సంపాదనకు ఋజువర్తనమే ముఖ్యమని నేననుకొందును. పుణ్యముపరంపరాకారణమైనఁ గావచ్చునుగాని సాక్షాత్కారము మాత్రముకాఁజాలదు. ఇందుల కెన్నియో యుదాహరణములు సుప్రసిద్ధములు కలవు. రావణుఁడెంత తపశ్శాలియైనను, పరాక్రమ సంపన్నుఁడైనను, ఋజువర్తనగల రామునికి వచ్చిన కీర్తి వానికిరాలేదు. ఇట్లే సుయోధనునికిని. ఇఁక ప్రస్తుతము యువ సం॥ ఆషాఢమాస చంద్రికలో శ్రీయుత దువ్వూరి జగన్నాథశర్మగారు శ్రీ విజయనగర ప్రభువులచరిత్రను వ్రాయుచు బొబ్బిలి యుద్ధసందర్భమున అప్పటి శ్రీ విజయనగర ప్రభువొనర్చిన కార్యమును సమర్థింప వలయునని కొంత ప్రయత్నించిరి. బొబ్బిలివారు వీరికాగ్రహమురాఁదగు చెడ్డపనులంతకుమున్నెన్నో చేసినట్లుదాహరించిరి. తుదకు తాంద్ర పాపయ్యగారు మహారాజును వధించుటను గూడ నుదాహరించి, అది యొక పౌరుషము గాదని వక్కాణించిరి. శ్రీ శర్మగారు వ్రాసిన ప్రతివాక్యమును నేను శిరసావహించువాఁడనే యైనను ఈ క్రింది మాటలు వ్రాయుచున్నాఁడను. శ్రీ మహారాజావారికిని, బొబ్బిలివారికిని ఎస్టేటు విషయముననేమి యితర విషయములయందేమి హస్తిమశకాంతరమన్నను కాదనువారుండరు. కాని యీ హెచ్చుతగ్గువల్లనే బొబ్బిలివారి కీర్తికి వన్నెయు, మహారాజావారి కీర్తికి కళంకమును విస్తరించుచున్నవి. ఎక్కుడు సేనయు రాజ్యమును గల శ్రీ మహారాజులుంగారు, ఫ్రెంచి సైన్యమును, పైగా తురుష్క సైన్యమును సాయముగాఁగొనుట, పిరికితనమునకు స్ఫోరకము. సమయము కాని సమయమున దండెత్తివచ్చుట కూడ డిటో. బొబ్బిలివారెన్ని విధముల సామోపాయము నవలంబించినను దానికి నంగీకరింపమి కూడ డిటో. బుస్సీ రక్షింపనెంచిన పసిబాలుని వధింపవలయునని నిర్ణయించుటయు డిటో. ఇంకను ఇట్టి హేతువులు బోలెడు కలవు. అన్నియు జగత్ర్ప సిద్ధములే. కాన విస్తరింపనక్కరలేదు. బొబ్బిలికథ వ్రాసిన యతఁడు బొబ్బిలివారివలన ధనముగొనిగాని వ్రాసియుండఁడు. మరల బొబ్బిలికి నామ రూపములు చాల వత్సరములకు పిమ్మటఁగాని రాలేదనుట చరిత్రప్రసిద్ధమే. ఈ కథయో! యుద్ధముజరిగిన కొలఁదినాళ్లలోనే అనఁగా- ఆవేఁడి చల్లారక పూర్వమే రచింపఁబడి యుండుననుట యుక్తియుక్తము. కావున నిది యొకరి ప్రేరణమునఁగాని, ధనముగొనిగాని రచింపఁబడి యుండదు. కొందఱు

కవులట్లు రచించిన చరిత్రములు లేకపోలేదు. గాని కొందఱు తమంతటఁదాము స్వతంత్రించి వ్రాసిన కవులు లేకపోలేదు. "ఘనమతు లెల్లవారికి నకారణబంధులుగారె! సత్కవుల్". భారతరామాయణాదులిట్టి రచనలే. ఆయాచరిత్రలలో నచ్చటచ్చట నతిశయోక్తి వర్ణనలున్నట్లే ప్రకృతకథయందును అయ్యవి లేకపోలేదు. కాని ప్రధానాంశమునందట్టిది లేదని యెల్లరును విశ్వసించిరి.

ప్రధానాంశమనఁగా, బొబ్బిలికిని, విజయనగరమునకును యుద్ధము జరిగినది. ఇందులకు కారణము తమకన్న మిన్నయు అప్పటి కాలములో మహారాజై తమవంటివారి ననేకులను సామంతులుగాఁ జేసుకొని యేలుచున్న విజయనగర ప్రభువును బొబ్బిలి లక్ష్యపెట్టకుంటయే. సదరు యుద్ధములో బొబ్బిలి నాశనమైనది. విజయనగరము గెల్చినది, కాని "అత్యుత్కటైః పుణ్యపాపైః" అనురీతిని మహారాజు తాండ్ర పాపయ్యగారిచే మడియుటచే విజయనగరపు విజయముకన్న బొబ్బిలి పరాజయమే కవి గేయమైనది అనునది. ప్రస్తుత నాటకములుగాని, వెనుకటి ప్రబంధములుగాని యీ ప్రధానాంశమును బురస్కరించుకొనియే బయలుదేరినవి. శ్రీ శర్మగారికింబలె విజయనగరము నెడల నాకు మిక్కిలి యభిమానము. ఈ విషయము - "అల పతంజలి కృతంబైన భాష్యమునకే పరిధవిల్లును మహాభాష్యపదము" అను సీసములోని యంశముల వలననే లోకము గుఱితించును. పైఁగా నిన్న మొన్నఁ బ్రకటింపఁబడిన నాజాతకచర్యలో - "రాజనఁగ నాతఁడే, మంత్రిరాట్టనంగ నాతఁడే" అనుపద్యమును గూడ శ్రీ శర్మగారు తిలకింతురుగాక. ఇట్టి యభిమానముగల నానోటనే ఆమధ్య బొబ్బిలికి వెళ్లినప్పుడు చరిత్రకు సంబంధించిన విషయమును బురస్కరించుకొని "మ॥ వెలమల్ రాజులకన్న మిన్నలను నవ్విఖ్యాతి కిందావుగా వెలసెన్ బొబ్బిలి" అని నుడువవలసి వచ్చినది. శర్మగారీ వ్రాఁత యెడల నెట్టి యభిప్రాయమిత్తురో! చూడవలెను. ఈ యుద్ధకాలము వఱకును వెలమవారు శూరులలో నొకరుగానున్నను, అగ్రేసరులని అందులో క్షత్రియుల కన్న మిన్నలనిపించుకొనుచున్నట్లు లేదు. ఈ విజయనగర ప్రభువే వారికీర్తికి వన్నెవెట్టినట్లు నాకుఁదోఁచినది. నేను బొబ్బిలివారిచే సమ్మానింపఁ బడవలయునను కోరికతో నట్లువ్రాయలేదు. విజయనగరము వారును నన్ను సమ్మానించిరి. కావున చరిత్రమునుబట్టి నాకు స్ఫురించినట్లు వ్రాసితినేకాని, ప్రయోజనాపేక్షచేఁగాదని మనవి చేయుచున్నాను. మఱియు బొబ్బిలి పట్టాభిషేకము వ్రాయుచు, అందీయుద్ధప్రసక్తి రాఁగా-

ఉ. "... ... ... రాతికంబ మొకఁ డెత్తయినట్టిది చూడనయ్యెడిన్."

చ. అది గనుఁగొన్నమాత్ర విజయావనిపాలుని దుర్నయంబు దు
ర్మదులు పరాసుసైన్యములరాయిడి, దుష్టతురుష్క సైన్యరా
డదయత, వెల్మశూరులనయాంచిత బాహుపరాక్రమస్ఫుర
త్కదనము నొక్క పెట్టునను కన్నులఁగట్టినయట్లు వ్రేలెడిన్"

అని నుడివితిని, ఈ వ్రాఁత నాకు ఆ స్థలము చూచుటవలనఁ గల్గిన యభిప్రాయమును బట్టి వ్రాసినదేకాని, యొకరిని సంతోషపెట్టుటకుఁ గాదు. నాకొక నియమము కలదు.

ఉ. ఆవల నెవ్వఁడేని కవి యల్లిన పద్యములం బఠించుచో
నీవిధమెల్ల నిశ్చయమ; యీ నుతికిన్ దగు నీతఁడంచు సం
భావనగల్గఁగావలయు భావమటుల్ పొడగట్టకున్న నా
దేవురుగొట్టు పద్దెముల దీవనలేమిటి కప్పరాట్ప్రభూ!

నా నియమము పై పద్యమువలనఁ దెలియఁగలదని యుదాహరించితిని. ఏకొంచెమో ఆధారములేని వ్రాఁతను వ్రాయుటకు, కవులెవ్వరును ఇష్టపడరు. అందులో చరిత్ర విషయమున బొత్తిగా నిష్టపడరు. ఏదో కొంచెమున్నచోఁ గొందఱు మిక్కిలి పెంచి వ్రాయుదురు. కొందఱు సామాన్యముగా పెంచి వ్రాయుదురు. బొబ్బిలికథవలెనే వేఱొకరు విజయ నగరపుకథ అనుపేరుతో నేలవ్రాయలేదో మనమాలోచించుకోవలెను. పేరేది పెట్టినను బొబ్బిలివారినే పైకెక్కింపవలయుననియే నేననుకొందును. కొన్నిలోపములున్నను తరువాతి కవులకు జంగముకథలోని యంశములే మార్గప్రదర్శకములైన వనుకొందును. ఈ రెండుసంస్థానములకును గలపూర్వవైర కారణములను గూడ నేఁటి నాటకగ్రంథకర్త లుదాహరించినను తుదకు బొబ్బిలివారి కుత్కర్షమును, వేఱొకరి కపకర్షమును వ్రాయకతప్పదు. కావున శ్రీశర్మగారి యీక్రింది వాక్యమునకు సమంజసమైన యర్థము నాకు స్ఫురింపదయ్యె. ఆవాక్యమిదియే-

"పైనుదాహరించిన శాత్రవ బీజములను వినాయించి, ఉత్తరకథను కేవల వధాపూర్వకమైన దానిని నాటకముగారచించి ప్రదర్శించుట చారిత్రక సత్యము లేనిపనియనియు, నాటకలక్షణము తెలిసిన విబుధులాక్షేపింపఁదగిన పనియనియుఁగాఁ జెప్పవలెను." మఱియు నాటకకర్తలకు "అన్యథావాప్రకల్పయేత్" అనునొక యాధారము కలదు. అది నాయకుని యందేదేని లోపమున్నచో బహుసుగుణములుగల నాయకుని యందలి యాస్వల్పలోపమును అన్యథాగామార్పుచేసి సవరించుట కుపకరించును. ప్రస్తుత మీ బొబ్బిలికథను నాటకమునకుఁ గైకొన్నకవి విజయనగర ప్రభువును ప్రధాన

నాయకునిగాఁ గైకొనుటయే తటస్థింపదుగాన మార్పున కవకాశమేలేదు. కావున నాటకకర్తల కీయాక్షేపణ తగులదు. శర్మగారింకొక వాక్యము నీసందర్భములో వ్రాసియున్నారు. అదియిది -

"... ... ... తాండ్ర పాపయ్య యను వెలమసేవకుఁడొకఁడు దొంగపోటున పొడిచిన ఖూనీకథను మహావీరలక్షణముగల నాటకముగా బ్రదర్శింప బూనుట... ఆంధ్రదేశమందలి నాటకరంగ మరణవార్తగా విబుధులు తలంపవలసియుండును."

ఈ వాక్యము కూడ నాకునచ్చలేదు. వెలమసేవకుఁడు, అనివ్రాయుటకూడ సమంజసముగాలేదు. కర్మధారయసమాసమో? తత్పురుషమో? అను సందియము కల్గునట్లు వ్రాయుటయుక్తముగాదు. తాండ్రపాపయ్యగారి నింతకన్న గౌరవముగా వ్రాయుట యొప్పని నేననుకొంద్దును. శూరుఁడను పేరు వంశప్రతిష్ఠనుబట్టి వచ్చెడిదికాదు. ఇఁక దొంగపోటును గూర్చి యతని నిందింపవలెను. కాని అప్పుడంతకన్న నయ్యనమున కవకాశములేదు. "అశ్వత్థామవలె" పాపయ్యగారును కొంతవఱకు సమ్మానార్హులే. ఒకటిమాత్రమున్నది. విజయనగర ప్రభువు సల్పిన యుద్ధము సర్వవిధముల నిర్దుష్టమై న్యాయబద్ధమై యున్నచో, అట్టి ధర్మవీరు నిట్లువధించిన పాపయ్యగారు నింద్యులైన నగుదురు గాని అన్యథాగా పాపయ్యగారు నింద్యులుగారు. ఆయనకు నాయకత్వమును కల్పించిన నాటకకర్తలును నింద్యులుకారని నేననుకొందును. నేనీ బొబ్బిలి చరిత్రను నాటకముగాఁగాని, ప్రబంధముగాఁగాని వ్రాసిన నేఁటికవులలోఁ జేరినవాఁడను గాకున్నను, శర్మగారువ్రాసిన - "విబుధు లాక్షేపింపవలసినపని" "నాటకరంగ మరణవార్తగా విబుధులు తలంపవలసి యుండును." అనెడి వాక్యద్వయము ప్రేరేపించుటచే నించుకనాకుఁ దోఁచినది వ్రాసితిని. ఇఁక నొకటి, నేను బొబ్బిలి పట్టాభిషేకమును వ్రాసియుండుటచే నీవ్రాఁతకు నది నిమిత్తము కావచ్చునని చదువరు లూహింతురేమో? నేవ్రాసిన చరిత్రకును, ప్రస్తుత యుద్ధమునకును సంబంధములేదు. అందుఁ బ్రసక్తాను ప్రసక్తముగా దొరలిన పద్యములలో నొకటి యుదాహరించియేయుంటిని. ఆఘట్టములోని మఱికొన్ని పద్యములుగూడ నుదాహరించి దీనిని ముగించు చున్నాఁడను.

ఉ. ఇప్పటి బొబ్బిలిం గుఱిచియే యిపుడించుక చర్చఁజేసి నేఁ
జెప్పితివెన్క బొబ్బిలి విశేషములన్ దిలకింప నొక్క నాఁ
డప్పురి తూర్పునందు నొకయర్ధపుఁగ్రోశముఁ బోయినార మం
దిప్పుడు రాతికంబ మొకఁడెత్తయినట్టిది చూడనయ్యెడిన్.

క. వెనుకటి యుద్ధమునకుఁ జెం
దిన ముఖ్యాంశములుదానఁ దేట తెనుఁగుబా
సను వ్రాయఁబడినవున్నవి
మొనమొన్ననె జ్ఞాపకార్థము నిలిపిరిదియున్.

తే. గీ. దాని నిల్పినయట్టిభూజాని నేఁటి
తేనికిఁ బితామహుండు విజ్ఞానఘనుఁడు
అంతటి ప్రయోజకుండు ధరాధిపతుల
యందు నెందులేఁడని చెప్పవిందుమెందు.

ఉ. బొబ్బిలివారికిన్ మిగులఁ బొంపిరి వోవు యశమ్మునిచ్చి, పే
రబ్బురమున్ ఘటించు నలయల్లడి యుద్ధము కారణమ్ముగాఁ
బ్రబ్బినక స్తి నన్నగరి పాడతి జాడతి కాదువారియున్
దిబ్బగమాతియున్ బ్రథిత దృశ్యములందొక దృశ్యమై తగెన్.

శా. వీరక్షేత్రమటన్న పేరుగనుటన్ విశ్వస్తుతిం బొల్చుటన్
శూరశ్రేష్ఠుల సచ్చరిత్రములచే స్తుత్యర్హ మౌటన్ సమి
ద్ధీరాగ్రేసరులైన వెల్మల యస్పృక్తేజంబుచే నానుటన్
శ్రీరంజిల్లనితత్ప్రదేశ మఖిల ప్రేమాస్మదం బయ్యెడిన్.

ఆయా పద్యములవలన నా హృదయము చదువరులకు గోచరింపక మానదు. ఇఁక నొకటి. తాండ్రపాపయ్యగారిచేఁతకును అశ్వత్థామచేఁతకును గొంతపోలిక కలదుగాని బాగుగఁ బరిశీలించినచో ధర్మాత్ములగు పాండవుల వధింపనేగి యెఱిఁగియో యెఱుఁగకో తాననుకొన్నపనిని నిర్వర్తింపనేరక తత్పుత్రుల వధించిన యశ్వత్థామతో, తాననుకొన్నపని ననుకొన్నట్లే నిర్వర్తించిన పాపయ్యగారిని బోల్చుట కొంత తప్పేయగునేమో! యని కొంకుచు– “గుణాఃపూజాస్థానమ్” అను నభియుక్తోక్తిని స్మరించుచు దీనిని ముగించెదను.

★ ★ ★

# కవికన్న విమర్శకుఁడికి జాగరూకత ఎక్కువగా ఉండాలి

కవి, విమర్శకుఁడు- యీ యిద్దఱికి చాలా సంబంధం అనాదిగా వస్తూవుంది. ఇప్పటిరోజుల్లో పడమటిగాలి తగలడంవల్ల యీ సంబంధం మఱీ కనఁబడుతూవుంది. విమర్శకుఁడికీ, వ్యాఖ్యాతకీ ఆట్టేభేదం కనపడదుగాని యిటీవల పడమటిగాలి సోఁకేక మాత్రం విశేషభేదం కనపడుతూనే వుంది. వ్యాఖ్యాత శాయశక్తులా తంటాలుపడి కవిని సమర్థించడం ఆచారం. పూర్వకాలపు విమర్శకులుకూడా యించుమించు ఆలాగే వుండేవారు. అయితే యేదేనా వ్యక్తిగతమైన దురుద్దేశం వుండి విమర్శించేటప్పుడు మాత్రం పైరీతికి కొంత వ్యతిరేకంగా ప్రవర్తించడం వుండేది. దీని కుదాహరణంగా పండితరాయలు అప్పయ్య దీక్షితులవారి గ్రంథాలనీ, భట్టోజీ దీక్షితుల గ్రంథాలనీ విమర్శించిన ఫక్కీని చూపవచ్చును.

యిప్పటి విమర్శకులలో ప్రాజ్ఞులైన వారివిధానంచూస్తే వ్యక్తిగతంగా దూషణ లేశమున్నూ కనపడదుగాని అసలు కవియుద్దేశాన్ని కనిపెట్టకుండా తోచినట్లల్లా విమర్శించి మహాకవుల పోకడల్ని యీసడించడం విస్తారంగా కనపడుతుంది. యిందులకు కళాపూర్ణోదయపు విమర్శనం వగయిరా లుదాహరణం. కళాపూర్ణోదయంకవి నేటివాడుకాడు కాబట్టి విమర్శకునకున్నూ, ఆయనకున్నూ వ్యక్తిగతమైన మైత్రినిగాని, ద్వేషాన్నిగాని ఆరోపించడానికి లేశమున్నూ అవకాశంవుండదు. కేవలం కవితా నిష్ఠమైన గుణాలూ, అవగుణాలుమాత్రమే యీ విమర్శకులకు ఆధారం. అయితే వెనుకటి విమర్శకులకేమి, వ్యాఖ్యాతలకేమి, చట్టన పూర్వమహాకవులను కాదనడానికి సాహసంవుండేదికాదు. యిప్పటివారికట్లాకాదు. యెంతటి మహాకవినైనా సరే తోటకూరలో పురుగులాగా తీసిపాఱేయడ్డానికి సాహసం కలిగి వుంటూవుంది. యిది యుక్తమైనా, అయుక్తమైనా యిప్పటివారిలో బాగా వ్యాపించిఉన్నవిశేషం.

యిఁక అధునాతనుల కవిత్వాన్ని అధునాతనులు విమర్శించవలసి వస్తే వారికీ, వారికీ యేదో వ్యక్తిగతమైన విరోధం వున్నదన్నమాటే. చూడండీ పాపము. యెంత అన్యాయమోను! వకాయన వకరి ప్రేరేపణ మీద వక పెద్ద మహాపండితుణ్ణి విమర్శిస్తూ,

ఆ విమర్శించే పుస్తకం తనకు పెంటమీదకాబోలును దొరికిందని వ్రాశారు. దానివల్లకూడా కొంత నైచ్యం కలగాలనే ఆయన ఉద్దేశం. అంతతోకూడా తృప్తినొందక గ్రంథకర్త దిద్దుకున్న దిద్దుబాటు నొకదాన్నెత్తికొని, ఆ దిద్దుబాటు అసలాయనకు తోచి చేసినది కాదనిన్నీ, అది యెవరో చెప్పినమీదట తోచిందనిన్నీ కూడా వ్రాశారు. యేమనుకోవాలో ఆయన వుదారత్వాన్ని! సహజగుణం.

యింకొక విషయం మనం గమనించాలి. కవికి దేవుడిచ్చివున్నంత తెల్వితేటలతో మంచో, చెడ్డో – రసమో, అరసమో, గిలకడం తప్పనిసరి. యెందుచేతనంటారా, వాడి కది సహజగుణం కనక. "సహజగుణమేరికేని దుస్త్యజము" కదా! అందుచేత కవిని "నీవెందుకు కవిత్వం చెబుతావు నీకు అది తెలియదు. ఇది తెలియదు" అని మందలించడానికి వల్లకాదు. వ్రాయగా వ్రాయగా యెక్కడో కొద్దో గొప్పో గుణంఉంటే వుండవచ్చు లేకపోతే లేకపోతుంది. "యెవడి పిచ్చి వాడి కానందం" గదా? అందుచేత యేదో రాసుకోవడం వారికితప్పదు. అయితే వాడికేలారాసుకోవడం తప్పదో వీడికల్లాగే విమర్శించడమున్నూ తప్పదనడానికి వీలులేదు. వీడికిది సహజగుణంకాదు. తెచ్చిపెట్టు కొన్నది. "కవులుపుట్టుదురుగాని చేయబడరు" అన్నట్లు విమర్శకులనుగూర్చి అభియుక్తోక్తిలేదు. అందుచేత వాడికీ, వీడికీ యీవిషయంలో పోలిక సహృదయసమ్మతం కాదు. చెప్పే మాటేమిటంటే, కవికన్న విమర్శకుఁడికి జాగరూకతయెక్కువగా ఉండాలనే. సహజమైన కవిత్వధారవుండి యితరసామగ్రిలేకపోతే కవికి చాలా దోషాలుతటస్థిస్తాయి. విమర్శకుఁడి విమర్శనలోకూడా అలావుండకూడదు. యెక్కడో, వకటీ అలావుంటే యేమోకాని అంతకంటే అధికంగావుంటే విమర్శకుణ్ణి పాఠకలోకం క్షమించదనుకుంటాను. యెందుచేతనంటే "తీరి కూర్చున్నమంగలి పిల్లితలగొటిగే" డన్నట్టు యితనికీ పరిశ్రమ యెందుకంటూ లోకులు గర్హిస్తారని నావూహ. కారణం యిదివఱకే వ్రాశాను. అయినా మళ్లా వ్రాస్తాను.

కవికి కవిత్వంచెప్పుకోవడం తప్పదు. చెప్పద మనక చెప్పుకోవడమన్నాను. చూచారా కేవలం తనకుమాత్రమే వుపయోగించినా అతని రచనకు వైయర్థ్యంలేదనివాడు సంతోషపడ వచ్చును. విమర్శకుఁడి విషయమట్టిదికాదు. లోకం చూచికూడా వప్పుకోవాలి. విమర్శనం అలావుండకపోతే "వాణ్ణి వెక్కిరించబోయినందుకు మంచిపని జరిగిం"దని లోకులు విమర్శకుఁడికి జరిగినపరాభవానికి సంతోషిస్తారు. కవితప్పులని విమర్శకుఁడెన్ని చూపిస్తాడో, అవతలివాడు తిరగబడ్డప్పుడు అన్నింటినీ నిలుపుకోవాలి. వకటి నిల్పుకోలేక పోయినా విమర్శకుఁడికి అది మహాపరాధమే అవుతుంది. నన్నడిగితిరా, వకమాటచెప్తాను. వెక్కిరించగూడదు.

తనంతట దానై వకణ్ణి వెక్కిరించడానికి యెవడున్నూ తలపెట్టనే కూడదు. తనమీద కెవడేనావస్తే అప్పుడు వాడాక్షేపించిన అక్షేపణలకు సమాధానాలు వ్రాయడాని కెవరున్నూ గర్హించరు. యీచెప్పేసమాధానాలు నిలుస్తాయా పరమసంతోషం; నిలకవపోతాయా, అప్పుడుకూడా వీణ్ణంతగా లోకులు నిందించరు. వీలైనంతలో ఆత్మరక్షణానికి ప్రయత్నించడం ప్రతివానికిన్నీ విధి. దానిలో కృతార్థత్వం కలిగితే కలుగుతుంది. లేకపోతే లేదు. దానికెవ్వరున్నూ ఆక్షేపించరు. పనిలేనిపాటగా వకరిని వెక్కిరించడానికి మొదలెట్టి బోల్తాపడితేమాత్రం "చచ్చినచా" వన్నట్లవకమానదు. కాబట్టి నిజమైన విమర్శకులను గూర్చికాదు. గాని విమర్శకాపశదులైన వాళ్లనుగూర్చి "వెఱ్ఱినాయనలారా! మీరెవళ్లని వెక్కిరించినా జాగ్రత్తగా వెక్కిరించండి నూఱు వెక్కిరించాం కదా, అందులో వకటేనా నిలవదా అని మాత్రం పెట్టుకోకండి, మీ వెక్కిరింపులలో యేవకటి గాని అఱగాని, పాతికగాని, పేలిపోయినా, అది మీకు పూర్తిగా అవమానాన్ని కలిగించేదే అని తెలుసుకోండి" అని బోధించి గాఢంగా మందలించవలసివుంది. యింతమాత్రానికి వాళ్లు వెనక తగ్గుతారా అంటారా అదివేఱు. మన కృత్యం మనం చేసుకుంటే తరవాత యేమైనా మనకు చింతవుండదు.

"కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన" కదా? మొత్తం తేలినసారం, కవిని వారించడానికి వల్లకాదు గాని, విమర్శకుణ్ణి వారించడానికి అవకాశంవుందన్నది. ముఖ్యాంశం యిదే అయినా యేదో కొంత దీనికి సంబంధించిన యితరాంశం రాయడంచేత గ్రంథం పెరిగింది.

అయితే యేలాంటి చేతకానివాడైనా విమర్శకుఁడంటూ వకడుండటంవల్ల చాలా లోకానికి ప్రయోజనంఉంటుందని కొందఱంటారు. కొంతవఱకు యిదిన్నీ సత్యమే. యేమంటారా? "నాపృష్టః కస్యచిద్బ్రూయాత్" కనుక యేపిచ్చి ప్రశ్నో బయలుదేరితేనేకాని సమాధానం చెప్పవలసి రానేరాదుగా? అవును. అయినప్పటికీ "ప్రతి చిగిలింత మొక్కా చింతచెట్టుతో ఢీకొం" దన్నట్లుండరా దా విమర్శనాలు. యిప్పుడల్లాటి విమర్శన లెన్నో కనబడతాయి. యిందులో కొందఱు యెలాగయితేయేం, మనపేరు పేపరెక్కి ప్రకాశిస్తుంది గదా అని సంతోషించే తరగతివాళ్లే. యేవకళ్లిద్దఱోతప్ప యిప్పుడందఱూ యీతెగలోకే చేరతారని నానిశ్చితాభిప్రాయం. కవిత్వం పిచ్చివంటిది.

విస్తారంగా వ్రాయడ మెందుకుగాని, కవిత్వం చెప్పకపోతే చెప్పేవాణ్ణి అది బాధిస్తుందిగాని, విమర్శనమాత్రం అట్టిదిగాదు. బాగా ఆలోచిస్తే కవిత్వం వక పిచ్చివంటిదనుకొంటాను. పిచ్చివంటిదీకాదు, యేలాంటిదో చెప్పడానికి నాకు

బాగాతోచడంలేదు. భవభూతి వకసందర్భంలో యేమీచెప్పడానికి పాలుపోకే కాబోలు, ఆత్మైక గోచరమైన విషయం అనడానికి బదులు "జ్వరోవా మూర్ఛావా కిము విషవిసర్పః కిముమదః" అని వూరుకున్నాడు. అలాగే కవిత్వాన్ని దేనితో పోల్చాలో నాకు నిష్కర్షగా తేలడంలేదు.

ప్రయత్నపూర్వకంగా వ్రాసేకవిత్వాన్ని గూర్చి నేను వ్రాయలేను గాని, దానంతటది తోచేదాన్ని గూర్చి కొంచెం వ్రాస్తాను. అది తోచినప్పుడు దాన్ని కాగితంమీదెక్కించేదాకా చాలాబాధగా వుంటుంది. యీవిషయాన్ని గుఱించి నేచదివి చూచినంతలో యేకవీ నిర్వచనంచేసినట్టులేదు గాని కుట్టికవి కొంచెం సూచించాడు. "అర్థాశ్శబ్దచయా స్సదాహ మహమిత్యగ్రేస్ఫురంతి" అన్నాడు. అని వూరుకొన్నాడా, మళ్లా యిల్లాఅన్నాడు : "స్వీకుర్యాంకమివత్యజామికమివ శ్రీమన్ లులాయ ప్రభో" అంటేయేమిటంటే ఆగ్రంథకర్తకు దున్నపోతుమీద కవిత్వంచెప్పవలసిన అవసరం కలిగింది. ఆపట్లాన్ని మొదలెట్టేడు, ఆ కల్పనలకు మితే కనబడకపోయింది కాబోలును, దానిమీద పైసందర్భాన్ని ఆవాక్యాలతో ప్రకటించాడు. వూరికే తండోపతండాలుగా, సముద్రపుతరంగాలుగా, అర్థాలూ, శబ్దాలువచ్చి మెదడులో నాట్యంచేస్తూండేటప్పటికి వాట్లల్లో దేన్ని స్వీకరించేది, దేన్ని వదలిపెట్టేది అంటాడు పాపం ఆ కుట్టికవి. ఆ సమయంలో ఆ మహాకవి కేలావుందో యెవరికి తెలుస్తుంది! అతనికే తెలియాలి.

అందుచేతనేకాబోలు మాముత్తాత నరసన్నగారు "కవితాచమత్కార గౌరవంబు మనసెఱుంగునుగాక నెవ్వనితరంబు" అన్నారు. అవును, వక బంగారుగనో, వజ్రాలగనో వక పేదకు దొరికిందనుకోండి. ఆపదార్థాలని త్వరలో యింటికి అసహాయంగా తెచ్చుకోవాలంటే యేలావుంటుందో ఆలోచించండి. ప్రస్తుత శబ్దార్థవిషయంకూడా ఆలాంటిదే అనుకుంటాను. కుట్టికవిగారి అనుభవానికిన్నీ, నాఅనుభవానికిన్నీ పోలికవున్నట్టు తోచడం చేత ఆయన వాక్యాలుదాహరించి యింతవ్యాఖ్యానంచేశాను. అందఱిదిన్నీ యిట్లే ఉంటుందని నేను నిశ్చయింపజాలను. నా అనుభవములో కవిత్వం అనేది తోచకనేపోవాలి గాని తోచినతర్వాత దాన్ని కాగితంమీద కెక్కించకపోతే అది వ్యాధినికూడా కలిగించి శరీరానికి అపాటవం తెస్తుందనే నమ్మకం. అందుచేతనే దీన్ని నేను "ఫారిన్‌మేటరు"గా రూపిస్తూ వచ్చాను. బాధిస్తూంటుంది తోచినకవిత్వాన్ని వ్రాయకపోతే అన్నమాటమీద జ్ఞాపకంవచ్చింది. వక జ్యోతిష్యుడున్నాడు మా ప్రాంతంలో. ఆయన జాతకభావంలో కొంత ప్రవేశం కలవాడు. ఆయనకి జాతకం చేతికిస్తే చూచి యేవేనా అరిష్టాలు కనబడితే వాట్లకి శాంతిచేసుకొమ్మని చెప్పడం కలదు. చెప్పినప్రకారం అవతలివాళ్లు శాంతి చేసుకుంటే

సరేసరి. ఆలా చేసుకోకపోయినట్లయితే ఆ అరిష్టకారక గ్రహాలు తనమీదకొచ్చి, తన్నేమోబాధిస్తాయంటూ చెప్పగా నేను స్వయంగా విని ఆయన్ని చేదస్తబ్రాహ్మడనుకున్నాను. అట్లే నేను వ్రాసిన ప్రస్తుతపు వ్రాతనుబట్టి నన్ను కూడా కొందఱు చదువరులనుకుంటారేమో? అనుకున్నాసరే, నా అనుభవాన్ని నేను వ్రాశాను.

కవికిన్నీ, విమర్శకుఁడికిన్నీ వుండే భేదాన్ని నాకు తెలిసినంతలో నిరూపించాను. యెంతవ్రాసినా యింతే. కవికి కవిత్వంసహజం కనుక లోకులేమనుకొన్నా యేదో గిలకడం వానికి తప్పనిసరి. విమర్శకుఁడికో, పనిలేనిపాటుగా కల్పించుకొనేపని గనుక సహజమైన ఆవేశంలోకి చేరదు. అందుచేత వాణ్ణి క్షమించనట్లు వీణ్ణి క్షమించకూడదన్నది ముఖ్యాంశం.

★ ★ ★

# వెక్కిరింపఁబోయి బోల్తాపడుట

పైసామెతను అసంగతముగా నుదాహరించుచు నన్ను మిక్కిలిగా వెక్కిరించుచు, పిలువని పేరంటముగా, పనిలేని పాటగా, ఓలేటి - కాదు, వోలేటి సుబ్బారాయ శాస్త్రులవారు గతమాసపు భారతీసంచికలో- "ప్రభావతీప్రద్యుమ్నము" అనుశీర్షికతో నొకవ్యాసమును ప్రకటించినారఁట! ఇదివఱలో భారతి నాకును వచ్చెడిది కాని నేనెన్నఁడుగాని యేవ్యాసమును పంపలేని కారణముననఁగాఁబోలును సుమారువత్సరము నుండి యదివచ్చుటలేదు. అందుచే దానిని నేను జూడలేదు. ఏమి తోఁచినదో, ప్రస్తుతము మద్రాసునివాసి, పురాణం సూర్యనారాయణ తీర్థులుగారు నాకు సంబంధించిన వ్యాసభాగమును పంపిరి. పత్రికవారికిఁ దోఁచలేదు గాని, తక్కినవి పంపకున్నను ఈ సంచికనేని వారే పంపవలసినది. అది యటులుండె, ఎట్లయిన నేమి? వ్యాసము చేరినదిగదా! చేరుఁగాక, చదివికొనుశక్తి యుండ వలయునుగదా! రెండు సంవత్సరముల నుండి నేను మిక్కిలి యనారోగ్యముగ నున్న సంగతి యెఱుఁగనివా రెవరు? అట్లగుటచే చదివించి విని, అవగాహన చేసికోవలసి వచ్చినది. తేలిన సారాంశము-

"పూర్వోత్తర విరోధముగా గ్రంథము వ్రాసి పాడుచేసినా రనునదియే." అది ప్రధానము. వెక్కిరింపులు, టక్కులు టమారాలు. ఇవితో వాసములు. ముసలివాళ్లను కుఱ్ఱలు వెక్కిరించుటలో తప్పేమి? అది యటులుండె. విమర్శకులు తమరెత్తుకొన్న యంశమును స్థిరపఱచుటకై- గ్రంథకర్త వజ్రనాభుని మనుమలు ముగ్గురనియొకట, నల్వురని వెఱొకటవ్రాసి, తప్పొప్పుల పట్టికలో సవరణను చూపెను గాని ఆ సవరణ వచనములలో లగించును గాని పద్యములలో లగింపదని కొంత గ్రంథము వ్రాసి తుదకాపద్యములలో సవరింప వీలగునని మూడునాల్గుగా స్వయముగా సవరించుకొని పిమ్మట,

> "ఈమూఁగురు జామాతల
> కామూఁగురు పుత్రకులు మహాబలశాలుల్."

అనుపద్యము నుదాహరించి యిందు మూఁగురు నలుగురుగా సవరింపవల నుబడదని మిక్కిలి చింతించిరి శాస్త్రులవారు. తుదకు పూర్వోత్తర గ్రంథ విరోధమును

జూపించినట్లు దృఢనిశ్చయులై శాస్త్రులవారు- "పూర్వోత్తరవిరోధ మొదవకుండఁ; బలుక నేర్చుట బహుతపః ఫలముగాదె?" అని యుదాహరించి అట్టి తపఃఫలము లేని వేంకటశాస్త్రిగారు ఇట్టి గ్రంథరచనకు దిగరాదని తమ యాశయ మన్నట్లు తేల్చినారు. ఇట్లు తేల్చి- శాస్త్రులుగారు "ఈమూఁగురు జామాతల" అను కందపద్యమును, అప్రాంతమందలి వచనములను పరిశీలింపలేదేమో?" అని యొకవాక్యమువ్రాసి, "ద్వితీయ ముద్రణమునందైను జూడకపోవుట చాలయాశ్చర్యము" అని మిక్కిలిగా అక్కజపడినారు. అక్కజపడి యంతతోఁగూడ విరమింపనేలేదు; ఇంకను గొంతగ్రంథము పెంచి యీ పూర్వోత్తరవిరోధము కుదురదని తేల్చిరి. ఒకటిరెండు మాటలలోఁ దేల్పవలసిన యంశమున కింత గ్రంథము పెంచుటేలొకో యని నే నక్కజ పడుచున్నాను. విమర్శకులగు వోలేటి శాస్త్రులవారో? "ద్వితీయ ముద్రణమునందైనను జూడక పోవుట చాల యాశ్చర్యము" అని ముక్కుపై వ్రేలిడికొనుచున్నారు.

ఇది యిటులుండె, యీ నాటకము మొదట శ్రీచెలికాని లచ్చారావు గారు తమ యాజమాన్యమునఁ బ్రకటించు పత్రికయందు ప్రకటించుట కారంభించినారు. ప్రథమాంకము ముగియకుండఁగనే, తిరుపతిశాస్త్రిగారు స్వర్గతులైనారు. నన్ను నప్రయత్నముగ రప్పించి నాకు నెలకు 25 రు. చొ. గౌరవవేతన మేర్పఱచి బహూకరించి పిమ్మట దీనిని పూర్తిచేసి యీవలసినదని కోరిరి. నాకప్పటికిఁ జిరకాలమునాఁడే దేహమున- ముఖ్యముగా శిరస్సునందు- భ్రమణ మేర్పడియుంటచే కవిత్వరచనమన్న భీతి యుదయించినది. కాని శ్రీలచ్చారావుగారి సమ్మానము నన్ను వశీకృతుఁగాఁ జేసినది. "అర్థస్య పురుషో దాసః"

ప్రసక్తానుప్రసక్తముగా నింతవ్రాసితినేకాని యిది ప్రస్తుతవిరోధ సమర్థన కుపకరింపఁజేయు తలంపుతోఁ గాదు. సుబ్బారాయశాస్త్రులవారికి మాయందు దయలేకపోయినది గాని అదియే యున్నచో ఆయన కంత వ్యాసము వ్రాయవలసియే యుండదు. మేమిన్ని వాక్యములు వ్రాయవలసియునుండదు. దయ యనఁగా నెట్టిదందురా? ఇట్టిది. కష్టపడి రెండుముద్రణములు సుబ్బారాయశాస్త్రులవారు చిత్తగించే యున్నారుకదా! ఇటీవల షష్టిపూర్తిసందర్భములో మరల గ్రంథములన్నియు ముద్రింపఁబడిన వనికూడ శ్రీ సుబ్బారాయశాస్త్రులవారు వినియుండక పోరుగదా! అగుచో బందరు మినర్వాప్రెస్సు నందు ముద్రింపఁబడిన 1934 సంవత్సరపు ప్రతిని గూడ శాస్త్రులవారు చిత్తగించి యుండినచో, ఆ యీ బాధవారికి లేకయుండునుగదా! అప్రతిలో 66వ పుటలో నిటులు దిద్దఁబడియున్నది.

"ఈమూఁగురు జామాతల
కామూఁగురు నౌకరు పుత్రు లాహవ ధీరుల్."

ఈ విరోధమును మాత్రము నేను దెల్పితినే కాని దిద్దుబాటు తెలుపనే లేదు. దానిపై ప్రచురణకార్యకర్త యగు కాటూరి వేంకటేశ్వరరావట్లు సవరించెను. నే నాసవరణ నిందనుక చూడనేలేదు. సుబ్బరాయ శాస్త్రులవారు దయచేసి నిన్నమొన్న విమర్శించి వెక్కిరించునప్పటి కిది వెలువడి వత్సరముకావచ్చినను వారిది చూడకుండుట నూ దురదృష్టమనుకొనుటకన్న నన్యమేమున్నది? ఈయన పాండిత్యములలోఁ జేరినది కాదు. ఇప్పుడు క్రొత్తగా బయలు దేరిన ఫక్కిని నూటికి ముప్పదియైదు మార్కులు సంపాదించి డిగ్రీని పొందినది. అందుచే విమర్శనజ్ఞానము కదుంగడుమెండు. అందుచేతనే తామేపొత్తమును విమర్శింపఁబూనినారో, ఆ పొత్తమెన్ని ముద్రణములైనదోకూడ పరిశీలింపకుండుట యని చదువరు లరయుదురుగాక. ఇంత సుళువుగా సవరింపఁదగిన విషయమును దమబుద్ధికి సవరణ కాని యంతమాత్రమున– "తనకల్మి యింద్రభోగము"నుగా నిశ్చయించుకొని శ్రీ శాస్త్రులవారు– "అనుపద్యమును దిద్దు టెట్లు? శాస్త్రులుగారే దానిని సవరింప వలయును." అని వ్రాయసాహసించినారు. ఈవ్రాఁత కర్థమేమో చదువరు లెఱుఁగకుందురా? గ్రంథకర్త శుద్ధ పత్రికలో సవరించుకొమ్మని సూచించెను. నిశ్చయమే. ఆ సూచన ప్రకారము సవరణచేయుట కిది చదువరులకే కాదు. గ్రంథకర్తకుఁగూడ వీలగునది కాదనియే కదా! కవిత యన నెట్టిదో యెఱిఁగిన వేంకటేశ్వరరావున కెట్లు సవరణయయ్యెనో! విమర్శకునకట్లే కాలే దనుకోవలయును కాఁబోలును. ఈ పొత్తము నేను పరేచ్ఛా ప్రారబ్ధవశమున వ్రాయ మొదలిడితినేకాని స్వేచ్ఛచేఁ గాదని గ్రంథకర్త తెల్పినట్లును, శుద్ధపత్రికలో సవరణను సూచించినట్లును విమర్శకుఁ డంగీకరించికూడా దీని కింత గ్రంథము పెంచుట కర్థమేలేదు. పైఁగా ఈయన లోకముతోపాటు గ్రంథమును విమర్శింపక వ్యక్తిపరముగా వాడినసామెత యెంత– "కుర్వీత బుధ సోమయోః" అన్నట్లున్నదో చదువరులు తిలకింపుఁడు.

"అని చెప్పుటచే నీ పాత్రలో వేంకటశాస్త్రిగారు ప్రతిఫలింపఁ జూచినారని చెప్పవలయును. కాఁబట్టి శుచిముఖిపాత్ర అసందర్భస్థితిలో నున్నదని చెప్పవలసి వచ్చినది. వెక్కిరింపఁబోయి బోల్తాపడినట్లు, ప్రతిఫలింపఁబోయి బ్రత్యక్షవిరోధమును పరిశీలింపలేదు."

ప్రతిఫలింపఁబోయిన దెవరు? వేంకటశాస్త్రిగారు, ప్రత్యక్షవిరోధమును పరిశీలింపని దెవరు? ఆయనయేకదా! వేంకటశాస్త్రిగారు చేసిన యపరాధము శుచిముఖిపాత్రలో ప్రతిఫలింపఁబోవుటయేకదా? అగుచోనది వెక్కిరింపఁబోవుటవంటిదేయగునా? కానిచో

ఆలోకోక్తిని వాడుట కర్థములేమి స్పష్టమేకదా! అగుచో ఈ విమర్శకునకు చక్కఁగా నాలుగు వాక్యములు వ్రాయుటకూడ నేర్చికోఁదగిన యవస్థయేకదా! అగుచో నెక్కడనో ఉపాధ్యాయులుగా నెటులుండి రని శంక రావచ్చును. ఇపుడు న్యాయమైన పాండిత్యముల నధఃకరించుటయు, నూటికి మూఁడవవంతు పాండిత్యములను మన్నించుటయు, ననఁగా నూటికి ముప్పదియైదు మార్కుల పాండిత్యములను మన్నించుటయు సర్వత్ర అనుభూతమే కావున నాశంక కవకాశములేదు. లేదా విద్యార్థుల యదృష్టమనియేని యనుకోవలయు. అదియటుండె. ఈ సామెతవలన విమర్శకుఁడేదో తన పితృపితామహులను ఉద్ధరించుతలఁపుతో నీవిమర్శనకు దిగెననికాని, లేదా, పేరుతెచ్చుకొనుటకై ఈ "ఘటం భింద్యాత్తు" లోనికి దిగెనని కాని యూహింపవలసియున్నది. అగుచో-

"పలుకనేర్చుట బహుతపఃఫలముగాదె" అనుఘట్టములో మమ్మును లేదా, నన్నును లాకలూకాయిగాళ్లలో చేర్చిన యీవిమర్శకుఁడుగారి పూనిక కార్యకారిగాదు. ఇందులకై యెవరినో గొప్పవారిని విమర్శించి పేరుతెచ్చుకోవలయు నని సుబ్బరాయశాస్త్రులవారు వయస్సుచేఁ జిన్నలైనను, "అన్యోన్యం గురవోవిప్రాః" అనునభియుక్తోక్తి ననుసరించి ప్రార్థింపఁబడుచున్నారు. ఇంతియకాక యిపుడేని మమ్మనుగ్రహించి షష్టిపూర్తి ముద్రణమును జిత్తగింపవలయుననికూడాఁ బ్రార్థింపఁ బడుచున్నారు. మఱియును మీవంటి విమర్శకాగ్రగణ్యులకు మావంటి లాకలూకాయిలను విమర్శించుట

"మొనగాఁ డొక్కరుఁ డాఱు మాసములు సామున్ జేసి మార్మూలఁ బంబిన భీపెంపున డాఁగియున్న ముసలాపెం బోరికిం జీరులా-గున"

అనుపద్యార్థమున కుదాహరణము కాఁగలదనికూడ మనవిచేయుచున్నాను.

చదువరులారా! ఇక్కడకీయనచూపిన విరోధమెట్టిదో మీకు విశదమేకదా? ఇంకను ఈయన యింతతో విరమింపలేదు.

"వేంకటశాస్త్రిగారీ చిక్కులను పరిశీలింపక శుచిముఖిపాత్రకు జంటతగిల్చి, చిలవలు పలవలు పెంచినారు." అనియెత్తికొనియేమో కొంత నిస్సారపు ప్రసంగము వెళ్లబోసినారు.

ఈయన వాడిన "వెక్కిరింపబోయి" అనుసామెతనుబట్టి యీయన కౌచిత్యజ్ఞాన మెంతయుండునో, ఇంతటి యౌచిత్యజ్ఞుఁడు పాత్రౌచిత్య విమర్శన కేమాత్రము తగియుండునో చదువరులు పూర్తిగ గ్రహించియే యుందురుగాన శాస్త్రులవారి చెట్టుక్రింది ప్లీడరు కబుర్లకు ఇప్పటి కింతతో సమాధానము వ్రాయుపూనికనుండి విరమింతును.

"ఈగండం గడిచి పిండం బయలఁబడితే" అప్పుడు తక్కినది పూర్తిచేయుదును. ఏమైనను, ఇట్టి "తథాదాధానాల"తో వాదము సమంజసముకాదని లోకులు ముఖ్యముగా నన్ను నిందింతు రని యెఱుఁగుదును. ఎటిఁగికూడా, నా కీడెబ్బదవ పడిలోసయిత మావ్యసనము బాధించుచునేయున్నది. భర్తృహరి యేమన్నాఁడు?

"విద్యాయాం వ్యసనమ్" అన్నాఁడు. ఈయన సాహిత్యశిరోమణిగారు. ఇంకొకాయన యొకపుస్తకము తెలుఁగులోనికి పరివర్తన చేసినారు. ఆయన తర్క శిరోమణి అని జ్ఞాపకము. ఆయన ఆ పొత్తములో, పనిలేని పాటగా మాౘవ్రాఁత నెత్తికొని కొంత తెలిసీ, తెలియని వ్రాఁత వెళ్లఁబోసినారు. ఆవ్రాఁతనుగూర్చి కూడ ఈ సందర్భములో ఒక "కారుణ్యము" వేయుట మంచి దనుకొందును. కావున ఆయనవ్రాఁతను రంగాన కవతరింపఁజేయుదును.

"పూర్వమహాకవిప్రయోగము లున్నను నిట్టివి పనికిరావు" ఇది ఆయన వాక్యము. దీనివల్లనే ఆయనవ్రాఁత యంతయు బయటఁబడును. ఇట్టివనఁగా నెట్టివి? అని ఆకాంక్షించుకొందము-

"పృథ్వీభరం బొక్కటా?" వంటివి. ఇందు "బొక్క" అని యశ్లీలార్థము స్ఫురించు చున్నదఁట! ముం దీశిరోమణిగారి హృదయము నాక్రమించిన యశ్లీలార్థము నైఘంటికులు వ్రాయనేలేదు; వ్రాసిరేయనుకొందము. ఏపూర్వమహాకవిగాని పాటింపని యపు డీలక్షణము నెవరుమన్నింతురు? కాళిదాసంతవాఁడు దీనిని లక్షింపనియపుడు తక్కినవారిగణనయేల? ఈ "పృథ్వీభరంబొక్క" యెట్టిదనగా? "చకాశే పనసప్రాయై పురీషండమహాద్రుమైః" వంటిది. అనఁగా పైశ్లోకములో, "చకాశే అను క్రియలో చివరఁగల "శే" అనువర్ణమునకు "పనస" శబ్దాదియందున్న పకారమును ముడిపెట్టి "చచ్చిచెడిచాయంగల విన్నపములుగా" "శేప" శబ్దమునుసృష్టించి, ఇంతతోఁగూడ తనకిష్టసిద్ధి కాక, ఈ శబ్దము శేఫశ్శబ్దమునకు స్మారక మగునని చెప్పి దోష నిరూపణము చేసినాఁడు. ఇట్లు కష్టించి పాడుసృష్టి సేయుట చాల గర్హ్యము. అగుచో లాక్షణిహృదయ మట్లేల ప్రవర్తించెనందురా? లక్షణమనఁగా కఁట్టుబాటు. దానిని జేయునపుడు తత్కర్త యెన్ని నియమము లేర్పఱుప వలయునో అన్నియు నేర్పఱచితీరవలసినదే కాని ఇటీవల లక్ష్యలక్షణవేత్త లానియమములలో మహాకవు లెంతవఱకు గౌరవించినారో, యెంతవఱ కీసడించినారో యనునంశము తత్తత్ప్రవృత్తిం బట్టి తెలిసికొని తానేది యేని వ్రాసికోనగును. అంతియ కాని "గ్రుడ్డెద్దు చేలో బడ్డట్టు" వ్రాయతెల్వికి లక్షణము గాదు. లక్షణ మున్నను, అయ్యది మహాకవిమాన్యముగానిచో దానికి విలువ యుండదు. ఈ విశేషాంశములు చెట్టుక్రింది ప్లీడరు తెగలోని విమర్శకులకు గోచరింపవు. కవిత్వము మాటటులుంతము. ధర్మశాస్త్ర విషయ మింతకన్న గరీయము కదా! ధర్మజ్ఞు లేమన్నారో చూడుఁడు.

"యద్యపి శుద్ధం లోకవిరుద్ధం నాఽచరణీయం నాకలనీయమ్"

దీనివలన శాస్త్రముకన్న ఆచారమునకు గౌరవ మిచ్చినట్లయినది. ప్రస్తుతము లక్ష్యమాచారస్థానాపన్నము. కావున శిరోమణిగారు "పూర్వమహాకవి ప్రయోగములున్నను" అని వ్రాయుట మహాపరాధము. ఈ త్రోవను తప్ప శ్రీ కాళిదాసు గారి 'ఉచ్చైః కులం చాత్మనః' లోనగునవి నిలువవు. శేఫమునకు శేపశబ్దము స్ఫోరకమైనట్లే "ఉచ్చైః" 'ఉచ్చ'కు స్ఫోరక మగును. ఇది యిటు లుండె. ఆలంకారకివామనుఁడు 'అవతార' శబ్దము కుదురదని వ్రాసినవ్రాఁత. దాని నాంధ్రీకరించిన శిరోమణిగా రెఱిఁగినదేకదా! అగుచో నీయనకు "మా భూత్పురీ వాదనవావతారః" అను కాళిదాస ప్రయోగము కుదురునా? ఇదియు నిటు లుండఁగా నీయన విశిష్టాద్వైతికదా! తఱచు శ్రీమహావిష్ణువునవతారములకు సంబంధించిన స్తోత్రములఁ బఠింపవలసి యుండునుగదా! అందు : "మత్స్యావతార గోవింద" అనునో లేక "మత్స్యావతార" అనునో చదువరులు తిలకింపుఁడు. లేక అవతరపదమే ఉచ్చరింపనిందు. అది హృదయంగమమగునో, కాదో పరిశీలింపుఁడు. ఆ యీ విషయములు మాకొఱకే వ్రాయఁబడినవికావు. ఇట్టి వెఱ్ఱిమొఱ్ఱి వ్రాఁతలు వ్రాయు జ్ఞానలవ దుర్విదగ్ధుల జ్ఞానము మిగుల శోచ్యము!

"విలువగలకవుల లక్ష్యమ్ములె తామీభార మెల్ల మోయఁగ వలయున్" "వ్యాకరణ మొక్క త్రోవ మహాకవు లొకత్రోవ" ఇత్యాదులు పైసందర్భములను బోధించుచున్నను జ్ఞానలవదుర్విదగ్ధులేదో మాకువృథగాపని కల్పించుటమానకున్నారు. ఇదిగాక ఈశిరోమణిగారికి మారచించినవి పెక్కు గ్రంథములుండఁగా ఈబొక్కమాత్రమే యుదాహరించుటకు దొరకెనా? దీనివలననీయన కేవల రంధ్రాన్వేషణతత్పరుఁడనియును, అందుచే "బొక్క" దొరికియుండుననియు ప్రాజ్ఞులనుకొని దీనికిసంబంధించిన శ్లోకమును పఠింతురు కాఁబోలును! శాంతం! పాపం. ఇంత స్తనశల్యపరీక్షచేయు నీశిరోమణి ఆంధ్రీకరణమున నిలువఁదగినది, హృదయంగమమైనది యొకఘట్టముకూడ లేదే? వ్రాఁత యంతయు తప్పుల తడక. ఉదాహరించిన పద్యములలోఁ గొన్నిచోట్ల గణములే సరిపడవు. ఈయన వ్రాసెడిది లక్షణగ్రంథము. దానిలో- "అయితే, యోచించు" లోనగు నపప్రయోగములకు మితిలేదు. ఇట్టి తెల్విఁతేటలతో నొరులపైకి దాడి వెడలుట, ఇదియే కాఁబోలును "ఉట్టి కెగురలేనమ్మ స్వర్గాని కెగిరిందనుకొనుట."

ఇందొకరు సాహిత్య శిరోమణులు, వేఱొకరు తర్కశిరోమణులు; వీరివ్రాఁతలయందలి సారాసారములను జర్చింపఁదగువారు సహృదయులు. వారే మందలింపఁదగువారును అని ఇప్పటికింతతో ముగించుచున్నాఁడను.

★ ★ ★

# బ్రతికించారు ఆచార్యులుగారు

యెందుచేతంటే? సూక్ష్మంలో మోక్షోపాయం చూపించారు వారి పుణ్యమా అని. మొట్టమొదట అనుకున్నానుగదా? అమ్మయ్యో? యేమాత్రమో తక్కువగా పద్ధాలుగుకాలాలు సంపూర్తిచేశారే! యీవార్ధక్యంలో యీ అనారోగ్యంలో "తీరికూర్చున్న మంగలి" లాగు యీ పనికిమాలినపని యెక్కడ పెట్టుకొందునురా అనిభయపడ్డాను. ఉభయ వేదాంత ప్రవర్తకులు యేవో తారతమ్యజ్ఞాన బోధకపు వాక్యాలు వ్రాసివ్రాసి "కసిదీరనమ్మ" అనే సామెతను జ్ఞప్తికిఁ దెస్తూ శాస్త్ర జ్ఞానం అంతా యింతా మాత్రమేకాక సంపూర్ణంగాకల శిరోమణులవడంవల్ల, ఆ తరవాతవచ్చే అతివ్యాప్త్యవ్యాప్తులను సవరించుకోవడానికి వేసికొనే "మాత్ర" పదాన్ని యిప్పుడేలక్షణంలో తగులుకోఁబెట్టి "వయోమాత్రవృద్ధులగు మీరు" అంటూ వకఅంకెవేసి, "మావిషయంలో యికముందేనా జాగ్రత్తగా సంచరించండి. లేకపోతే తగినట్లు బుద్ధిచెపుతాం" అనే అర్థమిచ్చే మాటలు కొన్ని వ్రాసి, వ్యాసాన్ని ముగించారు. వయోమాత్ర వృద్ధత్వాన్ని వారు స్వయంగా వప్పుకుంటూ వుండడంచేత వారు "సభకు రావలసిం"దని నన్ను కోరడాన్ని నేను పాటించలేకపోయినా యీమిష నా అసమర్థత్వాన్ని సమర్థిస్తుందను కుంటాను. యిప్పటికి వారేదేశంలో, యేజిల్లాలో వుండేవారో నాకు తపిసీలుగా తెలియదు. యేమైనా నేను వెళ్లే వోపికలోవున్నాను గనుకనా "మీవూ రెక్కడ" అని వ్రాసికనుక్కోవడానికి. వకటిమాత్రం యిప్పటి నాస్థితికి తగుతుందనుకుంటాను. వకపర్యాయం తమరే తమకు నచ్చినపండితకవిని (కేవల పండితుణ్ణిగాని, కేవల కవిమాత్రుణ్ణిగాని కాదుసుఁడీ) వెంటఁబెట్టుకొని మాగ్రామం కడియానికే దయచేస్తే మీవాదంలో విశృంఖలంగా నన్ను గూర్చి దూషించిన మాటలకేం గాని సంప్రదాయం తెలియక వొప్పులను తప్పు లనడం యెట్టిదో, తప్పులను వొప్పులనడం యెట్టిదో, యెంతోసేపక్కఱలేదు, కొద్దిసేపట్లోనే తేలుస్తాను. మీరేనా పత్రికలో రాయడం కనక యేదో కొంత పెంచివ్రాయఁగలిగారు గాని, ప్రత్యక్షంలో జరిగే ముఖాముఖీవాదంలో ఆలా పెంచలే రనుకుంటాను. నేను అనారోగ్యంగా వుండి మీ రున్నచోటికి రాలేక, నేనున్నచోటికే రమ్మనడంవల్ల మీకయ్యే రైలుఖర్చులున్నూ, యిక్కడవున్న కాలంలో 'తళిహా!' ఖర్చు కరామతులున్నూ నేనే భరించుకుంటాను. "అవస్థా పూజ్యతే" అన్న సందర్భం తమ రెఱుఁగనిది కాదు కాఁబట్టి యీ నావిజ్ఞప్తిని తోసిపుచ్చ రనుకుంటాను. మునుపటిరోజులే అయితే తాము సభ అంటూ

వుచ్చరించాలా? వుచ్చరింప నక్కఱేలేదు. "లేఁడిపై దూఁకు సింగమ్ముజాడ" అన్న పద్యంకూడా తమరు చదివేవుంటారు. "కొంగల మల్లాయగట్టు" అంటూ నైజాందేశ ప్రయాణంలో తగులుతుందఁట? కొంగల మల్లాయ వృద్ధుఁడైన పిమ్మట ఆగట్టుశిఖరం అధిష్ఠించి కూర్చుండి, "లేస్తే మనిషినిగాను" అనేవాఁడఁట! యిప్పుడు నేనున్నూ అట్టిమూడుకాళ్ల ముసలిగానే వున్నాను. కాఁబట్టి, మీరు రప్పించేచోటుకు రాలేక యింతగా ప్రార్థించడం. యిదేమిన్నీ నాసిద్ధాంతాలని ఆమోదించడం కాదు కనక మీరు నిరాకరిస్తారని అనుకోను. మీపుస్తకం నేను యెవరోవిద్యార్థిదగ్గఱ యేకొంచెమో చూచాను. వెంటనే ఆవిద్యార్థి తత్సమేతంగా వెళ్లిపోయాఁడు, మీక్కోపంవస్తే యేంచేతును? "తప్పులతడక" గానేతోఁచింది. ఆకాస్తసేపట్లో "బొక్క"గా ఛేదించి చూపిన దోషమున్నూ "త్య, క్ష" అనే అక్షరాలకుపడ్డ ప్రాసవిషయమై ఆక్షేపించినదిన్నీ నాకంటఁబడ్డాయి. ఇంకా మీలెక్క ప్రకారమైతే యెనిమిదుండాలి అవి చూచిన జ్ఞాపకం లేదు. తరువాత చాలారోజులు, యీ ప్రసక్తి పెట్టుకోనేలేదు. అంతట్లో యితర శిరోమణులవల్ల ప్రసక్తికల్గింది. పనిలోపనిగదా అని "కారుణ్యం" వుపక్రమించాను. దోషాలతోపాటుగా యేస్వల్పం గానో, గుణాలక్కూడా మీరు మా గ్రంథాల్లోనుంచి వుదాహరించివుంటే మాత్రం మిమ్మునుగూర్చి నేనువాడిన "జ్ఞానలవదుర్విదగ్ధ" పదము వ్యర్థమై నేను తొందర పడ్డట్టు లోకులకు సాక్ష్యమిస్తుంది. లేనిపక్షాన్ని సార్థకమై "దేవుఁడికి సదృశమైన పత్తిరి" అనే లోకోక్తిగా వుండి క్షేమేంద్రాదులు చూపిన ఔచిత్యాన్ననుసరిస్తుందనుకుంటాను. యీమాట బాగుంటేనే స్వీకరించండి. గుణాలకు మీరు మా గ్రంథాన్ని చూడనే లేదన్నందుకు మీ యీ వాక్యం సాక్ష్యమిస్తూవుంది, చిత్తగించండి.

"రంధ్రాన్వేషణపరుఁడ నంటిరి, ... మీ గ్రంథములు మూఁడునాల్గు పరామృష్టము లైనవి, సుమారు పదివఱకు నిందు దోషోదాహరణములుగా మీ పద్యము లుదాహరింపఁ బడినవి."

చాలును, మీతల్లికడుపుచల్లఁగా నూరేళ్లు వర్ధిల్లాలి. "అభణపు", "ఢిల్లికిఢిల్లే" లోకోక్తి యెత్తుకొని యెంతవుపకారంచేశారో, యీ వాక్యం వ్రాసికూడా అంతవుపకారం చేశారు మీరు. అంధుకోసమే మీకంటె ముందుగానే నేను సభాముఖమందు మీ దర్శనాన్ని కోరాలనుకుంటూ వున్నాను. యింతలో దైవం ఆకాస్తమాటా మీచేతే పలికించాఁడు. "నీదయా నీదయా నిర్దయా" అను లోకోక్తి తామెఱుఁగనిది కాదు. "ద్వారాణి భవంతి సర్వత్ర" కదా! మీ వుద్దేశ మెట్టిదో తెలియడమే నాకు కావలసింది. వేలకొలఁది పద్యాలు వ్రాసిన వాళ్లకి యెక్కడో సంధివశాన్ని "బొక్కా" రాక, యతీపోక, ప్రాసా చెడక వుంటుందని

వాదించే శుంఠనని తామనుకొనుచున్నట్టు మీవ్రాఁత ధోరణి తెల్పుతూ వుంది. ఆ వాదం నాదికాదు. మీరు దోషాలకే మావి వుదాహరించుటలో మీహృదయం యెట్టిది అని తెలుసుకోవడమే నాకు కావలసింది. దానితో సకలమున్నూ తేలిపోతుంది. యీవాదం తేలడానికి నా 'వయోమాత్రవృద్ధత్వమే" పర్యాప్తమవుతుంది. దీనిలో జయం పొందడానికి మీ "విద్యా మాత్ర వృద్ధత్వం" లేశమున్నూ పనికిరాదు. "అభణ" వగయిరాలు మీ "విద్యామాత్ర వృద్ధత్వాన్ని" పూర్తిగా కుంకటి వ్రేళ్లతో పెకలించి తీరుతాయి, చూస్తురుగాని. తి. వెం. కవుల రచన దోషాలకు మాత్రమే వుదాహరించుకోతగ్గదికాని, గుణాల కుదాహరించుకో తగ్గది లేశమున్నూ కాదు- అనే అంశాన్నే మొట్టమొదట మీరు సాధించఁదగ్గది. జ్ఞాపకముంచుకోండి, మీకు నేను వ్రాసిన యే అక్షరాలు కోపముకల్గించి వెఱ్ఱి మొఱ్ఱి ప్రసంగాన్ని పత్రికాముఖమున ప్రకటింపఁజేశాయో, ఆ మాటలు మళ్లా వుదాహరిస్తాను. కొంత శాంతించి దానియందుండే ప్రధానాంశాన్ని మనస్సుకు పట్టించుకోండి.

"జ్ఞానలవదుర్విదగ్ధు లేదో మాకు వృథాగా పనికల్పించుట మానకున్నారు. ఇదికాక యీ శిరోమణిగారికి మా రచించినవి పెక్కు గ్రంథములుండఁగా, ఈ "బొక్క" మాత్రమే యుదాహరించుటకు దొరకెనా? దీనివలన నీయన కేవల రంధ్రాన్వేషణతత్పరుఁడనియును, అందుచే 'బొక్క' దొరికియుండు ననియు ప్రాజ్ఞులనుకొని దీనికి సంబంధించిన శ్లోకమున పఠింతురు కాఁబోలునుఁ శాంతం పాపం!!"

ఇవిగదా నామాటలు? మీకు కోపంవస్తే లాభమేమి? చేసినపని తప్పుపని, భారతి నాచేత తగినమాటలు పలికించింది. యిఁకనేనా సంతోషించి నన్నుఁగూర్చి పద్దతొందరపాటుకు పశ్చాత్తాపపడండి స్వామీ! "సత్కవి వాక్యము రిత్తవోవునే" నేను- సత్కవిదాకా యెందుకు-కవి నేనా అయితే (మీహృదయాన్ని బట్టి కాదుసుఁడీ) మా విషయమున మీరు నడచిన నడతనుబట్టినేను మీ కొసఁగిన "జ్ఞానలవే" త్యాది బిరుదావళి మీరు కష్టించి గురుశుశ్రూషచేసి సంపాదించిన "శిరోమణి" బిరుదంకన్న మిన్నయై ప్రసిద్ధికి వస్తుందని నాపూర్ణవిశ్వాసం. యేవోనాలుగు పుస్తకాల్లో వాక్యాలు యేకరువుపెట్టి-

"యివి మీకు బొత్తిగా తెలియనివి, అసలేతెలియనివి" అనే అర్థమిచ్చే పేలవంమాటలు వ్రాసినంతతోనే తేలిపోతుందనుకున్నారా స్వామీ? మీరొనర్చిన యసంగతపుపనివల్ల మీకున్ను మాకు వయోముఖ్య సందర్భాల్లో దేనియందున్నూ, లేశమున్నూ పోలిక లేకపోయినా యేదో యింతవఱకు నాకు మాత్రం గోచరింపని కారణంగల కోపం మా యందు మీ హృదయంలో వున్నట్టు అనుమానింపవలసి వచ్చింది. లేకపోతే మీరట్టి అసంగతప్పని

చేసియుండరు యేం కర్మం కాలింది. చక్కఁగా గురుముఖతః చదువుకొని ప్యాసై, యేదో పదవి సంపాదించుకొని సుఖ జీవనం చేస్తూవున్న మీకు యెప్పుడో "మిడిసి రాలి పడ్డప్పటికీ" 'వృద్ధనారి' అన్నట్లు వకరికంట మేము పడేదిలేదు! మాకంట వకరున్నూ పడవద్దన్నట్టు కాలక్షేపం చేస్తూవున్న తిరుపతి వేంకటేశ్వర కవులను వెక్కిరించడానికి యేదో ప్రబలకారణం వుండితీరాలి! అది మీ ముఖతహ నేవినాలి. దయచేసి తెల్పుదురుగాక. ఆత్మవంచన లేకుండా మాత్రం ప్రవర్తించండి యింకనేనా! "యోజించి తప్పు" "యోచించి వొప్పు" అన్న మీ వ్రాంత అబ్బో! చాలా ఉత్పథంగా నడిచేటట్టువుంది. నడిపిస్తురుగాని, వంట్లో బలం తగ్గింది గాని యింకా కొంచెం బుద్ధిబలం భగవంతుఁడు నిల్పేవున్నాఁడు. మీవాదాన్ని తట్టుకోవటానికి యీకాస్తా చాలకపోదు. అది లోక వ్యవహారసిద్ధమే మండీ? అట్లాగే వాదిస్తురుగాని సభలో. "జ్ఞానలవదుర్విదగ్ధేత్యాదులు" పెద్దతిట్లుగా మీకుతోఁచాయేమండి స్వామీ? అస్మదాదుల మందఅమూ దానిలోనే చేరతాముగదా? మీరింకా వయస్సులో మాకన్న చిన్నలవడంచేత అస్మదాద్యపేక్షయా అనుభవము తక్కువగా వుండడాని కంగీకరింపనివా రుంటారా? ఆ పక్షాన్ని ఆమాట వాడగూడదా? తి. వెం. కవులు-

"చీమలో, దోమలో నాఁగఁ తోఁచిరి." కదా మీ బుద్ధికి, యెవరో కొందఅచే గౌరవింపఁబడిన వాళ్లు మీకట్లు తోఁచినప్పుడు "కారుణ్యా"ది ప్రసంగం మీ విషయమున తగనిదెట్లగును? గుణమేమిన్నీ లేనేలేదండి మా కవిత్వంలోను? యీమాట మీరే విద్యార్థులకు గురుత్వం చేస్తూవున్నారో, జిజ్ఞాసాతాత్పర్యంతో వారే అడిగితే గతేమి? మీ రేకాలేజీలో వున్నారో? తపిసీలుగా తెలియక సందిగ్ధంగా వుండి "ఫలానా" అని స్థిరపరచి వ్రాయలేదు, క్షమించండి. నేను మీ గ్రంథమంతా తపిసీలుగా చూడలేదు. యీ "బొక్క" ఘట్టమున్నూ "త్య, క్ష" వర్ణాలకు ప్రాసాన్ని గూర్చిన ఘట్టమున్నూ మాత్రమే చూచి మీరు అమాయకులని మాత్రం అనుకున్నాను. యెందుచేత? మొదటిదానికి భారతాదులలో సంధివశాన్ని వచ్చిన యీలాటివి లెక్కకుమించి వుండడం చేతనున్ను, రెండవ దానికి యిదికూడాతప్పే అనుకోవడంగాని, లేక యింతమాత్రం ప్రమాదంకూడా లేకుండా కవిత్వం చెప్పేవాళ్లంటూ వుంటారను కోవడంగాని సహృదయు లనిపించుకొనేవారి విషయం కాదుకనుకనున్నూ, యీయనెవరో గ్రంథాలు చదివి ప్యాసైతే అయివుండునుగాని, హృదయ నైర్మల్యం లేశమున్నూ లేనివారై వుండడం తప్పదనుకొన్నాను. అందుచేతనే సహృదయుల మందలింపున కాశపడింది నేను. ఆమందలింపును గూడా మీ హృదయం సమ్మతించింది కాదు. ఓహో! మీతాత్పర్యం నాకంటె ప్రపంచములో సహృదయుఁడంటూ వుంటాఁడా అని కాఁబోలునుఁ అవును "అహమేవ పండితః, అహంచ పండితః, అహం న పండితః" అనే అవస్థాత్రయంలో మొదటి అవస్థలో వున్నారుగదా స్వామివారు. మూఁడో అవస్థలో

వున్న వారి మాటలు వెగటుగా వుంటాయనుకొంటాను. యింతకూ స్వామివారి తాత్పర్యం. అశ్లీలమంటే తి. వెం. కవులకు తెలియదు సరికదాఁ యే యే అక్షరానికీ అక్షరానికీ ప్రాసమైత్రి వున్నదో అదికూడా తెలియదు అని ధ్రువపరచడమే అనుకుంటాను. ఆపద్ధతిని తి. వెం. కవులకు తెలిసిందేమిటో? తెలకపిండి. అందుకే విద్యార్థిని గూర్చి వుపయోగపఱచే మాటలుపయోగపఱచారు స్వామి.

(౧) ఇదొక్క విషయమేకాదు మీరు గ్రహింపనిది యింకను చాల విషయము లున్నవి.

(౨) పురీషం ... ... ... ఇదియు మీరు గ్రహింపజాలక పోతిరి. (ఇయ్యెడ స్వామివారి హృదయం బొత్తిగా నీచమున కొడిగట్టినట్లు నాకుఁ దోఁచెడిని. నిజం వారే తెలుపవలెను.)

(౩) మీకుచ్చ స్ఫురించు నంటిరి (ఇటఁ గూడ స్వామి కేదో హృదయకాలుష్యం ధ్వనితం.)

(౪) మీరు సరిగా గ్రహింపఁజాలని దింకొకటి.

(౫) మఱొక విషయము మీకు తెలియనిది.

(౬) అంతులేని తప్పులువచ్చు మీరు!

(౭) మీరీవిషయములో నోరెత్తుట కేమాత్రమును అర్హులుకారు. (యీ మాట స్వామివారి గ్రంథం తప్పులతడక యన్నందు కిచ్చేజబాబు.)

(౮) కావున మీయోజన పూర్తిగా దుష్టము నాయోచించుట మిక్కిలి యుక్తము.

యింకను యిట్టి ప్రల్లదములు పెక్కులు. ఒరులు దురుసుగా వ్రాసిరని చూపువారు కొంత వెనుకతగ్గి వ్రాయవలసింది. అట్టి తెల్విస్వామికి పెరుమాళ్లనుగ్రహించలేదు. పాపంఁ ఆచార్లవారికి మిక్కిలి కోపం వచ్చింది. కాఁబట్టి విద్యార్థికి బోధించినట్టు శిక్షించి బోధించారు. "పురీష" పదఘటితమైన వాక్యంలో ప్రతివాదికి తత్స్వీకరణాన్ని స్ఫురింపచేశారు. శ్రీమంతులవారితో వాదంపెట్టుకోవడం కంటె శ్రీమంతులవారు చెప్పినట్లే చేయుట యుక్తమేమో? అంటారేమో? చదువరులు. నాఅంతటనేను నాజన్మమధ్యమందు వీరితోనేకాదు, వాదం యెవ్వరితోనూ పెట్టుకోలేదు. పెట్టుకోను. అవతలివాళ్లునన్ను కదిపితే చేతనైనంతలో ఆత్మసంరక్షణార్థం పెనుగులాడతాను. జయాపజయాలు దైవాధీనాలన్నది నాకోసమే పుట్టలేదు, ఆచార్లుగారు మిమ్మేమేనా ముందు కదిపినారా అంటారా? కదిపినట్టు యిదివఱకే ఋజువు చేశానుగదా! ఆకదిపినదేనా పెద్ద గొప్పతప్పిదంచూపి కాదుసుమండి?

"పృథ్వీభరం బొక్కటా" అన్నది. "పృథ్వీభర మ్మొక్కటా?" అంటే వారన్నదోషం అక్కడ రాదు. ఆచార్లువారి గ్రంథమంతా తప్పుల తడక కాకుండా వారు వ్రాసిన రక్షకవాక్యం వకటి వుంది. ఆవాక్యాన్నే తి. వెం. కవులకు వక అఱనిముషం యెరవుగా యిస్తే అది సవరణ అవుతుంది. ఆ వాక్యం చూపుదునా?

"నాగ్రంథము తప్పులతడక యనియు... వ్రాసితిరి... అచ్చువేయించుటలో జరిగిన లోపమువలన నట్టి వ్యత్యాసము జరిగినది." యీ సంరక్షణవాక్యం శుద్ధాబద్ధమైనా వారి గ్రంథాన్ని యావత్తూరక్షించింది కాని మా "పృథ్వీభరం బొక్క" అన్నదాన్ని సంరక్షించలేక పోయింది. చూచారా ఆచార్లవారి సాహసం! యింతకూ ఆచార్లవారు ముందుమమ్మల్ని కదిపినారా లేదా అన్నది ప్రస్తుతం. గుణవిషయంలో వకటిన్నీ వుదాహరించక దోషవిషయంలోనే (నేను వకటే అన్నాను, కాదు పది అంటూ వున్నారు శ్రీమంతువారు. యీవ్రాత నాకు మఱీవుపకారకం. (ప్రియం నఃప్రియంనః) అన్నీ వుదాహరించడంవల్ల వారు నిద్రిస్తూవున్న నన్ను కదిపినట్లయిందా? అందుచేత నేను వారినిగూర్చి యెత్తుకోక తప్పిందికాదు. యిదివఱలో మాకువున్న ప్రతిజ్ఞాస్వరూప మెవరెఱుఁగరు?

"ఉ. కొండల నోరఁజేసికొని కొంత వడిం బఱతెంచి యంతను
ద్దండత దారికడ్డమయి తాఁకి హళాహళిసేయు కొండలన్
బిండిగఁ జేసి రైలు కడువేగమునం బఱతెంచునట్లు భూ
మండలి మాకవిత్వమును "మంకుఘటమ్ములు!" జెండిమీఱుతన్."

అనేది మా ప్రతిజ్ఞ. అంతేనేకాని యెవరిమీఁదికిఁ గాని మా అంతట మేము పోలేదు, పోము. ముందవతలవారు మాట మిగలాలి. యిది చదువరులు బాగా విచారించవలసిన విషయం. తరువాతంటారా? 'ఆసీమాంతం' చేసిగాని విడిచేదిలేదు. సరే! యీ మాటల కేమి? యిదివరలో మీకు వాదోపవాదాలు యే "లాకలూకాయల" తోనో వచ్చాయి. కాఁబట్టి మీ ఆటసాగింది. యిప్పుడో "యినపగుగ్గిళ్లుగాని, మినప గుగ్గిళ్లుకావు" అంటారా? సమ్మతమే. శ్రీమంతులవా రట్టివారే! యెట్టివారున్నూ కాకపోతే నిద్రపోతూవున్న వాణ్ణి పనిగట్టుకు లేపుతారా? వస్తే వోడే రానివ్వండి. పాములను పట్టుకొని ఆడించేవాడిగతి తుద కేమవుతుందంటారా? అలాగే చెప్పుకుందురుగాని తరువాత మీరు. యిప్పుడల్లా విచార్యమేమిటి? వారి గ్రంథంలో మాప్రయోగాలనిదోషాలకే యెత్తుకొని యితరానికి లేశమున్నూ యెత్తుకోని ఆచార్యులుగారి హృదయం యెట్టిది? యిందుకు ఆచార్యులు గారు పెరుమాళ్ల సాక్షిగా జవాబు వ్రాస్తే అది లోకానికి నచ్చినా నచ్చకపోయినా నేను వారికి దాసోహాలు చెపుతాను. యింతవఱకు నేను వ్రాయఁబోయేదానికి వుపోద్ఘాతం.

ఆచార్లుగారు "అయితే, యోచించి, సాధువనడాన్ని కూర్చియేమి? వాట్లను ఆక్షేపించే విషయానికి "ప్రకాస్తి, అభణపు గాండ్లు, ఢిల్లికి ఢిల్లే పల్లెకు బల్లే" అనేవి అద్దతగులుతా యన్నవ్రాంతకేమి? పిమ్మట వ్రాస్తాను. కాని ఆ ప్రయోగాల యందున్న తప్పిదమును మాత్రం స్వామివారు ముందుగా విపులంగా వ్యాఖ్యానం చేయాలనుకుంటాను. యేదో టిప్పణి కొంచెం వ్రాశారు, అదిచాలదు. విపులంగా తత్తన్నిష్ఠమైన దోషస్వరూపాన్ని వ్యాఖ్యానం చేయాలిగాని "నీళ్లలో గేదెను బెట్టి బేరం" చెప్పఁగూడదు. కాఁబట్టి మిక్కిలి అవసరమైన యీ విషయాన్ని స్వామిగారు గమనించాలి. అక్కడక్కడ "ఓనమాల కుఱ్ఱాఁడికి బోధించినట్టు బోధిస్తూ వచ్చారే? యిక్కడ మాత్రం "గురోస్తు మౌనం వ్యాఖ్యానం"గా వ్రాస్తే యెలాగ? యీ వయస్సులో అయాచితంగా నాకిలాటి గురువులు దొరకడం పురాకృత పుణ్య పరిపాకంగదా! "గుణాః పూజాస్థానమ్" అది అట్లుండె, లక్షణ గ్రంథముల కఠిన నియమములకు నేను వప్పుకొంటూ లక్ష్యానికి అనగా లాకలూకాయలడానికి కాదు, మహాకవుల లక్ష్యానికి యెక్కువ ప్రాముఖ్యం యిచ్చితీరాలి అనికదా వ్రాశాను? దాన్ని గుఱించి యేదోవ్రాస్తూ తిట్లకి రేఁగారు స్వాములు. అవి యౌచిత్యానికి దూరంగా వున్నాయి. వారికి జ్ఞానలవదుర్విదగ్ధత్వమే తిట్టుగా కనపడ్డది. "సర్వజ్ఞత్వము సాంబమూర్తిది" గదా! అయితే సర్వజ్ఞులే అనుకుందాం స్వాములను. "అభణ" అర్థంకాక పోవడమేమిటి? "ఢిల్లికి ఢిల్లే" దోషజుష్ట మవడ మేమిటి? నేను వ్రాసిన జ్ఞానలవదుర్విదగ్ధత్వాన్ని సమర్థిస్తేనే ఆచార్లగారు సమ్మతించవచ్చును. లేదా, బలవంతం లేదు. అన్నిటికిన్నీ మకుటం నిర్దుష్ట హృదయంతో తమ గ్రంథంలో మా ప్రయోగాన్ని యెత్తుకున్నారా? దుష్ట హృదయంతో యెత్తుకున్నారా అన్నది. యిది స్థిరపడితేనేగాని తక్కిన చర్చకు దిగడం అవసరంకాదు. యింకొకటి లక్షణ గ్రంథాల్లో వుదాహరణా లిచ్చేటప్పుడు సమకాలికుల పుస్తకాలనుండి యివ్వడం అంత గౌరవప్రదంకాదు. గుణాలకున్నూ, దోషాలకున్నూ కూడా ప్రాచీనులవి యివ్వడమే యెక్కువవీలు. వాళ్లు స్వర్గస్థు లవడంచేత లక్షణ గ్రంథకర్త తెల్వితక్కువగా ప్రవర్తించినప్పటికీ తిరగబడి అడగడం తటస్థింపదు, అదిగ్రంథకర్తకెక్కువ సుఖంగదా? ప్రతిప్రాచీన గ్రంథకర్తనున్నూ, ప్రతినవీన గ్రంథకర్తా కొద్దోగొప్పో ఆక్షేపిస్తూనేవుంటాఁడు. అడిగేదిక్కు మాత్రం వుండదు. మళ్లాయెవరో బయలుదేరి పూర్వగ్రంథాన్ని సమర్థించడమున్నూ వుందిగాని అది మిక్కలి అరుదు. వక్తవ్యాంశం. సమకాలికుల ప్రయోగాలు పుచ్చుకోవడంలో కూడా స్వాములవారేదో గొప్పను సంపాదించుకోవడానికే అన్నది. యిదే నిశ్చయమైతే తమరు బెత్తంచేతపుచ్చుకొని ఓనమాలు బోధించడానికి తగ్గస్థితిలో వున్న మావంటివారి గ్రంథాలనుండి వుదాహరణలు పుచ్చుకోవడం గ్రంథానికి వుపకరింపదనుట నిక్కం. యింకెందుకు పనికి వస్తుందంటే, యేదో క్రౌర్యంతో

అవమానించడానికి మాత్రమే పనికిరావలసి వుంటుంది. స్వామి యేమంటారో చూదాం. యేకవి వాడింది ఆశ్లీలంగా వుంటుందో ఆమాట ఆ కవికాలంనాటికి దుర్ధాన్ని యిచ్చేదిగా వుండి వుండదంటూ తేల్చారు స్వాములు. "సాని, అనుష్ఠించు" వీట్లనట్టివిగానే అభిప్రాయపడ్డారు. సందిగ్ధ విషయంలో వ్రాయడంలో మొదలిడితే వ్రాఁత మిక్కిలి పెరుఁగుతుంది. సందేహం లేనిదాన్నే చూపితే బాగుంటుంది. ఔచిత్యాది విషయములకు పింగళివారిని అగ్రగణ్యులుగా స్వాములు వప్పుతారేమో, లేక వారికిన్నీ వుపాధ్యాయత్వానికి సిద్ధాపడతారా?

"తగు చోట్లు గుద్దంటఁ ద్రవ్వి త్రవ్వి"

అని సూరన్నగారు ప్రయోగించారుకదా? ఆచార్యులవారు మావంటి "లూకలూక్షాయల" ప్రయోగాన్ని దోషాల కుదాహరణంగా చూపుకొని "గిల్లికజ్జాకు"దిగి తోఁచీ తోఁచని వ్రాఁతలు వ్రాస్తూ మాకు పని కల్గించడంకన్న ఆసూరన్నగారి వంటివారిని వుదాహరిస్తే లోకం "మెచ్చి మేకతోలు గప్పుతుం" దేమో? వీరిని నేను జ్ఞానలవదుర్విదగ్ధ పదభాజినిగా చేసినందుకు మిక్కిలి కినిశారు వీరు. వీరు చేసినపని యెట్టిదో చూడండి. వీరెత్తుకొన్న చోటున మేము చిరకాలం నాఁడే వ్రాసిన అక్షరాలుదాహరిస్తాను-

(పాశుపతమునుండి)

"పృథ్వీభరం బొక్కటా?" ఇట బొక్క అని విడఁదీసి దోషము నాపాదించుట లాక్షణికుల మతమే గాని, ముం "దీబొక్క" పదమునకేమి, పొఱ, ద్రొబ్బు, లోనగువానికేమి గ్రంథకర్తల మతమున దురర్థమున్నట్లు తోఁచదు. కావుననే "బొక్కనీరు (మార్కం. ౩ ఆ)" అని మారన్న ప్రయోగించినాఁడు. పొఱ, ద్రొబ్బులకు సర్వత్ర చూడుఁడు. దురర్థము వచ్చినను నంగీకరించి సంధిస్థలముల నిట్లు భారతాదికము నిరాఘాటముగాఁ బ్రవర్తించుచున్నది. "చ. హారితా జయమొదఁగూర్పకున్న" (భార-ఉద్యో ౨ ఆ). ఇట్టివి పెక్కులు శృంగార రసమున నించుక పరిశీలింప వలసి యుండునుగాని యందును బ్రాచీనులు గణింపరైరి. "సీ ... ... తగు చోట్లు గుద్దంటఁ ద్రవ్విత్రవ్వి (కళాపూ- ౪ ఆ)".

యిట్లు చిరకాలంనాఁడు సమాధానంవ్రాసి ప్రచురించిన విషయాన్ని యెత్తుకోవడంలో శ్రీ ఆచార్యులవారి హృదయం యేలాటిదిగా కనబడుతూ వుందో ప్రాజ్ఞులు విచారించాలి. యీ విషయంలో నాకు తెలియని దేమిటి? ప్రాజ్ఞలోకమే నిర్వచించాలి. "గుద్దపదం సూరన్నగారి కాలానికి సదర్థాపాదకమే" అనేవారుంటారా? ఆచార్లగారివాదం ఆతోవలో వుంది. వారిని నేను జ్ఞానలవదుర్విదగ్ధ లనడం స్వభావోక్తియైతేనే లోకం విశ్వసిస్తుంది. యీ క్రింది సందర్భం చూడండి-

"అభణపుగాండ్లు - అనునది నిరర్థకపదము" అంటారు స్వాములు. జ్ఞానలవదుర్వి దగ్ధత్వాన్ని స్వామివారి యీ వక్కమాటే స్థిరపఱుస్తుంది. దీనికోపమెందుకు? "నిజమాడితే నిష్ఠూరం" కిందికి యిది రాదు కాఁబోలు? యిది "స్వభావోక్తిరసౌచారు" అది నిరర్థకంకాదు. గిల్లికజ్జా తెచ్చుకొని, చేయాడినట్లల్లా వ్రాసేవారి సారం తేల్చడానికే మూలనున్న ఆ పదాన్ని ముంగిటి కీడ్చడం తటస్థించింది. సంప్రదాయజ్ఞులైన శిష్యులున్నారు. అడిగితే వారు స్వాములకు అర్థాన్ని బోధిస్తారు. అది శిరోమణిత్వానికి భంజకమైతే మనవిచేయఁజాలను. వ్యాకరణంలో కొంచెం ప్రవేశముండాలి. అజాదిగాఁ గాకుండా కూడా ఒక త్రోవ వుంది అక్కడ. కాని ఆ పక్షంలో యింకా చిక్కులు కొన్ని వస్తాయి. సారం తేల్చడానికేర్పడ్డ ప్రయోగ మయినప్పుడు ఆ తిరుమంత్ర రహస్యం యిప్పుడే అంతా తెలిస్తే యేలాగ? స్వామివారి తుందుడుకు వ్రాఁతకు - అనఁగా "దుస్త్యజాహి ప్రకృతిః" వగైరా వ్రాఁతకు తగిన ఫలాన్ని యీ "నిరర్థకపు" పదమే కలిగిస్తుందని మనవిచేసుకుంటాను. యెన్ని గ్రంథాలో వుదాహరించారు ఆచార్లగారు. గురుపాదాలవద్ద చదివితేగాని అవన్నీ నా బోట్లకు తెలియవన్నారు. అంగీకరామే. ప్రస్తుత పదానికర్థం కూడా గురుపాద సన్నిధానాన్నే తెలుసుకుంటారేమో? యెందుకింత కర్మం, అన్యబుద్ధి యప్రత్యక్షము కదా? వచ్చినవాదం, వారు "నిరర్థక" మన్న "ఈ యభణపుగాండ్లు" అన్నచోటకాదు, లక్ష్యలక్షణములలో దేనికి యెక్కువ ప్రాధాన్యం అన్నచోట. దానికోసం ముఖ్యమైన మాటలు వ్రాస్తే తీరిపోయేది. దానిలో దీన్నెత్తికోవడం యెందుకు? బోల్తాపడడానికే అని రుజువవడానికే. యింకా యీ ఘట్టంలో "ఢిల్లికి ఢిల్లి" కూడా తప్పన్నారు స్వామి. యేమి సాహసం? యేమి సాహసం? వీరికి సూరన్నగారి 'రోళ్లారోకళ్లం బాడిన కూరుము' లేలా సాధవుతాయోగదా. యింకా "ప్రకాస్తి" ఒకటి వుంది. తర్వాత చూదాం. శాంతం పాపం! లక్షణంకన్న లక్ష్యానికి ప్రాధాన్యమిచ్చి తీరాలి అన్నందుకు పాణిగృహీతపీఠికలో రేఫశకటరేఫలవిషయంలో కూడా కొంత వ్రాసియున్నాను. దానికి వీరేమిచెపుతారో? అందుకే యిటకు దయచేసేటప్పుడు కేవలకవినిగాక కేవలపండితుణ్ణిగాక మాధ్యస్థ్యానికి "పండితకవి" సహితంగా దయచేయాలని మనవిచేసుకొన్నాను. లక్ష్యలక్షణ విషయంకన్నా వీ రెట్టిహృదయంతో జీవత్కవినైన నాకవిత్వాన్ని పరామర్శించడానికి దిగినారోతేలాలి. సదుద్దేశమే అయితే, రంధ్రాన్వేషణత్వము వీరికి తగులదు. ఆ ఘట్టంలోవుదాహరింపకుండానే స్ఫూర్తికివచ్చి స్వామి వారిని యిప్పుడు 'తందానా' లాడిస్తూవున్న శ్లోకప్రసక్తిన్నీ వుండదు. దురుద్దేశమే అయితే ఆస్ఫూర్తికి తగిలే శ్లోకాన్నే వకమంత్రంగా యేర్పఱచుకొని సపాదలక్షజపం జరిపి తద్దశాంశం తర్పణమున్నూ, తద్దశాంశం హోమమున్నూ తద్దశాంశం బ్రాహ్మణ భోజనమున్నూ జరిగించాలా, వద్దా అని ఆచార్యులవారినే అడుగుతాను. చాలగ్రంథాలు యేకరువుపెట్టారు. వాట్లల్లోనుంచి

కొంత గ్రంథాన్ని కూడా వుదాహరించారు. యివన్నీ నాకు తెలియవన్నారు. సమ్మతమే, వారికి తెలిసిన లాభమేమి? తెలియనివాళ్లు తప్పుత్రోవ తొక్కటంకన్న తెలిసినవాళ్లు తొక్కడమే తప్పుగాదా? ముఖ్యంగా ఆచార్యులవారు మమ్మల్ని కదపడం సదుద్దేశమా దురుద్దేశమా? అన్నది తేలాలి. నాకు తెలియని అంశాన్ని వారీ వ్యాసంతో బోధించే సందర్భంకూడా తేలాలి. లోపం తమది కనపడుతూంటేనే ఆచార్లగారింత తొందరపడ్డారు, లేకపోతే యెంత తొందరపడతారో, తమకే యింత యిబ్బందిగా వుంటే వారన్నట్లు వయోమాత్రవృద్ధత్వమేనా వున్న నాకు తమరుచేసిన యయుక్తకార్యంవల్ల యెంత యిబ్బంది వుండాలో? యేమీ? నాజోలికే రానట్టున్నూ, నేను వారిమీఁదకు వృథాగా వెళ్లిదూషించినట్టున్నూ, అపలపిస్తారే ఆచార్యులుగారు? యింతమాత్రంతోనే పోతుందా? నాప్రకృతే దుస్త్యజమో, లేక తమకే అది వర్తిస్తుందో తేలేకాలం వచ్చిందనుకుంటాను. లేకపోతే వారుదాహరించు కోతగ్గదోషాలకు కవిత్రయం మొదలైన వారి ప్రయోగా లుండఁగా మావంటి 'లాకలూకాయలని' తడవడమెందుకు వస్తుంది? 'ఫలానుమేయాః ప్రారంభాః" కదా! ఆకాలంనాఁటికి ఆ మాటలకు దురర్థం లేదంటూ వక ఆభాసవాదాన్ని లేవదీశారు స్వామి. యీవాదం నిలిస్తే చూస్తాను నేను. సూరన్నగారి గుద్దలిలో 'గుద్ద' పదం యెంతఅపకారం చేయాలో అంతా యీవాదానికి చేసితీరుతుంది. యిది తెలుఁగులో వచ్చింది కనక వాదం తెలుఁగే వుదాహరించాను. సంస్కృతమ్మట్టుకు సంస్కృతానికిన్నీ వున్నాయి బోలెఁడు. భారవిలో కాఁబోలును- "శ్లో. ఈశార్థం" అనిపడ్డది. "పంచాంగవినిర్ణయోనయః" అనిన్నీ పడ్డది. శేఫాలికా పుష్పశబ్దం వకటి మహాకవులు తఱుచు వాడుతూ వుంటారు. ఇంకాయెన్నో వున్నాయి. యేమీ ఆధారాలు లేకుండా "కారుణ్యం" వేయడాని కుపక్రమించలేదు. చూపినవాట్లలో 'శార్థం' శ్రాద్ధానికిన్నీ, యింకొకటి గుహ్యావయవానికిన్నీ, వేఱొకటి పురుషగుహ్యావయవానికిన్నీ స్ఫోరకత్వ వాచకత్వాలకు పనిచేస్తాయి. అయితే ఆ కవులందఱూ అప్రాజ్ఞులే అంటూ వాదిస్తారని స్వామివారిధోరణి సూచిస్తూవుంది. అందుకే. అది తేలడానికే యీ వయోమాత్రవృద్ధుఁడి పరిశ్రమ. లేకపోతే- "లక్షణమున్నను" అని వ్రాస్తూ కూడా "కారుణ్యాని" కుపక్రమిస్తానా? కాళిదాసాదుల కాలానికిన్నీ, ఆలంకారిక వామనుని కాలానికిన్నీ కలభేదమే నాకు తెలియదనిన్నీ, కాళిదాసుకవిత్వానికిన్నీ ఆంధ్రదేశ వ్యవహారానికిన్నీ యెట్టి సంబంధమో తెలియదనిన్నీ మొదలెట్టిన శ్రీమానులవారి సాహసం వర్ణనీయం. నేను నూటికి ముప్పైయయిదో, లేక నలభైయో మార్కులు తెచ్చుకోలేదుగాని యీ తెచ్చుకున్నవారికి పాఠం చెప్పే శిష్యులున్నూ, వీరందఱిమీఁదా సర్వాధికారం వహించేశిష్యులున్నూ, నాకు పలువు రున్నారనియేనా స్వామి సంశయించలేదు. నేనొక వేళ వృద్ధుఁడనవడంచేత యీవాదం తేలేలోఁగా పరమపదిస్తానని ధైర్యమేమో స్వామి

వారికి? జాతకరీత్యా యింకా ఆయువుంది. రెండోపక్షంలో సమర్థులైన శిష్యప్రశిష్యులున్నారు. స్వామివారిని నిరోధించి అడుగుతారు. యేమని? మీ ప్రవృత్తినిబట్టి వాడఁదగ్గమాటలే గురువుగారు వాడినారు. 'అవసరపఠితా వాణీగుణగణరహితాపి శోభతే పుంసామ్' అని అవసరానికి తగ్గమాటలు వాడవలసివచ్చింది, వాడినాను. ఔచిత్య విచారచర్చ చేసిచూస్తే స్వామికి కోపం రాకపోయేదే, కాని నా ప్రకృతిలో అలా సహించేగుణం కాదు. "దుస్త్యజాహిప్రకృతిః" అని వారే వ్రాశారు. పత్రికవారు విసుక్కోకపోతే నా ప్రకృతిని స్వామివారు రుచిచూస్తారు. స్పృశించి విడిచానేకాని ప్రధానాంశం యింకా మొదలెట్టలేదు. "అభణ" నిరర్థకమన్నది స్వామి మఱుస్తారేమో? జ్ఞాపకంచేస్తే మంచిదిగదా! ప్రత్యుత్తరానికి నిరీక్షించే వేం. శా. శతావధాని.

## అనుబంధం

(౧) ఆచార్లగారు తాము నిరపరాధులైనట్టు వక వాక్యం వుటంకించారు. ఆవాక్యమిది. "నేను మీ గ్రంథమును విమర్శించునప్పుడు నాయాంధ్ర కావ్యాలంకారసూత్రవృత్తి వివరణమునం దొక్క పరుషవాక్యమేని మీవిషయమై వాడినట్లు చూపఁగలరా?"

పరుషవాక్యాన్ని పిమ్మట చూపుదాం. ముందుగీటుంచినచోట మాకు ఆయన ఆపాదించిన "బొక్క" వంటి "తొక్క" కనపడుతూవుందా? లోకంలో "తొక్క" పదం బూతులాటలో గ్రామ్యులు వాడేదేనా? "తొక్కన్న తోలన్న" ఇత్యాదులు స్వాములున్నూ వినేఉంటారు. కాఁబట్టి విస్తరించేదిలేదు. వారిసిద్ధాంతప్రకారం యిది గ్రామ్యదోషంకదా! పిమ్మట యింకా యిట్టివి మఱికొన్ని చూపుతాను. ప్రస్తుతం యిది "వెక్కిరింపబోయి బోల్తాపడడం" కిందకు దేఁకుతుందిగదా! యిఁక పరుషవాక్యం చూపుతాను.

ఈచివర సమాసము... బ్రాహ్మణ పరిషత్తులో చండాలునివలె నున్నది మాకవిత్వమును తెలిసో తెలియకో తోచినరీతిని విమర్శిస్తూ లేదనితోస్తే బాగులేదనడం యుక్తంగాని యీ "చండాల" పదప్రసంగమెందుకు? దీనింబట్టి వీరికిన్నీ, మాకున్నూ యేవిధమైన ముఖపరిచయము కూడ లేకున్నను, యేదోవైరకారణ ముండితీరవలెను. మఱియే యితర లక్షణగ్రంథకర్తగానియీ "చండాల" పద ప్రసంగముతో కవి కవిత్వాన్ని యీసడించినట్లు స్వాములు చూపఁగలరా? అయితే యిందు వ్యక్తిదూషణ లేదంటూ సమాధానం చెప్పవస్తారేమో? నేను "కారుణ్యం" వేసింది మాత్రం వ్యక్తికా, వ్రాఁతకా? చూడండి–

"ఆ వ్రాతనుగూర్చికూడ, ఈసందర్భములో ఒక కారుణ్యము వేయుట మంచిదను కొందును" అందుచేత "బొక్క" కి "తొక్క" లాగే యిదిన్నీ సరిపోతుంది. "జ్ఞానలవదుర్విదగ్ధత్వం" వగయిరాలు వారిరచనవల్లనేమి వారు తిరిగే ఆక్షేపించిన "ప్రకాస్తి-అభణ" వగయిరాలవల్ల నేమి సులువుగా సమర్థింపఁబడతాయి. యిఁక ఆచార్లగారు "వయోమాత్రవృద్ధత్వా"న్నేని గణించక చేసిన తూలుప్రసంగం మిగిలిపోతుంది. స్వామివారి గ్రంథంలో వున్న యితరతప్పులువుపేక్షించి గ్రామ్యదోషానికి వారిసిద్ధాంత ప్రకారం బాధించేవి దిఙ్మాత్రముదాహరిస్తాను.

(1) పంచమాధికరణము, (2) లింగము, (3) కావున నాతీరుగల, (4) మదింగా, (5) కమలము, (6) కాటయవేమన, (7) ఈనర్పుఁడవగుదని, (8) నెచ్చెలికాడు, (9) సహజన్యచూడనొప్పెఁ జారుదోహదల క్షణసహితి, (10) తియ్యఁబోడి, (11) రామలింగకవి, (12) కూర్పు కూర్చెదన్, (13) భగదత్తు, (14) అప్పరోమయము, (15) అతిమాత్ర, (16) బిరుదోత్సవములకు, (17) సంకటముల, (18) దహన, (19) వెండిగుండన, (20) మేళగింపుకాలేదు, (21) మొత్తపుకూర్పు, (22) ఎఱుఁగుటచే, (23) భీముఁడను -శుంభత్కుంభి, (24) కెంపుకడాని, (25) ముగుద, (26) మానము, (27) లక్ష్యముండవలయు, (28) ముట్టంగ.

యింకను ఆచార్లవారి పొత్తమునుండి యిట్టివెన్నో చూపవచ్చు. వీటిలో కొన్నిటికి అసకృదావృత్తికలదు. వారి విమర్శనాధోరణి ననుసరించినచో యీచూపినచోట్ల అంతోయింతో గ్రామ్యదోషమును చూపవచ్చును. యీ చూపినవాట్లలో వారు వుదాహరణంగా చూపిన మహాకవులకవనంలోవి కొన్ని, కొన్ని వారివివరణవాక్యాలలోవి. మా మతములో నివియన్నీ నిర్దుష్టములే. వారిమాట వారికివప్పగించేపక్షాన్ని యివిఅన్నీ దోషదూషితములే. యేది యెందుకు దోషదూషితమయిందని స్వామి బహుశః ప్రశ్నింప రనుకొంటాను. ప్రశ్నిస్తే విపులంగా వివరణం వ్రాస్తాను. యిప్పుడెందుకూ వృథాపరిశ్రమ? మఱిన్నీ వీరికి తెలుఁగువ్యాకరణ సంధులు తెలియవనుటకు చాలా వుదాహరణాలు దొరుకుతాయి. చూడండి యీవాక్యాన్ని "సౌభాగ్యము నొదవెడలంకారైక దేశములు". నావుడు, అనవుడు, యేమవుతారంటూ యెగతాళిచేయడం కలదు. వీరికి ఒదవెడున్ అను తద్ధర్మ విశేషణం రాముఁడువంటిదై సంధిని సంపాదించుకుంది. పయిగా సాహస మెంతో వున్నట్టు- అయితే, యోచించి యివి "సిద్ధిర్లోకాద్దృశ్యా" వల్ల సాధువులవుతాయని వ్రాయడంవల్ల కనపడుతుంది, పైసంధికూడా, యీ 'దృశ్యా'లోకే చేరుతుం దనుకుంటాను. యిట్టివి చూపవలసివస్తే మిక్కిలి పెరుఁగుతుంది వ్రాఁత. వారిమాట వారికి వప్పచెప్పడమే

నాపనిగాని, వారిని వెక్కిరించడంకాదుగదా. వీరు యితరులపద్యాలు వుదాహరించడంలో అవి యెట్టివో బొత్తిగా గమనించలేదు. పద్యమయితే సరి వుదాహరిస్తూవచ్చారు. వుదాహరణకి వకటి చూపుతాను–

క. ముసలాపెద్రేలుఁజన్నుల పసవంటిది లోభివానిబ్రదుకు ధరిత్రిన్.

అంటూ, స్తుతినిందల కుదాహరణంగా యిచ్చారు స్వామి. మళ్లా దేశకాల పాత్రాలు బాగా తెలిసినట్లు వ్రాంతలో మాటలు కనపఱుస్తారు. యీ కాలంలో యీ పద్యం, అందులో ప్రస్తుతం వుదాహరించిన పూర్వార్థాన్ని అసహించుకోని నాగరికులుంటారా? వామనుఁ డీలాటివుదాహరణాన్నే యిచ్చాఁడా? లోకంలో దీని వుదాహరణకు యీ మాత్రం మంచి పద్యమేలేకపోయిందా? దీన్నిబట్టి వీరికి ఛందోబద్ధమాత్రత్వమే పద్యానికి లక్షణంగా కనబడుతుందనుకోకతప్పదు. వ్యాకరణదోష దూషితమైనా పద్యమైతేసరి, వీరికి వుదాహరించడంలో సంశయం లేశమున్నూలేదు. చూడండి.

"శా. ... ... ... యెపుడేనా? యెందుకైనా? యిదేనా? వారందఱి తెల్వితేటలు సరేనా? గోపికావల్లభా!" వీరికి 'ఉదహరించు' 'ఉదాహరించు' ప్రయోగముల భేదమే తెలియదు.

దిఙ్మాత్రం ఆంధ్రవ్యాకరణపాండిత్యానికి వుదాహరించాను. న్యాయ శిరోమణిగారు కనుక వీట్లతో అంతగా పని లేకపోవచ్చును. యింక యితర కవిత్వాలు దిద్దేధోరణి కొంచెం వుదాహరించి ముగిస్తాను–

ఉ. అంచితులైన బంధుగులయందఱి ముందఱఁ జెప్పినిన్ను మె
చ్చిందెదఁ గుంతిచేతరవిచేత నిజంబని నీకు సాక్ష్యమి
ప్పించెద ఫల్గునప్రముఖవీరులు గొల్వఁగ నెల్ల భూమి యే
లించెద నచ్చకీర్తివిమలీకృత సర్వదిగంతరంబుగన్.

యీ పద్యవిమర్శనా ప్రసక్తిలోనే వీరు 'చండాల' పద ప్రసంగం చేసింది. యేదో దోషం వచ్చిందన్నారు. దిద్దుఁబాటు శాసించారు. చూడండి ఆ దిద్దుఁబాటు– "నిన్ను నెల్లెడ సరే 'యనిపించెద మందలించెదన్, లేక యెల్లవారును సరే యనునట్లుగ మందలించెదన్'. యీదిద్దుఁబా టెట్లున్నదో సహృదయుల నిర్ణయానికి వదలుతాను. యించుగాగమయతిగాని, రలాభేదయతిగాని అంగీకరిస్తేనేకాని విశ్రమం చెడుతుంది కూడాను పైదిద్దుఁబాటులో. తి. వేం. కవులు యే ఆశుధారాకవిత్వంలోనోతప్ప ఆ రెండుయతులనూ, సుతరామున్నూ అంగీకరింపరని స్వామి యెఱుంగ రనుకుంటాను.

ఆశుధారలోకూడా యేవకటిరెండో తప్పు దొరకకూడదు. పోనిందు యతిమాట కేమి? ఆయతులనుకూడా యెక్కడో బుద్ధిపూర్వకంగా కాకపోయినా ప్రమాదంవల్లనేనా తి. వేం. కవులువాడేవున్నారనుకుందాం. దిద్దుఁబాటు హృదయంగమమేనా? అని నేను సహృదయులనడుగుచున్నాను. ఆచార్లగారినికాదు. వీరిపోకడ కింకొకటి చూపి ముగిస్తాను. యీ ఘట్టంలోనే 'ఉ. కామముచేతఁగాని భయకంపితచిత్తము చేతఁగాని' అనే పద్యాన్ని యెత్తుకొని- 'భయముచేతఁగాని' అంటే బాగా అతుకుతుందని సవరణ నుపపాదించినారు. పద్యమన్న సంగతి మఱిచారేమో? అంటే, మఱిచినట్లున్నూ లేదు. కాదనడానికి 'శా. కామోత్కంఠత గోపికల్ భయమునం గంసుందు' అనే పద్యాన్ని వుదాహరించారు మళ్లాను వారితల్లికడుపుచల్లఁగాను. దానివల్ల మనకేంలాభమంటే, భయమునన్ అన్నట్టే కామమునన్ అంటే బాగా అతుకుతుందని స్వామి కెందుకు తోఁచిందికాదో! అనేవాళ్లకు అవకాశం కలిగింది కదా! యీలాటి వుపకారాలు చాలావున్నాయి స్వామివారు చేసినవి, యేదో సందర్భం కలిపించుకొని తెనాలిరామలింగకవిగారి

"చ. తెలియని వన్ని తప్పులని దిట్టతనాన సభాంతరమ్ములన్"

అనే పద్యాన్ని కూడా వుదాహరించారు. యిది వెనక దొంగ పాఱిపోతూవుంటే కాళ్లట్టుకు వ్రేళ్లాడుచున్న గేస్తురాల్ని మగఁడు, 'వొసేయివాఁడు వేళ్లు కొఱుకుతాఁడే" అన్నకథను జ్ఞప్తికిఁ దెస్తూవుంది. దీనికేంగాని స్వామి యీ పుస్తకం రచించడంలో చేసినలోపాలెన్నో వున్నాయి. అవన్నీ చూపడానికి నాకు వోపికలేదు. వయోమాత్రవృద్ధుణ్ణి గదా! లక్షణ భంగాలంటే ఛందోవ్యాకరణభంగాలకంటూ అనవసరంగా వారివీ వీరివీ వుదాహరించారుగాని స్వామి వుదాహరించకుండానే వారిస్వంతకవిత్వంతోనే అవి యెత్తుకుపోయేవి. శుద్ధపత్రికలో శ్రద్ధగా దిద్దినప్పటికీ, అజ్ఞానప్రయుక్తదోషా లింకనూ శరపరంపరగా వున్నాయి. వ్యావహారికభాష అనుకుందామా? స్వామివారిగ్రాంత అదిన్నీకాదు, గ్రాంథిక భాషందామా అదిన్నీకాదు, స్వాములారిభార్యలాఉంది. దీన్ని ఋజువుచేయమనిస్వామివారి ఆజ్ఞయితే చేస్తాను. యిట్టి పుస్తకాన్ని యేదో పరీక్షకు పఠనీయంగా యేర్పఱచిన యూనివర్సిటీబోర్డు వారు బుద్ధిపూర్వకంగా కాకపోయినావిధిలేక వ్యావహారికభాషను సమ్మతించినట్లయింది. కనుక ఆ పక్షంవారికి వంద్యులనుకోకతప్పదు. స్వామివారి విమర్శనాధోరణి మా అపూర్వకవితా వివేచనంలో చాలాకాలంనాఁడే చూపఁబడింది. యిప్పుడు మళ్లా చూపనక్కఱలేదు. "కంటికి నిద్రవచ్చునె? సుఖం బగునే? రతికేళి జిహ్వకున్" అనే శ్రీనాథునిపద్యాన్ని విమర్శించమంటే? స్వామి మొదట షష్ఠ్యంతంతో అన్వయం ఉంది కనక రెండోవాక్యములోకూడ షష్ఠ్యంతంతో అన్వయంవుంటేనేకాని

ప్రక్రమం చెడుతుందనక మానరనుకుంటాను. యిప్పుడేమంటేయేంలాభంగాని శ్రీనాథుడి కాలంలో అంటే బాగా సమ్మానం జరిగేది. "ప్రధ్వంసాభావము ప్రాగభావమనుచున్" అన్నపద్యం శ్రీనాథుఁడెందుకుఁ జెప్పాఁడో అనుకుంటే యిప్పటికి బాగా బోధపడింది, "అభణపు" 'ప్రకాస్తి' 'ఢిల్లీకి' అనేవాట్లని మఱవవద్దని స్వామికి హెచ్చరిక!

(షరా) వ్యాసం వ్రాసి పోష్టుచేసిన తరువాత వారిగ్రంథం అందింది. అందుచే అనుబంధం వ్రాయవలసి వచ్చింది అని చదువరులకు విజ్ఞప్తి చేసుకుంటున్నాను.

★ ★ ★

# వెక్కిరింపఁబోయిబోల్తాపడుటయే-1

దీనిని గూర్చి డిసెంబరు భారతి సంచికలో సంగ్రహముగ నే వ్రాసిన వ్యాసమును చదివిన నా శిష్యులు పలువురు నన్నుఁగూర్చి "ఈవయస్సులో, ఈ అనారోగ్యస్థితిలో మీకేల యీ పరిశ్రమము? అదిగాక మీరు సమాధానము వ్రాయఁదగిన యంశము లందేమియున్నవి? ఏమేని యున్నచో వ్రాయుటకు మే మెందఱమున్నారము కాము" అనుచు నన్ను మందలించుచు నుత్తరములు వ్రాయుచున్నారు. కొందఱు తమ తమ నేర్పుకొలఁదియు ఖండనములు వ్రాసి నాకడకంపియున్నారు. అందొక ప్రశిష్యుని ఖండనము నందలి పద్యములలోని యొక పద్య మిట నుదాహరించుచున్నాఁడను-

ఉ. "చాలును జాలు నీ వెఱుక చాలక దూఁకితి చింతనిప్పులో
లోలత, దోమయుంబలె విలోలుఁడ వైతివి, దారితప్పి, తో
యోలెటివార్ధి శీతకర! ఓపుదె? యొర్వఁగ వేంకటేశ్వరున్
మాలిమి వీడి వేఁడుము క్షమాపణ, వారిని వారి శిష్యులన్".

ఇతఁడు ప్రశిష్యుఁ డెట్లయ్యెనో యీ క్రింది యితని వాక్యముల వలన నవగత మయ్యెడిని.

"అయ్యా! నేను మీ శిష్యులగు మల్లికార్జున శాస్త్రులవారి తృతీయ పుత్రుఁడను. చిట్టిగూడూరి పాఠశాలలో విద్వాన్ ౨ వ క్లాసు చదువుచున్నాను. మీ పొత్తముపైవ్రాసిన విమర్శనకు నాకుఁదోఁచిన భంగిఁ బైరీతినుత్తరం బిచ్చితి..." (చేవ్రాలు)

ఈ ప్రశిష్యుని పేరు, వీరేశ్వరశర్మ. ఇంటిపేరు మల్లంపల్లెవారు. ఇతఁడు చాల పూపప్రాయము వాఁడనుకొందును. ఈతని తండ్రి మంచి విద్వత్కవి. కొమరులందఱును విద్వాంసులై పయికి వచ్చినారు. తండ్రిగారి యదృష్ట మభినందనీయము. ఈ ప్రశిష్యుని జూచిన జ్ఞాపకము లేదుగాని యితని యన్నలం జూచినట్లు జ్ఞప్తియున్నది. వారల విద్యకన్నను వినయము మిగుల నభినందనీయము. "విద్యవలనను వినయంబు" అను నభియుక్తోక్తికి నిజమైన యుదాహరణ మాబాలురే! ఇతఁడుగూడ నట్టి వినయము గలవాఁడే అని నా యూహ. అగుచో మన "విమర్శకబుధులు" శ్రీ సుబ్బారాయశాస్త్రులవారిపై నిట్లు కాలు

దువ్వవచ్చునా అనియు సంశయింతును. కాని సుబ్బరాయ శాస్త్రులవారేమంత తారతమ్యమును గమనించిరి నే గమనించుట”కని యితఁడనుకొని యుండునని సమాధానము చెప్పికొంటిని. అయినను ప్రశిష్యుని మందలించెదను. “అబ్బాయీ! సుబ్బారాయశాస్త్రుల వారుపాధ్యాయులు. నీ వింకను విద్యార్థివి. వయస్సులోఁగూడ నీకన్నవారు చాల పెద్దలు, తెల్వితేటలు దైవాధీనములు గదా! మనకు వయస్సే ప్రధానము. వారు వారి తప్పును గ్రహించి క్షమాపణ చెప్పికొన్నను చెప్పికొనకున్నను నీవు వారిపై కాలు దువ్వినందులకు క్షమాపణ చెప్పుట యుక్తమనుకొందును. కావున నటులొనర్తువుగాక”

చదువరులారా! ఇదివఱలో దీనిని గుఱించి నేను వ్రాయునప్పటికన్న నిపుడు కొంచె మెక్కుడు దేహారోగ్యము కల్గియున్నాను. లోకులు నా వ్రాయుట కంగీకరింపకున్నను “విమర్శకబుధుఁడు” గారి యింకొక వాక్యమును రంగమున కవతరింపఁజేసి రెండు పంక్తులు వ్రాసి విరమింతును. క్షమింపుఁడు-

“వరుఁడు నళినాసన వాహన హంసములలో నొకఁడు, వధువు నళినాసక రథవాహన హంస పతివంశ సంభవ. అట్లయినచో, నేకగోత్రజనితులకు వివాహ మంగీకరింప వలయునా?”

చూచితిరా? విమర్శకబుధుఁడు గారి ధర్మశాస్త్ర పరిశీలనము. హంసములకు వివాహమొనరించు పట్టునఁగూడ-

“చాతుర్థీం” అనుశ్లోకార్థమునేకాక “కూటస్థగణనాయాం తు స్వసారం మాతరం వినా, ఊనద్వాదశవార్షికీం” లోనగు శ్లోక తాత్పర్యములనుగూడ విచారించి కాని చేయఁగూడ దన్నంతలో నున్నది. ఒకటి మనమాలోచించుకోవలెనేమో? సర్వసామాన్యమైన పక్షులవిషయమే యగుచో “విమర్శకబుధుఁడు”గా రింత విచారింపరు. ఈ పక్షులకు మనుష్యభాషణాదులే కాక చాల విద్యలు వచ్చినట్లున్నది కావున వీని వివాహ విషయము మనుష్యులతోపాటుకూడా కాక అంతో యింతో బ్రహ్మసంబంధముకూడ నుంటచే బ్రాహ్మణులతోపాటు చేయింపవలెనని వారి తాత్పర్యమేమో? మహత్కార్యములగు సంభాషణాదులు వీనియం దుండుటచేతనే మహద్వివక్షచేసి “ఏకగోత్రజనితులు” అని ప్రయోగించియున్నారనుకొందమా? ఆ యీ సందర్భములనుబట్టి యా వివాహమునకు పంచకరహితమైన లగ్నముకూడ బలవత్తరమైనది యున్నంగాని విమర్శకుఁడుగా రొప్పరు కాఁబోలును! ఇంతేకాక రజస్వలా వివాహమునకుఁగూడ నొప్పరనుకోవలెను. పక్షుల విషయమున రజోదర్శన వయోనిర్ణయము వగయిరా లీయనకు తెలిసియే యుండు ననుకోవలెను. మఱచితి నింకొక పెద్దచిక్కున్నదిగదా! “శారదా” బిల్లుబాధ కూడ గమనింపక

యాలోఁగానే యాపక్షుల వివాహము జరుపవలె నని నిర్బంధింతురు కాఁబోలును! ఇతరుల కెటులైనను మాకును, ఈయనకును ఫ్రెంచిటవును యానాము పరిచయము పూర్తిగా నుంటచే బిల్లుబాధకు మేము భయపడము. అయ్యో! విమర్శనమా! నీకెన్నిపాట్లు వచ్చినవి! నీకర్మ మెట్లు కాలుచున్నదో చూచితివా? "కాదు, ఇది హూణభాషావేత్తల సంప్రదాయపు వాసనతో మిళితమైన విమర్శన" మందువా? అఘోరించినట్లే యున్నది నీ సమాధానము. చెప్పెద నాలింపుము. కాళిదాసు నెఱుఁగుదువా? రఘువంశ మెఱుఁగుదు వనుకొందును. అగుచో నందినీధేనువు నెఱుఁగకుందువా? ఎఱుఁగుదువు. దానియందున్న మహత్కార్యములను మాత్రమేల యెఱుఁగకుందువు? అగుచో ఆ నందినీధేనువునకు పంచభక్ష్య పరమాన్నములను బెట్టింపక కాళిదాసు దిలీపమహారాజు వంటి చక్రవర్తిచేత గడ్డినే పెట్టించినాఁ డేలొకో? తెలిసికొంటివా?

"శ్లో. ఆస్వాదవద్భిః కబళై స్తృణానామ్" - (రఘువంశము. 2 వ సర్గము)

ఎంత మహద్వివక్షకు తగినదానికేని జాతిధర్మ మనివార్య మనియే కద! ఆనందినీధేను సంతానమునకు దాంపత్యవిషయమున వరుసవావులుండునా? లోకముననున్న పశువులలో నెక్కడనేని యీ విషయము నెఱుఁగనివారు మనుష్యమాత్రులలో నేజాతిలోనేని గలరా? భవతు. అది పక్షివిషయము. ఈదృష్టాంతము పశువిషయ మందువేమో, పక్షులకు మాత్రము వరుసవావులున్నవా? హంసముల నెఱుఁగవుగాని పావురములనేని యెఱుఁగవా? ఏకగోత్ర జనితులకఁట! వివాహమఁట! అంగీకరింపవలయునఁట! మేలు! మేలు! మాటలాడనేర్చిన మాత్రాన జాతిధర్మములకు స్వస్తిచెప్పునెడల శ్రీహర్షాదుల కీజ్ఞానమేల లేకపోయినదో? "మృణాలాగ్ర భక్తులనుగా" శ్రీహర్షుఁ డాహంసముల నేల చిత్రించెనో కదా? చిత్రించుఁగాక. దానినాంధ్రీకరించిన శ్రీనాథునకుఁ గూడ సవరించు తెల్వి లేదాయెనే! "రసంబు పోషించియు అనుచితంబు త్యజించియు" ఇత్యాదికము లెన్నోమాట లుపోద్ఘాతములో వ్రాసికొని కదా శ్రీనాథుఁడాంధ్రీకరింప మొదలిడినాఁడు?

> "చదలేటి బంగారుజలరుహంబుల తూండ్లు
> భోజనంబులు మాకుఁ బూవుఁబోఁడి"

అని యేల యాంధ్రీకరించెనో? మనుష్య భక్షణ యోగ్యమైన వస్తువులనే భక్షించెదమని హంసచేఁ జెప్పించినచో "విమర్శక బుధుఁడు" గారి వంటివా రానందింతురుగదా! స్థాలీపులాకన్యాయమున "వెక్కిరింపఁబోయి" అనుసామెతను వాడినస్థలమునుబట్టియే "విమర్శకబుధుఁడు"గారి తెల్వితేటలు స్పష్టమయినవిగదా? పిమ్మట విమర్శించు పొత్తమునంగల సవరణను గుఱుతింపక వృథాసోదెను పెంచి విలువగల భారతిపత్రికకు

వ్యర్థపుఁబని గల్పించి "చావల్ఖరాబు" సామెతను జ్ఞప్తికిఁ దెచ్చుట వలన మఱింత స్పష్టపడియుండును. ఇఁక ఈ "ఏకగోత్రజనిత" వివాహవిచారమువలననో? "సర్వం సంపన్నం. సుసంపన్నం" అయినదనుకోని వారుండ రనుకొందును. ఈ వివాహసందర్భము ప్రథమాంకములోనిదే. ఇది నూటఁ దొంబది వంతులు పూర్తియగువఱకు తిరుపతిశాస్త్రిగారు జీవించియే యున్నారు. ఇది మనమందుఁ బెట్టికొని యీక్రింది గ్రంథమును దిలకింపుఁడు.

"తిరుపతిశాస్త్రిగా రొక్కరే సంపూర్ణముగ నీ నాటకమును రచించిన నిట్టి పూర్వోత్తరవిరోధము లుండకుండునో? లేక యింతకన్న నెక్కుడుగా నుండునో!"

"విమర్శకబుధుఁడు" గారి తాత్పర్యము కాదు గాని పైకిమాత్ర మీ వాక్యమున కర్థము, "అయ్యవారిని జేయఁబోయిన" అను సామెతకు స్ఫోరక మగుచున్నది కావున నిదిగూడ "బోల్తాపడు" అన్నదానితో జమకట్టుకొని, అతని తాత్పర్యమునుబట్టియే పైవాక్యమున కర్థము చెప్పికొందము. తానుతెల్పిలోపముచే మానాటకమునఁజూపిన లోపములకుముఖ్యకారణము, వేంకటశాస్త్రులుగారి రచనముగూడ నిందుఁ జేరుటయే యన్నది "విమర్శక బుధుఁడు" గారి తాత్పర్యమైయున్నది. అగుచో, ప్రథమాంకస్థమగు "ఏకగోత్రజనిత వివాహము" వెం. శా. రచనకు సంబంధించినది కాదుగద! ఇది స్వవచో వ్యాఘాతమా కాదా? బ్రదుకంతయు స్వవచో వ్యాఘాతముగా నున్నప్పుడు - ఇది అని విడఁదీసి చూపరాదని ప్రాజ్ఞులందరు కాఁబోలును! అగుచో, నీక్రిందిమాటలు వ్రాసి ముగింతునుగాక. బాగుగ నాలోచించినచో నీనాటకము రచించుటకు, తి. శా. గారును అర్హులు గారు, వేం. శా. గా రంతకుమున్నే కారుగదా! ఈ కథానాయిక ప్రభావతిగాని, నాయకుఁడు ప్రద్యుమ్నుఁడు గాని, లేక యిరువురుంగాని యేకొంచెమైనను అదృష్టవంతులే యైనచో నెన్నఁటికేని యిద్దాని రచనకు మావోలేటి వెంకటసుబ్బరాయశాస్త్రులవారే పూనుకోవలయునను కొందును. అది యటులుండె. సంశయమున్నచో, విమర్శక బుధుఁడుగారు వ్రాసినచొప్పున - "జీవితః కవేః ప్రష్టవ్యమ్" కనుక జీవించియున్న నాకొక కార్డు వ్రాసి కనుఁగోవచ్చునే! లేదా తనకన్నఁ గొన్ని రెట్లధికుఁడు తారతమ్యజ్ఞానశాలి, మాయింటి యల్లుఁడు, విశేషించి తనకన్నయునైన సూర్యనారాయణశాస్త్రి నడుగవచ్చునే! లేదా? అతనిద్వారమున నాకుకబురుచేసి తెలిసికోవచ్చునే! పత్రికలో వ్రాసియే కనుఁగోవలెనోటు? కావున నీ ప్రయత్నము సర్వథా యశస్సంపాదనార్థ మనుకోకతప్పదు. దానికిని మంచిమార్గము లనేకము లున్నవి. ఈయన వాని నన్నింటిని విడచి యీముళ్లకంచెలోఁ బడినాఁడు. పాపము! గ్రంథకర్తచే క్షమాపణ చెప్పించి సంతోషింపవలయునని యీయన కుతూహలము చూడుఁడు.

"పరిశీలించి సవరింప నక్కఱలేదనిన సంతసము"

పై వాక్యమువలన "విమర్శకబుధుఁడు" గారి కుతూహలము వెల్లడి యగుచున్నది గదా? ఈయనను తలఁచుగా మీరు విమర్శకబుధుఁడని వ్రాయుచుంటిరే, కారణ మేమని చదువరు లడుగుదురేమో? ఆ బిరుద మాయన వాక్యములయందలిదే!

"శ్లో. గుణదోషౌ... నియచ్ఛతి" అను విషయము విమర్శకాన్య బుధవిషయమని చెప్పవలయును."

ఈయన కేవల బుధుఁడు కాక "విమర్శకబుధుఁ" డఁట! అక్కతమున "గుణమును గ్రహించుట మాని దోషమునే గ్రహించు" నఁట! అందులకై వెదకి వెదకి– "వెక్కిరింపఁబోయి బోల్తాపడెను" కాఁబోలు! నాకు శీర్షికను వెదకికొను పరిశ్రమలేకుండఁ జేసిపెట్టినందులకీ 'విమర్శక బుధుఁడు' గారిని మిక్కిలి యభినందించుచు, నిప్పటికి దీనిని ముగింతును. ఇంకొకపరి "ప్రతిఫలన" మునుగూర్చి యోపిక తెచ్చుకొని కొండొకచో వ్రాయుదును. వ్రాయుట కేమిగాని యీ విమర్శక బుధుని లోలోనేని అన్న సూర్యనారాయణ శాస్త్రి మందలించుట యావశ్యకమని నా తలంపు. ఇది యుక్తమే యని తోఁచినచో నతఁడట్లొనరించుఁగాక లేదా, "కాదగ్గపని గంధర్వులే తీర్తురు!!"

★ ★ ★

# వెక్కిరింపఁబోయి బోల్తాపడుటయే-2

ఇదివఱలో రెండువ్యాసములు దీనింగూర్చి కొంత సంగ్రహముగా వ్రాసియుంటిని. ఇంకొక శంకనుగూర్చి యిపుడు వ్రాయుచున్నాను. ఆయన వాక్యమ్ములనే వ్రాసినచో గ్రంథము పెరుఁగును. కావున నా వాక్యతాత్పర్యమిట నుదాహరించి పిమ్మట నేను వ్రాయఁదలఁచినది వ్రాయుదును. ఆయనశంకయిది "ఒక్కశుచిముఖిపాత్రలో తి. వేం. కవులలో నెవరో యొక్కరే ప్రతిఫలింప వీలగును గాని యిరువురును నెట్లు ప్రతిఫలింప వీలగును" అని. శంకించువారి ముఖ్యతాత్పర్యమిది మాత్రమే యైనను దీనిని బలపఱుపఁదగిన వాక్యములు చాల నున్నవి. ప్రభావతీప్రద్యుమ్నము తి. శా. గా రొకరే రచింపమొదలిడినారు గాన ప్రథమాంకము నందలి ప్రతిఫలనము యుక్తమేకాని, ద్వితీయాంకమునందలి వేం. శా. గారి ప్రతిఫలనము మాత్రము యుక్తముకాదని తేల్చినట్లగుపట్టెడిని. వ్యంగ్యముగాఁగన్పట్టు విషయముగదా ఇది? అట్టి సందర్భమున నిట్టి స్తనశల్యపరీక్షతో నావశ్యకతయే యుండదు. మాటవరుసకు, పోతన్నగారికి నేపాత్రము నందు భాగవతమున ప్రతిఫలనము కలదో విచారించిన, విశేషించి వామనునియందని తేలును. అది సంస్కృతమున కనువాదమని త్రోసివేయరాదు. ఆ ఘట్టమున పోతన్నగారి స్వకపోలకల్పితము చాలనున్నది. అగుచో నాయా లక్షణములన్నియుఁ బట్టింపవలె నన్నఁ బట్టు నా? "ఒంటివాఁడఁ జుట్ట మొ కఁడులేఁడు" అని వామనుఁడనియె. పెండ్లమును, బిడ్డలును గల పోతన్నగారియెడల నిదిసమన్వయించునా? కావున వలనైనంతవఱకును సమన్వయమును గమనింపవలెను. ఇరువురొక పాత్రమున ప్రతిఫలించుట యొకటేయద్దమున నేకకాలమునఁగాని, లేక పర్యాయముగాఁగాని పలువురు ప్రతిబింబించుటవంటిది యనుకొన్నచో సుళువుగాఁ దేలుచున్నను విమర్శకులు మిక్కిలి పెంచి కోలాహల మొనర్చిరి. ఇయ్యెడ విమర్శకుఁడుగా రొనర్చికొన్నశంకా సమాధానములు, "తుమ్మికొని దీర్ఘాయుష్య" మనుకొనుతరగతిలోనివి. విమర్శకుఁడు వసుదేవుని యాగమున నవధాన మొనర్చిన దొక్కశుచిముఖియే యనుకొని కొంత చెత్త పెంచెను. తోవాసముగా వేఱొకహంసమున్నది. నన్ను-నాకు-నేను అను నేకవచనములు బాధింపవు. అపుడు మాటలాడుచున్న దెవరు? పరికింపుఁడు. ఒక్క శుచిముఖిపాత్రముమాత్రమే కావున, తత్తదేకవచన ప్రయోగములు లేశమును బాధింపవు.

రాజ - "నేను గొంత పరివారముతో,

క. విద్వాంసు లనేకులుగల తద్ద్వారక కేగి శతవధానముచే... ..."

పైగ్రంథమువలన శుచిముఖి యొంటరిగా వెళ్లలేదనుట స్పష్టము. ఆ పరివారములో శుచిముఖితో నాఁడవధాన మొనర్చునపుడు తోడుగా నున్న హంస మాంతర్గతము. కావుననే, ద్వితీయాంకమున శ్రీకృష్ణుఁడు, "మీరిరువురును కన్నులకుఁ గట్టినట్లగపట్టిన ట్లయ్యెడిని" అనియు, పరిచారకుఁడు "మీరిరువురు గాదూ?" అనియు నడుగుట సంభవించిన దని బాలురకుఁగూడ సుగమమే. అయినను విమర్శకబుధుఁడుగారి కీయంశము గోచరించినట్లు లేదు. ఈ విమర్శకుఁడు తుట్టతుద కేదో చేదస్తపు వ్రాఁత వ్రాసివ్రాసి తిరుపతి శాస్త్రిగారు ప్రతిఫలనము నంగీకరించిన ట్లీయక్కరములు తెల్పెడిని. "తిరుపతి శాస్త్రిగారు ప్రతిఫలించుట గమనింపక కాఁబోలు వేంకటశాస్త్రిగారు... నాటకమును వ్రాయుటకు ప్రారంభించిన తిరుపతిశాస్త్రిగారు స్వవిషయమును తెలియఁబఱచుటలో లోపమేదియును గానరాదు" పైయక్కరములు తి. శా. గారి ప్రతిఫలనమంగీకరించినట్లగుపట్టెడిని. కాని యీ విమర్శకునకు ప్రథమాంకప్రారంభమునందలి తి. శా. గారి యీవాక్య మేల విరోధింపదో చదువరులు పరికింతురుగాక.

"శతావధానులు తిరుపతి వేంకటేశ్వరులు రచించిన ప్రభావతీ ప్రద్యుమ్న నాటకమే నేఁడు ప్రదర్శింపఁబోవునది" ఉభయకర్తృకత్వ మున్నప్పుడు ప్రతిఫలన ముభయులకును వివక్షితమై తీరవలసినదే కదా! అట్లయ్యేనేని విమర్శకుఁ డొక్కరికిఁ ప్రతిఫలన మెట్లు సమంజస మనుకొనెనో? మఱియు, "నాకవిత్వంబునకు మెచ్చి సరస్వతియే బాలసరస్వతియను బిరుదొసంగి యీ గండ పెండేరంబు కాలికిం దొడిగె." బాలసరస్వతీ బిరుదమునటుంచి ఈ "గండపెండేరము" అనుదానిని సమన్వయ మెట్లుచేసికొనెనో? ఇది బందరునుండి యుపాధ్యాయత్వము విరమించుకొని వచ్చునప్పుడుగదా యిచ్చినది. అగుచో నాయుపాధ్యాయులు తి. శా. గారే యనుకొనెఁగాఁబోలు! పోలు!! పోలు!!! కాకినాడలో నున్నది యెవరో, బందరులో నున్నది యెవరో తెలిసికొనుపాటి వివేచనము తెలియనితాను ఆయనప్రతిఫలనము యుక్తము, ఈయన ప్రతిఫలన మయుక్తము అని చేటభారతము వ్రాసెనే! ఔరా! సాహసము! పోనీక్షణకాలము తి. శా. గారు, కాదు వేం. శా. గా రొక్కరే ప్రతిఫలించినట్లు వ్రాయవలెననుకొని విమర్శకుఁడుగారు- "టెంకాయిపిచ్చికొండ" చేసి రనుకొని పరిశీలింతమా? అప్పుడీయక్కరములు కుదురవు. "మఱియు రాజరాజేశ్వరీషోడశీ మహావిద్య నభ్యసించితి" వేం. శా. గారి ప్రతిఫలనమున కీ "రాజరాజేశ్వరి" వ్యతిరేకించును. ఇది ప్రత్యేకించి తి. శా. గారికే సంబంధించినది.

ఈయంశము కొలఁదిమాసములనాఁడొక వ్యాసమున వ్రాసియున్నాను, చూడుఁడు. "తి. శా. గారు అవసాన కాలమునకు నాలుగేండ్లకు ముందు మంత్రశాస్త్రమున మిక్కిలిగాఁ బరిశ్రమచేసిరి." (అపవాదలు చూ.)

తేలినసారమేమన? శుచిముఖిపాత్రలో విమర్శకునిత్రోవ ననుసరించి మాయిరువురలో నెవరి ప్రతిఫలనముగూడ లగింపదు. అగుచో తి. శా. గారిదిమాత్రము సమంజసమని విమర్శకుఁడుగారు వ్రాయుట కర్థము లేదని తేలినది. ఈ ప్రభావతీప్రద్యుమ్న నాటకము నిటు లుంతముగాక. "భూదేవతాగారగోదావరీతీరకంకణగ్రామంబు కాపురంబు" కంకణగ్రామ మనఁగా? కడియ మనియే కదా! ఆగ్రామ మిరువురకును నివాస గ్రామమని చదువరులు విశ్వసింతురా? ఇది విమర్శకుఁడుగారి కెట్లు సమన్వయించినదో? కాదు. వేం. శా. గారికి మాత్రమే అనిసమన్వయించుకొనిరందురా? అగుచో, ఆసీసగీతిలోని "తగు నుపాస్యంబు కాళీపదంబు మాకు" అనునది బాధించునే? విమర్శకునిత్రోవనుబట్టి మా కవనమునఁ గుదురని వెన్నియో కలవు. వానినన్నిటిని జూపుచో గ్రంథము బళ్లను దోలవలయును కావున నిఁకనొకటిమాత్రముచూపి విమర్శింతును. "చ. తిరుపతివేంకటేశు లని ధీరులు పిల్తురు... ... ...ఈకవిత్వ మనఁగా? నది పిన్నటినాఁడెపుట్టె నబ్బురముగఁ బెంచికొంటిమి" ఇయ్యది విజయనగరపుమహారాజావారి పద్యములలోనిది. పిన్ననాఁటి నుండి కవిత్వము చెప్పినదెవరు? "గోచివెట్టకమున్న కోమలకవిత చెప్పినవాఁడు సహపాఠి వేంకటకవి" (దేవీభాగవతము) ౧ స్కం.) "ఉ. గోణము పెట్టుటాది బుధకోటి నుతింపఁ గవిత్వవైదుషీ వేణికయౌచుఁ బేర్పడిన వేంకటశాస్త్రికి"

(గీరత ప్రథమ భాగము)

తిరుపతిశాస్త్రిగారు వ్రాసిన పయిసందర్భమునుబట్టి బాల్యమందే కవిత్వము పుట్టుట వెం. శా. గారికని తేలినను తి. శా. గారికెప్పుడు కవిత్వమారంభమైనదనియుఁ దేలదు. (కాళీసహస్రమునుండి) "శ్లో. సాహిత్యాం గురుపాణి నీయజనితా, పౌరాణ సంవర్ధితా - దేశాలోకన పుష్పితాచ కవితాకన్యామయి ప్రత్యయాత్ - వవ్రేమాం స్వయమేవ"

పైశ్లోకార్థము ప్రౌఢావివాహమును ధ్వనింపఁ జేయుచున్నది. ఇది తి. శా. గారి శ్లోకము. అతఁడు బ్రహ్మయ్యశాస్త్రులవారి సన్నిధికి వచ్చునప్పటికి ౧౭ వత్సరములు దాఁటినవి. పిమ్మట నొకటి రెండేండ్లకుఁగాని కవిత్వరచనకు తి. శా. దిగలేదు, కావున నట్లు వ్రాసికొనెను. పైశ్లోకములో "మయి" మామ్ అనునేకవచనములను గూడా గమనింపవలయును. విమర్శకుఁడుగారి ధోరణి కీయేకవచనములుగూడ ప్రస్తుతనాటకము నందలి ప్రతిఫలనమువలె నస్త, వ్యస్తములే కావలయును. అది యటులుంతము. తి. శా.

గారి జీవితకాలములో నేనుమాత్రమే రచించిన కామేశ్వరీశతకములో, "సహాధ్యాయింగాంనల తిర్పతిన్ సలిపి" అని యొకపద్యము వ్రాసియున్నాను. కాని ఆశతకముకూడ "తిరుపతి వేంకటీయము" అనియే ప్రకటింపఁబడినది. ఇదిమాత్రము విమర్శకుఁడుగారికి సమన్వితమగునా? ఆయన ప్రత్యేకించి వ్రాసినవియుం గలవు. మచ్చునకొకటి చూపుదును. "తిరుపతిశాస్త్రి తెలుంగుఁజేసె" అని బాలరామాయణ ప్రస్తావనలోనున్నది. ఆ బాలరామాయణముకూడ - "తిరుపతి వేంకటీయమే". ఇదిమాత్రము విమర్శకుఁడిగారి కెట్లు సమన్వయించును? పైఁగా ఆవాక్య మే సీసపద్యమునందున్నదో ఆ సీసపద్యములో తి. వేం. కవు లిర్వురును శ్రీ పోలవరపు జమీన్‌దారుగారి యాస్థానమున నున్నట్లే తెలుపు వాక్యముగూడ నున్నది. ప్రత్యేకించి తి. శా. గారికిఁగల పై సంబంధము వెం. శా. గారికి విమర్శకుఁడుగా రెట్లు లగింపఁజేతురో? ఈ సీసములోని వాక్యము నెట్లో విడఁదీసి, తి. శా. గారికి మాత్రమే సమన్వయించి సమాధానము చెప్పికొందమన్నను బుద్ధచరిత్ర పీఠికలోని యీ క్రిందివాక్యమట్లు చెప్పుకోనీయదే? "అని కోరికొని నాటఁగోలె నా ప్రభువుచేఁ బోషింపఁబడుచు దదాస్థానమంద యుంటిమి". ఎక్కడో వ్యంగ్యమర్యాదచే స్ఫురించెడి ప్రతిఫలనమునకై బోలెఁడు వెక్కిరింపుమాటలను వ్యయమొనర్చిన విమర్శకుఁడు గారికి వాచ్యముగానున్న పైవిషయము మఱియు నసంగతము కావలయును గదా? లేక నేను గూడ శ్రీపోలవరపు జమీన్‌దారుగారి యాస్థానమం దుండి పోషింపఁబడినట్లేమేని యాధారములు చూపఁగలరా? దీనిని గుఱించి దివాకరాస్తమయములో విస్తరించి కలదు గాన వలయువారందుఁ దిలకింపఁగలరు. ఇట్టి బుద్ధిమంతులు బయలుదేరుదు రని నే నించుక గుఱితించియే దానియం దొకింత ప్రస్తుతవిషయము నుట్టంకించితిని. అట్లుచేసినను, "భక్షితేఽపి లశునే న రోగశాంతిః" అను న్యాయము కతన, ప్రయోజనము కనుపట్టనే లేదు. "ఏదో తోఁచినట్లు వెక్కిరించెనే కాని విమర్శకుఁ డిన్ని చూడలే" దని కొందఱనవచ్చును. సమ్మతమేకాని దేనిని విమర్శింప మొదలిడెనో దానింగూడఁ దిన్నగాఁ జూడలేదని ఋజువుచేసితినిగదా? "అవును సత్యమే. ఆయన నేమిచేయమందు"? రనియెదరా? యేమియును జేయవలదు. తరువాయి నరయుఁడు - ఇంతవఱకు, తి. శా. గారి జీవితకాలమున జరిగినరచన లుదాహరింపఁబడినవి. తి. శా. గారి స్వర్గతికిఁ బిమ్మటివికూడ, "ఆరోగ్యకామేశ్వరి", "ఆరోగ్యభాస్కరము", "మృత్యుంజయస్తవము" లోనైన పద్యములును, కొన్నివచనములును వేం. శా. గారి వున్నవి. వానినన్నిటిని ఉభయ కర్తృకములుగనే షష్టిపూర్తి కమిటీవారు ప్రచురించుచున్నారుగదా! అందలి పద్యముల కుభయకర్తృ మెట్టుమనవిమర్శకబుధుఁడుగారికి సంగతమయ్యెడిని? 'బొబ్బిలిపట్టాభిషేకము' గూడఁ దిరుపతి వేంకటీయమే. ఇవియన్నియు విమర్శకునకు నసంగతములే యని తేలినది.

ఇట్టి ప్రాజ్ఞులకొఱకే కాఁబోలును కాటూరి వేంకటేశ్వరరావు జాతకచర్య పీఠికలో నీక్రింది యక్కరములు లిఖించినాఁడు. "ఈగ్రంథము వేంకటశాస్త్రులవారి పృథగ్రచనమే యైనను- "ఒక్కరు రచియించిరేనియును గాఁదగుఁదిర్పతి వేంకటీయమై" అనువారి సమయము చొప్పున నుభయకర్తృకముగానే ప్రకటించితిమి." పైరీతి నంగీకరించి ప్రకటించినవారికి మన విమర్శకుఁడుగారికిఁ గల్గిన సందేహము కలుగలేదనుకోవలయునా? ఈ సమయము ప్రస్తుతవిమర్శకుఁడుగా రెఱుఁగ రనుకోవలయునా? లేక యెఱిఁగి కూడ దీనివిషయమున విమర్శకుఁడు తనయనంగీకారమును లోకమునకుఁ దెల్పుటకే యీవ్రాఁత వ్రాసియుండుననుకో వలయునేమో? తుది యభిప్రాయము కూడ నిలువదు. ఏమందురా? అట్లే యైనచో తి. వేం. కవుల సమయము నుదాహరించి పిదపఁ దన యసమ్మతిని దెలుపవలసియుండును. అట్లొనర్పలేదుకదా? అదియునుగాక తి. వేం. కవుల సమయమును కాదనుట కీవ్యక్తికేమి యధికారము? ఇంతవఱ కెవ్వరును దీని నంగీకరింపనివారు లేరే? పైఁగా వీరి కీమైత్రి యెట్లింతకాలము నిలచినదని యక్కజపడుచు సంతసించుట జగత్ప్రసిద్ధమే కావున విస్తరింపను. తి. శా. గారి స్వర్గతికిఁ బిమ్మట నొకపుష్కరపరిమిత మగు కాలమునకు జరిగిన నా షష్టిపూర్తిసందర్భములో నొకరు తిరుపతి శాస్త్రిగారు కూడ వచ్చి యాసభ నలంకరించినట్లే భావించినారు. చూడుఁడు. "తిరుపతి దివ్యరూప మరుదేరెను మీదగు షష్టిపూర్తికిన్". కవికి ముఖ్యమైనది భావనాశక్తి. అట్టిశక్తిని పైపద్యములో తత్పద్యకర్త ప్రదర్శించినాఁడు. ఇఁక తి. శా. గారి కొమారుని భావశక్తి నుపపాదించి విషయాంతర ముపక్రమింతును. "వేంకటేశ్వరరూపమ్మున నున్న తండ్రికి నమోవాకమ్ము లర్పించెదన్". ఆయీ భావనలవలన లోకులు విద్యాసందర్భమున వారొనర్చు కొన్న సమయము నేమాత్రమోకాక పూర్తిగా నామోదించుచున్నట్లు స్పష్టము. ఈ విషయమున నుదాహరింపవలసినచో నెన్నియో కలవు. విస్తరభీతిచే సూచించి విడచితిని. విమర్శకుఁడుగా రిట్టిలోకులలో నొకరుకదా? వీరీ మార్గమును వదలి "నేల విడిచిన సామునకు దిగు" టెట్టిదో? బందరులో కారణాంతరమున నొకరేకైకొన్న గండపెండేరము వేఱొకరికిఁ గూడ నున్నట్లే సమన్వయించుకొన్నట్లును, కాకినాడలో నిం దొకరుమాత్రమే జపించిన రాజరాజేశ్వరీవిద్య యుభయులకును గలిగినట్లే సమన్వయించుకొన్నట్లును ప్రథమాంకము నందలి శుచిముఖి వాక్యములవలన సుళువుగా దేలుచున్నను విమర్శకుఁడుగారు "ముంజేతి కంకణమున కద్దము"ను గోరినట్లు "జీవతః కవేః ప్రష్టవ్యమ్" అని యీ వృథావ్యాపారమునకు దిగినకారణమేమో? మఱియు జాతకచర్యలో "ఆ-యయలకు లేదు భేద మరయంగఁ గుటుంబములందుఁ దక్కినన్" అని కంఠోక్తిగాఁ జెప్పఁబడియున్నదే! మాకు జరిగిన

విద్యావిషయపుసమ్మానములు నూటఁదొంబది తొమ్మిదిన్నఱవఱకు జంటగానే జరిగినవి. తక్కిన యఱయు ప్రత్యేకించి జరిగినను అయ్యదికూడ నిరువురము జమకట్టుకొనువారము. ధనవిషయమునఁ గూడ నిట్లేయని యెఱుఁగఁదగు నని చదువరులకు నాయొనర్చు విజ్ఞప్తి. సుమారు నలువదియేండ్ల నాఁడు నేను జీవిత సంశయావస్థలో నున్నప్పుడు శ్రీజయంతి రామయ్యపంతులవారు నరసరావు పేటలో డిప్యూటీ కలెక్టరుగా నుండి మమ్మువధానార్థ మహ్వానించిరి. అపుడు తి. శా. గారు మాత్రమే వెళ్లిరి కాని, అట జరిగిన సమ్మానము తి. శా. గారింటనేయున్న నాకును బంచి పెట్టిరి. బందరు నేను ప్రవేశించుటకు మున్నొకటిరెండు సంవత్సరములు మాత్రము మాలో మా కీవిషయమునఁ గొంత చర్చజరిగి పృథక్త్వము తటస్థించినది. అప్పటిదే శ్రీకాకుళము, మందసా, నూజివీఁడు లోనగు కొన్ని సభలలోని సమ్మానము. అది తప్ప పృథక్కరణము మాకెన్నడును ద్రవ్యవిషయమున లేనేలేదు. రచనలో నపుడును లేదు. అంత నేను బందరు ప్రవేశించితిని. వెంటనే శ్రీ వానమామలస్వామివారి యాహ్వానము సంఘటించినది. కలిసియే వెళ్లితిమి. పిమ్మట బందరులో నన్ను సమ్మానించుటకై పౌరులు చేసినసభ బొత్తిగా కవిత్వమునకు సంబంధించినది కాకపోఁబట్టి సభలో తి. శా. గారి ప్రసక్తియేమియు లేని కారణమున దాని కతఁడు నల్వురు పండితులతో పాటుగ నాహ్వానింపఁబడియు రాలేదు. పదపడి యతని జీవితాంతమువఱకును కలిసియే అన్నవరోత్సవాదుల కరుగుచుండుట ప్రసిద్ధమే. అతని స్వర్గతి యనంతరమునఁ గూడ నేను అన్నవరపు వార్షికమును గొన్ని సంవత్సరములవఱకు నాతని కుటుంబమునకు సరిగా పంచిపెట్టుట ఆ జమీన్‌దారు లెఱిఁగినదియే! పిమ్మట జమీన్‌దారులే పంచిపెట్టకుండ నాఁపుచేసి, తి. శా. గారి కొమరునకు వేఱుగా వార్షికము నేర్పఱచిరి. మఱియు నేలూరిలో తి. శా. గారి స్వర్గతికిఁ జాల నిటీవల శ్రీ మోతే నారాయణరావుగారు మా మృచ్ఛకటికమును బ్రదర్శించుచు నన్నాహ్వానించి నూటపదాఱులు సమ్మానించిరి. అది సైతము నేను పంచి యిచ్చితిని. ఇంతయెందులకు వ్రాయవలసివచ్చినదనఁగా, మాకుఁగల కవితాసంబంధ మిట్టిదని తెల్పుటకే. అతనిబంధుగులెల్లరు నన్నతనింబలెఁ బ్రేమించి వరుసవావులతో గౌరవింతురు. నాబంధువు లతనింగూడ నట్లే. ఈవిషయము ప్రస్తుత విమర్శకబుధుఁడుగారి తండ్రిగారును, పెద్దతండ్రిగారును గూడ నెఱిఁగినదే. జీవిత కాలమునందలి యవినాభావమును గూర్చి కొంతయు, తి. శా. గారి జీవితముతరువాతి యవినాభావమును గూర్చి కొంతయు సంగ్రహముగా వివరించితిని. భవిష్యద్విషయమున నాయభిప్రాయ మెటులున్నదో తిలకింపుఁడు. ఇటీవలి చర్యనుండి,

తే.గీ. "కొడుకు నామేనగోడలికొడుకుఁగూడ
శతవధానంబు నాఁ జనుస్యందనంబు
నడపుటకు నాకు మిగుల నానంద మయ్యు
మనములో నున్న కోరిక మఱపురాదు".

చ. తిరుపతి నేనునుంబలెనె తిర్పతిపుత్రుఁడు మత్సుతుండు ని
ర్వురు గవగూడి సత్సభలఁ బొంపిరివోయెడిపాండితిన్ బర
స్పర మవధానమున్ సలిపి పండితులం దరఁగించుచో యశ
స్కరమగు మాకు నిర్వురకు సర్వవిధమ్ముల నంచు నెంచెదన్.

తే.గీ. "ఇందులకుఁ దగ్గ సామగ్రి యేఱుపడియుఁ
బట్టదయ్యె నీదృశమహాభాగ్యగరిమ
వచ్చుతరమునవేని తిర్పతిమనుమలు
నామనుమలు తీర్తురుగాక నాదుకోర్కి."

విస్తర మెందులకు? తి. వెం. కవుల యవినాభావ మెఱుఁగని వారెవరు? "రోళ్లా రోకళ్లం బాడినకూరుము లెపుడింతదాఁచికొన్న నణఁగునే" అయ్యది దేవీభాగవతమునందలి శివశక్తుల యభేదమువంటిది.

ఆ.వె. "అతఁడ యేను నేన యాతఁడు భేదం బొ
కింతయేని యుండ దిరువురకును
బుద్ధిమంతులైన పురుషు లెఱుంగుదు
రెఱుఁగలేరు బుద్ధిహీనజనులు."

– దేవీభాగవతము, 3 స్కంధము

తి. శా.గారి బిరుదములు వేం. శా. గారికి, వేం. శా. గారి బిరుదములు తి. శా. గారికి సమన్వయించినట్లే, ఆయన ప్రతిఫలన మీయనకును, ఈయన ప్రతిఫలన మాయనకును కడు సులువుగా సమన్వయించునని మున్మందే నిరూపింపఁబడినది. వాస్తవమునకు హంసములు రెండుగాని యెక్కటిమాత్రమే కాదనుట నిర్వివాదము. విమర్శకుఁడుగారు హంస మొక్కటిమాత్రమే వసుదేవుని యాగమునకు వెళ్లియుండలేదను చోట్ల నుదాహరించియు నీయంశము స్ఫురింపక కాఁబోలు లేనిపోని వికల్పములకుఁ గడంగెను. హంసములు రెండైనను దేనియం దెవరు ప్రతిఫలించిరో యనునంశము విడఁదీయవలసిన యావశ్యకత లేదు. నాటక మొక్కరే మొదలిడినను నిరువురు మొదలిడినట్లే

తి. వెం. కవులసమయమని వ్రాసి, అందులకుఁ గల యాధారమును ప్రస్తావననుండి యుదాహరించి యున్నాను. వసుదేవునిజన్మము నప్పుడు శుచిముఖియు వేఱొక హంసమును జంటగా నుండి శతావధానము చేసినట్లు స్పష్టముగాఁ దెలియు నక్షరములు నాటకమునఁ గలవు. శుచిముఖితో జంటగానున్న హంసముపేరు వ్రాయవలసిన యావశ్యకత లేమింజేసి వ్రాయలేదు. ఆప్రశ్నము జనక మహారాజు భార్యపే రెవరనుటవంటిది. ఇది యిటులుండె. తి. వెం. కవులకు దేవీభాగవతములోని శివశక్తుల యవినాభావ ముదాహరణ మీఁబడినదిగదా! వీరిలో నెవరికిఁ బ్రాధాన్యము అను చొప్పదంటుశంకకూడారావచ్చును. కావునఁ గొన్ని యక్కరము లప్రస్తుతములేయైనను వ్రాయుదును. ద్వంద్వసమాసమును బుచ్చికొందము. "శివకేశవులు" ఇట నిరువురకును ప్రాధాన్యము తుల్యమే యైనను నొకరి కొకపరియును, వేఱొకరికి వేఱొకపరియును పర్యాయముగా ప్రాధాన్యము వివక్షింపవలసి వచ్చును. కారణమేమన? సమాసమెట వచ్చునో అచట నేకార్థీభావరూపసామర్థ్య ముండి తీరవలెను. ఆ సామర్థ్యములోని ముఖ్యాంశము విశేష్యవిశేషణభావము. అయ్యది ద్వంద్వము నందలి పదముల కితరసమాసమునందలి పదములకుంబలె సులభముగా లగింపదు. అక్కతమున నెటులో కల్పించుకోవలసివచ్చును. దాని స్వరూప మిట్టిది. 'శివసహితః కేశవః' అని యొక పరియు, "కేశవసహితశ్శివః" అని యొకపరియు వారివారి యిచ్ఛ ననుసరించి చెప్పికొందు రనుకొందము. అప్పుడొకరికొకప్పుడును, వేఱొకరి కింకొకపరియును ప్రాధాన్యా ప్రాధాన్యములు వచ్చినట్లే తి. వెం. కవులలోఁ గూడ వివక్షించుకోవలెను. జంటకవులు గదాయని సభలలో మాటలాడు నపుడుగాని, యింటఁగూర్చుండి కవిత రచించునపుడుగాని కంఠస్వరములు కల్పియే యా యావాక్యము లుచ్చరింతు రనుకొనువారుండరు. ఎప్పుడెవరు మాటలాడుదురో వారు ప్రధానులు. రెండవవా రప్రధానులు. ఆయీవిషయమాబాల గోపాలముగా నెఱిఁగినదే యయ్యును దీనినిగూడ నవగతము చేసి కోనేరని విమర్శకుఁడు మాకర్మముకాలి మాకుఁ దటస్థించుటచే నింత చెత్తప్రసంగము వ్రాయవలసివచ్చినది. ఇందుల కుదాహరణముగూడ నిత్తును.

"ఒకచరణం బతండు మఱియొక్కటి నేనుమఱొక్క టాతఁడున్". ఈ పద్యము గద్వాలరాజుగారిని గూర్చి మాటలాడుసందర్భములోనిది. పేరులేనందున తి. శా. గా రుచ్చరించినదో, వేం. శా, గా రుచ్చరించినదో నిర్ణయము చేయవలనుగాదు గాని యిరువురును కంఠస్వరములు కల్పి యుచ్చరించిన దని మాత్ర మెవ్వరును చెప్పరు. మఱియొకటి,

"తిరుపతి యతండు వేంకటేశ్వరుఁడ నేను, వెరసి తిరుపతి వేంకటేశ్వరుల మేము" ఈ పద్య ముచ్చరించినది వేంకటశాస్త్రియని స్పష్టము. అపుడు తి. శా. గా రూరక యుందు రనుట సుగమము. ఇట్లే తి. శా. గారు చదువుచున్నప్పుడు వేం. శా. గా. రూరక యుందురు. అవధానసమయముననో? చెరియొక చరణముగా నొడువుదురు. కాని అపుడుగూడఁ బ్రత్యేకరచన కొంతయుండును. ఇది పలువురు ప్రేక్షకు లెఱిఁగినదే. ఇఁక ప్రస్తుత ముపక్రమింతము. ప్రథమాంకములో శుచిముఖి మాటలాడుచున్నది. అందు తి. వేం. కవులకుఁగల ప్రజ్ఞలు వ్యంగ్యమర్యాదచే నగపట్టుచున్నవి. అట్టిచో నయ్యవి తి. శా. గారి ప్రజ్ఞలా? వేం. శా. గారిప్రజ్ఞలా యని శంకించుకోవలసి యేమివచ్చెను? ఇరువుర ప్రజ్ఞలును గూడఁ గావచ్చునే? రచనకు మొదలిడినవారిరువురా, యొకరా యని శంకింపనేల? ఒకరు మొదలిడినను ఇరువురు మొదలిడినట్లే వ్రాసికొనుట తి. వేం. కవుల యాచారమైనట్లు ప్రస్తావనలోని వాక్యము ఘోషించుచున్నది కదా! వారు మొదలిడిరి, వీరు మొదలిడిరి అని వ్రాయుటకు మా యితరపుస్తకములలో నెక్కడోకాని యాధారములే దొరకవు. మధ్యకాలమున, తి. శా. గారు స్వర్గతులగుచే స్వయముగా నీవిషయ ముపోద్ఘాతములో వ్రాయుట వలన విమర్శకుఁడు దానింబట్టి వ్రేలాడఁదొడఁగెను. అంతమాత్రమున తి. వేం. కవులసమయ మేమగును? సమయము నెఱిఁగియో యెఱుఁగకో యేవో కొన్ని పుటలు భారతిలో వ్యర్థముగా వమ్మొనర్చినను, ఈ విమర్శకుని విషయమున నింతగాఁ గలుగఁజేసికోఁదలఁపను గాని యితని హృదయమునఁ గొంత దురభిప్రాయ మున్నట్లు కనుపట్టుచున్నది. అది యెట్టిదన? ఇరువుర జీవితకాలమైనచో మా యిరువురకును, ప్రస్తుతము మా యిరువుర కుటుంబములకును, విరోధము కల్పింపవలయు నను నట్టిదియే. ఈ విషయ మాయన విమర్శనా వ్యాసములోని యక్కరములను సవిమర్శముగాఁ జదివిన బుద్ధిమంతులు గ్రహింపఁగలరు గాన విస్తరింపను. ముఖ్యాంశము, వసుదేవుని యాగమున శతావధాన మొనర్చినది శుచిముఖి మాత్రమేకాదు; వేఱొక హంసముకూడనున్నది. ఇది వాచ్యవృత్తిచేఁ దెలియుచునే యున్నది. శుచిముఖిమాత్రమే మాటలాడినప్పుడు వ్యంగ్యమర్యాదచే స్ఫురించుచున్న విద్యావిశేషములు తి. వేం. కవులిరువురకును సమన్వయించుకొనుట కేవిధమైన యభ్యంతరమునునుండదు. ఇట్టి స్థితిలో విమర్శకుఁడంత వ్రాఁత వ్రాయుటయు నాచే నింత వ్రాయించుటయు "జలతాడనము" వంటిది. అయినను వ్రాసినందులకుఁ జదువరులు నన్ను క్షమింతురుగాక-

"ముంజేతి కంకణమ్మున కద్దమేల" అన్నటులున్న మా యీ ప్రతిఫలనమే యీ విమర్శకునికిఁ గుదురలేదుగదా, మహాభారతమునందలి యీ క్రింది పద్యము సమన్విత మెట్లగునో చూతమని యుదాహరించి యిప్పటి కిద్దానిని ముగింతును.

చ. "పరమగురూపదేశమునఁ బార్థుడు పార్థివరత్న శేఖరుం
దరిదిబలమ్మునన్ భుజబలాతిశయమ్మున నీశుఁ బన్నగా
భరణుఁ బ్రసన్నుఁ జేసి దయఁ బాశుపతాదికదివ్యబాణముల్
హరసుర రాజదేవనివహమ్ములచేఁ బడసెన్ గ్రమమ్మునన్."

ఇట్టి చొప్పదంటుశంకలు నేఁడే మాకుఁ దటస్థింపలేదు. విద్యార్థి దశ నాఁటినుండియు నెవరో చేయుటయు, నుత్తరమిచ్చుటయుఁ గలదని చదువరు లెఱుఁగనిదికాదు. విద్యార్థిదశలో మాతోఁ జదివికొను నొకరు.

'శ్లో. "పశుపతిదయితాతృతీయపుత్రౌ । తిరుపతి వేంకటశాస్త్రిణౌ ..."

అను ధాతురత్నాకరశ్లోకములో మీ కిరువురకును తృతీయపుత్రత్వ మెట్లు సిద్ధించునని శంకింపఁదొడఁగిరి. దానింగూర్చి చెప్పినసమాధాన మిపుడు ప్రస్తుతము గామింజేసి యిటనుదాహరింపక ప్రస్తుతపుశంకకును దానికిని గొండొక పోలిక యుంటచే స్పృశించి విడుచుచున్నాను.

సీ. "ఏమహాత్ములు గల్గ భూమీశసభలలోఁ
గవులకు బహుళవిఖ్యాతి గల్గె"

అది యటులుంతము. ఇఁక నొకటి మఱచితి. ఈనాఁవ్రాసిన వ్రాఁత గూడ తిరుపతి వేంకటీయ మనియే ముందు సంపుటములలోఁ బ్రకటితమగును. అది విమర్శకునకు సమయము ననుసరింపనిచో నెట్లు సమన్వయించునో? "శాంతం పాపమ్".

★ ★ ★

# యింకో అపవాద

వక అపవాదనిగూర్చి ప్రౌఢభారతిలో వ్రాసివున్నాను. మఱో అపవాదనుగూర్చి కృష్ణకే పంపియున్నాను. యింతట్లో భారతిలో వకాయన యింకో అపవాదను ఆరోపించాడు. యీ అపవాదకున్నూ, ఇదివఱలో మొల్లకు సంబంధించిన అపవాదకున్నూ, ఆరోపించినవారికి స్వార్థపరత్వం యెక్కువగా వున్నట్లు తోస్తుంది. గతం దానికి వ్రాసేవున్నాను. దీనికిక్కడ వ్రాస్తాను.

వకాయన మానాటకాన్ని ఆక్షేపిస్తూ యేవో కొన్నిమాటలు వ్రాస్తూ అందులో ప్రసక్తానుప్రసక్తంగా, వెం. శా. గారు "వెక్కిరింపఁబోయి బోల్తాపడ్డా"రని వ్రాశారు. ఆవ్రాఁత చూచి నేను జవాబువ్రాస్తూ, యీ లోకోక్తివాడడానికి లేశమున్నూ అవకాశంలేదు. యిది "కుర్వీత బుధసోమయోః" అన్నరీతిగా వుందంటూ వ్రాసి విమర్శకుఁడుగారి స్థితి చాలా "లోయర్" క్లాసులో వుంది అనే అర్థమిచ్చేమాటలు వ్రాసివున్నాను. అది చూచుకునేటప్పటికి ఆయనక్కూడా తానుచేసిన ప్రమాదం గోచరించి- తక్కినవ్రాతంతా వకవంతున్నూ పనిలేనిపాటగా వయోమాత్రం చేతనేనా పెద్దవాఁడైన వెం. శా. ని వెక్కిరింపఁబోయి బోల్తాపడ్డాడనడం వకవంతుగా వుండడంచేత, దీన్ని మనం సమర్థించడం యెట్లాగా అని అందోళన కలిగింది పాపం! దానిమీఁద వకపెద్దయెత్తు యెత్తేరాయన. మొట్టమొదట బోల్తాపడ్డారన్నది వెం. శా. ని మాత్రమే. ఆ తప్పును సవరించుకోవడానికి యిప్పుడీలా అనడమేమి? అనేశంక వారికితోఁచివుండదను కుంటాను. లేదా? తి. వెం. కవులకుఁగల అభేదాన్ని వెం. శా. గారీమధ్య ప్రకటించిన వ్యాసంలో చదివినతర్వాత వ్రాసే వ్రాఁత కనక, ఆరీతిచే సమర్థించుకుందామనే అనుకున్నారో! దానికేమి? ప్రాజ్ఞలోకం కొఱకు ఆయీ అపవాదస్వరూపాన్ని తెలపడం ఆవశ్యక మవడంచేత. ఆయన వ్రాసిన యితరసందేహాల జాపితాను స్పృశింపక, యిది మహాకవి పింగళి సూరన్న గారికి సంబంధించినదవడంచేత, వోపిక లేకపోయినా కొన్ని మాటలు వ్రాయడం తప్పక వ్రాస్తూ వున్నాను.

"తి. వేం. కవులు ప్రభావతీప్రద్యుమ్న నాటకంలో పింగళి సూరన్నగారిని వెక్కిరింపఁబోయినారు" అని నిన్న నేడు భారతిలో మొదటి దాన్ని సమర్థించుకోవడానికి

లిఖించారు. అయితే మొట్టమొదట యేలా వ్రాశారు - ఆ వ్రాంతలో వున్న లోటేమిటి - యిప్పుడీలా వ్రాయడం యెందుకు అవసరమయింది అని చదువరులకు శంక కలుగకమానదు, కాంబట్టి పూర్వాపర సందర్భంగా వాటివాటిని వుదాహరిస్తాను. అని చెప్పుటచే నీపాత్రలో వేంకటశాస్త్రిగారు ప్రనతిఫలింపంజూచినారని చెప్పవలయును. కాంబట్టి శుచిముఖిపాత్ర అసందర్భస్థితిలో నున్నదని చెప్పవలసివచ్చినది. వెక్కిరింపంబోయి బోల్తాపడినట్లు ప్రతిఫలింపంబోయి ప్రత్యక్షవిరోధమును పరిశీలింపలేదు" అని విమర్శకుండుగారు మొదట వ్రాసివున్నారు. దానిని నేను చూచి వ్రాసిన మాటలుకూడా వుదాహరిస్తాను-

"ప్రతిఫలింపంబోయిన దెవరు? వేంకటశాస్త్రిగారు. ప్రత్యక్షవిరోధమును పరిశీలింపని దెవరు? ఆయనయే కదా? వేంకటశాస్త్రిగారు చేసిన యపరాధము శుచిముఖీపాత్రలో ప్రతిఫలింపం బోవుటయేకదా? అగుచోనది వెక్కిరింపంబోవుటవంటిదే యగునా? కానిచో ఆలోకోక్తిని వాడుటకర్థము లేమి స్పష్టమేకదా? అగుచో యీ విమర్శకునకు చక్కంగా నాలుగు వాక్యములు వ్రాయుటకూడ నేర్చికోందగిన యవస్థయేకదా? అగుచో నెక్కడనో ఉపాధ్యాయులుగా నెటులుండిరని శంకరావచ్చును".

యిత్యాది వాక్యములతో ఆలోకోక్తిని వాడడం బాగుందికాదని ఆయనకు తెల్పివున్నాను. దానిమీంద దాన్నేలాగో సమర్థించడానిక్కాంబోలు వక యెత్తు యెత్తేరు. దాన్ని చూపుతాను.

"వెక్కిరింపంబోయి బోల్తాపడినట్లు" అను వాక్యమునకు నాయభిప్రాయమిది. తాను బ్రతిఫలింపందలచుకొనుటచేం బింగళి సూరనార్యుండు శుచిముఖిపాత్రను గవయిత్రిగాను, విదుషిగాను, మాత్రమే చూపియున్నాండు. అంతమాత్రమునం బ్రకృతమునకుం గల్గు ప్రయోజనముకంటె ధారణాసంపత్తితోం గూడికొనినదని చెప్పుటచేం బ్రయోజన మెక్కువగా నుండు ననితలంచి, పిం. సూ. కంటెం దమ కెక్కువశక్తి కలదని చూపుటకేకదా వీరారీతిగా వ్రాసియున్నారు. దీనివలన పిం. సూ. కవియుం బండితుండును మాత్రమేకాని శతావధానాదికమును జేయంగలవాండుకాండు. మేమో?- కవులము, పండితులము, శతావధానాదికమును జేయంగలవారమునని లోకులకుం దెలియబఱచుటకే కదా ఆవిషయమునుగూడం దఱచుగా వ్రాయుట. కాంగా, ఇది పిం. సూరన్నను "వెక్కిరించుట కాదా?" ఇట్టి యభిప్రాయముతో వ్రాసిన నావాక్య మేల ప్రకృతమునకు సమన్వయింప కుండును? నా యూహ తెలియక శ్రీ శాస్త్రులవారు... ..." అని తాము మొదటచేసిన అవ్యక్తప్రసంగాన్ని సమర్థించారు విమర్శకులు. యిది "అబద్ధాలాడి దిద్దుకోవటం" వంటిది కాకపోయింది. పైగా వకతప్పుచేసి దాని సమర్థనంకోసం అంతకంటే కూడా పెద్దతప్పు

చేసినట్లవుతూవుంది. ఆయన తప్పులతో మన కవసరమేమిటి- అని వుపేక్షిద్దామంటే : లోకోత్తర కవీశ్వరుఁడైన పూర్వమహాకవిని తి. వెం. కవులు వెక్కిరించారంటూ వక తప్పుడుమాట దీనిలో కనబడుతూవుంది. మొదట వెం. శా. గారిని గూర్చి ఆ తప్పుడు సామెతను తారతమ్యజ్ఞానవైధుర్యంచేత "కుర్వీత బుధ సోమయోః" అన్నట్టుగా వాడి, ఆ విషయం వెం. శా. తెల్పితే తెలుసుకొని దాన్నే సమర్థించుకోవడానికి యీయన పడే బాధను చూస్తే యెవరికేనా చాలా విచారం కలుగుతుంది కాని- పైఁగా యిప్పుడు తొక్కే తప్పుడుతోవకు. అనఁగా "అబ్బాయీ! కొబ్బరిచెట్టెందు కెక్కేవంటే, దూడ గడ్డికి" అనేవాని మాదిరికి దిగి, పింగళి సూరన్నగారిని "వెక్కిరించారు కనుక తి. వెం. కవులు- వారిని నేను వెక్కిరించడానికి చూస్తే కోపంకూడా వచ్చితీరుతుందనుకుంటాను. యీ వెక్కిరింపును యీ విమర్శకుఁడుగారు తి. వెం. కవుల తాలూకు యే మాటల వల్ల గ్రహించారో ఆ మాటలుకూడా వుదాహరించడం ప్రస్తుతం కాకపోదు. కావున వుదాహరిస్తాను,

"సంగీతసాహిత్యంబులు నేర్చితి. వ్యాకరణంబుఁ జదివితి. లక్ష్య లక్షణ చాకచక్యంబునం దద్వితీయ ననిపించుకొంటి... ఆశుకవిత్వమల్లుటభ్యసించితి... కొన్ని కావ్యంబులు, నాటకమ్ములు వ్రాసితి... సరస్వతియే బాలసరస్వతి యను బిరుదొసంగి యీగండపెండేరంబు కాలికిం దొడిగె... రాజరాజేశ్వరీషోడశీమహావిద్య నభ్యసించితి... శతవధానముచే... కలధౌత బిరుదమాన్యత గంటిన్"...

తి. వెం. కవులు శుచిముఖిపాత్రచే వారి నాటకమునఁ జెప్పించిన మాటలు చిత్తగించండి. యీ మాటలలో వాచ్యంగాఁగాని, వ్యంగ్యంగాఁ గాని పింగళి సూరన్నగారిని వెక్కిరించడం యేలా వస్తుందో ఆలోచించండి. అయితే విమర్శకునకు మాత్రం యీ అంశం తెలియదా అంటారా? అట్లనఁగలమా? మనుష్యమాత్రునకు తెలిసేవిషయంగదా యిది. పైఁగా ఆయన పండితుఁడాయె. తెలియదనుకోవడం యేలాగ? తెలుసునుపాపం! చిక్కులో పడివుండడంచేత వూఁపిరి తిరగక యిదోతోవ తొక్కినట్లు తోస్తుంది. పోనీ ఆయన ఆత్మసంరక్షణకు పడేపాట్లతో మనకేంపని అంటే మనమీద అపవాద అంటగట్టటం వకటి వచ్చిపడిందిగా! మన సంరక్షణ కొఅకు ఆయన చేసిన తప్పును బయటఁబెట్టవలసి వచ్చింది. అందుచే షెద్ద చిక్కువుండిన ఆయనను గూర్చి యీ కాస్తా వ్రాసి లోకులకు సత్యం తెలిపినందుకు ఆయన్ని క్షమాపణ వేడకతప్పదు.

ఆయనకేవో చాల సందేహాలు మా నాటకంలో వున్నట్లు వ్రాశారాయన. వుండవచ్చు. అవి తీర్చడానికి నాకు వోపికలేదు. అక్కడకీ కొంత వోపిక తెచ్చుకొని మూడు వ్యాసాలు కాఁబోలును విస్తరించే వ్రాసి తెలిపివున్నాను. అవేవిన్నీ తన సందేహాన్ని పోఁగొట్టనట్లే

ఆయన వ్రాస్తూ వున్నారు. ఆయన శంకల మాదిరి యెట్టిదో యింతవఱకు నేను వ్రాసిన సమాధానాలవల్ల లోకులు తెలిసికొనివుంటారు. మళ్లా మొదలెట్టిన శంకల వైఖరి చూపుతాను. మచ్చుకు మాత్రం వకటి రెండు, యెక్కడో మానాటకంలో “నలుగురు” అనడానికి “ముగ్గురు” అని పడిందనుకోండి. దాన్ని శుద్ధపత్రంలో సూచించాము. అంతేకాక వేఱొక ముద్రణంలో సవరించాము. అదిచూడక ఆయన వెక్కిరించారు. సమాధానంలో వేఱొక ముద్రణం చూడవలసిందన్నాను. చూచారుకాని యింకా వకచోట “మూగురు” అనే వుందఁట. అదుగో విజయానికాధారం దొరికిందనుకున్నారు. దీనికే ముద్రణం చూచుకోవాలో చెప్పుమంటారు. చిన్నతనమయితే చిన్నతనంగా వుండాలికాని యీ విమర్శనా లెందుకో గదా! శుద్ధపత్రికలో చూడక వెక్కిరించడమా? వేఱొక ముద్రణంలో వున్న సవరణ గమనించక వెక్కిరించడమా? అందులో యింకావకటి మిగిలిందంటూ మళ్లా అడఁగడమా? వకచోట సవరణకనపడ్డప్పుడు సజాతీయ విషయమైనప్పుడు మళ్లా తెలపడమెందుకో గదా! “ముద్దముద్దకీ మిస్మిల్లా” కావాలి కాఁబోలు!

యింకొకశంక. యెక్కడో వ్యాకరణశాస్త్రమర్యాద మాటలు పడ్డాయి మా నాటకంలో. వాట్లనుగూర్చి కొంత సందేహించారు విమర్శకులు. యేమనుకోను? మురారి మహాకవి తన నాటకంలో (1) “జనికర్తుః ప్రకృతితా”, (2) “కథ మపత్యప్రత్యయా న్నిశ్చినోమి”, (3) “బ్రాహ్మణాదేశోఽ పిస్థానివద్భావేన” (4) “ప్రకృష్టకర్తృభిప్రాయక్రియాఫలవతః” యిత్యాదులు బోలెఁడు వాడివున్నాఁడు. అయినా యీయనకు ఆయీ వుదాహరణాలు, కవులపోకడలూ, చూపడంకన్న, నీవు మాపుస్తకాన్ని గౌరవించవద్దు. నీవద్దనున్న పుస్తకాన్ని చింపి పారవేయవలసింది. సొమ్ముపెట్టి కొనుక్కొని వున్నయెడల ఆనష్టం మామీద కడితే యిచ్చుకొంటాము. అని ప్రార్థించడం వుత్తమం అనితోఁచింది. యీ అంశం పాణిగృహీతా పీఠికలో యిదివఱకే సూచించి యున్నాముగదా?

యీయనకు “గంధర్వలోకం” లోనుంచి లేఖలు వస్తూవున్నట్లు వ్రాశారు. దాని నంబరు ౧౪ అని అంకెనుకూడా తెల్పివున్నారు. నాకున్నూ ఆలేఖ వచ్చింది. నాకువచ్చినదాని నంబరు ౧౨ అని మనవి చేస్తూవున్నాను. దానితత్త్వం పూర్తిగా కనిపెట్టాను. దానితో విమర్శకుఁడుగారికి వున్న బాంధవ్యం పూర్తిగా తెలుసుకున్నాను. “యుష్మద్గోత్రం వర్ధతామ్” అని ఆశీర్వదిస్తూవున్నాను. అది విమర్శకుఁడుగారు ప్రచురించడానికి సంశయించినా కాలాంతరమందు నేను ప్రచురింపడానికి సంసిద్ధంగా వున్నాను. దానితో మీయోగ్యత బాగా లోకులు తెలుసుకుంటారు. ప్రస్తుతం మీరు తి. వెం. కవులు పింగళివారిని వెక్కిరించారని వేసిన అపవాదాన్ని స్థిరీకరించుకోవడానికి మాత్రమే ప్రయత్నించండి.

మాకవిత్వం అస్తావ్యస్తంగావుంటే దానివల్ల లోకం కోపగించదు మామీఁద. పింగళి వారిని వెక్కిరించామంటే లోకం మండిపడి, వెనక "పూర్వకవుల అపరాధాలు" వ్రాసినవాళ్లకు జరిగించిన సత్కారాన్ని జరిగిస్తుంది. కాఁబట్టి యీవ్యాసం వ్రాయకతప్పిందికాదు. యిప్పుడేనా వెక్కిరింపు విషయం తప్పనితోస్తే క్షమాపణను పత్రికముఖంగా ప్రకటించుకోవడం మంచిది. సమర్థించేయెడల నేనే క్షమాపణను ప్రచురిస్తాను. యింతే నామనవి.

"గంధర్వలోకం" లోనుంచి వచ్చిన పద్యాల ప్యాకట్టు అక్కడ పోస్టాఫీసు లేకపోవడంచేత కాఁబోలు పిఠాపురం పోస్టుద్వారా నాకు "బట్టువాడా" అయింది. పోస్టుముద్ర యీ అంశాన్ని తెలిపింది. మీకే పోస్టు నుండి వచ్చిందో తెలుపఁగోరతాను. "ఫోర్జరీ" వ్రాఁతలు వ్రాసే మిత్రులున్నారని మీరు మీ వ్యాసంలో యే కొంచెమో తెల్పకపోతే నేను మీకు అంటఁగట్టడం తటస్థించకపోయేదే. మీరేవ్రాసికొనివున్నారు గనుక నాకిప్పుడు సుళువిచ్చింది. "అట్టి తిట్లు నేనిదివఱకు చాలా తినివున్నాను. మీ రా కుట్రలో చేరివున్నట్లు బాగా తెలిసింది. మీరు ఆలోచనాపరులే అయితే ఆలేఖనుగూర్చి మీవ్యాసంలో యెత్తుకోగూడదు. అయితే మీకు ఆమాత్రం ఆలోచనేవుంటే పింగళివారిని తి. వెం. కవులు వెక్కిరించారని డాబుడాబడం యెందుకువస్తుంది? అంతా అనాలోచనే, యిదీ వక అవాంతరానాలోచన. అనఁగా నాటకంలో అంతర్నాటకం వంటి దన్న మాట. దానివిషయం ముందుచూచుకుందాం. ముందు తి. వెం., పిం. సూ. గారిని వెక్కిరించారన్న మీ వాక్యాన్ని సమర్థించుకోండి. త్వరపడండి. సభకు రమ్మంటే కూడా యెట్లో వస్తాను.

★ ★ ★

# క్షంతవ్యుఁడుగారు

క్రమంగా "విమర్శకబుధుఁడు" గారు "క్షంతవ్యుఁడు" గారు కిందికి వచ్చినందుకు కొంత సంతోషించ వలసివుందిగాని యింకా ఆమాట వ్రాయడంలో కొంత వెనకా ముందూ తొక్కుళ్లాడుతూవుందిగాని కలంచురుగ్గా నడిచినట్లుమాత్రం ఆ ఘట్టంలో మాటలు వక్కాణించడంలేదు. యింకా పింగళి సూరన్నగారిని తిరుపతి వేంకటకవులు ప్రభావతీప్రద్యుమ్న నాటకంలో వెక్కిరించారన్నమాట సమర్థనీయం అవుతుందనే ఆశ "క్షంతవ్యుఁడు" గారికి వుందే అనుకుందామా? శివశివా! సాహిత్యశిరోమణి ప్యాసై ఆ మాత్రం జ్ఞానంకూడా వుండకుండా వుంటుందా? తి. వెం. కవులు శుచిముఖి పాత్రద్వారా ప్రకటించిన ప్రజ్ఞలవల్ల "బుధుఁడు" గారు ఇటీవల "కొబ్బరిచెట్టూ-దూడగడ్డీ" సామెతగా అపలపించిన వ్రాఁత సమర్థింపఁబడదని పూర్తిగా తెలుసుకున్నారు. దానిమీఁదే యీ "క్షంతవ్య" పదం బయటికి వచ్చింది. యిప్పుడున్న ఆపేక్షేమిటంటే? దేనిలోనోవకదానిలో నెగ్గకపోతామా? యేమాత్రం నెగ్గినా ఆత్మపక్షీయులు కొంతకాకపోతే కొంతేనా సంతోషిస్తారుగదా అని వుంది పాపం! అయితే యీ "పిచ్చిసోమయాజులిని" యీ "క్షంతవ్యుఁడు" గారు బాగా యెఱుఁగరు. ముసలాఁడుగదా అనుకున్నారు. సభలో పిం. సూ. గారిని తి. వేం. కవులు వెక్కిరించడాన్ని సమర్థించడం కృష్ణలో సూచించేటప్పటికి కొంతమట్టుకు పశ్చాత్తాపం కలిగింది. మళ్లా కొన్ని శంకలు పుట్టుకువచ్చాయి. పుట్టుకురాక అంతతో శాంతిస్తాయా? "మనోరథాః". ఆశంకలలో, "వ్యాకరణ విశేషాలు నాటకాలలో వాడవచ్చునా!" అన్నదానికి లఘువుగా సమాధానం కృష్ణలో యివ్వఁబడ్డదే. అది అంతతో నివర్తించివుంటుందనుకుంటాను. నివర్తిస్తేమాత్రం పిడివాదం తప్పుతుందా? తప్పదు. యిఁక శుచిముఖిని పక్షిగానే నటింపఁజేయడం యెట్లాగ? అంటూ వక పెద్ద శంక. ఆ శంకకి మళ్లా బాధ కలుగుతుందేమోనని, "ఆంజనేయులు, గరుత్మంతుఁడు" అంటూ యిద్దఱిని వుచ్చరించి వీరికి తప్ప యితరులకు అట్టిఅవకాశం లేదనడం వకటి. యీ వినాయిం పెక్కడ వుందో కదా! పాపం కొంచెం యెదటిదెబ్బ కాసుకునే వుపాయం వుంది. కాని హృదయం మాత్రం మంచిస్థితిలో లేదు. వుంటే "చక్కని రాజమార్గం" లోనే ప్రవర్తించి సందేహనివృత్తి చేసుకోవచ్చునుగదా! అసందర్భంగా- "వెక్కిరింపఁబోయి" అంటూ తారతమ్యజ్ఞానవిరహితంగా వుపక్రమించడం యెందుకు వస్తుంది? యీ

వుపక్రమణానికి పూర్వగాథ చాలావుంది. ఆ పొత్తము చిరకాలమునాఁడే అచ్చయి వుంది. పనిపడ్డప్పుడు దానిపేరు తెలుపుతాను. యిటీవలి శంకలలో వకశంకని వుపపాదించాను గదా. యింకొకటి కృష్ణునికి ప్రద్యుమ్న సాంబులు కొమాళ్లు కాఁబట్టి వారిద్దఱి కొడుకులున్నూ మనమ లవడం బాగుంది కాని, గదుఁడు సోదరుఁడుగదా! అతని కొడుకు మనుమఁడేలా అవుతాఁడంటూ వకశంక. మొట్టమొదట మాతోపాటుగా తానున్నూ గదుణ్ణి ప్రద్యుమ్నాదులతోపాటుగా జమకట్టుకొని యిప్పుడిప్పుడు తప్పు దిద్దుకొన్నట్లు అభినయించడంకూడా జరిగింది. మేము మొదటినుండిన్నీ వీరు మూఁగురున్నూ సోదరులే అన్న అభిప్రాయాన్నే కనపఱిచివున్నాము. జంకుతూ జంకుతూ "క్షంతవ్యుఁడు" గారు శంకించడం ఆరంభించారు. మే మెందుకు సోదరుణ్ణి పుత్రుఁడని మార్చి వ్రాశామో సభాముఖాన్ని వుపన్యసించి మెప్పిస్తాము. దానికోసమేనా సభకు దయచేస్తారేమో అని మనవిచేసుకుంటూ వున్నాను. యివి ప్రధానశంకలు. అప్రధానాలింకా కొన్నివున్నాయి. హృదయం చక్కగావుంటే యేప్రశ్న అడిగినా అడగవచ్చు. తెలుసుకోనున్నూవచ్చు. అది మంచిస్థితిలో లేనప్పుడు "హోర్టువీకు"గా వుండడంచేత ఆపురుషుఁడు యేంచేసినా అవ్యక్తంగానే వుంటుంది. వాఁడు యీలోకం కాదని "గంధర్వలోకం" దాఁకా వెళ్లినప్పటికిన్నీ అదిన్నీ తుట్టతుదకు తలవంపునే సంఘటిస్తుందని నా విజ్ఞప్తి. వృథాగా పత్రికల గౌరవం చెడఁగొట్టడానికిఁగాని యీపనికి మాలిన శంకలు యెందుకున్నూ పనికిరావు. కనక కాకినాడలో "విమర్శకాగ్రేసరాది" బిరుదులతో ప్రకాశిస్తూవున్న పెద్దలు వున్నారు. వారేమంటారో ఈశంకలకు? వకపర్యాయం కనుక్కుంటే బాగుంటుందని నే నిందు మూలంగా విన్నవిస్తూ ఉన్నాను. యెందుచేతంటే నాకు ప్రస్తుతం ఇంతకన్నా నీరసస్థితిలోనే అయినా గురువుగారిశంకలు ప్రధానంగా ఉత్తరింపవలసిన పని అవశ్యమయిందిగా యేర్పడింది. ఆపెద్దపనిలో ఈ "పిల్లసమేరీ" నిమిత్తం కాలం ఖర్చుపెట్టి పత్రికలకు పనికల్పించడం మంచిదిగా తోఁచడంలేదు. అదీ గోల్లనితీరేపనే. ఇదిన్నీ అట్టిదే. అయినా వారు గురువు లవడంచేత కొంతగౌరవం వారికి సంబంధించినదానికి యివ్వడం యుక్తం. దేనికో! "ప్రతి చిగిలింతమొక్కా చింతమొక్కతో" అంటూ వెనక వొకాయన సామెత వకటి వాడివున్నాఁడు. కాఁబట్టి సభలో తేల్చేస్తే తీరిపోతుందని తోఁచింది. పత్రికవారినికూడా ఈ వాదం యీలాగే తీర్చుకోవలసిందిగా సలహా యివ్వవలసిందని కోరుతాను. లేకపోతే మూల కూర్చుని గిలకడంగనక వాదిప్రతివాదులిద్దఱూ యేదో గిలుకుతూనే వుంటారు. యెంతచక్కనిసమాధానం వ్రాసినప్పటికీ అది యింకా నచ్చలేదనే యేదో దాన్ని గూర్చి అపలపిస్తూనూవుంటారు. వెనకాల తండ్రిగారో, లేక "గంధర్వలోక" స్థజ్ఞాతివర్గమో "మావాఁడిప్రశ్నలకు జవాబులురానేలే"దని హంగుచేస్తూనేవుంటారు. అందుచేత అర్ధాంగీకారంగా "క్షంతవ్య"

పదంతో వ్రాసిన విషయాన్ని గూర్చి యేమి, యిటీవల యివేనా నెగ్గకపోతాయా అనుకున్న విషయాలకేమి వకమాటు సభకే పనిచెపితే వీలుగా వుంటుందనుకుంటాను. యీ అంశం యింతగా కాకపోయినా కొంత సూక్ష్మంగా "యింకో అపవాద" అన్నవ్యాసంలో కృష్ణాపత్రికాద్వారా తెల్పడమయింది. యిప్పుడు మఱీస్పష్టంగా తెల్పుతూవున్నాను. వకసంగతి మఱిచాను. ఆసభలోకి "గంధర్వలోకం" చుట్టంగారినికూడా తీసుకు రావలసిందని మనవి. ఆయన పిఠాపురంలోనే వుంటారనుకుంటాను. ఆయన "బహిరంగలేఖ" కూడా సభాముఖాన్ని వినికిచేస్తాను. మీవద్దకు వచ్చిందంటూ తాము "భారతిలో" యిదివఱలో వ్యక్తీకరించిన "బహిరంగలేఖ"ని కూడా తీసుకువస్తే దాన్నీ దీన్నీ సరిచూచి సభాధిపతులు మీకు యేలాటి బంధుసముద్రులు ప్రస్తుతవిషయంలో సహాయులుగా నున్నారో ఆ విషయంకూడా పనిలోపని తేల్చివేస్తారు. దానితో "సర్వం సంపన్నం, సుసంపన్నం"గా సమస్తమూ చక్కపడడం అవుతుంది. యింతే నామనవి. అందునిమిత్తం త్వరపడండి. వచ్చేవోపికవుంటే ఆసభకు నేనేవస్తాను. లేదా? నాతరఫున మీ అన్న చి. సూర్యనారాయణశాస్త్రి రాఁగలడు లేదా! మఱివక రెవరేనా వస్తారు. దానికేమి? "నందో రాజాభవిష్యతి" యింతే ముమ్మాటికిన్నీ నామనవి.

★ ★ ★

# పాండవాశ్వమేధము

## విమర్శనఖండనము

సుమారు 5, 6 మాసములనాఁడు బ్ర॥ శ్రీ॥ కాశీభట్ట కృష్ణరాయ శాస్త్రిగారు మా పాండవాశ్వమేధమును బ్రస్తుత నూతన విమర్శనము ఫక్కి ననుసరించి విమర్శించిరి. కొన్నిచోట్ల భవభూతికన్న గ్రంథకర్తలుమిన్నలని కొండనెక్కించిరి, కొన్నిచోట్ల దిగఁద్రోసిరి. విమర్శింపఁదగిన సామగ్రి పూర్తిగా గలిగియున్నవారని మాకుఁ దోఁచియును నెక్కుడు సాహసించి వ్రాసిన యంశములు పెక్కు లున్నట్లు పొడకట్టుటచేఁ గొంచెము వ్రాసి కనుగొందమని యప్పటినుండియు ననుకొనుచుంటిని గానియప్పటికిఁ జాలఁబూర్వము నుండియుఁ బ్రాణాపాయకరమగు దీర్ఘ వ్యాధిలో నలుగుచున్న నే నింతదనుకు నేమియు వ్రాయనేలేకపోతిని. శాస్త్రులవారు "శ్రీ" కారము, కృత్యాదిని లేదని కొలదిగ శంకించి విడిచిరి. అది లేకుండుట ఆంధ్రాచార విరుద్ధమఁట. ఆంధ్రకవులు ప్రబంధములయందట్లు తఱచుగఁ బ్రవర్తించినమాట సత్యమే. నాటకములు వారిలోఁ బ్రాజ్ఞులు మా కాలమునకుఁ బ్రాక్కాలమున రచించినవారే లేరు. ఉన్నను, వారికిని విద్వత్తకును గడుం దవ్వు. అట్టిచో మేమనుకరింపవలసిన వారెవ్వరు? కాళిదాసాది గీర్వాణభాషాకవులుగదా? వారీ నియమమును బాటింపలేదు. కావున మేమును బాటింపలేదు. ఇవిగాక, "క. శ్రీకారముకృత్యాదిని" అను నాంధ్రపద్యమునకుఁ గూడ మాతృక "శ్లో. దేవతా వాచకాశ్శబ్దాః" అనునదియేకాని వేఱొఁడుకాదు. ఐనను ఆంధ్రులు అట్టి శబ్దములలో నొకటియగు శ్రీకారమును దఱచుగా వాడిరి. మేమో? "భారతః పంచమో వేదః" అనుటచే వేదవాచకమగుదానిని వాడితిమి. శ్రీకారమే యుండి తీరవలయునను నియమము లేనియపుడు వృథాగా వ్రాఁతపని కల్పించుట శోచనీయము. మఱియు, పాండు తనూభవు + లందు దుఃఖపున్ భారము అనుచోఁ బ్రమాదవశమున సప్తమ్యంతముగాఁబదచ్ఛేదము చేసికొని వృథాగఁబని కల్పించిరి. అందు + అనునది, దుఃఖభారమునకు విశేషణముగా నన్వయించికొనుమని మనవిచేయుచున్నారము. ఇందుల కాధారము ముద్రణ సంప్రదాయమునందలి స్పేసుగూడఁ గావచ్చును గాని వీరు చూచినదే పుస్తకమో, బహుశః, సపాశుపతమైయుండదు. అగుచో ద్వితీయ ముద్రణమున మేము కొందఱచే శంకింపఁబడి

సమాధానమిచ్చి యందుఁ బ్రకటించిన విషయములం గూర్చి కూడ వీరు వ్రాయవలసి యుండదు. వీరు ప్రథమ ముద్రణపుఁ బ్రతినిజూచి యుందురు. అందట్టి యాధారమున్నదో లేదో, అది యిప్పుడు చెప్పఁజాలము. లేదే అనుకొందము, అట్టి యాధారము లెవరికి? "అబ్రవీ త్పురాణ పండితులకుఁ" గదా? వీరు విజ్ఞులు, వీరి కట్టి వెందులకు? భ్రాంతి పురుషధర్మముగాన వీరన్యథాగాఁ బదచ్ఛేదము చేసికొనిరని యూహింపవలసియున్నది. మఱియు, "తోడనేనా" ఇది యెట్లు సిద్ధము? అవి యడిగిరి. ఇట్లు సిద్ధమని నొడువుదునా? "పదునాల్గు కోటులే నా? మఱియున్ ఘనంబుగ ధనంబు" (కుమార ధూర్జటి)

ఈ యిందుమతీ పరిణయ ప్రయోగమునకేమి గతియనియు, మధ్యద్రుత మెట్లు చేరినదనియు మరల నడుగుదురేమో? అడుగరు, శాస్త్రులవారు మాత్రము, "తెలుఁగునకున్న వ్యాకరణదీపము చిన్నది" "విలువగల కవుల లక్ష్యమ్ములె తామీ భారమెల్ల మోయఁగవలయున్" అను నంశము నెఱుఁగనివారా? కాదు. మాకుఁ బ్రయోగములతో నవసరమే లేదని వ్రాయ మొదలిడుదురందురా? మొదలిడనిండు, అంతభాగ్యము పట్టునప్పుడాలోచింతముగాక. మఱియు, "నుగ్గు-పిండి, అనియర్థము. మదమని యర్థములేదు" అని యాక్షేపించిరి. ఇది యేమికర్మము, మేమును మదమని యర్థము చెప్పమే, పిండియనియే చెప్పుదుమే. అగుచో సమన్వయమెట్లని శంకింతురోటు? ఇట్లు, కన్, అనుదానికి లోపము, నుగ్గుగన్, అని తేలినది - పిండియగునట్లుగా, అణంచి, అని సమన్వయము లోపమునకు వ్యాకరణ మడుగుదురా? సపాశుపతాశ్వమేధమున దీనింజూపియే యున్నారము. త్రిలింగ లక్షణ శేషము తిలకింపవలెను. మఱియు, "పిండంబులపై ధారకునుండున్" ఇయ్యెడ నశ్లీలమఁట! చచ్చుచున్న దుర్యోధనునకు వీరు పిండంబులు పెట్టించుచోటఁగూడ యాజ్ఞికుని నోటఁ గూడ నీమాట ప్రస్తావన మేభాగమునందును లవమునునుండరాదని విమర్శకుల యాశయమనుకొందమా? అట్టి యభిప్రాయమును విమర్శకులు ప్రకటింపవలెనుగాని ప్రకటించుచో నుదాహరణములకే కఱవా? ఈవిషయమున వీరు, "యాభవతః" అని యుదాహరించిరి. అటఁదగులు దోసమునకును నిట వీరనుకొన్న దోసమునకును జాల వ్యత్యాసముకలదు. అది కవి వేఱొక తాత్పర్యముతోఁ బ్రయోగించిన వేఱొకటిగాఁ బరిణమించుటచే, "అయ్యవారిని జేయఁగోతియైన" వడువునఁ దటస్థించిన దోషము. ఇదియోకవి మఱియొక యుద్దేశముతోఁ బ్రయోగింపలేదు. కోతింజేయుటకే సమకట్టినాఁడు. అదియేయైనది. తప్పేమి, యథార్థకథన తాత్పర్యముతోఁ బ్రయుక్తములైన శబ్దములయెడ నట్టిదోషముండదు కావుననే, "శిశ్నోదర పరాయణాః" "శిశ్నోదర పరాయణత్వమునకుఁ బారమెఱుఁగక తిరుగు" (పాండురంగ) ఇత్యాదులు సమాహితములని యెఱుఁగఁదగు - మఱియు నిందుంగూర్చి మా శృంఖలా

తృణీకరణము 42వ పుట మొదలు 54వ పుట వరకును, శలభాలభనము 2 మొదలు 6వ పుటవరకును జూడఁదగు. శాస్త్రులవారేపొత్తమును విమర్శింపఁబూనిరో దానికి సంబంధించిన పాశుపతమునే చూడరైరి. పాండవవిజయమును జూడలేదని వారే వ్రాసియున్నారు. అది చూచినచో ఋతువిషయము వారికి గోచరించియేయుండును. వీ రసహాయశూరులగుటచే సాహసైక శరణ్యముగా వ్రాయుట కలవడినట్లూహింప నయ్యెడిని. అగుఁగాక. ప్రస్తుతవిషయమున వీరు కావ్యానుశాసన మొకపరి చూచుట యుక్తము. మఱియు, "చంపీచంపని ప్రయోగము సాధ్యమా? ఏ వ్యాకరణము?" అని యడిగిరి. ఇదియుఁ బాశుపతమున నుత్తరింపఁబడినదియే. ఇటీవల దిద్ది తగులఁబెట్టిన భారతముగాక ప్రప్రథమ ముద్రణమునందలి భారతము శాంతి, ౨ ఆశ్వాసమునందలి "క. నమ్మమి మృత్యువు... నమ్మీ నమ్మక" అను ప్రయోగముచూచికొనఁదగు. ఇటీవల దిద్దుఁబాటువలన మూలాభిప్రాయము చెడుచున్నది. ఈయంశము నేఁటికిఁ జిరకాలముక్రిందట బందరునుండి వెలువడుచుండిన "ఆంధ్ర భారతి" అను పత్రికలో మాచేఁ బ్రకటింపఁబడిన వ్యాసమునందు - "ఉ. దిద్దకుఁడయ్య భారతము" ఇత్యాది పద్యములవలనఁ దెలియఁగలదు. మఱియు నీ- "నమ్మీ నమ్మక" అనుదానికి మా "చంపీ చంపని" అనుదానికే సంబంధముగలదు గాని విమర్శకు లీ సందర్భమున నుదాహరించిన "అన్నా దమ్ములు" లోనగువాని కేవిధమైన సంబంధమును లేదని యెఱుఁగఁదగు. దీర్ఘమాత్ర సామ్యమేని లేదా? యందురేని అగుచో నిదిమాత్రమే కాదు. "విశ్వామిత్రాదులు" బోలెఁడు కలవని యెఱుఁగునది.

ఇఁక వ్యాకరణమో, దీనింగూర్చి "తోడనేనా" అనుచో నుత్తరమున్నది. కనఁదగు. భారత మహాకవుల ప్రయోగమున్నను, "చంపీ ప్రయోగములు లేవు" అని వ్రాయుట సాహసైక శరణ్యము. లేదా? బుద్ధిపొరపాటు. మఱియు, "నికృష్టంపు జంపుఁజంపి" అనుదానిం గూర్చి యీ విమర్శకులు, అనాలోచితముగాఁ గొండొక వ్రాసి, చంపు - చావుగా దిద్దినఁ జక్కఁగనుండు ననిరి, పాపము! అమాయికులు. "అనుచితంపుఁజంపు" "జమిలి చంపులు" ఇత్యాది భారత ప్రయోగములు శాస్త్రులవారికి చావులుగా మార్పఁదగినవియే కాఁబోలును. ఈఘట్టమునందే "పంపుమయ్య" అనుదానింగూర్చి కొంత వ్రాసిరి. మరల, "ప్రయోగములున్నవి" అనియొప్పికొనిరి. ఒప్పికొనియు, విమర్శింతుము అని గర్జించిరి. ఈ గర్జన మెందులకో?

చాలీ చాలని వ్యాకరణము లేవియో కొన్ని యున్నవియే యనుకొందము. అంతమాత్రమున నీభాషాసముద్రము దరియ నీఁదఁగల మనియే కాఁబోలును శాస్త్రులవారి

యాశయము. అగుఁగాక, దానిని విమర్శించినపుడుత్తర మిత్తుముగాక, యని యిపు డుపేక్షించుచున్నారము. మఱియు, "పాఱుఁబోతులు అనుంగతి" ఈ ప్రయోగము లసాధువులంట? విమర్శకుల భాషాజ్ఞాన మెట్టిదో కాని,

* చ. పరిణతశక్తులైన యలభారతపుంగవు లట్టులుండ ము
ష్కరుఁ డనిపించుకొన్న కవి సామాజ సింహము రామకృష్ణవా

(గ్వ్రిరచనముగూడఁ జిత్తగించలేదు. పాపము, ఇటుపైనేని జిత్తగింతురుగాక)

గ్వ్రిరచనగూడఁ జూడుఁడు ప్రవేశఫలమ్ములు చిన్నిచిన్ని వ్యా
కరణపుఁ బొత్తముల్ సదివి కయ్యము పెంచకుఁడయ్య వాగ్విదుల్.

రామకృష్ణకవి యనఁగా? "చ. ఒకని కవిత్వమం దెనయునొప్పులు దప్పులు నా కవిత్వమం దొకనికిఁదప్పు వట్ట బనియుండదు." అనియును, "చ. తెలియనివన్ని తప్పులని దిట్టతనాన సభాంతరమ్ములం బలుకగరాకురోరి పలుమాఱు" అనియును బ్రతిజ్ఞచేసి నిర్వహించుకొన్నట్టియు, మ. "ఉదయంబస్తమయంబు... నీ కెదురేరీ?" అని వెలుగొందినట్టియు మహాకవి. అతఁడు తన కబ్బమున ౧ ఆ–మున, "అయ్యంతి చెక్కులఁబోలుం దెలనాకులు" అని ప్రయోగించి యుండెనే? దానింగూడ శాస్త్రుల వారు తృణీకరింతురో? తృణీకరింపరు. అన్యథా సిద్ధికై కడంగుదురు, చూచెదముగాక. వీరింకను నిట్టియవిచార మూలకములగు నాక్షేపణ లీఘట్టమున మఱియుం గొన్ని చేసియున్నారు కొన్నిటి యసారతను దెలిపి తక్కిన వుపేక్షింపఁబడుచున్నవి. మఱియు, "ఇట్లనే, అట్లన" యవి తప్పులంట! పాపము వీని సాధుత్వమునకై కొంత పాటుపడిరికాని తుదకుఁ గుదురలేదు. వారేమి చేయుదురు. అంతతో విసువుపుట్టి "కావునఁబై ప్రయోగమెట్లును దుష్టమే". అనియొక రంకెవైచి విరమించిరి. "మ. ... ... ఎప్పటట్లనయే నుండక" "ఉ. ... ... రాముని మ్రోల నాలుకలు రానటులన్" అను రామాభ్యుదయ ప్రయోగములును, "చ. ... లలితకరాబ్జరాగ మిటులన్ బ్రసరించి" అను రుక్మిణీపరిణయ ప్రయోగమును వీరికెట్లు కుదిరెడినో! ఇవి యింతకుమున్ను పాశుపతమున నుదాహరింపఁ బడినవియే. వీనికిగూడ, నన్యథాసిద్ధి యున్నదో! వినవలయు, మఱియు "జనుఁడు" దీనికై యేమో వ్రాసి యెక్కడనో, ప్రయోగమున్నట్లు జ్ఞాపకమనికూడ లిఖించి, తుట్టతుదకు "అనుకరణముగ నున్నది గావున సాధువే" అని గతికల్పించి శ్రమపడిరి. ఇంత పరిశ్రమ మెందులకో? "ఆ. వె. జరయు మృతియులేని జనునట్లు" అని చిన్నయ్యసూరి ప్రయోగించెనే? అది

* (సతికి) అని పాఠాంతరము.

సమాస గతమే యందురోటు? అనరు. వారనుకొన్న సమాస మిట్టిదికాదు. ఇట్టిదే యని వాదమునకు దిగినప్పుడు సమాధానమీయవచ్చును గదా? పైఁగా "జనుఁడను ప్రయోగము చక్కఁగ నభ్యస్తము కాలేదని ప్రత్యాంధ్రుడును నెఱుఁగును". అని యొక క్రొత్తమాట వ్రాసియున్నారు. అభ్యస్తముకాని యంతనే కబ్బముల వాడఁగూడదేమి? 'ఒగి, ఏడ్తెటి, వ్రేల్మిడి, నెట్టపంట, తద్దయు, ఎసక మెసఁగ" ఈ గ్రాంథిక పదములన్నియుఁ బ్రత్యాంధ్రునకును నభ్యస్తములే యగు నోటు? ఇవి దేశ్యములు. నావ్రాఁత తత్సమమునకు సంబంధించినది యందురో? అనుఁడు. ఆగుచో "క. ...సద్యంబ బ్రహ్మహత్యా పద్యము" భారతస్వర్గా ౧, ఆ. పైపద్యములోని "సద్యము" ప్రత్యాంధ్రునకును నభ్యస్తమే యగునొకో? తలయుం దోఁకయు లేని యిట్టి వ్రాఁతలవలన ఫలమేమి? శాస్త్రులుగారూ! మఱియు "ప్రప్రథమము" ఈ ప్రయోగము సాధువా? యనిరి. అంతతోఁజాలింపక "ఇదియే యామ్రేడితమో" అనికూడ వ్రాసిరి. వీరితో నిది యామ్రేడితమని చెప్పిన మూర్ఖుఁడెవఁడో కదా? పైఁగా "గీర్వాణమునఁగాని యాంధ్రమునఁగాని యిట్టి ప్రయోగములేదు" అని ధ్రువపరచిరి.

ఈ విమర్శకులకు నాందిలోని రసవిషయికమగు చర్చంబట్టిచూడఁ బదచ్ఛేదమెట్లు చేసికోవలయునోకూడఁ జక్కఁగఁ దెలియదని స్ఫుటమగుచున్నది. అట్టివారికీ వృథా సాహసోక్తులేటికో? ఇట్టి ప్రయోగము లేదఁట? లేకపోవుఁగాక, అది దుష్టమైనపుడు కదా? "వైయాకరణాః పిశాచాః ప్రయోగమంత్రేణ నివారణీయాః" అను చొప్పున వాకట్టు కల్పించుటకుఁ బ్రయోగపర్యంతానుధావనము చేయవలయును. శాస్త్రులవారు దానిదుష్టత్వమును నిరూపింప వలసియున్నది. అప్పుడు దానిశిష్టత్వమును నిరూపింతుము. ప్రయోగమఁట! రామశబ్దమునకుఁగూడ వీరికిఁ బ్రయోగమే కావలెను గాఁబోలును. మఱియు "వృథామాట" ఈ సమాస మనేక మందిలోనిది యఁట! ప్రయోగింపరాఁదట! ఎంత చక్కని విమర్శనము! ఇది సమాస మేల కావలయునో? వ్యస్తమన్నచో శాస్త్రులవారి శంక నివృత్తము కావలసినదే కదా? కాదు. "సమాసమే యందము" అనుచో వీరు దీని నేమిచేయఁగలరో? "అనేకమంది" తరగతిలో నిది చేరదు. చేరదు, చేరదు, కారణమరయుదురుగాక. తెలియదన్నచోఁ దెలుపఁబడును. మఱియు, "కోసము" ఇది యెవరి సహవాసము వలననో కల్గినదఁట! "గ్రాంథికముగ నటనట నున్నను" నగ్రాహ్యమఁట. ఇదియేటివ్రాఁత? ఇఁక గ్రాంథిక ప్రయోగమిచ్చి యేమి ఫలము! లోకార్థ మీఁబడుఁగాక. ఉ.భూసుత కోసమే గనుక బొంకితినేని. ఉ॥ రా॥ రా॥ అ॥ మఱియు "ఎల్లరు" ఎల్లవారనియే యెల్లకావ్యముల గలదఁట. ఏమి వీరి సాహసము! ఎల్లకావ్యము లనఁగా? అచ్చులును, హల్లులును, మాత్రము కావు గదా? "కొన్నిటఁగ్వాచిత్కముగ

నెల్లరనియుఁ గలదఁట? సమ్మతింపరానిదఁట?" ఎందుల కీ పిచ్చివ్రాఁత. ఇట్టివే మఱి కొన్ని యక్కరము లిచ్చోఁగలవు. ఇది యంతయు స్వవచో వ్యాఘాతపు వ్రాఁత. "ఉ. ఎల్లరు నెల్లచో ధనములిచ్చి" అని తెనాలి రామకృష్ణకవి ప్రయోగించెను. మఱియు నీక్రింది యాక్షేపణమును జూచినచో శాస్త్రులవారి సహృదయత్వపు బండారమెల్ల నొక్కమాఱుగా బట్టబయలగును.

"పితృవ్యాదులు" పితృవ్య ప్రభృతులన్న బాగఁట? "పై ప్రయోగము సరియైనను వినఁగనే నా చెవికి పితృవ్యులను తినువా రను నర్థము స్ఫురించెను" అని వ్రాయఁగలిగిరి. వీరిట్లువ్రాయుట తప్పులేదు. వీరి వ్రాఁత సర్వము నిట్టిదియేకదా? వీరి చెవికెట్లు స్ఫురించెడినో మాకెట్లు గోచరించెడిని? మా యనుభవముంబట్టి వీరికి స్ఫురించిన యర్థము ఝడితి స్ఫూర్తినందెడిది కాదనియుఁ గష్టముమీఁద స్ఫురించెడిది యనియు- "పినతండ్రులు మొదలగువారు" అనునది శీఘ్రోపస్థితమగుటకుం గల హేతువు విచారణీయము. అందులకు మాకున్న పాండిత్యము చాలదు. వైద్యశాస్త్ర పాండిత్యము కావలసియున్నది. వీరి ధర్మమాయని పాపము, "నాచెవికి" అని వ్రాసినందులకు సంతసింపవలసియున్నది. ఈవిరుద్ధపుఁ జెవికి "సీతారామౌ" అనుదానికి లాంగలపద్ధతియు, గంధర్వమృగమును, ఝడితి స్ఫూర్తి నందవలసియున్నది. శాస్త్రులవారు త్వరలో జాగ్రత్త గలిగి యీవిరుద్ధజ్ఞానము నుపసంహరించుకొనుటకై ప్రయత్నింపఁగోరఁబడుచున్నారు. ఏకారణముననో శబ్దవిషయమైన చర్చలో వీరి విచార మసారముగా నున్నను ఆర్థిక విచారమునెడల మిక్కిలి చక్కఁగ నున్నదని వ్రాయఁగలను. దానింగూర్చి విస్తరించి వ్రాసిరి. కొన్నిచోట్ల మిక్కిలిగ మెచ్చుకొనిరి. కొన్నిచోట్ల "ఛాందసత్వము" నారోపించిరి. సహృదయైక శరణ్యమగు ప్రస్తుత సందర్భమున నేనేమివ్రాసినను బ్రయోజనముండదు. కవియనఁగా? వంటబ్రాహ్మణుని వంటివాఁడు. వానిపాకమునందుం బలెవీని పాకమునందును భిన్నాభిప్రాయము లుండెడిని.

"జిహ్వాకొక రుచి, పుఱ్ఱెకొక గుణము" అనులోకోక్తి నెఱుఁగని వారెవరు? పాచకుఁడుగాని, కవిగాని తన పాకమును గూర్చి వివరింపరాదు. "సహృదయాః ప్రమాణమ్."

"శ్లో. కవిఃకరోతికావ్యాని । లాలయత్యుత్తమోజనః
తరుఃప్రసూతే పుష్పాణి । మరుద్వహతి సౌరభమ్"

గేస్తు సంతతిం గన్నట్టులు కవి యేవో గిల్కుచుండును. అందుఁ గొన్ని కొందఱకు మఱికొన్ని కొందఱకు నచ్చుచుండును. కొందఱకు నచ్చినవి కొందఱకు నచ్చవు. ఇందులకుఁ గవియేమి చేయఁగలఁడు? కవి రసాస్పదమనుకొన్న యొక పద్యము విమర్శకుని

యభిప్రాయమున నీరసమయినం గావచ్చును. ఇందులకై పెనఁగరాదు. కావున శబ్ద విచారమును గూర్చియే "స్థాలీపులాకన్యాయముగా" వ్రాసి విరమింపనెంచితిని. ఈ విషయ మిదివఱకే నానారాజ సందర్శనమునఁ జదువరులు తిలకించి యుందురు.

"... ... ... రసారస విచారము మాయదికాదు మిక్కుటం
పు రసికులైన మీ కెఱుఁగఁ బోలని దొక్కరసమ్ము గల్గునే"

పైపద్యపాదములు శ్రీనివాస విలాసాంధ్రీకరణ ఘట్టమునందలివి. ఇఁక విమర్శకుల నొకటి యభ్యర్థింపవలసియున్నది. ఏదో మీరు సాహసైకశరణ్యముగా వ్రాసితిరి. వ్రాయునప్పుడు వెనుక ముందు లాలోచింపరైతిరి. మా గ్రంథములను విమర్శించినవారిలో మీవంటి విద్వత్తుకలవారిదివఱలోనే లేరు. కాని ఆ విమర్శనముల నాఁటికి మేము తగినంత యోపికలోనుండుటచే వారి చొప్పదంటు శంకల కన్నిటికిని విసుగుకొనకయే యుత్తరములు లిఖించుచు వచ్చితిమి. ఇప్పుడో మేమిరువురము కాక ఒక్కరైతిమి. పైఁగా షష్టిపూర్తికి దాపగుటయు, వత్సరమునుండి వ్యాధిగ్రస్తతయుగూడ దానికిఁ దోడైనవి. కావుననేదో వ్రాసి మరలఁ బత్రికను నింపక విధిగా వ్రాయవలసి యుండునెడలనే వ్రాయవలయునని యభ్యర్థించుచున్నాఁడను. లేదా? సెలవుదినములలో నొక్కపరి దర్శనమిప్పింతురేని ప్రత్యక్షములో నుత్తరమిచ్చుట కింకను నాకుఁ గొంచొక యోపిక యున్నదని మనవిచేసుకొనుచున్నాఁడను. మీరు గూడ నన్నిట్లే కోరుదురేమో? అదియు యుక్తమే. కాని యట్టి యారోగ్యమున్నచో నేను మీరెంత వ్రాసినను నిట్లభ్యర్థింపనే యభ్యర్థింపనని మీరే గుఱితింపఁగలరు. ఇఁకమీరు కొన్ని గర్వోక్తు లచ్చటచ్చట వ్రాసియున్నారు. అవసరమగునేని వానింజూపెదను. లేదా తమరే, చూచుకోఁగలరు. ప్రత్యక్షములోఁ దమతోఁ గొంత వాగ్వాదము చేయవలయునను కుతూహలమున్నది, అందులకుఁ దమ యనుగ్రహము తోడ్పడుగాక.

"సతాం సద్భిస్సంగః కథమపిచ పుణ్యేన ఘటతే"

★ ★ ★

# పిష్టపేషణము

అయ్యా! కృష్ణరాయశాస్త్రులవారూ! మిమ్మును నేను- "విధిగా వ్రాయవలసి యుండునెడలనే" అని యభ్యర్థించినట్లు తాము శీర్షికలో నుదాహరించుచుఁ గూడ లిఖించిన సమాధానములయం దొకటిగాకున్న నొకటియైన నిలిచెడి తెగలోనికిఁ జేరకపోవుటయేకాక తత్తత్సందర్భములలోని మాటలే వాని యసారతను దెలుపుచున్నవి పరిశీలించెదరా?

(1) రూపక కావ్యాదిని శ్రీకార ముండవలయునని లేకున్నను,

(2) సంశయాస్పదమనియే విన్నవించితిని.

(3) అనువాఁడనో కానో శ్రీవారే యెఱుంగుదురు.

(4) మాకు లోపహేతు వక్కఱలేదు.

(5) ఇయ్యది రుచిభేదము ననుసరించినది.

(6) తప్పని నిరూపింతునని నాయభిప్రాయము గాదు.

(7) పాండురంగ మాహాత్మ్యమున ... ... ప్రయోగ మున్నదని యెఱుంగుదును... పాఠాంతరములున్నవియో యెఱుంగను.

(8) ప్రయోగము లభించునా యనియే సంశయించితిని.

(9) వ్యాకరణశాస్త్ర ప్రకారము కొన్ని సిద్ధములైనను,

(10) ప్రయోగ బాహుళ్యము కావలయును.

ఆ యీ మాటలును, వీనికి సందర్భించినమాటలును సవిమర్శముగా మరలఁ జదివికొని మీరు వాడినవాక్యములలో, లేక పదములలో, నేదినిల్చునని మీకుఁ బూర్తిగా విశ్వాసముండునో యట్టిదాని నొకదాని నేరి చూపితిరా? దానికై యెంతవ్రాయవలయునో యంతయు వ్రాసి, మీ యొనర్చిన పరిశ్రమకు సార్థక్యము గల్పింప యత్నింతును. అంతియ కాని యేవో కొన్ని కాలములను దోఁచినట్లుమీరు- "ప్రతివిమర్శనము" అని నింపుచుంటిరా? "అడిగెడివానికిఁ జెప్పెడివాఁడు లోఁకువ" కనుక విస్తారముగాఁ బెంచి వ్రాయవలసివచ్చును. అందులకుం దగినంతయోపిక లేదని మున్నే విన్నవించికొంటిని గదా? మీరు పరులవ్రాఁతలోని సారాసారములటులుండ స్వీయమగు వ్రాఁతలోని సారాసారములను

గూడ నిర్ణయించునంతటి శ్రద్ధకలవారు కారన్నందులకు మీవ్రాఁతలోనివియే కొన్ని యుదాహరించు చున్నాఁడను- "ప్రయోగమును జూపుఁడు, మీరు చూపలేరని ప్రశ్నించుటగాదు, నా యెఱిఁగినంతవట్టు లేదని తోచుచున్నది. నేను సర్వజ్ఞుఁడనా? అల్పాల్పజ్ఞుఁడను." ఈవ్రాఁత కర్థమేమైనా గలదా? ఇయ్యది- "చంకదుడ్డు శరణార్థి" అను సామెత కుదాహరణమో? కాదో? విమర్శించి చూచికొనుఁడు. మీకుఁ దోఁచినంతలోఁ బత్రికలు తేరగా నున్నవి కదా? యని ప్రచురించి, వృథాగాఁ బని కల్పింపవలసినదియేనా? మరల నీ క్రింది మీయక్కరములను జదివికొనుఁడు.

"నాప్రశ్నములకు సమాధానమిచ్చుటయే చాలును"

అయ్యా! మీరాయాయి ఘట్టములఁ బూర్వపక్షముల నెత్తికొని యెంత వ్రాయవలయునో యంతయు వ్రాసి తుదకు సాధుత్వము కుదురక "ఈ ప్రయోగ మెట్లును దుష్టమే" ఇత్యాదిగ నిశ్చయించి యిపుడు కొంత వినయమును బ్రకటింప మొదలిడి యా సంభ్రమమున- "దశదాడిమాది వాక్యముంబోలె" పరస్పర సమన్వయము లేనిమాటలను లిఖించుచుఁదుదకయ్యవి యన్నియును ప్రశ్నములుగాని, సిద్ధాంతములు గావని యపలపింపఁ జూచుచున్నారని విచక్షణులగు చదువరులు నిర్ణయించెదరనియేని తలఁపక మరల మీరు పత్రికలోఁ గొన్ని కాలములు వృథసేయుటకు నేను మిక్కిలిగ వగచుచున్నాను. నిజముగ మీరిన్ని ప్రశ్నలను నన్నుఁగాని యొరులనుగాని యడిగి తెలిసికోవలసిన వారే యగుచోఁజేయవలసిన విధానమిదికాదు సుడీ? "గురు శుశ్రూషయా విద్యా" ఓహో? అది యెట్లు సంఘటించెడిని? పాపము! శాస్త్రులవారికి శిష్యత్వము చేయు కుతూహల మున్నను "ప్రత్యక్షమగుచో నేమగునో" అను భయము పూర్తిగ బాధించుచున్నది. కావున వీరిట్లే పత్రికలు నింపుచుందురు. ఓపికయున్నచో వీరికి నుత్తరములు లిఖింపవలసినదియే. ఇట్టి వాదోపవాదముల మూలమున విద్య నార్జించు నుపాయము గూడ గణనీయమే కాని, ప్రస్తుతము వారి యుద్యమమునకుఁ దోడ్పడునంతటి యోపిక లేమింజేసి వారు సమీపమునకు వచ్చుచో నెట్లు బోధింపఁబడునో తద్విధానము నెఱింగించుటకుఁగా నేదో యొకదాని నడుగుఁడని విన్నవించుకోవలసి వచ్చినది. నే నెంతయో ధైర్యముతో మాఱుమాట లేఖమును వ్రాయరని వ్రాసిన యంశమునకుఁగూడ శాస్త్రులవా రెంత గంభీరముగా వ్రాయుచున్నారో? "పితృవ్యాదులు శ్రీ శాస్త్రులవారన్నట్లు పాఠకులే నిర్ణయింపవలయును."

ఇంకను "పితృవ్యాదులు" అనుచోఁ దామనుకొన్న యర్థము ఝుడితి స్ఫూర్తి నందునని చెప్పఁదగువారు పాఠకులలో నుందురనియే వీరికి విశ్వాసము కాఁబోలును? అగుచో! బ్రస్తుత విషయమున వీరు ప్రష్టవ్యులు కారు. వీరి కట్టి నిశ్చితజ్ఞానమును బ్రసాదించిన

యీశ్వరుఁడు ప్రష్టవ్యుఁ డనఁదగు. ఈ విషయ మిటులుంచి ఈవిషయమున వీరు నావ్రాసిన యక్షరములు ప్రస్తుతమునేకాక యప్రస్తుతమునుగూడ బోధించుచున్నవని నాయెడలఁ గినియుచున్నందులకు నుపశాంతి కల్పింపవలసియున్నది. ఆస్థలము- "భారత ప్రయోగములు శాస్త్రులవారికి చావులుగా మార్పదగినవియే కాఁబోలు" అనునది- ఈ, కి, షష్ఠి కర్తరిషష్ఠి వంటిదిగాని, కర్మణి షష్ఠివంటిది గాదు. లేఖకాశయ మిట్టిదియే యైనను శాస్త్రులవారు వ్యాకరణ నిష్ణాతులగుటచేఁ గాఁబోలు- "ఉభయప్రాప్తౌ కర్మణి" అను నాధారమును నూఁతగాఁగొని పైవాక్యము వ్యక్తికి సంఘటించుచున్నట్లభిప్రాయపడి యేవో కొన్ని పంక్తులు లిఖించినారు. ఆషష్ఠి కర్తృ కర్మ సాధారణముగా నన్వయింప వీ లిచ్చెడిదియే కాని ప్రయోక్త్రభిప్రాయమును సుంత విచారించుకోనక్కరలేదా? "చంద్రవన్ముఖమ్" అనుచోఁ గవ్యభిప్రేతములగు నంశములనే గైకొందురో? లేక యనభిప్రేతములగు నంశములనుగూడఁ గైకొందురో? ఇదిగాక ఆ వాక్యము ప్రస్తుతార్థమును బోధించి యంతతో శాంతినందక శాస్త్రులవారి యపోహ కవకాశము సుంత కలుగుచున్న దనుకొందమా? అగుచో మీవ్యక్తికది సంభవింపఁ జేసెడి దొసంగును దొలఁగించుటకుఁ బరాత్పరునిఁ బ్రార్థించుచుఁ బ్రతివిమర్శకుల నీయొక్క మాటడుగుచున్నాఁడను. అయ్యా! మీకునపోహను గల్గించిన విషయమును మాత్రమే లిఖించి, మిన్నకుండక తక్కిన జలతాడనమున కేలకడంగితిరి? ఇప్పుడు నే సమాధాన మిచ్చిన యంశముల నటులుంచి యసారములని పూర్తిగా వదలినవాని యోగ్యతను నానేర్చినకొలఁదిగఁ జూపుచున్నాఁడను. "కొంపతీఁత" - ఈ ప్రయోగము శాస్త్ర సిద్ధమైనను లోకమున వాఁడుకలో లేనిదిగా భావించి పాయు+త, డాయు+త, దూయు+త, క్రోయు+త, చేచు-పాచు-లోనగు నప్రసిద్ధముల నుదాహరించి యున్నారు. మీ యుదాహరించిన రూపములో దూయు ధాతువునకు లోకమున "దూఁత" అని ప్రయోగము కలదు సుఁడీ. అట్లే మాతీఁతకును వాఁడుక కలదు. ఈక్రింది యుదాహరణముల నరయుఁడు. "గోదావరి తీఁత కారంభించినది, కలుపుతీఁత జరుగుచున్నది." ఇఁక దూఁతకుఁ బ్రయోగమును జూపుదును. ఆయూర దోమలు "దూఁత"లును చరపులును, ఇత్యాదులు లోకప్రసిద్ధములు. మీప్రాంతమున నిట్టివ్యవహారము లేకపోవచ్చును. అందులకే కదా? "దేశాటనమును" నైపుణీ సంపాదక సామగ్రిలో లాక్షణికులు చేర్చినారు "కంగుల్ దీర్చినపైఠిణీరయిక" అనుదానికి సంబంధించిన యితిహాసము తామెఱిఁగియే యుందురు. వ్యాకరణము నిప్పట్ల నడుగనే యక్కఱలేదు కదా? అప్రయుక్తత లోకప్రసిద్ధి వలనఁ దొలఁగెడిని. ఇఁకఁ బూర్వులగ్రంథ ప్రయోగముల నడుగవలెను. ఉన్నను నుండవచ్చును. లేదా యిట్టి లోకప్రసిద్ధములకు వానితోఁ బనియేమి? సజాతీయ ధాతువులు కొన్నిటినుండి యిట్టివి పుట్టినట్లు లేదని దీని కనభిధానము చెప్పుట

యాపాతరమణీయమైనను విమర్శనమునకు జంకెడిని. సజాతీయ ప్రయోగాభావము ప్రస్తుతాభావమును సాధించుచో "గమ్, గామః, క్లమ్, క్లామః, క్రమ్, క్రామః" అను సజాతీయ ప్రయోగముల యభావము సర్వత్ర ప్రసిద్ధమగు "రమ్, రామః" అనుదాని కభావమును దెచ్చిపెట్టవలసి వచ్చును. వాది దౌర్బల్యమే కాని వాద దౌర్బల్యముండదు. వ్యవహారత స్సిద్ధములును, వ్యాకరణావిరుద్ధములు నగు ప్రయోగములను గూర్చి యింత చర్చయేల? ఈ విషయమునకు మేము చిరకాలమునాఁడె యుత్తరమును వ్రాసికొని యుంటిమి.

"తే.గీ. కేవల గ్రామ్యపదముల నేవగించి
జనులు వాడెడి పదములు సమ్మతములు
కలవు లేవని పెనఁగ శక్యంబె భార
తాదులను లేనిపదములు నవనిఁ గలవె"

(దేవీ భాగవతము ౧ స్కం.)

ఇఁక నొకటి, సమగ్రమగు వ్యాకరణము గల భాషలోని "ఫణినాపత్య" "వణినసూను" "మాధ్వీ" ఇత్యాది ప్రయోగములు మీ రెఱిఁగి యుందురు. వీనిం గూర్చి మీ యభిప్రాయమేమి? ప్రయోక్తలు శ్రీనాథుఁడు పెద్దన, ఎల్లమహాకవులును, గదా? ఇందుల కేమందము. మఱియు మీరు ప్రస్తుతము "సమదర్శినిలో" శాకుంతలమును గూర్చి విమర్శించుచున్నారు. చూచితిని. ఈ విమర్శనములను నేను విశ్వసింపను. ఆ గ్రంథకర్తల కీ మాత్రముగూడ దెలివితేటలు లేవని నే ననుకొనఁజాలను. ఇట్లే విమర్శించు నెడల నిలిచెడి కవితయే యుండదు. ఎట్లుండదో చూడవలెనని కుతూహలమున్నచో నిర్దుష్టమని మీకుఁబూర్తిగఁదోఁచిన యొక పద్యమునో, శ్లోకమునో పరీక్షార్థముగ నా కొసఁగుఁడు. దానిని నే నెట్లు పాడు చేసి మీకుఁ జూపుదునో చిత్తగింపఁగలరు. మీరేకాదు, ఈ నూతన ఫక్కి విమర్శనములకు మా శిష్యులలోఁగూడఁ గొందఱు దిగియున్నారు. విన్నను, వినకున్నను వారికిఁగూడఁ బనిలోపనిగా నిది విమర్శనమార్గము కాదని తెలుపుచున్నాఁడను. మీవ్రాఁతం దిలకించిన మీయందు బహుశ్రుతత్వము కలదని ముమ్మాటికిని దేలెడిని. అట్లు విశ్వసించుచుంగూడ నేనిట్లు వ్రాయుటకు మన్నింపఁగోరెదను. వ్రాయుటకన్నఁ బ్రత్యక్షములో మిమ్ము నంగీకరింపఁజేయుట సులువు. కాని "శాస్త్రులవారికి" ఇత్యాదివాక్యమున కపార్థము చేసికొనుటచే మీరందుల కంగీకరింపరు. ఇఁక "సమాధాన ప్రాయములగు గ్రంథములనేనిఁ" బంపవలసియున్నది. వారిట్లు కోరుట యుక్తమే, తప్పక పంపవలసినదియే. కాని యవియన్నియుఁ బునర్ముద్రణమునకువచ్చి చిరకాలమైనది.

ఒక్కొక్క ప్రతివంతున మాత్రము దాఁచి యుంచితిమి. వానిం జూచుటకేని దర్శనమునే కోరుచున్నాఁడను. లేదా? ఆ ప్రాంతములయందలి గ్రంథాలయముల నరయఁగోరు చున్నాఁడను. అట్లు తటస్థింపనిచో నోపికకొలఁది కొన్నాళ్లలో నాయా యీ గ్రంథభాగముల నెత్తి వ్రాసి పంపుదును. ఇఁక నొకటివ్రాసి విరమింతును.

"వృథామాటయు, 'తోడనేనా' లోఁ జేరును" అని వ్రాసితిరే? ఈమాట కర్థమేమి తోడనేనా? అనునది లోకానుభవ సిద్ధమైయుండ మహాకవిప్రయోగారూఢమై యుండ "చిన్నచిన్న వ్యాకరణపుఁ బొత్తములవలన" సమర్థనీయము గాదన్న మాత్రమునఁ బరిహసింపఁదగినదియే యగునొకో? అగుచో "పంచాంగమున వ్రాయనిచో నక్షత్రములు గూడఁ బోవలెనే?" అతి విస్తర మెందులకు? ఈతోడనేనా ప్రయోగమునకు మా పాశుపతమున నున్న యక్కరములు వ్రాసి చూపుచున్నాను. "వీరికున్న తెల్వితేట లెంతటివో కనుఁగొనుట కొక చిన్ని యుదాహరణమిచ్చుచున్నారము. "అప్రస్తుత ప్రశంస" లో వీరు "ఆర్యులారా! ఇది అప్రస్తుత ప్రశంసయేనా?" అని యొకచో వ్రాసికొని, అది తప్పని సంశయించి శుద్ధపత్రికలో "ప్రశంసయేయా" అని దిద్దికొనిరి. దీనిచే వీరి తెల్వితేటలు తెలిసికొనవచ్చును. దిద్దిన ప్రయోగ మెంత యసహ్యముగా నున్నదో సహృదయు లెఱుఁగుదురు... ...ఇంతకు మొదటిది తప్పగునా? కాదా? అనునది విచార్యము. "ప్రశంస + ఏ + ఆ" అనియుండఁగా మధ్య నకారమెట్లువచ్చునని సామాన్యులు శంకింతురు. విశేషజ్ఞులు భాషాస్వభావముచే మధ్య "ను" అను సముచ్చయము చేరుననియుఁ గావుననే ఇందుమతీ పరిణయములోఁ గుమార ధూర్జటి "ఉ. ...నాల్గుకోటులే! నా? మఱియున్ ఘనంబుగ ధనం బొనఁగూర్చెద" అని యతిస్థానమున బ్రయోగించి యున్నాఁడనియు నుత్తరము చెప్పుదురు. ఇట్లు వాక్యాలంకారముగా "ను" చేరునట్లు కొన్నిగలవు. ఈ యంశ మిందే 93వ పుటలోఁ గొంత తెల్పియుంటిమి. చెవి కింపుగలిగి యేమాత్రమేని సమర్థింపవలనైన దానిని వదలఁగూడదనియుఁజెవి కింపులేక శాస్త్రసిద్ధమైనను దానిని వాడుట అంత హృదయంగమము కాదనియుఁ బూర్వకవుల యాశయము" ఇత్యాదికము సపాశుపతాశ్వమేధమునఁగలదు. ఇందున "ను" అనునది మన యాంధ్రాచార్యుల భారతములోని "లేకను" అనుచోఁ గలదానికన్న ననర్థము కాదుగదా? మీయాశయమును దెల్పుదురుగాక! మీరు "అందఱకు" గ్రాంథికముగా లభింపదనిరి. ఎవరిని సంతోషపెట్టఁగలము. "మహాఋషీణాం మతయశ్చ భిన్నాః" ఇట్టివి వృథాగా రంగమున కెక్కించి మీరు పని కల్పించుకొని, యొరులకు పనిగల్పించినవి పెక్కులున్నవి, కాన విస్తరింపను. మీరు "ప్రతివిమర్శనమున" వ్రాసినదానిలో దేనినో యొకదానిని నిర్దేశించి విస్తరించి వ్రాయవలసినదని విధింపుఁడు. తెలిసినయంతలో వ్రాయుదును. మీ విమర్శన

మేదోవిధముగానున్నది గాని చక్కఁగ లేదని నాతోపాటుగా పాఠకులలోఁగూడ గొందఱనుచున్నారు. అనుట కొకవిద్యాభిలాషియగు పాఠకవరుని జాబునుండి కొన్నిపంక్తు లుదాహరించు చున్నాఁడను.

"సాధారణముగా నే(గ్రంథమునైన విమర్శింపఁదలచిన బుద్ధిమంతులు... ...గ్రంథ మిదివఱకు విమర్శింపఁబడినదో లేదో విమర్శింపఁబడి యుండినయెడల... ...దో ... ...దో ... ...దో ... ...విమర్శింపఁబడు గ్రంథముతో సంబంధించిన యితర గ్రంథము లేమైన గలవో లేవో... దో ... ...దో ... ...యోజించి విమర్శకుం గడంగుట యుత్తమ పాండితికి లక్షణమని నా సామాన్యబుద్ధిచేఁ దలంతును. అట్లుగాక ... ...అనుకరించిన ట్లొనర్చిన పర్యవసానము మఱియొక లాగున పరిణమించెడి ... ...విమర్శకు లింతతో తృప్తిగని ... ...గుర్తించి యూరకుందురని తలంచను."

ఇంత మాత్రమున లోక మెల్లను నిట్లే యభిప్రాయ పడునని యూహింపఁ దగదు. కొందఱు మీ వ్రాఁతను మెచ్చువారుఁగూడ నుండవచ్చును. మన మన వ్రాఁతను మెచ్చువారుఁగూడ నుండవచ్చును. మన మన వ్రాఁతలకు ఫలము లోకారాధనమే కావున నట్టి వ్రాఁతలు గొన్ని తాముకూడఁ బ్రచురింతురని నమ్ముచున్నాఁడను. "విద్యాయాం వ్యసనం... ...యత్రవసంతి నిర్మలగుణాస్తేభ్యోమహ ద్భ్యోనమః" (భర్తృహరి)

★ ★ ★

# పునఃపేషణము

అయ్యా! మీరింకను వ్రాయుదు రని నేఁదలంఁపకున్నను వ్రాయుచునే యున్నారు. మిమ్మును బ్రత్యక్షముగా దర్శింపకున్నను, ఒరుల వలన మీ వయస్సును గూర్చి వినకున్నను నాకన్నఁ జిన్న లని తెలిసికొనుచున్నాఁడను.

"నాయభిప్రాయము" అను శీర్షిక మొదలుకొని వ్రాసిన పంక్తులలో నేస్వల్పమో తక్క విశేషించి మాయందును, మా గ్రంథములయందును మీ కెక్కుడు ప్రేమముగల్గిన యంశమును దెల్పుచున్నవి – అంతకొకింత వెనుకనున్న – "అమహిమమేమి" అను శీర్షికక్రింది యక్కరములు గూడఁ జాలవఱ కట్టివియే యననగును. యిటు లుండఁగా – "తేరగా నున్నవికదా?" అను శీర్షికకు సంబంధించినవ్రాఁత సర్వమును వృథాగా నపవాదాపాదకమై పత్రికాధిపతులకు మామీఁద ద్వేషము కల్గించునదిగా నుండు టేమో? నిజముగా మీవ్రాసినయంశ మందున్నచోఁ బత్రికాధిపతులు మమ్మునడుగ కేల మిన్నకుందురు? వారు మాపేర వ్రాసినజాబు నీ సందర్భములోఁ బ్రచురింపవలసియున్నను, వారిసమ్మతిలేని పనియగుటచే నటు లొనర్పలేదు. మఱియు – "గురుశుశ్రూషయా విద్యా" అను శీర్షికక్రింద మీరు వ్రాసినవ్రాఁత మీ మనస్సునందలి రహస్యమును వెల్లడించుటయే కాక మీవలెనే యితరులు గూడ ననుమాన పడునెడల – "చండాలోఽస్తు" "జ్ఞానహీనో గురు స్త్యాజ్యః" లోనగు వాక్యములు వ్యక్తి దూషణకుఁగా మీ రుపయోగించినట్లు చెప్పకచెప్పు తెగలోనివిగా నున్నవి. ఇట్లు ప్రధానవిషయమును బోడిమాటలకు వదలి, యప్రధానమును బెంచిపని కల్పించికొని, యొరులకుఁ బని కల్పించుచుఁ దుట్టతుదను మరల "విషయ మాత్రముగ నిందని ప్రార్థింతును" అని వ్రాయఁగల్గితిరి. నేను విషయమాత్రముగనే వ్రాయుదును. మీ రట్లు వ్రాయలేదని దిఙ్మాత్రము చూపితిని. వ్రాయవలసిన విషయమే కప్పట్టదు.

శ్రీకారమునుగూర్చి మరల వ్రాఁతకు దిగితిరి. దిగుటయేకాక "నాటకము కావ్యముకాదని" తెలుపు మనిరి. అంత వఱకును మీవాదమే నిలుచునని మీకుఁ బరిపూర్ణ ధైర్యము కలదు. "నాటకము కావ్యము కాదు" అని మీ కుతూహలము ననుసరించి వ్రాయుచున్నాఁడను. ఏమందురా? నాటకమునందు "నాటకత్వ, కావ్యత్వములు" రెండును

గలవు. ఇందు సామాన్యధర్మ మెయ్యది? విశేషధర్మ మెయ్యది యనుచో– "కావ్యత్వవ్యాప్యము నాటకత్వము" కాని నాటకత్వవ్యాప్యము కావ్యత్వము కాదు. ఈ యంశము పండిత పామరసాధారణ్యముగాఁ దెలిసినదే కదా? అగుచో నొకవస్తువునందలి వివిధ ధర్మములలో వ్యవహారోపయుక్తమగు ధర్మ మేది కావలయును? వ్యాప్యధర్మము కావలయును? అపుడు నాటకమునందుఁ గావ్యత్వమున్నను దానిని విశిష్టధర్మ ప్రయుక్తమగు నాటక శబ్దముచేతనే వ్యవహరించుట పండితసమ్మత మగును. గాని సామాన్యధర్మ ప్రయుక్తమగు కావ్యశబ్దముచే వ్యవహరించుట పండితసమ్మతము కాదని యొప్పికొందురా? ఒప్పికొననియట్లు మీరు వ్రాసిన 'రూపకములు కావ్యము లేకదా' లోనగు మీపంక్తులుద్ఘోషించుచున్నప్పుడు మిమ్ము మరల నడుగుట యనాలోచితమే. అగుచో "నాటకమున నాటకత్వకావ్యత్వములేకాక" పదార్థ, త్వ, కార్యత్వ, యక్షరమయత్వాదులు గూడఁ గలవు కదా? తత్తద్ధర్మప్రయుక్తములగు పదార్థ, కార్య, ప్రముఖశబ్దములచేఁ గూడ వ్యవహరించుచున్నారా? వ్యవహరించుట యథాకథంచిత్తుగా సమర్థనీయమే అనుకొందము. లోక మామోదించునా? "యద్యపి శుద్ధం లోకవిరుద్ధం" అనుచొప్పున నట్టివ్యవహారము సర్వథా గర్హితమే యగునా? కాదందురా? అట్లేని స్మార్తులు, శ్రీవైష్ణవులు, మాధ్వులు, ఈ మూఁగురును బ్రాహ్మణులే కదా? ఇందు శ్రీవైష్ణవులకు స్మార్తత్వాపేక్షయావిశిష్టధర్మము వైష్ణవత్వముండుటచే వారు తద్ధర్మప్రయుక్తమగు వైష్ణవపదముచేతనే వ్యవహరింపఁబడుచున్నారు. ఇట్లే "మాధ్వులును" అని విస్పష్టము. ఈ వ్రాసిన వ్రాఁతకెల్ల సారాంశము వ్యాపకధర్మమునకు వ్యాప్యధర్మము బాధక మనునదియే. ఇది సర్వానుభవసిద్ధమగునేని "నాటకములు కావ్యము లైనను" ఆపదవ్యవహారము విశిష్టపదవ్యవహారముచేఁ దిరోహితమగు. కావున సర్వసాధారణముగా నాంధ్రులు కావ్యాదిని శ్రీకారము వాడుచున్నను నాటకాదిని వాడనక్కఱలేదు. గీర్వాణకవుల యాచారముంబట్టి ప్రవర్తింపవచ్చును అని తెలుచుండఁగా శాస్త్రులవారు శాస్త్ర మర్యాదసర్వత్ర గలదు అని వ్రాయుటేలొకో? పైఁగా "సాధారణులఁ గప్పిపుచ్చనేమో" వ్రాయుదు రేమో, అందురే? నే నిపుడు గాని, యింతకు ముందుగాని వ్రాసినవ్రాఁత సాధారణులను గప్పిమోసపుచ్చునదియో, పండితసమ్మతమో శాస్త్రులుగారే నిర్ణయింతురని దీని నింతతో నిప్పటికి ముగింతును. ఇఁక "పాండుతనూభవులందు దుఃఖము" అనుచోనందలి "అందు" అనునది క్రియాజన్య విశేషణమా, విభక్తియా? అని సందేహమునకు నవకాశ ముండునుగాన "అందు, ఒందుగా మార్చుట యొప్పు" అని వాదింప మొదలిడిరి. పోనిండు వీరియభిప్రాయము మొదటినుండియు నిట్టిది యేమో అనుకొన్న మొదట వీరట్టి సందర్భమును సూచింపక యిటీవల నీత్రోవకు దిగినారు. దిగుదురుగాక "సందేహాస్పద మనియే యనుకొందము" వీరు సామాన్యులు కారు బహుశ్రుతులు గదా? "వ్యాఖ్యానతో

విశేషప్రతిపత్తిః" అనుపరిభాషను జదివియున్నవారే కదా? ఎవరో ప్రశ్నించినట్లు ప్రశ్నింపనేల? దిద్దుఁబాటు నుపదేశింపనేల? మంచిది వ్యాఖ్యానముతో నవసరములేని త్రోవను వీరుపదేశించిరి కదా? యని "అందు, బిందుగా" దిద్దితిమే యనుకొందము. వేఱొకరు "పాండుతనూభవులు" అనునదికూడ వ్యాఖ్యానము నపేక్షించెడిదియే కావున నా పదముకూడ నిఁక నొకలాగు మార్పవలసియుండు ననునెడల గతి యేమి? ఇక్కడ వ్యాఖ్యానాపేక్ష యెట్టిదని యడుగుదురా? బోలెఁడు కలదు.

"తనూభవశబ్దము" ఔరసపుత్రబోధకము. వ్యుత్పత్త్యర్థమటులుండఁగా వీరొకరు గాకున్న వేఱొకరేని "అట్టివారు కాకుంటచే" కొంత ధర్మశాస్త్రసాహాయ్యము నపేక్షించి "సహోఢుం డౌరసునివంటివాఁడే" యని వ్యాఖ్యానము చేయవలయునుగదా? "పార్థులు" అని ప్రయోగించినచో వ్యాఖ్యానముతో నక్కఱయుండదు. అగునేని పాదపూర్తికిఁ గొన్ని యక్కరములు లోటగు నందురా? "చ వై తుహి, చ వై తుహి" అనునట్లేవో మన కాంధ్రము నందును గొన్ని కలవుగాన వానినుపయోగించి యా లోపము తీర్చికోవచ్చును. కాని "భక్షితేఽపి లశునే" అను న్యాయముచే నిప్పుడుగూడ వ్యాఖ్యానాపేక్ష తప్పదేమో కదా? ఇందేగురలో మూఁగురు మాత్రమే, కుంతీపుత్రులగుటచేఁ జిక్కు వచ్చును. పైఁగా "నకులసహదేవులు" ప్రస్తుతవిషయమున నుదాసీను లని తేలినచో వారిసోదర సౌహార్దమునకుఁ గూడ భంగము కలుగఁ గలదు. దానినిఁ దొలఁగించుటకు మరల భారతమును వెదకి వ్యాసనన్నయతిక్కనాదుల కౌంతేయపదప్రయోగములను సోదరపంచకవాచకములను జూపవలసివచ్చును. ఇట్లెట్లో సమర్థించి పార్థప్రయోగము నిల్పుటకన్న నీ వ్యాఖ్యానములోఁ గొంత భాగము నుపయోగించికొని "పాండుతనూభవ". ప్రయోగమునే యుంచుట యుక్తమని కొందఱభిప్రాయపడవచ్చును. ఈవాదము "ఘటత్వత్వత్వత్వంకుతోనజాతిః" అనుదానివంటిది. ధారా విశ్రాంతి లేకుంటచే "ఘటత్వమునందే" జాతి నంగీకరించి తక్కిన తుక్కును వదలికొన్నట్లు మొదటిపాఠమునే సమ్మతించుట యుక్తమని కొందఱనవచ్చును. "ప్రథమాతిక్రమణే కారణాభావాత్" అనుటచే "అందు ఒందు" అనుమార్పువఱ కెందులకు శాస్త్రులవా రిక్కడనే శంకింపవచ్చును గదా? శాస్త్రులవారు కల్పించినచర్చ విద్యార్థులకు విద్యాభివర్ధకమనుటకు సందియము లేదు గాని పరినిష్ఠితులును బహుశ్రుతులును అగు శాస్త్రులవారు "కశ్చిత్కాంతా" అనుచోటంబలె, అందు అనుచోట శంకించుటయు దిద్దుకొమ్మనుటయు నంతియకాక-

"సంశయాస్పదము కాదని యెన్నఁటికిని ఋజువు పఱపలే రనియే నా నమ్మకము"

"ముమ్మాటికిని సంశయాస్పదమే యగును"

"ఒందు, మీ యందుకంటెఁ జాల బాగు"

"బాగు గా దనియు మీరు చెప్పలేరు"

"ఇట్టిదే ఉగ్గణంచు అనుప్రయోగమును నుగ్గణంచుకంటె, ఉక్కణంచు అని యున్నఁజాల రమ్యముగ నుండునను నా యభిప్రాయము ముమ్మాటికిని నిల్చును. తిరిగి ముద్రించునపు "దుక్కణంచి" యని సరిచేయుఁడని ప్రార్థింతును".

అని వ్రాయఁగల్గుటకును నక్కజపడవలసి యున్నది. ఈ తుది "ప్రార్థింతును" అనుమాటకు సందర్భమునుబట్టి "శిక్షింతును" అని యర్థము చెప్పికొనక తప్పదు. శాస్త్రులవారి కింత పట్టుదలయే యున్నచో నెత్తికొనవలసినచో టియ్యదిగాదు, కాదు, కాదు. వీరుచూపినను, జూపకున్నను విధిగా దిద్దికోవలసినస్థలములు గొన్ని కలవు. అందీ క్రింది పద్యమొకటి.

"తే.గీ. వీర చిత్రాంగద విచిత్రవీర్యులకు వి
వాహ మొనరించితిని కష్టపడి జయించి"

ఇట్టిస్థల మేదేని జూపి శిక్షణతాత్పర్యముతో "బ్రార్థింతును" అని లిఖించినచోఁ దప్పక దిద్దికొందుము. అంతియ కాని మే మెట్టివారమైనను "శ్రీతిరుపతికవులు మహాకవులు" అని వ్రాయుచు నెందులకుంగొఱగానిచోట వృథాగా శంకను గల్పించికొని పని గల్పించుట "మహతాప్రయత్నేన లట్వాకృష్యతే" అనువాక్యమును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది. ఇట్లే తిక్కనాదులకుఁ గూడ వీరు సవరణల నుపపాదింపవలసివచ్చుచో నెన్నియో యుండెడిని. దిఙ్మాత్రముదాహరింతును.

"చ. అది యొకఁ డేల... దుస్ససేనుదు ర్మద మడఁగించి"

(భారత – కర్ణ – ౧. ఆ)

ఈ వాక్యము సంజయునిది. కర్ణవధవృత్తాంతమును ధృతరాష్ట్రునితోఁ చెప్పుసందర్భములోనిది. ఈదుస్ససేనుఁడు ధృతరాష్ట్రుని కొమరుఁడు. దుర్మదుఁడే యగుఁగాక యతని చావునుగూర్చి యతనితండ్రితోఁ జెప్పునపు డిట్లు ప్రయోగించుటకు శాస్త్రులుగారొప్పికొందురో? సవరణనుపపాదింతురో? ప్రత్యేకించి కనుఁగొనవలసియున్నది. కావునఁ జదువరులు జ్ఞప్తియందుంచికొనఁ గోరెదను. ఒకటి రెండు విషయములకు మాత్రమే యిప్పుడు పునరుక్త మైనను గొంత పెంచి వ్రాసితిని. ఇట్లే యింకను "తీఁత, దూఁత" లోనగు దత్తోత్తరములకు మరల వీరు ప్రశ్నించి యున్నారు. వ్రాసినచోఁ బెరుఁగును.

చదువరులకును విసు వుదయించును. పాపము "పితృవ్యాదులు" అనుదానిని వదలినారు. సంతసింపవలసియున్నది.

నామహిమను కనుఁగొన నెంచి కాళిదాసుని "తత్రశ్లోకచతుష్టయమ్" అను నభియుక్తోక్తికుదాహరణ మగుశ్లోకచతుష్టయము నొసఁగిరి. అందొకశ్లోకమును బాగుచేసి చూపుమనిరి. చూపుదును. కాని యిప్పటికే గ్రంథము విస్తరించినది కావున దీనిమీఁద శాస్త్రులవారు వ్రాసెడియుక్తిప్రయుక్తులను జూచి పిమ్మట వ్రాయుదానిలో వారికోరిక దీర్తును. ఇపుడొకమాట వారి నడుగుచున్నాఁడను. అయ్యా మీరునాకుఁ బరీక్షార్థముగా నా సమ్మతిమీఁదనే యొసఁగిన శ్లోకచతుష్టయములో "అస్మాన్ సాధు విచింత్య" అనుశ్లోకములో మీకేమైన శబ్దశాస్త్ర విరుద్ధ ప్రయోగము పొడకట్టెనేని దెలుపఁగోరుచున్నాను.

★ ★ ★

# పాడినపాటే

శ్లో. ఉచిత మనుచితం వా కుర్వతా కార్యజాలం
పరిణతిల రవధార్యా యత్నతః పండితేన
అతి రభసకృతానాం కర్మణా మావిపత్తే
ర్భవతి హృదయదాహీ శల్యతుల్యో విపాకః.

శాస్త్రులవారిని నే నడిగిన యంశమేమని? ఏదో యొక దానిని గూర్చి అనఁగా? మీరెక్కుడు నమ్మికతో మరల నెత్తికొని వ్రాసిన శ్రీకారమును గూర్చియా? అందు ఒందుగా మార్చుటను గూర్చియా? ప్రప్రథమమును గూర్చియా? "ఇట్లనే, అట్లన" అనువానిం గూర్చియా? "కొంపతీఁతను" గూర్చియా? ఈ చూపినవానిలో దేనిం గూర్చియో? వ్రాయవలసినదని నిరూపింపుఁడు. దానింగూర్చి చేత నైనంతలో విస్తరించి వ్రాయుదు ననియేకదా? అట్లేదో యొకటి నిర్దేశింపఁబడవలసి యుండఁగా మరల సూత్రప్రాయముగా మున్ను దత్తోత్తరములగు శ్రీకారములోనగు పెక్కింటి నుదాహరించి వాదము పెంచుటేలొకో? వారి తాత్పర్య మెట్టిదియైనను నేను "పరప్రతారణమాత్ర ప్రయోజనముగా" భావించుచున్నాఁడను. ఈపరప్రతారణ ప్రధాన ప్రయోజనపు వ్రాఁతలో "చండాలోస్తు" "జ్ఞానహీనో గురుస్త్యాజ్యః" ఇత్యాదికము వ్యక్తిదూషణాశయమును ధ్వనింపఁజేయుచున్నవి. ధ్వన్యర్థ మిటులుండఁగా వాచ్యార్థము మిక్కిలిగాఁ దమకు మాయెడల గౌరవమున్నట్లు చాటుచున్నవి; పెక్కు వాక్యములు గలవు. వానిం గూర్చి యడిగి గ్రంథము పెంచుటకు నే నిష్టపడను. నేను వారి వ్రాఁతయొక్క సారాంశమును నిరూపించుచుఁ దత్సందర్భమున వ్రాయక తప్పని విధిచే "గురు శుశ్రూషణయా" అని యుదాహరించినదానికి మరల శాస్త్రులవారు కుపితులై తాము శిష్యత్వము నంగీకరించినను "నేను గురుత్వమునకుఁ దగను" అను నంశమును వాచ్య వృత్తిచేఁ బ్రకటించినారు. ఆ యక్షరము లియ్యవియే, తిలకింపుఁడు.

"కాని. వేంకటశాస్త్రులవారు గురువులగుటకుఁ దగుదురా?" లోనగునవి. వారు "తగ"రని వ్రాయుచుండఁగా నేను "తగుదు"నని వ్రాయుట యపహాస్యాస్పదముగా నుండునని యెఱిఁగియుఁ దప్పని విధియగుటచే నిట్లు వ్రాయుచున్నాఁడను. అయ్యా!

శాస్త్రులవారూ? మీ విమర్శనపుఁబద్ధతిని బరికించినను మీ రచ్చటచ్చటఁ గుండలీకరణపు గుర్తులతో లిఖించెడి యాంగ్లభాషా వర్ణములనుబట్టి చూచినను మీకా భాషలో గూడఁ బాండితి యున్నట్లు తోఁచెడిని. దానిలో మీకు గురుత్వము జేయుటకు నాకు లేశమును బ్రవేశములేదు గాని మనకుఁ బ్రస్తుతము నడచుచున్న "వాదోపవాదములు" దానికి సంబంధించినవికావు గనుక, దీనికి సంబంధించిన సంస్కృతాంధ్ర భాషలలో గురుత్వము చేయఁగలనని నొక్కి వక్కాణించుచున్నాఁడను. ఇట్లు నా వ్రాసినవ్రాఁత లోకులకు సర్వదా "భోజనమునకు రావలదనిన, పట్టుచీర గట్టుకొనివత్తును అను సామెతను స్ఫురింపఁ జేసెడినని యెఱిఁగియు వ్రాయ సాహసించిన నన్ను గౌరవించి యొకపరి సెలవుదినములలో దర్శన మిప్పింపఁగోరెదను. "అథవా విద్యయా విద్యా" కనుక నాకు మీ రాంగ్లభాషలో గురుత్వము చేసి నాఋణమును దీర్చికోవచ్చును. లాక్షణికులు "కావ్యజ్ఞశిక్షయాభ్యాసః" అని వ్రాసిన వ్రాఁతకుఁ బైరీతినిన మీరు సార్థక్యము గలిగించుట సర్వథాయుక్తము. నేను "కావ్యజ్ఞుఁడను" అని మీ రిందును వెనుకటి పత్రికలయందును వ్రాసిన వాక్యములలో ననేకములు తోడ్పడుచున్నవి. కావున వాని నందందు మీరే చూచికోఁగలరని యిందెత్తలేదు. "అన్యోన్యం గురవో విప్రాః" కనుక నిట్లొనర్చుటలో మీకుఁగాని, నాకుఁగాని యవమానము కూడ నుండఁగూడదు. మీకు నేను "చండాలుఁడనుగా" దోఁచినను నా బుద్ధికి మీరుత్తమ బ్రాహ్మణ వంశజులుగనే ముమ్మాటికిని దోఁచుచున్నారు. కావుననే యిట్లు వ్రాయఁగలిగితిని. "నీచాదపి మహావిద్యా"యను దానిని స్మరింపుఁడు. ఇంతవఱకు మీరు వ్యక్తికిఁదగుల వలయునను నాశయముతో వ్రాసిన యక్షరములను బురస్కరించుకొని వ్రాసినవ్రాఁత. ఇఁకఁ బ్రస్తుతాంశము నుపక్రమింతము. ఏదో యొకదానినిగూర్చి నిర్దేశింపుఁడని కోరితిని. అట్లేమీరు నిర్దేశింపక మరలఁ బెక్కువిషయములనెత్తికొనిరి; పోనిండు. ఈయెత్తికొన్న వానిలోనేని యొకదాని నీసారి నిరూపింపుఁడు. అనారోగ్య ప్రయుక్తమగు నసమర్థతచే మిమ్మిట్లభ్యర్థించుచున్నాఁడను, సత్యమును గ్రహించి యట్టు లనుగ్రహింపుఁడు. ఇఁక నా కోరికమీఁద మీరు నాకుఁ బరీక్షార్థమై యొసఁగిన "తత్రశ్లోక చతుష్టయమ్" అను నభియుక్తోక్తి కుదాహరణ మనఁదగు చతుష్టయములోని "అస్మాన్ సాధువిచింత్య" అనుదానిని నే నెట్లు పాడుచేయుదునో కొంతమాత్రమే యిపుడు తిలకించి దానిని మీశక్తికొలఁదిని సమర్థింపుఁడు. ఈ నా యవ్యక్తపు వ్రాఁత స్వయంకృతాపరాధ ప్రయుక్తము కాకవేవల పరేచ్ఛా ప్రారబ్ధ ప్రయుక్తమని పత్రికా పాఠకులెల్ల నెఱిఁగియే యుందురు. కావున వారు నన్ను రోయకుందురని తలఁచి యిందుల కుపక్రమించుచున్నాఁడను.

"అస్మాన్, సాధు, విచింత్య, సంయమధనాన్" ఇచట, అస్మాన్ అనుపదమునకుఁ గణ్వమహామునిని యర్థము, బహువచనము. "అస్మదోద్వయోశ్చ" అను సూత్రముచే

సమర్థనీయము, కాని "సవిశేషణస్య ప్రతిషేధః" అని యుండుటచేతను, ఇచట "సంయమధనాన్" అని విశేషణ ముండుటచేతను, చింత్యమనక తప్పదు. ఇఁక దీని సమర్థనమునకై కొన్ని త్రోవలు కలవు, వానిని శాస్త్రులవారే తొక్కుదురు కాన నేనందులకుఁ బూనక "ఏకవచనముగా నుండునట్లు దిద్దుకొమ్మని కాళిదాసును శిక్షించుచున్నాఁడను. ఇది మీ విమర్శనము ననుకరించు తెగలోనిది కాదు. ఇచటఁ గొంత "ప్రష్టవ్యత్వమున్నది" యని మీ వంటి ప్రాజ్ఞులెల్ల నంగీకరింతురు. ఇఁక "ఉచ్చైః కులం" ఇయ్యెడ దంత్య తాలవ్యభేదము కొంత ప్రతిబంధించెడిదియే యైనను, సంస్కృతభాషలో "దంత్య చకారము లేకున్నను" ఈపదమునం గల తాలవ్యచకారము దంత్య చకారఘటిత మగు "ఉచ్చ" అనుపదమును స్ఫురింపఁజేయు నను కువాదమును మీరెట్లు ఖండింతురు? "చకాశే పనసప్రాయైః పురీషండ" అను లాక్షణికోదాహరణము మీరు తిలకించియే యుందురు. అట యథాకథంచిత్తుగా ముడివెట్టుటచే నిష్పన్నమైన "శేప, పురీష" శబ్దములలో శేప శబ్దము శేఫ శబ్దమునకు స్మారకమెట్లగునో ఇదియునట్లేయని యెఱుఁగుఁడు. ఆస్మారకత్వము కేవలము సంస్కృతభాషకు మాత్రమే సంబంధించినది. ఇది యట్లుకాక, తెలుఁగు భాషను బురస్కరించిన దొసఁగు కావున వైషమ్య ముండునని వారింపకుఁడు. అట్లే యగుచో సంస్కృత గ్రంథస్థములగు, "శష్పశ్యామాన్" లోనగు నిర్దుష్ట ప్రయోగములను మన యాంధ్రదేశపుఁ బుస్తకములలో, "ఘాస శ్యామాన్" అని దిద్దుటకుం గతమేమో విచారింపుఁడు. లాక్షణి కాశయ మేవిధముగాఁ గూడ నశ్లీలము స్ఫురింపఁగూడ దనియే సుఁడీ? అట్లగుటచేతనే సర్వదేశ సామాన్యభాష యగు గీర్వాణ భాషకుఁగూడ నాయాయి దేశపు వ్యవహారమునకు లోఁగ వలసియుండుటకు లాక్షణికులు సమ్మతించియున్నారు. దానింబట్టి యీశ్లోకమునందలి, "స్నేహ ప్రవృత్తిమ్" అను పదముకూడ నశ్లీలార్థ స్ఫోరకమగుచున్నది. మాదేశమునందీ "ప్రవృత్తి" పదమున కంత ప్రాచుర్యముగా "విరేచనార్థకత్వము" లేదుగాని గద్వాలప్రాంతమున దీనికట్టియర్థము పండిత పామర సాధారణ్యముగాఁ గలదు. బహుశః మీదేశమునఁగూడఁ గల దనుకొనియెదను. దీని నిశ్చయము దీనిపై మీరు వ్రాయుదానివలనఁగాని తేలదు. ఇప్పటికి గద్వాలప్రాంత దేశవాసుల మతమున నియ్యది యశ్లీలముకాక తీరదుగదా? ఇక్కడి కిది వెట్టిత్రోవను ద్రొక్కి దిఙ్మాత్రముగా విమర్శింపఁబూనిన నాలఘు విమర్శనము. ఈ "ప్రవృత్తి"కిని సమర్థనముకలదు. గాని శాస్త్రులవారే చూపుదురు. అదినాపనిగాదు. శ్లోకములోనింకను సగముకన్న నధికము కాలేదు. శ్లోకమో? కాళిదాస కృతము, తత్రాపి, "పేరువడిన చతుష్టయములో నొకటి" శాంతం పాపం, ఇది నాబుద్ధిదోషమో? కవిదోషమో? తిలకింపుఁడు. ప్రకృత మనుసరామః. మఱియును "అబాంధవ కృతామ్" అనుచోట?

"అబాంధవ" అని ఛేదించి దానిని "హే అబాంధవ!" అని సంబోధించునట్లు సమన్వయించి కొనినయెడలఁ గాళిదాసున కనభిప్రేతమగు రాజదూషణము సంఘటించును. అపుడు తక్కిన పదములకు సమన్వయమెట్లందురా? హేఅబాంధవ, త్వయి, కృతాం, అస్యాః స్నేహ ప్రవృత్తిం, అని సమన్వయము. అర్థత స్స్వయ మేవేతి సంబధ్యతే. మఱచితిని, "స్నేహప్రవృత్తిమ్" అనుచో నశ్లీలము వారించుటకై కాళిదాసునకు శిక్ష నుపపాదింపవలసి యున్నది. కనుక నతఁడిట, "స్నేహప్రసక్తిమ్ లేక ప్రసత్తిమ్" అని దిద్దికొననగు. ఇక్కడికి శ్లోకములోని సగము శాస్త్రులవారి ధోరణినిబట్టి విమర్శింపవలసి యున్నది. పిమ్మటఁ జూతముగాక. మొత్తముమీఁద గొన్ని యిట్టిదోషములున్నను నీశ్లోకము, చాల రసవత్తరమై వ్యాసవాల్మీకాదులకన్న నిక్కవి నగ్రస్థానమున నుంచుచున్నది. వారిప్పట్టున ననఁగా వ్యాసులవారిప్పట్టున నితనియొద్దసరస కవితావిధానమును నేర్చికోవలసియున్నది. ఇత్యాదులు కృష్ణరాయ శాస్త్రులవారి ననుసరించి నా వ్రాయు నక్కరములుగాని బుద్ధిపూర్వకముగా నేవ్రాయునవికావు. కావున నాపై నాగ్రహింపవలదని చదువరులను మరలఁబ్రార్థించుచున్నాఁడను. నే నిదివరలో "బాగుగనున్నదని మెల్లఁగా నొకమాట వ్రాసి జాఱవిడిచిన శాస్త్రులవారి "యార్థిక విమర్శనమెల్ల" పైదాని సజాతీయమే యనియు దానినెల్లఁ బ్రత్యక్షరమును విడఁదీసి విమర్శింప వలసివచ్చుచో నేను మరల జన్మించి వయస్సునుబొంది రావలసినదేకాని, యిపుడున్న శరీరబలము చాలదనియు నెంచి యట్లు జాఱవిడిచి శబ్దవిషయమునుమాత్రము చర్చింపఁబూనితినని పాఠకు లరయుదురుగాక. వీరి విమర్శనమున "అతి సర్వత్ర వర్జయేత్" అను నభియుక్తోక్తిని బొత్తిగా మన్నించుట వలనమును గన్పట్టదు. ఏ వెఱ్ఱిమొఱ్ఱిమాటలనో వ్రాయు మాకు భవభూతికన్న నుత్తమస్థాన మొసఁగిననెవరు సమ్మతింతురు? ఇక్కాలమునందలి యే కొండఱకన్ననో కొండొక మిన్నలుగా నేకొండఱో భావించుచున్న మమ్మును వ్యవహారభాషయగు తెలుఁగున "అందు ఒందుగా మార్చికొమ్మని" యన్న నెవరు సంతసింతురు? ఈ రెండును సంఘటింపనివియే, "కవయః కాళిదాసాద్యాః కవయోవయ మప్యమీ! పర్వతే పరమాణౌచ పదార్థత్వం వ్యవస్థితమ్." కావున శాస్త్రులవారి మెచ్చున కుబ్బి తబ్బిబ్బగుటగాని, నిరసనకుఁ జింతించుటగాని యొనర్చువారు, "పరమామాయికులని" మాతాత్పర్యము. విస్తంచ మెందులకు? వారిడిన ప్రశ్నమున కుత్తరముగా "నాపాదుచేయు విధమును" జూపితిని. దీని నింక వారు బాగుచేయవలయును, చేయనే లేరనుకొందము. కాదు న్యాయముగనే సమర్థింతురనుకొందము. నేను వారి వ్రాఁతయందలి సారమునుగ్రహించి మిన్నకుండెదనా? ఏదో బదులని పేరుపెట్టి గిల్కుచునే యుందును. దీనికి నిర్ణేతలెవరు? ఈ యథాత్తువాదము నాఁగువారెవ్వరు?

శ్లో. స్వాధీనో రసనాంచలః పరిచితాశ్శబ్దాః కియం తఃక్వచి
క్షోణీంద్రోననియామకః పరిషద శ్శాంతా స్స్వతంత్రం జగత్.

ఇఁక నిప్పటికి విరమించుచున్నాఁడను. ఎంత యొప్పైనదానినేని తప్పుచేసెదనని నాయంతట నేనై కాకున్నను శ్రీశాస్త్రులవారి నిర్బంధము వలన ననఁగా వారి విమర్శనవిధాన మిట్టిదియని చదువరులకుఁ దెల్పుటకైనను బ్రతిజ్ఞపట్టుట కొంత దొసఁగు కాకపోదు. ఇందులకు నేనెంత చదువరులను "మన్నింపుడని" ప్రార్థించినను నాపై వారు కొండొక కనులెఱ్ఱఁజేయక మానరని కొంకుచున్నాఁడను. ఈ ప్రతిజ్ఞ,

శ్లో. విదుషాం నివహై రిహైకమత్యా । ద్యదదుష్టం నిరటం కియచ్చ దుష్టం
మయి జల్పతి కల్పనాధి నాథే । రఘునాథే మనుతాం తదన్యదైవ.

అని నుడివిన రఘునాథభట్టాచార్యునికిఁ గాని "శ్లో. ఆమూలాగ్రతస్నానోః ... ... వాచా మాచార్యతాయాః పదమనుభవితుంకోఽస్తి ధన్యోమదన్యః." అని నుడివిన జగన్నాథ పండితరాయలకుఁగాని నావంటి సామాన్యునకుఁదగదు. పైనుదహరించిన శ్లోకద్వయము వలన శాస్త్రులవారి వ్రాఁతలోని "వేంకటశాస్త్రిగారు ప్రకటించిరి. నందిని పందినిచేసేది. పందిని నందినిచేసేది యిదేకాఁబోలును... ...ఏవిమర్శకుఁడును చారిత్రాత్మకముగ (పుక్కిటికథలుగాక) నిట్లు ప్రతిజ్ఞపట్టినట్లెఱుఁగను." అను నక్షరములు పరాస్తములు. ఇపుడేని యెఱుఁగఁదగు. ఇది యిటులుండ, తగకున్నను, నియ్యది యనుకృతికై కైకొన్న భూమికనుగా భావించి పాఠకలోకము నన్ను క్షమించుఁగాక యని వేఁడుకొనుచున్నాఁడను.

★ ★ ★

# నన్నయ్యభట్టు

ఈయన్ని గూర్చి యెప్పుడో సుమారు యిప్పటికి 45 ఏళ్లనాఁడు దేవీభాగవతప్పీఠికలో యేవో కొన్ని మాటలు వ్రాయవలసి వ్రాయడం తటస్థించింది. దాన్ని గుఱించి నేఁటివఱకున్నూ యెవరున్నూ యేమీ వ్యతిరేకంగా వ్రాసినట్టులేదు. అందులో నేను వ్రాసిందేనా మఱేమీలేదు-

"నన్నయసమున్నతుఁడై కడు లక్షణంపుఁ బ్రోవైగుది గూర్చు నేర్పుగలఁడై తగు" అని మాత్రమే. ఆయన్ని ప్రయోగవిషయంలో కవిత్రయంలో యెక్కువ నియమనిష్ఠలు కలవాఁడని కవులందఱూ అనాదిగా పొగుడుతూనే వున్నారు. అహోబల పండితుఁడు కవిత్రయంవారిలో నన్నయ్య ప్రయోగాన్ని శిరసావహిస్తాఁడు కాని తక్కిన యిద్దఱివీ తఱుచు, తోసేస్తూనే వుంటాఁడని విజ్ఞులందఱూ యెఱిఁగిన విషయమే. ఆంధ్రశబ్దచింతామణి నన్నయ్య రచించనట్టే పలువు రభిప్రాయపడతారు. నేనుకూడా యీతెగలో వాఁడనే. నన్నయ్యప్రయోగాలు కొన్ని చింతామణి సూత్రాలకు వ్యతిరేకించినవి కనపడతాయి. దాన్నిఁబట్టి-

"తానొక కట్టుచేసి యది తప్పెను నన్నయ కొన్నిచోట్ల" అని వ్రాశాను. యిది స్థూలదృష్టినిచూస్తే నన్నయ్యకు న్యూనతాపాదకమే గాని గౌరవాపాదకం గాదుగదా? అయితే సామాన్యులదృష్టిలో తప్ప విజ్ఞుల దృష్టిలో యీలాటి సందర్భాలు న్యూనతాపాదకాలు కావు. యెందుచేతనంటే పాణిన్యాచార్యులంతమహానుభావుఁడుకూడా తనశాసనానికి భిన్నంగా సూత్రాలలో ప్రయోగిస్తూ వస్తే ఆప్రయోగాలుకూడా సూత్రప్రాయంగా పండిత లోకానికి ప్రవృత్తినివృత్తులను శాసించడం అందఱూ యెఱిఁగిందే. యీమర్యాదను అహోబలుఁడు వొక్కనన్నయ్యగారికే యిచ్చాఁడు. యితరలాక్షణికులో కవిత్రయంవారి ప్రయోగాలు యావత్తుకూ యిస్తూ వచ్చారు. ఆత్మకూరుపండితులతో మాకుకల్గిన విద్యావిషయికవాదంలో నన్నయ్యప్రయోగాలిస్తేనే తప్ప వారు వొప్పుకొనేవారు కారు. "దేవతలు ధర్మవర్తులు" అనేది నన్నయ్యగారిది కావడంచేతనే వారు తోసేయడానికి వల్లకాక "ధర్మ వృత్తులు" అని దిద్దడానికి వుపక్రమించారు. భవతు. మేము నన్నయ్యను గూర్చి వ్రాసినది బహుకవిసమ్మతమైనమాటగాని మాస్వంతాభిప్రాయము లేశమున్నూ కాదు.

నన్నయ్య వైదికశాఖకనక తి. వెం. కవులు వైదికశాఖకు చెందినవారు కావడంచేత అతణ్ణి గొప్పచేశా రనేవారున్నూ వున్నారు. వారికి వొక నమస్కారం. యెవరికీ నచ్చనిమాట మేము వ్రాస్తేమాత్రం పనిచేస్తుందా? చేయదు.

"ఇంచుకకేమి యజ్వయిన్ లోఁగక యాతనిన్ జెనయు" అని ఆపద్యంలోనే వ్రాశాము. దీన్నిబట్టి నియమాలలో సోమయాజులుగారు నన్నయ్యకన్న నలుసంత లొక్కుతారని వ్రాసినట్లు స్పష్టపడుతుంది. యిదిన్నీ మాస్వంతకల్పన కాదు. నన్నయ్యగారి సీసాలు యతితోప్రారంభిస్తేయతితోటే, ప్రాసతోటి ప్రారంభిస్తే ప్రాసతోటే. ఒకదళంలో దానితోటిన్నీ వేఱొకదళంలో దీనితోటిన్నీ ప్రారంభిస్తే ఆప్రకారమే ముగింపఁబడతాయనిన్నీ తక్కిన భారతకవిద్వయంవారి సీసాలు యీ నియమాన్ని అంతగా పాటించినట్లు లేదనిన్నీ విమర్శకులు యిదివఱకే వ్రాసివున్నారు. అయితే నన్నయ్యగారు కూడా యెక్కడో స్వల్పంగా యీనియమాన్ని పాటించక అభ్యనుజ్ఞ యిచ్చివున్నారనికూడా వారేవ్రాశారు. అర్ధానుస్వారం గల హ్రస్వ పూర్వక ప్రాసకు అది లేనివర్ణాన్ని నన్నయ్యగా రెక్కడా ప్రాసపెట్టలేదు. తిక్కన్నగారున్నూ పెట్టలేదుగాని-

"క. నగములు... యె । సఁగుపూర్వస్థితిన" అని శాంతిపర్వంలో కాఁబోలును వొకచోట సార్ధబిందు, నిరర్ధబిందువులకు ప్రాస పెట్టినట్లు కనపడుతుంది. యింకా యీలాటివే నీహారలేశాలు కొన్ని శ్రీగిడుగుపంతుల వారు చూపివున్నారు. (జ్ఞకార కకారాలకు యతి పెట్టడం వగయిరాలు కూడా కొందఱు చూపుతారు) "వ్యయము" అనుటకు బదులు "వ్రయము" అని సోమయాజులుగారు దిద్దరానిచోట వాడినారు. అది వ్యావహారికంగాని గ్రాంథికంగాదు. యేవో యిట్టిలేతమమయము వగయిరాలు చూపుతారు కొందఱు తిక్కనగారికి. యీమాటలు మనస్సులో పెట్టుకొనియ్యేవే "ఎన్నియో దోసముల్ పొసఁగున్ నన్నయకన్నఁ దిక్కనకు నల్పుండౌనె? తన్మాత్రలోన్" అని వారివారి వాదమును ఖండించు తాత్పర్యంతో వక వాక్యం "అభ్యుపగమ్యవాద" పురస్కారంగా వ్రాసి వున్నాము. దానిని శాఖా ద్వేషంగా అపవదించేవారికి మేము చెప్పఁదగ్గ జవాబు లేశమున్నూలేదు. "సహృదయాః ప్రమాణమ్" అని మాత్రమే మనవి చేయుదుము. నన్నయ్యగారు ప్రయోగించినదే అయితే అది వకవేళ శాస్త్ర విరుద్ధమే అయినా దాన్ని అనుకరించిన తిక్కనాదులను యెవరూ యేమీ అనడానికి అవకాశం లేనట్టు కవిరాక్షసుఁడు సిద్ధాంతీకరించి వున్నాఁడు.

"ఉ. ఆదిని శబ్దశాసనమహాకవి చెప్పిన భారతంబులో" అనే పద్యార్థం యెఱిఁగినవా రందఱూ పైసందర్భాన్ని అంగీకరిస్తారు. దుర్ణయ శబ్దగతణత్వం నన్నయగారి నాటికి

నిర్దుష్టమే అయినా తిక్కనగారి నాటికి దుష్టమనేవాదం బయలుదేరివున్నట్టయితే తిక్కన్నగారు వదులుకోవలసివుండేది. కాని అలా వదులుకొన్నట్టులేదు. యీసిద్ధాంతము శేఖరకారకునిదవడం చేత తిక్కన్నగారు శేఖరకారకునికంటె (యీ పూర్వాపరవిచారం బొత్తిగా తెలియక ఒకరు కాశికావృత్తికంటె కౌముదే పూర్వమెందుకు కాకూడదంటూ వ్రాశారు) పూర్వులు కావడంచేత ఆయనికి గోచరించవలసిన ఆవశ్యకత లేదనుకున్నా అనుకోవచ్చును. కాని తిక్కన్నగారు వొకచోట అక్షోహిణీశబ్దాన్ని యతిస్థానంలో ప్రయోగించి వున్నారు. "అక్షాదూహిన్యాం" అనే వార్తికంవల్ల అక్షౌహిణీశబ్దం ఔకార ఘటితమే కాని ఓకారఘటితంగా కూడా వుండడానికి అవకాశంలేదు. కాని ఓకారఘటితంకూడా వుండవచ్చునని తత్త్వబోధినిలో సమర్థనం కనపడుతుంది. తత్త్వబోధినిగాని, కౌముదిగాని తిక్కన్నగారి నాఁటికి పుట్టినగ్రంథాలుకావు. అయితే ఆయన కీవిషయం యెట్లు గోచరించిందంటే వారుచదివిన యితర గ్రంథంలో యెక్కడో వుందని సమర్థనం చెప్పుకోవలసి వుంటుంది. విషయం విషయాంతరంలోకి డేఁకుతూ వుంది. మనకు ప్రధానం నన్నయ్యభట్టు ఆంధ్రానికి ప్రప్రథమలాక్షణిక కవి అవడంచేత అతనిప్రయోగ మెట్టిదైనా అది తిక్కనాదిమహాకవులకు ఆదరణీయం కావలసివచ్చిందన్నదే. యేకొందఱు చేదస్తులో తప్ప తక్కినమహా కవులందఱూ వక్కనన్నయ్యనేకాక కవిత్రయాన్ని ప్రథమాచార్యులుగా సమ్మానించి వున్నట్టు లక్షణగ్రంథాల వల్ల స్పష్టపడుతుంది. మేము యీతుదిమతాన్ని అవలంబించడమే కాకుండా యింకా ప్రసిద్ధులైన పోతనాది మహాకవులనుకూడా ప్రయోగాలవిషయంలో ఆదర్శప్రాయులుగా పెట్టుకొని కవిత్వాన్ని సాగిస్తూవచ్చాము. యీ అంశాన్ని "సీ. నన్నయకవి పెట్టినాఁడుకదా? తిక్కనాది కవీంద్రుల కాదిభిక్ష... ...వీరలును వీరిమార్గమ్ము గోరి యాంధ్ర కృతుల నొనరించి బహుబహూకృతుల నలరు వారలును మాకుఁ బూజ్యులు"- అనే మాశ్రవణానందపద్యం వ్యాఖ్యానిస్తూనే వుంది. తిక్కన్నగారు, అర్థబిందు రహితమైన నగము అనేదానికి సార్థబిందుకమైన ఎసఁగు అనేదాన్నిప్రాసలో నిల్పడాన్ని బట్టియ్యేవే మేము అట్టిప్రాసమును వాడియుంటిమి. యిది యేమో మేము స్వతంత్రించి చేసినసాహసమని వొకానొకరు యీ మధ్య గుంటూరుడిస్ట్రిక్టులోని శాస్త్రజ్ఞులుకాని విమర్శకులు వ్రాసి వున్నారు. బహుశః వారు తిక్కన్నగారి ప్రయోగాన్నైనా చూచివుండ రనుకుంటాను. భారతంలోవున్న విశేషాలు యెందఱెంత శోధించినా యింకా మిగులుతూనే వుంటాయి. ఆ కారణంచేతనే-

"సముద్రమున కెవ్వఁడు పారము నిర్ణయించెడిన్" అని దేవీభాగవతంలో వ్రాయవలసి వచ్చింది. దీన్ని గుఱించి గుంటూరు డి॥ విమర్శకులు పూర్వులు భారతమహా సముద్రాన్నుంచి ముత్యాలూ, రత్నాలూతీస్తే వీరునత్తగుల్లలు కాఁబోలు తీశారంటూవ్రాశారు.

వెనుకటి వారికి అవి దొరికితే మాకివి దొరికాయని ఆయనకు తోఁచడాని కేదోకారణం వుంటుంది. ఆకారణం క్రమంగా ముందుముందుగోచరిస్తుంది. కనకవిస్తరించేదిలేదు. రచనావిషయాన్ని అనుకరించడంలో మాకునన్నయగారికంటె తిక్కన్నగారి యందే యెక్కువ గౌరవ మనేసంగతి మాభారతనాటకాదులు చదివినవారికి గోచరమే కనక విస్తరించేదిలేదు. దేవీభాగవతరచనలో కూడా మేము తిక్కన్నగారిశైలినే వరవడిగాఁ బెట్టుకున్నాము. యెంతవఱకు కృతార్థులమైనామో అది లోకం తేల్చవలసినవిషయం గాని మావిషయం గాదు. శ్రీనివాసవిలాసపీఠికలో-

"విరచించినారు దేవీభాగవతమును దిక్కన్నశైలిగాఁ దెల్గుబాస"

అనియ్యేవే వ్రాసియున్నాము. తి. వెం. కవులెక్కడ తిక్కన్నగా రెక్కడ? నక్కెక్కడ? దేవలోక మెక్కడ? అనేవారికి మేము జవాబు చెప్పవలసివుండదు. యెవరినో వరవడిగా పెట్టుకోక యేలాగా తప్పదుకదా? అప్పుడుమాత్రం యీ ఆక్షేపణకు గుఱికాక తప్పుతుందా? అందుచేత కవిబ్రహ్మగారినే వరవడిగా పెట్టుకున్నామని మా మనవి. పోనీ ఆదికవిగదా? నన్నయ్యభట్టునే వరవడిగా పెట్టుకోరాదా? అలా పెట్టుకుంటే కొంత శాఖని గౌరవించినట్టుకూడా అవుతుందని యెవరేనా శంకిస్తారేమో? వినండి యథార్థాన్ని. ఆంధ్రకవులలో యింతవఱకు నన్నయ్యధారాశుద్ధిని అనుసరించి కృతార్థులైనవా రెవరున్నూ నా బుద్ధికి కనుపించడంలేదు. ఆయనకవిత్వంలో తక్కినగుణగణాలాలావుండఁగా సమాసశైలి బహు అసాధ్యస్థితిలో వుంటుంది. దాన్ని అనుసరిద్దామంటే బొత్తిగా కొఱకఁబడదు. కొన్ని పద్యాలు వుదాహరించి చూపితేనేబాగుంటుందిగాని గ్రంథవిస్తరభయం బాధిస్తూవుంది. (1) కురువృద్ధుల్ గురువృద్ధబాంధవు లనేకుల్ (2) మదమాతంగతురంగ కాంచనలసన్మాణిక్యగాణిక్య- లోనైన పద్యాలు యెన్నో వున్నాయి. చదువరులే పరిశీలించు కోవాలి. కొద్ది గొప్ప యీ సమాసధోరణి పెద్దన్నగారికవిత్వంలో కనపడుతుందని అన్యత్ర వ్రాసి వున్నాను. కాఁబట్టి యిక్కడ స్పృశించివిడుస్తూన్నాను. నా అభిప్రాయాన్ని బట్టి ధారాశుద్ధికి నన్నయ్యకు నన్నయ్యేకాని యితరులు దీటుకారనియ్యేవే. యితర గుణాలలో, యితరుల కవిత్వం నన్నయ్యగారిని మించుతుందంటే అది యథార్థమైనా, కాకపోయినా నేను వివదించేవాణ్ణికాను. నా యీ అభిప్రాయం లోకానికి యెంతవఱకు నచ్చుతుందో నాకు తెలియదు. యీ అభిప్రాయం నిన్న, నేఁడు పుట్టిందికాదు. చాలా బాల్యంలోనే పుట్టింది. డెబ్బయో పడిపూర్తికావచ్చినా యిది మాఱినట్టులేదు. యిఁక ముందున్నూ మాఱుతుందని తోఁచదు. కొన్ని అభిప్రాయాలు వెనుక వకలాగువుండేవి. యిటీవల మఱివకలాగు మాఱిపోయాయి. అందులో మచ్చుకు వకటి వుదాహరిస్తాను. మను,

వసుచరిత్రలలో వసుచరిత్రే అగ్రస్థానానికి వస్తుందని కొంతకాలం అనుకొనేవాణ్ణి. యిటీవల ఆ అభిప్రాయం మాఱింది. యేలా మాఱిందో వ్రాయవలసివస్తే చాలా వ్రాయాలి. కనక ప్రధానాంశాన్ని వుపక్రమిస్తాను. శాఖాభిమానాలనేవి నిన్న నేఁడు పుట్టినట్టుతోఁచదు. అనాదిగా వున్నట్టే తేలుతుంది. కాని వైద్యవిషయంలోనున్నూ, కోర్టువిషయంలోనున్నూ దీన్ని పాటిస్తూన్నట్లు కనపడదు. చూడండీ; యెవరివైద్యం బాగానచ్చుతుందో, యెవరిహస్త అమృతహస్తమని పేరుపడుతుందో, వారు తమశాఖవారు కాకపోయినా వారిదగ్గిఱికే రోగులు వెడతారు. ఆలాగేకోర్టువిషయంలో ప్లీడర్ల దగ్గిఱికిన్నీ. కవిత్వం కూడా శాఖాభిమానాన్నిపట్టి మెచ్చుకొనేవారు ప్రాజ్ఞులలో వుండరనే నాతలంపు. ఆలా యెవరేనా వున్నా వారి యభిప్రాయాన్ని లోకం బొత్తిగా ఆదరించదు. లోకం ఆదరించనప్పుడు మనలో మనం యేమనుకుంటే యేం లాభం? యింతవఱకు వ్రాసిన వ్రాఁతవల్ల మాకు భారతకవులలో యెవరియెడల యే యేవిషయంలోవున్న అభిప్రాయం యేలాటిదో గోచరిస్తుంది. కనక యిఁక విస్తరించేది లేదు. దేవీభాగవతపీఠికలో-

క. ఎన్ని పురాణమ్ములు తా।మన్నిటి నాంధ్రీకరించి యనుకంపన్‌గా
కున్నన్ దీనిన్ విడుతురె; నన్నయభట్టాది కవిజనంబులు మాకున్.

అని వకపద్యం వ్రాసివున్నాము. యీపద్యమే యీవ్యాసం వ్రాయడానికి తగ్గప్రసక్తి కల్పించింది. కనక దీన్ని బాగా గమనించవలెనని హెచ్చరిక. మేమాంధ్రీకరించడానికి ఆరంభించేటప్పటికి యీపురాణం ఆంధ్రంలోకి యెవరూ అనువదించలేదనే తాత్పర్యంతోటే మేము ఆరంభించాం గాని, లేకపోతే ఆరంభించేవాళ్లంకాము. గ్రంథరచన పూర్తిఅయి సాపువ్రాస్తూ వుండఁగా తూర్పున త్రిపురాన తమ్మన్న దొరగారున్నూ, పడమట ములుగు పాపయారాధ్యులవారున్నూ, పూర్వమే తెలిఁగించినట్టు ఆప్తులు చెప్పఁగావిన్నాము. శ్రీదాసు శ్రీరామకవిగారు కూడా తాము ఆంధ్రీకరిస్తున్నామని స్వయంగానే చెప్పినారు. ఆ చెప్పేటప్పుడు మీరాంధ్రీకరిస్తున్నారని విన్నాననికూడా వారే సెలవిచ్చారు. ఆయీవిషయం ద్వితీయ ముద్రణపీఠికలో శ్రీ దాసువారి భాగవతపీఠికలో సుమారు యిప్పటికి పదహారేళ్లనాఁడు నేను వ్రాసేవున్నట్లు జ్ఞాపకం. సంగతి సందర్భాలు యీలా వుండఁగా గుంటూరు డి॥ విమర్శకుఁడుగారు మా మీఁద యేలాటి అపవాదవేస్తున్నారో! చూడండి-

తే.గీ. దేవీభాగవతంబు నాంధ్రీకరణము
నందుఁ బ్రప్రథములుగఁ బేరందఁగోరి
వ్రాసితిరె? యిట్లు దాసు శ్రీరామకవి తె
నుంగు చేసినయది మున్నెఱింగి యుండి.

ఉ. క్రమమది లేని యీనుడుల గౌరవమందెదవయ్య?... నీవచించువా
క్యములవియెల్ల వేదములుగా గ్రహియింతురె! పండితోత్తముల్.

మాయం దీమహనీయుఁడి కింతకోపం యెందుకో? యెవరుముందు తెలిఁగిస్తే వచ్చే ఆధిక్యం యేమిటో! వొకరిది వొకరుచూచి తెలిఁగించారని ఋజువుచేసి నిందిస్తే యింకా కొంత బాగుండేదేమో? మాలోమాకేమేనా వైషమ్యాలున్నాయా? వుంటే శ్రీరామకవిగా రీక్రిందివిధంగా యెందుకురాస్తారో ఆలోచించండి ప్రాజ్ఞులారా?

చ. తిరుపతివేంకటేశ్వరసుధీమణులన్ గొనియాడి మొక్కెదన్
సరసులు నాకు మిత్రులును సర్వజనస్తవనీయ పాండితీ
భరితయశుల్, తెనుంగునను భాగవతంబురచింపఁబూని రం
చెతిఁగితి వారివల్ల, గణియింపరు నాయపరాధపుంజమున్.

ఆయీ పద్యతాత్పర్యాన్ని విమర్శకుఁడుగా రేలాచేసుకొని మమ్మల్ని అపవదింప మొదలుపెట్టారో నాకు లేశమున్నూ బోధ కావడంలేదు. "అన్యబుద్ధి అప్రత్యక్ష" మంటారు యిదే కాఁబోలు. దిక్కుమాలినప్రప్రథమత్వం, దీనికోసం యింత తగవెందుకు? ఉత్తరరామాయణాన్ని సోమయాజిగారు ఆంధ్రీకరించారు. తరవాత చాలాకాలానికి దాన్నే పాపరాజుగా రాంధ్రీకరించారు. ప్రప్రథములు తిక్కన్నగా రవడంచేత పాపరాజుగారి కవిత్వానికేమేనా గౌరవం తగ్గిందా? అందుచేత విమర్శకుఁడు గారేదో కోపం మనస్సులో పెట్టుకొని యేవిధమైనవైషమ్యాలున్నూ, యెన్నఁడున్నూ లేని మామామధ్య పొరపొచ్చెములు కల్పించి మమ్ము దూషిస్తున్నారేకాని అన్యంకాదని మనుష్యమాత్రులకు గోచరించే విషయమే కనక విస్తరించేదిలేదు-

బ్రతికివున్న నామీఁదేకాదు యెన్నఁడో చచ్చి స్వర్గమలంకరించిన నన్నయ్యమీఁద కూడా విమర్శకుఁడు గారికి విపరీతమైన కోపమే వుంది. యీపద్యాలు చూడండి-

"చ. మొదలిడి భారతంబు తుద ముట్టకముందె యరణ్యమందుఁ గ్రుం
కి దివియలంకరించుపనికిం జనునన్నయ మీకుఁ దా దయ
న్వదలిన దెట్టులయ్యెనది వాకొనె దాతనిపేరు గ్రుచ్చి, నీ
మది కిది తోఁచె నౌ దురభిమానికి యుక్తము లెట్లుదోఁచెడిన్"

చూచారా? మేము నన్నయాది మహాకవులు మాకు తెలిఁగించుకొనడానికి యీదేవీభాగవతాన్ని దయచేత వదలిపెట్టారనడం విమర్శకుఁడుగారికి యెంత అపరాధంగా తోఁచిందోఁ యీ కారణంచేత నేను "దురభిమానిని"గా వారికి తోఁచి చీవాట్లు పెడుతూ

వున్నారు. ఇక్కడ నాకు కర్తవ్యమేమిటి? యేమీలేదు. శిరసావహించి వూరుకోవడమే. ఆ పద్యం తరవాయి పద్యంకూడా చూడండి! ప్రాజ్ఞులారా!

క. దయచేఁ దెనిఁగింపక న
న్నయభట్టిది మాకు నిచ్చినాఁడనుకన్నన్
బ్రియమెక్కువ గనఁబడు ని
శ్చయమగు మామీఁదికరుణఁ జచ్చెనటన్నన్.

అబ్బా! విమర్శకుఁడుగారి ఆగ్రహానికి పట్టపగ్గాలే కన్పడడంలేదు. యెందుకో! నన్నయ్యగారిమీఁద యీ అకారణకోపం. మమ్మల్ని విమర్శకుఁడుగారు దిద్దుకొమ్మన్నట్టు దిద్దుకోవలసివస్తే నన్నయ్యభట్టును మాత్రమే "దయచేత చచ్చినట్టు" వుటంకిస్తే యేలా సమన్వయిస్తుంది. తిక్కన్న, యెఱ్ఱన్న, పోతన్న, సోమన్న, ఇంకా యెందఱో ప్రాచీన కవులు మాయందు దయచేత చచ్చివున్నారని వ్రాయవలసివస్తుందిగదా? అప్పుడు ఆ విషయం వైదికశాఖవాడైన నన్నయ్యకే ఘటింపక విమర్శకుఁడుగారు ప్రేమించే వారికికూడా తగిలితే అది వారి ఉపదేశానుసారం మేము చేసిన అపరాధమైనా మా మీఁద మఱింత కోపం హెచ్చి మమ్మల్ని యింకా నిందిస్తారేమో అసలు పద్యంలోవున్న- "నన్నయభట్టాది కవిజనంబులు" అనే పదంలో యెంత పరిశీలించినా యేవిధమైన దుర్ధ్వనిన్నీ లేకపోయినా విమర్శకుఁడుగారు నన్నయభట్టుకు ఆంధ్రకవీశ్వరులలో ప్రప్రథమత్వం యెందుకురావాలి అనేవుక్కురోషంతో యీ మందలింపు వుపక్రమించినట్టు పసులకాపరులకుకూడా గోచరించే విషయంలో యింతకన్న పెంచి వ్రాయడం అనవసరమని విరమిస్తూన్నాను. యిది వొకచిత్రమైనకాలం. యీ కాలంలో విమర్శనాలుమాత్రమే కాదు. యింకా యెన్నో సందర్భాలు యీలాటివే కనపడతాయి. "కాలాయనమః కలవికరణాయనమః" నన్నయ్య భట్టుకంటె పూర్వం తెలుఁగుకవిత్వం చెప్పేవారు లేకపోరుగాని యీలాటి సలక్షణకవిత్వం చెప్పేవారు లేకపోవడంచేత యితనికి ప్రప్రథమత్వభాగ్యం తటస్థించిందని చెప్పవలసి వస్తుంది. పైఁగా విమర్శకుఁడుగారు నన్నయ్యకు యింకోదోషాన్ని ఆపాదించివున్నారు-

తే.గీ. పరుఁడు తోడయి నిర్వహింపంగ భార
తము తెనింగింపఁ గలుగుట తానె చెప్పె
నట్టినన్నయ్యభ ట్టెట్టు లర్హుఁడయ్యె
హెచ్చు గలిగించి నీయిచ్చు మెచ్చు గొనఁగ.

నారాయణభట్టు సహాయమంటూ లేకపోతే నన్నయ్యభట్టు భారతాన్ని ఆంధ్రీకరించనేలేఁడని వీరి తాత్పర్యమనుకోవాలి. భారతం నన్నయ్యగారి కన్వయించదని

కూడా యీయన వ్రాయ సాహసింతురు. యీసాహసానికేంగాని పయిపద్యధోరణిచూడండి, నన్నయ్యపేరు వినఁబడేటప్పటికి విమర్శకుఁడుగారి కెంతఆగ్రహమోఁ యేమి కాలకర్మ దోషమో? యీమధ్య కొన్నివ్రాఁత లీలాటివే చదవటం తటస్థిస్తూవుంది. కొందఱు-

"నన్నయ్యగారి ద్రౌపది" అనిన్నీ "తిక్కన్నగారి ద్రౌపది" అనిన్నీ విడఁదీసి వారివారి వాగ్వైశద్యాలు చూపడం మొదలుపెట్టడం చూచి వెగటుగాఁదోఁచి కాఁబోలు మా సతీర్థులు శ్రీకాశీభొట్ల సుబ్బయ్య శాస్త్రులుగారు గాఢంగా మందలించి వున్నారు. అది కొంతవఱకు అభినందనీయంగానే వుంది గాని ఆ సందర్భంలో తిక్కన్నగారిరచనకు ప్రత్యక్షరానికిన్నీ బొత్తిగా అనౌచిత్యాన్ని ఆపాదించడమనేది కొంతశోచ్యంగా నాకు తోఁచింది. అట్టిసందర్భంలో నీవెందుకు సుబ్బయ్యశాస్త్రుల్లుగారి పూర్వపక్షాలను ఖండించకూరుకున్నావని యెవరేనా నన్ను ప్రశ్నిస్తారనుకుంటాను. సుబ్బయ్యశాస్త్రులవారు మంచి శాస్త్రజన్యజ్ఞానంతో మిళితమైన యుక్తినైపుణ్యం కలవారుగా వుండడంచేత ఆయన ఆక్షేపణలు ఖండించడానికి పూనుకుంటే సుఖసుఖాల తేలేటట్టు కనపడక అనారోగ్యంచేత బొత్తిగా అసమర్థతా స్థితిలో వున్న నేను దానిజోలికి పోలేదు. నిజానికి సుబ్బయ్యశాస్త్రుల్లుగారు యెవరో నన్నయ్యనుగూర్చి అనుచితపువ్రాఁత వ్రాయడంచేత వారికి వాగ్బంధం కలిగించడానికే అట్టిపూనిక పూనివున్నారుగాని, తిక్కన్నగారియందు శాఖాద్వేషం వుండి కాదని నేననుకున్నాను. అదేమాదిరిగా విమర్శించవలసివస్తే నన్నయ్యతిక్కన్నగార్ల లెక్కయేమి? వ్యాసవాల్మీకు లాగుతారా? కాళిదాస భవభూతు లాగుతారా? కాఁబట్టి అది విమర్శనమే కాదు. అందుచేత సుబ్బయ్యశాస్త్రుల్లుగారు ఆపనికి పూనుకోవడం యింకా విచారణీయమేను-

"మయి జల్పతి కల్పనాధినాథే రఘునాథే మనుతాం తదన్యథైవ"

అన్నట్టు సమర్థులైనవారు పూనితే మంచి చెడ్డగానూ, చెడ్డ మంచిగానూ కావడానికి యేమాత్రమూ అభ్యంతరం వుండదు. "జ్ఞానలవదుర్విదగ్ధుల" వ్రాఁతలు తాటాకుదళ్లవలె క్షణంలో యెగిరిపోతాయి. కాళిదాసుగారు-

"అధరస్య మధురిమాణం కుచకాఠిన్యం దృశోశ్చ తైక్ష్ణ్యంచ"

అంటూ వకశ్లోకం లోకోత్తరమయినది చెప్పివున్నారు. సహృదయత్వం వదలి దీన్ని నేను బగ్గంపాడుగా విమర్శించి పాడు చేయడం మొదలుపెడితే యెవరుగాని సమర్థించనే లేరని సప్రతిజ్ఞంగా చెప్పవలసివచ్చి చెపుతూవున్నందుకు లజ్జిస్తూవున్నాను. వూరికే మచ్చుకు వకశ్లోకంయెత్తిచూపివున్నాను గాని యేకవిదేనా సరే, యేశ్లోకమేనా సరే సహృదయత్వాన్ని

వదులుకొని విమర్శించడానికి దిగితే సమర్థించడం కష్టసాధ్యమే అవుతుంది. యీశ్లోకంపేరెందు కెత్తవలసి వచ్చిందంటే గుంటూరు డి॥ విమర్శకులు దీని సజాతీయమయిందే మాపద్యం వకటి లక్షణాపరిణయంలోది యెత్తి యేమేమో వ్రాసివున్నారు. ఆయనకు దీనిద్వారా తెల్పడానికే. చాలా ఉదాహరణలు చూపవలసి వున్ననూ, అందుకోసం యీవ్యాసం వ్రాయడంలేదు గనక ఆ విధానం యిక్కడ కొంత ప్రస్తుతమైనప్పటికీ వుదాహరించి చూపలేదు. “శ్లో. అస్మాన్ సాధు విచింత్య” అన్నశ్లోకంమీఁద సుమారు 16 యేండ్లనాఁడు నా వికటవిమర్శన చాకచక్యాన్ని ఒకరికి చూపి ఉన్నాను. కావలసినవారు దాన్ని చూడండి. పూర్వకాలంలో కూడా యీశాఖాభిమాన ప్రయుక్త పక్షపాతాలున్నూ, ద్వేషాలున్నూ వున్నట్టు అడిదం సూరకవిగారికిన్నీ, సోమకవిగారికిన్నీ జరిగిన యుక్తిప్రయుక్తి ప్రసంగంలో సోమకవిగారుచెప్పిన- క. పలుకుల చిలుకల కొలికీ- అనేపద్యం సాక్ష్యమిస్తుంది. కాని అంతకుమించినసాక్ష్యం మఱేది కనఁబడకపోవడంచేత యీ శతాబ్దంలో వున్నంత శాఖాభిమానాలు, లేక, ద్వేషాలు అప్పుడు లేవనియ్యేవే మనం అనుకోవచ్చును. నన్నయ్యయందు తిక్కన్నగారికి యెంత గౌరవమో వుండడానికి ఆయన తెనిఁగించినంత మట్టుకు భారతం అలాగే వుంచి తరువాయి అందుకొని ఆంధ్రీకరించడమే సహస్రముఖాల వ్యక్తం చేస్తుంది. పదిహేను పర్వాలు అవలీలగా తెలిఁగించిన తిక్కన్నగారికి ఆమూఁడుపర్వాలున్నూ మూఁడునెలలలో తెనిఁగించడానికి చేతకాకపోతుందా? అంతేకాదు, ఆపర్వత్రయమున్నూ తిక్కన్నగారు మళ్లాతెలిఁగించేయెడల రసవంతంగా వుండడానికి అభ్యంతరం వుండకపోవచ్చునుగాని నన్నయగారిశైలి అనితరసాధ్యమవడంచేత ఆ విషయంలో ఇటీవలి కవులు యెక్కువగా వాదోపవాదాలకు దిగవలసివచ్చేదనుటకు సందేహంలేదు. వొకరు ముందుగాచేసిన పనినే వేఱొకరు చేసేయెడల యేవో కొన్ని భాగాలు ముందువారివి అదివఱకే శ్లాఘ్యతరంగా వుండే పక్షంలో యిటీవలి వారి రచన అక్కడ తీసిపోక తప్పదు. సోమయాజులుగారు యీమాట మనస్సులో పెట్టుకొని ఆపర్వత్రితయంజోలికి పోలేదని యింతవఱకెవ్వరున్నూ వ్రాసినట్లు లేదు. నేనున్నూవ్రాయను. తిక్కన్నగారికి నన్నయ్యగారియెడల అపారమైన గౌరవమేగాని శాఖాద్వేషాదులేవిన్నీలేవు. అనియ్యేవే వ్రాస్తాను. ఆగౌరవం- “అందాది దొడంగి మూఁడుకృతులాంధ్రకవిత్వ విశారదుండు విద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్”.

అనే వాక్యంవల్లనే గోచరిస్తుంది. అరణ్యపర్వశేషం జోలికి పోకపోవడానికి లోకంలో వున్నప్రవాదమే కారణమనుకుంటాను. నన్నయ్యగారి కవిత్వం సంస్కృత పదభూయిష్ఠంగా వుండడానికిన్నీ తిక్కన్నగారిది ఆంధ్రపదభూయిష్ఠంగా ఉండడానికిన్నీ పలువురు పలువిధాల అభిప్రాయపడుతూన్నారు. నేను తెలుఁగు కనక “టీకాఽపి సంస్కృతమేవ” అన్నట్లు

కాక తెలుఁగుపదాలతో రచించడమే యుక్తమని తిక్కన్నగా రభిప్రాయపడివుందురనిన్నీ, నన్నయ్య గారిక్కూడా ఆంధ్రీకరణ విషయములో పైసందర్భం గోచరించవలసే వున్నను అప్పటిపండిత మండలి యీసడిస్తారేమోనని తత్సమపదభూయిష్ఠంగా రచించి వుందురనిన్నీ అభిప్రాయపడతాను. దీన్ని గురించి యింతమాత్రమే వ్రాస్తేచాలదు. యింకా వ్రాయాలి. వీరి కవిత్వాలలో నాకు గోచరించిన దింకొక విశేషము. యెంత సంస్కృత పద జటిలంగా నన్నయ్యగారి ధారనడిచినా ముఖ్య తాత్పర్యం మాత్రం తిక్కన్నగారి రచనకన్న సులువుగానే కలిగిస్తుందనిన్నీ అభిప్రాయపడతాను. ఈసందర్భం విరాటోద్యోగాల వఱకే. యుద్ధపంచకంలో యీ చిక్కులేదు. తరువాత పర్వాలు శాంతివగయిరాలు ధర్మశాస్త్రం వంటివి. వాట్లలో అసలు సంస్కృతంలోనే అంతగా కవిత్వనైపుణికి అవకాశం లేనప్పుడు అనువాదకులకుమాత్రం యెక్కడనుంచి వస్తుంది? ధర్మశాస్త్రంగాని, వైద్యజ్యౌతిషములుగాని ఛందోబద్ధాలుగా రచించినా అవి కవిత్వాలనిపించుకోవని చాలాచోట్ల వ్రాసివున్నాను. కనుక యిక్కడ స్పృశించి విడిచాను. యితర విషయాలు చాలాచాలా నడిచినా ప్రధానంగా తెలుసుకోతగ్గది నన్నయ్యగారిశైలి సంస్కృతపదభూయిష్ఠమే అయినా అది సామాన్యులకు ప్రతి పదార్థం చెప్పవలసివస్తే కొంత అడ్డుతగులుతుందేమోకాని, తాత్పర్యార్థాన్ని చేసుకోవడానికి అంతగా బాధించదనేదే. నాకుతోఁచిన విషయం యిది. దీన్నిబట్టి యేమి, వ్యాకరణాది సంబంధమైన మఱికొన్ని సందర్భాలనుబట్టి యేమి, ఆయన్నిగుఱించి, కొంత వ్రాస్తూ ప్రసక్తానుప్రసక్తంగా తిక్కన్న యెఱ్ఱన్నగార్లనుకూడా "మంగళాదేవి" అన్నభాష్యకారోక్తి ననుసరించి కొంచెం యెత్తుకున్నాను దేవీభాగవతపీఠికలో– గుం॥ డి॥ విమర్శకుఁడుగారు యీలా యెత్తుకోవడానిక్కూడా వొప్పుకున్నట్లు లేదు. చూడండి.

తే.గీ. కవుల చారిత్రములు వ్రాయఁగడఁగినావె?
దేవిభాగవతమున నీ తెలివిఁ జూపి
దురభిమానంబు నీలోన దొరలి కాక
యాదికవిభేద మిం దేమియవసరంబు.

దేవీభాగవతములో ఆదికవుల రచనాభేదాన్ని గూర్చి నేను వ్రాయడంకూడా దురభిమానప్రయుక్తమేనఁట! అసలు నేను యీ ఆంధ్రదేశంలో పుట్టడానిక్కూడా విమర్శకుఁడుగారు సమ్మతించరనుకుంటాను.

(1) "ఉ. తిక్కనకున్న పేరు తెగఁద్రెంచియు నన్నయ కీయఁజాలితీ,
వక్కట! యెంతకైనఁ దగుదైనను దిక్కనయేమి చేసె? నీ
కెక్కువ యేమిత్రవ్వి తలకెత్తెను నన్నయ?"

(2) "తే. గీ. ...బ్రాహ్మణుండవ యింత దుర్మార్గమగునె"

(3) "క. ...కవితాలలనమొగంబు బూడిదం బులిమెదవే?"

(4) "మ. ...ఎటోచాకుండఁ బోకుండఁగా అవధానంబని నెత్తినెత్తికొని"

(5) "తే.గీ. ...నీవె కవివె? సింగికూడఁ గవిత్వంబు చెప్పలేదె?"

(6) "శా. ...బుద్ధిలేదె? యిది సత్యంబౌనె?"

(7) "క. ...మీ కా కాకోపమానమే సార్థకమౌ!"

(8) "చ. తెలివలుగా గణించితివె? ధీరహితా
(బుద్ధిహీనుఁడా) వృథగా నియోగులన్"

(9) "ఆ. వె. ...వెఱ్ఱివెంకటాయ..."

(10) "ఉ. ఎక్కడనో విధాతలిఖియించిన యట్టి యదృష్టరేఖచే
దక్కెను నీకుఁ బేరు కవితావిషయంబున నంతెకాని"

(11) "క. లాభం బబ్బినదానికి నీ భంగిన్ జచ్చి చెడఁగ--"

(12) "క. మీరాశుకవిత చెప్పఁగ నీరక--"

(13) "క. మన వేంకటశాస్త్రి నీతిమాలిన వ్రాతన్."

(14) "తే. గీ. అయనమున కొక్కపద్యంబు నల్లనేర్చు
వాఁడు మీకంటె ఘనుఁడు--"

(15) "శా. కైపుంజెందినవేళ వ్రాసితిరె? మీకావ్యంబులన్"

(16) "తే. గీ. .. .. .. ..నిన్నేమనందు? నిట్టి
రోఁతలకు మెచ్చునట్టి సూరులను నిన్ను
ననియతాత్ముఁ జేసిన విధినందుఁగాక."

(17) "తే. గీ. ఆశుకవితావధానంబులందు మీకు
శక్తిచాలమిఁ బన్నినసాకుఁగాదె?"

(18) "క. పతి నీవో? లే కా తిరు
పతిశాస్త్రియొ? యెఱుఁగ మీవి హమ్మున దం
పతు లూరేఁగెదు నపు డుప
పతియే? అగ్రాసనాధిపతి పల్లకిలోన్."
(అగ్రాసనాధిపతి, కా. కృ. ఆచార్యులు అంకుమగడా)

(19) "క. ఇద్దఱు భోక్తల కెక్కువె?
తద్దినమని యిదియె మీకుఁ దగునుపమ..."

(20) "తే. గీ. గంటకేఁ బది (౧౦) పద్దెముల్ గెంటలేని - నీకొలఁదికి..."

(21) "ఉ. ...చచ్చి చెడంగలార లొక జాముల తిర్పతి వేంకటేశ్వరుల్,"

(22) "తే. గీ. కొత్త విశ్వస్తలన మూలఁ గూరుచుండి..."

(23) "తే. గీ. అరయఁ బదియవనాఁటి ముత్తైదువలన--"

(24) "ఆ. వె. సభకుఁబోయి చూడఁజాలనిమీరు--"

(25) "తే. గీ. బుఱ్ఱగొఱిగించి సున్నపుబొట్లువెట్టి
తిరుపతిని వెంకటన్నను ద్రిప్పినాము"
(ఇది సొంతతిట్టుకాదు, ఇతరానుకరణము)

(26) "చ. -పదియవనాఁటి యైదువలభంగి నడంగరె?"

(27) "చ. ...నక్కపోతు నే-నని యుపమించుకొ
మ్మదియె యన్ని విధంబుల సార్థకంబగున్."

(28) "క. ...వెంగలితన మింకఁ గలదె! వేంకటశాస్త్రీ."

(29) "తే. గీ. ...పందవై పాఱుటది యొకబంటుతనమె?"

(30) "క. ...నీ వీ వెడపోకలఁ బోయితె? ద్రావిడ యుక్తులన..."

(31) "చ. పయోధరములు చిమ్ముకొంచరుగు ద్రావిడభామలచందము,"
(విమర్శనములో ద్రావిడస్త్రీల పయోధరాల జోలి యేటికో)

యెన్నని చూపుదును? యిదేరీతిని నూటపదహారు డెమ్మీసైజు పుటలు తి. వెం. కవుల గ్రంథవిమర్శన మనే పేరుతో నొకరు పద్యాలతో పూరించినారు. వారు మమ్మిట్లు తిట్టుటకు ప్రధానహేతువు నన్నయ్య భట్టును మేము మా దేవీభాగవత పీఠికలో -"లక్షణంపుఁబ్రోవై" అని సంభావించినందుకున్నూ, ప్రప్రథమకవిగా అతణ్ణి సమ్మానించి నందుకున్నూ అనుకోవడానికి పయినచూపిన వాక్యాలలో యెన్నో ఆధారాలున్నాయి కదా? కాని మొట్టమొదటనే ఆ విషయం యెత్తుకొని కొన్ని తిట్లుతిట్టడంచేత స్థూలదృష్టికి అందుకోసమేమో అని మాత్రం తోస్తుంది. అయితే యింకావున్న తిట్లకు ఫలితాన్ని విచారించవద్దూ, వినండి, అసలు మా గ్రంథాలు విమర్శించడానికిన్నీ పూనుకున్నట్లులేదు. విమర్శకుఁడు గారికి మా మీఁద వచ్చిన కోపమంతా "గుంటూరు సీమ"కు సంబంధించినదే.

అందులో సప్రమాణంగా మేము వ్రాసిన విషయమంతా కాకపోయినా యే కొంచెమో యెత్తుకొని ఖండిస్తూ వచ్చారు. ఆ ఖండన యేలా వుంటుందంటే "నన్నయ భట్టాది కవిజనంబులుమాకున్" అనే వాక్యంలో మేము వ్రాసిన నన్నయభట్టాది అనే అక్షరాలకు చేసిన ఖండన మేలా వుంటుందో అచ్చంగా మూఁడుమూర్తులా ఆలాగే ఉంటుందని వేఱేచెప్పనక్కఱలే దనుకుంటాను. విమర్శకుఁడుగారి పరిశ్రమకు ముఖ్య ఫలితం యేమిటంటే, మేము కొప్పరపు కవుల కవిత్వ పాండిత్యాలకు జంకి పాఱిపోయి అపరాభవాన్ని కప్పిపుచ్చడానికి యేమీ వుపాయంతోఁచక గుంటూరుసీమ అనే అబద్ధపుతడకను అల్లి లేని జయాన్ని ప్రకటించుకొని సంతుష్టిపడ్డట్టు తేల్చడమే. యీలా తేల్చడంలో కొన్నిచోట్ల జడ్జిగానున్నూ, కొన్ని చోట్ల లాయరుగానున్నూ, కొన్ని చోట్ల సాక్షిగానున్నూ విమర్శకుఁడు గారు పనిచేసివున్నారు. యిలా మమ్మల్ని సమర్థించవలసిందని వీరిని కొప్రపువారుగాని, తత్పక్షీయులుగాని, కోరివున్నట్లు నామనస్సాక్షికి తోఁచుటలేదు, "ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః" గీరతవిషయాన్ని కూడా కొంత అందుకొని వీరు సమర్థనానికి పనిచేసివున్నారు. అదికూడా స్వయంగా చేసిందే కాని దానికి సంబంధించినవారి ప్రేరణవల్ల జరిగినట్టుతోఁచదు. దానికిఁగాని, దీనికిఁగాని, వారివారి ప్రేరణ యేమాత్రం వున్నా గ్రంథం అంత అనుచితధోరణిలో నడిచివుండదని నా నమ్మకం. గుంటూరి సీమపుట్టి యిప్పటికి మూఁడుదశాబ్దులు కావచ్చింది. అందులో అసత్యాలే వుంటే యిన్నాళ్లవఱకున్నూ మాకొప్పరపుసోదరులు వుపేక్షించేవారుకారు, "జల్లిసీమ" అనే పేరుతో గ్రంథం వ్రాస్తున్నామనో, వ్రాశామనో వారు ఆరోజులలో దేనిలోనో వ్రాసినట్లు జ్ఞాపకం. కాని ఆపుస్తకం బయటికి వచ్చినట్టు మాత్రంలేదు. యీవిమర్శన పుస్తకాన్ని చూచి సోదరులు లోలోపల చాలా లజ్జిస్తారనికూడా నా అంతరాత్మకు తోస్తుంది.

ఈ విమర్శకుఁడు గారికి మాయందు అందులో విశేషించి నాయందు వుండే ఆగ్రహమే యీ వ్రాఁతకు కారణం. ఆగ్రహానికి కారణం నేను వైదికశాఖవాణ్ణిగా వుండడమే. మరొక కారణం నన్నయ్యభట్టు ప్రప్రథమ కవిగా వుండడమున్నూ అతణ్ణి నేను-

సీ. "నన్నయకవి పెట్టినాఁడుకదా తిక్కనాది కవీంద్రుల కాదిభిక్ష"

అని శ్రవణానందంలో కవిత్వభిక్షాప్రదాతనుగా పేర్కోవడం అనుకోవాలి. అయితే వచ్చినకోపమంతా వినియోగించారో లేదో యేలా తెలుస్తుంది? ఆలా వినియోగిస్తే యింకా ముదురుపాకంలో తిట్టేవారేమో! అందుచేత కొంత దిగమింగి వ్రాసినట్లే భావించాలి. దూషించకుండా వ్రాయరాదా అంటే దూషించకుండానే వ్రాసివున్నట్టే ఆయన అనుకొని వుందురు. అందుచేత ఆప్రశ్న మన మడగడం అనవసరం.

విమర్శకుఁడుగారు నాతోపాటుగా వయోవృద్ధులే అని వారిపీఠికలో వకవాక్యం చెపుతూవుంది. నన్నువారు పద్యాలలోనేకాక వచనంలోకూడా, "వేంకటశాస్త్రి" అనియేకవచనంగానే వాడుతూ వుంటారు. అది వారికి నాయందు వుండే నిరసనభావానికి స్ఫోరకమే అయినా దానివల్ల వారి విమర్శనగ్రంథతత్త్వం పూర్తిగా వెల్లడి కావడం సంభవించడంచేత నాయందలి ప్రేమగానే భావిస్తాను. లేకపోతే ఆయా విషయాలు అన్నీ కాకపోయినా కొన్నైనా నేను ఖండించి మచ్చు చూపవలసివచ్చేది. యిప్పుడు ఆ పరిశ్రమ లేకుండా పోయిందని వేఱే వ్రాయవలసి వుండదు.

శా. కోపంబుల్ పనిసేయునే? ఒరుల కెగ్గుల్ చూపుచో-

ఒకటి మాత్రం నామీఁద పెద్దభారం దానంతట అదే వచ్చిపడింది. దూషించనివ్వండి. భూషించనివ్వండి. సుమారు నాల్గువందల పద్యాలకు యే మాత్రమో తక్కువగా తఱుచుచున్నను (నికృష్టంగానే కానివ్వండి) సంబోధిస్తూ గ్రంథకర్త విమర్శనవ్యాజంతో రచించినప్పుడు యీమూలంగా కృతి పతిత్వం అబ్బిన నేను ఆయన్ని సమ్మానించ వలసివుంటుందని వేఱే చెప్పనక్కఱలేదు. తిట్లకుకూడా సమ్మానమా? అని శంకిస్తారేమో? మాప్రాంతాన్నే నాబాల్యంలో జరిగిన యీ యితిహాసాన్ని వినండి. తహస్సీల్దారీ వుద్యోగాన్నో, డిప్యూటీకలెక్టరీ వుద్యోగాన్నో చేస్తూవున్న వొక బ్రాహ్మణ గృహస్థు తనకూతురివివాహంలో సంతర్పణసమయంలో నేతిజారీ పుచ్చుకొని నేయి వడ్డిస్తూ వుండఁగా వొకానొక బలశాలి బ్రాహ్మఁడు- "నీ అబ్బ సొమ్మేమేనా ఖర్చుపెడుతున్నావా? బాగా సమృద్ధిగా వడ్డించవేమి" అని యేమేమో అంటూ వొకచెంపకాయ కొట్టినట్టున్నూ, దానితో దిమ్మతిరిగి ఆయన కొంత సొమ్మసిల్లి ఆజారీ అక్కడ వదిలిపెట్టి యింట్లోకి వెళ్లి - ఆ బ్రాహ్మణ్ణి భోజనమైన తరువాత నావద్దకి తీసుకురావలసిందని ఆర్డరిచ్చాడనిన్నీ,ఆలా ఆర్డరివ్వడంతోటట్టే అందఱున్నూ యేదో శిక్ష విధిస్తారని అనుకుంటూ వుండఁగా, యేచేతితో ఆయన తన చెంపమీద కొట్టివున్నాఁడో ఆచేతికి వక మంచిబంగారు మురుగు బహుమతీ యిచ్చి ఆదరించి పంపేటప్పటికి అందఱూ ఆశ్చర్యపడ్డారనిన్నీ చెప్పుకోఁగా విన్నాను. ఆబ్రాహ్మఁడు ఆయన యెవరో లేశమూ యెఱుఁగఁడు పాపం. భవతు. ఆకాలపు వాళ్ల ఉదారతలు అలావుండేవి. రాయన భాస్కరుఁడు మొదలైనవారు ఆలాటివుదారులే. యిపుడు నాకు ఆలాటి అవకాశమే తటస్థించింది. నేను సామాన్యగృహస్థుడు గాని జమీందారుణ్ణికాను. దానంతట తటస్థించిన అవకాశాన్ని దాఁటఁబెట్టకూడదు. గ్రంథకర్తకు నన్ను తిట్టడమే వుద్దేశమైనా గ్రంథాన్ని కృతియిచ్చి కృతిపతిని చేసినట్లు తుదకు పరిణమించింది. కవిత్వం బాగా సాపుగా వుంది. అందుచేత నాశక్తికొలఁదిగా- "చంద్రుఁడికొక నూలుపోగు" అన్నట్టు

యేదో మా గ్రామంలో చిన్న సభచేసి యేవో అభినందనపద్యాలుకొన్ని చెప్పి యిప్పటికి నావద్ద నిల్వవున్న సేలుజోళ్లలో వుత్తమతరగతి సేలుజోడును బహుమతిగా యిచ్చి నోటితో లేదనడం కంటే చేతితో లేదన్నాఁడన్న లోకోక్తికి లక్ష్యంగా వుందామని తోఁచిందని త్రికరణశుద్ధిగా యిందుమూలంగా వారికి నేను ఆహ్వానం పంపుతున్నాను. నాప్రార్థనను అచిరకాలంలోనే దయచేసి వారు సఫలీకరిస్తారని నమ్ముచున్నాను. వారు లేశమున్నూ సందేహించవలసిన విషయం యిందులో లేదు-

"కబ్బమిచ్చినవానిఁ గన్నె నిచ్చినవాని" అనే వేణుగోపాలశతకచరణాన్ని వినేవుంటారాయన. అంతేనేకాని ఆయన నాశంకలకు తగిన జవాబు వ్రాయవలసిందని సవాలుచేసివున్నప్పటికీ ఆపనికి పూనుకొనేది లేదు. పూనుకుంటే మళ్లా తిట్టవలసి వస్తుందాయె. తిట్లకు తిట్లేజవాబు. విషస్య విషమౌషధం. ఆ పని నాకేకాదు యెవరికీ యిష్టంవుండదుకదా. ఆయన యేవో తిట్లు వ్రాసివ్రాసి తుట్టతుదకు నాకు వుపదేశంగా వకపద్యాన్ని వ్రాసివున్నారు. దాన్ని వుదాహరించి యీ అవాంతర విషయాన్ని వదలి ప్రధానాంశంయెత్తుకొని నాల్గు మాటలు వ్రాసి వ్యాసాన్ని ముగిస్తాను.

తే.గీ. పరువ మనియెడు చండభాస్కరుఁడు మింటఁ
నేగి తుది నపరాంబుధి నీడఁబడియె
జరయనెడి కాఱుచీఁకటి పొరసె నింక
జ్ఞానదీపికఁగొని యాత్మఁ గాంచుమయ్య.

యీ పద్యంకూడా సదుద్దేశంతో వ్రాసిందికాదు గాని మనం సదుద్దేశంకిందే భావిద్దాం.

"కొట్టితే కొట్టాఁడు కొత్తకోకెట్టాఁడు" అన్న మాదిరిగావున్న యీ పద్యం వ్రాసిన కవిని నేను అంతో యింతో కవినైవుండి తన్మూలాన్ని యెన్నో సమ్మానాలు పొంది వుండిన్ని శక్తివున్నంతలో సమ్మానించకుండా యేలా వుండఁగలనో చదువరులే చెప్పవలసివుంటుంది. యిందులో యేదో కపటం వుందని ఆయన ఆలోచించి రాకపోతే అదినాదురదృష్టమని విచారించడం కంటె నాకు కర్తవ్యం కనపడదు. యిది నిష్కపటమైన ఆహ్వానమని యే ప్రమాణం కోరితే ఆ ప్రమాణాన్ని చేస్తాను. ఈయన రెండేళ్ల నుంచి అనారోగ్యస్థితిలో వున్నట్టు మిత్రుని ద్వారా వ్రాయించి వున్నారు. యీ పుస్తకంలో కాక యేదో భారతసంశయ విచ్ఛేదమనే వీరితాలూకుపుస్తకంలో కొన్ని అపప్రయోగాలు కనపడి నేను వాట్లకు సమాధానంయీయవలసిందని వీరి మిత్రుఁడు గారి ద్వారా కబురంపితే వారితో పైసంగతినిచెప్పి మతికూడా స్థిరంగా వుండడం లేదని చెప్పినట్లునాకు వ్రాశారు. యిందుకు నేను మిక్కిలిగా విచారిస్తూ ఉపాస్యదేవతను వీరికి త్వరలో నాతోపాటు ఆరోగ్యాన్ని కలిగించి

చిరకాలమునుంచి తుల్యావస్థలోనే వున్న నాకు కృతి ప్రదాతను సమ్మానించినాఁడన్న యశస్సును సంపాదించి పెట్టవలసిందని ప్రార్థిస్తున్నాను. ఆ సమ్మానసభలోనే వారికి అంగీకారమైతే వారిశంకలకు కూడా సరళంగా తోఁచిన సమాధానాలుకూడా చెప్తాను. నన్నయ్యను గూర్చిన శంకలవంటివే అయితే చెప్పనే అక్కఱలేదుకదా? ఆయీ సందర్భం వారి అంగీకారానంగీకారాలను బట్టి వుంటుంది. బలవంతంలేదు. యీయన కవితాధారనేకాక శాఖాభిమానాన్ని కూడా చదువరులు ప్రశంసింపవలసి వుంటుందని నాతలఁపు. తిట్లకేమి అవి యీయనవి కావు కోపానివి. యిఁక యీలాటి సందర్భం వకటి నిమిత్తంగా పెట్టి యీ విమర్శకుఁడు గారిచేత నన్ను కృతినాయకుణ్ణిగా చేసిన నన్నయ్యభట్టారకుని అనితరసాధ్యరచనకై కొన్ని పద్యాలు చవిచూపుతూ తోఁచినమాటలు కొన్నివ్రాసి ఈ వ్యాసం ఆఁపుతాను.

చ. బహువనపాదపాబ్ధికులపర్వతపూర్ణసరస్సరస్వతీ
సహితమహామహీభరమజస్రసహస్రఫణాళిఁదాల్చి దు
స్సహతరమూర్తికిన్ జలధిశాయికిఁ బాయక శయ్యయైన య
య్యహిపతి దుష్కృతాంతకుఁ డనంతుఁడు మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్.

చ. అరిదితపోవిభూతి నమరారుల బాధలు వొందకుండఁగా
నురగులనెల్లఁ గాచిన మహోరగనాయకుఁ డానమత్సురా
సురమకుటాగ్రరత్నరుచి శోభితపాదున కద్రినందనే
శ్వరునకు భూషణంబయిన వాసుకి మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్.

ఉ. గోత్రమహామహీధరనికుంజములన్ విపినంబులన్ గురు
క్షేత్రమునన్ బ్రకామగతి ఖేలన నొప్పి సహాశ్వసేనుఁడై
ధాత్రిఁ బరిభ్రమించు బలదక్షపరాక్రమదక్షుఁ డీక్షణ
శ్రోత్రవిభుండు తక్షకుఁడు శూరుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్.

యిట్టి ధారాశుద్ధికై నేను బాల్యమాదిగా ప్రయత్నించి చూచాను. అలవడింది కాదు. యీభట్టారకుఁడు స్వల్పంలో తేలేదాన్ని పెద్దచేసిన్నీ చెప్పఁగలఁడు. పెద్దలో చెప్పేవిషయాన్ని క్రోడీకరించిన్నీ చెప్పఁగలఁడు. కర్తు మకర్తు మన్యథాకర్తుం సమర్థుఁడు. దీనికి వుదాహరణాలుగా కొన్ని పద్యాలు భారత విశేషాలలో యెప్పుడో చాలానాళ్లక్రితమే చూపివున్నాను. "జలధివిలోలవీచివిలసత్కలకాంచి" లోనైనపద్యాలు చూచుకోవాలి. ఆయీశక్తులన్నిటిలోనున్నా నాకు అనితరసాధ్యంగా తోఁచింది యీతని సమాసగ్రథన

నైపుణ్యమే! అప్రయత్నంగా భట్టారకుని కవిత్వంలో శబ్దాలంకారాలు కుప్పతెప్పలుగా వచ్చిపడతాయి. అందు కిదివఱలో చూపిన పద్యాలే చాలును. మఱివకటికూడా యిస్తాను.

"ఉ. భారతభారతీశుభగభస్తిచయంబులఁజేసి..."

యమకకవిత్వం రసాన్ని చెడఁగొట్టుతుందని లాక్షణికులందఱున్నూ వొప్పుకొన్న విషయమే. భట్టారకుని కవిత్వంలో వున్నయమకం రసాన్ని లేశమున్నూ భంగించదు. కారణ మేమంటే నిఘంటులసహాయంతో ప్రయత్నించి సమకూర్చిన యమకమయితే కాదూ ఆదోషానికి గుఱి కావడం. అసలు అతనిధారలోనే యిమిడి వుంటుందాయె శబ్దాలంకారం. యింకొకటి తత్సమపదాలు విడివిడివి కూర్చడంలోకూడా భట్టారకుని నైపుణి అనితరసాధ్యంగా వుంటుంది.

క. దేవసములైన యనుజుల
తో విప్రులతో రథాళితో వచ్చి యర
ణ్యావాసము చేసెదు ధర
ణీవల్లభ నీవు ధర్మనిష్ఠితబుద్ధిన్.

పైపద్యంలో వున్న కూర్పుసొగసు అలా వుంచుదాం. వచ్చి, చేసెదు, నీవు అనేమూఁడు మాటలుతప్ప అచ్చ తెలుఁగుమాటలు లేని యీపద్యం యెంతసుళువుగా కుఱ్ఱలకుకూడా అన్వయమవుతుందో పరిశీలించండి. భక్తి అనేది సంస్కృతం, బత్తి అనేది తెలుఁగు, ఆశ్చర్యము సంస్కృతం, అచ్చెరువు తెలుఁగు, ఆయీ పదాలలో యేపదాలు సుళువుగా అర్థమవుతాయో ఆలోచించండి. ఆయీ రహస్యం భట్టారకునికి తెలిసినట్టితరులకు తెలియదేమో అనుకుంటాను. యెక్కువగా యిమిడ్చి చెప్పడం సూత్రగ్రంథాలకు అవసరం గాని పురాణాదులకు అవసరం కాదు. శ్రీ॥ కం॥ వీ॥ పంతులుగారు భట్టారకుని కవిత్వంకంటెను, సోమయాజి కవిత్వంకంటెను కూడా నాచనసోముని కవిత్వం రసబంధుర మని అభిప్రాయ మిచ్చివున్నారు. కొన్ని పద్యాలు అతఁడు కేవల కావ్యపాకంలో నడిపించివున్నాఁడు. ఆపద్యములు రసవత్తరములనుటకు సందేహంలేదు. దరహంమీఁద చూస్తే భారతకవులను మించుననడానికి నాకు వొప్పుదల లేదు. ఆరీతినే పరిశీలించి చూచేయెడల తిక్కన్నగారి శైలిని కంకంటివారిశైలి అతిక్రమించిందని చెప్పవలసి వస్తుంది. పురాణశైలితో తిక్కన్నగారు ఉత్తరరామాయణాన్ని నడిపించారు. పూర్తిగా కావ్యశైలిలో పాపరాజుగారు నడిపించారు. వారి వారి వుద్దేశాన్నిబట్టి విమర్శకులు విచారించ వలసివుంటుంది. కవిబ్రహ్మంతటివాఁడు వ్రాసినదాన్నే పుచ్చుకొని ఆంధ్రీకరించడం

మహాసాహసంకదా? అట్టి సాహసానికి దిగినపాపరాజుగారు యెన్ని వన్నెచిన్నెలున్నూ పెట్టకపోతే యేలా తుదనెగ్గుతుంది? పయిగా పాపరాజుగారి వాణికూడా రసవంతమైనది కాని అల్లాటప్పా తరగతిలోనిదికాదు. కనుకనే అపహాస్యాస్పదుఁడు కాలేదు. యమకాలు వగైరా అలావుంచండి-

సీ. తిలకంబు దిద్ది "దిద్దితిఁ జూడు" మను రమా
సుదతి చెక్కుల నీడఁ జూచువాని"

యీపద్యం శ్రీమహావిష్ణువును వర్ణించినది. చరణాలన్నీ యీలాగే వుంటాయి. అందులోనున్నూ యీ మొదటిచరణం అత్యద్భుతమైన రసికత్వాన్ని వెల్లడిస్తూ వుంది. యెందుచేతంటారా? మీరేచూచుకోండి. నన్నెందుకు చెప్పమంటారు? ప్రసక్తానుప్రసక్తంగా పాపరాజుగారు వచ్చారు. ప్రస్తుతం నన్నయ్యగారు ఆయీ కవులను గూర్చి వ్రాయవలసివస్తే వొక్కొక్కరికి వొక్కొక్కవ్యాసం పెట్టుకోవలసిందే గాని వొకరిని గూర్చి వ్రాస్తూ వేఱొకరినిగూర్చి యెత్తుకోవడం మహాపరాధంగా పరిణమిస్తుందని నేను భయపడుతూవుంటాను. ఆలా యెత్తుకోవడం పేరే.- సీ. ఒకరి పెండిలిలో మఱొక్కఁడాపల్లకీ నిరుక నుంకించుట- వంటిది. వారు కోరకపోయినా మనం వారిని యిటికించినట్లవుతుంది. దీన్ని యెఱుఁగుదును. అయినా సంబంధం వుండడంచేత స్పృశించడం తప్పింది కాదు. భారతకవులను గూర్చి యెత్తుకుంటే యిటీవలవారిని యెత్తుకోవడం మానినా అసలు ముగ్గురినేనా యెత్తుకోక వొక్కరి నెత్తుకొని విరమించడానికి బుద్ధిపుట్టదు. యెఱ్ఱన్నగారు- "నాపెసరపప్పు కలసినదంతా నాదే" అన్నమాదిరిని భారతకవులైనారు. నన్నయ్యగారు అసలు ఆమహాకార్యాన్ని ప్రారంభించినవారవడంచేత భారతకవి అనేపేరు వహించారుకాని చాలా రచించికాదు. నిజంగా భారతకవి పట్టభద్రత్వం తిక్కన్నగారికే కట్టవలసి వస్తుంది.

చ. ...దుర్గమార్ధజలగౌరవ భారతభారతీసము
ద్రముదరియంగ నీఁదను విధాతృనకైనను నేర్వఁబోలునే

అని నన్నయ్యగారి దివ్యవాణి భావికాలమందలి యనర్థాన్ని సూచించింది. సంశయాత్మా వినశ్యతి అన్నట్లు తుదకు ఆలాగే జరిగింది. సత్కవివాక్యము రిత్తవోవునే. యెన్నటికి రిత్తవోవదు. భవతు. ఆలా జరిగికొన్నాళ్లు అసంపూర్ణ స్థితిలోనే వున్న ఆ భారతాన్ని ఆంధ్రీకరించడానికి సాహసించినతిక్కనగారు "యశోవా మృత్యుర్వా" అనే అభియుక్తోక్తిని మనస్సు యందుంచికొనియ్యేవే కర్తవ్యాంశమందు ప్రవర్తించినారని తోస్తుంది. ఆయన నన్నయవలె కవిమాత్రుఁడుకాక దండనాథుఁడుకూడా కదా! దండనాథునకు ప్రాణభీతి వుండదని వేఱే చెప్పనక్కరలేదు. అదిగాక- "న సాహస మనారుహ్యా నరో భద్రాణిపశ్యతి"

అనే న్యాయాన్ని పాటించిన తిక్కన్నగారు భారత మనాయాసంగా రసవత్తరంగా పూరించి తద్ద్వారాగా తాను తరించడమేకాకుండా నన్నయ్యగారిని కూడా తరింపచేశారనుటకు సందేహంలేదు. తిక్కన్నగారి విజ్ఞానం నన్నయ్య గారినికూడా కూడతీసుకురావడం లోనేవుంది. దీన్నిగుఱించి లోగడ వ్రాసేవున్నాను. అందఱు యెఱిఁగిందే అయినా తిక్కన్నగారిశైలికూడా కొంతమచ్చుచూపి యీ వ్యాసాన్ని ముగిస్తాను-

ఉ. చిచ్చఱకన్ను మూసికొని చేతిత్రిశూలము డాఁచి లీనమై
వచ్చిన రుద్రుచందమున వ్రాలుదు వీవనిలోన నోర్వఁగా
వచ్చునె నిన్ను నెట్టిమగవానికి నీకృప నాశ్రయింపఁగా
వచ్చితి మెవ్విధిం గెలువవచ్చు మహాత్మ యెఱుంగఁ జెప్పవే.

క. సంజయ మురభంజనుని ధ
నంజయునిం జీరికిం గొనఁడు కర్ణుం డిం
ద్రుంజెనఁకియైన గెల్తున
నుం జచ్చెనె అట్టివాఁడునుం గయ్యమునన్.

క. పలపలనిమూఁకలోఁ గా
ల్నిలువక గుల్లమ్ముడిగ్గి నీకొడుకు గదా
కలితభుజుఁడగుచు నొక్కఁడు
తొలఁగి చనియె నేమిచెప్పుదున్ గురునాథా.

యిట్టివి విడివిడి పదాలకూర్పుతో ముద్దులు మూటగట్టేశైలిలో వున్న పద్యాలెన్నో వుదాహరించవలసి వుంటుంది. యీశైలికి కూడా మార్గదర్శి నన్నయ్యగారే యేమో అని నే ననుమానిస్తాను.

తిక్కన్నగారి పద్యాలలో తెలుఁగెక్కువ సంస్కృతం తక్కువ. నన్నయ్యగారి పద్యాలలో సంస్కృత మెక్కువ తెలుఁగు తక్కువ, అని వ్రాయనక్కఱలేదు. కాని శైలి వుభయులదిన్నీ ప్రసాద గుణభూయిష్ఠమే. నెల్లూరు, గుంటూరు, బందరు ప్రాంతాలలో వున్నంత అచ్చతెలుఁగు గోదావరీ మండలంలో వాడకంలో లేదనే నాకు తోస్తుంది. కాని నన్నయ్యకెక్కడి నుండి వచ్చాయో మాఱుమూల తెలుఁగుపదాలుకూడా కవిత్వంలో దొర్లుతాయి. ఏడ్తెఱ, ఒగి, వెస, మొదలైనమాటలు వ్యావహారికంలో నేనెక్కడా మా ప్రాంతాలలోఁగాని యితర ప్రాంతాలలోఁగాని వినలేదు. భారతకవుల కెక్కడినుండి వచ్చాయి? గ్రాంథికంగా వున్నాయంటే నన్నయ్యగారి నాఁటికి వున్న గ్రంథాలపేళ్లు

చెప్పఁగలమా? యీశంకలకు సరియైన సమాధానాలు కనపడవు. మొత్తం నన్నయ్య గారికిన్నీ యేదో ఆధారం వుండితీరాలన్నది సిద్ధాంతం. శాసనాలకవిత్వం మాత్రమే నన్నయ్యగారికి పూర్వం వుండేదంటూ కొందఱువ్రాస్తారు. ఆశాసనాల్లోకూడా యీ మాటలు వున్నట్టులేదు. నిఘంటులన్నీ నన్నయ్యగారి కీవలివేను. నన్నయ్యగారు వాడని పదాలు కొన్ని– ఉపతాయి మొదలైనవి స్వల్పంగా తిక్కన్నగారు వాడివున్నారు. అవి వ్యావహారికాలో, గ్రాంథికాలో తెలియదు. భాష ప్రపంచ సృష్టితోపాటు అనాదిగా వుండితీరుతుందన్నదే తుదకు సర్వసమ్మతమైన మాట. భవతు. దీన్ని యీలావుంచి ప్రసక్తి కలిగింది కనక యెఱ్ఱన్న గారిని గూర్చి కూడా కొన్ని మాటలు వ్రాస్తాను. ఈయన వ్రాసిన భారతారణ్యపర్వశేషంకూడా ముద్దులుమూట కడుతూ జనరంజకంగానే వుంది. కనకనే మళ్లా యెవరున్నూ కలిగించుకొని పునఃపాకాని కుపక్రమించలేదు. యావత్తుకూ వుపక్రమించినవారు పలువురున్నూ ఆ పాకాన్ని అతిక్రమించినట్టున్నూ లేదు.

చ. ధనములు చాల గల్గి సతతంబును నింద్రియవాంఛ సల్పుచున్
మనమున నెన్నఁడున్ సుకృతమార్గము పొంతనుబోక లోభమో
హనిరతబద్ధులై తిరుగునట్టి జనుల్ పరలోక సౌఖ్యమున్
గనుటకు నేర రిప్పటి సుఖంబులు మేలయి తోఁచు వారికిన్.

క. ఈలోకమ యగుఁగొందఱ
కాలోకమ కొందఱకు నిహంబును బరమున్
మేలగుఁ గొందఱ కధిపా!
యే లోకము లేదు సూవె యిలఁ గొందఱకున్.

యీలాటి వింకా యెన్నో పద్యాలు వుదాహరించతగ్గవి వున్నాయి. సమాసగ్రథన విషయంలో మొట్టమొదటనే నన్నయగారి “శారద రాత్రుల” పద్యాన్ని యీయన అనుకరించవలసిన ఆవశ్యకత కలిగింది. అనుకరించి “స్ఫురదరుణాంశురాగరుచి” మొదలైన పద్యాలను ఇంచుమించు అదేశైలితో ముగించి చాలవఱకు కృతార్థుఁడుకూడ కాఁగలిగాఁడు. వొక్కొక్కరి కవిత్వమందున్నూ, వొక్కొక్కరి గానమందున్నూ ఒక్కొక్క విశిష్ట గుణం సహజంగా వుంటూవుంటుంది. ఆగుణం అనుకర్తలకు యే కొంత భాగమో స్వాధీన మవుతుంది గాని, పూర్తిగా స్వాధీనం కాదన్నది సర్వానుభవసిద్ధం. శ్రీనారాయణ దాసుగారిని హరికథకు లెందఱు అనుకరించడంలేదు? కోడి రామమూర్తిగారిని మల్లవిద్యాప్రవిష్టు లెందఱు అనుకరించడం లేదు? వొక్కరైనా వారి వారి పూర్తి విశేషాలు ప్రకటింపఁ గలుగుతున్నారా? పై విషయమున్నూ అలాటిదే. నిజంగా అనుకర్తలు కృతార్థులు కాఁగలిగినా

ప్రప్రథములయం దుండే గౌరవాతిశయంచేత అనుకర్తలను లోకం యేకొంచెమోతగ్గించడమే కనcబడుతుంది. ఉపమానస్థానంకన్న, ఉపమేయ స్థానాన్ని మనం యెంత వుత్కృష్టంగా వర్ణించినా తత్తుల్యంగా ఉంది అని చెప్పినట్టే అవుతుంది. ఆ యీభావాన్ని మనస్సులో పెట్టుకొనియ్యేవే దేవీభాగవతంలో మేమీ క్రింది పద్యం వ్రాశాము.

ఉ. మూగురయందు నన్నయ సమున్నతుcడై కడులక్షణంపుc బ్రో
వై గుది గూర్చు నేర్పు గలcడై తగు నించుక కేమి? యజ్వయున్
లోcగక ఆతనిన్ జెనయు, న్యూనుcడనందగc డెఱ్ఱనార్యుc డెం
తే గడుసుందనమ్ము గలc డిర్వురకున్ సరివచ్చు నన్నిటన్.

యెవరికో కోపం వచ్చిందని యిప్పుడు నేను నన్నయ్య స్థానాన్ని తిక్కన్నగారికి మార్పుచేసినా దాన్ని లోకం విశ్వసిస్తుందా? కొందఱు విశ్వసించినా మఱికొందఱు తిరగcబడతారు.

"... ... ... ... ... ...అందఱినిం దనియింప మమ్ము ని
ర్మించిన బ్రహ్మకైన దరమే! యిది పెద్ద లెఱుంగకుందురే!"

వాల్మీకి కన్నా కూడా మిన్నగా కవిత్వం చెప్పినట్టు కాళిదాసును సమర్థించవచ్చును. కాని కాళిదాసుకు సమకాలికుcడైన భోజరాజు--

"మధుమయఫణితీనాం మార్గదర్శీ మహర్షిః"

అని ఆ గౌరవాన్ని వాల్మీకి యందే ఆపాదించాcడు. సంస్కృత కవిత్వం వాల్మీకులతోనే ఆరంభంకాలేదు. వేదంలోకూడా కవిత్వపదార్థం గలవి కొన్ని భాగాలు కనపడతాయి. అయినా కావ్యరూపందాల్చింది వాల్మీకుల వాక్ప్రవాహమే. అందుచేత- "భువిc గవితాకన్యc బుట్టించె నెవ్వాcడు" అన్న యశస్సు ఆయనకు దక్కింది. అదే విధంగానే యేదో తెలుcగు కవిత్వం నన్నయ్యనాcటికి కొంత వున్నప్పంటికి-

"మ. మహి మున్ వాగనుశాసనుండు సృజియింపన్"

అన్న పేరు నన్నయ్యకు దక్కింది. దానికి యెవరెంత అసూయపడ్డా ప్రయోజనంలేదు. నన్నయ తిక్కన యెఱ్ఱన పోతన మొదలైన మహనీయులందఱూ నిరుపమానులే, ధన్యులే. వీరిని గూర్చి ప్రత్యేకించి మాట్లాడుకోవలసిందే అని యిదివఱకే వ్రాశాను. దానికి సంబంధించిందే యీ మురారి శ్లోకానువాదం-

చ. ఒకరొక రుంద్రు దీరవరు లొక్కరికొక్కరు తీసిపోరు భూ
మికి యశ మబ్బె రావణుని మెచ్చున నంచనుకొందుమేని వా
లికి నతడింత జంకె లవలేశము లొక్కట డించి వీనులుం
టకు విని కన్నులుంటకుఁ గనందగు నల్పుల మేమి చెప్పఁగన్.

స్వస్తి.

## అనుబంధము

(షరా) ఈ వ్యాసంరాయడానికి ప్రసక్తి కల్పించిన విమర్శకుఁడు గారు రమారమి నావలెనే డెబ్బైయేళ్ల వృద్ధ వయస్సులోనే వున్నట్టు వారు పీఠికలో వ్రాసిన-- "వెంకశాస్త్రియు నీవును వృద్ధులైరి." అనే వాక్యంవల్ల స్పష్టపడుతుంది. అయితే మేము గుంటూరు సీమలో విద్యావిషయికంగా సుమారు మూడుమాసాలకాలం వున్నరోజుల్లో యేప్రసక్తిలో గాని యీయన పేరెన్నడును వినబడ్డట్టులేదు. పలువురు శాఖాభిమానులు పద్యాలతో మమ్మల్ని గాఢంగా తిట్టి ప్రచురించేవారు. వారు వారు వారివారి పేళ్లను కూడా ప్రచురించడమే వుండేది. ఆపేళ్ల జాబితా అక్కడక్కడ గుంటూరు సీమలో ప్రచురించే వున్నాము. వీరిపేరు ఆపేళ్లలో యెక్కినట్టు లేదు. మేము పొరఁబడి వున్నామా? లేక యీయన అప్పుడీ విషయంలో జోక్యం కలిగించుకోనే లేదా అని సందేహం కలుగుతూ వుంది. యే కొందఱో "యథార్థవాది" "సత్యవాది" అనే మారుపేళ్లతో మమ్ముదూషించి ప్రచురించే మహానుభావులును వుండేవారు. ఆపేళ్లలో వీరు వొకరైవుందురా? ఇంత ఆవేశం కలవీరు వార్ధక్యం వచ్చే దాకా ఆయీ దూషణోక్తులను కడుపులో నెట్లు దాచుకోగలిగిరో? అని కూడా సందేహం కలుగుతూ వుంది. అయితే వీరు వ్రాసిన-

"బహుకాలమునకు మరలి యీగోల యేలయని తలంతురేని..." "యిది బహుకాలము క్రిందటనే వ్రాయబడినను..."

అనే వాక్యద్వయమువలన విమర్శకుఁడుగారు చాలాకాలం క్రితమే దీన్నివ్రాసి లోకులకు జంకియో లేక మతేకారణం వల్లనో దీన్ని దాఁచితుదకు వార్ధక్యం వచ్చాక వ్రాసిన గ్రంథం వృథా పోనేల? అని ప్రతిష్ఠార్థం దీన్ని ప్రకటించినట్లు తోస్తుంది. పూర్వ వయస్సుకన్న వృద్ధవయస్సు కొంత యుక్తాయుక్త విచక్షణత్వానికి తోడ్పడవలసి వుంటుంది. ఆపద్ధతిని తిట్లు తగ్గించుకొని శంకలుమాత్రం ప్రచురించుకుంటే అవి నిలచినా, నిలువకపోయినా యుక్తంగా వుండేది. ద్రావిడ స్త్రీల కచకుచాల దగ్గరనుంచి ప్రసక్తిగాని ప్రసక్తిగా యెత్తికొని వ్రాస్తే విమర్శనం యెక్కువ శృంగారంగా వుంటుందని ఆయనకు తోచడం ఆశ్చర్యంగా కనబడుతుంది. "రోళ్లా రోకళ్లా పాడిన" గుంటూరు సీమలోవున్న

విషయాలు ఈసీమవారైన వీరికి యేకొంచెమున్నూ అవగతం కాలేదనుకోవడానికి వీరిశంకలు కొన్ని సాక్షమిస్తాయి. సోదర కవులు కాకినాడనుంచి యెవరో వారి ఆప్తులకు వ్రాసిన వుత్తరం అసత్యవాక్య పూరితం అని అసలు వారే వొప్పుకున్నట్లు నాఁటివారి తూష్ణీంభావమే వేనోళ్ల సాక్ష్యమిస్తూ వుండగా ముప్పై యేండ్లకు వీరు ఆవుత్తరమంతా సమర్థించడానికి పూనుకోవడంకన్న ఆశ్చర్య మేముంటుంది? వీరి విమర్శనమంతా యిదే విధంగా ప్రవర్తించింది. దానికి నేను సమాధానం చెప్పడముకంటె ఆ సీమలో ఆ కాలంలో వుండేవారిలో యిప్పటికి స్వర్గతులుకాగా మిగిలిన గ్రంథకర్తగారి బంధుగులే చెప్పఁగలరని వారికి బరాతం చెప్పడం యుక్తమని తోఁచింది. ఆ గ్రంథాన్ని మెచ్చినవారిని వీరు- "స్తోత్రపాఠకులు కొందఱు ఒళ్లెఱుంగని సివమన్నయట్లు గుడ్డలూడ్చి గంతులు వైచిరి... వీరేమి విశేషములు గాంచి యట్లయిరి. తి. వేం. కవులయందలి దురభిమానమువారి నట్లాడించినది..." అనినీచంగా దూషించి యున్నారు. కాబట్టి అట్టివారు వీరి కేమి బోధించినను అది దురభిమాన ప్రయుక్తమే కాబట్టి ఆ వుత్తరపుతత్త్వం వగయిరాలకు మాకునాఁడు ప్రతిపక్షులైనను ఇటీవల మిత్రులే అయిన సోదర కవులనే సాక్షులుగా చూపుచున్నాను. 116 పుటలలో బోలెడు శంకలుండునుగదా? అన్నిటికి యిదివఱలో నన్నయ్యను ఆదికవిగా పేర్కొన్నందుకు శంకించిన శంకకు వ్రాసినట్లే వ్రాస్తే చాలా పెరుగుతుంది. నిస్సారమైన ఆ యీశంకా సమాధానాలకు లోకం యేకొంచెమున్నూ సుముఖంగా వుండదు. అందుచేత యేపత్రికగాని పరిగ్రహించదు. యీకారణం చేతేగదా? విమర్శకుఁడుగారు తమశంకలను పృథక్కుగా ద్రవ్యము వ్యయించి అచ్చొత్తించుకోవలసి వచ్చింది. నేను కనక సరిపోయిందిగాని వీరుచేసిన అనుచిత ప్రసంగమునకు యితరులైతే యింతతో సరిపోదు. కాని యెన్ని అనుచితపు తిట్లు తిట్టినా విమర్శకుఁడు గారి వుద్దేశము తిట్టవలెననేదికాదనే నా అంతరాత్మకు తోస్తూవుంది. యేలాగో దేశానికి వచ్చిన కళంకాన్ని తొలగిద్దామనేదియ్యేవే. అందుచేత దీన్ని ప్రస్తుతం జర్మనీ లోనైన దేశాల్లోనేకాక మన దేశంలో కూడా సర్వత్రావ్యాప్తిలోవున్న దేశాభిమానం క్రింద జమ కట్టవలసి వుంటుంది. అన్నిటికి మూలం కవిత్వం వకటి సాఫుగా వుంది. యీగుణం నన్ను బాగా ఆకర్షించడం చేతనేనే యీయన్ని నేను సేల్జోడు సమర్పించి బహూకరింపఁదలఁచినాను. యితర విషయంలో పద్యం సాఫుగావ్రాయడమే శ్లాఘ్యం. అందులో పూర్వోత్తరపక్షాలు పద్యంలో సాఫుగా వ్రాయడం మఱీ శ్లాఘ్యం. అందుచే వీరు నాకు అభినందనీయులు. పయిగా కృతిప్రదాతలు. నాసమ్మానము ననాదరింపక దయచేసి త్వరలో సభాముఖమున స్వీకరింతురని విశ్వసించుచున్నాను.

★ ★ ★

# "శుభస్యశీఘ్రమ్"

అయ్యా! "సంధిమిచ్ఛంతి సాధవః" అనే లోకోక్తి ననుసరించి మీరునన్నెం తతూలనాడి, దూషించి, చెడతిట్టి వెగటుగాప్రవర్తించినప్పటికీ నాకది అపకారకం గాదనిన్నీ మీకే అది యెంతసవరించుకోవాలని ప్రయత్నించినా (భవతిహృదయదాహీ శల్యతుల్యో విపాకః) సవరణకాక బాధిస్తుందనిన్నీ ఆతొందర పాటును నేను లెక్కింపక మీతో సంధికిగా మనస్సా ప్రయత్నించి మీకు కవితా సామగ్రి సరియైనది లేశమున్నూ లేదని యెఱిగిన్నీ గణయతి ప్రాసలకూర్పు కొంతసాఫుగా వుండుటచే (బహుమానించడానికి యేదో మిష వుండాలికదా) నేను సంతోషించి మిమ్మల్ని సమ్మానించాలని త్రికరణశుద్ధిగా యేర్పరచుకొని యెంతో గౌరవంగా నిష్కపటంగా ఆహ్వానిస్తే మీరుదాన్ని అవమానకరంగా భావించి కావలిస్తే నేనే మీకు సమ్మానం చేయడానికి సిద్ధంగా వున్నాను. మావూరే రావలసిందంటూ వ్రాస్తారే? మీవ్రాత యుక్తిసహంగా వుందా? లేకపోయినా మీ కోరిక ప్రకారం రావడానికైతే సిద్ధపడతానుగాని మీరేమనుకొన్నారో? నేను బొత్తిగా దుర్బల స్థితిలోవున్నాను. సుమారు యేడెనిమిదియేళ్లనుండి నేను అతిమూత్ర వ్యాధితో అతిమాత్రంగా నలుగుతూన్నాను. అందులో వకసంవత్సరాన్నుంచి మఱీన్నీ, అందులో గతించిన వేసవి మొదలుకొని మఱీమఱీనిన్నీ, నేను వస్త్రధారణం కూడా బరువయి చేసికొనే శక్తి తగ్గి "కౌపీనవంతః ఖలుభాగ్యవంతః." అనేకృపణస్థితికి వచ్చి సంవత్సరన్నఱకన్న యెక్కువ కాలమే అయినది. ఇట్టి నన్ను ఆహ్వానించడానికి మాయింటికివచ్చి కొందఱు మాటదక్కదేమో? అని భయపడి మోమోటపెట్టక తిరిగి వెళ్లుచున్నారు. ఈ స్థితిలోనే చెన్నపట్టణంవఱకున్ను నన్ను బలవంతపెట్టి శ్రీతిరుమల శ్రీనివాసత్రిలింగపీఠంవారు నిరు డీరోజుల్లో తీసుకువెళ్లారు. భగవదనుగ్రహం తిన్నగావుండడంచేత వారికి అప్రతిష్ఠ లేకుండా మళ్లా యిల్లు చేరఁగలిగానుగాని చాలావ్యయం రాకపోకలకు వారికి తగిలింది. నిరిటి కన్ననూ మిక్కిలి తక్కువస్థితిలోవున్ననన్ను యీ మధ్య తెనాలివైశ్యులు ఆహ్వానించారు. బలవంతంమీద వెళ్లడమూ రావడమూ జరిగింది. అంతే కాని సభలో నాలుగుమాటలు మాటాడేనో? లేదో? నాకు బాగా తెలియదు. యిప్పటి నాతూకం యేబైపౌనులకన్న కొంచెం తక్కువలోనేవుంటుంది. యిట్టినన్ను కృతిప్రదాతృత్వద్వారా మామగారున్నూ, తద్వారా గురుపంచకంలోవారవడంచేత పరమపూజ్యులున్ను అయినమీరు మనుగుడుపునకో

అన్నట్లున్నూ "వీరభద్రపళ్లెమునకు హనుమత్పళ్లె" మన్నట్టున్నూ బలవంతంగా కాకపోయినా యేదో విధంగా వీడువాడు గదా? అనే పూర్ణ విశ్వాసంతో ఆహ్వానిస్తున్నారు. నాకు (కృతికన్యాభర్తృత్వద్వారా) అల్లునకు ప్రస్తుతస్థితినిబట్టి యిచ్చేబహుమానం "చంద్రుడికి నూలుపోగు" సామెత వుండనేవుంది కనుక (తావన్మాత్రమే) కౌపీనం యిచ్చినా నేనుసంతోషిస్తాను. సందేహపడనక్కఱలేదు. "శ్వశురాగారసమ్మానంసద్యోగృహ్ణాతి పండితః" కనక మీసత్కారాన్ని పొందడానికి నేను ఉవ్విళ్లూరుతున్నాను. నన్ను సత్కరించడానికి మీకు యెక్కువ వ్యయప్రయాసలు తగలవు గానిరాకపోకలకు అధమం నలభైయాభై రూపాయిలదాకా తగులుతాయనిన్నీ, ఆహేతువుచేత అది సాధుబాధగా పరిణమిస్తుందేమో? అనిన్నీ సంశయిస్తూన్నాను. తమకు అంగీకారమయితే యేలాగో బయలుదేఱి తమ సమ్మానాన్ని పొంది మీ గ్రామస్థులసందర్శనం చేదామని కుతూహలం యింతా అంతా కాదుసుమండీ! బోలెఁడువుంది. నా ప్రస్తుతస్థితినిబట్టి నాకు చేయవలసిన సదుపాయం అంతగా వ్యయప్రయాసలకు గుఱిఅయి వుండదు. ఉదయం 8 గంటలకులోగా వేడినీళ్ల స్నానం. అఱగిద్దెడు బియ్యపుసన్ననూకల పలచటిజావ. అఱసోలెడు మజ్జిగ (ఆవుదేనా సరే? గేదెదేనా సరే)– ఇంతే, మధ్యాహ్నం యేదో మీతోపాటు భోజనం, 3 1/2 గంటలకు సుమారున బార్లీగింజలజావ, రాత్రి మీతోపాటుగా కొంత ఆలస్యంగాకాక నల్లమందుకనక 7 గంటలకు భోజనం (ఇది ప్రధానం కాదు) నిమ్మకాయంత గోధుమపిండితో చేసిన చపాతీ, అఱసోలెడు ఆవుపాలు : బస్ ఇంతే. యీసదుపాయం యెవరికిగాని అంతగా భారంకాదనే నేను అనుకుంటాను. కాని యింతకంటె అధికమైన సదుపాయం కొన్నిచోట్ల మిక్కిలి చిక్కుగా వుండేది వకటివుంది. అది ఆవలీవలికివెళ్లే సదుపాయం. నాపడకగదికి పదిగజాలలో ఆ సదుపాయం కుదరాలి. (అవసర మవుతుందేమో అని యిట్లు కోరడంగాని యిది యెల్లప్పుడూ అవసరంకాదు. కాని మనిషికివున్నది పుష్టికదా) నాకువున్నవ్యాధి మూత్రవ్యాధి అని లోగడనే వ్రాశానుగదా. అది అప్పుడప్పుడు ప్రకోపిస్తూ వుంటుంది. ఇది వార్ధక్యాతిశయంచేత యిప్పుడు మఱింత లోకువచేసి తఱుచు ప్రకోపాన్ని చూపిస్తూవుందిగాని అసలు నన్ను యిది ఆశ్రయించేమో నలభై అయిదేళ్లు దాటవచ్చింది. యిది కల్పితమని తమరభిప్రాయపడి విమర్శనకు వుపక్రమిస్తారేమో? గ్రంథస్థంగావున్న యీకింది పద్యాలు చిత్తగించండని ప్రార్థిస్తాను.

"మ. పదిగా దిర్వది గాద యీరుజ ననున్ బాధింపఁగాఁ జొచ్చి న
ల్వదిపై నాలుగుదాఁటె వత్సరము; లీపాపిష్ఠరోగాన కే
నెద నొక్కించుక చోటొసంగియసుమా? యెట్లెట్లొ వర్తింతు నేఁ
డిది నాకున్ భరియింప రాద యిఁక నీవే దిక్కు కామేశ్వరీ"

యిక్కడ విమర్శించే వారికి కొంత అవకాశం వుంది. అదేమిటంటే? మొదట నల్వదియైదేళ్లంటూ వ్రాశావేమి? పద్యంలో "నల్వది పైనాలుగు అనిమాత్రమే వుందికదా? పరస్పరవిభేదంగాలేదా! అని శంకించేవారికి సమాధానం వినండి. యిప్పటికి సుమారు సంవత్సరం తొమ్మిదిమాసాల క్రితం యీవ్యాధినితట్టుకొనేశక్తి బొత్తిగాలేని దౌర్బల్యం యేర్పడింది. అప్పుడు చెప్పినది యీపద్యం. అందుచేత యిప్పటికీ, అప్పటికీ మధ్యవున్నకాలం కొంత అందులో చేరవలసిరాక ఆ వ్యత్యాసం కలిగిందని మనవిచేస్తాను. అయితే యిదిన్నీ వకశంకేనా? దీనికి సమాధానం యెందుకని తాము కాకపోయినా మఱెవరేనా శంకిస్తారేమో, యెవరో అక్కఱలేదు. దేవరవారే యిట్టిశంకలు చేసేవారిలో అగ్రగణ్యులనే సంగతి యీవ్యాసంలోనే అవకాశంవుంటే కొంత లోకానికి ఋజువుచేస్తాను. అందుకే అనుకుంటాను నేను గతంలో కొన్నాళ్లక్రితమే గతించవలసివుండిన్నీ ఆగవలసి వచ్చిందని తోస్తూవుంది. తక్కినశంక లేలావున్నా "దాఁటెను" అన్నచోట మీశంక తప్పదుగదా? "దాఁటెను నన్నయ" అన్నది, "తప్పెను నన్నయ" అని దిద్దుకున్నట్లు వ్రాసివున్నారు. అది పుస్తకంచూడకుండా వ్రాయడంచేత కలిగిన మార్పుగాని నాదిద్దుబాటుకాదని విజ్ఞప్తి. మీరు భ్రమపడినారు. మీరనుకొన్నదోషం దాఁటులోలేదు. ప్రసక్తికలిగింది కనక యింకొక పద్యంకూడా ఆఘట్టంలోదే వుదాహరించి మఱీ ప్రస్తుతం అందుకుంటాను.

"మ. ఇదియే బందరునందు నిల్పె నను నెన్నేనేళ్లు సంపన్నుఁగా
నిదియే సల్పె ననేకశిష్యులకుఁ దా నీరోగమే యొజ్జగాఁ
బొదలించెన్ ధ్రువ మేను దీనిభయముం బోనెట్టఁగానెంచి నె
మ్మదిగా నొక్కట నిల్చితిన్ నిజము సుమ్మా! తల్లి! కామేశ్వరీ."

సరే! ప్రసక్తివచ్చి మఱోపద్యం చదువర్లవినోదార్థం వుదాహరిస్తే యిది విమర్శకాగ్రేసరులైన తమవంటివారికి పెక్కుశంకలు కలిగించేదిగా పరిణమించిందే. కాగతిః అవును తప్పేమీ? రోగమేమిటి? అన్ని వుపకారాలు చేయడమేమిటి? యిది ప్రష్టవ్యాంశం కాకపోతుందా? అయ్యా తెలియక అడుగుతాను. యివన్నీ శంకలేనా అని మిమ్మెవ్వరూ మందలించనే లేదేమండి – ఆశ్చర్యం. అందుచేత యేదోజవాబుచెప్పే తీరవలసిందేనా? అంతే వినండి. అడిగేవాడికట! చెప్పేవాడట! లోకువట! అంతేనేకాని యివన్నీ పూర్వపక్షాలే అవుతాయా? శాంతం పాపం. యీపద్యచరిత్ర చెప్పవలసివస్తే అధమం రెండువందల ఫారాలేనా గ్రంథం పెరుగుతుంది. పత్రికాప్రవర్తకులు శ్రీయుతులు వెంకటేశ్వరశాస్త్రుల్లుగారు విసుక్కోకుండా ప్రకటిస్తారా? అని కూడా సందేహం. వారు నాకు యెన్నో వత్సరాలనుంచి

పత్రిక గౌరవార్థం పంపిస్తూన్నారుగాని, యెప్పుడు గాని వొకమంచివ్యాసం విపులమయినది వారిపత్రికకు నేను పంపించిన పాపాన్ని పోలేదని లజ్జిస్తూ వుంటాను. అయితే సుమారు సంవత్సరానికి పూర్వం కొన్నివేలకాలాలుదాకా వ్యాసాలు వ్రాసివున్నాను. అప్పుడేనో కొన్ని వ్యాసాలు వారిపత్రికకి పంపిస్తే యీలజ్జించడానికి అవకాశమే లేకపోయేది కాని ఆ పత్రికలకున్నంత వ్యాప్తి దీనికి లేదనుకొని నే నాకాస్త పనీ చేయలేకపోయాను, ప్రస్తుతం గుం॥ డి॥ విమర్శకుఁడుగారు నా "నన్నయ్యభట్టు" వ్యాసానికి జవాబుగా యిచ్చే "సంశయవిచ్ఛేదావచ్ఛేద ప్రచ్ఛేదోపచ్ఛాద" వ్యాసం నా "నన్నయ్యభట్టు" వ్యాసంలో వీరివిమర్శక గ్రంథాన్నుంచి యెత్తిచూపిన ముప్పయివక్క దూషణవాక్యాలన్నీ బాగా చూచివుండడంచేతకాఁబోలు వీరివ్యాసాన్ని "తోసిరా" అన్నారు. దానిచేత ఆసందర్భం యేమీ యెఱగని త్రిలింగకదివచ్చింది. వస్తేమాత్రం ప్రాజ్ఞులు వేంకటేశ్వరశాస్త్రుల్లుగారు వ్యాసకర్తగార్ని తిట్లు "పదియవనాఁటిముత్తైదువు" లోనైనవిన్నీ, హాస్తోక్తులు ద్రావిడ స్త్రీలకుచాలు లోనైనవిన్నీ (నేనుయెత్తిచూపినవి) చూచేవుంటే కృష్ణవారుచేసినట్టే చేసేవారుకాని అవి వారెఱుగనేయెఱుగరని పూర్తిగా విశ్వసిస్తూ వారికి నేనొక చిన్నవిజ్ఞప్తికూడా పనిలోపనిగా అందించుకుంటూవున్నాను. అయ్యా! నన్ను సంవత్సరంనాడు త్రిలింగపీఠంవారి సమ్మానసభలో మీరు చూచివున్నారు. నాకోరికమీద- "చరకసంహితను" కూడా నాకు మీరు యిచ్చివున్నారు. జ్ఞాపకం వుందా? అప్పటి నాశరీరస్థితి యెంత శోచ్యస్థితిలోవుందో! మీకు నేను వ్యాఖ్యానం చేయనక్కఱలేదు. యిది నానాటికి పోయేకాలంగాని, వచ్చేకాలం గాదుకదా? అందుచేత అప్పటికంటే యిప్పుడు యెంత కృశించివుంటానో వేఱే వ్రాయనక్కఱవుంటుందా? వుండదు. ఇట్టిస్థితిలో- "తిరుపతి వేంకటకవుల గ్రంథవిమర్శనం" అనే పేరుతో యెన్నో బండబూతులు (మనుష్యులలో యెవరో తప్ప నోట వచింపరానివిన్నీ, వినరానివిన్నీ) తిట్టిన యీ గుం॥ డి॥ విమర్శకుఁడుగారు యింకా యేమో తారతమ్యశూన్యంగా వ్రాసే చేతగానివ్రాతకు అవకాశం యిచ్చి నాకుపనికల్పించడంలో (ఆయీతత్త్వం యెరక్కే అనుకుందాం) మీరు భాగస్వాములయినందుకు నేను మిక్కిలీ విచారిస్తూన్నాను. యీయన తిట్టినతిట్లు మళ్లా యిక్కడ నేను అనువదిస్తే గ్రంథం చాలా పెరుగుతుంది. ఆతిట్లను చూచేవుంటే యీమధ్య వీరిసన్మానానికి ప్రసిడెంటుగా వీరివూళ్లోనే జరిగినసభకు వచ్చిన పండితులు మెల్లగా తప్పుకునేవారే అని ఖండితంగా నొక్కిచెపుతున్నాను. శ్రీశిష్లావారు (పేరు జ్ఞాపకంలేదు) ఈయన మాగ్రంథాలమీద చేసినవిమర్శనకు నేను మెచ్చుకున్నాననంటూకూడా వుటంకించి యీయన్ని ప్రశంసించారు. యుక్తంగావుంటే నేను ప్రశంసించేస్వభావం కలవాణ్ణో కానో? "గిడుగా? పిడుగా" వగయిరా నావ్యాసాలెఱిగివున్న మీబోట్లకు వేఱేవ్రాయనక్కఱవుండదు. రామ! రామ! ఈయన వ్రాసిన

డెమ్మీసైజు 116 పుటలలోనూ మచ్చుకేనా వకటిన్నీ యుక్తమయింది లేనేలేదు. చూడండీ మచ్చుకు వకటి చూపుతాను.

"నీవు మీసం పెంచావుగదా కవిత్వానికంటూ? మీ తిరుపతి శాస్త్రి యెందుకు పెంచాఁడు కాఁడూ?"

అనేది అందులో ఒక పూర్వపక్షం చూడండీ, దీన్ని గుఱించి యెంత వ్రాయాలోను. అసలు యీమీసం పెంచడం గొడవ యెందుకు వచ్చిందో చెప్పాలా? ఆత్మకూరు సంస్థానంలో మా దేవీభాగవతం వినిపిస్తూవుండఁగా ఆ సంస్థాన విద్వాంసులు, మహాపండితులు శ్రీనివాసాచార్లుగారు– "నాపలుకాలకింపుమ అనంత! గుణాలయనైన యట్టి" అనే పద్యంలో – గుణాలయ లక్ష్మి అనే ప్రయోగము యెట్లాసాధువు అని ప్రశ్నించారు. యేదో సమాధానం చెప్పాము. తృప్తిపడ్డారు కారు. దానిమీఁద క్రమంగా ఘర్షణ పెరిగింది. భారతం వుదాహరణంగా చూపుతామన్నాం. చూపండిగాని భారతం అంతా మేమంగీకరించే వాళ్లంకాం. నన్నయ్యభట్టుగారి కవిత్వంలోనే చూపాలన్నారు వారు; అందుకైతే మేం అంగీకరించలేదుగాని (ఓహో గ్రంథం పెరిగిపోతూవుందే! యేంచేసేది? తీఁగతీస్తే డొంక కదులుతూ వుంది కాఁబోలు) సాధ్యమైనంతవఱకు నన్నయ్యగారి ప్రయోగాన్నే చూపలేకపోతామా? (యెప్పుడూ అభ్యుపగమ్యవాదం జిగీషువులకు వుపకరిస్తుందని నా మతం.) అనే ధీమాకుతో వున్నాం. మర్నాడు నన్నయ్య గారిదే– "దేవతలు ధర్మవర్తులు" అనేది యిచ్చాం. కొంపమీఁదికి వచ్చింది వారికి. దానితో మెసలడానికి వీలులేక "ధర్మవృత్తులు" అని దిద్దుతామంటూ పిడివాదం పుంతలోకి దిగారు వారు. (ఎందుచేత ప్రతివాదులకు మెసలడానికి వీలిచ్చిందికాదో? వ్రాయవలసివస్తే మఱీ గ్రంథం పెరుగుతుంది. పైగా సామాన్యులకు బోధించదుకూడాను.) దానిమీఁద జరుగుతూవున్న ఘర్షణలో వారు మా యుక్తిమీఁద పైయుక్తి తోఁచక రాజుగారితోటి "మహాప్రభూ! వీరు లౌక్యులు. బాగా మాట్లాడతారు. లౌక్యులైనందుకు ఆ బాఱమీసాలే గుఱుతు చిత్తగించండి" అన్నారు. మీసాలు ఆకాలంలో వైదికానికి చాలా ఆక్షేపణీయాలని వ్రాయాలా? అక్కఱలేదు. దానిమీఁద నేనన్నానుగదా? యీ మీసాలు లౌకికరీత్యా పెట్టుకున్నవికావండి. మేమూ వైదికులమే. అతఁడు వెల్నాఁటి. నేను ఆరామద్రావిణ్ణి. అయితే మీసాలెందుకు పెట్టుకున్నామంటే? యిందుకు అని అంతా సుప్రసిద్ధంగా చదువుకుంటూ వుండే మాతాలూకు "దోసమటంచెఱింగియును" అనే పద్యాన్ని ఆవేశంతో చదివేను. ఆపద్యరచన నాఁటికి మా వయస్సు 28 యేండ్లు. దాదాపు ఆయీవయోనిర్ణయం నానారాజసందర్శనంలో వున్న "తే. కుజుఁడు భూకారకుండఁట?" అనే పద్యం

(ఆసంస్థానంలో చెప్పిందే) చదువుకొని పిమ్మట జాతకచర్యలో ఉండే జననకాలదశాశేషం పరిగ్రహించి జననం మొదలుకొని లెక్కపెట్టుకుంటే లెక్కలలో చాలా ప్రజ్ఞవున్న గుం॥ డి॥ విమర్శకుఁడుగారికి క్షణంలో తెలుస్తుంది. నాకన్న తిరుపతిశాస్త్రి సంవత్సరం యేడు మాసాలు కాఁబోలును చిన్న. యెందుకీసోదె? యెవరుసంతోషించింది? చెప్పండి? అయితే యేంచేతును. ఈ పనికిమాలినపని ఆయన కల్పనచేశారు, వృథాగా పత్రిక నిండుతూంది. "కాకస్య కతివా దంతాః" చెప్పొచ్చేదేమిటంటే! యిది జరిగి యిప్పటికి 42 యేండ్లు దాటవచ్చింది. అప్పుడు నాకుమాత్రమే మీసంవున్నట్టున్నూ, తిరపతయ్యకి లేనట్టున్నూ విమర్శకుఁడుగారు అభిప్రాయపడి ప్రశ్నిస్తారే? ఆసందర్భం వీరికేలా తెలిసింది? మాయిద్దఱికీ కూడా వుండఁబట్టే మీసం "పెంచినార మీమీసము" అనడం తటస్థించింది. భవతు. విమర్శకుఁడుగారివూహే సమంజసం అనుకుందాం. యిన్నాళ్లదాఁకా యీ శంకకు అవకాశం లేకపోతుందా? పాండిత్యంలో మన విమర్శకుఁడుగారివంటి పరిజ్ఞానం లేకపోవచ్చుఁగాని ఆ రాజుగారికి వొక్కరికే మీసం వుందనిన్నీ, రెండోవారికి లేదనిన్నీ అట్టి సందర్భంలో "పెంచినారము" అని చెప్పడం పొసఁగదు కనక పృచ్ఛచేదామనేనా? అనుకోరా? వారల్లా వుండఁగా "మాట్లాడితే మారామేకు"లన్నట్లు గొంతుకపట్టి నొక్కి యేలాగేనా సంస్థానాన్నుంచి పాఱదోలుదామనే దురుద్దేశంతో వున్న ఆ పండితులు వూరుకుంటారా? వారెందుకూరుకున్నారంటే? అసలు శంకకవకాశమే లేదుకనకనే యింకేముంది?- "గజం మిథ్య పలాయనం మిథ్య." వినండి భూతార్థాన్ని అప్పుడేకాదు మఱికొంతకాలందాకా యిద్దఱికీ కూడా పూర్తిగానే (కత్తిరిమీసాలు కావు) మీసాలు వుండేవి. (మెలిఁబెట్టివిడిచిన మీసాలపై గొప్ప నిమ్మకాయలు రెండు నిలుపవచ్చు) అయితే అతనివి అంతగఱిబోజా మీసాలుకావు. వకమాదిరివి. నావో? బాగా శివాజీ మీసాలలాగు వుండేవి. ఆ మీసంతో వున్న నా ఫోటో బందరులో ప్రైవేటు డాక్టరు శేషగిరిరావువద్ద వకటి వుంటే వుండవచ్చు ననుకుంటాను. (ఎందుకీసోదె యిదేం ప్రశ్న? యేం జవాబు. యీలాటి చొప్పదంటు శంకలుచేసి పైఁగా అమంగళాశ్లీలపు బండబూతులు తిట్టి అందుకు నేను యేమీ అనక కాస్తయతిప్రాసల కూర్పున్నూ ధారాబాగుందని సేల్జోడుబహుమతీ చేయదలచుకుంటె దాన్ని పరిగ్రహించడం అవమానంగా భావించి యేదో చెత్తయిలాటిదే వ్రాసి కయ్యిం పెంచేవారికి తమ పత్రిక తోడ్పడిందని వ్రాయబోతే గ్రంథం పెరుగుతూవుంది కదా? పెరిగితే చింతలేదు. యీ వ్రాతకూడా చెత్త వ్రాతే అవుతూ వుందికదా? చెత్తకి చెత్తేకాక మఱివకటి వస్తుందా? రాదుకదా? అవుతే మంచిదే. యేంచేసేది) విమర్శకుఁడిగారికి అవసరమైతే ఆతనిపేర వ్రాసి తెలుసుకోవచ్చును. ఈయన తిట్టినతిట్లు యెంత గర్హణీయాలో తమకే తెలుస్తుంది. ఆపత్రిక తాము చిత్తగించలేదనే నావిశ్వాసం.

యిప్పుడు అది తాము చూచామని నాకు ప్రత్యుత్తరం వ్రాసేదాకా పూర్తినిద్దురేపట్టదు. ఆపత్రికల తేదీలు ప్రకృతం విమర్శకుఁడుగారు మీ పత్రికలో వ్రాస్తూవున్న "సంశయావచ్ఛేదకావచ్ఛిన్నం"లో వుదాహరించే వున్నారు (నాకు కలిగిన సంశయ మేమిటో? విమర్శకుఁడుగారు ఛేదించేదేమిటో? నాకు బోధపడడంలేదు. అంత ప్రజ్ఞాశాలులేమి, కావచ్చు). ఆ తేదీలుగల పత్రికలు పంపవలసిందంటే కృష్ణాపత్రికవారు తమకు పంపకపోరు. లేదా? నావద్ద వకటే ప్రతివుంది. దాన్నే పంపవలసిందంటే పంపుతాను. లేదా విమర్శకుఁడుగారు అలాటితిట్లను వుపయోగించిన "తిరుపతివేంకట కవుల గ్రంథవిమర్శనం" అనే (రు 1-0-0 వెలగల) గ్రంథాన్ని తమకు పంపవలసిందంటే పంపకపోరని తలుస్తాను. ఇందులో యేదో వక పనిచేసి తాము ఆతిట్లు చూడాలి. అయితే ఆయన్ని మీరెప్పుడేనా యేపల్లెత్తు మాటేనా అన్నారేమో? అందుచేత ఆయనికి మిమ్మల్ని ఆలా (కృతేతు ప్రతి కర్తవ్యం) గాఢంగా తిట్టి బుద్ధి చెప్పవలసివచ్చిందంటారేమో? రామ రామా! ఆయనకీ మాకూ యెన్నడూ యేవిధమైన సంబంధమూలేదు. వొకరిమొగం వకరం చూచి యెఱుగం. (అయమయమితి ప్రత్యభిజ్ఞగా) యెఱుగనే యెఱుగం. రెండేళ్లనాడు కాఁబోలు "గ్రామం గచ్ఛన్ తృణం స్పృశతి"గా మావూరు వచ్చి నన్ను చూచినట్లు వీరిస్నేహితులు నాపేర యిటీవల వ్రాశారు. యీ తిట్లు చాలాకాలంనాఁటివి. కాఁబట్టి యిది నిష్కారణవైరం. "పండితా పండితానాం" అంటూయేకరువు పెట్టివున్నారు అభియుక్తులు. ఆయనమహాపండితులు. ఆకారణంచేత తరపేక్షయా శుంఠతావచ్ఛేదక కోటిలో పరిగణింపవలసిన మేము ద్వేష్యులం కావలసి వచ్చిందేమో? ఆ తిట్లు చూచి తాము వారిని ప్రశ్నిస్తే వారే తమకు తోఁచిన సమాధానం సెలవిస్తారు. మిమ్మల్ని యెందుకు యింత నిర్బంధిస్తానంటే? పత్రికా సంపాదకులకు వ్యాసకర్తల తత్త్వం తెలియడంకూడా అవసరమనియేను. చిరకాలాన్నుంచి నాకున్నూ, మీకున్నూ పరిచయంవుందికాని- "ఎన్నఁడు నినుఁ బెట్టుమనుచు నీంద్రము సేయన్" అన్నాడు భాగవతంలో. యెప్పుడూ మిమ్మల్ని యేమీ నేను స్వార్థంకోరలేదు. యిప్పుడు కోరుతూ వున్నాను. తీరిస్తే యీకోరిక తీర్చండి. లేదా? చింతలేదు. యాచ్న గదా!

"అవమానం పురస్కృత్య మానం కృత్వాతు పృష్ఠతః" అన్నారు అభియుక్తులు (మీరూ, మీరూ యేవో కలహాలు పెట్టుకుంటూ వుంటే మేమూ మేమూ కలిగించుకుంటూ వుంటామా? అంటారనిన్నీ యెఱుగుదును. యీ కలహం నిష్కారణంగా తిట్టడంగదా). నాకు తమసహాయమల్లా వ్రాయక వ్రాయక "జన్మానికల్లా శివరాత్రి"గా మీ పత్రికకు వ్రాస్తూ వున్న నా దీర్ఘ వ్యాసాలు (ప్రస్తుతానికి సంబంధించినవి మాత్రమే) మీ పత్రికలో జాగ్రత్తగా ప్రచురించడమే కావలసింది. వుండడం ప్రాయోపవేశావస్థలోవున్నా, బుద్ధి యింకా

అంతో యింతో ప్రసరింపచేస్తూనే వుంది భగవతి. బహుశః విస్తారంగా మీ పత్రికకు పని కల్పనకాదే అనుకుంటాను. ఆ బ్రాహ్మడు తిట్టినతిట్లకు తగినంత సమర్థనం ఆయన చూపడమంటూ వుండదు. అలా చూపడమే తటస్థిస్తే "వింధ్యః ప్లవే త్సాగరే". ఆపద్ధతిని అంతతో "భాషామంజరీ సమాప్తా" కావలసే వస్తుందిగదా? ఆయనికి నామీద వున్న కోపానికి పరిమితే కనపడదు. నామీద కోపం అంతతో ఆగక నన్నయ్యమీదికికూడా ప్రసరించింది. నాకేమో? నన్నయ్య సమాస గ్రథనఫక్కి భారతకవులు తక్కిన యిద్దఱిలోనే కాదు యిటీవలకవులలో గూడా మృగ్యమని వక అభిప్రాయంవుంది. యిది తప్పుటభిప్రాయమైనా కావచ్చును. దీనికోసమే అయితే అన్నితిట్లు "దశాహం (దిక్కుమాలిన దశాహం) నాఁడు గొఱిగించుకొన్న ముత్తైదువు"నఁట నేను. యేమి కర్మం. పాపం ఆబ్రాహ్మడికి యీలాటి సదూహ కలిగింది? వకవేళ మేము యెప్పుడేనా ఆయన్ని యేమేనా అనేవున్నామేమో? మఱచినామేమో? అంటే పాపం, ఆగ్రంథంలో ఆలాటి అభూతంగా వుండేకల్పన యేమీ చేసినట్టులేదు. దీనికి ఆయన్ని అభినందించవలసివుంది. మా మొదటి తప్పల్లా ఆయన పట్టుకున్నతప్పు-

"క. ఎన్ని పురాణమ్ములఁ దా
మన్నిటి నాంధ్రీకరించి అనుకంపన్ గా
కున్నన్ దీనిన్ విడుతురె?
నన్నయభట్టాది కవిజనంబులు మాకున్."

అనే పద్యంలో "నన్నయభట్టాది" అనేపదం దగ్గిఱే వుంది. నన్నయభట్టు భారతం వ్రాస్తూ వ్రాస్తూ అరణ్యపర్వం ముగియకుండానే చచ్చుకున్నాడు గదా? అట్టిస్థితిలో అతణ్ణి అంత గొప్పచేసి యెత్తుకోవడం యెందుకు? ఇదంతా వెంకటశాస్త్రి దురభిమాన ప్రయుక్తంగాని వేఱుకాదు. (యింతతో సరిపెడితే చింతలేదు. దశాహంనాటి ముత్తైదువులెందుకో? మీబోట్లు కనుక్కోవాలి) అంటూ తిట్లకు వుపక్రమించడంచూస్తే శోచ్యావస్థలోవున్న ఆ వ్రాతకు ఆశ్చర్యమేకాదు. విచారంకూడా కలుగుతుంది. యెందుకు విచారం నన్నుతిట్టినందుకనుకుంటూ వున్నారా? అలా మీరు అనుకోనూ అనుకోరు. అందుకు నేను అలా వ్రాయనూలేదు. నాకు 70 వత్సరాల వయస్సుగాని ఆయనకు 76 వత్సరాల వయస్సని వారివూరి బ్రాహ్మడే వకాయన యీ మధ్య తెనాలి రైలులో నాకు కనపడి చెప్పివున్నాడు. ఆయీ విమర్శన గ్రంథం (బూతులబుంగ) అచ్చై వకసంవత్సరం లోపు కనక దీని ప్రచురణం 75 వత్సరాల ప్రాయంలో జరిగివుండాలి. యేమీ చదువుకోని వాళ్లక్కూడా వృద్ధత్వం కొంత వివేకాన్ని కలిగిస్తూందంటారు. యీయన సాక్షులు గదా?

పైగా భగవదనుగ్రహం బాగావుంటే కొలదివత్సరాలలో విమర్శకుడుగారు సహస్రమాసజీవులు పొందదగ్గ బిరుదం, భగవత్స్వరూపులు అనేది నిన్ననేడు వారివారి సభ్యులు మమ్ము కసిదీర తిట్టి ప్రచురించిన గ్రంథరచనాన్ని కూడా యితర సంశయవిచ్ఛేదాలతో సంపుటీకరించి యిచ్చిన "1. కవిశేఖర, 2. అభినవతిక్కయజ్వ" లోనైన బిరుదావళితోసహాధరించే మంచిసమయం రాబోతుంది అట్టి భవిష్యద్భగవదవతార మూర్తుల చేతితోనేనా "దశాహంనాఁడు గొఱిగించుకొన్న ముత్తైదువు"లు అసకృదావృత్తిగా చిత్రించఁ బడవలసిందంటాను? యింతకు వెంకటశాస్త్రిగాఁడు ఆ అవతారమూర్తులపట్ల చేసిన అపచారం యేమిటో? నన్నయ్యను పురాణాలు తెలిగించినవారిలో చేర్చి గౌరవించడంకన్న అపచారం యేమి కావాలి? ఆయీ తిట్లేకాదు. శంకలుకూడా తిట్లలాగే వుంటాయి. వుంటాయేమిటి వున్నాయి. శంకలేతిట్లు, తిట్టులే శంకలు. శ్లో. "త్వమేవాహం త్వమేవాహం" "ముత్తైదు" వల్లా వుండఁగా, పంద, వెంగలి, ఎట్సెట్రాలు, చూపేదేమిటి? "ఇట్టి రోఁతలకు మెచ్చు సూరులను నిన్ను ననియతాత్మ జేసినవిధి నందుఁగాక," అని విమర్శకులు వ్రాసిన పరితాపవాక్యాన్ని చూచికూడా శ్రీశిష్టాశాస్త్రులవారు నాకుప్రష్టవ్యులైనారు. తి. వెం. కవులు తమమీఁద వీరు వ్రాసిన విమర్శనాన్ని మెచ్చుకొన్నట్లు వుటంకించి వీరిని ప్రశంస చేశారు. వీరు యిలా అనడానికి వారికి ఆధారం ఏమిటోకదా! నేను నన్నయ్య వ్యాసంలో వీరి కవితాధారను అభినందనీయమని అన్నాను. దానికే సేల్జోడు బహుమతి అన్నాను. విమర్శనం అద్ధాన్నమే అని వ్యంగ్యంగా కాదు వాచ్యంగానే అన్నాను. అంతకు మున్ను వీరిస్నేహితులకు వ్రాసిన కార్డులో వీరిభారత సంశయ విచ్ఛేదాన్ని అర్ధజరతీన్యాయంగా, అభివంతనీయమన్నట్టు కొంత తేలుతుంది అంతే. విమర్శన గ్రంథాన్ని అభినంద్యంగా వ్రాయలేదే? అట్టిస్థితిలో శ్రీ శిష్టాశాస్త్రులు వారు నేనభినందించినట్టివారి (విమర్శకుడుగారికి సంబంధించిన) పొగడ్తలో ఆమాట యేలా వుటంకించి వున్నారు? అని నాకు సందేహం. యీ సందేహము తీర్చతగ్గదే అయి వారిని అడగడానికి తగ్గంత అర్హత నాకువున్నట్టు వారి చిత్తానికితోస్తే వారు నాకేదో ప్రత్యుత్తరాన్ని అనుగ్రహించనే అనుగ్రహిస్తారు. లేదా? అప్పుడు అంతపాటి అర్హత నాకులేదు కాఁబోలును అని నాలో నేనే లజ్జించి తలవంచుకుంటాను (వారు యేదేనా వ్రాయదలఁచుకుంటే పత్రికలో వ్రాయాలిగాని నాకు వుత్తరం వ్రాయరాదు). యిది బొత్తిగా అసంబద్ధంగా వుందిగాని మావిమర్శకుఁడుగారికి వారివూరి (ధూళిపూడి) వారు సమర్పించిన స్వాగతంలో వుటంకించిన అక్కరముల ధోరణి కడుంగడుఁ జక్కఁగా నున్నది. వుదాహరించి చూపుదునా. "విమర్శకాగ్రణీ! విమర్శచేయుపట్ల మీకలము ఖడ్గమునకే యుద్ధి దానిని ఝుళిపించి కవిసింహములగు తిరుపతి కవులనే తాఁకితిరి" ఈ వాక్యమెంతో సమంజసముగా నున్నది.

మేము వారి విమర్శనము నభినందించినట్లిందు లేశమును లేదు. ఇది చరిత్రకుపకరించు ధోరణి, యీ వ్రాతనేగాక వ్రాసిన వారింగూడ నే నభినందించుచున్నాను. శిష్టా వారివాక్యమునకే నాకు సమన్వయము కుదురకున్నది. వారి వాక్యము కూడా వుదాహరిస్తే బాగుండునుగాని ఆ పత్రిక యిప్పుడెక్కడుందో వెతకాలి. నేను దాన్ని బెజవాడలో కాఁబోలును చదివినాను. అయితే శిష్టావారి ఉద్దేశమందేమేనా దోషముండి అట్లనియుందురా! శివ! శివా! అదికేవల మపోహ. విమర్శకుఁడుగారి గౌరవార్థము వారట్లుటంకించి యుందురు. అంతేకాని విమర్శకుఁడుగారు ఆసమయంలోనేమి? లోఁగడ వుదాహరించిన స్వాగతము నందలి వాక్యశ్రవణ సమయంలో నేమి? కొంత కలగఁజేసికొని తి. వెం. కవులద్వారా నాకు గౌరవం రావడమేమిటి? "యిది నాకు బొత్తిగా అవమానంగా వుండే పద్ధతి" వారు శుద్ధతెల్వితక్కువవారు. పనికిమాలిన వ్రాఁతలు వ్రాయువారు, అందుచేత తద్వారా నా గౌరవాన్ని ప్రకటించడం నాకు బొత్తిగా యిష్టంలేదని చెప్పవలసింది. ప్రస్తుతం వ్రాస్తూవున్న "సంశయవిచ్ఛేద" వ్యాసం చాలాభాగం జాగ్రత్తగానే విమర్శకుఁడుగారు వ్రాస్తూన్నారు కాని కొద్దిగా తొందరపాటు మాటలు యిందులోనూ లేకపోలేదు. చూడండి యీవాక్యాన్ని

"అట్లు కాదేని శాస్త్రి (వెం. శా.) గారి తెల్వితక్కువ యనవలసివచ్చును."

యిప్పటి వ్యాసంలో యింతకు మించిన తుందుడుకు మాటలున్నట్టులేదు. యిది స్థూలదృష్టిని వ్రాసినమాట. యీ వ్యాసంలో పూర్వం నాకెప్పుడు పెట్టని "గార్లూ, బూర్లూ" కూడ పెట్టడమేకాక, నాపేరుకు మొదట శ్రీకూడా తగల్చడాన్ని గూర్చి నేను వాటి సమన్వయాన్ని యీ విధంగా చేసుకుంటూవున్నాను. యేలాగంటే తిట్లుతిట్టి వ్రాసేగ్రంథరచన నాఁటికి విమర్శకుఁడుగారికిన్నీ, నాకున్నూ యేవిధమైన సంబంధ బాంధవ్యాలున్నూ యేర్పాటు కాలేదుకనక ఆలా నిరాఘాటంగా చేతికి వచ్చినట్లల్లా యేకవచనపు వషట్కారాలతో తిట్టఁగలిగారనిన్నీ, యిటీవల కృతియివ్వడం ద్వారా నేను శ్రీ తిక్కన సోమయాజిగారి "క. నే నిన్ను మామయనియెద దానికిఁ గాఁ గావ్యకన్య" అనే పద్యం చొప్పున అల్లుణ్ణి అవడం తటస్థించడంచేత 70యేళ్ల బాలప్రాయంలోవున్న అల్లుణ్ణి మన్నిస్తేగాని బాగుండదని "గార్లు" పెట్టి విందుచేశారని సమన్వయించుకున్నాను. అయితే ఆబ్దికంలో భోక్తలికిపెట్టే పిండివంట గార్లేమిటి? మంగళప్రదమైనపిండివంటలు యేబొబ్బట్లో పెడితే యుక్తంగా యుండేవి, అని కొందఱనుకోవచ్చుగాని "దశాహం ముత్తైదువుగా" నన్ను పేర్కొనడమే కాకుండా యింకోపద్యంలో "క. ఇద్దఱు భోక్తల కెక్కువె? తద్దినము" అంటూ మా సీమ గ్రంథంలోవున్న – "ఒకరి పెండిలిలో" అనే పద్యంలో వున్న శుభప్రదమైన

వాక్యాన్ని - "ముద్దు గుడవరా ముది పెండ్లికొడకా" అన్న సామెతగా ప్రాసకుదిరింది కదా? అని తద్దినంగా అపవదించి అమంగళాశ్లీలాలు వెలార్చిన మాకృతి కన్యాప్రదాతలుం గారు యింకా ఆ వాసనసోకే అనుకుంటాను యీ ఆబ్దికపు పిండివంట (గార్లు) నాకు అనుగ్రహించి వుంటారని వూహిస్తాను. నాకు యిప్పటి పెండ్లి (కృతికన్యాపరిణయం) మూఁడోదో? నాలుగోదో? అవుతుంది. తక్కిన భార్యలు తిట్టుమోతులుగారుగాని, యీనాల్గో భార్య బాగా గయ్యాళిన్నీ, తిట్టుమోతున్నూ దొరికింది. వార్ధక్యం దీనితో గడపాలి. శాంతం పాపం! మొట్టమొదటి పెళ్లికి పిల్లనిచ్చిన అత్తవారింట కూడా అదేంకర్మమో? నాకు మా అత్తగారు (ఢీరు నమ్ముతారో, నమ్మరో?) గార్ల పిండివంటతోనే విందు చేసేవారు. అది మీకు ఇప్పటికి యేలాజ్ఞాపకం వుందంటారేమో? నాధారణయెటింగినవారున్నూ, ఆ మధ్య నేను వ్రాసిన దీర్ఘవ్యాసాలు చదివినవారున్నూ యీప్రశ్న వేయరు. నాకు మూఁడో సంవత్సరములో నా తరువాత పుట్టి - మొన్న పురుట్లో వోయిన "ప్రబుద్ధుఁడు" అనే పద్యార్థానికి లక్ష్యమైన మాతమ్ముడు పురుడు సహా యిప్పటికింకా తూ.చా.తప్పకుండా జ్ఞాపకం. అతిశయోక్తిగా జమకట్టుకుంటే ఆలాగే జమకట్టుకోండి. నమ్మితే నమ్మండి - "నమ్మిన నమ్మకున్న నది నావశమా" అన్నారు. మా పరమమిత్రులు శ్రీదాసు శ్రీరామ మహాకవిగారు యేదో విషయం వ్రాస్తూ తెలుఁగు నాఁడు అనే చిన్నపుస్తకంలో. యిది విషయాంతరం, ప్రస్తుత విషయం జ్ఞాపకం వుందనడానికి బీజమేమిటంటే? అప్పటికి ఏడెనిమిదేళ్లవాఁడు నాకొకస్యాలకుడుండేవాడు. ఆకుఱ్ఱవాడు ఆ గార్ల పిండివంట సందర్భములో అన్నాడుకదా? మా అత్తగారితో- "అమ్మా! యీవాళ మనింట్లో గార్లు వండుతున్నావు తద్దినమా?" అన్నాఁడు. అది మా మామగారువిని వాణ్ణితిట్టి అయ్యో అమంగళంగా అన్నాఁడే అని నొచ్చుకున్నారు. ఆయన కుఱ్ఱవాణ్ణి తిట్టిన తిట్లు కూడా జ్ఞాపకం వున్నాయికాని, యెలక మీఁదా, పిల్లిమీఁదా పెట్టి నేను విమర్శకుడు గారిని తిట్టినట్టువారు భావించుకుంటారని వుటంకించలేదు. క్రియమాట యీవృద్ధదశలో తటస్థించిన అత్తవారివిందులోనే కాక బాల్యదశలోకూడా నాకు అత్తవారివిందు "గార్ల" తోనే జరిగేదన్నది యిక్కడ వక్తవ్యాంశం. మా అత్తమామలు నన్నుయెప్పుడూ గారు పదంతోటే పిల్చేవారన్నది ధ్వన్యర్థం. యీ మామగారు యేకవచనంతోటే గౌరవించారు పూర్వం. యింతకూ చెప్పేదేమిటంటే? యిప్పుడు వ్రాస్తూవున్న వ్యాసంలో మాత్రం దుందుడుకు మాటలు కొంత మృగ్యం అనియ్యేవే, సాహసోక్తులు, తలకు తగని ప్రసంగాలు చాలా వున్నాయి అవి పూర్వపక్ష సిద్ధాంతాలు చేసుకొనేటప్పుడు ప్రతివారి వ్రాఁతలలోనున్నూ అంతో యింతో వుంటూనే వుంటాయి కనక వాట్లని గూర్చి వ్రాయవలసిందిలేదు. గార్లపురాణం అంతవసరం లేకపోయినా నాజ్ఞాపకశక్తిని తెల్పడానికి వుటంకించాను.

శిష్టావారి అభినందన సందర్భములో స్వాగతంలో వున్న విమర్శకుడుగారి- "కత్తిఝుళిపించు"ను గూర్చిన ప్రసంగములోన్నుంచి యిలా ఎక్కడికో పోతూవున్నాము "కత్తిఝుళిపించు" వ్రాఁత చాలా సరసంగావుంది. యేమంటారా? వ్రాసినవారు యిట్టే తప్పుకోవచ్చు, హిట్లరు మహాశూరుఁడు కదా? అతఁడిమీద మాయింట్లో నేను కూర్చుండి బ్రిటిషు తరఫున నావద్దవున్న (బండాడిముక్కుకూడా తెగని) మొద్దుచాకు నూరి ఝుళిపించవచ్చునుగదా? అది పనిచేసిందా? లేదా? అన్నది విచారణాంతరం. శ్రీకృష్ణభగవానుడేమన్నాడు-

"కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన"

అనలేదా? ఫలం దైవాయత్తం. మనం చేయవలసింది పనిమాత్రమే. అట్టిపనిని విమర్శకుఁడుగారు చేసినారు కనుక వారు మహాసాహసులని మాత్రమే ఆవాక్యం చెపుతుంది. ధ్వనినికూడాతీస్తే విమర్శకుని శక్తి తి. వెం. కవులముందు అంతగాని, కొంతగాని పసకట్టేది కాదుగాని కాకపోయినా సాహసించి అందుకు పూనుకోవడం అభినందనీయమని కూడా తేలుతుంది. ధ్వనిగదా? "అస్తమేతి గభస్తిమాన్" అనేవాక్యం యెందఱికెన్ని విధాల ధ్వనించింది. కాని ఆధ్వనికికూడా కొంచెం సంబంధం మాత్రం వుండాలి. యీమాట విమర్శకుఁడుగారు బాగా గమనించాలి. ఇది విషయాంతరం. శిష్టావారు స్థూలదృష్టిని అభినందించడంలో ఆమాట దొర్లినట్టు అనుకోవడమే. యిప్పటికి నాకు కర్తవ్యం యేదేనా యింతకంటె అధికం వారు తెల్పితే తెలుసుకోవడమున్నూ - పెళ్లి పీఁటలమీఁద వున్న పెండ్లికొడుకును వారివారికి తోఁచినట్టు అందఱూ ఆశీర్వదిస్తారు. వాటికి అవయవార్థాలలో అవసరం వుండదు. ప్రస్తుతం సందర్భం ఆలాంటిదైనా ప్రసక్తి కలిగి కొంతవ్రాయవలసి వచ్చింది. యెందులోన్నుంచి యెందులోకో పోవడంవల్ల ప్రధానాంశం మఱుగుపడుతుంది, మామీసాల ప్రసక్తిలో విమర్శకులు వేసిన ప్రశ్న ఆయనకు బొత్తిగా దానిపూర్వోత్తర సందర్భాలు తెలియకవేసిన ప్రశ్నగా ఋజువు చేయబడిందికదా? యీలాటిప్రశ్నలే గుంటూరుసీమలోని (ఆప్రాంతంవారు ఆబాలగోపాలమూ యెఱిఁగిన) సందర్భాలను గూర్చి కొన్ని వేసివున్నారు. స్వర్గతులుకాగా మిగిలిన విమర్శకుఁడుగారి బంధువులకే వాట్లవిషయం బరాతంపెట్టి వున్నాను.

వారు యీపాటికి విమర్శకుఁడుగారికి వాటిసందర్భాలు చెప్పేవుంటారనుకొంటాను. కాని యీవిషయంలో యింకోటి ప్రస్తుతం ఆలోచించాలి. సుమారు ముప్ఫదియేళ్లనాఁటి గుంటూరు సీమచరిత్ర యిప్పుడు 76 వత్సరాల ప్రాయంలో వుండడం నిజమే. అయితే అప్పటికి 46 వత్సరాల ప్రాయంలో వుండే వీరికి యితరులు బోధించడంతో పనేముంటుంది.

అందుచేత యితరులకు బరాతం పెట్టడం కూడా అనవసరమే అనిన్నీ అసలు విమర్శకుండు గారికే బరాతం పెట్టడం యుక్తమనిన్నీ యిప్పటికి తేలింది. అయితే ఆయన యెటిఁగేవుంటే? వాట్లనుగూర్చి మళ్లా యెందుకు ప్రశ్నిస్తారు? అంటే వున్నదంతా దానిలోనే వుంది కుల్లస్సు. ఆప్రశ్నించడమే అత్యాశ్చర్యం. ఆశ్చర్యంలోనున్నూ ఆశ్చర్యం. ఆరోజుల్లో యీవిజృంభించడం బొత్తిగా కనపడక యిన్నాళ్లకి విజృంభించడాని కారంభించడం యింకోటి. కాశికావృత్తికంటె కౌముదే యెందుకు పూర్వం కాకూడదని మొదట ప్రశ్నించి, తరువాత ఆప్రశ్నించడం బొత్తిగా అనభిజ్ఞత్వప్రయుక్తమని నేను సూచించినతర్వాత యిప్పటివ్యాసంలో అపూర్వత్వం గుంటూరిసీమ గ్రంథంలో వున్న నావాక్యాధారం మీఁదే సమర్థించఁబడుతుందని వుబలాటపడటం యింకోటి. శాంతం పాపం! దీన్ని గుఱించి కొంచెం వ్రాస్తాను. వీరేవాక్యం భ్రమపడి దానికి ఆధారమవుతుందను కొన్నారో! ఆవాక్యం వీరు వుదాహరించినప్పుడు దానితత్త్వాన్ని బోధపఱుస్తాను. యిప్పటికి వారిసంతోషాన్ని అలాగే వుండనిస్తాను. బొత్తిగా శాస్త్ర సంస్కారం లేనివారు యేవో ప్రశ్నలు కూరగాయప్రశ్నలువేసి చాలించక యీబాధకూడా యెందుకో. "బుద్ధిః కర్మానుసారిణీ" మీసపు శంక వదిల్చినట్లయింది. యద్వా మీసం నేను మాత్రమే పెంచి తిరుపతిశాస్త్రి పెంచనేలేదని వాదసౌకర్యార్థం క్షణకాలం వప్పుకుని మాట్లాడుకుందాం. అప్పుడు మాత్రం "పెంచినారము" అని చెప్పఁగూడదా?– "అస్మదోర్ద్వయోశ్చ" అనేది యేమవుతుంది? యింకా వాదం సాఁగితే వీరు యింకో ప్రశ్నవేస్తారని తోస్తూవుంది. అది యిది.

"మీరిద్దఱూ జంటకవులు గదా? తిరుపతిశాస్త్రి యిప్పటికి సుమారు 20 యేళ్లనాఁడే దేహం చాలించాఁడు కదా? నీవింకా దిక్కుమాలిన వ్యాసాలు వ్రాస్తూ వొక్కినరంలాగ జీవించి వున్నావేమీ, మాయిష్టం వచ్చినట్లల్లా మమ్మల్ని వ్రాసుకోవడానికి అభ్యంతరం కల్పిస్తూ" అనేది కూడా వొకప్రశ్నలోకే చేరుతుందనుకోవడాని కభ్యంతరం వుంటుందా? యీవిమర్శకుఁడుగారి ప్రశ్నలధోరణి చూస్తే, ఆలాటిప్రశ్న వేస్తారా? విమర్శకాగ్రణిగారు. యిదివఱలో వేసినప్పటికీ యిప్పుడు కొన్ని బిరుదులు పొందివుండికూడా వేస్తారా? అలాటి ప్రశ్న అంటే? యిప్పుడు వేయరేమో కాని మునుపు వేయడాని కభ్యంతరం లేశమున్నూ లేదని మనవిచేస్తూ అలాటిప్రశ్నలే వీరు వేసినట్లు యిక్కడ మఱివకటిచూపి ఋజువు చేస్తూన్నాను. దేవీభాగవతపద్యం వీరివిమర్శన కంతకూ ఆయువుపట్టు పద్యం– "క. ఎన్ని పురాణమ్ములు" అన్నది లోఁగడ వుదాహరించే వున్నానుగదా! అందులో యీయన చేసినశంక యేలాటిదో? గమనించండి. అరణ్యపర్వం తెలిగిస్తూ చచ్చిన నన్నయ్య "యేలా నీవిచ్చేమెచ్చు పరిగ్రహించడానికి అర్హుఁడైనాఁ"డనికదా? ప్రశ్నించారు విమర్శకాగ్రణిగారు. ఈయన భాగవతం యెప్పుడేనా ఆఖరికి కృత్యాదిపద్యాలేనా చదివి వుంటారో? లేక

లోకోపకారార్థం సంశయవిచ్ఛేదం చేయడానికి భారతం (అదేనా తెలుఁగే సుమండీ) మాత్రమే చదివివుంటా రనుకోవాలో? తెలియదు. యేమంటారా? "మ. ఒనరన్ నన్నయ తిక్కనాదికవులీయుర్విం బురాణావళుల్ దెనుఁగుం జేసియు" అన్న పద్యంలో పోతన్న గారుచేసిన అపరాధాన్నేనా తి. వెం. కవులు. "క. ఎన్ని పురాణమ్ములు" అనేపద్యంలో చేసింది. అంతకన్న అధికమైనదా? అట్టిస్థితిలో దీన్ని వీరే (తి. వెం.) చేసిన అపరాధంగా అపవదిస్తూ-

1. కవితాలలనమొగంబు బూడిదం బులిమెదవే
2. బ్రాహ్మణుండవ యింత దుర్మార్గమగునె?
3. మామీఁదికరుణ (నన్నయ్య) చచ్చెనటన్నన్
4. దురభిమానంబు నీలోన దొరలికాక.

యిన్ని అసంగతోక్తులున్నూ, సాహసోక్తులున్నూ వ్రాయవలసి వుంటుందా?

పోతన్నగారు నన్నయ్యను పురాణముమాత్రమే తెలిఁగించిన కవులలో మాత్రమే కాదు, పురాణావళుల్ తెలిఁగించిన కవులలో కూడా చేర్చి గౌరవించి వుండఁగా మేము గౌరవించఁ గూడదా? దానికి యీవిమర్శకుఁడు గారి అభ్యంతరమా? మాకు యిక్కడికి విమర్శకుఁడుగారి ప్రశ్న సౌదభ్యం వెల్లడిగా తెలుస్తూవుందా? సౌదభ్యం (లడయో రభేదః) యీలావున్నా. తిట్లేమో-1. క్రొత్తవిశ్వస్తలన మూలఁగూరుచుండి, 2. అరయఁ బదియవనాఁటి ముత్తైదువలన, 3. యిద్దఱుభోక్తల కెక్కుడెతద్దినము, 4. చచ్చిచెడంగలారు, 5. పదయవనాటియైదువలభంగి నడంగరే?

యీలాటి అమంగళాలతో వున్నా, నిరసనోక్తులేమొ? 1. వెఱ్ఱివెంకటాయ, 2. మన వెంకటశాస్త్రి నీతిమాలిన వ్రాతల్, 3. ధీరహితా (బుద్ధిహీనుఁడా), 4. నీవె కవివె?, సింగిగూడఁ గవిత్వంబు చెప్పలేదె? 5. బుద్ధిలేదె? 6. నక్కపోతునని యుపమించుకొమ్ము.

యింతటి అనాత్మజ్ఞత్వంలో వున్నా, యివిలేశమున్నూ నేను గణించనే లేదని ఈయన్ని త్రికరణశుద్ధిగా నేను సేల్జోడు (రమారమి 70 రూపాయీలది) సమ్మానించడానికి ఆహ్వానించినదానివల్లనే లోకం గుఱితిస్తుంది కదా? నేను ఈతిట్లవల్ల అమాత్య సార్వభౌమ వంశోద్భవులే అయినా బొత్తిగా బొందఁబడుతూ వున్నారుగదా? అని మనస్సారా గుఱితించి "బుద్ధిః కర్మానుసారిణీ" అని సమాధానం చెప్పికొని యిట్టి అనాత్మజ్ఞులతో ఆసన్న మరణదశాంతర్దశలలో వున్నమనం వాదోపవాదాలకి దిగడానికి ప్రాజ్ఞలోకం బొత్తిగా అంగీకరించదని యింట్లోవున్న పదార్థంగాని మనం కొని చేసేది కాదుగదా? అని,

"క. అపకారికి నుపకారము నెపమెన్నక సేయువాఁడు నేర్పరి సుమతీ."

అనే పద్యాన్ని స్మరించి ఆరీతిగా యీయన అనుగ్రహాన్ని సంపాదించుకొందామని ప్రయత్నించాను. ఈనాప్రయత్నం కూడా విఫలమే అయింది. విమర్శకుఁడుగారు దీన్ని అవమానంగా భావించారు. లోక మేలా భావించిందో? చూడండీ, చాలా వుత్తరాలున్నా వక్కపిల్లకవి వుత్తరంలో నుంచి కొన్ని మాటలు మాత్రమే వుదాహరిస్తాను.

*గునపఱ్ఱు, తాడేపల్లిగూడెం పోష్టు,*
*24-05-1939.*

మానాప్రగ్గడ శ్రీరామసుబ్బరాయశర్మ నమస్కరించి వ్రాసికొనెడి

విజ్ఞప్తి :

"కృష్ణాపత్రికలో ప్రకటింపఁబడినవ్యాసము (నన్నయ్యనుగూర్చినది) చూచితిని. దేవీభాగవతపు విమర్శకుఁడుగారికి మీరిచ్చిన సమాధానము చదివితిని. వారు పశ్చాత్తప్తులు కాకపోరని నానమ్మకము. ఏమందురా?

"క. తిట్టినవారల మరలం
గట్టలుకం దిట్టఁబోక కానుక లఱుతం
జుట్టఁగఁ జూతురు శాంతముఁ
బెట్టెనె? మీ యమ్మ ఉగ్గుఁ బెట్టెడివేళన్."

నాకాశ్చర్యమైనది. ఇట్టి శాంతయుతుని ప్రేరేపణ లేకయే మీకృతి కర్తగారికి (మానియోగితల్లజునకు) కవిలోకమే సమాధానమీయఁగలదు.

చే(వ్రా)లు.

అనేకులు కవులు, అడ్వకేట్లు (ఇందుఁ గొందఱు వాచా అభినందించినవా రున్నారు.) ఉద్యోగులు (వీరందఱు నియోగులే) నాపూనికను అభినందించిన వారుగలరు. అసలు వారూ వీరూ యెందుకు బోధించాలి. విమర్శకుఁడుగారి వార్ధక్యం బాగానే వుండి నలుగురి నోళ్లల్లో పడవలసిన ప్రాప్తి లేకపోతే వారివృద్ధత్వమే వారిని బోధించేది. "అవశ్య మనుభోక్తవ్యం కృతంకర్మ" నిరసించినవారల్లా నేనెవరిని ఆతిధ్యమునకై ఆహ్వానించితినో వారు మాత్రమే అయితే వారికి మనస్సులో అన్ని అనుచితమైనతిట్లు తిట్టి యేలావెళ్లి వానిసత్కారాన్ని స్వీకరించేది అనే సంశయం కలగడంలో ఆశ్చర్యం వుండకూడదు. అది మానవసహజమైనధర్మం. ఎంతకోపం లోపల వున్నా శారీరక ధర్మాలుగాని, మానసిక

ధర్మాలుగాని మార్పుచెందవన్నది సర్వానుభవసిద్ధం. అకారణంచేత మొగం చెల్లక వారు నిరసించారు గాని మఱొకటికాదు కనక మళ్లా వారిని ప్రార్థిస్తాను. అయితే- "రానివారలన్ రమ్మని పిల్వ వేడుకనరా" అని నన్ను లోకం పరిహసిస్తుందేమో? వినండి ఆయన నన్ను తిట్టినా ఆదూషణాలు నాకు భూషణాలుగానే పరిణమించాయి. యీలాటి తిట్లకు వప్పుకోలేదుగాని కీ॥ శే॥ సోమంచి భీమశంకరంగారు (ప్లీడరు) అమ్మాఆలీ బూతులయితే ఆశీర్వచనాలే అని వొకప్పుడు చమత్కరించారు. యీతిట్లు లోకంలో యీలాటివా రుంటారని తెలుసుకోవడానికి అవకాశం గలిగి గురుత్వాన్ని కూడా చేసినట్లయింది. అందుచేత మొదట కొంచెం భారంగా కనపడ్డా, క్రమంగా అది చెడ్డపని అయినప్పటికీ, ముమ్మాటికికూడా చెడ్డపనేఅయినప్పటికీ దానివల్ల నాకుఁగాని, నాయశస్సుకుఁగాని, యిప్పుడు గాని, భవిష్యత్కాలంలోఁగాని జరిగే అపకారం యత్కించిత్తూ కూడా లేదని నాకు తోఁచింది. దీన్ని లోకం యెంతవఱకు విశ్వసిస్తుందో నాకు తెలియదు.

"ఉత్పత్స్యతే మమ తు కోఽపి సమానధర్మా"

అన్నాఁడు భవభూతి. అలమతి విస్తరేణ. అందుచేత వారిని నేను కవితాధార సాఫుగా వున్నదనే గుణలేశాన్ని పురస్కరించుకొని తక్కిన దాన్ని సర్వమున్ను పొల్లుగా భావించి జల్లించి "తోసిరా" జని సమ్మానింప దలఁచినాను. యిప్పటికీ యింకా నాప్రయత్నం అమల్లోనే వుందిగాని "నిరాశాః పితరో గతాః" కాలేదు. వారితిట్లు సమర్థనీయాలు కావన్న సంగతి వారికి బాగా గోచరించినట్లు వారి యిటీవలి సశేష వ్యాసంలో వుండే అక్షరాలవల్ల వ్యక్తం అవుతూ వుంది. ఆ అక్షరాలు చూచాకే నేనీ వ్యాసాన్ని వ్రాయడానికి ఆరంభించాను. ఇంకా వారి వ్యాసం "సశేష" స్థితిలో వున్నా యెప్పటికప్పుడే జీవితసంశయంలోవున్న నేను రాఁబోయేవారివ్యాసశేషం చూడకుండానే, "మీగాళ్ల" సామెతగా భవిష్యత్తులో రాఁబోయేవారి మాటలను భావనాశక్తిచేత (కవులకు భావనాశక్తి చాలా సంగతులను గోచరింపఁ జేస్తుంది). వూహించి మళ్లా యీ ఆహ్వానాన్ని పంపుతూన్నాను. ఇది విషయాంతరం. వారి వ్యాసంలో వున్న యీమాటలు వారికి వారితిట్లను సమర్థించుకునే వుపాయం లేక నీళ్లు నమలవలసి వచ్చిందన్నసంగతిని తెలుపుతాయో! లేదో! చదువరులకు తెలియడానికి వుదాహరిస్తూవున్నాను.

"31 సంఖ్యగాఁ గొన్ని పద్యములు వెగటుగాఁ గనపడునట్లుటంకించి కొంత విపరీతార్థము చేసి వ్రాసియున్నారు. శాస్త్రిగారి యుద్దేశమేమియో? నేనట్లు తమ్ము నిందించినట్లు లోకమునకుఁ దోఁచవలయుననికదా? కానిందు నా గ్రంథమామూలాగ్రము చదివినవారికైన సత్యము తెలియఁబడదా?" అనివ్రాయ మొదలిడినారు. నేను చేసిన

విపరీతార్థమేమో? అసలు వారి సుపరీతార్థమేమో శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులు గారు గాని, లేదా వీరిని ధూళిపూడి సభలో అభినందించి నాపేరు లేక మాయిద్దఱి (తి. వెం. కవుల) పేరులు యెత్తికొన్న శ్రీ శిష్టాశాస్త్రులుగారు గాని లేదా ఆ సభకు ప్రసిడెంటుగా శ్రీ పిఠాపురం మహారాజావారి కాలేజీ నుండి దయచేసిన పండితమండనులు గాని నాకు తెల్పి మందలింతురని కోరుచున్నాను. నేనొకవేళ అందులో సుపరీతార్థమే వుందని ఆబ్రాహ్మడికి యీలోకంలోనే కాదు పరత్రకూడా అపకారం యెందుకు కలగాలనిఅన్నా, వెగటుగాలేదు సొగసుగానేవుంది. స్వర్గానికి మెట్లు కడుతూవుందని అబద్ధానికి సిద్ధపడి వాదించడానికి దిగినా; ఆయీ ముద్దుమాటలను సీ! యని రోయని పుణ్యాత్ము లెక్కడేనా పుట్టి వున్నారా? అనేదే నాశంక. వీరే అక్కఱలేదు విమర్శకుడుగారు తమకుఁదోఁచిన యేవిజ్ఞుల పేరులుదాహరించినాసరే, వారేశాఖ వారేనా సరే, యేకులంవారైనా (18 జాతులలో) సరే, ఆడవాళ్లేనాసరే, మగవాళ్లేనాసరే, ఆ తిట్లు తిట్లుకావనియు, అందులో అంతరార్థం సుపరీతార్థ మున్నదనియు “పదియవనాటి ముత్తైదువు” పుణ్య స్త్రీయే అనియు అర్థము చెప్పి విమర్శకుఁడు గారిని వొడ్డెక్కిస్తే నేను సంతోషిస్తాను. (యేదో? కాలకర్మ దోషంచేత కర్మం చాలక అలా నోరుకాదు చేయి జాఱింది అని క్షమాపణ (నాకుకాదు) లోకానికి చెప్పి నిర్దోషత్వాన్ని సంపాదించుకోక యింకా తగుదునంటూ యీ పిడివాదం యెందుకంటాను?) తగుదునని యింకా వ్యాసాన్ని వ్రాసి పత్రిక నిండిస్తూ తమ అనుచిత ప్రసంగాన్ని సమర్థించుకోవడానికి ఉపాయం కనపడక యితరులు విపరీతార్థం చేశారనిన్నీ- “వెగటుగా వుండేటట్టు ప్రకటించా”రనిన్నీ అపవదించడం శోచనీయం కాదా? పైఁగా-

శాస్త్రిగారి యుద్దేశమేమియో? నేనట్లు తమ్ము నిందించినట్లు లోకమునకుఁ దోఁపవలయునని కదా? (లోకానికి నిందించినట్లు తోఁచదు స్తుతించినట్టుగానే తోస్తుందేమి?)

ఈ వాక్యసౌదభ్యం చదువరులు గమనించాలి. శాస్త్రిగారియుద్దేశం శాల్జోడు సమర్పించుకోవడమే ముమ్మాటికిన్నీ అంతే. తిట్టనట్లుమాత్రం లోకానికి తోఁచకుండా శాస్త్రిగారు చేయాలి. చేయగలరా? తిడితేమాత్రం 76 సంవత్సరాల బ్రాహ్మఁడుగదా! యెందుకు పడఁగూడదూ? అంటాను పైఁగా అంతకంటె అనఁగా తిట్లకంటె అధిక పాండిత్యం పూర్ణానుస్వారంగా వుండి విమర్శనకు పూనుకొన్నవృద్ధులు తిడితే మాత్రం నోరుమూసుకూరుకోవాలిగాని అయ్యా! చూడండని వారితోను వీరితోను చెప్పుకోవడం కూడానా? యెంత ఘాతచేశాఁడూ. వెం. శా. (ముదిమి రెండవ బాల్యంబు కదా) అవును తప్పే. దాన్ని వారించుకోవడానికేకదా? శ్రీవారిని శాల్జోడుతో అభినందన పద్యాలతో

సహాగా సత్కరించడానికి సంకల్పించుకున్నాఁడు. కాబట్టి వారు వాఁడికోరిక తీర్చడంకన్న కర్తవ్యం లేదు. పైఁగా "నేను విమర్శన గ్రంథమున వ్రాసిన విషయములకు సరియైన సమాధానము వ్రాసిరేమో చూడుఁడు." (యెంతముద్దుగా వుందో? యీ వాక్యం పరిశీలించాలి) అని కూడా వ్రాస్తారే? నన్నయ్యను గుఱించిన ఆక్షేపణ దానిలో వున్నదేనా? మీసప్రస్తావన దానిలోదేనా? వాట్లను గూర్చి నన్నయ్య భట్టు వ్యాసంలో మొదటి దానికిన్నీ దీనిలో మీసప్రసక్తికిన్నీ సమాధానం వ్రాశానా? తక్కినదానికి బంధుసముద్రులకి బరాతం పెట్టివున్నానా?

యింకనల్లా "పదియవనాటి ముత్తైదువు వగయిరా తిట్లకు నేను జవాబు చెప్పవలసి వుంటుంది. యేమని చెప్పాలో తోఁచకే సేల్జోడు బహుమానంగా యివ్వదలచుకున్నాను. (వెనక అధాత్తువాదం చేసి నీయమ్మజిజ్ఞాసా అంటూ వాదించినపండితుడి కేశాలు శిరస్సున ధరించి తనకు రాజుగారిచ్చిన బహుమానం ఆయనకిచ్చిన సంగతి లోకానికి తెలియదా? వెం. శా. ఆయనకి తీసిపోతాఁడా) ద్రావిడస్త్రీల కుచాలుకూడా తడివినందుకు వొక్కనాకేకాక పత్రికాధిపతులకుకూడా సంబంధం వుండడంచేత మేము ఉభయులమున్నూ చెఱివక సేల్జోడున్నూ బహుమతీచేస్తేనేగాని మా పాపాలు పటాపంచలైపోవు. వెల్నాటికనక తి. శా. కి యీ ప్రాయశ్చిత్తం చేసుకోవలసివుండదు. ధన్యుడు! కనక వేంకటేశ్వర శాస్త్రులవారిని హెచ్చరిస్తూన్నాను. సేల్జోడు సిద్ధంచేయమని. యింకమీఁదటనేనా యీలాటివారి వ్యాసాలు అనాలోచితంగా ప్రకటించి నాబోటి సర్వసంసిద్ధులకి అమాంగళ్యపు వ్రాఁతలు (మఱివకప్పుడేనా సరే) వ్రాసే యీలాటి ప్రబుద్ధులద్వారా పనికల్పించి బాధించడం యుక్తంకాదని పత్రికాప్రవర్తకులకు తోఁచేయెడల క్రియారూపంగానో, వాగ్రూపంగానో వారిఅనుతాపాన్ని ప్రకటించ గోరుచున్నాను. లేదా? పరుండియే నే నింకా బళ్లని తోలగలను వ్యాసాలు. వాట్లని జాగ్రత్తగా ముద్రించి ప్రకటించి ఆయిాలోపాన్ని సవరించుకోవలసిందని ప్రార్థిస్తాను. విమర్శనగ్రంథం చూచినట్లయితే మీరు యెంత యేవగించుకుంటారో అనుకుంటాను. అయినా నాకోసంచూచి అందేదేనా ఉత్తరం యియ్యతగ్గది వుందేమో? పత్రికాధిపతులు చూపితే దానికి తోఁచినసమాధానాన్ని యిస్తాను. అధిపతులే అక్కఱలేదు. నన్ను ద్వేషించేవారు సుప్రసిద్ధులు కొందఱున్నారుగదా? పేళ్లెందుకు తీరికూర్చుని ఆ ద్వేషించేవారిని ఆశ్రయించేనా సరే తిట్లుకావని వారిచేత అనిపిస్తే యింకో సేల్జోడుకూడాను. సరేనా అసలు విమర్శకులకు నన్నుప్రశ్నించడానికి అర్హత యెంత వఱకు వున్నట్లు గోచరిస్తుందో? ఆయనచేసిన "పదియవనాఁటి" వగైరా 31 ఆశీర్వాదాల వల్లనే కాక యింకా గ్రంథంలోవున్న ఆశీర్వాదాలవల్ల కూడా నిర్ణయించి పత్రికలో పత్రికాధిపతుల ఆచార ప్రకారం ప్రకటించి లోకాన్ని సంతోషపెట్టఁగోరతాను. పత్రికలలో పలుసంగతులు

పడుతూ వుంటాయి. వాట్లన్నిటికీ మేము బాధ్యులమా? మీలో మీరు వాదోపవాదాలద్వారా తీర్చుకోవలసిందే అనిగాని, లీగల్‌గా అనిగాని జవాబు చెపుతారా. యిది స్పెషల్ విషయంగా మీరు పరిగణిస్తారనియ్యేవే యింతగా వ్రాశాను గాని లేకపోతే యీమాత్రానికైతే వ్రాయను. ఈయనకు జవాబు చెప్పలేకపోను? (అనఁగా యిప్పుడేకాదు జీవితానంతరం అర్థమం ఒక సంవత్సరందాకా కూడా చేతిలో లేఖిని పనిచేస్తూనే వుంటుందని నా పిచ్చి నమ్మిక) గాని యీ వయస్సులో యీలాటి అనుచిత ప్రసంగానికి (అనగా కోర్టువారు తీర్చవలసిన దానికన్నమాట) నేను జవాబులు వ్రాస్తూ కూర్చుండడానికి లోకోపకారకార్యాలలో తఱుచుగా ప్రవర్తించే మీబోట్లు ఆమోదిస్తారా? మీ పత్రికపుట్టి సుమారు యిరవైయేళ్లేనా కాకపోదుగదా? యేవిమర్శకులేనా యే గ్రంథకర్తనేనా "పదియవనాఁటి ముత్తైదువు" లోనైన అప్పుచ్ఛ్యపు మాటలతో బహూకరించి నట్లెఱుఁగుదురా! అట్టిమాట లెన్నఁడేఁనా మీరు (ఇప్పుడూ ఆమాటలు మీరు ప్రకటించ లేదుసుడీ పాపం! ఆయనే ప్రతిష్ఠకోసం చిరకాలం దాఁచిదాఁచి యిప్పటికి అదృష్టంపండి స్వద్రవ్యంతో బయటికిఁ బెట్టివున్నారు.) మీ పత్రికలో ప్రకటించి వున్నారా? అని నా ప్రశ్న. తాము జూడలేదు యీయన తిట్లని యీసంగతి నేనెఱుఁగుదును. యీయన విమర్శకులు కారు. వట్టి అనాత్మజ్ఞులు అని నేను తెలిసికొన్నాను. మొట్టమొదటనే పంపిన భారతసంశయవిచ్ఛేదం మీఁద అభిప్రాయం అసలు వారు కోరకుండానే నాఅంతట నేనే వొకమాదిరిగా యిచ్చి మెల్లిగా రంగంలోకి అవతరింపచేశాను. అప్పుడీపుస్తకం విమర్శనం పంపించారు. చూచాను. సమ్మానించ తలచాను. దానికి ఆయన నాకు అనుగ్రహించిన ప్రత్యుత్తరం ఇది.

"తామే మాగ్రామము వచ్చి సభచేసి చేయవలసి యుండునుగాని నేను తమగ్రామము వచ్చుట తగియుండదు."

"యెందుచేత తగియుండదోకదా? కృతిప్రదాత కృతి నాయకుని కడ కేగి సమ్మానింపఁబడుట ఆచారమా? కృతినాయకుఁడు కృతియిచ్చిన గ్రంథకర్తయింటికేగి సమ్మానాన్ని పొందుట ఆచారమా? తిక్కన్నసోమయాజులుగారికి కేతనమహాకవి దశకుమారచరిత్రను కృతినిచ్చెను గదా? దానిని తిక్కన్నగారి గృహమునకు వచ్చి వినిచి సమ్మానమును తిక్కన్నగారి గ్రామములో పొంది వుండునా? లేక తిక్కన్నగారే కేతన్నగారి వూరు వెళ్లి అక్కడనే కేతన్నగారి కవిత్వాన్ని విని వారింటే భోంచేసిసమ్మానించి వచ్చివుంటారా? మనుమసిద్ధి తిక్కన్నగారింటికి వచ్చి ఉత్తర రామాయణాన్ని విని సత్కరించి తన రాజధానికి లేదా కోటకు వెళ్లియుండునా? యింతటి పరిజ్ఞానంకూడా గుం. డి. విమర్శకుఁడు గారికి లేదని లోకం అభిప్రాయపడరాదు. నేను అంతకంటే పడేదిలేదు. కాని యేంచేస్తారు పాపం! వురిలో చిక్కారు.

"అప్రతిపత్తిమూఢమనసా ద్విత్రాస్థితా నాడికాః" అన్న యెత్తు నేనెత్తడంచేత యేమీ వ్రాయడానికి కలమాడక యీలా అపహాస్యపు టక్కరాలు వెళ్లఁగ్రక్కారే! కాని అసలు శక్తి యీలాటిది కాదు. లౌకికాగ్రేసరులు అంకెలలో మంచి పాండిత్యముంది. దాన్నిబట్టి సంఖ్యావంతులు కూడా (అసలు సంఖ్యావచ్ఛబ్దవ్యుత్పత్తి వేఱుకదా) అనఁబడతారు. యీమధ్యనే అభినవ తిక్కయజ్వలు కూడా వారిగ్రామంలోనే (యింట గెల్చిరచ్చ గెలువు మన్నారుకదా) అయి వున్నారు. యీపైని త్రిలోక విజయంకూడా చేస్తే చేస్తారేమో; "పదియవనాఁటి ముత్తైదువునూ, దశాహంనాఁటి ముత్తైదువునూ" బంగారు పట్టుతల్లిగా సమర్థిస్తారు. (ఇంకా యీలాటి అపృచ్ఛ్యప్రసంగం చాలావుంది.) దానితో ఆ బిరుదేకాదు సర్వమూ సమర్థితం అవుతుంది చూస్తాము. కానీ ధూళిపూడి గ్రామస్థులకు మహాకవి తిక్కన్నగారియెడల గౌరవం లవలేశమున్నూ లేదేమోనని వివేకులు అనుమానించవలసి వస్తుందేమో అని నాచింత. యేమంటే? యీయనజ్ఞానం మిక్కిలి సామాన్యంగా కనపడుతూ వుంది. వీరికిచ్చినస్థానమేమో పెద్దది యిప్పుడు తిక్కన్నగారి యశఃకాయమే వుందిగాని అసలు కాయంలేదు. పరిశీలించేవారు అనుకోరుగాని, స్థూలదృష్టులు వారి బండారంకూడా యింతపాటిదే అనుకుంటే? అయ్యో కర్మమా! తిక్కన్నగారి ప్రజ్ఞావిశేషపరిజ్ఞానానికి యీలాటి వుపమేయ స్థానాలేనాగతి? అలా యెవరంటారు, గాని లోకంలో ప్రాజ్ఞుల సంఖ్య చాలా తక్కువ, ప్రాజ్ఞేతరులే అనఁగా? జ్ఞానలవదుర్విదగ్ధులే యెక్కువ. అందుచేత కొంత వారికికూడా మనం భయంపడవలసి వుంటుందని నామనవి. సరిగ్గా నాలుగు పంక్తులు వ్రాయడానికి సామర్థ్యం పూర్ణానుస్వారంగా వుండే వీరు పెద్దపెద్దమాటలు ప్రకటిస్తారే! యీసాహసం వీరికి యెక్కడనుండి వచ్చిందోగదా! ఆ యీ సందర్భం యిఁక లోకమే తేలుస్తుంది. అందుకే నాశాంతి మంత్రాలు వీరికి నచ్చాయి కావు. నాసంధి అంతకంటే నచ్చింది కాదు. నాసమ్మానాన్ని నిరాకరించారు సరే, అంతటితోనేనా వూరుకున్నారా! ఊహూ! ఊరుకోలేదు. యీ క్రింది వాక్యాన్ని చిత్తగించండి.

"అట్లుకాదేని వారు వచ్చినశత్రుణ్ణి నన్ను జామాతగా విమర్శకుడు గారు బుద్ధిపూర్వకంగా అంగీకరిస్తారని యెవరనుకుంటారు? భవతు. యేలాగయితేనేమి? యిప్పటికి మనుగుడుపు ఆహ్వానందాఁకా వచ్చింది కదా? యీ వివాహం సర్వథా రాణిసంయుక్తకున్నూ, పృథ్వీరాజుకున్నూ జరిగినమాదిరిగా ఆచరిత్ర యెఱిఁగినవారు భావిస్తారు. సంయుక్తతండ్రికి యేకోశమందున్నూ పృథ్వీరాజుయందు యిష్టంలేదు, లేకపోతే మాత్రం దైవలిఖితం తప్పుతుందా?

"ఎన్నఁగ రాదుగా? మఱియు నేటికి నేటికి ధాత వ్రాయునో" కృతి యిచ్చి వుండిన్నీ బహుమతి పుచ్చుకోవడానికి దయచేయవలసిందని నేను సగౌరవంగా కోరితే గతంలో

తామొనర్చిన అపచారాలవల్ల రావడానికి మొగం చెల్లక ఆ బహుమానం అక్కడకే మూటగట్టి తెచ్చి చేయవలసిందంటారే! యిది యెక్కడి లోకజ్ఞానం బాబూ? ఏమో? అలాఅనడానికిన్నీ వల్లకాదు; "కవితాలలన మొగంబు బూడిదం బులిమే" వాళ్లకు దానిలోవున్న సారస్యం బోధపడుతుందా! ఏదో మాదిరి "ముత్తైదువు" కదా! వాఁడు కృతిభర్త సేల్జోడు పట్టుకొని అత్తవారింటికే (స్వంత ఖర్చులతో కూడా కాబోలును) వెళ్లి కృతికన్యాప్రదాతను సమ్మానించడం యెట్టిదో? ధూళిపూడి గ్రామమే తెలుసుకొనుఁగాక. ఆ భారం దానిదే నాకెందుకు - యిఁక. "ఏ భూపాలుఁ డీవచ్చినన్" అన్నసాఁకును గూర్చి విచారిద్దాం. తృతీయ చరణంలో వున్న- "సాలగ్రామము మున్నుఁగా గొనఁడు" అన్నది బాధిస్తుంది కాఁబోలు స్పృశించనే లేదు. ఆసాలగ్రామ పదంవల్ల కాళ్లుకడిగి మంత్రపూర్వం యిచ్చే షోడశమహాదానాలు గాని, దశదానాలుగాని (అనఁగా పురోహితవృత్తిలో వుండేవారు పరిగ్రహించే వన్నమాట) ప్రవరాఖ్యుఁడు న ప్రతిగ్రహీత కనక పరిగ్రహించడనే స్వారస్యమే వస్తుందిగాని, పాండిత్యప్రయుక్తమైన సన్మానాలుకూడా అతఁడు పరిగ్రహించక నిరాకరిస్తాఁడని స్ఫురించదు. స్పృశించక వదిలినా ఆసాలగ్రామం "ఎట్సెట్రా" న్యాయంచేత వచ్చితీరుతుంది. పెద్దనామాత్య ప్రభృతి మహాకవులు అగ్రహారాదులు రాజులవల్ల సగౌరవముగా స్వీకరించేవున్నారుగాని నిరాకరించలేదు (కోకటగ్రామాద్యనే కాగ్రహారంబు లడిగిన సీమల యందునిచ్చె). కాఁబట్టి మన అభినవతిక్కయజ్వగారు నాయిచ్చుసేల్జోడు బహుమానాన్ని నిరాకరించడానికి ఆసాఁకు బొత్తిగా యేమీ ఉపకరింపనందున- మొగం చెల్లకపోవడమే యిందుక్కారణమని తప్పక యొప్పికోవలసి వస్తూవుంది. యీవూహ నిక్కమే అయితే యిప్పటికేనా "పశ్చాత్తాపానికి" వచ్చినట్టు ప్రాజ్ఞలోకం భావించడమే కాకుండా పశ్చాత్తాపం పాపనివారకకంకాఁబట్టి పారలౌకికపు చిక్కు కూడా వారికి లేదని తోస్తుంది. నాకు వయస్సు ఉత్తరవయస్సు కనక ఐహికభయం కంటె పారమార్థిక భయమే యెక్కువగా చూచుకోవలసి వుంటుందని వేఱుగా చెప్పనక్కఱలేదు. "శా. నాకుం దోఁచినమాట యైహికమటన్నన్ దీర్ఘ యాత్రాపరుల్, వీఁకంజేయు మకాము లందొకటియౌ వేయేళ్లు జీవించినన్." మఱేమీ ఆశ్చర్యంగా కనపడదుగానీ, యేపైలాపచ్చీసు వయస్సులో నేనావున్నవారైతే యీలాటి తిట్లుతిట్టి ప్రచురించారన్నా కొంత అంగీకరించడానికి మనస్సు వొప్పుకుంటుందిగాని యీలాటి పెద్దలు, భారతాది గ్రంథపరిశీలకులు, విమర్శకులు, లౌకికసార్వభౌములు పైఁగా అంతో యింతో కవులున్నూ గదా? వీరు! వీరు- "పదియవనాఁటి" మొదలైన తిట్లు మమ్మల్ని కాదే అనుకుందాం వేఱొకరినేనా యెంత నికృష్టుణ్ణేనాతిట్టి ప్రచురించి (వారు కోర్టుకు మాలాగే వెళ్లరే అనుకోండి) మళ్లా లోకంలో యెలా తలెత్తుకు తిరగడానికి వల్లపడుతుంద దనుకున్నారో అనేదే పెద్ద సందేహం.

మాశిష్యకోటిలో వ్యక్తులిద్దరు యీమధ్య నేను బెజవాడ వెళ్లినప్పుడు "యీలాటివారి కందఱికీ మీరుజవాబు చెపుతూ వుండడం మీది పెద్దలోపం" అంటూ నన్నుమందలించడానికి మొదలుపెట్టారు. దానిమీద-

"నాయనా! ఆయనమీకు దగ్గఱ బంధువులు కాకపోయినా శాఖా మాత్రబంధువులు కాకపోరుగదా? నాకుపనిలేకుండా పోతుంది. కాస్త కలిగించుకొని మంచి మార్గానికి తిప్పండి అని ఆ యిద్దఱిలో వకరితో మాత్రము అని చూచాను. కానీ అతనికి యెల్లప్పుడూ ఆ కాంగ్రెస్సు వర్కుతోటే సరిపోవడం చేతనో యేమో? మళ్లా యీప్రసక్తి యెత్తుకోనేలేదు. లేకపోతే వుపేక్షించేవాఁడు కాఁడు. గుంటూరుసీమ వివాదల పుట్టుపూర్వోత్తరం పూర్తిగా యెఱిఁగి అయ్యో! అని నొచ్చికొనే వాళ్లల్లో మొట్టమొదటివాఁడే. "ఉ. శాఖకు నప్రతిష్ఠ" యీలాటి వృథా అభిమానం అని చింతించేవాఁడే. అయినా-

"నమాజు చేయఁబోతే మసీదు మెద బడ్డది" అన్నట్టున్న యీవ్యర్థ వ్యాపారంలోకి యెవఁడో నావంటి చేదస్తుడుతప్ప యెవఁడు కలిగించుకుంటాడు? ఆలాకలిగించుకుంటే విమర్శకుఁడుగారు ఆవ్యక్తులనుకూడా విభీషణాయిగాళ్లని నిందించడం వుంది. అది వారివిమమర్శన గ్రంథంలో వక విశేషాంశమే. కీ॥ శే॥ వడ్లమన్నాఁటి నరసింహశర్మనున్నూ, ప్రస్తుతం విశాఖపట్నంలో ఉద్యోగిగానున్న పింగళి లక్ష్మీకాంతాన్నిన్నీ, నాఁడేమో అనఁగా గుంటూరుసీమవివాదములలో ఆవలిపక్షానికి వ్యతిరేకంగా న్యాయపక్షాన్ని వర్తించారని వీరు దూషించివున్నారు. భవతు. యిప్పుడు వీరి వుద్యమాన్ని యేబంధుసముద్రులు సమర్థిస్తారో? చూడవలసివుంది. యేదో ఆకాలంలో ఆసీమలో వివాదం జరిగిందన్నమాటే కాని అప్పుడు పరమశత్రువులుగా వున్న వారందఱున్నూ, యిటీవల పరమబంధువులుగా మారినట్టు నాకు బాగా అనుభూతం అయింది. అది బ్రాహ్మణలక్షణం. యెందుకు అలాగ మాఱ రంటాను. నన్నయ్యభట్టు- "విప్రులయలుకయు తృణహుతాశనమ్ము దీర్ఘమగునె?" అని వూరికేనే అన్నాఁడా? అతఁడు లోకజ్ఞుఁడు "లోకజ్ఞునుభయభాషా" అని వూరికేనే వ్రాసుకున్నాఁడా? లేదు. యిప్పటికి సుమారు 16 యేళ్లక్రితం నేను హఠాత్తుగా గుంటూరు వెళ్లడం తటస్థించింది. అప్పుడు శ్రీయుతులు పాటిబండ సూర్యనారాయణరావుగారు (ప్లీడరు) అరండల్ పేటలోనే అనుకుంటాను వారు కట్టించిన శ్రీ ఆంజనేయ స్వామివారి ఆలయం చూడాలని బలవంతంగా తీస్కువెళ్లి యెంతో ఆదరించారు. అప్పటిమాట యెందుకు? సంవత్సరానికి పూర్వం బెజవాడలో శ్రీపాటిబండ సుందర్రావుగారు (అడ్వొకేటు) యెంతో ప్రయత్నపూర్వకంగా సపుత్రకంగా, సచ్ఛాత్రంగా, నన్ను వారింటికి పిల్చుకొని వెళ్లి సేలువలువగైరాలతో సమ్మానించి విందుకూడా చేశారు. పాటిబండవారినే ప్రత్యేకించి

యెందుకు యెత్తుకున్నానంటే ఆరోజుల్లో "పండితంమ్మన్య లక్షణం" అనేపేరుతో మామీఁద కొన్ని దూషణోక్తులు వ్రాసినవారు పైవారిలో మొదటివారు. రెండవవారు బహుశః అప్పటికి పుట్టివుంటారేమోకాని ("కౌపీనవంతః ఖలు భాగ్యవంతః") కనక ఆ యుద్ధంలో పాత్రత్వం వున్నవారు కాకపోయినా వారితండ్రిగారు శ్రీవేంకటరమణయ్య పంతులవారికి ద్వేషుఁడంటూ వుండవలసివస్తే చెల్లపిల్లమాత్రమే. కార్డులోకూడా (లౌకికాగ్రేసరులై వుండికూడా) వాఁడు మహా దుర్మార్గుఁడు అని నిరాఘాటంగా వ్రాసేవారు. శ్రీయుతులు కృత్తివెంటి గంగరాజుగారు ఆవ్రాయడాన్ని చూచి చాల మెచ్చుకొనేవారు. నేను వారి (వెం. ర. య్యగారి) వ్రాఁతనే సమర్థించేవాణ్ణి. దానిమీద గంగరాజుగారికి పంతులుగారి మీద మఱింత కోపంవచ్చేది. యింతే వ్రాయవలసింది. యింక వ్రాస్తే సారస్యం చెడుతుంది. శేషం ఊహించుకోండి- లేదా? గంగరాజుగారికి బందరువ్రాసి తెలుసుకోండి. చాలును యీసందర్భంలో నన్ను కార్డులో కూడా వాఁడు దుర్మార్గుఁడు అని వ్రాసేవారి వ్రాఁతను ఆమోదించి నేను సమర్థించడపు లౌక్యంయేమిటి? అని అగుడుతారేమో? అందులోనేవుంది. వెం. శా. ప్రజ్ఞావిశేషం యావత్తూ; ఈ బ్రాహ్మణుడువంటి యేకొలఁది మంది హృదయం లోనోతప్ప ఆనాఁటివిషయం లేశంకూడా యిప్పుడు వున్నట్లేలేదు. వారూవీరూ క్షీరనీరన్యాయంగా వుంటూవున్నరోజుల్లో యీయన మళ్లాదీన్ని లేవదీశారు. అయితే దీనిమూలాన్ని యీయనకేమాత్రమో లభించడం జరిగిందని వింటాను. అందుచేత కొంత అవసరమే అని తోస్తుంది. "సర్వః స్వార్థం సమీహతే" కదా! యీయన ప్రశ్నలు చూస్తే ఆశ్చర్యంగా వుంటుంది. అత్యాశ్చర్యంగా కూడాను. దేవీభాగవతంలో నష? నా తెలివిని చూపించానుష?. (దేవీభాగవతమున నీతెలివి చూపి చూ.) దేవీభాగవతాన్ని ఆంధ్రీకరిస్తూ వున్న నేను నా తెలివిని చూపక యితరుల తెల్వి నేలా చేసేదీ? యెరువు తెచ్చుకొనేదా? "ఆదికవిభేద మిందేమి యవసరంబు" అంటూ వకప్రశ్న. యీప్రశ్నకు కొంచెం వ్రాసి యింక వ్యాసం విరమిస్తాను. ఆత్మకూరి విద్యావివాదం దేవీభాగవతం రచించడానికి మొదలిడిన కొద్దికాలంలో ప్రారంభ మయింది. ఆపండితులు లక్ష్యవిషయంలో భారతాన్నేకాని వొప్పేవారు కారు సరిగదా? అందులో నన్నయ్యనిమాత్రమే. యీచేదస్తం వారికి తెచ్చిపెట్టింది అహోబలుఁడున్నూ, కవిరాక్షసుఁడున్నూ. ఆసందర్భం యీకారణంచేత ఆకాలంలో ప్రస్తుతం అవడంచేత ఆగ్రంథపీఠికలో భారతప్రామాణ్యాన్ని గుర్చి చర్చించడం అవసరం అయింది. యెత్తుకున్నాను. చర్చించాను. చర్చించాను. తుట్టతుదకి "ఏమైనను భారతమ్మునకు నంజలి సేయక తీరదేరికిన్." అని ముగ్గురు కవులూ ప్రామాణ్యకోటిప్రవిష్టులే అనితేల్చాను. యీయనకేం తెలిసి ప్రశ్నించారో! పాపం! "ఆదికవిభేద మిందేమి యవసరంబు" అంటూ ప్రశ్నిస్తూ, పైఁగా అంతటితో సరిపెట్టక, "దురభిమానంబు నీలోన దొరలికాక" అనికూడా

పైని కొసరువేస్తారు. ఆయీసందర్భాలు యెన్నని యెత్తిచూపేది? చూపడమే వస్తే వొక్క త్రిలింగ చాలుతుందా? నేంటి తెలుఁగు పత్రికలన్నీ కలిస్తే కూడా చాలుతాయా? యింతటి అమాయికసార్వభౌములెక్కడేనా వుంటారా? యేప్రసక్తిన్నీ లేకుండానే భారతాన్ని గుఱించి అన్నిపద్యాలు పిచ్చిగానీ యెత్తి దానిపీఠికలో వ్రాస్తామా? పైఁగా నన్ను నేను, "నక్కపోతని" ఉపమించు (పోల్చు) కోవాలష! సరి! యెవఁడేనా తన్ను తాను "నక్కపోతునని, కుక్కపోతుననీ" ఉపమించుకుంటాఁడా? విమర్శకుడుగారు యెన్నెన్నో బూతుఁగూఁతలు కావుకావు అమాంగళ్యపుకూఁత లుపయోగించినప్పుడు యీ "నక్కపోతు" కూఁత మాత్రం అంతకు తీసిపోయిందని కాఁబోలు నాకు వదలిపెట్టారు. వారే వుపయోగించవచ్చునే? యిది. "పదియవనాఁటి" వగైరా మృదు ప్రసంగముకంటె చెడిపోయిందా? లేదా? "దున్నపోతు" అని కూడా ఉపమించి కసితీర్చుకోవచ్చునే? యేమంటారా! దున్నపోతు పోలికలో ప్రస్తుతం చాలా బలహీనస్థితిలో వున్ననాకు అది పంచగురువులలో వొక గురువు మామగారు వాడేదికనక ఆశీర్వచనంగా పరిణమించి దున్నపోతుకు వుండే బలపరాక్రమాల్లో యేశతాంశమేనా నాకు అంటుకొని ఆయనగారి చొప్పదంటుశంకలన్నిటికీ యీలాగే సమాధానాలు వ్రాస్తూ ప్రజ్ఞలోకంచేత "యీయనకేం మతిపోయిందా?" అని పరిహసింపఁ బడడానికి కొంత వుపకరిస్తుంది కదా? ఆదున్నపోతుపమానం! అంతేకాక ముసలికి, రోగికి కృతికన్యాదానం చేసిన పూజ్యులు వానిక్షేమం కోసం పడరానిపాట్లు పడాలి. నేను శ్రీజయంతి పంతులుగారికిన్నీ, శ్రీజయపురం మహారాజావారికిన్నీ మిక్కిలి వృద్ధులకు పిల్ల (కృతి) నిచ్చిచూడండి? యేలావ్రాశానో? శ్లో॥ భార్యాగతాది వమథాపి మమోద్భభూవ కన్యాద్వయం జగదతీత కలావిలాసం జామాతరావతి తరాం జరఠౌ చలబ్ధౌ సర్వాత్మనాయుషి భత్కరుణా శరణ్యా" ఆశ్చర్యం. ఆశ్చర్యం. పైఁగా నాకు-

ఎక్కడో బ్రహ్మదేవుఁడు వ్రాశాఁడఁట? అందుచేత కవితావిషయంలో నాకు పేరు దక్కిందష? ఏమిటా దక్కుతా? యీలాటివారిచేత బండబూతులు తినడమేనా? యెదురు తిరిగి నేను-

"అయ్యా! యెక్కడనో? అన్నారుగదా? అదియెక్కడ? యెవరు కనిపెట్టినారు? లేక..." ...అంటూ ప్రశ్నిస్తూ గేలిచేస్తేగతేమిషో! అయొచ్చేదీ, పయొచ్చేదీ తెలుసుకోవద్దా? నాలాగ "కవితాలలనమొగంబు బూడిదంబులిమెడి" వారిలో చేరేవారు కారుకదా? వీరు కుంకుమతో పులిమేవారు. వేదజ్ఞానంలేని వైదీకం యెంతశోభిస్తుందో? లోకజ్ఞానంలేని లౌకికమూ అంతేశోభిస్తుందనుకుంటాను. రెండిటికీ మారెండు వ్యక్తులున్నూ లక్ష్యంగా నేఁటికాలానికి భగవంతునిచే సృష్టింపబడ్డాయి కాఁబోలును. ప్రశ్నల వైఖరేమో? అలావుంది. ఆప్రశ్నలకు సమాధానం రాలేదంటూ నెపం వకటా? చూడండీ యింకోప్రశ్న.

"ఉపపతియా? (అంకుమగఁడా) అగ్రాసనాధిపతి?" అని కాశీ కృష్ణమాచార్లగారిని గుఱించి ప్రశ్నించారు. దీనిముద్దు లోకంగమనించి మెచ్చి మేంకతోలు గప్పుతుందని మామామగారితాత్పర్యంగదా! దీన్ని విమర్శించవలసివస్తేనో, మొగుఁడుగాని, అంకుమొగుఁడుగాని వుండవలసివస్తే ఆడాళ్లకేగాని మొగాళ్లకుఁ గాదుగదా? తి. వెం. కవులు మొగాళ్లా? ఆడాళ్లా? వొకవేళ విమర్శకులు "అంకుమొగుణ్ణి కట్టిపెట్టడానికి ఆఁడాళ్లే" అంటారేమో? అనరు. కృతికన్యకను దయచేశారుగదా? అందుచేత సమన్వయించదు. లక్షణ చెప్పవలసివస్తుంది. అలక్షణ వాళ్లపెళ్లాలకో? తల్లులకో? నాయనమ్మలకో? అమ్మమ్మలకో? అనే అర్థాన్ని తీసుకువస్తుంది. వాళ్లుదుష్ప్రవర్తనగలవాళ్లే అయితే యేమోగాని, సత్ప్రవర్తనగలవాళ్లే అయితే అలా అపవదించినవ్యక్తి యిహపరాలకు రెంటికీ దూరం అవడంలో సందేహ ముంటుందా? పద్యం సాఫుగానే వుందని నేనూ వొప్పుకుంటాను. దానికి సేల్జోడుబహుమానం మినహాయించండి. తుట్టతుదకు యీలాక్షణికార్థంవచ్చి తీరుతుందనిన్నీ, కంఠంపట్టుకుంటుందనిన్నీ, లోకం యేవగించుకుంటుందనిన్నీ తెలిసేవుంటే విమర్శకుఁడు గారు పాపం ఆలా చిత్రించి వుండరు. తెలియకపోవడానికి కారణం వొక్క లోకజ్ఞానవైధుర్యంమాత్రమే కాదు. శాస్త్రజ్ఞాన వైధుర్యంకూడా దానిలో చేర్చుకోవాలి. దీన్నిబట్టే నేను "శాస్త్రజ్ఞులుగాని" అని వీరిని గూర్చి నన్నయ్యవ్యాసంలో వ్రాస్తిని. దానికి నామీఁద వీరికి కోపంవచ్చింది. నన్నయ్యధారతో (తత్సమధారతో) నేను యేయితరకవుల ధారలు (ఆవిషయంలోనే) తులఁదూఁగవని వ్రాశాను. తూఁగేవి వున్నట్టు వీరు కొన్ని పద్యాలమొదళ్లు సూచించారు; అయ్యో! దేవుఁడా ఆపద్యాలు ఆమడదూరంలో కూడా నిలబడలేవు. పనిపడితే ఆయీవిషయం కవులలోకూడా యెవరికోగాని అవగతమయ్యేది కాదు. వీరు చూపినపద్యాలన్నీ వాడివడపోసి వ్రాసినమాటే అది. అందుచే యేమాత్రమో కూర్పునేర్పు మాత్రంతో సర్వజ్ఞత్వానికి దిగి "మనవెంకటశాస్త్రి నీతిమాలిన, తెల్విమాలిన, పనికిమాలిన, వ్రాఁతల్" అని వ్రాయడానికి సాహసించిన విమర్శకుఁడుగారికి ప్రస్తుత విషయం బొత్తిగా బోధించదు. నేను బోధించడానికి ప్రయత్నించినా లాభంలేదు. అని ప్రమాణంచేసి (చెప్పవలసిన విషయం కనక) చెప్పక తప్పిందికాదు. గర్వోక్తిగా భావించవొద్దని అభ్యర్థన. (వచ్చునె? ... ... యేమిచ్చినఁగాని, కానలకు నేగినఁగాని హరిప్రబోధముల్) అన్నాఁడు ప్రహ్లాదుఁడు. ఆయీ విషయము యీమధ్య యీవిమర్శకుఁడుగారి సన్మానసభకు అధ్యక్షులుగా వుండిన పిఠాపురపు కాలేజీపండితులు నిర్ణయింప వలంతులవుతారని వారి ముఖపరిచయం నాకులేకపోయినా వినికినిబట్టి విశ్వసిస్తూ బరాతం పెడుతూన్నాను. "కోవెత్తికవితాతత్త్వ మీశ్వరో వేత్తివా నవా" నేనల్లా విమర్శకుఁడుగారు నన్ను యెన్నితిట్టినా

ధారసాఫుగా వుండనేదానికే సంతోషించాను. తిట్లకేమి? వాటిశిఖా కోసినతిట్లు అవి గాలికిపోతాయి! అని నన్నయ్య వ్యాసంలో దులపరించి బహుమానానికి ఆహ్వానించానుగదా.

"ఉపపతియా? అగ్రాసనాధిపతి పల్లకిలో" అన్న కూర్పు యెంతో చక్కఁగా వుంది. యతికిఁగాని, ప్రాసకుఁగాని తడుముకొన్నట్లులేదు. అయితే కవిత్వమంటే? "యతియుం బ్రాసయుఁగూర్పు మాత్రమే" అగునా కాదుగదా? అయినా నేను రసపిపాసకుణ్ణి. ఆధారకే సంతసించి మా అమ్మమ్మల్ని, నాయనమ్మల్ని కూడా అన్వేషించే తిట్లను గణించనేలేదు.

సేల్జోడు బహుమతీ యిద్దామనుకున్నాను. నామనోరథాన్ని విమర్శకుఁడుగారు అధఃకరించారు. వారివూరువెళ్లి అక్కడ దాన్ని సమర్పించుకోవలసిందిగా ఆజ్ఞాపించారు. కాని అట్లాంటి ఆచారం లేకపోవడంచేత వుపరమించుకోవలసి వచ్చింది. యీ బహుమతీ జరిగేవుంటే విమర్శకుఁడు గారు నన్నువుద్దేశించి వాడిన "వెఱ్ఱివెంకటాయ" పదం సార్థకమే అయిందని కొంద రనుకొనేవారు. ప్రాజ్ఞులు సంతసించేవారు. యీమాత్రం ధారతో యతిప్రాసలు కూర్చువారు ఆసీమలో అనాదిగా పలువురు వుంటూవున్నారు. శాస్త్రజ్ఞత్వం మాత్రం యెక్కడోగాని వున్నట్టు యీకాలంలో కనపడదు. పూర్వకాలములో యింత శూన్యం కాదు. యిది విషయాంతరం. తిట్లు బాగా తిట్టితిమిగదా? కసిదీరా అనిమాత్రమే యీవిమర్శకులు సంతోషించుకున్నారుగాని వాట్లవల్ల తేలేతత్త్వాన్ని పాపం? ఆయన గమనించుకోలేదు. అవి ఆత్మాపకారకా లవుతా యనుకొన్నారా? లేదు.

"బాబుకుఁ బెండ్లియౌ ననుచు బాలుఁడు సంతసమందె" అంతే, పాపం! వీట్లనుగూర్చి నాకువున్న అభిప్రాయాన్ని తెల్పేపద్యాలున్న పుస్తకాన్ని వీరు సపుత్రకంగా కొంత గూఢంగా మావూళ్లో మాయింటి పడమటివసారాలో గుడ్డకుర్చీమీఁద అనారోగ్యంగా కూర్చుని వున్ననాకు యిప్పటికి రెండేళ్ల ఆఱుమాసాలనాఁడు దర్శనం యిచ్చినప్పుడు (జయంతిని) సమర్పించి వున్నాను. అప్పటికి వీరితిట్లపుస్తకం రచింపఁబడి వున్నప్పటికీ ముద్రితం కాలేదని శ్రీయుతులు పోవూరి వేంకటేశ్వర్లుగారిచే వీరు వ్రాయించిన వుత్తరంవల్ల తెలుతుంది. నేను వీరికి సమర్పించిన జయంతిలోవున్న-

శా. నన్నున్దిట్టి జయింపలేరెవరు విన్నాణమ్ములేనట్టివా
రి న్నీచంపువిధానకగ్గమయి రా యీ తిట్లెనాకిచ్చు సం
పన్నత్వమ్ముఁ గవిత్వ మెవ్వరు ననుం బ్రాజ్ఞత్వపర్యాప్తిమై
దున్నంగా లిఖియింతురో? పరమబంధుల్ వారు నాకెల్లరున్.

అనే పద్యమున్నూ-

శా. ఈమంత్రార్థము నే నెఱింగినటు లింకేయార్యులు న్నేర రే
నీ మంత్రమ్ము జపించియే జయముమై నేపారితిన్‌దిట్లు నా
కేమిన్ రావనుకోకుఁ డందుననునింకే యొజ్జలుం బోల రే
నేమో? తిట్టెడివారిఁ దిట్టకయె హాయి న్విందు నాతిట్టులన్.

అనేపద్యమున్నూ వీరు చదవకుండానే వుంటారా? చదివివుండిన్నీ తమపుస్తకంలో వున్న తిట్లను సవరించుకోక పోవడంవల్ల వీరియెడల దైవాని కప్పటికప్పుడే చేసిన అనుచితప్పనివల్ల ఆగ్రహం కలిగిందనిన్నీ ఆకారణంచేత సవరణ చేసుకోకుండానే ముద్రణం చేసుకొమ్మన్నాఁడు కాబోలుననిన్నీ అనుమానించవలసి వచ్చింది. యిక్కడనొక అవాంతర విషయం పైపద్యంలో అతిరుఘిడితిగా స్ఫురించింది. యీలాటి వెన్నో నాకవిత్వంలో నాకు అప్పుడప్పుడు గోచరిస్తూ వుంటాయి. కాని అవి యితరులకు గోచరించి వ్రాయవలసిన రహస్యాలుగాని గ్రంథకర్తకు గోచరించినా వ్రాయఁదగ్గవి కావు. వ్రాసుకుంటేనో? యెవరోతప్ప తక్కినవారు గేలి చేస్తారు. యెక్కడోగాని సహృదయులుండరు. అందుచే వ్రాయకూడదు. అయినా యిక్కడ వ్రాస్తున్నాను. నేను యేపుస్తకాన్ని అచ్చుపడ్డదాన్ని వీరికి యిచ్చి వున్నానో? అయిచ్చేసమయానికి వీరెవరో నాకు సుతరామున్నూ తెలియదుగదా? అంతకు పూర్వమో అంతకంటే తెలియదు. తి. వెం. కవుల గ్రంథ విమర్శనం అన్నపుస్తకమంటూ యెవరేనా వ్రాసేరన్నసంగతేనా అప్పటికి నాకు తెలుసునా? తెలియదు. అదిన్నీకాక అప్పటికే అచ్చుపడి ఆఱుమాసాలకు సుమారుకాలం అతిక్రమించిందికదా? జయంతికి; అట్టిజయంతిపుస్తకంలో విమర్శకుఁడుగారి యింటిపేరికి వికృతి అయిన "ఒజ్జ" పదం వుండడానికి నాలో నాకే ఆశ్చర్యంగా కనపడి అది దాఁచుకోలేక పత్రికక్షులు గేలిచేస్తారని యెఱిఁగికూడా యిక్కడ వుటంకించాను. అంతమాత్రమే కాదు. యీయన శుద్ధ తిట్టుమోతు అనికూడా ప్రకరణవశంచేత ఆపద్యార్థంవల్ల తేలుతుంది. ఇంతేకాదు. "ఒజ్జ" పదానికి ప్రకృతిగావుండే పదం యింటిపేరుగాగలవారైతే తిట్లల్లో ప్రజ్ఞకలవారే గాని పనిపడితే ఆ తిట్లల్లో నాకు వారు తీసిపోయేవారేగాని, హెచ్చేవారుకారనిన్నీ నాకు వచ్చినతిట్లు నేనెన్నఁడూ వుపయోగించననిన్నీ, వుపయోగించినా అందులోకూడా కవిత్వపదార్థంవుండి "క. వీఁడా? నాకొకకొడుకని గాడిద యేడిచెగదన్న ఘనసంపన్నా?" అన్నట్లుంటాయిగాని, యింత అయుక్తంగా వుండవనిన్నీ, అందులోనున్నూ నన్ను తిట్టేవారిపట్ల వాట్లని భొత్తిగా వుపయోగించే వుద్దేశం నాకు అసలే కలుగదనిన్నీ, నేనల్లా వారు నన్నుతిట్టేతిట్లు హాయిగా వినడమే చేసి ప్రచురించి వూరుకుంటాననిన్నీ ఆపద్యార్థం

వ్యాఖ్యానిస్తుంది. ఆయీ సందర్భం ప్రస్తుతానికి యెంత అనుగుణంగా వుందో? విజ్ఞులు విచారింతురుగాక. ఆయీవిశేషం నాకిప్పుడే స్ఫురించిందని మొదటనే వ్రాసి వున్నాను. యింకోమాట యిక్కడ వ్రాయవలసింది మఱిచాను. నేను విమర్శకుఁడుగారి యింటిపేరుగాని పేరుగాని యింతవఱకెక్కడా వుదాహరించనే లేదు. దానికి నేను చెప్పఁదలచిన కారణం.

"శ్లో. ఆత్మనామ గురోర్నామ... న గృహ్ణీయాత్"

అన్న అభియుక్తోక్తియే! వీరు నాకు పంచగురువులలో వకగురు స్థానం అని మొదటనే సూచించి వున్నాను. జయంతిలో ప్రకృతివికృతిభావ ప్రకారంగా వున్న యింటిపేరు బుద్ధిపూర్వకంగా వ్రాసింది కాదుకనుక ఆ నిషేధానికి నేను గుఱిగానని ఆయాశాస్త్రజ్ఞులకు మనవి చేసికొని ప్రస్తుత మందుకుంటూ వున్నాను. వీరు నన్ను యెంత పచ్చిగా తిట్టినా నాకు వీరి కవిత్వంలోవుండే సాఫుదనమే ముఖ్యంగా కావలసింది. అందుకే నేను వీరిని సమ్మానింపఁదలంచిందని నన్నయ్యవ్యాసంలోనే నొక్కినొక్కి వ్రాసి వున్నాను. దాన్ని స్వాగతంలో– "కత్తిఝుళిపించడాన్ని వుటంకించినవారు చదివి గ్రహించే వున్నారు. శిష్టావారు అంతశ్రద్ధగా దాన్ని చదవేలేదో? లేక అసలే చదవే లేదో? వీరివిమర్శనాన్ని నేను అభినందించినట్లే అభిప్రాయపడి ఆ విధంగా వీరిని మెచ్చడం జరిగింది. మెచ్చదగినశంకలు వున్నప్పటికీ నేను మెచ్చలేదంటే అదినాకుకళంకు. విమర్శకుఁడుగారు మాత్రమేకాదు. యెవరేనా ఆ ప్రశ్నలలో సారవంతమైనది వుందంటే నేనున్నూ వప్పుకుంటాను. వొప్పక తప్పుతుందా? వాది ప్రతివాదులు వొకరివాదాన్ని వేఱొకరు మెచ్చడమంటూ వుండనేవుండదన్నది సామాన్యపుమాట గాని విశేషపుమాటకాదు. ఆ పక్షంలో నేను వీరికవిత్వం సాఫుగా వుందని, త్రికరణశుద్ధిగా వొప్పుకోవడమే కాకుండా దానికోసం వీరిని సమ్మానించడానికి ఆహ్వానించడం యేలా సంభవిస్తుంది? దీనిచేతనే ఆ సామాన్యపుమాట వెం. శా. గారికి ప్రతిబంధించేదికాదని ప్రాజ్ఞలోకం విశ్వసిస్తుంది. వున్నంతలో గుణాన్ని అంగీకరించడమే నామతం. ప్రతి వాఁడికవిత్వమూ బాగానేవుందంటూ సర్టిఫికేట్లిస్తూవుంటావు, నీకేమేనా మతి వుందా లేదా అంటూ మాతిరపతిశాస్త్రి నన్ను గేలిచేస్తూవుండేవాఁడు. ప్రతివాణ్ణి విద్యార్థిగా చేర్చుకొని యేదో చెప్పడమే నాపని. ప్రాయోపవేశావస్థలో వున్నయిప్పుడుకూడా "బ్రామి" నైసతేనేమి, "నాన్ బ్రామి" నైసతేనేమి, సుమారు పదిమందికి తక్కువగాలేరు. యిక్కడ వీళ్లని గుఱించి యెందుకు వ్రాస్తానంటే? ప్రస్తుత మవడంచేతనే, అప్రస్తుతపు వ్రాఁత వ్రాయడం నాలేఖినికి బొత్తిగా చేతకాదు. మావిమర్శకుఁడుగారు వారి (ధూళిపూడి) గ్రామానికి సన్మానించే సదూహతో నన్ను రావలసిందని ఆహ్వానించారు గదా? నాకుకావలసిన సదుపాయాలు లోఁగడ వుటంకించి

ఖర్చులు సుమారు నలభై యాభై రూపాయీలదాఁకా తగులుతాయేమో? అని వుజ్జాయింపుగా సూచించి వున్నాను. దాన్ని యిక్కడ తపిసీలుగా గుటికి బారెఁడు హెచ్చుతగ్గులో వివరించడం అవశ్యకం కాకపోదు. యీ విద్యార్థి మూఁకంతా నాతో యెప్పుడూ రాదు. వృథాగా ఖర్చులు తగిల్చే దురుద్దేశంతో యీమూకని యిప్పుడున్నూ తీసుకు వచ్చేదిలేదు. నాభార్య స్వర్గస్థురాలయే సమయానికి సుమారు యేడేళ్ల శైశవావస్థలోవున్న కడసారికుఱ్ఱవాఁడు ప్రస్తుతం పదేళ్లవాఁడైనప్పటికి నేనెక్కడికివెడితే అక్కడికి- "తాడుతో దబ్బనం"గా తప్పఁడు. వాఁడికి సంరక్షణార్థమైతేయేమి, సహాధ్యాయిగా చదువుకైతే ఏమి యింకో విద్యార్థి పెద్దటిక్కెట్టు వయస్సు వాఁడే వస్తాఁడు. యిక్కడికి టిక్కెట్టున్నఱగదా? నాసంరక్షణకంటూ వక పెద్దవిద్యార్థి కౌముది చదివేవాఁడు వుండాలి. కానీ బెజవాడలో వంతెన దిగడం యెక్కడం యీలాటి చిక్కువుండడంచేత యిప్పుడు కౌముది చదివే విద్యార్థి వయస్సు చేత పెద్దవాఁడేగాని నన్ను యెత్తుకొని "దండాడించడానికి" (దండాడించడం పెళ్లిలో నాగవల్లినాఁడు మావైపున జరుగుతుంది. పెళ్లికొడుకునీ, పెళ్లికూఁతుర్నీ చెఱివకరున్నూ యెత్తుకొని బుక్కాతో తెయితక్కలాడతారు. ఆవంతెనమెట్లల్లో యెత్తుకు నడిచేటప్పుడు అలాగే వుంటుందన్నమాట) తగ్గంత శక్తికలవాఁడు కాఁడు. అందుచేత అసలు ధూళిపూడినుండి పనిపడితే నన్నుయెత్తుకొని బెజవాడ బ్రిడ్జిమీఁద "దండాడింపు" చేయడానికి యెవరేనా రావలసి వుంటుంది సమర్థులు. యీవచ్చేవారు తిరిగి మాగ్రామం వచ్చేటప్పుడు ఆవంతెన గండం దాఁటేవఱకే కాని మాగ్రామం చేర్చేవఱకూ వుండ నక్కఱలేదు. అయితే అసలు బెజవాడలో దిగడంతో అవసర మేముంటుంది? ధూళిపూడికి (తఱుకోయిమాచారంగా) తెనాలి దాఁకా యెకాయెకీనే ప్రయాణం చేయరాదా? అని ప్రశ్నిస్తారేమో? ఆయనే వుంటే మంగలాణ్ణి పిల్చి పెట్టునన్నట్టు ఆశక్తి లోపించిన అవస్థలోకి వచ్చి యిప్పటికి కప్పుడే పదేళ్లు దాఁటింది. యిప్పటిస్థితి చెప్పవలసివుండదు కదా? యిది ప్రాయోపవేశావస్థ, మదరాసు ప్రయాణం, పొన్నూరుప్రయాణం, నిన్నమొన్న నవరాత్రాలలో చేసిన తెనాలి ప్రయాణం, యివన్నీ బెజవాడలో మొదట మకాంచేసి తరవాత మళ్లా మఱునాఁడో? మూఁడోనాడో? రైలెక్కినవే మళ్లా తిరిగీ వచ్చేటప్పుడు బెజవాడలో దిగినవే. వారివారిని కనుక్కుంటే దీనియథార్థం తెలుస్తుంది. బ్రిడ్జిమీఁద "దండాడింపు" యిప్పటి కెప్పుడూ జరగలేదు. ఆసమయానికి భగవంతుఁడు యేలాగో కఱ్ఱసహాయంతో ("వృద్ధో యాతిగృత్వా దండం") ఆ గండందాటే శక్తిని యిస్తూవున్నాఁడు. ఆపక్షంలో యింకో టిక్కెట్టు వృథాగా యెందుకు తగల్చవలసి వుంటుందంటే? తీరా అవసరమైతే అప్పుడు మనకు అక్కడ మోసే మనిషి యెక్కడనుంచి సప్లయి అవుతాఁడో? ఆలోచించండి. పెట్టెలూ, బేడలూ మోసే రైలులైసెన్సు కూలీలు పనిపడితే మనిషిని సజీవుణ్ణి కూడా మోస్తారా? స్పెషలుగా ఆమోఁతక్కూడా వాళ్లు

అంగీకరించి సిద్ధపడినా? యీటిక్కెట్టు చార్జీకంటె యెక్కువే అడుగుతారో? యింకా అంతకంటేనూకూడా సమయాన్నిపట్టి మఱీన్నీ యెక్కువబిల్లు చేస్తారో? అందుచేత మనం ముందే జాగ్రత్తపడడం మంచిదికదా? ("జాగ్రత్తా తోభయం నాస్తి") యిక్కడికి మూడు టిక్కెట్లన్నఱతేలింది. నాకు దూరప్రయాణానికయితే సెకండు క్లాసుగాని దగ్గిఱప్రయాణమే కనక యింటరు చాలును. నావ్యాధి ఆవలీవలికి తఱచుగా వెళ్లేపద్ధతిలోది కావడంచేతగాని ఆచిక్కేలేకుంటే? యింటరులోకాకపోతే గౌరవానికి లోపం వస్తుందని నేనెన్నఁడు అనుకోను. యేంచేసేది. "అవస్థాపూజ్యతే రామ" అని యెవరెఱుఁగరు? యిక్కడికి రమారమీ అయిదు "థర్డుక్లాసు" టిక్కెట్లదాఁకా దేఁకినట్లయింది. యింకా కొన్ని సాదరుఖర్చులు గుఱ్ఱపు జట్కాలు వగైరాల బాపతు వుంటాయికదా? నేను రోజువారీగా పుచ్చుకొనే మందులు నేనే తెచ్చుకుంటాను. నల్లమందుసహితంగా, వకప్పుడు అవసరం పడితే ఆమందులు సమీపంలో వుండేపట్నానికి యెవరేనా వెళ్లి తీసుకురావలసి వస్తుంది. (దీనికి నేనే సొమ్ముయిస్తాను.) చాలా రోజులు వుండవలసివస్తే తప్ప మూడునాల్గురోజులయితే యీ మందుల సప్లయిచిక్కువుండదు. యేమో? వెళ్లేది పొరుగూరుగదా? యెన్నఁడూ వెళ్లలేదు కూడాను. యెన్నాళ్లు పడుతుందో? యిప్పుడు ఆగ్రహంగావున్న విమర్శకుడిగారికే నామీఁద అనుగ్రహం కలగగూడదా? లేదా ఆవూళ్లో చాలామంది సంపన్న గృహస్థులున్నారని వినికి వారికి నామీఁద అభిమానం కలిగి మఱి కొన్నాళ్లుండవలసివస్తే వస్తుందేమో? అభిమానానికి కారణం లేకపోలేదు. వారివూరి విమర్శకులు నన్ను యెన్ని తిట్టినా, వాట్లను నేను సహనంతో వెట్టివెంకటాయ మాదిరిగా దులపరించుకొని శిరసావహించి వారియందుండే యేదోగుణాన్ని పురస్కరించుకొని-

"పరగుణపరమాణూన్ పర్వతీకృత్య"

అనే భర్తృహరి వాక్యానుసారం గౌరవించడానికి ఆహ్వానించడం కంటె వేఱొకకారణం యేంకావాలి. రెండోది వారివూరి విమర్శకులు నన్ను సమ్మానించడానికి ఆహ్వానించినప్పుడు వారు సామాన్యగృహస్థులవడంచేత వారికి మనంకూడా తోడ్పడదామనే వుద్దేశం వారికి కలిగినా కలగవచ్చు. దీన్ని యిప్పుడు నిర్ణయించలేము. నాకు నాజీవితకాలంలో జరిగినవన్నీ యీలాటి సందర్భంలో జరిగిన సమ్మానాలే. వాట్లని వివరించవలసివస్తే చాలా పెరుగుతుంది. కనక వుపేక్షిస్తాను. అందుచేత యీధూళిపూడి ప్రయాణంకూడా తుదకు అలాగే పరిణమిస్తుందేమో అని అనుమానించవలసి వచ్చింది. యిది వుత్ప్రేక్ష కాదు. ఆమధ్య శ్రీరావుగంగాధరరామారావుబహద్దరుగారి షష్టిపూర్తికి మద్రాసు వెళ్లి యెవరికీ తెలియకుండానే వద్దామని సంకల్పించుకుంటే తుదకు అది ఆలా కాలేదు. శ్రీరాజావారి

పెద్దసమ్మానమేకాక గౌరవనీయులైన గవర్నరుగారు లోనగువారు వేయిన్నూటపదార్లు తలవనితలంపుగా సమ్మానించి వున్నారన్నది లోకప్రసిద్ధం కనక విస్తరించేది లేదు. నేనిప్పుడల్లా విమర్శకుఁడుగారివల్ల పొందదలఁచిన సమ్మానం. "కౌపీన సంరక్షణార్థ మయం పటాటోపః" గాని నాప్రస్తుతావస్థనుబట్టి అంతతోటే సంతృప్తి పడతానని వారికి మనవిచేసుకుంటూ వున్నాను. యిదివరలోకూడా మనవి చేసుకున్నాను. "మూఁడడుగుల్ మేరయ ద్రోయకిచ్చుటయె బ్రహ్మాండమ్ము నాపాలికిన్" అన్నమాదిరి ధోరణిలోకి దిగే కపటమేమేనా నామాటలలో వుందేమోనని విమర్శకుఁడుగారుగాని, వేఱొకరుగాని అనుమానపడనక్కఱలేదు. అట్టిబేరాలు నేనెక్కడా చేసివుండలేదు. యేమిస్తే అదే పుచ్చుకొని సంతోషించడమే నాప్రధాన ప్రకృతి. పోతరాజుగారి "క. వ్యాప్తింజెందక వగవక, ప్రాప్తంబగు లేశమేని పదివేలు" అనేపద్యం నాకు కంఠోపాఠం. నాకు (పొరబాటుచేతో యేమో? రూపాయనుకొనే అవుతుంది.) అర్ధణాకాసు (ఇప్పుడివి అమల్లోలేవు) యిచ్చి సమ్మానించినవారు కూడావున్నారు. అయితే శంకాసమాధానాలతో చేరిన వ్యాసంగనక దీనిమీఁద వచ్చే పూర్వపక్షానికి జవాబు యిప్పుడే చెపుతున్నాను. నైజాం యిలాకా వనపర్తి సంస్థానంలో పదిరూపాయలు యిస్తే, "పదిరూపికలిచ్చినావుగా" అంటూ యెందుకు తగువులాడవలసివచ్చిందీ? అని శంకిస్తారేమో? బహుశః యీశంక యిదివఱలో విమర్శకుఁడుగారు వారిగ్రంథంలో యెక్కించే వుంటారేమో? అందులోవున్న శంకలన్నీ యీమాదిరివేకదా? ఆపుస్తకం ప్రస్తుతం నావద్ద లేకపోవటంచేత నిశ్చయించి వ్రాయలేకపోయాను. పనిలోపని యింకొకటి వ్రాస్తాను. విమర్శనపుస్తకాలు వందో? యేభైయో? నావద్దకు వారు పంపితే యెవరేనా ఉచితంగా కోరితే ఉచితంగా యిచ్చిన్నీ, రు.1-0-0 యిన్నీ ఇచ్చి పుచ్చుకుంటే ఆప్రకారంగా యిచ్చిన్నీ, వసూలైన ఆసొమ్ము పువ్వులలోపెట్టి వారికి (మనియార్డరు ఖర్చుపోను) పంపించుకుంటాను. నాకు పుస్తకాలవర్తకం వుండడంచేత యిది వారికి అంగీకారమైతే యీసహాయంచేస్తాను. దానివ్యాప్తివల్ల నాయశస్సు అభివృద్ధి చెందుతుందనే పూర్ణవిశ్వాసంతోనే వారిని నేను యీవిధంగా అభ్యర్థించడం (క. నేరక కృతిచెప్పుట తననేరమి నపకీర్తి జగతినిల్పుట కాదే?) తరవాతమాట యేలాగవున్నప్పటికి ప్రస్తుతం వకపుస్తకం పంపవలసిందని ప్రార్థిస్తాను. యీవాదం యింతతో ముగిస్తే అక్కఱలేదుగాని యింకా యూరపుఖండ యుద్ధంలాగు సాఁగేయెడల అవసరమవుతుందేమో అని యీలా అభ్యర్థించడం. తొందరగా పోస్టుద్వారా పంపనక్కఱలేదు.

కొలఁది రోజుల్లో వారిగ్రామానికి నన్ను వెంటఁబెట్టుకొని వెళ్లనే వెడతారు కనుక అప్పుడు అడిగి తీసుకుంటేసరిపోతుందికదా! విమర్శకుఁడుగారు "హనుమత్పళ్లెం" మాదిరిని

నన్ను రమ్మని కోరడం ఆలా వుండఁగా ఆగ్రామంలో వుండే సంపన్నగృహస్థులు నన్ను ఆహ్వానించాలని అనుకొంటూ వున్నట్టు తెనాలిరైలులో వకరు ఆవూరివారే బ్రాహ్మణులు జానపాటివారు చెప్పివున్నారు. అందుచేతనైతేనేమి? యిందుచేతనైతేనేమి? ఆవూరి ప్రయాణం నాకు యేలాగా బ్రాహ్మ వ్రాసి పెట్టినట్లే వూహకు వస్తుంది.

శా. "ఏవేళ న్మతి యేస్థలమ్మునను నేయేరీతిగా నున్నదో
ఆవేళన్ మతియాస్థలమ్మునను ఆయారీతియైతీరు సూ
ర్యావిర్భావముఁ బ్రొద్దు గ్రుంకుటయు దృష్టాంతమ్ము లిప్పట్ల నీ
భావమ్మింత యెఱుంగధైర్యము మదిన్ బాటిల్లుఁ గామేశ్వరీ"

కాఁబట్టి వారికి లోగడ సంగ్రహంగా మనవిచేసుకున్నవికాక, చేదస్తంగా వున్నాయే అని విమర్శకులు పరిహసించేవైనా మరికొన్ని కూడా మనవి చేసుకొందునా? అయ్యా! నాకు వుండే వ్యాధిప్రకోపావస్థలో వున్నప్పుడు నేను పొరుగూళ్లోనే కాదు. స్వగ్రామంలో స్వగృహంలో కూడా స్తిమితంగా వుండేస్థితి చాలా దుర్ఘటంగానే వుంటుంది. దానికి కొన్ని వుపాయాలు "సవాకోటిదరిద్రాలకు అనంతకోటి వుపాయాలు" అన్నట్టు నేను యేర్పఱచుకొని గాజుకాయమాదిరిగా ఆయుశ్శేషాన్ని గడుపుతూవున్నాను.

మ. "ఎపుడున్ వ్యాధికి నర్ఘ్యపాద్యములుగా నెన్నెన్నొమందుల్ సమీ
పపుగూటన్ బదిలమ్ముచేసికొని నిన్ బ్రార్థించుచున్ వీలువ
డ్డపుడెల్లన్ భగవచ్చరిత్రములు వ్యాహారించుచున్ నేనిటుల్
కృపణత్వ మ్మెదగాఁగ నుంటి నిది నీదేచల్వ కామేశ్వరీ" ౬౧౨

అంకెనుబట్టి యీసౌభాగ్యకామేశ్వరిపద్యాలెన్ని వందలున్నాయో చదువర్లు గుణితిస్తారు. పద్యంలోవున్న అంశంవల్ల ప్రస్తుత జీవితవైఖరికూడా గ్రహిస్తారు. ఈ కారణంచేతనే నేనువాదానికి భయపడి శ్రీపోవూరి వేంకటేశ్వర్లుగారు నాకు మునియేడు వ్రాసిన (విమర్శకుఁడుగారి అనుమతిమీదనే అనుకుంటాను) వుత్తరాలకు అనగా విమర్శనగ్రంథం అచ్చుకాకపూర్వం అందులోకొన్ని మచ్చుకు శంకలు వుటంకిస్తూ వ్రాసినవుత్తరాలకుచాలా శాంతంగా, నిస్పృహగా మనవి వ్రాసుకున్నాను, వారావిషయం తెల్పకపోరనుకుంటాను. అదిఆలా వుంచి-అందులోదే (సౌభాగ్యకామేశ్వరిలోదే) యింకోటి వుదాహరిస్తే యింకా కొన్ని విశేషాలు బోధపడతాయి.

మ. "ఒక పన్నున్నది నాకు విఘ్నపతినో? ఒక్కండె కన్నుండె నా
కకవీంద్రుండనొ? తెల్పు మంబరొ? భవత్కారుణ్య మీనాకుఁద

క్కక దేవత్వము నిప్పుడే యిడినటుల్ గాఁదోఁచుఁజిత్రంబు వా
ర్థకదోషాలకుఁగూడ నబ్బెనిటు సార్థక్యంబు కామేశ్వరీ."

చాలును. పెరిగిపోతూవుంది వ్యాసం. వక్తవ్యాంశం యింకా మిగిలేవుంది. యీస్థితిలో వున్న నన్ను రప్పించదలఁచుకొన్న విమర్శకుఁడుగారు గాని (నేనువిన్నది నిజమే అయితే) ఆధూళిపూడిలో వుండే సంపన్న గృహస్థులుగాని యెంతత్వరలో కార్యధూర్వహులయితే అంతమాట దక్కుతుంది. జనవరినెలలోఁగాతప్ప నేను యిప్పటికంటె మంచిస్థితిలో వున్న పూర్వమప్పుడేనా ప్రయాణం చేయలేను. కారణం ఫిబ్రవరి మొదలుకొని మళ్లా అధమం జూనునెలాఖరులోగా నావ్యాధి నన్ను మఱీ బెదరిస్తూ వుండడమే. (యిప్పటిరీతి అన్నిటికీ బెదరఁదగ్గదే కదా!) యిల్లుకదలకుండా "కడుపులో చల్ల కదలకుండా" కాలక్షేపం చేస్తే చిక్కులేదు. అందుచేత జనవరి దాఁటకుండానే ఆ యీప్రయత్నం చేయాలిగాని తరువాత చేసి యేదో రావడానికి భయపడ్డాఁడనీ, యేమోఅనీ, యేమో అనిన్నీ, నెపపెడతారేమో? అని యీలా వ్యవధివుండగాఁ మనవి చేసుకోవడం. భయపడడం యెందుకు? చప్పట్లపర్వం జరుగుతుందనేనా? అయితే అది గ్రామంకాదా? వొకవేళ అదిన్నీ జరుగుతుందే అనండీ! అందులో కల్గే విష్ణుచక్రంకంటె యిదివఱలో విమర్శకుఁడుగారు అనుగ్రహించిన తిట్లల్లో తక్కువ అవమానం వుందా? దాన్ని నేను గణించేవాణ్ణి యెప్పటికీ కాను. యీలాటి విష్ణుచక్రాలవల్లనే నాపేరు (అసలేమేనా వుండడమే నిజమైతే) బయటికి వచ్చిందని "[illegible]త్త్యైర్యశీలభృతే" అనేవ్యాసంలో వ్రాసి వున్నాను. అట్టివారు నాకు అభినందించ వలసినవారు "ఏమహాత్ములు గల్గ భూమీశ సభలలోఁ గవులకు బహుళవిఖ్యాతి గల్గె" గతంలో జరిగిన చప్పట్లపర్వాల వల్ల నాకెంత నష్టం కలిగిందిన్నీ ప్రాజ్ఞలోకం యెఱుగనే యెఱుఁగును. అందుచేత-

శ్లో. "అవమానం పురస్కృత మానం కృత్వాతు పృష్ఠతః"

అని అనుకుంటూ రానక్కఱలేదు విధిగా సమ్మానమే జరుగుతుందని నమ్మియ్యేవే రానిశ్చయించుకొన్నాను. వస్తాను. నాకున్నదల్లా వొక్క అనారోగ్యప్రతిబంధకమే. నేను పెట్టిన గడువుమాత్రం మించనీయకండి. వారంరోజులు వ్యవధి వుంచి నాకు తెలపండి. యెందుకంటే? ఆ వ్యవధి దినములలో ఆహారాదులలో మఱీ జాగ్రత్తగావుండి మఱికొంత ఆరోగ్యాన్ని అభివృద్ధి పఱచుకోవడానికి ప్రయత్నిస్తాను. అంతే కాకుండా ప్రయాణానికి అనుకూలించే సుముహూర్తంకూడా వున్నంతలో వీలైనది చూచుకోవడం కూడా అవసరమేకదా! (యిది సున్నపుపిడత ప్రయాణం) తీసుకువెళ్లినందుకు మీకు మాటదక్కాలి. వచ్చినందుకు నాకున్నూ మాటదక్కాలి, యితరవిధయా రసాభాసైనా, అనారోగ్య విధయా

రసాభాసకాకూడదుకదా? భగవదనుగ్రహం యెట్టిదో కాని యింట్లో వున్నప్పుడున్నంత అనారోగ్యం అశక్తత యిల్లువదలిన ఉత్తర క్షణానన్నుంచే నన్ను వదలి పెట్టడం వుంది. దీన్ని గుఱించి చిరకాలంక్రితమే ఆలోచించి తేల్చుకున్నాను. సుమారు యిరవై రెండేళ్ల వయస్సులో వున్నప్పుడు శ్రీవేంకటగిరిసంస్థానానికి వెళ్లడం తటస్థించింది. అప్పుడు సంస్థానం వారిమీఁద చెప్పిన పద్యాలలో వకపద్యంలో యీశాపం తగిలిందని నాఅనుమానం. యేలాగా "వెఱ్ఱివెంకటాయ" బిరుదం రానేవచ్చింది, కనక ఆ బిరుదాన్ని పోషించే పిచ్చినమ్మకాలు కూడా యిందులో వ్రాస్తాను.

"చెడ్డకాపరానికి ముప్పేమిటి? మొండికాలికి చెప్పేమిటి?"

సీ. "పరసజ్జనావళుల్ పరమబంధులు గాఁగఁ
బరులయన్నము పుష్టికరముగాఁగ."

తక్కినది సందర్భనంలో చూచుకోండి కావలిస్తే, అందుచేత యిల్లు బయలుదేరడానికే బ్రహ్మాష్టో బ్రహ్మం గాని బయలుదేరి యింకా పరాన్నం తినకుండానే ఆరోగ్యమే కాదు, శరీరబలమేకాదు, కొంతఅభివృద్ధిలో వుంటుంది. ఆబరవసాన్ని పురస్కరించుకొనియ్యేవే. "కూర్చుండి కూడొండలేను వంగుండి తీర్థం" అన్నస్థితిలో వుండికూడా బలవదాహ్వానాలకు సిద్ధపడుతూ వుంటాను. అందులో యీ ఆహ్వానం సామాన్యాహ్వానమా? "కత్తేస్తావా? బద్దేస్తావా?" అన్నతరగతిలోదికదా? అయితే యిదేమిట్రాబాబూ? "నమాజు చేయబోతే మసీదు మెడబడ్డ"దని మెల్లగా యేదో మఱో సాఁకు చూచుకొని యీ వుద్యమం విరమిస్తె చెప్పఁజాలనుగాని, నా అంతట నేనుమాత్రం వెనకంజ వేసేదిలేదు. అప్పుడే "ప్రభువిచ్చె వేనూటపదియాఱులనునట్టి స్వప్నములే ధనార్జనములాయె" యింకాకొన్ని హిరణ్యాక్షవరాలు భోజనానికి సంబంధించినవైతే వున్నాయికాని, అవి సమకూర్చడానికి యెవరు గాని చేసే ప్రయత్నం లవలేశమున్నూ వుండ నక్కఱలేదు. కనక యిందులో వుటంకించి గ్రంథం పెంచలేదు. "శ్లో. ప్రక్షాళనాద్ధి పంకస్య దూరా దస్పర్శనం వరమ్" అనే న్యాయంచేత అసలే. యీప్రయాణం మానుకోరాదా? అని కొందఱు విజ్ఞులనవచ్చును. కాని వారిమాటలు యీగంగిరెద్దుకు రుచించవు. "మ. అఱకం గట్టిన గంగిరెద్దురుకదే! ఆత్మీయ వాద్యధ్వని స్ఫురణం బించుక విన్నన్," అన్న గీరతపద్యం యెఱిఁగినవారునన్ను వారించరు. వారించలేరూనున్నూ కనక- "నందో రాజా భవిష్యతి" వెళ్లే తీరతాను. విమర్శకుడిగారి సమ్మానాన్ని పొందే తీరతాను. వారివూరు నేను వెళ్లిన తరవాత నాకు అంతాజయమే కాదే అనుకుందాం. యేభయమూ లేదాయె. ప్రాణభయం కూడా లేని వార్ధక్యవయస్సాయె. యెందుకు జంకాలీ అంఛాను, నాసౌహార్దం వారికి వచ్చినట్లే అయితే లోఁగడ

నేనాహ్వానించిన ఆహ్వానమేకాక మళ్లా వారిని ముఖాముఖీనికూడా వారిగ్రామం వెళ్లినప్పుడు ఆహ్వానిస్తాను. గనక వారుకూడా మాగ్రామం వచ్చి, మాగృహం పావనం చేసి, నా అభినందన పద్యాలున్నూ సేలుజోడున్నూ దయతో స్వీకరించేటట్టున్నూ, నన్ను ఆశీర్వదించేటట్టున్ను అమాంగళ్యపువాక్యాలు మఱిచి పోయేటట్టున్నూ వారి వూరి వారిచేతనే గట్టిగా నచ్చఁజెప్పించి తిట్టినప్పటికీ ఆ తిట్లు గణింపక కృతి ప్రదాతను సమ్మానించాడు చెళ్లపిళ్ల అనే యశస్సును పొందే తీరతాను అనే దృఢవిశ్వాసంతో యీవ్యాసాన్ని వ్రాశాను. బొబ్బిలి సంస్థానంవారికిన్నీ, విజయనగరసంస్థానంవారికిన్నీ వున్న వివాదంకంటె మావిమర్శకుఁడుగారికిన్నీ మాకు (తి. వెం.) న్నూ యెక్కువ వివాదం వుందా? యిప్పటి బొబ్బిలి మహారాజావారి తాతగారున్నూ, శ్రీమదానందగజపతి మహారాజులుంగారున్నూ చాలా మైత్రిగా వుండేవారు. ఆలాగే లోఁగడ విమర్శకుఁడుగారు నన్ను తిట్టిపోసినప్పటికీ– "కొట్టితే కొట్టాఁడు కొత్త కోకెట్టాఁడు" అన్నమాదిరిగా నేను సంతృప్తిపడి వారిస్నేహాన్నే అభ్యర్థిస్తూ వుంటే దీన్ని యేలా తోసివేస్తారో చూస్తాను."

"బాజాలసందట్లో మంగళసూత్రాన్ని మఱచివున్నాను"

లోఁగడ వొకదాన్ని యెత్తుకొని దాన్ని సమాప్తి పొందించకుండానే యేదో ధోరణిలో పడి యేమేమో వ్రాశాను. అదేమిటంటే? "యేమిచ్చినా సంతోషించడమేకాని పేచీపెట్టడం నాస్వభావం కా"దన్నది. వనపర్తిసంస్థానం వగయిరాలు పరీక్షించి సమ్మానించే వవడంచేత ఆలా పేచీపెట్టవలసి వచ్చిందనేమాట లోఁగడనే వ్రాయవలసింది. మఱిచాను యిక్కడ వ్రాశాను. ఆఘట్టంలోకి జమకట్టుకోండి. ఆయీపద్యంవల్ల ఆపేచీ తాలూకు పూర్వోత్తర సందర్భం తెలుతుంది. వుదాహరిస్తాను–

"క. గానమ్ముకన్నఁ గవనం
బేనాఁడేనియును దక్కువే? నరవర; నీ
వీ నియతి విడిచి యిచ్చిన
నే నేమని సమ్మతింతు నెఱిఁగి యెఱిఁగియున్."

యెత్తుకొని యీలా మఱిచిన వింకా వుంటే వుంటాయేమో? వయోదోషంవల్లనూ, అనారోగ్యంవల్లనూ వచ్చే యీహంసపాదులకు చదువరులు నన్ను క్షమించాలి. నావంటివాఁడే వొకఁడు. గోచీ మఱిచి పోయితలపాగా మాత్రం పెట్టుకొని యెవరో ప్రశ్నించేటప్పటికి తొడమీద హంసపాదు వ్రాశాడఁట!

యిప్పటి నాస్థితి అట్టిదే! విమర్శకుఁడుగారి శంక లెట్టివో? వాట్లవాలకాన్ని చాలావఱకు బయటికితీసి చూపడమున్నూ జరిగింది. యీ చూపడం కొంత

వాచ్యంగానున్ను, కొంత వ్యంగ్యంగానున్నూ వుంటుంది. గనక చదువరులు బాగా గమనించాలి. వారుసమాధానపడక పోవచ్చును. గాని నేను వారికొఱకు మాత్రమే వ్రాయలేదుకదా? నన్నయ్యను పురాణాలు తెలిగించిన కవులలో చేర్చినదికదా? నాప్రధానాపరాధం; పోతన్నగారి ప్రవృత్తివల్ల విమర్శకుఁడుగారికి యథార్థం బోధపడి వుంటుందా? యింకా బోధపడదా? యిందుకేనా వారు సంతుష్టిపడితే వారికి వచ్చిన ఆగ్రహంలో నూఱువంతుల్లో 99 వంతులు సవరణ అవుతుంది. మా పెద్దలు కృతార్థులవుతారు. గుంటూరుసీమ అంతా తప్పులతడకే అయినా ముప్పై సంవత్సరాలు నిరాఘాటంగా ప్రచారం చేసి రెండు ముద్రణాలు పొంది సుమారు నాల్గువేల రూపాయలు సంపాదించుకుంది. యీ పైనిదాని ప్రచారం ఆగిపోయినా చిక్కులేదు. యెంతోకష్టించి వ్రాసిన విమర్శకుడుగారి ప్రయాసకు ఆమాత్రమేనా చారితార్థ్యం కలిగించడానికి నాఅభ్యంతరం లేశంకూడా లేదుగాని ఆచరిత్రను అమూలాగ్రంగా యెఱిగిన విమర్శకుఁడుగారి బంధువులే యెదురుకుంటారేమో కదా? ఆలా యెదురుకోవద్దనిన్నీ, వారు చాలా పరిశ్రమ చేసి వ్రాసివున్నారనిన్నీ యీతుట్టతుది వయస్సులో నేను యెవరినీ జయించే కోరికతో లేననిన్నీ వొకవేళ "పుట్టెను పుట్టిన గుణం" సామెతగా అట్టికోరిక నాకింకా పోకపోయినా "పిచ్చుక మీద బ్రహ్మాస్త్ర ప్రయోగానికి" సిద్ధపడేది లేదనిన్నీ కాబట్టి నాకోరిక చెల్లించవలసిందనిన్నీ వారిని ప్రార్థిస్తాను. ఆపద్ధతిని నీవీమాత్రం వ్రాయడం కూడా అవసరమే అని శంకిస్తారేమో? వినండి నేను విరమించుకొనే తలపుతో సమ్మానానికి అంతఃకరణశుద్ధిగా ఆహ్వానిస్తే దాన్ని వారు అన్యథాకరించి,

"మ. గతమేమో? గతియించెఁ గొంతఅదియున్ గయ్యాలతో గొంత శాం
తతతోఁ గొంత వృథాగఁ గొంత కవితానందమ్ముతోఁ గొంత యే
యిఁతి కర్తవ్యము లేక కొంత యెటులో యీపై భవచ్చింతనా
మృతరక్తిం గలిగించి ప్రోవుమని కే లే మోడ్తుఁ గామేశ్వరీ"

అని యిలువేల్పు కామేశ్వరిని ప్రార్థించుకుంటూ సర్వసంగపరిత్యాగినిగా వున్ననన్ను-

"తే. కొట్టవచ్చిన వారిని గొట్టఁ బోక
తిట్టవచ్చినవారిని దిట్టఁబోక
చతురుపాయమ్ములను శాంతి సతతమార్జి
తమ్ముగావలెనంచుఁ జిత్తమునఁ దలఁతు."

అని జీవితచరిత్రలో వ్రాసికొని తదర్థమై అవసరంలేని సందర్భంలో కూడా క్షమాపణయిచ్చి లోకానికి దాన్ని వెల్లడించి వున్ననన్ను-

యీ విమర్శకుఁడుగారు సంశయ విచ్ఛేదము అనే శీర్షికతో యింకా యేవేవో ప్రగల్భాలు వ్రాసి యీనాలుగు మాటలున్నూ బలవంతంగా వ్రాయించుకున్నారు. గాని యిది బుద్ధిపూర్వకపు వ్రాఁతకాదు. ఆలాటి వ్రాఁతే అయితే యింతఘాటు తగ్గివుండదని లోకమెఱింగినదే? (వెం. శా. కి కలిగిన సంశయ మేమిటో వీరు తీర్చేదేమిటో? ఆవ్యాసానికీ శీర్షికకూ వుండుకున్న "బదరీబాదరాయణ" సంబంధం తప్ప యితర సంబంధం యెట్టిదోతేల్చాలి) యిందుకు కారణం యింకోటి కూడావుంది. మొదట యీ గుంటూరు కలహం తెచ్చిపెట్టింది రాహుమహాదశలో శుక్రుఁడు యిప్పటికి మళ్లా శత్రుస్థానంలోవున్న శనిలో శుక్రుని అంతర్దశ వచ్చింది. వచ్చి యిప్పటికి ఆఱు మాసాలు కాబోలును అయింది- ఆకారణంచేతే, "ఆలర్కం విషమివ" అని భవభూతి చెప్పినప్రకారం చిరకాలానికి యిది మళ్లా రేగింది. యీలాటి తార్కాణంవల్లనే నేను జాతకాన్ని నమ్మేపిచ్చి వాళ్లల్లో వొకణ్ణిగా లోకంచేత పరిగణింపఁ బడతాను. ఆలర్కం, వెఱ్ఱికుక్క సంబంధమైన విషమని వ్యాఖ్యాత వ్రాసినట్లు జ్ఞాపకం. అది సకాలంలో నివర్తించక యేమాత్రం శేషించినా యెప్పుడో వకప్పుడు మళ్లా పొడచూపి బాధిస్తుందని సంప్రదాయజ్ఞులు అంటారు. ఆలాగే యిదిన్నీ. అప్పుడు వీరు 46 యేండ్లవయస్సులో వున్న ప్రాజ్ఞులైవుండికూడా "నలుగురితోపాటు నారాయణా, కులం తోటిపాటు గోవిందా"గా నాఁడు మమ్మల్ని ప్రత్యేకించి దర్బారు అనే పేరుతో వక పత్రికపెట్టి దూషించే మహానుభావులతో నేకీభవించి యేవోనాలుగురాళ్లు రువ్వితే, మళ్లాయిప్పుడు నాకు యీ పరిశ్రమ కలిగించ వలసి వచ్చేదే కాదు.

"సట్టాజు పెళ్లిలో గుట్టాజు కొకపోఁచ"గా అప్పుడే యేదో అయేది "గోళ్లని తీరేపనికి గొడ్డ"ళ్లన్నట్లు మళ్లా యీపరిశ్రమ తగిలేదేకాదు. కాని యీశనిలో వచ్చే శుక్రాంతర్దశకు దీన్ని వీరు మిగల్చడం అంటే? "న దుఃఖం పంచభి స్సహ" అన్నట్లు వారితో చేరక మీకు తిట్టడం బాగా చేతగాదు. అందుచేత నేను మీతో కలవను అని మాని స్వయంపాకస్థుల మాదిరిని శుద్ధశ్రోత్రియంగా పృథక్కుగాతిట్టడం అనేది దైవచోదితంగాని, యెన్నివిధాల ఆలోచించినా బాహ్యకారణంగాని, అంతఃకారణంగాని కనుపించడంలేదు. అందుచేత యీదోషాన్ని సర్వమున్నూ నాజాతక గ్రహాలమీద "పాపాయపరపీడనం"గా ఆరోపిస్తూ విమర్శకుఁడుగారి స్నేహాన్ని లోగడ మాటిమాటికి అభ్యర్థించడం జరగనే జరిగింది. కనకదాన్నే జ్ఞాపకంచేస్తూ, నన్ను రప్పించ దలచినది త్రికరణశుద్ధిగానే జరిగినట్టిదే అయితే నా యిప్పటిస్థితి ఆలసింప తగ్గది కాదు కనుక- "శుభస్య శీఘ్రమ్" అనే లోకోక్తికి ఉదాహరణంగా వుండేట్టు చేయవలసిందని ప్రార్థిస్తూస్వస్తి చెపుతూన్నాను. వెం. శా. శతావధాని.

## సింహావలోకనం

ప్రసక్తాను ప్రసక్తంగా పైవ్యాసంలో చాలా విషయం నడిచింది. అందుచేత ముఖ్యాంశాలు యిక్కడ వుటంకించడం మంచిదనుకుంటాను.

(1) విమర్శకులకు నేను వారి విమర్శన అర్థాన్నంగావున్నా, అనుచితంగా వున్నా అపృచ్ఛ్యసంభాషణతో, వృథాసాహసోక్తులతో, అమంగళాశ్లీలాలతో, ఆప్రగల్భోక్తులతో నిండివున్నా, అందులోవున్న కవితాధార చాలాధారాళంగా వుండడంచేత చేయఁదలఁచుకొన్న సేలుజోడుసత్కారం విమర్శకుఁడుగారు మావూరు రావడానికి మొగం చెల్లక వారివూరే పట్టుకువచ్చి చేయవలసిందని నాకు విధించడం ఆచార విరుద్ధ మవడంచేత నేను వొకవేళ గత్వాగత్వావారి ఆహ్వానం తుదకు ఫేలయినా, దేవుఁడు చాలా మేలుచేస్తే వారివూరుసంపన్న గృహస్థుల ఆహ్వానంమీఁద వెళ్లవలసివచ్చినా అప్పుడు మళ్లా వారిని యథాపూర్వంగా ఆహ్వానించడమే జరుగుతుందిగాని అక్కడనే సమ్మానించడం జరగదు అని ధ్రువంగా నమ్మవలసి వుంటుంది.

(2) వారి ఆహ్వానం (నన్నుద్దేశించింది) యుక్తియుక్తమే. కృతి కన్యాపరిణయం జరిగి కొలఁది కాలమే అయివుండడంచేత, సదరుఆహ్వానం మనుగుడుపు ఆహ్వానంవంటి దవడంచేత, నాకు అనారోగ్యప్రతిబంధకం తప్ప యితర ప్రతిబంధకాలు లేవు కనుక, నేను శిరసావహించి జనవరి నెలలోగా యెప్పుడేనా సరే వారంరోజులు నాకు గడువుయిచ్చి వెంటఁ బెట్టుకొని వెళ్లేయెడల నానల్లమందువేళ వగయిరా యేర్పాట్లకు భంగంకలగనిపద్ధతిని మధ్య మధ్య మకాములతో తప్పక రావడానికి సిద్ధంగానేవున్నాననిన్నీ, మామూలుగా నాతో మాచిన్న చిరంజీవితోసహా ముగ్గురువిద్యార్థులు మాత్రమే వుంటారుగాని యితరవిద్యార్థులు వుండరనిన్నీ, లోఁగడ మనవిచేసినా మళ్లాకూడా మనవిచేస్తాను. యీప్రయాణమునకు వారితరువాయేగాని నా తరువాయి లేశమున్నూ యిప్పటికిలేదు. ముందుమాట చెప్పలేను.

(3) 116 పేజీల విమర్శన గ్రంథంలో వున్నవన్నీ చొప్పదంటుశంకలేకాని వొకటీకూడా సజావుగావున్నది కాకపోవడంచేత జవాబివ్వడమంటూ మొదలుపెట్టి గ్రంథం పెంచి పత్రిక నించడానికి వొప్పక,

“ప్రధానమల్ల నిబర్హణ” న్యాయానుసారంగా నన్నయ్యను పురాణాంధ్రీకర్తలలో చేర్చడం పూర్తిగా సమర్థించి చూపడం జరిగింది కనుక చూపినంతమట్టుకేనా వొప్పుకోవలసివుందో!

లేదో! లేకపోతే యెందుకు లేదో? లోకానికి తెల్పినపిమ్మటఁగాని వృథాగా యిఁక వివాదం పెంచవద్దని విమర్శకుఁడుగారిని కోరుతున్నాను. యెందుచేతనంటే యీమూలకంగా పేరుసంపాదించుకోవాలని ప్రయత్నించేమీకు యిది ఆవశ్యకంగా తోఁచినా "యెక్కడనో ధాత లిఖించినకారణంచేత" రాఁదగ్గపేరు రానే వచ్చింది కనుక నాకిది "యీసులేసుగా" కనపడిందనివిజ్ఞప్తి.

(4) మీతాలూకుతిట్లుతిట్లేకాని మతివకటికావు. ఆతిట్లు తక్కినవిమర్శగ్రంథంవల్ల సవరణకావు, యెన్నటికీకావు అందులోవున్న వెగటు సర్వమూ మీఁదేగాని నేను తెచ్చిపెట్టిందికాదు. మీబుద్ధిపూర్వకమేగాని ప్రమాద ప్రయుక్తమున్నూ కాదు. అందుకు వేఱేసాక్షులక్కఱలేదు. మీహృదయమే సాక్షి! జవాబుదారీ దానిదే అందులో శ్లేషగాని, అన్యాపదేశంగాని, యితర ధ్వనిగాని, యేవిధమైన కమ్మీగాని లేశమున్నూలేదు. శుద్ధబట్టబయలు కనక ఆలాటి వృథాఆరోపణలు చేయవద్దని 76 వత్సరముల ప్రాయములో వున్న మిమ్మునేను కడచిన ప్రమాదమే చాలు యింకా ప్రమాదపు వ్రాతలు వ్రాసి పరాక్రమించవద్దని మీ శ్రేయస్సుకోసం సాంజలిబంధంగా ప్రార్థిస్తాను. కోపం ఆఁపుకోలేక పోయారు యిప్పుడే మనుకుంటే కలిసి వస్తుంది. యెవరో యెందుకు తుదకి మీ చిరంజీవులు, మునిమనుమలు, పసిపాపలు యెదురుకున్నా మీకు జవాబు సున్న.

(5) నేను పెద్దవాణ్ణి, మీరూ పెద్దలే (నాకన్న కూడాను) కనక యీ తుదివయస్సులో అనవసరపు వివాద మెందుకు? కనక అన్యోన్యమున్నూ, అన్యోన్యసత్కారాలు అన్యోన్యగ్రామాల్లో యథాన్యాయంగా స్వీకరించి లోకం యొక్క ఆమోదాన్ని పొందడం మంచిదని విన్నవిస్తాను. తరువాత తమచిత్తం- యీతుది వయస్సులో మీకు భగవంతుఁడీతీరని శల్యాన్ని తెచ్చిపెట్టినాఁడు. జయేచ్ఛ మీకు యీచిక్కు తెచ్చిపెట్టింది. యింకాపరాక్రమిస్తే మఱీబాగుండదు కనక సమ్మానాన్ని స్వీకరించి జయగుర్తుగా మిమ్మల్ని ప్రేమించే అమాయికులవద్ద డచ్చీలు ప్రచురించుకోండి.

(6) మీకు ప్రధానంగా మనస్సులో వున్నకోపమల్లా నేను నాఁడు యెప్పుడో మాంధాతలనాఁడు (ముప్పైయేండ్లప్రాంతంలో) యెవరికో మీ శాఖవారికి సహాసనాన్ని కవితావిషయంలో నిషేధించడంకదా? అది చాలా యుక్తమే అనిన్నీ, అంతేకాని శాఖాద్వేషప్రయుక్తం కాదనిన్నీ, రేపు నాకంటే చాలా

పెద్దలైన మీవిషయంలో కూడా అట్టిపట్టుపటాంగంవస్తే అది కవితా విషయంలోనే (లెక్కలవిషయంలో కాదు) అయితే అంతే జరుగుతుందనిన్నీ, దానికి మీరు నాహృదయాన్ని బాగా పరిశీలించాలంటే? మారెండో చిరంజీవి శతావధాన్ని నాతోసమానుఁడనే వుద్దేశంతో యెవరేనా నాపంక్తిని కూర్చోపెట్టేయెడల వాణ్ణికూడా నేను నిషేధించే వాణ్ణే అనిన్నీ, స్పష్టంగా మనవి చేస్తున్నాను. కనుక ఆవిషయమైన ద్వేషం నాయందు మీరు వుంచుకోవడం కేవలం అన్యాయమనిన్నీ నొక్కి వక్కాణిస్తూన్నానని మనవి.

(7) నాకు ధారాశుద్ధివిషయంలో అనఁగా సంస్కృత సమాసగ్రథన విషయంలో నన్నయ్యకు నన్నయ్యే కాని తక్కిన యిరువురున్నూ అతనికి దీటుకారన్న అభిప్రాయం శాఖాభిమానప్రయుక్తం కాదనిన్నీ, విద్యాభిమాన ప్రయుక్తమేననిన్నీ, ప్రమాణంచేసిచెపుతూ దాన్ని గూర్చి మాట్లాడడానికి మీకువుండుకున్న చదువుగాని, అనుభవంగాని, బొత్తిగా చాలవు కనక ఆ విషయమై యింకవాదం పెంచవద్దనిన్నీ కూడా ప్రార్థిస్తాను. తగ్గంత పిండి వుంటేకాని ఆయీ విషయం గోచరించేదికాదు. నాఅభిప్రాయం తప్పయితే దాన్ని నిరూపించతగ్గవా రెవరేనా నిరూపిస్తారు. తిట్లవల్ల దాన్ని నిరూపించడం అసంభవమని యెన్నిసార్లు వ్రాసేది. శాంతం పాపం.

(8) నియ్యోగులునూ, వైదికులున్నూ కలిసి సంబంధ బాంధవ్యాలు చేసుకోవడం దగ్గిఱనుంచిన్నీ నాకు అభినందనీయాలనిన్నీ మా ప్రభాకర శాస్త్రి కొమార్తను శ్రీయుతులు విస్సా అప్పారావుగారి కుమారున కిచ్చిచేసిన పెండ్లిని నేను మనఃపూర్వకంగా అభినందించి వున్నాననిన్నీ, కవితా విషయంలో పిండిప్రోలివారిని గూర్చిన వ్యాసంవల్ల గుణమే ప్రధానంగాని నాకు శాఖప్రధానం కాదనిన్నీ, మీకు కారణాంతరంచేత గోచరించక పోయినా యితరుల కందఱికి పూర్తిగ గోచరిస్తుంది. కనక ఆదోషాన్ని నామీఁద ఆపాదించవద్దనిన్నీ, తామే భరించవలసి వుంటుందనిన్నీ మనవి చేసుకుంటాను. తరువాత తమచిత్తం.

(9) మీరు మావూరు నేను చేయఁదలఁచుకొన్న సన్మానానికి రావడానికి లేశమున్నూ భయపడనక్కఱలేదనిన్నీ, రౌండుటేబిలు సభకువెళ్లిన గాంధీగారిని ఆహ్వానించినవారెంత భద్రంగా కాపాడి మనదేశానికి సమర్పించారో? మిమ్మల్ని కూడా అంత భద్రంగానే మీ గ్రామం పంపించడానికి

పూచీపడుచున్నాననిన్నీ, మళ్లామళ్లా పునరుక్తి ప్రాయంగా మనవి చేసుకుంటూ వున్నాను.

(10) షరా:- యింతదాకా యీవ్యాసం వ్రాసిన తరవాత విమర్శకుండుగారి వ్యాసం తరవాయి కూడా వున్న పత్రిక వచ్చింది. దానిలోసారమల్లా వెం. శా. విమర్శకుండుగారికి వోడిపోయినట్టున్నూ, అంతేకాక నన్నయ్యభట్టుకు గౌరవం కలిగించాలనే వుద్దేశంతో వెం. శా. వ్రాసిన వ్యాసం వాండివుద్దేశాన్ని నెఱవేర్చక నన్నయ్య భట్టుకు న్యూనత్వాన్ని కలిగిస్తూ వుందనిన్నీ, పనిపడితే పండితసమక్షంలో వీట్లనేకాక యింకా వారు (విమర్శకులు) విమర్శన గ్రంథంలో వ్రాసిన విషయాలన్నిన్నీ సమర్థించడానికి సిద్ధంగావున్నామనిన్నీ, యేమేమో కొన్ని సాహసోక్తులు వ్రాసి వ్యాసాన్ని ముగించారు. నాకు పట్టరాని నవ్వు వచ్చింది. చెప్పొద్దూ కవితాధార అభినందనీయమని వొప్పుకున్నదే కదా? లోంగడ సాహసమున్నూ, అనాత్మజ్ఞత్వమున్నూ కూడా అభినందనీయులే అని వ్రాయకపోవడం తప్పుగదా? అనుకున్నాను.

(11) వాట్లకన్నిటికీ సరిపడేమాట యిదివఱలో నా యీవ్యాసంలో అసకృదావృత్తిగా దొరలేవున్నా మళ్లాయిక్కడ వుదాహరిస్తాను. అయ్యా! పండితసమక్షంలో మీతో వాదించడానికి నన్ను సమర్థుణ్ణిగా లోకం వొప్పుకుంటుందని నేను అనుకోను. అందుచేత మీవిమర్శనగ్రంథంలో వున్న యితర విషయాలన్నీ వదిలిపెట్టి మీరు నన్ను తిట్లుకావనుకొని తిట్టినతిట్లను సమర్థించడానికి మీకు యేపండితుండి పేరు నచ్చుతుందో? ఆ పేరుమాత్రం వుదాహరిస్తే అంతటితో మీమీందవున్నభారం వదలిపోతుందని మనవి చేసుకుంటాను. యేమేనా వాదోపవాదాలు చేసుకోవలసివస్తే ఆయనా, నేనూ చేసుకుంటాము, విశేషించి గ్రంథం పెంచక ఆపండితుల నామధేయాన్ని మాత్రం ప్రచురించ వలసిందని ప్రార్థిస్తాను. బాగుందా? యీలా అనుగ్రహించండి లేదా? వొకజయపత్రం వ్రాయించి తెచ్చుకోండి నేను కూడా వ్రాలుచేస్తాను. సంతోషించండి.

(12) ఇది విమర్శనగ్రంథానికి సంబంధించిన వాదవిషయం. మీరు నన్ను సమ్మానించడానికి రప్పించేవిషయం ఆలాగే నిల్చివుందని జ్ఞాపకం చేస్తున్నాను. నేను మిమ్మలిని సగౌరవంగా ఆహ్వానించిన ఆహ్వానాన్ని తాము నిరాకరించారు. అయినప్పటికీ మీగ్రామం వచ్చినప్పుడు మళ్లా ప్రయత్నించి చూస్తానని పలుసార్లు వ్రాసేవుండడంచేత అది అమల్లోనే వుంది గాని

అధఃకరింపఁబడలేదు. వృథాగా జయేచ్ఛతో పరాక్రమిస్తూ వున్న మీరు శ్రీపోతన్నగారి–

"మ. ఒనరన్ నన్నయ తిక్కనాది కవులీయుర్విం బురాణావళుల్ తెనుఁగున్ జేసియు" అన్న వాక్యానికేనా వెం. శా. సరియైన అర్థాన్ని గ్రహించాఁడో? లేదో? కాస్త పత్రికాముఖాన్ని ప్రకటించండి. శ్రీమానాప్రగ్గడవారి అబ్బాయి వ్రాసిన వుత్తరం (నేను ప్రకటించింది) తమకేమేనా రుచిస్తే రుచించినట్లున్నూ, లేకపోతే లేనట్లున్నూ కొంచెం ప్రకటించండి. "శ్లో. యుక్తియుక్తం వచోగ్రాహ్యం బాలాదపి సుభాషితమ్, వచనం తత్తునగ్రాహ్య మయుక్తంతు బృహస్పతేః" యీశ్లోకార్థం తమరు అంగీకరించేదే కదా? అయితే ఆబాలకవి నేమంటారు.

(13) నవ్వొచ్చేది యింకొక మాట వ్రాస్తూ వుంటారు. మీరు ధైర్యంతో వ్రాసేదేనా? ఆమాట "మీవిమర్శనగ్రంథ మంతా పాఠంజదివితే యేదో విజ్ఞులకు బోధిస్తుందంటూ వ్రాస్తారుగదా? మీరు ఆలాపాఠంజదివితే అప్పుడు అందులోవున్న "పదియవ నాఁటి" వగయిరాలు వెగటుగా వుండక మధురంగా వుండడం తటస్థిస్తుందనేనా? మీ అభిప్రాయం. కానివ్వండి మీకుతూహలాన్ని తోసి రాజనడం యెందుకు? ఆలాగే ప్రత్యక్షరశోధగా యేపండితుఁడి చేతనో చదివించి ఆవ్రాత వెగటుగా లేదని ఆయన చేవ్రాలుతో నాలుగు అక్షరాలు పత్రికలో ప్రకటింపఁజేయండి. సరేనా? యిక్కడకి సర్వమూ మీ అభిప్రాయానుసారంగానే నేను వొప్పుకొన్నట్టయింది గదా! అయితే యిదంతా కొంత గంపచిక్కుగా కనపడుతుంది. తుదకి పసకట్టేది కాదంటారా? ఆపక్షంలో మిమ్మల్ని నేను బాధించేవాణ్ణి కాను. చక్కఁగా నాసగౌరవాహ్వానాన్ని ఆమోదించి నాసేల్జోడుసత్కారాన్ని స్వీకరించండి యింతే నావిజ్ఞప్తి. మీగ్రామంలో వుండే సంపన్న గృహస్థులకేనా తృప్తికరంగా వుండేటట్టు మీతిట్లను సమర్థించుకోవడం వకటిన్నీ, రెండోది యెవరేనా మీ బంధుసముద్రులు సేల్జోడు బహుమానాని కెందుకు దయచేశారు కారని అడిగితే తృప్తికరమైన జవాబు యివ్వడం వకటిన్నీ జరిగినట్టు విని సంతోషిద్దామని కోరిక వుందనికూడా మఱోవిజ్ఞప్తి. ఆర్థికశంకలే మీరు మీ గ్రంథంనిండా చేసివున్నారని నాకు జ్ఞాపకం. ఆ పుస్తకం నావద్ద లేదని లోగడ మనవి చేసేవున్నాను. యిప్పుడు వ్రాసిన "సంశయ విచ్ఛేదా వచ్ఛేదం"లో శాబ్దిక శంకలు కొద్దిగా సూచించారు. వాట్లకి జవాబు యివ్వలేదని కూడా తేల్చారు. ఆగ్రహించారు. మీవాక్య ముదాహరిస్తునా?

"మాదుమీదులు" మఱికొన్ని దుష్ప్రాసములు మొదలగుదోషముల కేమియు సమాధానములు చెప్పక యొక్క హ్రస్వముమీఁది బిందు నిర్బిందుప్రాసమునకు మాత్రమే యెక్కడనో యొకానొకచోట (శాంతి పర్వములోనోయేమో) ఉన్నట్లు స్థాననిర్ణయములేక తమకసి యంతయు వెళ్లఁగ్రక్కుచు 'శాస్త్రజ్ఞులు కాని విమర్శకు' లనియు బహుశః వారు తిక్కనగారి ప్రయోగమునైనఁ జూచియుండరనుకొందు ననియు వ్రాసిన వ్రాఁతయే సాక్ష్యమిచ్చుచున్నది." అంటూ వ్రాస్తారుకదా? సార్థబిందు నిరర్థబిందు ప్రాసవున్నపద్యంలో ప్రధానస్థలాన్ని (నగము ఎసఁగు) అనే పదాలతో చూపితినిగదా? పైఁగా శాంతిపర్వం అంటినికదా? కంద పద్యమని తెలిసికోవడానికి కూడా కొంత ఆధారం వుంది. ఏచరణానికి ఆచరణంగా, ఏపద్యానికి ఆపద్యంగా అచ్చువేసిన భారతాలు వున్నయీ రోజుల్లో ఆపద్యాన్ని వెతుక్కోవడంకూడ మీకు కష్టమే అయిందా? అదిన్నీకాక ఆవ్యాసంలో "నగములు... ఎసఁగు పూర్వస్థితిన" అన్నంతవఱకు కూడా మొట్టమొదట వుదాహరించి వుంటిని కదా? యింకా "ముంజేతికంకణాని కద్దం చూపించమంటారే" యిది మీకు యుక్తంగా తోఁచిందా? లక్షణగ్రంథాలలో ప్రయోగం యిచ్చి వూరుకుంటారుగాని యింత మాత్రమున్నూ స్థలం వగైరాలు సూచించరే? అయితే వకతప్పు నాది వుంది. శాస్త్రగ్రంథ సంప్రదాయం తెలియని మీకొఱకు వ్రాసే వ్యాసంలో శాస్త్రజ్ఞమర్యాదగా కలం నడపడం తప్పుకాకపోదు. కర్మం కాలి నాకు ఆలాటి మీతో వాదం వస్తే వచ్చిందికాక నేను-

చ. "గురుకులవాసమున్ జరిపి కూరిమి మాధుకరంబు వారముల్
జరుపుచు, నమ్మగాని యొకసాధ్విని నమ్మ! యటంచు బాబటం
చొరులను గొల్చి నేర్చితిమి యొండొకశాస్త్రము పండితుల్ సెబా
సుర! యని మెచ్చఁ బద్యములు శ్లోకములున్ రచియింతుమొప్పుగన్"

*(గుంటూరుసీమ - పూర్వరంగము)*

ఆయీ పద్యంలో చెప్పినప్రకారం గురుశుశ్రూషచేసి నేర్చుకొన్న శాస్త్రమర్యాదను విడిచి యెలా వ్రాయడం తటస్థిస్తుంది.

(1) "కథంతర్హి హాపితః క్వాపి హేసుభ్రు" ఇతిభట్టిః

(2) "మణీవోష్ట్ర స్యేతితు ఇవార్థే వశబ్దో వాశబ్దోవా బోధ్యః"

యీ మాదిరిగాఁ గదా? శాస్త్రగ్రంథాల్లో వుంటుంది. యిందులో వక ప్రయోగ విషయంలో "భట్టిః" అనేనా అన్నాఁడు గాని రెండోదానిలో ఆమాత్రమున్నూ అనలేదుగదా! యీలాటి శాస్త్రమర్యాదలు మీకు చూపడం నాది మఱీతప్పిదంగా విజ్ఞలోకం భావిస్తుంది.

యేమంటే? "శాస్త్రజ్ఞులు కాని విమర్శకులు" అని వ్రాస్తినిగదా? మిమ్మల్ని గూర్చి; అలావ్రాసి మళ్లామీకు శాస్త్రకర్తలమర్యాదలను వుదాహరించడం తప్పా, మఱీ తప్పా? అయితే యీ విధంగా ఆలోచించినట్టయితే మీకు సమాధానం వ్రాయడానికి మొదలెట్టడానికే ప్రాజ్ఞలోకం అంగీకరించదుగదా? అపద్ధతిని "మూలచ్ఛేదీ తవ పాండిత్యప్రకర్షః" లోకి దిగవలసి వస్తుంది. కనక "కంబళీలో భుజిస్తూ వెండ్రుకలు వెదకడానికి" మొదలుపెట్టక ఛందానుసారంగా అపద్యాన్ని యావత్తూ వుదాహరించవలసిందే. నేను అట్లు చేసి వుండలేదు. యెప్పుడో యిప్పటికి సుమారు యాభైయేళ్లనాఁడు చూచినదవడంచేత నయితేయేమి యీప్రాసవిషయం తప్ప దానిలో జ్ఞాపకం వుంచుకోతగ్గ అర్థసారస్యం వగయిరా లేకపోవడంచేతనైతేయేమి, పద్యం యవత్తూ వుదాహరించవలసిందే. నేను అట్లు చేసి వుండలేదు. యెప్పుడో యిప్పటికి సుమారు యాభైయేళ్లనాఁడు చూచిన దవడంచేత నయితేయేమి యీప్రాసవిషయం తప్ప దానిలో జ్ఞాపకం వుంచుకోతగ్గ అర్థసారస్యం వగయిరా లేకపోవడంచేతనైతేయేమి, పద్యం యావత్తున్నూ జ్ఞప్తిలోలేదు. యిప్పుడు మళ్లా వెదుకుదామంటే? తగినంత వోపిక కనపడడంలేదు. అదిగాక నేను చూచిన భారతం చాలా ప్రాచీనం. అది మా మామగారిది. దాన్ని ఆయన జీవితకాలంలోనే మేనగోడలి కుమారుఁడికి ఆయన యిచ్చివున్నారు. దాన్నిప్పుడు బళ్లారినుండి తెప్పించాలి. యెందుకీశ్రమ. "నమ్మీనమ్మక ప్రయోగాలు జ్ఞానప్రకాశము వగైరాలు". యిటీవల సంస్కర్తలు మార్చేశారు కూడాను. దీన్ని మార్చవలసి వుండదుగాని యేమో ఆలాగనిన్నీ నిశ్చయించడానికి వీలుకాదు బాగా పరిశీలిస్తేనేకాని? యింతకూ ఆప్రాస దుష్టమా? అయితే అప్పకవి "పాఁడి ద్రచ్చుఁగనిమ్ము నాతండ్రి కృష్ణ" అంటూ కూడా వుదాహరించి సార్ధబిందుకానికిన్నీ సంపూర్ణబిందుకానికిన్నీ (రేఫశ్లిష్టత్వవిషయం వుపేక్షిద్దాం.) వుచ్చారణలో యెంతో భేదం కనబడుతూ వున్నా ప్రాసను అంగీకరించాఁడుకదా? శ్రవణంలో లేశమున్నూ (పూర్వకాలంలో సంగతి మనకు తెలియదు.) ఇటీవల భేదమేలేదని - నగము - ఎసఁగులకు ప్రాసపెట్టనే లేదనుకుందాం.

సోమయాజిగారు పెట్టకపోతే మాత్రం మనం పెట్టుకోకూడదా? యిప్పుడదంతా వెదకడ మెందుకంటాను. సర్వతంత్రస్వతంత్రులున్నూ, నిరంకుశచర్యులున్నూ, అభినవపండితరాయలున్నూ అయిన శ్రీమాడభూషి వెంకటాచార్యులవారికిన్నీ, శ్రీ అల్లంరాజు సుబ్రహ్మణ్య కవిగారికిన్నీ "ఇఁక" అనేపదం ప్రాసలో పెట్టి పద్యం చెప్పవలసిందని కోరినప్పుడు నడచిన వాదంలో ఆ ఆచార్లగారు తక్కినవి నిరర్ధబిందుకాలు పెట్టి చెప్పితే ఆయన ఆక్షేపిస్తే చెప్పినసమాధానం సుప్రసిద్ధం కనక తిక్కన్నగారు ఆ లాపెట్టని పద్ధతిని కూడా యితర మహాకవులరచనలలో కుప్పతెప్పలుగా వున్న యీ

విషయమై చర్చించడం అనవసరం. ఆ భారతం విమర్శకుఁడే చూచి లేదంటే తప్ప యీలోఁగా నేను దాన్ని వెతకడానికి ప్రయత్నించేదిలేదు. పోవూరి వేంకటేశ్వర్లుగారిచేత విమర్శకుఁడుగారు వ్రాయించిన వుత్తరాలకు నేను "లోకమో? పాడో" అనుకొని యథాలాభంగా, అశ్రద్ధగా యిచ్చిన మొట్టమొదటి జవాబువల్ల విమర్శకుఁడుగారికి బాగాలోఁకువ చిక్కి-వీఁడు తామనుకొన్న అసకృదావృత్తిగా విమర్శన గ్రంథంలో వాడుకున్న "ముత్తైదువు" లాగ వూరుకునే వాఁడేఅని ధీమాకు చిక్కి లోఁకువకట్టి ఆపుస్తకం పాఁతరలోనుంచి బైటికితీసి తిట్లూ, ద్రావిడస్త్రీల కుచాలు వగైరాదుష్ప్రసంగంతోటే "ఐసరుబొజ్జా" అని ధైర్యంగా, నిర్లక్ష్యంగా భవిష్యదాలోచన లేక విమర్శన గ్రంథం (స్వంతద్రవ్యంతోనే పాపం?) అచ్చొత్తించుకొన్నారు. దానికీకూడా నేను అజ్ఞాన ప్రయుక్తమైన వనిగదా? అనివోపికలేని రోజుల్లో యెందుకీయనతో వాదం పెట్టుకోవడమని యేదో ప్రసక్తిలేని ప్రసక్తిగా "నన్నయ్యభట్టును" గూర్చి వ్రాయడం పెట్టుకుని విమర్శకుఁడిగారి శంకలలో వున్న అసారస్యాన్ని దిఙ్మాత్రం చూపి, తిట్లనుచూపి అవి కూడా గణింపక సేల్జోడు బహుమానంద్వారా గౌరవిద్దా మనుకుంటే అది అంగీకరించలే. ఉహూ పైఁగా నాకే సమ్మానం. అంతతోటీ వుపరమించలే. నాశంకల కన్నిటికి జవాబివ్వలే దంటూ వొకనెపం. ప్రతీశంకా యేదో కొంత చరిత్రను పురస్కరించుకొన్నదే. యిప్పటికి ముప్పై యేళ్లనాఁటి చరిత్ర కొన్నిటికి వ్రాయాలి. యాభైయేళ్లనాఁటి చరిత్ర కొన్నిటికి వ్రాయాలి. యెంత కుంచించి వ్రాసినా తీఁగదీస్తే దొంక కదలినట్లవుతుందాయె. అక్కడికీ మచ్చుకు మీసాన్నిగూర్చి వ్రాసి చూపిస్తినాయె. ఆయువుపట్టుశంక నన్నయ్యభట్టును గూర్చి లోఁగడ వ్యాసంలోనేకాక మళ్లా యీవ్యాసములో పోతరాజుగారి-

"మ. ఒనర న్నన్నయ తిక్కనాదికవు లీయుర్విం బురాణావళుల్ తెనుఁగుంజేసియు"

అన్నపద్యం కూడా వుదాహరించి చూపడం అవుతూవుందా? యీవ్యాసంలో యింతతోటేనా కిక్కురుమన కుండా స్వయంకృతాపరాధానికి (అంటే యీలాటిశంకలకు కాదు. పదియవ నాఁటివగైరాతిట్లకే లజ్జిస్తూ యిట్టి అపమార్గంలోకి దింపిన విపరీత దైవానికి చింతిస్తూ నాసేల్జోడు బహుమానాన్ని స్వీకరించి (వయస్సుచే) పెద్దలు కనుక నన్ను యీలాగే యెవరేనా తలతిక్క ప్రశ్నలు వేస్తూవుంటే జవాబు యిస్తూ శేష జీవితాన్ని గడుపుకోవలసిందని ఆశీర్వదించి తలదాఁచుకోవడమేయుక్తమో? "నాశంకల కింకా సమాధానం రానేలేదు" అంటూ "కిందఁబడ్డా మీఁదివాణ్ణే" అంటూ పరాక్రమించడానికి తలెత్తబోవడమే యుక్తమో? లోకంమాటకేంగాని ఆధూళిపూడిలో చాలామంది ఆంగ్లభాషా విశారదులున్నట్లు నే విన్నమాట నిజమే. అయితే వారే మందలిస్తారని నా ఆశ. యిందులో

నాదేమేనా తప్పున్నట్టు వారికి తోస్తే నన్నుకూడా ఆధూళిపూడి ధూళిరేఁగేటట్టు మందలించడానికి పూర్ణమైన అధికారం కలిగి వుందని వేఱే వ్రాయనక్కఱలేదు. యీయన మా "పాణిగృహీత" గ్రంథం కృతి యివ్వడాన్ని గూర్చి కొన్నిశంకలు చేసి వున్నారు. వాట్లను గూర్చి వ్రాయవలసివస్తే బోలెఁడు చరిత్ర వుంది. అది సుమారు 35 సంవత్సరాలఁనాటి చరిత్ర. ప్రస్తుతం యెంతో ప్రయత్నిస్తేనేగాని మొట్టమొదట ఆవుత్తరాలు వగైరా ప్రచురించిన ఆపుస్తకం కూడా చిక్కదు. సరే? యేలాగో సంపాదిస్తానే అనుకోండి. ప్రచురిస్తానే అనుకోండి. దానివల్ల యేప్రయోజనాన్ని సాధించినట్టయింది. విమర్శకుఁడుగారిని సమాధాన పఱచడంకంటే యింకేం ప్రయోజన మంటారా? ఆయన తలలో సత్యం వప్పుకొనే రేణువులంటూ వుంటేనా? ఆబాపతురేణువులు యేవొకటి రెండు వున్నప్పటికీ గుంటూరిసీమలోవున్న ఆయా వుత్తరాలనుగూర్చియేమి యితర విషయాలనుగూర్చి యేమి శంకించవలసి వుండదు. లేదా శ్రీకొప్పరపు సోదరుల స్వహస్తలిఖితానికి మక్కికి మక్కి నకలును మేము ప్రచురించడం; వారుమాకు డాబుదర్పంగా రిజిస్టరు నోటీసు యివ్వడం; మళ్లామేము జబాబు యివ్వడం; దానితో - "నిమ్మకునీరెత్తినట్లు" వారు కిక్కురుమనకుండా తూష్ణీంభావం వహించి గత్యంతరం లేక వూరుకుండడం; అంతా గుంటూరుసీమ ఉత్తరరంగంలో ప్రచురింపఁబడి వుండఁగా దాన్ని గూర్చి అసలు వారు యెన్నఁటికీ మాట్లాడడానికి అవకాశంలేక వారి ప్రమాదాన్ని వారు న్యాయంగా వప్పుకోవడంచేత లోకుల గౌరవానికి భాజనులుకాఁగా యిప్పుడీవిమర్శకుఁడుగారు దానికోసం పెనుగులాడడమనేది - "గుంజ లార్చాయి" అనే సామెతను జ్ఞప్తికి తెస్తూ వుందో? లేదో? పరిశీలించండి నాయనలారా! అప్పుడు - "పచ్చగడ్డి వేస్తే భగ్గునమండుతూ" వుండే రోజులు గదా? వారికీ మాకూ? యేమాత్రం అవకాశం వున్నా సోదరులుగాని వారిపార్టీ వారుగాని ఆకాలంలో వుండేశాఖాభిమానంగాని వూరుకోనిచ్చేదేనా? అసలువుత్తరమే వొకవైదిక స్కూలు మాస్టరుకి చేజిక్కింది. అసలు అతనివద్దవుంచుకొన్నాడు. నకలు వ్రాసియిచ్చాఁడు, పని పడితే అసలుతో హాజరు గావడానికి సిద్ధంగా వున్నానని అసలు దాన్ని చూపించాఁడు, దాని మీఁద దాన్ని మేము ప్రచురించఁగలిగాము. ఆరికార్డంతా యిప్పటికింకా జాగ్రత్త పెట్టే వుంచాను. యేమో? యెప్పటి కేం పని పడుతుందో? అని- "కోకాలః (కః కాలః అనరు) కోధర్మః" అంటారు కదా? అభియుక్తులు. చెప్పొచ్చే దేమంటే? విమర్శకుఁడుగారు ముప్పైయేళ్లకి మళ్లా అదంతా ప్రచురింపచేసే పనికికదా? అంకురార్పణచేశారు. (ఈశంకా సమాధానాలకూ పాండిత్యానికీ సంబంధబాంధవ్యాలేమేనా వున్నాయా? లేవు. అయితే దీనివల్ల జరిగే లోకోపకారం యేమి? అంటే, సమాధానం సున్నకదా?) అది నాకు ఆశ్చర్యంగా కనపడి ఆసీమవారికి బరాతం చెప్పివున్నాను. సోదరులు

కూడా వీరివ్రాంతలకు మనస్సా సమ్మతించరు. సంతోషించరు. ఆమోదించరు. ఈమాట నేను “నన్నయ్యభట్టు” వ్యాసంలో వ్రాసే వున్నాను. దాన్ని వీరు బోలెఁడు అప్రస్తుతాలు వ్రాసి పెంచి యీమధ్య వ్రాసిన “సంశయచ్ఛేదం” లోస్పృశించినట్టుగాని ఖండించేటట్టు లేదనియ్యేవే నానమ్మకం. మాతిరుపతిశాస్త్రికిన్ని, వారికిన్నీ యెప్పుడున్నూ చుక్కెదురే గాని నాకూ వారికీ కొంత సంభాషణవగైరాలు కలవు. శ్రీరాజా భుజంగ రావుగారికొమార్తలలో వొకకొమార్త వివాహంలో కాదు యిద్దఱు కొమార్తల వివాహాలలో మేమూ మేమూ కలుసుకున్నాము. బ్రహ్మశ్రీ వేమూరి శ్రీరామశాస్త్రి శతావధానిగారు శ్రీవడ్డాది సుబ్బారాయకవిగారిని మమ్మల్నీ యింకా కొంత మందినిన్నీ పిల్చి విందు చేశారు. ఆవిందులో మా తి. శా. గారు శివరామ శాస్త్రిని ఆపంక్తికి తనతోపాటు రాకుండా చేశాఁడు. నేను యెంత చెప్పినా వినలేదుకూడానున్నూ, నేను సోదరుల పంక్తిని భోంచేసిన వాణ్ణే. ఆయీమాభోజనం ఆయీ అవడంలోనే శివరామశాస్త్రి సహితంగా వచ్చి భోజనానికి ఆఁకలేస్తూందని విస్తళ్లు తీయకుండానే తొందర పెట్టినాఁడు. అంతకుపూర్వం ఆఁకలే లేదు. యీవేళ తినేదేలేదని శ్రీరామశాస్త్రి గారితో చెప్పి తక్కినవారిని భోంచేయవచ్చు నన్నాడు. ఆయీవిషయం సోదరుల జ్ఞప్తిలో వుందో? లేదో? చెప్పొచ్చేదేమిటంటే? నాకూ సోదరులకూ ప్రధానవిషయంలో తప్ప యిటీవల వ్యక్తిగతంగా లేశమూకూడా ద్వేషాలు లేవు. వారిలో పెద్ద సుబ్బారాయకవిగారు స్వర్గతులైనపుడు వారిసోదరులలో యెన్నో వారో వొకరు (ఉత్తరం తీసి చూస్తేనేకాని సరిగా చెప్పలేను.) ఆవిచారకరమైన దారుణవార్తను నాకు తెల్పినారు. నేను నా విచారాన్ని లేఖద్వారాగానే వారికి సాశ్రుతర్పణ పూర్వకంగా తెలిపి వున్నాను.

“ముఖం వుంది. అద్దం వుంది.” యీసందర్భం సోదరకవులను పృచ్ఛ చేస్తే జ్ఞాపకం వుంటే వారు చెప్పకపోరు. యిట్టి సందర్భంలో “రోళ్లా రోకళ్లా పాడిన” గుంటూరిసీమలో వున్న చారిత్రక విషయాలు “గజం మిథ్య పలాయనం మిథ్య”గా మావిమర్శకుఁడుగారు అపవదించి యేదో పుస్తకమంటూ వ్రాసి రు. 1-0-0 వెలకూడా పెడతారే? పోనీ యేదో మన పేరుమీఁదుగా ఆబ్రాహ్మడికి కొంచెం లాభం కలిగితే కలుగుతుంది పేరున్నూ కలుగుతుంది. దానికి సేల్జోడు బహుమానంతోడవుతుందనుకుంటే వొప్పుకోలేదు చూడండి. ఆశ్చర్యమాశ్చర్యం. భవతు. యేదో “ఘటం భింద్యాత్” అన్నారుకదా? పెద్దలు; దానికే సంతోషించింది కదా? స్వగ్రామం. వచ్చే బిరుదులేవో వచ్చాయికదా? యింకా ప్రయత్నం యెందుకంటాను? యింకా వ్యాసా లెందుకంటాను? యింకా వెం. శా. తెల్వితక్కువవాఁడు నేను తెలివైనవాణ్ణి అని వ్రాసి సంపాదించతగ్గదేమేనా వుందా? వెం. శా. కూడా సేల్జోడుపట్టుకొని సమ్మానించడానికి సిద్ధంగానే వున్నాఁడు కదా? దయచేసి స్వీకరించి-

"ఇదుగో? నావిమర్శనకి జవాబు చెప్పలేక భయపడి యెవరో జమీనుదారులు బహుమతీగా యిచ్చిన జరీసేలుజోడు (గడి విప్పనిది) నాకిచ్చి క్షమాపణచెప్పాండు." అని యిప్పుడు సమ్మానించే బంధుసముద్రులతో ప్రసంగించుకోవచ్చును గదా? యింకా వ్యాసాలెందుకు? సంశయచ్ఛేదా లెందుకూ అంటాను. సరే? సార్థబిందు నిరర్థబిందు ప్రాసప్రసక్తిలోన్నుంచి చాలా దూరంపోయింది వుపన్యాసం. యీలాగే పెరుఁగుతుంది వ్రాత వ్రాసినకొద్దీ అని లోకానికి తెల్పడానికేనా యిది పనికి వస్తుంది కదా! యింక విమర్శకుఁడు గారు శృంగిగ్రాహికయా వుదాహరించిన "మీదుమాదులు" అనేచోట వున్న దుగాగమప్రసక్తితప్పా? వొప్పా? అన్నదాన్ని గూర్చి కొంచెం వ్రాసి విరమిస్తాను. యిది వీరినేకాదు చాలామందిని పొరపెడుతూ వుంది. దీన్ని గుఱించి మాజయంతిలో చూడండీ యేమని వ్రాయఁబడి వుందోను.

" 'నీదు' అనుచోటంబలె 'మీదు' అనుచోట దుగాగమము రాదని గురువులవాదము. దీనింగూర్చి 'గుప్తార్థ ప్రకాశిక' చక్కఁగా మందలించినది. కనుక నిపుడేని వారు దానిం జూడందగు."

ఆయీ జయంతిని విమర్శకుఁడుగారికి దాఖలు చేసే వున్నాను. శ్రీవారు దాన్ని చూడలేదనుకోనా? (లోకంలో మాపుస్తకాలు ప్రత్యక్షర శోధగా చదివినవారంటూ కొందఱు వుండేయెడల వారి కెవరేనా "ప్రైజు" యిచ్చేయెడల అది వీరికి యిచ్చాకగాని మఱివొకరివ్వకూడదని నాసలహా) గుప్తార్థ ప్రకాశిక చూడలేదనుకోనా? చూచినా కనబడలేదేమో? అనుకోనా? యిదేమీ కాదు. చూడడం జరిగింది. కనపడా కనపడింది గాని ఆగ్రంథం వ్రాసిన బ్రహ్మశ్రీ కల్లూరివారి పాండిత్యం నచ్చలేదనుకోనా? భవిష్యత్తులో యింకా కలమాడిస్తే అప్పుడుగాని యీవిమర్శకుఁడుగారు దీన్ని గూర్చి యేతోవ తొక్కుతారో? బోధపడదు. పడడానికేముంది? "నేను మాత్రం వూరుకున్నానా?" అన్నట్టు శాంతిపర్వములో ప్రయోగం వుందని చూపిస్తే మళ్లా ప్రశ్నించనట్టే ప్రశ్నించారనుకోవాలి. యీసారి ఆ "మీదుమాదు"లను గూర్చి యేపుటలో యెన్నో పంక్తి దగ్గఱనుంచి యెన్నోపంక్తిదాఁకా వ్రాయఁబడివుందో కూడా వ్రాయవలసివుంటుందేమో? అవసరమైతే ఆపనికూడా చేస్తాను. పడరాని పాట్లన్నీ పడాలిగదా? నేను యిందుకే పుట్టినట్లున్నూ, ఆయన అందుకే పుట్టినట్టున్నూ అప్పుడు లోకం గుర్తించుఁగాక! అప్పటిదాఁకా అక్కఱే లేదు. ఈ పాటికే గుర్తించి వుంటుంది. ("భజగోవిందం" రోజులుకదా? యివి యెందు కొచ్చిన పిచ్చి లేక వెఱ్ఱిశంక లివి యెవరిదగ్గఱకేనా వెళ్లి చదువుకోరాదా?) "మీదుమాదు" ప్రయోగాల సమర్థనమే కాదు. "మీదుమాదు" పాండిత్యాదులు సమస్తమూ తేలిపోతాయి. దీనితో

గుప్తార్థప్రకాశిక 266, 267, 268 పేజీలు చూడండి. 268లో సుమారు 12 పంక్తులు దాఁటిన (ఓహో! దాఁటి ప్రయోగంపడిందే మళ్లా తప్పు పడతారనుకుంటాను.) తరవాత శ్రద్ధగా చదివితిరా మీదుమాదు ప్రయోగాలలో వుండే సాధుత్వం తెలుస్తుంది. యెవరో లాకలూకాయలు ప్రయోగించిన ప్రయోగాలుగావు. కానేకావు. గ్రంథకర్త చూపిస్తా: అప్పకవీయంలోవి. తెలిసిందా? జాగ్రత్త. సూత్రార్థం కూడా యేకవచనానికే దుగాగమం వస్తుందనిన్నీ బహువచనానికి రాదనిన్నీ చేసుకోరాదని చేసుకోవడానికీ అవకాశం లేదనికూడా సహేతుకంగా ఆయన గట్టిగా మందలించారు. మీకు సూత్రార్థాలూ గీత్రార్థాలు (తెలియవు కనుక) వుపయోగించవు కదా? ప్రయోగాలు చూచుకోండి. సంతుష్టిపడండి. మెసలడానికి అవకాశం వుంటేమీరు వూరుకొనే వారుకారు కనక మెసలనే మెసులుతారు గదా? లేనిపద్ధతినో? యేమీలేదు. మళ్లా తిట్లకేరేఁగండి. యీలా అభ్యనుజ్ఞ యిచ్చినప్పటికి యిటుపైనిమీరు రేఁగుతారని తోఁచదు తిట్లకు. యేమంటారా? యింక ఆబాపతు సరుకు ఈవద్దస్టాకులో లేనట్టు పూర్తిగా ఘాటుచచ్చినమాదిరిగా లంఖణాలబోటు వాలకంగా నడచిన యిప్పటిమీ– "సంశయవిచ్ఛేద" వ్యాసంవల్ల గోచరిస్తూవుంది. యీ వివేకం మొదటేకల్గితే మీవయో వృద్ధత్వానికి యింత హానికలిగేదికాదు. అయితే యెవడిశక్యం. దైవం అనుల్లంఘనీయంకదా? సరే యీవ్యాసంలో మీరు జవాబురాలేదనుకొన్న –నగ – ఎసఁగు, ప్రాసల శంకకున్నూ "మీదుమాదు" దుగాగమ శంకకున్నూ జవాబు వచ్చినట్లేనా? యిఁక "దుష్ప్రాసాలు" అన్నదానికి బాకీవుంది. "నీళ్లల్లో గేదె (బఱ్ఱె)ను బెట్టి బేరంబెడితే యేలాగ?" ఆదుష్ప్రాసాలు వున్నచోట్లేవో? చూపి ప్రశ్నించండి, సమాధానం చెప్పఁగలిగితే చెపుతాను. లేదా? తప్పే అని వొప్పుకుంటాను. లేదా? ప్రమాదం అంటాను. అయితే విమర్శన గ్రంథంలో చూపేవున్నాను. చూచుకో అంటారేమో? ఆపుస్తకం ప్రస్తుతం నావద్దలేదు, మా తిరుపతిశాస్త్రి కొడుకు వద్ద విశాఖ పట్టణంలో వుంది. వాఁడి అడ్రెసు నాకు బాగా తెలియదు. అందుచేత ఆపుస్తకాన్ని వకటి పంపండని మిమ్ములనే ప్రార్థించవలసి వచ్చింది. అనుగ్రహించండి. నన్నయ్య వ్యాసంతో తమరు విరమిస్తారనుకొని వాఁడు చూస్తానంటే వాఁడికి యిచ్చివున్నాను తెలిసిందా? అయితే– "తానొకటి తలిస్తే దైవము వొకటి తల్చాఁడు" ఆవ్యాసమూ మిమ్మల్ని మందలించలేకపోయింది. సేల్జోడుబహుమానమూ మీవిజృంభణాన్ని మందలించలేకపోయింది. కొంచెంగా ఘాటుమాత్రం తగ్గించాయి అవి. యెందుచేత? నేను కవితాధార సాఫుగావుందని సేల్జోడు బహుమానం యివ్వదలఁచినా మీరు అందు కనుకోలేదు. తిట్ల పాండిత్యానికిరా? బాబూ! యీ సేల్జోడు అనుకొని వుంటారు. సామాన్యులా? ఆవలిస్తే పేగులు లెక్కెడతారుగా? అదిన్నీకాక దానికి వుపమానంగా చూపినకథవల్ల అసారస్యం యేలాటి పసిపిల్లాఁడికేనా గోచరిస్తుందాయె బాగా గ్రహించారు.

సంతోషమే సరే? యీలాటి ప్రశ్నలువేయండి తప్పేమి. తోcచినంతలో జవాబువ్రాస్తాను. శిష్ట్లావారి అభినందనంవల్ల మీరు మళ్లా వ్రాcతకి దిగారుగాని లేకపోతే దిగేవారుకారు. వారు పూర్తిగ పొరcబడ్డారు. మీతిట్లువగైరాలకు మీ కెంత జవాబు కాధారం వుందో? వారి అభినందనానికి అంతే. యీ సంగతి మీకుత్వరలోనే గోచరిస్తుంది. నేcడో రేపో శిష్ట్లావారు నా "నన్నయభట్టు" వ్యాసాన్ని చదివితీరతారు. ఆధారం దొరికితే నన్ను మందలిస్తూ జవాబు యిస్తారు. దొరక్కపోతే ప్రమాదపడ్డట్టేనా జవాబు యిస్తారు. ("ప్రమాదోధీమతామపి" అపి రేవ కారార్థకః అంత అసిధారావ్రతంగా నడిచే జీవితం యెక్కడో కాని వుండదు.) నిమ్మకు నీరెత్తినట్లు గంభీరంగా వూరుకోనేనా వూరుకుంటారు. "అప్రతిషిద్ధ మనుమతం భవతి." కనుక అట్టి తూష్ణీంభావం కూడా వుపయోగమే అవుతుంది. నేను వికటవిమర్శనంచేస్తాను. చూస్తారా? అంటూ వకవాక్యం నన్నయ్య వ్యాసంలో వ్రాస్తేదాన్ని ఆక్షేపించడం మొదలెట్టి వున్నారు విమర్శకులు. కర్ణుడు పలికిన పల్కులు వున్నపద్యం చూపి వున్నారు. నన్నయ్యభట్టు భావివిషయం సూచితమైన- "భారతభారతీసముద్రము" అన్నదాన్నిగూర్చిన నావివరణం బాగులేదంటూ వ్రాcతకు దిగారు. యెందుకు తండ్రి? యీ అప్రస్తుతాలు. ప్రస్తుతం మీతిట్లను సమర్థించుకొని బయటcబడే ప్రయత్నం చేయండి. తరువాత నన్నయ్యభట్టునీ, తిక్కన్న సోమయాజినీ యెఱ్ఱాప్రగడనీ వుద్ధరిస్తురుగాని- "స్వయం తరితు మక్షమః కథ మసౌ పరాం స్తారయేత్" భారతానిది యేవూరు; మీదేవూరు? భాగవత పీఠికలోవున్న- "ఒనర న్నన్నయ తిక్కనాదికవులు" అన్నపద్యార్థం అవగతం కాకో! లేదా? చూడకో? యెంతోగతంలో వ్రాయడమేకాక మళ్లా యీవ్యాసములోకూడా బోలెcడువ్రాcత వ్రాసినమీరు భారతంలో వుండే సంశయాలు తీరుస్తారేమి? పైcగా అందులో వుండే పద్యార్థాలు నేను అన్యథా చెప్పినట్లు మీకు యెవరో చెప్పినట్లుగా అభూతకల్పన వొకటా? కాదు నిజమే అనుకుందాం. "నహిసర్వ స్సర్వం విజానాతి" కదా? యేదోపద్యం నాకంటె మీరే బాగా అన్వయిస్తారనుకోండి. తగినవయస్సుకాక పోcబట్టిగాని యుక్తమైన వయస్సే అయితే నావద్ద తమరు యెంతకాలం శుశ్రూష చేయcదగ్గ పాటి సాహితి కల్గి వుంటారో? (యితరులను వద్దు) మీ అంతరాత్మను ప్రశ్నించి చూడండి. అది యేదో యంత్రం వుత్తర దిక్కునే సూచించినట్టు యథార్థాన్నే బోధిస్తూ వుంటుందని యింతగా మనవి చేయడం. స్థూల దృష్టిని 76 యేండ్ల వయస్సుగదా? వొకరివద్ద శుశ్రూష చేయడానికి తగినది కాదని వ్రాశాను గాని బాగా ఆలోచిస్తే 'ముదిమి రెండవ బాల్యంబు' అన్నారు కనుక తగినదే అవుతుందేమో? శాంతం పాపం? యెంతో గర్వరహితంగానే వ్యాసాన్ని నడిపిద్దామని సంకల్పించానుగాని, బూతు కూcతలు పడలేదుగాని గర్వోక్తులు (యథార్థాలే అనుకోండి)

పడకుండా వుండాలంటే మీవ్యాస ధోరణి అంగీకరించిందికాదు. దీనికి మాముత్తాతగారు చెప్పిన సమాధానమే గతి. అది జయంతిలో-

 మ. గరువంపున్నుడు లిందు నచ్చుటచటం గన్పట్టు నప్పట్టునం
బరిహార మ్మొకకొంత గన్పఱచెడిన్ మాపిన్న ముత్తాత యి
ద్దురితమ్మున్ గుఱితించి చింతిలుచు నుందున్ ముప్పదిన్ రెండుదు
ర్దురితమ్ముల్ గురుఁడాడ సైఁచి కవితన్ దూఱంగ నోరెత్తితిన్.

అన్నపద్యంకింద టిప్పణిలో వుంది చిత్తగించండి. ప్రస్తుతం 32-31గా మార్చుకోండి. యెవరో "పండితాయతే"లు యేవో తొందర మాటలు వ్రాసినంతలో వాట్లకు జవాబు వ్రాయడానికి సిద్ధపడడం వుదారత్వానికి లక్షణం కాదనిన్నీ యెఱుఁగుదును, యేం లాభం. యీపిచ్చి సోమయాజులకి అట్టి వుదారత్వం యీవార్ధక్యంలో సర్వసంసిద్ధమైన స్థితిలోకూడా అమల్లోపెట్టడానికి భగవదాజ్ఞ లేకపోయింది. పిచ్చిసోమయాజులను గూర్చి లోఁగడయేదో వ్యాసంలో విస్తరించివ్రాసే వున్నాను. అక్కడ చూచుకోండి. వాఁడికి తన్నుయెవరేనా స్పృశిస్తే సరి వెంబడించి వారిని యెంత దూరమేనా తరుముకువెళ్లి స్పృశించడమే వ్రతం, నాగతి కూడా అలాగే వచ్చిందని చింతిస్తాను. సరే? యెంతవ్రాసినా మీ తొందరపాటు మాటలు వుత్తరించతగ్గవి మిగిలినట్లే కనపడతాయి. "యెలుఁగుబంటి తంటస" మన్నట్టు యిది యెప్పటికి తేలేటట్టు లేదు, అత్యవసరాలు వుత్తరింపఁ బడ్డాయికదా? తృప్తిపడండి. ముఖ్యాంశాలు వ్రాసి విరమించడానికి సంకల్పించుకొని మళ్లా లేఖినిచేతఁబట్టేటప్పటికి అంతలో మీవ్యాస శేషం వచ్చింది. దానితో యిదికూడా అంటే సింహావలోకనంకూడా పెరిఁగింది. పెరిఁగినానాకు సంతుష్టి యింకాకలగలేదు. అయినప్పటికి పత్రికవారికి భయపడి ముగిస్తూన్నాను. యీవ్రాత మళ్లా యెక్కడికక్కడే దోపుళ్లతో నిండి నడవడంచేత చాలా హంసపాదులతో నిండి వుంది. జాగ్రత్తగా ముద్రించి మళ్లా మీశంకలు రాకుండా చేస్తే సంతోషిస్తానని పత్రిక వారికి విజ్ఞప్తి. ఆయీవార్ధక్యంలో-

మ. శివనామమ్ముఁ దలంచి కొంచు నెటులో జీవున్ గృతార్థుం బొన
ర్చువిధిన్ బద్దెము లల్లికొం చుపనిష చ్ఛుద్ధా న్తకాన్తామణీ
భవనప్రాంగణసీమ దాస్య మొనరింపం బోవు నన్నెందుకో?
కవనమ్మున్ దెగ వెక్కిరించి గురుఁ డీగర్వోక్తు లాడించుటల్.

అన్న పద్యార్థప్రకారం వర్తిద్దా మనుకుంటే పంచగురువులలో వొకరుగా లోఁగడ మనవి చేసుకున్న తమరు దానికి విఘ్నం కల్పించారు. గతానికి విచారించి ప్రయోజనంలేదు. "భాషామంజరీ సమాప్తా" పాండిత్యంతో యింకా పెనుగులాడక (యిది మీకోసమే

చెప్పేమాట) త్వరలో నన్ను తమ గ్రామానికి వెంటఁబెట్టుకొని వెళ్లి మీరు వ్రాసిన వ్రాఁతలో (గోడమీద పిల్లివాటంగా వున్నదానిలో) యేసమ్మానం మీమనస్సా వివక్షితమో? దాన్నేచేయండి. పిమ్మట నేను నాతోకూడా నా స్వంత ఖర్చుల మీఁద మిమ్మల్ని తీసుకువచ్చి నాఆహ్వానంలో (యేవిధమైన యితరార్థములేదు. గనుక) వున్న నిష్కపటమైన సేల్జోడు బహుమానం చేసితరిస్తాను. ఆమర్నాటినుంచి మళ్లా నా "శివాయనమ ఓం" లోకి దిగుతాను. "ఆలస్యాదమృతం విషమ్" కనుక జనవరినెల లేక ఫిబ్రవరి 15 తేదీకిలోఁగా యీ ప్రయత్నం చేయండి. యింతే; పెద్దలగు మీకు నా నమస్కారాలు "శివాయనమ ఓం, శివాయనమ ఓం! శివాయనమ ఓం శివాయనమ ఓం" స్వస్తి.

## అనుబంధము

నేను లోఁగడ సంవత్సరం నాఁడు వ్రాసిన "నన్నయ్యభట్టు" వ్యాసంలో ప్రసక్తాను ప్రసక్తంగా భారతం నన్నయ్యగారి చేతిమీదుగాఁ పూర్తికాకపోవడానికి సూచ్యార్థ సూచన నన్నయ్యగారి వాణి-

"చ. అమలిన తారకాసముదయంబుల నెన్నను సర్వవేదశా
స్త్రముల యశేషపారము ముదంబునఁ బొందను బుద్ధి బాహువి
క్రమమున దుర్గమార్థజల గౌరవభారత భారతీసము
ద్రము దరియంగ నీఁదను విధాతృనకైనను నేరఁ బోలునే?"

అనే పద్యంలోనే సూచించిందని క్లుప్తంగా సూచించినాను. దాన్ని మావిమర్శకుఁడు గారు అపవదిస్తూ కొన్ని మాటలు వ్రాయుటయేకాక యెవరో చౌదరిగారివద్దనూ యింకా యెవరో బ్రాహ్మణపిల్లవానివద్దనూయేవో యుక్తులు చెప్పి ముఖపిధానం చేయడానికి ఆరంభిస్తే వారిద్దఱున్నూ నాపేర తఱుచుగా ఉత్తరాలు వ్రాస్తూన్నారు. వారి వ్రాఁత కొంత "శల్యసారథ్య" ప్రయుక్తంగానే కనపడుతుంది గాని అయినప్పటికీ ఆసంశయాన్ని మనస్సులో పెట్టుకోక నేను-

"అయ్యా! వ్రాస్తే చాలా వ్రాయాలి. కాఁబట్టి వొకసారి మా వూరు వస్తే నాకు తెలిసినంతలో మీ సంశయం తీరుస్తాను."

అని వ్రాసి వున్నాను. కాని వారిలో వొకరు (చౌదరిగారు) నావలెనే వృద్ధులంఁట! అందుచేత రాలేక మళ్లా మళ్లా వుత్తరాలు వ్రాసి నాకు పనికలిగిస్తూన్నారు. అందుచేత యీ రెండు మాటలున్నూ వ్రాస్తే యిది వారికే కాక తద్ద్వారాగా "దేహళీద త్తదీపన్యాయం"గా యితర పాఠకలో కానిక్కూడా అందించినట్లగు నని పైని వుదాహరించిన పద్యంలో వున్న

సూచ్యార్థాన్ని వివరిస్తూన్నాను. ఆ పద్యంలో నాలుగోచరణంలో- "దరియంగ నీఁదను విధాతృనకైనను నేరఁబోలునే?" అనే వాక్యంలో పూర్తిగా యీఁదుట దుస్తరమనే అర్థం కలదా? లేదా దానివల్ల నన్నయ్యగారు సంశ యాత్ములైనారా? అంటే లేదని యెవరంటారు? "సంశయాత్మామ వినశ్యతి" అనే అభియుక్తోక్తినిబట్టి తుదకు సంశయం సంశయమే అయింది అనుకోవడానికి అవకాశం పూర్తిగా వుండఁగా యింకా వివాద మెందుకో? భవతు. యింకాఆపద్యంలో ఆయీ అర్థాన్ని బలపఱిచే అక్షరాలు బోలెఁడు వున్నాయి చూడండి- 1. ఎన్నను (ఎన్నఁగల వాణ్ణి కాను) 2. పొందను (పొందఁగలవాణ్ణికాను) 3. ఈఁదను (ఈఁదఁ గలవాణ్ణికాను) అనే అర్థం రాకుండా చేయడానికి యెవరికేనా శక్యమవుతుందా? నన్నయ్యగారేమో? ఆయీ మూఁడు క్రియలున్నూ అసంపూర్ణ క్రియలుగా (ఎన్నుటకున్నూ, పొందుటకున్నూ, ఈఁదుటకున్నూ) ప్రయోగించినారు. రెండో అర్థంలో అనఁగా? గ్రంథసమాప్తికాదనే సూచ్యార్థ సూచనలో సంపూర్ణక్రియలు (వ్యతిరేకార్థకోత్తమ పురుషక్రియలు)గా పరిణమించాయి. ఆలా పరిణమించకుండా చేయడానికి- "విధాతృనకైనను నేరఁబోలునే?" అంటాను నేను- కాఁబట్టి యిదివఱలో పరంపరగా కవులుచెప్పే- "పూరములంబర పూరితంబులై" అన్నదానికన్న యిది మిన్నగా వుందో లేదో? సహృదయులు పరిశీలించి పరిగ్రహించవలసి వుంటుందని నేననుకున్నాను. యేదోవిధంగా వాది ప్రతివాదిభావాన్ని కల్పించుకొని వివాదించేవారిని తృప్తిపఱచడం నాకే కాదు. యెవరికీ శక్యంకాదు. నాకు పూర్తిగా పైపద్యంలో ఆయీసూచ్యార్థం వుందనే నమ్మిక.కల్గి వ్రాశానేకాని లోకాన్ని మోసగించే తాత్పర్యంలో వ్రాయలేదు. జీవిత చరిత్రలో దీన్నిగూర్చి వక పద్యం వ్రాశాను. దాన్ని వుదాహరిస్తాను.

ఉ. 'ఎన్నను, పొంద, నీఁద,' ననునీత్రితయమ్మును బెద్దయెల్లుతో
నన్నయ పూర్తి చేయునని నమ్మిక లేమివచించు నిట్లొగిం
గన్నులఁ గట్టినట్టులుగఁ గన్పడు చున్నను నేఁటి క్రొత్తతి
క్కన్న, త్రిలింగ లోనటులు కాదని వ్రాయువృథావివాదియై.

చాలును. ఈయన తాను తిట్టినతిట్లు తనవి కావనిన్నీ యెవరో తిడితే ఆ తిట్లను అనుకరించాననిన్నీ, తాను కృతియిచ్చినట్లుగా అభిప్రాయపడడం సరిగాదనిన్నీ ఆచౌదరిగారు వగయిరాలతో వివదించుచున్నట్లు తెలుస్తుంది. ఆమాటలను త్రిలింగ ఆమోదించి ప్రచురించే యెడల దాన్ని గూర్చి వ్రాస్తాను. ప్రచురించడంలో ఆమాటలు ససారాలోకావో అనేవిషయ విమర్శ ఆపత్రికదే అని మాత్రం వ్రాసి యిప్పటికి దీన్ని ఆపుతాను.

★ ★ ★

# భారత భారతి

"భారత భారతి" అనే యీ ప్రయోగం ఆదిపర్వంలో వుంది. దీని కర్థం సరియైనది – భారత = భారతం (గ్రంథం) యొక్క భారతి = వాణి. అనగా? భారత వాఙ్మయమన్నమాట. దీన్ని సముద్రంగా రూపించి నన్నయ్యగారు దీన్ని దరిముట్టేటట్టు యీఁదడానికి బ్రహ్మకేనా శక్యం కాదన్నారు. "భారత భారతీ సముద్రము దరియంగ నీదను విధాతృనకైనను నేరబోలునే" చూ. ఆ యీ సందర్భం నేను అయిదాఱేళ్లకు పూర్వం యేదో సూత్రప్రాయంగా త్రిలింగ పత్రికలో వ్రాసి వున్నాను. భారత రచన అరణ్య పర్వంలో కొంతతోటే సమాప్తం కావడానికి ఆపర్వంలోనే శరదృతు వర్ణనలో వున్న "ఉ. శారదరాత్రు లుజ్జ్వల... రుచిపూరము లంబర పూరితమ్ములై" అనేవి కారణంగా కవిపరంపర చెప్పుకుంటారు. ఆ యీ సందర్భానికి అరణ్యపర్వందాకా వెళ్లనక్కఱలేదు. ఆదిపర్వంలోనే గ్రంథారంభ ఘట్టంలో వున్న–

"చ. అమలిన తారకాసముదయంబుల నెన్నను సర్వవేద శా
స్త్రముల యశేషపారము ముదంబున ముట్టను బుద్ధి బాహు వి
క్రమమున దుర్గమార్థజల గౌరవ భారతభారతీసము
ద్రము దరియంగ నీదను విధాతృనకైనను నేరబోలునే."

అనే పద్యంలోవున్న "భారత భారతీ సముద్రము దరియంగనీదను" అనే వాక్యంలో వున్న ఈదను అనే తుమున్నంతం (కవి యభిప్రాయంలో యిదితుమున్నంతమే) కవికి అభిప్రేతం కాకున్నను వ్యతిరేకార్థ కోత్తమ పురుషైక వచనంగా కూడా అర్థం యివ్వడం దుర్వారం గనక యీ అనర్థానికి అదే సూచకం కావచ్చుననో, అదిన్నీ సూచకము కావచ్చుననో, (అధికస్యాధికం బలం) ప్రసక్తాను ప్రసక్తంగా వ్రాశాను. ఈదను అన్నది తుమున్నంతంగానే సమన్వయించుకున్నప్పుడు సముద్రతుల్యమగు భారతం చక్కగా సమన్వయించుకొని పూర్తి చేయడమంటే? చాలా కష్టసాధ్యం అన్నంతవరకే అర్థం వస్తుంది. కాని (ఆలంకారికమర్యాద అంతే) అపార్థానికి త్రోవతీయదు. ఆ క్రియ (ఈదను) ను వ్యతిరేకార్థకంగా అన్వయించడమే కాకుండా దానికి వొకదానికి మఱొకటి బలం, దరియం–గన్–అనేది కూడా కల్పితే వచ్చే అర్థమో?– (అగ్నివాయు సంయోగమై) నేను

భారత వాఙ్మయ సముద్రమును యేకొంచెమో (యీదితే) యీదగలుగుతానేమో కాని తుదముట్టా (దరియంగన్-చూ) యేలాగా యీదగలవాణ్ణి కాను. అని స్పష్టంగా భావ్యనర్థాన్ని (అభిధచేతనే లక్షణ వగయిరా లక్కఱలేదు) భగవంతుఁడు ఆయనచేతనే పలికించి నట్టయిందో? లేదో? సహృదయులు పరిశీలింతురు గాక. యీ అపార్థం కవికి సమ్మతమని యెంత పిచ్చివాడూ అనడు. సమ్మతమే అయితే అది అపార్థమెందుకవుతుంది? యథార్థమే. అది కేవలం దైవప్రేరితం. ఇక్కడ చెడ్డకు సూచక మీవిధంగా అయింది. గాని వేఁటొక్కచోట మంచికిన్నీ యిట్టి సూచకాలు (నేత్ర స్పందనాలు) కలుగుతవి. "అథవా భవితవ్యానాం ద్వారాణి భవంతి సర్వత్ర" అనలేదా? కాళిదాసు యీలాటి సందర్భాలలో- "తత్రభవితవ్యతా బలవతీ" అంటారే కాని, గ్రంథకర్తలు అన్యథాగా వ్యాకరింపరు. ప్రధానమైన-యీదనుఅనేది యీత్రోవలోకి యెప్పుడయితే సమన్వితమయిందో! అప్పుడు "ముట్టను ఎన్నను" అనేవిన్నీ ఈ త్రోవనే సమన్వితములై ఆ అపార్థాన్నే బలపరుస్తాయని వ్రాయనక్కఱలేదు. యిక్కడల్లా ముఖ్యంగా జ్ఞాపక ముంచుకోతగ్గది యీ అపార్థం దైవప్రేరితమే కాని కవికి అభిప్రేతం కాదు. అనేదియ్యేవే. "అభిప్రేతమే" అని యెవరేనా అపాదిస్తేనో అది ఐహికానికే కాక పారమార్థికానిక్కూడా చాలా హానికరమని వేఱే వ్రాయనక్కఱలేదు. యీ సంగతి యెఱిగో, యెఱక్కో, వొకానొకరు (యః కశ్చిత్) వృథాగా ద్వేష బుద్ధితో నేనేదో- "చ. అమలిన తారకా సముదయమ్ముల నెన్నను" అనే పద్యంలో అసలు అనాదిసిద్ధమైన పాఠంగా వుండే "భారత వాహినీ సముద్రము" అనే పాఠాన్ని ఆదేశించినట్టు అపలపించడమే కాక, కొన్ని దూషణోక్తులు కూడా వ్యయపెట్టిన వ్రాత వొకటి- ఆంధ్రవాణిలో కనపడింది. నేను గోణం కట్టింది మొదలు కొన్ని భారత ప్రతులు చూచివున్నాను. గాని, నాకు ప్రతిపక్షి అపలపించే వాహినీ పాఠం వుపలబ్ధం కాలేదు. సర్వత్రా "భారత భారతీ" అనే పాఠమే వుపలబ్ధమయింది. అదిన్నీ కాక భారత వాహినీ పాఠానికి వ్యాఖ్య వ్రాస్తూ, ప్రతిపక్షి బహువ్రీహి సమాస సూచకంగా, భరత వీరచరితలనెడు వాహినులు కల-అనే విగ్రహానికి స్ఫోరకమైన అక్షరాలు (భరతవీర చరితలనెడు నదీ ప్రవాహములు కల, చూ) లిఖించివున్నాఁడు. ఆ పక్షంలో బహువ్రీహి సమాసానికి రాదగిన చిహ్నం హ్రస్వమో? లేక కప్పో? రావలసివస్తుంది. ఆపక్షంలో పరినిష్ఠిత రూపం - భారత వాహినీకః లేదా? "భారత వాహినిః" అని కావలసివస్తుంది. యిందులో దేనికంగీకరించినప్పటికీ ఛందో భంగం దుర్వారం. వాహినీపాఠానికి చెప్పే అర్థంకూడా, అంత వీలుగా లేదు. అట్టి అర్థం కవి వివక్షించవలసిన ఆవశ్యకత కూడా కన్పడదు-

భారత వాఙ్మయమును సముద్రంగా రూపిస్తే చాలు. చాలినాసరే తృప్తిపడక వాహినీపాఠాన్ని కల్పిస్తామంటే వున్న విప్రతిపత్తి సూచించాను. యిఁక నిప్పుడు వాహినీ

శబ్దానికి హ్రస్వం వచ్చే సందర్భం కొంచెం (విపులంగా కాదు) వివరిస్తాను. అందుకు "అబ్రవీత్పురాణ" వ్యాఖ్యాత మాటలు ముందు వుటంకించాలి. అవి అపహాస్యాస్పదంగా వున్నా చూపించాలి.

"భరత వీరచరితలనెడి (యిది భారత శబ్దానికి) నదీ ప్రవాహములు గల భారతమనెడు" మూలంలో భారత శబ్దం వొకటే వుంది. అర్థంలో రెండు వుంటేకాని కాపురం తుదనెగ్గదు భవతు. (ఉచ్చరిత శబ్దోర్థ ప్రత్యాయకో నానుచ్చరితః) దాన్నే ఆవృత్తి చేస్తేనో? ఆ సంప్రదాయం శాస్త్ర సంబంధమైన సూత్రాలకుగాని, సాహిత్య సంబంధమైన శ్లోకాలకూ తెలుగు పద్యాలకూ చెందిందికాదు. వ్రాస్తే చాలా వ్రాయాలి. సంప్రదాయం కాకపోయినా అంగీకరిద్దాం. భరతశబ్దానికి కవి వివక్షించుకున్న భారత గ్రంథమని చెప్పుకోక అవివక్షితమైన యీ అర్థం యెందుకుచెప్పాలి? భరత వీరచరితలలో వొక్కొక్కని చరిత్ర వొక్కొక్కనిది. అందరివీ అన్ని నదులు. అవి వచ్చి భారత గ్రంథమనే సముద్రంలో కలిశాయా? వో హో హో! యెంత చక్కని అలంకారశాస్త్ర విదగ్ధత్వం!!! అయితే యీ అర్థం బాగాలేదు, అని నేనంటే బాగానేవుందని ప్రతిపక్షి వాదానికి వుపక్రమిస్తే గతేమిటి? "సహృదయాః ప్రమాణమ్" అనవలసివస్తుంది. యెప్పుడూ లోకంలో నిజమైన సహృదయుల సంఖ్య తక్కువగానే వుంటుంది. కనక అప్పుడు- "పంచశుభం, పంచాஉశుభమ్"గా పరిణమిస్తుంది వాదం. కనక సుళువైన మార్గం చూచి ప్రతిపక్షి వాదాన్ని మందలించడం యుక్తం. ఆ మార్గం యెట్టిదంటే? అయ్యా! మీరు చెప్పే యేళ్లూ కోళ్లూ వచ్చి సముద్రంలో కలవడం వగయిరా గంపతిరుగుడు అర్థాన్ని శంకించేదిలేదు. గాని- మీరు "భారత వాహినీ" శబ్దానికి భరతవీర చరితలనెడు నదీ ప్రవాహములు కల భారతమనెడు సముద్రము అని కదా? అర్థం వ్రాశారు. "కల బహువ్రీహిః" అనే అభియుక్తోక్తి నెప్పుడేనా విని వున్నారా? బహువ్రీహి చెప్పేయెడల విగ్రహవాక్యం "భారతాన్యేవ వాహిన్యోయస్య" అనేనా? అప్పుడు వాహినీ శబ్దగత దీర్ఘానికి హ్రస్వంవచ్చి "భారతవాహినిః" అనేనా కావాలి. లేదా? కప్పు (కాఫీ కప్పు కాదు బహువ్రీహి కప్పు) చేస్తేనో? "భారత వాహినీకొ" అనేనా పరినిష్ఠితరూపం యేర్పడాలి. ఉభయధాపి ఛందోభంగం తప్పదు. "అపి మాషం మషంకుర్యాంచ్ఛందో భంగం నవా" అన్న మాటెరుగుదురా? "అబోధోపహతాశ్చాన్యే" తెగలో వుండే మీకీ వ్యాఖ్యానాలెందుకు? నన్నయ్య బుద్ధిని బాహువిక్రమంగా రూపించాడు కదా? దానికి అనుకూలించడానికి మనం వాహినీపారవ కల్పించి గ్రంథపరమైన భారత శబ్దాన్ని భరతవీర చరిత పరం చేద్దామనే అనుకున్నారు. గాని, ప్రధానమైన చిక్కు (ఉ. బాబుకు పెండ్లి య్యోనని బాలుడు సంతసమందె గాని, మేకై బహివెట్టు చెట్టసవతమ్మ ఘటించు టెరుంగడు... గీరతము చూ.) గమనించనేలేదు. "భాష్యాబ్ధిః క్వాతి గంభీరః"

అన్న విధంగా నన్నయ్య భారత గ్రంథాన్ని సముద్రంగా రూపించాడు. అంతే. మీ పాండిత్యాన్ని ప్రకటించుకొనడానికి ప్రయత్నించారు. తప్పులేదు. కాని, లోకం యింకా పండిత శూన్యం కాలేదు. శబ్దజ్ఞానం లేని దిద్దుబాట్లు "రాజేత్వన్మ ఖాంభోజే" మాదిరిగా అంతస్సార శూన్యత్వాన్ని ప్రకటించవా? మురారి కవి "నశబ్దబ్రహ్మోత్థం పరిమళ మనాఘ్రాయచ" అన్నాడు.

శా. అంతస్సారము లేకయున్న నెటులో ఆ పేరు లీపేరు లార్జింతుర్కొందరు- (జయంతి చూ.) యెఱుగుదురా! సరే మీదగ్గిర యీసంప్రదాయాలన్నీ యేకరువెట్టడం వృథా. నేను వొకమాట మిమ్మల్ని అడుగుతాను. జవాబిస్తారా? యీ "భారత వాహినీ సముద్రము" అనే పాఠం మీ కేదేనా పుస్తకంలో వుపలబ్ధమయిందా? స్వకపోల కల్పితమా? అంఛాను. స్వకపోల కల్పితమే అయితే ఆశ్చర్యం లేదు. యే పుస్తకంలోనేనా వుపలబ్ధమైన దనేయెడల ఆశ్చర్యపడవలసి వస్తుంది. అష్టభాషా వాగను శాసనుడైన నన్నయ్య కాఁడుగదా? అతని పసులకాపరి గూడ యిట్టిప్రమాదానికి గుఱికాడు. తెలిసిందా?

"ఉ. మూగురయందు నన్నయ సమున్నతుఁడై కదు లక్షణంపు బ్రోవై"

"ఉ. అందాది దొడంగి మూడు కృతులాంధ్ర కవిత్వ విశారదుండు
విద్యాదయితుం డొనర్చె మహితాత్ముడు నన్నయభట్టు దక్షతన్."

"సీ. నన్నయకవి పెట్టినాడు కదా!
తిక్కనాది కవీంద్రుల కాదిభిక్ష."

అట్టి నన్నయ్య యిట్టి తప్పుడు ప్రయోగం చేస్తాడంటే విజ్ఞలోకం సమ్మతించదు. ఇంతకూ సుప్రసిద్ధంగా వుపలబ్ధ మవుతూవున్న "భారత భారతీ సముద్రము." అనే పాఠం కంటె ఆ డొంక తిరుగుడు పాఠంలో యే విధమైన గుణము కనపడదు. పైగా దోషం కనపడుతూవుంది. నేనిప్పటికి చాలా ప్రతులు భారతం చూచాను. నాకీ భారతభారతీపాఠమే కాని భారత వాహినీ పాఠము కనపడలేదు అని మళ్లా వ్రాస్తున్నాను. దీని అయోగ్యతను గూర్చి కొంచెం వ్యాకరించాను. అసలు పాఠము యొక్క యోగ్యతను కూడా వివరిస్తాను.

భారత భారతీ సముద్రము; భారత = (వ్యాసకృతమైన) భారత గ్రంథంయొక్క, భారతీ = వాణి, అనగా? భారత వాఙ్మయ మనెడి సముద్రము అని రూపించాడు కవి. అనేక వ్యాసఘట్టాలతో నిండి మహా గంభీరంగా వుండేది గనక-సముద్రత్వేనా రూపించడం యుక్తమే. యీ రూపణకు యితరాపేక్షతో పనిలేదు. కాళిదాసుగారి కవిత్వంలో మన పైత్యం చేర్చడంవల్ల డొంకతిరుగుడు త్రోవ పట్టడం. యిది "చక్కని రాజమార్గము లుండగా సందులు దూరినట్లు" గాక మఱేమి? నన్నయ్యకు అప్రయత్నసిద్ధంగా యమకం దొర్లుతుంది.

1. ఉ. భారతభారతీ శుభగభస్తి చయంబులు... ...
2. చ. భారత భారతీ సముద్రము దరియంగ నీదను... ...
3. మ. కురువృద్ధుల్ గురువృద్ధ బాంధవు లనేకుల్... ...
4. మ. మదమాతంగ తురంగ కాంచన లసన్మాణిక్య గాణిక్య...

యింకా యెన్నో యీలాటివి చూపవచ్చును. దిద్దిన వాహినీపాఠంలో చెప్పే అపార్థాన్ని బట్టి దురుద్ధరమైన వ్యాకరణదోషం తగలడమే కాకుండా (యీ దురుద్ధర దోషం హ్రస్వం రావాలనేది స్థూలదృష్ట్యా చెప్పేమాట. సూక్ష్మదృష్ట్యా అయితేనో? భారతవాహినీకః అని కప్పురావాలనేదే. ఇందులో యేదేనా మీకు చిక్కే అన్నది పరమార్థం) యమకం కూడా చెడుతూ వుంది. తాను యీవిధంగా తప్పుత్రోవలో కలంనడుపుతూ అసలు పాఠాన్ని గూర్చి కొన్ని అసంగత వాక్యాలు 'భారతభారతీ' అని దిద్దినారు. ఈ మార్పునం దేమి విశేషము గ్రహించిరో?... ... ... "ఇది అనౌచిత్యము సమంజసముగ లేదు." అంటూ వొక కాలం జ్ఞానలవదుర్విదగ్ధపు మాటలతో నలుపు చేయబడింది, వాహినీ అనేది పూర్వపాఠమట? యిది యథార్థమగు మాటేనా? కాదన నేల? అంగీకరింతము గాక. ఆ పక్షంలో యిట్టి అవ్యుత్పన్నులు యీ పిదపకాలంలోనేకాదు. పూర్వకాలంలోకూడా కొందఱు వుండేవారని తేల్తుంది. వ్యుత్పన్నులే అయితే వ్యాకరణ దుష్టమైన పాఠాన్ని కల్పించరు. యితరులు కల్పిస్తే సమ్మతించరు. "నోచే ద్దుష్కృత మాత్మనా కృతమివ స్వాంతా ద్బహి ర్మాకృథాః" అన్నాడు పండితరాయలు. యేదో సందర్భంలో యెప్పుడో మేమున్నూ- "-వాకురు కింతుమాకురు వృథా పద్యాని గద్యానివా" అని వొకరిని మందలించవలసి వచ్చింది. అర్హత వుండుగాక; లేకపోవుగాక, యేదో భారతాన్ని బాగుచేదామని పూనుకోవడం బాగానేవుంది. యీ తలకు తగని మాటలెందుకు? "మొండివాదం... తెలివితక్కువ... తాజెడ్డకోతివనమెల్ల జెరచె..." ఆ ఈ ప్రసంగం నన్ను గూర్చి చేసింది. యెందుకంటే? నేను "భారత భారతీ సముద్రము" అనేపాఠం వ్యాకరించినందుకు. పైగా అరణ్యపర్వంలో సూచితమైన "షరపూరితమ్ములై" అనే భావ్యనర్థ సూచకమైన విశేషం. ఆదిపర్వంలోనే "చ. అమలిన తారకాసముదయమ్ములన్... ..." అనేపద్యంలోనే సూచితమయిందని ఋజువు చేసినందుకు. నేను ఆయీ అపార్థం భాసిస్తూందన్నానుకాని ఆయీ అపార్థం గ్రంథకర్తకు సమ్మతమని అనలేదు. యీయన నేను సమ్మతమని అన్నట్లు కల్పించడం వొకటి? (చూచారా? యీయనకు అసత్యమంటే యెంత భయం లేదో) అపార్థాలూ అమంగళార్థాలూ వొక్కొక్కప్పుడు అవశాత్తూ యెంతటి మహావిద్వత్కవికేనా సరే దొర్లుతూ వుంటాయి. ఆపని జరిగాక పరిశీలించుకుంటే (గ్రంథకర్త మరణానికి సంబంధించేవి

కాకపోతే) గ్రంథకర్తకే గోచరిస్తాయి. యిది అట్టిది కాదు గనక, యేది? "అమర్చిన దానిలో అత్తగారు వేలెట్టింది" అన్నట్లు కవి పరంపర చెప్పుకొనేదాన్నే ఆయీ "అమలిన తారకా" పద్యంలోని "ఎన్నను-ముట్టను-ఈదను" అనే తుమున్నంతాలను వ్యతిరేకార్థ కోత్తమ పురుషైక వచనాలుగా (వీలుండబట్టే సుమండి) సమన్వయించి చూపి బలపరిచాను. అయితే ఈయన యెవరో, పాపం! నాఁమీద కలియబడతారెందుకో? యెందుకా? పేరుకోసం అంటారనుకుంటాను. యింత మాత్రంతో పేరు వస్తుందా? అయ్యో? రాకేం. వెనక జరిగిన యితిహాసం కీ॥ శే॥ రాలు శ్రీ విక్టోరియారాణిగారికి సంబంధించింది. టుపాకీగుండు దాటిపోయింది. ఆకొట్టిన వ్యక్తిని పిల్చి "యిదేం పాపం జగన్మాత నీకేం అపకరించింది" అని అడిగితే ఆ మనిషి చెప్పాడుగదా "అయ్యా! నాకు వొక కోరిక వుంది. నా మనస్సులో లేశమూ దురుద్దేశంలేదు, చిత్తగించండి. ఆకోరిక పెద్ద పేరు సంపాదించాలనేది. దానికి యింతకన్న వుపాయంకనపడలేదు. యీ పాటికప్పుడే నా పేరు యెన్ని పత్రికలలోనో అచ్చవుతూ వుంటుంది. సప్తసముద్రాలూ దాటుతుంది." అని చెప్పేటప్పటికి చక్రవర్తిని ఆ మానిసి చెప్పినది యథార్థమే అయివుండునని నిశ్చయించి అతనికి యేవిధమైన శిక్షాలేకుండా విడుదల చేయించిందని చెప్పుకోగా వినడం. యీయన యిప్పుడిప్పుడు వార్ధక్యంలో పైకివచ్చారుగాని, పేరుకోసం యత్నం చాలా కాలాన్నుంచి చేస్తూన్నట్టు వ్రాతమూలకాలు ఆధారాలున్నాయి. యీయన కేవో కొన్ని బిరుదాలు (నేతి బీఱ కాయలు) కూడా స్వగ్రామంలోనే (యింట గెల్చి రచ్చ గెలవమన్నారు. గదా!) అలంకరించారు. యిక నేం కావాలి? "తిక్కన సోమయాజిగారు" భారతాన్ని పూర్తిచేస్తే యీయన వ్యాకరించడానికి ఆరంభించారు. తెలుగుగదా అనుకున్నారు కాబోలును! అలా అనుకుంటే విరాట పర్వం దగ్గిఱ నుంచి పని జరుగుతుందేమో? లేదా? అరణ్యపర్వంలో వున్న-

"చ. స్ఫురదరుణాంశు రాగరుచి బొంపిరి వోయి... ..."

అని పద్యం దగ్గిఱనుంచి కూడా పని జరుగుతుందేమో కాని,

"ఉ. శారదరాత్రు లుజ్జ్వల లసత్తర తారక హారపంక్తులన్
జారుతరంబులయ్యె వికసన్నవ కైరవగంధబంధురో
దారసమీర సౌరభము దాల్చి సుధాంశు వికీర్యమాణ క
ర్పూరపరాగపాండు రుచి పూరము లంబరపూరితంబులై"

యీ వొళ్లెఱుగని శివపు ధోరణి కవిత్వాన్ని వ్యాకరించడానికి చాలా సామగ్రి వుండాలి. ఆ యీ పద్యంగాని, యింకా కొన్ని పద్యాలు ఆదిపర్వంలోనే "మాకు బ్రసన్నులయ్యెడున్"

ఆ పనికి మాలినపచ్చి శృంగారం వ్రాయక తప్పింది కాదు. పోతన్నంతటి వాఁడికి భోగినీదండకరచన తప్పిందా? వీట్లనిబట్టి కవులఆశయాలు నిర్ణయించడానికి వల్లకాదు. సర్వే సర్వత్రా కవులు "యెవఁడిపిచ్చి వాఁడి కానందం" అన్నసామెతకు దాసులుగానే రచన సాఁగించుకుంటారు గాని, యితరులకు దాసులుగా వుండరనే నా నమ్మకం. ప్రస్తుత గేయాలు కూడా వొకరి ప్రోద్బలంమీఁద వారువారు వ్రాస్తూ వున్నట్టు నాకు తోఁచదు. యీ గేయాలు వ్రాసేవారందఱూ ధారాళంగా పద్యాలు వ్రాయఁగలవారే కాని, సామాన్యులు కారు. కవిత్వానికి ఛందోరీత్యా కూడా మార్పు కలిగించడానికి యీ తోవను నడిపిస్తూన్నారు. యెన్నో విధాల పద్యాలు వున్నప్పటికీ, నన్నయాదులు కొన్నిటిని మాత్రమే స్వీకరించి రచన సాఁగించుకొన్నట్టే వీరున్నూ యెన్నో తాళభేదాలు వున్నప్పటికీ, సర్వసులభంగా వుండే ఆట, ఆది, యీలాటితేలిక తాళాలలోనే వ్రాస్తూ వుంటారు. రహదారీ పడవలు లాగేవాళ్లు పాడుతూంటే చిన్నతనంలో వినడం వుండేది యీబాపతు పదాలు. అప్పటి రోజుల్లో గవర్నమెంటుద్యోగులు సకుటుంబంగా ప్రయాణాలు సాఁగించేటప్పుడు ఆయీపదాలు విని అందులో వుండే పచ్చిశృంగారాన్ని యేవగించుకొని, ఆ కలాసులను మందలించడంకూడా వుండేది. క్రమంగా ఆప్రయాణాలు నామమాత్రావశిష్టాలయినాయి. ఆ పదాలను వరవడిగాఁ బెట్టుకొని కొంత రచన బయలుదేఱింది. ఆ రచననుకూడా కొందఱు ఆదరిస్తూన్నారు. వ్యావహారిక భాషలో వుండడంచేత విద్యాశాఖవారు మాత్రం ఆదరించినట్టులేదు. క్రమక్రమంగా వారుకూడా ఆదరిస్తారనే తోస్తుంది. అందుచేత స్కూళ్లల్లోవుండే వుపాధ్యాయులు "మహారాజులు తల్లీ" "అమ్మా! మాదాకవళం తల్లీ, నీబిడ్డల మన్నం తల్లీ" వగయిరాలు విద్యార్థులకు పాఠం చెప్పవలసిన ఆవశ్యకత కలుగుతుందనే తోస్తుంది. పాఠాని కేం సులువుగానే చెపుతారు గాని, ఆయీగేయాలు సుస్వరంగా, వుదాత్తానుదాత్తస్వరిత ప్రచయా లెక్కడెక్కడ వుపయోగించాలో తెలుసుకోవడానికి గేయకర్త శుశ్రూష చేయకపోతే, సాధ్యంకాదు. వేదం మాదిరిని అభ్యసించవలసిందే గాని ఆ సన్నాయి నొక్కులు వగయిరాలు సుఖసుఖాల పట్టుబడేవికావు. యిది నేను స్వయంగా విని కనిపెట్టిన రహస్యం. పూర్వకవులు అన్నిమార్గాలూ తొక్కేశారు. (హృదయగతిన్ బురాతన కవీశ్వరు లేగనివీథి లేధు. బాణోచ్ఛిష్ట మిదంజగత్) యిఁక మనకి యిది తప్ప రచనకు ఆలంబనం లేదు అని బుద్ధిమంతులు దీన్ని ఆమోదించినట్లు తోస్తుంది. ఆమోదిస్తారు గాక, యీ నవకవిత్వానికి యిదివఱలో లాక్షణికులు చూపిన లక్షణాలు కాక, ప్రస్తుతలక్ష్యాలను అనుకూలించేలక్షణ గ్రంథాలు లేని లోటు వకటి యిప్పటికీ కనిపిస్తూ వుంది. యీ లోపం కూడా త్వరలోనే తీరితే, దీన్ని యెవరేనా ఆక్షేపిస్తే ఆ లక్షణగ్రంథాల ద్వారా జవాబు చెప్పి

సమర్థించుకోవడానికి వీలిస్తుంది. పూర్వ కవిత్వాల కేనా మున్ముందుగానే లక్షణం పుట్టివుండదు. లక్ష్యం పుట్టినపిమ్మటే లక్షణం పుట్టి వుంటుందన్నదే యుక్తిసహమైనమాట. యతిప్రాసలు వదలుకోవడానికి అభ్యనుజ్ఞ యే లాక్షణికులూ యివ్వనక్కఱలేదు. సంస్కృత కవిత్వమే మార్గప్రదర్శక మనుకుంటే సరిపోతుంది. అయినా యింకా వాట్లని వదులుకున్నట్టు లేదు గదా? అందుచేత సర్వమూ మార్పు చెందుతూవున్న యీ నూతన ప్రపంచానికి నూతన కవిత్వం కూడా ఆవశ్యకమే. యిప్పుడిప్పుడు నాకు కూడా తోస్తూనే వుంది. దీనికి నేనే మార్గప్రదర్శకుణ్ణని కొందఱు వ్రాస్తున్నారు. ఆమార్గప్రదర్శకత్వం యెంతవఱకు సత్యమో, యెంతవఱకు కాదో ఆయీ నా వ్యాసంవల్ల లోకం గ్రహించుఁగాక.

★ ★ ★

# కవితా విప్లవం-2

కవితావిప్లవం అనే వ్యాసాన్ని నేను యెవరియందూ ద్వేషంతో వ్రాసిందికాదు. "అమ్మా! మాదాకవళం" అనేపల్లవి భాగం మాత్రమే దానిలో అంటే వొకగేయంలో నాకు శోచ్యంగా తోచింది. "గాలిదుమారము లెగరడం" వగయిరాలు నామనస్సుకు ఇబ్బందిని కలిగించలేదు. ఇది వర్ణ్యమేనా! అని నాలో నేను ప్రశ్నించుకున్నాను. ఏదేనా పతాకా ప్రాయమైన ప్రధానకథాంశం వుంటే, దానికి ప్రకరీప్రాయంగా యిది వుండడం నాకూ సమ్మతమే అని బుద్ధునికి విరక్తి కల్గించిన విషయం వుగ్గడించే వున్నాను. అశ్లీలాలలో వొకటిగా వున్న దండి ప్రహసనశ్లోక భాగాన్ని వుదాహరించి, అది హాస్యోక్తిగా సమర్థిత మవుతుందనికూడా సూచించేవున్నాను. ప్రస్తుతం "అమ్మా మాదాకవళం" అంగి (ప్రధానం) గాని, దేనికీ అంగం గాదు. దీనివల్ల లోకం పొందవలసిన ఆనందంగాని మఱివకటిగాని (అంటే నీతిగాని - రామాదివద్వర్తితవ్యం చూ.) యేమి వుంటుందీ అని కొంతసేపు చర్చించుకున్నాను. ఆఁకలిపీడకు తాళఁజాలక దైవోపహతులు చీఁకట్లోనూ, వానలోనూ అడుక్కుంటారన్నంతవఱకే బోధ పడింది గాని, అంతకంటే అధికంగా బోధపడిందికాదు. దాని క్కారణం అప్పుడు బోధ పడలేదు గాని, దానిమీఁద గేయకర్తగారు వ్రాసిన యీ క్రింది వాక్యంవల్ల యిప్పుడు బోధపడింది. ఆ వాక్యాన్ని వుదాహరిస్తాను.

"శ్రీ శాస్త్రిగారికి రసతత్త్వం అచుంబిత విషయమేమో అనిపిస్తూంది."

నేను పైమాటకు అంగీకరిస్తున్నాను. నాకు 72 యేండ్లవయస్సు గడిచినా తేలికగా ఆబాలగోపాలానికీ తెలిసే "అమ్మా! మాదాకవళం" అనే గేయంలో వుండే రసతత్త్వం తెలియనప్పుడు, తెలిసినవారి శుశ్రూష చేస్తేమాత్రం యీ వయస్సులో ప్రయోజనం వుంటుందా? కనక, ఆప్రయత్నంకూడా చేయను. "మాదాకవళం" కవిత్వం సహృదయసమ్మత మైనట్టున్నూ, నేను హేయంగా చూపిన "కొందఱు సోదరీమణులు" అట్టిది కానట్టున్నూ గేయకర్తగారు అభిప్రాయపడ్డారు. ఇదికూడా సహృదయ సమ్మతమే అన్ని వ్రాయుటకు సాహసించనందుకు నేను ఆయన్ని అభినందిస్తూన్నాను. "మాదాకవళం" గేయంవల్ల యేదేనా విశేషార్థం పాఠకలోకానికి బోధపడేది వుంటే, "కొందఱు సోదరీమణుల"

పద్యంవల్లనూ వుంటుందని నే ననుకుంటాను. సహృదయైకశరణ్యంగా వుండే యీ విషయాలకు గ్రంథకర్తలు వివదించడంవల్ల ప్రయోజనం లేదు. లోకానికి వదిలివేయాలి. వ్యక్తిగతద్వేషాలుగాని, అభిమానాలుగాని, యీలాటి విషయాలలో అకించత్కరాలు. మొగమాటాలుకూడా డిటో. "మాదాకవళం" అనే గేయం యెవరిదో వారిపేరు వ్రాయకపోవడాని క్కారణం ఇది మా చిరంజీవి రచించినా, నేను ఏవగించుకొనే వాణ్ణే అని తెల్పడానికేకాని మఱోటికాదు. "యెంకిపాటలు" నేను ఆమోదించలేదని 20 యేళ్లక్రితం కృష్ణలో పడిన వాదోపవాదాలు తెలిపివుండడంవల్ల యిప్పుడు మళ్లా తెల్పవలసి వుండదు. గేయకర్త తగినంత ఉపపత్తి చూపకుండా వ్రాసిన మాటలు ఉపేక్ష్యాలే అయినా "రసతత్త్వం నాకు తెలియదు" అనే ఆయన వుద్దేశాన్ని అభినందించడానికి తప్ప యీ కాస్త వ్రాఁతాకూడా అనవసరమే. యీలాటి హేయవిషయాలు అంగంగా వుంటేతప్ప, అంగిగా వుండడం హృదయ రంజకంగా వుండదని నావ్యాసంలో నొక్కినొక్కి వ్రాశాను. ఆయీ శోచ్యగేయం నూతన గృహప్రవేశానికి కూడిన సభలో చదవడం నాకు మఱీ శోచ్యంగా కనపడింది. యెవరికి అట్లు తోఁచలేదో ఆసభాస్తారులు తెల్పితే శిరసావహిస్తాను. పెండ్లిసభకు వచ్చిన మేళం, లేదా, సొన్నాయి "తరలీ పోతాము చాలా దయలుంచండి, యిఁక మరలీ జన్మాలకు రాము మదిలో నెంచండి" అనే కీర్తన అభినయించడంగాని, పాడడంగాని అభినందనీయం కాదని తెల్ప నక్కఱలేదు. ఆయీ విషయంనాకేకాదు, మఱికొందఱికికూడా తట్టిందని గేయకర్తకుకూడా గోచరించినట్లు ఆయన వాక్యమే తెల్పుతూ వుంది. దాన్ని వుదాహరిస్తాను.

"శ్రీ శాస్త్రిగారికిన్నీ మఱికొందఱికిన్నీ రసస్ఫూర్తి కలగకపోవడం సత్యమే కావచ్చును."

బస్, చాలును. యిఁక వాదం యెందుకు? యీ వొక్క మాటతోడనే యావత్తూ గతార్థ మవుతూవున్నప్పుడు దీన్ని గూర్చి వివాదపడవలసి వుండదనుకుంటాను. కొందఱు "మాదాకవళం" మాదిరిగేయాలుగాని, పద్యాలుగాని ఆమోదించేవా రున్నట్లు నేనూ నా వ్యాసంలో విస్పష్టంగా సూచించే వున్నానైతిని. యింకెందుకు వాదోపవాదాలు? అయితే "వెం. శా. గారికి కవిత్వరసం అనుభవించడం బాగా తెలియదనే అంశం లోకానికి తెల్పడానికి" అంటారా? అయితే సంతోషమే. పాశ్చాత్యులవెన్నకు అలవాటుపడితే, దీనికీ వెం. శా. అలవాటుపడుతాఁడు. యింతతో ఆఁపుచేదాం. యీ విషయం యింతతో ఆఁపి, పనిలో పనిగా వేఱొక విషయాన్ని గూర్చి కొంచెం వ్రాస్తాను. ప్రస్తుతం "మాదాకవళం" గేయాన్ని రచించిన యువకవిగారు, "ఆయీ మాదిరి కవిత్వానికి మార్గదర్శకుడు వెం. శా. శతావధానిగారే" అనికూడా కొంత సూచనచేశారు. ఈయన మాత్రమే కాదు,

మఱికొందఱు యువకవులుకూడా యీలాటిగేయాలకు కాకపోయినా యేదో కొత్తపుంతలో రచించే రచనలకు నన్ను లేదా, మమ్ము మార్గదర్శకులనుగా వ్రాయడం వుంది. కాని, ఆయీ ఆపాదనకు వారువారు యేవిధమైన లక్ష్యములున్నూ చూపినట్టు లేదు. ఉపనిషత్తులలో వుండే రహస్యం బయటికి తీసి ప్రకటించిన మతకర్తలు లేశమూ కూడా కొత్తవిషయం బోధించనప్పటికీ, వారివారి పేళ్లతో ఆ మతాలు పేర్కొంటూవుంటారు. అప్పకవి కొన్నియతులు కొత్తవి కనిపెట్టినట్టు వ్రాసుకున్నాఁడు, మేముకూడా పూర్వకవులు వెళ్లిన మార్గాలుకొన్ని వుంటే, వాట్లనుబట్టి కొన్ని యమకాది చేదస్తాలు వదలుకుందామని అనుకొని, రచన సాగించుకుంటూ వచ్చాము. అంతేకాదు, "క్షమాపణ" లోనైన నిక్షేపంవంటి శబ్దాలు వ్యవహార భాషలో వాడుకుంటూ వున్నారన్నంతమాత్రంచేత అవి "నింద్య గ్రామ్యాలు" అని కొందఱు అపవదిస్తే. "కావు మహారాజా! వాట్ల సాధుత్వం ఇట్టిది" అని వాచస్పత్యాదికం వెదికి చూపుతూ వచ్చాం. ఆలా చూపినతర్వాత కూడా యింకా "క్షమార్పణ" అని వాడుకునేవారు లేకపోలేదు. శాస్త్రం వుంది. ఋషులవే కాక, పండితరాయాదుల ప్రయోగాలున్నాయి. వాచస్పత్యం వుంది. యిన్నివున్నా, వ్యావహారికంలో వాడడం వల్లనే అది గ్రామ్యమవుతుందా? క్షమార్పణగా సవరించి వాడడమనేది గోదావరికి "గోధావరి" అని వాడడంవంటిదేనా? తత్తథాస్తామ్.

(1) లవ లేశములు, (2) యజ్ఞ యాగములు. ఇవన్నీ శిష్టులైన మహావిద్వాంసులు వాడతారు. మిక్కిలీ స్వల్పము అనే అర్థం వివక్షితమైనప్పుడు వొక్క "లవ" పదం చాలదని, లేశపదం చేరుస్తారు. లవంలో కూడా లవమని దాని తాత్పర్యం. ఆ శిష్టులేనా యిది స్వంతంగా వాడిందికాదు. "కుర్వంతి కామసుఖలేశలవాయ" అని శ్రీమద్భాగవతం. "లేశస్యాఽపి అణ్వంశాయ" అని వ్యాఖ్యానం. ఇవేవీ చూడక, ఆక్షేపిస్తారు. యేమనుకొనేది? ఇఁక "యజ్ఞయాగాలు" అనేది - యజ్ఞపదానికి, బ్రహ్మయజ్ఞం (నియతంగా ప్రతిరోజూ వైదికులు కొన్ని పనసలు యేకరువుపెట్టడం) అర్థం, అనిన్నీ - యాగపదానికో? "అగ్నీషోమీయం పశుమాలభేత" "గామాలభేత" వగయిరా శ్రుతి చోదితమైన పెద్దపెద్ద యాగాలు అర్థమనిన్నీ సమన్వయించుకుంటే సరిపోతుంది. దీని కితరులప్రయోగాలు వెదకనక్కఱలేదు. దీన్ని ఆక్షేపించినవారే వొకచోట ప్రయోగించి వున్నారని వొకవిజ్ఞుఁడు నాపేర వ్రాస్తూ "ఇదేమిటండీ? 'ఈ యజ్ఞయాగాలు' ఆయన ప్రయోగించుకొన్నప్పుడు శుద్ధమై, మీరు ప్రయోగిస్తే శుద్ధం కాకపోయిం"దంటూ ప్రశ్నించడం జరిగింది. దానికి నేనేమీ జవాబు చెప్పలేకపోయాను. ఆక్షేపకులు నాలాగు వూరుకోరనిన్నీ, యేదోసమాధానం చెపుతారనిన్నీ నే ననుకుంటాను. శిష్టమహావిద్వాంసులు అనఁగా వేదశ్రౌతాలు వచ్చినవారు

వాడేమాటలూ వూరికేపోవు. వారి ఆక్షేపణలూ వూరికే పోవని నేను తలుస్తాను. ఫలితార్థం "యజ్ఞయాగాలు" నిర్దుష్టమని తేలింది. యింకా "ఋతం వద, సత్యం వద" వగయిరాలు యీలాటి వున్నాయి. యివన్నీ వేద వ్యాఖ్యానా లెఱిఁగినవారు వ్యాఖ్యానించతగ్గవి. అర్హత చూచుకోకుండా, నేను దీన్ని గూర్చి వ్రాస్తే పండితలోకం విచారిస్తుంది. "ఋత సత్యాలు, కవిపండితులు, దుఃఖశోకాలు" వగయిరాలలో యత్కించిద్భేదం వుందని మహాకవుల ప్రయోగాలు చెపుతూన్నాయి. యివి పునరుక్తాభాసాలుగాని, పునరుక్తాలుకావు. వ్యాఖ్యాత లీవిషయం వ్యాఖ్యానిస్తూ వచ్చారు. ఆ యీపదా లేవీ పునరుక్తులు కావనేది వక్తవ్యాంశం. ప్రస్తుతం "యజ్ఞయాగాలు" అన్నచోట యిదివఱలో చూపినదే సహృదయసమ్మతమైన సమాధానం. దాన్ని వొప్పుకొనేది లేదనే వైతండికులకు యింకోటి వుంది గొడ్డలిపెట్టు సమాధానం. ఇది ఆక్షేపకుల ప్రయోగాన్ని కూడా సాధిస్తుంది. యజ్ఞపదానికి యజ్ఞాలు (పశువిశసనం వగయిరాలతో సంబంధించినవి) చెప్పుకోండి, దానికి పర్యాయపదంగా కనపడుతూవున్న, యాగపదానికి దానము అని అర్థం చెపితే మీరు చేసేదేమిటి? దానమనే అర్థం యేలా వస్తుంది? అని ప్రశ్నిస్తారు. సరే "యజదేవపూజా సంగతి కరణ దానేషు" అనే ధాతుపాఠం చిత్తగించండి, అంటే సరిపోతుందా? ఉఁ, హుఁ, సరిపోదు. సరిపోదేమి? (సర్వం ధాతుమహ) ప్రయోగం కావాలంటారా? అన్నిటికీ ప్రయోగాలుంటాయా.

"ఱిసి, ధాత్వర్థ మనుగ్రహింపఁ గదవే" అన్నాఁడు శ్రీనాథుఁడు. దీనికి ప్రయోగాంతరం నన్నయాదులది వుందా? ఆమధ్య నేను "బుక్కించు" అని వొకచోట ప్రయోగించాను. ఇది యేదో భాషాంతరంగా భావించి, పూర్వపక్షం వచ్చింది-కాదు సంస్కృతం. బుక్క భషణే, భషణం శ్వరవః (కుక్కకూఁత) అని తెల్పడం జరిగింది. ఓహో ప్రమాదపడి ప్రశ్నించాంగదా అని, పశ్చాత్తపించి కర్ణాటకలహంగా "ప్రయోగం చూపవలసింది" అని మళ్లా ప్రశ్న వచ్చింది. దీనికి ప్రయోగం యెందుకు? ఈ కుక్కకూఁత యేకవికి అవసర మవుతుం దని అడిగేవారి తాత్పర్యం. వారికి "శ్లో. నసశబ్దో... జాయతే యన్న కావ్యాంగ మహోభారో గురుః కవేః" యీశ్లోకం వుందనికూడా తెలుసునో? లేదో, యిక్కడ అవాంతరంగా వొకమాట వ్రాసి మఱీ ప్రస్తుతం వ్రాస్తాను. "మాదాకవళం" గేయకర్తగారు, పైశ్లోకంలోని "కావ్యాంగం" అనే పదార్థాన్ని బాగా గమనించాలి. ప్రస్తుతం అందుకుంటాను - పండితరాయలు "బుక్క నైర్ధిక్కరోతి" అని ప్రయోగించాఁడు. సమయానికి స్ఫురణకు తగిలిందే అనుకోండి. తగలకపోతేనో? ఆ "బుక్కించు" తప్పనుకోవలసిందేనా? మే మల్లా యీలాటి శబ్దాలవిషయంలో కొంత సాహసం చూపుతూవచ్చాం. కాదు కాదు, సాహసం చూపినట్లు కొందఱు అనుకుంటారు. యిది నిఘంటులో వుందాఅని అడిగితే, చెప్పే

జవాబేమిటి? ధాతుపాఠంలో వుందంటే తృప్తిపడకపోతే, నిఘంటు తృప్తిపరుస్తుందా? వుందే అనుకుందాం, అప్పుడు "అప్రయుక్త"మని వాదించవచ్చునుగా! మేమల్లా యీలాటి నిస్సారపువాదాలను లెక్కపెట్టకుండా శిష్టవ్యవహృతాలు కొన్నిటినీ, ధాతుపాఠాది వ్యవహృతాలు కొన్నిటినీ వాడుకుంటూ వచ్చాం. తెలుఁగులో "దులుపరించు" అనే ధాతువు శ-ర-నిఘంటులో లేదు దులుపుమాత్రమే వుంది. నేను యీ సంగతి యెఱిఁగే 'దులుపరించు' అని వాడినాను. నీకాధార మేమిటంటే, వినండి, శ-ర-లో (1) చిలుకు - చిలుకరించు (2) పలుకు - పలుకరించు, యివి వుదాహరింపఁబడ్డాయి. ఉభయరూపాలకు అర్థంలో వైలక్షణ్యం మిక్కిలీ స్వల్పం. నేను 'దులుపు' అనేది మాత్రమే శ-ర-లో వుండినా - 'దులుపరించు' లేకపోయినా వ్యవహారంలో వున్న హేతువుచేతనున్నూ గ్రామ్యమనడానికి అవకాశం లేకపోవడం చేతనున్నూ బుద్ధిపూర్వకంగానే వాడి వున్నాను. శ-ర-లో లేదన్నంత మాత్రంచేత వాడుకో కూడదనే పక్షంలో 'కళంకు' వగైరాలెన్నో గ్రంథస్థాలే దానిలో లేవు. ఇటీవలివారు కొత్తకోశాలలో చేరిస్తే, చేర్చి వున్నారేమో? చేర్చలేదే అనుకుందాం. అది వారిలోపం కావలసి వస్తుందిగాని, నిర్దుష్టమైన వ్యావహారికపదజాలం కాకపోతుందా? "పంచాంగంలో లేకపోతే, నక్షత్రాలు లేకపోతాయా?" దిఙ్మాత్రం శబ్దజాలవిషయంలో మేము పెట్టుకొన్న మార్గం ఉదాహరించాను. కల్పనా విషయంలోనూ యితర విషయంలోనూ మే మేమి క్రొత్తపోకడలకు మార్గదర్శకులమైనామో నాకు స్ఫురించడంలేదు.

'యతించు' అనే సంవృతిరూపాన్ని వాడితే, అదికూడా తప్పనుకొనే విమర్శకులు కనపడ్డారు. 'యత్నించు' అనేదే సాధువనిన్నీ, అది అనఁగా? 'యతించు' అనేది సాధువు కాదనిన్నీ ఆక్షేపకుల తాత్పర్యం. ఉపకృతిరూపమైన - 'యత్నించు' అనేది, సంవృతిరూపమైన 'యతించు' అనే దానికి బాధక మవుతుందని వ్యుత్పన్నులు యెవరూ అనుకోరు. యతీ ప్రయత్నే అనే ధాతువునుండే యీ రెండురూపాలు నిష్పన్న మవుతాయి. భవతు. ఆ యీ విషయం విశేషించి కాకపోయినా, యేకొంచెమో శాస్త్ర చర్చతో చేరింది. కనక యేదో విధంగా సమాధానం చెప్పడానికి యత్నిస్తే, యత్నించవచ్చు ననుకుందాం. ప్రస్తుతమైన "అమ్మా! మాదాకవళం" గేయంలో వుండే రసం నీకు తెలియదు అంటే, చెప్పే జవాబేమిటి? ఇది "సహృదయాః ప్రమాణమ్" అనే తరగతిలోదికదా! అందుచేత నాకు దానిరసం తెలిసిందికాదు, అని కిక్కురు మనకుండా వొప్పుకోవడమే యుక్తమని నాకు తోఁచింది. ఈగేయ కర్త నా విషయంలో యింతతోటే, అంటే! 'నీకు రసజ్ఞత్వంలేదు' అనడం మాత్రంతోటే సరిపెట్టినందుకు అభినందిస్తూన్నాను. కొందఱు చెడామడా తిట్టినవారున్నూ

వున్నారు. యెందు కంటారు. "ఏనిని" అన్నరూపం తిక్కన్నగారు కర్ణ, శల్య, సౌప్తిక, పర్వాలలో మూడుచోట్ల ప్రాసస్థానంలో ప్రయోగించి వున్నారు, కనక అది సాధువు అని తెల్పినందుకు. ఇంతమాత్రానికేనా? తిట్టడం, ఇంకా యేదేనా దోషం వుందేమో? అంటే వినండి. లోగడచూపిన (1) లవలేశములు (2) యజ్ఞ యాగములు వగయిరా సుప్రయోగాలు వాడినందుకుకూడాను. ఆ తిట్లు చూపుతాను. (1) చవట, (2) దుర్జాతి, (3) కయిగాడు, (4) పెద్దమ్మవారు, ఇత్యాదులు - ఇవన్నీ నాకు ఈ 72వ వత్సరంలో పరిషత్తువా రిచ్చిన బిరుదు లనుకున్నా అనుకోవచ్చును. వీట్ల విషయమై యేర్పడ్డ పరిషత్తు, యేదో, ఆపరిషత్తులో వుండే సభ్యులెవ్వరో తెలుసుకోవాలనే కోరికగలవారు "అరణ్యరోదనం" అనే గ్రంథంచూడవలసి వుంటుంది. మొట్టమొదటి మెంబరు 'ముళ్లకంచె'. కొంత వరకు అచేతన మెంబర్లతో కథసాగించి, తరవాత పంది, నక్క మొదలైన సచేతన మెంబర్లతో కథనడిచింది. చెడామడాతిట్టడం తప్ప యింక యేవిధమైన ఔచిత్యమూ నామట్టుకు కనపడలేదు, కాని - "రసజ్ఞత్వం" లేని కారణం చేతనే దాని తత్త్వస్ఫూర్తి నాకు కాలేదేమో అని యిప్పుడు తోస్తూవుంది. కర్మంచాలకదేన్ని గురించేనా - తప్పనో? ఒప్పనో? తెలిసినంతలో మనస్సు విప్పి చెప్పడంగాని, వ్రాయడంగాని తటస్థిస్తే, అది తనకు అనుకూలంగా కనపడితే చిక్కులేదు. ఆలాక్కాక, వ్యతిరేకంగా వుంటే వషట్కారాలు తప్పవు - ఇదంతా అనుభవానికి వచ్చియ్యేవే. "ఈనాఁడు, సత్కవియై పుట్టుటకూడ దోసమని వక్కాణింతు," అని వ్రాసుకున్నాను. ఎవరికో ఆగ్రహం వస్తుందని మనస్సుకు నచ్చని - "అమ్మా! మాదాకవళం" కవిత్వం నచ్చిందని యేలా వ్రాసేది? భారత సుప్రయోగాలు - "ఏనిని" వగయిరాలు అపప్రయోగాలంటే, యేలా వొప్పుకొనేది? కొందఱు తిట్టుదురుగాక, కొందఱు- "రసతత్త్వం నీకు తెలియదు" అని ధిక్కరింతురుగాక. అంగీకరించడమే యీవయస్సుకు తగ్గది. "అహమేవ, అహంచ, అహంన" అనే అవస్థాత్రయములో యీవయస్సు "అహం న పండితః" అనేదానికే తగినదికదా! 'వృద్ధులబుద్ధులు సంచలింపవే' అన్నారుకనక, యీ- "అమ్మా! మాదాకవళం" గేయంలో వున్న రసంనాకు గోచరించక పోవచ్చును. అందుచేత ఆవిధంగా వ్రాసియుందును. కొందఱు రసజ్ఞులు నచ్చినవారుంటే, వారి వారి చేవ్రాళ్లతో అభిప్రాయాలు సంపాదించి, పత్రికాముఖాన్ని ప్రకటిస్తే - "పరప్రత్యయనేయబుద్ధులు" యథార్థాన్ని తెలుసుకుంటారు, "నలుగురితో నారాయణా, కులంతో గోవిందా" అన్నారు కనక, అప్పుడు నేనున్నూ వారితో యేకీభవిస్తాను అందాకామాత్రం - 'ఉ. కొందఱు సోదరీమణులు' అనేపద్యం ఆరసంలో యెంత ఆస్వాద్యమో యింకో రసంలో - "మాదాకవళం" గేయమున్నూ అంతే ఆస్వాద్యం. గేయమని పేరేగాని నాఁడు గేయకర్తగారు సభలో చదివినప్పుడు దీనికి లయకూడా పడినట్టు లేదు.

"శిరచ్ఛేదసమయంలో కుండలాలనుగూర్చి విచారించినట్టు" అసలే పనికి రాదనే గేయవిషయంలో తాళాన్ని గూర్చిన్నీ, రాగాన్ని గూర్చిన్నీ, విచారించడం బొత్తిగా అనుచితం. ఇదిన్నీకాక, పుట్టి బుద్ధెఱిఁగింది మొదలు పరిశ్రమ చేసిన కవిత్వంలోనే "నీకేమీ తెలియదు" అనడానికి సంశయింపని గేయకర్త కచుంబితమైన గానవిషయంలో "తోసిరా జనడానికి" సంశయమంటూ వుంటుందా? అందుచేత ఆ విషయంలో కలం నడిపేది లేదు.

"శ్లో. స్వాధీనో రసనాంచలః పరిచితా శ్శబ్దాఃకియంతః క్వచిత్
క్షోణీంద్రో న నియామకః పరిషదశ్శాంతా స్స్వతంత్రం జగత్
తద్వ్యాయం కవయో వయం వయమితి ప్రస్తావ నాహుంకృతి
స్వచ్ఛందం ప్రతిసద్మ గర్జత వయం మౌనవ్రతాఽఽ లంబినః"

సహృదయాః ప్రమాణమ్.

★ ★ ★

# కర్ణాటకలహం

యీమాట మృచ్ఛకటికలో చూచాను. యిప్పుడు అనుభూతమయింది. "అమ్మా! మాదాకవళం" నాకు కవిత్వంలో చేరుతుందని తోఁచలేదు. అది కవిత్వంలో చేరే పక్షంలో ఆ బాపతువాళ్లంతా కవులలోనేవచ్చి కూర్చోవచ్చు, "ఛందోవ్యాకరణాదివిత్" అనేదానికి సంబంధించిన యోగ్యతతో పనిలేనట్టు ఆ గేయ పల్లవి తెల్పుతూవుంది. అయితే, ఆగేయ పల్లవిని వుచ్చరించిన వ్యక్తి మహావిద్వాంసుఁడు కావడంచేత "ప్రసిద్ధేఽపి ప్రబంధానాం" వగయిరా ధ్వన్యాలోకశ్లోకాలు వుదాహరించి "అమ్మా! మాదాకవళ" ప్రబంధాన్ని సమర్థించడం జరుగుతూ వుంది. తక్కిన దీనులకు ఆయీపాండిత్యం లేకపోవడంచేత సమర్థనం వుండదు. అంతమాత్రంచేత వాళ్లనోటమ్మట వచ్చింది 'మహాప్రబంధం' కాకపోతుందా? మూలంలో 'ప్రబంధానామ్' అని మాత్రమే వుంది గాని, వ్యాఖ్యానంలో – 'ప్రబంధాదిషు మహాకావ్యాదిషు' అని ఉన్నది. అందుచేత ఆభిక్షులు వుచ్చరించిందిన్నీ – మహాకావ్యమే కావలసివస్తుందనుకోవాలి. మనది రసవంతమై అది నీరసమనడానికిన్నీ, అభియుక్తులొప్పరు. "శ్లో. శిక్షుణా కక్షనిక్షిప్తః కిమిక్షుర్నీరసో భవేత్." చెప్పొచ్చే దేమిటంటే వీళ్లందఱూ కవులేకావడం "అస్మద్గోత్రం వర్ధతాం"గా పరిణమించి మనబలం అభివృద్ధికావడం అభినందనీయమే అయినా, ఆనంద వర్ధనాచార్యులవారి వుద్దేశం అట్టిదేకాదని స్పష్టంగా 'ప్రబంధపదం' చెపుతూ వుంది. ప్రబంధలక్షణం ఆ ఘట్టంలో ఆయన వ్రాయకపోయినా (అనుక్తమన్యతః) "మహాపురుషచారిత్ర ముదాహరణ మర్హతి" అనే అంశం ఆయన 'తోసిరా' జనేవారుకారు. ఈ "మాదాకవళం"లో యే మహాపురుష చరిత్రం వుదాహరించఁబడిందని దీన్ని 'ప్రబంధం'గా అంగీకరించేది? కనక దీనిసమర్థనానికి ఆశ్లోకం వుదాహరించడం దుర్వినియోగం చేయడం అనినొక్కి వక్కాణించవలసి వచ్చింది. గేయకర్త చెప్పవలసిన జవాబు యేలా వుంటే వుపయోగిస్తుందంటే? "మేము నాయకుని ధీరోదాత్తత్వాదులు వగయిరాలుగాని మఱికొన్ని సుగుణాలుగాని చూచేది లేదు. ఇంతేకాదు, మాకు వ్యాకరణాదులతో అవసరం లేదు, యేదేనా వొకవిషయాన్ని బోధించేదల్లా కవిత్వమే అని మా అభిప్రాయం" అంటే టక్కున సరిపోయేది. ఆలా సమాధానం చెపితే, నన్నయ్యగారు

---

* కర్ణాటకలహం అంటే యేదో కవ్వించి వివదించడం.

భారతంలో వొక సందర్భంలో "వీని బాస వేఱు" అన్నాఁడు కనక యిదిన్నీ ఆలాటిదే అని సంతోషించవలసి వుండేది. యేదో గ్రామ్యవాక్యానికి - ఆనందవర్ధనాచార్యులను రంగంలోకి దింపితే, పూర్వుల ప్రబంధలక్షణాలన్నీ "తాడుతో దబ్బనం"గా వెంటఁబడతాయని గేయకర్తగారికి తట్టలే దనుకోవాలో? లేక, వెం. శా. కి అలంకారవిషయం అచుంబితమంటే దానితో సర్వమూ సమాహిత మవుతుందని వూహించివుంటారనే అనుకోవాలో; తెలియదు. ఆనందవర్ధనాచార్యులవారి హృదయం గురుముఖతః చక్కఁగా అధ్యయనంచేసి వుండిన్నీ, "అమ్మాఁ మాదాకవళం" కవిత్వమని వివదించడం అత్యాశ్చర్యం - దోషజుష్టమైన శబ్దంగాని వాక్యంగాని ఆనందులు వింటారా? చూస్తారా?

"ప్రథమకబళే మక్షికాపాతః" కదా! వారిదృష్టిలో దీనిగతి; యెందుకీ కర్ణాటకలహం, దీని కంతకూ ఫలితం నేను అలంకారశాస్త్రం చదివినవాణ్ణి అని లోకానికి తెల్పడమే అనుకోవాలి. అంతమాత్రంతో "సారస్వత వైభవం" ఆకళింపు కాదు. "శ్లో. యత్సారస్వత వైభవం" చూడఁదగు. వొక మహావిద్వాంసుఁడు వొకానొక రాజసభలో "కాంతాసమ్మితయా యయా" అన్నదానికి తాత్పర్యం వ్యాఖ్యానిస్తూ పలికినమాటలు సమయానికి జ్ఞప్తికివచ్చాయి. వుదాహరిస్తాను, "భార్య తన కేదేనా వస్తువు (నగ) కావలసివస్తే, విలాసాలు కనపఱుస్తుంది" అని వ్యాఖ్యానించేటప్పటికి ఆమాటలు విని మఱోపండితుఁడన్నాఁడు రాజుగారితో "అయ్యా! రాజా! మీవంటి మహారాజులకు తెల్లవార్లూ విలాసాలు చూపిస్తే పగలంతా మీరు సమర్థులు కనక ఆభరణాలు చేయిస్తా రనుకుందాం, యిఁక మాబోఁటివాళ్లగతి యేమిటి?" అనిప్రశ్నించేటప్పటికి రాజుగారూ నిర్ఘాంతపోయారు. పండితుఁడూ నిర్ఘాంతపోయాఁడు. (పాతప్రతిష్ఠాజుట్టులకు యెవ్వరికోగాని అనుభూతి వుండదు) చెప్పొచ్చేదేమిటంటే? అలంకారశాస్త్రం చదివినంతలో ప్రయోజనం లేదనియ్యేవే. ఆచదువు నూటికి నలభైయో యేభైయో మార్కులు తెచ్చుకోవడానికే వుపకరిస్తుందనడానికి వేఱే సాక్ష్యంతో పనిలేదు. యీ "అమ్మా! మాదాకవళం" కూడా వొక కవిత్వమే అనివాదిస్తూ దానిసమర్థనానికి పూర్వోక్తరీత్యా బొత్తిగా వుపకరించని "ప్రసిద్ధేషు ప్రబంధానాం" అన్నదాన్ని వుదాహరించడమే. ఆనంద వర్ధనాచార్యుల కాలంలోనే యీప్రసంగం వస్తే యేమయేదో? అది నా భావనకు గోచరించినా వ్రాసేది లేదు. పూర్వులకట్టుబాట్లతో రచనచేసే శక్తి మాకు భగవంతుఁడు యివ్వలేదు గనక, మేము దానితోవ వదులుకొని యీమార్గాన్ని అవలంబించామంటే వొక్కమాటతో తేలిపోయేదానికి యీ "మాదాకవళ" సమర్థనానికి (కొత్తకుండా, పాతతెడ్డూ) పూనడమేకాక, ఆ మహామహుని శాసనం కళంకితం చేయడమనేది పెద్ద అపచారం. పైకి అనకపోయినా యీ రచనలు రచించేవారి

హృదయంలో నన్నయాదుల రచనలయందు ఆదరం లేదు. లోకాన్ని అవి రంజింపనేర వనిన్నీ యివి రంజింపఁజేస్తాయనిన్నీ వీరి విశ్వాసం. అది నేను కాదనేది లేదు. యెవరో కొందఱు ఆదరించడాన్ని బట్టే యేకొందఱో దీనిలోకి దిగి వుంటారు. దేన్నీ అందఱూ ఆదరించరు. దేన్నీ ఆదరించకపోరు. పండితరాయ లేమన్నాఁడు "యన్నింబానాం పరిణతఫల స్ఫీతి రాస్వాదనీయా యచ్చైతేషాం కబళన కళా కోవిదః కాకలోకః" అనలేదా? రచించండి కాని, పూర్వలాక్షణికుల శ్లోకాలుదాహరించి సమర్థించడానికి పూనుకోవద్దనియ్యేవే నాఅభ్యర్థనం. వ్రాస్తే చాలా వ్రాయాలి. యీ కర్ణాటకలహం నాకిష్టం లేకే మొట్టమొదటనే ప్రతిపక్షవాక్యానికి అంగీకారం తెల్పివున్నాను. తెల్పినా కొన్ని సాహసవాక్యాలతో మళ్లా పరాక్రమించడం శోచ్యం. పైఁగా "నీ శ్రవణానందం రసాభాసం" అంటూ యెఱిఁగీయెఱుగనిమాట వొకటి వెలువడింది. (అది అటిట్ట దైతేమాత్రం యీ మాదాకవళం కవిత్వమవుతుందా?) యెందుచేత? ఆమాట యెఱిఁగీ యెఱుగని దయిం దన్నప్పుడు వ్రాయఁదగ్గది వ్రాస్తాను. యిప్పుడెందుకు వృథా కంఠశోష? లోఁగడ యెక్కడో యీ విషయం వ్యాఖ్యానించఁబడే వుంటుందిగాని, గేయకర్తగారు అది చూచి వుండరు. లోకంలో "త్వం అంటే త్వం" అనడం సహజం. అయితే యీ మాట యీ వివాదానికి పూర్వం అంటే బాగుండేది. యిప్పుడో? "అమ్మా! మాదాకవళం" నాకు నచ్చలే దనడంచేత అన్నట్టర్థ మవుతూవుంది. దాన్ని యీ యెఱిఁగీ యెఱుగనిమాటకోసం నేను సమర్థించేది లేదు. ("కులస్త్రీ గణికా౽థవా" చూస్తే లాక్షణిక శాసనం వున్నట్టు గోచరిస్తుంది.) నేను ఆయనపే రెత్తకుండా రచననుగూర్చే నాకు తోఁచిన మాటలు భావికవుల (నన్ను వరవడిగాఁ బెట్టుకొనేవారి) నిమిత్తం వ్రాయవలసి వ్రాశానేకాని, వ్యక్తిద్వేషాదులతో కాదు. అయినా ఆయనికి నామీఁద ఆగ్రహం కలిగింది. నిన్న మొన్న వొక పుస్తకం యెవరిదో అభిప్రాయార్థం వచ్చింది. యీ "మాదాకవళ" కవిత్వానికి యేలాటిదేనా అర్థం వుందిగాని దానికి "అర్థ మనర్థం భావయ" అన్నట్టే వుంది. మాదిరి చూపుతాను.

కరకర బిరబిర చిరచిర
కరకర బిరబిర చిరచిర

యీఅక్షరాలే కావు. మాదిరి అంతా యింతే. (యింతమట్టుకు యిది వొకఖండకావ్యం) దీనిలో బ్రహ్మాండం మునిఁగిపోయినంత విశేషార్థం వుందని యెవరో వుపాధ్యాయులు పీఠికలో వ్రాశారు. దాన్నిబట్టి బరిశీలించి చదివి చదివి విసుగెత్తింది. నాకేమీ గోచరించిందే కాదు. ఆయీ కవిత్వాలన్నిటినీ సమర్థించడానికి ఆనందవర్ధనా చార్యులవారి లాక్షణికోక్తులుపకరిస్తాయా?

"కుర్వీత బుధసోమయోః" భవతు. ఆయీ మాదిరి కవిత్వాలు కొందఱు వ్రాస్తున్నారు కనక లక్ష్యములు సిద్ధమైనాయి. వీట్లకు తగిన లక్షణగ్రంథాలు యింక పుట్టవలసి వుంది. కొద్ది రోజుల్లో ఆతరవాయి తీరుతుంది. అప్పుడు వాట్లద్వారా వీట్లని సమర్థించడం యుక్తం, అంతేకాని యిప్పటి "మాదాకవళ" కవిత్వానికి ఆ మహాకావ్యాల నిమిత్తం పుట్టిన ఆలక్షణా లేం పనిచేస్తాయి? (కాల్లో ముల్లుగుచ్చుకుంటే గునప మేంపనిచేస్తుంది?) వాట్లదృష్ట్యా యీరచనలన్నీ "పూర్వత్రాఽ సిద్ధాలు" కదా! వీట్లవంక అవి చూడనే చూడవు. చూస్తేనో? ముందుగానే అపశబ్దాలు కనపడి యేవగించుకుంటాయని వ్రాయనక్కఱలేదు. యిది (ప్రస్తుత గేయం) కవిత్వంలో జమకట్టఁబడేయెడల--

1. ఓ యేవయ్యో? కాపు
మాయింటి కే వ్రావు
మీయింటి కే వ్రానే నా
సేతు లేం నేదు (లస్య నః)

2. అచ్చావు నెయ్యంటివే?... ... స్తివే. వగయిరాలన్నీ కవిత్వాలే కావలసి వస్తుంది. యిక్కడ వొకమాట వ్రాస్తాను. యీ వుదాహరించిన లొల్లాయి పదాలలో కొంచెం రసమయితే వుందిగాని, అది కొంత దోషజుష్టమే కనక పండితు లాదరించేదికాదు. యీమాదిరి లొల్లాయిపదాల రచనకు ప్రకృతగేయకర్తగారు (చక్కనిసాహిత్యం కలవా రగుటచే) తగరు. చదువుకొన్న చదువుకు తగిన రచన చేసి దానిలో పేరుప్రతిష్ఠలు సంపాదించవలసింది. యిదేమో సులువైన వుపాయం అనుకున్నారు. అంతవఱకు అంగీకారమే కాని యీ రచనమొఖం చూడడానికే యేవగించుకొనే లక్షణకర్తల వాక్యాలు వుటంకించి సమర్థించే ప్రయత్నం శోచ్యం. నేను లోఁగడ యెంకిపాటలను గూర్చి వ్రాసిన వ్యాసాలలో వీట్లవిషయం విపులంగా చర్చించాను. వెనుకటి లక్షణాలుగాని, వాట్లని మన్నించే చేదస్తప్పండితులుగాని, కవులుగాని యీరచనలకు ఆమోదించరు. కనక ఆ లాక్షణికోక్తులు వీట్ల సమర్థనానికి వినియోగించవద్దనే యెంత వ్రాసినా నేను వ్రాసేది. అయితే గేయకర్తగారు యెందుకు వాట్లని వుదాహరించారంటే? వినండి. "కోశవా నాచార్యః" అని పాఠకలోకానికి తెల్పడానికిన్నీ; అంతేకాదు వెం. శా. కి ఆ యీగ్రంథాలు యేవీ తెలియవు, అనికూడా లోకానికి తెలియఁజేయడానికిన్నీ అవుతుంది. ఈ అంశం ఆయనవ్యాసంలో కొన్ని వాక్యాలు సూచిస్తాయి, అయితే నిజానికి కట్టుపడాలి. నేను ఆగ్రంథాలు గురుముఖతః చదివి ప్యాసైన "శిరోమణిని" కాను. యింక యేతరగతిలో చేరతానంటే? యెందుకూ పనికిరాని "ఉరోమణి" తరగతిలో చేరితే చేరతాను. ఆనందవర్ధనాచార్యులవారి వాక్యాలు, యీలొల్లాయి పదాలను

సమర్థించడానికి పనికిరావన్నంతవఱకు ఆ ధ్వన్యాలోకంకూడా చూడనక్కఱలేదు. ఆనాఁటి లక్షణకర్తలలో ఆయా విషయాలలో యత్కించితు మతభేదాలు వున్నప్పటికీ "అపశబ్దములతో, నికృష్టపురుషచరిత్రలతో" నింపఁబడిన కావ్యరచనను ఆమోదించడం సర్వకల్ల. యేరసమో నవరసాలలో వొకటి ప్రధానంగా పుచ్చుకొని,

ఆ.వె. "ఆధ్యుఁడొక్కఁడున్న నందఱుఁ బూజ్యులే
లెక్కమీఁద సున్న లెక్కినట్లు
అతఁడు వోవుమీఁద నంద అపూజ్యులే
సున్న మీఁద సున్నలున్నయట్లు"

అన్నరీతిగా రచిస్తే దానిచాటున అన్నీకమ్ముకుపోతాయి గాని శ్రీమతే... దేవ్యైనమః అన్నట్టు ప్రధానంగానే అశ్లీలంగా (1) అమ్మా! మాదాకవళం, (2) మహారాజులు తల్లీ, కళ్లులేవు. అవిన్నీ యెత్తుకొని (అనంతర చరణాలలో మంగళార్థకాలు వుంటే వుంటాయిగాక) దాన్ని అభ్యుదయార్థం జరుగుతూ వున్న గృహప్రవేశసభలో చదవడానికి యేపూర్వ లాక్షణికోక్తులు సమ్మతిస్తాయి? "రసోఽఙ్గిత్వేన వినివేశితవ్యః" అన్నవాక్యానికి యీ దిక్కుమాలిన నికృష్టులకు సంబంధించిన యేడుపురసాన్ని అంగిగా చేయవలసిందని తాత్పర్యం కాదు. నాయకనిష్ఠ శోకంకూడా ఆహ్లాదాన్ని పాఠకులకు కలిగిస్తుందని వ్రాసిన వారిహృదయంకూడా వేఱు. వ్రాస్తే చాలా వ్రాయాలి. "శ్లో. విద్యావినయ సంపన్నే" అనే శ్లోకార్థాన్ని దుర్వినియోగం చేస్తే యేలా వుంటుందో? ఆలాక్షణికోక్తికి దీన్ని లక్ష్యంగా చూపి సమర్థించడమూ ఆలాగే వుంటుందంటే చాలును. వినేటప్పటికి యేవంగా వుండేది లాక్షణికోక్తులద్వారా నిడివి మీఁద సమర్థింపఁబడినా ప్రయోజనంలేదు. (వామన ఇతి త్రివిక్రమ మభిదధితి దశావతారవిదః) అదిగాక ఇది పండితులకొఱకా? పామఱులకొఱకా? అని అధికారినిర్ణయప్రశ్న వస్తే, నాఽద్యః. యెందుచేత నంటే? వారు బొత్తిగా దీనివంకకు చెవిపెట్టరు. పెడితేవారికి ఈ లాక్షణికోక్తులు అవగతమై వుంటాయి కనక సమర్థించుకొని ఆనందిస్తారే అనుకుందాం, చెవినేపెట్టరుగదా! నద్వితీయః. వాళ్లకి ఆనందవర్ధనాచార్లెవరో గోవర్ధనాచార్లెవరో తెలియనే తెలియదుకదా? యిఁక యీరచన యెవరికోసం? స్వాత్మానందంకోస మనుకోవాలి. పడవలులాగేవాళ్లూ, బళ్లుతోలేవాళ్లూ దీనికి అధికార్లనుకుందామా? వాళ్లకి యే పచ్చిశృంగారమేనా వుండాలి. "యెంకత్తకడియాలు" వగయిరాలు చూ. ఆయీకారణాలను బట్టి చక్కనిసాహిత్యజ్ఞానాన్ని యీవిధంగా వ్యర్థపుచ్చవద్దని గేయకర్తగారికి నాసలహా. నువ్వెవరు? నాకు సలహా యివ్వడానికంటే? యీసలహానన్ను విశ్వసించే శిష్యోపశిష్యులకేనా వుపకరిస్తుందని ఆశిస్తాను.

చ. "హితము వచింపఁ దా వొసఁగునెవ్వఁడు వాఁడెవఁడున్ వినండ భా
రతముననేమి తక్కిన పురాణములందుననేమి యెవ్వఁడే
హితము గణించె నట్లని మఱెవ్వఁడు చెప్పుటమానెఁ జెప్పుటే
చతురునకో యగున్ గణన సల్పి కృతార్థుఁడు వేఱొకం డగున్"

అథవా నాకు ఆ గేయంలో వుండే రసం తెలియకనే పోవచ్చును, యేమీ యెందుకు తెలియాలి? "నహి సర్వ స్సర్వం విజానాతి" కదా! అందుకే నేను నావ్యాసంలో "కొందఱు రసజ్ఞులు నచ్చినవారుంటే వారి వారి చేవ్రాళ్లతో అభిప్రాయాలు సంపాదించి పత్రికాముఖాన్ని ప్రకటిస్తే... నేనూ వారితో యేకీభవిస్తాను" అని యీలా హృదయం విప్పి వ్రాసినప్పటికీ యేదో కోలాహలం చేస్తూ "మొదటివ్యాసానికీ యీవ్యాసానికీ వచ్చినమార్పు" అంటూ గ్రంథం పెంచడం నాకు "కర్ణాటకలహం"గా కనుపడుతూ వుంది. కనక కాస్తపిండిగలవా రేమంటారో కనుక్కొని ఆలా చేయవలసిందని హెచ్చరిస్తూ దీనికి స్వస్తిచెపుతాను.

★ ★ ★

# "సహృదయాః ప్రమాణమ్"

అనే విషయంలో మనం యెన్ని యితర ప్రమాణాలు చూపి వివదించినా ప్రయోజనం లేదు. ఆనందవర్ధనాచార్యులవారు వారిజీవితకాలంలోనే అనుకుందాం యీ "అమ్మా! మాదాకవళం" గేయం బయలుదేరితే దానికి కవిత్వవాఙ్మయంలో వారి విమర్శనలో యేలాటి సీటు వుండేదో? నేను వివరించనక్కఱలేదు. ఈమహాభాగ్యం నిన్న నేఁడు పొడచూపింది. యీ రోజుల్లో యింతకంటే కూడా కొత్తరకం రచనలు బయలుదేరుతూ వున్నాయి, మచ్చు చూపుతాను.

| | |
|---|---|
| గుడగుడ | చెళ్‌చెళ్ |
| గుడగుడ | చెళ్‌చెళ్ |
| గడగడ | పిళ్‌పిళ్ |
| గడగడ | పిళ్‌పిళ్ |
| చరచర | కొడ్తాన్ కొడ్తాన్ |
| చరచర | తిడ్తాన్ తిడ్తాన్, |
| విరవిర | ఉంటాన్, తింటాన్, |
| విరవిర | వింటాన్, కంటాన్, |

చాలును - యీమాదిరి ఖండకావ్యసంపుటం వొకటి అభిప్రాయార్థం వచ్చింది. అది నాకు అర్థమే కావడంలేదు. యేమి అభిప్రాయం యిచ్చేది? దీన్ని పాశ్చాత్యులవెన్నవలెనే కొన్నాళ్లు అలవాటు చేసుకోవాలి కాఁబోలునని సమాధానపడ్డాను. లోఁగడ చర్చింపఁబడ్డ "మాదాకవళం" అనేగేయం అర్థమవుతూ వుంది. యిదో? నమ్మండి, నమ్మకపోండి (నమ్మిన నమ్మకున్న నది నావశమా?) శుద్ధ అగమ్యగోచరం, అయోమయం. నా కేమీ అవగతం కానే లేదు. దాన్ని ఆలా వుంచుదాం "మాదాకవళం" గేయం నేను యెంత ప్రయత్నించినా నాకు నచ్చలేదు. నాకు నచ్చకపోయినంతమాత్రంలో యితరుల కెందఱికో అది నచ్చడం తటస్థిస్తే అది కవిత్వం కాకపోదు, కనక దానికోసం ధ్వన్యాలోకం యావత్తూ గాని, కొంతగాని యేకరువు పెట్టి ప్రయోజనం లేదు. ఉదాహరించిన శ్లోకమేనా బాగా పరిశీలిస్తే ప్రస్తుతానికి అనుకూలించేది కాదు. అందులో వున్న ప్రబంధశబ్దం బాధక మవుతుంది. దాన్ని

వివరించవలసివస్తే చాలా పెరుఁగుతుంది. తెలియదని వప్పుకొనేటప్పుడు శాఖాచంక్రమణ మెందుకు; యెవరి కవిత్వమేనా లోకాన్ని ఆకర్షించడానికీ ఆకర్షించకపోవడానికీ, ఆలంకారిక గ్రంథాలు కారణం కావు. అవి లక్కీ లిక్కీ అని వాదించడానికే వుపకరిస్తాయి.

"నీయందమ్మది నాకు నచ్చదనెఁ దన్వీరత్న మొక్కర్తు"

బస్ చాలును, అంతతో విరమించవలసిందే కాని సాముద్రికాది శాస్త్రాలు యేకరు పెట్టి లక్ష్యే లక్షణసమన్వయం (చక్రధ్వజాదిరేఖలు వగయిరా) చేయడానికి ప్రయత్నించి ప్రయోజనం లేదు. అంతేకాదు. ఆపెను "నీకు సాముద్రికాది శాస్త్ర పరిచయంలేదు, కనక నా అందం నీకునచ్చిందికా"దని గాని, "నీ అందమూ నాకు నచ్చలేదు" అని కాని వాదానికి వుపక్రమించినా ప్రయోజనం లేదు. పూర్వకాలంలో నచ్చిన శ్రవణానందం యిప్పుడు నచ్చడంలేదని వ్రాస్తే నేను నచ్చఁజెప్పడానికి ప్రయత్నిస్తానేమో అనుకున్నారేమో? అట్టిప్రయత్నం నాదికాదు. (అందఱినిన్ దనియింప మమ్ము నిర్మించిన బ్రహ్మకేని దరమే; చూ.) ఏదేనా శబ్దాన్ని గూర్చో? అర్థాన్ని గూర్చో శంకవస్తే దాన్ని గూర్చి వ్యాకరణమో? కోశమో! మఱొకటో? ఆధారంగా చూపి సమర్థించడానికి అవకాశం వుంటుందేమో కాని నీ కవిత్వం రసవిహీనం లేదా? అసహ్యం అంటే; సమర్థించడానికి పూనుకోవడంకన్న వూరుకోవడమే వుత్తమం. దానిభారం పాఠకలోకానిదేగాని గ్రంథకర్తది కాదుగదా! కనక శ్రవణానందం రసాభాసమనే కారణంచేత హేయమైతే దానితోపాటు వాఙ్మయంలో నశించేవి యేవోకావు "భారతః పంచమోవేదః" కూడా నశించవలసే వున్నా యెఱిఁగీ యెఱగని శంకలను గొప్పఁజేసి వాదానికి దిగడం నాతలఁపు కాదు. కనక యిదివఱలో ప్రమాదపడి శ్రవణానందాన్ని పఠించినా అది దానితత్త్వాన్ని తెలియక చేసిన పొరఁబాటుగా భావించి యిఁకనేనా దాన్ని ముట్టకపోవడమే ఆదోషానికి నికారమని హెచ్చరిస్తాను. చక్కని విమర్శనాజ్ఞానమున్నచో శ్రవణానందం రసాభాసంకాదు. రసమున్నంతవఱకే గాని పిమ్మట రచన విరమించఁబడింది. అయినా దానిసమర్థనం నాపనిగాదు. లోకం లోకం లోకం. ఇంతేకాదు- (1) మనుచరిత్ర (2) వైజయంతీవిలాసం వగైరాలు చాలావున్నాయి. వీటి నన్నిటినీ పరిత్యజించవలసిందే అని కూడా సలహాయిస్తాను. వొకమాట వ్రాయడం మఱిచాను. "మాదాకవళ" కవిత్వం నాకు నచ్చలేదన్న హేతువుచే- "త్వం అంటే త్వం" అనడం లోకరివాజు కనక యీలా అనవలసివచ్చిందేమో అని లోకులు అనుమానించడానికి అవకాశంమాత్రం లేకపోలేదు, కాని దైవముఖం చూచి వ్రాసేవ్రాఁతల్లో ఆత్మవంచన వుండదు కనక నిజంగానే నచ్చలేదనిన్నీ నచ్చకపోయినా యాథాలాభాలుగా చదువుచూ వచ్చారనిన్నీ అంతేకాదు ఆనందిస్తూ వచ్చారనిన్నీ నేను విశ్వసిస్తాను. నాకుమాత్రం విన్న

క్షణం మొదలు యేతత్క్షణపర్యంతమూ- "మాదాకవళం" కవిత్వం నచ్చనేలేదు. కనక ఆత్మవంచన లేకుండా నాహృదయాన్ని నేను వెల్లడించవలసి వచ్చింది. "నీకు యేమీ తెలియదు" అని వొక్కచిన్నవాక్యం వ్రాస్తే సరిపోయేదానికి గేయకర్తగారు చాలా గ్రంథం పెంచి వ్రాశారు. దానికి ఫలితార్థం ఆవాక్యంకన్న విశేషించి కనపడదు. యింతమట్టుకు నేను లోఁగడ కంఠోక్తిగా అంగీకరించిందే - యిఁకనల్లా నేను ప్రతిబంధ్యుత్తరంగా కనబఱచిన- "కొందఱు సోదరీమణులు" అనేపద్యం వుంది, దీనిసమర్థనం నేను (ఆలంకారిక గ్రంథపరిచయం చాలక) చేయలేను గాని గేయకర్తగారైతే (నాతరఫున వకాల్తనామా పుచ్చుకుంటే) వూరుకోరు. అయితే అది ఆయన కవిత్వం గాదు కనక మనకెందుకని వూరుకున్నారనుకుంటాను-లేదా! అవసరమైతే సమర్థనానికి పూనుకుంటారేమో?

"వాదిదౌర్బల్యమే కాని వాదదౌర్బల్యం" వుండదుగదా? రఘునాథాచార్యులవా రేమన్నారు! "మయి జల్పతి కల్పనాధినాథే రఘునాథే మనుతాంత దన్యథైవ" అల మతివిస్తరేణ. యీవిషయం వివదనీయం కాదు. వృథాగా పత్రికలకు పనిచెప్పడం అనవసరం. నాకు నచ్చకే నచ్చలేదన్నాను గాని గ్రంథకర్తను అవమానించడానికి కాదు. ఆయనకీ నాకూ యేవిధమైన వ్యక్తిద్వేషమూలేదు - "కాలం మాఱింది కవిత్వరుచి మాఱింది" అనే అర్థమిచ్చే మాటలు గేయకర్తగారు వ్రాశారు. యెంత మాఱినా యింకా యీవిధమైనది కవిత్వమనుకొనే దాఁకా రాలేదనే నా వెఱ్ఱినమ్మకం.

"శ్లో. అద్యాఽప్యస్తి చతుస్సముద్రవలయీభూతం ధరామండలం
సంత్యన్యేఽపిచ తత్రతత్ర విదుషాంగోష్ఠీషు బద్ధాదరాః"

అర్థమే లేనిమాటలు విడివిడి గ్రూపులుగా అచ్చొత్తించి ప్రచురించడంకన్న (యీ అచ్చుకూడా కొత్తమాదిరి) "మాదాకవళం" కొంత మెఱుఁగే అనిమాత్రం నాకు తోఁచింది. "యెంకిపాటలు" పరమోన్నతస్థానంలో నిల్చి వున్నాయనేది కూడా నేను విశ్వసింపలేను. సహృదయశబ్దం యెవరిని చెపుతుంది? యింకొకమాట-

ధ్వన్యాలోకం లోనైన గ్రంథాలు ప్రాచీనకవిత్వాలనే చాలాభాగం తూఱుపాఱఁబట్టినట్లు కనపడుతుందిగదా? అవి వీట్లని సమర్థిస్తాయా! పైఁగా అవి శబ్దార్థాలు రెండూ నిర్దుష్టాలుగా వుండనిదే వాట్లని దగ్గిఱకేరానివ్వవు, (అలంకారశాస్త్ర గ్రంథకర్తల కవిత్వంకూడా యెందుకూ కొఱగానిది బోలెఁడు వుంది. చూపవలసివస్తే వ్యాసం పెరుగుతుంది) వాట్లని స్పృశింపనే స్పృశింపవు. "ప్రథమకబళే మక్షికాపాతః" అన్నట్టుగా శబ్దసౌష్ఠవాన్ని పూర్తిగా వదులుకొన్ని నేఁటికవిత్వాలను ఆగ్రంథాలద్వారా సమర్థించడానికి పూనుకోవడం హాస్యాస్పదం. దీనిపేరే

కర్నాట కలహం. భవతు, దానికేమి ఆగేయకర్తకు అది లోకోత్తరమైన కవిత్వంగా తోఁచినట్టే నాకు దానికి విపరీతంగానూ తోఁచింది. నే నేం చేసేది? నాకు తోఁచింది వ్రాశాను. "లోకోభిన్నరుచిః" దీనికి వివాదమెందుకు? వివాదపడి సాధించతగ్గ విషయ మిదికాదుగదా! యిది మాత్రమేనా! పచనం కూడా యిట్టిదే. యెన్ని పాకశాస్త్ర శ్లోకాలు యేకరు పెట్టినా భోక్త నాలుక కవి రుచిని కలిగింప నేరవని వ్రాయనక్కఱలేదు. (పచనకర్త "నీకు నాపాకాన్ని అనుభవించే నేర్పులేదు" అని గాని- "నీకు జిహ్వాదోషం పట్టిం"దని కాని-పైత్యరోగమ్ము చేతను-చూ.) అంటే అనవచ్చును. కాని అట్టి ధార్ష్ట్యమును చూపినవారు మాత్రం యింతవఱకు పాచకులందు వున్నట్లు వినలేదు. నా మతంలో (1) కవి, (2) గాయకుఁడు, (3) పాచకుఁడు, (4) కన్యాపిత యీ నలుగురూ వొకటే తరగతివారనిన్నీ, వీరు నిర్బంధించి యితరుల సర్టిఫికెట్లు సంపాదించడానికి ప్రయత్నించి ప్రయోజనం లేదనిన్నీ ఆ కారణంచేత వుదాసీనులుగా వుండి యితరులు తమకు యిచ్చే సలహాలు రుచిస్తే అనుసరిస్తూ, రుచించకపోతే వుపేక్షిస్తూ వుండడమే యుక్తమనిన్నీ తోస్తుంది-అంతేనేకాని - "నీవు నా కవిత్వం మెచ్చుకోలేదు కనక నీవు నాకు ద్వేష్యుఁడవు" అనడంలో ప్రయోజనంలేదు. నేను మొదటినుంచీ ద్వేషం లేదని వ్రాస్తూన్నాను. నాకు "మాదాకవళం" కవిత్వమేకాదు. నేఁటివెన్నో నచ్చడంలేదు. (ద్వైతానికి అద్వైతం నచ్చదు - దానికి యిది నచ్చదు) అంత మాత్రంచేత వారు నాకుద్వేష్యులా? కారు, యిది నాచేదస్తమైనా కావచ్చు. నాశ్రవణానందాన్ని నేను సమర్థించేదిలేదు. అట్లే "మాదాకవళాన్నిన్నీ" వుపేక్షిస్తే వీలేమో? లోకానికి వదలిపెడదాం యెందుకీశ్రమ-

స్వస్తి.

★ ★ ★

# యేది సాధ్యం?

వ్రాసిందే వ్రాస్తూ వృథాగా పత్రికకు పనిచెపుతూ వున్నారుగదా! మీకు సాధ్యం యేమిటంటాను. (1) వెం. శా. కి అలంకారశాస్త్రపాండిత్యంగాని, యద్వా రసచుంబనోపాయంగాని పూర్ణానుస్వారం; యద్వాపుస్తకాపేక్ష అనేదే అయివుండునా? ఆలాక్కాకపోతే (2) "అమ్మా! మాదాకవళం తల్లీ" అనేది సహృదయు లంగీకరించే కవిత్వమే, శుభార్థమైన మహాసభలో వినిపించతగ్గ కవిత్వమే అనిపించుకోవడమే అయివుండునా? యీ రెంటిలో మీకు యేది సాధ్యం అని మిమ్మెవరేనా ప్రశ్నిస్తే మీరు చెప్పే జవాబేమిటి? నాఉ ఉ ద్యః. యేమంటారా? యెంతమంది, వెం. శా. లకు యేమీ రాదని తేలినా మీకు లేశమున్నూ ప్రస్తుతం వుపయోగించేది లేదు. (పృష్ఠ తాడనా ద్దంతభంగః) వెం. శా. అపండితుఁడైనంతలో కవిత్వం కానిదల్లా కవిత్వం కాఁగల్గుతుందా? యింకేమిటంటే? ఆక్షేపకనిష్ఠమైన అపాండిత్యమే ప్రస్తుతం తేల్చుకో తగ్గది కనక, ఆలాటి మాటలు వ్రాయవలసి వచ్చిందంటారేమో? అయితే వినండి. మీరు ఏసభలో యీఅపభ్రంశ గేయపల్లవిని గానమాధుర్యాన్ని అనుపానంగా తోడుచేసి సభ సంతోషిస్తుందనే కుతూహలంతో చదివి వున్నారో, ఆసభలో వెం. శా. కన్న మిన్నగా అలంకారశాస్త్ర పరిశ్రమ చేసి రసాన్ని చుంబించే నేర్పుకలవా రెందఱు వుండివుంటారని ప్రశ్నిస్తే మీరు చెప్పే జవాబేమిటోకదా! (కొద్దికొద్ది ఆ యా విషయమ్ము లన్నియును నారసి లౌకిక చాతురీమతి, శ్రీ విభవమ్మునన్ జెలఁగి చేటున కాకరమౌ నసూయకున్, భావము లొంగనీక" చూ.) అసూయయున్నట్లు చూపఁగలరా! అది భావనాశక్తికి గోచరమే అయినా వివరించేది లేదు. మీకే అట్టే వుంచడం మంచిది. మీ స్వహస్తలిఖితాక్షరాలే చూచి సహృదయులానందించి మీ సాహసాన్ని అభినందించాలి. కాని, అంతటి సాహసం మీరు ప్రదర్శిస్తారో లేదో చూడాలి. శ్లో. "రమ్యం జుగుప్సిత ముదార మథాఉ పి నీచం... ... తన్నాస్తియన్న రసభావ ముపైతిలోకే" అని వొకశ్లోకాన్ని వుదాహరించారు మీరు. దీన్నిబట్టి "అమ్మా! మాదాకవళం తల్లీ" పల్లవి కవిత్వ మవుతుందో కాదో కాని ప్రతిబంద్యుత్తరంగా నేను మొట్టమొదటనే వుదాహరించిన ఉ. "కొందఱు సోదరీమణులు... పెదమోమయలేచిరి గ్రుడ్డివెన్నెలన్" అనేది (జుగుప్సితం చూ.) కవిత్వమే సహృదయసమ్మతమే అని తేలుతుందని సంతోషిస్తాను. యేమంటే? అది కవిత్వమే అనిపించుకుంటుందని నేను స్వప్నేఉ పి అనుకొని వుండలేదు. మీరు

స్వార్థనిర్వహణార్థం చేసేపరిశ్రమ తుదకీలా పరిణమించింది. ఆపద్యంలో వున్న విషయం "జుగుప్సిత"మే అయినప్పంటికీ "కవిభావక భావ్యమాన" మయింది కనక దాని "రొట్టె నేతిలో పడిం" దనుకుంటాను. ఆదశరూపక శ్లోకంలో వున్నవిషయమే లోఁగడ నే నుదాహరించిన

"న స శబ్దో న త ద్వాచ్యం న సా విద్యా నసా కళా
జాయతే యన్న కావ్యాంగ మహో భారో గురుః కవేః"

అన్నదానిలోనూ వుంది. భంగ్యంతరంగా మీదశరూపకశ్లోకంకూడా యేవిషయమేనా "కావ్యాంగం" అవుతుంది కాని, ప్రధానస్థానాన్ని ఆదుకోవడానికి పనికిరాదని బోధిస్తూ వుందని విస్పష్టమే. ముడిపదార్థాన్ని ముడిపదార్థంగానే ప్రదర్శించడం కవికృత్యం కాదు. వొకటి వుదాహరించి మఱీ నాకు తోఁచినమాటలు వ్రాస్తాను. చర్మాలున్నాయనుకోండి. రక్తమాంసవసామజ్జాదులతో నిండి హేయంగా వుంటే అందఱూ అసహ్యించుకుంటారు. వాట్లనే సంస్కరించిన పిమ్మటనో అనేకవిధాల గౌరవించి ధరిస్తారు. మీరు ప్రస్తుతం అట్టి సంస్కారం లేశమేనా "అమ్మా! మాదాకవళం తల్లీ" పల్లవిలోచేసి ప్రపంచకానికి అందించి వున్నారా? లేదు. ఆబిచ్చగాళ్లు యేలా వుచ్చరిస్తారో! ఆలాగే వుంచారు. దీనిరచనవల్ల యేవిద్వాంసుఁడేనా కవిశబ్దభాక్కు కాఁగలిగితే వాళ్లున్నూ "కవిశబ్ద భాక్కులే" కావలసివస్తుంది. కాని, వాళ్లు అలంకారగ్రంథాలు వ్యాసంగం చేసి పరీక్షలిచ్చి డిగ్రీ సంపాదించినవాళ్లు కాకపోవడంచేత "విద్వత్కవులు" మాత్రం కాలేరు. మీరు దశరూపకాన్నుంచి వుదాహరించిన శ్లోకం (రమ్యం జుగుప్సితం) యీలాటి అపభ్రంశ గేయాలకు కవితా పట్టాన్ని యివ్వడానికి పుట్టలేదు. ఆయీ రహస్యం "పాత్రప్రతిష్ఠాజుట్టులకు" గోచరించేదికాదని నాహృదయం. ఇదియే ప్రధానాంశం. ఆగేయానికి లయపడుతుందా? పడదా? యిత్యాదులు ప్రధానాలు కావు. వీట్లనన్నిటినీ పెట్టుకుంటే ప్రధానం తేలదు. విశ్వనాథ సత్యనారాయణ నాఁటిసభలో దానికి లయ వేయలేదు. అతఁ డీవిషయం నాయెదట వప్పుకున్నదే. దాన్ని ఆనాఁడు మీరు చదివిన రీతిని దీర్ఘాలతో చదివితే దానికి యిప్పుడూ లయపడదు.

"గురువు లఘువు చేసి కుదియించి కుదియించి లఘువు గురువు చేసి లాగిలాగి." అనునట్లు పరిశ్రమచేస్తే లయపడని దంటూ వుంటుందా? మీరు శ్రవణసుఖార్థం కదా! దానికి వుదాత్తానుదాత్తప్రచయాదులు తోడు చేశారు. అథవా, లయపడడం ప్రస్తుతాన్ని సమర్థించఁగలుగుతుందా?

"వెం. శా. కి రసచుంబనశక్తితోపాటు లయజ్ఞానంకూడా లేదు" అని మీరు వాదించడానికి పనికివస్తే పనికివస్తుందేమో? హృదయంవిప్పి మాట్లాడేయెడల లోఁగడనే సర్వవిషయాలూ వుటంకించఁబడ్డాయి. అయితే "నాకు తగ్గ సదుత్తరం రాలేదు. ఇఁకముందున్నూ వస్తుందనే ఆశకూడా లేదు" అనే అర్థమిచ్చేమాటలు మీరు వ్రాస్తూన్నారు. యిప్పుడే కాదు, యెప్పుడేనా స్వార్థనిర్వహణతత్పరులు వ్రాసేమాటలే యివి. మీయందేదేనా వైరంవుండి నేను ఆ "అమ్మా? మాదాకవళపల్లవి" కవిత్వం కాదన్నానని చూపిస్తే తప్ప, మీవాదానికి ప్రయోజనం వుండదు. నాపరిశ్రమ తత్ప్రయుక్తంకాదు. సత్యనారాయణకూడా పని పడితే దీన్ని కవిత్వమని వొప్పుకోఁడనియ్యేవే నాహృదయం. మీకు నాతత్త్వం (అజ్ఞత) తెలిసినట్లు మతికొందఱికి తెలియదు. కనక వారు మీ "అమ్మా! మాదాకవళం" కవిత్వమే అంటూవుంటే కొందఱు తత్త్వం యెఱిఁగీనిన్నీ ప్రోత్సహిస్తూ వుంటే తెలిసినా తెలియకపోయినా జీవితమంతా దానికోసమే వ్యయించి "మ. కవనార్థం బుదయించితిన్" అనుకొనే మాఁబోటిముసలాళ్లు హరీ అచ్యుతా అనకుండా వూరుకొనేయెడల ఆ తూష్ణీంభావంలో కొంతసుఖమే వున్నప్పంటికీ "అప్రతిషిద్ధ మనుమతం భవతి" గా పరిణమిస్తుందేమో నని తప్ప లేకపోతే విశ్వనాథ సత్యనారాయణకన్న వేయిరెట్లు నేను మిమ్మల్ని ప్రోత్సహించి, విని లోలోపల నవ్వేవారిలో లోపాయికారీని చేరి వుండేవాణ్ణే. అయితే అందుకు ప్రస్తుతవయస్సు ప్రోత్సాహకమని మీరే కాదు యెవరూ అనుకోరు. ఇట్లు ఆత్మవంచన లేనినన్ను మీరు శత్రువుగా భావించి యేమేమో వ్రాస్తున్నారు. భవతు. మొదట నేనే దీనికి వుపక్రమించినా తగినంత ఆవశ్యకత్వం లేకుండా వుపక్రమించలేదు. (యీ అంశంకూడా లోఁగడ సూచించే వున్నాను) దాన్ని మీరు తత్త్వదృష్టితో గ్రహింపక "అన్నా! మనకవిత్వం ఈయన కాదంటాడా?" అనే యీర్ష్యతో యేదోవిధంగా వాదం పెంచడంపేరే "కర్ణాట కలహం". నాకు తోఁచిన సలహా నే నందిచ్చాను. అయితే "నాఽపృష్టః కస్యచిద్ బ్రూయాత్" కనక మిమ్మెవ్వరడిగారని ప్రశ్నిస్తారా. వొక్క నన్నే కాదు. మీరు ఆ సభవారి నందఱినీ అడిగినట్టే ఆ సభలో సాహసించి దాన్ని చదవడం. కొందఱు లోలోపలనిరసించి ఊరుకున్నారు: పదిమందితో సంబంధం వుండడంవల్ల నేను పయికి నాభావాన్ని తెల్పివున్నాను. మీరు కోపం వచ్చి యేమన్నా అంగీకారమే? స్వస్తి.

★ ★ ★

# యేది కవిత్వం-1

అని ప్రశ్నించుకుని వ్రాయవలసివస్తే చాలామందికి కంటగించుకోవలసివస్తుంది. అంతతో సరిపోక 'త్రిదోషహరం తిప్పతీఁగ' మాదిరిగా వుంది యీ నిర్ణయమనికూడా నూటికి తొంబదితొమ్మండుగురు పరిహాసం చేయడంకూడా తటస్థమవుతుంది. అట్లని యథార్థాన్ని మఱుగుపరచడం యుక్తంగా వుండదుకదా? కనుక కొంచెంగా దాన్ని గూర్చి వ్రాస్తాను.

సీ. లలనాజనాపాంగ వలనావసదనంగ
తులనాభి కాభంగ దోఃప్రసంగము.

ఆ యీ పద్యం వసుచరిత్రలో వసంతఋతువర్ణనలో వుంది. ఇది చాలా శ్రవణా నందంగా కనపడడంచేత యిది కవిత్వమని గాని, యిదే కవిత్వమనిగాని చెప్పి ఆనందించేవారు కవులలో పలువురువున్నారు. నిజానికి బాగా పరిశీలిస్తే "రమణీయార్థ ప్రతిపాదక శ్శబ్దఃకావ్యమ్" అనే పండితరాయల కావ్యత్వపరిష్కారానికి యిది వుదాహరణం కావడంలో సంశయింపవలసిన్నీ వుండదు. యే విధమైన అర్థమున్నూ లేని మృదంగాది శబ్దములే శ్రవణానందాన్ని కలిగిస్తూ వుండగా యేదో కొంత అర్థం కలిగి వున్న పైపద్యంయెందుకు శ్రవణానందజనకం కాకపోతుంది? కనక యిదే కవిత్వం అని చెప్పకపోయినా 'యిదికవిత్వం' అనేనా చెప్పడాని కభ్యంతరం వుండదు గాని కవిత్వ తత్త్వవేత్తలుమాత్రం 'యిదిన్నీ కవిత్వమే' అన్నంతవఱకు వొప్పుకుంటే వొప్పుకుంటారేమో గాని, అంతకంటె అధికగౌరవాన్ని దీనికి యివ్వరు. వారిదృష్టిలో యిది 'అధమకవిత్వం' లోకివస్తుంది. దీనిలో ద్విప్రాసచమత్కారమలా వుండఁగా ప్రతీచరణంలోను నాలుగు అంత్యప్రాసలు వున్నాయి. యీపద్యం పుట్టినతరవాత దీన్ని వరవడిగాఁ బెట్టుకొని పలువురు కవులు పలుపద్యాలు వ్రాసివున్నారు. కాని వాట్లలో దీనిలోవున్న యావత్తు శబ్దాలంకార వైచిత్ర్యమున్నూ వచ్చినట్లు లేదు. వొకటి వుదాహరించి చూపుదునా?

"ఏలాలతాజాల డోలాసమాలోల బాలామణీ గాన భాసురములు"

యిలాటివి అక్కడక్కడ చాలా వున్నాయి. యిది తారాశశాంక విజయంలోనిది. యిందులో అంత్యప్రాసా సర్వతోముఖంగా రాలేదు, ద్విప్రాసా రాలేదు. మాముత్తాతగారు

పద్యమంతా వకటేప్రాసతో చెపితే మఱీగొప్పగా వుంటుందని దీన్నిబట్టేవొకపద్యం చెప్పి వున్నారు.

సీ. పాటీరభూభృ ద్వనాటీమరుద్వధూ
వీటీసుగంధమ్ము లాటిలాటి
లాటీవరాటీమరాటీకుచాఌలిప్త
పాటీరవాసనల్ మీటిమీటి
మీటీకృతోద్విరు ద్వాటీదళత్పుష్ప
కోటీపరాగంబు జూటిజూటి
జూటీభవత్కురుటోక్టీ సమాశ్లిష్ట
ధాటీవిహారంబు జాటిజాటి

గీతంకూడా యిదేధాటీలో నడిపించారు. కాని దానిలో వొకచరణంమఱిచారు. త్రిపాదిగానే వుంది. దీనిలో అంత్యనియమం లేదు గాని ముక్తపదగ్రస్తం వొకటి అధికంగా పడింది. సర్వతఃప్రాసముచ్చట సరేసరి. అర్థం వుందో? లేదో? అని సంశయించ వలసిందే! ఆయన సిద్ధాంతకౌముది సమగ్రంగా స్వహస్త లిఖితంగా వ్రాసుకొని గురుముఖతః అధ్యయనం చేసినట్టివారేకాని పుంవద్భావం వగయిరాలు యమకపుష్టికోసం వదులుకొన్నట్టు తోస్తుంది. గీతిలో వకచరణం మఱిచిపోవడంకూడా యమకబాధచేతనే. యమకాదులలో కొంత కక్కురితికి లాక్షణికులు అభ్యనుజ్ఞనైతే యిచ్చి వున్నారుగాని ఆ అభ్యనుజ్ఞ యీలాటివిషయంలో కాదు; రసపుష్టి వుండకపోవడానికి పూర్తిగా అంగీకరించారు.

"ప్రాయశో యమకే చిత్రే రసపుష్టి ర్నదృశ్యతే" ఆలాటి అభ్యనుజ్ఞ వున్నప్పటికీ వసుచరిత్ర పద్యంలో కొంత రసపుష్టికూడా వుంది. తరవాత కవులరచనలో రసపుష్టి బొత్తిగా లేదు. కాళిదాసు "ద్వైపాయన ప్రభృతి శాపాయుధత్రిదివ సోపాన ధూళిచరణా" అంటూ కాళికను స్తవంచేశాఁడు. తరవాత యెందఱో కవులు ఆయీ అశ్వధాటీవృత్తాన్నే యెత్తుకొని కొన్నిస్తవాలు నడిపించారు. ఆసొగసురాలేదు. యెందుకు రాలేదంటారా? యెందుకో రాలేదు. పరిశీలించుకోండి మీకే తెలుస్తుంది. (మేముకూడా బాల్యంలో కొంత దీని కోసం పాటుపడ్డాము "శ్లో. నాళీకజాద్యదితిజాళీ" వగైరాలు చూ.) అందుచేతనేకదా?

శ్లో. కవయః కాళిదాసాద్యాః కవయో వయ
మప్యమీ పర్వతే పరమాణౌచ పదార్థత్వం వ్యవస్థితమ్.

అన్నాఁడు వొక మహాకవి. ప్రకృతమనుసరామః మొట్టమొదట చూపిన, "లలనాజనాపాంగ" పద్యం పుట్టి యిప్పటికి మూఁడు నాలుగు శతాబ్దాలుగడిచి

పోయినాయిగాని మళ్లా ఆలాటిపద్యం ఆవిర్భవించలేదంటే కాదనేవారయితే కనపడరుగాని దాన్ని కవిత్వంగా అంగీకరించమంటే అంగీకరించేవారున్నూ వుంటారుగాని ఆలాటివారిని రసజ్ఞులంటే మాత్రం తత్త్వవేత్తలువొప్పుకోరు. అంటే? యేమన్నమాట? "కవిత్వమంటే శబ్దాడంబరం కాదన్నమాట". ఆయీసందర్భం చర్చిస్తూ మేము శ్రీనివాసవిలాసంలో "ఉ. కేవలశబ్దముల్ దగ లగించి బిగించినయట్టి సంస్కృతంబు" ... అని యెత్తుకొని, "శుష్కకుచపొంకము బైటకుఁ బెట్టినన్" అని వుపసంహరించవలసి వచ్చింది. కాని ప్రతీకవికీ కవిత్వారంభదశలో యేదో యమకం వచ్చేటట్టు పద్యం వ్రాయాలనే కుతూహలం వుదయిస్తుందని నా అనుభవాన్ని బట్టి వ్రాయసాహసిస్తూన్నాను. "చ. జిలిబిలిపల్కులున్ సొగసుఁ జిల్కెడిముద్దులు" అనే శైలిలో శ్రవణానందాన్ని నడిపిన మాకు మొట్టమొదట యేదో శతకం వ్రాసేటప్పుడు "మగువపదంబు కోకనదమానదమా నదమా" అనే మా ముత్తాతగారిధోరణిలో కవిత్వం నడపాలనేవుండేది గాని పిండి తగినంత లేని బాల్యమవడంచేత యెన్నిమాట్లు ఆధోరణిలో కలం నడిపినా వొకటి రెండు చరణాలు కుదరడమే దుర్ఘటంగా కనపడేది. అర్థంమాట యేలావున్నా నాలుగుచరణాలూ వొకటే మాదిరిలో నడిస్తేనేకాని చదువరులకు (సామాన్యులకే అనుకోండి) అది అబ్బే అనిపిస్తుంది. మాముత్తాతగారు పడ్డంతకష్టం యీవిషయంలో యెవరూ పడనేలేదేమో అని నాకు తోస్తుంది. రకరకాల యమకాలన్నీ ఆయన కవిత్వంలో కనపడతాయి. ఆ యమకం లేకుండా కూడా యెంతో చక్కఁగా ఆయన చెప్పఁగలరు. కాని "నాన్‌బ్రామిన్సు" ప్రతీపదార్థంలోనూ వుల్లిని కల్పినట్లు ప్రతీపద్యంలోనూ యమకప్రభేదాలలో యేదో వొకటి కల్పడమే ఆయనకలవాటు. కొంచెం మచ్చు చూపుతాను.

చ. ఘనకబరీ స్తనాకృతులు కంధరమై ధరమై రమైక్యమై
చను మది కంఠవక్త్రములు సాదరమౌ దరమౌ రమౌకమౌ
దినుసగు వాక్స్మితాంగములు తేనెలతో నెలతో లతోక్తితో
నెనయగు నాభిజంఘగతి హేమకరిన్ మకరిన్ గరిన్నగున్.

ఆ యీ పద్యాల అర్థం నాకు పూర్తిగా తెలుసును. దానిక్కారణం సంప్రదాయజ్ఞులవల్ల వినడమే. కొన్ని పద్యాలకు తెలిసిన తరువాత మఱి కొన్నింటికి దానంతట అదే తెలుస్తుంది. నాలుగోచరణంలో తుట్టతుదను యమకనియమం చెడింది. అంతేకాక సంధివశాత్తూ కరిన్ అనేది గరిన్ అనేవ్రాస్తే అందం చెడవలసివస్తుంది. వొక్క చరణానికి అర్థం వ్రాసి చూపుతాను.

ఘనకబరీ = గొప్ప కొప్పున్నూ, స్తన = ఉరోజము లున్నూ, ఆకృతులు = ఆకారమున్నూ, (యేలావున్నాయంటే) కంధరమై = మేఘమై, ధరమై = పర్వతమై (జాత్యేకవచనం) రమైక్యమై రమా = లక్ష్మీదేవితో, ఐక్యమై = అభేదమును పొందినదై, క్రమాలంకారము. ఇలాగే తక్కిన చరణాలకున్నూ చూచుకోవాలి. యీమాదిరి కవిత్వం తెనాలిరామలింగం చెప్పినట్టు ప్రతీతి వుంది గాని అతనికి ప్రఖ్యాతి తెచ్చిన పాండురంగ మాహాత్మ్యంలో మాత్రం యిట్టి కవిత్వం మచ్చుకుకూడా కనపడదు. పాండురంగ మాహాత్మ్యంకాక రామలింగం పాండురంగ విజయం అంటూ వొకప్రబంధం రచించి వున్నాఁడనిన్నీ దానిలో యీలాటిపద్యాలెన్నో వున్నాయనిన్నీ విద్వత్పరంపర చెప్పుకోవడమేకాక ఆ గ్రంథం లోవే యీ పద్యాలంటూ ముక్తసరిగాకొన్ని పద్యాలు చదువుతూ వుండడం నా బాల్యం నాఁటికి విస్తరించి వుండేది.

"తే.గీ. అతివకచనాభిజఘన దేహాననము త
మీనదరసాలతారాజసానిరాక రణము... ..."

అనే పద్యంకూర్పు చూస్తే అందులో వున్న చిత్రవిచిత్రాలు సాక్షాత్తూ ఫాలాక్షుఁడిక్కూడా అత్యాశ్చర్యకరాలుగానే వుంటాయి కనకనే యితణ్ణి "రామలింగ" పదంతో లోకం వ్యవహరించవలసి వచ్చిందేమో అని నే ననుకుంటాను. యితని పాండురంగ మాహాత్మ్యం చూస్తే వైష్ణవమతస్థుఁడుగా కనపడతాఁడు. దానిగద్యలో రామకృష్ణుఁడుగా వున్నాఁడు. దీనిలో మొదటి అక్షరం "త" అనేది తీసివేయడం వగయిరా విశేషాలు వాఖ్యానించవలసివస్తే చాలా పెరుఁగుతుంది. దీనికికాకపోయినా యేదోవ్యాసంలో యెప్పుడో,

చ. అలఘునచంద్రబింబనిభ మై తనరారెను వక్త్ర మందులోఁ
గలిగిన నామభేదముల కైవడి భాసిలెఁ గప్పుగొప్పు చె
క్కులు రదనాంశుకమ్ములవి గుబ్బలకున్ సరిరాకపోయెఁజే
తులు సరులయ్యె దానివలెఁ దోఁచెను బొంకపుటారు నాతికిన్

దీనికి కొంత వ్యాఖ్యానం చేసి ప్రచురించినట్లే జ్ఞాపకం. ఆ యీ పద్యాలలోదే వొక సీసపద్యం. "సీ. ద్విరదంబు నడతోడ" అనేది. యీ పద్యం యేచరణానికి ఆచరణమే సమన్వయిస్తుంది. మాముత్తాతగారు దీన్ని వరవడిగాఁ బెట్టుకొని రచించిన సీసపద్యం. "సీ. శరదంబు వేణికి శాంతభావమునందె" అనే పద్యమో! యావత్తూ వొకపదంతోటే తిరుగుతుంది. చాలా అవయవాలవర్ణన దానిలో యిముడుతుంది. "అలరుచన్గుత్తు లీకొమ్మ కలరుఁజుమ్మ" అని తుట్టతుదకు కుచవర్ణనతో పద్యం ముగుస్తుంది. ప్రసక్తానుప్రసక్తంగా చాలా దూరం వచ్చాము. మా ముత్తాతగారు యమక కవిత్వం చెప్పడం తఱచుగా వుండేది.

యమకం లేకుండా వారు చెప్పినపద్యం చాలా శ్రవణసుఖంగా వుంటుందని కూడా చెపుతాను. వొకటి మచ్చు చూపుతాను.

క. తళతళనై బెళబెళనై
మిళమిళనై మేనికాంతి మిఱుమిట్లు గొనన్
గళ లలుముకొనియె దిన మొక
నెలవున లేజవ్వనంపునిగ్గులు దేఱెన్.

యిలాటి శైలిలో వున్న పద్యాలు కొన్ని లేకపోలేదు గాని మా ముత్తాతగారు విశేషించి యమకానికే పాటుపడ్డారు. యమకంమాత్రం కవిత్వంకాదా? అంటే? జవాబు చెప్పడం కష్టంగాని సహృదయులందఱున్నూ అది కవిత్వం కాదనే చెపుతారు. దానికోసమై కవికి యిష్టంలేకపోయినా కొంత పేకేజీ సరుకు చేరి తీరుతుంది. చూడండి యీపద్యాన్ని-

"ఉ. నిన్నటిమాపు మాపురమణీరమణీయసభావిభాగభా
గున్నత రత్నపీఠి గొలువుండి సురాంగనలాడఁ గిన్నరుల్
గిన్నెర మీఁటి పాడఁ దిలకించుచు నిచ్చటి కేలరాఁడొకో?
మన్నిరవద్యమిత్రుఁడని మన్నన నిన్నుమదిన్ దలంచితిన్"

యీ పద్యంలో నాల్గవచరణంలో వున్న "మన్నిరవద్యమిత్రుఁడు" అనేదానిలో వున్న - మన్నిరవద్య, అన్నపదం కేవలం ప్యాకేజీసరుకుగా దొర్లిందే. యిది యమకంకోసం కాదని వివాదించవచ్చును. ఆ పక్షంలో ప్రాసకోసమనుకోండి. భారతాదులలో అందులోనూ ముఖ్యంగా నన్నయ్యగారి కవిత్వంలో అప్రయత్నంగా కొంత యమకం దొర్లుతుంది. అది ప్యాకేజీసరుకుగా వుండదు. మచ్చుచూపుతాను.

ఉ. భారతభారతీ శుభగభస్తిచయంబుల
మ. మదమాతంగ తురంగ కాంచనలసన్మాణిక్య గాణిక్య
ఉ. పాయకపాకశాసనికి భారత ఘోరరణమ్మునందు

యిత్యాదులు చూచుకోండి. యీయమకం "మన్నిరవద్యమిత్రుఁడు" మాదిరిగానే వుందో? అన్యథాగానే వుందో సహృదయులు పరిశీలింపఁగలరు. యమకంలాగే - చిత్రకవిత్వంకూడా శబ్దాన్ని ఆశ్రయించికొని వుండేదే రామకృష్ణ విలోమకావ్యం లోనైనవన్నీ బహుపరిశ్రమచేత సాధించినవేకాని వాట్లను ఆదరించే పాఠకలోకం చాలా తక్కువ. అంతదాఁకాయెందుకు? రాఘవపాండవీయం మట్టుకు యెందఱు చదువుతారో ఆలోచించండి. వాట్లరచన బహుకష్టసాధ్యమే కాక బహుతర పాండిత్య సాధ్యంకూడా

నన్నుమాటకు అందఱూ అంగీకరించేదే. కాని లోకాదరం ఆయీ హేతువులను పురస్కరించుకొని పుట్టేదికాదు. కవి కష్టపడే రచించాఁడో? కాకుండానే రచించాఁడో? ఆయీవిషయం పాఠకలోకానికి అవసరంలేదు. చెవికి యింపుగా హాయిగా చల్లగా మెల్లగా తగలడమే కావాలి.

ఉ. ఏవనితల్ మమున్ దలఁప నేమిపనో? తమ రాడువారుగా
రో? వలపింపఁగా నెఱుఁగరో? తమ కౌఁగిటిలోన నుండఁగా
"రావది యేమిరా? విజయ రాఘవ?" యం చిలుదూరి బల్మిమైఁ
దీవరకత్తెనై పెనఁగి తీసుకవచ్చితినో? తలోదరీ.

యీపద్యం వొకమహారాజుగారి సాని బోగమావిడ కట్టింది. యిందులో యమకంలేదు, శ్లేషలేదు. సంస్కృతసమాసాలులేవు. కట్టిన ఆవిడకు వేదశాస్త్ర శ్రౌతాలలో పాండిత్యం వుందని చెప్పడానికి అవకాశం అంతకంటేలేదు. నియమనిష్ఠలు కలదనడానికి యే విజ్ఞులూ అంగీకరించరు. "విటునకు సత్యశౌచములు వేశ్యకు నేమములేదు" గదా? పైని వుటంకించినకారణా లేవిన్నీ లేకపోయినా యిది యేగ్రంథంలోనూ వున్నది కాకపోయినా అధమం వక శతాబ్దానికి తక్కువకాలంలోది కాకపోయినా యిప్పటిదాఁకానే కాదు యింకా యెంతకాలమేనా వుంటుందని నానమ్మకం. దానిక్కారణం యిందులో వున్న రసమే. వేశ్యాత్వాన్ని యెంత సొగసుగానో ప్రకటిస్తూ వున్న యీపద్యంలో వున్న సొగసుయెన్ని "లలనాజనాపాంగాలలో" సంపాదించఁగలం? యింకొకపద్యంకూడా చూడండి.

ఉ. ఎన్నఁడునేరిచెన్ బెళుకులీచెలికన్నులు కారుకమ్ముల
న్నన్నకురుల్, పిఱుందు వటువై పటువైఖరి గైకొనెం గదే
మొన్నగదమ్మ? పిన్న మొనమొల్కలు నేఁడిదె వన్నెలాడిలేఁ
జన్నులుమిన్నలై పయఁటసందున డాఁగురుమూఁతలాడెడిన్.

యీ పద్యం కంసాలి రుద్రయ్యదని చెప్పుకుంటారు. యెంతమంది బ్రాహ్మణకవులు గుమిగూడితే యీ విశ్వబ్రాహ్మఁడికి దీటవుతారు? యీలాటి కవి వారిలో వున్నా ఆ శాఖీయులు తెనాలిరామలింగాన్ని కూడా తమవాఁడని అన్యాయంగా చెప్పుకుంటారు. లోకాదరాన్ని చూఱగొనే కవికి ఆరంభకాలంలోనే రసవంతమైన కవిత్వమేదో? అట్టిది కాని కవిత్వమేదో? తెలుసుకునే సామర్థ్యం యేర్పడాలి (అది దైవాధీనం). అది యేర్పడ్డాక వాఁడేదేనా రచిస్తే దానిలో అంతా కాకపోయినా లేశమేనా లోకాదరణానికి పాత్రమవుతుంది. ఆలాటి జ్ఞానం అంకురించకుండా రచించే రచన "యతియుం బ్రాసయుఁ గూర్చుమాత్రఁగవియే" తరగతిలోకి జమవుతుంది. ఆయీ విషయం సంస్కృతంలో బాగా

విమర్శించిన గ్రంథాలున్నాయి. "ద్విత్రాఏవకవయః ద్విత్రాణ్యేవకావ్యాని" అని నిర్మొగమాటంగాతేల్చేశారు విమర్శకులు. యింకొకవిశేషం. వెనకటికాలంలో యీకర్మం అంతగాఁగాని కొంతగాఁగాని వున్నట్టు లేదుగాని యీ 19వ శతాబ్దంలో అభిప్రాయాల కర్మం వొకటి వచ్చిపట్టుకుంది. ఆ అభిప్రాయాలలో "ఒక్కఁడేనియు నిజమగునూహ వ్రాయఁడు"గదా? ఆపద్ధతిని యీఅభిప్రాయాలెందుకు? "మూఢః పరప్రత్యయనేయబుద్ధిః" కనక వీట్లనుబట్టి మూఢులు తమ కవిత్వాన్ని ఆదరించి కొంటారనేనా? భవతు, యిది విషయాంతరం. యమకం చెవికియింపుగా మృదంగాది శబ్దాలవలె హాయి నిచ్చినా, అది అంతతో ఆఁగిపోయేదేగాని వాసనారూపకంగా హృదయాన్ని ఆశ్రయించి వుండేదికాదు. అట్టి పద్యాలు కావ్యంలో ఆయాకవులు (కొందఱే అనుకోండి) యెందుకు సంఘటిస్తారంటే, కావ్యమంటే? వొకగ్రామంవంటి దనుకుందాం, ఆ గ్రామంలో చాతుర్వర్ణ్యమేకాక యింకా యింకా యింకా నిమ్నజాతులుకూడా వుంటారా వుండరా? ఆలాగే యమకప్రధానపద్యాలు కూడా వుండే వుంటాయి. కాని గ్రంథమంతా తన్మయంగానే ముగిస్తే మాత్రం నిమ్నజాతిమయమైన గ్రామంలాగే ఆకావ్యమున్నూ వుండవలసివస్తుంది. యమకమంత కాకపోయినా శ్లేషకూడా మితిమించివాడేపద్ధతిని మొగం మొత్తుతుం దనడానికి సంశయించవలసివుండదు.

తే.గీ. నీరజారాతి! నినుఁ దననెలవు గూల
నేల సృజియించె విధి సృజియించుఁగాక
యేల జైవాతృకునిఁ జేసె నేల తప్పుఁ
బుడమిఁ "బాపేచిరాయు" వన్బెడఁగునుడుగు.

యీ మాదిరిగావుంటే "అన్యదాలోచనామృతమ్" తెగలోకి యేకొంచెమో చేరినా పూర్తిగా చేరదు. యింతకంటెకూడా సులభపాకం,

తే.గీ. విమలమధుర మనోహర వృత్తి వెలయు
వారిఁ బొడఁగన బుధు లెంతదూరమైన

అనేది. యిందులో వారిశబ్దం మాత్రమే శ్లేషించి పద్యానికి యెంత సొగసివ్వాలో అంతాయిచ్చింది.

చ. వలఁ బడియున్న జక్కవ కవన్ బురణించుచు సన్నపైఁటలో
పల వలిగుబ్బదోయి కనుపండువు సేయఁగ మోడ్పుచేతులో
దలను ఘటించి మ్రొక్కిడి పదంపడి మెల్లన డాయఁబోయి తొ
య్యలి విరిబంతి దోయిట నుపాయన మాయన కిచ్చి యిట్లనున్.

యీ మాదిరి పద్యాలు భగవంతుని తేజస్సు మాదిరిగా స్వయంప్రకాశకాలు. అంటే, శ్లేష వగయిరాల ఆపేక్షలేకుండానే సహృదయాహ్లాదకాలుగా వుంటాయన్నమాట.

ఉ. మ్రొక్కిన నెవ్వ రేమనఁడు మోమటు వెట్టుక చక్కఁబోయె నీ
దిక్కును జూడఁడాయె నొక దీవనమాటయు నాడఁడాయె వీఁ
డెక్కడివైష్ణవుండు మన మేటికి మ్రొక్కితిమమ్మ అక్కటా!
నెక్కొని వెఱ్ఱిబుద్ధిమెయి నిద్దురఁబోయినవానికాళ్లకున్.

చ. ప్రకట జితేంద్రియుల్ మును పరాశరకౌశికులంతవారు స్త్రీ
లకు వశు, లంతకన్న మిగులన్ దృఢమౌ మగకచ్చ బిగ్గఁగ
ట్టుకొనఁగ నీతఁడెంత శుకుఁడో! హనుమంతుఁడొ! భీష్ముఁడో! వినా
యకుఁడొ! తలంచుకో సరసిజాయతలోచన! నెమ్మనమ్మునన్.

యీ ఘట్టమంతా యిదేమాదిరిగా వుంటుంది. వీట్లకు వెల చెప్పవలసివస్తే స్వర్గాన్నుంచి యెవరో దిగిరావలసిందేగాని అస్మదాదులవల్ల అయేపనికాదు. యిందులో శబ్దవైచిత్ర్యంగాని శ్లేషాది అర్థవైచిత్ర్యంగాని లేదు, యింక యేమిటి వుంటా? అంటే : కవిత్వంమాత్రమే వుంది. "ఇయ మధికమనోజ్ఞా వల్కలేనాఽపి తన్వీ" అనే తెగలోవి యీ పద్యాలు, యీ పద్యాలు మాత్రమే కాదు, యీ వైజయంతీ విలాసం యేభాగంతీసి చదివినా యీలాంటిపాకంలోనే వుంటుంది.

మ. అకలంకస్థితి నాఁటనుండియును శూద్రాన్నంబు వర్జించి మా
ధుకరప్రక్రియ బ్రాహ్మణాన్నమె భుజింతున్, గానిచో వైష్ణవ
ప్రకరంబిండ్ల గులాము సేయుదు స్వయంపాకంబు శ్రీరంగ శా
యికృపన్ వెళ్లె దినమ్ము లీక్రియను స్వామీ! నేఁటిపర్యంతమున్.

యీలాటికవిత్వం యెన్నిజన్మాలో చేసిన పుణ్యపరిపాకం వున్నవాళ్లకుఁగాని సంఘటించదు. దీన్ని సమన్వయించుకోవడానికి నిఘంటువు వగైరాలతో లేశమున్నూ ఆవశ్యకం వుండదు. ద్రాక్షాపాకమంటే యిదే. వందపద్యాలకి వొకపద్యమేనా యీలాంటిది వుండని పద్ధతిని కవిత్వం చెప్పడానికి సిద్ధపడడంకంటే అవ్యక్తత్వం మఱోటి వుండదని పూర్వమహాకవులు నిర్మొగమాటంగా మొఱపెట్టివున్నారు.

శ్లో. నాకవిత్వ మధర్మాయ
మృతయే దండనాయవా;
కుకవిత్వం పున స్సాక్షా
న్మృతి మాహు ర్మనీషిణః.

యింతకంటే చెప్పఁదగ్గవా ళ్లెవళ్లుంటారు? యీలా ఖండితంగా చెప్పినప్పటికీ పాపం యెందఱో వృథాగా పరిశ్రమచేసి "కాగితాల్ వృథా చేసి కవిత్వ మల్లిన రుచించునె? అయ్యది గడ్డిపచ్చడిం జేసిన యట్టులుండు" అనే మా నానారాజసందర్శన పద్యభాగాన్ని స్మరింపఁజేస్తూ వుంటారు. ఆ యీ విషయంలో యెందఱో వారివారి అభిప్రాయాలు విస్తరించి వున్నారుగాని యెందఱెన్నివ్రాసినా నిజమైన మార్గాన్ని తెలుసుకొని కవిత్వాన్ని నడిపించేవారుమాత్రం మిక్కిలీ మృగ్యంగానే కనపడతారు. ఆలాగేకాకపోతే "పండుగునాఁడూ పాతమొగుడే" అన్నట్లుయెన్నో శతాబ్దాలు గడిచిపోయినా ఆకాళిదాసే ఆభవభూతే ఆనన్నయ్యభట్టే ప్రత్యక్షం కావడానిక్కారణం యేమిటంటారు? ఆకవిత్వాలు జీవనదులవంటి జీవకవిత్వాలు కావడమే తప్ప మఱివక కారణం వుండదు.

"మలయమారుతములరీతి మలయవలయు" అని బుద్ధభగవానుఁడు యేదో సందర్భంలో చెప్పివున్నాఁడు. దాన్ని మనం కవిత్వవిషయంలో వుపయోగించుకుందాం. బడబడమంటూ కంకరరాళ్లమీఁదవెళ్లే బండిలాగునడిచేకవిత్వాన్ని సహృదయులు మెచ్చుకోరు. ఆ సంగతిని యెవరో వొక మహాకవి యీవిధంగా తెలుపుదు చేశాఁడు.

శ్లో. ఘటః పటఇతి స్ఫుటం పటు రటంతి నై యాయికాః
పఠంతిచ హఠాత్తరాం ఖఫఛఠేతి పాతంజలాః
వయం వకుళమంజరీ గళదరీణ మాధ్వీఝరీ
ధురీణ శుభరీతిభిః ఫణితిభిః ప్రమోదామహే.

యీ శ్లోకంలో పూర్వార్ధరచనకున్నూ, ఉత్తరార్ధరచనకున్నూ వున్న భేదం గమనిస్తే సర్వమూ తేలిపోతుంది. గాని ఆ భేదాన్ని గమనించే వారు మృగ్యులుగా వుంటారు.

శ్లో. విపశ్చితా మపశ్చిమే వివాదకేళినిశ్చలే
సపత్నజి త్యయత్న మేవ రత్నఖేటదీక్షితే
బృహస్పతిః క్వ జల్పతి క్వ సర్పతి ప్రసర్పరా
డసన్ముఖశ్చ షణ్ముఖ శ్చతుర్ముఖశ్చ దుర్ముఖః.

అని చదవడంతోటట్టే కొందఱు కవిత్వమంటే యీలా వుండాలిగాని-

తే.గీ. కుందనమువంటిమేను మధ్యందినాత
పోష్ణహతిఁ గందె వడఁదాకె నొప్పులొలుకు
వదన మస్మద్గృహమ్ము పావనముఁ జేసి
బడలికలు వాసి చనుమన్న బ్రాహ్మణుండు.

యీలా నిద్దరోతూ వుంటే యేం బాగుంటుంది అనేవారే లోకంలో సర్వత్రా (పామరులలో కాదు మహాపండితులలోనే) కనపడతారు. యీ విషయంలో అనుభవాన్నిబట్టి వొకమాట వ్రాస్తాను. పండితులకంటేకూడా పామరులలోనే (సామాన్యులలోనే అన్నమాట) రసజ్ఞు లుంటారని కనిపెట్టఁగలిగాను. ఆకనిపెట్టడాన్ని బట్టియ్యేవే సుమారు యిప్పటికి నలభైయేళ్లక్రితము యీ క్రింది విధంగా వ్రాయవలసివచ్చింది.

"... ... కేవలు లెందఱునేని కావ్యకృ
ద్భావము నిర్ణయించి రసపాక మెఱింగి సుఖించి మించి వ
హ్వా! వహవా! యటంచు ముదమందఁగ నేరరు, కొద్దికొద్ది ఆ
యా విషయమ్ములన్నియును నారసి లౌకికచాతురీమతి
శ్రీవిభవమ్మునం జెలఁగి చేటున కాకరమౌ నసూయకున్
భావము లొంగనీ కనుభవమ్మున మించిన మిమ్ముబోటి వి
ద్యావిదులౌ రసజ్ఞులకుఁ దద్రసముల్ పొడకట్టు! గాళిదా
సే వచియించెఁగాదె... ... ..."

చాలును. యీ మాలిక యావత్తూ యీవిషయాన్నే బోధిస్తుంది. మొత్తంమీఁద మాటేమిటంటే; యేకవికేనా లోకంలో పెద్దపేరు రావలసివస్తే దానిక్కారణం అతనికవిత్వమందు వుండే శబ్దాడంబర మని మాత్రం అనుకోకూడదు. పోతరాజుగారు తఱుచుగా అంత్య నియమాన్ని మన్నిస్తూవుంటారు.

ఉ. స్వస్తి జగత్త్రయీభవన శాసనకర్తకు హాసమాత్రవి
ధ్వస్తనిలింపభర్తకు నుదారపదవ్యవహర్తకున్ మునీం
ద్రస్తుతమంగళాధ్వర వితానవిహర్తకు నిర్జరీగళ
న్యస్తసువర్ణసూత్ర పరిహర్తకు దానవలోకభర్తకున్.

ఆయీపద్యం లోకోత్తరమైనధారలోనే వున్నా ఆయనకు పేరు తెచ్చినపద్యాలలో యిది చేరవలసి వుండదు. ఆ పద్యాలలో శబ్దవైచిత్ర్యం మచ్చుకు కూడా వుండదు.

ఉ. నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు కృపారసమ్ము పైఁ
జల్లెడివాఁడు మౌళిపరిసర్పితపింఛమువాఁడు నవ్వురా
జిల్లు మొగమ్మువాఁడొకఁడు చెల్వలమానధనమ్ముఁ దెచ్చెనో
మల్లియలార! మీ పొదల మాటున లేఁడుగదమ్మ చెప్పరే?

యీమాదిరి పద్యాలవల్లనే పోతరాజుగారిపేరు కవిమండలంలో సువర్ణాక్షరాలతో శాశ్వతమయిందని సర్వులూ (సహృదయత్వం వున్నవారౌతేనే) అంగీకరిస్తారు. భాగవతం అంతా పరిశీలిస్తే (పోతరాజుగారి కవిత్వభాగంలోనే అనుకోండి) యీలాటి పద్యాలు మహావుంటే ఒక శతమానానికి మించవనుకుంటాను. తావన్మాత్రంతోనే లోకోత్తరమైన పేరు ప్రతిష్ఠలు పోతరాజుగారికి వచ్చేశాయి.

ఆ.వె. అధ్యుఁడొక్కఁడున్న నందఱు పూజ్యులే
లెక్కమీఁద సున్న లెక్కినట్లు
అతఁడుపోవుమీఁద నంద ఱపూజ్యులే
సున్నమీఁద సున్న లున్నయట్లు.

యీ మధ్యకాలంలో యువకవులున్నూ, బాలకవులున్నూ కొత్తపంథాగా కవిత్వాన్ని నడిపిస్తున్నారు. వారు శబ్దవైచిత్రికోసం పాకులాడడం లేదు. అంతేకాదు, యే రసాన్ని పురస్కరించుకొని రచన కారంభిస్తారో దాన్ని పోషించే విభావానుభావాదులలో చాలాభాగం వదులుకొంటూవున్నారు. అంటే యేమన్నమాట? ఒక్కవిభావాన్నే రంగస్థలాని కెక్కించి కొన్ని మాటలు అవేనా యేలాటివంటారు? పారిభాషికాలు గుదిగూర్చి లోకంమీఁదకి వదులుతున్నారు. అసలువారి సహవాసం వుంటేతప్ప ఆ పారిభాషికాలకు పామరులకేకాదు పండితులకున్నూ అర్థమేకాదు. తాత్పర్యమున్నూ తెలియడంలేదు. అసలు ప్రధానానికి యెన్నో బురఖాలు అలంకరించి రంగానికెక్కిస్తే తప్ప తావన్మాత్రాన్నే బయటపెట్టడం జరిగితే అది సహృదయరంజకం కాకపోఁగా అంతతో శాంతించక పరమాసహ్యాన్ని కూడా కలిగిస్తుందని లోకానికి బోధించే విధానం యేలాటిమాటలతో వ్రాయాలో నాకు బోధపడక యేలాగో యీచివరిమాటలు వ్రాశాను. యింతకన్నా స్పష్టంగా వ్రాసేయెడల ఆయా కవులకవిత్వంమాట అలా వుండఁగా నేను వ్రాసినవ్రాఁతే అసహ్యంగా వుంటుందని భయపడ్డాను. కవి తెచ్చిపెట్టే సొగసే కాని అసలులో వున్న దేముంది? "పుట్టమృత్తిక".

శ్లో. స్తనౌ మాంసగ్రంథీ కనకకలశా విత్యుపమితౌ
ముఖం శ్లేష్మాగారం తదపిచ శశాంకేన తులితమ్
స్రవన్మూత్రక్లిన్నం కరిక రశిరస్పర్ధి జఘనం
ముహు ర్నింద్యం రూపం కవిజనవిశేషైర్గురుకృతమ్.

యీ శ్లోకంలో తక్కినదంతా మనకొద్దు, నాలుగో చరణంలోవున్న అంశాన్నే మనం తీసుకోవాలి. కవిపోషణ చేయడంలోనే నాయికానాయకుల అందచందాలుగాని, శీలంవగయిరాలుగాని వన్నె కెక్కి సహృదయులను ఆకర్షించాలి. అట్టిస్థితిలో ఆ పోషణ

మేమీ లేకుండా "యూస్లేసు" అంటూ "త్రోసిరాజని" ప్రధానభాగాన్ని మాత్రం రంగాని కెక్కిస్తే (అడుగుతారూ? యింక అహో! స్వామిరూపమడగనా,) అదిసహృదయాకర్షక మవుతుందని నాకు విశ్వాసం కలగడంలేదు. నేను యీ కొత్తరకం కవిత్వాలు కొన్ని శ్రద్ధగా చదివే అవి అయోమయంగా తోఁచి యీ మాట వ్రాశాను. అందుచేత విభావానుభావాదులు పరిమితంగా (చేదస్తంలేకుండా) వర్ణిస్తూ ప్రధానభాగాన్ని పోషించవలసిందనే నే నభిప్రాయపడతాను. యమకాదులుకూడా యేకొంచెమో కనపఱచడం తప్పుగాదు గాని, వాట్లకే ప్రాధాన్యం యిస్తే మాత్రం ఆ కావ్యం పయికి రాదు, రానే రాదు. వసుచరిత్రలో యెన్నోభాగాలు చేదస్తంగా వున్నవివున్నా ఆచేదస్తాన్ని అధఃకరించతగ్గ కవిత్వభాగాలు కూడా విస్తరించి వుండడంచేతనే ఆకవిత్వం సహృదయ హృదయాహ్లాదకం కావలసివచ్చింది.

సీ. మందయానము నేర్పు నిందిందిరాజీవ
రాజీవరాజ న్మరాళరాజి.

యిందులో వున్న ముఖ్యమైన అర్థం ఆ గిరికాదేవికి హంసలు నడకలు నేర్పుతూ వున్నాయనేది. బాగాలోతుగాపోతే గిరిక నడక మనోహరంగా వుంటుందనియ్యేవే. ఆసందర్భాన్ని యెంతో సొగసుగా కవి పోషించాఁడు. దాన్ని వున్నదున్నట్టే వ్రాసి వూరుకుంటే అదికవిత్వం అనిపించుకోదు, కాని పయిత్య మనిపించుకుంటుంది. యిప్పటి యువకవు లీమాట విశ్వసించరు, తత్తథాస్తామ్. యమకాన్ని ఋతువర్ణనంలోనో అరణ్యసముద్రాది వర్ణనంలోనో వాడి, తనపాండిత్యం చూపించుకుంటే బాగుంటుందని భారవిమహాకవిరచన తెల్పుతూ వుంది. భారవి పంచమస్సర్గ చూడండి. ఆసర్గ యావత్తూ హిమవత్పర్వతాన్నో, మఱోపర్వతాన్నో, వర్ణించినదే. కాళిదాసు కుమారసంభవంలో ప్రథమస్సర్గలో పర్వతాన్ని వర్ణిస్తూకూడా యమకచిత్రకవిత్వాలతో వర్ణించలేదు. దీన్నిబట్టి యీరీతికవిత్వాలు రసస్ఫోరకాలు కావన్నమాట స్పష్టంగా తేలుతుంది. దీన్నిబట్టి చూస్తే యెక్కడాకూడా ఆకవిత్వం అతఁడొప్పుకోఁడని స్పష్టం. చతుర్విధ కవిత్వాలతోటీ నింపినకావ్యాలలోనేనా చివరకు పేరు తెచ్చేవి భావప్రధానంగా చెప్పినపద్యాలే అవుతాయి కాని యితరంకావు. అబ్బాయీ! వసుచరిత్రలో దేదేనా వొకపద్యం చదవవలసిందని యెవరేనా పృచ్ఛచేస్తే ఆవిద్యార్థి రసారసవివేచనకలవాఁడే అయితే,

శ్లో. ఆపద్మోద్భవునోలగంబునకు దీవ్యద్ద్వీపినుల్ నిచ్చరా
రో? పోరో? మతి యెందతేనియును వారున్ మేము సంధింపమో!
యేపద్మాననఁ జూచినన్ జెలియ! ని న్వీక్షించినట్లుండ దే
లా! పల్మాటలు పూర్వజన్మకృతముల్ గాఁబోలు నీ నెయ్యముల్.

(యీ పద్యానికీ, ఆకొండి రామమూర్తిగారికీ, యింకొక వ్యక్తికీ సంబంధించిన చరిత్ర మఱొకప్పుడు వ్రాస్తాను.) యీ మాదిరి పద్యాన్నే చదువుతాండుగాని,

సీ. జనకనేత్ర ఫలంబయిన పాలపాపండు
వరవృద్ధిగాంచు జై వాతృకుండు.

యీ మాదిరి పద్యాన్ని చదవండు. ఆ పద్యం మాత్రం సరసమైనదికాదా? అంటారేమో! సరసమైనదే. అయినా మొదటిదానివంటిదిగాదు. చదివేటప్పటికల్లా అర్థస్ఫూర్తి కలుగుతూ వుంటేనేగాని ఆలాకాని పక్షంలో ఆ పద్యం యెంతరసవంతమైన దైనా సహృదయ హృదయాకర్షకం కాంజాలదు. ఆముక్త మాల్యదలో ఎంతో అలంకారపు సరుకు వుంది. పాకం నారికేళపాకం. అందులోనున్నా కూర్పు డొంక తిరుగుడుకూర్పుగా వుంటుంది గాని, సరళంగా వుండదుకూడాను - అయినప్పటికీ కొన్నిపద్యాలు రసస్ఫోరకాలుగా యేలా పడ్డాయో పడ్డాయి. వాట్లకోసమే ఆ గ్రంథాన్ని చదవవలసి వస్తూవుంటుంది. "నక్షత్రతారాగ్రహసంకులాఽపి జ్యోతిష్మతీ చంద్రమసైవ రాత్రిః" అన్నాండు కాళిదాసు. ఆపద్యాలు కొంచెం రుచిచూపుతాను.

తే.గీ. సంగతియె యోయి! యిసుమంత టింగ ణావు
తత్త్వనిర్ణయవాదంబు తరమె? నీకు
ఓడితేనియు వద్దు మొఱ్ఱో యనంగ
లింగమును గట్ట కుడుగ మెఱింగి నొడువు.

యింకా యీ ఘట్టంలో మఱి మూండు నాలుగు పద్యాలు యిదే పాకంలో నడిచిన వున్నాయి. యిది ద్రాక్షాపాకం. నారికేళపాకంలోకూడా కొన్ని యీలాటియెన్నికకు వచ్చే పద్యాలున్నాయి. కొంచెంచూపుతాను.

మ. తలఁ బక్షచ్ఛటఁ గ్రుక్కి బాతువులు కేదారంపుఁగుల్యాంతర
స్థలి నిద్రింపఁగఁ జూచి ఆరెకు లుషస్స్నాత ప్రయాతద్విజా
కళిపిండీకృతశాటు లంచవి తదావాసమ్ములం జేర్పరే
వులడిగ్గన్ వెసఁబాఱువానిఁగని నవ్వన్ శాలిగోప్యోఘముల్.

యీ పద్యంలో కవిత్వానికి పరమావధిగాఁజెప్పే యావత్తు యోగ్యతలూ పుంజీభవించి వున్నాయి. యిమిడికకు వుదాహరించవలసివస్తే ఆంధ్రకవితా ప్రపంచంలో దీనికి అగ్రతాంబూలం తప్పదు. గ్రంథ విస్తరభీతిచేత యింకా వుదాహరించవలసినవి ఈలాటివి మఱికొన్ని వున్నా విరమిస్తున్నాను. శా. అనిష్యానిది గేహసీమ నడురేయాలించినన్ -

మ.గృహసమ్మార్జనమో? జలాహరణమో-వగయిరాలు చూచుకోండి. కృష్ణదేవరాయలు యింత మంచి కవిత్వం చెప్పేవాఁడే అయినా తఱుచుగా "ఒక్కొక సంకేతము కా కతఁడ రస న్నేఁ గానే" మాదిరి కవిత్వమే చెప్పి వుండడంచేత ఆయన కవిత్వం "లోకులరసనలె యాకులుగా" వుండే తరగతిలోకి చేరింది కాదు - నా యెఱిఁగినంతలో ఆముక్తమాల్యదలో చాలా పద్యాలు కంఠోపాఠంగా వచ్చినవారల్లా కీ. శే. అల్లంరాజు సుబ్రహ్మణ్యం కవిగారు మాత్రమే. వ్యాఖ్యానం సమగ్రమైనది వున్నప్పటికీ ఆముక్తమాల్యదలో పద్యాలు యెన్నో అర్థంకానే కావు - కృత్యాద్యవస్థలో రాయలవారి వంశవర్ణన పద్యాలలో వున్న -

మ. అలుకన్ ఘోటకధట్టి కాఖురపుటీ హల్యన్ ఖురాసానిపు
చ్చలు వోదున్ని ... ... ... జాంగల శ్రేణికిన్.

అనే పద్యంలో కొన్ని సంప్రదాయలున్నాయి. ఆ సంప్రదాయాలు తెలుసుకుంటేనే తప్ప (ప్రతిపదార్థం తెలుసుకొన్నప్పటికీ) అన్యథా దాని తాత్పర్యం కాదు - దానిఫలితార్థం తురుష్కరాజైన ఔదులఖానుణ్ణి కృష్ణరాయలు జయించాఁడని తేలుతుంది. తేలితేమాత్రం లాభమేమిటి? ఖురాసాని పుచ్చలు పోయేటట్టుగా దున్నడమేమిటి? వగయిరా శంకలు నివర్తించడానికి కొన్ని సంప్రదాయాలు తెలియాలి. అవన్నీ తెలిసినతర్వాత ఆపద్యంలో వున్న సొగసు ఆనందజనకం అవుతుంది. ఆ యీస్థితిలో వుండే కవిత్వపాకాన్నే నారికేళపాకం అన్నారు సహృదయులు. కొంత కష్టపడ్డతర్వాత కూడా యేవిధమైన ఆనందాన్నీ కలిగింపని కవిత్వమైతేనో? దానికి పేరేదీ వున్నట్టు లేదు. "తే కే న జానీమహే". అలంకారిక వామనుఁడు చెప్పిన "విచిత్రప్రకారాహి పదానాం ప్రవృత్తిః, వామనయనా, వామోరురితి భవతి, నతు వామవదనా వామచరణేతి" అనే సందర్భాన్ని రాయలు బొత్తిగా గమనించినట్లే లేదు - పదం శాస్త్రసిద్ధమవడమే కావలసింది గాని యితరంతో పని లేదనుకొని ఏ పక్షంలో ఆలాటి శబ్దాల కూర్పు చెవికి కంటకప్రాయంగా వుంటుంది. వైద్య శాస్త్రరీత్యా మూరుకొండ, నేపాళం, కసింత, వగయిరాలన్నీ భక్షణయోగ్యాలుగానే కనపడతాయి, యెందుచేతంటారా? తోటకూర, గోంగూర వగయిరాలకు వ్రాసినమాదిరిగుణాలే వాట్లకున్నూ వ్రాయడం అందఱూ యెఱిఁగిందేకదా? ఆలా వ్రాసినప్పంటికీ జనులకు (రోగంవస్తేతప్ప) అవి అన్నాధారాలుగా యేర్పడలేదు. (రోగికేనా మందుగా యిస్తే యిస్తారేమోగాని కూరగాకాదు) ఆలాగే శబ్దశాస్త్రరీత్యా నిర్దుష్టమైనంత మాత్రంలోనే ఆపదం ప్రయోగార్హం కాదు - దీన్నే నన్నయ్యగారు "ఇహతు ప్రవ్యాహార్యం సంకేతిత సుప్రసిద్ధమేవపదమ్" అన్నారు. ఆలాటి సుప్రసిద్ధపదా లైనప్పటికీ దేనికీ దేనికీ లంకెబాగాకుదురుతుందో దానికీ దానికే సంబంధం కల్పాలి (చందన్కి చందన్మిలేతో)

గాని యితరాలకు కల్పడం కర్ణకటువుగా వుంటుందని వామనుఁ డభిప్రాయపడ్డాఁడు. దీని కింకా వివరణం వ్రాస్తేకాని సర్వే సర్వత్ర యువకవుల మనస్సుకు బాగా యెక్కదు. కాని దానికి తగ్గశక్తి నాదగ్గఱ వున్నట్టు లేదు. తన అభిప్రాయాన్ని యితరులకు యెక్కేటట్టు వ్రాయడమంటే సామాన్యంకాదు, ముఖాముఖీని బోధించడం సుఖంగాని వ్రాఁతమూలంగా బోధించడం చాలాకష్టం. అసలు కవిత్వానికి వున్న చిక్కంతా దీనిలోనేవుంది.

## అనుబంధం

విషయాన్ని సంగ్రహించి, వ్రాయడానికే సంకల్పించి మొదలు పెట్టినా, వార్ధక్యదోషం చేతో యేమో కొంత యితరవిషయంకూడా దొర్లి ప్రధానాంశం మఱుగుపడిందేమో? అని అనుమానం కలుగుతూ వుంది. కనక మళ్లా కొంచెం వ్రాస్తూన్నాను. లోకాదరాన్ని అపేక్షించే కవికి శబ్దచిత్రం యేమీ సాయం చేయదు. కవిత్వానికి కావలసింది అర్థగాంభీర్యంగాని శబ్దగాంభీర్యంగాదు. ఆయీ గాంభీర్యం పద్యాలలోనే యిముడ్చ నక్కఱలేదు. గద్య కావ్యంలోకూడా యిముడ్చవచ్చును. కాని గానసాహాయ్యం పద్యానికే కాని గద్యకు వుపకరించదు. యింతేకాదు, కంఠోపాఠంచేసి తరించవలసిన విద్యార్థిలోకానికి గద్యకంటె పద్యం యెక్కువ సహాయకారి, కనక తఱుచు మనకవులు పద్యమయంగానే కవిత్వాన్ని నడిపిస్తూవచ్చారు. వాల్మీకికి పూర్వం గద్యకవిత్వమే కాక పద్యకవిత్వంకూడా కొంత (వేదంలో నన్నమాట) వుండేది గాని అది యెవరో గాని అందఱూ యెఱిఁగింది కాదు. అందఱూ యెఱిఁగిన ఛందోమయవాఙ్మయానికి వాల్మీకే ఆద్యుఁడు. కనకనే "భువిఁగవితాకన్యఁబుట్టించె నెవ్వాఁడు" అనే ప్రతిష్ఠ వాల్మీక్కి దక్కింది. ఆదికవిత్వంగా యావన్మందిపండితులూ కవులూ గౌరవించే రామాయణంలో యిటీవలికవులు వారి వారి కవిత్వాలలో ప్రవేశపెట్టిన శబ్దచిత్రం కనపడదు, యిది ఆవశ్యక మయినదే అని చెప్పఁదగ్గదే అయితే ఆ మహాముని వుపేక్షించేవాఁడు కాఁడు. వాల్మీకిరామాయణంలో,

శ్లో. రామం దశరథంవిద్ధి మాం విద్ధి జనకాత్మజామ్
అయోధ్యామటవీం విద్ధి గచ్ఛతాత యథాసుఖమ్.

మొదలైనశ్లోకాలకు చెప్పే విశేషార్థాలు యిటీవల వ్యాఖ్యాతల బుద్ధిచే కల్పించఁబడ్డవేకాని కవి యెఱిఁగి వున్నవి కావు. అందుచేత అట్టి క్లిష్టమార్గాలు తొక్కిన కవిత్వం ఆదరణపాత్రంకాదు. భారతంలో కొన్ని క్లిష్టమార్గాలు కనపడతాయి. అవిమాత్రం గ్రంథకర్త యెఱిఁగినవే అని వొప్పుకోక తప్పదు. దానికి శిష్టపరంపరాగతమైన యితిహాసం (విఘ్నేశ్వరునివ్రాఁతకు సంబంధించింది) ప్రోద్బలంగా కనపడుతుంది. ఛందస్సులు

యెన్నివున్నా అనుష్టుప్ఛందస్సుకు సాటివచ్చే ఛందస్సు సంస్కృతంలో లేనేలేదని దాని ప్రాచుర్యాన్ని పట్టే తెలుసుకోవచ్చును. తెలుఁగులో దానికి దీటయినది ద్విపదగానే కనపడుతుంది. రంగనాథుఁడు మొదలైన కవులు కొందఱు ద్విపదనే ఆమోదించి కవిత్వాన్ని నడిపించారు. కాని యేమైనా సంస్కృతంలో అనుష్టుప్ఛందస్సుకు వున్నంత ప్రాచుర్యం దీనికి లేదు. పైఁగా "ద్విపదకావ్యంబు - దిడ్డిగంత" అంటూ తెలుఁగులో యేవగింపుకూడా బయలుదేఱింది. యిది శోచ్యమేకాని పలువురు కవులలోనూటికి వొక్కరూ గౌరవించినవారు కనపడకపోవడంచేత ద్విపద అంతరించిందనే అనుకోవచ్చు. పడమటి దేశంలో ద్విపదరామాయణానికి వున్నంత ప్రచారంలో యెన్నోవంతూ కూడా భాస్కరరామాయణానికి వున్నట్టు లేదు.

> "ఉన్నాఁడు తడవుగా నున్నాఁ డతండు
> మన్నాఁడు నిన్నుఁ దెమ్మన్నాఁడటన్న"

యిారీతిని యెంతో రమణీయంగా వుండే ద్విపదకవిత్వాన్ని యిటీవలివారు "త్రోసిరా" జనడం విచార్యమే. నిన్న మొన్నటినుంచి కొందఱు గేయానుకూలాలు "ముత్యాలసరాలు" లోనైనవి కొత్తవి కల్పించో యేపాటలలోనోచూచో రచిస్తూన్నవారు వున్నా వారేనా యిాద్విపదని పైకి తీసుకురావడంలేదు. యెవరూ దీనికి మొగ్గలేదుగాని మొగ్గేపక్షంలో భారతం యావత్తూ యిాద్విపదలో అనువదిస్తే బాగా వుండే దనుకుంటాను. కవిత్రయంవారు పద్యాలలో అనువదిస్తే మళ్లా మనంకూడా పద్యాలలోనే అనువదించడంకంటే ద్విపదలో అనువదిస్తే చాలా నూతనత్వం కనపడి తీరుతుందని నే ననుకున్నాను. నాబోటి వృద్ధుఁడికి యిావూహపుట్టి ప్రయోజనంలేదుగాని యెవరేనా యువకవులకు యిావూహ పుట్టేటట్టయితే ఆవూహ ప్రయోజనకారిగా పరిణమించి ఆంధ్రానికి వకనూతనాలంకారాన్ని సంపాదించ గలుగుతుందనుకుంటాను. ద్విపద కవిత్వంలో శబ్దచిత్రానికి పాటుపడేకవికికూడా అంత విశేషావకాశం వుండదు కనక ఆయిారచన చాలా అనుకూలంగా వుండడమే కాకుండా "సంస్కృతముం గని గేలి" చేస్తుందనికూడా నేననుకుంటాను. శ్లేష, ద్వ్యర్థి, మొదలైనవికూడా శబ్ద చిత్రాలుగానే పరిగణింపబడతాయి. వీట్లని యెంత తగ్గించివాడితే (నల్ల మందులాగ) కవిత్వం అంతరమ్యంగా వుంటుంది. దీన్ని గూర్చి కాళిదాసాదుల కావ్యాలే మనకు ప్రేరకాలు కనక విస్తరించేదిలేదు. నాకూయమకం చేతనవునుసుమా అని చెప్పడానికో అన్నట్టు కాళిదాసు నవమస్సర్గలో "న నగరం నగరంధ్రకరౌజనః" అంటూ యావత్తుసర్గా అదేమాదిరిగా నడిపించాడు. యింకోటి "కవికంఠపాశం" అంటూ వొకపుస్తకం కనపడుతుంది. అవి శార్దూలశ్లోకాలు. "ఖడ్గీవ త్ఖగరాజవ త్ఖచరవ త్కంఖాణన త్ఖాణవత్"

యీమాదిరి (అర్థశూన్యపు) చతుర్థపాదాలతోనే వుంటాయి ఆశ్లోకాలు. అర్థం లేనివే అని తోస్తుంది. లేకపోయినా నిఘంట్లు దగ్గిఱపెట్టుకొని యెవరేనా చెపితే చెపుతారేమో? చెప్పనివ్వండిగాని అది కాళిదాసుగారి కవిత్వం మాత్రం కాదు. కాళిదాసాదులు తగినంత సామగ్రి వున్నవాళ్లవడంచేత వాళ్లు యమకం నడిపించినా కొంత రసం కనపడుతుంది. యితరుల కవిత్వానికి యీభాగ్యం పట్టదు. మేముచెప్పిన "కాళికాస్తవాన్ని" మెచ్చుకొనే పండితులను చూచినప్పుడు నాకు సిగ్గుగలిగేది. కాళిదాసుగారి "ద్వైపాయన ప్రభృతి" శ్లోకాలకున్నూ మా "నాళీకజాద్యదితి" శ్లోకాలకున్నూ, పోలికేలేదు. అయితే యేమి, మావాట్లకీ పేరువచ్చింది ("పుణ్యైర్యశో లభ్యతే" "అనప్పిండి అమ్మన్నగారిదీ బట్టతల నామొగుడిదీ బట్టతల") కాఁబట్టి పండితులలో కూడా కవిత్వతత్వాన్ని నిర్ణయించే వారు తక్కువగానే వుంటారన్నది నిష్కృష్టాంశం.

"కోవేత్తి కవితాతత్త్వ మీశ్వరో వేత్తివా నవా"

⭑ ⭑ ⭑

# యేది కవిత్వం-2

ఏది కవిత్వం! అని ప్రశ్నిస్తే జవాబుచెప్పడంలో చాలా విప్రతి పత్తులు కనపడతాయి. యేమంటే? భిన్నరుచిర్హిలోకః. కొందఱికి కొన్ని, మఱికొందఱికి మఱికొన్నిన్నీ రుచిస్తాయి. కొందఱు యేదీ తెలియక లోకంలో యెవరిని మెచ్చుకొంటూ వుంటారో తాముకూడా వారికవిత్వానికే వోటు యిస్తారు. కనక పయివిధంగా ప్రశ్నించడంకన్న అనాలోచనపని వుండదనిన్నీ తోస్తుందినాకు; కవికర్ణరసాయనకవి (సంకుసాలకవి) “అవివో! కవితల్” అని తేలికగా అనేశాఁడు. అవంటే; యేవి? అనే ఆకాంక్షకుకూడా అతఁడే వ్యాఖ్యానించాఁడు. “లోకుల రసనలె (నాల్కలె) ఆకులుగా నుండునట్టి యవివో! కవితల్” అన్నాఁడు. ఆయీకవి తాటాకులమీఁద రచనలు సాగించే రోజులలో వాఁడు అని ఆయీ వాక్యమే చెపుతూవుంది. యేకవి కవిత్వం పదిమందికీ కంఠోపాఠంగా వస్తుందో, అదే కవిత్వంగాని తాటాకులలో మురుగుతూవుండే కవిత్వం కవిత్వమేకాదని ఆయీ కవితాత్పర్యం. అయితే యీకవి కవిత్వం ఆయీ లక్షణానికి లక్ష్యభూతంగా వుంటుందా? అనే ప్రశ్నకు అవకాశం కలుగుతూవుంది. కాని చెప్పడం సుళువుకాని, చెప్పినట్లు చేయడం యీ కవికే కాదు యే కవికీ పుస్తకాపేక్షే.

అట్టిస్థితిలో యీతని కవిత్వం నాకు చాలాభాగం కంఠోపాఠంగా వచ్చును. కనక యీయన చెప్పినట్లు రచన చేశాఁడందామా? ఉహు. అది వీలుకాదు. లోకమంటే వొక్క చెల్లపిళ్లేకాదుగదా? దీనికోసమని వోట్లకు బయలుదేఱితే యేమవుతుందో? అందుచేత యింకోకవి కవిత్వాన్ని తీసుకుందాం. (1) సుమతి శతకం, (2) వేమనశతకం, (3) కవిచోడప్ప శతకం యింకా వున్నాయి యీలాటివి. యిందు మొదటి రెండు పుస్తకాలు చిన్నప్పుడు (యిప్పుడుకాదు) బళ్లల్లో పఠింపచేయడం వుండేది. ఆ కారణంచేత అవి కంఠోపాఠంగా చాలామందికి వచ్చి వుండడం సంభవించిందంటే మనమాట బోటవుతుంది. మూడవ పుస్తకంలో బూతులుండడంచేత పామరులు వల్లించివుంటారు. కాబట్టి మఱొక కవిత్వం వెతుక్కోవాలి. యేకవి యీశాసనం చేశాడో ఆకవి కవిత్వం ప్రౌఢపాకంలో వుంటుంది. కొంచెం వుదాహరిస్తాను.

ఉ. పుట్టుగుఁజెట్లకున్ మొలవఁబోసిన విత్తులు శాంతి ముస్తకున్
ముట్టియతోడి జీవములు మోహపు టుర్లకునున్ గుహూనిశల్
... ... ... ... ... ... ... ... కోరికలెవ్వరి నొంప కుండునే.

సమయానికి యావత్తు పద్యమూ జ్ఞప్తికి వచ్చింది కాదు. ఉదాహరించిందేచాలు శైలితెల్పడానికి. మనుచరిత్రపాకానికీ దీనికీ భేదం వుంటుంది.

"ఉ. చేసితిజన్మముల్ తపము చేసితినంటి దయావిహీనతన్
జేసినకర్మముల్ ఫలముఁజెందునె? పుణ్యము లెన్నియేనియున్
జేసినవాని సద్గతియె చేకుఱు భూతదయార్ద్రబుద్ధినో
భూసురవర్య యింత తలపోయవు నీచదువేల? చెప్పుమా?"

యీ రచనలోవున్న ప్రసాదగుణం పుట్టుగుఁజెట్ల, పద్యంలో కనపడదు. కాని కొంచెంపిండివున్న వాళ్లకు ఆనందాన్ని కల్గించడాని కభ్యంతరంలేదు. అయితే కవికర్ణరసాయనంగాని, మనుచరిత్రగాని సర్వసాధారణంగా "లోకులరసనలె ఆకులుగా" వున్నాయని కాని, లేవనిగాని చెప్పగలమా? అధికారి తారతమ్యాన్నిబట్టి వుంటుందిగాని ఆయా విషయం సార్వత్రికమనడానికి అవకాశంలేదు.

పోనీ యిటీవలికవిత్వా లెందుకు? పరమగురువులుగా వుండే కవిత్రయం వారున్నారుగదా వారి కవిత్వాలే పుచ్చుకొని విచారిస్తే యుక్తంగా వుంటుందంటారేమో? అలా విచారించినా భారతంలో యేపర్వంలోవి కాని పట్టుమని పది పద్యాలు వచ్చినవారున్నారా అంటే : వున్నారని ధైర్యంగా జవాబుచెప్పడం కష్టం. భారత పద్యాలకంటే విజయవిలాసం పద్యాలు కంఠోపాఠంగా వచ్చినవారు చాలామంది కనపడతారు. వైజయంతీ విలాసంకూడా ఆలాటిదే. 1. ఉ. మ్రొక్కిన నెవ్వరేమనఁడు 2. ప్రకట జితేంద్రియుల్ (లోనైనవిచూడుడు).

ఆ యీ ఘట్టం యావత్తూ నాకు కంఠోపాఠం. గాని యీ పుస్తకం నావద్ద యిప్పుడేకాదు యెప్పుడూలేదు. యెప్పుడో నెవరివద్దో చూచివున్నాను. తావన్మాత్రంచేత అవి యిప్పటికీ నాధారణలో వున్నాయి. దానికి కారణం నా ధారణా మాహాత్మ్యమంటారా? యీ విషయం చదువరులకే వదులుతూవున్నాను. సంకుసాల మహాకవి చెప్పినమాటకు యీ వైజయంతి లక్ష్యమవుతుందందామా? వెనక చూపిన దోషమే దీనికీ బాధకం.

"నఖలుః సర్వోఽపి వత్సరాజః" అన్నారా లేదా? అలాగే ఎవరో "నఖలు సర్వోఽపి చెళ్లపిళ్లః" అని పూర్వపక్షం చేస్తారు. యిదేవిధంగా మఱికొందఱి కవిత్వాలను వుదాహరించగలను కాని ఆ వుదాహరించడం గ్రంథాన్ని పెంచడానికే కాని ప్రకృతాని కావంతగాని కొంతగాని వుపకరింపదు. కనక పేకేజీ సరుకుమాటలు కట్టిపెట్టి మెల్లిగా ప్రధానాంశాన్ని వుపక్రమిస్తాను. యిప్పుడు యెవరిపేరులు స్పృశించివిడిచానో వారి

కవిత్వాలు లోకోత్తరాలే. యిప్పుడు మనకు చర్చనీయాంశం లోకోత్తరత్వం కాదు, మఱివకటిన్నీ కాదు. ప్రకృత కాలంలో గాంధీ గారి మాదిరిని నూటికి తొంభైతొమ్మిదివోట్లు యెవరికవిత్వానికి వస్తాయన్నది. యీ మాట పాఠకులు బాగాజ్ఞప్తిలో వుంచుకోవాలి. "బమ్మెరపోతరాజుఁ గవిపట్టపు రాజుఁ దలంచి మ్రొక్కెదన్" యీ మహాత్మునికవిత్వం కంఠపాఠంగా చాలా పద్యాలు వచ్చినవాళ్లు అక్షరాస్యులలో పలుమంది కనపడతారు.

మ. మహిమున్ వాగనుశాసనుండు సృజియింపన్గుండ లీంద్రుండు త
న్మహనీయ స్థితిమూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవన్.

అనే పద్యంలో యీ కవిపట్టపురాజుపేరు యెక్కకపోయినా లోకంలో యీయన కవిత్వమే చాలామందికి సంధ్యావందన ప్రాయం. శ్లేషగా రచించే పద్యం. కనక వసుచరిత్రపద్యం, దానిలో అనాగరికంగా వున్న, పోతరాజు పేరుకు చోటు లేకపోయింది. యే భారతకవిత్వానికీ దీనికున్న వ్యాప్తి కనపడదు.

క. వ్యాప్తిం జెందక వగవక
ప్రాప్తంబగు లేశమైన పదివేలనుచున్
దృప్తింజెందని మనుజుఁడు
సప్తద్వీపములనైనఁ జక్కంబడునే.

శా. కారే? రాజులు రాజ్యముల్ గలుగవే? గర్వోన్నతిన్ జెందరే
వారేరీ? సిరిమూటఁ గట్టుకొని పోవన్జాలిరే? భూమిలోఁ
బేరైనంగలదే? శిబిప్రముఖులున్ బ్రీతిన్ యశఃకాములై
యీరే? కోర్కులు; వారలన్ మఱచిరే? యిక్కాలమున్ భార్గవా?

మ. గొడుగో? జన్నిదమో? కమండలువొ? నాకున్ ముంజెయో? దండయో?
వడుగేనెక్కడ? భూములెక్కడ? కరుల్వామాక్షులశ్వమ్ములె
క్కడ? నిత్యోచితకర్మమెక్కడ? మదాకాంక్షామితంబైనమూఁ
డడుగుల్మేరయె త్రోయకిచ్చుటయె బ్రహ్మాండమ్ము నాపాలికిన్.

శా. ఆదిన్ శ్రీసతికొప్పుపైఁ దనువుపై నంసోత్తరీయమ్ముపైఁ
బాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ బాలిండ్లపై నూత్నమ
ర్యాదం జెందుకరంబు క్రిందగుట మీఁదై నాకరంబుంట మే
ల్గాదే? రాజ్యము గీజ్యమున్ సతతమే? కాయంబు నాపాయమే?

యెన్నని వుదాహరించేది? యీ ఘట్టం యావత్తూ చాలా మందికి వచ్చేవుంటుంది. భీష్మస్తవంలోవుండే -

సీ. కుప్పించి యెగసిన గుండలంబులకాంతి... తెరలిచనుదెంచు దేవుండు దిక్కునాకు. వగయిరాలు రానివారెవరు?

"ఉ. ఎవ్వనిచే జనించు జగమెవ్వనిలోపలనుండు ... ..."

వగయిరా గజేంద్రమోక్షం రాని అక్షరాస్యులున్నారా? వీట్లదాఁకా యెందుకు? అసలు గ్రంథారంభంలోవున్న -

తే.గీ. చేతులారంగ శివునిఁబూజింపఁడేని, ... ...

ఆయీ గీతంలో యావత్తు భాగవతరహస్యమూ యిమిడింది. "అమ్మలఁగన్న యమ్మ" పద్యాన్ని చెప్పనే అక్కఱలేదు.

సీ. కమనీయభూమిభాగములు లేకున్నవే? ... ... ... ... ... ...
ధనమదాంధులకొలువేల? తాపసులకు.

"క. ఇందుఁగలఁ డందులేఁడని"

"ఉ. అచ్చపుఁ జీఁకటింబడి"

"మ. కలఁడాకాశమునందు"

"శా. బాలుండీతఁడు కొండదొడ్డది, ... నాకేలల్లాడదు"

ఆ యీ పద్యాలు వోనమాలు వచ్చినవారందఱికీ జిహ్వాగ్రమందే వుంటాయి.

"ఉ. నల్లనివాఁడు ... ... ... ... ... ... ... ... ... ... ... ...
మల్లియలార! మీ దరికిరాఁడుగదా? కృపనుంచి చెప్పరే?"

"ఉ. అంగజునైనఁగాని ... ... ... ... లవంగలుంగనా
రంగములార! మీ దరికిరాఁడుగదా? కృపనుంచి చెప్పరే?"

సీ. వీఁడఁటే? నందుని వెలఁదికి జగమెల్ల
మొగమందుఁ జూపిన ముద్దులాఁడు"

చ. నగుమొగమున్ సుమధ్యమును నల్లని మేనును లచ్చి కాట ప
ట్టగు నురమున్ మహాభుజము లంచిత కుండలకర్ణముల్ మదే
భగతియు నీలవేణియుఁ గృపారసదృష్టియుఁ గల్గు వెన్నుఁడి
మ్ముగఁ బొడకట్టుఁగాక కనుమూసిన యప్పుడు విచ్చినప్పుడున్.

ఆ యీ పద్యం మనస్సులోవున్న భక్తులకు శ్రీకృష్ణమూర్తి ఆకారం సార్వకాలికంగా గోచరించడాని కభ్యంతరం వుంటుందా?

ఉ. నంద తపఃఫలమ్ము సుగుణమ్ముల కందము గోపకామినీ
బృందము నోముపంట సిరివిందు దయాంబుధి యోగిబృందముల్
డెందములందుఁ గోరెడికడింది నిదానము చేరవచ్చెనో
సుందరులార! రండు చని చూతము కన్నుల కోర్కి దీరగన్.

అందఱికీ కంఠోపాఠంగా వుండే పద్యాలని చెపుతూ వుదాహరించడం పునరుక్తిగా పరిణమిస్తుందని యెఱిఁగిన్నీ వుదాహరించడానిక్కారణం నాదోషంకాదు. మురారి, "సతుగుణగణానామపగుణః" అనలేదా? అందుచే విజ్ఞులు క్షమిస్తారు. యెవరు కవిత్వం చెప్పినా యాభై యాఱక్షరాలలోనే. ఒక్కొక్కరి వాణిలో ఒక్కొక్క విధంగా రసం ప్రసరిస్తుంది. రచించే కవికి తన రచన భవిష్యత్కాలంలో లోకానికి యేవిధంగా రుచిస్తుందో తెలియనే తెలియదు. తన్మయుఁడై రచించుకుపోతాఁడు. తక్కిన భారమంతా లోకానిది. భవతు-తెలుఁగు కవులలో పలువురు మహానుభావులు - కవిత్వభిక్షపెట్టినవారు (సీ॥ "నన్నయకవి పెట్టినాఁడు కదా? తిక్కనాదికవీంద్రుల కాదిభిక్ష" చూ.) వున్నా, అందులో పలువురు ప్రాచీనులే అయినా, వారి రచనల ననుసరించే పోతన్నగారు రచన సాఁగించినా, లోకాదరవిషయంలో అగ్రతాంబూలం పోతరాజుగారికి యివ్వాలని నే ననుకుంటాను-

"క. వీరెవ్వరు శ్రీకృష్ణులుగారా" అనే పద్యానికి మాతృక

క. వీరెవ్వరయ్యె? ద్రుపదమ
హారాజులె? యిట్లు కృపణులై పట్టువడన్
వీరికి వలసెనె? యిపుడు మ
హా రాజ్యమదాంధకార మదివాసెనొకో?"

అనే పద్యమే కానివ్వండి. నన్నయ్యగారి కన్న పోతన్నగారు పూర్వుఁడే అయేపక్షంలో మాత్రం ఆ ఘట్టంలో ఆ యీ పద్యం పోతన్న గారికి నడిచివుండదా? చట్టన "గ్రంథచోర్షులుగాని కవులుగారు" అని యీసడించేవారు లోకంలో పలువురుంటారు. వారు ఆ యీ సందర్భాలు కొంచెం పరిశీలించాలి. నే నెవరినీ అనుసరించనని ప్రతిజ్ఞపడితే అది నెగ్గదు. యేమంటే? బుద్ధిపూర్వకంగా కాకపోయినా, యాదృచ్ఛికంగానేనా అనుసరించినట్లు ప్రత్యర్థులు ఋజువుచేస్తారు. అందుకే అనుకుంటాను సంకుసాల నరసింహకవి ఇలా అన్నాఁడు.

చ. హృదయగతిన్ బురాతన కవీశ్వరు లేగని వీథిలేదు నేఁ
దదనుగతిన్ రచించుకృతి తాత్త్వికులన్ గరఁగింప కుండునే
మదగజరాజముల్ చనిన మార్గమునం గడు నింపు నింపవే
మదగజరాజయానమదమంథర బంధుర యానమానముల్.

ఆ యీ మహాకవి ఆక్షేపకులకు చక్కని సమాధానం చెప్పినాఁడు. ఆ యీ విషయం యిదివఱలో యెప్పుడో చర్చించి విడిచినదే, కనక స్పృశించి విడిచాను. నేను సుమారు పదియేళ్లనుండి యేవోవ్యాసాలు వ్రాస్తూనే వున్నాను. ధారణశక్తి 40 యేండ్లవయస్సు నాఁటికే కొంత తగ్గడ మారంభించింది. 'ధారణ నిల్చునా? నిలువదా?' (బందరు శతావధానం చూ.) యిటీవల 75 వత్సరాల ప్రాయానికి యెంత తగ్గి వుంటుందో ప్రాజ్ఞులు పరిశీలింపఁగలరు. అందుచే * పునరుక్తులు పడివున్నాయేమో అని అనుమానం తగులుతూ వుంది.

మళ్లా ప్రధానాంశం అందుకుంటూన్నాను. అందఱికీ ఒకటేవిధమైన అక్షరాలే కవిత్వానికి ఆధారాలుగావున్నా రచనలో కొన్ని రహస్యాలున్నాయి. ఆయాపదాలు కూర్చడంలో వైలక్షణ్యం వుంటుంది. అది ఇదమిత్థం అని బోధించడానికి దొరుకడేదికాదు. అందుచేతే అనుకుంటాను "విచిత్రప్రకారాహి పదానాం ప్రవృత్తిః" అన్నాడు, ఆలంకారిక వామనుఁడు. ఆయీ విషయంలోగల యే వ్యాసంలోనో విస్తరించే వుంటాను కనక స్పృశించి విడుస్తున్నాను. అచ్చంగా తెలుఁగే చెపుతానని కాని, అంతే కాకుండా నిరోష్ఠ్యంగా కూడా చెపుతానని కాని లేనిపోని శృంఖలాలు తగుల్చుకొని కొందఱు రచన సాగించివున్నారు. ఆకాలంలో అట్టి రచనల యందు పాఠక లోకానికి ఆదరం వుండేదేమో అనుకోవాలి. యితరులమాట అలావుంచుదాం. కవిబ్రహ్మంతవానికి కూడా కొంచెం ఆయీ విధమైన

---

* నేను వ్రాసిన వ్యాసాల పత్రికలు యే కొన్నో తప్ప చాలావఱకు పత్రికాఫీసులలోనే తప్ప నావద్దలేవు. కొందఱు భాషాభిమానులు ఆయీనావ్యాసాలు సంపుటాలుగా ప్రచురించే వూహతోవున్నట్టు వింటాను. అది సుఖ సుఖాల నెఱవేరేపనికాదు. ద్రవ్యంమాటలావుండఁగా ఆయీ వ్యాసాలు సేకరించడం చాలాశ్రమతో చేరినపని. ముఖ్యంగా నా వ్యాసాలు - (1) ఆంధ్రవారపత్రిక (2) కృష్ణ (3) భారతి (4) త్రిలింగ (5) ఆంధ్రవాణి యీ అయిదింటిలో పడివున్నాయి. ఆంధ్రదినపత్రికలో కూడా యీ మధ్య కొన్ని పడ్డాయి. యే వొకటి రెండో ఆంధ్ర ప్రభకు పంపినట్లు జ్ఞాపకం. అభినవ సరస్వతిలో అప్పుడప్పుడు పడడం కలదు. ఆ యీ సరస్వతి ఆంధ్రవారపత్రికనుండి గ్రహించి ప్రచురించడమే తఱుచుగా వుంటుంది. ఆంధ్రలోకూడా యేవొకటి రెండో పడ్డాయి. ఆయీ వ్యాసాలు గ్రంథరూపంగా ప్రచురించేవారు - పునరుక్తులుగా వుండే సందర్భాలు పరిశీలిస్తారని నాయాశ. వారికీ యంశం తెలిసివుండడం మంచిదని యీ రెండు మాటలూ ప్రసక్తిగాని ప్రసక్తిగాదీనిలో వ్రాశాను.

రచనలో యేదో విశేషం వుందనే తాత్పర్యం వున్నట్టు ఆయన రచించిన – నిర్వచనోత్తర రామాయణం సూచిస్తూవుంది – వచనం లేకుండా శతకాలూ, అష్టకాలూ, నక్షత్రమాలలూ రచించడంలో కష్టంలేదనిన్నీ, కథా సందర్భం వుండే చరిత్రలు వగయిరాలు చిత్రించడం కష్టమనిన్నీ, అప్పటి కవులనుకొనేవారని తోస్తుంది. వాల్మీకిరామాయణం యావత్తూ పద్యమయమేకదా? ఆయన నిర్వచన రామాయణం అని పేరెందుకు పెట్టలేదో, విజ్ఞులు విచారింతురుగాక – ప్రయత్నం వినాగా అంటే సహజంగా దొర్లే శబ్దాలంకారాలు తప్ప యితర శబ్దాలంకారాలు కూడా శ్రమకు చేటేగాని కవిత్వానికి శోభను తేవు.

శ్లో. పరిపతతి పయోనిధౌ పతంగ
స్సరసిరుహోముదరేషు మత్తభృంగః
ఉపవన తరుకోటరే విహంగో
యువతిజనేషు శనైశ్శనైరనంగః.

అప్రయత్న సిద్ధంగా దొరలడంచేత ఆ యీ శ్లోకంలో వున్న అంత్య ప్రాస హృదయంగమంగావుంది. కవిత్వం యెంతసేపూ భావప్రధానంగా వుంటేనే సంతోష జనకమవుతుందని సహృదయులు చెపుతారు. భారవి మాఘుఁడు మొదలైన మహాకవులు ఆ యీ విషయాన్ని మన్నించేవారే అయినా –

ఏకాక్షర, ద్వ్యక్షర మయాలుగా కొన్ని రచనలు సాగించడానిక్కారణం వారివారి పాండిత్య ప్రకటనార్థంగాని అన్యంకాదు. కంకణబంధంలోనైన రచనలు కేవల పాండిత్యం తెల్పడానికే. రసజ్ఞులు వాట్లని ఆమోదించరు. కాని రాజులు ఆయీ బంధకవిత్వాలకు అక్కజపడి–అగ్రహారాదులిచ్చి సమ్మానించి వున్నట్టు ప్రత్యక్ష నిదర్శనాలున్నాయి. యీసడించడం సుళువుగాని, రచన సుళువుగాదు. ఇది విషయాంతరం. తెలుఁగుకవులలో పోతరాజుగారు, సంస్కృతకవులలో త్యాగరాయాదులు ధన్యులు, వారిని స్మరించువారును ధన్యులు.

"వయంచ కృతిన స్తత్సూక్తి సంశీలనాత్"

★ ★ ★

# రచయితలు

వీరినిగూర్చి కొంచెం వ్రాస్తాను. రచనచేసేవారు రచయిత లనిపించుకుంటారు. రచనా శబ్దార్థము క్రియామాత్రానికి (ప్రతీ పనికీ) వర్తిస్తుందిగాని, యోగరూఢిచే మాత్రము కవిత్వం చెప్పడానికే గాని యితరానికి అనువర్తించదు. కావ్యం అంటే కూడా కవిచేసిన శబ్దరూప రచనకే అనువర్తించడం ఆ యీ యోగరూఢి చేతనే. అయితే, యోగరూఢి అంటే యేమిటి అని ప్రశ్న వస్తుంది. అసలు శబ్దాలు యావత్తూ మూడు విధాలు : యౌగికాలు, రూఢాలు, యోగరూఢాలు – అనే యీ మూడిటిలో చాలా భాగం రూఢాలుగానే చెలామణీ అవుతాయి. రూఢాలు అవయవార్థంలేనివి. డిద్ధుడు, విద్ధుడు, డబిద్ధుడు, అన్న, బల్ల, పుల్ల, కల్ల, చల్ల, చెప్పు, కప్పు, అప్పు, పప్పు, చొప్పు, జొన్న, చిన్న, దున్న, వెన్న ... మొదలైనవి. ఇవన్నీ రూఢములే. యిందులో మొదటి మూడుమాత్రం తత్సమాలు. తక్కినవన్నీ దేశ్యాలు (దేశస్థులు అనాదిగా వాడుకొనుచున్నవి) దున్న అనేదానికి అవయవార్థం (వ్యుత్పత్తి) చెప్పడానికి కొందఱు స్థూలదృష్టులైతే ప్రయత్నిస్తారు (దుక్కి దున్నడానికి వుపకరించే జంతువు) గాని, అది నిలవదు. దుక్కిదున్నడం దున్నపోతులతో పాటుగా గాని, అంతకంటే అధికంగాకూడా గాని యెద్దులుకూడా చేస్తూవున్నాయి కనక, ఆయీ వ్యుత్పత్తి అతివ్యాప్తిదోష దూషిత మైపోయింది.

ఇక యోగరూఢాలను గూర్చి కొంచెం వ్రాసి ప్రధానాంశానికి వస్తాను. యోగం అంటే అవయవార్థం అదికనపడుతూవున్న రూఢశబ్దాలు. అనగా వ్యవహారంలో వున్న శబ్దాలు, ఆ వ్యవహారం పండితుల దేనాసరే, పామరులదేనాసరే, 'మోఱకులం మాకేం తెలుస్తుందడీనీ?' అన్నాడు ఒక పాలికాపు అంతేవాసి, యీ 'మోఱకు' శబ్దం మూర్ఖశబ్ద భవంకనక, తద్భవం, రామ్యుడు. వాడినా గ్రామ్యంకాదు. దేశ్యమంతకు ముందేకాదు. యెందుకు కాదంటే, చాలా వ్రాయాలి. అది ప్రస్తుతంకాదు.

రచన చేసేవారందఱూ రచయితలే, ఆరచన గురుముఖతః అభ్యసించిన గీర్వాణ, లేదా, ఆంగ్లం లోనైన యేభాషలలో నేనా కావచ్చును. యద్వా, పుట్టుకపిమ్మట కొద్ది మాసాలలో (అత్త, తాత, వగైరా) శ్రవణతః సునాయాసంగా అలవడే మాతృభాషలో నేనా సరే, దేన్నిగుఱించైనా కొన్ని పద్యాలో, గద్యలో రచనచేస్తే ఆ వ్యక్తిని 'రచయిత' అని వ్యవహరిస్తారు. క్రియలోమాట, రచయితృశబ్దం కవికి పర్యాయపదంగా పరిణమించి

నట్లయింది. అయితే, లౌకికవ్యవహారానికి సంబంధించిన కోర్టుతీర్పులు, వకాల్తనామాలు, యింకా యెట్సెట్రాలు రచనలనిపించుకుంటాయా? వార్తాపత్రికలలోని - హఠాన్మరణం! పెద్దాపురపు సత్రం వసారానుండి రెండు పిచ్చుకగుడ్లు కిందబడి అసువులు విడిచాయి. జనోపకారం. మా వూళ్లో వచ్చే యేడు యింకో కల్లుదుకాణం పెట్టిస్తారట. కొన్ని యీ మాదిరి వ్రాతలూ రచన లనిపించుకుంటాయా? అని ప్రశ్నిస్తే జవాబు సులభమే కాని స్థలం కొంత వృథాగా ఆక్రమిస్తుంది. రచన అన్నప్పుడు దాని పఠనంవల్ల, లేదా, శ్రవణంవల్ల యేదో మనస్సుకు కొంత ఆనందం కలగాలి. యీలా లక్షణపరిష్కారం చేసుకుంటే మనకు, కోర్టు జడ్జిమెంట్లు వగయిరాలు వచ్చి మామాటేం చెపుతా వని ప్రశ్నించనేరవు. వీన్ని గుఱించి పుష్కరకాలానికి పూర్వం కృష్ణాపత్రికలో 'కవిత్వమంటే యేమిటి?' అనే శీర్షికకింద కొంత వ్రాసినట్లే జ్ఞాపకం.

నిన్న మొన్నటిదాకా రచన వ్యాకరణ సమ్మతంగా వుండాలి అనే ప్రతిబంధకంవుండేది. యిటీవల ఆ ప్రతిబంధకం పూర్తిగా వైతొలగింది. దీన్నిగుఱించి కీ.శే. లు గిడుగు పంతులుగారు స్మరణీయులు. కం. వీ. పంతులుగారి వచనరచన చాలాభాగం వ్యావహారికమే కాని, గిడుగువారి కున్నంత పట్టుదల ప్రస్తుతవిషయంలో కం. వీ. పంతులవారికిలేదు. గిడుగు పంతులుగారి పట్టుదలకు వున్న తాత్పర్యం తోసివేయదగ్గది కాదు.

"కరగాచింది హుళక్కి, ద్రోవదికికో
కల్ మెచ్చి యిచ్చింది, ద

బ్బరకాకాసురునిన్ గటాక్షమునచే
పట్టిం దబద్ధం బహో ... ..."

ఈ పద్యంలో వున్న, కాచింది, యిచ్చింది, చేపట్టింది, అనే మూడున్నూ దిద్దితే కాచినది, ఇచ్చినది, చేపట్టినది, అని యగును కాని మొదటి పాఠాని కున్నంత శ్రవణసుఖం వుండదు. "పన్నెండేలా రాజు రాణువా బొబ్బిలి గమ్మింది." "నూగునూగుమీసాలవారయా నూటి కెలమ దొరలు."

ఆయా వాక్యాలు దిద్దితే యీసొగసు రాదని పంతులుగారి వాదం, ఆయీ వాదం వట్టివాదం కాదనిన్నీ, యీ రచనలు వైద్యజ్యౌతిషములకు సంబంధించిన రచనలవలెనే అర్థప్రధానములు గాని శబ్దప్రధానములు కావనిన్నీ నా మనస్సుకు తోచి నేను పంతులుగారిని ప్రతిఘటించలేదు. బొబ్బిలి యుద్ధాన్ని "జంగంకథ"గా మొట్టమొదట యెవరో (పేరు తెలియదు.) వ్రాశారు. చాలాకాలం తద్ద్వారాగానే దాని ప్రచారం సాగింది. పిమ్మట దిట్టకవి

నారాయణకవివితంసుడు పద్యకావ్యంగా విరచించి కవిలోకానికి విందుచేశాడు. కాని సర్వే సర్వత్రమాత్రం ప్రచారం జంగం కథకే వుండిపోయింది. పెద్దపెద్ద సంస్కృతసమాసాలు వగయిరాలు దిట్టకవిగారి దిట్టతనాన్ని బోధిస్తూన్నాయేకాని, పాత్రౌచిత్యాన్ని పూర్తిగా దూరీకరించి వేశాయి. కాని అట్టి సమాసాలజోలికిపోక రచించిన భాగాలు చాలా హృద్యంగా వున్నాయి.

> "బెబ్బులిమీసమైన మెలివెట్టి తెమల్పగవచ్చుగాని ఆ
> నిబ్బరగండడైన ధరణీపతి రావు నృసింహుడేలు నా
> బొబ్బిలికోటపై జనగ బోల గిరీటికినైన గాదు మా
> అబ్బపదమ్ములాన నిజమాడెద హైదరుజంగు సాహెబూ"

ప్రస్తుతం కాదు గనక, యీ దిట్టకవితల్లజుని స్పృశించి విడుస్తూన్నాను గాని, ఆలాగే కాకపోతే ఖాయన్ని గూర్చి యెంతేనా వ్రాయవలసి వుంటుంది. యీ "దిట్టకవి" అనే గృహనామధేయం యీయనవంశంలో వున్నట్టున్నూ, పిమ్మట యీయన అందులో జన్మించినట్టున్నూ గోచరిస్తూవుంది. అప్పటికి లేనిచో ఆయీ బిరుదం వంశానికి యీయన సంపాదించి అలంకరించినట్లు కవులు సంభావించడానికి యీయనరచన పూర్తిగా తోడుపడుతుంది. విషయం విషయాంతరంలోకి యే కొంచెమో దిగుతూ వుంది. మళ్లా చుక్కాని బిగబడతాను.

పద్యరూపకంగా గాని, గద్యరూపకంగా గాని (వైద్యజ్యోతిషాలవలె, లేదా, కోర్టు జడ్జిమెంట్లవలెగాక) హృద్యంగా వుండేటట్టు యేకొంచెం గొప్పరచన సాగించినా ఆ వ్యక్తికి రచయితల పంక్తిలో స్థానం వుంటుందనేది యిప్పటికి తేలిన పరమార్థం. అయితే, "అధ్యాత్మరామాయణం" యావత్తూ గద్యగాని పద్యంగాని కాక, కీర్తనమయం. గ్రాంథిక భాషగాని వ్యావహారికభాష గాదు. ఆయీ మహాకవికి రచయితలలో స్థానం లేనట్టేనా? అని ప్రశ్న వస్తూవుంది. దీనికి జవాబేమిటి? అంటే, వినండి : ఆయీ రామాయణానికి వచ్చిన దోషమల్లా ఒక్కతాళరాగ సమన్వితత్వమేనా? ఆ పద్ధతిని వాల్మీకి తన రచన శ్లోకరూపంగా సాగించినప్పటికీ శిష్యులు కుశలవులకు రాగతాళ ("కుశీలవౌ కుశలవనామధేయౌ. చూ.) యుక్తంగా ప్రచారం చేయడం నేర్పి, శ్రీ రామచంద్రమూర్తిని సంతోష పెట్టినట్లు ఆ రామాయణంలోనే వుంది గదా? రాగతాళ సంబంధం దీనికెంత బాధకమో దానికీ అంతే కనక "నచ శంకా, నచోత్తరమ్" "అహో! మూలచ్ఛేదీ తవ పాండిత్యప్రకర్షః" ప్రత్యుత, ఆయీదోషం వేదానిక్కూడా సంఘటిస్తుంది. సామవేదాన్ని యజ్ఞంలో ఋత్విక్కులు గానం చేస్తారు. "వేదానాం సామవేదోఽస్మి" గానానికి తలిదండ్రులుగా గౌరవింపబడే ("శ్రుతి ర్మాతా, లయః పితా") రాగతాళసంబంధంవల్ల

రచనకు సర్వథా గుణం కలుగుతుందిగాని, దోషం కలుగదు. కనక, అధ్యాత్మరామాయణ కర్తకు రచయితల పంక్తిలో స్థానం వుండితీరుతుందని చెప్పడానికి యే విధమైన అభ్యంతరమున్నూ నాకు గోచరించడంలేదు. అయితే, వేలకొలదిగా కీర్తనలు రచించిన త్యాగరాయలవారికో అంటారా? అనండి. వినండికూడాను. వారు యెన్నివేలు కీర్తనలు రచించినా గాయకులుగా లోకానికి పరిచితులుగా వుండడమే వారి అభీష్టంగాని, కవులుగా వుండి పరిచితులు కావడం వారి అభీష్టంకాదు. కనక మనం వారినిబలవంతంగా రచయితల పంక్తిలో కూర్చోపెట్టక వేతే స్వహస్తపాకులుగా వుంచడమే నాకు సమంజసంగా తోస్తుంది. అయితే, అన్యబుద్ధి అప్రత్యక్షం గదా? వారికి కవులపంక్తిలో చేరడానికి యిష్టంలేదని మీకేలా తెలిసిందంటారేమో? యిది "స్వానుభూత్యేకమానాయ" ఆ అనుభవం యెట్టిదంటే : నాకు 24 వత్సరాల ప్రాయంలో, అంటే శ్రీ విజయనగరం మహారాజులుంగారి సందర్శనంకూడా చేసినదరిమిలా నన్నమాట.

"అటు గద్వాలిటు చెన్నపట్టణము ... ... ... ... మా
కిట రాజీయకయున్న దర్శనము నింకెవ్వాని కీ రా జొసం
గుట చెప్పంగదవయ్య ... ... ... కోదండరామాభిధా"

(' సందర్శనం, ' చూ.)

గానమందు కృషి చేదామని కుతూహలం కలిగింది. దానికి అవకాశం యెట్టిదంటే, "భార్యా మూల మిదం గృహం" కనక యజ్ఞోపవీతాలు దండిగా ధరించడానికి అనుకూలించే గృహస్థాశ్రమప్రవేశమే గాని అప్పటికి అంతకు మించిన గృహస్థాశ్రమంలో నేను చేరలేదు. వ్యాకరణగ్రంథాలు తరువాయి లేవు. తర్కం మొదలెడితే, త్వరలో తేలదు. అదిన్నీ కాక, కవిత్వానికీ, తర్కానికీ చుక్కెదురు. అందుచేతనే అనుకుంటాను కాళిదాసు "నమః ప్రామాణ్యవాదాయ మత్కవిత్వాపహారిణే" అని వొక నమస్కారం చేసినట్లు పెద్దలవల్ల వినడం. అంతమాత్రమే కాదు, "నో వైయాకరణజ్ఞ మేవ పితరం, న భ్రాతరం తార్కికం" అనివుండడంచేత వావికూడా అనుకూలించదు. గానం యెక్కడి కక్కడికే వుపయోగం. "కూనిరాగం తీయలేని మొగాడూ, కుడుములొండలేని ఆడదీ వుండదు" అని లోకోక్తివుంది. అని చెప్పి గానం అప్పటికే వినికివల్ల కొంత అభ్యస్తమయి వుండడమే కాక, విజయనగరం రాజావారి దర్శనం సుమారు నెల పదేను రోజులవఱకున్నూ కాకపోవడంచేత ("శతఘంటకవనంబు సల్పుటా, ఆనందజనపాలుదర్శనం బనెడివారు... కాని సులభ మటంచు నొక్కరును జెప్ప–రట్టు భవదీయదర్శనం బాచరించి, ధన్యతను జెందె మత్కవిత్వంబు నేడు – శ్రీమదానందగజపతిక్షితితలేంద్ర") వృథాగా కూర్చోవడమెందుకని (క్షణశః కణశశ్చైవ విద్యా మర్థం చ సాధయేత్) ఆ సంస్థానవైణికులలో వొకడున్నూ,

సుప్రసిద్ధులునూ అయిన శ్రీకటు సూరన్న గారివద్ద ఫిడేలు ప్రారంభించి యేవో సరళీ, జంటా మాత్రమే కాదు "సరిమాగరి సరిగరిసా" యింతేకాదు, దుర్వాసుల సూర్యనారాయణ సోమయాజులు గారు రచించిన "రిప్పామ గరిసరి మ్మా" "యిటుజూడరా" యిత్యాదులు అభ్యసించాను. ఆ టయిము నేను గానానికి వినియోగిస్తే, మాతిర్పతిశాస్త్రి తర్కం అభ్యసించడానికి వినియోగించాడు. అదీ యిదీ యే కొంచెమో అన్న స్థితిలో వుండగా శ్రీరాజావారి దర్శనం కావడం, సన్మానం జరగడం వగయిరాలు సందర్భనంలోనూ, జాతకచర్యలోనూ చూచుకోండి. ప్రసక్తానుప్రసక్తంగా చాలా దూరం వచ్చాం.

సంగీతాన్ని అభ్యసించడానికి మైసూరు శ్రీవీణ శేషన్నగారివద్దకు ప్రయాణం కట్టడానికి వారి పరిచయం గద్వాలాదులలో వారి శిష్యుల ద్వారాగా నైతే వుందిగాని, ఆయీ పరిచయం నాకు వుపకరించడానికి బదులు అపకరించేటట్టు కనపడి ప్రయాణం ఆగిపోయింది. అపకరించడానిక్కారణం వివరించనక్కఱలేదుగాని, అయినా కొంచెం సూచిస్తాను : ఈ సంగీతాభ్యాస కుతూహలం నాకు కలిగేటప్పటికి ఆంధ్రదేశంలో తి.వెం. కవులంటే యెఱగని వారులేరు. అట్టి స్థితిలో సంగీతానికి గురు శుశ్రూష చేయడానికి వెడితే గురువుగారు యితరులతోపాటు చేర్చుకొని (శుశ్రూష) చేయించుకుంటారా? విద్యాభ్యాసానికి యేర్పడ్డ మూడిటిలో (శుశ్రూష, సమృద్ధిగా ధనప్రధానం, ఒక విద్య తనది యిచ్చి వారిది మఱివకటి స్వీకరించడం) శుశ్రూషవల్ల సంపాదించిన విద్యే శోభిస్తుంది.

చ. గురుకులవాసమున్ జరిపి కూరిమి మాధుకరమ్ము వారముల్
జరుపుచు, అమ్మ గాని యొక సాధ్విని 'అమ్మ!' యటంచు, 'బా' బటం
చొరులను గొల్చి నేర్చితిమి యొండొకశాస్త్రము ... ...

(గుంటూరిసీమ)

అందులోనూ, గానానికి చేసే శుశ్రూష (ఉపచారం) మఱీ విలక్షణంగా వుంటుంది. తంబురాపట్టుకుని గురువుగారివెంట తాడుతోదబ్బనంగా సభలకు వెళ్లడం, అప్పుడప్పుడు అంట్లతప్పేలాలు తోమడం - యీ పనులుగాక గురువుగారి నీర్కావిదోవతులు వుతకడం యివన్నీ చేసినా గురువుగారి వెంట తంబురా మీటడం తప్ప స్వరజ్ఞానం మర్మం విడిచి తెలియఁజెప్పే గురువు లెక్కడో గాని, వుండరనే వినడం. భవతు.

ప్రధానాంశం విడిచి చాలాదూరం వచ్చాం. ఆయీ శుశ్రూషలు చేయించుకొనే గురువులు వున్నట్లు వినడమే కాని, నాకు తటస్థించలేదు. యింగ్లీషువిద్యార్థి బూట్సుకాళ్లతో వచ్చి క్లాసులో కూర్చుంటాడు. ఆ మాదిరిగా మాత్రం మన విద్యలు అభ్యసించే విద్యార్థులు వుండరు.

ప్రకృత మేమిటంటే, నేను సంగీతం అభ్యసించడమంటూ వస్తే స్వస్వరూపాన్ని గోపన (కర్ణుఁడు మాదిరి) చేయవలసి వస్తుంది. అది యే కొలదికాలమో దాగినా 'యింగువ దొంగతనం'గా పరిణమిస్తుందేమో అని భయపడి మానుకున్నాను. ఒకవేళ ఆయాచిక్కులన్నిటికీ అంగీకరించి, గాయకాగ్రేసరుఁడుగా తయారైనా గతంలో వున్న కవిత్వ ప్రయుక్తమైన నామరూపాలకంటె యెక్కువ నామరూపాలు దీనివల్ల కలగవు– అని ఆయీ వుద్యమాన్ని విరమించుకున్నాను.

సారాంశ మేమంటే : త్యాగయ్యగారు రచయితల పంక్తిలో కూర్చోవడానికి తగ్గ ప్రజ్ఞా విశేషం కలవారే అయినా, వారి ప్రధానవిద్య (గానం) అందుకు అంగీకరించదు. ఆలాగే– 'గోచివెట్టకమున్న వచ్చిన కవిత్వం' నాకున్నూ అడ్డు తగులుతుందని భయపడ్డానంటే విశ్వసించనివా రుండ రని భయపడుతూ వ్రాస్తున్నాను. త్యాగయ్యగారు గద్యంగాని, పద్యంగాని అస్మదాదులకంటే హృద్యంగానే కట్టగలరు గాని, వారికి అంతకుమున్ను స్వాధీనపడివున్న గానం దీనికి ప్రాధాన్యస్థితిని రానీయదు. అస్మదాదులవంటి రచయితలు యెన్ని కోట్లయినా వొక త్యాగరాయలు కారన్నది పరమార్థం. ఆ మహానుభావుణ్ణి గౌరవించడానికి మనం రచయితల పంక్తిలో స్థానం కల్పించడం సదుద్దేశ ప్రయుక్తమే అయినా, తుదకది అన్యథాగా పరిణమిస్తుంది కనక, వారికి యీ స్థానం వద్దంటాను నేను. లోగడ వికారి సంవత్సరంలో కాసీంకోట జమీందారుగారి తోబుట్టువు వివాహానికి శ్రీయుతులు పోలవరపు జమీందారుగారు, కిర్లంపూడివారు లోనైన జమీందార్లు, యింకా మఱికొందఱు విచ్చేశారు. దానికి కిర్లంపూడి వారితో మేం (తి. వెం.) కూడా వెళ్లడం తటస్థించింది. హరికథా పితామహుఁడు నారాయణదాసుగారు కూడా వచ్చారు. దాసుగారిని వినడమేగాని, అప్పటికి మేం చూడలేదు. ఆయనతో యెవరు యే విధంగా చెప్పి వున్నారో తెలియదు, మమ్మల్ని యీవిధంగా ప్రశ్నించారు ఆయన; "ఏమయ్యా, వేంకటశాస్త్రీ, మీరు నన్ను కవిగా అంగీకరిస్తారా? గాయకుఁడుగా అంగీకరిస్తారా?" అని ప్రశ్నించేటప్పటికి "మీరు హరికథ కాగ్రేసరులు, హరికథకులకు గానప్రజ్ఞా వుండాలి, కవనప్రజ్ఞా వుండాలి. యింకా చాలా ప్రజ్ఞలు వుండాలి. మీరు అన్ని విద్యలకూ నివాసస్థానంగా మాబోట్లు చెప్పుకుంటారు". ఈరీతిగా యెన్నిసార్లు నిష్కపటంగా నేనుచెప్పినా అలాకాదు, యేదోవొక విద్యను నిర్ధారణచేసి చెపితేనే గాని నామనస్సుకు సంతుష్టిలేదు, అని పట్టుకొని వేధించేటప్పటికి గత్యంతరంలేక 'మీకు నిరుపమానత్వం రావలెనంటే గానంలో వస్తుంది గాని, కవనంలో రాదు. కారణం కవులలో మీవంటి వారు మఱికొందఱు దొరుకుతారు. గానంలోనో, మీ గాత్రమువంటి గాత్ర మాధుర్యం 'న భూతో న భవిష్యతి' అనేటప్పటికి ఆయనకు చాలా కోపం వచ్చింది. తోక తొక్కిన పాముగా పరిణమించి తిట్టడంకూడా జరిగింది. యిటీవల మళ్లా కొలదివత్సరాలలో స్నేహితులమైనాం. నే నంటే చాలా ప్రేమగా

చూచేవారు. నాకంటే సుమారు పదేళ్లు ఆయన పెద్ద. నావలెగాక యావజ్జీవమూ బలిష్ఠుఁడుగా, సుఖిగా కాలం వెళ్లబుచ్చిన మహనీయుఁడాయన. చెప్పొచ్చే దేమంటే : దాసుగారు కూడా త్యాగయ్యగారి వలెనే రచనాశక్తి కలవారైనా, వారి పంక్తిలో చేరుటకు సందేహిస్తారు. కొందఱు "ఏకవిద్యా సురక్షితా' అన్న శ్లోకానికి వుదాహరణంగా వేదమో, శాస్త్రమో కృషిచేస్తారు. వారితో దానిలో వాదోపవాదాలు పెట్టుకుంటే చాలా విద్యలలో కృషిచేసినవారు వోడిపోతారు.

పూర్వకాలంలో "సుబ్బ్రత్రయ" మంటూ వుండేవారు. వారిలో ఒకరు తనికెళ్ల సుబ్బన్నశాస్త్రులుగారు. వీరు తర్కశాస్త్రంలో ప్రత్యేకించి కృషిచేశారు. యీ పేరు కలవారే యింకొకరు అక్షంతలవారు. యింకొకరున్నారు గాని వారింటిపేరు సమయానికి జ్ఞప్తికి రాలేదు. యీ ముగ్గురిలో ఒక్కరికి యింకొక్కరు తీసిపోరు. కాని నవద్వీపంలో (యీ వూరు కలకత్తా ప్రెసిడెన్సీ) యేమో చెప్పలేం. యితరత్ర వాదనసమర్థులు లేరని చెప్పుకుంటారు. తనికెళ్లవారికీ, కొవ్వూరిగోపాలశాస్త్రుల్లు (యీయన షట్ఛాస్త్రవేత్త) గారికీ లేటు శ్రీ పిఠాపురంరాజావారు వాదోపవాదాలు పెట్టినప్పటి గాథ కొలదివత్సరాలనాడు యేదో వ్యాసంలో వ్రాసే వున్నాను.

రచయితలు యేవిధంగా వుంటారో, రచనామాత్రం దానికి సాధకమైనా గద్యపద్యాత్మక రచనే సాధకంగాని తాళరాగయుక్తమైన రచన సాధకం కాదని వ్రాస్తూ, యెందుకు కాదో నాకు తెలిసినంతలో వివరించాను. ప్రకృతకాలంలో శ్రీయుతులు హరినాగభూషణంగారు గానం ప్రధానంగానూ, సంస్కృతాంధ్రభాషలే కాక యింగ్లీషుకూడా అప్రధానంగా కృషిచేసి సంస్కృతాంధ్రాలలో కొంతరచన సాగించినవారే. పనిపడితే యీయన ఫిడేలుతో సభకు వస్తారుగాని, కలమూ, కాగితంతోటీ రారు. అభిమానించి యీయన్ని రచయితల పంక్తిలో చేర్చి నాల్గుమాటలు అభినందన ప్రయుక్తాలే అందాం-వ్రాస్తే, ఆయన అంతరాత్మ సంతసింపదనే నేను అనుకుంటాను.

"పిళ్లః కవి రహం విద్వాన్" అన్నారట అప్పయ్యదీక్షితులు. పిళ్లంటే వేదాంతదేశికులు, కవితార్కికసింహః, ఈయన అప్పయ్యదీక్షితులవంటి విద్వాంసుఁడు కాడా? ఆయన వేదాంత దేశికులవంటి కవిన్నీ కాడా? ఉభయులయందున్నూ ఉభయప్రజ్ఞలూ కేంద్రీకరింపఁబడి వున్నా, వారివారికి అభిమానవిద్యలు వేఱుగా వుంటాయి. యేదో కొంచెం వ్రాసి ముగించాలనుకుంటే కొంత చేదస్తంగా పెరిగినట్లుంది. చదువరులుక్షమింతురుగాక. పూర్వంకన్న వ్యావహారికభాషకు శృంఖలాలు తెగినతర్వాత రచయితల సంఖ్య పెరగడం ముదావహమ్. "అస్మద్గోత్రం వర్ధతామ్."

★ ★ ★

# అన్నీ కవిత్వాలేనా?

కావు. నిశ్చయంగా కావు. కానేకావు. కవిగా జనించినవాఁడు తోచిందల్లా గిలుకుతూనే వుంటాఁడు. గృహస్థు బిడ్డల్ని కనడంలేదా? ఆలాగే కవిన్నీ, అందులోనూ, యిందులోనూ కొంతమాత్రమే నాణెమైన సరుకు బయలుదేఱుతుంది. "పుత్రులు తన కుద్భవించినఁ గురూపులు కాఁగలరంచు భార్యతోఁ గలయిక మానునే?" చెట్టుకాచిన కాయలన్నీ మంచి రుచిగా వుండడం అసంభవం. ఆ యీ హేతువుచేతనే అనుకుంటాను పూర్వవిమర్శకులలో వకాయన భారత భాగవత రామాయణాలేకాక కాళిదాసాది మహాకవుల కావ్యాలుకూడా బాగా వడపోసి తుదకు "ద్విత్రాఏవ కవయః, ద్విత్రాణ్యేవ కావ్యాని" అని వూరుకున్నాఁడు. యీమాట లోకానికి యెంతేనా కంటకంగా వుండేమాట సత్యమే. అయితే మాత్రం యథార్థం చెప్పఁదలఁచుకొన్న విజ్ఞుఁడు జంకి తన అభిప్రాయాన్ని దాఁచుకుంటాఁడా? వాల్మీకి యిరవై నాలుగువేలు, వ్యాసులవారి తక్కిన రచనలను వదులుకొన్నప్పటికీ వొక్కభారతమే సపాదలక్షగదా? యింకా కవులెన్ని యెన్ని వేలూ లక్షలూ వ్రాశారో! అంతటివాఙ్మయంలో ద్విత్రాణ్యేవ, అంటే యెవరికి రుచిస్తుంది. యీమాట వ్యాసులు వొక్కచేతి మీఁద యింత వ్రాస్తే ఆపరిశ్రమనేనా ఆలోచించక చులాగ్గా చేతనైనదే కదా అని "ద్విత్రాణ్యేవ" అంటే పరిశ్రమ యెఱిఁగిన యేవిజ్ఞులు విశ్వసిస్తారు? అయితే కవిత్వానికీ, గానానికీ, వంటకీ కావలసింది మాధుర్యమా? లేక పరిశ్రమా? ఆపద్యం రచయిత కష్టపడివ్రాశాఁడో? అలాకగానే వ్రాశాఁడో అదంతా యెవరిక్కావాలి? తుట్టతుదకు తేలేది రసారస విశేషం. "సాధ్యోహి రసో యథాతథం కవిభిః".

యీవిచారణలోకి దిగితే అది యింతలో తేలేది కాదు. ఆయీ నాలుగుమాటలూ యెందుకు వ్రాయవలసి వచ్చిందంటే; యీమధ్య కొన్నాళ్లనుంచి ఆఁగి వున్న ఆదిశైవ పత్రిక మళ్లా ప్రచురింపఁ బడుతూవుంది. అందులో రెండుచోట్ల మృత్యుంజయస్తవాలు వున్నాయి. రెండోది చదివేటప్పటికి మనస్సులో యేమో భావాలు స్ఫురించాయి. యేవో కొన్ని మాటలు వ్రాద్దామని కలం చేతపట్టేటప్పటికి ఆపద్యాలు వ్రాసినకవి మావాఁడే అయినాఁడు. అయితే మాత్రం యేలా మానేది? ఉబ్బసపుపీడ మాధవపెద్ది సుందరరామయ్యకవికే కాదు మఱొకవికే కలిగితే కలుగుతుందనుకుందాం. ఆపీడ యింతటి

లోకోత్తరమైన కవిత్వంగా పరిణమించడమంటూ వుంటుందా? అనుకున్నాను. మళ్లా ఆలోచించుకొంటే యీవిధంగా తోచింది. యేమీ? కరుణాశూన్యులైన బోయవాళ్లు చేసే ఘోరకృత్యాలు చూచి యెంతమంది దుఃఖించరు, వాళ్ల దుఃఖమంతా వాల్మీకి దుఃఖంవలెనే రామాయణంగా పరిణమించిందా? లోకమంతా కవి యెన్నటికీ కానేరదు. కొండల్లోపుట్టే రాళ్లన్నీ వజ్రాలవుతాయా? కావు. కవికి అనుభూతమైన రోగమే కాదు, భోగమే కాదు, త్యాగమే కాదు, ఆగమేకాదు, యాగమే కాదు, రాగమేకాదు, యోగమే కాదు, సర్వమూ కవిత్వంగానే పరిణమిస్తుందని నే నప్పుడప్పుడు అనుకుంటూ వుంటాను. దీన్ని యేకొందఱో విశ్వసిస్తారు. కాని సర్వే సర్వత్ర విశ్వసింపరు. ఆయీ నాభావాన్ని మాబుచ్చిసుందర రామయ్య మాధవపెద్ది బలపఱచినందుకు ఆనందిస్తూ అతణ్ణి బాధిస్తూవున్న వుబ్బసం యిఁకముందు శత్రువునైనాసరే యెవణ్ణీ కూడా బాధించకుండా వుండడానికి శ్రీమృత్యుంజయుణ్ణి నేనుకూడా ప్రార్థిస్తూ వున్నాను. నేను స్వయంగా కాకపోయినా (ఆత్మావైపుత్రనామాసి) ఆయీపీడ అనుభవించినవాణ్ణే. కొంత కవిత్వం చెప్పినవాణ్ణే. కాని మాశిష్యుఁడి కవిత్వానికీ నాదానికీ యెక్కడికెక్కడ? నాపద్యం వుదాహరించి పిమ్మట మాశిష్యునికవిత్వాన్ని వుదాహరిస్తాను.

> మ. తమకుం దగ్గని దానిఁ గోరుదురు సంతానంబు నెప్పట్లఁ బ్రా
> జ్ఞమతుల్; దగ్గెడిదాని నెట్టి కుమతుల్ గాంక్షింప రట్లొటనో
> యమ? యిందుం గలశ్లేష శ్లేష్మరుజయందైనన్ సమర్థించినా
> కొమరున్ దగ్గనివానిఁ జేయు మది నాకున్‌జాలుఁ గామేశ్వరీ.

సుందర రామయ్యపద్యం చూడకుండా దీన్ని చూస్తే యిదిన్నీ కొంత బాగానే వుంటుంది. యిందులో తగ్గనిదానిన్ దగ్గనిదానిన్ శ్లేష శ్లేష్మ ఇత్యాదులలో కొంత చమత్కారం లేకపోలేదు. యిఁక శిష్యుని ఉబ్బసం చూడండి. యెప్పుడో మా తిరుపతిశాస్త్రి యెవరినో హేళన చేస్తూ, “దగ్గో? కవిత్వమో? తాత్కాలికంబగు సన్నిపాతంపుఁ బ్రసారమొక్కొ” అన్నాఁడు. ఇప్పటికి మాసుందరరామయ్యదగ్గు మంచికవిత్వంగా పరిణమించి అతని వెక్కిరింపునకు భంగం తెచ్చింది. తెస్తేతెచ్చిందికాక, వాణ్ణిబాధిస్తే బాధించిందిగాక మంచికే కారణ మయింది చూడండి యీపద్యం.

> మ. సరిలే మానవకోటియీవెలుపలన్ సంసారచక్రాననే
> దొరలన్ లేకిటులుండ, లో నొకటి రెండున్ గావు షట్చక్రముల్
> వరుసం బేర్చి బిగించినావు గద అబ్బా! నాగపాశాలతో
> దరియింపన్ వశమౌనె? నీకరుణచేతంగాక మృత్యుంజయా.

యీ పద్యం శిష్యుఁడు ప్రకటించిన ఆరుపద్యాలలోను అయిదోది. యిందులో యోగశాస్త్రం కొంతవుంది. చట్టన తాత్పర్యం గోచరించదేమో. అందుచేత ముందుగా వుదాహరించాను. కవికి కల్గినబాధను యిది తెలుపుడుచేస్తుంది. యీపద్యంకూడా రసవంతమే అయినా నేను యెత్తినపీఠికలోని అంశాలను సమర్థించడానికి యిది చాలదు. యీ పద్యాలు చదివి చూడండి.

మ. ఒక బిల్వార్చనయేని వీఁడెఱుఁగునో? ఒక్కొక్కటే యొంటిమీ
దికి నిన్నేఁడులు వచ్చి యొక్క శివరాత్రిగాని వీఁడుండెనో
మొక మేలాగునఁ జెల్లి వాడెఱచెడిన్ మోక్షమ్ము నిమ్మంచు నేఁ
టికి నాఁమ్రొక్కినమ్రొక్కె చాలు ననుకొంటే తప్పు మృత్యుంజయా.

యీ పద్యం మొట్టమొదటిది. దీనిలోవున్న స్వారస్యాన్ని వివరించవలసివస్తే యీకాగితాల కఱవుదినాలలో యేపత్రిక భరిస్తుంది. రేషనింగు కంట్రోలు రోజులివి. కడుపునిండా తిండీ, ప్రస్సునిండా కాగితాలూ వున్న రోజుల్లో అయితే బాగుండేది. శాంతం పాపం-ప్రతిహత మమంగళం-ప్రకృత మనుసరామః.

"ఏకబిల్వదానతోఽపి । తోషిణే నమశ్శివాయ
స్తోకభక్తితోఽపి భక్త । పోషిణే నమశ్శివాయ.

పైవాక్యాలు శ్రీశంకరాచార్యులవారివి, నమ్మికగలవారిపట్ల మృత్యుంజయ స్తవము పనిచేయుటకు సంశయంలేదు. నేను ఆ యీ స్తవమువల్లనే వార్ధక్యమును కొంతసుళువుగా నెట్టుచున్నాను. "కవనార్థంబుదయించితిన్... మృత్యువు జయింతున్ దానిచేన్" అని నే వ్రాయగల్గితిని. తప్పక శివస్తవము పనిచేసి తీరును. ఇది నే ననుభవించి వ్రాసెడిమాట. శిష్యుఁడు సోమరి యయ్యు నన్ననుసరించుట శ్రేయస్కరము. మృత్యుంజయుఁడు వీని ననుగ్రహించి సుఖిగాచేసి వీనిచే పెక్కు మహాకావ్యములు రచింపించుఁగాక. దీనితాత పద్య మింకొకటి చూపుతాను.

మ. ఒక లంబోదరుఁడైన పుత్రకుఁడు మున్నున్నట్టిదే నీకుఁ జా
లక కాఁబోలును సృష్టిఁ జేసితివి యీలంబోదరుంగూడఁ దీఁ
గకుఁ గాయల్ బరువౌన కాని కుడుముల్ గల్పించి యవ్వాని కే
లొకొ? యివ్వానికి నొక్కమైని యిడుమల్ మొల్పింతు మృత్యుంజయా.

యీపద్యంలో వున్న చమత్కారం కవి నెప్పుడేనా చూచివుంటేనే కాని సుగమం కాదు. లంబోదర పదం వాడుకోతగ్గంత స్థూలకాయుఁడు కాఁడుగాని మొత్తంమీఁద

శుష్కకాయుల తరగతిలో చేర్చడానికి వాని దేహప్రకృతి వొప్పుకోదు. లంబోదరత్వం ఆయాసపుదగ్గువాళ్లకు మఱింత బాధకం. నాపద్యంలో తగ్గు దగ్గు, వలెనే యితనికి యిడుమలూ కుడుములూ కొంతవుపకరించాయి. మాగోదావరీతీరంలో కుడుములు కల్పించడంకంటే యిడుమలు కల్పించడమే మంగళంగాభావిస్తారు. కుడుములు చాలా అమంగళ ప్పిండివంటల్లో చేరుతుంది. విఘ్నేశ్వరుఁడికి చవితినాడు నివేదించేవాట్లను మా తీరస్థులు వుండ్రాళ్లంటారుకాని కుడుము లనరు. శాంతం పాపం. యిడుమలు బాధకములైనను "జీవన్ భద్రాణి పశ్యతి" కదా? అయిాసంప్రదాయాలు మండలభేదానికి సంబంధించినవి. యిఁక యీ విచారణవద్దు. యీ పద్యంలోకూడా చాలా మంచికవిత్వం వుంది. యింకోపద్యం కూడా వుదాహరించి విరమిస్తాను.

> మ. నరజన్మం బెటు లిచ్చితో పశుపతీ; నాకంటెఁబశ్వాదులున్
> మెఱుఁగే యెన్నివిధాలఁ జూచినను; స్వామీ! ముందు చేజాఱు నీ
> పొరఁబాటున్ సవరించుకోనయిన సద్బుద్ధిన్ బ్రసాదింప వి
> త్తెఱఁగౌ పాలన యిందె కాని మఱి యెందే నున్నె మృత్యుంజయా.

యీ పద్యం లోగడ వుదాహరించిన పద్యాలన్నిటినీ తలదాఁటుతూ వుంది.

ఆమయపీడలో వుండికూడా పరమేశ్వరుణ్ణి నెపపెట్టి ఆయనయెడల తప్పు నిరూపించి జ్ఞానాన్ని సంపాదింపయత్నించినట్లవుతూ వుంది గాని, లేశమున్నూ దైన్యాన్ని వెలిపుచ్చినట్లు తోచడంలేదు. గతించినపద్యాలు వ్యాధినిగూర్చి వ్యాకరించాయి కనక యీపద్యంలో ఆవిషయాన్ని స్పృశింపక "ప్రారబ్ధం భోగతో నశ్యేత్" అనే అభియుక్తోక్తికి వొప్పఁజెప్పి పారమార్థికానికి వుపకరించే జ్ఞానాన్నేనా అనుగ్రహించవలసిందని చాలా బెట్టుసరీగా యేదోముష్టి అంటారే ఆవిధంగా యాచించినట్లయింది. అలంకారికులు 'ద్విత్రాణ్యేవ' అన్న వాక్యానికి యీలాటిరచనలే వుదాహరణం అవుతాయి. తక్కినవి యతిప్రాసల కర్చేగాని కవిత్వాలనిపించుకోవు. ప్యాకేజీసరుకే విస్తరించి వుంటుందిగాని యే కాలంలోనూ కూడా యీలాటి రచన తక్కువగానే వుంటుంది.

'యతియుం బ్రాసయుఁ గూర్చుమాత్రం గవియే?' అంతమాత్రము చేతకవి కాదనిన్నీ అది కవిత్వం కాదనిన్నీ పలుచోట్ల వ్రాసివుండడమే కాదు యితరుల రచన వుదహరిస్తే వారివారికి కోపంవస్తుందేమో అనియేదో అవధానంలో తప్పనివిధిగ రచించిన మాపద్యాన్నే "సెనగపిండి యుల్లిపాయ చిన్నిమిరపకాయలున్ జొనిపి ... ... పకోడి ... ... ఖాద్యమై" అనేదాన్ని వుదహరించి వున్నాను కూడాను. ప్రస్తుతం యెవరి కవిత్వాన్నిగూర్చి యీ నాలుగు మాటలూ వ్రాయవలసివచ్చిందో ఆ స్వయం వ్యక్తుడు మాధవపెద్ది బుచ్చి

సుందరరామయ్య నావద్ద కొంతకాలము శుశ్రూష చేసినవాడు. కాని జన్మతః కవి. శిష్యాభిమానంకింద నా ప్రశంస జమకడతారేమో? చదువరులు యీశంక కవకాశం లేకపోదుగాని అక్కడక్కడ యింకా రసగ్రహణపరాయణు లున్నారని నా నమ్మిక. వారు యథార్థాన్ని గుర్తించితీరుతారు. "శ్రీ వెలయంగ సత్కవిత జెప్పెడివాడన" అని ప్రారంభించి కొన్ని విశేషాలు యేకరువెట్టి, పెట్టి తుట్టతుదకు "కొంటెలలోన గొంటెయున్ గావలె" అని ముగించబడింది. మాబుచ్చి సుందరుడు నిజానికి కొంటెవాడు కాదుగాక అతని ప్రకృతిలో యితరులకు కొంటెతనం గోచరిస్తుంది. బాధ పడేటప్పుడు కూడా దాని అధికారం అది చలాయించడంవల్ల అది యితనికి సహజమని ప్రాజ్ఞలోకం మన్నించి క్షమించాలి. యితడు నాశిష్యుడని చెప్పేమాటలు కావివి. బహుయోగ్యుడు. రాముని పేరితనికి పెట్టినందుకు ఆమహామహునియందున్న గుణాలలో ప్రధానగుణాలు నితనియందు కొన్ని వున్నాయని నేననుకుంటాను. ఇతడితరభాషాపదాలు వాడడంలో దిట్టకవి నారాయణ కవికి దీటంటే చాలదు. యింకా వొకమెట్టు పైనే వుంటాడు. "డాక్టరైనఁ గొమ్ములు దిర్గుయాక్టరైన" ఇత్యాదు లితనికవిత్వంలో రసోచితంగా దొర్లుతూ వుంటాయి - పొదిగించుకోవడం, స్వర్గాన్నుండి వూడిపడడం, విశేషించి కలగడం, కర్ణకుండలాలతో పుట్టడం, వగైరారచన ఆంధ్ర కవిత్వం పుట్టిన తేదీ మొదలు నేటివరకు యే కవిన్నీ చేయనేలేదేమో అని నే ననుకుంటాను. సినిమా యాక్టర్లు రసజ్ఞులే అయితే యితనివల్ల పొందిన వుపకారానికి యేదో సభచేసి శక్తివంచనలేకుండా సమ్మానించి ఋణం తీర్చుకుంటారని నేనభిప్రాయపడతాను. ఇతనివల్ల వారిపేరు శాశ్వతమయింది. తారాపదం సార్థకం చేశాఁడీ స్వయంవ్యక్తుడు. పోతే సినీమాలు పోవచ్చు వాట్లకోసం కట్టిన హాల్సుపోవచ్చుఁగాని మా బుచ్చి సుందర రామకవిరచనకెల్ల శిరోభూషణం, వ్యంగ్య కవిత్వానికే శిరోభూషణం, వేయేల? ఆంధ్రకవిత్వానికే శిరోభూషణం, "కవచకుండలాల" పద్యం మాత్రం పోదు. యీ బుచ్చికవికి కవచకుండలాలు బహుమతీ చేసిగాని నిద్దురపోరు రసికులని నా వూహ. ఆనాటికర్ణుఁడు యీ నాఁడు వుంటేనా? మజాఖా తెలిసేది. ఇది విషయాంతరం. ప్రస్తుతం శిష్యుడు పడుచున్నబాధ మృత్యుంజయుడు కనిపెట్టి తన అరిష్టవార కత్వాన్ని, (అరిష్టవారక శ్శంభుః) సార్థకపఱచుకొని యింకను అనేకగ్రంథాలు క్రొత్తపోకడలతో నితనిచే రచింపఁజేసి యనుగ్రహించుఁగాక అని ఆశీర్వచిస్తూ దీన్ని ముగిస్తున్నాను.

శిష్యుణ్ణిగూర్చి ప్రశంసించడం తప్పని యెరుఁగనివాణ్ణి కాను. యెటిగిన్నీ చేసినతప్పుగా దీన్ని ప్రాజ్ఞలోకం మన్నిస్తుందని సాహసించి మనస్సులో దాచుకో లేక యీ నాలుగుమాటలు వ్రాశాను. యే నాల్గురోజులో శిష్యుఁడైనంతమాత్రంలో వాఁడు లోకం మెచ్చేకవిత్వం

చెప్పఁగల వాఁడై వుంటే, గురువు మూకీభావం వహించడంగాని లేదా లోకానికి వ్యతిరిక్తంగా వాణ్ణిగూర్చి వుపన్యసించడం లేదా కేన్వాసింగు చేయడం గాని అది యుక్తంగా వుంటుందా? కనక గురువు తన సదభిప్రాయాన్ని ప్రచురించడమే యుక్తమని నాతలఁపు. రసారసవిచారం పట్ల గురుత్వ శిష్యత్వ జన్యత్వ, జనకత్వాదులు అకించిత్కరాలు. యెవరేనా సరే గుణముంటే మెచ్చవలసిందే అని నా సిద్ధాంతం – 'మురారే స్తృతీయః పంథాః".

(షరా) వొకమాట ముఖ్యమైనదే మఱచాను, చాలామంది శిష్యులు నా మాదిరి చదువుతారు. యితఁడో నావలె మోహనరాగం కాక నాదనామక్రియా రాగంతో చాలా హృద్యంగా చదువుతాడు. నేను మాత్రం యితని మాదిరిని నాదనామక్రియతో చదవలేను. యీ శిష్యుడు సమానానాముత్త మశ్లోకోఽస్తు, ఇత్యాశీః. స్వస్తి.

★ ★ ★

# రాజ్యలక్ష్మి

పై పేరుతో వున్న వొక క్రొత్తనాటకమును గూర్చి కొన్నిమాటలు వ్రాస్తాను. నిన్నటిరోజున రాజమండ్రి హిందూసమాజములో మాటామంతీ ఆడుకుంటూ కూర్చున్నప్పుడు శ్రీయుతులు ఆంధ్రభీష్మ బిరుదాంకితులు శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులవారు కూడా అక్కడికి దయచేసినారు. శ్రీ పంతులవారు, శ్రీ నందూరి బంగారయ్య (వకీలు) గారిని ప్రశంసిస్తూ "మీ నాటకమును శాస్త్రుల్లుగారికి చూపినారా? అది యీలాటివారు తప్పక చూచి మెచ్చుకోదగింది" అనే అభిప్రాయమిచ్చే మాటలు పలికినారు. వెంటనే బంగారయ్యగారు తమ గృహమున కెవరినో పంపి ఒక పుస్తకాన్ని తెప్పించి నాకు యిచ్చినారు. నావోపిక "నానాటికి తీసి కట్టు నాగంభొట్టూ" అన్నస్థితిలో వుండడంచేత నిన్నరాత్రి చదవడానికి మొదలుపెట్టి ముగించలేక పోయానుగాని గ్రంథమందుండే సందర్భశుద్ధివగయిరా యేలాగేనా చదివితీరాలనే దీక్షను కలిగించడంచేత యీవేళ పూర్తిగా ప్రత్యక్షరశోధగా చదివి యెన్నడూ యేనూతన కవుల పుస్తకాన్ని చదివిన్నీ పొందనంతటి పరమానందాన్ని పొందఁగలిగాను. మృచ్ఛకటిక యెంత సందర్భశుద్ధి కలిగివున్నదో యిదికూడా అంత సందర్భశుద్ధిన్నీ కలిగివుందని వ్రాయడానికి జంకను.

కులస్త్రీలు నాటకరంగాలెక్కుటకు యెవో కొన్ని షరతులతో గ్రంథకర్త మెత్తబడడం తాత్పర్యంగా స్థూలదృష్టులకయితే తోస్తుందిగాని, మొత్తం తాత్పర్యం అదికాదన్నట్టు పరిశీలకతాదృష్టితో వివేచనచేస్తే, ప్రతివారికి గోచరిస్తుంది. స్త్రీలు నాటకరంగాలలో అభినయించడం యీ గ్రంథకర్తకు లేశమున్నూ యిష్టం లేదనే అంశం మిక్కిలి మృదువుగా బోధించిన యీకవిత్వ ప్రౌఢిమను యెంత వర్ణించినా తనివి తీరదు. యీయన శుద్ధఛాందసుఁడు కాకపోయినప్పటికీ ప్రస్తుతవిషయంలో ఆఛాందసుల అభిప్రాయాలే సర్వథా శ్రేయస్కాములకు ఆదరణీయాలుగా యీ నాటకంలో చిత్రించి వున్నారు. కులస్త్రీలు నాటకాలలోనూ, సినీమాలలోనూ అభినయపాత్రలుగా వుండవచ్చునని వాదించేవారు తీరా అది తమకు సంబంధించవలసి వచ్చేటప్పటికి యేస్థితికి రావలసి వస్తుందో యీయన బహు మృదువుగా బోధించారు. యింతమాత్రంచేత ప్రపంచకం మంచి స్థితికి వచ్చి

తనపొరపాటుకు పశ్చాత్తాపపడుతుందని చెప్పడానికి వీలులేదుకాని పాశ్చాత్య విద్యావ్యాసంగంలో ఆరితేరిన యీ నాగరిక కవిశిఖామణి వ్రాసినదగుటచేత యీ సాంఘిక నాటకము అస్మదాదులు వ్రాసేదానికంటె యెక్కువ లోకాదరానికి పాత్రంకాగలదని నానమ్మకం.

యీ నాటకంలో యెక్కడాకూడా "పేకేజీ" సరుకు నాకు కనిపించనేలేదు. ప్రధానపాత్ర రాజ్యలక్ష్మి శీలమును యెంతచక్కఁగా కాపాడవలెనో, అంత చక్కఁగానూ కాపాడుతూ కూడా భర్తప్రవర్తన అన్యథాగా వున్నప్పుడు భార్యాప్రవర్తనకు భంగం కలగడానికి వుండే అవకాశాలను మిక్కిలీ చక్కఁగా కనపఱిచిన యీకవినేర్పు చాలా ప్రశంసనీయం. అనేక గాథలు వున్నప్పటికీ అంతర్నాటకానికి సారంగధర చరిత్రను పుచ్చుకొని జగన్మోహనరావుకు బుద్ధి చెప్పడం యెంతేనా వర్ణనీయం. జగన్మోహనరావు తల్లిగారి అంత్యదశలో అతణ్ణి ఖండాంతరానికి పంపడం వగయిరాలు ప్రస్తుతకాలంలో పుత్రవంతు లనిపించుకొనే వారికి చెప్పినట్లయింది. రాజ్యలక్ష్మి శీలసంరక్షణవల్ల పురుషులలో వున్నంత అవినీతి యిప్పటికిన్నీ మన భరతఖండంలో స్త్రీలలో లేదనిన్ని, వాళ్లమూలకంగానే భరతఖండపు యోగ్యత యింకా అంతో యింతో నిల్చివుందనిన్నీ స్ఫురింపచేసి నట్లయింది. యీ అంశం వాచ్యంగాకూడా గ్రంథకర్త తేల్చివున్నాడు.

ఆంధ్రనాటకాలు ప్రారంభించి సుమారు యాభై, అఱవై యేళ్లు కావచ్చిం దనుకుంటాను. పురాణకథలను యితివృత్తంగా పుచ్చుకొని కొందఱు నాటకాలు వ్రాసివున్నారు. యేకొందఱో స్వకపోల కల్పితగాథలు పుచ్చుకొని కూడా వ్రాసివున్నారు. ఆయా నాటకాలన్నీ అభినందనీయాలుగానే వున్నాయి, కాని యేవొక్క వాక్యంగాని వ్యర్థంకాకుండా సార్థకంగానే వున్న నాటకాలు స్వతంత్ర రచనలలో దొరకడం కష్టసాధ్యం. సంస్కృత రచనలలో వుండదాని కభ్యంతరంలేదు. అందులో శాకుంతలమంటే ఉత్తర రామచరిత్రమంటే సరేసరి. మృచ్ఛకటికమాట చెప్పనే అక్కఱలేదు. మన బంగారయ్యగారి నాటకరచనకు పునాది యిప్పటినవనాగరికుల తొందరపాటు కృత్యాలే అని నేననుకుంటాను. వారివారిని చక్కని మార్గంలోకి తిప్పడానికి గ్రంథకర్త చేసిన వుపాయము మిగుల కొనియాడ దగినది. పోతరాజుగారి–

ఆ.వె. పొలఁతి దావవప్పి పురుషుఁ డాజ్యఘటమ్ము<br>
కదియకుండరాదు కదిసెనేని<br>
బమ్మయైనఁ గూఁటుఁ బట్టకమానఁడు<br>
వటున కింతిపొత్తు వలదు వలదు!

అనే పద్య తాత్పర్యంలో గ్రంథకర్త తాత్పర్యం పూర్తిగా యేకీభవిస్తూవున్నట్టు యెన్నో అక్షరాలవల్ల గోచరిస్తుంది. మొదట జగన్మోహనరావును చెడదీసిన బాలవితంతువునుగూడా తుదకు బాగుజేసినపద్ధతి మన ప్రాచీన నాటక సంప్రదాయంగా కనబడుతుంది. అప్పుడు పశ్చాత్తాపం పుట్టడంకూడా కొంత అభినందనీయమే కాని అంతమాత్రంచేత అట్టిస్త్రీలకు మన పూర్వనాగరికత సంఘంలో చోటు నివ్వదు. కాని ఆపె తత్త్వం కూడా అసలు మంచిదే అయినా యీ నాటకకళావ్యామోహంచేత చెడ్డట్టు వ్యంగ్యమర్యాదయా తేల్చినట్లయింది. యీలా విమర్శించి తేల్చవలసివస్తే యెన్నో విశేషాలు యీ రాజ్యలక్ష్మిలో బయలుదేఱతాయి. మొత్తం మాత్రం దీనివల్లతేలేసారం కులస్త్రీలు నాటకరంగాలకు పనికిరారు. అనఁగా నాటక రంగంలో యితర పురుషులతో ఆయాభాగాలు నటించినపిమ్మట శీలాన్ని చెడఁగొట్టుకోకుండా వుండడం కలలోవార్త అనేదే యిందు తెలుసుకోదగ్గది. శీలమే అక్కఱలేదు కులస్త్రీల కనేవారుతప్ప తదితరులు యీ భావాన్ని శిరసావహిస్తారు. కనక యీ నాటకము సామాన్యంగా అన్ని పక్షాల వారికిని ఆమోదపాత్రమని నే నభిప్రాయపడతాను.

ఆయీ గ్రంథకర్త అభిప్రాయాన్ని వ్యాసాలమూలకంగా బోధించడంకన్న దృశ్యప్రబంధమూలకంగా బోధించడంలో చాలా సౌలభ్యం వుంది. వెనక శ్రీకృష్ణ మిశ్ర అనే మహావిద్వత్కవి శిష్యుఁడికి వేదాంత వాసన బొత్తిగా పట్టకపోవడానికి చాలా విచారపడి తుదకు దృశ్యప్రబంధమూలకంగానే శిష్యుణ్ణి బాగుచేసినట్లు వినికి. దానిపేరే "ప్రబోధ చంద్రోదయం." యీ యువకవి మాగ్రామ సమీపంలోవున్న రాజమండ్రీ నివాసియే అయినా నిన్న మొన్నఁటిదాఁకా నాకీయనతో పరిచితిలేదు. సుమారు వత్సరన్నఱనాఁడు నేనూ గురువుగారున్నూ వాదోపవాదాలు ప్రకటించుకుంటూ వున్నప్పుడు మా మా లోపాలోపాలను యెఱిఁగి వుండిన్నీ యెందఱో పెద్దలు మౌనంవహించి "మన కెందు" కని వూరుకున్న సమయంలో తల కంటగించుకొని సాహసించి యీయన "గాండీవ" పత్రికలో - "పరువా? ప్రతిష్ఠయా" అంటూ పెద్దశీర్షిక పెట్టి కొన్ని మందలింపు వాక్యాలను వ్రాసి వున్నారు. ఆ వ్యాసంలో యేశతాంశమో "జయంతి" లో వుదాహరించికూడా వున్నట్లుజ్ఞాపకం. చెప్పొచ్చేదేమిటంటే? సత్యం వచించడంలో యీయనకు సాహసం చాలా మెండు. వారేమనుకుంటారో, వీరేమనుకుంటారో, అనే సంకోచం లేదు. వున్నదున్నట్టు వ్రాయడమే యీయనపని. వెనకటిరోజుల్లో శ్రీ కం. వీ. పంతులుగా రొకరు యిట్టి సాహసం కలవారుండేవారు. మళ్లా ప్రస్తుతమీయన కనపడుతూన్నారు. ఆలాటిసాహసమే లేకపోతే

యీ రోజుల్లో 'కులస్త్రీలు నాటకరంగాల కెక్కడం మంచిదికాదు. నాటకప్రదర్శకులలో బాహుళ్యంగా శీలసంరక్షణం మృగ్యం, వారికి తాగుడు యెక్కడోతప్ప వుండి తీరుతుంది;' యీ లాటి విశేషాలను బోధించే నాటకం వ్రాయడం తటస్థిస్తుందా? యీలా యే ఛాందసుఁడేనా వ్రాస్తే వాణ్ణిపట్టుకుని దులిపేయరా? యీలాటి యథార్థాన్ని మృదుమధుర శైలిలో నాటకం వ్రాయడం చేఁతకాదేమోకాని యీ యనకు వున్న పవిత్రమైన అభిప్రాయాలు వున్నవారు నవనాగరిక యువకులలో పలువురు వున్నారు. వృద్ధులలో వున్నారని చెప్పనే అక్కరలేదు. శ్రీన్యాపతి భీష్మలవారు పనికట్టుకొని దీని నంతగా ప్రశంసించడమే వృద్ధుల అభిప్రాయాన్ని తెలుపుతూ వుంది. శ్రీయుతులు చిల్కమర్తి కవిగారు సంఘసంస్కర్తలై వుండిన్నీ దీన్ని మిక్కిలిగా మెచ్చుకోవడం నేను నిన్న సమాజంలో విని వున్నాను. నవీన సంస్కర్తలమాట చెప్పలేనుగాని వృద్ధసంఘ సంస్కర్తలకు దీనిలోవుండే అంశాలు అభినందనీయాలని దీనివల్ల తెలుసుకోవలసి వచ్చింది.

"ప్రతిక్షణ విజృంభణాత్" అనే శ్లోకార్థంలాగ యిప్పుడు అన్ని విషయాలున్నూ క్షణేక్షణే మార్పు చెందుతూ వున్నాయి. ఆ మార్పులకు తలా తోఁకా వున్నట్టు తోఁచదు. దారీ తెన్నూ అంతకంటే కనపడదు. యిట్టి రోజుల్లో యే ఛాందసులో యే మూలోకూర్చుని యెవళ్లువింటే యేంచిక్కు వస్తుందో అని భయపడుతూ గొణుక్కోవలసిన విషయాన్ని యే శ్రవ్య కావ్యంగానో వ్రాసి యేమూలో దాచవలసిన దానికి పబ్లీకుగా నాటకమంటూ వ్రాసి యెవళ్ల మనస్సుకూ నొప్పితగలకుండా వక కార్యాంశాన్ని బోధించిన యీకవి ధన్యుడు, మాన్యుఁడు, యీయన ప్రవృత్తిసర్వథా వసుచరిత్రలో భట్టుమూర్తి చూపిన వొక విషయాన్ని జ్ఞప్తికితెస్తూవుంది.

> శా. మాయాశీలురు చంచలాత్ము లనుకంపాశూన్యు లాత్మైక కా
> ర్యాయత్తుల్ సమయానుకూల రచనావ్యాపారగోపాయనో
> పాయజ్ఞుల్ మగవారలాపయి మహీపాలు ర్మహావైభవ
> శ్రీయోగాంధులు చెప్పనేల మగవారి న్నమ్మగా వచ్చునే?

యీపద్యంలో కృతినాయకుడైన శ్రీ తిరుమల రాయుణ్ణి యెంతో మృదువుగా మందలించినట్టు కనపడుతుంది. యీలాగే మనబంగారయ్య గారు క్రొత్తలోకాన్ని అనఁగా మందలించతగ్గలోకాన్ని మందలించారు. మందలింపు మందలింపుగాకాక మిక్కిలి శ్రోత్రపేయంగా వుందికూడాను. నన్నయితే యీయన అభిప్రాయాన్ని అడగలేదుగాని నా అంతట నేనేదీన్ని తోఁచి వ్రాశాను. అదిన్నీ కాక అడిగితే యిచ్చేది యీలా వుండనే

వుండదు. దాని కేర్పాటుగావున్న మాటలు యేర్పాటుగానేవుంటాయి. అవి మనియార్డరు ఫారాలలాగ అచ్చువేసి వుంచుకున్నా వుంచుకోవచ్చును. యీలా వ్రాయనక్కఱే లేదు. యీ గ్రంథకర్తరీతి చూస్తే చాలా అభివృద్ధిసూచకంగా నాకు తోస్తూవుంది. భగవంతుడు నా అభిప్రాయంతో యేకీభవించి యీయనకు సర్వథా శ్రేయఃప్రదాతయగుఁగాక.

★ ★ ★

# కవిత్వమూ-బ్రాహ్మణత్వమూ

కవిత్వం-బ్రాహ్మణత్వం ఈ రెంటికీ చుట్టతిక ముందునా? అనఁగా, కవిత్వసామగ్రిలో బ్రాహ్మణత్వంకూడా వొకటా? అని ప్రశ్నించేవారు యిప్పుడు పలువురున్నారు. దీనిక్కారణం అప్పకవీయం. ఆపుస్తకంలో కవినిగూర్చి వ్రాస్తూ "ధరణీసురుఁడు ప్రశాంతుఁడు" అంటూ ఆరంభించఁబడింది, దానికి యేదైనా సంస్కృతంలో మూలంవుందేమో అని వెదికితే అహోబలపండితుఁడు "సత్కులీన శ్శుచి ర్దక్ష శ్ఛందో వ్యాకరణాదివిత్" అని యేదో ప్రాచీనశ్లోకం వుదాహరించాఁడు. అందులో వున్న "సత్కులీన" శబ్దానికి అప్పకవిపద్యంలో వున్న "ధరణీసురుఁడు" తెలుఁగేమో? గుఱికి బారెఁడు హెచ్చుతగ్గుగా అప్పకవిఅనువాదం సరిపోతుంది గాని బ్రాహ్మణేతరులలో చాలామంది (సంస్కృతంలోసహా) కవులుండడంచేత ఆలక్షణనిర్వచనం దోషదూషితం కాకతప్పదు. సత్కులీనత్వమనేది బ్రాహ్మణులకే కాదు, బ్రాహ్మణేతరులకుకూడా కాణాచే. కులోచితధర్మములను చక్కఁగా పాటించే యేకులస్థుఁడుగాని సత్కులీనుఁడుగా వ్యవహరింపఁ బడతాఁడు. అయితే అప్పకవికి బ్రాహ్మణేతరులు కవులుగావుండడం యిష్టంకాదని అతనిపీఠికలోని మఱొక పద్యం తెలుపుతుంది. అతని కాలంనాఁటికి బ్రాహ్మణేతరులలో కవులు లేరేమో అనుకుంటే అదీ పొసఁగదు. కువిందుఁడు, భోజరాజునాఁటివాఁడు. సుప్రసిద్ధ సంస్కృతభాషాకవిగా అతని రచనే సాక్ష్యమిస్తుంది. "హేసాహసాంక! కవయామి వయామియామి" "త్వంకారయుక్తాహి గిరఃప్రశస్తాః" ఇతఁడు తంతువాయి (సాలె) కులజుఁడు. కుమ్మరికులస్థురాలు మొల్లకూడా అప్పకవికి పూర్వురాలేకదా. కృష్ణదేవరాయలు అప్పకవికి పూర్వుఁడే అయినా అతని ఆముక్తమాల్యదలో పెద్దన్నగారి పద్యాలు (వంశవర్ణనకు సంబంధించినవి) వుండడంచేత ఆగ్రంథమంతా పితామహుఁడు రచించినట్లే అభిప్రాయపడ్డాఁడు మన అప్పకవి.

వేదశాస్త్రముల విషయంలో బ్రాహ్మణేతరులలో సుప్రసిద్ధులు మృగ్యులుగాని కవితారచనలో మృగ్యులుగారు. వేదానికి స్వరబాధ, శాస్త్రానికిదురవగాహత్వపీడ యివి అధికారిమృగ్యత్వహేతువులు. అప్పకవిపద్యంలో వున్న "ధరణీసుర" శబ్దం లక్షణయా ద్విజత్వపరం చేసికొని సమన్వయించుకుందా మన్నాభట్టుమూర్తివగైరాలు శూద్రులుగానే పరిగణింపఁబడతారు. భటరాజులకు యజ్ఞోపవీతా లున్నా ఆచారాలు శూద్రాచారాలే.

యేవిధంచేత చూచినా కవి ధరణీసురుఁడుగానే వుండాలనే లక్షణనిర్వచనం యుక్తంగా కనపడదు. ఆ విశేషణం మాత్రమే కాదు "ప్రశాంతుఁడు" అనేది కూడా బాధించేదే. కవులు వేములవాడ భీమకవి వగయిరాలు శాంతులుగారు.

"చ. గరళపుముద్దలోహ మవగాఢ మహాశనికోట్లు సమ్మెటల్
హరునయనాగ్ని కొల్మి యురగాధిపు కోరలు పట్టుకార్లు ది
క్కరటి శిరంబు దాయి లయ కాలుఁడు కమ్మరి వైరివీర సం
హరణగుణాభిరాముఁడగు మైలము భీమన ఖడ్గసృష్టికిన్."

భీమకవిగారి యింటిపేరు మైలమువారే అనియు, వేములవాడ అనేది నివసించే గ్రామాన్ని బట్టి నచ్చిన పేరనిన్నీ తెల్విడి. ఆయీ వేములవాడ నైజాంమండలంలోనూ ఉంది, గోదావరిజిల్లాలోనూ ద్రాక్షారామ దాపున వుంది. భీమకవి అక్కడివాఁడా యిక్కడివాఁడా అనే చర్చ లోఁగడ చాలామంది చేసి విరమించారు. ప్రస్తుతం మనక్కావలసింది భీమన ప్రశాంతుఁడేనా అనేదే.

"ఉ. పెండెలనాగి చెక్కులను ... రామకవి కుంజరు హస్తము ...
యీకసుమాల ధారుణీమండలనాథుఁబోలు ... ... ... ..."

(ఇది తురగావారిది.)

అప్పకవినిర్వచనం అతివ్యాప్త్యాదిదోషగ్రస్త మవడమట్లుండఁగా అహోబల పండితుఁడు వుదాహరించిన "సత్కులీన శ్శుచి ర్దక్షః" అనే దానిలోవున్న సత్కులీన విశేషణార్థాన్ని కూడా కవిత్వం అపేక్షిస్తుందని నియతంగా చెప్పడం పొసఁగదు. పదకవిత్వమో, పద్యకవిత్వమో, జంగంకథలు వగైరాలో అల్లేవాళ్లు చిరకాలాన్నుంచి వున్నట్లే ఆయారచనలు సాక్ష్యం యిస్తాయి. కులాభిమానప్రయుక్తమైన పోట్లాటలు కాపులకీ, బ్రాహ్మలకీ వున్నాయంటే, ఆవివాదాలు బ్రాహ్మలలో బ్రాహ్మలకే శాఖాభేదప్రయుక్తంగా కనపడుతూ వున్నప్పుడు జాత్యంతరులతో వుంటే ఆశ్చర్యమేమిటి? వైదికులకీ, నియోగులకీ మళ్లా వారిలో అవాంతరులకీ యీదురభిమానాలు వుంటూనే వున్నాయి. ఆయీ పోట్లాటలకి జంకి కవిత్వం బ్రాహ్మలనే కాని అన్యులనే కాని ఆశ్రయించి, యితరులను అస్పృశ్యులనుగా భావించి నిరసిస్తుందనడానికి యేప్రాజ్ఞుఁడూ సమ్మతింపఁడు. కవిత్వమూ గానమూ యివి వొకరి సొత్తులు గావు, అందటివీని. సహజంగా పుట్టేవి. "శ్లో. గాంధర్వంచ కవిత్వంచ... సహజా గుణాః" వేశ్యజాతిలో కన్న మిన్నగా భాంవేషం వినిపించే పాత్రలు కడజాతిలో వున్నారు. యిప్పుడే కాదు కృతయుగంలోకూడా యీఅంశాన్ని ధ్రువపఱచాలంటే హరిశ్చంద్రో పాఖ్యానం తోడ్పడుతుంది. వేశ్యజాతిలో స్త్రీలూ పురుషులూ మహాకవులే వున్నారుగదా?

యిటీవల లక్షణనిర్వచనం అతివ్యాప్త్యాదిదోషదూషితంగా పాడయిందిగాని పూర్వలాక్షణికు లేర్పఱచింది చూడండీ యెంత చక్కగా వుందోను :

శ్లో. శక్తి ర్నిపుణతా లోకశాస్త్రకావ్యాద్యవేక్షణాత్
కావ్యజ్ఞ శిక్షయాభ్యాస ఇతి హేతు స్తదుద్భవే.

ఇందులో కులాలప్రసక్తిలేదు. శాస్త్రపదం వున్నా అదివుంటే విద్వత్కవి అనిపించుకుంటాఁడు, లేకపోతే "శుద్ధసురన్నది రుద్రరూపమై" మాదిరిని రచించే కవి అనిపించుకుంటాఁడు, పూర్వం కవిత్వం చెప్పేవాళ్ళకు భాషాపాండిత్యం ఆవశ్యకంగా వుండేది గాని యిపుడు నవ్యసాహిత్య పరిషత్తు ఆపీడ వదిల్చింది. కాని హరిజనకవులు చెప్పే కవిత్వాలు నిర్దుష్ట భాషలోనే కనపడుతూ వున్నాయి. నేను ప్రత్యక్షంగా కొన్ని కవిత్వాలు చూచే యీమాట వ్రాస్తున్నాను. అందఱికీ అందుబాటు శైలిలో లేవనేకారణంచేతనే కదా యిప్పుడు చాలామందికవులు భారతాదులను నిరసిస్తూన్నారు. యీ నిరసించడం యింకా పూర్తిగా లోకామోదాన్ని పొందినట్లు లేదుగాని పొందినవెంటనే యెవరో వొకరు క్రొత్తశైలిలో వ్రాయనే వ్రాస్తారు. యిప్పుడు మనకు ముఖ్యంగా విచారించుకోఁదగ్గది కవిత్వానికీ బ్రాహ్మణ్యానికీ సంబంధం వుందా అనేదే. అట్టిసంబంధం లేదనే యెన్నో సందర్భాలు తెల్పుడు చేస్తున్నాయి. కవిత్వం రచించేవారిలో నూటికి తొంభైమందికి (బ్రాహ్మణులలోనే) శాస్త్రం చదువుకున్నా బుఱ్ఱకెక్కదు. కాళిదాసంతవాఁడు. "శ్లో. నమఃప్రామాణ్యవాదాయ మత్కవిత్వాపహారిణే" అని వొక్కదండం పెట్టి మానుకున్నాఁడని విద్వత్పరంపర చెప్పుకుంటుంది. భార్య కాపరానికి వచ్చాక చదువేలా సాఁగదో, అదేవిధంగా కవితారచనలోకి దిగి వెఱ్ఱోమొఱ్ఱో గిలుకుతూవుంటే శాస్త్రాభ్యాసమున్నూ సాగఁదు. అసలు దాని (శాస్త్రం)లో ప్రవేశమంటూ అయితే యేదోకొంత ఆర్జించ వీలవుతుంది గాని అది "అనభ్యాసే విషం శాస్త్ర మజీర్ణే భోజనం విషమ్." అన్ని శ్లోకానికి వుదాహరణంగా పరిణమింపచేస్తుంది. అందుచేత యీరెంటికీ సామానాధికరణ్యం కుదరదు. విద్వత్త అభ్యాససాధ్యమనిన్నీ, కవిత్వం జన్మతో పుట్టుకవచ్చేదనిన్నీ అందఱూ యెఱిఁగిందే. కనక యిందులో రెండోదానికి జాత్యాదులతో ఆవశ్యకత లేదు. బ్రాహ్మణేతరులకు తర్క వ్యాకరణాది శాస్త్రాలు అభ్యాసంవల్లకూడా సాధ్యపడవా అంటారేమో? సాధ్యపడవనే చెప్పవలసివస్తుంది. దానికి తథ్యంగా బ్రాహ్మణేతరులలో కవులే కనపడుతున్నారు గాని శాస్త్రజ్ఞులు కనపడడంలేదు. శాస్త్రజ్ఞత్వ మనఁగా శిష్యులకు పాఠాలుచెప్పే శక్తిగాని, అల్లాటప్పా ప్రవేశం కాదు. ఒక బ్రాహ్మఁడు పదిపంద్రెండేళ్లు వ్యాకరణం చదివి కాశీనుంచి వచ్చి "ప్రత్యాహారే ష్వితాం నగ్రహణం, అనునాసిక ఇత్యాది నిర్దేశాత్" అనే వాక్యానికి అర్థం తెలియనే

లేదన్నాఁడు. ఆ యీ వాక్యం సిద్ధాంతకౌముదిలో మొదటి పుటలోనే వుంది. దీన్నిబట్టి శాస్త్రప్రవేశం యెందఱికి (కష్టించి కృషి చేసిన వారికే) అవుతుందో తెలుసుకోవచ్చును. తర్క వ్యాకరణాలు కనక సంప్రదాయంగా వచ్చివుంటే తక్కిన శాస్త్రాలలో త్వరగానే ప్రవేశం కలుగుతుంది. కాని అవి త్వరలో ప్రవేశం కలగనీయవు. తపోహిదురతిక్రమం. కొంత వోపికపట్టి చదివితే వ్యాకరణానికి అనుగ్రహం కలిగి పేలపిండిమాదిరిని చరచర అనుభూతం అవుతుందిగాని తర్కం ఆలాటిది కాదు. చదివినకొద్దీ అయోమయంగా పరిణమిస్తుంది. అందుచేతనే "అయోముఖమూ, పిష్టగర్భమూ" అంటారు వ్యాకరణాన్ని. తర్కాన్నో? "పిష్టముఖమూ, అయోగర్భమూ" అంటారు. దీన్ని యీలా వుంచుదాం.

నేఁటికాలంలో ప్రతివిషయమూ తల్లక్రిందులుగా మాఱింది. పూర్వం యేది మంచో అది యిప్పుడుచెడ్డ. మీసాలను గూర్చి చర్చించుకుందాం. అవి వుంచుకోవడం పూర్వం ప్రతాపానికే కాదు, షోకుక్కూడా స్ఫోరకం. యిప్పుడో? అవి యేపూటకాపూట అంట గొరుక్కుంటేనే తప్ప కచేరీలోనూ అర్హత లేదు, గదిలోనూఅర్హత లేదు. మహమ్మదీయులు, క్షత్రియులు, వెలమవారు వీరందఱూ ప్రాణాన్నేనా గడ్డిపఱక మాదిరిని త్యజించేవారుగాని మీసాన్ని త్యజించేవారుకాదు. యిప్పుడో? ఆయీపౌరుషప్రధానజాతులవారందరూ బీదలు పాచీపని స్వయంగా చేసుకున్నట్లు మీసాలవిషయంలో చాలా శ్రద్ధపుచ్చుకోవడం అందఱూ యెఱిఁగిందే. మీసంలోవుండే వెంట్రుకలు తాకట్టుపెడితే పూర్వం కరెన్సీకన్నా యినుమిక్కిలిగా పనిచేసేవి. యెందఱో పౌరుషవంతులు ఋణం తెచ్చుకోడానికి తాకట్టుకు వాట్లనే వుపయోగించుకొనేవారని వినికిడి. మీసాలకూ, గడ్డాలకూ సంబంధించిన యితిహాసాలు చాలావున్నాయి. (కవులు శ్లోకాలూ, పద్యాలూ తాకట్టు పెడితే పౌరుషవంతులు మీసాలు). ఆయిసుక పాతర త్రవ్వడానికి మొదలెడితే వ్యాసం తేలదు. ఒక మతగురువుగారి మీసమూ, గడ్డమూ దాఁచి వుంచి ఆమతస్థులలో మహారాజు లెవరేనా ఆ పవిత్రస్థలానికి యాత్రకు వెడితే వొకవెంట్రుకను ప్రసాదంగా యిస్తారని చెప్పఁగా విన్నాను. 'హైఫేమిలీ' వారికే గాని ఆరాజులలోకూడా ఆప్రసాదం ముట్టదఁట! అట్టి మహాపదార్థం "శివ! శివ! తాని లుఠంతి గృధ్రపాదైః" అనే దురవస్థకు లక్ష్యమయింది. (అసలు తీసివేసినా అందమే మఱో దురవస్థ? సిగ్గుసిగ్గు).

మనకు ప్రస్తుతం కవిత్వం. దానికీ పాండిత్యానికీ చుట్టరికం వుందా? లేదా? అనేది. అక్కఱలేదని పలువురు శఠిస్తూన్నారు, అంతలో సరిపెడితే సంతసమే. సిగ్గు సిగ్గు! యెంతటి మహాకవినేనాసరే 'పుంసివా కొమ్మెక్కి' రకం కవులు ధిక్కరిస్తూన్నారు. అంతతో సరిపెట్టడం లేదు. "నీకేం తెలుసు పో వెధవ, కుంక, ముండమోపి," యిత్యాదిగా వావిడుచుచున్నారు.

ఇట్టి ప్రసంగం తప్పు, కూడదని మందలించడానికి యెవరేనా పెద్దలు సాహసిస్తే వారినికూడా యినుమిక్కిలిగా దూఱుతూన్నారు. "అట్టిపండితులలో నరయ నూటికి నొక్కరుండు కవీశ్వరుఁడుండునేమొ?" అని మాచిన్నతనంలో అనుకొనేవాళ్లం. యిప్పుడు పాండిత్యానికీ, కవిత్వానికీ సంబంధమే లేదని రుజువౌతూ వుండడంచేత జన్మాంతరవాసనచేత పుట్టిన ధార వొక్కటే రచనలకు మూలమని తేలింది. ("గారెలపిండివంట" పద్యం గీరతంలో చూ. "దారిన్‌జిక్కిన" అనే పద్యంకూడ చూ.) మునుపు తనకుపుట్టినధారకుతోడుగా శాస్త్రాలోకన లోకాలోకనాదులువుంటే బాగుంటుందని వాట్లను సంపాదించడానికి యత్నించేవారు, అది కొంతశ్రమతో చేరినపని కనక యిప్పుడు ఆసామగ్రినే తగ్గించడం మంచిపనిగా వూహించి వున్నదాన్నికూడా తగ్గించుకుంటూ వున్నారు. యీరకంలో కొందఱు అనవసరంగా యేపూర్వమహాకవినో పుచ్చుకొని అతణ్ణి దూషించడానికి ఆరంభిస్తూన్నారు. దానిస్వరూపంయిది.

"మ. ఉదయం బస్తనగంబు సేతువు హిమవ్యూహంబునుం జుట్టిరా
విదితంబైన మహిన్ మహేంద్రకవితా విద్యాబలప్రౌఢి నీ
కెదురేరీ ... ... ... ... ... ... ... ... ... ... ... ..."

అన్నాఁడుకదా రామలింగం. యిది నన్నయాదులను ధిక్కరించినట్లా! కాదా! అంటూ తలాతోఁకాలేని వాదానికి వుపక్రమించి యెనిమిదో అర్థాన్ని యేకరు పెడుతున్నారు. రామలింగం యేశతాబ్దంవాఁడు, నన్నయ్య భట్టేకాలంవాఁడు అనేవిచారణ ఆయీవ్యక్తులకు స్ఫురించకుండావుంటుందా? ఆయీసందర్భం రామలింగకవికి సమకాలీనులకే చెల్లుతుందిగాని యెన్నఁడో చచ్చి స్వర్గ మలంకరించినవాళ్ల కేం సందర్భిస్తుంది?

"శా. ఈక్షోణి న్నినుఁబోలు సత్కవులు లే రీ నాటికాలమ్మునన్"

(శ్రీనాథుఁడు)

ఆ యీ మాట శ్రీనాథుఁడికి పూర్వమందుండే తిక్కన మొదలయినవారికిఁగాని, పరమందుండే పెద్దనాదులకుఁగాని యెట్లు సమన్వయిస్తుంది? వేదాంతదేశికులవారు "శిరస్సు నిహితం మయా పద మదక్షిణం లక్ష్యతామ్" అని ప్రతిజ్ఞచేశారు. యింతకన్న ఘోరమైన, పండితలోకానికి అవమాన కరమైన ప్రతిజ్ఞ అంటూ వుంటుందా? యీ దేశికులవారి ప్రతిజ్ఞనుగూర్చి వ్యాసాంతమందు కొంతవ్రాస్తాను. యిది యెన్నఁడో స్వర్గమో, మోక్షమో పొందిన శంకరాచార్యులకు సమన్వయిస్తుందని యేమాత్రం పరిశీలన వున్నా అనుకోవడం తటస్థిస్తుందా?

అస లుపక్రమించిన విషయంవేఱు. బ్రాహ్మణ్యానికీ, కవిత్వానికీ లంకెగా యెవరేనా చెప్పడానికి పూనుకుంటే ఆమాట అపహాస్యాస్పదమేనా, కాదా అనేది. అప్పకవికి కొద్ది గొప్ప యీ పిచ్చి అభిప్రాయం వున్నట్టు అతని వ్రాఁత కొంత సాక్ష్య మిస్తుంది. విశ్వకర్మజాతిలో త్రాసులు, బంగారుతూఁచుకొనేవి, చేసే కుటుంబాలుకొన్ని తునివద్ద యేదో వూళ్లో వుండేవి. ఆ కుటుంబస్థులు ఆ శిల్పం తమ కూఁతుళ్ల కొడుకులు చూస్తూవుంటే చేసేవారు కారు. అలాగే వైద్యులు కొందఱు కొన్ని ఔషధాలు భద్రంగా కాపాడేవారు. అలాగే కొన్ని మామిడిజాతులున్నూ. (జహంగీరు ఇమాన్ పసందు పద్యం చూ.) తుదకు యివన్నీ వారువారు అనుకున్నట్లు తమలోనే వుండక అంతటా వ్యాపించాయి. అలాగే కవిత్వమూ యిప్పుడు ఆబాలగోపాలమూ ఆబ్రహ్మస్తంబ పర్యంతమూ (తెలుఁగన్నమాట) వ్యాపించింది. శ్రీనాథుఁడు "నీవునుంగవివి గావుగదా?" అన్నాఁడని ఒక వినికిడి కలదు. దీన్నిబట్టిచూచినా బ్రాహ్మణులలోనే కాక యీ కవిత్వం సర్వత్రా వ్యాపించి పూర్వమున్నూ వుండేదని తెలుస్తుంది. అది విద్వత్కవిత్వమా, కాదా అన్నది విచారణాంతరం. గంభీరహృదయులు తేలిక ప్రసంగాలు యెన్నఁటికీ చేయరు. చేసేవాళ్లను ఆమోదించరు. గాని లఘుహృదయులు జాతినియెత్తిపొడవడం పూర్వమూ వుండేది. వాసిరెడ్డివారి సంస్థానంలో బుచ్చివెంకు అనే కళావంతుఁడు వుండేవాఁడు. అతణ్ణి బ్రాహ్మణకవులు-

క. "ఈ-న్యంకేల? వానికింగల
రంకే యచ్చోట నిలుప రసవంతమగున్"

అని (పాపం) కులాచారాన్ని పురస్కరించుకొని శ్లేషించేటప్పటికి ఆకవి ఒళ్లు మండి "ఊరకే మన్నన మాలి మాకొలము మాట దలంతురు" అని చక్కని జవాబు చెప్పినట్లు వినికిడి. ఆజవాబు చెప్పడంలో "చేమకూర వెంకన్నకు లోపమేమి?" అని విజయవిలాస గ్రంథకర్తని స్పృశించడం చేతనే చేమకూర మహాకవి లక్ష్మణామాత్య తనూభవుఁడే కాని బ్రాహ్మణుఁడు మాత్రం కాఁడని తెలియవచ్చింది. ముప్పది యిద్దఱు నియోగుల సీసంలో యితఁడున్నాఁడు. యితఁడు గ్రంథాంత గద్యంలో గోడమీఁదిపిల్లి వాటంగా ప్రవర్తించాఁడు. తండ్రికి అమాత్యపదం వాడి తనకు వాడుకోలేదు. (యిప్పుడయితే వాడుకొనేవాఁడే) యిటీవల.బుచ్చివెంకుకూ, బ్రాహ్మణకవులకూ జరిగిన వివాదవల్ల యథార్థం బైటఁబడింది. బుచ్చివెంకు అన్నట్లు - "పన్నిన సత్ప్రబంధమున బాగును నోగును జూడ" వలయును గాని "నీవు బ్రాహ్మఁడవు, విశ్వబ్రాహ్మఁడవు, నియోగివి, వైదికివి, వైశ్యుఁడవు, క్షత్రియుడఁవు, కమ్మవు, కాపవు, బల్జీవి, మాలవు-ఆఁడుదానవు" అంటూ వివదించడంకన్న శోచ్యస్థితి వుండదు. (భిక్షుణాకక్షనిక్షిప్తః కిమిక్షు ర్నీరసో భవేత్) యెవరో లఘుహృదయు లిట్టి కలహాలకు

వుపక్రమించినా వాట్లని పెద్దలు - లేదా విజ్ఞులు జవాబివ్వడం (అనగా అలఘు హృదయులతో వాదించడం) అనాలోచనపని. వీరిపెద్దతికాన్ని ఆవలివారు గమనింపరు. అనరానిమాటలు (బండబూతులు) అందురు. వీరికి అట్టి మాటలు రావు. వస్తాయే అనుకుందాం, అప్పుడు అంతకన్నను వీరు లఘుహృదయులు కావలసి వస్తుంది గదా? అందుచేత అట్టివారి తిట్లను గణించడం ప్రమాదం. వారిచ్చే అథార్టీవాక్యాలు "కుర్వీత బుధసోమయోః" అన్నట్లుంటాయి. అట్టిమాటలను ఖండించడం యెందు కంటాను. వారికి యెవ్వరూ అడ్డరు. బస్ ఇంతే. యేదో ప్రసక్తాను ప్రసక్తంగా యీ విషయం మధ్యలో తగిలింది.

కవిత్వానికీ, బ్రాహ్మణ్యానికీ లంకె అని అప్పకవి అనలేదు గాని యేదో నీచోపమానం పెట్టి శూద్రకవిత్వాన్ని గూర్చి కొంత ప్రసంగించడం అనాలోచనగానే నాకు కనపడింది. "తెలివి యొకరిసొమ్మా?" అన్నాఁడు క్షేత్రయ్య. అయితే యితరకులాలలో తెలివి అనే పదార్థంవున్నా దానిని విద్యలో వుపయోగపఱచక ద్రవ్యాకర్షణకు అనుకూలించే వ్యవసాయాది సద్వృత్తులయందు (నిజం చెవుతాను. నాకు కవిత్వంకంటే వర్తకం కష్టసాధ్యంగా కనపడుతుంది) వినియోగించడంచేత బ్రాహ్మణులలో వున్నంతమందిగాని, కొంత మందిగాని లేకపోవడం తటస్థించింది. చిరకాలాన్నుంచి విద్యాకృషి లేని కుటుంబంలో జన్మించిన వ్యక్తికి విద్యాగోష్ఠిలోకి కాలుపెట్టినప్పుడు బ్రాహ్మణకులజులకుబలె చురుకుగా ఆవాసన అంటదు. అదేనా సంస్కృతమున్నూ, తత్సమపద భూయిష్ఠంగా వుంటే తెలుఁగున్నూ అభ్యసించడంలోనే, ఇంగ్లీషులో బ్రాహ్మలెంతో యితరులూ అంతే. అయినా యీవిషయంలోనూ కొంత విశేషం వున్నట్టు వినికి. దక్షిణాదిబ్రాహ్మలవలె మన ఆంధ్రులు కొన్ని పరీక్షలలో వుత్తీర్ణులు కాలేరనీ, దక్షిణదేశస్థులలోనున్నూ తామ్రపర్ణీతీరస్థులు మఱీ బుద్ధి సూక్ష్మత కలవారినిన్నీ చెప్పుకుంటారు. దానిక్కారణం ఆ నది వుదకమే అంటారు. ఆ నీటిలో తామ్రంవుందని దానిపేరే చెపుతూవుంది. బ్రాహ్మణులే కాదు. తదితరులుకూడా మిక్కిలి బుద్ధిశాలులు దక్షిణదేశంలో వున్నారు. బ్రాహ్మణేతరులలో అఱవంలో వుద్దాలమైనకవు లున్నారని వినికి. దక్షిణా గాథకాః అంటే బుద్ధిశాలులు. ఆయీమాట సిద్ధాంతకౌముదిలో వుంది. బహుశః యీమాట భాష్యంలో కూడా వుందేమో జ్ఞాపకం చాలదు. (శా. "లేరే యెందఱొ అడ్వొకేట్లు తెలువుల్లేవే; అయంగారికే పేరే మల్లడి కృష్ణసామికె కదు బెంపేమి?" జయంతి చూ.) బుద్ధిమత్తగాని, విద్యావత్తగాని, ధనవత్తగాని, గుణవత్తగాని, ఆవత్తగాని యీవత్తగాని యేవత్తగాని వొకరి సొత్తుగాదు. యిది మాదే అనిన్నీ, యితరులు దీనికి తగరనిన్నీ అనుకోవడం, వారిని దూషించడం యివి అనాలోచనపనులు. నాకు మొదటినుంచీ యీ పట్టింపు లేదు. నాకు వచ్చిన నాల్గక్షరాలూ తప్పోవొప్పో బ్రాహ్మణులకేనా

సరే బ్రాహ్మణేతరులకేనా సరే చెప్పడమే నాకలవాటు. అప్పకవి రోజుల్లో నేను వుంటే ఆయన నన్ను గాఢంగా మందలించేవాఁడేమో! వేదం నాకు రానూరాదు. వచ్చినకాస్తా నన్నెవరూ అడగనూ లేదు; నేను చెప్పనూ లేదు. శాస్త్రమున్నూ డిటో. యిఁకనల్లా అందటికీ అందుబాటులో వుండేవి తెలుఁగుముక్కలు. అందులోనేనా వ్యాకరణం యెవరికో (బ్రాహ్మల్లోనూ అంతే) గాని యెక్కదు. అందుచేతే నేను స్కూల్లోకూడా బాల వ్యాకరణం చెప్పేవాణ్ణే కాను. సంవత్సరానికి నాలుగు గడియలకన్న నేను గ్రామరు కింద ఖర్చుపెట్టేవాణ్ణి గాను. నాగ్రామరు యావత్తూ యింతలో యిమిడేది:

(౧) అకారానికిఁ గాని ఇకారానికిఁ గాని సంధి చేయాలని నియమంలేదు – మీచిత్తం.

(౨) ఉకారానికి వాక్యం ముగింపులోతప్పక సంధిచేయండి తప్పకుండాను.

(౩) ద్రుతప్రకృతికం (నకారపొల్లు) మీఁద వుంటే క చ ట త ప లు; గ జ డ ద బ లుగా మార్చుకోండి.

ఈ మూడు మాటలూ చెప్పడానికి యెన్నాళ్లు కావాలి? కొన్ని నిమిషాలు చాలునుకదా. కాంపోజిషను యావత్తూ వీట్లతోనే నెగ్గించేవాణ్ణి. తెలుఁగుటీచరు వ్యాకరణమే చెప్పడం లేదని యినస్పెక్టరుగారికి యేలా తెలిసిందో (మంథపూడి కామేశ్వరరావు పంతులుగారు) నన్ను ప్రశ్నించారు. అప్పుడు నేను "అయ్యా! వ్యాకరణం ప్రత్యేకించి అభ్యసింపవలసిన శాస్త్రం గాని యెన్నో సబ్జెక్టులలో అదీవొకటిగా చేర్చి చెప్పతగ్గదిగాదు. కనక నేను ఏదో పరీక్షప్యాసుకు అనుకూలించేమార్గంగా అవసరమైనంతవఱకే బోధిస్తున్నాను. యెంతో క్రోడీకరించి తగ్గించి తగ్గించి చెప్పినా ఆ కాస్తాకూడా అంటనివాళ్లు బోలెడున్నట్లు తమరు చిత్తగించే ఉన్నారు గదా?" అని వారికి తృప్తి కలిగేటట్టు నా అనుభూతిని యేకరు పెట్టిన పిమ్మట వారు ఆమోదించినట్లే నాకు తోఁచింది. యిది యిప్పటికి సుమారు ముప్పది యేళ్లకు పూర్వపు సంగతి. యిటీవల స్కూలుపిల్లల కాంపోజిషనుకున్నూ, పత్రికలలోని సంపాదకీయాలు వగయిరాలకూ అంతనిక్కచ్చి వ్యాకరణం అక్కరలేదని అభిప్రాయం మాఱింది. కాలరీతి ప్రతి విషయానికీ లఘుత్వంగా ఉండడాన్ని ఆపేక్షిస్తూ వుంది. గురుత్వాన్ని సహించేటట్టు కనపడదు.

తెలుఁగని పేరుకాని వ్యాకరణం బోధ చేయవలసివస్తే సంస్కృతానికివున్నంత కాకపోయినా కొంతేనా కష్టం వుంటుంది కాని తేలికలో తేలదు. బ్రాహ్మణ కవులు చాలామంది ఆయీ కారణంచేతనే వ్యాకరణంమాకు లొంగవలసినదే కాని మేము వ్యాకరణానికి లొంగేదిలేదని శఠిస్తూన్నారు. "ఛందో వ్యాకరణాదివిత్" అని లక్షణం

శాసించినమాట సత్యం. ఆ శాసనం ఆనకట్టకు పూర్వం అమలు జరిగింది కాని యీ యిరవయ్యో శతాబ్దానికి పనికిరాదని పలువురు యువకవులు కట్టుకట్టి పనిచేస్తున్నారు.

శబ్దం బ్రహ్మస్వరూప మనిన్నీ, దాన్ని సుస్వరంగానూ నిర్దుష్టంగానూ వుచ్చరించినప్పుడే అది పుణ్యజనక మవుతుంది గాని అన్యథాగా వ్యవహరిస్తే యేదో కొంపములక్కి కారణంగా పరిణమిస్తుందని పూర్వాచార్యుల శాసనం. ఆ యీ శాసనా లన్నీ యిప్పుడు అకించిత్కరాలుగా బుట్టదాఖలవుతూ వున్నాయి. పూర్వపండితుల చర్యలూ, వారిప్రతిజ్ఞలూ తల్చుకుంటే యిప్పటివాళ్ల విశృంఖలత్వం యేదోవిధంగా పరిణమించినట్లు కనపడుతుంది. ఆ పండితరాయలు, ఆ వేదాంత దేశికులు, ఆప్రతిజ్ఞలు యిప్పటివాళ్లకు రుచించవు సరిగదా, అవి తమకు మర్యాదభంజకాలని కూడా విచారపడతారు.

> "వాచా మాచార్యతాయాః
> పద మనుభవితుం కోఽస్తి ధన్యో మదన్యః"

ఆ యీ శ్లోకం చాలా పెద్దది. పండితరాయలవారిది యీగర్జితం. "ఆసేతుహిమాచల పర్యంతమూ వున్న పండిత మండలిని నేను ప్రశ్నిస్తున్నాను : వాక్పతిఅనే పేరుకు యీభూలోకంలో నేనుతప్ప మఱొకఁడు వున్నాఁడా? వున్నట్టయితే, విశంకం వదంతు" అనిగర్జించాఁడు పండిత రాయలు. (ఘనులు పండితరాయాదికవులు చూపు త్రోవలంబట్టి పోదుము దేవునైన లక్ష్యపెట్టము. చూ.) యేదో ఆగర్జించడానికి అవసరం వచ్చింది కనకనే అతఁడటుల గర్జించాఁడుగాని తీరి కూర్చుని గర్జించలేదు. పండిత రాయలు వేఁగినాటి బ్రాహ్మఁడు. వెల్నాటిశాఖవారు ఆ యీ గర్జింపు మా పూర్వులకు అవమానకరం అని విచారిస్తే యేం ప్రయోజనం? ఆ పండితరాయలకు సమకాలీనులుగా వుండే భట్టోజీ దీక్షితులు, అప్పయ్య దీక్షితులు వీరు ప్రతిఘటించికూడా వోడిపోయారు. అంతవఱకు అది పండితలక్షణమే కాని అన్యథా అతణ్ణి వంచించలేక ఆతఁడు లవంగి అనే తురుష్క కన్యకను పెండ్లిచేసుకున్నాఁడని మిషపెట్టి బహిష్కరించడం వగయిరాలు యీ కాలంలోనే అయితే శోచ్యం. అతఁడు నిరాఘాటమైన శక్తికలవాఁడు. కనకనే ఆకాలపు ఢిల్లీచక్రవర్తి (శహాజహాను) అతనికి పండితరాయలు అనే బిరుదాన్ని యిచ్చి గౌరవించాఁడు.

> "దివిజకవివరు గుండియల్ దిగ్గురనఁగ
> నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి"

దీని కర్థమేమిటి? యీలోకంలో వుండేకవుల నందఱినీ వోడించడమయిందనేనా? ఆ వోడించడం తనకన్న కొంత పూర్వకాలంలో వుండే కవిబ్రహ్మకున్ను, చాలాపూర్వికుఁడైన

నన్నయ్యకున్నూ కూడా సంఘటిస్తుందా? తనకు సమకాలీనుఁడైన గౌడడిండిమభట్టువఱకే సంఘటిస్తుందా? శ్రీనాథుఁడువైదీకి కాఁడు. నియోగి అవును గాని మన దేశంలో విస్తరించి వుండే ఆర్వేల నియోగిన్నీ కాఁడు. యిందుకు అతనిపద్యపాదం "పాకనాఁటింటివాఁడవు బాంధవుఁడవు" అనేదే వక్కాణిస్తుంది. ఆనందించక అసూయపడి విచారించవలసివస్తే శ్రీనాథుని విజయానికి పాకనాఁటివారుతప్ప యితరనియోగులున్నూ, వైదికులు సరేసరి యావన్మందిన్నీ విచారించవలసివస్తుంది, అందులో "మహి మున్ వాగనుశాసనుండు సృజియింపన్" అని వుండడంచేత నన్నయ్యగారి చుట్టాలున్నూ (వైదికులన్నమాట), మఱిన్నీ "కుండలీంద్రుండు తన్మహనీయస్థితిమూలమై నిలువ" అని వుండడంచేత తిక్కన సోమయాజులుగారి బంధువులున్నూ (ఆర్వేలవారన్నమాట) యెక్కువగా అసూయపడవలసి వస్తుంది. యింతే కాదు. ఆంధ్రకవితాపితామహుఁడుగారి శాఖవారు (నందవరీకు లన్నమాట) కూడాపాకనాఁటివారు తమవారు కారు గనుక విచారింపవలసినవారే అవుతారు. వీరేకాదు. యింకా మఱిచాను. తెనాలిరామలింగకవి అగ్రశాఖికాకోకిలం కనుక శుక్లయజుశ్శాఖానియోగులున్నూ, శ్రీనాథుని యైశ్వర్యానికి విచారింపవలసిన వారే కాని యీక్షణంవఱకు యెవ్వరుగాని యిట్టి విచారానికి భాజనులు కాకపోవడం మన అదృష్టం. రామలింగకవి ప్రథమశాఖవారిలో వైదికే కాని నియోగికాఁడనే పక్షంలో వారికీ విచారం తప్పదు. యింకీ "యీవిచారం అసలు యుక్తమేనా" అనే ప్రశ్నకు జవాబు వుందా? నన్నయ్యగాని, తిక్కన్నగాని, రామలింగంగాని, పెద్దన్నగాని శ్రీనాథుఁడి కాలంలో వున్నారా? లేరుగదా? "అమరపురి" పద్యంలో లేకపోయినా మఱోపద్యంలో "ఈక్షోణిన్నినుఁ బోలు సత్కవులు లేరీనాటికాలమ్ములో" అని వుండనేవుంది. వుండదే అనుకుందాం "పార్థ ఏవ ధనుర్ధరః" యీ మాటకు రాముఁడుగాని రావణుఁడుగాని అశోకుఁడుగాని గుఱిఅవుతారా? భవతు.

శ్రీనాథుని ఆత్మశ్లాఘాపరత్వం మాకు విచారకారకం అంటారా? అనండి. కవులలో తన్నుఁగూర్చి అంతో యింతో వ్యంగ్యంగానో, వాచ్యంగానో కత్థించుకోని (కత్థ శ్లాఘాయాం) వారెవరు? కవికుల గురువు కాళిదాసు "మందః కవియశః ప్రార్థీ" అన్నాఁడు కనుక యీయన్ని పుచ్చుకుందామా? యీవిధంగా రఘువంశంలో వినయాన్నే కనపరిచాఁడు. శాకుంతలంలోనో? "అభిరూపభూయిష్ఠా పరిషదియం. తదత్ర కాళిదాస గ్రథితవస్తునా నవేన నాటకేనోపస్థాతవ్యం" నాఁటిసభలో చాలామంది పండితులున్నారష; అందుచేత కాళిదాసుగారి నాటకంగాని పనికి రాదష? వాచ్యార్థంలోనే కొంత కత్థనం కనపడుతూ వుంది. యిఁక వ్యంగ్యానికి త్రోవదీస్తేనో? పండితులంతగాలేని సభలో అయితే యే కవిదేనా

నాటకం పనికివస్తుందిగాని పండితభూయిష్ఠమైన సభలో అయితే కాళిదాసుదేగాని పనికిరాదు. యీలాగే నన్నయ్య,

(౧) "నిత్యసత్యవచను మత్యమరాధిపాచార్యు నన్నపార్యు"

(౨) "అమలోదాత్తమనీష నే నుభయకావ్యప్రౌఢి పాటించుశిల్పమునంబారగుఁడన్"

అని కవిబ్రహ్మ యిదేరీతిని అందటికీ చూపవచ్చును.

40 యేండ్లనాఁడు కవిసింహగర్జితములు అనే పేరుతో వొక చిన్న పుస్తకం ప్రచురింపఁబడింది. వలసినవారు దానిలో చూచుకుంటారు. కీ॥ శే॥ కస్తూరి శివశంకర కవిగారు యేదో సందర్భంలో వొక వ్యాసం వ్రాశారు. అందులో ఆయీవిషయం కూడా స్వల్పంగా స్పృశించినట్లు జ్ఞాపకం. (అది "గుంటూరిసీమ"లో వుంటుంది) అయితే ఆయీ కవులు తమ గొప్పఁదనాన్ని చెప్పుకున్నారు గాని యితరుల మీఁదికి దూఁకినట్లు లేదంటారేమో? ఆ చెప్పుకోవడంలో వ్యంగ్యంతీస్తే దూఁకడమూ కనపడుతుంది. పోనివ్వండి, అంత శ్రమయెందుకు, వాచ్యమే దొరుకుతూ వుండఁగా? లోఁగడ "శిరస్సు నిహితం మయాపదమదక్షిణం లక్ష్యతామ్." యీశ్లోకం యెందుకుఁ బుట్టిందో యెఱుఁగుదురా? రామానుజమతం యెవళ్లు వొప్పరో? అనఁగా వారిసిద్ధాంతాన్ని ఆమోదించి (చక్రాంకనాదికం, ఊర్ధ్వపుండ్రధారణం వగైరా) ప్రవర్తించక వివదిస్తారో; అట్టి ప్రతివాదిపండితు లెవరేనా సరే వారి శిరస్సులయందు నా కాలు-కాదుకాదు యెడమకాలు పెట్టఁబడింది. అనఁగా పెట్టితీరుతానన్నమాట. యీమాటలు "తదన్యమతదుర్మద జ్వలితతేజసాం వాదినాం" అనే మూఁడవచరణంలో కనపడుతూ వున్నాయా? (మత ప్రచారకులలో శ్రీ నందిరాజు దీక్షితులుగారు తిరుమణి తిరుచూర్ణధారకులను గూర్చి ప్రతిజ్ఞ చేయడం, మతుకు మిల్లివారు యెదిరించడం వగయిరాలు గ్రంథవిస్తర భీతిచేత వుదాహరించ లేదు) కుడికాలు పెడితే యెక్కడ ప్రతివాదులను గౌరవించినట్లవుతుందో అని యెడమకాలన్నాఁడు. తదన్య- రామానుజులవారికన్న యితరులయొక్క మత-మతములు, అద్వైతం, ద్వైతం, శైవం, శాక్తేయం, ఇవన్నీ కావచ్చును గాని దేశికులవారి తాత్పర్యంమాత్రం అద్వైతమతమనియ్యేవే. అద్వైతమతోద్ధారకులు ఆదిశంకరులు గతించి అప్పటికి కొన్ని శతాబ్దాలు అయినా శంకరులనెత్తిమీఁద వేదాంతదేశికులు యెడమకాలు పెట్టినట్లయిందనిన్నీ, ఆయీ దేశికులవారేమి, అసలు విశిష్టాద్వైతమతోద్ధారకులు శ్రీరామానుజులవారేమి, యింకా శ్రీవైష్ణవమత ప్రచారకులు మఱికొందరేమి శంకరులవారి భాష్యం అంటూ పుట్టివుంది గనక "అమర్చినదానిలో అత్తవ్రేలెట్టింది." అన్న మాదిరిని తమ మతానికి అనుకూలించే మాటలు వ్రాసుకున్నారు గాని ఆయనలో యెన్నోవంతున్నూ

కారని అద్వైతపు బాలుఁడెవరేనా ప్రసంగిస్తే యేంలాభం? దేశికులకాలంలోవున్న పండితులు లేదా పండితుఁడు "ఇదుగో నేను శాంకరమతంవాణ్ణి. నన్ను జయించుచూదాం. అప్పుడు నీయెడంకాలు నీవు పెట్టనక్కఱలేదు. నీకంత శ్రమెందుకు, నేనే నా నెత్తిమీఁద పెట్టుకుంటాను" అని యెదిరిస్తే యేదో జరుగుతుంది. అంతేకాని ఆకాలం గతించాక "నన్ను కొడితే యేంలాభం, మాబావని కొట్టిచూడు" అన్నట్టు వాగ్వ్యయం చేయడం మొదలెడితే యేంప్రయోజనం? యేదో పొరఁబాటో, తొందరపాటో ఆ వాగ్వ్యయానికి కారణమనుకుందాం. విద్యావయోవృద్ధులు క్షేమంకోరిన వారు "నాయనా, నీత్రోవ సరియైనదికాదు. వేదాంతదేశికుల ప్రతిజ్ఞ శంకరులకు సమన్వయింపదు. కాలంవేఱు" అనిబోధిస్తే వారిని పట్టుకొని తిట్టడం, తలకు తగని డాంబికాలు పలకడం, ఇదంతా క్షంతవ్యంకాదు. వేదాంత దేశికులవారి ప్రతిజ్ఞకు తగిన కారణం ఆకాలంలో వుండకపోదు. దేశికులు శ్రీమహావిష్ణువు యొక్క ఘంటయొక్క అవతారమని ఆమతస్థులు విశ్వసిస్తారు. కవితార్కిక సింహుఁడు అనే ఈ పేరున్నూ, వేదాంతదేశికులు అనే పేరున్నూ ఆయనకు వాడతారుగాని అసలు తలిదండ్రులు పెట్టిన పేరు యెవరూ వాడరు.

శ్లో. కవితార్కికసింహాయ కల్యాణ గుణశాలినే
శ్రీమతే వేంకటేశాయ వేదాంతగురవే నమః.

ఆయీ శ్లోకంవల్ల ఆయనపేరు తెల్పినట్లయింది. ఆలాటి మహానుభావుని కాలు నెత్తిమీఁదకు రావడం అదృష్టమేకాని యెందుకూ కొఱగాని వాదాలు చేయువారిని మందలించడం కూడా పాపమే.

తెలుఁగుకవులలో రామలింగం ముష్కరుఁడుగా అతని కొన్నిపద్యాలు (తెలియనివన్ని తప్పులని - ఒకనికవిత్వమం దెనయు నొప్పులుఁదప్పులు, వగయిరా) తెల్పుడు చేసినా అతఁడు శ్రీవైష్ణవభక్తుఁడని అతని పాండురంగ మాహాత్మ్యం ఋజువు చేస్తుంది. ఆలాగే ఆయీ దేశికులవారు లోఁగడ వుదాహరించిన ప్రతిజ్ఞాశ్లోకభాగంవల్ల దుర్వాస మహాముని మాదిరిగా కనపడినా ఆశ్లోకపూర్వార్ధం చూస్తే రెండవ తొండరడిప్పొడి యాళ్వారుగా తోఁపకమానరు. చూడండి-

"శ్లో. యతీశ్వరసరస్వతీ సురభితాశయానాం సతాం,
వహామి చరణాంబుజం ప్రణతిశాలినా మౌళినా"

చూడండీ, యెంత విషయం వుందోను? "యెవరు శ్రీరామానుజుల వారి వాక్యములను ఆదరించి వర్తించు మహాభక్తులో వారి పాదమును వంచిన తలమీఁద పెట్టుకుంటాను" అనికదా దానిభావము. మహాపురుషుల ప్రకృతిలో పరస్పర విరుద్ధధర్మాలు

కలిసి వర్తిస్తాయి. వారి ఆశ్రమాలలో లేళ్లూ, పెద్దపులులూ కలిసి మెలసి వుంటాయి. ఆయన సమకాలీనులు మతచర్చలో దేశికులకు వోడిపోయినవారేకాని గెలిచినవారు లేరని ఆమతస్థులే కాదు నిజమైన చరిత్ర తెలిసిన మతాంతరులుకూడా విశ్వసిస్తారు. "శ్లో. శత్రోరపిగుణా వాచ్యా, దోషావాచ్యాగురోరపి" అనికదా అభియుక్తోక్తి. అయితే దేశికులవారి ప్రతిజ్ఞ క్రొత్తదిలాగువున్నా కొత్తదిమాత్రంకాదు. భారతం సభాపర్వంలో సహదేవుఁడు యీప్రతిజ్ఞనే చేసియున్నాఁడు. కాని అది మా కూటస్థులకు అవమానకరంగా వుందని నిషాదపడ్డవా రెవ్వరూ లేరు. అది బాహుబలస్ఫోరకం. ఇదో? విద్యాబలస్ఫోరకం. అయితే యింకోమాట యేమిటంటారా "రాజు వచ్చినా రాకళ్లకు పాపయ్యంటేనా?" (బొబ్బిలి పాట) అన్నట్లు, యీదేశికుల కాలంలో ఆదిశంకరు లుంటే యేమయేదో? యెందుకు యీప్రశ్న? "పెట్టఁగల బచ్చలిపాదును కొనఁగల గేదె తినిపోయింది" పై ప్రశ్న భావనాబలాన్ని వినియోగించి జవాబు చెప్పతగినది. అద్వైతులేమో మాశంకరులే గెలిచేవారని సంతుష్టి పడతారు. విశిష్టాద్వైతులు మాదేశికులే గెలిచి తీరుతారని చెప్పుకొని సంతుష్టి పడతారు. అయితే యింకో శంక. శంకరులు ఆకాలంలో లేరుగనుక దేశికుల వారి యెడమకాలు బాధ ఆయనకు లేశమూ సంఘటింపదు. యెవరేనా సంబంధిస్తుందే అయ్యోఅనిదుఃఖిస్తే అది అజ్ఞానవిలసితమే కానిఅన్యంకాదు. లేదా. దురభిమాన మనుకోవాలి. దాన్ని అలా వుంచుదాం. అప్పయ్యదీక్షితులవారు దేశికులకాలంలో వున్నారుగదా? సాక్షాత్తూ బ్రహ్మోపరావతారం. ఆయన్ని దేశికులు వోడించి ఆయన నెత్తిమీఁద యెడమకాలు పెట్టినట్లేనా దేశికులవారు? అంటే వినండి. అసలు దేశికులకాలంలో యావత్తుమంది అద్వైతపండితులతోటీ వాదం తటస్థించే వుంటుందని చెప్పఁగలమా? యేదో సభలో యేకొందఱితోటో వాదం వచ్చివుండును. అప్పుడు దేశికుల వారు యింతటి ఘోరప్రతిజ్ఞ చేయడానికి తగినంత హేతువు తారసమైవుండును. అంతేనేకాని అవచ్ఛేదకావచ్ఛేదేనా అద్వైతులు దేశికుల యెడమకాలు నెత్తిని పెట్టుకోవలసిన దురవస్థ వచ్చి యుండదు. "అదుగో పులి యిదుగో తోఁక" ఫలితార్థం దేశికులవారు అద్వైతమత సిద్ధాంతాలు ఖండించి విశిష్టాద్వైతాన్ని పోషించిన మహామహులు అన్నది. పనిపడితే దేశికులవారు దేవుణ్ణికూడా యెదిరించే ధైర్యం కలవారనడానికి కొన్ని యితిహాసాలున్నాయి.

"శ్లో. ఐశ్వర్యమదమత్తోఽసి మాం నజానాసి దుర్మతే!
పరైః పరిభవే ప్రాప్తే మదధీనా తవస్థితిః"

యీశ్లోకం వొకానొకసందర్భంలో దేశికులవారు శ్రీతిరుపతి వేంకటేశ్వర స్వామిని గూర్చి చెప్పవలసి వచ్చిందని చెప్పఁగావిన్నాను. దానికి వున్న పుట్టుపూర్వోత్తరాలు

తెలియనివాళ్లు "దేశికులు యెంత దుర్మార్గుఁడు, దేవుణ్ణే 'దుర్మతీ' అని సంబోధించాఁడే యిఁక యితనికి యెవరడ్డుతారు? తల్లిచెవులు దెంపినవానికి పినతల్లిచెవులు బీఱపువ్వులూ గావుగదా" అంటూ దూషిస్తారు. వారివెనక తత్వం తెలియని అమాయికులు "కాఁబోలును. అది కర్ణకఠోరంగానేవుంది. నాకైతే దేశికులవారంటే భక్తేగాని యీ విషయంలో నా మనస్సున్నూ నొచ్చింది. అయితేమాత్రం యేంచేసేది? ఆయన యెదట కిక్కురుమనలేం" అంటూ ఆరంభిస్తారు. అంతేనే కాని దేవుణ్ణికూడా అంతమాట యెందుకనవలసివచ్చిందో అనే విచారణ దాఁకా యెవరికోగాని బుద్ధి ప్రసరింపదు. దేవుఁడున్నాఁడా, లేడా అనే ప్రసక్తి తటస్థించినప్పుడు స్వామివారేదో దేశికులవారికి సహాయం చేయవలసివచ్చిందనిన్నీ, ఆ సహాయం గుడితలుపులు కుంచెకోలతో అవసరం లేకుండానే వాటంతట అవి విడిపోవడమే స్వరూపం కలదనిన్నీ చెప్పుకుంటారు. దేశికులవారు కోరిన పని స్వామివారు చేయకపోయేటప్పటికి దేశికులకు పట్టరాని ఆగ్రహం వచ్చింది. యెందుచేత? త్రికరణశుద్ధిగా 'భగవంతుఁడున్నాఁడు' అనే నమ్మికతో వున్నవాఁడై యితరులను నమ్మిస్తూన్నారు కదా దేశికులు. అట్టి పరమభక్తునిపట్ల తన సత్త చూపకపోతే భక్తుని పాట్లేమికావాలి? "దాసుఁడిపాట్లు పెరుమాళ్లకే యెఱుక" కనక ఆసందర్భంలో దేశికులవారి నోటమ్మట పైవాక్యం వచ్చిందంటే ఆస్తికుఁడెవ్వఁడూ ఔచిత్యానికి భంగంగా తలఁపఁడు. త్యాగరాజు యేమని గానం చేశాఁడు. ఆయన లోకాన్ని మోసం చేసే స్వభావం కలవాఁడేనా? తప్పకుండా భగవంతుఁడున్నాఁడని విశ్వసించినవాఁడు కావుననే "ఎందు దాఁగినాఁడో మారాముఁ డెందుకు దయరాదో?" అని గానం చేశాఁడు.

భగవత్సత్తను గూర్చి నాస్తికులు వితండవాదం చేస్తారు. వారికి భగవంతుఁడు వొక్కసారి కనపడితే లేనిపోనివాదాలతో గ్రంథాలు పెరగవుగాని ఆసృష్టికర్తకు "నీవు లేవు" అనే వాళ్ళందఱికీ కనపడడమేనాపని? (యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్). అదిన్నీకాక తనకోసం జపతాపాలు చేసి కృశించేవాళ్లకే దిక్కులేదే? అట్టి దేవుఁడు నాస్తికులకు కనపడి తనసత్తాను ధ్రువపరచుకోవాలా? వున్నాఁడన్న వాళ్లకి వున్నట్లున్నూ, లేఁడన్నవాళ్లకు లేనట్టున్నూ వర్తిస్తాఁడు. ఆ మాయామానుష విగ్రహుఁడు; ఆ మాటా త్యాగరాయలే వాక్రుచ్చారు. "కద్దన్నవారికీ కద్దు కద్దని మొఱలిడిన పెద్దలబుద్ధులు నేఁ డబద్ధమౌనె." ఇది విషయాంతరం. యిప్పటి నాగరికులు కొందఱు దేశికులవారిని మెచ్చకపోదురుగాక. ఆకాలంలోవారు పూజించారు. విశిష్టాద్వైతులందఱికీ ఆయనమాటంటే వేదం. అద్వైతులేనా "యేదీ నీయెడమకాలు మానెత్తిమీఁదయేలా పెడతావో పెట్టు" అన్నట్లుగా ఐతిహ్యం కనపడదు. ఆయనప్రతిజ్ఞాశ్లోకం యతిరాజ సప్తతిలో నలభైయోది. కావలసినవారు చూచుకోండి. ఆయనకట్టి శక్తిసామర్థ్యాలు వుండఁబట్టే ఆశ్లోకం అప్పుడు

లోకంలో నిల్వగల్గింది. లేకపోతే గౌడడిండిమభట్టు కంచుఢక్కాకి పట్టిన దుర్గతే దానికిన్నీ పట్టేది.

ఆ కాలంనీకు జోడుకాగడా లెవరిచ్చారంటే "నా ఆముదపుచేనిచ్చిం" దని జవాబిస్తే సహించేది కాదు. అన్నట్టు దేశికులవారు వెంకటేశ్వరస్వామిని బెదరించాక యేం జరిగిందో వ్రాయనే లేదు. యేం జరుగుతుంది? భక్తపరాధీనుఁడు శ్రీ వేంకటేశ్వరుఁడు దేశికులకు, అనుకూలంగా వర్తించినట్లే వినికిడి. ఆ యీప్రతిజ్ఞలు వగయిరాలుగాని, ఆ యీ భగవత్ప్రత్యక్షాలు గాని యెక్కువ తెలివి కలవారు విశ్వసింపకపోదురు గాక, విశ్వసించేవారే నూటికి తొంభై మంది. వేదాంత దేశికుల ప్రతిజ్ఞాశ్లోకంమళ్లా వొకసారి వుదాహరించి వ్యాసం ముగిస్తాను.

"శ్లో. యతీశ్వరసరస్వతీసురభితాశయానాం సతాం
వహామి చరణాంబుజం ప్రణతిశాలినా మౌళినా
తదన్యమతదుర్మద జ్వలిత తేజసాం వాదినాం
శిరస్సు నిహితం మయా పద మదక్షిణం లక్ష్యతామ్"

యిందులో "అదక్షిణం" అనేపదానికి యెడమకాలనే కాక క్రియా విశేషణంగా వ్యాఖ్యానిస్తే "నిర్దయం" అనే అర్థం కూడా చెప్పవచ్చును. కాని ఆమతస్థులు ఆయీమార్గవాన్ని సహించరో యేమో? యేలా చెప్పినా పాదం శిరస్సు భరించడం తప్పదన్నది సిద్ధాంతమేకదా? సరే; వ్యాసారంభం యెక్కడ? ముగింపెక్కడ? ఉపక్రమోపసంహారాలకు సంబంధబాంధవ్యా లుండవద్దా అంటే వుండవలసిందే కాని అసలు నామార్గం యేదో కొత్తపుంత. దేన్నిగుఱించో మొదలుపెడతాను, మధ్యమధ్య "సఁరాజుపెళ్లిలో గుఁరాజు కొకపోఁచ" లెన్నో జ్ఞప్తికి తగులుతాయి. వాట్లకోసం మళ్లా హెడ్డింగులు పెట్టి వ్రాసేదేమిటని దానిలోనే నాల్గుమాటలు వ్రాసివిడుస్తూ వుంటాను. ఆయీ యావత్తు వ్రాంతకున్నూసారం–

(౧) కవిత్వానికీ బ్రాహ్మణ్యానికీ లంకె లేదు.

(౨) యేకవిప్రతిజ్ఞలు ఆకవికాలీనులకేకాని తత్పూర్వులకుఁగాని, తదనంతర కాలీనులకుఁగాని సమన్వయింపవు. సమన్వయిస్తాయి అనుకోవడం యుక్తిదూరమే కాక వ్యక్తి దూరమేకాక అనుభవదూరం కూడాను.

ఆయీ రెండు అంశాలున్నూ, అవాంతరంగా యింకా కొన్ని దొర్లివుంటే వుండవచ్చును. ముసలివ్రాంత, నల్లమందువ్రాంత. యేదో నాకే చేదస్తంగా వుంటుంది. కవిత్వానికీ బ్రాహ్మణ్యానికీ సంబంధం లేదని ప్రాక్కాలీనులు క్షత్రియాదుల వల్లనే తేలింది.

(మాఘుఁడు వైశ్యుఁడని విద్వత్పరంపర చెపుతారు) కాని కవిత్వానికీ, పాండిత్యానికీ చుట్టఱికం అక్కఱలేదని యీశతాబ్దానికి పూర్వం తేలలేదు. చూడండీ, వొక్క రేఫశకటరేఫలను గూర్చి యెందఱు యెంతశ్రమచేశారోను. "ద్విరేఫదర్పణం" వగయిరాలు చూస్తే పై సంగతి తెలుస్తుంది. యిటీవల తెలుఁగుమీఁఱినకొలఁదిని యతిప్రాసలు, వ్యాకరణం వగయిరాలుకూడా అనావశ్యకా లన్నంత వఱకు వచ్చింది. అందుచేత యేదో గణబద్ధం చేసేమాత్రంలో వుండే వ్యక్తి మహాభారతకర్త వ్యాసులను పట్టుకొని తోఁచినట్లల్లా అనడం, యేవో కర్ణకటువైన ప్రతిజ్ఞలు చేయడం యీస్థితికి వచ్చింది యీనాఁడు కవిత్వం. తీరా యెదురుకుంటే "మాబావని కొట్టిచూడు" అనడానికే అధికారం గాని అంతకు మించి లేదు. ఆయీరకంవారితో కొందఱు వాదానికి వుపక్రమిస్తూన్నారు. అది శోచనీయం. ఆఖరికి "నాయబ్బజిజ్ఞాసా, నీతాతజిజ్ఞాసా" వలె పరిణమించింది. ఆఖరికేకాదు దానిధోరణి మొదటనే అట్టివాసన కొట్టింది. పెద్దలు అట్టివాదం పెట్టుకోరాదు. భవభూతి "ఘటానాం నిర్మాతు స్త్రిభువనవిధాతుశ్చకలహః" అన్నాఁడా లేదా? "భవే దద్యశ్వోవా కిమిహ బహునా పాపిని కలౌ" శాంతం పాపం. దాసు శ్రీరామకవిగారు "పున్నెమ? పూరుషార్థమ? బుభుక్షువు చేసిన బ్రాహ్మణార్థమా?" అన్నారు. కనక పెద్దలు యిట్టి వారితో వాదాలు పెట్టుకోవడం నాకు అభిమతం కాదని నమస్కార పూర్వక విజ్ఞప్తి. యే బాపతు ఐశ్వర్యంగాని వొకటే తెగని ఆశ్రయించి వుండదు. అందఱినీ సంతోషపెడుతూ వుంటుంది పర్యాయంగా; కొన్నాళ్లు దేవతలేలితే, కొన్నాళ్లు రాక్షసులు. అప్పుడు వారికి వీరు సలాం. ఇప్పుడో? వీరికి వారుసలాం యింతే ఐశ్వర్యప్రకృతి. మురారి యేమన్నాఁడు?- శ్లో."కస్మైచిత్కపటాయ... నీచాన్నీచతరోపసర్పణ మపామేతత్కిమాచార్యకమ్" అన్నాఁడు. దీని తాత్పర్యం వ్రాయవలసివస్తే చాలా పెరుగుతుంది. చిరకాలం రావణున్ని ఆశ్రయించిన లక్ష్మి రాముణ్ణి (మనుష్యమాత్రుణ్ణి) ఆశ్రయించిందని ఫలితార్థం. వేదశాస్త్రాలను గూర్చి చెప్పలేనుగాని తక్కిన కవిత్వాదులు జాతిభేదంతో పనిలేకుండా అందఱికీ అలవడతాయనే నేను అనుకుంటాను. వేదానికీ, శాస్త్రానికీ వున్న బాధ లోఁగడ వుదాహరించే వున్నాను. పుస్తకాలు చూచి వేదం వల్లించినా అదిసక్రమమైన అభ్యాసం కాదు. దాన్ని శ్రుతి అనడంలోనే వుంది ఆ తాత్పర్యం. సంప్రదాయసిద్ధంగానిదీ యేవిద్యా ఫలించదు. కనక వేదమంటే మావంటి బ్రాహ్మణబ్రువులకు భయం. దాని అంగాలన్నా (వ్యాకరణాదులు) అంతే. జర్మనీలో వేదార్థం తెలిసినవా రున్నారంటారే; వున్నమాట నిజమే. వారికీ ఉచ్చారణ కుదరదు. వారికే కాదు. దశవిధ బ్రాహ్మణులలో యెందఱికో కుదరదు, ఆంధ్రులకూ ద్రావిడులకూ మాత్రమే యీమహాభాగ్యం. వీరు వేదం పఠిస్తూ వుంటే తక్కిన అష్టవిధ బ్రాహ్మణులూ చాలా ఆప్యాయనంగా విని ఆనందిస్తారు. యిఁక ముందేనా వేదానికి ఆంధ్రులూ

ద్రావిడులూ మాత్రమే జీవం నిల్పాలికాని యితరులవల్ల అయీ కార్యం తుదనెగ్గదు. కర్ణాటకులూ మహారాష్ట్రులూ వేదం చెప్పుకోవడం మట్టుకు క్వాచిత్కంగా వుందని వినికిడి వుంది. ఘూర్జరులలో చెప్పుకోవడం కూడా దృశ్యాదృశ్యమే. మాగురువుల రోజులలో లోకైకమహావిద్వాంసులు బాలశాస్త్రులవారు యజ్ఞం చేసినప్పుడు శ్రౌతులు మన ఆంధ్రదేశాన్నుంచేఆహ్వానింపఁబడ్డారని మాపరమగురువుల వల్ల విన్నాను. ఇది విషయాంతరం.

కవిత్వం యావత్కులాలవారిదీగాని వొకకులంవారిది కాదన్నది ప్రధానాంశం. అయీమాట వారివారి మాతృభాషకే సమన్వయిస్తుంది. సంస్కృతకవిత్వం ధార వున్నంతలో సాధ్యంకాదు. కాని క్వాచిత్కంగా స్త్రీశూద్రులలో సంస్కృత కవులున్నారని వేశ్య మంజువాణి ఋజువుచేసింది. తెలుఁగులాగే వ్యావహారికంలో దాన్ని నడపడానికి అవకాశంలేదు. అది యావత్తూ గ్రంథాలద్వారా, గురువులద్వారా సంపాదించుకోతగ్గదే కాని వ్యవహారంవల్ల అలవడేది చాలా తక్కువ. మన ఆంధ్రంలో సంస్కృతం కొంత మార్పుచేసి సంస్కృతాన్ని (తత్సమం) కల్పుకుంటున్నాం. కన్నడంలోనో? అఱవంలోనో? లేక ఆరెంటిలోనూ కూడానో? మార్పులేని సంస్కృతాన్ని కలిపి మణిప్రవాళనామంతో వాడుకుంటారనివిన్నాను. శిష్టసమ్మతిలేదు గాని మన భాషలోకూడా కొంచెంగా కనపడుతుంది ఆలాటి కవిత్వం.

శ్లో. తిండికై తె పదిమంది వసంతీ, తండులాలు గృహమందు నసంతి
రండనాకొడుకులెల్ల హసంతి, కొండగోగులు గృహే విలుఠంతి.

యీరచన చాలా అందంగానే వుంది. అరవకవిత్వానికివలె ప్రాస మాత్రం వుంది. ఆఖరుచరణంలో రెండున్నూ, తక్కిన చరణాలలో వొక్కొకటిన్నీ కేవల సంస్కృతాలున్నాయి. మన భాషలో కూడా యీ మాదిరి రచన వుంటే బాగుంటుందేమో? మణిప్రవాళ నామధేయ (శిష్టులు సమ్మతిస్తే) దీనికే చెల్లుతుంది. కొంటెతనానికి యెవరో చెప్పినవి యీలాటివి మనతెలుఁగులో స్వల్పంగా యింకా వున్నాయి.

శ్లో. అస్థివ ద్భకవచ్చైవ చల్లవ ద్వెల్లకుక్కవత్
రాజతే భోజతే కీర్తిః పున స్సన్న్యాసిదంతవత్.

శ్లో. ఏకైకదుడ్డుః కులపండితానాం
దుడ్డుద్వయం కుండలపండితానామ్
యేగాని యేగాని మహాకవీనాం
కాసుద్వయం చిల్లర బ్రాహ్మణానాం.

కవిత్వ మంటే తన మనస్సులో వున్న భావాన్ని యితరులకు తెల్పుడు చేయడమే కనక యేలాటిభాషలో తెల్పుడు చేస్తే యేమి అనే వాదం యిప్పుడు బయలుదేరింది. క్వాచిత్కంగా పండితులుకూడా దీనికి బాసటగా వుంటూన్నారు. మునుపు (పాండిత్యం లేకపోయిన పక్షంలో) నిశితమైన ధార స్వతస్సిద్ధమైనది వుండిన్నీ యెందఱో దాన్ని వృథాచేసుకోవలసి వచ్చేది. యిప్పుడాలా కాకుండా ఆలాటి ధార కలవారి రచనకు కూడా శిష్టపంక్తిలోకన్నా హెచ్చు పంక్తిలో స్థానం దొరికింది. శ్రీనాథాదుల రోజులలో ద్విపద కావ్యానికే గణన లేనట్టు కనపడుతుంది. కాని సంస్కృతంలో వుండే అనుష్టుప్పునకు తెలుఁగులో సరిపోయేది ద్విపదే అనుకుంటాను. ద్విపదలు, రగడలు వగయిరాలు పదకవిత్వానికి చేరిపోయాయి. పద్యకావ్యాలలో యెక్కడేనా కీర్తన యిమిడిస్తే దాన్ని కవులు ఆక్షేపించేవారు. శ్రీ మాడభూషి వేంకటాచార్యులవారు (అపరపండితరాయలు) పదకవిత్వాన్ని భరతాభ్యుదయంలో వాడే టప్పటికి అల్లంరాజు సుబ్రహ్మణ్యకవిగారు ఆక్షేపించడం నేను నాచిన్నతనంలో యెఱిఁగిందే. పద్యకావ్యాలలో ద్విపద లంతగా వాడడం లేదుగాని ప్రత్యేకించి ద్విపదగానే కొన్ని గ్రంథాలు పూర్వకవులు రచించారు. రంగనాథ రామాయణం వాట్లలో అగ్రస్థాన మలంకరిస్తుంది. శైవకవులు పూర్తిగా ద్విపదలోనే రచన సాగించారు. నన్నయ్యగారినాఁటికి వ్యాపకంగా వున్న అక్కరలు, మధ్యాక్కరలు, తరువోజలు క్రమంగా నామమాత్రావశిష్టా లయినాయి. యిప్పుడు భావకవులు మఱికొన్ని క్రొత్తపేరులు కల్పించికొని వాట్లలో తమభావాలను ప్రకటిస్తూన్నారు. కవిత్వానికి శ్రోతృరంజనం ముఖ్యం. దాన్ని మఱవకుండా రచిస్తే అది "లోకులరసనలె ఆకులుగా" చిరకాలం వుంటుంది. మనకి అచ్చుయంత్రం "నక్కపుట్టి నాల్గువారా లయిందన్నట్లు" నిన్నమొన్నగదా వచ్చింది. అంతకుపూర్వం పుట్టిన మనవారి రచనల జీవాతువులు "లోకులరసనలే" అన్నమాట యేకవిన్నీ మఱవరాదు. తెలుఁగురచన అంతకు పూర్వం వున్నా దాన్ని మంచిత్రోవలో పెట్టి రచన సాగించి మనకింత భిక్ష పెట్టింది నన్నయ్యభట్టు. అతనికి చేదోడువాదోడుగా వున్న మహావిద్వాసుఁడు నారాయణభట్టు ఆంధ్రంలోఁగాని, సంస్కృతంలోఁగాని కన్నడంఁగాని యేవో కొన్ని మహా గ్రంథాలు రచియించే వుంటాఁడు కాని అవి యింతవఱకు పైకి రాలేదు. కొందఱు నిన్న మొన్న వ్రాస్తారుకదా- "భారత రచన ఆ నారాయణ భట్టుదే. నన్నయ్య తద్దినం బెట్టేవాఁడి తమ్ముఁడు ... లాగు వుండి వుంటాఁ"డని వ్రాశారు. ఆ యీమాట లోకానికి నచ్చితే సంతోషమే. వారిద్దఱూ కూడా మనకు రక్త సంబంధులుకారు. కవితారచన ద్వారా బంధువులు. "ఘనమతు లెల్లవారికి నకారణబంధులుగారె సత్కవుల్" తెనాలిరామలింగాన్ని విశ్వబ్రాహ్మణులు మావాఁడని అభిమానించినట్లే నేఁడు కొందఱు నన్నయ్య మావాఁడనడమూ కలదు. ఇతణ్ణిగూర్చి

మాత్రమే బేవారసాస్తినివలె యెవరి మట్టుకువారు మావాఁడే అనడానికి అవకాశం వుందికాని తదితరులనుగూర్చి అనడానికి అవకాశంలేదు. యిప్పుడు నేను భట్టుమూర్తిని మావాఁడంటే నే నాకులంలోకి చేరవలసి వస్తుంది. కాని అందుక్కూడా సిద్ధపడే వ్యక్తులు కొందఱు వున్నారు. దానిక్కారణం అతనికవిత్వమందుండే గుణమే. "కవీనాం కో దోష స్తు గుణ గణానా మవగుణః" అన్నాఁడు మురారి. కవులంతా రాముణ్ణే ప్రేమించినట్లు నన్నయ్యనీ ప్రేమిస్తారు. అతఁడు భిక్షాప్రదాత. "సీ. నన్నయకవి పెట్టినాఁడుకదా? తిక్కనాదికవీంద్రుల కాదిభిక్ష" నన్నయంటూ పుట్టకేపోతే యేంజరిగేదో? అప్పుడు యావత్తుభారమూ తిక్కన్నగారిమీఁదే పడి భిక్షాప్రదాత యీయనే అయేవారు. ఒక్కచేఁతిమీఁదుగా రచించినట్లయేది. ౧౫ పర్వములు రచించిన సోమయాజులుగారే ఆమూఁడు పర్వాలూ కూడా రచిస్తే అని విచారపడేవారున్నూ లేకపోలేదు. అట్లెందుకు జరగలేదో అది మనకు గోచరించేది కాదు. ఆయన ఆకాలంలో యెవరేనా యీప్రశ్నవేస్తే యేమని జవాబిచ్చేవారో తిక్కనగారు. ఆ జవాబు పుక్కిటి పురాణంగానేనా చెప్పుకొనేవారు కవులలో వున్నట్లు లేదు. "అం దాదిదొడంగి మూఁడు కృతులాంధ్రకవిత్వవిశారదుండు విద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్" అనిమాత్రమే సోమయాజులు గారు వ్రాసి వూరుకున్నారు. యిందులో వేసిన విశేషణాలు వొకటి ప్రాసక్రింద రెండుయతిక్రింద జమకడితే మిగిలేదల్లా, నన్నయ్యభట్టుమాత్రమే. "దక్షతన్" అనేది పాదపూరణార్థమైనా కావచ్చును. ఆయన్ని ద్వేషించే వారికిదే మార్గం. శివకేశవులకు పరస్పరద్వేషాలులేనట్లే నన్నయతిక్కనలకున్నూ లేవు. వారు సమకాలీనులు కారుగదా? నన్నయ్యగారియందు యితరకవులతోపాటు తిక్కన్నగారికి పరమాదరమే అని మన మనుకోవాలి. ఆయీ అంశమును తిక్కన్నగారి ప్రయోగా లుదాహరించి చర్చిస్తే కవిలోకానికి కొంత వుపకరిస్తుంది గాని అంత వోపికగాని, కొంత వోపికగాని నాకులేదు. యీవ్రాఁత ఆకాశపురాణపువ్రాఁత. కొందఱు నన్నయ్యగారి ద్రౌపది, తిక్కన్నగారి ద్రౌపది అంటూ విడదీసి వారి వారి అభిప్రాయాలు ప్రచురిస్తారు. ఆయీ విషయం బొత్తిగా నిరాధారమని మన్మిత్రులు సతీర్థులు కాశీభట్ల సుబ్బయ్య శాస్త్రులవారు పెద్దవ్యాసం వ్రాసి ఋజువు పఱచినారు. ద్రౌపది వ్యాసభట్టారకునిదే గాని యిం దెవ్వరిదిన్నీ కాదని నే ననుకుంటాను. కొంచె మించుమించుగా అనువదించడం అనువాదకుల ఆచారం. అంతమాత్రంచేత వారికి వీరు వంకలు దిద్దినవారుకారు. అట్లు వ్రాయుట వ్యాసభట్టారకుని నిందించుటే.

ప్రసక్తానుప్రసక్తంగా చాలాదూరం వచ్చాం. వాల్మీకి వ్యాసుల ద్వారా పరిశీలించినా బ్రాహ్మణేతరులకూ కవిత్వానికీ చుట్టఱికం ఉంటుంది. అప్పకవివ్రాఁత స్థూలదృష్టిప్రయుక్తం. యింకో మాట వ్రాయడం మఱచాను. యేదో శాసనంలో భారతాన్ని రాజనరేంద్రుఁడే

రచించినట్టు కనపడుతుందనిన్నీ, అందుచేత నన్నయభట్టుకీ, భారతానికీ సంబంధమే లేదనిన్నీ సుమారిప్పటికి ముప్ఫైయేళ్లనాఁడు వొక క్రొత్తవాదం బయలుదేఱింది. దానికి ఆధారం రాజనరేంద్రుఁడు భారతం రచింపచేశాఁ డని చెప్పడానికి "కారయామాస" అనక "చకార" అని అంతర్భావితణ్యర్థం వాడడమే. అక్కడక్కడ అంతర్భావితణ్యర్థాలు వాడడం కవుల ఆచారంవుంది. ప్రకరణాన్ని బట్టి వ్యాఖ్యాతలు వాట్లని వ్యాఖ్యానిస్తూ వుంటారు. "వ్యాఖ్యానతో విశేష ప్రతిపత్తిః" రాజనరేంద్రుఁడు భట్టారకుణ్ణి ఆహ్వానించడం వగయిరా పీఠికలో వుందాయె. (౧) "పాండవోత్తముల చరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్టము" (౨) "ఇవి యేనున్-భారతశ్రవణాసక్తియు..." ఇత్యాదిగా వుండే రాజుగారి వాక్యాలు ఆశ్వాసాదినీ ఆశ్వాసాంతాన్నీ వున్న పద్యాలు, గద్య వీట్ల నన్నిటినీ ఆ "చకార" అనే క్రియ త్రోసివేయఁగలదా? కృష్ణదేవరాయలవలె రాజనరేంద్రుఁడు కవిగా యెక్కడా ప్రతీతి లేదు. కనక ఆవాదం కొలఁదికాలంలోనే అంతరించింది. నిన్నమొన్న నన్నయభట్టు సహాధ్యాయి నారాయణభట్టే కృతికర్తంటూ వాదం బయలుదేరింది. ఆమాటే నిజమైతే "పాయక పాకశాసనికి భారత... తోడయి నిర్వహింపఁగన్" అనే పద్యం చాలా మార్పు చేయాలి. చేస్తేమాత్రం పండితలోకం విశ్వసిస్తుందా? అసలు కవుల చరిత్ర బొత్తిగా లేనప్పుడే యేదో ఆకాశపురాణంగా చెప్పుకొనేవాళ్లు ఆ పుక్కిటిపురాణ వాక్యాలు కొన్ని విశ్వాస్యాలుగా వుండకపోయినా అసలుకి భంగం గలిగించి తుండూ తుపాకీనీ లేకుండా యెగరఁగొట్టి "అహో మూలచ్ఛేదీ తవ పాండిత్య ప్రకర్షః" అన్నమాదిరిగా వుండేవి కావు. భారతానికీ, నన్నయభట్టుకీ సంబంధమే లేకుండా వుండే చరిత్ర యెన్ని ఆధారాలతో వున్నా లోకం విశ్వసించదు. కాని, లెక్కవ్యక్తులు ఒకరిద్దరు మాత్రం చాలా సంతోషిస్తారు.

"ఉ. సీతయు లేదు రావణుని చెల్లెలు లే దలరాముఁ డబ్ధిలో
సేతువు గట్ట లేదతనిచే దివిజారులు చావలేదు సా
కేత పురమ్ము లే దచటఁ గేకయ పుత్రియు లేదు సర్వము
న్నూతన సృష్టియే యన జనుల్ విని నవ్వుదు రేమొగమ్మునన్."

(ఇటీవలి చర్య.)

గతించిన చారిత్రిక సంగతులు యెవరు వ్రాసినా సరిగా వుండవు. పౌరాణికగాథలు కూడా సరిగావుండడంలేదుగదా? అతీంద్రియజ్ఞానం కల ఋషులే భిన్నభిన్నంగా వ్రాస్తే యితర పండితులనుగూర్చి చెప్పేదేమిటి? యేరోజు జరిగింది ఆరోజు వ్రాసుకోవడం అప్పటికాలపు పండితులకు అలవాటులేదు. కొన్ని గ్రంథాల చివర గద్యయే లేదు. పుష్పబాణవిలాసం ఆతెగకే చెందుతుంది. విపులమైన వ్యాఖ్యానం దానికి వుంది. కాని

వ్యాఖ్యాత మూలకారుని పేరు వుటంకించలేదు సరిగదా తన పేరున్నూ ఉటంకించుకోలేదు. శ్రీకృష్ణుని శృంగార చర్యలు ప్రతిపాద్యములుగా పెట్టుకొన్నిట్లు "భువనవిదిత మాసీద్ యచ్చరిత్రం" అనే శ్లోకంలో కనపడుతుంది. తరువాత యేశ్లోకంలోనూ ఆవాసన కనుపడదు. కొందఱు పుష్పబాణవిలాసం కాళీదాసకృత మనడం విన్నాను. యిలా వ్రాస్తూవుంటే యేదో తరవాయి వుంటూనే వుంటుంది. కవిత్వం బ్రాహ్మణుల సొమ్మే అని అప్పకవిగాని మఱివొకరు మాదే అని యెవరోగాని రిజిష్టరు చేయించుకోవడానికి యత్నించడం పరిహాసాస్పదం. "దేవుని పెండ్లికి అందఱూ పెద్దలే".

★ ★ ★

# అంతా రామమయం

యీ జగమంతా రామమయం. యీపదకవిత్వం యెవరిది? అంటే? భద్రాచల రామదాసుగారిదని ఆబాలగోపాలంగా అందఱూ యెఱిఁగిందే. దీన్ని మనం మన తెలుఁగు వ్యాకరణానుసారంగా గ్రాంథిక భాషలోకి మార్చుకుంటె- "అంతయు రామమయం, బీ జగమంతయు రామమయం॥" అని తేలుతుంది. కాని సహజమైన భాషలో యిచ్చినంత హాయి యీకృత్రిమ భాషలో వుండదు. పాడుకొనేవాళ్లు దీన్ని వాడవలసివస్తే గుఱ్ఱానికి కళ్లెం లాగిపట్టిన మాదిరిగా వుంటుంది. తుట్టతుదను విరమించినప్పుడు సున్నతో విరమించడం మాత్రం తప్పదు. అందుచేత వున్నదున్నట్టుగానే దీన్ని గానం చేయడంలోనే సుఖం కనపడుతుంది. గ్రాంథికంగా మార్చినప్పుడు గానానికి ఆనుకూల్యం పూర్తిగా లోపిస్తుంది. అందుచేతే అనుకుంటాను యీ రామదాసు మాత్రమే కాదు. త్యాగరాయలు కూడా యీ విధంగానే గేయాలు రచిస్తూ వచ్చారు.

(1) జగ మేలే పరమాత్మా? యెవరీతో మొఱలిడుదు.

(2) చక్కని రాజామార్గము లుండఁగ సందులు దూరనేలనే వో మనసా?

ఆయీ గేయాలు యథాశాస్త్రంగా దిద్దవలసివస్తే చాలాపదదుగా పరిణమిస్తాయి. ఏల అనే అవ్యయం కళేగాని వ్యావహారికంలో సర్వత్రాద్రుతప్రకృతికంగానే కనపడుతుంది. గేయాలకు గ్రాంథికభాష వాడిన కవులు చాలా అరుదుగా కనపడతారు. అధ్యాత్మరామాయణకీర్తనలు రచించినకవిన్నీ, మృత్యుంజయవిలాసం రచించిన కవిన్నీ గ్రాంథికభాషనే వుపయోగించారు. ఈపదకవిత్వంలో యెక్కడా వ్యావహారికం దొరలించనేలేదా ఆకవులు; అంటే వినండి, వారు గ్రాంథికంగా రచిద్దామని రచించారు. ఆంధ్రభాష మాతృభాష కావడంచేత చిన్నప్పటినుంచీ వాడుకొనే మాటలలోనే నేవేనా (బుద్ధిపూర్వకంగా కాదే అనుకోండి) కొన్ని దొర్లడం తప్పదు. ఈ పీడ పదకవిత్వం చెప్పేవారికే కాదు. పద్యకవులకున్నూ అనివార్యమే. నన్నయ తిక్కనాదులు వాడితే అవి "అనింద్య గ్రామ్యాలు" తదితరులు వాడితేనో? అవి నింద్య గ్రామ్యాలు. ఇంతే భేదం. శ్రీనాథుఁడెంతో గొప్పవాఁడై వుండిన్నీ కొన్ని గ్రామ్యాల వాడి వున్నాఁడు. (అఱువై, డెబ్బై, గొంతు గూరుచొని, పగయిరాలు చూ.) యే కవికేనా వంకలు పెట్టవలసి వస్తే తెలుఁగు మాటలలోనే తఱచు

అవకాశం వుంటుంది గాని సంస్కృతశబ్దాలలో అంతగా వుండదు. యెందుచేతంటారు? తెలుఁగేమో? అభ్యసించకుండా వస్తుందాయె. సంస్కృతం కష్టపడి గురుశుశ్రూష చేస్తేనే కాని రాదుగదా? అట్టి భాషలో యెవరికోతప్ప అపభ్రంశాలు దొర్లవు. (యీ మాట యిప్పటి నవకవులకు చెల్లుబడికాదు) గేయ కవితావిషయంలో అపభ్రంశాలు దొరలడం సంస్కృతంలోకూడా వున్నట్టే యీ క్రిందివాక్యంవల్ల స్ఫుటమౌతూ వుంది. "కి మపభ్రంశేన భవతి గీతస్య" అన్నాఁడు ఆచార్యగోవర్ధనుఁడు; యీ మాట సంస్కృత కవిత్వానికి లగించేదే గాని తెలుఁగుకి లగించేదికాదు. గోవర్ధనాచార్యులు తెలుఁగువాఁడని ప్రతీతిలేదు. ఇతని పేరెత్తిన జయదేవుఁడు గీతగోవిందకర్త కూడా తెలుఁగువాఁడుకాఁడు, వోఢ్రుఁడు. తరంగాలని వ్యవహరించఁబడే "కృష్ణలీలా తరంగిణిలో" విస్తరించి కాకపోయినా యే మాత్రమో వ్యాకరణదోషాలు దొరుకుతాయి. గోవర్ధనుఁడు చెప్పిన దానికి యీ తరంగభాష లక్ష్యమై యుండదు. నారాయణతీర్థులకన్న గోవర్ధనుఁడుచాలా పూర్వుఁడై వుండాలి. అష్టపదులు రచించిన జయదేవుఁడే తీర్థులకన్న ప్రాచీనుఁడు. ఆజయదేవుఁడు "ఆచార్యగోవర్ధనః" అని యితణ్ణి పేర్కొన్నాఁడు. మొత్తంమీఁదమాట సంస్కృతమనండి, తెలుఁగనండి యింకే భాషేనా అనండి గేయరచనలో వ్యావహారికాన్ని స్పృశించకుండా వుండదన్నమాట. పద్యకవిత్వంకన్న పదకవిత్వం ఆపాతమధుర మనేమాట అందఱూ వొప్పుకుంటారు. "ఆద్య మాపాతమధురమ్" అనేది సుప్రసిద్ధం. వినీ వినడంతోనే ఆకర్షించేది గేయం, దానికి భాషావిచారంతో పనిలేదు. గాని నూఱులో తొంబైపాళ్లు గీతానికే వదిలి పెట్టినా పదిపాళ్లేనా భాషను బట్టిన్నీ మాధుర్యం వుంటుంది. దాన్ని బట్టే గాయకులు సంగీతానికి వాడుకునేశ్లోకాలు "శ్లో. సజల జలదనీలం వల్లవీ కేళిలోలం" వంటివేకాని – "శ్లో. వాశ్చా రేడ్ధ్వజధ గ్ధృతోద్వధిపతిః క్రుధ్రేడ్గజానికిః" మాదిరివి వాడుకోరు. త్యాగరాయాదులు (పూర్వమెప్పుడో కొన్ని తరాలనాఁడు తెలుఁగుదేశస్థులే) అఱవదేశస్థులే అయినా రచన యావత్తూ తెలుఁగులోనే సాఁగించడానిక్కారణం భాషామార్దవాన్ని పట్టికూడా గానానికి కొంత మాధుర్యాన్ని సంపాదించే వుద్దేశం వుండఁబట్టియ్యేవే. శ్రీకృష్ణదేవరాయలు "దేశభాషలందుఁ దెలుగులెస్స" అని చెప్పడానిక్కారణం మార్దవాన్ని పురస్కరించుకొనియ్యేవే. అచ్చతెలుఁగుకున్నంత మార్దవం తత్సమమిశ్రమైన భాషకు వుండదు. (మ. కురువృద్ధుల్ గురువృద్ధబాంధవులనేకుల్. చూ.) అట్లే సహజమైన దేశ్యపు తెలుఁగున కున్నంతమార్దవం కృత్రిమ (కల్పిత) తెలుఁగుకున్నూ వుండదు. (సీ. పల్కుటాల్ దొరగ్రుడ్డు పనటు లాటలపట్టు. వగైరాలు చూ.) పై మాటకు అర్థం బ్రహ్మాండభాండము క్రీడాస్థానమని ఆ కృత్రిమ తెలుఁగు కన్న తత్సమపదమైనా బ్రహ్మాండ భాండశబ్దమే కొంత ఆనందాన్ని కలిగిస్తుంది. పదకవులు అచ్చతెలుఁగునే వాడరు గాని వినేటప్పటికల్లా అర్థం గోచరించే మిశ్రభాష వాడతారు.

(1) ఎందఱో మహానుభావు లందఱికి వందనములు.

(2) తెలివి యొకరిసొమ్మా? యెందుకే విభుని తిరుగ పొమ్మంటినమ్మా?

(3) అలిగితే భాగ్యమాయె మఱేమీ వాడలిగితే
తలిరుబోఁడిరో? వాని దండించఁగలనా? వా॥డలిగితే॥

యెక్కఁడేనావొకపదం తత్సమంపడినా అదికూడా తెలుక్కంటే కూడా సులభంగా అర్థమయేదే పడుతుంది పదకవిత్వంలో; అయితే పదకవులు ఆయీభాషావిభాగాన్ని ప్రయత్నపూర్వకంగా చేసి వాడివుంటారా? అంటే? వినండి నాఅనుభవాన్ని వివరిస్తాను. దైవాత్తూ వారి కాయీమాటలు దొర్లుతాయి కాని వారు దీనికి ప్రయత్నించరు.

చ. కనుఁగవ కింపు గల్గి తగు కామకలాభ్యసనంబు గల్గి జ
వ్వనమున లేఁత యయ్యు రసభావములన్ గడుఁ బెద్దయై తనం
తన వలపున్నదైన వనితామణి యెవ్వని కబ్బుఁ బ్రాగ్భవం
బునఁ దులలేని పున్నెములు పూవులుపూచి ఫలింపకుండినన్.

ఆయీ పద్యంలో అయిదు పదాలు సంస్కృత మనుకోవడానికి తగ్గగురుతుకల వున్నాయి. ఆఱోపదం తెలుఁగులోకలిసి పోయినమాదిరిదే. దీన్ని యీవిధంగా చెపితే బాగుంటుందని కవి అనుకొని రచించి వుంటాఁడనుకోవడం శుద్ధ పొరఁబాటు. కాంతలకు హావభావాదు లెట్టివో? కవుల కాయాయీ రచనావిశేషాలున్నూ (లీలావతీనాం సహజా విలాసాః భర్తృహరి చూ.) అట్టివే. విలాసాలే లేనిస్త్రీలున్నూ వుంటారు. రచనావిశేషాలు దొరలని కవులూ వుంటారు. ఇంతేకాదు, ఆయీ రహస్యాలు కనిపెట్టడం చేతగాని వ్యాఖ్యాతలున్నూ వుంటారు. (నాకు అన్నిరాగాలూ వొకటేలాగు వుంటాయి. అన్ని అత్తరువులూ కూడా డిటో అనే వారున్నూ కలరు.) తత్సమపదభూయిష్ఠంగా కవిత్వంచెప్పి ఆంధ్రకవికుల గురుత్వాన్ని కైకొన్న నన్నయ్యకవిత్వంలో కూడా యీపోకళ్లు వున్నాయి.

క. దేవసములైన యనుజుల
తో విప్రులతో రథాళితో వచ్చి యర
ణ్యావాసము సేసెదు ధర
ణీవల్లభ? నీవు ధర్మనిష్ఠితబుద్ధిన్.

యీపద్యంలో మూఁడుపదాలు మాత్రం తెలుఁగు వున్నాయి. తక్కిన యావత్తూ సంస్కృతమే అయినప్పటికీ వినేటప్పటికల్లా అర్థం గోచరిస్తూ వుండడంచేత దీన్ని జాను తెలుఁగు కింద జమకట్టినా వొప్పుతుంది. పదకవుల కవిత్వం యావత్తూ యీలాగే

వుంటుంది. సంగీతవిద్వాంసులలో వొక్క దీక్షితులవారి కవిత్వం మాత్రం కొంత పెటుకుగా కనపడుతుంది. ఈయన రచన సర్వమూ సంస్కృతమే. ఆకారణంచేత పెటుకనుకుందామా? ఆలాగేఅయితే జయదేవుని అష్టపదులకు యీదోషం తగలలేదే? ("సకురు నితంబని? గమన విలంబన మనుసర తం హృదయేశం" వగైరాలు చూ.) మొత్తం కవిత్వానికి మెఱుఁగు తెచ్చేది ప్రసాదగుణ మనిన్నీ ఆగుణం పదకవులలో విశేషించి కనపడుతుందనిన్నీ చెప్పినట్లయింది. అంతేకాదు ప్రసాదగుణానికి కారణం వ్యవహారంలోవుండే మాటలు తఱుచుగా వాడుకోవడమనిన్నీ చెప్పినట్లయింది. అయితే ఆపక్షంలో వ్యాకరణానికి స్వస్తిచెప్పవలసి వస్తుందేమో? అక్కఱలేదు. లోకోక్తుల మట్టుకు వ్యాకరణబాధ లేకుండా లాక్షణికులే శాసించారు. "లోకోక్తీనాం భవేద్యోగో యథా వచ్ఛ్రుతిరంజనమ్." యీలాగు అభ్యనుజ్ఞ నిచ్చినా కొందఱు లోకోక్తులలో వుండే వ్యాకరణ దోషాలను సవరించి వుపయోగిస్తూ వచ్చారు కాని, పింగళిమహాకవి యథాస్థితంగానే వాడుకున్నాఁడు.

(1) "రోళ్లా రోఁకళ్లంబాడిన కూరుము లిపుడింత దాఁచికొన్న నడఁగునే?"

(2) నుయిదాఁటే వానికిన్ జింతయాకంతైనన్ గడమైననున్.

(3) పాలు విఱిఁగితే పెరుగగునే?

2-3 నెంబర్లు, రామలింగని కవిత్వమున్నూ సారంగుతమ్మయ్య కవిత్వమున్నూ అని యెఱుఁగుదురుగదా? 'విజయవిలాసకవి' చేమకూరకవి విజయవిలాసంలో కంటేకూడా సారంగధర చరిత్రలో లోకోక్తులెక్కువగా వుపయోగించాఁడు. విజయవిలాసంకంటే సారంగధర చరిత్రకే యెక్కువ పేరు వస్తుందని గ్రంథకర్త అభిప్రాయపడి వుంటాఁడని నావూహ. కాని యేకారణంచేతనో అలాజరుగలేదు. "చేమకూరపాకాన్ని పడింది" అన్న ప్రతిష్ఠ విజయవిలాసంవల్లనే కలిగిందని నాతాత్పర్యం. యిది విచారణాంతరం. లోకోక్తులంటే? వ్యావహారికపుమాటలన్నమాట. తఱచువ్యవహారం (కాస్తపరిశుద్ధమైనవారు వాడుకొనే దన్నమాట)లో నలిగేమాటలతో కవిత్వం చెప్ప గలిగితే అది పాఠకలోకాన్ని రంజింపఁగలిగినట్టు శాస్త్రాలు శోధించి దిద్దితీర్చి (శ్రౌత్రార్థాంతీచణైర్గుణ్యోః-చూ.) రచించిన రచన కలది రంజింపఁజాలదు. కూచిమంచి తిమ్మకవిగారు ఆకాలపు రుచినిబట్టే అనుకుంటాను వొకసీసపద్యం,

"సీ. పరిలిపరి పీలుకర్బురపు రక్షణుఁడు."

అని కాఁబోలు అంతారాతిమయం అన్నట్లు రచించారు. చాలామంది దానికి అర్థం చెప్పవలసిందని అడుగుతూవుంటారు. కొందఱు చెప్పఁగలవారున్నూ వున్నారు. చిన్నప్పుడు

విన్నాను. కాని యిప్పుడెవరేనా చెప్పవలసిందని అడిగితే మల్లాపుస్తకాపేక్షే. పాకాలలో నారికేళపాకం కూడావున్న మాట అందఱూ యెఱింగిందే కాని పైనిచూపినరచన దానికి వుదాహరణం కాదు. దానికి వుదహరించవలసి వస్తే-

మ. తలఁబక్షచ్చటఁ గ్రుక్కి బాతువులు కేదారంపుఁ గుల్యాంతర
స్థలి నిద్రింపఁగఁజూచి ఆరెకు లుషస్స్నాత ప్రయాత ద్విజా
వళి పిండీకృత శాటులం చవి తదావాసంబులన్ జేర్ప రే
వులడిగ్గంగను వారిఁ జూచి వెస నవ్వున్ శాలిగోప్యోఘముల్.

యీలాటి పద్యాలు వుదాహరించవలసి వుంటుంది. కొంత శ్రమపడ్డ తర్వాతనేనా రసంస్ఫురించే కవిత్వానికే నారికేళ పాకమనే పేరువర్తిస్తుంది కాని, యెంతో పరిశ్రమమీఁద అర్థమ్మట్లుకు తెలిసి అప్పుడు కూడా రసం కనపడని కవిత్వాన్ని నారికేళపాకంగా సహృదయులు భావింపరు. తత్సమపదాలే అక్కఱలేదు. అచ్చ తెలుఁగు పదాల కూర్పులోకూడా కొంత పెటుకుగా వుండే రచనలు వుండడం కలదు. యెక్కడ దాఁకానో యెందుకు దీనికి వుదాహరణం "మూఁడు పంగల యీటె మోపినాఁడు" వగయిరా వాక్యాలు మనుచరిత్రనుంచే వుదాహరింపవచ్చును. ఆ మాటకంటె, తత్సమపదమైనా త్రిశూలం అని వాడుకుంటేనే హృద్యంగా వుంటుంది. కవి తనకు పదజాలం యెక్కువగా తెలుసుననే సంగతి లోకానికి తెలపడానికే అయితే నిఘంటును నిర్మిస్తే స్వాభిప్రాయం నెఱవేఱదా? (తే. గీ. తనకు నాల్గు నిఘంటుపదములు వచ్చుననుచు, చూ.) ఆఖరికి శుద్ధవ్యావహారిక భాషలో కవిత్వం చెప్పవలసిందని నీ తాత్పర్యమా? అని నన్ను మీరడుగుతారేమో! ఆలా అడగండి. వ్యవహారంలో నలిగే మాటలతో రచించడం మంచిదని నేను జవాబు చెపుతాను. వ్యవహారంలో కొంత సంస్కారశూన్యంగా వుండేమాటలు సంస్కరించుకొని వాడుకుంటే అవి గ్రాంథికభాషగా చెలామణీ అవుతాయి. కొంచెం వ్యాఖ్యానించి చూపుతాను.

క. ఈలోకమయగుఁ గొందఱ
కాలోకమకొందఱకు నిహంబును బరమున్
మేలగుఁ గొందఱ కధిపా?
యేలోకము లేదు సూవె? యిలఁగొందఱకున్

యీ పద్యంలో మాటలన్నీ పండిత పామర సాధారణ్యంగా లోకంలో అందఱూ వాడుకొనేవే. పద్యంలో పెట్టడం కొంచెం సంస్కరించి పెట్టడం జరిగింది. సంస్కరించని పూర్వం యీలా వుంటుంది. "కొంతమంది కేమో యీలోకమే సౌఖ్యకరంగా వుంటుంది.

కొందఱికేమో? ఆలోకం మాత్రమే. కొందఱికి రెండున్నూ అనుకూలిస్తాయి, కొందఱికి రెండూ కూడా చెడుగుగానే వుంటాయి." అనే వ్యావహారికపు మాటలకే కొంత మెఱుఁగుపెట్టి ఛందోబద్ధంచేస్తే లోకోత్తరమైన పద్యంగా పరిణమించింది. యెవరు కవిత్వం చెప్పినా యాభై యాఅక్షరాలలోనే. వొక్కొక్కరి కూర్పు ఆనందజనకంగా వుండడానికిన్నీ, వొక్కొక్కరిది అన్యథా వుండడానికిన్నీ కారణం చెప్పడం కష్టం. అందఱు వండే పదార్థాలూ వొక మాదిరివే. పాకభేదంవల్ల రుచి భేదించడంలేదా? అన్నీ మామిడిచెట్లే. ఆకులు వగైరాల ఆకారంలో భేదం తెలుసుకోవడం దుర్ఘటం. పండ్లలోరుచి భేదం కలగడం లేదా? యెంతమట్టుకు కవిలోకాన్ని గురువుగా పెట్టుకుని రచన సాగిస్తాఁడో అంతవరకే రచన రుచిస్తుంది. లోకాన్ని నిరసించాఁడా? అధఃపతనం తప్పదు. భవభూతి యేదో సందర్భంలో "ఉత్పత్స్యతే మమతు కోపి సమానధర్మా" అని అంటే అన్నాఁడుకాక. యేదో నీరసరచన రచించే ప్రతికవికిన్నీ భవభూతి వాక్యం వుపాదేయం కాదు. భవభూతి కవిత్వం లోకగురుకమేకాని లోకాన్ని వదులుకున్న సంస్కృత కవిత్వం పూర్వకవులకు దేశభాషమాదిరినే నడిచేదేమో కాని యిప్పటి కవులకట్లు నడవదు. తెలుఁగుసహజంగా నడుస్తుంది. వ్యావహారికభాషను వదులుకున్నా అవ్యయాలు వగైరా తెలుఁగు కవిత్వంలో వ్యావహారికంగానే దొర్లుతాయి. యీ విషయానికి వుదాహరణలు చూపవలసివస్తే భారతంలో చాలా భాగం వుదాహరించవలసి వస్తుంది. "వారువచ్చి నీకిచ్చిరేని పాణి గ్రహణము చేయుము నన్నున్." అన్నాఁడు కదా? నన్నయ్య. యిది సంస్కృత మర్యాదనుబట్టి సమన్వయిస్తుందా? చేయుధాతువు ద్వికర్మకం కాదు. అట్టి స్థితిలో నీవు నన్ను పాణిగ్రహణం (పెండ్లినిచేయుము) అంటేసమన్వయించిందా? యథాకథంచిత్తుగా సమన్వయించిందే అనుకుంటే వచ్చేవిప్రతిపత్తి చూడండి. శకుంతలావాక్యం గదా యిది. ఆమె దుష్యంతుణ్ణి తన్ను పెండ్లియాడవలసిందని చెప్పేమాటకు మఱోలాగు అర్థంవస్తూవుంది. నీకు నన్ను పెండ్లిచేయుము. యెవరికో అన్యులకిచ్చి పెండ్లిచేయవలసిందని కంఠోక్తిగా చెప్పినట్లయింది. దానితో రసాభాసం సిద్ధమయింది. (ఏకత్రైవానురాగశ్చేత్ చూ.) అసలు నన్నయ్యతాత్పర్యం శకుంతల దుష్యంతుణ్ణి మనస్ఫూర్తిగా వరించివుండిన్నీ, తండ్రిగారి సమ్మతి పర్యంతమున్నూ వేచివుండవలసిందని కొంచెం వ్యవధిని సూచిస్తూ దానిమీఁద దుష్యంతుఁడు హతాశుఁడయి బలాత్కారానికి (కామాంధానాం యుక్తా యుక్తవివేక శూన్యత్వాత్) సిద్ధపడతాఁడేమోనని తండ్రిగారికి కొన్ని విశేషణాలు. (1) కరుణా నిరతులు (2) ధర్మస్వరూపులు అనేవి వేసినారు, తప్పక మనయనురాగమును గౌరవిస్తారని గుప్తంగా తెలుపుడుచేసింది. నన్నయ్యగారి కవితా ప్రాశస్త్యాన్ని తెలపడానికి (1) ఉ. నిండుమనంబు నవ్యనవనీత (2) మ. మదమాతంగ తురంగ. అనే పద్యాలు వుదాహరించి యేవోకథలు వుద్ఘాటిస్తూ వుంటారు. ఆ పద్యాలు

హృద్యాలు కావని నేననేదిలేదు కాని నేను చూపిన యీ పద్యం లాక్షణికులు వుత్తమకవిత్వానికిచెప్పిన (జీవితం వ్యంగ్యవైభవమ్) సూత్రానికి ప్రథమోదాహరణం కావడమే కాక కూర్పువిషయంలో కూడా మిన్నగా పరిగణించఁ బడుతుందనిన్నీ, ఛందోబద్ధంగా వుంది కనక దీన్ని పద్యమనుకుంటూ వున్నాంగాని అలాగే కాకపోతే యిది వచనమే అనుకోవచ్చుననిన్నీ నా తలఁపు. తీగదీస్తే డొంకకదులుతుంది. అసలు వ్రాయడానికి పెట్టుకొన్న విషయంవేఱు. గద్య పద్య కవిత్వాలకు వుండే భేదం వ్యాఖ్యానించవలసివస్తే కొంత పెరుఁగుతుంది కనక వుపేక్షిస్తాను. యెంతటి మహాకవి రచించినాక పద్యమనే టప్పటికల్లా యతికో, ప్రాసకో, గణానికో వ్యర్థపదంపడి తీరుతుందనిన్నీ వొకవేళ ఆపదం అవసరమేఅని రచయిత సమన్వయించినా అది లోఁగడ చెప్పిన స్థానాలలో వుంటే వ్యర్థపదంగానే పరిగణించఁబడుతుందనిన్నీ గద్యకు యీ కళంకాన్ని కల్పించడానికి అవకాశమే కలగదనిన్నీ చెప్పితే ప్రస్తుతం చాలుననుకుంటాను. నన్నయ్యగారు పద్యంగానే చిత్రించినా వొక్క లఘువుగాని, గురువుగాని యితరులు సవరించడానికి చోటులేదు. సవరించడానికే చోటు (అవకాశం) లేకపోతే యిదే తాత్పర్యాన్ని మఱివొక పద్యంలోఁగాని లేదా అదేపద్యంలోనేకాని యిమిడ్చి కవితసాఁగించి లోకాన్ని మెప్పించఁగలమా? నామట్టుకు చేతగాదన్నంతవఱకే నాకధికారం. అది అలావుంచుదాం. క్రియాకారకాన్వయాన్ని కుదుర్చుకుందాం. “నన్ను పెండ్లాడుము” అని వ్యావహారిక భాషలో వుంటుంది. ఆపద్ధతిని చేయుము అనేక్రియకు ఆత్మనేపదార్థకంగా (కొనులేకుండా కూడా ఆత్మనే పదంవుంటుంది) చేసికొనుము అంటే సమన్వయిస్తుంది. కొంతమంది సంస్కృత భాషామర్యాదనుబట్టి సమన్వయించడానికి పూనుకొని తికమకపడతారు. ఆపద్ధతిని పైవాక్యం “మాంత్వం వివాహంకురు” అని కావలసివస్తుంది. కాని సంస్కృతభాషా మర్యాద నెఱిఁగిన కవిమాత్రం పైవాక్యాన్ని యేవగించుకుంటాఁడు. తెలుఁగులో నన్ను పెండ్లిచేసుకో అనడంకంటేకూడా నన్ను పెండ్లాడు అనేదానికే ప్రాచుర్యం. “నన్ను పెండ్లాడవే చెంచీతా మేనత్తకూఁతురవె చెంచీతా” పద్యంలో యే మాటలలో వున్నా భావంమాత్రం పెండ్లాడుము అనేదే. అయితే చేయుము అనేదానికి ఆడుము అనే అర్థం వస్తుందా? అంటే వినండి. చేయుము అంటేరాదుగాని, దానికి ఆత్మనేపదంగా చేసికొనుము, అని అర్థంచెప్పుకొనే పద్ధతిని అదే అర్థం ఫలితమౌతుంది. క్రియలో మాట యే కవి కవిత్వంచెప్పినా వ్యావహారికం భావాల మీఁద ఆధారపడే చెప్పాలి. ఆడుధాతువుకు వెనకాల మాట అనేపదం చేరిస్తే ఉచ్చరించు అనిఅర్థం వస్తుంది. ఉపపదం లేకుండా వుపయోగిస్తే నృత్యంచేయు అని అర్థం వస్తుంది. ఆయీ ధాతువుకు చివర “పోయు” ధాతువును చేర్చి అసలుధాతువును క్త్వార్థకంగా మాఱిస్తేనో? నిందించు అనే అర్థం రావడమేకాదు. మితిలేని రీతిని నిందించుట అనికూడా

వస్తుంది. ఆయీఅర్థాలన్నిటికీ ఆధారం మన కేమిటంటారు. లోక వ్యవహారమే. అందుచేత కవికి అన్నిటికంటే లోకమేముఖ్యం. అందులో బొత్తిగా పశుప్రాయులుగా వుండేవాళ్ల వ్యవహారమున్నూ (యెల్లేఁడు, యేంది, ఉండేడు వగైరాలు) బొత్తిగా చేదస్తంగావుండేవాళ్ల వ్యవహారమున్నూ (ఆస్సే, వుంచుంది, యేమిషే వగైరాలు) కవులు పుచ్చుకోక యితరాన్ని కొద్దిగా సంస్కరించి వుపయోగిస్తూ వచ్చారు.

(1) గతకాలము మేలు వచ్చుకాలముకన్నన్.

(2) నీమగఁడంత యెక్కుడె?

(3) నరునకుఁ... చుట్టమెవ్వరు?

(4) మాకీ పుట్టువునకుఁ బాండుక్ష్మాపాలుఁడు నిన్నుఁజూపి చనియె

(5) ఓడితేనియు వద్దు మొఱ్ఱో యనంగ లింగమును గట్టకుడుగ మెఱింగి నొడువు.

చాలును విస్తారమెందుకు. ఇందు 1-వ నంబరు. పోయినరోజులు మంచివి. అనే వాక్యాన్ని పురస్కరించి పుట్టినది. 2-వ నంబరు. నీమొగుఁడే అంత గొప్ప వాఁడేమి అన్నదాన్ని పురస్కరించి పుట్టింది. 3-వ నంబరు. చుట్టమెవ్వఁడు అని యేకవచనంలో వుండవలసివున్నా లోకంలో బహువచనంలోనే వాడడాన్ని బట్టి పుట్టింది. 4-వ నంబరు చనియె అనుధాతువునకు మరణించు అను నర్థమున్నూ లోకవాడుకనుబట్టి సంపాదించుకో వలసిందే. అయితే ఇక్కడ చనియె అనక చచ్చె అని సవరించకూడదా? అనే వారున్నూ వుండవచ్చును. మా జన్మమంతా యీలాటి శంకలకే వినియుక్త మయింది. బళ్లకొద్దీ వ్రాసిన వ్యాసాలున్నాయి. పత్రికల నుండి పునర్ముద్రితాలు పుస్తకాలున్నాయి చూచుకోండి. కవిబ్రహ్మ ఆలా వాడక యీలా యెందుకుపయోగించాఁడో తెలుస్తుంది. ఇంక 5-వ నంబరు. ఎఱింగినొడువు అనేది, తెలిసి మఱీమాట్లాడు అనే వ్యావహారికాన్ననుసరించి పుట్టింది. ఛందోబద్ధం చేయడంలో "మఱీ" అనేది లోపించింది. లోపించినా వ్యవహారంలో అనుభూతమై వుండడంచేత దాని అర్థం కూడా వస్తుంది. వ్యవహారబలంవల్ల విభక్తులుకూడా కలిసివస్తూంటాయి క్వాచిత్కంగా. "వాఁడుయ్యా లూఁగుచున్నాఁడు." ఇందులో "ఉయ్యాల" పదం ప్రథమావిభక్తిలోవున్నా సప్తమ్యర్థము చెప్పికోవాలి. అంతేనే కాని ఉయ్యాలనూఁగు చున్నాఁడు అని సవరించడంలో వివేకం కనపడదు. ఒకప్పుడు గ్రంథకర్తకే ఛందోబద్ధం చేయడంలో కుదరక సప్తమ్యంతంగా పడితేనో? గణముల చిక్కున్నదికనక ఆకూర్పు క్షంతవ్యంగా భావించవలసి వుంటుంది చూడండి. "చింతయాకంతైనంగడమైననుం గడమ" అన్నచోట పద్యంలోకనక చింతయాకన్నాఁడు గాని రామలింగం, వచనకవిత్వమే అయితే

చింతాకంత అనే ప్రయోగించేవాఁడు. యీలాటివెన్నోవున్నాయి. వ్రాసే వోపిక లేదు. "జీర్ణమంగే సుభాషితమ్."

తక్కినయావత్తు వాదమూ ఆలావుంచి కీ. శే. గిడుగుపంతులుగారి వాదంలో సముచ్చయం లోపించి దానికి పూర్వ మందున్న అచ్చుకు దీర్ఘం వస్తుందనే మాటమట్టుకేనా శిరసావహించ వలసి వుంటుందని నేననుకుంటాను ఉదాహరణం - అంత+యు రామమయము (యు లోపించి) అంతా రామమయము. రామదాసు పదకవిగాని కవిధూర్జటిపదకవికాఁడు. అతఁడు వక పద్యం యావత్తూ, అంతా, అంతా, అనే దీర్ఘాంతాలే నింపి పూరించాఁడు. అంత అనేదానికి యు, అనేది చేరిస్తే రాదుగాని దీర్ఘాంతమైనప్పుడు అందఱు, అనే అర్థం కూడా వస్తుంది. అంతావచ్చారా? యింకో విశేషం దీర్ఘాంతానికి యావత్తూ, అని యేకవచనంలో అర్థం చెప్పుకోవలసి వస్తుంది. యేదో యీలా కిందా మీఁదా పడుతూవుంటే యేవో తోస్తూనే వుంటాయి శంకాసమాధానాలు. యిప్పటికి దీన్ని ముగిస్తాను.

★ ★ ★

# అడియాస

శ్లో. కతిపయదివసైః క్షయం ప్రయాయాత్
కనకగిరిః కృతవాసరావసానః
ఇతి ముద ముపయాతి చక్రవాకీ
వితరణశాలిని వీరరుద్రదేవే.

ఈ శ్లోకం ప్రతాపరుద్రుని దాతృత్వాన్ని గూర్చి రచించినది. ప్రధానంగా అతిశయోక్తి అలంకారం వుండఁగా మరికొన్ని యేవో అలంకారాలు వుంటాయి విజ్ఞులు పరిశీలిస్తేను. యిప్పుడీశ్లోకాన్ని వుదాహరించి వ్యాఖ్యానించవలసిన ఆవశ్యకత యేంకలిగింది అని ప్రశ్నిస్తే జవాబు – "పనిలేని మంగలి పిల్లితల గొఱిగాడు" అనే లోకోక్తిని వుదాహరించడమే. అంత మాత్రంతో ప్రశ్నించిన పెద్దమనిషి తృప్తిపడకపోతే పెద్ద అక్షరాలలో చిత్రించిన "అడియాస" పదం ముక్తకంఠంతో వేయినోళ్లతో ఘోషిస్తూవుండఁగా వొకరివివరణం అనావశ్యకం అని మూఁగనోము పట్టడం. సరే యీశ్లోకం ప్రతిపదమూ పరిశీలిస్తే తేలే ముఖ్య తాత్పర్యం.

అనఁగా అనఁగా వొకరాజన్నట్టే – వొక ఆఁడచక్రవాకప్పక్షి. ఆ యీపక్షి సుప్రసిద్ధుఁడైన వోరుగంటి ప్రతాపరుద్రుని కాలంలో పిల్లా జెల్లా, తానూ భర్తా సుఖంగా వోరుగల్లు పరిసరారణ్యాలలో కాలక్షేపం చేస్తూవుండేది; గాని ప్రతిదినమూ దీనికి దుర్భరమైన భర్తృవియోగదుఃఖం రాత్రి యావత్కాలమూ అనుభవించడం తప్పేదికాదు. యీ దుఃఖాన్నుంచి తప్పించుకోవడం యేలాగా అని ఆలోచిస్తూవుండఁగా సర్వసాధారణ స్థితిలో వున్న "ప్రతాపరుద్రమహారాజులుం గారి" దాతృత్వం–

శా. ఇంతింతై ... అంతై ... యెంతో ఐ ... యేమోఐ ... నభోవీథిపై.

అనేపద్యాన్ని జ్ఞాపకంచేసే స్థితిలో వుండేటప్పటికి చక్రవాకికికూడా తెలిసింది. తెలిసి దానికి రాత్రికాలం యావత్తూ వియోగం కవి సమయసిద్ధం కనక యీపయిని ఆవియోగాన్ని కలిగించే రాత్రినే చూడవలసిన ఆవశ్యకత నాకు కాదు యావత్తూ లోకానికిన్నీ తటస్థించదు. యేమంటే రాత్రింబగళ్ల భేదము యే పర్వతం అడ్డురావడంవల్ల కలుగుతూవుందో ఆపర్వతం (మేరువు) యావత్తూ–బంగారుమయం. కనక నేఁడో రేపో చిల్లరకొట్లలో యిటుకలుగా

చేసి దాంచినది అయిపోవడంతోనే దీనిభరతం పట్టించడానికి ఆరంభిస్తారనిన్నీ ఆలాగ తవ్వడానికి ఆరంభిస్తే అదేనాయెంతో కాలం అంగదుకనుక (దివసైః) యే కొన్ని రోజుల్లోనో భూమి మట్టానికి తవ్వడం తటస్థిస్తుందనిన్నీ అంతటితో రాత్రింబవళ్ల భేదమును కలిగిస్తూవున్న-మేరువునీడ వదలి ౨౪ గంటల కాలమూ సూర్యుండు నిరాటంకంగా ప్రకాశించడంవల్ల తనకు లోంగడ కవిసమయసిద్ధమై అనుసరిస్తూవున్న వియోగదుఃఖం అంతరిస్తుందనిన్నీ చక్రవాకి ఆనందిస్తూవుందని ప్రతాపరుద్రుని దాతృత్వాన్ని కవి లోకోత్తరమైన తన ప్రతిభ ద్వారా ప్రశంసించాండు. యితరభాషలలో కవులూవున్నారు. రసవంతమైనరచనలూవున్నాయి, లేదా వుంటాయిగాని యీఅతిశయోక్తివంటి అతిశయోక్తులు లేవనే ఆభాషా పండితులవల్ల వినడం, ఆయీ చక్రవాకివంటి- గొంతెమ్మ కోరికలు తలపోసుకునే వాళ్లు ప్రాజ్ఞలోకంచేత పరిహసించంబడుతూ వుంటారు. ప్రస్తుత చక్రవాకి వంటి వారిని గూర్చినదే ఈ కథ.

“అనంగా అనంగా వొకబ్రాహ్మడు-ఆయనకు పెళ్లీగిళ్లీ లేదు, నెలకు రోజులు ముప్పై యింటిలోనూ యే నాలుగో అయిదోతప్ప తక్కిన రోజులన్నీ బ్రాహ్మణార్థాలతోనే కాలక్షేపం, ఆబ్దికాలవాళ్ల పేర్ల కేట్లాగు ఆయన దగ్గిర వుంటుంది. రెండు మూడు రోజులు వ్యవధి వుండంగానే జాపితా ప్రకారం ఆగృహస్థుల యింటివద్దకు వెళ్లి ప్రస్తుతవిషయం జ్ఞప్తికి తెచ్చి రెండో బ్రాహ్మణ్ణి యెవరినేనా నిమంత్రించారా లేదా అని ప్రశ్నించేవాండంట! యీ ప్రశ్నవల్ల మొదటివాండుగా తానువున్నట్లు ద్యోతకం, సరే ఆ బ్రాహ్మడో యింకొకబ్రాహ్మడో బ్రాహ్మణార్థం చేసుకొనివచ్చి దేవాలయం ముఖ మంటపం చిట్టచివర కూర్చుని జుట్టు దులుపుకోవడంలో వొక నువ్వుగింజ కిందరాలింది. ఆబ్రాహ్మడు ఆ గింజ చేతిలో పెట్టుకొని “రిక్తుని మనసు కోరికలు పెద్ద” కనక యీ విధంగా తలపోతలకు ఆరంభించాండంట. - యీ గింజ కత్తిరి కార్తిలో నేడొడ్లానో పాతితే అది చక్కగా పెరింగి పెద్దచెట్టుఅయి అధమం సోలెండు నువ్వులేనా చేతికి దొరుకుతాయి. వాట్లను వొక సెంటుభూమిలో చల్లితే కుంచెడో రెండు కుంచాలో అవుతాయి. మళ్లా మళ్లా చల్లుతూ వుంటే అదృష్టానుసారంగా పుట్లకొద్ది పెరింగి ధర బాగావున్నప్పుడు కఱవుకాలంలో బ్లాకు మార్కెట్టులో అమ్మితే వందలకొలంది లాభం వస్తుంది. ఈ సంగతి బంధుజాతానికి తెలిసి పిల్లని యివ్వడానికి యింటిచుట్టూ మూగుతారు. వొకరు వెయ్యంటే యింకొకరు రెండు వేలంటూ వేలంపాట ప్రారంభిస్తారు. మనస్సుకు నచ్చినకన్యను పెళ్లిచేసుకుని సుఖంగా కాపురం చేస్తాను. పిల్లాజెల్లా కలుగుతారు. నేను మేడమీందే తఱుచు మకాం. నాపెళ్లాం నాపిల్లలిని నా దగ్గిఱకి వంట అయింది, భోజనానికి రండి అని కబురంపుతుంది. నేను విలాసంగా గర్వంగా యింకా నాకు ఆకలి కావడంలేదు అని బిఱ్ఱబిగుస్తాను. అని అడ్డం తిరగడాన్ని అభినయించేటప్పటికి

బొట్టమోపుగా చిట్టచివర పిట్టగోడమీఁద ఉన్నాఁడేమో తన్మయత్వంలో తూలిపడి యేం కావాలో అదే అయి గొంతెమ్మ కోరికలకు ఫలితం యిలా వుంటుందని లోకులు యితిహాసంగా చెప్పుకొనేదిగా పరిణమించింది. చక్రవాకి మూర్ఖజంతువు. దీనిమీఁద బెట్టుసరి. గొంతెమ్మ కోరికలు యెవరికీ ఫలించవుసరిగదా వ్యతిరేకించి ముప్పు తెస్తాయని కూడా ప్రాజ్ఞులు తెలిసికొంటారు. యీ శ్లోకంవంటి శ్లోకం మనం (మేనమామ పోలికగానేనాసరే) రచించఁగలమా అని శ్రీవిజయనగరం మహారాజులుగారి సందర్శన సందర్భంలో కొన్ని రచించివున్నాం, అందొకటి సంస్కృతం, వొకటి తెలుఁగు. రెండూ విజ్ఞుల వినోదార్థం వుదహరిస్తాను.

"శ్లో. తత్కించంద్రాతపోఽ యం నను భవతిదివాఽ ప్యస్య కస్మా త్ప్రచార
స్సత్వాచ్చంద్రస్య సత్వేఽ ప్యరుణ కిరణతోఽ జాగళస్థస్తనోఽ యమ్
నోచే దానందదంతీశ్వర విమలయశస్సత్యమిత్యాదివాక్యై
శ్శాస్త్రార్థంకుర్వతే త్వద్యశసినృపమణే తార్కికాస్తర్కరీత్యా"

(ప్రశ్నోత్తరరీతిని సమన్వయించుకోండి)

శా. నీకీర్తిప్రతతుల్ ధరాతలము నెందే నిండి అందొక్కఁడ
య్యాకాశమ్మున కేగి పుష్పవతియై ఆపూర్వపశ్చాద్గిరి
వ్యాకీర్ణం బగుచుండు వాయుగతిచే నద్దాన చంద్రోఽ యమి
త్యాకారభ్రమ నొందుచుండు జగ మో యానంద భూపాలకా.

(యిందులో ప్రధానం ఉత్ప్రేక్ష)

"తే.గీ. అర్థవత్తని అనధీనమని ... ... అర్థవత్సూత్ర
మందు గూఢముగఁ జెప్పె పాణిని"

యిందులో కవిత్వపదార్థం లేదుగాని రచించిన వాఁడు వ్యాకరణవేత్త అని తెల్లమవుతుంది.

శ్లో. క్లీబంపునోస్తు దేహోఽ స్త్యేకో మాత ర్నతత్ర బహుచిత్రమ్
స్త్రీపుంసయో రపి తథా లలితే యద్దృశ్యతే మహ చ్చిత్రమ్.

(దీనికి సమన్వయం రంగూనుత్తరం తెలిస్తే తెలుస్తుంది - అనగా ఎవరు రచించారో వారి దగ్గిఱకి వెళ్లి తెలిసికోవలసిందనడం)

శ్లో. పద్మం న యోగ్యవస్తు స్యా దే వాత్మోప మిత్యవస్థాయామ్
ఇత్యేవ మద్రిజాతే కంఠరవే ణాంబ వక్తినేత్రం తే.

(ఇదికూడా డిటో, ఆరంభావస్థలో యీ విధంగా నడిచి క్రమంగా శరన్నదీజలంవలె మాఱుతుంది. మచ్చు చూపుతాను)

శ్లో. శర్వాణి! దేవి! పరితః పరితాపితోఽ యం
సంసారదుఃఖదహనేన తదేకశాంత్యై
నీహారభూధరపురాకృతభాగధేయం
త్వాం భావయామి గిరిశస్య తపోఽ న్తరాయమ్.

యెంతశైలి తేలికలో వుంటే కవిత్వానికి అంత గౌరవం. కాళిదాసాదులకు కఠినశైలిలో వ్రాయడం చేతకాక నేనా-

"మందఃకవియశః ప్రార్థీ గమిష్యా మ్యుపహాస్యతామ్." యిట్టిశైలిలో వ్రాయడం? దీన్ని గుఱించి వ్రాయవలసివస్తే సుఖసుఖాల తేలదు. భగవంతుఁడనుగ్రహిస్తే మఱొకప్పుడు చూచుకుందాం.

శా. నీకీర్తివ్రతతుల్, అనే పద్యం మాదిరి పద్యాలు యేకవిగాని తన జీవితంలో యెన్నో వ్రాసివుండఁడు. యీమాట జ్ఞప్తిలో ఉంచుకోండి చదువరులు. స్వతంత్రంగా రచించే రచనలో కూడా కవితెల్వితేటలు (ఎవ్వనిగుణలత లేదు వారాసుల కడపటి కొండపైఁ గలయఁబ్రాకు) ప్రకటిత మవుతవి. బ్రాకెట్టులోది తిక్కన్నగారిది. యింకొకరిది చూపుతాను "తిలకమ్ముదిద్దిఁ దిద్దితిఁజూడుమనురమాసుదతి చెక్కులనీడ, జూచువాని" యీకంకంటి కవీంద్రుఁడు యెన్నోచోట్ల కవిబ్రహ్మగారిని మించడం కలదు. "ముఖేముఖే సరస్వతీ" గదా? భవతు. అడియాసనుగూర్చి వ్రాస్తూ ప్రసక్తానుప్రసక్తంగా (వార్ధక్యదోషంచేత) కవిత్వం ఆరంభ దశలో యేవిధంగా వుంటుందో క్రమక్రమంగా యేవిధంగా మారుతుందో అనే ప్రసక్తిలో కొన్ని వాక్యాలు వ్రాశాను. పోనిందు అవిమాత్రం జిజ్ఞాసువుల కుపకరింపవా? చూడండీ యీ రెండు పద్యాలున్నూ-

ఉ. ఎందఱిఁ జూపెనేని వరియింపదు మాకవితా కుమారి క
న్నందుకు దేశముల్ తిరుగుటబ్బెను సౌఖ్యము లేకపోయె నా
నందనృపాల! నీదుసుగుణమ్ములు చెప్పిన నాలకించి వెం
టం దలయూఁచెఁ గావునఁ దటాలునఁ దీనిఁ బరిగ్రహింపుమా?

ఉ. అందఱు కన్నివంకలను నల్లుచునుండునెకాని యెవ్వనిన్
బొందుట కిచ్చగింప దదెపోయని యేనును నూరకుందు మీ
యందునమాత్ర మిచ్చ కలదంచును సూచన సేయుచుండు నే
నందనిమ్రానిపం డిది యటందును తానటు కాదు కా దనున్.

ఆయీపద్యద్వయానికి యేదో సన్నిహితబాంధవ్య మున్నదని తెలియుచున్నదిగాని విషయముమాత్రం చాలదూరం. వొకదానిలో రసం శృంగారం, వేఱొకదానిలో వర్ణ్యమే రసానికి సంబంధించేదో ఆలోచించాలి. నేను ఆయీచక్రవాకి సంతోషాన్ని ప్రకటించే శ్లోకాన్ని యెందుకు వ్యాఖ్యానించ వలసివచ్చిందో అదిన్నీ విచారణీయమే.

"ప్రయోజన మనుద్దిశ్య నమందోఽపి ప్రవర్తతే" యెవరయినా ఫలానా ప్రయోజనం ఆయీ శ్లోకాన్ని వ్యాఖ్యానించడానికి వుంది అని తెలిపితే సంతసిస్తాను. నాకు యేమీ తోఁచనప్పుడీలా వ్రాస్తూవుంటాను. వాట్లలో అన్నిటికీ కాదుగాని యేకొన్నిటికో ప్రయోజనం వుంటేవుంటుంది. విజ్ఞులు విచారింతురుగాక.

★ ★ ★

# పండితరాయలు : కాళిదాసు

1. పండితరాయలు, 2. కాళిదాసు వీరిద్దఱిలో యెవరిది నిగర్వ ప్రకృతి, యెవరిది సగర్వప్రకృతి? అని శంకించుకొని నాలుగు మాటలు వ్రాయాలని కుతూహలం కలిగింది, వ్రాస్తూన్నాను. "కో౽స్తి ధన్యోమధన్యతి" అన్నాఁడు జగన్నాథపండితరాయలు. శ్లోకం చాలా పెద్దది. "వాచామాచార్య తా యాఃపద మను భవితుం" అనేభాగాన్ని కలుపుకొని సమన్వయించుకుంటే మేరువుపర్వతం మొదలుకొని మలయపర్వతం వఱకు ఉన్న ధరామండలంలోవున్న పండితమండలిలో నాయెదట నోరువిప్పగలవాడంటూ ఉన్నాడా? అని ప్రత్యర్థులతో కయ్యానికి కాలు దువ్వుతూవున్నట్లు స్పష్టమే. వాచ్యంగా తోఁచేదెంతో అంతేగాని దీనిలో యెంత ప్రయత్నించినా యితర విధయా వచ్చే అర్థంకానరాదు. ఆపద్ధతిని ఆయీ "రాయలు మహావిద్వాంసుఁడయ్యును విద్యకు ముఖ్య ఫలితం (విద్యయొసఁగును వినయంబు) వినయాన్ని బొత్తిగా మన్నించనేలేదు" యెన్నిసుగుణాలువున్ననూ అవి వినయంలేనిచో ప్రకాశింపవు.

శ్లో. విద్యావివాదాయ .... ఖలస్య సాధోః జ్ఞానాయ.
నదీపారాజంతే వినయరహితా నామివగుణః.

యీ రాయలవారు రచించే రచనయావత్తూ పిల్లి మీఁదా ఎలుక మీఁదా పెట్టివుంటుందిగాని ప్రత్యక్షంగావుండదు. ప్రస్తుతశ్లోకం "ఆమూలాద్రత్నసానోః" అనేదిఅలాటిదికాదు. భూమండలంలో వుండే పండితులందఱూ తనకు ప్రత్యర్థులుగా వుండవచ్చునన్నమాట. "శా. నాతో మార్కొనలేరు... చేతుల్వేయు వృథా భరంబగుచు వచ్చెన్ దేవ! యీమేనికిన్" అన్న బాణుఁడూ పండిత రాయలూ వొక ప్రకృతికే సమన్వయిస్తారు.

శ్లో. విదుషాం నివహైః ... మయి జల్పతి ...
రఘునాథేమనుతాంతదన్య దైవ.

కాళిదాసు ప్రకృతిలో గర్వంలేక పోలేదుగాని అది యీవిధంగా వుండదు. శ్లో. మందః కవియశః ప్రార్థీ ... వామనః. లోఁతుగా పరిశీలిస్తే దీనిలోనూ గర్వస్ఫూర్తిని

వ్యాఖ్యానించవచ్చును. దీనిలోనేకాదు, "అభిరూపభూయిష్ఠా పరిషదియం, తదిహ కాళిదాస గ్రథితవస్తునా నవేన నాటకేనో పస్థాతవ్యం." అనేదానిలోనూ గర్వాన్ని యింతా అంతా కాదు బోలెఁడు చూపించవచ్చును. పిమ్మట చూచుకుందాం. రాయలవారికి అన్యాపదేశం కూడా వుదాహరించి విమర్శిద్దాం. "శ్లో. హేమ్నః ఖేదోన తాపో న ఛ్ఛేదినకషణేనవ, ఏతదేవ పరందుఃఖం, యద్గుంజా సమతోలనమ్" యిది కేవలం అన్యాపదేశం. తానేమోబంగారం, ప్రత్యర్థివిద్వాంసులు గురిగింజలు. పరీక్షాసమయాల్లో ఆయీ సంస్థాన విద్వాంసులందఱినీ ఆపట్టీలో (1) కస్తూరి (2) వుల్లిపాయ (3) అగరుబిళ్లలు (4) పొగాకు అని తారతమ్య విచక్షణ లేకుండా వ్రాయడానికి సహింపలేక కాఁబోలును.

శ్లో. హేమ్నః ఖేదోనతాపోన ఛ్ఛేదేన కషణేనచ
ఏతదేవ పరందుఃఖం యద్గుంజాసమ తోలనమ్.

అనే శ్లోకంద్వారా కడుపుమంట తీర్చుకున్నాఁడని పండితులు చెప్పుకుంటారు. గద్వాల లోనైన నిజాం సంస్థానాలలో ప్రతియేటా కార్తీకంలో వేదశాస్త్రాలకున్నూ, కవిత్వానికీ, గానానికీ యింకా కొన్నిటికీ మాఖమాసంలో నున్నూ, సత్కరించడమైతే వుందిగాని ఆసత్కారంకూడా తారతమ్య వివక్షతో సంబంధించినది కాకపోవుటచేత పండితరాయలవంటి అభిమానశాలికి అసత్కారంగానే కనపడుతుంది. కనుకనే-

ఉ. ఏకవియెట్టివాఁడొ? మరియేకవి కెట్టివిశేష పండిత
శ్రీకలదో? విచారణము సేయుటయే కనకాభి షేకమా
గాక తదన్య పద్ధతి జగమ్ము సమస్తము ధారవోసినన్
జేకుఱునే ముదంబు పరిశీలనసేయుమి రామభూవరా?

ఉ. పండితులైన వారు ప్రతిభాగతి భాసురులౌట సర్వభూ
మండలినుండు రాజులును మన్ననసేఁతురు వారిఁ
బండితాపండితులైన వారల సభాస్థలినీవలెఁబూజసేయు టేఁ
దుండునె? రామభూవర సమున్నత దాన విధానధీవరా.

అంటూ స్తుతి వ్యాజమున నిందించవలసి వచ్చినదని విజ్ఞులరయుదురుగాక. పండితులను సత్కరించుటకు యేభూపతికి కుతూహలంవుంటుందో ఆతనికి కేవలం ధనంమాత్రం వుంటేచాలదు. సద్బుద్ధియెంత వున్నప్పటికీ అదీ ప్రయోజనకారి గాదు. ఇంకా వుండవలసిన సాధన సామగ్రి యేమిటంటే :

సీ. పండితులకు గౌరవము చేయుటకు మంచి
పండితుల్ దగ్గర నుండవలయు
నుండిననేమి ఆయుండు పండితకోటి
పరులయున్నతి సహింపంగవలయు
సైచిననేమి ఆ సత్పండితులమాట
లింపుగా రాజు మన్నింపవలయు
మన్నింపనేమి ఆ మన్ననలకు వద్ద
నున్న దివాను దానొప్పవలయు

గీ. నిన్నియును గల్గు రాజవీవేయటంచు
వచ్చినారము లేకున్న వత్తుమయ్య?
దానరాధేయ కవి సముదాయగేయ
పండిత విధేయ రామ భూపాలరాయ.

విషయం విషయాంతరంలోకి దూకుతూవుందా? లేదు–దాతయైన ధనవంతునకు ఆ యీసీసంలో వుట్టంకించిన సామగ్రి వున్నప్పుడే ఆ యీవి కీర్తి సంపాదక మవుతుందిగాని యిందులో యేవొకటి లోపించినా అది దబ్బిచ్చి తద్దినం కొని తెచ్చుకొన్న లోకోక్తికిగురి కావలసివస్తుంది. అయితే దాతకన్న లోభియే స్తుతిపాత్రుఁడా? అంటే కాఁదుగాని దాత జీవితం యెన్నో చిక్కులతో నిండి వుంటుంది. కనక జాగ్రత్త యెక్కువ అవసరమని హెచ్చరించాడు.

“సీ. ఈడిగ ముత్తికి జోడు సేలువులిస్తేను
కురువగంగికి జరీకోకలిస్తేనూ

ప్రయోజనంనాస్తి” అని దాతకు బాగా తెలిసివుండాలి. మా చిన్నతనంనాటికి అమల్లోవున్న నాకబలి పళ్యాలను గూర్చి వ్రాసి మఱీ విషయాంతరం రాస్తాను. అది యేమిటంటే–కోమట్ల యింట వివాహం జరిగినప్పుడు కవులకూ; గాయకులకూ, తోలుబొమ్మలవాళ్లకూ, భాగవతులకు పెళ్లివారి చేవనుబట్టి సత్కరించడం వుండేది. యేనాఁడు ప్రారంభమైనాయో యీ మామోళ్లు, వీటికి ఆనాఁడు వాళ్ల గ్రామంలో పట్టాలుకూడా యిచ్చివున్నారు. జమీందారులపన్ను కంపల్‌సరీగా యిచ్చుకోవడం యేలాటిదో ఆయీ నాకబలి సంభావనకూడా అలాటిదిగానే వుండేది. తెలుగు దేశంలోనేకాని అన్యత్రా యీ నాకబలి బాధ వున్నట్టు తోఁచదు. మా (తి. వెం.) విద్యార్థిదశలో ఆ యీ నాకబలి పళ్లెం యెత్తడానికి రెండు మూడు చోట్లకుమేమూ వెళ్లడం జరిగింది. కవిత్వం చెప్పేవాళ్లువుంటే ఆ పళ్లెం వాళ్లే యెత్తడం; లేని పక్షంలో కవిత్వంచెప్పేవాళ్ల వంశంవాళ్లు, వీళ్లూ వాళ్లూకూడా

దైవాత్తు తారసపడక పోయే పక్షంలో యేడిద్దుఁడో బిద్దుఁడో లేకపోతే దబిద్దుఁడో బూకరించేశక్తి వున్నవాఁడు యెత్తి తనవంటి బూకరింపువాళ్లకు యేపావో చవలమో చేతులోఁబెట్టి తక్కినవాళ్లకు మొండిచేయి నా పరుగు కడుచుకోమని చెప్పి "ఫలాయమానస్యకం దైవలాభః" చేయడం జరుగుతూ వుండేది. వీట్లవైఖరి ఆకళింపుకాని ఛందోమాత్ర పరిజ్ఞాతలుతప్ప ఆయీ పళ్యాలకు యేమాత్రం నామరూపాలు వున్నా ఆ తరగతివాళ్లు వెళ్లినట్లు లేదు. దారిద్ర్య దోషం చేత యీ పళ్యాలకు పిండిప్రోలు లక్ష్మణ కవిగారు వెళ్లేవారని చెప్పుకోఁగా వినడం. ఆపెళ్లివారికీ కవిగారికీ జరిగినసంభాషణలు మా (తి. వెం.) చిన్నతనం నాఁటికి ముదిరిన ముసాలితనంలో వున్న పెద్దలు చెప్పుకునేవారు. శిష్టు కృష్ణమూర్తి కవిగారూ లక్ష్మణకవిగారు సమకాలీనులే అయినా యెన్నఁడూ యీసంభావనకు "పరువుతక్కువ" గాభావించి వెళ్లేవారుకారుట! లక్ష్మణ కవిగారు సకాలానికి వెళ్లకపోయినా పట్టుపట్టి సంభావన వసూలు చేసేవారఁట! మా ముత్తాతగారున్నూ వెళ్లినట్లు లేదు. ఏనుఁగువారున్నూ డిటో. యికనల్లా దీనికి హాజరుకావడం పిండిప్రోలువారు మాత్రమే. వొకషావుకారు యింట వివాహం జరిగిన తరువాత సుమారు సంవత్సరం కాలం అతిక్రమించాక లక్ష్మణకవిగారు సంభావన తేతెమ్మని అడిగితే లిమిటేషన్ పాయింటు చూపి షావుకారు మొరాయించేటప్పటికి కవిగారు "మీ యింట జరిగిన వివాహంలోకి నేనురాలేదని నీవు బొంకుతూవున్నావు. నేనువచ్చేవున్నాను కాని పెళ్లిహడావుడిలో నీవు తబసీలువారీగా చూడలేదు. నాకబలిముగ్గు పెట్టడం జరిగిందంటావా? అనవా? అయితే ఆముగ్గుదేనితో? పిండితోనేకదా? యిక్కడికిసగం తేలింది. ప్రోలుతేలాలి-పంచరంగులతో ఆరోజున పెట్టేముగ్గుపేరు "ప్రోలు" శబ్దంచేత వాడడంకూడా తెలియదానీకు?" అని షావుకారుని దంగుపుచ్చి సంభావన వసూలుచేసినట్లు చెప్పుకోఁగావినికి. యింకా యీలాటిగాథలే కొన్ని పెద్దల ముఖతః విన్నవికొన్ని వున్నాయి.

(1) కుళ్లుముండా గుద్దుతుక్కుంటాను బండముండా రాయిస్తావా?

(2) ప్రాసకోసం యేడిచానే కూసుముండా.

(3) ఇఁక పదివేలొసంగెద మఱిందుకు పద్యము చెప్పుసత్కవీ! (సమస్య).

(4) మాదిగవల్లి ... రావేఁడినాయనా?.

(5) వీ-తీస్తేశ్వపతి, శ్వతీస్తే విపతి ఊరుకోవయ్యామామా.

(6) క. ఈశునకము కృష్ణమూర్తియే.

(7) మ. అవురా! శంకర! మంచివాఁడవు ... శంకర మంచివాఁడవు.

(8) చిట్టూరి కమలభవుని జేసె కమలభవుఁడు.

యింకా జ్ఞాపకం తెచ్చుకుంటే కొన్ని రాకపోవు. ఒక్కొక్కదానికి కొంత చరిత్ర వుంటుంది. తెనాలి రామలింగం, అడిదం సూరకవి, తురగారామకవి, రేకవల్లి సోమకవి, లోనైనవారి చరిత్రలు శ్రవణపేయంగా వుంటాయి. సోమకవిగారు చాలా పెద్దవిద్వాంసులు కూడాను. అనకాపల్లిలో స్కూలుటీచరుగావున్న శ్రీ బులుసు పాపయ్యశాస్త్రిగారివల్ల ఆయీ రేకవల్లివారి చమత్కార విశేషాలు నేఁటికి 50 సంవత్సరాలనాఁడు వినివున్నాను. "కవుల కతలకు రాజుల కతలు లొచ్చు" క్రమంగా కథ కథాంతరంగా మారింది. నామరూపాలుగల యేకవిన్నీ నాకబలి పళ్లెపు సంభావనలకు వెళ్లుట లేదనిన్నీ మ. బరువైతోచుకుటుంబ రక్షణకుఁగా... పిండిప్రోలు లక్ష్మణకవిగారు మాత్రం వెళ్లినట్లు వినికిడి వుందనిన్నీ వ్రాస్తూమాటు పుంతలోకి కాలుపెట్టి నడుస్తూన్నాం. శిష్టువారు విద్వత్కవులలోవారు. తెలుఁగు కవిత్వంకూడా అలవోకగా రచించినా వారికి సంస్కృతం ప్రధానం. తెలుఁగులో చిరకాలంనిలిచివుండే కావ్యమేదీ రచించలేదు. లక్ష్మణకవిగారుకూడా డిటోలో వుండవలసేవచ్చేది. కాని రావుదమ్మన్న గారి ధర్మమా అని వారు తమ భూమి జబరుదస్తీ మీఁద అపహరించిన కారణంచేత వొకద్వ్యర్థికావ్యం రావణదమ్మీయం అనే నామాంతరం కల లంకావిజయం సుమారు రెండు మూడువందల పద్యాలు వ్రాయడంవల్ల వాఙ్మయంలో ఆయన పేరు శాశ్వతంగా వుండగలదని నాదృఢవిశ్వాసం. 'శిలసంహితకు' దీటుగావుండే వచనం యెంతరచించి బీరువాలు నింపినా ప్రయోజనం నాస్తి అని అన్యత్ర అసకృదావృత్తిగా వ్యాఖ్యానించేవున్నాను. విద్యార్థిదశలో తప్ప పిమ్మట నాకబలి పళ్లెపు సంభావనలకు వెళ్లలేదు. ఆ సంభావనలయందు మాకు గౌరవంలేదన్న సంగతి కాకినాడ శతావధానంలో చెప్పిన ఆ యీపద్యంవల్ల తెల్లమవుతుంది.

క. నాకబలి పళ్లెరమ్ముల
నాకటజీవించు కుకవులరుగుదురె? లస
న్నాకనిలయ కవిసమ కవి
నాకాధిపులున్న సభకనఘ? భీమేశా.

మా విద్యార్థిదశపిమ్మట యే రెండుదశలో ఆయీ నాకబలి సంభావనలు కోమట్లు జరిపి అంతట్లో యేదో, కర్ణాట కలహం కల్పించి ఆకలహం కోర్టుదాకా వెళ్లేటట్టుచేసి ఆఖరికి, మూలచ్ఛేదీ తవ పాండిత్య ప్రకర్షః అనిపించారు. ఆయీమూలచ్ఛేదం చేసిన గౌరవం పిఠాపురందాపునవున్న గొల్లప్రోలు కోమట్లకు దక్కింది. ఆయీ సంభావన యిచ్చేవారూ పుచ్చుకొనేవారూ "కైకురు బొయికురు" లాడుకోవడం ప్రతి పెళ్లిలోనూ వున్నదే యెక్కువ గొప్పగా సత్కరించాలని ప్రతిగ్రహించేవారు, తక్కువగానే కాని యెక్కువ యిచ్చేది లేదని దాతలు, ఆయీ వాదం క్రమంగా చిలికి చిలికి గాలివానగా పరిణమించి

మొదట క్రిమినలు తరువాత సివిలులోకి దేకి తుట్టతుదకి మొదటికే మోసంగా పరిణమించింది. "ఢిల్లీ వల్లభ హస్తపల్లవ తలేనీతం నవీనం వయః" యీ కవిలోకచక్రవర్తికి అయీ నాకబలి సన్మానం నచ్చదని వ్రాయాలా? అక్కఱలేదు. మఱిన్నీ శ్లో. నిర్మాణేయది (కొంత జ్ఞాపకంలేదు) మార్మికోయది... నోచేద్దుష్కృత మాత్మనా కృత మివస్వాంతా ద్బహిర్మాకృథాః. అయీ పండిత రాయల శ్లోకానికి ముఖ్య తాత్పర్యం "అయ్యానీకు పండిత సమ్మతంగా రచించే నైపుణి వుంటేనే నీరచన గద్యమో పద్యమో వినిపింపుము. అన్యథావున్న పక్షంలో నీవుచేసిన పాతకం దాఁచుకున్నట్లే కవిత్వంకూడా దాచుకోవడమే యుక్తం" అని బోధిస్తున్నాఁడు. ఆయీధోరణినిబట్టి విచారిస్తే రాయల ప్రకృతి సగర్వంగాని నిగర్వంలోచేరదు. రాయలుచేసిన మైత్రి తురుష్కులతోటి. తిన్నసొమ్ము తురుష్కులది. వొకటేమిటి సర్వమూ తురుష్కులదైనప్పుడు సాత్త్వికత్వ మాయనకు దవ్వుగా నుండడం యుక్తిక్షమం.

కాళిదాసు చల్లగా అంటిస్తాడు. మనస్సుకు నొప్పి కలిగించడు. కాని అవసరమైనంత నొప్పి ఆ రచనలో వుండకపోదు. "అభిరూప భూయిష్ఠా... అన్న వాక్యంలో కావలసినంత తలబిరుసుతనం బయటఁబెట్టవచ్చు. యీసభ పండితులతో నిండివున్నది కనక (లాకలూకాయల రచనకాక) నేఁడు కాళిదాసకృతమైన దేదేని ప్రదర్శిస్తేనేకాని మాటదక్కదు. ఆయీకాళిదాసవాక్యం సర్వమూ "అస్తమేతిగభస్తిమాన్" అన్నదాని వంటిది. సకల ఫల సంపెగ పువ్వువలెనే యిదిన్నీ వారువారు వివక్షించుకున్న అర్థాన్ని స్ఫురింపఁజేస్తుంది. వాచ్యార్థలక్షణార్థ వ్యంగ్యార్థాలు మూడింటిలోనూ ఆలంకారికులు వ్యంగ్యార్థానికే ప్రాధాన్యం యిస్తారు. కనక పండితరాయలకన్న కాళిదాసుకే గర్వ ప్రకృతిమత్త్వం ధ్రువపడుతూవుంది. వొకానొకప్పుడు తనశక్తిని వున్నది వున్నంతలో దాచిపెట్టక ప్రకటించడం కూడా యుక్తమే అన్నారు మాపిన్న ముత్తాత నరస కవిగారు,

ఉ. ఏ నిటువంటివాఁడనని యెన్నిక కావ్యకథానులాప సం
ధానమునందు శాత్రవ విదారణ మందు ...
...యుక్తమటుగాన ప్రశంసయొనర్చితిన్ మదా
ఖ్యానము రామచంద్ర కృపకాదె మహాత్ములెఱుంగ కుందురే.

కావ్యారంభమందు, పెళ్లి బేరాలు పొసఁగ జేసేటప్పుడు, యుద్ధమునందు, స్వభావోక్తిగా మాటలాడుటలో దోషములేదు అని పద్యతాత్పర్యం, దీనిమీద శంకాసమాధానములు విస్తరిస్తే చాలా పెరుగుతుంది గ్రంథం. కనక యిప్పటికి యింతతో స్వస్తి చెపుతూన్నాను.

# ఆంధ్రభోజుఁడననేమి?

(26-10-1918 సం॥ర కృష్ణాపత్రిక నుండి)

పూర్వము సంస్కృత భాషయందు మహాకవియు నత్యుదారుఁడును

శ్లో. ఉచ్చైర్గతి ర్జగతి సిద్ధ్యతి ధర్మతశ్చే
త్తస్య ప్రమాచ వచనైః కృతకేతరైశ్చేత్
తేషాం ప్రకాశనదశాచ మహీసురై శ్చే
త్తానంతరేణ నిపతే త్ద్వను మత్ప్రణామః.

అనునంతటి బ్రాహ్మణభక్తి వివేకవిశ్వాసములకు నాకరమైనయొక రాజు భోజవంశోత్పన్నుఁడుండువాఁడనియు నిటీవల నెవ్వరేని యత్కించిద్భిద కలిగినను, తన్నిష్ఠభూయోగుణ విశిష్టులు రాజు లందవతరించినచో వారికీ బిరుద ముచితమనియు మా మిత్రులు మ.రా.రా. పానుగంటి లక్ష్మీనృసింహారావుపంతులవా రభిప్రాయపడి రామకృష్ణుల యవివేకమువలన శ్రీపీఠికాపురాధీశ్వరునకు "ఇనుమునుబట్టి యగ్గికి సమ్మెటపెట్లు" అను సామెతగా ననివార్యముగా సంక్రమించుచున్న యపయశమును దొలఁగించుచు వ్రాసిన "నిష్కారణనింద" అను వ్యాసమునఁ గొండొక సందర్భమున శ్రీవారికాబిరుదమును వ్రాసియున్నారు. శ్రీ పీఠికాపురాధీశ్వరులను స్తుతించి విద్యలకుఁ బ్రోత్సాహము కలిగించుట మాకుఁ బరమ సమ్మతమేకాని "తద్భిన్న త్వేసతి తద్గతభూయో ధర్మవత్త్వం సాదృశ్యమ్" అను సాదృశ్య లక్షణమును సుంతేని పంతులవారు విమర్శింప లేదుగదా యని విచారించుచున్నారము. ఈ యంశ మొక్కటితక్క శ్రీపంతుల వారి వ్యాసములో మే మితరమును స్పృశింపము. కారణము, శ్రీశ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులవా రాభారమును వహించి పూర్తిగాఁ గృతకృత్యులై యుండుటయే. పంతులవారు రామకృష్ణులతప్పును బూర్తిగా వ్యంగ్య మర్యాదచే బలపఱచుచు శ్రీరాజాగారి కందు సంబంధమును గల్గింపఁగూడదని మాత్రము వ్రాయువ్రాఁత మాకును సమ్మతమే. కాని, యది యనివార్యమగుటచే "శ్లో. తస్మాదపరిహార్యేఽర్థే" అను గీతావాక్యమును స్మరింపక తప్పదు. శ్రీరాజాగారు మా రామకృష్ణుల యపచారమునకుఁ గర్తలుగాని కారయితలుగాని ప్రేరకులుగాని కారనునది సత్యము. ఐనను లోకమెల్ల నిందువిషయమున నేకవాక్యతగా

ఘూర్ణిల్లి యల్లకల్లోల మగుచున్నను తమ వద్ద నుండుకవుల యవివేకమును వారింపక యింకను నేవో తప్పుడు యుక్తులతో "దేశభక్తి" నామకఘృతకోశవ్యాసములను వ్రాయుచుఁ బత్రికాపాఠకులకు రోఁతపుట్టించునవ్యక్తుల నుపేక్షించు శ్రీరాజాగారు "ఆంధ్రభోజు" లైన నగుదురుగాక. రామకృష్ణుల యవివేక ప్రయుక్త కృతులకు "అనుమోదకులు" కూడఁగా రనునంశమును పంతులవారెట్లు సమర్థింతురో? మేము వినఁ గుతూహల పడుచున్నారము. పంతుల వారి "ఆంధ్రభోజపదము" పంతులవారికో లేక రామకృష్ణులకో "ఆంధ్రకాళిదాసత్వము" నాపాదింపక తీరదు. రామకృష్ణుల స్థితిని బట్టి దీనిని వహించి సంతసించుట వాంధ్రయవివేకమునకు వన్నె పెట్టుటయే యైనను బంతులవారి యుదారతను బట్టియేమి, యోగ్యతనుబట్టియేమి, వివేకమును బట్టియేమి, యీ భారము వారు వహింప నంగీకరింపరని మేమేకాక లోకులెవరేని సమ్మతించి తీరవలయును. పంతులవారు చేయు ప్రయత్నము మంచిది. వారి వ్యాసము ప్రభువునకు రామకృష్ణుల యవివేకమునఁ గల్గిన నిందను వారించుతలఁపుతోఁదక్క నన్యకారణమును బురస్కరించుకొన్నది కాదు. మాచే విమర్శింపబఁడిన "ఆంధ్రభోజపదము" వారప్రధానముగా వాడినది కాని ప్రధానముగా వాడినది కాదని మే మెఱుఁగక యింతవఱకు వ్రాయలేదు. సాదృశ్య శబ్దార్థ విషయమునఁ బంతులవారి యూహయేమో కనుఁగొన నింతగా వ్రాసితిమి. కాన వారన్యథా తలఁప కుందురుగాక! వారి "నిష్కారణనింద" పై శ్రీశ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గురుపాదులు వ్రాసిన దానిం జదివితిమి. మావలెనే పంతులవారును శ్రీశాస్త్రులవారును నాబాల్యమిత్రులయ్యు దానిన్ గణింపక యథార్థము పట్టున శాస్త్రులవారొనరించిన వ్యవసాయము కడు శ్లాఘనీయము. శ్రీ శాస్త్రులవారు రామకృష్ణులు మున్ను నింద్యగ్రామ్యమని వ్రాసి చీవాట్లు దినిన "క్షమాపణ" పదమునందలి నిర్దుష్టత నెఱిఁగినవారే యయ్యు నచ్చుటచ్చుటఁ బ్రస్తుతవ్యాసమున నీపదమునకు బదులుగా నేఁటి కూరగాయ కవులుపయోగించు "క్షమార్పణ" పదముపయోగించినటుల స్ఫుట మగుచున్నది. కాని ఇది సత్యదూర మని యీ సందర్భమందే మఱియొకచో వాడిన "క్షమాపణ" పదమువలన సహృదయులు గుఱితింపఁ గలరు. క్షమాపణకు బదులుగా "క్షమార్పణ" యని పడినచోటులెల్లఁ బత్రిక కూర్చువారలవి యని యెఱుఁగఁ గోరుచున్నారము. దీని కింతగా నేల వ్రాయవలయు నన్న మా వెం॥రా॥ లిది యాధారముగాఁ జేసికొని మరల "క్షమాపణ" పదమునకుఁగా బెనఁగఁ గలరని తప్ప లేకున్నచో నింతగాని కొంతగాని వ్రాయనే యక్కరలేదు. మఱియు శ్రీశాస్త్రుల వారు దేవ+అయ్య, దేవయ్య అని వ్రాసిన వ్యుత్పత్తిని మేము శిరసావహించుచు, "దేవయ్యకాదు, ధేబయ్య" అని కొండొకచో మేము విన్న సందర్భము నిందు వివరించుచున్నారము. దేబె +అయ్య, దేబయ్య, అని దాని వ్యుత్పత్తి అర్థము విస్పష్టమ

కాన వ్యాఖ్యానమనావశ్యకము. కొంతకాలము మేము గూడ "దేవయ్య" అనియే వాడితిమి. ఇటీవల నెఱింగితిమి. ఏకారసంధి విషయమునకుఁగూడ మాకుత్తరమును శబ్దమును దెల్పిన పండితులే తెల్పియున్నారు. అవసరమైనపు డావిషయమును విస్తరింతుము. ఇఁక రామకృష్ణుల "దేశభక్తి" వ్యాస మిపుడు వెలువడినంత వఱకు శోచ్యస్థితిలో నున్నదని యందలి "గురుబ్రువ" పదము చేతనే సహృదయులు గుఱితింపవచ్చును. వీంద్రకు గురువు, గురుబ్రువుఁడు; పిత, పితృబ్రువుఁడు; మాత, మాతృబ్రువ. ఇట్టి దుఃస్థితిలో వీంద్రవివేకులేలకారు? ఈ సందర్భమున వీం డ్రిట్లేదో పత్రికలయందు గిలుకుచుఁ గాగితపుకఱవు దినములలోఁ గాగితములు వమ్మొనర్చుటకన్న సభాస్థలికి వచ్చి తమ "అపరాధమును" సమర్థించుకొనుట సమంజసము. ఏ సభలోఁగాని యటులొనరించి సభ్యులను సంతుష్టిపఱచి తాము లోకమునం దాపాదించుచున్న "భ్రాంతచిత్తులై" అను నంశమ్మును స్థిరీకరించినచోఁ దమపోషకులకేమి తమకేమి మంచి గౌరవముగదా? ఆ సభకుఁ బిలువకున్నను మేము వత్తుము మాయెదుట మా శిష్యుల నోరెంతవఱకు సాగునో? చూడవలయునని మాకెన్నాళ్లనోయుండి కుతూహలము కలదు. ఆ సంవత్సరాది సంచికలోని వ్రాఁత యితరుల వాక్యముల కనుకరణమే కాని, తమది కాదఁట? వహ్వాఁ ఈత్రోవ "క్షమాపణ చెప్పుట" కపరపర్యాయము కాక మఱేమి? ఆయవివేకపుఁ గూఁతలన్నియుఁదమ సొంత మాటలే. అనుకరణములు గావు కావు కావు. ఏ గ్రుడ్డివాఁడును దీని నంగీకరింపఁడు. ఇంతటనేని ఋజుమార్గమున క్షమాపణచెప్పి చక్కఁగా బ్రదుకుట యుక్తము. సహృదయులారా! కొడుకో, తమ్ముఁడో, శిష్యుఁడో, వేఱొకరుఁడో, యవివేకియై దొసఁ గొనరిcప వాని కేడుగడయగు తండ్రియో, అన్నయో, గురువో, వేఱొకఁడో "అయ్యా! మావాని తప్పును మన్నింపవలసినది" యని ప్రార్థించుటయు, లోకు లామాటను విశ్వసించి యాయవివేకమును క్షమించుటయు నేఁడు పుట్టినవి కావు. కావున మావాండ్రింకను గిల్కుచున్నారని మీరాగ్రహింపకుఁడు. క్షమింపుఁడు.

"వివేకభ్రష్టానాం భవతి వినిపాత శ్శతవిధః" అను భర్తృహరి వచనము మీయెఱుఁగనిదికాదు, మావాండ్ర తెలివికిఁ గృష్ణాపత్రికాధిపతి గూడ నిప్పట్ల నింద్యుఁడే యయ్యె. కారణ మతఁడు వెనుక మమ్మును గోళ్లనుగా వ్రాసినాఁడట! ఇటీవల నట్టివ్రాఁతకుఁ దావలమగు మమ్మునే తమ మీదికిఁ బురికొల్పెనఁట! వీండ్రాకోళ్లవ్రాఁతనే చూచి పదపడి మేము బందరువదలి వచ్చుతఱి వ్రాసినవ్రాఁత చూడకుండుటకుఁ గత మేమో? కృష్ణాపత్రికాధిపతి మాకును దమకును గొప్పరపువారికిని జరుగు నసమానకలహమునందు రోతపుట్టి కోడికి వేఱొక కోడి యెదురఁ బడినంతనే శౌర్యము వహించుటయే సహజమైనట్లు తి.వెం. కవులకుఁ గూడఁ దారతమ్యవిచారములేకే శౌర్యముదయించుచుండు నను

నంశమును మనమం దుంచికొని కోళగాఁవ్రాసి గుంటూరుసీమ యుత్తరరంగమున దానిపై వ్రాసిన మాసమాధానమువలననో? అంతకుమున్నో వ్రాసిన సుదర్శినీ పత్రికాధిపతి వ్రాఁతవలననో మనసు పశ్చాత్తప్తమైనదనుట కాయన తిరిగియు దానిఁగూర్చి లవమునువ్రాయకుండుటచేతనే సహృదయులు గుఱితింపఁగలరు. ఇది వివేకుల లక్షణము కాదా? భ్రమప్రమాదాది దోషభూయిష్ఠమగు మనుజుని మనసొకప్పుడు కుమార్గమునఁ బడవచ్చును. పిమ్మట నితరుల యుపదేశము వలననో స్వయం ప్రబుద్ధతకతముననో క్రమమార్గము స్ఫురింపవచ్చును. స్ఫురించిన పిమ్మటఁ గూడ "తాఁబట్టిన కుందేటికి మూఁడేకాళ్లు" అని వెఱ్ఱివెఱ్ఱి వ్రాఁతలు వ్రాయఁబూనుట యవివేకుల లక్షణము, వెం.రా.లకో? ఈ కర్మము తెలియని హేతువున నింకను "దేశభక్తి" వ్యాఖ్యానములు వ్రాసి ప్రజలచీవాట్లకుఁ బాల్పడవలసి వచ్చుచున్నది. అయ్యో! "యరలవమదనస" పద్యమునకు వ్యాఖ్యాన మెవ రపేక్షింతుకో గదా? భవతు. దీనిగతి ముందు విచారింతము. ప్రస్తుతము శ్రీ పంతులవారి నీప్రశ్నమున కుత్తర మడిగి విరమింతము.

ఉ. పెంపుడుజంతు వొక్క యెడఁ బేరినయామున మేనెఱుంగమిన్
దంపులమారియై యొకని దాఁగఱచెన్ వెస వాఁడు జంతువున్
జంపుటొ, కొట్టుటో యొకటిసల్పుట యుక్తమొ? పెంచునామహా
సంపదుదారుతోఁ దెలిపి జంతువునా మడఁగించు టర్హమో.

★ ★ ★

# మహాకవి భోజమహారాజు

(23-11-1918 సం॥ర కృష్ణాపత్రిక నుండి)

ఈ మహారాజును బూర్వకవు లెట్టివారి కుపమానముగాఁ గైకొను చున్నారో సుంత విచారింపవలసివచ్చినది. ఈయనఘుఁడు తాను మహాకవియై తనయైశ్వర్యమును మహాకవులకుఁ దంగెటిజున్ను గావించినవాఁడు కావున నీ రెండు విషయముల నిటీవల సుప్రసిద్ధు లెవరేని రాజులం దవతరించినచో వారి నియ్యద్వితీయుతోఁబోల్చు చున్నారు. అందును నీతనికి ముఖ్యము వైదుష్యము కాని దాతృత్వమాత్రము కాదనునంశము చదువరులు మనమున నుంచికొని యీపై భాగమును జదువవలయును. ఈయంశము నీక్రిందిశ్లోకము బోధించెడిని.

శ్లో. అంభోజం కలయన్ సదృక్ష మవనే సాహిత్యరీత్యాం దృశో
ర్మాంధాతార మపారసంపది మహద్భావే యశోరాశిషుః
శత్రూణాం పురభంజనే ధృతిగుణే కించోరగేంద్రం మతి
ప్రాగల్భ్యే ప్రతిభాతి తిమ్మనృపతిః పాకాహితప్రాభవః.

ఈ శ్లోక రత్నము సుమారు నూఱుసంవత్సరములకు మున్ను శ్రీశ్రీ పెద్దాపురపు మహారాజుగారిని గూర్చి తాత్కాలికపు విజయనగర ప్రభువగు శ్రీ విజయరాఘవ సార్వభౌముఁడు రచించినట్లు విద్వత్పరంపర వలన వినుచున్నారము. ఈ ప్రభువతం సులిరువురును మహారాజులగుటయే కాక మహాకవులును నయి తమ యైశ్వర్యమునకు వన్నె వెట్టినవారఁట. వీరిరువురును బినతల్లి పెదతల్లి బిడ్డలఁట. పై శ్లోకమును రచించిన ప్రభువు మాటటులుండ నాప్రభుని యుంపుడుకత్తె యగువేశ్యకూడ మంచికవయిత్రి యనుట కీ క్రింది పద్య ముదాహరింపఁ బడుచున్నది.

ఉ. ఏవనితల్ మముం దలఁప నేమిపనో? తమరాఁడువారుగా
రో? వలపింపఁగా నెఱుఁగరో? తమకౌఁగిటిలోన నుండగాఁ
"రావదియేమిరా? విజయరాఘవ?" యం చిలుదూరి బల్మిమైఁ
దీవరకత్తెనై పెనఁగి తీసుకవచ్చితినో తలోదరీ.

ఈ పద్యము శ్రీరాజుగారి యంతఃపురము తన్నేమో యనినట్లు చెప్పినదాసిచేతి కిచ్చి యారాజునుంపుడుకత్తె యంతఃపురమున కంపించి నట్లు విందుము. అప్రస్తుతమే యైనను నప్పటికాలపు మనభాషౌన్నత్యము దెలియుటకై మఱికొంత యిట వ్రాయుచున్నారము. పిఠాపురమునకు నతిసమీపమున నున్న చంద్రంపాలెము గ్రామమున వసించు మహాకవి కూచిమంచి తిమ్మకవిగారి రసికజనమనోభిరామమును జదివి యక్కవి సార్వభౌముని దర్శింపఁ గుతూహలినియై యావేశ్య మహారాజావారు కోటిఫలి దయచేయునవసరమున వారితోఁ దాను బయలుదేరి యిక్కవి గ్రామ సమీపమున డిగి ప్రచ్ఛన్నముగా నీకవిని దర్శించిన సందర్భమునందలి పద్యము కూడ నిట నుదాహరించుచున్నారము.

> చ. చతురులలోన నీవుకడు జాణ వటంచును బిట్టుఁ గౌగిలిం
> చితి నిటు మాఱుమో మిడఁగఁ జెల్లునె? యోరసికాగ్రగణ్య! య
> ద్భుతమగు రంగుబంగరపు బొంగరపుంగవరంగు లీ స్నగచ
> ద్వితయము ఱొమ్మునాటి యదె వీఁపున దూసె నటంచుఁ జూచితిన్.

ఈ పద్యమునందలి పూర్వార్ధము వేశ్యకవిత్వ మనియు నుత్తరార్ధము తిమ్మకవిగారిదనియు స్పష్టమే. ఏ సందర్భమునవారి కిట్టియుక్తి ప్రతియుక్తులు జరిగినవో యదియును బద్యమే చెప్పును గాన విస్తరింపము. ఇఁకఁ బ్రస్తుతమునకు వత్తము. వేశ్యల దగ్గర నుండి కూడ నిట్టికవితాప్రసక్తి గల యాకాలమునందలి యా విజయరాఘవ సార్వభౌముని సాహిత్య సౌహిత్యము లెట్టివో చదువరు లూహించుకొందురుగాక. మొదట నుదాహరించిన శ్లోకార్థము వ్యాఖ్యామూలమునఁగాని యెల్లరకు సుబోధము గాదు. కాని గ్రంథవిస్తరభీతిచే నవసరమైనంత వరకే వ్యాఖ్యాన మొనర్పఁబడుచున్నది. తిమ్మనృపతికి, తాత్కాలికపు పెద్దాపుర సంస్థానప్రభువు, అవనే = పాలనము నందు, అం = విష్ణువును, సాహిత్య రీత్యామ్ = పాండిత్యమునందు, భోజం = భోజమహారాజును, దృశోః = చూపుల విషయమున, అంభోజం = పద్మమును, సదృక్షం = సమానమైనదానినిగ, కలయన్ = చేయుచు, ఇదేరీతిగా నాయాయాచరణములన్నియు నన్వయింపనగు. మన కిందుఁ బ్రస్తుతాంశము, భోజరాజుతో బోలిక గావలసిన తేనికి మంచిపాండితియు మంచి కవితయు నుండి తీరవలయు ననునది. ఆ సందర్భ మిందుఁ బూర్తిగాఁదేలుచున్నది గాని యద్వితీయ మగునీ శ్లోకమును రచించిన విజయరాఘవ సార్వభౌమునికి భోజునితో నుపమితిని సాధించుట కీచర్చ యుపకరించునే గాని దీని నేరాజు నుద్దేశించి యాయన వ్రాసి పంపెనో యాయనకట్టి యుపమితి నిది సాధింపదు. సత్యమే కాని మహాకవి విజయరాఘవ

సార్వభౌముఁడు తిమ్మనృపతి కాశ్రితుఁడై ముఖస్తుతి చేసె ననుకొను వారుందురా? ఉందురేని యా పెద్దాపురప్రభు వెంతమహాకవియో తెలుపఁదగు నీక్రింది శ్లోకమును గూడ నుదాహరింతముగాక.

> శ్లో. నాళీకభంగకృ దతీవనదీనబంధు
> ర్నక్షత్రపో, నవసుధావిభవైక హేతుః
> రాజాకిమిందురపి నార్యభిమానహారీ
> రాజా పరం విజయరాఘవసార్వభౌమః.

ఈ శ్లోకము తిమ్మజగపతి మహారాజు విజయరాఘవ సార్వభౌమునిపై రచించినది. విజయరాఘవ సార్వభౌముఁడు రచించిన శ్లోకమే నిరుపమాన మనఁదగినది కాని దీనిని విన్న పిదప దాని కాగౌరవము దక్కదు. ఈ శ్లోకము వంటి శ్లోకము కాలత్రయమునందును జనింప రానిదని విద్వాంసుల యభిప్రాయము. దీని కించుక వ్యాఖ్యానము రచింపవలసినదే కాని గ్రంథవిస్తరమును బత్రిక సహింపదు. అన్వయించుకొనుమార్గ మిది. న అళీకభంగ కృత్ = నాళీకభంగకృత్, విజయరాఘవ సార్వభౌముఁడు, అళీకభంగ కృత్తు, అనఁగా, 'అళీకం త్వప్రియేఽ నృతే," కనుక అప్రియమునో, లేక, అనృతమునో, రూపుమాపువాఁడు. ప్రభువైనవాని కిదిలక్షణముకదా? లోకమున కప్రియమైనదానిని వారించుటకన్నఁ బ్రభువున కవశ్యకర్తవ్య మేముండెడిని? ఇఁకఁ జంద్రుఁడో, అళీక భంగకృత్తు కాఁడు. ఇఁక నేమన? నాళీక భంగకృత్తు, అనఁగాఁ బద్మములను రూపుమాపువాఁడనుట. ఇట్లే నార్యభిమానహారీ. న అర్యభిమానహారీ = నార్యభిమానహారీ అనియు, నదీనబంధుః = న+దీనబంధుః, అనియు, న+క్షత్రపః, నక్షత్రపః న+వసుధావిభవైక హేతుః న వసుధావిభవై కహేతుః" అనియు, వ్యస్తము లుగను సమస్తములగను నాయాయీ విశేషణములను రాజపక్షమందును జంద్రపక్షమందును యోజించి రాజుకన్నఁ జంద్రుఁడు నికృష్టుఁ డనువిశేషమును జంద్రునకు సహజముగా వాడు విశేషణముల వలననే సమర్థించిన యాతిమ్మజగపతి మహారాజునకుఁ గవితో భోజుఁడేనియు సరిగాఁడను నది సహృదయైకవేద్యము. అట్టి స్థితిలో నీయనుపమానునికి భోజోపమానము లజ్జాకరముగాదా? అయినను నతఁడును మహాకవి యితఁడును మహాకవి యని విజయరాఘవ సార్వభౌముడట్లు పోల్చి యుండును. ఈ విజయరాఘవ మహాకవి రచించిన సావిత్రీ చరిత్ర, విష్ణుభక్తిసుధాసాగరము అను రెండు తెలుఁగు ప్రబంధము లొకటే సంపుటముగా శ్రీ మొగల్‌తుర్తి సంస్థానమునందు మేమిప్పటికి నిరువది మూడువత్సరముల క్రిందటఁ జూచియున్నారము, భాషోద్ధారకులా గ్రంథము లచ్చొత్తించుటకై సంపాదింపఁ గోరుచున్నారము. వాని ప్రకటనము వలన

నెట్టితేండ్లకు భోజోపమితి చెల్లునో యెట్టితేండ్లకుఁ జెల్లదో లోకమునకు విస్పష్టపడఁగలదు. మఱియు నప్పకవీయము తృతీయాశ్వాసమున

క. రాజమనోజా? విద్యా
భోజా? దీనార్థికల్పభూజా రిపుసం
ఙ్ఞాజా? వైభవవిజితబి
డౌజా? రవితేజ? గుత్తి యప్పలరాజా.

అని యుదాహరింపఁబడియున్నది. ఈ పద్యకర్త యయ్యలరాజు రామభద్రుఁడు. ఇమ్మహాకవికూడఁ దనకృతిపతిని విద్యావిషయమున భోజుఁడనియు, అర్థిమనోరథ పూరణమునెడల ననఁగా దానవిషయమునఁ గల్పవృక్ష మనియు వేఱువేఱుగా వర్ణించియున్నాఁడు. ఇంతవఱకుఁ గావించిన చర్చవలన భోజుఁడు కవులగు రాజుల కుపమానమం దుండునే కాని కేవలదాతల కుపమానస్థానమున నుండఁడని తేలినది. "మహాభాష్యంవా పాఠయేత్ మహారాజ్యంవా పాలయేత్" అనునట్లు లేరాజునకు మహారాజ్యపాలనముకన్న మహాభాష్య ప్రవచనము ముఖ్యమో ఆ రాజునకే భోజోపమితి చెల్లునుగాని తదితరుల కాయుపమితి యన్వర్థము గాక ఘృతకోశమై యపహాస్యాస్పదమను నంశమున కింతకన్న నుదాహరణములు చూపనక్కఱలేదు. మామిత్రులు మ॥రా॥రా॥ పానుగంటి నృసింహారావుపంతులవారు చూపిన సమానధర్మము లనఁగా! భాషాభిమానత్వము, పండితకవి పోషకత్వము, తర్కవ్యాకరణాది శాస్త్రములు పరీక్షింపించి సత్కరించుట, పూర్వాధునాతన గ్రంథ ముద్రాపణము, వేదపరీక్ష, సూత్రభాష్యాద్యాంధ్రీకరణ ప్రేరకత్వము లోనగునవి భోజోపమితి సంపాదకత్వము నెడల నకించిత్కరములు కావున "ఇది వఱకుఁ జెప్పిన సమానధర్మము లింకను మా మిత్రులకుఁ జాలవా, ఎవరు నాయనలారా? ఇట్లు చేయువారు" అని వ్రాయుట విచారదూరము. ఆ యీ సత్కార్యములకును ఈయుపమితికిని సంబంధమే లేదు. ఎవరికిఁ బంతులవారు భోజోపమితి సామ్రాజ్య పట్టాభిషేకము నొనర్ప నెంచినారో వారికి సంస్కృత మందుఁ గాకున్నను దెలుఁగునందేని మంచి కవితాశక్తి కాకున్నను దగు మాత్రము సామర్థ్యమేని యుండఁదగు. దానిని బోషించుకొనఁదగు సాహితియు నుండఁదగు. అపు డాంధ్రభోజుఁడన్నచోఁ బ్రధానధర్మము సమన్వయించును. తెలుఁగు కవిత్వమనుటయేకాని యదియుఁ బైపైని లేదని మా మిత్రు లెఱుఁగుదురు.

తే.గీ. తెలుఁగు తెలుఁ గని యద్దాన దిగుటెకాని
సంస్కృతమ్మునకన్నఁ గష్టమ్ము హెచ్చు
ఒక్కదానఁ బరిశ్రమ మున్నఁజాలు
దాని కిద్దానికో రెంటఁ దగులవలయు.

కావున సంస్కృతాంధ్రభూయిష్ఠ మగుసాహితియుఁ గవితాచాతురియుఁ గలకృష్ణదేవరాయల వంటి ప్రభువతంసులే "ఆంధ్రభోజపదము" వహింపఁ దగువారు కాని యాశక్తి లేనివారందుల కర్హులు గారని సహృదయుల పోకడలు తెల్పుచున్నవి. ఇట్టిస్థితిలోఁ బంతులవారు "వారి వ్రాఁతను బట్టి పీఠికాపురాధీశుల "నాంధ్రభోజుఁ" డని యన్వర్థముగా ననుట వారి కిష్టము కాక యున్నట్లగపడుచున్నది" అని వ్రాయుట యవిచారమూలకము. తిరుపతి వేంకటేశ్వరులకే కాదు, విజయనగర మహారాజుగారికి, రామాభ్యుదయ గ్రంథకర్త యగు నయ్యలరాజు రామభద్రకవికి, వీరికి వారికి ననవేల? యావదాలంకారిక గ్రంథకర్తలకు వారొనర్చిన "తద్భిన్న త్వేసతి తద్గతభూయోధర్మవత్త్వమ్" అను నుపమాన లక్షణమునందలి "భూయోధర్మవత్త్వమ్" అను విశేషణమునకుఁగూడ మా మిత్రులు పోల్చిన పోలిక సమ్మతము గాదనుట కింతకన్న వ్రాయ నక్కఱ లేదు. తత్త్వాన్వేషణ మొనర్చి యుపమానకల్పన చేయుదుమేని యొకరొప్పుకున్నఁ బోవునా? అట్లుకానిచో నెందఱొప్పిన నేమగును? "త్వయి ప్రసన్నే మమ కింగుణేన త్వ య్యప్రసన్నే మమ కిం గుణేన" ఉపమాది కల్పనలయందు రచయితలు పరిశీలకులుగాఁగూడదు. అతీతవిషయములయందెట్లయినను, అనతీతములగు సందర్భములలో నీపరిశీలనా శూన్యత్వ మపహాస్యాస్పదము కాకమానదు. దానిచే వర్ణ్యమున కది గుణాధాయకము కాక యన్యథా పరిణమించును.

ఉ. ఆవల నెవ్వఁడేని కవి యల్లినపద్యములం బఠించుచో
"నీవిధమెల్ల నిశ్చయమ యీనుతికిం దగు నీతఁ" డంచు సం
భావనగల్గఁగావలయు భావ మటుల్ గనుపట్టకున్న నా
దేవరుఁగొట్టుపద్దెముల దీవన లేమిటి కప్పరాడ్విభూ.

మఱియుం బంతులవా రననుగుణోపమానకల్పన మొనర్చి యది సహృదయ సమ్మతముగా దని తెల్పిన మీఁద దాని సాధించుటకు దర్పనిష్ఠ మగుదాతృత్వాదికమును విస్తరించుచుఁ దుట్టతుదను "ఎవరు నాయనలారా? ఇట్లు చేయువారు?" అనునొక సాహసోక్తిని వ్రాసియున్నారు. గద్వాల, వనపర్తి, ఆత్మకూరు సంస్థానములలోని పరీక్షలు, సమ్మానములు పంతులవారెఱుఁగరో? ఆ సంస్థానములలో విద్వాంసుల విషయమున నగుచున్న ద్రవ్యవ్యయము ప్రతివత్సరము లక్షకుఁ దక్కువకాదు. అందు గద్వాలలోనే నేటేట నేఁబదివేలు, తక్కు రెండు సంస్థానములలో నేఁబదివేలకుఁ దగ్గదు. ఇవి తరతరముల నుండి జరుగుచున్నవి. ఆ ధర్మవ్యయము నెఱిగియు "ఎవరు నాయనలారా?" అని మా మిత్రులు ప్రశ్నించు టేటికో? మఱియు నూజివీటిని నిన్నగాకమొన్న 28 వత్సరముల

ప్రాయమున స్వర్గతులైన నారయ్యప్పారావుగారిని శ్రీపంతులవారు స్వయముగా నెఱుఁగుదురు. శ్రీపంతులవారు నూజివీట నున్న ప్రభువుల యాదరణము మీఁద నట వసింప నుద్యమించుట మే మెఱుఁగుటయేకాక శ్రీవిరవవెంకటసూర్యరాయ విద్వద్వ్రతంసుఁడు గూడ నెఱుఁగును. ఆ నారయ్యప్పారావుగారి రాబడికిని ఆయన దాతృత్వమునకును గల ప్రసక్తి పంతులవా రెఱుఁగుదురు. మే మెఱుఁగుదుము. ఆయన నేటేట దర్శించి వార్షికములుకైకొను పండితకవు లెఱుఁగుదురు. మఱియు నూతనముగా రాజ్యమునకు వచ్చిన శ్రీ ఉయ్యూరు ప్రభువునకుఁ గల విద్వదాదృతి కవితాప్రసక్తి లోనగునంశములు మామిత్రు లెఱుఁగనివారు కారు. కారణాంతరమున నిపుడు నూజివీటి రాజులలో నొకరును బిఠాపురాధీశుల కైశ్వర్యమున దీటుకారు. గద్వాల లోనగు సంస్థానము లేని యింతకుఁ గొంత లొచ్చే. అయినను విద్వత్కవ్యాదరణాదికమున నెన్నిరెట్లు హెచ్చుదురో పంతులవారు పరికింప వలయును. రాఁబడిలో నెన్నోరెట్లు హెచ్చగు మైసూరు, బరోడా లోనగు సంస్థానముల యందలి విద్వత్పరీక్షలు సమ్మానములు నిట విస్తరించుట ప్రస్తుత భోజోపమితి వంటిదే యగుట వదలుచున్నారము. ఒకపరి మైసూరుప్రభువు రాయచూరు మార్గమున రైలుప్రయాణము చేయునవసరమున నామహాప్రభువును సందర్శింప గద్వాల భూపాలుఁ డరిగినపుడు ప్రసంగవశమున నా మైసూరుప్రభువు "రాజా మీ సంస్థాన మెన్నికోట్ల రాబడి గలది?" యని యడిగెనఁట. దానిపై "అయ్యా నేను మీ సంస్థానము నందలి యొక్క పెద్ద గృహస్థువంటి వాఁడను కొన్ని లక్షలు మాత్రము వచ్చువాఁడను." అని గద్వాల రామభూపాలుఁడు సవినయమున విన్నవింప మైసూరు ప్రభువు నమ్మక "నీయశమును బ్రతివిద్వాంసుఁడును వర్ణించుచుండునే. అనేక పర్యాయములు నీకీర్తిని పండితుల వలన మేము వినియున్నారము. నీ రాబడి యింతస్వల్పమైన నీకుఁ గోట్లువచ్చు సంస్థానాధి పతులకన్న నెక్కుడు యశ మెట్లు వచ్చెడిని?" అని మరలఁ బ్రశ్నించెనఁట ! దానిపై గద్వాల ప్రభువు "ఇయ్యది మీ యనుగ్రహబల" మని విన్నవించెనఁట! ఈ ప్రసక్తి జరుగుదినములలో మేము గద్వాలలో నుంటిమి. ఆ ప్రసంగము విన్న రాజాశ్రితుల కతన నెఱిఁగి వెంటనే

సీ. కోటివచ్చెడి రాజ కోటీరమణియైన

నిటువంటి సత్కీర్తి నెనయఁగలడె.

అను పద్యమును జెప్పితిమి. ప్రస్తుత మేమనఁగా, నేఁటికాలమున విద్వాంసుల నెంతో ప్రీతితో నాదరించు మహాప్రభువులు చిన్నలలోఁ బెద్దలలోఁ గూడ నప్రధానముగా విద్వద్గౌరవమును బ్రధానముగా ధర్మాభాస గౌరవమును గైకొని ధర్మాభాసమున

కగువ్యయములో నెన్నవవంతుగాని దీనికి వ్యయముగాని వారి ప్రశంసకుఁగా నిందఱుధర్మ ప్రభువుల నీసడించుచు "ఎవరు నాయనలారా?" అని ప్రశ్నించు పంతులవారి వాక్యమున కర్థ మగుపట్టదు. శ్రీపంతులవా రొకపరి సువర్ణ లేఖలో నొక వ్యాసమును. వ్రాసియున్నారు. ఆ వ్యాసపరమార్థము పిఠాపురపుఁ గవితాపరీక్షకు సంబంధించినదియే. అపుడు పంతులవారు తత్సంస్థానమున నుండనిదినములు. కవిత్వముమాట నటులుంచి సాహిత్యము మాట వదలుకొని శ్రీ పిఠాపురాధీశు లేమహాకవుల నాదరించిరో, ఏ మహాకవులఁ బరీక్షింపించిరో, ఏ మహాకవులం బరీక్షకులుగా నేర్పరచిరో ఆయా మహాకవులలో శ్రీరాజాగారిని గూర్చి యెవరుగాని రచించిన దొకపద్యమునేని కవిత్వ మనిపించుకొనదగినది చూపుచు లోకసంతుష్టికై యొక వ్యాసము వ్రాయఁ బ్రార్థితులు. అపుడు కొంతకాకున్నఁ గొంతేని "భోజోపమితి" యన్వర్థ మగును. తగు పరీక్షకుల నేర్పరచిన మఱునాఁ డెందఱో కవులు రాఁగలరు. ఈ యంశమును నాఁడు పంతులవారి వ్యాసమే స్ఫుటపఱచినది. వారును మఱచి యుండరు. మేము వారికి 19 వత్సరముల క్రిందటఁ బ్రసక్తాను ప్రసక్తముగా వ్రాసిన "ఆంధ్రకాళిదాస బిరుదము" మఱువ లేదు. పంతులవారపుడు దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి తమ్మనశాస్త్రులవారిచేఁ గాఁబోలును గవితావిషయమున నాక్షేపింపఁబడి సమాధాన సందర్భమునకై మాలోనొకరి పేర వ్రాసిన యుత్తరముపై మే మాయాక్షేపణలు సరికా వని వ్రాయుచు నా బిరుదమును హృదయపూర్వకముగా వ్రాసితిమి. అటు లొసఁగిన యా బిరుదమును వారెందును బ్రచురింపక వారి యహంకారశూన్యతకుఁ దావలముగా దాఁచి పెట్టిరి. వారి వినయాధిక్యమున కది స్ఫోరకమని వారనుకొన్నను మే మొసఁగిన మీఁదట వారటులొనరించి రనుకొనుటకు లోకుల కేమి యాధారము కలదు? ఇంతవఱ కాధారము లేక యిపుడు వారు పీఠికాపురాధీశ్వరుల కొసఁగిన "ఆంధ్రభోజ బిరుదము" ద్వారమున దానికిఁ గలప్రసక్తి బయలఁ బడుటచేఁ బంతులవారియనౌద్ధత్యము వెల్లడియైనదని మేము సంతసించుచున్నారము. మే మిడినబిరుదము వారిపుడు ధరింప కుండుటకు వారి యనౌద్ధత్యమే కాక కాలదోషము కూడఁ గారణమని మేమూహించుచున్నారము. ఒక పుష్కరము దాఁటి రెండవ పుష్కరపూర్తి కావచ్చుచున్నది గదా? వినయార్థము వారు ధరింపకున్నను మేము మరల మరల వారి నీ బిరుదమును ధరింపవలసినదని ప్రార్థించుచున్నారము. ఏమందురా? వారు కవులు, పరిశీలకులు. "ఇదంబ్రాహ్మ మిదంక్షాత్రం" అను తెలఁగున నాంధ్రమందును రాజకీయ విద్యయందును నిష్ణాతులు. ఇట్టివారు శ్రీ శ్రీ పిఠాపురాధీశులను "ఆంధ్రభోజుఁడు" అని వాడిరిగదా? "సత్కవి వాక్యము రిత్త వోవునే" కనుక ఋషివాక్యమునకుంబలె దానికి సార్థక్య కల్పన మావశ్యకము. "నానృషిః

కురుతే కావ్యమ్" పంతులవారు ఋష్యంశ సంభూతులు కాకపోరు. ఆ వాక్యమునకు సార్థక్య మన్య విధమున సంఘటింపదు. పంతులవారు "ఆంధ్రకాళిదాస బిరుదము" వహించిన యుత్తర క్షణమున "భోజరాజంత రాజున్నఁ గాళిదాసంతకవి యుండనే యున్నాఁడు" అనులోకోక్తిని దబ్బిబ్బుచేసియేని సార్థక్యమును గల్పింప వచ్చునని మాయాశయము. కవివలనఁ బ్రభువునకును బ్రభువువలన కవికిని వన్నె వచ్చుట సహృదయ సమ్మతము.

శ్లో. మణినా వలయం వలయేన మణి
ర్మణినా వలయేన విభాతి కరః
కవినా చ విభు ర్విభునా చ కవిః
కవినా విభునా ప్రవిభాతి సభా.

ఇట్లు మార్గాంతరమున శ్రీవారి బిరుదమును సమర్థింపఁ బాటుపడు మమ్మును మామిత్రులు పంతులవా రన్యథాగా భ్రమించినందులకు మావిచారము పట్టజాలకున్నారము. ఇంతవఱకు వ్రాసినదొక భోజపద విచారమే. పంతులవారు వ్రాసిన మఱికొన్ని సంగతుల కుత్తరము లోకుల కొఱకు వ్రాయవలసియున్నది. గ్రంథవిస్తరమగుటచేఁ బ్రస్తుత మింతతో ముగించి వేఱొకపరి దానింగూర్చి వ్రాయనెంచితిమి.

★ ★ ★

# గారుశబ్ద విచారము

(5-4-1919 సం॥ర కృష్ణాపత్రిక నుండి)

గారుశబ్దము గౌరవార్థక మని యెఱుఁగనివారు లేరు. కావున దీనిఁ గూర్చి చర్చించుట చర్వితచర్వణము, అయినను ప్రస్తుతకాల వైపరీత్యముంజేసి యీగారు శబ్దాపేక్ష కొందఱ కెంతో యపకృతిని గావింపనుండుటచేఁ జేత నైనంతలోఁ గొంతవ్యాఖ్యాన మొనర్పవలసి వచ్చినది. మనదేశమందనాదిగా, ఈగారు వర్ణాశ్రమాచార పద్ధతులకు లోఁగి ప్రవర్తించుచున్నది. వారియందితర యోగ్యత లున్నను నుండకున్నను బ్రాహ్మణాద్య గ్రవర్ణస్థులను దదనంతరవర్ణస్థులు గారు పదముతో గౌరవించుచున్నారు. లోపల నిష్టమున్నను లేకున్నను బ్రాహ్మణాద్య గ్రవర్ణస్థులును అధికారాది విశిష్ట కారణములచేఁ దదనంతర వర్ణస్థులను గారు పదముతో గౌరవించుచున్నారు. ఆ యీ సందర్భములం బట్టి చూడ గారుపదము కులోన్నతియో, అధికారోన్నతియో, ధనోన్నతియో, విద్యోన్నతియో, కలవారికెల్ల నిరాఘాటముగా వాడఁదగినదిగాఁ దేలుచున్నది. అత్యుత్కృష్ట వంశస్థులనేకులు, అతి కృష్టులగు ననేకులను అధికారాదికారణములచే గారు పదముతో నోరారఁ బిల్చుట లోకమెల్ల నెఱిఁగిన విషయమే. కావున నిందుల కుదాహరణములక్కఱ లేదు. ఇఁకఁ బ్రస్తుతము విద్యనుబట్టి గారుపదము వాడుట యుక్తమే యగునెడల మార్దంగికత్వము కూడ సంగీతాంగమగు విద్య యని యొప్పికొనుచు, ఆవిద్యలో, కొన్ని జిల్లాలకుఁ బెద్దయైన మనుజుని విషయమున నీగారుపద ముపయోగించుట కెవరుగాని యేలకొంకవలెనో? సుంత విచారింప వలసియున్నది. తీఁగె కదిపిన డొంక కదలుచున్నది.

"రహిపుట్ట జంత్రగాత్రముల రాల్గఱఁగించు
విమలగాంధర్వంబు విద్య మాకు"

గాంధర్వ మన సంగీతము, దానికే తౌర్యత్రిక మనిపేరు, తౌర్యత్రిక మనగా నృత్తగీతవాద్యములు. మొత్తమీనృత్తగీతవాద్యము లితరులు గూడ విశేషాభిమానముతో నభ్యసించుట యనాదిగా వినవగుచున్నను నియ్యవి వేశ్యాజాతి స్త్రీ పురుషులకుఁ గులవిద్యలని మనపూర్వులభిప్రాయపడి యున్నారు. ఆజాతి స్త్రీ పురుషులలో నీ నృత్తగీతవాద్యములలో నెంతెంత ప్రసిద్ధులేని బయలుదేరి యున్నట్లును వాండ్రు

తత్తత్సంస్థానములలో నేకవచన ప్రయోగ మాత్రమున సంతుష్టి నందినట్లును వినుచున్నారము. పంచ రత్నములని పేరువడసిన పదవర్ణములను రచించిన బోగము కొలము విద్వాంసుఁడగు వడివేలునకును నప్పటి తంజాపురీ రాజునకును జరిగిన సంభాషణ మిందులకుదాహరణము, మఱియు నిన్న మొన్నటి వఱకు జీవించియున్న మంగలికొలము సంగీతపండితులు చిన్నన్న కుప్పుసాములలో, చిన్నన్నను మేము బాగుగ నెఱుఁగుదుము. గద్వాలాది సంస్థానములలో, తోడి విద్వాంసులగు నగ్రజాతివారిచేనేమి రాజబంధువులచేనేమి "ఏమి చిన్నన్నా, ఏమోయీ చిన్నన్నా" అనిపించుకొనుటయు నెఱుఁగుదుము. ఈ ప్రసంగము నింతటితో నాపుదము. వాండ్రు విద్వాంసులై గారుపదమునకు తగియున్నప్పుడు 'గారు' పద ముపయోగింపకుండుట ప్రాజ్ఞుల లక్షణము కాదు అని మన మేల యనరాదు? అనవలసినదే! ఈయంశమే యిట దేలవలసియున్నది. వినుఁడు. ఎంతటినీచుఁడేని విద్యాధిక్యమువలన గారు పదార్హుఁడగుననుట నిక్కమేకాని ఆ నీచున కావిద్య కులవిద్యయగునేని యది గారు పదార్హతనుదప్ప దక్కిన సకలగౌరవములను గలిగించు ననునది యిందలి రహస్యము. ఆనీచుఁ డే యింగ్లీషు విద్యనో చదివి యేయుద్యోగిగనో వచ్చినచో వంగివంగి సలాములు, గారులు, గీరులు, నిరాటంకముగా వచ్చెడిని. స్వకులవిద్యలోఁ బండితుఁ డగువానియందు లోకమున కభిమానమేమో యతిశయించియే యుండును గాని గారుమాత్ర మనుభూతమయి కనుపట్టదు. అగ్రకులజులలో యీబాధలేదు. వాఁడు శుంఠయైనను వారి పూర్వులంబట్టి గారు వాడుచునేయున్నారు. వేశ్యాదిజాతుల పురుషులు గారుపదము సంపాదింపవలెనన్నచోఁ బ్రస్తుతము రాజకీయవిద్యలోఁ నేమాత్రమేని పరిశ్రమ చేయవలసినదే. స్వవిద్యలోఁ జేసిననది గారు పదము నందింపదు. ఇది యనుభవసిద్ధము. పురుషులకు మార్దంగిక శిరోమణిత్వము 'గారు' పదము నందింపఁ గల్గినచో స్త్రీలకు నాట్యనైపుణియో, గానచాతురియో వాత్స్యాయన శాస్త్రపాండితియో, లేక తదనుభవమో గారు పదము నందించి తీరవలయును గదా? అది యెన్నఁటికిని ఘటించునా; సూత్రప్రాయముగ వ్రాసి యీ విషయ మింతతో ముగించుచున్నారము.

★ ★ ★

# మనుగుడుపు

(17-11-1934 సం॥ర కృష్ణాపత్రిక నుండి)

ఈ పదమున కవయవార్థం చెప్పుమంటే చెప్పడం కష్టంగాని, యీ మాట ఆబాలగోపాలంగా మాత్రం అందఱూ తెలుసుకొంటారు. ప్రతి పెళ్లికొడుక్కున్నూ పెళ్లయిన వెనువెంటనే అత్తవారింట కొన్నిరోజులో మాసాలో, జరిగే విందు పేరిది. నాకు పెండ్లయి నలభైనాలుగేండ్లు సుమారైనప్పటికీ, యీ మధ్య తిరిగి వక కన్యకను కట్టుకోవడంచేత యీ విందు మళ్లా తటస్థించింది. ఆ కన్య యెవరు? మామగారెవరు? అత్తవారూరిపేరేమిటి? అని అడిగితే చాలా వ్రాయవలసి వస్తుంది. ఒక మామగారు గాక యిద్దఱు మామగార్లు, దీన్ని బట్టి గ్రామాలు కూడా రెండే. కన్య మాత్రం వక్కత్తే. ఆమె పేరు నేను చెప్పడానికి శాస్త్రం వప్పుకోదుగాని, వ్రాయడానికి శాస్త్రజ్ఞుల సమయం కొంత అంగీకరిస్తుంది. కాబట్టి వ్రాస్తూన్నాను. "సౌందరనందం" అంటారు. వేంకటరత్నం వగయిరా పేర్ల వలెనే యీ పేరున్నూ స్త్రీపరంగా సమర్థించుకోవచ్చు. యీ పైని చూపిన సూచనల వల్ల యీ పెండ్లి సంగతి యిక్కడి సభ్యుల కందఱికీ స్పష్టంగా తెలిసివుంటుంది. మామగార్లు పింగళి లక్ష్మీకాంతం, కాటూరి వేంకటేశ్వరరావుగార్లనిన్నీ, షష్టిపూర్తి మహోత్సవ సందర్భంలో నాకు పై పేరుగల కబ్బాన్ని కృతిపెట్టేరనిన్నీ కూడా తెలిసే వుంటుంది. కాని దీనికి "కంటిన్యుయేషను" గా జరిగిన మనుగుడుపును గూర్చి కొంచెం వ్రాయాలనుకొని వ్రాస్తూన్నాను.

ఈ వివాహం యీ బందరులోనే మీ అందఱి సమక్షంలోనే నాకు అఱువై మూడేండ్ల రెండు మాసాలు నిండేరోజున జరిగింది. కన్యక పుట్టి అప్పటికి కొన్ని వత్సరాలు కాకపోదుగాని, యేమైననూ బాలగాని ప్రోఢకాదు కనుక, శారదా బిల్లు కిందకు రాకుండా యీ వివాహాన్ని తప్పించడానికి వీలుండదు, అందులో ముసలాడికి పసిపిల్లని కట్టిపెట్టిన పెండ్లి కనుక, సంఘసంస్కర్తల మనస్సులు యీ పెండ్లిమాట వినడంతోనే మఱీ మండుతాయి. అధికారికూడా పూర్తిగా జుర్మానా అనుగ్రహించడాని కభ్యంతరం వుండదు. యిట్లాటి చిక్కులన్నీ వున్నా, నేనీ బందరులో సుమారు పదమూడేళ్లు కాపురంగా వుండి యిక్కడివారి ప్రేమను పూర్తిగా గడించుకొన్న కారణంచేతో మఱేమో కాని, యీ పెళ్లి ఫ్రెంచిపేటలో

దొంగతనంగా కాక, పబ్లీకు టవున్ హాలులోనే జరిగింది. జరిగి యిప్పటికి యేడాది దాటిపోయింది కూడాను. యిప్పటికి యెవ్వరున్నూ కేసు పెట్టలేదు. కాబట్టి నేను పెండ్లాడనే లేదని కాని, అసలు పెండ్లికూతురు కన్యేకాదని గాని కోర్టులో డిఫెన్సులు పెట్టుకోవలసింది లేదని మహాధైర్యంగా మీయెదుట వుపన్యసించగలుగుతూన్నాను.

ఇక మనుగుడుపు గాథ వినండి. పెండ్లికొడుకు అదృష్టమంతా పెండ్లికూతురు పాదాన్ననుసరించి వుంటుందని ప్రాచీను లభిప్రాయపడతారు. “భవాని త్వత్పాణి గ్రహణ పరిపాటీఫల మిదమ్” ఇత్యాదులు అభియుక్తోక్తులెన్నో పైసంగతిని సమర్థిస్తాయి. కాబట్టి యీ పెండ్లి కూతురిని కట్టుకొన్నాక నేను చాలా జబ్బుపడినప్పటికీ తిరిగీ పెండ్లయిన యీ వూరికి వచ్చి మిమ్మలినందఱినీ దర్శించి ఆనందించగలగడం అన్నది పెండ్లికూతురు చలవేకాని మఱోటికాదనడం నిర్వివాదాంశం. యిలా కాకపోతే జబ్బుపడడం వల్ల ఆ జబ్బుక్కారణం యీ పెళ్లే అనియే యెందుకనుకో గూడదని మీరు శంకింపవచ్చును. స్థూలదృష్టిని చూస్తే అట్టి వూహకూడా కలగవచ్చుగాని, ఱఅవై నాలుగేండ్ల వృద్ధుడు జబ్బుపడడానికి కారణం అన్యుల మీద పెట్టడంకన్న, వయస్సు మీదే పెట్టడం యుక్తియుక్తంగా వుంటుందనుకొంటాను. అట్టివృద్ధత్వంలో యెంతోజబ్బుచేసి కూడా మరల జీవించి సభలకు రావడం వగయిరాలు జరగడానికి అంతో యింతో శక్తి కలగడమనేది పెండ్లికూతురు చలవనుకొంటేనే బాగుంటుందేమో ఆలోచించండి.

దీన్నీలావుంచి పైసంగతి వినండి. పెండ్లయింది. సకుటుంబ పరివారంగా బెజవాడత్రోవను మాగ్రామం ప్రవేశించాము. బెజవాడపౌరుల ఆదరంవల్ల కొన్ని వుపన్యాసాలక్కడ జరిగాయి. పెండ్లికి వచ్చేటప్పుడు కూడా వేమూరి రాంజీరావనే శిష్యుడు పరివారసమేతంగా మిక్కిలి భక్తితో విందు చేశాడు. వెళ్లేటప్పుడు కూడా అతనికే విందు చేయాలని కుతూహలం మిక్కిలిగా వుంది కాని, డాక్టరు ఘంటసాల సీతారామశర్మలోనైన శిష్యవర్గం వదలిపెట్టేరు కారు. కడియం ప్రవేశించిన తర్వాత వెనువెంటనే నాకు కుడికన్ను ఱెప్ప హఠాత్తుగా వాలింది. దానితో తల తిప్పు. ఈ రెండింటితో నేను యెందుకూ కొఱగాని స్థితిలో వుండవలసిన వాణ్ణైనాను. ఈ సంగతి బందరులోవున్న మామగారు వేంకటేశ్వరరావుకు తెలిసింది. విశాఖపట్నాని కతడు వ్రాశాడు. విశాఖపట్నం మామగారు వైద్యానికని తన దగ్గఱికి రప్పించాడు. వున్నంతలో మంచిముహూర్తం చూచుకొని మా పెద్ద చిరంజీవిని సాయంతీసుకొని ప్రయాణం చేశాను. రైలారోజున పిఠాపురాని కావలగట్టు చెడిపోవడంచేత మా కడియానికి సకాలానికి వచ్చిందికాదు. యెదరవచ్చేది రాకపోయినా, విశాఖపట్నం వెళ్ళేదేనా సకాలానికి వస్తుందేమో, పిఠాపురందాకా వెళ్లి, నాటికి ఆ వూళ్ళో

ఆగి, తరవాత ఆలోచిద్దామంటే, పడమటి రైలుక్కూడా యీచిక్కే వచ్చి అదీ వచ్చిందికాదు. ఈ అభావచేష్టలు చూస్తే ప్రయాణం వైఖరి బాగుందికాదు. నిజానికి వెన్కకి వెళ్లవలసింది. కాని నేను వీట్లని లెక్కపెట్టకుండా స్టేషనులోనే వుండి, కొంత ఆలస్యంగా వచ్చిన రైలెక్కి నాటికి పిఠాపురం వెళ్లి ఆగి, మఱునాడు లేదు మూడోనాడు విశాఖపట్నం ప్రవేశించాను.

లక్ష్మీకాంతం సంతోషించి హాస్పటల్ వారితో సంప్రతించి వైద్యం చేయించడాని కారంభించాడు. అక్కడ బొడ్డపాటి తిరుమల్రావు అనే డాక్టరు యిక్కడి స్కూలు శిష్యత్వం కలవాడే అవడంచేతనేమి, స్వతస్సిద్ధమైన మార్దవంచేత నేమి, కంటివైద్యం డాక్టరుగారితో “యీయన మా గురువుగారు” అని గట్టిగా శిఫారసు చేశాడు. కంటి డాక్టరుగారు చేయదగ్గ పరీక్షలు చేశారు. పరీక్షలు చేయడానికి ముందు రెండు మూడురోజులు కంట్లో మందువేసి చూశారు. ఆ రోజుల్లో నా స్థితి కొంచెం వ్రాస్తాను. లక్ష్మీకాంతం తనకు తీరిక లేకపోయినా నన్ను వెంటబెట్టుకొని హాస్పటలుకు తీసుకువెళ్ళేవాడు, అతని వూహ యేమిటీ? శాస్త్రులుగారి కక్కడ ఏం లోపం జరుగుతుందో అని. పాపం, నా గ్రహస్థితికి అతడేం చేస్తాడు? “అవస్థా పూజ్యతే రామ.” అక్కడ నేను చదువుకొనే గ్రూపులోనే కూర్చోక తప్పుతుందా? ఆ గ్రూపో, రెండు కళ్ళూ లేనివాళ్ళూ, వక కన్ను లేనివాళ్ళూ, కళ్లంట నీళ్లోడేవాళ్ళూ, యీలాటి వాళ్లతో నిండి వుండేది. యీ కర్మమే లేకపోతే హాస్పటలు కెందుకు వస్తారు? చదువక్కఱలేని వాళ్లు స్కూలు కెందుకెళ్లాలి? మాస్టర్లయితే జీతం కోసం వెళ్లాలి. అక్కడ మాస్టర్లు డాక్టర్లు. మేము విద్యార్థులం. యీ పోలికా యిదీ కొంతబాగానే వుందిగాని, ఆ గ్రూపులో కూర్చున్నప్పుడు నాకు పట్నవాసాల్లో ఆదివారం తిరిగే ముష్టివాళ్లు జ్ఞాపకం వచ్చేవారు. యెవళ్లకేనా ఆలాంటివూహే కలుగుతుందనుకొంటాను. నేను అంతో యింతో కవినవడంచేత యీ చవట పోలికలు నన్ను మఱీ బాధిస్తా యనుకొంటాను.

ఒకరోజున లక్ష్మీకాంతం రావడానికి వీలులేక వక విద్యార్థిని సాయమిచ్చి పంపించాడు. ఆవేళ కూడా మామూలుగా ఆ గ్రూపులోనే వెళ్లి నేను కూర్చున్నాను. అలా కూర్చొని ఆ రోగుల కష్టసుఖాలు అడిగి తెలుసుకుంటూ నా కష్టసుఖాలు అడిగేవాళ్లకు చెబుతూవుండగా, యెవరో మా దేశం మనిషి, నన్ను యెఱిగినాయన, ఆ హాస్పటల్లో పేషెంటుగా కొన్నాళ్ల నుంచి వుండడంచేత కొంత పాతకాపు, ఆ డాక్టర్ల వద్ద కొంత చనువు కలిగినవాడు నన్ను చూచి, యిదేమిటి? మీరిక్కడ కూచున్నారు, యిలా దయచేయండి, అని చేయట్టుకొని లాక్కెళ్లి, పాపం, అమాయికుడు, మా డాక్టరుగారి రూములో వున్న వక కుర్చీమీద కూర్చోబెట్టేడు. నా కక్కడ కూర్చోవడం లేశమున్నూ యిష్టంలేదు. లోపల బోలెడు భయంగా వుంది. వుండి మాత్రం యేం చేయను? కూర్చో

పెట్టిన వారి మోమోటం బాధించింది. అంతలో మా డాక్టరుగారు వచ్చారు. సాగనంపారు. తిరుమలరావుగారి శిఫారసు పనిచేయలేదా అనుకోకండి. ఆ శిఫారసు వైద్యానికా, కుర్చీమీద కూడా కూర్చోనివ్వడానికా అని నేను సరిపెట్టుకున్నాను. ఇదిగాక యివన్నీ గ్రహచారా న్ననుసరించి ప్రతివాళ్లకిన్నీ ఘటిస్తూండేవే. కవులకయితే పదిమందికి తెలుస్తాయి. యితరుల వంతగా పబ్లిషుకావు. యింతే భేదం. యోగజాతకాలలో అవయోగాలు తక్కువగా వుంటాయి, అవయోగ జాతకాల్లో సుయోగాలు క్వాచిత్కంగా ఉంటాయి. వుభయమున్నూ అనుభవానికి వచ్చి తీరతాయి. యీ విషయం అనుభవజ్ఞు లెవరున్నూ తోసెయ్యరు.

ఇదీలావుంచుదాం. కంటిజబ్బుకు వైద్యం ప్రస్తుతం. అది వంటి జబ్బుకింద మాఱింది. యెందుకు మాఱిందంటే నేనేం చెప్పగలను? కర్మం, లక్ష్మీకాంతం హాస్పటల్ డాక్టర్లతో తుల్యులైన వారినే యేర్పఱచి యింటి వద్దనే తరువాత వైద్యం చేయించాడు. వుపకారం జరిగిందికాదు. అతడూ, అతని కుటుంబమూ సర్వవిధాలా వక నెలరోజులు వుపచారం చేశారు. యెట్లో యింటికి చేరేను. తరువాత కూడా యేడెన్మిది మాసాలు చిక్కుపడ్డాను. ఆ చిక్కు పడేరోజుల్లోనే రెండో మామగారు వేంకటేశ్వరరావు బందరులో వైద్యం చేయించాలనే వూహతో కొంత ప్రయత్నించాడు. మా గ్రామం వచ్చాడు కూడాను. కాని యిల్లు కదిలే స్థితి లేదు. విశాఖపట్నంలో వున్నప్పుడు ఆరోగ్య భాస్కరంలో నా స్థితిగతులు సూక్ష్మంగా వ్రాశాను. తరువాత కడియంలో అదిముగించి మృత్యుంజయ స్తవమను పేరుతో నాకప్పుడు కలిగే వూహలు వ్రాశాను.

అదల్లావుంచుదాం. వేంకటేశ్వరరావు కే.యన్. గిరిరావుద్వారా కొన్నిమందులు పంపేడు. మందులయందు విశ్వాసంలేక, నేనాపార్శిల్సు విప్పనేలేదు. నా కవిత్వ మేమిటో, నేనేమిటో, యింకొక టిక్కడ వ్రాయాలి. నా కవిత్వం వల్ల తమమందు పనిచేయడాని కవకాశం కలగడం లేదని కొంతమంది డాక్టర్లనేవారు. నేను కవిత్వం ప్రయత్నం మీద చెపితే మీరాలా అనండి, నాకుతోచింది వ్రాయకపోతే యేలాగ? అది కడుపులో నిలవ వుండడానికి మాత్రం మీ వైద్యశాస్త్రం వప్పుతుందా? అదిన్నీగాక. అది "ఫారిన్ మేటరు" కదా? అని నేజవాబు చెప్పేవాణ్ణి. చెపితేమాత్రం వారంగీకరిస్తారా? వారి ధోరణివారిది. మన ధోరణి మనది, యిందులో వక విషయం మన మాలోచించాలి. యెవడుగానేనా పుట్టవచ్చునుగాని, వైద్యుడుగా పుట్టడంలో చాలాచిక్కు. మందు పనిచేసిందా, అలాంటప్పుడు వైద్యుడుగా పుట్టడమే మంచిదనిపిస్తుంది. లేదా జవాబు చెప్పడం చాలా కష్టం. రోగి చెప్పే సంగతులు అదివఱలో తమకే గోచరించినట్లు యేకరు పెట్టబోతారు కొంతమంది. సరీగా వారు చెప్పినట్టు వీడునడుచుకున్నా. దానిలో యేదో ఆరాతీస్తారు. కొందఱు సామాన్య

గృహస్థులకు వైద్యం చేయడానికేంగాని, ప్రభువులకి వైద్యం చేయడం చాలాకష్టం. వాళ్లకి దినదిన గండమే. అందుచేతనే "దివసే దివసే మరణం, యత్పరచేతోను రంజనం వృత్తిః" అని పెద్దలు వ్రాశారు.

ఇది యీలా వుంచుదాం. బందరు నుంచి వచ్చిన మందులు విప్పనే లేదన్న దగ్గఱనుంచి మళ్లా మొదలెడతాను. మందుకోసం గాదుగాని, ఆ పార్శిల్లో నస్యం కూడా వుండడం చేత, పంపిన యిరవైరోజులకి కాబోలును విప్పాను. అందులో వ్రాసిన ప్రకారం ఆ మందు వాడేను, ఆఱుపూటలు వాడేటప్పటికి వ్యతిరేకించింది. వుపకారం కూడా చేసిందికాని, దాన్ని నేను గమనించనేలేదు. అంతట్లో దాన్ని ఆపి యెట్లో ఆ వ్యతిరేకాన్ని సర్దుకున్నాను. మళ్లా మందువాడి క్రమంగా కొంత సుఖంపొంది ఆ మందు పంపిన డాక్టరుకు వక పద్యం వ్రాసిపంపాను. ఆ పద్యం యిక్కడ వుదాహరించడం మంచిది కదా?

ఉ. అద్యతనుల్ గలారు భిషగగ్రణు లెందఱునేని; ఆంగ్లపున్
వైద్యము దేశివైద్యమును "ప్యా" సయినట్టిరు, "ప్యాసు" గాని నీ
వైద్యమె నాకు సౌఖ్యమిడి పద్యమిడం బురికొల్పె "స్వస్తితే"
వైద్యశిరఃపదంబుకొని వర్ధిలు శేషగిరీఁ గిరీట్కృపన్.

ఈ పద్యం మాత్రమే చెప్పి వూరుకోలేదు. కేవలం పై పద్యంలో పేర్కొన్న డాక్టరు శిష్యునివల్లనే యీ వుపకారంకాలేదు. కృతికన్యా జనకులలో రెండవవాడు వేంకటేశ్వర రావునకు కూడా యిందు కొంత భాగం కలదు. అందుచేత.

మ. కరమున్ బత్తిని గావ్యకన్యనిడుటన్ గాటూరి శ్రీ వేంకటే
శ్వరుఁడీ నే నెడయైనఁ గావ్యసుతకున్ వైధవ్యయోగంబు దా
పరమౌ నన్నభయాన శేషగిరిచేఁ బంపించె మేల్మందులన్
మఱవంగూడదు వానికిన్ యశము సంపాదింపు మృత్యుంజయా.

అని కూడా వకపద్యంలో వ్రాశాను. కాని దీనితో కూడా మనస్సు తృప్తి తీరింది కాదు. అందుచేత యింకోపద్యంకూడా వ్రాశాను.

మ. రుజకున్ మందులు వారకంబులనుటే రూఢంబు, సామాన్యలౌ
ప్రజలిట్లేవచియింత్రు ప్రాజ్ఞులు మహాపద్వారకు న్నిన్ను దూ
రుజలందున్ స్మరియించి మేల్లనుటయున్ రూఢంబ యిప్పట్ల న
క్కజ మేమున్నది? ప్రస్తుత స్తవమె సాక్ష్యమ్మిచ్చు మృత్యుంజయా.

ఈ పద్యం వల్ల వేంకటేశ్వరరావు శేషగిరిరావులయందు చూపిన కృతజ్ఞత్వానికి భంగం కలుగుతూన్నట్లు స్థూల దృష్టికి తోస్తుందికాని, మందు వాడిన పిమ్మటనే ఆరోగ్యం కలిగినట్లు వెనుకటి పద్యంలో స్థిరపఱచడం వల్ల మందుకు భగవత్సహాయం అనుపానంగా మాత్రం చూచుకోవలసి వస్తుంది. ప్రస్తుతస్తవంలో నేమి, యింతకు కొంచెం వెనుక వ్రాసిన ఆరోగ్యభాస్కరస్తవంలోనేమి, కంటి ఱెప్పవాలడాన్ని గుఱించి వ్రాస్తూ 'నా కనువైద్య మీవకృపమైఁ జేయంగదే భాస్కరా' లోనగు కొన్నిప్రయోగాలు అక్కడ అప్రయత్నంగా పడ్డాయి. వాటికి తార్కాణంగా యే వైద్యమూ లేకుండానే కనుఱెప్పదానంతట అదే యథాపూర్వకంగా వాలిన అయిదు నెలలక్కాబోలును లేచింది. యీ విషయం కూడా కొన్ని పద్యాలలో మృత్యుంజయస్తవంలోనే కొంచెం వివరించాను. గ్రంథవిస్తరభీతిచే వాటినిక్కడ వుదాహరించను. దానికి మాత్రం భగవత్కృపనే మందుగా భావించుకోక తప్పదు. మనకిది క్రొత్తగాదు. మనపూర్వులు "తచ్ఛాంతి రౌషధైర్దానైర్జపహోమసురార్చనైః" అని వ్రాశారు. ఇతరులీ మాట నెంతగాపాటించినా, నేమాత్రం చాలాకాలాన్నుంచి వ్యాధి విమోచనానికి దీన్నే విశేషించి వాడుతూన్నట్లు ఆరోగ్యకామేశ్వరిలోనైన నా పుస్తకాలవల్ల లోకులు గ్రహిస్తారు కాబట్టి విస్తరింపను.

ఇక రెండో మనుగుడుపును గూర్చి సంగ్రహంగా చెప్పి ముగిస్తాను. కొంచెం ఆరోగ్యం కలిగినట్టు తెలిసింది మొదలుకొని రెండోమామగారు బందరుకు రమ్మని మఱీ ఆహ్వానించడం మొదలెట్టేడు. యెంత ఆరోగ్యం? యెట్లో యింట్లో సంచరించడానికి మాత్రం తగ్గదేకాని యెక్కువదికాదు. అత్తారింటికెళ్లే అల్లుడంటే యెల్లా వుండాలి? యేలాబయలు దేరను? యేలా రాను? వస్తానని రాస్తూ వుండడం, ప్రయాణం నిజంగా పెట్టుకోడం, యే జట్కావాడు చేసిన మోసమో దాన్ని వారించడం, యిలా కొన్నాళ్లు జరిగాయి. తుట్టతుదకు మాగ్రామ సమీపంలో తణుకు దగ్గఱ తేతలిగ్రామంలో ఒక సభకు ఆహ్వానించారు. అర్థాంగీకారంగా వస్తానన్నాను. ఆమాట బాధించింది. వారు వచ్చి కూర్చున్నారు. అపారమైన పడిసెం బాధించడానికి నాడే ఆరంభించింది. యేలాగ బయలుదేరడం? వారు వదిలేరు కారు, రైలెక్కేను. ఆవూరు వెళ్లేను. యెట్లో ఆసభలు జరిగాయి. ఆరోగ్యం కుదుటబడలేదు. మళ్లా అక్కడ నుంచి వెనక్కి పట్టించాను. వీలుగా లేనప్పుడేమిటి చేసేది? "మాధవా? మన రథములు మరలనిమ్ము, బ్రదికియుండిన సుఖములు వడయవచ్చు." మన మంతకంటె యెక్కువ వాళ్లమా? రాజమండ్రీలో వక శిష్యుడి తాలూకు చుట్టాల మూలాన్ని దిగవలసి వచ్చింది. అక్కడ ఆ వడ్డి సంఘంవారు స్వాగతం, సుస్వాగతం, వగయిరా మర్యాదలు జరిగించారు. తరువాత నేను మామూలుగా వెళ్లే సోమెన కామేశ్వరరావుగారింటికి వెళ్లేను. మఱునాడు యింటికి వెళ్లాలనుకుంటున్నాను. అంతలో ట్రయినింగు కాలేజీ విద్యార్థులు

సభకు రావాలన్నారు. వోపిక లేదన్నాను. వూరికే కూర్చోవడమే అన్నారు. సరే అన్నాను. పెద్ద సభ జరిగింది. మా గురువుగారు శ్రీపాదవారు అగ్రాసనాధిపతులు. కవిత్వాన్ని గురించి వుపన్యసించాను. ఇంటికి వెళ్లాలనుకుంటే, విశాఖపట్నాన్నుంచి లక్ష్మీకాంతం బందరులో 4వ తేదీని మీటింగుకు రమ్మని వ్రాసినట్లు యింటిదగ్గిఅనుంచి కబురు. తుదకు యిక్కడికి బయలుదేరేను. ప్రయాణం వైఖరి వక మోస్తరుగా వుంది. చూస్తే యేలావుందంటే, మొదట చిక్కుగా వుండేటట్టు కనపడి తుదకి, మంచిగా పరిణమించేటట్టు కనపడింది. తోవలో వేంకటేశ్వరరావు దీపావళికి స్వగ్రామం వెడుతూ రైల్లో నూజిళ్లదగ్గఱ కనపడ్డాడు. ఇది కొంత శుభసూచకం. వెనక్కి వచ్చాడు. యింటి వద్ద నుంచి రప్పించవలసిన వాళ్లని రప్పించాడు. అనుకున్న సభ నేడు జరిగింది. మిమ్మలి నందఱిని మళ్లా సంవత్సరానికి చూచి ఆనందించే భాగ్యం కలిగింది. సర్వేజనా స్సుఖినోభవంతు. స్వస్తిప్రజాభ్యః. కథ కంచి కెళ్లింది. మనమింటికి వచ్చాం.

★ ★ ★

# అష్టావధానమంటే!

(12-8-1935 సం॥ర త్రిలిఙ్గ నుండి)

ఏకకాలమందే ఎనిమిదిపనులయందున్ను బుద్ధి నిల్పడం. ఇది మొట్టమొదట వేదం అధ్యయనం చేసినవారు చేసేపని అని సంప్రదాయజ్ఞులవల్ల వింటాము. వేదంలో "ఘనామాలాశిఖా" ఇత్యాది భేదాలున్నా యనిన్నీ వాటికి సంబంధించిన అవధానాన్ని వారిలో బుద్ధిమదగ్రేసరులు చేసేవారనిన్నీ ఆకారణంచేతనే వారికి అవధానులు అనేపేరు వచ్చేదనిన్నీ వినికి. ఇటీవల అట్టి అవధానం చేయక పోయినప్పటికీ వేదంచెప్పుకొన్న మాత్రంచేతనే అవధానులు అనేపేరు వస్తూవున్నట్లు లోకవాడుకవల్ల మనకు తెలుస్తూ వున్నది. ఇందు కుదాహరణం "సుబ్బావధాన్లు, రామావధాన్లు" మొదలైనవి పెక్కులు. ఈ అవధానం క్రమంగా కొంతకాలానికి కవిత్వంలోకి వచ్చింది. మనకు తెలిసినంతలో ఈ అవధానమును సమర్థించినవారు పూర్వులలో కొలదిమంది మాత్రమే వున్నారు. చరికొండ ధర్మన్న, భట్టుమూర్తి, నెల్లూరి రాఘవకవి. మా రోజులలో మాకన్న కొంచెము పూర్వులు శ్రీమాడభూషి వేంకటాచార్యులవారు. వీరందఱున్నూ శతలేఖినీ పద్యసంధానధౌరేయులు, అనగా శతావధానులు. కనుక "శతేపంచా శన్న్యాయంచేత" "అష్టావధానులు" కూడ నైయున్నారు. అయితే శతావధానం కష్టమా? అష్టావధానం కష్టమా? అన్న విషయం కూడా మనకు ప్రస్తుతం విచారించదగ్గదే. సామాన్య దృష్టికి శతావధానంకన్న అష్టావధానం తేలికగా కనిపిస్తుందికాని బాగా పరిశీలిస్తేమాత్రం అట్టిదికాదు. కారణమేమంటే; బండపనిగా కనపడ్డప్పటికీ శతావధానంలో విషయం కవిత్వం వకటి మాత్రమే. అష్టావధానంలోనో? భిన్నభిన్న విషయాలుండడం వల్ల చిక్కు చాలా వుంటుంది: ఈ రెండు అవధానాలకున్ను పూర్వులు లక్షణాలు ఏర్పఱచారో లేదో మాకు తెలియదు. మా రోజుల్లో మేము సభ్యులకోరిక మీద లక్షణాలు ఏర్పఱచాము. అవి అచ్చుపడి వున్నాయి. అయినప్పటికీ ప్రస్తుతంగనక అష్టావధానానికి మేం చెప్పిన లక్షణాన్ని వుదాహరిస్తాను.

"శా. పౌరాణోక్తికవిత్వపుష్ప గణనావ్యస్తాక్షరుల్ లౌక్యగం
భీరో క్త్యంచిత కావ్యపాఠనకళావిద్భాషణంబుల్ ముదం
బారంగాఁజతురంగ ఖేలనము నీయష్టప్రచారంబు లో
ప్పారున్ శంకర ! యేకకాలముననే అష్టావధానమ్మునన్."

ఒకకాలమందే యిన్ని పనులున్ను జరగడమంటే కేవలం అసంభవం కనుక ఒక పనితరువాత ఒక పని, అని అభిప్రాయంగాని వేఱొకటి కాదని ప్రాజ్ఞులకు విస్పష్టమే. ఈ విషయమే మాకుఱ్ఱలీమధ్య వీరవరంసభలో ప్రస్తావవశంగా "అట్లు చెప్పుట త్రిమూర్తులకైనా శక్యంగాదు" అని చెప్పినారట. అట్లంటే యెట్లు? క్రమంగాగాక ఎనిమిది పనులున్ను ఒకటే మాటుచేయడం అని వీళ్ల అభిప్రాయమై వుండగా అవతలివారెవరో పేరు దాచుకొని "ప్రేక్షకుడు" అనుకల్పితపు పేరుతో వ్రాసేవ్యాసంలో ఇట్లు వ్రాసినారు. "మాయందు త్రిమూర్తులకైనను తప్పుపట్టుటకు అసాధ్యమని నొక్కి చెప్పి అవధానోప క్రమణమునకు గడంగిరి" (29-7-35 సం. త్రిలింగ చూ.)

ప్రేక్షకుని వ్రాతకున్ను మాకుఱ్ఱలప్రసంగమునకున్ను సంబంధమే కనుపడదు. పోనీ ప్రేక్షకుణ్ణి అడుగుదామంటే ఆయనయెవడో మనకు తెలిసేదెట్లు, ఆయన నిజమే వ్రాస్తా రబద్ధంవ్రాయరనుకొందామా? అట్లా వ్రాసేటట్టయితే పేరు దాచుకోవలసి వుండదుకదా. అందుచేత ఈ ప్రేక్షకుడు మనస్సులో మాయీకుఱ్ఱల మీద ఏదోద్వేషకారణం కలిగి యీవ్రాతకు దిగినట్లూహింపవలసి వచ్చింది. ఆ ప్రేక్షకుడు ద్వేషం చేత వ్రాసినా, లేక స్నేహంచేత వ్రాసినా, మా పిల్లలకు లోకజ్ఞానం నేర్చుకోవడానికి మార్గదర్శకునిగా వుండడం చేత నేను అతణ్ణి ఆశీర్వదిస్తున్నాను. పేరు ప్రకటించకపోవడంచేత మాకుఱ్ఱలు తప్పికోవడానికి అనగా మేమట్లనలేదని దాటుకోడానికి అవకాశం కలుగుతూవుంది. అది అలావుంచుదాం. ఈ అష్టావధానం పైని మీరు చెప్పిన ప్రకారమే చేయవలెనా? మఱొకలాగు కూడా చేయవచ్చునా? అని కొందఱడుగ వచ్చును. వినండి, మేము వినికినిబట్టి పూర్వులు చేసిన విధానాన్ని పురస్కరించుకొని లక్షణం వ్రాశాము. వీనియందు లక్ష్యమున్నవా రీలా చేయవచ్చు, లేనివారు మార్చుకొన్నను మార్చుకోవచ్చును; వీరవరపుసభలో మాకుఱ్ఱలు చదరంగానికి బదులుగా ఇప్పుడు క్రొత్తగా వచ్చిన "క్యారెంబోర్డు" అనే ఆటను పెట్టుకొన్నట్లు ప్రేక్షకుడుగారే వ్రాశారు. ఇంతేకాక ఈ క్రొత్తయాటకు బుద్ధిబలంతో అంతగా పనిలేదని కూడా ప్రేక్షకుడుగారే వ్రాశారు. ఈ విషయంలో ఆయన వ్రాసిన యక్షరాలన్నిన్నీ బాగానే వున్నాయని అంగీకరిస్తూ నాకు తోచిన మఱికొన్ని మాటలు వ్రాస్తున్నాను. "క్యారెంబోర్డు"

ఆటకున్ను గోళీ కాయలాటకున్ను అంతగా భేదం కనుపడదు. అవధానంలో చదరంగానికి బదులు దీన్ని పెట్టుకోకూడదు. అలా పెట్టుకోవడంవల్ల అవధానానికి లాభం లేదు సరికదా, నష్టంకూడా వుంది. యేమంటే? చదరంగమేవున్నట్టయితే యెత్తు ఆలోచిస్తూన్నట్టు నటిస్తూ ఇతర విషయముల ధారణ కొంత భద్రపఱుచుకోవడానికి అవకాశం కలుగుతుంది. ఈ బోర్డాటలో అట్టి అవకాశం వుండదని నేననుకొంటాను. పేకాట కూడా ఈ బోర్డు వంటిదే. కనుక అవధానంలో చదరంగమే వుండాలి. అయితే మీకుమారుడే మీ అభిప్రాయానికి భిన్నంగా యెందుకు ప్రవర్తించాలని అడుగుతారేమో, ఇందును గుఱించి ప్రేక్షకుడుగారివ్రాతే మీకు సమాధానం చెపుతూవుంది చూడండి.

"యీ కవికుమారులు..... వేంకటశాస్త్రిగారి..... అనుమతిని బడసి యనంతర మీయవధాన విధానమునకు గడంగినచో...." పై వాక్యం వల్ల ఈ ప్రేక్షకుడు నన్ను బాగా యెఱిగిన సుజనశిరోమణి యనిన్నీ మాప్రాంత నివాసియే యనిన్నీ చదువరులకు విశదం కనుక విస్తరించను. మా పిల్లని యీడు పదిహేను వెళ్లి పదహారోవత్సరం, రెండోకుఱ్ఱాడు నా మేనకోడలి కొడుకు వీడికంటె వక వత్సరం సుమారు పెద్దవాడే వోరెండింగ్లీషుముక్కలు అక్కడాఅక్కడా నేర్చుకున్నాడు. ఆంధ్రంగాని గీర్వాణంగాని వాడితండ్రి అభ్యసించాడుగాని వాడభ్యసించలేదు. కాని తల్లి చనిపోయిన హేతువుచే యింట్లోదిక్కులేక యీ మధ్య దేశ సంచారం మాత్రం విశేషించి చేయడం చేత "దేశాటనం పండిత మిత్రతాచ" అన్న సామగ్రిలో మొదటిది కొంత వఱకు సంపాదించినట్లయింది. ఇక మావాడి పాండిత్యం ఇంట్లోచదువవడం చేత శ్రద్ధాభక్తులు సున్నగా కావ్యనాటకాలున్ను లఘుకౌముది చాలావఱకున్ను కంగాబంగాచదివి ఈ మధ్య నేను పూర్తిగా అనారోగ్యస్థితికి వచ్చిన తర్వాత అంతకుపూర్వ మంతోయింతో చదివిన సిద్ధాంతకౌముదిని పూర్తి చేసుకుందామని కుతూహలం కలిగిందిగాని యేం లాభం; అంతబాగా జరగడంలేదు. అయినప్పటికీ కొంత కృషి చేయడం వల్ల "కృషితో నాస్తి దుర్భిక్షం" కనుక కొంత అక్షరజ్ఞానం సంస్కృతంలోనేకాక తెలుగులో కూడా కలుగుతున్నట్లుంది. కాని ఈమాత్రం జ్ఞానంతో వచ్చీరాని కవిత్వంతో అవధానాలు మొదలు పెట్టడానికి వల్లకాదు. ఏమంటారా? అవధానికి సభ్యులను సంతోషపెట్టేశక్తి చాలావుండాలి. ఆశక్తికీ అవధానశక్తికీ సంబంధమేవుండదు. అవధానశక్తి కేవలం ధారణకు మాత్రమే సంబంధించి వుంటుంది. పైశక్తి, వాఙ్మాధుర్యాదులతో చేరి వుంటుంది. ఇది గురుశుశ్రూషవల్ల కూడా వచ్చేది కాదు చూడండి. "పైవాచామాధురిలోనుగా గలుగు విద్వత్తుల్ పురాసంచిత - ప్రాచుర్యమ్ముననబ్బు నేరివశమౌ ! భాగ్యమ్ముకామేశ్వరీ"

అని ఆరోగ్యకామేశ్వరిలో నేనే వ్రాశాను. ఇవన్నీ ఈలా వుండగా పైకినొచ్చకుండానే పెంకెఘటాల నోరుకట్టడానికితగ్గ వకవిధమైన నిరుపమానమైన పెంకెతనం వుండాలి. ఎంతపండితుణ్ణైనప్పటికి బోల్తా కొట్టించే వుపాయాలు వుండాలి. ఉదాహరణకి ఆ వుపాయం వకటి చూపుతాను చిత్తగించండి. వకాయన అవధానం చేస్తూన్నాడు, వక పృచ్ఛకుడు సంస్కృతంలో పృథ్వీవృత్తంలో లక్ష్మీదేవిని వర్ణించమని కోరి కూర్చున్నాడు. అంతలో హఠాత్తుగా మెఱుపు మెఱిసినట్లు అవధానికి వక్రబుద్ధి పుట్టింది. ఈవర్ణనలో వక చమత్కారంజేసి అందఱినీ బొందలోపడదోయాలని, ఆపట్లానచెప్పడానికి మొదలెట్టాడు- ఏ విధంగా? ఈ విధంగా? "సరోజనిలయాం సరోజనికరాం" ఇది పృథ్వీవృత్తపాదం కాదు, కాబట్టి కోరిన పృచ్ఛకుడన్నాడు గదా? బావా? వృత్తం తప్పిందన్నాడు. అవధాని తప్పితే తప్పిందిలే వ్రాయిబావా అన్నాడు. దాని మీద ఇంకోకవి బావమఱది వరసవాడే అదేంమాట? దిద్దిచెప్పమన్నాడు. అవధాని నేను దిద్దేదిలేదన్నాడు. పిమ్మట, తోడి అవధాని అన్నాడు కదా? అదేమిటోయి పాదంలోపొరపాటు కనపడుతోంది. దిద్దమన్నాడు. కావలిస్తే రెండో చరణంలో నీవు దిద్దుకోమని అవధాని సహాధ్యాయికి జవాబు చెప్పాడు. అంతట్లో తనతో సమానమైన శిష్యుడు లేచి 'ఇదే మిటండోయి, తప్పిందన్నప్పుడు దిద్దకపోవడం' అన్నాడు. దిద్దేదిలేదని ముట్టితోపు జవాబే చెప్పాడు. సభ్యులు ఇదేమిట్రోయి వీళ్లలోవీళ్లకే పడ్డదని నిర్ఘాంతపోయి చూస్తున్నారు. ఇక్కడికి సభంతా గొల్లలై నట్లయిందని అవధాని గ్రహించి పృచ్ఛకుణ్ణి ఉద్దేశించి వ్రాసుకొమ్మని "వరాంభాస్వరాం" అని ఉఱిమేడు. ఇది తగల్చడంతోటే ఆపాదం పృథ్వీవృత్తపాదం అయింది. తప్పిందన్నవారంతా వెలవెల పోయారు. ఇక వీడు, రాముడనడానికి బదులు రీముడన్నా చెల్లిపోతుందా? చెల్లదా? చెప్పండి. ఈ శిరోమణిగారి వంటివారే ఆసభలో వుంటే పై తప్పు విషయంలో వీరుకూడా భాగస్థులవుతారో లేదో ఆలోచించండి. ఇట్టి స్థితిలో చూడండి వీరెల్లావ్రాశారో? "సత్యకవిగారు ఫస్టురౌండైన పిదప సెకండు రౌండున అర్థము చెప్పుదుము" అని సెలవిచ్చిరి..... శుద్ధాంధ్రమునే వుపయోగింతుమని చెప్పి యీ ఇంగ్లీషు పదప్రయోగ మెందులకో, దీని అర్థమేదియో? నాకవగతము కాలేదనియు సెలవిచ్చిరి". ఈ సెలవిచ్చిన వారొక వెలమదొరగారు. ఈ దొరగారి అభిప్రాయము చొప్పున తెలుగులో అవధాన కవిత్వము చెప్పెదమని కూర్చున్న అవధానుల నోట కవిత్వంలో కాక మామూలు మాటలలో కూడా ఇంగ్లీషుగాని వేరొక భాషగాని దొరలకూడదని వుండిన వుండుగాక, ఈ ప్రేక్షకుడుగా రదిసరియైనదని యెట్లుతలచి బోలెడు వాక్కులను ఖర్చుపెట్టిరో? ఏ ప్రభువుల కాలములో

ఆయా ప్రభువుల భాషలోని కొన్నిమాటలు దేశభాషలలోకి చేరినవన్న విషయం ఈ సుజనశిరోమణిగారికి తెలియనేలేదా? అయ్యో? యెంత వివేకము. ఇదిన్నీ కాక ఆ మాట కవిత్వంలో వాడినది కూడా కాదు కదా? ఈ ప్రేక్షకుడు నిజమైన పేరు ప్రకటించినప్పుడు బోధించవలసింది బోలెడున్నది. ఇప్పుడు తెల్పి ప్రయోజనం లేదు. కనుక ప్రస్తుతంలోకి దిగుదాం. చదరంగపాట సందర్భంలో మా పిల్లల పాండిత్య లోపాన్ని చెపుతూ శాఖాచంక్రమణంగా కొంత నడచింది. తేలినసారం మామేనగోడలి కొడుక్కు సంస్కృతాంధ్రములలో ప్రవేశం తక్కువనిన్నీ ఇంగ్లీషే మాత్రమో కంగాబంగావచ్చుననిన్నీ మాకుఱ్ఱకు సంస్కృతాంధ్రాల్లో తగుమాత్రం ప్రవేశం వుందిగాని యింగ్లీషు ఏ.బీ.సీ.డీ.లు కూడా తెలియవనిన్నీ తెలుసుకొని తరవాయి ఆలకించండి. ఈ సందర్భం యిలావుండగా ప్రేక్షకుడుగా రెల్లా వ్రాశారో ఈయక్షరాలు కూడా పరిశీలించి పిమ్మట కథాభాగాన్ని వినండి. "ఆంధ్ర, ఆంగ్ల, గీర్వాణభాషలు మూటియందును అవధాన మొనర్ప సమర్థులమని సెలవిచ్చి" ఈ సెలవిచ్చిం దెవరు? అవధానులు కదా? అందొకనికి ఏ.బీ.సీ.డీ. లేరావే? ఎట్లు సెలవిచ్చెనో? ఈ మొదలగు కొన్ని పంక్తులవలన ఈ ప్రేక్షకుడు సదుద్దేశముతోనే వ్రాయబూనిన ట్లెంత నటించినను లోలో దురుద్దేశము బోలెడున్నట్లు పరిశీలకులకు బోధపడి, ఈయన "అధోముఖీస్వయం రంధ్రీ" అను శ్లోకాన్ని జ్ఞప్తికి తేకమానరని సూచించుతూ ప్రస్తుతాన్ని వ్రాసి ముగిస్తాను. ప్రస్తుతం, మాకుఱ్ఱలు మా అభిప్రాయానికి భిన్నంగానే అవధానాన్ని మొదలుపెట్టి చేస్తూన్నారన్నదే. మా అవధానాన్ని వీళ్లు చూడడానికి లేశమున్ను అవకాశం లేదు. ఎందుచేత వీళ్ల పుట్టుకకు సుమారు యిరువదియేండ్ల క్రితమే మేము అవధాన సభల నుండి విరమించినట్లు లోకమెఱుగును. పోనీ? వీళ్ల కుతూహలాన్ననుసరించి ఆ యీ రహస్యాలు బోధించరాదా? అంటే నిన్నమొన్నపది హేనేండ్లు దాటిన మాకుఱ్ఱనికి నేటికి నాలుగేండ్లు సుమారు నుండి మిక్కిలి అనారోగ్యస్థితిలో వున్న నేను దీన్నెట్లు బోధింతును? ఇదిగాక చిరకాలంనాడే ఈ విద్యయందు మాకనాదరం. అందులో ముఖ్యంగా నాకనాదరం కలిగినట్లు నాముప్పది మూడు వత్సరముల ప్రాయమున చెప్పిన యీ పద్యమువల్ల లోకము తెలిసికోకపోదు.

ఉ. దొమ్మరిసానియెంతయును దుద్దుకమెయిన్ గడనెక్కియాడుపో
ల్కిమ్మతిబల్మికల్మి గడుగీరితికై యవధానముంబొన
ర్చుమ్మనుజుండు దీనినొకచోద్యముగా గణియింపబోక స
త్సమ్మతిగా నెసంగు కవితారసమున్ జవిజూడుభూవరా.

ఈ అవధానవిద్యయందు మొట్టమొదట మేమెంత యాదరాతిశయాన్ని పెట్టుకొన్నప్పటికీ ఇటీవల మాకు అదిపూర్తిగాతగ్గివుండడం చేత మా పిల్లలకి దీన్ని బోధిస్తామని యెవరనుకొంటారు? అనుకోరు. మేము బోధించమైతిమి. మా అవధానంగాని, ఇతరుల అవధానంగాని వాళ్లు యింత వఱకు చూడలేదాయె. ఇట్టి స్థితిలో వీళ్లకి యిందులో వుండే కష్టసుఖాలు యెట్లు బోధపడతాయి? దానికి ఈలాంటి ప్రేక్షకుల వ్రాతలే ఆధారం కావాలి? కనుక ఏవుద్దేశంతో ప్రేక్షకుడు వ్రాసినా మాకుఱ్ఱలు ఆయన్నే గురువులలో వకరినిగా భావించి అవధానమ్మాట అలా వుంచి ముందుగా నిజానికికుత్సితులుగా నుండిన్నీ పైకి మంచిగా నటిస్తూ వుండేవారిని బోల్తాకొట్టించే వుపాయాలు యికనేనా నేర్చుకో వలసిందని మాకుఱ్ఱల్ని ఇందుమూలంగా మందలిస్తూ ప్రేక్షకుడుగారు వ్రాసిన యితర విషయాలని గూర్చి యెత్తికొని గ్రంథం పెంచక ప్రేక్షకుడుగారి యుద్దేశము మంచిదికాకున్నను మాపిల్లల భావిశ్రేయస్సునకు కొంతవఱకిది ప్రోద్బలంగా వుండడంచేత దాన్ని కూడా అభినందిస్తూ యింతతో ముగిస్తున్నాను.

★ ★ ★

# ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

(11-4-1931 సంగరు కృష్ణాపత్రిక నుండి)

"అహం న పండితః" ఇయ్యది నా ప్రస్తుత స్థితి. నాకే కాదు, ఈ వయస్సులో నెవరికేని యిదియే శరణ్య మనుకొందును. దీనికి వెనుకటివి కూడ రెండవస్థలు కలవు. అవి, "అహమేవ పండితః, అహంచ పండితః" అనునవి. అవి మాత్ర మీ వయస్సునకుఁ దగినవి కావను కొనియెదను.

క. ఎన్నఁడు జనియించితిమో
యెన్నఁడు పెరిఁగితిమొ యుద్ధమేటికి మాకో
యన్నాఁ ముదుసల్లము భగ
వన్నామము దలఁచికొనుచు బ్రతికెదము...

ఇట్టిస్థితిలో మూఁడవస్థితికే యీ వయస్సుచితముగాని తక్కుద్వయమున కనౌచిత్య దోషము నాపాదించుననుట నిక్కము. కావున వెనుదీయ వలయును.

క. సంశయము వలదె? రాజక
వంశక్షయముం బొనర్పవచ్చునె? మౌనీం
ద్రాంశంబకావొకో నీ
వోంశాంతి శ్శాంతిఁ జదువకుంటివా? యెపుడున్.

"నానృషిః కురుతే కావ్యమ్" కనుక కవికిఁ గూడ ఋషి ప్రవర్తన మంతో యింతో అనుకార్యము కాకపోదు. "కలౌషష్టి" కూడా దాఁటినది. ఇపుడు వివాదములకు దిగి యొకరి నధఃకరించి కాని, యధఃకరింపఁబడి గాని పొందవలసిన మేలుకీ ళ్లంతగాఁ గాని, కొంతగాఁ గాని యుండవు. "అధీత మధ్యాపిత మార్జితం యశః" లేదా? అపయశస్సే ఆర్జింపఁబడుఁ గాక, దానినిపుడు పోఁగొట్టికో వశమా? కాదు. మా గురువులలో నొకరగు బ్రాగశ్రీగ కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రులవారు బాల్యమాది చాలా వ్యాసంగము కవితా భాగమున నొనరించినారు. చాల కబ్బములు రచించినారు. తుట్టతుదకుఁ బూర్వ పుణ్యవశమున మహాభారతాంధ్రీకరణమున కుపక్రమించినారు. కృతార్థులు కూడఁగా

వచ్చినారు. ఈ రచన వీరికిఁ బరమార్థమున కెక్కుడుగ నుపచరించెడిదే యయ్యుఁ బ్రకృత మనేకులకు వీరిని శత్రుస్థానముగఁ జేసినది. దానికి బీజ మిది. "కవిత్రయకృత భారత ముండఁగా మరల నిదియేల!" అని స్థూల దృష్టుల శంక. దీనికి బోలెడు సమాధానములు కలవు. అవి యన్నియు సమంజసములే. అయినను ప్రాచీనుల యందుఁబలె నవీనుల యందు లోకుల కాదరాతిశయము కలుగదు గదా? "ఏగతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరే కదా?" ఇది నేఁడే పుట్టినదా? మన మెంత పోరాడినను ప్రయోజనము లేదు. బీజము బీజముగా నుండక మనపోరాటము వలనఁ జెట్టు గట్టఁజొచ్చును. ఆ బీజమును గ్రంథకర్త లెన్నఁడును నశింపఁజేఁ జాలరు. మన కోరికతోఁ బని యేమి, మన పని మనము చేసి కొందము, అని మౌన మవలంబించుటమే యియ్యెడ ముఖ్యకర్తవ్యము. "కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కదాచన" ఆ బీజమును లోకమే క్రమముగా నశింపఁజేయుటకుఁ బూనుకొనఁ గలదు. అది యిప్పుడే కావలయునన్నచోఁ గష్ట సాధ్యము. అట్టికాలము రాఁగలదు. ప్రతీక్షింప వలయును."కాలోహ్యాయం నిరవధి ర్విపులాచ పృథ్వీ". అప్పుడును రెండవ పక్షముండక మానదు, ఉండుఁగాక, యేదో పక్షమువారు మనలను బరిగ్రహించినఁ జాలును గదా? అంత వఱకు మా గురువుల వారు నిరీక్షింపక యా భారమును దామే వహించి పోరాడ మొదలిడినారు. దాని మీఁద లోకములోఁ గొంత యసంతుష్టి ప్రబలఁ జొచ్చినది. అయ్యది శ్రీవారి కెక్కుడు పనిని గల్పించు చున్న మాట నిశ్చయము. ఇపుడు నా వయస్సు అఱువది వత్సరముల యెనిమిది మాసములు. గురువుగారు నాకన్న నెంతోపెద్దలు కారు. ఇపుడు వారొనర్చుచున్నయుద్ధమును గమనించినచో ద్రోణాచార్యులు జ్ఞప్తికి రాక తప్పదు. అది యటులుండె. భారతాంధ్రీకరణము శ్రీవారికి స్వర్ణాభిషేకమును, కవి సార్వభౌమ బిరుదమును సంపాదించెను. అంతతో శ్రీవారు సంతుష్టి చెందవలసినది. దానికయి యచ్చటచ్చట జరుగు నభినందన సభలకు వెళ్లఁజొచ్చిరి. ఆ సభలు జరుగు చోట్లలో ముఖ్యంగా బందరులో, "పంచశుభం పంచాశుభం" అను త్రోవ రాఁజొచ్చినది, బందరు పరశురామక్షేత్రమని తత్రత్యులు పలువు రనఁగా వినియుంటిని. ఆ మాటకుఁ గలహకారక మని వ్యుత్పత్తిని చెప్పెదరు. దీనికిఁ దార్కాణముగా నేనా విషయమును స్వయముగా ననుభవించితిని. ఆ యనుభవమును నేనిట వ్రాసినచోఁ దేలదు. వలయు వారు మా పాండవ రాజసూయమును దిలకింపఁ గోరెదను. శ్రీవారి యభినందన సందర్భమును కృష్ణాపత్రికలోని ప్రధాన వ్యాసము పూర్తిగా నిరసించినది. ఆ సమయములో నేను నా కూతుల వివాహ సందర్భమున నొక పనిమీఁద నూజివీటికి వెళ్లి, గుడివాడ త్రోవను వచ్చుచు నొకటి రెండు రోజులు గుడివాడలో నిలవవలసి నిల్చితిని. అట నొక రావ్యాసమును వినిపించిరి. స్వయముగాఁ జక్షురక్షర సంయోగముగాఁ

జదివిచూచినాను. ఖండనకు మార్గ మగుపట్టదయ్యె. గాలికి దూలికిఁ బోయెడి దెన్నటికిని గాదు అని నాకుఁ బూర్తిగాఁ దోఁచినది. ఆ త్రోవ మా గురువులకే కాదు. కొండొక మా శిష్యునకును బాధకముగనే యున్నది. ఇట్టి స్థితిలో మధ్యనున్న నాకు మాత్ర మది బాధకము కాక యుండునా? అగుఁగాక. చేయవలసినదేమి? పొడమిన కోపమునడఁచి కొంటిని. నేను జదివికొన్న కావ్యములలో భారవి ద్వితీయ సర్గమందు నాకు నభిమానము మెండు. ఈ యభిమానము నాకపుడు "విజితక్రోధరయం జిగీషవః " "సహసా విదధీత న క్రియామ్" లోనగు సందర్భములను జ్ఞప్తికిఁ దెచ్చి మిక్కిలి యుపకరించెను

బ్ర॥శ్రీ॥ శిష్టా నరసింహశాస్త్రులవారి వ్యాసము కృష్ణా పత్రికా ప్రధానవ్యాసమును స్థిరీకరించుటకై స్థూణానిఖననన్యాయమున బయలుదేరినది. కృష్ణరావుగా రెంత సూత్ర భాష్యాదుల నభ్యసించినను లౌకిక పండితులేగాని వైదిక పండితులు కారు. కావున వైదిక పండితుల సమ్మతికై యది పుట్టినది. అంతియకాక యందుఁదుట్టతుదనున్న బ్ర॥ శ్రీ॥ పరిమి నరసింహశాస్త్రులవారి యేకీభావ వాక్యములను గూడఁ జదివితిని. పిమ్మట వారిరువురును గూడ నగుపడిరి. కొంచెము కదలించి చూచితిని. అందు మొదటివా రభినందన మందును ననభినందన మందును గూడఁ బాల్గొనిరి. కాని యందొకటి పరేచ్ఛా ప్రారబ్ధమును, రెండవది స్వేచ్ఛా ప్రారబ్ధమును నైయున్నది. రెండవవారిది సర్వమును రెండవ తరగతి లోనిదే. ఇందు రెండవవారును నేనును జిరకాలము హిందూ హైస్కూలులోఁ బండితులుగాఁ బనిసేసి యున్నారము. ఈయన పాండిత్యమును శీలమును నేనెఱుఁగుదును. పాండిత్యము జగత్ప్రసిద్ధమే. ఇఁక శీలమో, యెఱిఁగిన వారు కొందఱు మాత్రమే యుందురు. ముఖ్యాంశ మేమన? ఈయన యే మంచి కార్యమునందుఁ గాని యే చెడ్డ కార్యమునఁగాని లేశమును బాల్గొనక వారి పనివారుచేసికొని యేగువారు. వీరి కొకరితో సంబంధమే లేదు. అట్టివారీ ప్రస్తుత కార్యమున నీమాత్రమేని యేల కలిగించుకొనిరో యింకను విచార్యమే. ఏమయిన నేమి, వీరి యిరువుర సమ్మతి తోడను కృష్ణారావుగారి ప్రధాన వ్యాసమునకుఁ బూర్తిగా బలము కల్గినది. ఈ నరసింహశాస్త్రులవారి వ్యాసములోఁ బ్రస్తుతాంశమునకు బలము కలిగించు మాటలే కాక కొన్ని మాటలు నా ద్వారమున శ్రీవారి నధః కరించు దురూహను వెలిఁబుచ్చుచున్నవి.

శ్రీ మాగురువుగారికి "సార్వభౌమ పదమబ్బినచో" నాకు స్థాన మెక్కడనని కూడ వీరు కొంత చింతించినారు. ప్రత్యేకించి యెత్తికొని వ్రాసినచో మిక్కిలి పెరుఁగును (తమకును మా గురువులకును గల వివాదములో నా పేరెత్తికొని నన్ను గొప్పఁ జేయ నుంకించుట నాకు మిక్కిలి విచారకరము.) శాస్త్రులవారికి నా యందభిమాన మున్నచో దానికిది

సమయముకాదని మనవి చేయుచున్నాఁడను. మఱియును వీరు మా గురువుగారికిఁ బ్రసిద్ధులైన యేశాస్త్రజ్ఞుల పంక్తి యందుఁగాని స్థానమే లేదనిరి. ఏమీ? వ్యాసకృత మహాభారతమును బ్రత్యక్షరమును బరిశీలించి తెలిఁగించిన మహాకవికి సర్వశాస్త్ర మర్మములును నవగతము లగునే? అట్టి స్థితిలో నిట్లు లిఖించుట కర్థమేమో! గురుశుశ్రూషా పూర్వకముగ శాస్త్రాభ్యాసము చేయవలయుననియా? అగుచో "తదధీతే, తద్వేద" అను సూత్రమునందలి రెండవ వాక్యమునకుఁ జారితార్థ్యం బెచ్చట? భవతు, నేనిపుడు వీరి వ్రాఁతలనెల్ల విమర్శింపఁ బూనను. వీరు తుట్టతుదను దిక్కన్నగారి భారతమునకును మా గురువుగారి భారతమునకును, బంగారు తీఁగెలకును, ఇనుప తీఁగెలకును నున్నయంత తారతమ్యము కలదని వ్రాయఁగల్గిరి. ఈ మాట యెంత సత్యమైనను దీనిని ఖండింపఁబూనుట మిక్కిలి కష్టము. మానవమాత్రు లందఱకును తిక్కన్నగారి యందభిమానము. మా గురువులయందో, యే కొలఁది మందికో యుండిన నుండవచ్చునుగాని సార్వజనీనము గాదు. అట్టి స్థితిలో దీని ఖండనమున కుపక్రమించి బయలఁబడుట యెట్లు? నరసింహశాస్త్రులవారేదో భగదత్త వైష్ణవాస్త్రఘట్టము నెత్తికొని తమవాదమున కుదాహరణముగాఁ జూపిరి. అది నిస్సందిగ్ధముగా నట్టిదియే కావచ్చును. కాని వేరొక ఘట్టమును దీసి ప్రయత్నపూర్వకముగా విమర్శింపఁబూనినచో, నది యిదియు నిది యదియునుగా మాఱునని శాస్త్రులవారు యోజింపనే లేదు. ఇట్టి ప్రసక్తిసుమారు 10 సంవత్సరములనాఁడు వచ్చినది, ఆ ఘట్ట మేదియో నేనిపుడు మనవి జేయఁజాలను గాని యపుడు జరిగిన తద్విషయక సభకు నేనే అధ్యక్షుఁడుగా నుండి మా గురువుగారి భారతమే సర్వోత్కృష్టమని పలువురు విజ్ఞుల యెదుట నుపన్యసించి జయము గాంచితిని. కాఁబట్టి నరసింహ శాస్త్రులవారి వాక్యమునకు "ఉదితానుదిత హోమమునకుంబలె" వైకల్పికత్వ మాపాతతస్సిద్ధమని నా యభిప్రాయము. ఇంకొకటి. ఎక్కువ చోట్లు తిక్కన్నగారివి బంగారు తీఁగెలు కావచ్చును. ఏ కొన్నిచోట్లు మాత్రమో, ఇనుప తీఁగెలు కావచ్చును. మా గురువుగారివో, తద్వ్యత్యయముగా నైనఁగావచ్చును. అంతియ కాని, "సర్వమును తోఁటకూర కట్టగా" లిఖించుట సాహసమాత్రమని నా యభిప్రాయము. ఈ విషయమునఁ, బ్రస్తుత మింతకన్నఁ బెంచివ్రాయను. ఎట్లయిన నేమి నా పేరు గూడ వీరి వివాద సందర్భములో నెక్కుటచే నమాయికులగు మా గురువుల కపోహ గలిగించునేమో! కారణాంతరముననేని యా సమయమున నేను బందరులోనను, గుడివాడలోనను నుండుట వారి యూహను బలపఱుప వచ్చునని యెంచి యొక యుత్తరమును మాత్రము గురువుగారి పేర వ్రాసికొంటిని. దాని సారాంశము "ప్రస్తుత సందర్భమునకుఁ దాము తొందర

పడవలదు” అనునది. గురువుగారు నా మాటను విశ్వసించిరి. పిమ్మటఁ గొలఁది దినములలో శ్రీవారి యింట జరుగు వివాహములో నేను వారిని సందర్శించితిని. అపుడు “నన్నెందులకు వారించితివి” అని ప్రశ్నించిరి. సమాధానము చెప్పితిని. తృప్తిని మాత్రము గురువుగారు చెందనియట్లు గ్రహించితిని. వెంటనే విమర్శించిరో మఱి కొన్నాళ్లకు విమర్శించిరో కాని శ్రీ నరసింహ శాస్త్రులవారి, ఆంధ్ర మేఘసందేశమును పుల్లెల శ్రీరామశాస్త్రులవారి పేరుతో విమర్శించిరి. శ్రీరామశాస్త్రులవారిని నేను మాగురువుగారి ద్వారముననే యెఱుఁగుదును. విద్యా పక్షపాతులు. కడుంగడు యోగ్యులు. ఎవరినిగాని నిర్హేతుకముగాఁ గాని సహేతుకముగాఁగాని తూలనాడరు. అట్టివారి పేరుతో విమర్శించు నా మేఘసందేశ విమర్శనము మిక్కిలి యప్రగల్భ వాక్యములతోడను, వెక్కిరింపు మాటలతోడను, నిండియుండుట మిక్కిలి విషాదకరము. సర్వశాస్త్రముల యందును జక్కని పరిశ్రమ చేసిన నరసింహశాస్త్రులవారి నంతగాఁ దృణీకరించుట మా గురువుగారి కే మాత్రమును లాభమును కలిగింపదని నేను దెలిసికొంటిని. నరసింహశాస్త్రులవారు తమ భారతమును “నీరసము” అని యందురుగాక. ఆ మాటను ఖండించుట కామహాపండితుని గడ్డిపఱకగా నపలపింపఁ జూతురా? నిజమున కా శాస్త్ర విదుఁడు గడ్డిపఱకయే యగుచో అట్టి గడ్డిపఱక తెలిఁగించిన పొత్తమును దమ పేరుతోఁగాని వేఱొక పేరుతోఁగాని తమ యాజమాన్యమునఁ బ్రకటిత మగు పొత్తమున నేల ప్రకటింప వలయును? కావున మేఘసందేశమున మా గురువులు చూపిన దోషములు నిల్చినను, నిలువకున్నను, ముందా పనికిఁ బూనుటకే నేను సమ్మతింపను. తామనుకొన్నట్టులా తెలిఁగింపు సర్వమును నయుక్తమై ఖండింపఁబడినను దమ కవిత్వము నెడల నాయన చూపిన నిరాకరణము ఖండింపఁబడదు. కావున మా గురువుగారి యుద్యమ మిటఁజింత్యము. నరసింహశాస్త్రుల వారికో, వారి కొమరులకో శ్రీ మా గురువుగారు వారి ప్రస్సులోని “చాకలి వానిచే జవాబు చెప్పింపఁ బూనుట” లోనగు ననాలోచిత ప్రసంగము ప్రతిపక్షుల కపకరింపక, పరమోపకారమై, వ్రాసిన వారి కెంతయపకృతి చేయవలయునో యంతయుఁ జేయఁగల్గినదని నేనపుడనుకొంటిని. అనుకొనిన లాభమేమి? ఇపుడేని శ్రీవారితో మనవిఁజేసి దీని నుండి మరలింపఁ గల్గుదునా? మరలింపఁజాలను. పూర్వము నా మాట యందుఁ గొండొక విశ్వాసమున్నను నిపుడది లేదని నా కనేకుల వలనఁ దెలిసినది. వారి పత్రికలోని యక్కరము లీయూహనే ధ్రువపఱచు చున్నవి. అక్కతమున నేను స్వయముగా దర్శనమునకేగి మనవి చేసిన నొకింతలోఁ దేలెడి దాని కింతగాఁ బరిశ్రమ చేయవలసి వచ్చినది. నాయందిపుడు శ్రీవారికిఁ గోపకారణమేమని చదువరులనుకో

వచ్చును. సుమారు పదియేండ్లనాఁడు నా వ్రాసిన "వైకర్తన శబ్దవిచార" మొకటి. అవసరమైనపుడిద్దానిని విస్తరింతును. ఇటీవల శ్రీవారి యాజ్ఞానుసారముగా నేను పాలకొల్లు వెళ్లి యచట వారి హృదయములోనున్నచొప్పున నుపన్యసింప నేరక పోవుట యొకటియుఁగా శ్రీవారి యక్కరముల వలన నవగత మయ్యెడిని. ఈ యపోహమును మ॥ రా॥ రా॥ నాళం కృష్ణారావుగారు లోనగు తత్రత్యప్రాజ్ఞులు పలుసార్లు చెవినిల్లుగట్టుకొని పోరి మరలించిరి. మరల యథాపూర్వముగ నాయందనుగ్రహము కల్గియే యుండిరి. కాని యిటీవల శ్రీవారు "శ్రీ కొల్లాపుర సంస్థానమున కేగి వచ్చిన పిమ్మట" శ్రీ పుల్లెల శ్రీరామశాస్త్రులుగారి పేరితో బ్ర॥శ్రీ॥ వనం సీతారామశాస్త్రులవారి శ్లోక పంచకమును మిక్కిలి గాఢమైన పాకముగా విమర్శించి ప్రకటించిరి. ఆ విమర్శనమున కాపండిత మౌళి తోఁచిన సమాధానములను వ్రాసి యభిప్రాయమునకై పలువురితో పాటు నాకడకును వచ్చిరి. అది మా గురువుల పేరితోడనే యున్నచో నేను దప్పికొనుటకు వీలిచ్చెడిది. అట్లుగాక "ఏతం పెట్టన్నట్లు" పుల్లెల శ్రీరామశాస్త్రిగారి పేరితో నున్నది. నేను శుశ్రూష చేసినది శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రులవారికిఁగాని, పుల్లెల శ్రీరామశాస్త్రులవారికిఁగాదు కావున నభిప్రాయ మీయక తప్పినది కాదు. దాని నా శాస్త్రులవారు తక్కు పండితుల యభిప్రాయములతో బాటుగా నచ్చొత్తించి ప్రకటించికొనిరి. అది మొదలు నాయెడల విశ్వాసము తప్పి నన్ను గొండొక తరగతిమాటలతో నిరాకరింప మొదలిడిరి. ఈ నిరాకరణమును గూడ నేను గుంటూరికి రాకపూర్వము చూడనేలేదు. ఇక్కడనే వారి పత్రికలోఁ జదివితిని. బ్ర॥శ్రీ॥ హరినాగభూషణముగారిని గూర్చి వ్రాసిన బహిరంగలేఖను గూడ నచటనే చదివితిని. అదియును నాకు నచ్చినదికాదు. పుల్లెలాయన నరసింహశాస్త్రుల వారిని దూషించుట తగవు కాదని నాగభూషణముగారు వ్రాయఁగా, గురువుగారు దానిని భూషణముగా సమర్థింపఁ బూనినారు. నాగభూషణముగారు మా గురువుల యందు మిక్కిలి భక్తులు. బందరులోని యభినందన సభను గూర్చిన ముఖ్యులలో నొకరు. అట్టివారు వారి విద్యా గురువులను నిందించుటకు సహింపక మృదువుగా నేవోకొన్ని మాటలు వ్రాసినందులకుఁ గినిసి వారిని తృణీకరించుట యంత వీలుగాదనియే నే ననుకొంటిని.

"ఉచిత మనుచితం వా కుర్వతా కార్య జాలం! పరిణతి రవధార్యా యత్నతః పండితేన" ఈ వాదము శబ్ద శాస్త్రాదులకు సంబంధించినది కాదు. కావున సూత్రాదులుదాహరించి సమర్థింప వలసినది కాదు. రసమునకు సంబంధించినది. ఇందును గూర్చి యాలంకారికులు వ్రాసి వ్రాసి, "సహృదయాః ప్రమాణమ్" అని విరమించుట సుప్రసిద్ధము. కావున మా గురువులు గూడ దీనికి సమ్మతింతురని నా విశ్వాసము. ఇక నొకటి కవిత్రయ

కృత భారతమును గూర్చి మా గురువుగా రెక్కడఁగాని నిగర్హణము నుపపాదింపఁ గూడదు. అట్లుపపాదించు నెడల నది న్యాయమైనను లోకులకు శత్రుత్వము కల్గించును. పాలకొల్లు సభలో "ఉ. నిండు మనంబు నవ్యనవనీత" అను పద్యమును గూర్చి శ్రీవారు ఖండింపఁబూనుటయు దానిపైఁ గొందఱు వీరి పద్యములోని యేదో మానుటను గూర్చి ప్రశ్నింపఁగడఁగుటయునట్టి యెడ నేను నాకుఁ దోఁచిన విధమున నేవో రెండు పొడిమాటలు చెప్పి యప్పటి కా వివాదము నాఁగుటయు శ్రీ మాగురువుగారే కాక నాఁటి సభ్యులెల్లరు వినియున్నారు. పూర్వ భారతము కన్న వీరి భారతమునందు మెఱుఁగు లున్నయెడల, లేవని వాదించువారికి లోకమే జవాబు చెప్పును. కావున నా భారము లోకులకు వదలివేయుఁడని గురువులను బ్రార్థించు చున్నాఁడను.

★ ★ ★

# శ్రీపాదగురువులకడ నా శుశ్రూష

(9-11-1935 సం॥ర కృష్ణాపత్రిక నుండి)

సీ. రఘువంశము భుజంగరాడ్గురు సన్నిధి
నింపుమీఱఁగఁ బఠియించినాఁడ
శ్రీపాదకృష్ణమూర్తి కవీంద్రుకడ నైదు
మాసముల్ శుశ్రూష చేసినాఁడ
కాజులూరను నూరఁగామసోముల యొద్ద
నొకమూఁడుమాసమ్ము లున్నవాఁడ
చామర్లకోటలోఁ జదివితి రాఘవా
చార్యసన్నిధిని మాసత్రయమ్ము

తే.గీ. పై ననంతార్య సూరయ పండితు లిరు
వురును మూఁడు మాసమ్ములు గురువులైరి
పిదప శ్రీబ్రహ్మయమనీషి పేరు దెచ్చు
గురుఁడు నాకయ్యెఁ దన కట్టి గురుఁడ నేను.

ఇట్లు ప్రసంగవశమున గీరతప్రథమభాగములో నా కావ్యగురువులను గూర్చియు, వ్యాకరణశాస్త్ర గురువును గూర్చియు సంగ్రహముగాఁ జెప్పికొనియుంటిని. ఇందు శ్రీభుజంగరావు పంతులవారి సన్నిధిని జదివినది రఘువంశమని తెలియుచునే యున్నదిగాని, యెంతకాలము చదివినదియు "నా గురుపరంపర" అనే వ్యాసములో వివరించితిని. దాని నిట నుదాహరించెదను. "ఇతర విద్య లప్రధానంగా, కావ్యాలు ప్రధానంగా యేలాగైతేనేమి రెండేండ్లలో, మూడుసర్గలు రఘువంశం చదవడం అయింది." (నవంబరు 10వ తేదీ 1934 సం॥ కృష్ణ చూ.) ఇఁక రెండవ చరణములోని గురువుగారి యొద్ద చదివిన దానికి తపిసీలు తెల్పవలసి యున్నది. దీనిని గూర్చియే యీ వ్యాసము బయలు వెడలుచున్నది. కావున, ఈ వివరణము తుట్టతుదిని చేయుదును. మూఁడవ చరణములోని కాజులూరి గురువులను గూర్చి –

"ఇఁక కాజులూరి విద్యార్థిత్వం. ఆ వూళ్ళో మేఘసందేశ పూర్వ భాగంలో తరవాయిమాత్రం జరిగింది. చదరంగంలో కొంత పాండిత్యం అతిశయించింది. సులక్షణ సారం స్వయంగానే చూచుకొని కవిత్వం పద్యాల్లో కూడా చెప్పడం మొదలు పెట్టేను. ఆ వూళ్ళో ముగ్గురు గురువులు. రేగిళ్ల కామశాస్త్రులుగారు, పప్పు సోమయ్యగారు, పప్పు సోమనాథశాస్త్రులుగారు. (పద్యములోని "సోములు" అనుచోట. ఏకశేషవలన నీ యుభయులని గ్రహింపవలెను) వీరెవరున్నూ కవులుగారు. మొదటి గురువు భుజంగరావు పంతులుగారు గ్రంథాలేమీ వ్రాయలేదుగాని, వారు మాత్రం కవులే. తరువాత, కాటవరంలో శుశ్రూషింపఁబడ్డ గురువులున్నూ (శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులవారు) కవులే. వారి వారి వద్ద నేను కవిత్వానికి సంబంధించిన కృషి చేయలేదు. ఏదో తోచినట్టు అల్లడానికి మొదలు పెట్టే నన్నదే ముఖ్యాంశం. అందుచేత లక్షణంలో యెన్నో సంశయాలు కలుగుతూ వుండేవి. యెవరేనా తటస్థించినప్పుడు కనుక్కుంటూ వుండేవాణ్ణి." (నవంబరు 10వ తేదీ 1934 సం॥ కృష్ణ చూ.) అయ్యా! కాజులూరి విద్యార్థిత్వములో విశేషాలు వ్రాయుచు వ్రాసిన కొన్ని మాటల వలన నేను కవిత్వ లక్షణము గురుముఖము వలనఁ జెప్పికోలేదని తేలుచున్నది గదా. దీనిని మనస్సునందుఁ బెట్టికొని నాలుగవ చరణములోని చామర్లకోట విద్యార్థిత్వమును జిత్తగింపుఁడు.

(జాతకచర్య పూర్వార్ధము నుండి)

"క. ప్రతివాది భయంకర వంశతిలకుఁడు..... రాఘవా
ర్యుఁడు......... శిష్యతతికిఁ బాఠములుచెప్పు...."

"చ. ... ఇట కేగుదెంచితిమి వ్యాకరణంబు పఠించునిచ్చ నాఁగను
మహనీయుఁ డవ్విబుధ కాంతుఁ డొకించుక నవ్వి యిట్లనున్"

"గీ. ఏమి చదివితి రీవఱ కెద్దివాస । మనుఁడు యానాము కాపుర మనఘ
నాకు మేఘసందేశమున సాము మిగులు కలదు."

చదువరులారా! కాజులూరినుండి కథ చామర్లకోట వచ్చినది. చామర్లకోట వచ్చునప్పటికి మేఘ సందేశములో సగము మిగులున్నదనఁగా, పూర్వ మేఘమనెడి ప్రథమ సర్గము మాత్రమే అయినదనుట వలన, ఉత్తరభాగమగు రెండవ సర్గము చామర్లకోటలో మొదలు పెట్టి చదువవలసియున్నదనుట స్పష్టము. కాజులూరికన్న పూర్వ విద్యార్థిత్వము కాటవరములో శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులవారి వద్దనే చేయఁబడినది. అక్కడ మేఘసందేశ మెంతవరకుఁ జదువఁబడినది?

(జాతకచర్య పూర్వార్ధము నుండి)

తే.గీ. "అంత మేఘసందేశ కావ్యమును మొదలు, వెట్టి చదు
వుచునుండంగ విఘ్నకారణం బుదయమందె...."

చ. "..... గురు నింతి మృతింగనె, ఆత్మదేహమం
దొదవె నొకించుకంత జ్వరయోగము.......ఇంటి కే
గెద నని పేర్మినగ్గురునికిన్ వచియించి... చనెఁ దల్లినిదండ్రినింగనన్.

కాటవరములో మేఘసందేశమును మొదలు పెట్టి చదువుచున్నట్లును, అంతలో విఘ్నము వచ్చినట్లును తెలునుగాని, యెంతవఱకా మేఘసందేశము చదివినదియు తేలదు. తేలక పోవుఁగాక, మాఘుకావ్యము చదువుచున్నట్లు మాత్రము స్ఫురింపదు. చదువరు లీమాఘుకావ్యము మాట మన మందుంచికొని పదంపడి విషయము చిత్తగింపుఁడు. నాజ్ఞప్తిని బట్టి కాటవరములో మేఘ సందేశ ప్రథమసర్గములో "శ్లో. వేణీభూతప్రతను సలిలా" అను శ్లోకము వఱకును అయినట్లిప్పటికిని చెప్పఁగలను. ఈకాకదంతపరీక్ష యిదివఱలో నవసరము కామింజేసిగాని, యీ మాట యిదివఱకే వ్రాసియుందును. ఏమయిన నేమి? మేఘసందేశము శ్రీకృష్ణమూర్తి శాస్త్రులవారి వద్ద నారంభించి, ప్రథమసర్గము కొంత, అనఁగా 63 శ్లోకములలో 29 శ్లోకముల వఱకు మాత్రము, చదివి, విఘ్నమురాఁగా, ఆయూరువదలి యింటికి వచ్చిన పిమ్మట, తక్కిన మేఘసందేశపు మొదటి సర్గపు తరువాయి కాజులూరులోఁ జదివినట్లును, (ఈ చదువును గూర్చి జాతకచర్య చూడఁదగు) ఆ స్థితిలో చామర్లకోట శిష్యత్వ మారంభమైనట్లును తేలినది. చామర్లకోటలో చదివిన దేకావ్యము? అని ఆకాంక్ష కలుగుచున్నది. క్రమప్రకారము మేఘసందేశములోని తరువాయి చదువవలెను. కాని అట్లు జరగలేదు. ఆచార్యులవారు నాకు భారవి కావ్యమును, లఘుకౌముదిని మొదలుపెట్టినారు. ఈ విషయము నెఱిఁగినవారిలో, చామర్లకోటలో పలువు రుందురేమోకాని, ఉన్నను నా విద్యార్థిత్వమును వారు చెప్పఁగల రేమోకాని సుమారేబదియేండ్లనాఁటి విషయ మగుటచే నే నే కావ్యము లటఁ జదివితినో చెప్పఁజాలరను కొందును. కాని యీ విషయ మంతో యింతో బ్ర॥శ్రీ॥ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రులవారి తమ్ములును, సుప్రసిద్ధులును, పండితులును, వయస్సులో నించుమించు నాతోడివారును, చామర్లకోట శిష్యత్వమునెడల, నాతో నేకగురుకులును, లఘుకౌముది సంజ్ఞాప్రకరణములో ఆరంభదినములలో నాకు చింతన చెప్పినవారును నగు సుబ్బయశాస్త్రులవారు నేనచట భారవికావ్యమును, లఘుకౌముదియు మొదలిడి చదివిన యంశమును జెప్పఁగలుగుదురేమో యనుకొని వారిసాక్ష్యము నాసించుచున్నాను.

(జాతకచర్య పూర్వార్ధము నుండి)

క. అనుపలుకు లచటిశిష్యులు
విని నవ్విరి, ఆర్యుఁడెట్టి విధమున మీకున్
జను వ్యాకరణముఁ జదువఁగఁ
బనిగొనవలెఁ బంచకావ్య పఠనమ్మునకున్.

పై పద్యమువలన మేఘసందేశమేని పూర్తిగాఁగాని వానికి వ్యాకరణ పాఠము చెప్పుట యెట్లని యక్కడి శిష్యులు నవ్విరని స్పష్టము. పంచకావ్యములు చదువవలెనని ఆచార్యులుగా రనుటవలన, నింకను పంచ కావ్యములలో భారవియు, మాఘమును తరువాయి యని స్పష్టము. ఈ మాట జ్ఞప్తియందుంచుకొనుఁడు. చామర్లకోట చదువెంతవఱకు జరిగినదో చిత్తగింపుఁడు

(జాతకచర్య పూర్వార్ధము నుండియే)

ఉ. భారవి మూఁడుసర్గలును, వ్యాకరణమ్మునఁ బంచసంధు లిం
పారఁబఠించునప్పటికి అక్షికిఁబూర్వపు వ్యాధి కొంతహె
చ్చై రసభంగముం గొలిపి యచ్చొటు వీడఁగఁజేసె నేరికే
నారయ మేటిసంపద లనంత దురంతమహాంతరాయముల్.

విస్తరము మఱికొన్ని వ్యాసముల యందును, ఉదాహరించిన జాతక చర్యయందును చూడఁగలరు. చామర్లకోట విద్యార్థిత్వము నాఁటికింకను నేను మాఘకావ్యము మొదలిడలే దనునది సారాంశము. ఈ యంశము చదువరులు జ్ఞప్తియం దిడుకోవలెను. ఇఁక మాఘకావ్యము మొదలిడిన దెవరి యొద్దనో తెల్పి ముఖ్యాంశమునకు వత్తును.

(జాతకచర్య పూర్వార్ధము నుండియే)

క. పదపడి యితఁడాగ్రామము (చామర్లకోట) వదలి పురమ్మునకు వచ్చి
(అనఁగా అప్పటి నివాసము ఫ్రెంచిటవును యానాము వచ్చి)....

గీ. ఊరికొక రెండుక్రోసుల దూరమందుఁ
గలదు పిల్లంక యనియెడు గ్రామము....
అందుఁ గలఁడు లఘు కౌముదిని
నయమ్ముమైఁ జెప్పఁదగు ననంతాచార్యఘనుఁడు

ఆ.వె. పల్లెపాలెమనెడి పల్లెయునొక క్రోశ, మందుఁగలదు... సూరయా
హ్వాయుండు.... సాహితీఘనుఁడు - గలఁడచటను.

తే.గీ. అచటి కప్పుడప్పుడరిగి భారవికావ్యమందు
తక్కుసర్గ లయ్యనఘుని యొద్దఁ జదువుచుండు....

తక్కువ సర్గలనఁగా చామర్లకోటలో చదివిన మూఁడు సర్గలును గాక మఱి రెండుసర్గలని వ్యాఖ్యానము చేసికోవలెను. అంతియకాని భారవి కావ్యము సర్వమునని తాత్పర్యముకాదు. పంచకావ్యములలో నెవరుగాని యేకావ్యమునుగాని (మేఘసందేశము తప్ప) పూర్తిగాచదువరు. ఇది సంప్రదాయజ్ఞు లెల్లరును నెఱిఁగినదే కాన విస్తరింపఁ బనిలేదు. నాకు మాత్రము మేఘసందేశము కూడ సగమనఁగా, ఉత్తరమేఘ మప్పటికే కాక యిప్పటికిని తరువాయియే. అది యటులుండె. ఇప్పటికి నాకు మాఘము చదువవలసియే యున్నదనునది ప్రస్తుతము. లఘుకౌముది పిల్లంక గ్రామములో అనంతాచార్యులవారి యొద్దను, భారవి తరువాయి పల్లెపాలెములో సూరయ్యగారి యొద్దను చదువుచున్నట్లు తెలినది.

(జాతకచర్య పూర్వార్ధము నుండియే)

తే. ఇట్టులొక మూఁడు మాసమ్ము లింటనుండి, భారవిసమాప్తి
నొనరించెఁ బఠనసేయ । మొదలిడియె మాఘము.........

ఈ మాఘము మొదలిడితిననియే వ్రాసితినిగాని, పైనుదాహరించిన యిరువురు గురువులలో నెవరియొద్దనో వ్రాయలేదు. ప్రకరణమును బట్టి కావ్యపాఠము పల్లెపాలెములో చదువుచున్నట్లుండుటచే, సూరయ్యగారి వద్ద ననుకోవచ్చును. కాని అట్లుకాదు, పిల్లంక అనంతాచార్యులవారి యొద్దనే ఇఁక నొక విశేషము. అప్పుడిప్పటివలె, పుస్తకములు సులభముగా లభించెడివికావు. ఆకారణమున సప్తమసర్గ దగ్గఱనుండియున్న మాఘకావ్యము ఆయాచార్యులవారి యొద్ద నుండఁగా, "రొట్టెకు రేవేమిట" అని, ఆ సర్గమునే మొదలు పెట్టినారు. ఏకొన్ని శ్లోకములో అగునప్పటికి, చామర్లకోట చదువునకు విఘ్నము కల్పించిన కంటిజబ్బు మరింత హెచ్చి విఘ్నము నాపాదించినది. అంతతో ఆచదువు ముగిసినది. పిమ్మట చరిత్రము శ్రీ బ్రహ్మయ్యశాస్త్రులవారి సందర్శనమున కేగుట లోనగు విషయములు ప్రస్తుతములు గావు. ఇంతకును నేను మాఘము బ్రహ్మయ్యశాస్త్రులవారి సన్నిధికి వెళ్లుట కించుక పూర్వము మొదలుపెట్టి నట్లును, ఆ మొదలు పెట్టుటయేని మొదటినుండి కాదనియు, మొదటి నుండి కాకపోయినను మొదలిడిన సర్గము దగ్గఱ నుండియేని జరుగక విఘ్నమువచ్చిన దనియు, చదువరు లరయవలయును. దీనిచేత మేఘసందేశములోని ఉత్తరభాగమువలెనే నాకు మాఘకావ్యము కూడ నిప్పటికి గురు ముఖమున చదువని పొత్తముల లోనిది యేయని తేలును. అగుచో "నీ విటీవల నివి పాఠము లెట్లు చెప్పితి"

వని శంక రావచ్చును. ఈ శంక కేమి? చొప్పదంటుశంక. చదివినవే పాఠము చెప్పి చదువనివి చెప్పలేనిచో వాఁడుపాధ్యాయుఁడేకాఁడు. చదివినను చదువకున్నను, నేను మాఘకావ్యము మొదలువెట్టినది పిల్లంకలో శ్రీ సుదర్శనం అనంతాచార్యుల వారివద్ద ననునది ముఖ్యాంశము. వీరు నా కెన్నవ గురువులు? స్థూలదృష్టిని గ్రామముల లెక్క ప్రకారము, (1) కాపులపాలెము, (2) కాటవరము, (3) కాజులూరు, (4) చామర్లకోట, (5) పిల్లంక ఈ రీతిని అయిదవగురువుగారు, రెండవ గురువుగారు కాటవరపు గురువుగారు, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులవారు. వీరెట్లు వ్రాయుచున్నారో తిలకింపుఁడు :

26-9-32 రాజమండ్రి.

"శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి విషయము తెచ్చినారు. ఆసంగతి వ్రాయనాకిష్టములేదు. అయినను మీరడిగితిరి కావున చెప్పెదను. అతఁడు కుమారసంభవము మొదలు మాఘము వఱకు కావ్యములు నావద్దనే చదివినాడు. తెలుగు కవిత్వము, అవధానాభ్యాసము నా యొద్దనే జరిగినది. ఇది ఎందుకడిగినారో నాకు తెలియదు. ఇంతకన్న విశేషము వ్రాయదలఁపను......."

ఇది శ్రీశాస్త్రులవారు "నేను వారి శిష్యుఁడనేకా'నని సంశయించుచు నొకరు వారి పేర వ్రాసిన యుత్తరమున కిచ్చినజవాబు. ఏయూరికి? హైదరాబాదుకు. ఇందులో స్పష్టముగా మాఘ కావ్యము వఱకు చదివినట్లు వ్రాయుచున్నారు. నా యొద్దనే అని యేవకారార్థఘటితముగా లిఖించినారు. నా వ్రాఁతయేమో పైని చూపితిని. వీరి వ్రాఁతయే నిజమగుచో కాజులూరిలోఁగాని చామర్లకోటలోఁగాని పల్లెపాలెములోఁగాని పిల్లంకలోఁగాని వేంకటశాస్త్రి అలంకార విద్యార్థిగా నుండుటయేకాని, చదువనే లేదని తేలును. లేదా, విద్యార్థిగా నాగ్రామములకు వెళ్లనేలేదని యేని తేలును. అగుచో, చరిత్ర గ్రంథమగు జాతక చర్యలో ఆ యీ గురువుల నామధేయము లేల యెత్తవలెను? వారి శుశ్రూష నేల యుదాహరించవలెను? అనునది చదువరులు విచారించుకోవలసి యుండును. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులవారి యొద్ద చదివిన విద్యలో కొంతభాగమును, యితర గురువులకు కట్టి పెట్టుటవలన వేంకటశాస్త్రికిఁ గలిగిన ఫలమేమో విచారింపవలసి యుండును. ఇది యిటులుండె. ఈ మాఘాంతపు చదువొకప్పుడు నైషధాంతము వరకును దేఁకినది. చూడుఁడు. "దయమీఱ నైషధాంతము కావ్యములు చెప్పి" ఈపై నుదాహరించిన సీసపాదము శిష్యులు, వెంకట రామకృష్ణుల వివాదములో, వెం.రా. లపక్షమున నుదాహరింపఁబడినది. పై సీసములో ఇప్పుడు శ్రీశాస్త్రులవారు హైదరాబాదులో నొకరిపేర వ్రాసిన యుత్తరములోని అవధానాభ్యాసాదులు గూడ నున్నట్లు జ్ఞాపకము. అపుడీ

సీసపాదమును మాత్రముదాహరించి, జాతకచర్య నుండి నేను శ్రీశాస్త్రుల వారివద్దఁ జేసిన విద్యాభ్యాసము నుదాహరించి, తుట్టతుదను "నైషధము శ్రీ శాస్త్రులవారి యొద్దనే కాదు, మఱియొకరి యొద్దఁగూడ నిప్పటికి వేంకటశాస్త్రి చదువనే లేదు, ఇఁకముందు చదువవలసియుండును, ఆ యీ యంశములకు శ్రీ శాస్త్రులవారు వేంకటశాస్త్రిని కృతఘ్నుఁడని యందురో, యే మందురో! 57వ పుట 11వ పంక్తిలోని గాదె జగన్నాథస్వామి గారి పద్యములోఁ జూడఁగోరెదము." ఇత్యాదిగాఁ గొన్ని వాక్యములు వ్రాసి గీరత ద్వితీయ భాగమగు గురుదక్షిణ పీఠికలో, ఆఱవపుటలో విమర్శించి యున్నాను. అయ్యది 1913వ సం॥ అచ్చుయియున్నది. దీనిం గురించి శ్రీ శాస్త్రులవారు దేనిలో నేని ఖండించుటగాని, ప్రత్యక్షములో నాతో నీవు వ్రాసినది సరికాదని మందలించుట గాని చేసినట్లులేదు. ఇప్పటికిది ప్రకటింపఁబడి 22 సం॥ ములు దాటవచ్చినది. వారిట్టి విషయములలో జోక్యమునే కలిగించుకోనివారని యనువారుందరు. వజ్రాయుధమవ్వారికి బాధకమగును. ఇఁక నొకటి. అప్పుడు నేనా యక్షరములు చాలా ధైర్యముతోడనే వ్రాసినాను. శ్రీ శాస్త్రులవారి వలన వెం॥రా॥లో వారి తరఫువారో, విని వ్రాసిన వ్రాఁత మాత్రమది కాదని నాకు పూర్తిగా నమ్మకము కలదు. కావుననే నేనంత ఖండితముగా వ్రాయఁ గల్గితిని. ఇటీవల శ్రీ శాస్త్రులవారి "మాఘ కావ్యము వఱకు" అను నక్షరములు చూచినది మొదలు ప్రమాద వశమున శాస్త్రులవారట్లు పలికి యుందురని కొండొక యనుమానింపవలసిన వాఁడనైతిని. శాస్త్రులవారు కొల్లాపురపు ప్రయాణము వెళ్లుటకుఁ బూర్వము నా యందు మిక్కిలి అభిమానము కలవారనుటకు సందియము లేదు. ఆ ప్రయాణము వెళ్లివచ్చిన కొలది రోజులలో నా యందు మిక్కిలి కోపముద్భవించినది. ఈ కోపము "శాంతి" వ్యాసము తెలుపును. ఈ హైదరాబాదు యుత్తరము ఆ ప్రయాణమునకు చాల నిటీవలిదే. ఈ యుత్తరపు తేదీ : 26-9-32 సం॥ రము కదా. కొల్లాపుర ప్రయాణము 1930 సం॥లో జరిగినది. ఈ యంశము "శ్లోక పంచక నిరాకరణము" అను పొత్తపు ముఖపత్రము వలన నవగతమయ్యెడిని. ఏదో కోపమున్నట్లు ఉదాహరించిన ఆ యుత్తరములోని కొన్ని వాక్యముల వలన నెట్టి మూర్ఖునకేని అవగతమయ్యెడిని. మరల నా యుత్తర మొకమాఱు తిలకింపుఁడు అయినను శ్రీశాస్త్రులవారు మాత్ర మసత్యము వ్రాయసాహసింపరాదు. నేను సర్వత్ర మహాసభలలో శిష్యుఁడనని ఢంకామీఁద దెబ్బగొట్టి చెప్పుచుంటిని. గ్రంథములలో వ్రాయుచుంటిని. కుమారసంభవ మేఘసందేశములు చదివిన నొకటియు, మాఘమువఱకుఁ జదివిన నొకటియునా? అయినను కోపమట్లు తోఁప నీయలేదనుకోవలెను.

"వేంకటశాస్త్రి అబద్ధ మాడుచున్నాఁడు, కృతఘ్నుఁడు" అని లోకులకుఁ దెలియఁ జేయుటయే శ్రీవారికి, తాత్కాలిముగాఁ దోఁచిన యూహ. ఇట్లే ఏ విశ్వకర్మ శిష్యునివద్దనో, యెప్పుడో, మఱికొన్ని అపోహలు కూడ కల్పి, జాఱవిడిచినారు. ఆ హరికథకుఁడు (విశ్వకర్మ) హైదరాబాదులో ఈ యంశములను నల్వురయెదుటఁ బడవేసినాఁడు. దానితో లంక యంటుకొన్నది. ఆ పట్టణస్థులు మొదటికే నమ్మక నాకుత్తరము వ్రాసినారు. నేను శిష్యత్వము నిజమని సూత్రప్రాయముగా జవాబిచ్చినాను. శ్రీవారిచ్చిన జవాబు నుదాహరించియే యున్నాను.

వీరిట్లు హైదరాబాదువారికి జవా బిచ్చుటలోనే కాక వేఱొకచోఁ గూడ నిట్లే లిఖించినారు. తిలకింపుఁడు.

(శ్రీవారి "దురుద్ధరదోషశృంఖలము" అనెడి పుస్తక పీఠిక నుండి)

"చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు............. వీరు కొంతకాలము నా యొద్ద విద్యాభ్యాసము చేసినారని లోక మనుకొనుచున్నది. వీరు గీరతమను నొక మహాగ్రంథమును రచించినారు. అందు నొక్కింత నాయొద్ద చదివితినని వ్రాసినారు. నేను మాత్రమెటగాని యిది యిట్టిదని వ్రాసిగాని చెప్పిగాని యెఱుఁగను, నిశ్చయము, ఇందువలననాకు రాఁబోవు గౌరవములేదు............"

పై వాక్యములు గురువుగారెట్టి కోపముతో నుండి వ్రాసినదియు వ్యక్తపఱచెడినిగదా? ఆ యుత్తరము గురువుగారు వ్రాయనేలేదేమో, అందలి మాటలు విశ్వబ్రాహ్మ శిష్యునితో ప్రసంగింపనేలేదేమో, అనుకొందమన్న, ఈ శృంఖలపీఠికలోని మాటలు పైవానిని బలపఱచుచున్నవిగదా! అగుచో శ్రీ శాస్త్రులవారు పలుచోట్ల "వేంకటశాస్త్రి నా యొద్ద కుమారసంభవము మొదలు మాఘము వఱకుఁగాని, లేక నైషధమువఱకుఁ గాని, చదివి యుండి అవధానాభ్యాస మొనరించి కూడ, అన్యథగా చెప్పుచున్నాఁ" డని ప్రసంగించి యుండవలెను, అని తేలుచున్నది. దీనికి శ్రీ గాదె జగన్నాథస్వామిగారి పద్య మొకటి అనుకూలించుట లేదు. చూడుఁడు

(గురుదక్షిణ 59వ పుట నుండి)

ఉ. శ్రీపదకృష్ణమూర్తికవిశేఖరు సన్నిధి మీగురుండు వి
ద్యాపఠనంబు చేసినది యారయ మాసచతుష్క మయ్యు సం
దీపితబుద్ధి నాతనిని దేశికుఁడంచును చెప్పుచుండు "నే
నేపగిదిన్ గురుండగుదు నీతని" కంచు వచించు నాతఁడున్.

ఈ పద్యము గీరతవివాద సందర్భములో, వెం॥ రా॥ లను గూర్చి జగన్నాథస్వామిగారు మందలించుచు వ్రాసినదని స్పష్టమేకదా? ఈయనతో శ్రీ శాస్త్రులవారెపుడో, "ఏదో కొంచెము నా వద్ద చదివినను, అది లెక్కలే" దని ప్రసంగించి యుండవలెను. లేదా, ఆయన యేల వ్రాయును? వీరు గూడ నిప్పుడు సజీవులేకాన సత్యనిర్ధారణపట్ల తోడ్పడఁ గలరు. కొల్లాపురపు గొడవ మొదలు నా యెడలఁ గోపముదయించినను, 1913 సం॥ మునకు పూర్వపు సంగతి గదాయిది. శ్రీవారపు డాయనతో నన్నమాటయే, సందియము లేదు.

"మాఘము వఱకు" అనగా భారవి మాత్రమే చదివెనని యర్థము చెప్పుదురేమో? శివ శివా? ప్రతివాది భయంకరం రాఘవాచార్యుల వారి యొద్ద లఘుకౌముదితోపాటు అప్రధానపాఠముగాఁ జదివికొన్న భారవి మూఁడు సర్గములను, పిల్లంక అనంతాచార్యులవారి యొద్ద లఘుకౌముది తరువాయి చదివికొనుచు, పల్లెపాలెములో మధునాపంతుల సూరయగారి వద్ద చదివికొన్న భారవి చతుర్థ పంచమ సర్గములును కాటవరములో శ్రీ శాస్త్రులవారి వద్దఁ జదివికొన్నట్లు వ్రాయఁగలనా? నేను వ్రాసినచో నాకు పుట్టగతు లుండునా? ఈ కొంపతీఁత వ్రాఁత శ్రీవారి కెందులకుఁ దోఁచినదో, వారెట్లు సమర్థింతురోకాని, నా కుపాయము దోఁపకున్నది. శ్రీవారి యావాక్యమును హైదరాబాదువా రెట్లు విమర్శించి యెంత తీవ్రముగా ఖండించిరో చూడుండు.

(భాస్కరమాలికానుబంధము అను విద్యావిషయిక విమర్శనము నుండి)

"........... చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు తమ యొద్ద కుమారసంభవము మొదలు మాఘమువఱకు చదువుకొనిరనియు, తెనుగు కవిత్వము, అవధానాభ్యాసము తమవద్దనే.. అనియు వ్రాయుట మరింత చిత్రములో చిత్రము. అంతవరకు శుశ్రూష చేయుటకు కనీసము, ఎంత చురుకుదనము గలవానికైనను రెండు సం॥ములు సుమారు పట్టును. మఱి తమ గండపెండెర మహోత్సవ సందర్భమున, చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు అధ్యక్షులై తమ అధ్యక్షోపన్యాస సమయమున, గొప్ప సంగీతసభలో, 'నేను శ్రీ॥కృ॥ శాస్త్రిగారి యొద్ద 3 మాసములు శుశ్రూష చేసినాను' అని యనిరే? అప్పుడు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారేల మౌనముద్ర ధరించిరో! అబద్ధమైన నోరెత్తరా? మూఁడు మాసములలోనే పైవిధమగు విద్యయంతయు సంపూర్తి యగునా?..........."

ఈ రీతిగా శంకించినవారికి శ్రీవారేమి ప్రత్యుత్తర మిచ్చిరో తెలియదు. నేను గీరతములో అయిదుమాసములని వ్రాసినాను. గండపెండెరపు సభలో 3 మాసములని పలికినట్లు పై విమర్శకులు వ్రాయుచున్నారు. ఇది నిక్కమే. జగన్నాథస్వామిగారు నాల్గు మాసములని వ్రాసినారు. నా జీవితకాలమునందే పరస్పర భేదములగుపడుచున్నవి చూచితిరా? ఇట వ్యాఖ్యాన మవధరింపుఁడు. నేను శ్రీ శాస్త్రులవారి గ్రామము ప్రవేశించినది

జ్యేష్ఠమాసము. అటనుండి జ్వరపడి పథ్యము పుచ్చుకొని యింటికి బయలుదేరివచ్చినది కార్తీకమాసము. కనుక అయిదుమాసములని నేను వ్రాసినాను. చదువు జరిగినది మూఁడు మాసములే కనుక అట్లు చెప్పినాను. ఈ విషయము జాతకచర్య పీఠికలో కూడ కలదు. జగన్నాథస్వామిగారు గీరత ప్రథమభాగస్థమగు "ఐదుమాసముల్" అనుమాట చదివిన పిమ్మట వ్రాసిన పద్యములోఁగూడ "మాసచతుష్కమయ్యు" అని వ్రాయుటకక్కడ "మాసపంచక" శబ్దముపడినచో గణభంగమగునని యూహించి "ఈషద్వైషమ్య మవివక్షితం" అను నార్యోక్తి ననుసరించి నట్లూహింపనయ్యెడిని. చదువుమాట దేవుఁడెఱుఁగును. నేను అయిదుమాసములకన్న నెక్కుడు కాలము కాటవరములో విద్యార్థిగా నున్నట్లు శ్రీవారు నిరూపించఁగలరా? శ్రీవారి తండ్రిగారి యజ్ఞము, తోఁబుట్టువు పెద్దవేణయ్యగారి సన్నిపాతజ్వరము, వీరి యిల్లును, రెంటాల వీర్రాజుగారి యిల్లును తప్ప, గ్రామమెల్ల వరదవలన మునిఁగి పెద్ద యుపద్రవము సంభవించుట, శ్రీవారి జ్యేష్ఠభార్య జ్వరముచేతనే స్వర్గస్థురాలగుట, పిమ్మట రేకపల్లె లచ్చయ్యశాస్త్రులవారి తమ్ములు రామమూర్తిగారు జ్వరమువలన స్వర్గస్థులగుట, ఇవి యన్నియునేనుండఁగ జరిగినవేకదా? ఈ సందర్భములో కొంచెము జ్వరమువచ్చి నేను భయపడి యింటికి చేరితిని. ఆయీ యంశములు, పెండేరపు సభకు మోటారులో శ్రీ వడ్డాది సుబ్బారాయకవిగారును, తామును, నేనును ఊరేగింపు మిషతో వెళ్లునపుడు త్రోవలో శ్రీ శాస్త్రులవారిని ప్రశ్నించి, ఔనని యనిపించుకొంటిని. శాస్త్రులవారికీ సందర్భము జ్ఞప్తియందున్నదో లేదో! నా కానాటి, అనఁగా కాటవరపు విద్యార్థిత్వమునాఁటి, సంగతులన్నియు జ్ఞప్తియందున్నవి. అఁఉండుటయే కాదు, కన్నులకు కట్టినట్లు కనుపడుచుండును. అప్రస్తుతము లగుటచే మఱికొన్ని సంగతులు కూడ నిప్పటికి తూచా తప్పకుండ నాకు జ్ఞపిలో నున్నను, అయ్యవి యిచ్చట వ్రాయలేదు. అవికూడ వ్రాసితినేని శ్రీవారు మిక్కిలిగా నాశ్చర్యపడుదురు. అప్పటివారిలోశ్రీ కాకరపర్తి వేంకటరాయఁడుగారును, ఈయన తోఁబుట్టువు లిరువురును ఇప్పటికి జీవించియున్న ట్లెఱుఁగుదును. శ్రీవారు మఱచినచో నేనక్కడ నున్నకాలమును వీరు చెప్పఁగల రనుకొందును. కాని శ్రీవారికీ సాక్ష్యముతో పనిలేదు. వారు నేను తమ ప్రతికక్షియగు పండితునికి తమకు వ్యతిరేకముగా మంచి యభిప్రాయము నిచ్చుటచే కుపితులై అట్లు నా విద్యార్థిత్వమును దీర్ఘీకరించిరని తోఁచెడిని. ఒకరోజు శిష్యుఁడన్నను ఒకటే, ఒకయేడు శిష్యుఁడన్నను ఒకటే. నేను శిష్యుఁడనే, వారు గురువులే. నే నెంతో నిష్కల్మషముగా వర్తించుచుంటిని. గండపెండేరపు సభలో

చ. "గురువులు పల్వురుండినను కొంకక నేఁటికి నిల్చియున్న మ
 ద్గురుఁ డొకరుండె. శ్రీపదు డకుంఠిత తేజుఁడు కృష్ణమూర్తి...."

అని వచింపలేదా? శ్రీ శాస్త్రులవారు నా శిష్యత్వమువలన తమకు "వచ్చెడి గౌరవములే" దనుకొనుచున్నారు. అది సత్యమే కావచ్చును. నే నట్లనుకొనుటలేదు. వారి గురుత్వము వలన నాకు గౌరవము కలదనియే నేననుకొనుచున్నాను. కావుననే జాతకచర్యలో

చ. "కదలి యనంతరం బచొటు కాటవరంబను నొక్క పల్లె కిం
పొదవఁగ నేగ నయ్యెడల నొందువిధమ్మునఁగాక భుక్తియున్
జదువును సంఘటించుటయు సర్వసుఖమ్మగు నట్టి యచ్చొటన్
గదలక కొంతకాల మెసకమ్ముననుండెఁ గలార్జనాదృతిన్."

తే.గీ. "అచట శ్రీపాదవంశజుఁ డనఘమూర్తి
కృష్ణమూర్త్యాఖ్య సుకవివరేణ్యునొద్ద
మొదలిడి కుమారసంభవమునను రెండు
సర్గలు పఠించె మూఁడుమాసములలోన"

ఉ. "ఆ యనఘుండు దీక్షిత సమాహ్వయుఁడున్ సవయస్కుఁడౌసహా
ధ్యాయియుఁ గూడి నూత్న కవితాభ్యసనాదరులౌట, లక్షణం
బేయెడఁ జర్చసేయునపు డీతఁడు తానొక కొంతకొంత, త
ద్ఛ్రీయు గ్రహించె వారలది చెప్పకమున్న స్వబుద్ధిపద్ధతిన్"

ఒక శంక, చెప్పకుండఁగనే గ్రహించినది పై లక్షణజ్ఞాన మెంతయని చదువరులు శంకింతురేమో, ఎంతోకాదు. వర్గయతి వళకు మాత్రమే.

తే.గీ. "అట్టి లక్షణలేశసంప్రాప్తికతన
మున్న యించుక కవనంబు మొనసి "ఉప్పు
లేని సామెత" జరియించు వీనికంత
నబ్బె నకలంక పదకవిత్వాతిశయము."

కాటవరము వెళ్లుటకు పూర్వమే యానాములో నామీఁద కోర్టులో కవిత్వపు సంబంధమైన కేసు వచ్చుటచే శ్రీశాస్త్రులవారి వద్దకు వచ్చునప్పటికే నేను తప్పో ఒప్పో పదకవిత్వ మల్లుచుంటిననుట స్పష్టము. ఇతరత్ర ఈ విషయము విస్తరింపఁబడినదే.

తే.గీ. "అట్లు రచియించి వారల కరయఁజేయ
వారలవిగాంచి యొక్కింత పరిహసించి
"ఇప్పుడ కవిత్వ మొనరింప నెంచెదేని
చదువు చెడుఁగాన నయ్యది వదలుమనిరి."

తే.గీ. "గురువుఁ దత్సహపాఠియుఁగూడి తలఁచు
ఆడుచుందురు చదరంగ మట్టియెడల
లక్షణంబెట్టు లట్ల తల్లక్షణంబు
నితఁడు గ్రహియించె నాదర మెసక మెసఁగ."

తే.గీ. "అంత మేఘసందేశకావ్యమును మొదలువెట్టి - చదు
వుచునుండంగ విఘ్నకార - ణం బుదయమందె......"

చ. "...... గురునింతి మృతింగనె నాత్మదేహమం
దొదవె నొకించుకంత జ్వరయోగము... ఇంటికే
గెదనని పేర్మి నగ్గురునికిన్ వచియించి... చనె...."

ఇత్యాదులు మున్నుదాహరించినవేయైనను దార్ఢ్యార్థము మరల నుదాహరింపఁబడియె, కావున పునరుక్తిగా నెంచవలదు. ముమ్మాటికి నిదియే నా కాటవరపు విద్యాభ్యాసము కుమారసంభవములో, ప్రథమములో కొంత, తృతీయములో కొంత, పంచమములో కొంత, మొత్తము మూఁడు సర్గలలోఁ బాఠము జరిగినను, పూర్తిగా మూఁడును కానందున రెండు సర్గములగ్రంథము చదివినట్లయినది. అయిదు మాసముల కాల మచట నున్నను అనివార్యములగు విఘ్నములవలన మూఁడు మాసములు మాత్రమే చదువు జరిగినకాలము. ఆ మూఁడు మాసములలోనే పూర్వమేఘములో 29 శ్లోకములు కూడనైనవి. పద్యములో సూత్రప్రాయముగా వ్రాయునపు డీ కాకదంతపరీక్ష కవకాశము కలుగదుగాన స్థూలారుంధతీ న్యాయముగా నుదాహరింపఁబడియె. మేఘసందేశము చదువుచు నేను కాటవరపు శిష్యత్వము నుండి విరమించి, స్వగ్రామమువెళ్లి కొన్నాళ్లుండి, పిమ్మట, కాజులూరి శిష్యత్వము మొదలిడి మూఁడు మాసముల కాలము సుమా రచట పూర్వమేఘము తరువాయి చదివినను, మిగిలిన ముప్పదినాల్గు శ్లోకములలోఁ గొన్ని మిగిలియేయున్నవనుట యథార్థము. పద్యములో "మొదలిడిన పొత్తమది తుదముట్టదయ్యె," అనునదికూడ స్థూలదృష్టిని వ్రాసినదే. పొత్తమనుచో...."సర్గము" అనుట యుక్తము. ఇట్లు వ్రాయుట చేతనే జాతకచర్యలో నొకచోట క. "ఏ విషయము సంగ్రహముగనే వ్రాయంబడియెనిందు." అని వ్రాసియుంటిని. ఇట్టి స్వల్ప విషయమే యైనచో నేను ప్రస్తుత మనారోగ్యస్థితిలో ఈ వ్యాసము వ్రాసి, నాయంత కాకున్నను, కొంత అనారోగ్యస్థితిలోనే యున్న గురువుగారికి మనఃపరిశ్రమ కలిగింపనెంచను. ఆ యీ విషయము నేనిపు డేనాఁటి చర్య ఆనాఁడుగా వ్రాయుచున్న "జాతకచర్య - ఇటీవలి చర్య" అను పొత్తములో విపులముగా వ్రాసియున్నాను. "ఇటీవలిచర్య" అనఁగా షష్టిపూర్తి జరిగిన పిమ్మట చరిత్రమని తాత్పర్యము. షష్టిపూర్తి

వఱకును అచ్చయియే యున్నది. ఇది కూడ సుమారు డెమ్మీసైజు నూరుపుటల వరకుఁ గాఁదగినంత గ్రంథమిప్పటికిఁ దయారైనది. కొల్లాపురపుసందర్భములో, అనఁగా 1930 వ సం॥ ప్రాంతమున గురువుగారికి నాయందు పూర్వోక్తకారణముచే విపులమైన ఆగ్రహము కలిగినను, 1932 సం॥ము జరిగిన శ్రీ గురువుగారి గండపెండెరపు టుత్సవమునాఁటి నుండి నాయందు నిష్కళంక హృదయముతోడనే గురువుగారు వర్తించుచున్నారు. అయినను నేనిప్పుడు "ఈవడ్లగింజలో బియ్యపు గింజకు" ఇంత వ్యాసము వ్రాయవలసి వచ్చినందులకు మిక్కిలి విచారించుచున్నాను. వ్రాసినను చిక్కే, వ్రాయకున్నను చిక్కే. ఏమందురా? నాకు సుమారు రెండేండ్లనుండి నోటీసులు వచ్చుచున్నవి. కనుపడలేదని తిరిగి పోవుచున్నవి. ఈ మధ్య సుమారు నెలనాఁడు మరల నోటీసు వచ్చినది. ఈ నోటీసు తప్పక అమలు జరుగునని నాకును తోఁచినది. కాని జాతకరీతిని మాత్ర మిపుడు మారకస్థితి కనుపడదు. అందుచే మరల ప్రయాణ మాఁగినది. ఆ యీ సందర్భము ప్రస్తుతము వ్రాయుచున్న కామేశ్వరీ స్తవములోని యీ పద్యములు తెల్పును.

శా. నాపూర్వుల్ సుఖవైన మార్గముననే నాకం బధిష్ఠించి రే
నేపాకంబుననైన నేమి! జననీ! యీలాగు శుష్కించియున్
గాపాడంబడుచుంటి, రెండుపయిగాఁ గావచ్చె సంవత్సరా
లేపింకబ్బునె? జాలమున్ సలుపఁగా నేలమ్మ? కామేశ్వరీ.

శా. ఆహారం బదితగ్గె, దేహబలమా? అంతంతగానుండె నిం
కూహాపోహల కేమి? కైతమునకే మొక్కింతయుం దగ్గ దు
త్సాహం, బియ్యది దేహమున్నిలుప శక్తంబౌనె? ఆహారమే
సాహాయ్యం బిడుఁగాని, తద్రుచి భవత్సాధ్యంబు కామేశ్వరీ.

అది యటులుండె. ఇట్టి స్థితిలో నీ పరిశ్రమమేల? అన్నది ముఖ్యాంశము. ఏమి చేయుదును? పలుచోట్ల నాశక్తివంచన లేక మద్దెల వరుసలు చెప్పికొన్న గురువు దగ్గఱ నుండి పేరు ప్రకటించి కృతజ్ఞతను వెల్లడించితిని. దానికేమి? పోనిమ్ము, ప్రస్తుత విషయము గురువుగారి ప్రకటన ననుసరించి సవరించుకొందమన్నను అచ్చైయుండుటచే వీలుగాదయ్యె. గురువుగా రెవరిపేరనో వ్రాయు నుత్తరములో, నేనెవరియొద్దనో తమ శుశ్రూష చాలించిన చాలనాళ్లకు చదువ మొదలిడిన మాఘకావ్యమును తమ వద్దనే చదివినట్లు వ్రాసిరి. ఆ వ్రాఁత అంతతో నాఁగక, రఘువంశ మొకటి తప్ప తక్కిన కావ్యములన్నియు తమ వద్దనే చదివినట్లు లోకమునకు బోధించుచుండె. పోనిమ్మీయుత్తర మెవరికి వ్రాసిరో వారికి మాత్రము తెలియునుగాని అది యితరులకుఁ దెలియదనుకొందమన్న నయ్యది

విమర్శగ్రంథ ములకునెక్కి అచ్చయి యెల్లెడల వ్యాపించె. నేనుపేక్షించినచో రేపటి నుండి పత్రికలలో 'అది నిజమా? ఇది నిజమా?' అని వివాదములకుఁ బ్రారంభింతురుగదా! కావుననిది చారిత్రక విషయ మగుటచే నుపేక్షింప వలను పడక కలిగించుకోవలసి వచ్చినది. గురువుగారి "మాఘము వఱకు" అను నక్షరములుగల హైదరాబాదు యుత్తరపు సంగతి నా కిదివఱలో తెలియదు. ఈ రికార్డు సుమారు వారమునాఁడు (ఈ వ్యాస మీ నెల 2వ తేదీని వ్రాయఁబడినది.) నాకడకు వచ్చినది. దురుద్ధరదోషశృంఖలము చూచి రెండు మూఁడేండ్లు దాఁటినది. అదియును దారుణముగనే యున్నను, ఇది దానిని మించినది. అందుచే నుపేక్షింపఁ వీలిచ్చినది కాదు. కావున గురువుగా రన్యథాగా భావింపక లోకులను సంతృప్తిపఱుపఁ గోరినాను. నేను శ్రీవారి గ్రామములో విద్యాభ్యాసమునకై నివసించిన కాలము దాదాపుగ నైదు మాసములే. అప్పటికి పూర్వమే నేను పదకవిత్వము తప్పో ఒప్పో చెప్పుచున్నాను. ఆ కవిత్వమే నన్ను కోర్టు కీడ్చినది. కుట్టిఁ దనుకారణమున యానాం మేజిస్ట్రేటు కేసు కొట్టివేసెను. నేను కవిత్వ లక్షణమేమియు కాటవరములో చదువుకొనలేదు. కాని గురువుగారును, సహపాఠియును చర్చించికొను సందర్భములో వర్గయతి మట్టుకు నా కవగతమైనది. ఆకాలమున కింకను గురువుగారు ధారాళముగా కవిత చెప్పుస్థితిలోనే లేరు. అవధానులు కూడకారు. పిమ్మట అవధానులైనారా లేదా అనునంశము నాకిక్కడ ప్రస్తుతము కాదు. కావున, అవధానమును గూర్చి లేశమును నేను వారి యొద్ద నభ్యసించలేదు సరికదా, వేఱొకరియొద్దఁ గూడ నభ్యసించనేలేదు. అవసరమును బట్టి కాశికి వెళ్లినపుడు, నిడమఱ్ఱు గ్రామములో అవధాని వేషము వేసితిని. ఈ విషయ మన్యత్ర విస్తరింపఁబడినది. ఇఁక నేను కాటవరములో అభ్యసించిన విద్య యెంతవఱకనఁగా....

ఆ.వె. వీరివద్ద నేఁ గుమారసంభవమును
గొంత, మేఘదూత కొంత, యింత
వఱకె చదివినాఁడ, వాస్తవంబిది గురు
వరుని హృదయ మెఱుఁగుఁ బరుఁడు నెఱుఁగు.

అని నిన్న మొన్న వ్రాయుచున్న "ఇటీవలిచర్య"లో మరల ప్రసక్తి కలుగుకతన "సింహావలోకన" న్యాయమున వ్రాయవలసివచ్చి వ్రాసితిని. ఈనా యక్కరములు భ్రాంతి మూలకములనిగాని దురుద్దేశ మూలకములనిగాని శ్రీమాగురువుగారే కాదు, వేరెవరేని విషయ మెఱిఁగిన వారు సప్రమాణముగా ఋజువుచేసి తెల్పునెడల పూర్వము వ్రాసిన నా చరిత్ర పుస్తకములోని యంశములను వచ్చు ముద్రణమునందేని సవరించుకొందును.

ఎవరో యెందులకు? శ్రీవారి సహాధ్యాయి శ్రీ మధిర సుబ్బన్న దీక్షితులుగారున్నచో, కదుసుళు వుగా నీయంశము తేలెడినిగాని దురదృష్టవశమున వారు కూడా నిప్పటికిఁ గీర్తిశేషులేయైరి. ఏమైనను దీనికి గురువుగారే నివర్తకులు కావలెను. చదువరులు శ్రీవారిచ్చు నుత్తరమునకు ప్రతీక్షింప వలెను. వారు కృష్ణాపత్రికకు వ్రాయు నాచారములేదు. లేకున్నను దీనిని మాత్రము కృష్ణకే పంపుటకు ప్రార్థించుచున్నాను. పత్రికవారికిని గురువుగారికిని కొండొక మనఃప్రభేదములున్నను వానిని పత్రికవారు లెక్కింపరు, శిరసావహింతురు. వెనుక నాశాంతి వ్యాసమునకు జవాబు వేరొకపత్రిక కంపుటచే నిట్లభ్యర్థింప వలసివచ్చినది చదువరు లరయుదురుగాక. మఱియు హైదరాబాదు యుత్తరమును గూర్చి శ్రీవారు తప్పుకొనుటకుఁ గొంత యుపాయము కలదు. కాని తుదకదియు నిల్చెడి త్రోవ కాదు. అదిగాక "శృంఖలము" లోనివ్రాఁత నేయుపాయమునఁ దప్పి కొందురు? దీనికి శ్రీవారు జవాబిచ్చుచు లోకులను సంతృప్తిపఱుచు పట్టున యుక్తికన్న సత్యమునే యెక్కువడుగ నాధారము చేసికోవలెను. ఇప్పుడు నేను ముఖ్యముగాఁగోరునది శ్రీవారివద్ద నాయొనర్చిన విద్యాభ్యాసమునకు సంబంధించినంత వఱకు మాత్రమే. శ్రీముక్త్యాల రాజావారి వద్ద చాడీలుచెప్పి యుపకరించుట, పాలకొల్లులో మోసగించుట, లోనగు "శృంఖలము" లోని విషయము లక్కఱలేదు. వానికి శ్రీరాజావారే కలరు. పాలకొల్లే కలదు. నాకేల పరిశ్రమ? అన్నిటికిని సర్వసాక్షి భగవంతుఁడే కలఁడుగాని, అయినను పామరత్వము కతన యత్నింపక తప్పినదికాదు. లోకులకు సందియ ముండకుండఁ జేయుటకై శ్రీ గురువు గారికిది నా వినయపూర్వక విజ్ఞప్తి.

"చ. నుతజలపూరితమ్ములగు నూతులు నూఱిటికన్న సూనృత
వ్రత ! యొకబావిమేలు, మఱిబావులు నూఱిటికన్న నొక్క స
త్క్రతువదిమేలు, తత్క్రతుశతమ్మునకన్న సుతుండుమేలు, త
త్సుతశతకమ్ముకన్న నొక సూనృతవాక్యము మేలు చూడఁగన్."

★ ★ ★

# నా ముక్త్యాల ప్రయాణము

(30-11-1935 సం॥ర కృష్ణాపత్రిక నుండి)

స్వస్తిశ్రీ క్రోధన సం॥ శ్రావణ మాసంలో (1925 సం॥ ఆగష్టు నెలలో) నాకు శ్రీ ముక్త్యాల సంస్థానాన్నుంచి తంతి ద్వారాగా ఆహ్వానం వచ్చింది. మా పాఠశాలోపాధ్యాయులు పాలంకి గంగాధరశాస్త్రిని తోడుగా తీసికొని నేను ప్రయాణం చేశాను. బోనగల్లు స్టేషనువఱకూ రైలే గాని అక్కడ నుంచి త్రోవలో యేదోవకయేరు తటస్థిస్తుంది, అంత వరకూ మోటారు. ఆ యేఱు వర్షాకాలమవడం చేత నిండుగా పాఱుతూ వుంది. అదేమిటో, ఆ యేట్లో నీ రెంతో అంత యిసుకకూడా ప్రవహిస్తూ వుంటుంది. గోదావర్యాది నదులలోవలెఁగాక ఆ యేఱు దాఁటించే పడవల మాదిరి వేఱు. వాటికి చక్రాలుంటాయి. ఏఱు దగ్గిఱికి పెందలకడనే వెళ్ళేముకాని, వంతుల ప్రకారం దాఁటించడం కనుక మావంతు వచ్చేటప్పటికి కొంత ఆలస్యమయింది. అదేనా కొన్ని శిఫారసుల మీఁదగాని లేకపోతే ఆ మాత్రం ఆలస్యంలో కూడా తేలదన్నమాటే. అవతలి కెళ్ళేటప్పటికి రెండు జాములు కావచ్చింది. మళ్లా అవతలి వొడ్డున కంటిన్యూగా మోటారు వుండడంచేత దానిద్వారా సుమారు మధ్యాహ్నం వంటిగంటకు జగ్గయ్యపేటకు చేరుకున్నాము. ఎప్పుడో అప్పటికి సుమారు ముప్పైయేళ్లనాఁడు కాశీప్రయాణంలో ఆ వూరు వెళ్లడమే కాని యిటీవల యెన్నఁడూ వెళ్లినట్లు లేదు. అందుచే పేరువిన్న వాళ్లేకాని మనిషి నెఱిఁగినవా ళ్లుండక పోవడం చేత వంటపూటింటికి వెళ్లాలని అనుకుంటూ వుండఁగా మాతో పాటుగా మోటారు దిగిన గృహస్థొకాయన వారింటికి ఆతిథ్యానికి తీసుకువెళ్లారు.

నాఁడు శ్రావణ శుక్రవారం నోము. యింకా కొంతాలస్యం ఆ కారణంచేత అయిందికాని, వక కొత్త విశేషం కనిపెట్టినట్లు సంతోషించాను. యేమిటంటే : మావైపున కూడా యీ వ్రతం లేకపోలేదుగాని, దీనిలో స్త్రీలతోపాటు పురుషులు పాల్గొనడం మాత్రం నేనెక్కడా చూడలేదు. బందరులో సుమారు పదమూడేళ్లు నేనున్నానుగాని, అక్కడ యీ సంప్రదాయం వుందో లేదోగాని చూడలేదు. నేఁటికి "కాకతాళీయంగా" జగ్గయ్యపేటలో తటస్థించినందుకు సంతోషంగానే వుంది గాని అప్పటికే నేను పెసరబద్దంత నల్లమందు వకపూట వేసుకొనే అభ్యాసంవుండడంవల్ల ఆలస్యమవుతోందని యిబ్బందిగా కూడా వుంది.

పాపం, ఆ గృహస్థు నా నల్లమందు మూలాన్ని ఆ పూజ కొంత త్వరలో తేల్పించాడు. ఆ దంపతుల కావేళ నా ఆశీర్వచనం తటస్థించడానికి మిక్కిలిగా ఆ యింటివారు సంతోషించారు. నాకు క్రొత్తబట్టలిచ్చి సన్మానించినట్లుకూడా జ్ఞాపకం, పొద్దు పోయినా పిండివంటతో భోజనం. యీ మాట "బ్రాహ్మణో భోజన ప్రియః" కింద జమకట్టుకోకుండా చదువరులను కోరుచున్నాను. యెందుకురాయాలంటే, యేదేనా కార్యార్థం బయలుదేఱి నప్పుడు మొట్టమొదటి మకాంలో శ్రమలేకుండా భోజనభాజనాదులు తటస్థించడం భవిష్యత్కార్యానికి మంచిదని శకున శాస్త్రజ్ఞులు చెపుతారు. చెప్పడమేకాదు, ఇది తప్పకుండా అనుభవానిక్కూడా వస్తుంది. కాబట్టి ఆలాంటి అలవేళ అప్రయత్నంగా భోజనం దొరకడమేకాకుండా వరలక్ష్మీవ్రతం చేసుకుంటూ వున్న నూతన దంపతులను చూడడం, ఆ సభలో సన్మానించబడడం, ఇదంతా భావికార్యానికి శుభసూచకం గదా! అందుచేత మనస్సుకు చాలా ఆనందం కలిగింది. భోజనమయింది. గుఱ్ఱపు జట్కాలమీఁద ముక్త్యాలకు ప్రయాణం సాగించాము. తోవలో వెనుకటి యేఱుమోస్తరుదే యింకోయేఱు అడ్డం వచ్చిందిగాని, దాని వడి చాలా తగ్గిన స్థితిలో వుండడంచేత సునాయాసంగానే దాఁట నిచ్చింది. సంధ్యాకాలానికి లోగానే ముక్త్యాల చేరుకొన్నాము. యెడ తెరిపిలేకుండా సంగీత సభలేమి, సాహిత్య సభలేమి, జరుగుతున్నాయి. నేనక్కడికి వెళ్లడం కొత్తయినా, కొత్తనిపించనేలేదు. యెందుచేత? బందరు బందరంతా అక్కడ ప్రత్యక్షమయింది. శిష్యులు, అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి, వేటూరి ప్రభాకరశాస్త్రి లోనగువారంతా అక్కడే వున్నారు. హరినాగభూషణంగారిని చెప్పనే అక్కఱలేదు. ఆయనకు గుండెకాయగా వుండే వేమూరి నారాయణరావుకూడా కనపడ్డాడు. పై వాళ్లంతా కనపడడం వకయెత్తున్నూ, ఈనారాయణరావు కనపడడం వక యెత్తున్నూ యేమంటే; యితఁడు మాబోట్లవలె ధనాపేక్షతో వకచోటికి రాఁదగ్గవాఁడు కాఁడుగదా? పైె ఫేమిలీవాఁడు, పూర్వమంతకాకున్న అప్పటికిక్కూడా "చాపచినిఁగినా చదరంత" ఐశ్వర్యంలో వున్నాఁడు. యిక్కడి కెందుకు రావాలి, అనుకొన్నాను. యీ సంశయం కొంచెఱివల్ల తీరింది. యీ వుత్సవాలకీ యీసభలకీ ముఖ్యకారకుఁడు యీ వేమూరి నారాయణరావే అని తెలిసింది. యితఁడు నా బందరు శిష్యులలో నాయందు మిక్కిలీ అభిమానం కలవాఁడు. దేవీభాగవతాన్ని అచ్చువేయడానికి యావత్తు ధనమున్నూ తానే యివ్వాలని సంకల్పించుకొన్న భక్తుఁడు. అయితే నేను అవసరమైతే పుచ్చుకొందామని అనుకొనేవాణ్ణి. భగవంతుఁడు అట్టిలోటు లేకుండా మా పుస్తకాల మీఁద వచ్చే ద్రవ్యంతోనే ఆ ముద్రణాన్ని నెఱవేర్చాడు. ఆ హేతువుచేత యితని ద్రవ్యాన్ని నేను పరిగ్రహించలేదు. గాని అతని లోపంవల్ల మాత్రం కాదు. తుట్టతుద కేలా అయితే యేమి కొంత ద్రవ్యం యితనిది నేను పరిగ్రహించడం కూడా జరిగినట్లే

అనుకోవచ్చు. మా తిరుపతిశాస్త్రిగారి పెద్దకొడుకు పెండ్లికి నారాయణరావు నా మొగమాటాన్ననుసరించి నూరురూపాయీలు అతని కోరికచే అప్పుగా యిచ్చాడు. తిరుపతిశాస్త్రి రెండువందలకు నోటు వ్రాసి పంపేడుగాని, సందర్భం లేకోయేమో యితఁడు నూఱురూపాయలు మాత్రమే పంపేడు. వడ్డీగాని అసలుగాని పుచ్చుకొనే వూహ యితనికి లేదని వేరేచెప్పనక్కఱలేదుగాని, యిటీవల సందర్భాన్ని బట్టి యిస్తే అసలు మాత్రం పుచ్చుకుందామని వూహ వున్నట్లు తోఁచింది. కాని ఆమాత్రం కూడా జరిగించకుండానే తి.శా.గారు స్వర్గస్థులైనారు. అతఁడు వ్రాసిచ్చిన నోటు కాలదోషం పట్టిన తర్వాత నా వద్దకు నారాయణరావు పంపించాడు. సొమ్ము నిమిత్తమేమో అనుకొని వున్న పరిస్థితులన్నీ వ్రాసి, పంపుమంటే నేను సొమ్ము పంపడాని కభ్యంతరం లేదని వ్రాశాను. అప్పటి కతని స్థితిగతులు చాలా వ్యత్యాసంగా వున్నప్పటికిన్నీ అందుకతఁ డంగీకరించాడు కాఁడు. తర్వాత నేను మా.తి. శాస్త్రి కొడుకుతోకొంచెం నీవుకాలూచేయీ కూడదీసుకొన్న తర్వాత అసలు మట్టుకు అతనికిస్తే బాగుంటుందని చెప్పాను. కాని వానికిట్టి వుద్దేశం వున్నప్పటికీ నెఱవేఱిందేకాదు. అంతలో నారాయణరావు స్వర్గమలంకరించాడు.

రామాయణంలో పిడుకల వేట్లాటన్నట్టు యీ ముక్త్యాల ప్రయాణంలో యితన్ని గూర్చి యింతగా వ్రాయడ మెందుకని చదువరులకు తోస్తుందేమో! యీ నా ముక్త్యాల ప్రయాణానికేకాక ముందు నేనిందులో వ్రాయబోయే మఱోప్రధాన విషయానిక్కూడా యీ నారాయణరావే "కర్ణునితల భారతం" గా వుండడం చేత యింతగా ప్రస్తావించవలసి వచ్చింది. శ్రీ ముక్త్యాల రాజావారు యితని ప్రేరేపణచేతనే ఆయా కవిగాయకాదులను బిలిపించి సన్మానించారు. యితఁడే శ్రీరాజావారికి నన్ను జ్ఞాపకం చేసి రప్పించినవాఁడున్నూ, "యేమి? యితఁడు జ్ఞాపకం చెయ్యక పోతే శ్రీ రాజావారికి నీపేరే తెలియదా" అని శంకించకండి. రాజులుగదా! అభియుక్తులేమన్నారు!

శ్లో. అగాధహృదయా భూపా కూపా ఇవ దురాసదః
ఘటకా గుణినో నోచే త్కథం లభ్యేత జీవనం.

దీనికి ప్రతిపదార్థం వ్రాస్తే చాలా పెరుఁగుతుంది. కొంచెం కఠిన శ్లోకం గనుక తాత్పర్యం వ్రాస్తాను. రాజులున్నూ, నూతులున్నూ వకటే మాదిరిగానే చాలా లోతుగా వుండడంచేత, ఘటకులంటే సంధానంచేసే మధ్యవర్తులున్నూ నీరుతోడుకొనే చేఁదలున్నూ మంచిగుణం కలవారున్నూ మంచిత్రాడు కలవిన్నీ కాకపోతే, రాజులవల్ల జీవనం ఆసించే వారికి జీవనమున్నూ, నూతిలో నుండి నీరు ఆసించేవారికి నీరున్నూ, లభించదని ముఖ్య తాత్పర్యం. యీ నారాయణరావే శ్రీ రాజావారితో మనవిచేసి నన్నక్కడికి రప్పించాడన్నది ప్రస్తుతం.

ఆనాఁడు సంధ్యాకాలాని కావూరు ప్రవేశించానని వ్రాశాను. సంగీతసభలో శ్రీవారి దర్శనం నాఁడే చేసినట్లు జ్ఞాపకం. మఱునాఁడు ఉదయం శ్రీహరి నాగభూషణం గారి పాట. ఆ పాటకచ్చేరీ తుట్టతుదను శ్రీ రాజావారి మీఁద వకపద్యం ఆశీర్వచనంగా చెపుతూ నాగభూషణం గారిని గూర్చి కూడా వకపద్యం చెప్పాను. ఈ రెండింటికీ మధ్య వకపద్యం కూరగాయది చెప్పి అప్పటి నా వయఃపరిమితి వగైరాలను ముచ్చటించాను. ఆ యీ పద్యాలుదాహరిస్తా నిచ్చట.

శా. శ్రీలన్ జాలఁ జెలంగుచుండియు సదా చెయ్యివ్ల్ తపోవేదశా
స్త్రాలీధమ్ములుగాఁగ జీవితము శ్లాఘ్యం బొగతిన్ బుచ్చు ము
క్తీలేశున్ మన చంద్రమౌళివిభు ముక్తీశుండు రక్షించుఁగా
కే లోపమ్మును లేక కాల మఖిలం బీలాగె కాలాఁగఁగన్ ౧

తాత్పర్యము సుగమమే కనుక విస్తరింపను. అప్పుడు సంగీత సాహిత్యాదులతో నృపుఁడు కాలక్షేపం చేయుచుండడంచేత, కాలమెప్పుడూ యిలాగే నిల్చి ఉండాలి, అన్నది ప్రకరణానికి సంబంధించిన విశేషం, యింక తరువాయి పద్యం –

తే.గీ. శిష్యులకుఁగూడఁదల నరసినది కొంత
నాకు దల యొక్కటియకాదు నరసె మీస
లిట్టిచో నేఁ గయిత సెప్పనేల యయినఁ
జెప్పకేతప్ప కొక్కింత చెప్పుచుంటి. ౨

ఈ పద్యంలో వున్న శిష్యుల పేళ్లు కొన్ని వుదాహరించేవున్నాను. నా వయస్సప్పటికి సుమారు యేభై అయిదేండ్లు.

తరువాయి పద్య ముదాహరిస్తాను.

తే.గీ. తఱచుగా రామశబ్దంబు తాఱుమాఱు
చేసి నాగభూషణుఁడు వచించుమాట
కర్థ మో చంద్రమౌళిధరాధినాథ !
"ఏను సంగీతపున్ మర నెఱుఁగు" మనుట
దీర్ఘ మేలన? నదియు గీతిగుణ మధిప. 3

"రామ" శబ్దాన్ని తలక్రిందుచేస్తే "మరా" అవుతుంది. మన కిక్కడ కావలసింది "మర" కాని, "మరా" కాదు. అయితే సంగీతంలో అలాటి దీర్ఘాలు లెక్కలేదని సమాధానం.

ఈ పద్యానికి సుమారొక గంటసేపు వ్యాఖ్యానం చేసినట్లు జ్ఞాపకం. పైకి వ్యాఖ్యానం చేస్తూవున్నట్టు కనిపించినా, నేను లోపల చేస్తూ వున్నపని వేఱు. యేమిటంటే మొదటి పద్యం చదివేటప్పటికి నాకీ వూహలేదు గాని, చదువుతూవుండఁగా మా రెండవగురువుగారు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రుర్లు గారు శ్రీరాజావారికి అంకితంగా (అంకితం గాదని మా గురువుగారు కోర్టులో వాదించారు కాని ఆవాదం తుదకు నిల్వదు) భారతం తెలిఁగించడమున్నూ, వారు నెల 1 కి రు. 116-0-0 పంపించడమున్నూ, యిటీవల వీరిరువురకున్నూ మనోమలికలు కలిగి రిజిస్టరు నోటీసులు జరగడం వగయిరాలున్నూ దైవవశంగా స్ఫురణకు వచ్చి, మన మెట్లేనా వీరిద్దరికిన్నీ ఇటీవల కొంతకాలం నుండి జరిగే కలహాన్ని నివారించడానికి ప్రయత్నిద్దామని తోఁచి, వట్టి పొడిమాటల్లో కన్న ఛందోబద్ధంలో జీవం యెక్కువుంటుందని మనస్సులో ఆ విషయమైన పద్యాలు అల్లుకుంటూ వున్నాను. కాని ఆ పూటే వినిపించినట్లు జ్ఞాపకం లేదు. మధ్యాహ్నం పాట కచ్చేరీ అయిన పిమ్మట పొద్దుటి ఆశీర్వచనపద్యంలోవున్న "ముక్తీ లేశున్" అన్న పదము నెత్తికొని, శ్రీమా గురువుగారు కూడా "ముక్త్యాల" పదమునకు "ముక్తీల" అనియె భారతంలో వాడినారు. అని ప్రసక్తి కల్పించికొని గురువుగారికిని శ్రీ రాజావారికిని కల వైషమ్యము తొలఁగించాలనే వూహతో ఆ యీ పద్యాలు వినిపించాను.

సీ. నీ భారతామ్నాయ నేతృత్వ మదియనే
  తాదృశైశ్వర్యప్రదమ్ముగాఁగ
నీ తనూజాతుండు నీతిచే భూతిచే
  ఖ్యాతిచే విస్ఫీతకరుఁడుగాఁగ
నీదు జీవిత మొక్కనేఁడెగా కాకల్ప
  మాదిరాజయశోవినోదిగాఁగ
నీదు సంస్థాన మానీత సత్కృత నిరం
  తర కవిగాయకోత్కరముగాఁగ

తే.గీ. నాయురారోగ్యభాగ్య మహామహప్ర
భూతవిఖ్యాతిముఖ్య విభూతి కిప్ప
టట్లె యెప్పుడునిలయమై యలరుమయ్య!
అర్థిజనకల్పభూజ ! ముక్త్యాలరాజ !

శా. గోదాతీరమునందు భారతము దిక్కూలంకషోద్య ద్యశః
ప్రాదుర్భావుఁడు రాజరాజు (రాజరాజనరేంద్రుఁడన్నమాట)
రచియింపన్‌జేసెఁ గృష్ణానదీ

భూదారుండవునీవు నట్టిపనికే భూయఃప్రయత్నమ్ము నా
పాదింపంగలవాఁడవై యశము సంపాదించితో భూపతీ. ౫

ఉ. ఎందఱురాజు లెన్నికృతు లెందఱచేఁ గృతినందిరేని, నీ
చందముగా యశంబు గనఁజాలరు, భారతమన్న వేదపుం
గందము తాదృశంబయిన గ్రంథము కృష్ణుఁడె విప్పిచెప్ప నా
యందముగల్గుటెట్లు లిఁక నన్యుఁ డెవండు తెలుంగుచేసినన్. ౬

వేదపుం గందము, అనఁగా వేదపుదుంప, లేదా, వేదముయొక్క గంధము (పరిమళము) కలది, అనిగాని చెప్పికోఁదగు. అసలు భారతము నన్నయాదు లాంధ్రీకరించిరి. వారు భారతయుద్ధమును ప్రత్యక్షముగా చూచినవారు కారు. కృష్ణుఁడో, అట్లుకాక, ప్రత్యక్షముగా సర్వమునుచూచినవాఁడు. కావున వారి రచనకన్న నిది సర్వోత్కృష్టముగా నుండునని వ్యంగ్యమేకాక వాచ్యముకూడను. ఇందు, కృష్ణపదము శ్లేషించుటచే ఇట్టి యర్థవిశేషము వచ్చినదని యెఱుంగవలెను.

తే.గీ. ములుగు పాపయారాధ్యులు మున్ను దేవి
భాగవతమును మీవంశపార్థివుల స
మక్షమందె తెలింగించె నంతకన్న
వేయిరెట్లు భారతకృతి విభుతమిన్న. ౭

శ్రీ వాసిరెడ్డి వెంకటాద్రినాయఁడుగారి ప్రభుత్వపు దినములలో రచింపఁబడిన పాపయారాధ్యులవారి యాంధ్రభాగవతము జగ్గయ్యపేటలో యీ ప్రయాణములోనే నేను చూచినాను. ఇంకను అది ముద్రితము కాలేదు.

శా. ఎన్నోపున్నెము లీవు మీకులజు లా యీ రాజ్యముంబూని మున్
ము న్నార్జించియెయుందు, రయ్యవియు విస్ఫూర్జద్యశస్స్ఫితికిన్
వన్నెంబెట్టఁగఁజాలియున్ బ్రకృతమై భాసిల్లు నీ భారతం
బన్నన్ దత్కృతు లన్నిటిన్ మిగిలి నీకర్పించె నత్యున్నతిన్. ౮

ఉ. ముం దెటువంటి సద్యశము పొందెదొ! యిప్పుడె రాజరాణ్న రేం
ద్రుం దలఁదన్నితీ వధిపఁ రూఢిగనిన్ జనమేజయాచలేం
ద్రుం దులదూఁగఁజేయుటకుఁ దొల్లి యొకింత యతించినాఁడ, నేఁ
డందులకే యతించెదఁ గృతార్థుఁడ నయ్యెదనన్న నమ్మికన్. ౯

ఇందు, రాజరాజనరేంద్రుఁడు నన్నయభారతమునే కృతి పొందుటచే, అయ్యది దాదాపు మూఁడుపర్వములే కనుక, శ్రీముక్త్యాలరాజావా రప్పటికే అయిదుపర్వములు కృతినందియుంటచే రాజనరేంద్రుని మించినట్లు తెలిసికోవలెను. జనమేజయుఁడు యావద్భారతమును వినుటచే నాయత్నమట్లు చేయవలయునని యున్న ట్లెఱుఁగఁగదగు. "తొల్లియొకింత యతించినాఁడ" అనుమాటకు సందర్భమెట్టిదో నాకు జ్ఞప్తియందు లేదు. దీనిం గూర్చి శ్రీరాజావారుగాని శ్రీ మా గురువుగారుగాని వ్యాఖ్యాతలు కావలెను. ఈ భారతములో కొంతభాగము మరియొకరికి అంకితము కాకూడదనియు, మీకే సర్వమును అంకితము కావలెననియు నాతాత్పర్యమని చదువరు లరయఁగలరు. ఈ యభిప్రాయము కూడా అపరాధంగానే గురువుగా రిటీవల భావించారు. అది ముందు తెలుస్తుంది.

శా. అంతేవాసిని నేను గృష్ణకవి కత్యంతమ్ము నాయందు నా
యంతర్వాణికిఁ బ్రేమమగ్గలము నీయాంతర్యమో నన్ను న
శ్రాంతమ్మున్ గమనించు, నిట్టియెడఁ "గార్యంబేల కాకుండు" నం
చెంతున్ స్వాంతమునందు, నిక్కము జయంబే నాకుఁ జేకూరెడిన్. ౧౦

శా. శ్రీనాథుండటఁ దొల్లి వేమవిభుతో సింగక్ష్మాభర్త కెం
తేనిన్ వైరముమీఱియున్న తఱిఁ దానేయేగి సింగక్ష్మా
జానిన్ సత్కవితావినోదమున మెచ్చన్ జేసి తద్వైరమున్
మానించెన్, గవిరాజవైరమును నే మాన్పింతు నారీగతిన్ ౧౧

కవి యొక్కయు రాజు యొక్కయు అనియును, కవిరాజుగారి యొక్కయు అనియునర్థము. శ్రీనాథుఁడు వారించినది, రాజునకును, రాజునకును గల వైరము. ఇదియో కవికిని రాజునకును సంబంధించిన వైరమని విశేషము.

శా. నా తోఁబుట్టువు భారతంపుఁ గృతికి న్నాథుండ వీవౌటచే
నీతోఁ జుట్టఱికంబు నాకొదవుటన్నే నిన్ను విన్పింపఁగా
నేతున్ గృష్ణ కవీంద్రుఁడో? వినెడి మున్నేనాకు, నింకేటికో
కాతర్యంబు, నరేంద్ర భావుక యశఃకాంక్షన్ బ్రవర్తించెదన్. ౧౨

ఇందు గురువు తండ్రివంటివాఁడనియు, తత్పుత్రిక అనఁగా "కవి జనకుఁడు" అను సంప్రదాయము ననుసరించి ఆయన భారత మాయనకుఁ గొమార్తె యగుటచేనాకు తోబుట్టువగుననియు గ్రహింపనగు. మఱియు, "నరేంద్రభావుక" అనుచో ఆకృతికన్యకకు నీవు పెనిమిటి వగుటచే నాకు నీవు బావవు గనుక నిన్ను బావా! అని సంబోధించుచున్నాను

నంశము కూడ గ్రహింప వలయును. రెండవ పక్షమున భావుక పదము యశస్సునకు విశేషణముగా నన్వయించుకోవచ్చును. "భావకం భవుకం భవ్యం" అని నిఘంటు. ఇట నింకను షష్ఠీతత్పురుషచే విశేషార్థము వచ్చును గమనింపుఁడు –

ఉ. చెప్పెడివాఁడు కృష్ణకవి, చెప్పుఁగఁజేసెడివాఁడవీవు మీ
రెప్పటికిన్ మహాయశము నెంతయుఁ గాంతురు గాక, లోకపున్
మెప్పునుగొంద్రుగా, కది సమీహితమేదియులేని నాకెటో
గొప్పదనమ్ము దెచ్చుటకొకో? యని యెంచెద మీ వివాదముల్ ౧౩

చ. మృదుహృదయుం, దమాయికుఁ, దమేయుఁడు, కృష్ణుఁడు నీవొ? సత్కవీ
ద్వదనముఁ గన్నమాత్రన ప్రపంచము సర్వము విస్మరించు సౌ
హృదయము గలట్టి దాతృమణి విట్టిద్వయమ్మున కించుకంతయా
కదనము వేంకటేశునెడఁ గల్గిన కూరిమి పెంపు భూవరా. ౧౪

సీ. సచ్చిదానంద శ్రీస్వామి చాతుర్మాస్య
కారణమ్మున వచ్చుఁగాక యిటకు
రారె? నిస్పృహులయ్యు రాజుల కడకు య
తీంద్రు లవ్యాజంపుఁ గృపకు లోఁగి
అంతమాత్రన "యింత వ్యయమేటి" కనుక యిం
దఱుఁ బండితులఁ బిల్చు ధన్యులుంద్రె?
ఉంద్రుగా కేనేడ కొగి రాఁగ వీలులే
కుండియు వచ్చుటెట్లౌనరె? నీస

తే.గీ. మస్తమును నాకేదియొ గొప్పయశము దొరకు
కారణంబని నామదిఁ గానఁబడెడి
నితరనృపులఁ గాంచిన దొకయెత్తు, నిన్నుఁ
గాంచుటొకయెత్తుసుమ్ము ముక్త్యాలభూప. ౧౫

తుట్టతుది పద్యంవల్ల ముక్త్యాలకు అస్మదాదు లెందుకాహ్వానింపఁబడ్డారో విస్పష్టం కాబట్టి విస్తరించేదిలేదు. అక్కడ నేను చేసిన ప్రయత్నం గురువుగారు నన్ను కోరితే చేసిందికాదు. తాత్కాలికంగా భగవంతుఁడు నాకు తోపిస్తే చేసిందే. దీనివల్ల నాకు మంచి కలుగుతుందని నేననుకొన్నాను. మొట్టమొదట అలాగే జరిగింది. దాన్ని కూడా టూకీగా వుదాహరిస్తాను. ముక్త్యాలనుండి నేను స్వగ్రామానికి వచ్చేటప్పుడు హఠాత్సంభవంగా

గురువుగారు అన్నవరం కాఁబోలును స్వామిదర్శనార్థం వెళ్లుచూ రాజమండ్రి వద్ద రైలులో కనపడ్డారు. ఆ యీ పద్యాలు దేశీలు సర్వమూ వినిపించి సంగతంతా మనవి చేశాను. దానికి చాలా సంతోషించారు. ఆ విషయం "ఇటీవలిచర్య" లో యిట్లుటంకించాను.

తే.గీ. ఏను ముక్త్యాల చని యటఁ గృష్ణగురుని
కొరకుఁ జేసినయత్నంబు గురుఁడు తెలిసి
కొని మహానందవారిధి మునిఁగితేలి
కౌఁగిలించికొనియె నన్నుఁ గరము పేర్మి.

యిటీవల కూడా గురువుగారికి నాయం దనుగ్రహం తప్పుట కేమీ కారణం లేదుగాని తమ ప్రతిపక్షి శ్రీ వనం సీతారామశాస్త్రులుగారితో కొల్లాపురంలో వివాదపడివచ్చి వారిశ్లోక పంచకాన్ని ఆక్షేపించి యేకర్మమూ యెఱుఁగని బ్ర॥ శ్రీ॥ పుల్లెల శ్రీరామశాస్త్రిగారి పేరితో ప్రకటించిన పిమ్మట, ఆయన వ్రాసిన సమాధానములపై అభిప్రాయాన్ని యిచ్చిన పండితుల జాబితాలో నేకూడా వుండడం వల్ల ఆగ్రహం కలిగింది. శ్రీరామశాస్త్రుల్లుగా రేకర్మయూ యెఱుఁగరని వ్రాస్తారే మీరు, ఈయంశాన్ని మీరేలా నిర్ణయిస్తారంటారేమో! వినండి. నేనెప్పుడేనా రాజమండ్రీ వెళ్లడం కలదు. వెళ్లినప్పుడు సుమారు పదిపండ్రెండేండ్లనుండి శ్రీ సోమెన కామేశ్వరరావుగారింట బసచెయ్యడం అలవాటు. వారి యింటికి సమీపంలోనే శ్రీ వోరుగంటి సుబ్బారావుగారి లోగిలిన్నీ వుంది. సుబ్బారావుగారింట్లోనే శ్రీరామశాస్త్రుల్లుగారి మకాం. శ్లోకపంచకవిమర్శనం ప్రకటింపఁబడ్డ కొలఁది దినాలకే ఆయన జ్వరితులై లంఖనాలు చేస్తుండఁగా, నాకు తెలిసి చూడడానికి వెళ్లాను. ఆయన క్షేమం కనుక్కుంటూ, కొంచెం నింపాదిగా వున్నట్టు ఆయన చెప్పిన తరవాత 'ఇదేంకర్మమండీ? అంత అయుక్తంగా ఆ శ్లోకాలు విమర్శించారు" అని చనువుండుటచేత ఆయన్ని అడిగాను. దానిమీఁద, ఆయన నేనేకర్మమూ యెఱుఁగనని చెప్పేరు. కాఁబట్టి నాకు తెలిసింది. అప్పటికప్పుడే ఆ విమర్శనాన్ని గుఱించి యితర పండితులతో పాటుగా నేను కూడా అభిప్రాయం ఇవ్వడ మయిపోయింది. కనుక అప్పుడా వ్రాఁత సర్వమున్నూ గురువులదే అని తెలిసికొన్నప్పటికీ చేయిజాటినదాన్ని నేను సర్దుకోవడానికి వీలిచ్చిందికాదు. అభిప్రాయం యిచ్చేటప్పుడు కూడా యిది గురువుగారిదే అని నా కనుమానం లేకపోలేదు. గాని యేమైనా వారి పేరు దానిలో లేదుగదా అనుకున్నాను. ఇదిగాక, నిజాన్ని దాచడం నా చేతకాదు. తరవాయి వినండి. నాకు అంతోయింతో శిష్యుఁడై యుండిన్నీ నేను వ్రాసినదాన్ని కాదనడానికి వీఁడెవఁడు? వీఁడి కేమధికారం వుంది? అని పిమ్మట

గురువుగారి కాగ్రహం కలిగింది. అంతేకాని అది తమ పేరుతో లేదనే సంగతి వారు గమనించారు కారు. గురువుగారి పేరుతోనే ఆ పుస్తకం ప్రకటింపబడ్డట్టయితే అవతలివారు నన్ను నిర్బంధించడాని కవకాశం లేకపోయేది. వకవేళ నిర్బంధించినా అది ఒప్పవనివ్వండి, తప్పవనివ్వండి, మన ఆచారాన్నిబట్టి దాని విషయంలో కలగఁజేసుకోవడానికి నాకంతగా అధికారం లేనిమాటే సత్యం. ఈ ఆచారాన్నిబట్టే, వెనుక "వశ్యావశ్య" విచారసందర్భంలో శ్రీజయంతి భగీరథశాస్త్రులవారు మా తరఫున వ్రాస్తూ, అవతల తరఫున వారి గురువులు శ్రీ మహామహోపాధ్యాయ తాతారాయఁడుశాస్త్రులువారువ్రాఁతకు దిగడంతోనే చట్టన విరమించారు. అప్పుడు నేను "తనకుఁదాఁగాక తగునె యితరులయాశ?" అనుకొని స్వయంగానే వ్రాఁతకు దిగి యేదో వ్రాశాను. ఏదో అయింది. అది అన్యత్ర విస్తరించి వుండడంచేత యిచ్చట స్పృశించి వదలడమయింది. ఆ కోపంతో నన్నేకాక అభిప్రాయం యిచ్చిన పండితులనందఱినిన్నీ తూఱుపాఱఁబట్టుచూ గురువుగారు "దురుద్ధరదోష శృంఖలము" అను పేరుతో వకపుస్తకం వ్రాసి అచ్చొత్తించారు కాని ప్రకటించక నిల్పివేశారు. నిల్పిన దానిలో సంగతులు నీకెట్లా తెలిసేయియని శంక రావచ్చును. దాని నీ క్రింది పద్యములు చెప్పును గాన నుదాహరిస్తాను.

(ఇటీవలిచర్య నుండి )

తే.గీ. ఏగవలసి గుంటూరికి నేగినాఁడ
నచట, పళ్లె పూర్ణప్రజ్ఞుడను కవివరు
నింట నిది చిక్కెనా, కెటులేగె నటకు
నిది, తుదకు నక్కవీంద్రుఁడు నెఱుఁగననియె.

ఈ చిక్కినది గురువుగారి పొత్తము, అని తెలియఁదగు.

తే.గీ. ఒప్పులనుగూడి తప్పులందోలి వ్రాసి
పైని పడఁదిట్టినట్టె యద్దానిమీఁద
ఖండనము వ్రాసి పండితాఖండలులకు
నతఁడు చూపి యభిప్రాయ మందికొనియె.

క. వారలలో నేనొకరుఁడ
నేరము నా మీఁద లేమి నిక్కమయేనిం
బ్రారంభమయ్యెఁ గోపం
బూరక నామీద గురున కోరిమిలేమిన్

క. ఇఁక నొక విశేష మలపు
స్తకమది తమపేరఁ బ్రకటితంబగు నేనిన్
బ్రకటింపక నా హృదయం
బకలంకచరిత్రు నతని నావలి కనుతున్.

తే.గీ. అట్లు గాకున్న కతన నాకెట్లు దప్పి
కొనఁగ వీలిక యందలి గుణవిహీన
భావ మన్యపండితులతోపాటు స్పష్ట
పఱచినాఁడ, దురుద్ధరప్రతిభ మెఱయ.

ఆ.వె. దానిఁగాని దానితోనున్న యితర పం
డితులవ్రాఁత గాని ఋతమయంబ
యగుటఁ ద్రోచిపుచ్చ నలవిగామి యెఱింగి
కూడఁ గోప మాఁపికొనఁగరాక.

విస్తరము ప్రకటించిన తర్వాత దానియందే చూస్తారుగదా. నాతో పాటు అభిప్రాయ మిచ్చిన పండితవరేణ్యుల నామము లిక్కడ వుదాహరించడం మంచిదనుకుంటాను (1) బ్రా॥ శ్రీ॥ శ్రీపాద లక్ష్మీనరసింహశాస్త్రులవారు, శ్రీ పిఠాపుర సంస్థాన విద్వాంసులు. (2) బ్రా॥ శ్రీ॥ వేదుల సూర్యనారాయణశాస్త్రులవారు, శ్రీ పిఠాపుర సంస్థాన విద్వాంసులు. (3) బ్రా॥ శ్రీ॥ ఓలేటి వేంకటరామశాస్త్రులుగారు, పీఠికాపుర సంస్థాన కవీశ్వరులు. (4) శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారు – డిటో. (5) శ్రీయుత వడ్డాది సుబ్బారాయకవిగారు, కవిశేఖర బిరుదాంకితులు. (6) శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహ కవిగారు, డాక్టరు బిరుదాంకితులు. (7) బ్రా॥ శ్రీ॥ కాశిభట్ల బ్రహ్మయ్యశాస్త్రులుగారు, విమర్శకాగ్రేసరులు. (8) చిలుకూరి సోమనాథశాస్త్రులుగారు, తుని సంస్థానం విద్వాంసులు. (9) దువ్వూరి నాగేశ్వరశాస్త్రుల వారు. యింకా మఱికొందఱు పెద్దలూ పిన్నలూ అభిప్రాయముల నిచ్చియున్నారు. విస్తర భీతిచేత వుదాహరించడం లేదు. ఆయీ వుదాహరించిన పండితులలో కొందఱిపేరు విన్నంత మాత్రాన్ని యెవరికైనా భయం పుట్టి తీరాలి. అట్టి సందర్భంలో మా గురువుగారి ధైర్యమేమో నాకు గోచరించడం లేదుగాని, వీరి వ్రాఁతను ఖండించడానికి పూనుకున్నారు. ఖండించారు. అంతేకాకుండా వారి వారిని పూర్తిగా తృణీకరించారు. అచ్చొత్తించారు. తుదకు యేంతోఁచిందో ప్రకటించడం మాత్రం మానేశారు. మంచిపని చేశారని నేననుకున్నాను. సంతోషించాను. ఆ పుస్తకం పేరే “దురుద్ధరదోషశృంఖలం”. అదే నాకు గుంటూరిలో దొరికింది. యితరులను గూర్చి

గురువుగా రేం వ్రాసేరో అది ప్రస్తుతం కాదు. నన్ను గుఱించి ముక్త్యాల విషయంలో యేంవ్రాశారో అది యిచ్చట వుదహరిస్తాను.

"చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు.... వీరికి నా యందు అనిర్వ్యాజ మైన ప్రేమ. "అంతేవాసిని నేను గృష్ణకవి కత్యంతమ్ము నాయందు నా-యంతర్వాణికిఁ బ్రేమ మగ్గలము" అని ముక్త్యాలరాజావారి యొద్దఁ బద్యరూపముగాఁ జెప్పియున్నారు. మఱియు ముక్త్యాల రాజాగారితో నా విషయమేమో చెప్పి యేమో చేసినారు. పాలకొల్లువారితో నాకుఁగల భారత సంబంధము త్రెంచుకోవలయునని నాకెంతో ప్రోత్సాహము చేసినారు...."

గురువుగారు వ్రాసిన వాక్యములలో మొట్టమొదటిదిన్నీ, తుట్టతుదిన్నీ నేను చేసిన పనులే. నేను వారి శిష్యుణ్ణనిచెప్పిన దసత్యమా? యావత్తు భారతమున్నూ శ్రీరాజావారికే కృతిగా వుండాలనే కోరికతో నేను యత్నించిం దసత్యమా? యింక "ముక్త్యాలరాజావారితో యేమో చెప్పి" అన్నమాట కర్థమేమో విచారించాలి. దీనికి శ్రీవారి విశ్వకర్మ శిష్యుని మాటలు వ్యాఖ్యానప్రాయంగా వున్నాయి. ఆ మాట లుదాహరిస్తే ఆ సూత్రానికర్థం బోధపడుతుంది.

(మ.రా.రా.శ్రీ ఓగిరాల సుబ్బారావుగారి వుత్తరము నుండి)

హైదరాబాదుదక్కన్, 21-8-32.

....ఒక విశ్వకర్మ.... నేనును మరికొందరు స్నేహితులును కలిసి యతనితో మాటలాడుచున్న సందర్భమున మీరు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి శిష్యులనియు, అట్లుగానైన యుండియు ముక్త్యాలరాజాగారితో శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులుగారు దుర్మార్గులనియు మొదలగున వేవియో చెప్పి కృష్ణమూర్తిశాస్త్రులుగారు భారతము వ్రాయుటకుగాను పైరాజావారిచ్చు నెలవేతనము నాపుచేయించి మీ గురువులయందు మీరు కృతఘ్నుతనుజూపి యుండిరని యొకనేరమును మోపి నిర్భయముగా నన్నాడు......."

ఈ మాటలలో నేమాత్రమున్నూ విశ్వకర్మ శిష్యుని స్వకపోల కల్పితం లేనియెడల గురువుగారి సూత్రమునకిది భాష్యమవుటకు సందేహం లేదు. పాపం, అతఁడేంచేస్తాడు? యేదో గురువుగా రనఁగా విన్నాఁడు, నిజమే అనుకొన్నాఁడు. సొంతమాటలతో యేకరువు పెట్టేడు. ఆఖరికి నేను ముక్త్యాలలో చేసిన ప్రయత్నం "పుణ్యాని కెడితే పాప మెదురైన" ట్లయింది. యిందలి యుక్తాయుక్తములను చదువరులకే విమర్శించడానికి వదిలిపెడతాను. నేను కృతఘ్నుత్వాన్ని గూర్చి విస్తారంగా పెనుగులాడి పుస్తకాలు వ్రాసి జీవితంలో చాలాభాగం దానికోసమే వినియోగించిన వాణ్ణవడంచేత "తప్పులెన్నువారు తమ తప్పు లెఱుఁగరు"

అన్న వేమన్నగారి సూక్తిని నాయందుపట్టించడం సుళువు కనుక యీ తోవను గురువుగారు తొక్కేరనుకోవలెనా? యేమనుకోవలెనో నాకు బోధపడడం లేదు. యీ అపవాదాన్ని శ్రీ ముక్త్యాలరాజావారే పోగొట్టడానికి అర్హులు కాఁబట్టి శ్రీవారినే ప్రార్థిస్తున్నాను.

అయితే నేను శ్రీవారి సన్నిధిని శ్రీమా గురువుల కొఱకు పద్యాలు చెప్పి ప్రయత్నించేటప్పుడు యింకా చాలామంది వున్నారు. వారెవరేనా కలిగించుకొంటే కలిగించుకోవచ్చు. అందులో శ్రీయుత హరి నాగభూషణంగారేమి, శిష్యుఁడు వేటూరి ప్రభాకరశాస్త్రియేమి, శ్రీవారి సంస్థానంలో వుద్యోగిగావున్న శ్రీ చల్లా సూర్యనారాయణమూర్తి గారేమి, వీరిలో యెవరు వ్రాసినా వ్రాయవచ్చును. వీరిలో తుట్టతుది వారు మా గురువుగారికి చాలా మిత్రులు, భక్తులు, మొదటి యిరువురున్నూ కాని ఇటీవల నిన్న మొన్న నాగభూషణంగారు శత్రుకోటిలో చేరినట్లు వజ్రాయుధపత్రిక వల్ల తెలుస్తుంది. ముక్త్యాల గాథకు పూర్వమే ప్రభాకరశాస్త్రికిన్నీ గురువుగారికిన్నీ ఏదో వాదోపవాదాలు జరిగినట్లు పత్రికలో చదివినట్లు జ్ఞాపకం. అందుచేత వారిమాట అంత ప్రమాణం కాదనుకొంటాను. తుట్టతుది వారిక్కూడా యీలాటి దేదో వున్నట్లే యెప్పుడో గురువుగారి ప్రసంగం వల్ల తేలినట్లు జ్ఞాపకం. యెవరెందుకు వ్రాయాలి, గురువుగారు వ్రాసిన పొత్తములో వున్న సంగతులు నిలిచేవనే నమ్మకం గురువుగారికే లేదేమో అని వారు దాన్ని సర్వ సంసిద్ధంచేసి కూడా ప్రకటించకపోవడం వల్లనే బుద్ధిమంతులు తెలుసుకుంటారేమో! యింకా దానిలో నన్ను గుఱించి చిత్రవిచిత్రంగా గురువుగారు లిఖించారు.

"వనంవారు, కొల్లాపురమునకు తీసికొనివెళ్లి మహారాణిగారిచే వేయిన్నూట పదాఱు లిప్పింతునని చెప్పి యున్నారేమో! ఆహా! ధనమెంత చెడ్డది!"

చూచారా? కాకున్నధనాశ యెంతచక్కగా వివరించారో గురువుగారు? "మాతాపుత్ర విరోధాయ హిరణ్యాయ నమః" కదా! యింకా చిత్రమైన మాట లున్నాయి. చూడండి. "ఈవ్రాఁత చిలకమర్తివారి యుపన్యాసధోరణిం బోలియున్నది. బంధుత్వమూరక పోయినదికాదు." నిజమే. నా రెండవతోబుట్టువు చిలకమర్తివారి యాఁడుపడుచే. బంధుత్వము నేను గురువుగారికి జంకి వదలుకుందా మంటే వదులుతుందా? యిదిగాక నాకు శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి యెడల నిజమైన ప్రేమకలదు. నా సమకాలికులలో ఆయన కవిత్వమునందేమి, శ్రీ దాసు శ్రీరాములగారి కవిత్వమందేమి, ఆదిపూడి ప్రభాకరరావుగారి కవిత్వమందేమి, మఱి కొందఱి కవిత్వమందేమి నాకెంతో అభిమానం.

తే.గీ. భరతఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేఁగదూడలై యేడ్చుచుండ
తెల్ల వారను గడుసరి గొల్లవారు
పిదుకుచున్నారు మూతులు బిగియఁగట్టి.

ఈ వక్క పద్యంతో సమానమైన పద్యం నేను చెప్పఁగలనో, లేదో, అనుకొంటూ వుంటాను. ఆయన మతాన్ని నేను ప్రేమించేవాణ్ణిగాను, ఆయన కవిత్వాన్ని ప్రేమిస్తాను. ప్రేమించనే అనుకోండి, లోకం నిందించదా? యీ విషయం నే నీవేళ వ్రాసేది కాదని శ్రీ మా గురువుగా రెఱుఁగుదురు. గురువుగారి భారతాన్ని గుఱించి రాజమండ్రిలో గురువుగారి ప్రతిపక్షులు ఆక్షేపించే సందర్భాన్ని సమర్థించడానికి సభ అవడం, దానికి నే నధ్యక్షుఁడుగా వుండడం, కొంత వ్యాసంలో వుటంకించే వున్నాను. ఆ సభ తరవాత మూఁడేసి నెలల కొక్కొక్క సభ చొప్పున పెట్టుకోవడమూ, యేదోవక కవి కబ్బాన్ని విమర్శించడమూ, అని గురువుగారే చాలాప్రయత్నించి కొంతపని చేశారు. పయికి ప్రయత్న మేలావున్నా, అంతరంగంలో చిలకమర్తివారి గ్రంథాలకొఱకే యీ యేర్పాటు.

శ్రీ నాళంవారి సత్రంలో వకనాఁడు పెట్టేరు. బ్ర॥శ్రీ॥కాశిభట్ల బ్రహ్మయ్యశాస్త్రులగారే దానికి అధ్యక్షులు. ఉపన్యాసకులో? బ్ర॥శ్రీ॥ కొంపెల్ల సుబ్బారాయశాస్త్రులుగా రొకరు, పుల్లెల శ్రీరామశాస్త్రులుగారొకరు. మ॥రా॥రా॥ నాళం కృష్ణారావుగా రొకరు, మాగురువుగారొకరు, నే నొకణ్ణి యింతమట్టుకు జ్ఞాపకం వుంది. ఇంకా కొందఱున్నా రనుకుంటాను. నేను తలతిప్పుగావుండి కూడా గురువుగారికి కోపం వస్తుందని వచ్చానుకాని వుపన్యాస పీఠానికి చాలాదూరంలో సత్రపుసావిడిలో వింటూ పడుకున్నాను. ప్రసన్న యాదవాన్ని విమర్శించడానికి వుపన్యాసకులు మొదలుపెట్టేరు. మొదటి నుంచీ సభలో అల్లరి కొంచెం ప్రారంభమయింది. దానితోపాటే అడిచినుకూ పొడిచినుకూకూడా మొదలెట్టింది. తుదకు "గాలీవానా వస్తే కథే మారుతుం" దని అనుకొన్నానుగాని, అలా జరగలేదు. క్రమంగా అల్లరిమాత్రం హెచ్చింది. నన్ను కూడా వుపన్యాసపీఠ మెక్కమని బలవంతం చేశారు. భయపడుతూ భయపడుతూ యెక్కేను. ఎందుచేత? వట్టి అల్లరితో సరిపోయేటట్టు ఆ ధోరణి లేదు. సరే. యెక్కిందే తడువుగా శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహకవి గారి కవిత్వంలో నేఁడుపన్యాసకులు చూపించిన దోషాలలో వకటిన్నీ నిలచేవి కావన్నాను. ఆమాట వినడంతోనే సభలోనుంచి "హియర్, హియర్" అనే మాటలు వినవచ్చాయి. ఈ మాట నేను ముఖప్రీతి కన్నది గాదు. నిజముకూడా అంతేను. గురువుగారు, ఇదేమిట్రా వీఁడీలా మొదలెట్టే డనుకుంటూ వున్నారని వ్రాయనక్కరలేదుగదా? నేను నా ధోరణి

నాపనేలేదు. నాధోరణి నాదే. వాది దౌర్బల్యమేకాని వాదదౌర్బల్యముండదు కదా? సుమారు పావుగంట కాలము అదే రీతిని సాగించాను. మాతరపువారి కష్టంగానే వుంటుందిగాని సభ్యులకు చాలా సంతోషంగా వుంది. అట్టి సంతోషమే నేను నాఁడా సభ్యులక్కలిగించకపోతే, ఆఖరు వుపన్యాసకుణ్ణి గనుక నేను, అందఱి ప్రత్యామ్నాయ నాకు "తస్యప్రహరణాలు" తప్పవన్నమాటలో అతిశయోక్తి లేశమున్నూ లేదనుకోండీ. రాజమండ్రిలో శ్రీ వీరేశలింగం పంతులువారి తరువాత చిలకమర్తివారి మీఁదనే నూటికి తొంబదితొమ్మిది మంది కభిమానం. అట్టి చిలకమర్తికవిని కేవలము దురుద్దేశముతో అవమానించడాని కేర్పడ్డసభలో నేనుగాదుగదా నన్ను పుట్టించిన బ్రహ్మదేవుఁడేనా వ్యతిరేకంగా మాట్లాడి మానప్రాణాలలో దేన్నో వకదాన్ని కోలుపోకుండా యివతలికి వస్తాడనుకోవడం కేవలం పిచ్చిగాక మఱేమి?

ప్రకృతం వినండి. తాగుమోతు ప్లీడరులాగా నేను శత్రుపక్షాని కనుకూలించే మాటలు మాట్లాడుతూవుంటే గురువుగారు వగయిరాలు నన్ను తరువాతేనా చీవాట్లు పెట్టకుండా వుంటారా? అందుచేత వారినీ సంతోష పెట్టాలిగదా? అందుకోసం మళ్లా జందేన్ని మఱో బుజం మీఁద కెక్కించాను. లక్ష్మీనరసింహకవిగారు ఇంగ్లీషులో చేసినంతకృషి సంస్కృతంలో చేస్తే బాగా వుండేదని మృదువుగానే చెపుతూ కొన్ని దురుద్ధరదోషాలు చూపెట్టడానికి మొదలు పెట్టేను. సభ్యుల కంతకుముందు నా మీఁద కలిగిన అనుగ్రహం దానిచేత పోతుందేమో అనుకున్నాను గాని లేశమున్నూ పోనేలేదు. అది అదృష్టం. "బ్రదుకు జీవుఁడా" అని వుపన్యాస పీఠాన్ని దిగేశాను.

ఆ రాత్రి వక పెద్ద సంపన్న గృహస్థింటిలో నేదో గొప్ప విందు. అక్కడికి శ్రీ లక్ష్మీనరసింహంగారున్నూ వచ్చేరు. పలుకరించాను. యీ సభా సందర్భాన్ని ఆయన అదివఱకే విన్నారు. మాటల సందర్భంలో, మీరు నిష్పక్షపాతంగా మాట్లాడేరఁట అని నాతో ఆయన అన్నారు. ఆయన కూడా మంచి ధారణాశక్తిగల కవే కనుక యెవరేనా అడిగితే ఈ సంగతి చెపుతారేమో ఆ యీ సంగతి శ్రీ మా గురువుగారు మొదలైనవారందఱికీ జ్ఞాపకం లోనే వుంటుందని నేనుకుంటాను. ఆ యీ విషయాలన్నీ మ॥రా॥రా॥ నాళం కృష్ణారావుగారేమి, బాలదారి నారాయణదేవుగారేమి, తూ.చా. తప్పకుండా చెప్పఁగలరను కుంటాను. వీరు మా గురువులకు ముఖ్యమిత్రులేను.

యింకా నన్ను గుఱించి గురువుగా రాగ్రహంతో లిఖించిన అక్షరాలు కొన్ని చూపి చదువరులకు విసుగు కలిగిస్తాను, క్షమించండి. "పద్యములని పేరుగాని పద్యములు గావఁటఁ అంతకన్న మిన్నగాఁ దాను వెలిగించిన పద్యములున్నపుడు చూతము." అంతకన్నంటే యెంతకన్న, అనుకున్నారు? వనం సీతారామశాస్త్రుల్లుగారిని తాము దూషిస్తూ

శ్లోక పంచక నిరాకరణంలో తుట్టతుదిని వ్రాసిన పద్యాలకన్న అని యర్థము. వారు యెట్టు వ్రాసినా గురుస్థానం గనుక చెల్లుబడి అవుతుంది. నేను వ్రాస్తే లోకం వప్పుకుంటుందా? అందుచేత నేను నమస్కరించి వూరుకోవలసిందే. అంతతో మాత్రం వారికి సంతుష్టి కలుగుతుందా? కాఁబట్టి "అయ్యా! నేను వ్రాయలేను" అని వ్రాస్తే బాగుంటుంది కనుక అలాగే వ్రాస్తాను. నే వూరుకున్నా యే శిష్టా వారో బయలుదేరుతారేమో? వద్దు మహారాజా వద్దు. నా మనవి చిత్తగించండి. శిష్టావారున్ను, పరిమి వారున్నూ తెచ్చిపెట్టినదే నాకీ చిక్కు. వీరి వ్రాఁతలో నా పేరు చేర్చడం వల్లనే గురువుగారికి కోపకారణ మారంభమయింది. ముట్నూరివారు కూడా కొంతనిమిత్తం కాకపోలేదుగాని ఆయన ధర్మమా అని నా పేరుమాత్రం ఎడిటోరియల్లో తలపెట్టలేదు. అందుకాయన్ని మెచ్చుకోక తప్పదు.

అంతలో కొల్లాపురం గోల వచ్చింది. దానితో నేను గురువుగారికి పూర్తిగా శత్రుపక్షంగా మాటినట్లయింది. మీ పుణ్యమాయెగాని బాబూ! మీ రూరుకోండి. తరువాయి చిత్తగించండి.

"ఇట్లు వ్రాసినంత మాత్రఁదామొక మహర్షులై మడిగట్టుకొన్న వారు కాలేదు.... కామేశ్వరీ శతక మంతయుఁబర దూషణమే కదా? నీతులు చెప్పటకేమి?....."

దీని కేంవ్రాయను? నేను వ్రాయడ మెందుకు? గ్రంథం పెరగడానికే కదా? అది అలాటిదే యేమో? చిట్టచివరి వాక్యం కూడ పరిశీలించండి.

"వనంవారు మహారాణీగారితోఁ దప్పుగాఁ జెప్పుట చేతనే వారు నాకు దయచేయింతుమనిన.... పారితోషికము నాకు రాకపోయినది. ఇట్టి మహాదోషమునకుఁ గారకులు వనంవారు. వారిం గూర్చి యెట్లు వ్రాసినను దప్పు లేదనియు... వేంకటశాస్త్రిగా రెఱుగుదురు గాక.!"

ఈ వాక్యంతో గురువుగారు చేసినపని యెట్టిదో స్పష్టమయింది గదా. అభిప్రాయ మిచ్చిన వారిమీఁద కోపించడమెందుకు? సరే, అసలు గాథ వినండి.

ముక్త్యాలలో నున్నన్ని నాళ్ళూ గురువుగారి కొఱకే యత్నిస్తూ వుండేవాణ్ణి. ఇదివరలో వుదాహరించిన వేమూరి నారాయణరావును కూడ యీ విషయంలో శ్రీ రాజావారితో మనవి చేయవలసిందని ప్రోత్సహించాను. అతఁడు కూడా సమ్మతించాఁడు. మా గురువుగారు కూడా ఇటీవల రాజమండ్రిలో నారాయణరావుతో కలసి మాట్లాడేరు. ఆ రోజున మేము ముగ్గురమున్నూ శ్రీయుత యెఱ్ఱగుంట్ల సుబ్బారావు (పెన్షన్ డిప్యూటీ మేజిస్ట్రేటు) గారింట విందుకు వెళ్లినట్లు కూడా జ్ఞాపకం. శ్రీ సుబ్బారావు పంతులుగారికిన్నీ

నారాయణరావునకున్నూ మిక్కిలి దోస్తీ. ఆతఁడు ముక్త్యాల వెళ్లి సంధానం చేస్తానన్నాఁడు. కాని కొంత ఆలస్యం అయింది. అంతలో గురువుగారు తొందరపడి స్వయంగా శ్రీ రాజావారి దర్శనానికి వెళ్లేరు. వారు గౌరవించారు. యేదో జరిగింది. ప్రధానాంశం మాత్రం ఫలించలేదు. మరల నాతో విషయం చెప్పారు. ఉత్తరాలు వ్రాయమన్నారు. వ్రాశాను. జవాబు బెడిదంగా వచ్చిందికాని అనుకూలంగా రాలేదు. స్వయంగా మళ్లా వెడదామంటే అనారోగ్యంచేత వెళ్లలేకపోయాను. యిదే నేను చేసిన తప్పు. ఇదే నా అపరాధం. శ్రీ రాజావారు నా వుత్తరాల కిచ్చిన జవాబుత్తరాలు నేను యెప్పటి కప్పుడు గురువుగారికే యిచ్చాను. అలా కానిచో యిందుదాహరించే వాణ్ణే. యీ సంగతి గురువుగా రెఱిఁగినదే.

ముక్త్యాల రాజావారు, యెవరో వక సన్న్యాసి చాతుర్మాస్య వ్రతార్థంగా తమ గ్రామానికి రాఁగా, దాన్ని నిమిత్తంగా పెట్టుకొని యింత మంది కవి గాయకాదులను రావించి వరుసగా కొన్నాళ్లు భగవదారాధన చేస్తూ కాలక్షేపం జరిపినారని యిది వఱలో వుదాహరించిన పద్యాల్లో చివర సీసపద్యంవల్ల తెలుస్తుంది, కాని అప్పుడాయా యీ పండితులకు శ్రీ రాజావారెట్టి సత్కారాలు చేసినదిన్నీ అందులో తేలదు. అది ముఖ్యంగా వ్రాయవలసిందే. దాతలు లోకంలో బహుమంది వున్నారు కాని యీ దాతృత్వమే వేఱు. ఒక్కొక్కరికి నాలుగేసి నూటపదహార్లు. మూఁడేసి నూటపదహార్లు యీ ప్రకారంగా యిస్తూ, అధమం విద్యార్థిగా వచ్చిన వాడికిన్నీ అర్ధనూట పదహాఱుకు తక్కువకాకుండా యిస్తూ అంతటితో సరిపెట్టక పట్టుదోవతులు మంచి వెలగలవి యిస్తూ, వాటితోపాటు వెలగల సేలంచాపులు గూడా యిస్తూ సమ్మానించడం చూచి, కాస్త గోచీ పెట్టింది మొదలు ప్రతి గ్రహణంతప్ప యెఱుఁగని నేను అత్యాశ్చర్య పడ్డాను. కవిత్వం చెప్పేవాళ్లని, “యేదో అతిశయోక్తి చెప్పేదులే” అంటూ చాలామంది తృణీకరిస్తూ వుంటారుకాని, యిలాటి దాతని గూర్చి చెప్పకపోతే దోషం వస్తుందో రాదో చెప్పండి. అప్పు దందఱితో పాటున్నూ నేను కూడా ఆ సమ్మానాన్ని పుచ్చుకొని మాట్లాడక యింటికి వచ్చేశానే కాని యేమిన్నీ నోరుమెదల్పనేలేదు. కాని యిలాంటి మహాదాతను గూర్చి వ్రాయక పోవడం తప్పని మాత్రం మనస్సులో అప్పుడప్పుడు బాధగా వుండేది. ప్రసక్తిలేనివ్రాంత బాగుండదు గదా!

అలా సుమారు రెండేండ్లు గడిచాయి. అంతలో చి॥ మా పెద్దకుఱ్ఱనికి వివాహమున్నూ చిన్నతనికి వుపనయనమున్నూ తటస్థించినవి. యీ శుభకార్యాలకు పరిచయం వున్న అందఱు జమీందార్లతోపాటు శ్రీ ముక్త్యాల రాజావారిక్కూడా వక శుభలేఖ వ్రాశాను. వెంటనే నూట పదహార్లు మనియార్డరు వచ్చింది. రెండిటికీ రెండు నూటపదహార్లని కూడా జ్ఞాపకం. అది మొదలుకొని యీయనకు శుభలేఖ వ్రాయడమంటే భయమేయడం

మొదలు పెట్టింది. లోకంలో బోలెఁడు జమీందార్లున్నారు. యితర ప్రాంతాల మాటల్లా వుంచండి, మన ప్రాంతంలోనే అనుకుందాం. ఆ జమీందార్లను ఆశ్రయిస్తే యేదోకొంత లాభం వారివల్ల పొందితే పొందవచ్చు, అదేనా దృశ్యాదృశ్యమే. యిదేమిటి అత్యద్భుత మనిపించింది. అయితేయేమి, నా జీవితంలో మిక్కిలి క్రొత్తగా వున్న విషయం వర్ణించి ప్రకటించనేలేక పోయానుగదా అన్న జిజ్ఞాస నన్ను బాధిస్తూనే వుంది.

అంతట్లో చి॥ రెండవకుఱ్ఱనికి స్వల్పకాలంలోనే శారదాబిల్లు గడబిడలో వివాహం చేయవలసివచ్చింది. నేను శారదాబిల్లుకు జంకే కేవల చాదస్తుల్లో పూర్తిగా చేరేవాఁడను కాకపోయినా, పెండ్లికొడుకులు దొరక్క వెతుక్కునేకాల మవడంచేత, కన్యకలుగల సంపన్న గృహస్థులు బలవంతం పెడితే పదేళ్ల కుఱ్ఱనికి వివాహం చేయడానికి కంగీకరించాను. యీ అంగీకరించడానికి నన్ను లోఁకువచేసి తొందరగా పైఁబడుతూవున్న ముసలితనం కూడా వకకారణం. జాతకచర్యలో టూకీగా ఈ వివాహ విషయం వ్రాశాను. శారదాబిల్లుకు నీ వెందుకు జంకవంటారేమో! నేను రజస్వలా వివాహమే అవసరమైతే దాన్నే చేదామనుకొనే తెగలో వాణ్ణే. ప్రభు శాసనాన్ని బట్టి చేస్తున్నాం గనుక అందువల్ల వచ్చే పాపం మనలను ఘటించదని కూడ నా నమ్మకం. యిదిన్నీ కాక, మన దేశంలో అనాదిగా క్షత్రియులు రాజర్షు లనిపించుకున్నవారు రజస్వలా వివాహమే జరిగించినట్లు తెలుస్తోంది. వాళ్లందఱూ నరకానికి వెళ్లి మనం మాత్రం మోక్షానికి వెడతామా అని కూడా నావూహ. సీతాదేవికి వివాహంనాఁటికి, పదేళ్లు దాటనే లేదనిన్నీ, ద్రౌపదికింకా అప్పటికి, అనఁగా స్వయంవరం నాటికి, అయిదేళ్లు నిండలేదనిన్నీ సమర్థించేవారితో వాదించడానికి నాకు వోపికలేదు గాని, నేను మాత్రం మూఢనమ్మకం మీఁద ఆ వివాహాలన్నీ రజస్వలావివాహాలే అని నమ్ముతాను.

ప్రసక్తి సందర్భాంతరములోకి వెడుతూ వుంది. మా కుఱ్ఱనికి వివాహం అన్నది ప్రస్తుతం. ఆ వివాహానికి శ్రీ లక్ష్మీనర్సాపురం జమీందార్లకు ద్రవ్యం నిమిత్తం పద్యాలు వ్రాస్తూ శ్రీ ముక్త్యాలరాజాగారిని గూర్చి యిట్లు వ్రాశాను.

చ. చనుటకు శక్తిచాలమి వెసన్ గరపత్రము లంపినంతనే
ధనమిడు ఱేఁడులుం గల రుదారులు కొందఱు నాకు, వారిలో
ఘనుఁడల వాసిరెడ్డికులకాంతుఁడు శ్రీశశిమౌళి యొక్కఁ; డై
నను నటు వ్రాసి పుచ్చుటకు నామది సిగ్గిలు రామయాంబికా.

యెవరిని గాని యెదురుగుండా నిజమైన విషయానికైనా స్తోత్రం చేయడం చాలాకష్టంగా వుంటుంది. అది వినడమునకున్నూ అసలువారి కాలాగే వుంటుంది. అందుకే కవులు ఆలాటి సందర్భాల్లో ఆయా వుదార పురుషులు తల వంచుకున్నట్టుగా కబ్బాలలో చిత్రిస్తూ వుంటారు. నేను శ్రీ ముక్త్యాలరాజావారిని గూర్చి కూడా ఆ కారణంచేతనే యెదురుగా యేమీ చెప్పలేక, యితర సందర్భంలో ఆ మాటమాత్రం సూత్రప్రాయంగా వ్రాసి కొంత ఋణవిముక్తి చేసుకున్నట్టు సంతోషింపఁగలిగితిని. కాని యింకా తృప్తి తీరిందికాదు, చిన్నతని పెండ్లికి కూడా జంకుతూ జంకుతూ శుభలేఖ వ్రాశాను. ఆ శుభలేఖ శ్రీ దొరవారికి శ్రీ చల్లపల్లిలో తమ మేనల్లుని వివాహ సందర్భంలో వుండఁగా అందిందనుకుంటాను. ఆ చల్లపల్లి యువరాజుగారి వివాహ సందర్భంలో నాకు ఆహ్వానం వచ్చింది. యింకా అప్పటికి వారం పదిరోజులు మా చిరంజీవి వివాహము వ్యవధిలో వుండడంచేత వెళ్లఁగలిగితిని. అక్కడ శ్రీ ముక్త్యాలరాజావారే సర్వమును నిర్వహించేవారు. తమ మేనల్లుని వివాహసందర్భంలో ఆఱువందల రూపాయిలు బహుమతిగా యిప్పిస్తూ, పైఁగా, తమస్వంతమునుండి వకనూట పదహాఱు అలాయిదాగా యిచ్చారు. వివాహ సమయంగనుక ద్రవ్యం అప్రయత్నంగా నా దృష్టికి విస్తారంగా లభించడానికి సంతోషంగానే వుందిగాని, యేమిటో మనస్సులో మాత్రం కొంచెము సందేహంగా ఉండడం మానలేదు. ఎందుకురా ఈ సందేహం, అని అట్టే ఆలోచించుకున్నాను. మొదట స్థూలదృష్టికి, ద్రవ్యప్రతిగ్రహం వల్లనేమో అనుకున్నాను. అయితే మనకీ ప్రతిగ్రహం లేని దెప్పుడు? జన్మదారభ్యాయిదే వృత్తిగదా అని మళ్లా తర్కించుకున్నాను. వితర్కించుకుంటే యీ సందేహం యిప్పుడేకాదు, మొదటి నుంచీ అంతో యింతో వున్నట్లే పొడకట్టింది. దాని కింతకు పూర్వం, అనఁగా శుక్ల సం॥రములో గనుక యీ సందర్భం, అప్పుడికి సుమారు ముప్పదియేళ్లనాఁడు రచించిన శ్రీ కామేశ్వరీ శతకంలోని యీ పద్యం కొంత తోడ్పడింది కనుక దాన్ని వుదాహరిస్తాను.

> మ. బలి పాడాయెను, గర్ణుఁడుం జెడియె, విప్రస్వాము లర్థించుకో
> ర్కెల నీఁబూని మఱెవ్వఁ డెట్లు నిలుచున్, బృథ్వీస్థలిం దాత గా
> వలదం ద్రజ్ఞులు గొంద, ఱిందుఁగల లాభంబింత గుర్తింప, ఠి
> క్క లికాలం బిటు కాలుచున్నయది దిక్కా ? మొక్క? కామేశ్వరీ.

ఇందులో దాతృత్వమం దేమోలాభమున్నదని ప్రయోగింపఁబడింది. ఆ లాభ మేమిటంటే : సంతోషమే. ఆ సంతోషాన్ని బలిచక్రవర్తి వివరించాడు. "నూత్న మర్యాదంజెందు కరంబు క్రిందగుట మీఁదై నాకరంబుంట మేల్గాదే" అని.

మొత్తం తేలిన సారమేమిటంటే, యీ విషయంలో నిజమైన, దాతకు ఆనందం వుంటుందనిన్నీ, కొంచెం వ్యక్తికల ప్రతిగృహీతకో, సంకోచంగా వుంటుందనిన్నీ సహృదయులు గ్రహిస్తారు. ప్రస్తుతానికి వద్దాం. నిరంతరమున్నూ ప్రతిగ్రహమే చేయుచుండడ మట్లుండ, దానికై పుట్టిన బ్రాహ్మణవంశమందు జన్మించిన నాకు శ్రీ ముక్త్యాలరాజావారి దాతృత్వము సందేహాన్ని కల్గించింది. చల్లపల్లిరాజావారు చాలయెక్కువ ధనమిచ్చినా, సంశయం లేకుండానే ప్రతిగ్రహించాను. వీరిచ్చిన దంతకన్న తక్కువైనా ప్రతిగ్రహించి సిగ్గుపడినాను. ఎందుచేత? ఇప్పటికి సుమారు సంవత్సరన్నఱనాఁడు శుభలేఖ పంపినంత మాత్రాన రెండు నూటపదహారులు మనియార్డరు పంపె, మళ్లా యిప్పుడు నూటపదియాఱు లిచ్చె, పెద్దరాబడిగల అనేక జమీందార్ల యీవికంటె యీ యీవి నా కెందుచేతనో ఆశ్చర్యం కలిగించింది. పోనీ చేతనైన పనిగదా, ఏవో కొన్ని పద్యాలు చెపుదామంటే ద్రవ్య మిచ్చినప్పుడు చెప్పిన పద్యాల కంత విలువయుండదనిన్నీ సంశయం కలిగింది. ఎప్పుడూ నీ వాలాటి పద్యాలే చెప్పనేలేదా? అంటే : చెప్పకేంగాని, యేదో వున్నంతలో కాస్తయుక్తా యుక్తం విచారిస్తూండడం మాత్రం వుంది. అంతేకాని చెప్పకుండా యెక్కడ నెఱవేఱింది? తుట్టతుదకు శ్రీ ముక్త్యాలరాజావా రొసఁగిన నూటపదహార్లు గ్రహించిన తర్వాత కూడా యెదుటనేమీ చెప్పలేదుగాని, యేమైతే అదయిందని యీ క్రింది పద్యాలు చెప్పి పంపించాను. యివికూడా అచ్చైయున్నప్పటికీ ప్రసక్తి కలగడంచేత ఇక్కడ ఉదాహరిస్తాను.

మ. నృపతు ల్లేరని కాదుగాని మఱి ముక్తీశ ! నీవంటి దా
నపరుల్ మృగ్యులు, నాఁడు నీ పురమునన్ సన్న్యాసికిన్ భక్తిమై
నుపచారమ్ములొనర్చు నుత్సవమునం దోహో ! భవత్పాణి ప
ద్మపు సౌభాగ్యము నేమిచెప్పవలెఁ దత్తద్దానముల్ సేయుచో. ౧

మ. ఎవరో మస్కరి వచ్చెనే యనుము మీ కృష్ణాస్రవంతీ తటం
బవలోకింప; నమస్కరించియు సపర్యల్ జల్పినం జాలుఁగా!
కవులన్ గాయకులన్ దదన్యులను వేడ్కం బిల్వఁగా నేల? త
ద్వ్యవసాయమ్మునకంత యీవి యిడనేలా? చంద్రమౌళీశ్వరా. ౨

మ. అది నీవెప్డు పఠించితో తెలుపుమయ్యా నాకు, నాముక్తమా
ల్యదలో వ్రాసెను గృష్ణరాయలు మహౌదార్యస్వరూపంబు, నీ
కదియుం గాదనుకార్య, మాతఁడు భవిష్యద్వేత్తయై వ్రాసెనం
చెదనూహింతు భవద్వదాన్యతకు నీ డెచ్చోట నేఁగానమిన్. 3

మ. కొమరున్ బెండ్లికొమారుఁ జేసినపుడో; కూఁతున్ వివాహోఖ్య భ
ద్రమహాపీఠి నలంకరించినపుడో, తత్తాదృగుద్దామ దా
తృమహత్త్వంబు సమర్థ నీయమగు, నంతేకాని సన్న్యాసిభై
క్ష్యమునాఁ డింతవ్యయమ్మొనర్చెడి వదాన్య శ్రేష్ఠులున్ గల్గిరే. ౪

మ. ఒకనూఱాఱిడఁ జాలదొక్కొ? మఱి మూఁడో నాలుగో యిచ్చియుం
బ్రకటింపందొరకోవు తృప్తి, మఱి వస్త్రాలన్ననో? పట్టువీ
యక సామాన్యపు జాతివీయ, వుభయం బర్పించియేతీరి, తె
న్నక యెట్లుండఁగవచ్చు నీ వితరణానందంబు మౌళీశ్వరా. ౫

ఆ యీ పద్యాలల్లో వ్యాఖ్యానం చేయవలసినవేవిన్నీ లేవుగాని, ఆముక్తమాల్యదలో శ్రీకృష్ణదేవరాయలు రాజనీతి సందర్భంలో వుదాహరించిన పద్యం మాత్రం సమయానికి జ్ఞాపకం రాలేదు. చదువరులు చూచుకోవలసి వుంటుంది.

ఈ ముక్త్యాల రాజావారి దాతృత్వానికి భయపడడం చేతనే యిటీవల మా యింట జరిగిన శుభ కార్యాలకు శుభలేఖ పంపడం కూడా మానివేశాను. చల్లపల్లిలో నూటపదహారులు వీరివల్ల ప్రతిగ్రహించాక మా కుఱ్ఱని పెండ్లి జరిగింది. వెంటనే తలుచుకోని తలఁపుగా నెలలోగానే కూఁతుల పెండ్లిండ్లు తటస్థించాయి. అప్పుడు శ్రీ రాజావారికి శుభలేఖ వ్రాయడం మానలేదుగాని, తాము ద్రవ్యం పంపనక్కరలేదు, చాలా మంది జమీందార్లు సహాయం చేయడంచేత ద్రవ్యలోపం లేదు. అవసరమైనప్పుడునేనే మిమ్ము కోరుతాను, అని "షరా"లో వ్రాసినట్లు జ్ఞాపకం. యీ రాజావారి జనకసోదరు లొక పర్యాయము మా గ్రామం తోటల వైభవం చూడడానికి వచ్చినప్పుడు మా పాఠశాల చూచి శ్రీవారి యన్నగారితో మనవిచేసి రూ. 250-0-0లు నిల్వఫండు క్రింద పంపించారు. తుట్టతుదరోజుల్లో చందాలు వసూలు కానప్పుడు శ్రీవారు పంపిన ద్రవ్యము నుండే ఉపాధ్యాయుల జీతపులోటు భర్తీ చేస్తుండేవాణ్ణి. అలా భర్తీచేయడానికి వాడినప్పటికీ పాఠశాల మానివేసేటప్పటి కింకా కొంత సొమ్ము నిల్వవుంది. శ్రీరాజావారు నా పేర ఆ సొమ్ము పంపేటప్పుడు పాఠశాల వున్నంతకాలము దాని క్రింద వాడవలసిందనిన్నీ, ఏ కారణం చేతనైనా పాఠశాల ఆపుచేసేయెడల మీ స్వంతంక్రింద మీరు వాడుకోవచ్చు ననిన్నీ సర్వాధికారాలున్నూ నా మీఁదనే పెట్టి వుత్తరం వ్రాయించారు. అలావారు వ్రాయించినా ఈ ద్రవ్యం మన స్వంతంక్రింద వాడుకోకూడదని మిగిలిన సుమారు యేభై రూపాయిలున్నూ అప్పుడప్పుడు వచ్చే యాచకుల కొఱకు ఖర్చుపెట్టేను. ఇంకా సుమారు. రు. 1-8-0 కాబోలును నిల్వ వుంది. అది కూడా వాడేశాయాలి. శ్రీ ముక్త్యాలరాజావారు

నా విషయంలో యెన్ని విధాల సహాయం చేశారో కొంచెం వ్రాయడానికి శ్రీమా గురువుగారు కారణభూతు లవడంవల్ల వారికి పునఃపునః నమస్కరిస్తున్నాను. గురువుగారిటీవల నిన్న మొన్నటి నుంచి నన్ను గుఱించి యేలా వ్రాసినా, నా యందు మిక్కిలీ పక్షపాతం గలవారనుటకు సందేహంలేదు. నేను కాటవరంలో వీరివద్ద చదువుకునేటప్పుడు కేవలంగా నన్ను కుమారునికంటే కూడా యినుమిక్కిలిగా చూడడం నా కిప్పటికిన్నీ జ్ఞప్తిలోవుంది. దాన్ని గూర్చి యిప్పుడు వ్రాస్తూవున్న "ఇటీవలి చర్యలో" కూడా వ్రాశాను. చూడండి.

ఉ. ఆయనయొద్దనేరిచితి, నన్యులయొద్దనుగూడ నేర్చితిన్
"పోయెను కాలమద్ది" యనఁబోలెనె? నేఁడు ప్రయోజకుండనై
ఆయెడఁ బ్రుతుకన్న నధికాదృతిఁ జూచిన చూపు నెమ్మదిం
బాయద నాకు నిప్పటికిఁ బాండితి యెంతటిదేని గల్గినన్.

నానాఁటి కిప్పటికాలానికి యేలాగ మాఱినా, మనలో గురుశిష్య భావమనేది చాలా కట్టుబాటులో వుండేది. చూడండి, ఆయుధాలు ధరించి వొకరి నొకరు చంపుకొనే ప్రయత్నంలో వున్నప్పుడు కూడా భారతయోధు లెట్లు వర్తించారో!

(ఇటీవలి చర్య నుండి)

తే.గీ. అర్జునుఁడు కృపునొద్ద ద్రోణార్యునొద్ద
శంకరునియొద్దఁగూడ నస్త్రములు నేర్చె
నిందెవరియందు గౌరవ మించుకేని
యేమఱెనె? భారతార్థజ్ఞులిది యెఱుఁగరె

సాక్షాత్తుగా గురుత్వమే వుండనక్కఱలేదు. పరంపరాగురుత్వాన్ని కూడా మనవారు గణించేవారు. దీన్ని గుఱించి కొలఁది సంవత్సరాల క్రితం జరిగిన వక యితిహాసం "ఇటీవల చర్య" లో వుదాహరించాను. ఆ సందర్భాలలోది కూడా వక పద్యం యిక్కడ చూపుతాను.

క. గురుశిష్యభావ మియ్యది
పరంపరాప్రాప్త, మింకఁ బ్రస్తుతమగు మా
గురుశిష్యత సాక్షాత్తుగ
జరిగిన దిది కాదనంగ శంకరు తరమే.

ఇఁక ముగిస్తాను. చదువరు లొక సంగతిమాత్రం కనిపెడుతూండాలి. నాది శిష్యస్థానం. కనుక యే మాత్రమున్నూ వ్రాఁతలో దుందుడు కుండడానికీ లోకమున్నూ వప్పుకోదు, శాస్త్రమున్నూ వప్పుకోదు. కాఁబట్టి యేమాత్రం అవక తవకగా వున్నట్టు మీకు తోఁచినా వెంటనే తెల్పుతూ మందలించుటకు మీ కధికారం పూర్తిగా వున్నదన్న సంగతి నేను వేఱే తెల్పనక్కఱలేదు. అఱవైయాఱేండ్ల వయస్సులో వున్న నేను యిప్పటికి యే దోషమున్నూ చేయలేనేలేదని చెప్పనూలేను, చెపితే లోకము విశ్వసించనూ విశ్వసించదు. యింకేమిటంటే నా ధైర్యం, కృతఘ్నత్వం మాత్రం నేనెప్పుడు కలలో కూడా యెఱుఁగనని నా నమ్మకం. అందుచేత యింత దీర్ఘవ్యాసం అసమర్థస్థితిలో దినదినగండం వేయేళ్లాయుష్యం అన్నట్టుగా వుండి కూడా వ్రాస్తినిగాని, వ్రాసే శక్తి వుండి మాత్రం కాదు. లోకుల యెదుట, వున్న యథార్థాన్ని పడవేయకపోతే యీ అపవాదుతో నే పరానికి వెళ్లవలసి వుస్తుందేమో అని నాకు భయం. సామాన్యు లారోపించిందైతే గణింపవలసి వుండదుగాని యిది అట్టిది కాదని వేఱే చెప్పనక్కఱలేదు. కొల్లాపురం గొడవకు పూర్వం గురువుగారు నన్నుఁగూర్చి యెవరైనా యేమేనా అంటే వాళ్లని కొట్టడానిక్కూడా సంసిద్ధు లయ్యేవారని నేనెఱుఁగుదును. యీ కొంపతీఁతకు ఆగోల కారణమయింది. కొద్ది గొప్ప నా తెల్వితక్కువ కూడా వన్నట్లు తెల్పేవున్నాను. యథార్థమైనా నేను వారికి వ్యతిరేకంగా వ్రాయకూడదు. అయితే మాత్రం నన్ను మఱోలాగు మందలించాలనికాని అపవాద ఆరోపించడం న్యాయమా? కానివ్వండి, యిది కూడా నాకు కొంచెం వుపకారమే చేసింది. ఇదే లేకపోతే నా యితర ప్రయాణాలవలె టూకీగా జాతకచర్యలో వుదాహరించినదానితో తేలిపోక కాశీయాత్రవలె దీనికి ప్రత్యేకంగా వ్యాఖ్యానం చేయడం తటస్థించదుకదా! దీనివల్లనేకదా యెన్నాళ్లనుంచో శ్రీ ముక్త్యాల రాజావారి దాతృత్వాన్ని గుఱించి వ్రాయాలనుకుంటూవున్న నామనోరథం సఫలం అయింది. కాఁబట్టి గురువుగా రాపాదించిన అపవాదుకూడా నాకు కొంతలాభాన్నే కలిగించినదని సంతోషిస్తూ దీన్ని ముగిస్తాను.

★ ★ ★

# నా పాలకొల్లు ప్రయాణము

(15-2-1936 సంור కృష్ణాపత్రిక నుండి)

స్వస్తిశ్రీ ప్రభవ సంוו జ్యేష్ఠ శుద్ధంలో నాకు హఠాత్తుగా పాలకొల్లు ప్రయాణం తటస్థించినది. అప్పటికి పూర్వం సుమారు సంవత్సరంన్నర నుంచి జబ్బుగా వుండి వుండి రమారమీ నాలుగుమాసాల నుండి కాఁబోలు కొంత వ్యాధి తీవ్రస్థితి తగ్గి యింటిలో మట్టుకు సుళువుగా వుండఁగలుగుతున్నాను. అంతేనేకాని చొరవచేసి యే వూరికిఁగాని వెళ్ళే స్థితి యింకా అప్పటికి రాలేదు. అట్టి స్థితిలో శ్రీ మా గురుపరంపరలో నొకరగు శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులవారు చిన్న రుక్కాముక్క నొకదాన్నిచ్చి శ్రీయుత బాలదారి వీరనారాయణదేవుగారిని నా యొద్దకు పంపించారు. ఆ రుక్కాముక్కలో నిట్లుంది. “నేను పాలకొల్లు వెడుతూ వున్నాను. నీవు తప్పక రావలెను. నీవు వచ్చుటవల్ల నాకు యినుమిక్కిలిగా లాభించును” అని. యిట్లుండడమంటే యీ అక్షరాలే అన్నమాట కాదు. యీ అర్థం వచ్చే మాట లున్నాయన్నమాట. గురువుగా రప్పుడు పాలకొల్లు వెళ్లే ప్రసక్తి యేలాంటిదో శ్రీ నారాయణదేవుగారు నాతో చెప్పినారు. వారు భారతకృతి సందర్భంలో పాలకొల్లుకు వెళ్లారు. నేను వారి సెలవు ప్రకారం వెళ్లడానికి తగ్గంత ధైర్యంగా లేను. మంచిస్థితిలో వున్నప్పుడేనా నేనేదేనా పొరుగూరికి వెళ్లవలసివస్తే యెన్నో ముహూర్తాలూ, ఆనందాదియోగాలూ వగయిరాచూచికాని బయలుదేరే ఆచారంలేదు. అట్టిస్థితిలో సుస్తీగావున్నప్పుడు వెంటనే బయలుదేరడ మంటేయెట్లా? అదిగాక, ఆవేళ నవమి కూడాను. ప్రయాణనవమీ, ప్రత్యక్షనవమీ కూడదని పెద్దలంటారు. పైఁగా గురువారం కూడాను. “న గురౌ దక్షిణాం దిశం” అన్న నిషేధం సుప్రసిద్ధమేకదా? యిన్ని అసందర్భాలున్నప్పటికీ గురువుగారి మనస్సుకు వెళ్లకపోతే నొప్పి కలుగుతుందేమో అని బయలు దేరడానికి నిశ్చయించుకొన్నాను. కాని నేను వెళ్లడంవల్ల గురువుగారేదో తమకు లాభం కలుగుతుందని వ్రాసినమాటకు మాత్రం నాకు అర్థం బోధపడిందికాదు. సరే అక్కడికి వెళ్లిన తరువాత గురువుగారినే కనుక్కుందామని అనుకున్నాను. వడ్డి శిష్యుఁడు నందివాడ వెంకటరత్నానికి ఆవూళ్ళో చుట్టా లుండడంచేత అతఁడు కూడా వస్తానన్నాడు. చిరంజీవి నా రెండవ కుఱ్ఱ దుర్గయ్యనీ, పైనిచెప్పిన వడ్డీ అతణ్ణీ వెంటఁబెట్టుకొని పాలకొల్లు ప్రయాణం చేశాను. రాత్రి తొమ్మిదిగంటల సుమారువేళ మోటారుదిగి వారినీ వారినీ అడుగుతూ గమ్యప్రదేశానికి

వెళ్ళేము. అక్కడ శ్రీ గురువుగారు లేరు. మఱునాఁడే సభ కనుక దాని నిమిత్తం ఆహ్వానించడానికి పెద్ద మనుష్యుల దర్శనార్థం నర్సాపురం దయచేశారు. ఈ స్థితిలో నన్నక్కడ చూచేవా రెవరు? “ఊరు నాకు క్రొత్త, ఊరికి నే క్రొత్త.” నేనా వూరు వెళ్లి అప్పటికి ముప్పైయేండ్లకు తక్కువ కాలేదు. భోజనంవేళ అప్పటికే దాటింది. అట్టిస్థితిలో మేము వెళ్లిన యింటి అరుగుమీఁద వక పిల్లవాఁడు పుస్తకం చేతcబట్టుకు యేదో చూస్తూ కనపడ్డాడు. ఆ పిల్లవాణ్ణి పిలిచి ఫలానా శాస్త్రుల్లుగారి బస యెక్కడ అని అడిగాను. అప్పుడా పిల్లాడు నర్సాపురం వెళ్లారని చెపుతూ మీరెవరని అడిగేడు. ఫలానా అని చెప్పాను. వోహో సరే తమరేనా? కృష్ణమూర్తి శాస్త్రుల్లుగారు మీరు వస్తారని చెప్పి వెళ్లారు. ప్రొద్దుపోవడం చేత యీ వేళకు రారనుకొన్నారు మావాళ్లు. అని చెప్పి లోపలికి తీసుకువెళ్లాడు. భోజనం చేశాము. ఆ వూళ్ళో దోమలబాధ విస్తారంగదా? అందుచేత పడుక్కోవడాని కెక్కడ కెడదామని ఆలోచిస్తూ వుండఁగా వడ్డి శిష్యుఁడు వాళ్లవూరి కోమట్ల చుట్టా లీవూళ్ళో వున్నారు. వారి యింటికెడితే సదుపాయంగా వుంటుందన్నాఁడు. వెడదాం పదమన్నాను. రేపాక సర్వన్నగారనే వైశ్య శ్రేష్ఠుని యింటికి తీసుకొని వెళ్లాడు. ఆ దంపతులు చూపిన భక్తీ, గౌరవమూ వర్ణనాతీతము. భారతకృతికి సంబంధించిన శ్రీ రేపాక సత్యనారాయణగారున్నూ యీ సర్వన్నగారున్నూ దగ్గఱ జ్ఞాతులే. వారియిల్లు బసగా దొకడంచేత ఆ వూళ్ళోవున్న మూఁడు నాల్గు రోజులున్నూ స్వగ్రామంలో స్వగృహంలో వున్నట్లే వుంది. ఇంతేకాక ఆ వూరి శివాలయపు అర్చకులు వెల్నాటి పూజార్లు శ్రీ శివకోటి సుబ్బయ్యగారు కూడా నన్ను మిక్కిలిగా ఆదరించారు. ఈ కారణంవల్ల కూడా వార్ధక్యదోషం అప్పుడే తొక్కికొని వస్తూవున్నప్పటికీ నాకు లేశమున్నూ ఇబ్బంది అనిపించనేలేదు.

వెళ్లిన మఱునాఁడే విష్ణ్వాలయంలో భారతకృతి సమర్పణం. యీ పని ఉదయం సుమారు పదిగంట్లకు లోఁగానే. యీలోపున గ్రంథకర్తగారిని వూరేగించడం, గురువుగారు తమతోపాటు నేను కూడా సారటులో వుండాలని బలవంతపెట్టారు. కాని నల్లమందు వేస్తేనే కాని నేను వకరి అధీనంలో వుండే యేపనికిన్నీ పనికిరాను. అందుచేత రాలేనని మనవి చేసుకున్నానుగాని అంగీకరించారుకారు. యేం రసాభాసవుతుందో అని భయపడుతూ నల్లమందు వేసుకోకుండానే వూరేగింపులోకి నేను కూడా వెళ్లి గురువుగారితోపాటు సారటులో కూర్చున్నాను. పాలకొల్లు రావలసిందని గురువుగారు నాకు కబురుచేసిన తర్వాత వారిని నేను సావకాశంగా కలుసుకొన్న దప్పుడే. రాత్రి రెండుగంటల వేళ గురువుగారు నర్సాపురాన్నుంచి వచ్చి నన్ను కలుసుకొన్నారు గాని అప్పుడు వట్టి క్షేమసమాచారమేగాని యితర ప్రసంగమేమీ జరగనే లేదు. వూరేగింపులో సారటులో కూర్చున్నది మేమిద్దరమే కనుక యేదేనా మాట్లాడుకోడానికి అవకాశం చిక్కింది.

అప్పుడు "అయ్యా! తాము నాకు వ్రాసిన రుక్కాలో నీవు వస్తే నాకు మిక్కిలిగా అనఁగా యినుమిక్కిలిగా లాభిస్తుందని వ్రాసినారు గదా! ఆ సందర్భం యెట్టిది, యిక్కడ నేను ఆ లాభించే విషయంలో యేం చేయవలసి వుంటుంది" అని అడిగేను. ఎంత గుచ్చి గుచ్చి అడిగినా గురువుగారు దీన్ని గుఱించిన మార్గం చెప్పినట్లే లేదు. అప్పుడల్లా వుండఁగా యిప్పటికీ నాకా విషయం పుస్తకాపేక్షే. వూరేగింపులో నాకు వారు చెప్పిన సంగతల్లా, ఆ కృతిని స్వీకరించే వైశ్యశ్రేష్ఠుని ఆరోగ్య భాగ్యభోగ్యాలు తప్ప వారు వ్రాసిన విషయంలో నాకు కల్గిన సంశయాన్ని నివర్తించేమాట వకటిన్నీ చెప్పనేలేదు.

వూరేగింపు ముగిసింది. పెట్టుకొన్న సుముహూర్త ప్రకారము భారతంలో రెండవ సంపుటం కాఁబోలును సభలో యేవో కొన్ని పద్యాలు కృత్యాదివి వినిపించి అంకితం యిచ్చే ఆచారాన్ని లఘువుగా నిర్వర్తించారు. అప్పుడు నేను కూడా ఆ భారత భాగంలో కృత్యాదివో మఱో భాగంలోవో కొన్ని చదివినట్లు జ్ఞాపకం. కృతినందికొనే ఆయన సభార్యకంగా పీటలమీద కూర్చుండి వైదికాచార ప్రకారముగా కృతిని స్వీకరిస్తూ శ్రీ శాస్త్రులవారికి అదివఱలో ప్రతిశ్రుత మొనర్చిన ద్రవ్యాన్ని నూతన వస్త్రాలసహితం చందనతాంబూలాలతో సహా పళ్లెంలో వుంచి సమర్పిస్తూ, యిచ్చే భూమిని కూడా వాచా యింత అని చెప్పి సమర్పించాడు. తరువాత మహదాశీర్వచనంతో అప్పటికి సభ ముగిసింది. యెవరిండ్లకు వారు భోజనాల కెళ్ళేరు.

యిఁక మధ్యాహ్నం గురువుగారి భారత ప్రశంసను గుఱించిన సభ. ఆ సభలో శ్రీనాళం కృష్ణారావుగారు, బాలవారి నారాయణదేవుగారు, మఱికొందఱు ప్రాజ్ఞులున్నూ వుపన్యాసకులు. నేను ఆఖరు వుపన్యాసకుణ్ణి. శ్రీ నర్సాపురం సబ్‌జెడ్జిగారు అధ్యక్షులని జ్ఞాపకం. శ్రీ నాళం కృష్ణారావుగారు మొదలైన వుపన్యాసకులు శ్రీకృష్ణభారతాన్ని గుఱించి విపులంగా వుపన్యసించిన తరువాత నా వంతు వచ్చింది. నేను నాకు పూర్వం ఉపన్యసించినవారి అభిప్రాయంతో పూర్తిగా యేకీభవిస్తున్నానని చెప్తూతూ నాకు తోచిన మఱికొన్ని సంగతులు చెప్పి ప్రస్తుతాన్ని బలపఱిచాను. అంతలో సభ్యులలో యెవరో కవిత్రయ భారతాన్ని గుఱించి అడిగినట్లున్నూ, దాన్ని గుఱించి ప్రస్తుతం యెత్తితే తేలదని బదులు చెప్పినట్లున్నూ, తరువాత వారి కోరికమీఁదనో లేక స్వంతంగానో గద్వాలాది సంస్థానముల విషయం కొంతసేపు చెప్పి నా వుపన్యాసాన్ని ముగించినట్లున్నూ జ్ఞాపకం. నా వుపన్యాసం ముగించేటప్పటికి రాత్రి తొమ్మిదిగంటలకు తక్కువ కాలేదు. నర్సాపురాన్నుంచి పలువురుద్యోగస్థులు వచ్చి యుండుటచే కొంత త్వరలో యెత్తుకొన్న విషయాన్ని ముగించినట్లు సభ్యులకు తోచింది. అందుచేతే కాఁబోలును నర్సాపురపువారు

యింక నొకపరి మీ వుపన్యాసాన్ని వినాలి, కాఁబట్టి మీరు నర్సాపురం తప్పక రావలసిందని కోరినారు. అట్లే మీయాదేశ ప్రకారం వస్తానన్నాను. తరువాయి సంగతి ప్రస్తుతానికంతగా సంబంధించేది కాదు. కాకపోయినా ప్రధానాంశం వ్రాసి తర్వాత తరువాయి కూడా వ్రాసి మఱి ఈ వ్యాసాన్ని ముగిస్తాను.

ప్రధానాంశమేమిటంటే; ఇంతవఱకు నేవ్రాసిన సంగతి సందర్భాలనుబట్టి చూస్తే యెవరికిఁగాని నేను గురువుగారి విషయంలో చేసిన అపరాధ మేమాత్రమేనా వున్నట్టు తోస్తుందేమో ఆలోచించాలి. యీ నావ్రాఁతే అసత్యమనికాని, యిందులో కొంత భాగం అసత్యమనికాని శంకించేయెడల నాఁటి సభ్యులలో యెవరినేని కనుక్కొని పిమ్మట ప్రధాన విషయాన్ని విమర్శించడం మంచిది. కొందఱిపేర్లు వెనుక వుదాహరించే వున్నాను. ఆ నాళం కృష్ణారావుగారుగాని, నారాయణదేవుగారుగాని యిందులో నేమాత్రమేనా వ్యత్యాసం వుంటె తెల్పకపోరని నా విశ్వాసం. జరిగిన విషయ మిట్లుండఁగాశ్రీ గురువుగారు తమ "దురుద్ధరదోషశృంఖలంలో" యేలా లిఖించారో నన్నుఁగూర్చి చూడండి. "తుదకు పాలకొల్లులో కృతిగ్రహణ సమయమున నెట్లో చెప్పుదునని యెట్లో చెప్పినారు." నాకు గురువుగారు వ్రాసిన యీ వాక్యం చూచి యిప్పటికి సుమారు నాల్గువత్సరములన్నఱ దాఁటవచ్చిననూ తాత్పర్యం బోధపడ్డదేకాదు. గురువుగారి పొత్తము చూడక మునుపు కూడా యేదో వారు నా విషయంలో అనుమానపడ్డట్టు మాత్రం వారివారివల్ల విన్నాను. విన్నప్పటికీ వెనువెంట ఆ అనుమానాన్ని నాళం కృష్ణారావుగారు మొదలైనవారు సహేతుకం కాదని తెలిపి నివర్తింపచేసి నట్లుకూడా వినివుండడంచేత సవరణయిందికదా అని సంతోషించాను. యీ అనుమానానికి ఆస్పదం గురువుగారి కెప్పుడు తటస్థించిందంటే ప్రభవ సం॥ జ్యేష్ఠంలో పాలకొల్లుసభలో కృతిగ్రహణానంతరం నేయిచ్చిన వుపన్యాసంలో కదా? వెనువెంటనేకాని కొన్ని మాసాల్లోనేకాని యిది అపోహకాని వేఱుకాదని మిత్రుల బోధవల్ల నేమి, వారంతట వారికేగాని యేమి, అవగతం అయిందని నే ననుకొని సంతోషించడానికి హేతువేమిటంటే, విభవ సం॥ వైశాఖంలో గొల్లప్రోలులో అయిన మా పెద్ద చిరంజీవి వివాహానికి శ్రీ గురువుగారు దయచేసి ఆశీర్వదించడమే అందుచేత నామనస్సులో కల్గిన పరితాపం పటాపంచలై పోయింది. పిమ్మట కొల్లాపురం గొడవ వచ్చింది. గురువుగారికిన్నీ ఆ సంస్థాన పండితులు శ్రీ వనం సీతారామశాస్త్రుల్లుగారికిన్నీ యేదో వివాద మారంభ మయింది. ఆ వివాదసందర్భంలో పండితుల అభిప్రాయా లివ్వవలసివచ్చింది. ఆ యిచ్చిన వారిలోనే కూడా చేరవలసి వచ్చింది. దానితో గురువుగారికి పట్టరాని కోపం వచ్చి నన్నేకాక ఆ పండితులనందఱినీ విమర్శించి ప్రకటించి వోడ గొడదామనే కుతూహలంతో వకపుస్తకం వ్రాసి అచ్చు వేయవలసివచ్చింది. కాని తిరిగీ

పస్తాయింపు కలగడంచేత కాఁబోలు దాన్ని ప్రకటించడం మాత్రం జరగలేదు. కాని గురువుగారు మిమ్మునుగూర్చిచాలా కోపంగా యేదో వ్రాసి అచ్చువేస్తూన్నారని తఱచు వారి వారివల్ల వినడం మాత్రం జరిగింది. చెప్పినవాళ్ల నెవరిని గాని గురువుగారు నన్నుగుఱించి యేం వ్రాస్తున్నారు, యేమంటూన్నారు అని మాత్రం నేను తపిసీలుగా అడుగనూలేదు. వివరంగా వాళ్లెవళ్లున్నూ చెప్పనూలేదు. పుస్తకం పైకి వచ్చి నపుడు చూచి అందు గురువుగారు చూపించిన దోషమేమైనా మనం చేసినట్టుంటే క్షమాపణ చెప్పుకోవచ్చునని మాత్రం అనుకొన్నాను. అంతేకాని పుస్తకం ఆపివేశారన్న మాటప్పటికి నాకు తెలియదు. పిమ్మట ప్రజోత్పత్తి చైత్రంలో శ్రీ పళ్లె పూర్ణప్రజ్ఞాచార్యులుగారి కాదంబరీ గ్రంథమును శ్రీ గ్రంథకర్తగారి మామగారు మధ్వశ్రీ అవధాని శిరోమణి కాశీకృష్ణాచార్యుల వారికి కృతి సమర్పించే సభకు నే నధ్యక్షుఁడుగా గుంటూరికి వెళ్లడం తటస్థించింది. అక్కడ పూర్ణప్రజ్ఞాచార్యులుగారి సావడిలో కొన్ని పుటలు చినిగియున్న శ్రీ గురువుగారి "దురుద్ధరదోషశృంఖలం" తలవని తలంపుగా నాకు కళ్లఁబడింది. యీ పుస్తకం నేను వారి వజ్రాయుధం పత్రికలో చిరిగిపోఁగా మిగిలిన భాగమే అనుకొన్నానుగాని వేఱేసైజులో వున్నప్పటికీ స్పెషలుగా అచ్చొత్తించినదనే జ్ఞానం నాకు మొదట కలగనే లేదు. ఇది చూచిననాఁడో మఱి రెండుమూఁడు రోజుల్లోనో నేను శాంతివ్యాసాన్ని వ్రాసి త్రోవలో బెజవాడనుంచే కృష్ణకు పోస్టుచేశాను. ఆ శాంతి వ్యాసంలో యీ శృంఖలాన్ని గుఱించిన మాట లుండడానికి కారణం గుంటూరులో నా కది కనపడడమే. దీనికి సంబంధించిన అక్షరాలు కొన్ని శాంతివ్యాసాన్నుంచి వుదాహరిస్తాను. "అది మొదలు నాయెడల విశ్వాసము తప్పి నన్ను కొండొక తరగతిమాటలతో నిరాకరింప మొదలిడిరి. ఈ నిరాకరణమును గూడ నేను గుంటూరికి పోకపూర్వము చూడనేలేదు. అక్కడనే వారి పత్రికలో చదివితిని." నేను వారి పుస్తకమును, పత్రిక యని భ్రమించినట్లు పైనుదాహరించిన అక్షరాలలో తుట్టతుదిమాటవల్ల విస్పష్టంగదా? గురువుగా రపోహపడ్డట్టున్నూ దానిని కొందఱు ప్రాజ్ఞులు నివారించినట్లున్నూ నేను ఆ వ్యాసంలోనే వ్రాశాను చూడండి.

"నాయం దిపుడు శ్రీవారికి కోపకారణ మేమని చదువరు లనుకోవచ్చును.... ఇటీవల శ్రీవారి యాజ్ఞానుసారముగా నేను పాలకొల్లు వెళ్లి అచట వారి హృదయములో నున్న చొప్పున నుపన్యసింపనేరకపోవుట యొకటియుఁగా శ్రీవారి యక్కరముల వలన నవగతమయ్యెడిని. ఈయపోహమును మ॥రా॥రా॥ నాళం కృష్ణారావుగారు లోనగు తత్రత్యప్రాజ్ఞులు పలుసార్లు చెవినిల్లుగట్టుకొని పోరి మరలించిరి. మరల నాయందు యథాపూర్వముగా అనుగ్రహము కలిగియే యుండిరి."

పైని చూపిన శాంతి వ్యాసపు వాక్యముల వలన గురువుగారి "శృంఖలము" నేను చూచి చాలారోజులైనను వారేమో అయా విషయములు ప్రమాదముగా నట్లు వ్రాసిరేకాని వేఱొకటికాదని సరిపెట్టుకొను చుండేవాణ్ణి అని తెలుచున్నదిగదా. ముక్త్యాల విషయమైన అపోహకూడా ఈ ప్రసక్తిలోనిదే. దానికి వారు నన్ను ముక్త్యాలరమ్మన్నప్పుడు అనారోగ్యంచేత నేను వెళ్లలేక పోవడమే కారణంగా అనుకొనేవాణ్ణి. యేమైనా వారి అపోహలని గుఱించి వ్రాస్తే వారి మనస్సుకు కష్టంగా వుంటుందని యెంచి యేమిన్నీ వ్రాయడానికి దిగలేదు. శాంతివ్యాసంలో కొంచెంగా స్పృశించి మాత్రం వదలిపెట్టేను.

ఇంతలో కొన్నాళ్లకు గండపెండేరపు సభ తారస మయింది. నా కప్పటికే "దినదినగండం వేయేండ్లాయుష్యం" మోస్తరులో ఆరోగ్యం వుండడం మొదలెట్టింది. కాని లోకులకు మాత్రం అంతబాగా తెలియదు. అట్టిస్థితిలో ఆ వుత్సవానికి నలుగురుతోపాటు నాకు ఆహ్వానం వస్తుందికదా! అనారోగ్యంచేత దూరస్థంలో వున్న బెజవాడకు వెళ్లలేకపోతానేమో! అని అనుకుంటూవుండేవాణ్ణి. బెజవాడల్లా రాజమండ్రిగా మాఱింది. కాని వేసవిలో అవుతుందని కూడా తెలుస్తూ వచ్చింది. అప్పుడే అయితే రాజమండ్రికి కూడా వెళ్లలేనేమో అనుకొనేవాణ్ణి. నా పాలిటిదైవం దాన్ని ఆశ్వీజందాకా నిల్పుచేయడమే కాకుండా, గురువుగారి కిష్టంలేకపోయినా దాని అధ్యక్షత తనంతట తానై నా మీఁద విఱుచుకుపడేటట్లు కూడా చేశాడు. ఆ సభలో వర్తించిన నా వర్తన సభ్యులకేకాక గురువుగారి క్కూడా తృప్తికరమయింది. దానితో గురువుగారి మనోమలిక మటుమాయమైపోయింది. అంతతో యే గొడవా లేకుండా పోవలసిందే. కాని హైదరాబాదు వారికి యెవరో యేకలవ్యశిష్యుని సంరక్షణార్థం గురువుగారు వ్రాసిన వుత్తరాన్ని వుదాహరించి విమర్శించి అచ్చొత్తించి ప్రకటించిన కాగితాలు నిన్న మొన్న నావద్దకు వచ్చాయి. అవిచూస్తే వారిదగ్గిఱ నే చదివిన చదువును గూర్చి నేను అబద్ధమాడినట్లొకటిన్నీ, ముక్త్యాలలో ద్రోహం చేసినట్లొకటిన్నీ, పాలకొల్లులో మోసం చేసినట్లొకటిన్నీ, వెరశి మూఁడు దోషాలు మనోవాక్కాయములచే సుతరామున్నూ నే యెఱుఁగనివి నా మీఁద వున్నట్లు తేలింది. యీ మూఁడింటిలోనూ వకటి వుత్తరం వల్ల స్థిరపడుతూ వుంది. తక్కిన రెండున్నూ శ్రీ గురువుగా రచ్చొత్తించిన్నీ నిష్ప్రయోజన మనుకొనోయేమో అణఁచి పెట్టిన పుస్తకంవల్ల స్థిరపడుతూన్నాయి. విమర్శకులైనవారు వీటి నిజానిజాలను విమర్శించి తేల్చుకో గలిగినా, సర్వులున్నూ అట్లా తేల్చుకోజాలరుగదా అని మూఁడింటికి మూఁడు వ్యాసాలు వ్రాసి సంగతి సందర్భాలు తెలుపవలసి వచ్చింది. ఆయా సంగతులు తెల్పినంత మాత్రంలోనే నేను నిరపరాధి నవుతానని కాదు గాని లోకమేదో నిశ్చయించడానికివి కొంతవఱకయినా ఆధార మవుతాయికదా అని నా యాశ.

యిఁక వెనుకటి తరువాయి టూకీగా వుదాహరించి దీన్ని ముగిస్తాను. కృతిసమర్పణం శుక్రవారం ఉదయం జరిగింది. నాఁటి మధ్యాహ్నం విష్ణ్వాలయంలో నా ఉపన్యాసం నలుగురితోపాటుగా జరిగింది. కాని అడ్వర్టైయిజమెంటు లోపంచే గ్రామంలో చాలమందికి తెలియనే లేదని పలుమంది అన్నారు. అందుచేత శనివారం శివాలయంలో నా ఉపన్యాసానికింకొక సభ కావాలని యత్నించారు. యీ సభకు మొట్టమొదటి కారకుఁడు నా చిన్నతనంలో సుమారు పదిపంద్రెండేండ్లు మా కుటుంబము కాపురంగా వున్న యానాం కాపురస్థుఁడున్నూ ప్రస్తుతం పాలకొల్లు కాపురస్థుఁడున్నూ అయిన వక కోమటిబిడ్డయే అన్నది ముఖ్యాంశం. యితనికెట్లో నా రాక తెలిసి మఱునాఁడు వెతుక్కుంటూ నా బసకు వచ్చి "నేను ఫలానా" అని చెప్పి కుశలప్రశ్నలు వగయిరాలయిన తర్వాత మీకు బహుమాన మేమాత్రమన్నాఁడు. నా కిక్కడ బహుమతీ జరగడాని కేమిన్నీ ప్రసక్తి లేదనిన్నీ నేను ఫలానా సందర్భంలో వచ్చాననిన్నీ చెప్పాను. కాని అతనికి సంతుష్టి లేనట్లు నాకు తోఁచింది. తరువాత అతఁడు రాక రాక మీరీవూరు వచ్చారు, వృథాగా వెళ్లకూడదు. సభ కావాలి, అనడానికి మొదలెట్టేడు. దానికేం మఱొకప్పుడు వస్తానన్నాను. కాని అతని మనస్సుకు తృప్తి కలిగినట్లుమాత్రం నాకు తోఁచలేదు. పిమ్మట అతఁడు వాళ్లింటికి వాళ్ల వాళ్లంతా నన్ను చూడడానికని వెంటబెట్టుకు వెళ్లాడు. చిన్నప్పుడెఱిఁగిన వాళ్లవడంచేత చూడడానికి నాకున్నూ కుతూహలంగా వుంది. వెళ్లాను. అతనితల్లి కొంత వృద్ధురాలు. నన్ను చూచి చిన్ననాఁటి నాచేష్టలు జ్ఞాపకం చేస్తూ ప్రస్తుతపు నా కుటుంబస్థితిగతులు నడిగి తెలిసికొంటూ మిక్కిలిగా సంతోషించి నన్నాదరించింది. తరువాత బసకు చక్కా వచ్చాను. బస దాఁకా ఆపూర్వ పరిచితుఁడు దిగఁబెట్టి యింటికి వెళ్లాడు. మళ్లా యింకొక కాపుగృహస్థును వెంటఁబెట్టుకొని మధ్యాహ్నం రెండు గంటల వేళ నా దగ్గఱికి వచ్చి, యీ వూళ్ళో మీరింకొక సభ చేయకుండా వెళ్లడానికి వల్లకాదు, నిన్న మీ వుపన్యాసం వుందన్నమాట వూళ్ళో యేకొందఱికో తప్ప సర్వే సర్వత్ర తెలియక పోవడంచేత చాలామంది రానేలేదు, అని చెప్పడానికి మొదలేశాడు. నేను అతనితో రేపు నరసాపురం వెళ్లక తప్పదు. వస్తానని చెప్పివున్నాను. యీ రోజుననే అయితే చిక్కులేదు, అని జవాబుచెప్పాను. అతఁడు కొంతప్రయత్నం చేశాడుగాని నంత అడావడిచేత ఆవేళ సభకు షాహుకార్లెవరూ వచ్చేటట్టు లేకపోయింది. అప్పుడు నర్సాపురానికి వెళ్లి "ఆదివారం కూడా మా వూళ్ళో సభ అయితేనేకాని శాస్త్రుల్లుగా రీవూరికి రావడానికి వీలులేదు" అని వారితో వినయంగా శ్రుతపఱిచి "మాకు సోమవారం వచ్చినా సరే అయిదు గంటల తర్వాత జరిగేది కనుక ఆవేళకు అందఱికీ తీరిక అవుతుం" దని అనిపించుకొని వచ్చినాఁడు.

ఆదివారం శివాలయంలో పెద్దసభ జరిగింది. ఆ సభకు మాగురువు గారున్నూ ఆహ్వానింపఁబడి దయచేసి కొంతసేపు కూర్చుని సభ పూర్తికాకుండానే యేదో పనివుందని కాఁబోలునుచెప్పి బసకు వెళ్లారు. అంతకుముందు విష్ణ్వాలయంలో జరిగిన సభలోఁగాని నాఁటి శివాలయపు సభలోఁగాని గురువు గారికిఁగాని వారి భారతానికిఁగాని వ్యతిరేకించే మాట వకటేనా మాట్లాడినట్టు నే నిప్పటికిన్నీ యెఱుఁగను. ఎందుచేత గురువుగారట్లా వ్రాశారో అనుకుంటూ వుంటాను. అన్నిటికీ కారణం కొల్లాపురపుగాథే అని నా వూహ. గురువుగారేదేనా అపరాధకారణాన్ని నిరూపిస్తే అది సత్యదూరం కానిదే. అయితే, యిచ్చిన వుపన్యాసాన్నిప్పుడేలాగా సర్దుకోలేను గనుక క్షమాపణేనా చెప్పి నిర్దోషుణ్ణి కావాలని యిప్పటికిన్నీ నావూహ. కాలుజాఱితే సర్దుకోవచ్చుగాని నోరుజారితే సర్దుకో రాదుగదా "నోరా! వీపుకు దెబ్బలు తేకే" అని పెద్దలూరికే అన్నారా? వీపుకు దెబ్బలంటే ప్రస్తుతం "యదనంతర" న్యాయంగావచ్చిన అపవాదమే అనుకోండి.

శేషం వినండి, టూకీగానే ముగిస్తాను. సభ పూర్తి అయింది. సేలువులు, నూఱార్లు సత్కరించారు. కొందఱు సంపన్న గృహస్థులు షాహుకార్లు వారివారి గృహాలకు ప్రత్యుత్థానంగా తీసుకువెళ్లి వెలగల నూత్న వస్త్రాలూ, పదులూ యిరవయిలూ రూపాయిలూ, చందన తాంబూలాలూ, తుతాపూరుజాతి మామిడిపండ్లూ యిచ్చి సమ్మానించారు. యీ సమ్మానానికంతకూ కారణం ఆ వైశ్యగృహస్థే, యితఁడాగ్రామంలో వున్న ధనికులలో సహస్రాంశానికేనా పోల్చతగ్గవాఁడు సుతరామున్నూ కాఁడు. యానాంలో నేనుండే రోజుల్లోనైనా నాతో కలిసి మెలసి తిరిగిన వాఁడనుకోవడానికిన్నీ తగిన కారణాలు లేవు. యితని తండ్రి నా యీడువాఁడైతే కావచ్చునేమో కాని యితఁడు కాఁడు. తుద కితని పేరు కూడా నాకు తెలియదు. నా దగ్గఱికి వచ్చినప్పుడు కూడా, నీ పేరేమని నే నడగనే లేదు. యెందుచేత? అతఁడేమో ప్రీతిగా వచ్చి నన్ను పెద్దచుట్టాన్నిగా ప్రత్యుత్థానం చేస్తూంటే నేను "నీ పేరేమి" టని అడగడం బాగుండదని పేరుకూడా నేనడగనే లేదు. యితని తండ్రిపేరు సోమరాజని జ్ఞాపకం. యింటిపేరు మాత్రం మాజేటివారు. పాలకొల్లు లక్షాధికార్లను చెప్పి చెప్పడానికి వల్లకాకపోయింది గాని యానాం షాహుకార్లలో కొంత గణనీయమైన కుటుంబమే. యానామునుంచి పాలకొల్లు రావడాని క్కారణ మేమిటో తెలియదు. షాహుకార్లలో మన ప్రక్కవా రెవరేనా కాపురానికి యానాం వెళ్లడానిక్కారణం కలుగుతూ వుంటుంది. అంతేకాని యానాన్నుండి వచ్చేకారణం కలుగదు. కలిగినా అది అప్రతిష్ఠా హేతువుల్లో చేరదు. ఈ కోమటిబిడ్డ వల్ల నాకు పాలకొల్లులో అప్పుడు "యెఱుక పిడికెఁడు ధన" మన్న సామెత తార్కాణం అయింది.

ఇక్కడ యింకొక మాట వ్రాస్తాను. పరిచయమన్నది బాగానే అనఁగా గాఢంగానే వున్నప్పటికీ అది దగ్గిఱలోకన్న దూరంగా అయితే గణ్యతలోకి వస్తుంది. దగ్గిఱలోనే అయితే అంతగా పనిచేయనిదిగా వుంటుంది. అంటే అంత లెక్కలోనికి రాకుండా వుంటుంది. ఇంకా నా మనస్సులో వున్న అభిప్రాయం పూర్తిగా రాలేదని నాకనుమానం. వినండి. మనం లండను వెళ్ళేమనుకోండి. అక్కడ మన వూరివాఁడు కాక మనచుట్టుపట్ల వూరివాఁడొకఁ డేదో జాతివాఁడే కనపడతాఁడనుకోండి. వాణ్ణి చూచేటప్పటికి మనకి ప్రాణం లేచివస్తుంది. అదే మన గ్రామ సమీపంలో అయితే వాణ్ణి పలకరించనే పలకరించం. ప్రస్తుతం యీ కోమటిబిడ్డ యానాంవిడిచి వచ్చాక యానాం మనిషిని యీ పాలకొల్లులో చూడడమే తటస్థించలేదనుకొంటాను. నేనీరోజుల నాఁటికి యానాంవాణ్ణి కాకపోయినప్పటికీ పూర్వం యానాం వాణ్ణవడంచేత అతనికి నన్ను చూచేటప్పటికి అపరిమిత సంతోషం కలిగి వుండును. ఆ సంతోషమే ఆయీసభా సందర్భానికి హేతువుకావాలి. అతనికి తోడుగా పనిచేసిన కాపెవరో యిప్పటికిన్నీ నేను తెలిసికోలేక పోయాను. అతఁడు మాత్రం నన్ను చిన్నప్పటినుంచీ యెఱిఁగినవాడిలాగ మాట్లాడేడు. యెన్నో అట్టపుట్టాణాల్లు వుటంకించాడు. వాట్ల వల్ల కూడా నాకు కాస్తేనా యాదుకు రానేలేదు. అతఁడు సామాన్యమైన గృహస్థు. బీదవాఁడే అని తోఁచింది. యీ సభ సమావేశ పఱచడంలో యానాపు కోమటిగేస్తుకన్న యితని చాకచక్యమే యెక్కువ పనిచేసినట్లు తోఁచింది. యితఁడేం చదువుకొన్నాడో తెలియదు కాని, వాగ్ధాటి మాత్రం చాలామంచిది. యితనికి చదువుకొన్నవాళ్లంటే ప్రాణమే. పేరుదాహరించవలసిందే కాని బొత్తిగా జ్ఞాపకం లేదు. సుమా రెనిమిదేళ్ల నాఁటి సంగతి యేం జ్ఞాపక ముంటుంది? నాకీ ప్రయాణమును గుఱించి యీలా వ్యాసం వ్రాసే ప్రసక్తి కలుగుతుందని లేశమైనా తెలిసివుంటే యివన్నీ జ్ఞాపకం వుంచుకొనేవాణ్ణేమో! గురువుగారునేనేమో పాలకొల్లులో ద్రోహం చేసినట్లు వ్రాయడంచేతగదా ఇది వ్రాయడం తటస్థించింది! వారు మాత్రం యీ ప్రసక్తి వూరికే కలిగించారాయేమిటి? నావుపన్యాసంలో బందరు ఫిరంగిలోవలె నానాతుక్కున్నూ దొర్లుతుంది. ఆ వఱదలో యేదో వారికి అనుమానాని క్కారణమైందేమో? నేను అంతో యింతో కవినిగాని వుపన్యాసకుణ్ణి గాననడంలో అసత్యముండఁగూడదు. అవధానాలు మానేసిన తర్వాత నన్నెవరేనా ఆదరించడానికి పూనుకుంటే యేదో వుండాలి కనుక యీ నాటకం పెట్టుకున్నాను. అవధానాలరోజుల్లో నీవు బొత్తిగా వుపన్యాసాలే చెప్పలేదా అంటే, చెప్పేవాణ్ణికాని ప్రధానం కవిత్వానికే గాని అన్యానికి లేదన్నమాట. తిరుపతిశాస్త్రుల్లుగారు స్వర్గస్థులైన తరువాత నేను పూర్తిగా వుపన్యాసకుఁడుగా మాఱాను. యింకొకటి, వుపన్యసించి నంత సేపున్నూ సభ్యులు కదలకుండా అల్లరి చేయకుండానే వుండి వింటారు. కాని నా వుపన్యాసంలో

తాత్కాలికానందమే గాని చిరస్థాయిగా వుండే సంగతులంతగా వుండవని కొందఱు హూణభాషా కోవిదు లనుకుంటూ వుండఁగా విన్నాను. యిది సత్యమే కావచ్చును. నేనేమైనా నిజమైన వుపన్యాసకుణ్ణా యేమిటి? రెండెడ్లబండిక్కట్టే జోడులో వకటిచస్తే ఆ బండివాఁడికి మళ్లా తిరిగి యెద్దు దొరక్కపోతే మిగిలిన యెద్దుతో వంటెద్దు బంతి వ్యాపారాన్ని సాగించినట్లు భగవంతుఁడు నన్ను వుపన్యాసకుణ్ణిగా వుపయోగించు కొన్నట్లనుకోవాలి. కాని, కొద్దిరోజుల నుండి ఆవుపన్యాసానికిన్నీ నా శక్తి పనికిరావడం లేదు.

అది యట్లుండె. వుపన్యాసకుఁడు గానివాణ్ణి వుపన్యాసకుఁడుగా దేవుఁడు మారిస్తే మాత్రం వుపన్యాసకులకుండే మహాలక్షణాలన్నీ పడతాయా యేమిటి? "మాఱు మనువుదాన్ని కట్టుకుంటే మొదటి మొగుడు సోది మొదలెట్టిం" దన్నట్టు నా వుపన్యాసంలో కవిత్వ సందర్భాలు రాక మానవనుకొంటాను. అనఁగా వ్యంగ్యాలూ గింగ్యాలూ తఱచుగా వుంటాయన్నమాట. ప్రస్తుత మేమిటంటే, నా వుపన్యాసంలో యేమాటేనా గురువుగారికి అనుమానం కలిగించిందేమో! నాకు మాత్రం యిప్పటికిన్నీ తెలియనే తెలియదు. గురువుగారు మాత్రం వారితోనూ వారితోనూ అనడమేకాని నాతో యెప్పుడేనా అన్నారు కనుకనా తెలియడానికి. వారెవరెవరితో అన్నారో వారందఱున్నూ గురువుగారితో యేకీభవింపనివారే అని మాత్రం వారివారి వల్లనే విన్నాను. యింతవఱకు విన్నావుగదా. యే మాట వారి కనుమానం కలిగించిందో అది మాత్రం యెందుకు వినలేదంటారేమో! చెప్పిన వారంతే చెపుతూ వచ్చారు. నేనున్నూ అంతే విని వూరుకుంటూ వచ్చాను. తబిసీలుగా తెలుసుకోవలసిన ఆవశ్యకత లేకపోయింది. యెందుచేత? లోకులే సమాధాన పఱుస్తూన్నప్పుడు యీ బాధ మనకెందుకని. యెవరో యెందుకు? శ్రీ యినుగంటి ప్రకాశ రాయనింగారు నిన్న మార్గవశాత్తుగా యెక్కడికో వెడుతూ నా క్షేమం కనుక్కోవడానికి మా వూళ్ళో ఆగి మా యింటికి దయచేశారు. దయచేసే టప్పటికి నేను కూర్చుని లేచే స్థితిలో లేను. నడున్నొప్పి మిక్కిలి బాధిస్తూ ఉండడంచేత కూర్చుంటే కూర్చుండడమే, పరుంటే పరుండడమే, నిల్చుంటే నిల్చుండడమే అన్నట్లున్నది నా స్థితి. ఇంటికి వచ్చిన పెద్ద మనిషిని అవమానించినట్లవుతుందని యేలాగో వోపిక తెచ్చుకొని వీధి అరుగుమీఁదకు వచ్చి వారితోపాటు కూర్చుని ప్రస్తుతం వ్రాస్తూవున్న "ఇటీవలిచర్య" వినికి చేశాను కూడాను. వినికి చేస్తూండఁగా నాకు హఠాత్తుగా తోఁచిందిగదా; యీ దొరకు మనయందు మిక్కిలీ అభిమానం. స్వయంగా ఆహ్వానించి అన్నవరం దేవుడికి ఆస్థానకవులని పేరు పెట్టియేటా నూటపదాహార్లు చొప్పున సుమారు యిరవై యేళ్లనుండి ముట్టచెప్పడమే కాకుండా, యింకా యెన్నోసార్లు యేదో నిమిత్తం కలిగి నంతనే నూట పదార్లిచ్చి గౌరవించడం అలా వుండఁగా,

రోజూ అధమం వకమాటేనా నన్ను తలపెట్టకుండా వుండరని యెంతమంది వల్లనో వింటున్నాను. ఎవరో యెందుకు, యీ సంగతి శ్రీ గురువుగారుకూడా సుమారు నెలరోజులనాడు చెప్పారు. యింతగా నన్నభిమానిస్తూ వుండే యీయన విషయంలో మన మేమిన్నీ చేతనైన ప్రత్యుపకారం చేయనే లేకపోయాముగదా అని తోఁచి, యుక్తకాలం గతించింది యిప్పుడేమనుకుంటే యేం లాభమని పస్తాయించి, యేనాఁటి కానాఁడుగా వ్రాయుచున్న "ఇటీవలిచర్య" అనే పుస్తకాన్ని కృతి యిద్దామని నిశ్చయించి ఆయనతో కూడా చెప్పినట్లు జ్ఞాపకం. మనంతట మనం యిచ్చేటప్పుడు మనకాయన అంగీకారంతో అవసరమే ముంటుంది? ధనాపేక్షతో చేసేపనేమన్నా అయితే అంగీకారం లేనిదే లాభించదేమో అనుకోవాలి. యిది కృతజ్ఞతకుగాను మనంతట మనమై ఋణం తీర్చుకొన్న మోస్తరుగా చేసేపని గనుక ఆలాటి సందేహాలతో లేశమున్ను అవసరం వుండదుగదా? ప్రసక్తాను ప్రసక్తంగా యింకోటి యిక్కడ వ్రాస్తూ వున్నాను. సుమారు రెండు నెలలనాఁడొక హరికథకుఁడు నావద్దకు వచ్చి, అయ్యాఁ మీ జీవిత చరిత్ర హరికథగా వ్రాయడానికి నాకు మీరు సమ్మతి నిప్పించవలసిందంటూ కోరేడు. దానిమీఁద అబ్బాయీ హరికథల కీలాటి లాకలూకాయి చరిత్రలు పనికిరావు, ఆ కథల మాదిరి వేఱు, అదిన్నీకాక అచ్చుపడి వున్నదాన్ని బట్టి నీవు వ్రాసుకుంటానంటే నేను అడ్డడానికి నాకేమధికారం వుంది? వున్న సంగతిమాత్రం యిది అని బదులు చెప్పేను. అతఁడు వ్రాస్తాడేమో? నాకు సుతరామున్నూ యిష్టం లేదు. ఇదివఱలో అతఁడు వ్రాసినదాన్ని చూస్తిని, రసాభాసంగా కనబడింది. మనక్కూడా అదేగతి పడుతుందేమో అని భయం. చరిత్రలో అవక తవకలున్నా గ్రంథకర్త సమర్థుఁడైతే యెట్లోవాట్లను తోళ్లను బాగుచేసినట్లు బాగుచేసి లోకానికి ప్రదర్శిస్తాడు. అట్లుకాకపోతే మంచి విషయాన్ని కూడా చేతగాని గాయకుఁడు త్యాగయ్య కీర్తనలమీఁద కూడా అసహ్యత కలిగించినట్లు చేస్తాడు. యెట్లు చేసినా వద్దనడానికి మాత్రం మనకధికారం లేదనుకుంటాను. కాని ఇప్పటికాలంలో లీగల్‌గా యేమేనా ఆధారం వుంటుందేమో! అది నాకు తెలియదు. దొరగారిక్కూడా యిష్టం లేకపోతే నాలాగే యేదేనా పత్రికలో వ్రాయించనే వ్రాయిస్తారు గాని కొట్టరు గదా! అనే ధైర్యంతో కృతిమాత్రం పెట్టదలఁచుకొన్నానన్నది ప్రస్తుతం. ఆవూహతో శ్రీ ప్రకాశరాయణింగారికి 'ఇటీవలిచర్య'లో కొంత వినిపిస్తూ మా గురువుగారు నా మీఁద ఆపాదించిన అపవాదాలని గూర్చి కూడా వినిపిస్తూ వుండఁగా ఆయనతో కూడా మాగురువుగారీ ప్రసక్తిని శ్రుతపతిచినట్లున్నూ దానికితాము సమ్మతింప నట్లున్నూ నిన్న శ్రీ దొరవారు కూడా సూచించారు. యిందఱు సమ్మతింపని విషయంలో యీ యసమర్థతా స్థితిలో యీ వ్యాసాలెందుకని చదువరు లనుకోవచ్చును గానీ "అప్రతిషిద్ధ

మనుమతం భవతి” కనుక వూరుకుంటే నేను కూడా సమ్మతించినట్లే అవుతుందేమో అని వ్రాయవలసివచ్చింది. యిలా వ్రాసినంత మాత్రంచేత నిజంగా వున్న కళంకు పోతుందా? పోదు. వ్రాయకపోతే మాత్రం, లేనికళంకు అంటుతుందా? అంటదు. కనుక నా యీ ప్రయత్నం “రక్తేవిరక్తేచ వరే వధూనాం నిరర్థకః కుంకుమపత్రభంగః” అన్న శ్రీ లీలాశుకుని సూక్తి కుదాహరణమే అయింది. కానివ్వండి. ఆ లీలా శుకుఁడూర కున్నాఁడా? శ్రీకృష్ణునిగానం చేయలేదా? నేనున్నూ శ్రీకృష్ణగానమే చేస్తున్నాను. తప్పేమి? యిందు పునరుక్తికూడా బాధించదు. శేషం వినండి. సోమవారం నర్సాపురం వెళ్లేము. నాఁడొక వుపన్యాసం యివ్వడమయింది. కాని సభ్యులంతతో తృప్తిపడక యింకొకటి కావాలన్నారు. మఱునాఁడు కోర్టులో సాక్ష్యముందని చెప్పాను. ఫరవాలేదు మళ్లా సమను చేస్తారన్నారు. వారి మాట తీసేయలేక ఆగి మఱునాఁడు కూడా వుపన్యాసమిచ్చి వారిచేకూడా యించుమించు పాలకొల్లులో వలెనే సమ్మానింపఁబడి సపుత్రకంగా, సచ్ఛాత్రకంగా, సుఖంగా, యింటికి వచ్చాను. ‘కథ కంచి కెళ్లింది.”

★ ★ ★

# శాస్త్రిగారి "క్షమాపణ"

(25-1-1936 సంఖర కృష్ణాపత్రిక నుండి)

చదువరులారా! నేను వ్రాసే సంగతులన్నీ అవసరమైనవే అయినప్పటికిన్నీ శిష్యస్థానంలోని వాణ్ణవడంచేత మన ఆచారాన్నిబట్టి తప్పక పోవని యెఱిఁగి వుండడంచేత ఆదోషం కొంతేనా పోతుందని శీర్షిక అలా పెట్టేను గాని యిదిన్నీ "చంక దుడ్డు శరణార్థి" అన్న సామెతను జ్ఞప్తికి తెచ్చే వ్రాఁతే. గురువుగారు సమాధానం అని వ్రాస్తూ "అది నా ప్రమాదమేమో నని నీవు సమాధానపడవచ్చునే?" అని వక వాక్యం నావిద్యాభ్యాస విషయంలో హైదరాబాదుకు తాము వ్రాసిన వుత్తరంలోని "మాఖాంతము వఱకు" అనే సందర్భాన్ని నివారించేదాన్ని వ్రాశారు. దీని వల్ల శ్రీవారివద్ద నేచేసిన విద్యాభ్యాసాన్ని గుర్చి జాతకచర్యలో నా వ్రాసిన వ్రాఁత అసత్యం కాదని లోకులకు బోధపడుతూవుంది. గురువు గారిప్పుడీ మాట వ్రాయడంవల్ల లోకులకు తెలుసుకోవడాని కవకాశం కలిగిందిగాని లేకపోతే కలుగదుగదా! నేను ఆ యీ వ్యాసాలు వ్రాయఁబట్టిగాని వూరకే గురువుగారీ వాక్యాన్ని ప్రచురింపరుగదా! అందుచే నా వ్యాసాలు "నవ్వులపాలవుట" కని గురువుగారు వ్రాసిన యీ క్రింది వాక్యాలన్నీ అర్థం లేనివేమో పరిశీలించండి. (1) తవ్వుకోవడం పూడ్చుకోవడం పిచ్చివాళ్లపనిగాని మనపనిగాదు. (2) వ్యాసాలు వ్రాసి పత్రికలు నిండించడానికి ప్రయత్నింపకుము. (3) నవ్వుబాట్ల పాలు గాకుము. ఇది హితబోధమని నమ్ముము. ఇది యిలా వుంచి "సమాధాన పడవచ్చునే" అని వ్రాస్తారే గురువుగారు. నా సమాధానం కోసమా యీ చర్చ, నా జాతకచర్యలో వున్న నా విద్యాభ్యాసపు వ్రాఁతను చదివిన వాళ్లు గురువుగారి హైదరాబాదు వుత్తరాన్ని కూడా చదివితే కలిగే సంశయాన్ని పోగొట్టడం కోసమా, అన్నది యిట విచార్యం. ఇప్పుడు చదువరుల కాసందేహం తొలఁగుతుంది. నేను ధన్యుణ్ణి. నా వ్యాసాలు పుట్టక పోతే తమ రామాట యెందుకు వ్రాస్తారు? "నాऽపృష్టః కస్యచిద్బ్రూయాత్" కదా?

యిఁక నేను నవ్వులపాలు గావడాన్ని గుర్చి నేను యితరుల క్కూడా శిష్యుణ్ణయినప్పటికీ తమకున్నూ శిష్యుణ్ణేకదా? అగుచో విద్య మాత్రమే కాక మఱికొన్ని అభ్యాసాలు పట్టుపడడానికి లోకులు విశ్వసిస్తారు. (1) కవిగండ పెండేరాల వృద్ధి -

౧౫- తన్నాశః -౨ (2) రాజులేని అమెరికాదేశంలో కింగ్సుకు లెక్క లేదు. అయిల్ కింగు... మన ఆంధ్రభూమిలో, కింగ్సేమిటి? సార్వభౌములు, చక్రవర్తులూను - కవిసార్వభౌములు, శిల్పసార్వభౌములు, ... తామరతంపరగా పెరుగుతూన్నారు. పై సందర్భాలు కృష్ణాపత్రికలోవి. భారతిలో ఒకప్పుడు వ్రాశారుగదా : "ఈనిక్కపు కవిసార్వభౌమునకు" అని. దాని తాత్పర్యమేమిటో! నందిరాజు చలపతిరావుగారు కాశీమజిలీ అచ్చువేస్తూ ఆ పుస్తకం మీఁద - "నిజమైన కాశీమజిలీలు' అని పేరు వేయించారు. దానికర్థ మేమిటి? అంతకుపూర్వం యెవరో అచ్చు వేసిన కాశీమజిలీ లున్నట్లున్నూ అవి నిజమైనవి కానట్టున్నూ, తనవి నిజమైనట్లేకదా దాని తాత్పర్యం. అట్టే వ్యాఖ్యానమెందుకుగాని, త్రిలింగలో కాఁబోలును, శ్రీ వ.సు. రాయకవిగారికి జరిగిన రాజమండ్రి సమ్మానాన్ని తమకు జరిగిన పెండరపు టుత్సవం దరిమిలాను పనిలేనిపాటగా అభినందిస్తూ చంద్రాభట్ల రామమూర్తిగారు కాఁబోలును పద్యాలలో యేలావ్రాశారో తమరు చిత్తగించారా? వసురాయకవిగారు వారికి జరిగిన సమ్మానాన్ని గుఱించి యే వూరువెళ్లి యెవరినీ ఆశ్రయించలేదఁట, వారంతట వారే లోకులు ఆయనను ప్రేమించి ఆ సమ్మానాన్ని జరిగించేరఁట. దీని తాత్పర్యమేమిటో తాము పరిశీలించారా? ఇదే అర్థమిచ్చేటట్టుగా అభినవ సరస్వతీ పత్రికాధిపతి వక సీసగీతలో వ్రాశాడు చూడండి.

ఆ.వె. అడిగినారె మీరు యత్నించినారె స
మాశ్రయించినారె యందుకొఱకు.

ఇది ఆయన యెవరిని గుఱించి వ్రాసినా, ఆ కాలమం దెవరో అడిగి, యత్నించి, ఆశ్రయించి, సమ్మానం పొందినవారిని మనస్సులో పెట్టుకొని వ్రాసినట్లేకదా? యింకా యిట్టివి పెక్కులున్నాయి. ఇవన్నీ తమ పెండరపు టుత్సవానికి యించుమించు కాలములోనివే. యివి వ్యంగ్య మర్యాదచే తెలుపుడు చేస్తున్నాయి ప్రస్తుతాంశాన్ని, వాచ్యంగానే వ్రాసింది కృష్ణాపత్రిక సంపాదకీయంలో, సార్వభౌమ బిరుదాన్ని గూర్చిన్నీ, కనకాభిషేకాన్ని గూర్చిన్నీ. దాన్నే బలపరిచారు శిష్టావారున్నూ, పరిమివారున్నూ, యిందులో యెవరున్నూ లాకలూకాయలుకారు. మీయం దెవ్వరికిన్నీ ద్వేషమున్నట్లాధారాలు లేవు, వీరి వ్రాఁతనే ఖండించడానికి అవకాశం లేదని నేను శాంతివ్యాసంలో వ్రాస్తే "అవివేకపు వ్రాఁతలకు నిరుత్తరమే సమాధానమనీ, నిరసించుటే ఖండన మనిన్నీ" తమరు నా కళ్లనీళ్లు తుడిచి వోదార్చారు. కాని నా మనస్సులో ఆ దుఃఖం అప్పటికీ యిప్పటికిన్నీ బాధిస్తూనే వుంది. ఉంటే మాత్రం యేంచేయను? తమతో మనవిచేసి యిఁకముందేనా యిట్టి ప్రయత్నాలు చేయకండి మహారాజా అని బతిమాలు కుందామంటే తాము దాన్ని

వోర్వలేమిగా భావిస్తారుకాని అంగీకరిస్తారా? నేను నా గ్రంథానికీ, నా చరిత్రకూ కల్గిన విరోధాన్ని నా జీవితకాలంలో సవరణ కావడం కొఱకు పత్రికలో యేవో వ్యాసాలు రాసుకుంటూవుంటే, అధికారం వున్నావారు కనుక "నవ్వుబాట్లపాలుగాకుము" అని హితబోధచేసి చేవ్రాలు చేస్తూ కష్టపడి సంపాదించుకొన్న బిరుదం వదలిపెట్టి ప్రత్యేకించి నాకోసం, ప్రియవాది అనే క్రొత్త బిరుదాన్ని ఉపయోగించారు. నేను కూడా ఈ బిరుదాన్నే ధరించి ప్రస్తుత మీ్మరు చేయఁదలఁచుకొన్న ప్రయత్నాన్ని గూర్చి నివారణమాటలు వ్రాస్తే తాము విశ్వసిస్తారా? విశ్వసింపరు. చూడండి శ్రీ వీరేశలింగంగారి కేదో శిలావిగ్రహాన్ని స్థాపించారఁట, కీ॥శే॥ డయిన ఆయన ప్రయత్నం వుందని అనుకుంటారేమో యెవరేనాను. అనుకోరుగదా? ఇంకొకటి. కీర్తిశేషుఁడైనప్పటికీ లోకానికి యీ సమ్మానానికి ఆవ్యక్తికి అర్హత లేదని తోస్తే వెక్కిరించడాన్ని యెవ్వరాపుతారు? "లోకులో కాకులో" వకవేళ "కాదన్నవాఁడు కరణం" అన్నట్టు ఆ కాస్త మర్యాదా జరిగిన తర్వాత, యెవరో బయలుదేరి సమర్థిస్తారనుకోండి. యేంలాభం? ఆలాటి త్రోవ వచ్చినప్పుడే "పంచశుభం, పంచాశుభం" అంటారు లోకులు. నేనొక బిరుదానికి ప్రయత్నించడం లేదు. శిలావిగ్రహస్థాపనకై ప్రయత్నించడం లేదు. నాకు జన్మదినోత్సవం చేస్తారా? చేయరా? అని యెవరినీ యాచించడం లేదు. నా జీవిత చరిత్రలో వ్రాసినవ్రాఁతకు బాధకలిగే వ్రాఁత తమది అచ్చుపడివుండడం చేత ఆ తప్పును తొలఁగించుకోవడానికి ప్రయత్నించాను. దాన్ని మీరు నవ్వుబాట్ల పాలవడానికి ప్రయత్నించినట్లుగా వ్రాశారు. దాని మీఁద యింత వ్రాయవలసి వ్రాశాను. ఈ వ్రాఁత యథార్థమైనదయినా నా స్థానానికి అనఁగా శిష్యుడికి ఉచితం కాదుకాఁబట్టి మీ పాదాలమీఁద నా శిరస్సు వుంచి క్షమాపణ కోరుతూవున్నాను. దాసుడితప్పు దండంతో సరి. అనుగ్రహించండి. యిప్పటికి నాకు తమరు ఆపాదించిన కృతఘ్నత్వం వకటి నివర్తించినట్లయింది. కొంతమట్టుకు ధన్యుణ్ణయినాను.

యిఁక "దురుద్ధర దోషశృంఖలం" ద్వారాగా ఆపాదించిన దోషాలు రెండున్నాయి. అందులో వకటి ముక్త్యాలకు సంబంధించింది, రెండు పాలకొల్లుకు సంబంధించింది. ఆ "శృంఖలగ్రంథం" కూడా హైదరాబాదు వుత్తరంవలె ప్రమాదమూలకమే అంటే నాకు పూర్తిగా ధన్యత్వం కలుగుతుంది. లేదా? యీ కృతఘ్నత్వం పరలోకంలో విచారించే వాళ్లు సర్వజ్ఞులు కనుక నన్ను బాధించరుగాని యిహలోకంలో యెవళ్ళోతప్ప వాళ్లని పోలేవాళ్లుండరుకాఁబట్టి నన్ను కొంతేనా బాధించకపోరు. అందుకోసమై నేనింతగా అభ్యర్థిస్తున్నాను. ఆయీ అభ్యర్థనం న్యాయమైనప్పటికీ గురుశిష్యులకు కలహం పెరిఁగి పోతూ వుందని పత్రికవాళ్లు ప్రకటించక పోయినా నేను యిప్పుడు యే రోజుకు ఆరోజే వ్రాయుచున్న "ఇటీవలి చర్య"లో విస్తరించి వ్రాసివున్నాను. దాని ప్రకటనము కూడా

"సశేషం" అని తుట్టతుదను వుటంకించి నేcడో రేపో జరుగుతుంది. అందుచే పత్రికవా రాపిన ప్రయోజనం వుండదు. "కోడీ కుంపటీ లేకపోతే తెల్లవారదా?" పోనీ తమ హృదయములో యిది యింతతో చల్లాఱితే మంచిదని నిజంగా వుందనుకొందామంటే యీ వాక్యం చిత్తగించండి, "నువ్విపుడు కృష్ణాపత్రికలో రాస్తూన్న రాతలన్నీ నేను చూస్తూనే వున్నాను. అవి చాలా హెచ్చుతగ్గులుగా వున్నాయి" అన్నారు కదా? యిదివఱలో కృతఘ్నుత్వ ప్రయుక్త దోషాలు మూcడింటినే ఆపాదించారు. ఇపుడు మళ్లా తప్పుడువ్రాంతలు వ్రాస్తూ వున్నట్లు వుటంకించారు. యిcక దోషాలయిదింటికీ వకటిమాత్రమే తరవాయనుకొందునా? మఱి యేమనుకొందును? "నువ్వు కొన్ని సంగతులు వ్రాసినప్పుడు నేను వాటికి తగినట్లు మఱికొన్ని సంగతులు వ్రాయవలసివస్తుంది.......... నీ వ్రాసిన వ్రాంతలన్నీ సప్రమాణంగా ఖండించి వాటికి మారు రాసి లోకాన్ని వొప్పించగలను. అయితే దానికి నేనిప్పుడంగీకరించిన చిత్తంలోలేను" తుట్టతుది వాక్యాన్ని గుఱించి నేనేమిన్నీ మనవి చేయcజాలనుగాని, తక్కిన వాక్యాలను గూర్చి మాత్రం మనవి చేసుకుంటాను. వ్రాయవలసిన సంగతులుంటే వ్రాసి లోకులను వొప్పించవలసిందనే నా ప్రార్థన ముమ్మాటికిన్నీ. "నేనెవరితోనో యేమో చెప్పినాననిన్నీ... చెప్పcగా వారుత్తరం వ్రాశారనిన్నీ.... చెప్పడం తప్పుగాకపోదు." ఈ వాక్యాల కర్థమేలేదు. హైదరాబాదు వుత్తరం సంగతి తామొప్పుకొనుచునే యున్నారుగదా? తక్కినది తమ "శృంఖలం"లో వున్న విశృంఖలపు వాక్యాలు. అంతేనేకాని "యెవరో యెవరో" లు కావు. శృంఖలగ్రంథం వకటి నాకు గుంటూరులో లభించిందని యిదివఱకే వ్రాసివున్నాను. నిన్నమొన్న విశాఖపట్టణంలో వక రావుసాహేబుగారి వద్దకూడా వున్నట్లు వారే చెప్పారు. వారిని తమరున్నూ యెఱిcగివుంటారు. యింకా యెందఱివద్ద యెన్నివున్నాయో? ఆ పుస్తకం తమరు చాలా ఆలోచించి వ్రాసిందేకాని మఱోమోస్తరుదికాదు. ఖండన గ్రంథం గదా? హైదరాబాదు వుత్తరంలాగు అందులో వ్రాంత ప్రమాద ప్రయుక్త మనడానికి అవకాశం చిక్కదనుకొంటాను. కోపం వచ్చి అలా వ్రాశానని వ్రాయడమేతప్ప నాకు ఆ తొందరపాటు సవరణచేసే మార్గాంతరం కనపడడంలేదు. కాcబట్టి యిప్పట్లో నేను కొంత వ్యతిరేకంగా వున్నప్పటికీ యీ నిక్కపు భక్తుణ్ణి మన్నించి యీ నా సలహాను అంగీకరించండి. మీకు యేస్వల్పంగానో శిష్యులున్నా జట్టీలు తెచ్చే శిష్యులేగాని నావంటి భక్తికల శిష్యులు లేరు. ఇది నిక్కము. నా శిష్యత్వంవల్ల తమకు వచ్చే గౌరవంలేదని శృంఖలంలో వ్రాసివున్నారు. అది చూచి నేను పరమాశ్చర్యపడ్డాను. మనస్సా మీరు అమాయికులని యెఱుcగుదును. యెఱిcగి యేమి చెయ్యను? నన్ను మీ వ్రాంత కృతఘ్నుణ్ణిచేస్తూ వుంది. యే పాపాన్నేనా నేను భరిస్తాను కాని యీ పాపాన్ని భరించలేను. యీ సంగతి నా గీరతంవల్లనే దేవరకు

విశదంగదా? ఆ గీరతాన్నే తమరు "శృంఖలంలో యీసడించారు. మీకు బోధించతగ్గ వాణ్ణిగాను కాని, కవిత్వమన్నప్పుడు, యేరసంలో మొదలు పెడతాడో కవి, ఆ రసంలో మెప్పించుకోవడమే అనుకోండి. మీరందఱున్నూ గ్రంథాలు వుచితంగా పంపి వారి వారి అభిప్రాయాలు కోరడం నేనెఱుఁగుదును. నేనెవ్వరికిన్నీ పుస్తకం పంపడంగాని అభిప్రాయం అడగడంగాని కలలో కూడా యెఱుఁగనే యెఱుఁగను. అడిగితే తప్ప యెవ్వరికిన్నీ పుస్తకం చూడమని చేతులో పెట్టను. ఇప్పటి మాటకేమి? నేను మునుపు మీకు ముఖ్యప్రేమాస్పదుణ్ణే గదా, యెప్పుడేనా పోస్టుద్వారాగాని ప్రత్యక్షంగా కాని వక పుస్తకమేనా దయచేసి చూడండని దాఖలు చేసుకున్నానా; యెందు చేత? నా వ్రతానికి భంగం కలుగుతుందనే. నా తాత్పర్యమేమింటంటే, రిజిష్టరు ఖర్చులు వగయిరాలు పెట్టుకొని వుచితంగా పుస్తకం పంపినప్పుడు యెంత యిష్టంలేనివారైనా మంచి అభిప్రాయాన్నే యిచ్చి తీరుతారనే. ఆలాటి అభిప్రాయా లెందుకు పనికొస్తాయో చూడండి. ప్రస్తుతమేమిటంటే : యిట్టి పొగరుమోతు గీరతానికి యెందఱో ప్రాజ్ఞులు సదభిప్రాయాలు వారంతట వారే వ్రాశారు. యిది నా ప్రజ్ఞ అనుకొందునా? లేక కాలపు వైపరీత్య మనుకొందునా? మీరు దాన్ని మహాగ్రంథమని పూర్తిగా నిరసించారు కదా? అయితే అప్పటికే కొల్లాపురం గోల వచ్చింది కాఁబట్టి అది కోపంవల్ల యీసడించినట్లు జమకట్టుకొన్నాను. మీకున్నూ కృష్ణాపత్రికకున్నూ ఈలాటి కోపకారణం లేశమున్నూ లేదే? లేకున్నప్పుడు మీ భారతాన్ని "ఊరక పద్యముల గణబద్ధము చేసినంత మాత్రమున" అని నిరసించి వ్రాయఁగలిగింది కదా? యిందలి యాథార్థ్యమును మీరు గమనించనే లేదు. మీ పొత్తము సర్వమున్నూ నీరసమని నేనను. కాని మీరు పైవారి వ్రాఁతలకు ఆధారంగా కొంత రచన చేశారు.

క. స్త్రీస్వాతంత్ర్యము లేమిన్  
మా స్వాములవారు వచ్చి మసలక నీకున్  
సుస్వాదువృత్తి నిచ్చిన  
ఓ స్వారాడ్తుల్య నన్ను నొందుము పిదపన్.

యీ నా వుదాహరించిన మీ పద్యంలో స్వల్పంగా వ్యత్యాసం వుంటే క్షమించండి. ఈ విషయములో నన్నయ్య పద్యం చూడండి.

క. కరుణానిరతులు ధర్మ  
స్వరూపు లింతకు మదీయజనకులు చనుదెం  
తురు వారు వచ్చి నీకి  
చ్చిరేని పాణిగ్రహణముచేయుము నన్నున్.

మీ రచనని నిరసించేవారి కీలాటి చోట్లు పూర్తిగా తోడ్పడతాయి. వారి నందఱినీ మీరు సర్వం తోటకూరకట్టగా అవివేకులని తోసివేయఁ గలిగినారు. నా కది చేఁతగాదు. రాఁతలోకి దిగనేదిగను, దిగితే ఆసీమాంతం చేసి కాని విడిచేదిలేదు. వోడు వస్తుందంటే, అసలే కలగ జేసుకోను. వకప్పుడు నిజమైన తప్పుంటేకూడా మార్గాంతరంచేత సాధించఁగలను. కాకినాఁడ అవధానంలోని "ఏనా మనూనాకృతి భాసమానం" అన్నదిన్నీ, గుంటూరి వివాద సందర్భంలోని, "పశ్యాపశ్య....." వాదమున్నూ, పాండవాశ్వమేధంలోని "మరుద్భూపాలుఁడు" లోఁదిన్నీ ఇవి నా పొరపాట్లే అయినా మార్గాంతరం త్రొక్కి సాధించాను, జయించాను. ఈ బలం నా కెక్కడ నుంచి వచ్చిందనుకున్నారు! గురువుల ఆశీర్వచనం వల్లనే. ఆ గురువులలో బ్రహ్మయ్యశాస్త్రులవారి శుశ్రూషకు నేను వెళ్లకపోయే యెడల నేనున్నూ తమవంటి కవినే అగుదును గాని శంకరుఁడు పాశుపతాస్త్రం యిచ్చినట్లు ఆ మహాత్ముఁడు నాకు వ్యాకరణ శాస్త్రాన్ని దయచేశారు. దానిచేతనే ప్రతిసభలోనూ నే ఆడింది ఆటగా, పాడింది పాటగా, సాగింది. తాము వ్రాసినట్లు "శేషం స్వం......." ఈ స్వల్పకాలంలో కూడా అట్లాగే సాఁగుతుందని నా నమ్మకం. గురుపరంపరలో ప్రధానస్థానం వారికిచ్చాను. అనఁగా శంకరస్థానం వారిది. నాకు తాము, కృపాచార్య స్థానంలో వుండే గురువులు. నా అదృష్టంవల్ల ఆ పదము శ్లేషిస్తూకూడా వుంది. కాఁబట్టి నేనిప్పుడు తాము వ్రాసినట్లు పిచ్చియెత్తినట్లే యెదురు తిరిగినా నాయందు కృపను వదలుకోరని యెఱుఁగుదును. చూడండి యెదురుతిరిగి వ్రాసే వ్రాఁతలో కూడా "ఇటీవలి చర్యలో" యెట్లా వ్రాశానోను!

ఉ. కొంకఁగ నేల చెప్పెదను, కోమలమౌ హృదయంబుతోడ "మా
వెంకటశాస్త్రికన్నఁ బృథివింగలరే? కవు" లంచుఁ బల్కు ని
శ్శంకగ మద్గురుం, డటు ప్రశంస యొనర్చెడి దేశికుం డెటో
సంకుచితాంత రుండగుచు సందియ మందఁ దొడంగె నియ్యెడన్.

ఇది తమ పెండారపు సభాధిపత్యమునకు సంబంధించిన ఘట్టములోనిది. దీనివల్ల యిప్పటికిన్నీ మీయందు నాకెట్టి భక్తి వున్నదో తమచిత్తానికే విశదం. పెండారపు సభలోని నా వర్తన తమరెఱుఁగనిది కాదు. నేనేమో తగాయిదా పెడతానని పలువురనుకొన్నారు. తాము కూడా తుట్టతుదకు కాని నా అగ్రాసనాధిపత్యాన్ని అంగీకరించనేలేదు. దీన్ని గుఱించి వ్రాస్తూ భారతిలో యెవరో చాలా చర్చించారు. ఆయన శాస్త్రి అనిమాత్రమే చేవ్రాలు చేశారు, చిత్తగించారో లేదో? వారి వారి వ్రాఁత లుదాహరించాను. ఇటీవలి చర్యలో ఈ పద్యం ఆ ఘట్టం లోనిదే.

క. జరిగె సభ భూనభోంతర
మిఱుకై సందింత లేక; యిరువురకున్ బో
రరుదుగ జరుగుననుచుఁగొం
దఱువచ్చిరి, చనిరి తుదకునష్టాశయులై.

ఆ సభనాఁటికి చాలపూర్వమందేమీ శృంఖల గ్రంథాన్ని నేను చూచియున్నాను. అయినప్పటికీ నేనా బాపతు వికారచేష్ట లేమిన్నీ కనపఱచనే లేదని తమ చిత్తానికే విశదంగదా? దీన్ని బట్టి నేను తమకు శ్రీరాములవారికి ఆంజనేయులవంటి భక్తుణ్ణని తమ చిత్తానికే విస్పష్టం. ఇట్టి భక్తుణ్ణి మీరు వదులుకోకూడదు, రెచ్చగొట్టన్నూ కూడదు. ఆంజనేయులు కపి, నేను కవిని. కాఁబట్టి నాయందు కోతిచేష్ట లుండఁగూడదు. మీ శృంఖలగ్రంథం చూచి యెట్లో సహింపఁగలిగాను. కాని హైదరాబాదు వుత్తరం చూచాక నేను స్వతహా కవినైనా కపినే అయి –

శ్లో॥ కపిరపిచ కాపిశాయనమదమత్తో వృశ్చికేన సందష్టః
అపిచపిశాచగ్రస్తః కింబ్రూమో వైకృతం తస్య.

అనే శ్లోకానికి వుదాహరణంగా మాఱిపోయాను. మాఱితే మాఱుదును గాక, నాస్వంతం కోసం తప్ప మిమ్మల్ని ధిక్కరించడాని కీ వ్యాసాలు ప్రారంభించలేదు. చేయని కృతఘ్నుత్వాన్ని నామీఁద మీ రాపాదించారు. అందుచేత మన పూర్వాచారానికి విరుద్ధమైనా అంగీకరించి యీ "గురువుతో గ్రుద్దులాటకి" మొదలేశాను. నాకల్లా కావలసింది, కృతఘ్నుత్వం లే దనిపించుకోవడం. అందుకే యీ నా పరిశ్రమ. యిప్పుడు మీరున్నూ పశ్చాత్తాప పడుతున్నారని గ్రహించాను. యేలాగంటారాఁ "యింత కాలం వక విధంగా వెళ్లిపోయింది. శేషం స్వల్పం. అది కూడా యిల్లాగే శాంతంగా వెళ్లిపోతుందనుకున్నాను. వెళ్లి పోనిచ్చాడు కాదు భగవంతుడు." ఈ అక్షరాలు మీ అనుపాతాన్ని పూర్తిగా వెల్లడిస్తూ వున్నాయి. అయితే యేం చేతును? దీనికి భగవంతుడు కారణంగాదు. అనాలోచితంగా మీరు నన్ను గూర్చి వ్రాసిన అక్షరాలు. "పరిణతిరవధా ర్యాయత్నతః పండితేన" కనుక మీరు భావిపరిణామాన్ని వూహించకుండా శృంఖలం వ్రాశారు, అచ్చొత్తించారు. కాని పస్తాయించి నిలుపు చేశారు. ఆ నిలుపు చేయడమేనా యెందుకనుకున్నానంటే నేను

(ఇటీవలి చర్యనుండి)

తే.గీ. లలి "దురుద్ధరదోషశృంఖల"మటన్న
పేరితోఁ బండితులఁ దూఱుపాఱబట్టు
చొక్కపొత్త మచ్చొత్తించియును నది తమ
భావి పెండెరమును భంగపఱచుననుచు.

క. లోనెంచి వెనుకముందు ని
దానించియు సిద్ధమైనదాని నణఁచి రె
ట్లేనియు నొకటో రెండో
పై నిలిచెన్ వారిచేతిపట్టు వదలుచున్.

ఇందు కనుకున్నాను. యిందేమేనా పొరబాటుంటే క్షమించండి. తాము శృంఖలంలో వ్రాసిన ప్రకారం, ముక్త్యాల సందర్భమున్నూ పాలకొల్లు సందర్భమున్నూ సమర్థించ లేకపోతే నేను "సెనగలు తిని చేయి కడుక్కున్నట్లు" యీ గండం లోనుంచి బయటపడి శుద్ధుణ్ణనిపించు కుంటానుగాని గురువుగారి కెదురుతిరిగి యథార్థమైనవైనా కొన్ని వాక్యాలు వ్రాసిన పాపం మాత్రం నాకు దాపరిస్తుందని విచారిస్తూన్నాను. అయితే నా మతంలో యేపాపమున్నూ కృతఘ్నత్వాన్ని పోలేదికాదని విశ్వాసం గనుక యీ స్వల్ప పాపం చేశేనా ఆ గొప్ప పాపాన్ని తొలఁగించు కోవడానికి ప్రయత్నించినట్లు గురువుగారు భావించవలసి వుంటుంది. వారు భారత మాంధ్రీకరించినారు కదా? అందు నాళీజంఘుని చరిత్రలో కృతఘ్నత్వాన్ని గుఱించి వ్రాసిన విషయం పూర్తిగా వారి కవగతమే కావున విస్తరింపను. స్వల్ప పాపంచేత గొప్పపాపాన్ని పోఁగొట్టు కోవడానికి శాస్త్రజ్ఞుల సమయం వప్పుకుంటుంది. దాన్నే "కూపఖననన్యాయ" మంటారు. ఈ న్యాయం కొంచెం పాపం చేసి సంపాదించే పెద్దపుణ్యం విషయంలో గ్రంథాల్లో పెద్దలు వాడారు. కొంచె మించుమించుగా నేను దీన్ని ప్రస్తుతానికి ముడిపెట్టేను. అదిన్నీకాక న్యాయానికెవరితో యెవరేనా వివదించడం తప్పుగా దన్నందుకు పరశురామునితో నెదుర్కొని యుద్ధ మొనర్చిన భీష్ముఁడొకఁడు కనుపడుతూ వున్నాఁడు. కాఁబట్టి నాకు అంతగాచిక్కులేదు. అందుచేతనే "ఇటీవలిచర్యలో" ఇట్లు వ్రాశాను.

క. గురు వొకచో నపమార్గము
పొరఁబడియో బుద్ధిపూర్వముగనో త్రొక్కన్
సరిగాదని శిష్యుఁడు మృదు
సరణిని తెల్పుటయుఁ దద్జ్ఞ సమ్మతమె యగున్.

గురువుగారు నాకు ప్రధాన సమాధానములో వారి శిష్యత్వమును నే నపలపింపాలనే వుద్దేశంతో వున్నట్లు కొన్ని మాటలు వ్రాశారు. అది లోకం వప్పుకోదు. నా శిష్యత్వం వల్ల వారికి వచ్చే గౌరవం లేక పోవుఁగాక, నేను మాత్రం యితర గురువులతోపాటు వారికి కూడా శిష్యుణ్ణే. యితర గురువుల వద్ద చదివిన చదువును మాత్రం వారిపరం చేయడానికి వప్పుకోలేక పోయాను. నా అంతట నాకు "ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః" అనే న్యాయంచేత

అబ్బిన కవిత్వావధానాలను వారికి కట్టిపెట్టినా నాకు దోష ముండదుగాని అన్యులవద్ద చదివిన చదువును కట్టిపెడితే దోషంరాదా? ఈ సంగ తిదివఱకే వ్రాశాను. నాశిష్యత్వాన్ని వారు నిరాకరించారు. శిష్టావారు దీనివల్ల చాలా లాభం వుందని వ్రాసిన సంగతి గురువుగా రెఱిగిందే. చిట్టిగూడూరి పాఠశాలా విద్యార్థి వకఁడెట్లా వ్రాశాఁడో చూపి యిఁక దీన్ని ముగిస్తాను.

"మీరు శిష్యతన్ లవమును పేరులేదనిన నవ్వరె పిల్లలు గూడఁ జూడ
'కింకవిగజసింహదేశికత' కన్నను నెక్కుడె గండపెండరాల్."

వకటే మాట. ధనంకోసం ప్రయత్నం చేయడం సంసారికి తప్పదు. కుక్కదానం పట్టి కుటుంబం పోషింపమన్నారు కదా. ప్రతిష్ఠకోసం ప్రయత్నిస్తే అది పనిచేయదు. తోడ్పడ్డవాళ్ళే యెక్కడో వున్న మాట వున్నట్లు యేకరువు పెడతారు. దానితో రసాభాసవుతుంది. యీ విషయం బాగా గమనించవలసిన సంగతి. యింకొకటి, అవ్యక్త ప్రసంగంచేసే శిష్యులుంటే మందలించాలి. వాళ్ల సంరక్షణకే యితరులకు వుత్తరాలు వ్రాయకూడదు. అలా వ్రాస్తే అవి తుదకు మెడ మీఁదకి వస్తాయి. గురువుగారు విశ్వకర్మ శిష్యుడి రక్షణకు వ్రాసిన వుత్తరంలో పెండేరానికి సంబంధించిన మాటలు పుచ్చుకొని అక్కడి పత్రికలో యెంతతీవ్రంగా విమర్శించారో గురువు గారు చూడలేదనుకుంటాను. "నేనెవరితోనూ నీ విషయమై తప్పుచెప్పలేదని ప్రమాణం చేస్తాను" అని గురువుగారు వ్రాశారు. విశ్వకర్మ శిష్యుడు తనంతటతానే అవ్యక్తంగా హైదరాబాదులో తాము తనతో చెప్పినట్లు కొన్ని మాటలు ప్రసంగించా డనుకొందమా! అయితే ఆ శిష్యుణ్ణి పదిమంది పెద్దలుగల సభకు పిలిచి నన్ను కూడా పిలిచి క్షీరనీర న్యాయంగా వున్న మాకు తంపిపెట్టితివేమి, అని మందలిస్తే యిప్పుడేనా బాగుంటుందేమో? అయితే అతని మాటల్ని "శృంఖల గ్రంథం" బలపరుస్తుంది గదా? అప్పుడు గత్యంతరమేమి? ఇదిగాక ఆ శిష్యుడిచేత హరికథ వ్రాయించడం, అందులో యెక్కడా చదవని పాణినీయాన్ని అతితేలికగా "పాడినట్లు" వ్రాయించు కోవడం, యివన్నీ లోఁకువకు కారణంకావా? ఆ పాణినీయం యెవరివద్ద "పాడినట్లు" వ్రాయఁబడినదో ఆ మహనీయులను కొంచెము నే నెఱుఁగుదును. నేను తమకు శుశ్రూషచేసే కాలానికి వారు జీవించేవున్నారు. వారివద్దనే తాము పాణినీయం పాడివుంటే యిటీవల చాలాకాలాని కనఁగా రాజమండ్రి నివాసానికి వచ్చిన పిమ్మట పాణినీయం పఠించాలని యేల ప్రయత్నించవలసి వచ్చిందో విచార్యం కాకపోదు. అప్పటి తమ ప్రయత్నం నాకు ధారణలో వుండఁబట్టే, ఇటీవలి చర్యలో ఈ పద్యం వ్రాయఁగల్గితిని.

క. "గురుఋణము తీరుటకు వ్యా
కరణముచెప్పు" మని గురువుగారన్నది నే
మఱవఁగలే దల ధవళే
శ్వరమున బ్రహ్మగురుసేవ సలిపెడి పట్లన్.

అది యటులుండె. గురువుగారికి నాకన్న ప్రేమపాత్రుఁడులేఁడు ఇఁకముందున్నూ వుండఁబోఁడు. కాలకర్మ దోషంవల్ల నేను వారి ప్రతిపక్షికిచ్చిన అభిప్రాయంవల్ల వారి మనస్సు చెడినది. దానిపై నేదో వ్రాశారు. వ్రాసినా నేనెట్లో సరిపెట్టుకున్నాను. కొన్ని యేండ్లు జరిగి పోయాయి. అంతలో విశ్వకర్మ శిష్యుఁడు యీ చిక్కు తెచ్చిపెట్టేడు. అక్కడికి వ్రాసిన వుత్తరం వల్ల యింత పెరిఁగింది. అయితే నేను వారిని వదలను, నన్ను వారున్నూ వదలరు. "విప్రుల యలుకయు, తృణ హుతాశనమ్ము దీర్ఘమగునె?"

★ ★ ★

# వకటేమాట లేక సూక్ష్మోపాయం

(14-3-1936 సం॥ర కృష్ణాపత్రిక నుండి)

గురువుగా రేదో వ్రాస్తూవున్నారు. ప్రధానాంశం మాత్రం తేలడం లేదు. వ్రాఁత పెరిఁగిపోతూవుంది. వెం॥శా॥ కృతఘ్నుఁడు అని తేలినట్లులేదు. వ్రాఁత పెరిఁగిపోతూ వుండడం చేత పరస్పరవిరోధాలు మిక్కిలిగా దొర్లుతూన్నాయి. ఆ విరోధాలను బట్టి వారు అసత్యకల్పనకు దిగినట్లు లోకులు భావించడాని కవకాశం కలగడం తప్పకాదు. యిదే అవకాశం గదా అని యెవరో గొప్ప సభ్యులు లేచి మా గురుశిష్య లిద్దఱినీ తూలనాడుతూ తమ సభ్యత్వాన్ని ప్రకటించుకొంటూ అంతతో తృప్తిపడక "మొట్టో వెంకటశాస్త్రి శిష్యత్వం నాకువ" ద్దని కంఠోక్తిగా వ్రాస్తూవున్న గురువుగారిని ఇందుకోసం "పాట్లుపడుతున్నారు" అని వ్రాసివున్నారు. యింకా యీ సభ్యులు వ్రాసిన ప్రధానాంశంలో కూడా కొంత సాహసం కలదు. అవసరమైనప్పుడు వేఱొక విషయంలో చూపిన మఱికొంత సాహసాన్ని కూడా కల్పి దాన్ని ఋజువు చేస్తాను. ఆ "ప్రబుద్ధాంధ్ర" దాచే వుంచినట్లు జ్ఞాపకం. మా వాదం పూర్వాచారానికి సంబంధించిందవడంచేత ఆ "ప్రబుద్ధుల"కు తప్పుగా, అసభ్యంగా తోఁచడంలో ఆశ్చర్యంలేదు.

అది యట్లుండె. యిఁక మా గురుశిష్యులవాదం తేలే వుపాయమేమిటి? కాలాలకి కాలాలు నిండిపోతూవుంది గదా! అంటే వక ఉపాయం తోఁచింది. దానికి గురువుగారే మార్గప్రదర్శకులు. యిది యేకతరద్వంద్వ యుద్ధం వంటిది. వుభయ సేనలలోనున్నూ కర్ణార్జునలవంటివారిని యిద్దఱిని యేరికొని పోట్లాడించి జయాపజయ నిర్ణయానికి వుభయులున్నూ అంగీకరించే ఆచారం పూర్వమందు వుండేదఁట. యిప్పుడు గురువుగారు సూచించినదిన్నీ అట్టిదే. దాన్ని చూపి మఱీ వ్రాస్తాను.

"నేను వారి విషయమై వ్రాసిన వ్రాతలంగూర్చి యేదియేనియు వారు కాదనగలిగినచో నొరుల సాక్ష్యముతో నవసరములేకుండ నేను చేసినది తప్పేయని యొప్పుకొందును."

పై సాహసోక్తి గురువుగారిది. దీన్ని భంగించే అంశాన్ని వుదాహరిస్తాను. యింతతోనేనా గురువుగారు విరమించి సాచీమార్గానికివస్తే సంతోషించి మిన్నకుందును. "పాఠక మహాశయులారా! నాకిప్పటికి 69 సం॥రములు నిండినవి. నేనెప్పుడును

వేంకటశాస్త్రిగారు నాకు శిష్యులని యే సభయందును బలికియుండలేదు.” చెరలాటంలో పై రీతిని వ్రాసి యున్నారుగదా గురువుగారు! దీనికి నా సమాధానం చిత్తగించండి. “చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి నాశిష్యుఁడు, అతఁడు నాయందు పితృవాత్సల్యత చూపుచు......” అనే వాక్యాలు రాజమండ్రి కోర్టులో శ్రీవారు పలికివున్నారు. “పండితాభియోగం” అనే పేరుతో ఆ కోర్టు వ్యవహారమంతా అచ్చుపడివుంది. కోర్టు సభ కాదని గురువుగా రంటారనుకోను. యిదేమోస్తరుగా “శ్రీవారి కౌమార్త కవయిత్రికాదు” అని నేను ధ్వనింపఁ జేశానన్న సంగతి కూడా యెగిరిపోతుంది. అలాగే ముక్త్యాలలో శ్రీవారిని గూర్చినేను చేసిన ప్రయత్నానికి మొట్టమొదట తాము సంతోషించలేదన్నదిన్నీ యెగిరిపోతుంది. గ్రంథం పెరగడాని కిష్టంలేక సూక్ష్మంలో మోక్షం కనుపఱుస్తూ వున్నాను. వాది ప్రతివాదులు వకరివ్రాఁతను వొకరు నిరసించడం లోకాచారమే. యిప్పుడు నేను చూపించింది ఆ మాదిరిదే అవునో కాదో గమనింప కోరుతాను. వారి ప్రతిపక్షిపండితునికి నేను సదభిప్రాయం యివ్వడమే వారికి నాయందు కోపానికి కారణం అన్నది యిద్దఱమూ వప్పుకుంటూనే వున్నట్టు మామా వ్రాఁతలు స్పష్టపరుస్తాయి ఆ కోపం మీఁద వ్రాసేవ్రాఁత కనుక యేదో మాదిరిగావుండి గురువుగారు అసత్యం వ్రాస్తూ వున్నట్లు కనుపడినప్పటికీ నేను కేవలం అలా భావించను. 69 వత్సరముల వయస్సులో పూర్వ మెప్పుడో జరిగిన విషయాలు బాగా జ్ఞప్తికిరాక, పోనీ వూరుకుందామంటే స్వతస్సిద్ధమైన కోపం అందుకు అంగీకరింపక వ్రాసేవ్రాఁతకనక నానావిధాల అస్తవ్యస్తంగా వుంటూ వుందని సమాధాన పడతాను. చి॥ నా కొడుకు సభకు నన్ను రమ్మని హైదరాబాదువారు కొరితే అనారోగ్యకారణంచేత నేను వెళ్లలేకపోతే ఆ సభలో నా ప్రతిమకు కప్పిన సేలువు వగయిరాలకున్నూ విశ్వకర్మ శిష్యుఁడుగారి సంభాషణవల్లనూ, ఆయన సంరక్షణకు గురువుగారు వ్రాసిన వుత్తరంలోని మాఖాంతం వగయిరా ప్రమాదపు వ్రాఁతవల్లనూ, శృంఖలం వల్లనూ వచ్చిన యీ వివాదానికిన్నీ ఆ సేలువులను కారణంగా చూపించే గురువుగారి అమాయికత్వానికి పదివేల నమస్కారాలు. వెం॥శా॥ “.. కాసుకు గడ్డి తినేవాఁ” డని ఋజువుచేస్తే సంతోషమే కాని యీ విషయం నాకింత అవసరంకాదు. గాని అవసరమైతే పట్టపగ్గాలుండవు. ఆధారాలు బోలెఁడు. ప్రధానాంశం, నేను కృతఘ్నుఁడనా? అన్నది. లోకం దాన్ని పరిశీలించుకోవడానికే ఆయా వ్యాసాలు వ్రాశాను. అవసరమైనప్పుడేదో నిర్ణయించుకుంటుంది. గురువుగారు వ్రాసే వ్రాఁతల సారం తేల్చడానికి వకటి చూపేను. పేరుపెట్టి యింకా దేనికేనా “యేమి చెపుతావు” అని గురువు గారుగాని వేఱొకరుగాని ప్రశ్నిస్తే యిట్లే జవాబు వ్రాస్తాను. యిది సుళువైన మార్గమని నాకు తోఁచి యిలా విన్నవించుకున్నాను.

★ ★ ★

# దోషావాచ్యా గురోరపి

(18-3-1936 సుధర్మ పత్రిక నుండి)

అనడం వల్ల గురువులది యేదేనా శబ్దమో అర్థమో తప్పుగా వున్న యెడల దాన్ని శిష్యుఁడికి తప్పనడాని కధికారం వున్నట్టు మనపూర్వులే అంగీకరించారు. అంతేకాని గురువుగారికి తప్పని తెలిసికూడా వొప్పే అని వాదించవలసిందని విధివాక్యం యేదీవున్నట్టు లేదు. అయితే గురువుగారు మాత్రం వారిది తప్పయినను నేను సమర్థించడం విధి అని రెండుమూడు సార్లు వ్రాసి వున్నారు. "చెరలాటంలో" అలా చేయక పోవడంచేత దుర్మార్గుఁడు, అని కూడా తేల్చారు. యింకొక చిత్రం "ఓగిరాల సుబ్బారావుగారి జోడు సేలువులు చేతికట్లు యిట్లు వ్రాయించినవి." అంటూ వక వాక్యం వ్రాశారు. యిది యేసందర్భంలో అనుకున్నారు. వారి ప్రతికక్షికి నేనిచ్చిన సదభిప్రాయాన్ని గుటించి కోపించే ఘట్టంలో. సదభిప్రాయ మిచ్చిందెప్పుడు? 24-7-30 సం॥ తేదీని. గురువుగారు వ్రాసే సేలువుల గొడవ 1935 సం॥ నవంబరులోది. అనఁగా నిన్న మొన్నటిది. అప్పుడేదో అనఁగా విశ్వకర్మ శిష్యుడుగారి ప్రసంగ సందర్భంలో ఒక వుత్తరం నా పేర ఆయన అంటే సుబ్బారావుగారు వ్రాశారు. నేను శ్రీవారి వద్ద చదివినవాఁడనే అని జవాబు వ్రాశాను. యీ ప్రసక్తి 1932 సం॥ సెప్టెంబరు ప్రాంతములోనిది. అంతే ఇటీవల ఆయనకున్నూ నాకున్నూ ప్రసక్తి లేదు. యింతలో నిన్న మొన్న దీపావళిముందు మా రెండవ చిరంజీవి హైదరాబాదుకు అవధానానికంటూ వెళ్ళేడు. అక్కడే వో కొన్ని సభలు జరిగాయి. అందులో కొందఱు ప్రముఖులు తండ్రిగారిని కూడా పిలిపిస్తే బాగుంటుందనుకొని నా పేర వ్రాశారు. నా అసమర్థత్వాన్ని నేను తెలుపుడు చేసి వూరుకున్నాను. అప్పుడేమో ఆసభలో నా ప్రతిమకు ముందుగా సేలువలు చేతికట్లు యిచ్చి ధూపదీపనైవేద్యాల మర్యాద జరిపేరట ! అదుగోఁ ఆ సేలువలు గురువుగారికి వ్యతిరేకంగా నేను 1930వ సం॥రంలో యిచ్చివున్న అభిప్రాయానికి కారణమయినాయఁట! యెంత సందర్భశుద్ధిగావుందో చూడండి. వనంవారు కొల్లాపురానికి తీసుకువెళ్లి వేయినూటపదహారు లిప్పిస్తా మనడంచేత అట్టి అభిప్రాయాన్ని నేనిచ్చినట్లు "శృంఖలం"లో వ్రాశారు. అబద్ధమైనా అది కొంత అతికినట్లుంది. యిదేమిటి? ప్రస్తుతానికి వద్దాం. యిలా విరోధాలు చూపడానికి మొదలెడితే యెంతేనా పెరుగుతుంది. గురువుగారు కృష్ణలో వ్రాస్తూ వుంటేమీరు సుధర్మకు పంపేరేమిటి! సుధర్మలో శిష్యుడు

బ్రహ్మంగారిచేత దుందుడుకుమాటలు వ్రాయిస్తూన్నారు. అందుచేత దీన్ని సుధర్మకు పంపేను. హెడ్డింగులో దోషాలన్నారు. యేమిటంటే శ్రీ జటప్రోలు సంస్థాన యువరాజుగారిని వివాహ సమయంలో ఆ సంస్థానపండితులు వనం సీతారామశాస్త్రుల్లు గారు అయిదుశ్లోకాలతో ఆశీర్వదించారు. ఆపండితునివల్ల మా గురువుగారికి ఆ సంస్థానంవారి వల్ల రావలసిన రెండు వేలరూపాయల లబ్ధి చెడిపోయిందట? ఆ హేతువుచేత కసితీర్చుకొనడానికి తోచి నట్లల్లా ఆ శ్లోకాలు విమర్శించి అంతతో తృప్తికాక "సీ.......... ఓయి సీతారామశాస్త్రి....... నీ కవిత్వము.......అశుద్ధము (యిందులో దిక్కుమాలిన పాడు అర్థము కవి వివక్షితము) అమంగళము. (కాఁబట్టి యీవేసవిలోనేత్వరగా) సంస్కార మొనరించుకొమ్ము." ఇత్యాదికంగా కొంత కర్ణకఠోరంగా వ్రాసివున్నారు. ఆ సందర్భంలోనే "కృష్ణవర్మను ప్రార్థించి" అని కూడా అన్నారు. యిందులో కొంచెం శ్లేషకూడా వుంది. అలా తగల బెట్టడం వల్ల నీవు "భూతిగలవాఁడ వగుదువు" అన్నారు. అంటే నీ కింత బూడిద దొరుకుతుంది. అని కూడా శాసించారు. గురువుగారి వాక్యాలకి మనం వ్యాఖ్యానం చేయడం కంటె వారి వ్యాఖ్యానాన్నే వుదాహరిస్తే యెక్కువ యుక్తంగా వుంటుంది కదా!

(దురుద్ధరదోషశృంఖలం 18వ పుట నుండి)

"సుధీమణి పద్యములలో భగవంతుఁ డవతరించినను సమర్థింప నేరనంత దోషమేమున్నదో? నీ కవిత్వము నీయింటిపేరును బోలి యున్నది. (వనము) కంటకాకీర్ణము, మహోపలావృతము, సాలావృకాది సత్వాన్వితము, సంస్కార శూన్యము, అమంగళము, అశుద్ధము, దోషైక వేద్యము రక్షఃపిశాచాంచితము" అని చెప్పి "కృష్ణవర్మను బ్రార్థించి" అనుగీతములో సంస్కార మొనరించుకొమ్ము = బాగుచేసికొనుము కాల్చివేసికొమ్ము, భూతి = ఐశ్వర్యము, బూడిది ఈ రెండుపదములు శ్లేషించినవి. ఇట్లు రెండర్థములు గలుగునట్లు చెప్పుట సుధీమణి తప్పనియే నేను చెప్పుచున్నాను. ఇన్ని దోషములు గలుగు పద్యములు లోకములో నున్నచో నిహపరములకు దూరము గావలసి వచ్చును. గాన లోకములో వానికి వ్యాప్తిలేకుండ కాల్చివేయుమని చెప్పిన నొప్పునని చెప్పుచున్నాను. యింతకన్న నిఁక నేదోషమును సుధీమణి పద్యములలో లేదనియుఁ జెప్పుచున్నాను. ఉన్నదని చెప్పఁగలవాడు బయలుదేఱినచో సమాధానము చెప్పుటకు నే నిదే సిద్ధముగా నున్నాఁడను...."

ఇత్యాదికముగా చాలా వ్రాసియున్నారు. యీ వ్రాఁతవ్రాయునప్పటికింకా ఆ పద్యములు తమవి కావని వాదించే తాత్పర్యంతోను సుధీమణి అంటే పుల్లెల శ్రీరామశాస్త్రుర్లుగారి తెఱచాటుననే తాముండి గురువుగారేదో వ్రాస్తూవున్నట్లు స్పష్టమేకదా?

ఆ తెఱలోవుండి వ్రాసేవ్రాతలో ఆయనది తప్పే అని కొంతవఱకు వప్పుకున్నట్లుకూడా వ్రాశారుకదా? ఆ తెరకాస్తా తీసివేస్తే ఆ పద్యాలు తమవే అన్నప్పుడు అందు అలా చెప్పగూడదని చెప్పినమాట స్వయంగా వప్పుకొన్నట్లయింది కాదా? యిఁక విశ్వకర్మ శిష్యుఁడిగారిచేత యేదో అసత్యప్రణాళికను వ్రాయించడ మెందుకు? తామేదో వ్రాయడ మెందుకు? వృథాపరిశ్రమయే కదా! ఆ పద్యాలు పుల్లెల శ్రీరామశాస్త్రుల్లుగారివే అంటారా? తాముతప్పన్నట్లే నేనున్నూ తప్పన్నాను. అందులో గురువుగారి మార్గాన్నే శిష్యుఁడు పట్టినట్లయిందిగాని వ్యతిరేకించినట్లు లేశమున్నూలేదే. అయితే యిప్పుడు కార్యార్థం, ఆ పద్యాలు వూరికే నామతః శ్రీరామశాస్త్రుల్లుగారి పేరు పెట్టేనేగాని నావే అని గురువుగారు వ్రాస్తూన్నారు. ఆ వ్రాఁతనే ఆక్షేపిస్తూ వున్నారు. కొందఱు పత్రికాధిపతులు, దాన్ని ఆక్షేపించి వూరుకోక వీరెన్నేని అసత్యాలాడతారని కూడా సూచిస్తారు. ఆ సూచన వూరికే పోతుందేమో అంటే పెండ్యాల వారికేసు అచ్చుపడడంచేత వూరికేపోదు. పోనీ అది నాకెందుకు? నాకు కావలసింది మనం వారి కవిత్వాన్ని తిట్టినతిట్లు గురువుగారివే అని వారు వప్పుకుంటూ వున్నప్పుడు నేను వారికి వ్యతిరేకంగా వెళ్లవచ్చునా అనేది మాత్రమే. వారు వెళ్లిన మార్గం మంచిదికాదని వారే వప్పుకుంటూవున్నట్లు వారిస్వంతమాట లుదాహరించానుగదా? వారెంత తప్పుగా వుందని వ్రాశారో అంతకు పదివేలరెట్లు తప్పుగా వుందని నాకుతోఁచింది. లోకానిక్కూడా నాకుతోఁచినట్లే తోస్తుంది అని నేను పూర్తిగానమ్మి ఆత్మవంచన లేకుండా గురువుగారికి కోపం వచ్చినా సరే అని సదభిప్రాయం యిచ్చానే అనండి. యిప్పుడు నన్ను సాధించడానికి మార్గాంతరం లేక సుధీమణి తెఱను దూరంగా తోసివేసి గురువుగారేలా వ్రాస్తూన్నారో!

"శ్రీరామశాస్త్రిగారికిని కొల్లాపురంవారికిని సంబంధములేదు. అందలి విషయమంతయు నన్ను పురస్కరించుకొని యున్నట్లును, నాకురెండు వేల రూప్యములు వనంవారివలన రాకపోయినట్లును, స్పష్టముగా మొదటి పత్రమే తెలుపుచుండినది. అందు మొదటి పంక్తిలోనే నా పేరున్నది..........."

పై అక్షరాలు తెరతీసివేసి గురువుగారు ప్రత్యక్ష మైనారన్నందుకే కాక ధనము చెడినదిగాన ఆ శ్లోకాలు తప్పంటినేకాని లేకపోతే అనేది లేదు అనే అంశాన్ని కూడా వ్యంగ్య మర్యాదచే స్పష్టీకరిస్తూ ఉన్నాయి. దాని మీఁద యింకా లాగితే "యిస్తే... యివ్వకపోతే" అనే సామెతలోకి కూడ దేఁకుతుంది. అందాకా మనకెందుకు, యింకొకమాటకూడా చెరలాటం, లోనుంచి గురువుగారిది యిక్కడ వుదాహరించి పైని అందుకుంటాను. "అది నేను వ్రాసినదని పూర్తిగా తెలియును" అది అంటేయేమి?

శ్లోకపంచక నిరాకరణం. వారికి అంటే యెవరికి నాకు అనగా వేంకటశాస్త్రికి. సరే. అప్పుడు తెరచాటుంది కనుక కొంచెము సందేహించడానికి కవకాశముందిగాని యిప్పుడది లేదు గనుక పూర్తిగా గురువుగారివే ఆ తిట్లు అని తెలిసికొన్నాను. గురువుగారు వ్రాస్తారుకదా! "మా యిరువురకున్న సంబంధముచే నా వ్రాఁతలలో తప్పులున్నను సమర్థించి వ్రాయుట తమకు విధియైయుండ" అని నన్ను నెపపెడతారు. యిదివరలో నాశిష్యత్వాన్ని హేయంగా తలఁచినా దీనికోసం అంగీకరించారు. ధన్యుణ్ణి. సామాన్యపు తప్పులైతే చూచుకోవచ్చు, వ్యాకరణ సంబంధమైతే యేలాగో బ్రహ్మయ్యశాస్త్రులవారి శుశ్రూష నుపయోగించి కొంత పెనుగులాడతానే అనుకోండి, యీ తప్పులాలాటివికావుగదా! పెండ్లి కొడుకును ఆశీర్వదించిన పద్యాలాయె. పద్యాలు చెప్పిన పండితుఁడు తమకు ద్వేషికాని ఆ యువరాజుగారు ద్వేషికాడాయె. "యినుమునుబట్టి అగ్గికి సమ్మెటదెబ్బలు" అన్నట్లు ఆయనక్కూడా బాధ కలుగుతూ వుందాయె. ఒకవేళ గురువుగారికోపం వస్తుందని నా ఆత్మను నేను వంచించికొని మా గురువుగారి ప్రవృత్తి సమంజసమే కనుక నేను మీ కభిప్రాయం యిచ్చేది లేదు. అంటానే అనుకోండి దానిమీఁద ఆపండితుఁడు మీకేలాతోస్తే ఆలాగే యివ్వండి అంటాఁడు కదా? దాని మీఁద ఆలాగే యిచ్చి నేను కూడా లోకుల నిందకు గురికావలసిందేనా! ఆ కారణంచేత నాకు తోచిన అభిప్రాయాన్ని నేను వ్రాసియిచ్చాను. దానిమీఁద గురువుగారికి కోపంవచ్చింది. ఆ కోపం అనేక మార్పులు పొంది అనేక వ్రాతలు వ్రాయిస్తూ ఉంది. దీన్ని సహించగలను గాని లోకనిందను సహించఁగలనా? యితర జమీందార్లతోపాటు నాకు కొల్లాపురం వారితో లేశమున్నూ సంబంధములేదు గాని వుండేటట్టయితే ఆ జమీందార్లే నన్ను అన్యథాగా అభిప్రాయమిచ్చే యెడల నిరోధించి అడిగే యెడల "మెమ్మెతెత్తే" అనవలసిందేకాని నోరు విప్పఁగలనా? గురువుగారు సులువుగా వ్రాసేమాట కనక "సమర్థించవలసిం" దని వ్రాస్తూన్నారు. నా శక్తి నేను చూచుకోవద్దా? వారు మఱికొందఱితో వాదోపవాదాలు పెట్టుకొన్నప్పుడు ప్రమాదపడిన విషయాలలో ఆ పండితులు నాకుత్తరం వ్రాస్తే గురువు గారికి చిక్కువస్తుందని అవలివారిని బతిమాలుకొని తప్పుకొన్నవిన్నీ కలవు. అందొకటి చూపుతాను. గురువుగారు శ్రీ శిష్టా నరసింహశాస్త్రులవారి మేఘసందేశాన్ని సుధీమణిగారిని కవచంగా పెట్టుకొని ఆక్షేపించినవాటిలో "ఫణిప, కణప" అనే శబ్దాలను రెండింటినీ తప్పన్నారు. ఆ శాస్త్రులు గారో? వారి కుమారుఁడో "ఫణిపయితాహే, కణపయితాహే" అని వక పెద్ద మహాపండిత కవిశేఖరుఁడి ప్రయోగాన్ని యిచ్చి, ఆ యీవిషయాలుగల వాగ్బంధం అనే పుస్తకాన్ని అభిప్రాయార్థం నా దగ్గఱకు పంపేరు. యివ్వక యేదోవిధంగా తప్పుకొన్నాను. యిస్తే యింత కాకపోయినా అదిన్నీ యెంతదాకానో మునిఁగేదే? యెంతగా గురుశిష్యులం

మేమిద్దఱమూ యేకమై కట్టుదిట్టంగా పనిచేసినా అసలు విషయం తప్పైనప్పుడు దాన్ని లోకం గ్రహించలేకపోతుందా? నేను శిష్యుణ్ణికనక నెపపెడుతూ వున్నారు గురువుగారు. లోకైక విద్వాంసులగు శ్రీశ్రీపాద లక్ష్మీనరసింహశాస్త్రులుగారు మా గురువుగారికి "అస్మద్గోత్రంవర్ధతాం" అనే తెగలోవారేకదా? వారు మాత్రం గురువుగారి తోవను సమర్థించడానికి పూనుకున్నారా? యెవ్వరూ బొత్తిగా అయుక్తంగా వున్నదాన్ని సమర్థించలేరు. కొందఱు ఆలాటి విషయాల్లో మనకెందుకని వూరుకొంటారు. నేనాలా చేస్తే బాగుండేదేకాని నాతత్త్వం ఆలాంటిదికాదు. ఆవలివారికి జవాబు చెప్పలేక పోయినప్పుడు వారిమతంలో చేరిపోవడమే నాతత్త్వం. అందుచే అభిప్రాయం యిచ్చాను. అందులో "తగల బెట్టుకొమ్ము, బూడిదకలవాఁడవవుతావు" అన్నమాటలు నన్ను పూర్తిగా బాధించాయి. యిప్పటికీ బాధిస్తూన్నాయి, తగలబెట్టుకొమ్మనడం మొదటి తరగతిదోషం, అశుద్ధం, అమంగళం, రెండో తరగతిలో చేరుతాయి. ఆ శ్లోకాలు చెప్పిన పండితుఁడేమీ లాకలూకాయ కాఁడు. పెద్ద తర్కవిద్వాంసుఁడు. వీరి ఆక్షేపణలకు జవాబువ్రాసి పండితుల అభిప్రాయాలు పుచ్చుకొని అచ్చొత్తించి "వట్టి వ్రాఁతలెందుకు శక్తివుంటే సభకు రావలసింది" అని గురువుగారిని ప్రార్థించివున్నాఁడు. వీరందుకు పూనుకొన్నట్లు లేదు. అది ఆలా వుంచుదాం తగలబెట్టుకొమ్మనడమున్నూ, శ్లేషగా అశుద్ధమనడమున్నూ అమంగళ మనడమూన్నూ పండితులకే కాదు మానవమాత్రులందఱికీ హేయంగానే వుంటుందని నా విశ్వాసం. దీన్నింకా సమర్థించే "శృంఖల" గ్రంథాన్ని నాలుగుమూఁడేళ్లు ఆపడమేకాక కొందఱు పెద్దమనుష్యులతో తగలఁబెట్టి నట్లుకూడా స్వయంగా చెప్పియున్నప్పుడేమో నన్ను జయించడానికి అచ్చు వేస్తారట! మార్చితే తప్ప నాకు దొరకిన ప్రతే అయితే అది వారికి అవమానాన్ని తెచ్చి తీరుతుంది. విశ్వకర్మ శిష్యుఁడుగారిచేత అబద్ధాలాడించడం మొదలు పెట్టేరు. సుబ్బారావుగారితో ముక్త్యాల విషయమేమీ విశ్వబ్రహ్మంగారు ప్రసంగించనట్టే యిప్పుడు "సుధర్మ" లో వ్రాయిస్తూవున్నారు. యేపత్రికలోనూ ప్రకటన అప్పటికి లేశమున్నూకాని నాముక్త్యాల విషయం బ్రహ్మంగారు అప్పటి ప్రసంగంలో తేకనే పోతే ఆ సుబ్బారావుగారికేలా తెలుస్తుంది? చదువరు లూహించుకోరా? యేదో వారికీ వీరికీ ప్రసంగం వచ్చింది. దానిలో వెం॥ శా॥ గారు చాలా గొప్పవారు. వారేమిటి కృష్ణమూర్తిశాస్త్రులుగారికి శిష్యులేమిటి అని సుబ్బారావుగారు నాయందు అభిమానంచేత అనివుండాలి. దానిమీఁద బ్రహ్మంగారు గురువుగారివల్ల విన్న సంగతులను మఱింత రసపోషణచేసి యేకరు పెట్టివుండాలి. యీయన బొత్తిగా ముక్త్యాలవిషయాన్నే స్పృశింపకపోతే ఆయనకు తెలియడానికి అవకాశం లేదు చూడండి యీ ప్రసంగానికి శృంఖలంలో గురువుగారు వెళ్లిన వాక్య ధోరణి తోడ్పడుతూవుంది. అంతేనేకాని, "నేను

కృష్ణశాస్త్రిగారి శిష్యుఁడనని చెప్పితిని, అప్పుడు సుబ్బారావుగారు మీ గురువుగారు వేంకటశాస్త్రిగారి శిష్యులట? కదా" అనిరి అని యిప్పుడు బొంకితే పోదు. యీబొంకులకేమి? అవసరాన్నిబట్టి బొంకుతూన్నారు బ్రహ్మంగారను కొందాం పైఁగానన్ను మందలింపచేయాలనికూడా ఆయనకు కుతూహలంగదా! సుబ్బారావుగారు మాటలాడడమే చేతగాని శుంఠ అనుకోవడానికి వీలులేదు. హైస్కూలులో కాబోలును టీచరనో లేక కాలేజీలో టీచరనో మన బ్రహ్మంగారు వ్రాస్తూనే వున్నారు కాని ఆయన యీయనతో చేసినట్లు యీయనవ్రాసిన ప్రసంగం నిజమే అయితే వట్టి దద్దమ్మగా భావించవలసివస్తుంది. బ్రహ్మంగారి మాటలంటూ గురువుగారెత్తిచూపిన వాటికంటే "సుధర్మలో" బ్రహ్మంగారు ఆడిన అబద్ధాలు కొంత సమన్వయంగానేనా వున్నాయి. ముక్త్యాలప్రసంగం రెండింటి లోనూ స్పృశించనే లేదు. సుబ్బారావుగారి కల్పనగా అపలపిద్దామనే బ్రహ్మంగారి వూహ. వుంటారు బుద్ధిమంతులు. వకరియిల్లు తగులబెట్టి తగులబెట్టలేదని కోర్టులో ఋజువు పర్చుకోగలిగారట యెవరో ఆమధ్య, అంతకన్న దీనిలో కష్టమేముంది? నరంలేని నాలుకేకదా? సత్యం అసత్యంగానూ, అసత్యం సత్యంగానూ కార్యార్థమయి అపలపించడానికి ఆ నాలుక కొందటికి తోడ్పడుతుంది. దీన్ని గురించి యీ మధ్యనే "ప్రజామిత్రకు" కాఁబోలును వ్యాసంవకటి పంపినట్లు జ్ఞాపకం. అయితే గురువుగారు కేవలం శుద్ధ అమాయికంగా వ్రాసినవ్రాఁతకన్న బ్రహ్మంగారు సమాయికంగా వ్రాసిన పూర్వోత్తర సందర్భం బాగా వుండడం చేత బ్రహ్మంగారిని మా సతీర్థులుకూడా కనుక అభినందిస్తూ "మాట తల పెట్టడం నాది తప్పే నాకంతటి అర్హతలేదు కాని యీ గాథకంతకూ మూలకారణం తమ హైదరాబాదు ప్రసంగమే అవడంచేత యెత్తుకోక తప్పిందికా"దని మనవిచేసుకొంటాను. పనిలోపని యింకొకటి కూడా మనవి చేసికొంటాను. అయ్యా! మీరు సుమారు అయిదాఱుమాసాల నాఁడు నావద్దకువచ్చి వక విషయమై నాసమ్మతిని కోరివున్నారు. నేను అసమ్మతిని తెలియఁజేసి వున్నాను. యీ అంశాన్ని పాలకొల్లు వ్యాసంలో కూడా గూఢంగా సూచించివున్నాను. ఇప్పుడు ప్రత్యక్షంగా మనవి చేసుకుంటూ వున్నాను. ఆపనిమాత్రం చేయకుండా వుండడానికి మిమ్ము ప్రార్థిస్తూ వున్నాను. నేను మీపేరెత్తినంత మాత్రంలోనే నా మీద మీకంత కోపం వచ్చి నన్ను మందలింపజేయాలని వ్రాయగలిగారే! దానిలో అంతతప్పున్నట్లు మీకు తోచిందండీఁ కానివ్వండి, యిప్పుడు యింట్లో గదిలో మాత్రమే కూర్చుండే వోపికలోవున్నాను. కొంచెం వోపికకలిగితే ఆశీర్వచనపు పద్యాలు తగులబెట్టటాన్ని సమర్థించడానికి మన గురువుగారు సభచేయించేయెడల ఆ సభకి యేలాగోవస్తినట్టాయెనా? తమ దర్శనం చేసుకోకపోను. అప్పుడు మందలింపచేసే ప్రయత్నం చేస్తురు గాని యింతలో తొందరెందుకు? తొందరే అంటారా? అయితే యీలోగానే అట్టి

సభను సమకూర్చండి. నాలుగు రోజులు వ్యవధిలో వుండగా తెల్పండి హైదరాబాదువారికి కూడా తెలియజేయండి. అప్పుడొక్క సుబ్బారావుగారు మాత్రమే వుండివుండరు. మఱికొందరున్నూ వుండివుంటారు. మీ ప్రసంగ సందర్భంలో వారున్నూ వస్తారు. వారివీరి సమక్షాన్నే మన గురువుగారి యెట్టయెదుటనే యితరులెందుకు? మీరే మందలిస్తురుగాని. మీకేం అధికారం లేదా? లేదనేవారుంటే చూచుకోవచ్చు లెండి. నరంలేని నాలుకకదా? అని దాన్నియేలాపడితే అలాతిప్పుదామని మీరనుకోవడం యుక్తమే. గురువుగారు యీలాటి ఆధారాలమీఁద బెండై వుండడం అనాలోచనపని. వారు ఆలోచన కలవారే అయితే వారిజీవితము మీచేత హరికథగా వ్రాయబడడానికి వప్పుకొంటారా? దాన్నాలావుంచుదాం. ప్రస్తుతం మీకు కావలసింది నన్ను మందలించడమేకదా? దాని ప్రయత్నంలో వుండండి, ఆశీర్వచనపద్యాలు తగలబెట్టుకొమ్మనడాన్ని గూర్చి కూడా పనిలోపని నన్నే మందలిస్తురుగాని, యితరుల దోషానికిక్కూడా యితరులు మందలింపఁబడడం యిప్పటి మనపరిపాలకుల మతగురువు బోధించిన విషయమే. అన్నిటికీ నన్నే మందలిస్తురుగాని. మీ హరికథలోవున్న చిత్రాతిచిత్రాలకుకూడా గురువుగారుగాని మీరుగాని సమాధానం చెప్పలేక పోయేయెడల నన్నే మందలిస్తురుగాని దాని కెవరినో అక్కరలేదు. పీఠిక వ్రాసిన శ్రీయుత టేకుమళ్ల అచ్యుతరావు పంతులు యమ్.యే.యల్.టి. గారినే అధ్యక్షులుగా కోరుకొందాం. వారే మందలిస్తారు కాబట్టి మనవి చేసుకొన్నాను. వెనుక మీపేరెత్తుకొన్నప్పుడు కూడా చాలా జాగ్రత్తగానే వ్రాశాననుకొన్నాను. యిప్పుడు మిక్కిలి వినయంగా చాలా గౌరవప్రదమైన మాటలనే యుపయోగించాను. అయితే మీకీమాటలు కూడా కోపకారణమే అవుతాయేమో? నన్నింత గౌరవించి వ్రాయడ మెందుకంటారేమో? తినబోతూ రుచులెందుకు? ముందు మీ ధోరణినిబట్టి యేలావెళ్లమంటే ఆలాగే మీ ఆజ్ఞానుసారం వెడతాను. మీకు నామీద కోపంవచ్చింది కాని నేను మిమ్ములనుగూర్చి వ్రాసేఘట్టంలో ఇటీవలి చర్యలో మీదోషం లేశమున్నూ లేనట్లే వ్రాసివున్నాను. దాన్ని దిద్దక ఆలాగే వుంచుతాను. దాన్ని వుదాహరిస్తాను.

క. "ఇం దొకయంశము పరికిం
పం దగు "ముక్త్యాల" చరితపట్టున బ్రహ్మం
బుం దెగడరాద గురువరు
లందులకున్ మూలభూతులగుట ధ్రువంబౌ"

యేమైనాసరే? శిష్యులంటే మీరే శిష్యులు గురువుగారి యుద్దేశాన్ననుసరించి యేలామార్చి వ్రాయాలంటే ఆలా వ్రాస్తూన్నారు. ఆ త్రోవచేతకాకే నేను గురువుగారికి ద్వేషినైనాను. మీరు గురువుగారి హృదయం బాగా కనిపెట్టేరు. తప్పులున్నను సమర్థించాలని

గురువుగారన్నమాట మీరు నిర్వహిస్తూవున్నారు. యిప్పుడీ విషయం మీవద్ద చదువుకుంటే గురువుగారి అనుగ్రహానికి నేనున్నూ పాత్రుణ్ణి కాఁగలను. కాని అరవై యేండ్లున్నూ కాక అఱవైయాఱేండ్లు దాఁటవచ్చాయికదా! యీ విద్యాభ్యాసం జరుగుతుందా? "నందోరాజా భవిష్యతి" దీనికేంగాని మందలింపుకోసం సభ కూర్చే ప్రయత్నం చేయండి. దానిలోనే "ఆశీర్వచనపు పద్యాలు తగల బెట్టడం" ప్రసక్తినికూడా రాజమండ్రిలో ప్రముఖులు కొందఱేనా కలగజేసుకొని తేలుస్తారు. యీలాగానే ఆ యీ సందర్భాలువున్న "దురుద్ధరదోషశృంఖలాన్ని" ప్రచురించేలాగున్నారు. గురువుగారిని వారి "చెరలాటం"లో వున్న ధోరణి తెలుపుతూ వుంది. అంత వరకేనా నిరీక్షింపవలసిందని నావిజ్ఞాపనగా మనవిచేయండి. నేనువ్రాసే మాటలు దూరాలోచన కలవిగా వుంటేనే స్వీకరించమనండి, బ్రహ్మకైనా కాదు భగవంతునకైనా సమర్థించడానికి "తగుల బెట్టమనడం" శక్యం కాదని మళ్లా మనవిచేసుకుంటూ విరమిస్తూవున్నాను. విరమిస్తూవకమాట వ్రాస్తూవున్నాను. శ్లోకపంచక నిరాకరణంలో చాలావ్యత్యాసాలు గురువుగారు వ్రాసివున్నారు. ఆ వ్యత్యాసాలతో నాకుపనిలేదు, తుట్టతుదిని "అమంగళం, అశుద్ధం, తగలఁబెట్టుకొమ్ము, బూడిద దొరుకుతుంది" అనే ప్రసంగాన్ని రాజమండ్రి పౌరులలో అష్టాదశ వర్ణస్థులలో నెవరిచేత నేనా సమర్థింపిస్తే నేను తమపాదధూళిని శిరసావహించడంలో విశేషమేముంటుందిగానీ మీ విశ్వబ్రహ్మశిష్యుఁడి పాదధూళిని శిరసావహిస్తాను. ఆ పిమ్మట యీ అంశాన్ని కూడా చేర్చుకొని మీ దురుద్ధరదోషశృంఖలాన్ని మీరు ప్రకటిస్తే చాలా శోభగా వుంటుందని మనవి చేసుకుంటూవున్నాను, గురువు గారిని గూర్చి యీపని జరిగేలోగా మాత్రం దాన్ని ప్రకటించవద్దని పునరుక్తిగా కనపబడినప్పటికీ మళ్లామళ్లా వ్రాస్తూవున్నాను. ఆ తగల బెట్టడాన్ని సమర్థించలేక నేను మీ ప్రత్యర్థికి మీకు వ్యతిరేకించే మాటలతో అభిప్రాయ మిచ్చాను. మీవిన్నీ యిలాంటివి యితర ప్రసంగాలుకూడా వున్నాయి. అవియేలాగో తప్పుకుంటే తప్పిపోయాయి. ఆదేశాన్నుంచి యీ దేశం వచ్చి "మీ కెంతతోస్తే అంతే యివ్వండి" అంటే జవాబు చెప్పలేక పోయాను దీన్ని సమర్థిస్తే యిఁక మనకు వాదోపవాదాలక్కరలేదు. అబద్ధాలాడుతూ వున్నారు. అని పత్రికల్లో పెద్ద హెడ్డింగులు పడనక్కరలేదు. యిందులకే ప్రయత్నించండి. క్షమించండి, ఆ హెడ్డింగులు పెట్టేవారు నా కేలాటి మిత్రులో తామే యెరుఁగుదురు. వారు నా కనుకూలంగా వ్రాస్తూవున్నా అందులో లోపాలను కూడా నేను సహించేదిలేదు. యీ విషయం ముందు దేవర వారికి నావ్రాఁత వల్లనే స్పష్టపడుతుంది. దానితో వెం॥ శా॥ తత్త్వం తమకేకాక లోకానిక్కూడా విశదమవుతుంది. యెప్పటికి యథార్థము యథార్థమే. కపటం కపటమే. యింతే నామనవి.

★ ★ ★

# నేఁడు

(19-3-1936 సం॥ర కృష్ణాపత్రిక నుండి)

మిక్కిలీ సుదినమని సంతోషించా లనుకున్నాను. భార్య చనిపోయిన రోజులుగదా యివి! యీ రోజులలో సుదినం యెక్కడి నుండి వస్తుందని నీవనుకున్నావని లోకులు ప్రశ్నింపవచ్చును. వినండి. మంచిలో చెడ్డ, చెడ్డలో మంచిన్నీ కలుగుటకూడా అప్పు డప్పుడు సంభవిస్తూ వుంటుంది కదా? యీ రెండు అంశాలున్నూ యిప్పుడే నాకు అనుభూతమైనాయి. చి॥కుఱ్ఱనికి వడుగున్నూ, చి॥సౌ॥ పెద్దపిల్లకు శోభనమున్నూ జరిగించి సంతోషిస్తూవున్న సమయంలో భార్యా వియోగం తటస్థించింది. యిది మంచిలో చెడ్డగదా! యిఁక చెడ్డలో మంచేమిటంటే? యీ భార్యా వియోగపు దినాలలో శ్రీ మా గురువులు శ్రీశ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రులవారు నేనింకా నిద్దురమంచము నుండి లేవని పూర్వమే పరామర్శ నిమిత్తం శ్రీయుత బెజవాడ వేంకటస్వామి నాయఁడుగారినిన్నీ, గొర్తి సన్యాసిగారనే నా బాల్యమిత్రుఁడుగారినిన్నీ, మఱియొకరినిన్నీ వెంటబెట్టుకొని యీ వేళ దయచేశారు.

పత్రికలలోకాలాలకు కాలాలుగా అవిచ్ఛిన్నంగా యేవో వ్రాఁతలు నడుస్తూవున్న సమయంలో శ్రీవారు నన్ను వోదార్చడానికి రావడం చెడ్డలో మంచిగా నా మనస్సులో తోఁచి శ్రీ నాయఁడుగారున్నూ సన్యాసిగారున్నూ మా యిరువురకున్నూ అత్యావశ్యకులగుటచే యీ విషయం యీ మిషమీఁద ఆగిపోతుందనే హేతువుతో గురువుగారితో కలిసికొని వచ్చివుంటారని నే నభిప్రాయ పడడంలో తప్పులేదు కదా? ఆ కారణం చేత కొంతసేపు ప్రకృతకాలోచితమైన ప్రసంగం జరిగిన తరువాత నేనే, శ్రీ గురువుల పాదములపై శిరస్సుమోపి “అయ్యా, వ్రాఁతలో పరస్పర విరుద్ధాలు పడుతున్నాయి, దీనివల్ల లోకానికి అసత్యము వ్రాసినట్లు తోఁచడానికి అవకాశం కలుగుతూవుంది. జరిగిందేమో జరిగింది. యిఁక దీనినుండి విరమించి లోకానికి సంతుష్టి కలిగించుదాము” అని మనవి చేసుకున్నాను. దానిమీఁద బ్రహ్మాండమైన కోపావేశం తెచ్చుకొని గురువుగారు, “నేను పరామర్శించుటకు వచ్చితినేకాని యిందుకురాలేదు. నీ వ్రాఁతలవల్ల నా భారతానికిన్నీ, నా బిరుదులకున్నూ చాలా హానికలిగింది, కొల్లాపురపు పండితుఁడల్లాటివాఁడు యిల్లాటివాఁడు. అతనికి నీవు నాకు వ్యతిరేకంగా అభిప్రాయం యిస్తావా? తప్పైనా వొప్పైనా నా పక్షాన్నే వుండి

తీరవలసింది" అంటూ పెద్దస్వరంతో మాటలాడి, నావలెనే జబ్బుస్థితిలో వుండడమే కాకుండా హార్టుజబ్బుకూడా వున్న వారవడం చేత, "యిదేం చిక్కురా భగవంతుఁడా" అని నేను భయపడేస్థితికి కూడా వచ్చి యెట్లో కొంతసేపటికి భగవదనుగ్రహం వల్ల మరల కుదుటఁబడి క్షేమంగా రాజమండ్రికి దయచేశారు.

వెంకటస్వామి నాయఁడుగారేనా కొంత సూచిస్తే నేనీ ప్రసంగం యెత్తకపోదును. నేను కొలఁది నాళ్లక్రిందట జరిగిన చిరంజీవి వుపనయనానికి విద్యార్థి ద్వారాగా ఆహ్వానమంపినపుడు బెడిదంగా జవాబు చెప్పినారు. అట్టివారిప్పుడు దయచేయడం వల్ల యీ వాదోపవాదాలు ముగింపు చేయడం కూడా వారికి సమ్మత మేమోనని వూహించుకొన్నాను. యిది నా పొరపాటే, వారికి జయం యీ విషయంలో యింకా కలుగుతుందనే పూర్ణమైన విశ్వాసం వున్నట్టు వారి వాక్యధోరణి వెల్లడిచేసింది. కోర్టు సభ కాదని వాదించడానికి సిద్ధంగా వున్నారు. శ్రీవారికొమార్త కవయిత్రి అని నేను వ్రాసిన మా "ముత్తాత" వ్యాసంలో వున్న అక్షరాలు చూపించాను. అదిన్నీ వారు విశ్వసించినట్లు లేదు. యేదో పత్రికలు నింపడమే వారి వుద్దేశం కాని అది నిల్చేదా? నిలవనిదా? అనే చర్చతో వారికి అవసరం లేశమున్నూ వున్నట్టు వారి ధోరణి కనపడడంలేదు. యింక వారిని ప్రార్థించిన లాభంలేదు. కాఁబట్టి పత్రికలవారిని ప్రార్థించి చూస్తాను. అయ్యా పత్రికాధిపతులారా! మీకు కూడా కొంత పరిశీలకత్వం వుండాలా? వద్దా? "దున్నపోతు యీనిందంటే దూడని కట్టెయ్యండి" అనే మోస్తరుగా మీ ప్రకటన వుండవచ్చునా? యెవరినో వకరిని వారి వ్రాఁతనుబట్టి మీ వ్రాత అసంగతంగా వుంది అని మందలించడానికిగాని ఆకారణంచేత మీ వ్రాఁత ప్రకటనార్హం గాలేదని తెల్పుటకు కాని మీకు అధికారం వుందా? లేదా? సహేతుకముగా మీరు యుక్తాయుక్తతలు తెలిపితే కూడా పక్షపాత దోషం తగులుతుందా అని మిమ్ము ప్రశ్నిస్తూ వున్నాను. "వకటేమాట లేక సూక్ష్మోపాయం" అనే శీర్షిక క్రింద నేను శ్రీవారు కోర్టులో చెప్పినమాటలు వుదాహరించి వుంటిని. కోర్టులో చెప్పేమాటలు ప్రమాణం మీద చెప్పేవేకదా, వాటినే కాదంటేయింక గతియేమి? అట్టివారెవరయినా గురువులే కానిండు; యేదో వ్రాసి నాకు వృథాగా పని కల్పించి బాధిస్తూవుంటే తటస్థంగా వుండడం మీకు ధర్మమేనా? ఆ వ్రాఁతలో సారంవున్నట్లు మీకు తోస్తే దాన్నేనా మీరు ప్రకటించండి. నాకు వారు కృతఘ్నుత్వాన్ని ఆరోపించి వ్రాశారు ముందుగా "శృంఖలం" అనే పుస్తకంలో. ఆలా వ్రాయడానికి కారణం, నేను వారి ప్రతిపక్షి పండితుఁడికి సదభిప్రాయం యివ్వడ మంటారు గురువుగారు. నే యిచ్చిన మాట సత్యం. ఆ పండితుణ్ణి గురువుగారు ఆడిన దుర్భాషలకు నేను సహించలేకపోయాను. కాఁబట్టి గురువుగారికి వ్యతిరేకమైనా న్యాయమవడం చేత ఆలా అభిప్రాయం యిచ్చాను. దానిమీఁద

నన్ను మిక్కిలిగా దూషించారు గురువుగారు శృంఖల గ్రంథంలో. అది నాకు దొరికింది. నాలుగేండ్లెట్లో సహించాను. కనుకనే వారి కాలికి ఆ మధ్యకాలంలో మహాసభలో పెండేరం తొడిగాను. పిమ్మట మాఖాంతము చదివినాఁడు అనే శుద్ధాబద్ధపు వుత్తరం కూడా హైదరాబాదుకు వ్రాసినది బయలు పడ్డది. అప్పుడు వ్యాసత్రయం రాసినారు. అందు మృదువు తప్పలేదు. విషయమంతా యింతే. దీన్ని మీరే విచారించి యేదో తేల్చండి. యిఁక నేనేమిన్నీ వ్రాసేది లేదు. యెందుకు? గురువుగారి వ్రాఁతలో సారం నాకు కనపడడం లేదు. లోకానిక్కూడా కనపడడం లేదని తేలితే నా కంతటితో సంతృప్తి. అందుకై మిమ్మిట్లు ప్రార్థించడం. లేదు, నాదే తప్పుగా వున్నట్లు తోస్తే ఆ మాటేనా వ్రాయండి. అదిన్నీ మీకిష్టం లేకపోతే యీ వ్యాసాన్ని యీ వుత్తరం సహా ప్రకటించి వూరుకోండి. యేం చేస్తాను.

★ ★ ★

# ఆత్మవంచన

(11-4-1936 సం౹౹ర కృష్ణాపత్రిక నుండి)

ఆత్మవంచన చేయడం కొంతమందికి చాలాతేలిక. అందుచేత ఆత్మవంచనను చాలామంది చేస్తూవుంటారు. యీ చేయడంలో అనేక సందర్భాలు వుంటాయి. కొన్నిటిలో భక్తి, కొన్నిటిలో మొగమాటం, కొన్నిటిలో భయం, కొన్నిటిలో ప్రేమ, కొన్నిటిలో కోపం, యిలాటివి హేతువులుగా వచ్చి ఆత్మవంచన చేయవలసివస్తుంది. వీటి నన్నిటిని గూర్చి వ్రాస్తే గ్రంథం చాలా పెరుగుతుంది. కాఁబట్టి దీనిలో ప్రేమ అనే ప్రబలకారణం వున్నప్పటికీ ఆత్మవంచనకు అంగీకరింపక యిహ పరలోకాలకు స్తోత్రపాత్రుఁడైన వక మహోద్యోగిని గూర్చి కొంత వ్రాస్తాను. పేరుపెట్టి వ్రాస్తే అదేంచిక్కో కనుక పేరుపెట్టకుండానే వ్రాస్తాను.

అనఁగా అనఁగా వక మహాపట్నం. ఆ పట్టణంలో మిక్కిలి ప్రసిద్ధి చెందిన వక ఆఱువేల నియోగుల కుటుంబము వుంది. ఆ కుటుంబంలో అనాదిగా సుప్రసిద్ధులే బయలుదేరుతూ వచ్చారు. అందులో "వ్రతానా ముత్తమవ్రతం" అన్నట్టు వక మహాయోగజాతకుఁడు వుదయించాఁడు. ఆయన క్రమక్రమంగా పెద్దవాఁడై చదువు సంధ్యలు ముగిసిన తర్వాత వుద్యోగంలో ప్రవేశించి దినదినాభివృద్ధిగా శుక్ల పక్షచంద్రుఁడులాగ అఖిలజన ప్రేమపాత్రుఁడై కొంతకాలం వెలిఁగివెలిఁగి 'పెన్షన్" పుచ్చుకొని సుఖంగా ఋషిప్రవర్తనతో జీవనం చేస్తున్నాఁడు. ఆయనకు నలుగురో అయిదుగురో కొమాళ్లు. అందఱికీ గొప్పగొప్ప వుద్యోగాలే తటస్థించాయి. అందులో వకకుమారుఁడు తహశ్శీల్‌దారీ పెళపెళ్లాడిస్తూ వున్నాఁడు. ఆయనక్కూడా పెన్షన్ రోజులు సమీపానికి వస్తూవున్నాయి. ఆ కాలంలో "లంచంలేని మాటా పుంజంలేని బట్టాలేదు" అనే సామెత ననుసరించేవారే వుద్యోగస్థులలో నూటికి తొంభైమంది అని అందఱూ యెఱిఁగినదే. మన తహశ్శీలుదారు గారుకూడా కలియుగ రావణాసురుఁడు వంటివాఁడే కనుక లంచాలు విశేషించి పుచ్చుకొనేవుంటారు కాని యే కేసులోనూ చిక్కుకోకుండానే తెలివితేటలు కలవాఁడు కనక కాలక్షేపం చేసుకు రావడంచేత పై అధికార్లకు చిక్కవలసిన అవసరం లేకపోయింది. లక్షో రెండులక్షలో నిల్వచేశాఁడు. కాని పిల్లాజెల్లా బాధమాత్రం లేశమున్నూ లేదు. యిలాటి సందర్భంలో అంత ద్రవ్యం నిలవచేసి వున్నప్పుడు కొంత సంతృప్తి ఆయనకు వుండవలసిందే

కాని దిక్కుమాలిన ధనం అది సంతృప్తి అంటూ ఎవ్వనికీ కలగనివ్వదు. యిది సర్వానుభవసిద్ధం కనక విస్తరింప నక్కఱలేదు.

"ప్రాయోధనవతా మేవధనే తృష్ణా గరీయసీ" అన్నారు పెద్దలు. ధనవంతులకు ధనమందున్నదంత ఆశ దరిద్రులకుండదు. దీనికెన్నో వుదాహరణాలు చూపవచ్చును. అందఱికీ తెలిసిన విషయానికి వుదాహరణాలు చూపి కథ పెంచడమెందుకు? మన తహశ్శీల్దారుగారు అప్పటికే రెండు లక్షలకు అధికార్లయివుండి నెలకు రెండో మూడో వందలు జీతం తీసుకుంటూవుండి యింకా రైతులు మొదలైనవారు యిచ్చే నేయి, పెరుఁగు, కూరలు, నారలు, వగయిరా సంపత్తికలిగి సుఖంగా కాలక్షేపం చేస్తూ అనుకున్నారుగదా మనం కొద్దిరోజుల్లో యీ వుద్యోగాన్నుండి తప్పుకోవలసివస్తుంది, చేయడానికి వోపిక వున్నప్పటికీ వయస్సతీతమవడం చేత పైవాళ్లు నిర్బంధించి సాఁగనంపుతారు. అప్పుడేదో కొంత "పెన్షన్" యిస్తారుకాని యిస్తేమాత్రం యీ మజా వస్తుంది కనకనా? అందుకే "అధికారాంతమునందుఁ జూడవలదా? ఆయయ్య సౌభాగ్యముల్" అన్నారు పెద్దలు. యింకా అధికారాంతమందు చాలా విశేషాలు వుంటాయంటారు, వాట్లను గూర్చి యెన్నోకథలు చెప్పుకోవడం నాకున్నూ తెలిసిందే. తెలియడానికేముంది. యిదివఱలో వుండే పలుకుబడి లేశమున్నూ వుండదు. యిది సర్వానుభవ సిద్ధమే. అట్టి స్థితిలో కూడా యిప్పటి వలెనే జరగాలంటే బాగా ధనం చేతులో వుండాలి. వుంది గదా కొంత నిలవ, అంటే, వుందే అనుకుందాం. "కూర్చుని తింటే గుఱ్ఱా చెఱ్ఱా ఆగవు" గదా? అని ఆలోచించి అధమం పదిలక్షలేనా ఉద్యోగం చాలించుకునేనాఁటికి ధనం నిలవ వుండేటట్టు చేసుకోవాలి అని మనకథా నాయకుఁడుగారు సంకల్పించుకున్నారు. దానిమీఁద రాజకీయమైన ధనాన్ని అపహరిస్తే తప్ప లంచాలవల్లా గించాలవల్లా మనోరథం నెఱవేఱేటట్టు కనబడలేదు. అంతట్లో జమాబందీరోజులు వచ్చాయి. యేడెనిమిది లక్షల పయికం సర్కారుకు తాలూకానుండి జిల్లాకు పంపవలసి వచ్చింది. మనకలియుగ రావణాసురుఁడుగారు కొంతమంది దొంగలను తోవలో సిద్ధంచేశారు. వాళ్లు రాజకీయ భటులను చావఁదన్ని పైకం యావత్తూ దోఁచుకున్నారు. తహశ్శీల్దారుగారు దొంగల కేర్పాటు చేసిన ప్రకారం కూలియిచ్చి వేయడమే కాకుండా అదనంగా కూడా సంతోషపెట్టి యెక్కడో ఆపయికాన్ని భూస్థాపితంచేసి జరిగిన వుపద్రవాన్ని నేర్పుగా సర్కారుకు తెలియపఱచుకొన్నారు.

పై అధికార్లు వచ్చారు. విచారించారు. వాకపుచేశారు. పాపం దాఁగుతుందికనకనా యేదో కొంత వాసన కొట్టడం మొదలెట్టింది. అంతేకాకుండా మనం ఆత్మని యెంతవంచించి

అసత్యాని కంగీకరింపఁ జేసినా అసలు దాని స్వభావం సత్యసంధత్వమే కనక తహశ్శీలుదారుగారి ముఖవైఖరిని బట్టియేమి, మాటల తబ్బిబ్బునుబట్టి యేమి, కేసు పూర్తిగా బిగిసింది. ధనమున్న చోటు కూడా బయటఁబడింది.

యిప్పటి అధికార్లకున్నూ అప్పటి అధికార్లకున్నూ చాలా భేదం వుంటుంది అని అందఱున్నూ వప్పుకొనే సంగతే కనక దాన్ని గుఱించి వేఱే వ్రాయనక్కరలేదు. విచారణాధికారి మన తహశ్శీలుదారుగారి తండ్రి పేరు ప్రతిష్ఠలను గూర్చిన్నీ అసిధార వ్రతాన్ని గూర్చిన్నీ బాగా యెఱిఁగివుండడంచేత అతన్ని రప్పించి " మీ కుమారుణ్ణిగూర్చి మీరేం చెపుతా"రని సగౌరవంగా ప్రశ్నించాఁడు. దానిమీఁద మన తహశ్శీలుదారుగారి తండ్రి యేలా చెప్పాలో అలాగ, ఆత్మవంచన లేశమున్నూలేకుండా వున్న దున్నట్టు ప్రేమపాశాన్ని తెగఁదెంపి పబ్లీకు న్యాయసభలో యేకరుపెట్టాడు. అధికారి ఆయన యథార్థ వాదిత్వానికిన్నీ నిష్పక్షపాతిత్వానికిన్నీ అత్యాశ్చర్య పడి ముక్కుమీఁద వేలెట్టుకొని నిర్ఘాంతపోయాఁడు. అబ్బా! యీ హిందువులలో యిలాంటి మహానుభావు లున్నారా అనుకొన్నాఁడు. అనుకొని యిందుకు ప్రతిఫలం మనం యేంచేయాలని అట్టే వితర్కించాఁడు. వితర్కించి, సరే! యితణ్ణి యేంచేయమంటారని మళ్లా ప్రశ్నించాడు. దానిమీఁద నిర్మొగమాటంగా నిర్దాక్షిణ్యంగా చెప్పేఁడుగదా ఆయన "రాజద్రోహికి యేం చేయవలసిందని ధర్మశాస్త్రం చెపుతుందో ఆ ప్రకారం చేయవలసిం" దన్నాఁడు దానిమీఁద అధికారికి మఱీ అనుగ్రహం పుట్టింది. పుట్టి మళ్లా అన్నాఁడుగదా "అయ్యా, మీ యథార్థవాదిత్వానికి నాకు చాలా ఆశ్చర్యమవుతూవుంది. యేమంటారా? లోకంలో దుర్మార్గుఁడైనా సరే, సన్మార్గుఁడైనా సరే, కొడుకంటే తండ్రికి అభిమానం వుండి తీరాలి. ఆ అభిమానాన్ని పట్టి ఆత్మను వంచించి యెంతటి అబద్ధమేనా ఆడితీరాలి. అట్టి సందర్భంలో గర్భవాసప్రీతిని లేశమున్నూ గణింపక నీవు ధర్మానికే కట్టుబడ్డావు. యిట్టి నిన్ను సంతోష పెట్టకపోతే భగవంతుడు నన్ను క్షమించడు. కాఁబట్టి నీ కోరిక యేదో చెపితే ఆ కోరికను నేను నెఱవేఱుస్తాను. సంశయింపక చెప్పవలసిం" దన్నాఁడు. దానిమీఁద మన కథానాయకుఁడుగారి తండ్రి, అయ్యా! నాయందుమీకట్టి అనుగ్రహమే నిశ్చయంగా కలిగినట్టయితే తప్పుచేసిన నా కొడుకు వుద్యోగం తీసివేసి పెన్షన్‌కూడా కొట్టేసి ఖైదుశిక్షలేకుండా మాత్రం వదలిపెడితే నన్ను మీరు సమ్మానించినట్టే సంతోషిస్తానన్నాఁడట ఆ మహానుభావుఁడు. దానిమీఁద అధికారి మనం యెంత జాఱవిడిచినా యీ పుణ్య పురుషుఁడు వున్న అవకాశాన్నంతనూ వుపయోగించుకోనేలేదని ఆశ్చర్యపడుతూ అదే ప్రకారం చేశాఁడఁట. అప్పటి నుంచీ ఆ తహశ్శీలుదారుగారి తండ్రి చరిత్రను సత్యప్రియులైన

వాళ్లు చెప్పుకొని మా హిందువులలో, బ్రాహ్మణులలో, నియోగులలో, యిలాటి వారుండేవారని పొంగుతూ వుంటారు.

అన్నిటికన్నా ఆత్మవంచన చాలాకష్టం. అబద్ధం ఆడి పొందే గౌరవంకన్న నిజమాడి పొందే అగౌరవం అనేక రెట్లు మెఱుఁగని నేననుకుంటాను. నా కెప్పుడున్నూ యీలాటిచిక్కు తటస్థింపలేదుగాని తటస్థిస్తే యీలాగే వర్తిద్దామని చాలారోజుల నుంచి నా సంకల్పం. నా మాటేలా వున్ననూ మావంశంలో యీలాటి ప్రవర్తన కలవాళ్లు చాలామంది వున్నట్టు వినికి. మా నాన్నగారి ప్రవర్తన యిట్టిదే అని నేనెఱుఁగుదును. ఆయనకు శ్రుతపాండిత్యం తప్ప మంచి చెడ్డలు తెలిసికోవడానికి తగ్గ చదువు సంధ్యలు లేశమున్నూ లేవు. లేకపోయినా కవులలో చాలాభాగం ఆచారం యేలా వుంటుందంటే : మా నాన్నగారంత వారు, మా తాతగారంతవారు అని వ్రాసుకోవడం సర్వత్రా అనుభూతం. నాకు వంశాచారాన్ని బట్టో యేమో! ఆత్మవంచన చేసుకోవడం చేఁతకాక మాతండ్రిగారిని గూర్చి అతిశయోక్తిగా వ్రాయక "కామయ మనుమఁడు రామాంబకొమరుండు తండ్రి కామయ్య సత్యనిరతుండు" అని మాత్రమే వ్రాసి సంతుష్టిపడ్డాను. ఆయనే కాదు మా వంశంలో ముప్పాతిక ముప్వీసంపాళ్లు అంతా అమాయికులే అని మా బంధుజాత మేమి, మమ్మెఱిఁగిన తదితరులేమి నిర్వివాదగా అంగీకరిస్తారు. యీ అమాయికత్వాన్ని హాస్యం చేసే బంధువులు వెఱ్ఱిగా కూడా భావించి "చెళ్లపిళ్ల వెఱ్ఱి" అని కూడా వాడుతూవుంటారు. మా తండ్రులు ముగ్గురన్నదమ్ములు. ముగ్గురును అమాయికులే. అందులో మా తండ్రిగారే కొంత గడుసువారు.

లేక లేక యెన్నాళ్లకో నాకు సంతానం కలిగింది. ఆ చిరంజీవికి నాలుగేండ్లు దాటేరోజుల్లో మా తండ్రిగారు పరమపదించారు. ఆలోఁగా వకనాఁడు దంపుదంపే మనుష్యులు కాఁబోలును మా తండ్రిగారితో వారి మనుమణ్ణి గూర్చి, అయ్యా తాతగారూఁ మీమనుమఁడికి మీ పేరెట్టేరు కనక మీలాగే బతకాలండి అన్నారు. దానిమీఁద విని ఆయన ఊరుకో వచ్చునా? వూరుకోలేదు. నాలాగే సంచరిస్తే నాలాగే బతుకుతాఁడు పొమ్మని జవాబు చెప్పేఁడు. యింతకూ వ్రాసేదేమిటంటే ఆయన ఆత్మవంచించడం చేఁతకానివాఁడు కనుక సత్యసంధుణ్ణి అనే నమ్మకం ఆయనకి స్వవిషయంలో పూర్తిగా వుంది. సత్యసంధులకు పుణ్యలోకావాప్తి తప్పదని వేదశాస్త్రములు ఘోషిస్తాయి. యీ యేకాదశీమరణం పుణ్యలోకావాప్తికి మూలకారణంగా నిర్వివాదంగా అందఱూ వప్పుకుంటారు. ఆయన యెనభై మూఁడు వత్సరాల వయస్సులో అనాయాసంగా యేకాదశినాడు పరమపదించారు. ఆ పరమపదించడంలో కూడా కొంత విశేషం వుంది.

ఆయనకు కష్టక్లుప్తిమీఁద తప్ప తేలికగా చేవ్రాలు చేయడం కూడా బాగారాదు. కాని వినికిమీఁదన యేదేనా వచ్చే బుద్ధిచుఱుకు మాత్రం వుంది. చిన్నప్పుడు వీథిభాగవతాల వినికివల్ల కొంత గాలిగా సంగీతం పాడడం అభ్యాసముంది. పిమ్మట కుటుంబ సంరక్షణ జరగక వ్యవసాయం కట్టిపెట్టి యానాం గ్రామం కాపురానికి వెళ్లిన తరువాత అక్కడ శివ విష్ణ్వాలయాలలో జరిగే సేవలకు తఱుచు సంగీతం పాడడానికి వెళ్ళే సందర్భంలో ఆ దేవాలయాల్లో వినికివల్ల కొంతమంత్రపుష్పం ఆయనకు ధారణకు వచ్చింది. మరణ సమయానికి పురాకృత సుకృతంవల్ల ఆ మంత్రపుష్పంలో "నీవారశూకవత్తన్వీ పీతాభాస్వత్యణూపమా, తస్యాశ్శిఖాయామధ్యే పరమాత్మా వ్యవస్థితః" అనే ఘట్టాన్ని యేకరుపెట్టి అసకృదావృత్తి చేయడమున్నూ, యేకాదశి మరణాన్ని పొందడమున్నూ నేనేకాక మా బందుగులలో కూడా కొందఱెఱుఁగుదురు.

అదివఱకే నాకు సత్యమంటే అభిలాషమెందు. దాన్నిఁబట్టే నేను గీరతం గుంటూరిసీమలో వ్రాయడం తటస్థించింది. మాతండ్రిగారి సందర్భం చూచింది మొదలు నాకు దానియందు మఱీ ఆసక్తి హెచ్చింది. దాన్ని యెంతవఱకు నెఱవేఱుస్తూ వున్నానో ఆ సందర్భం లోకులు నా జీవితానంతరం తేలుస్తారు కాఁబట్టి యిక్కడ విస్తరించవలసింది లేదు. యిక్కడ కావలసింది చెళ్లపిళ్లవంశానికి, అందులో మాకడియం చెళ్లపిళ్లకు అసత్యమంటే చేఁతకాదు. అందుచేత ఆత్మవంచన బొత్తిగా చేఁతకాదు, అన్నది ముఖ్యాంశం. యింతయెందుకు వ్రాస్తానంటే వైదికవంశంలో వాఁడనైనా మా వంశంలో వైదికానికి ముఖ్యమైన యజ్ఞయాగాదులు చేసిన శ్రోత్రియులుగాని, లౌకికానికి గౌరవప్రదమైన దివాన్‌జీ వుద్యోగాన్ని చేసినవాళ్లుగాని వున్నారని వ్రాసి సంతోషించడానికి నాకు లేశమున్నూ అవకాశం లేకపోయినా, సత్యసంధులు మాత్రం వున్నారని వ్రాసుకొని సంతోషించడానికి భగవంతుడు అవకాశం యిచ్చి వున్నాఁడని నన్ను ప్రేమించే లోకులకు తెల్పడానికే.

★ ★ ★

# పనిలేనిపాట

(5-5-1936 సం॥ర ప్రజాసేవ నుండి)

గురువుగారు వ్రాసేవ్రాఁతను గూర్చికాదుగాని నేను యిదివఱకు వ్రాసినదాన్ని గుఱించీ కాదుగాని యిప్పుడు వ్రాసే వ్రాఁతను గూర్చి ప్రాజ్ఞులు "పనిలేనిపాట" అని అనక మానరని యెఱుఁగుదును. కృష్ణ యెడిటోరియల్లో పనిగట్టుకొని, "అయుక్తంగా వుంది ప్రతివాద" మని తెల్పి నిరాకరించి వుండె. పలువురు వుత్తరాలు వ్రాస్తూన్నారాయె, అట్టి సందర్భంలో యేమిబాముకోవాలని గురువుగారి విపుల వ్యాసాలకు జవాబు నేను వ్రాయాలి? పైఁగా గురువులవా రాపాదించిన "కృతఘ్నత్వాన్ని" నిజం తెలిపి పోఁగొట్టుకుందామని వ్రాఁత మొదలెట్టి మృదువుతప్పకుండా మూఁడు వ్యాసాలు వ్రాసుకుంటే, దానిమీఁద కోపం వచ్చి గురువుగారు యిహపరాలు. లేశమున్నూ చూడక "గురుతల్పము, దొంగతనము' వకటేమిటి? రెండేమిటి? ముప్పైరెండు దాఁకా దోషాలు ఆపాదించి కృతార్థులైనారు గదా?

"సోలెఁడు బియ్యానికి సోదెకెడితే కుంచెఁడు బియ్యం కుక్క ముట్టుకుపోవడం" కాక మరేమి? యిది, ముల్లువచ్చి కొట్టిడచిన చందమైనదనిన్నీ అనుకోవడానికి పూర్తిగా వీలు లేదు. సుమారు యిరవై ముప్పయి కాలాల వ్రాఁతప్రవాహంలో కృతఘ్నత్వాన్ని నివర్తించే అక్షరాలున్నాయే అనుకుందాం. అవి బాగా బోధపడతాయా లోకానికి? అందుచేత యెందుకు ప్రారంభించానో ఆపనిన్నీ జరిగినట్లు లేదు. పైఁగా ఆ కృతఘ్నత్వాన్ని తలదన్నేవి ఆపాదించి వున్నారు గురువుగారు. లోకం ఆ వ్రాఁతచూచి వారి యెదుటనే యేవగించు కున్నట్టుకూడా విన్నాను. యెంత సత్యమో! యెవరిక్కావాలి! నిర్మొగమాటంగా మాట్లాడే వారు యీ కాలం లోనేకాదు, యేకాలంలోనున్నూ అరుదే. మా గురుశిష్యవాదాలని, కృష్ణ భరించలేక పోయింది. గోదావరి వొడ్డునవున్న "సుధర్మ" కూడా జంకి నట్లే వింటాను. పెన్న వొడ్డునవున్న "ప్రజాసేవ" నేనున్నానని పూనింది. ఆపెమాత్రం యెందాఁకా వోరిమిపడుతుందో? చూడాలి. తలా, తోఁకా వున్నవాదమైతే గదా? యిది. కవిత్వం చెప్పి, కన్యకనుకని, వంటవండి, సంగీతం పాడి, మెప్పుపొందాలంటే భారం లోకానికి వదలిపెట్టక తప్పదు. అందులో ముఖ్యంగా రసారస విచారానికి గ్రంథకర్త చెప్పే జవాబు పనికిరాదు. శబ్దసాధుత్వాదులకైతే గ్రంథకర్త పరిశ్రమ పనికివస్తుంది. కర్మంచాలక

గురువుగారి భారతం అసారమనేవారికి ఆధార భూతమైన పద్యాల్లో మొట్టమొదటిదేమో అనఁదగ్గ పద్యాన్ని"స్త్రీ స్వాతంత్ర్యము" అనేదాన్ని నేను ప్రసక్తానుప్రసక్తంగా నాగీరతం గురువుగారు యీసడించిన సందర్భంలో కాఁబోలు వుటంకించాను. దాన్ని సమర్థించారు గురువుగారు. యెల్లావుందంటారు? ఆసమర్థనం సమంజసమా? కాదా? అన్నది నాకు ప్రస్తుతం కాదు. అది లోకంపని, అంతతో తృప్తిపడక నా "బొబ్బిలి పట్టాభిషేకం" లో "స్త్రీలనుగూడ" అన్న పద్యాన్ని పట్టుకొని విమర్శించి కోపం తీర్చుకున్నారు. గురువుగారేమో అంటే నేను జవాబువ్రాసి పత్రికకు పనికల్పించాలా యేమిటి? దాన్నిన్నీ వుపేక్షిస్తాను, అసమర్థుఁడ వంటారేమోఁ గురువుకన్న శిష్యుఁడు అసమర్థుఁడుగా వుండడమే యుక్తం కదా? వారికోసంగాదు. లోకంకోసం. జవాబు చెప్పరాదా? అంటారా? అయితే కొంచెం వ్రాస్తాను. "స్త్రీలను అనే సప్తమ్యర్థక ద్వితీయ తప్పన్నారు గురువుగారు. "సీ....... మనుజుల విప్రుండు" అనే శాంతి ౧. ఆ. వల్ల అది సాధువు. "భారతమాంధ్ర సత్కవుల పాలిటి వేదము" దేవీ - ౧. ఆ. గురువుగారు గనుక యింతకన్న వ్రాస్తే బాగుండదను కొందును. కోపోద్రేకం మీఁద సరియైనవి దొరకలేదుగాని శాంతించి మెల్లగా వెతికితే తి॥ వేం॥ కవుల కబ్బాలలో గురువుగారికి దురుద్ధరమైన దోషాలే దొరక్క పోయాయా? కోర్కెలు కూడా రైటే "క॥ కేదారము లందుఁగోరి కెలుదయివారన్" తపతీసంవరణము, "తే॥గీ॥ గీము లలరించి కొనిరి కోర్కెలు చెలంగ" నీలాసుందరీపరిణయంలో తిమ్మకవి సార్వభౌముడు. యింకా కొన్ని ఆక్షేపించారు. ప్రౌఢవ్యాకరణం - చూస్తే కొంత సంశయం తీరుతుంది. యీ వివాదం సత్యము తేల్చుకొనుట కేర్పడ్డదిగాని గురువుల ప్రజ్ఞయెట్టిది! శిష్యుల ప్రజ్ఞ యెట్టిది అనే అంశం లోకానికి తెల్పడానిక్కాదు కాఁబట్టి స్పృశించి వదలినాను. అవసరమే అయితే గురువుగారి పునీత ప్రయోగానిక్కూడా సమర్థించే సరకు నావద్ద వున్నది. యెప్పుడో దాన్ని యెవరో ఆక్షేపించారు. గురువుగా రింతవఱకూ "గురోస్తుమౌనం వ్యాఖ్యానం" గానే వున్నారు. శ.ర. నిఘంటులో వుందిగాని తావన్మాత్రం చేత అది సమర్థింపఁబడదు. గురువుగారి సెలవైతే ఆవలి వారితో కొంత పెనుగులాడతాను. యెప్పుడేంపని పడుతోందో! అని కొంతసరకు దాఁచి వుంచాను. దాని ప్రయోగం గురువులమీఁదే జరపవలసి వచ్చినందుకు విచారిస్తూవున్నాను. "కాదని తప్పుదిద్దమా! ఉభయులోన నొక్కఁడు మఱొక్కనికిం దగుఁగాక" ఉభయులూ అంటే జ్ఞాపకం వచ్చింది నేను జీవితచరిత్ర వ్రాస్తూ తి॥శా॥ గారి నేమోఁ యేమోచేయడానికి చాలా చమత్కరించానఁట! యీలా వ్రాయడ మెందుకంటారా? అతని కొడుకులకూ నాకూ వివాదం కల్పించడానికి. వాళ్లంత అవిమృశ్యకారులయితే చూస్తాను. యింకాయెన్ని! మా శిష్యులకు సంబంధించినవాదం, గుంటూరి సీమలో వచ్చినవాదం, యివన్నీ ఆవలివారివే న్యాయమైనట్లు వ్రాశారు

గురువుగారు. దయచేత యెదటి పక్షానికి చేయూఁత యివ్వలేదన్నాడుకూడాను. యిస్తే ఆవలిపక్షమే జయించేదన్నమాట. యెందుకీ యప్రస్తుత ప్రసంగం! యిప్పుడు మళ్లా యిల్లా వ్రాస్తున్నారు. గురువుగారి సాహసం యెంతేనా వర్ణనీయం.

"చర్చించుకోగా, వెం॥ శా॥ గారు నాయొద్ద సంవత్సర పరిమితి కాలమునకు తక్కువకాకుండ నుండిరనియు మాఖముకూడా ప్రారంభించి కొంచము చదివిరనియు స్మరణకు వచ్చినది" అంటారు గురువుగారు. మొదటిగురువులు శ్రీ భుజంగరావు పంతులవారివద్దను, తుదిగురువులు బ్రహ్మయ్యశాస్త్రులవారి వద్దనున్నూ తప్ప యిఁక యేగురువుల యొద్దఁ గాని మాసాలు తప్ప సంవత్సరాలు చదవలేదని వెం॥ శా॥ యేప్రమాణం బడితే ఆ ప్రమాణం చేస్తాడు. నిజమట్టిదే అయినా గురువుగారి వాదం కాదనడంకంటె వారి అభీష్టం చొప్పున సమ్మతిస్తే తప్పులేదుకాని నిజం వ్రాసిన "జాతకచర్య" తీరా ప్రచురింపఁబడ్డది. యిప్పుడు సవరించడం ఎట్లా? అదల్లావుంచుదాం. మాబిరుదాన్ని వెక్కిరించారు. పెడర్థం చెప్పారు, వెంకటశాస్త్రికేనా? చేతకానిది. వెనక పేరి కాశినాథశాస్త్రులవారి కిచ్చిన జవాబు గురువు లెఱుంగరనుకుంటాను. ఆ త్రోవలోనికి దిగితే వెక్కిరించవలసి వస్తుంది. వివాదం జరుగుతూవున్నప్పటికీ వెక్కిరింతలూ వేళాకోళాలు శిష్యస్థానానికి బొత్తిగా పనికిరావు. గురుస్థానానికిన్నీ అవి పనికిరావుగాని, ఆ మాట గురువులకు తోఁచాలి. మనకు తోస్తే యేం లాభం! గురువుగారేమాలోచించారో! కాని వ్రాసేవ్రాఁతంతా అప్రస్తుతమే. యింకా వారి బిరుదాలు సమర్థించడానికి కొంత ప్రయత్నించారు. అది పనిచేసినా చేయకపోయినా ప్రస్తుతం కాకపోదు. నేనిప్పుడు వ్రాస్తూయున్న "ఇటీవలిచర్య" ప్రకటింపఁబడితే ఖండిస్తామన్నారు. ఆఖండించే పుస్తకం పేరు "గర్య" అని కూడా వుదాహరించారు. నాది "చర్య" గనక వారిది "గర్య" యిదివరకే దానిలో గురువులకు సంబంధించిన మట్టుకు పద్యాలు కొన్ని వుదాహరించాను. వ్యాసాలలో వాటిని ఖండిస్తూనే వున్నారు. బహుశః ఇదే దానికిన్నీ పనికివస్తుంది. లేక పోతేనోయెప్పుడో వ్రాయఁదలఁచుకొన్నదిన్నీ పనికిరాదు. కాఁబట్టి వేఱే పరిశ్రమ మక్కఱలేదనే నా భావము. వారి భారతం మీఁద ఖండనవ్రాస్తే జవాబు వ్రాస్తామన్నారు. వోపికెవరికుంది? నేను వ్రాయను. యెవరేనా వ్రాస్తే తామిచ్చే జవాబెట్టిదో? యిప్పుడు తాము చూపిన "స్త్రీస్వాతంత్ర్యం" పద్యసమర్థనం వలెనే వుంటుందని స్థాలీపులాకన్యాయంచేత లోక మిదివఱకే తెలుసుకొని వుంటుంది. యెంత పరిశ్రమచేసి సమర్థించినా "స్త్రీ స్వాతంత్ర్యం పద్యం" కరుణానిరతులు అనే నన్నయ్యగారి పద్యందగ్గర కాదుగదా, ఆమడదూరంలో నైనా నిలవగలుగుతుందా? యింతెందుకు, నన్నయ్య పద్యంలో మాటలు వచనంలో యెక్కించినా అలాగే సరిపోతాయి. గురువుగారి పద్యాన్ని వచనంలో పెట్టవలసివస్తే

యేమవుతుందో? పరిశీలిస్తే వారికే తెలుస్తుంది. యిలా వ్రాస్తే చాలా వ్రాయాలి. పత్రిక భరాయించలేదు. గురువుగారు ప్రస్తుత విషయాన్ని విడచి తిట్టిపోస్తూవున్నందుకు లోకము యేమనుకుంటూవుందో? తెలపడానికి యిదివఱలో వక ప్రాజ్ఞ మహాశయుని వుత్తరం కొంత వుదాహరించినట్లు జ్ఞాపకం. ఆ వుత్తరం ఆయన వ్రాసేటప్పటికింకా యింతగా గురువుగారు బరిదెగించలేదు. యిప్పుడు దాహరింపఁబోయే వుత్తరం నాదగ్గిరకు వచ్చే టప్పటికిన్నీ గురువుగారు అంతగా తెగించి తిట్టినట్లు లేదుగాని యీ వుదాహరింపఁబోయే వుత్తరం వ్రాసిన ఆయన శృంఖలాన్ని, పనిగట్టుకొని చదవడం వల్ల కొంతయేవం కలగడాని కవకాశం చిక్కింది. యిదివఱలో వుదాహరించానన్నది ఆంధ్రదేశంలో వకదిక్కు సరిహద్దు నుండి వచ్చింది. యిపుడుదాహరింపఁబోయేదో? యింకొక దిక్కు సరిహద్దు ప్రాంతానిది. దీన్ని వుదాహరిస్తే లోకాభిప్రాయం తెలుసుకుని గురువుగారు జాగ్రత్తపడి పట్టుదల తగ్గించుకుంటే పత్రికలకు విశ్రాంతి కలుగుతుందేమోయని నా ఆశ. పాపం, కృష్ణ మెల్లిగా తప్పుకుంది. ఆపెకు వంకదొరికింది. యేమిటావంక అంటే ద్వాత్రింశద్దోషారోపణం కంటె యేం కావాలి? దానిలోనంబరువన్, దొంగతనమా? అన్నది. యిరవై అయిదోది కాఁబోలు "గురుతల్పం" తుట్టతుది పొత్తర్లు కట్టడం. వారు కోపోద్రేకంమీఁద యేం వ్రాసినా అందులో కొన్నిటి మాటకేంగాని కొన్నిటిని మనం అనువాదం చేయడం కూడా పాతకహేతువే అనుకుంటాను. కృష్ణ మానడం మానిందిగాని యీహేయప్రసంగాన్ని మాత్రం ప్రకటించి మఱీమానింది. యిది ప్రకటనార్హంకాదని ఆమెకు పూర్తిగా తెలుసును. అయితే యెందుకు ప్రకటించాలి? తాను విరమించుకోవడానికి కారణంగా దీన్ని అందఱికి తెలుపడాని కనుకుంటాను. యిలాటివి కావుగాని యేలాటివో కొన్ని వెనక మాగీరత శిష్యులున్ను ఆపాదించారు. వాట్ల నన్నిటిని ఒక పద్య పేటికలో యిమిడ్చి భద్రపఱచి లోకాభిరామాయణంలో ప్రచురించుకున్నాము. ఆ పద్య మ్మొదలు "చ. విటుఁడవివేకి" అన్నది. వలయువారందు చూడఁగలరు. యేమైనాసరే గురువుగా రాపాదించిన వాట్లట్లో గురుతల్పం దొంగతనం, తాగుడు యీలాంటి వాట్లకేనా ఖండన కనపరిస్తే బాగుండునంటారా? కాటికి కాళ్లు చాచుకొన్న స్థితి యిది అని గురువులే వ్రాశారు ఇదివరలో. కొలది కాలంలోనే వుభయులకున్ను దీని ఫలితం కనఁబడే టప్పుడు యిప్పుడు ఖండన మండనా లెందుకు? విచారించతగ్గవాళ్ళే విచారిస్తారుగదా? తోసేస్తే తోసేస్తారు. నెత్తిని రుద్దవలసొస్తే రుద్దుతారు. మన ఖండనా లేంపని చేస్తాయి? కోపానికేనా అనుగ్రహానికేనా మితి అంటూ వుండాలి. యీలా యేదో వ్రాస్తూనే వుంటే పెరుఁగుతూనే వుంటుంది. ప్రకటిస్తానన్న వుత్తరం ప్రకటిస్తాను. ".... గురువుగారి శృంఖలంకాపీ నొక దానిని చూడవలయునని మీ వ్యాసములు చదువుచున్నప్పటినుండి బాధిస్తూయుండెను... వక

కాపీ సంపాదింపఁ గలిగితిని. గురువుగారి విషయమై నాకింత వఱకును ఏమీ తెలియదు. నాకొక్కటియే తెలిసి యుండెను. కవిత్రయమువారు వ్రాసిన భారతమును గూడ వీరు తిరిగి వ్రాయ సంకల్పించి కృతార్థు లయిరనియు, కవిసార్వభౌములని బిరుదువడసి, కనకాభిషేకము చేయించుకోగలిగి మీ చేతి మీదుగనే గండపెండేరము ధరింప గలిగినారని మాత్రమే యెరిగియుంటిని. కృష్ణాపత్రిక మొదలగు పత్రికలలోని విమర్శనల నెరిగి యున్నప్పటికిని 1860–70 ఆ పది సం॥రముల ప్రాంతములలో మన ఆంధ్రదేశములో పుట్టిన మహాపురుషులలో వీరుగూడ నొకరని అప్పటికి యిప్పటికి గూడ నాకు వీరియందు భక్తి గౌరవములుమెండు. కాని “శృంఖల” ధోరణి నాకాశ్చర్యము కలిగించినది. ప్రతి మానవునికిని యేదో వక లోపముంటుంది. కాని అంతటి ధీశాలి నీచమార్గమును బట్టుట....” ఇత్యాదులు. వారిని నిందించవలసినదానికన్న వారి యీలోపముకు విచారపడవలసి మాత్రముంటుంది. ఒకటి మాత్రము నాకు గట్టిగా తోస్తుంది. భారతాది మహాగ్రంథములతో సహా 108 గ్రంథములు వ్రాసి పారవేసిన కవిరాక్షసుని కీర్తి ఒక రాశిగను, శృంఖలాది గ్రంథములు వ్రాసిన అపకీర్తి ఒకరాశిగను, వీరి జీవిత చరిత్రయందు శాశ్వతముగ నిలిచిపోవుననియే. మాటకు సూటిలేనివారితో వాద వివాదములకు దిగుటకూడ ప్రమాదమేమో? ప్రతి వారూ ‘మొదటి నుండి ఆయన దదేరకం, మీరుకూడా (మిమ్ములు) యీలాంటి వ్రాతలకు దిగడం యేమీ బాగులే’ దనే అభిప్రాయాన్ని వెల్లడిస్తున్నారుకాని, నిజమే వచ్చిన అపవాదను పాపుకోవడానికి ప్రయత్నించకపోతే యేలాగ! అనేవారు. కేవలము మిమ్ము గురువులుగనే కాక తండ్రికన్నను నెక్కువ గౌరవముతో పూజించుకొను సోదరబృందమే అంటున్నారు, ఎందుకొచ్చిన శ్రమ. కీర్తియో? అపకీర్తియో? ఆచంద్రార్కము నిలిచిపోగల ఖ్యాతిగడించి అయిపోయినది. ఇప్పుడెవరేమన్నను ఆ ఖ్యాతి తరగదు. పెరుగదు కూడా. కాకపోతే ఒకటి మాత్రం గట్టి. గురువుగారెంత ఛాందసులైనా అగుదురని నిర్ణయించుటకీ వాదప్రతివాదము లక్కఱకు వచ్చునేమో? దానికికూడ మీరు చింతపడవలసిన విషయమే యుద్ధరంగమునకు సూత్రము దిగిన తరువాత మంచిచెడ్డలు మాత్రము తోచవు. చూడండి మీరొక వ్యాసమున గురువుగారి పద్యముల పేలవమును చూపితిరి. ఈ సంగతి మీరు చూపకపోతే లోకమాపాటి గ్రహించుకోదనేనా! మీ అభిప్రాయము. ఆ భారమంతా లోకమే నెత్తిమీఁద వేసికొని ధరించును. ఏవో యిరవైవేల పద్యాలను గణబద్ధంచేసి పారవేసినంత మాత్రాన కవి సార్వభౌము లవుదురా? వీరే కవిసార్వభౌములైన వేంకటశాస్త్రిగారు మొదలగువారి సంగతేమిటి?, అని కృష్ణాపత్రిక వారు వ్రాశారంటే మీరు సూచించితేనేనా? వారు వ్రాసింది. రెండు సేలువుగుడ్డలుచూచి భ్రమించారని గురువుగారు వ్రాస్తే, మీరు సభలలో పొందిన గౌరవములు ఏనుగంబారీ

మీద యెక్కించి వూరేగింపంబడిన వైభవములు వేయిన్నూటపదియార్లను గూడ నొసగి సమ్మానించిన వారిని గూడ తీవితోనే ఆశీర్వదించిన వైఖర్లును ఎవరెరుగని సంగతులని? గురువుగారి కెవరో పది రూపాయిలను ముట్ట జెప్పమన్నటుల తెలిసి వారి కెందుకు దక్కవలె మనమే తెచ్చుకొందామని ప్రయత్నించినటుల యెవరేనా శిలాశాసనము వ్రాసి పెట్టినను, విశ్వసించుటకు లోకమేమంత మాత్రము మూర్ఖత చెందినదా? మీరు జయాపజయముల కొలకనుకొనుచున్నారే కాని లోకంమాత్రం యిద్దరు పెద్దవారైనారనే అనుకొనుచున్నారు. నేనంటే యీలాంటి వెర్రిమొర్రి వ్రాతలు వ్రాస్తూ వుండడమలవాటేనని మీకు బాగా తెలిసిన విషయమే గనుకను, వినదగిన విషయము లేమేనా వుంటే వినిపించ వచ్చుననియు, తప్పయితే క్షమింతురని ధైర్యంతో యీ విషయ మింతదూరం వ్రాయడమైనది....' చేవ్రాలు.

ఆయీ విమర్శకులు వుత్తరం 22-3-36 తేదీగలది. అప్పటికి యింకా గురువుగారు ముప్పది రెండు దోషాలు ఆరోపించిన కృష్ణ ఆయన చూడలేదు పాపము. శృంఖలానికే అంత నొచ్చుకొన్న ఆ విమర్శకులు "గురుతల్ప" దోషములోనగు మహాపాపముల నాపాదించిన గురువుగారి లేఖిని నెంత మెచ్చుకొనునోకదా? అయితే యీ విమర్శకులెవరో? యేవూరివారో! అధికారమెట్టిదో? లేశమున్నూ నేనిట వెలిపుచ్చలేదు. ఆయన నాకన్న చిన్నయైనను ఆయన నన్ను గూర్చి యొనర్చిన సదుపదేశమును నేను శిరసావహిస్తూ వున్నాను గాని మా గురువరులట్లు శిరసా వహిస్తారో? లేదో? వీలైనంతలో యిరువురకును అనుకూల్య ప్రాతికూల్యములు సమంగానే వుండాలని యీయన ప్రయత్నించి నప్పటికీ విధి లేకో? లేక పక్షపాతమో? నేవ్రాస్తే యేంలాభం? చదువరులు నిశ్చయించుకోవాలి? గురువుగారి విషయంలో యీయన యెక్కువగా పరితాపాన్ని వెల్లడించినట్లగుపడుతుంది. అట్టి సందర్భానికి శ్రీవారు సహింపరు. నాకు ఆరోపించినట్లే ముప్పది రెండు కాకపోయినా అధమం యిరవై రెండేనా ఆ విమర్శకుండికి కూడా ఆరోపిస్తారు. ఆ కారణంచేత ఆయన పేరు ప్రకటించడం మానినాను. అంతపనిపడ్డప్పుడు అసలు వారికి యేదో సమాధానం చెప్పికొని పేరువగయిరాకూడా ప్రకటిస్తాను. ప్రకటిస్తే మాత్రం "లోకం అంటే యీయనేనాయేమిటి!" అని శంక రావచ్చును. లోకం మాత్రం వక మాదిరిగా వుంటుంది కనకనా? అటు బాగుందనేవారు కొందఱూ, యిటు బాగుందనేవారు కొందఱూ. అంతేకాని యీవివాదకు బీజంయేమి? యెవరో పండితుండు ఆయనకు ఆశ్రయమైన స్థానాన్ని గూర్చిపెండ్లికాలంలో చెప్పిన పద్యాలను విమర్శిస్తే విమర్శింతురుగాక. అమంగళాశు ద్ధాది పదాలతోతిట్టి, తగులంబెట్టు మనవచ్చునా? దానిని సమర్థింపలేక తమకు వ్యతిరేకంగా అభిప్రాయం యిచ్చాండన్న కోపంతో శిష్యుండిమీంద గురువుగారు అపవాదలు

ఆరోపించవచ్చునా? వూరికేగాలి మాటలే కాకుండా వాట్లను "శృంఖల" గ్రంథంలో వ్రాయడమెందుకు? అట్టిస్థితిలో వాట్లయాథార్థ్యం తెల్పడానికి శిష్యుఁడేమో అక్షరాలు వ్రాసుకుంటే యీ కోపం యెందుకు? వృథాగా లోకానికి కటువుగా వుండేతిట్లెందుకు? అసత్యాలెందుకు? అని నిర్మొగమాటంగా యెట్టయెదుట అనేవారు వుండనేవుండరుకదా? "యిద్దఱూ ముసలవాళ్ళే వీరికెందుకు? యీవాదాలు" అని మాత్రం అంటారు, ముసలవాళ్ల మవడంచేతే యీ వాదాలు. నేఁడో రేపో జీవితం అంతరిస్తుంది.

వెంకటశాస్త్రి మాఘం దాఁకా చదువుకొని మేఘసందేశందాఁకానే చదువుకున్నానన్నాట్ట అంటే అది నాకు కళంకంగాదా? "సంభావితస్యచాకీర్తిర్మరణా దతిరిచ్యతే" యీవొక్క అసత్యానికి వప్పుకుంటే కాజులూరు, చామర్లకోట, పిల్లంక, పల్లెపాలెం యిన్నివూళ్లల్లో చదువుకు అభావం చెప్పాలి. కృతఘ్నుఁడు కావాలి. దీనికి భగవంతుఁడు సహిస్తాఁడా? హైదరాబాదుకు యీ వుత్తరం వ్రాయడం దగ్గరనుంచిన్నీ గురువుగారి లేఖిని ఋజుమార్గంలో లేశమున్నూ నడవడమేలేదు. యీహానికేమోగాని వారు వ్రాసే మాటలు పరానికి పూర్తిగా విరోధించేవే. మన ఆర్యులకు యిహం కన్న పరం చాలా ముఖ్యం. యేలాగో యిహంలో లోకులని వంచిస్తే ప్రయోజనం లేదు అనేభయం మనవాళ్లకున్నట్లు వాళ్ల వాళ్ల ప్రవర్తనలు చెపుతాయి. వకదానిలోనుంచి వకదానిలోకి దూఁకడమే కాని గురువుగారి లేఖిని ప్రధానాన్ని స్పృశించడం లేదు. నా పేరెత్తి పలువురు గురువుల బిరుద ధారణాదులను ఖండించడం ఎప్పుడు మొదలెట్టారో అప్పటి నుంచిన్నీ నా మీఁద వారికి ఆగ్రహం అంకురించింది. పోనీ వారి కెవరికేనా నా ప్రేరణ వుంది అని అంటారేమో? అంటే, యెన్నెన్నో కాలాలు వ్రాసినా యిప్పటికి ఆ మాట మాత్రం వ్రాయలేదు గురువుగారు. యిది చాలా ప్రశంసనీయం. ఆత్మోత్కర్ష మాటలేమో నేను వ్రాశానంటారు గురువులు. నేనేకాదు అందఱూ పని పడ్డప్పుడు అంతో యింతో అట్టిమాటలు వ్రాస్తే వారే. గురువులున్నూ వ్రాశారు. యెందుకీ అప్రస్తుత విషయం? నాకు "ఫోటో" ల యందేమో ఆదరముందంటారు. యిదిన్నీ అప్రస్తుతమే. నిజం చెపుతాను. నాకు "ఫోటో" తీయించుకోవడానికి కూచోవడమంటే ప్రాణ సంకటం, ఆయా ఫోటోలలో వుండే నా యేబ్రాసి వేషం వల్ల చదువరులీ రహస్యాన్ని గ్రహించవచ్చును. శ్రీ గురువుగారి "పెండెరపు" సభకు అధ్యక్షుఁడుగా కూర్చున్న నన్ను శ్రీ న్యాయపతి సుబ్బారావు పంతులుగారు కొల్లాయి గుడ్డేదండోయి అని ప్రేమపూర్వకంగానే అనుకోండి. ప్రశ్నించి బహూకరించారు. విన్నారు శ్రీ గురువుగారు కూడా పంతుల వారివాక్యాన్ని, వారి కప్పుడు గురువుగారిని చూపియేవో రెండు పొడి మాటలు మనవి చేసుకున్నాను. బహుశః దీన్నే గురువుగారు పెండెరపు సభలో వెం॥ శా॥ తమ్ము అవమానించే చేష్టలు చేసినట్లు గూఢంగా వ్రాస్తూ వున్నారనుకుంటాను. ఆ

సభ జరిగి నాలుగేండ్లు కావచ్చింది. అప్పుడు యెవరుగాని ఇంతవఱకు నాకీ కళంకాన్నియెక్కడా ప్రకటించలేదు. ఆ రోజుల్లో గూడా గురువుగారి పెండెరానికన్న కూడా నా ప్రవృత్తినే పత్రికలు శ్లాఘించాయి. అవసరమయితే చూపుతాను. చి॥ ల॥ అనే పేరుతో పెద్దవ్యాసంవ్రాసి పెండేరమునూ, గురువుగారినీ, నన్నూ, వెక్కిరించిన ఆంధ్రపత్రికా వ్యాసం కూడా నేను వ్యతిరేక చేష్టలుచేసినట్లు లేశమున్ను సూచించనైనా లేదు. పెండేరపు విషయంలో తన అసమ్మతిని మాత్రమే వెల్లడించింది. యితరుల సమ్మానాలకు వెంబడిగా యిట్టి అసమ్మతులు లేవు. గురువుగారీ విషయాన్ని బాగా గమనించి పత్రికలలో సమర్థత కుపక్రమించాలి. ప్రస్తుతం నా కొల్లాయిగుడ్డ సంగతి. నాకు సౌందర్యాన్ని బలపరచుకొనే వేషమందాసక్తి బొత్తిగా లేదు. కారణం నేను సురూపులలో చేరేవాఁడను కానని యెఱుఁగుదును. కనుక కొల్లాయిగుడ్డలు వాడుతూవుంటాను. మహాసభలలో కూడా, పనిపడితే పొత్తర్లు మూటగట్టు కోడానికిక్కూడా పనిచేస్తాయని యెవరేనా అంటే దాన్ని నేను "స్వభావోక్తి రసో చారు"గా జమకట్టుకొంటాను. నేను హైకోర్టు లాయరు వేషం వేయను. వేసే కవులను ఆ విషయంలో అభినందించనుకూడాను. నేనట్టి వేషం వేసినా అదినన్ను అందగాణ్ణి చేయఁజాలదని నాకు బాగా తెలుసును. బాగా ఆలోచిస్తే నాకు పూర్తిగా తెలిసిన సంగతి యిన్నాళ్లకి యిదిమాత్రమే అనుకుంటాను. భవభూతి యేమన్నాఁడు? శ్లో. నాస్మాకం శిబికా...... విద్యా ఉఉనవద్యాఉస్తినః॥ అన్నాఁడు. బాహ్యవేషాడంబరాలున్నూ వెనకాల అపహసిస్తూవుండే బిరుదులున్నూ వకటే తరగతిలోవని నాభావం. శ్లో. విద్యారూపం విరూపాణాం ॥ కదా! బ్రహ్మంగారి హరికథను గూర్చి కొంచెం నేను యెత్తుకొన్నమాట వాస్తవమే. నిజంగా అది అపహాస్యాస్పదపు వ్రాఁతయే. గురువుగారెఱుఁగ రందామంటేఁ దాని పీఠికలో వారు "యెన్నో సంగతులు తగ్గించి నిలుపుచేసినవే ప్రకటించి" నట్టు స్పష్టముగా కనఁబడుతుంది. యిది నేను స్పృశించి నందుకు బదులు షష్టిపూర్తినాఁడు నాకు కృతిపెట్టిన పింగళి, కాటూరి, శిష్యుల సంగతి నెత్తుకున్నారు గురువుగారు. వారికి పోలిక తోఁచినందు కనుకోవాలి; ఆకృతిలో కథ నన్ను గూర్చిందికాదు. హరికథలో ప్రతిపాద్యులు గురువుగారేకదా? యింకా యింతటితో వదిలారా? అడివి శంకరరావుగారి నెత్తుకున్నారు. అందుకు యెపుడో వారే సమాధానం యీవలసివుంటే యిస్తారనుకుంటాను. బ్రహ్మంగారు శ్రీ పట్టసక్షేత్రంలో శ్రీ భద్రకాళీ మహాదేవి గురువుగారికి (కలలోనూ గిలలోనూకాదు) ప్రత్యక్షమైనట్లున్నూ, ఆపెతో వీరు మాటలాడినట్లున్నూ వ్రాశారు. యిది గురువుగారు చెప్పి వ్రాయించిందా? కాదా? బ్రహ్మంగారి కేలా తెలిసింది? ఆ సమయంలో బ్రహ్మంగారు కూడా గురువుగారి పార్శ్వాన్ని దయచేసివున్నారా? యిట్టి అపహాస్య విషయాలు దానిలోవున్నాయి. సుమారు అఱువైవేల

గ్రంథం తెనుఁగులోకి పరివర్తన చేసింది భారతంవుండఁగా పేరు చిరస్థాయి కావడానికి యీలాటివెందుకని నాశంక. కవిపేరు నిలిపితే కవిత్వమేనిలుపుతుంది. అదిరసవంతమైన దయితేనే -

"లోకుల రసనలె యాకులుగా నుండునట్టి యవివో కవితల్" అన్నాఁడు సంకుసాలకవి. కర్మిష్ఠత్వాదులు కవితారసాన్ని తెచ్చిపెట్టవు. తగ్గిస్తే తగ్గిస్తాయేమోయింకాను.

తే.గీ. ఎంత దూరమో? యెందులకెవరు? జారు
వా, యను కవి ప్రవరుఁడు కవనమునందు
వానిఁబోలెడువారె? యెవ్వారలేని
విప్ర కవులందు నెవ్వరో? వేత్తదక్క.

అని యిటీవలిచర్యలో వక ఘట్టంలో వ్రాసివున్నాను. సార్వభౌమ బిరుద సభను కొంత వర్ణించారు గురువుగారు. ఆ సభలో నేఁటికవులలో ప్రసిద్ధులు పలువు రుండడం అవసర మంటాను నేను. గురువులవారు నీవు అని నన్ను వుద్దేశించి యియ్యది నిన్ను గూర్చివ్రాసేమాట అంటారేమో? నాలక్ష్యం లేశమున్నూ లేనట్లున్నూ నాకవిత్వం పనికిమాలిన కవిత్వమైనట్లున్నూ వ్రాస్తూయున్న గురువుగారికి నాభయం వుంటుందని నే ననుకుంటానా? అదిన్నీ కాక నెలలయితేనేమి, వారికి మళ్లాజ్ఞాపకం వచ్చిన ప్రకారం సంవత్సరాలయితేనేమి వారివద్దనేను శుశ్రూషచేసిన శిష్యుణ్ణయినప్పుడు వారి సార్వభౌమత్వానికి నా అడ్డేంపని చేస్తుంది. అందుచే ఆ సభలో నేను లేనన్నది బాధకంగాదు, సాధకమున్నూ కాదు. ఆ బిరుదు రాజులకు రాజసూయాధ్వరం యెట్టిదో? కవుల కట్టిదిగా తలంపక తప్పదు. అందుచే అశ్వంలాగా కవిత్వం కూడా తిరిగి పట్టుపడకుండా స్వస్థానాన్ని చేరుకోవాలి. అట్టి శక్తివుంటే తప్పు లేనప్పుడు తమ ప్రయత్నం మీఁద కాదే అనుకుందాం, యితరులు బలవంత పెట్టియిచ్చినా ఆలోచనాపరులు ధరించరు. అందుకే "కృష్ణ" ఆక్షేపించింది. లేకపోతే దాని పుట్టేం మునిగింది? ఆ పత్రికా సంపాదకుఁడేమిన్నీ తెలియనివాఁడు కాఁడు. అస్మదాదులతోపాటు ఇంచుమించు ఆంధ్రగీర్వాణాదులలో ప్రవేశంకలదు. ఆయనకు వకరిని అవమానించే స్వభావంలేదు. అందులో దేశాభిమాని అవడంవల్ల ఆంధ్రదేశమన్నా, ఆంధ్రకవులన్నా ఆయనకు విరుద్ధమయిన అభిమానం. యీ సార్వభౌమ, కనకాభిషేక ప్రసక్తికి కొంచె మీవలా ఆవలా జరిగిన సమ్మానా లెన్ని లేవు? వాట్లను గూర్చి లేశమైనా ఆయన వ్యతిరేకంగా వ్రాశారా? వీట్లను గుఱించే వ్రాయడమేమి? యీ సందర్భం విచారించవలసిన అంశం. ఆయన వ్రాఁత అవివేకపు వ్రాఁత అని గురువుగారు

సరిపెట్టుకున్నారు. ఈ ఆంధ్రదేశంలో యింకొకరెవరేనా ఆయన వ్రాంతను గూర్చి “అవివేక” పదాన్ని వుపయోగిస్తారేమో? వేలు మడిచి చూపండి? యీలాటి శంకకు సమాధానం కనపడకే నేను గురువుగారి తరఫున పూనుకొని దాని ఖండన కుపక్రమించక పోయింది. యీ మాట నేను ఆత్మవంచనచేసి చెప్పేమాటకాదు. ఆత్మవంచన నాకు బొత్తిగా చేంతకాదు. యీ విషయం నేను వక వ్యాసంలో లోకానికి ప్రత్యేకించి విన్నవించుకున్నాను. కావున యిక్కడ విస్తరించేదిలేదు. ముమ్మాటికిన్ని కృష్ణరావుగారి సంపాదకీయాన్ని నేను ఖండింప లేదన్నది నా అసమర్థత్వ ప్రయుక్తమే. ఆయన నాకు పరమ మిత్రుండని గురువుగారు వ్రాయంబోతారేమో? లాభం లేదు. సుమారు 25 యేండ్లనాండు గుంటూరు సీమ కలహాలలో యీ మహానుభావుండు పనిగట్టుకొని తమ పత్రికలో మూండు కోడిపుంజు బొమ్మలను చిత్రింపించి అందులో వక కోడిపుంజు మెడలో నా మెడలో వుండే గౌడ రుద్రాక్షతావళాన్ని తగిల్చి నన్ను లోకానికి ప్రదర్శించలేదా? అట్టి కృష్ణారావుగారిని నేనెప్పుడైనా మరుస్తానా? అయితే నిజం వప్పుకోవడం మనిషికేకాదు, ప్రతి మనస్సుకున్నూ సహజగుణం గనుక నాలో నేను విమర్శించుకుని ప్రస్తుతం మనం న్యాయానికే అనుకుందాం కలహిస్తూ వున్నమాట సత్యమే. ఆ కలహంకూడా స్వకీయజాతి అయిన కవిజాతితోటి. కోళ్లుకూడా అట్లే కనుక యుక్తంగానే వుంది వుపమానం అని సరిపెట్టుకున్నాను. అంతతోకూడా వూరుకోక నెమ్మది మీంద గుంటూరు సీమలోకొంత సమాధానం మృదువుగాచెప్పి విరమించాను. పిమ్మట నన్నుంగూర్చి చాలామంది వ్రాసిన వ్రాంతలున్నూ కృష్ణా పత్రికవారివున్నాయి. అవిచూస్తే, “కొట్టితే కొట్టేండు” అన్నట్లుంటాయి. యింతకూ సారం కోడిపుంజుగా చిత్రించిన కృష్ణరావుగారు నాకు మిత్రులున్నూ కారు కవిసార్వభౌమ, కనకాభిషేకాలను ఖండించిన కృష్ణారావుగారు గురువుగారికి శత్రువులున్నూ కారు. యింక యెవరవుతారో? లోకులే నిర్ణయించుకోంగలరు. ఆ మాట యీమాట అనే వివక్షతో లేశమూ పనిలేకుండా నా విషయమై కోపం యేలా నడిపిస్తే అలాగల్లా కలాన్ని గురువులు నడిపిస్తూవున్నారు. నేనాలా నడపనూ నడపను. నడపడానికి నాకధికారమున్నూ లేదు. యేదైనా శబ్దమో సమాసమో నాది తప్పని గురువులంటే దాన్ని గూర్చి యేకొంచెమో వ్రాస్తే వ్రాస్తాను. అదిన్నీ నిజానికి వ్రాయ నక్కరలేదు. యీవాదోపవాదాలు పాండిత్యపు బలాబలాలకి సంబంధించినవి లేశమున్నూ కావు. వెం.శా. కుమార సంభవం మొదలుకొని మాఘం వరకున్నూ వక గురువుగారి వద్దనే చదివి నాండా? లేక అయిదారు గురువుల యొద్ద చదివినాండా? అన్న అంశం తేల్చుకోవడానికి యేర్పడ్డది. రెండవ గురువుగారు తమ వద్దనే చదివినట్లు వకరికి వ్రాశారు వుత్తరంలో. అది పత్రికలకెక్కింది. అచ్చుపడ్డ

"జాతక చర్య"లో వున్న యథార్థాంశానికి అది భంజకమవుతూ వుంది. దాని నిజానిజాలు తేల్చుకోవడానికి వెం॥శా॥ వ్యాసాలు వ్రాయవలసి వచ్చింది. దానిమీఁద అంతకు పూర్వమేవున్న కోపం గురువులకు మరింత హెచ్చింది. మొదట ఆ వ్రాఁత ప్రమాదమేమో అన్నారు. యిపుడు తిరిగీ ప్రమాదం కాదని సమర్థించడానికి మళ్లా సంవత్సరం కాలానికి తగ్గదని వ్రాస్తూ వున్నారు. యెవరో నాకు సేల్వులిచ్చి తమ మీఁదకు పురికొల్పినట్లు వక కల్పన. ఆయన నాకింటికి తెచ్చియిచ్చింది సేలువుకాదు. సేలంపట్టు కండువా. మాచిరంజీవి అవధాన సభలో యిచ్చింది సేలువున్నూ చేతి కఱ్ఱయున్నూ. యీ వార్ధక్యంలో యీ గడ్డితిని గురువుల మీఁదకు నేను యుద్ధానికి ఢీకొన్నానంటె విశ్వసించే లోకం వుందనే గురువులవారి నమ్మిక. మాలో మేమీలా వాదాలాడుకుంటూ వుంటే మధ్యవారు వారిలో వారికుండే కోపాలు తీర్చుకోవడానికి అన్యాపదేశ ప్రసంగాలు. అందులో బుద్ధిపూర్వకంగానో ప్రమాదంగానో దైవాని కెరుక. మేముకూడా చిక్కుకోవడం, అందులో కసితీరేటట్టు వొకరి నొకరు తిట్టడం, యెఱుఁగని లోకులు వీరుకూడా యెఱిఁగే వుంటారనుకోవడం యిన్నివిధాలుగా వుంది మావాదం. ఫలాపేక్షతో నేనెవరి కవిత్వాన్నో పొగిడేనంటూ గురువుగారు వ్రాశారు. ప్రస్తుత కవిత్వాన్ని గురువుగారు పొగిడారు. యేదో ఫలాపేక్ష వుండక తప్పదు, నిశ్చయం. నా జీవిత చరిత్రలో "జాషువా" కవిని ప్రశంసించాను. దానికేమి ఫలితమో! తోఁచినట్లల్లా వ్రాస్తారు గురువుగారు. వారిదయవల్ల భగవంతుఁడు నాకు అన్నోదకా లిచ్చాఁడు. ఆత్మవంచనచేసి బాగులేని కవిత్వాన్ని బాగుందనికాని, బాగున్నకవిత్వాన్ని బాగులేదనికాని తెగడడం, పొగడడం, యివి నాపనులుకావు యీపనులెవరివో ఋజువుచేయమంటే ఋజువుచేస్తాను. యెవరు పంపినా అందులో గుణమున్నా లేకపోయినా వున్నంతలోనే వెదకి కనపడ్డ స్వల్పాన్నే గొప్పచేసి అభిప్రాయ మివ్వడం కలదు. దానికిన్నీ నా జీవితచరిత్రలో నేను వ్రాసే వ్రాఁతకున్నూ చాలా భేదం వుంటుంది. యెంతో నచ్చిన కవిత్వమయితేనేగాని జీవిత చరిత్రలో నేను యెత్తుకోవడం తటస్థింపదు. అందుచేత యెవరినో యెందుకోమెచ్చి కార్యసాఫల్యం చేసుకున్నాఁడు వెం॥శా॥ అని వ్రాయడం అసూయామూలకం. ఆ మహారాజు యీ కవితా ప్రసక్తికి పూర్వమే నన్నాహ్వానించి వుండడం గురువుగా రెఱుఁగ రనుకుంటాను. ఆ ఆహ్వానానికి పూర్వం "రాజసందర్శనం"లో ప్రచురించిన అభినందన పద్యాలు కారణమని వ్రాస్తే కొంత బాగుండేది. కోపం మీఁద వ్రాసే వ్రాఁతకు అర్థమే వుండనప్పుడు హేతు హేతు మద్భావం యెక్కడ వుంటుంది? నా ప్రకృతి యెట్టిదో సందర్శనం వగయిరా పుస్తకాలు చదివిన లోకులు యెఱిఁగేవుంటారు. కాఁబట్టి విస్తరించేదిలేదు. నాకున్నూ, గురువులకున్నూ గల అభిప్రాయ

భేదాన్ని మామావంశవర్ణనా పద్యాలను బట్టి క్షణంలో లోకం గ్రహిస్తుందనుకుంటాను. మా పూర్వులు దివాన్‌జీ పనిచేసినట్లెక్కడా నేను వ్రాయలేదు. యజ్ఞయాగాదులున్నూ చేసినట్లు వ్రాయలేదు. యిట్టిస్థితిలో మా ముత్తాతగారు యజ్ఞయాగాదులు చేసినట్లు జనరల్‌గా వ్రాసి యున్నారు. అది నిజమే అయితే వకరికైనా సోమయాజి బిరుదంవుండదా? అని నేను ఆత్రోవ విడిచిపెట్టాను. అట్టి శుద్ధశ్రోత్రియ కుటుంబం మాదనిగాని కొంతేనా లౌకికోద్యోగం చేసిన కుటుంబం మాదని గాని వ్రాసుకోవడం సిగ్గుచేటని నాకు తెలిసి సత్యవాక్తత్పరత్వమున్నూ అంతో యింతో కవిత్వము చెప్పడమున్నూ మాత్రమే మావంశమందున్నట్టు సూచించివున్నాను. నా "బాలసరస్వతీ" బిరుదధారణాన్నిబట్టి గురువుగారు శాసించినట్లు "శ్మశాన వృక్ష"మై పుట్టడం తటస్థింపక మనుష్య జన్మమే వచ్చేయెడల మళ్లా యీలాటి వంశంలోనే జన్మాన్ని అనుగ్రహించవలసిందని భగవంతుణ్ణి ప్రార్థిస్తాను. అశ్వమేధాదులు చేసిన వాళ్లకంటే కూడా సత్యవాక్యతత్పరులే పూజ్యులని భారతంలో వుంది. అదే నాకు కావలసింది. యెన్నో వుక్రోశపు వ్రాఁతలు వ్రాశారు గురువుగారు. వాట్లన్నిటికీ జవాబెందుకు? శతావధానం సంపూర్తిగా యెక్కడా చేయలేదన్నారు. తి.శా. గారున్నూ నీవున్నూ సాయంపట్టేవా రన్నారు. యిద్దఱు చేయడమే చాలాకష్టతరం అని యెందఱో ప్రాజ్ఞులనుకొనేవారు. పైఁగా నీవుచేసే అవధానాన్ని చేయలేనివారెవరు. అందఱూ చేస్తారన్నారు. అంటే యేమన్నమాట? ఆహారవిహారాలవలె అవధానంకూడా సర్వసామాన్యమే అన్నమాట. కోపంమీఁద వ్రాసేమాటలకు అర్థమేముంటుంది? నేను వక్కణ్ణే సంపూర్తిగా నూజవీటిలో సంపూర్ణ శతావధానం చేసిన సంగతి గురువుగారు యెఱుఁగ రనుకుంటాను. యెఱక్కేమి? యెఱిఁగే వుంటారు. వారు అవధానులు అగుదురా? కారా? అన్న సంశయాన్ని లోకానికి తొలఁగించడాని కాలా వ్రాశారనుకుంటాను. ప్రభాకరశాస్త్రికి సంబంధించినదాన్ని కొంచెం వ్రాస్తాను. గురువుగారు, తిరుపతిశాస్త్రిగారు ప్రభాకరశాస్త్రిని తమవద్దకు పంపుతూ, "వెం॥శా॥ మీ వద్ద మూఁడుమాసాలు మాత్రమే చదివినట్లు" వ్రాసి చేవ్రాలుచేసి యిమ్మన్నట్లున్నూ, తమరు, తి॥ శా॥ గారివద్దనుండి వక వుత్తరం యీ అర్థమిచ్చేది చేవ్రాలుతో తెస్తే "వెం॥ శా॥ నా వద్ద అసలు చదువనే లేదని వ్రాసి చేవ్రాలుచేసి యిస్తా"నని జవాబు చెప్పినట్లున్నూ చెరలాటంలో వ్రాశారు. దీన్నిబట్టి గురువులకోపం బాగా తెలుస్తుందికదా. దీని నిజానిజాలను దేవుఁడే యెఱుఁగునని నేనింత వఱకు స్పృశించనేలేదు. తి॥శా॥ స్వర్గతుఁడయ్యె. ప్రభాకరశాస్త్రికేదేనా అవసరం వచ్చి కార్డు వ్రాస్తే జవాబే వ్రాయడం లేదాయె. అట్టి స్థితిలో దీన్ని స్పృశిస్తే మాత్రం యేం లాభం? అదిన్నీ కాక గురువుగారు వ్రాసే అబద్ధాలలో

నిది యెంతపాటిది? అని వుపేక్షించి వూరకున్నాను. యింతలో నాకు భార్యావియోగం తటస్థించడం చేత పలువురుతోపాటు పరామర్శ వుత్తరం వ్రాశాఁడు ప్రభాకరశాస్త్రి. దానిలో వకమాట. గురువుగారు తనపై మోపిన నిందనుగూర్చి యెత్తుకుంటూ దాని స్వరూప మెట్టిదంటూ ప్రశ్నించాఁడు. యిట్టిదని "కృష్ణలో" వున్న మాటల నుదాహరించాను. దానిమీఁద మళ్లా తాను వస్తూవున్నానని వ్రాస్తూ యీక్రింది మాటలు వ్రాశాఁడతఁడు.

"శ్రీకృష్ణమూర్తి శాస్త్రులుగారు నన్ను గూర్చి వ్రాసినట్లుగా మీ రుదాహరించిన వ్రాత నాకు విడ్డూరముగా ఉన్నది. నా జీవితములో ఎన్నడు గాని వారితో అట్టి ప్రసంగము జరిపినట్లు స్మరింపజాలకున్నాను. నాకు మతి మళ్లిపోలేదు. జ్ఞాపకశక్తి తగ్గిపోలేదు. నా జీవితకాలములో కృష్ణమూర్తిశాస్త్రులగారితో కలసిమాటాడిన సందర్భములే చాల తక్కువ సంఖ్యకలవి.... కీర్తి శేషులు తిరుపతిశాస్త్రిగారు ఎన్నడుగాని కృష్ణమూర్తిశాస్త్రిగారి ప్రశంస నాతో తేలేదు. వారు నేనుకలసికొన్న సందర్భములుకూడా చాలా తక్కువ సంఖ్యకలవే. అది మీ రెఱుఁగుదురు."

యిత్యాదులు ప్రభాకరశాస్త్రి కార్డులోని మాటలు. ప్రభాకరశాస్త్రికిని గురువులకును యెదోకొంత విద్యావిషయమున చాలానాళ్లనాఁడు మనస్పర్ధలు కలిగినట్లు జ్ఞాపకం. అది నిజమే అయితే పనిలోపనిగా అతణ్ణి అధఃకరించుట కీకల్పనలో ఒక పాత్రగా గురువులు తీసికొని వుండాలి. విశ్వకర్మ శిష్య ప్రశంసాధ్యాయంలో సుస్వభావ విషయంలోవున్న అధఃకృతిలో యితఁడున్నూ పడతాఁడుగనుక "యిట్టి దుస్స్వభావులు నిజం వ్రాస్తారు కనకనా" అని ఖండిస్తే ప్రభాకరం వుత్తరం ధూళిధూళిగా యెగిరి పోతుందని యెఱిఁగిన్నీ ఉదాహరించాను. మాయీవాదాన్ని అతఁడు బొత్తిగా సమ్మతించేవాఁడు కాఁడు. యీ మాటలు చూడండి.

"నేనీ దుఃఖజనకమైన వివాదమున ఇఁక చెవి జొన్పను. మీరును నుపేక్షింపఁ గల్గిన సంతోషింతును."

యితఁడిట్టి వివాదముల విషయమే కాదు. యితర విషయములకు గూడ విముఖుఁడే అయి యేధ్ధోరీతిని కాలక్షేపము చేయుచున్నట్టు శ్రీయుతులు విస్సా అప్పారావుపంతులు యం.ఏ.యల్.టి. (గవర్నమెంటు కాలేజి ప్రిన్సిపాల్, రాజమండ్రి) గారి వలనవింటిని. కాని అతఁడు యీ విషయమున నీ రెండుమాటలు మాత్రమేలవ్రాయవలెను అన్నది విచార్యం. నేనేమో గురువుగారువ్రాసే పెద్దపెద్ద వ్యాసాలలోవున్న ప్రతి మాటనూ యెత్తుకొని ఖండించడానికి మొదలుపెట్టి కోలాహలం చేస్తాననే యూహ అతనికే కాదుచాలామందికి

తోఁచి యిలా వ్రాసి వున్నారు. అలావ్రాస్తే బళ్లని తోలాలిగదా? అంత పెద్దమేటరును యేపత్రిక భరిస్తుంది! భరించని పద్ధతిని నేను వ్రాసినా ప్రయోజనం లేదుగదా. యిదిన్నీ కాక లోకం గురువులు కోపంమీఁద యేదోరీతిని తిడుతూవుంటే ఆ తిట్లకు జబాబు పెట్టుకొనేటంత మూర్ఖుణ్ణిగా నన్ను తలుస్తుందనుకోను. చూపితే ఆతిట్లు చూపాలని మాత్రం వుంది. అదిన్నీ అవసరం లేదు. యిదివఱలో పత్రికలో లోకులు చదివినదే కదా? గురువువారి ధోరణిని గూర్చి యిదమిత్థమని నేను నిర్ణయించుకోఁజాలకున్నాను. వక విషయం చూడండి.

విశ్వకర్మశిష్యుఁడుగారిని అభినందించవలసి వచ్చింది గురువు గారికి. యెందుచేత? ఆయన గురువుగారి చరిత్ర హరికథగా వ్రాస్తూ దానిలో పట్టిసంభద్రకాళమ్మ ప్రత్యక్షమై (కలలోఁ గాదుసుఁడీ) నట్టూ పాణినీయాన్ని కష్టపడి చదువకుండా "పాడినట్టూ" యీ వగయిరాలు వ్రాసి ఆనందం కలిగించడమే కాక హైదరాబాదు ద్వారాగా యీతగాదా తెచ్చినప్పటికీ యిటీవల "నరంలేనినాలుకను" యేలాపడితే ఆలాత్రిప్పి తమకనుకూలించే లాగ పనిచేస్తూ వున్నారు. అందుచేత ఆయన్నియెక్కువగా అభినందించవలసి వచ్చింది. "ప్రజాసేవా" పత్రికలో వక కాలం కాలానికి దానికింద వినియోగించారు. వారికన్న, నాకన్న, ఆయన చాలా గొప్పవారనీ యోగ్యులనీ యేమేమో వ్రాశారు. అంతతో తృప్తితీరింది కాదు. ఆ పట్లాన్ని యెప్పుడో నావద్ద పుస్తకం పట్టిన బ్రాహ్మణ శిష్యబృందాన్ని యెత్తుకొని యీ క్రింది మాటలు వ్రాశారు. చదువరుల వినోదార్థం వాట్లనుమాత్రం యిక్కడ చూపుతాను.

"మీ బ్రాహ్మణశిష్య బృందములో యెవ్వరును వానింబోలిన సుస్వభావముకలవారు లేరని డంకామీఁద దెబ్బకొట్టి నేను చెప్పఁగలను."

అసలు యీ విశ్వకర్మ శిష్య ప్రశంసాధ్యాయం గురువుగారెందుకుపక్రమించవలసి వచ్చిందంటే? హైదరాబాదులో "విశ్వకర్మ శిష్యుఁడు" నా ప్రశంస తెచ్చెనఁట అని నేను వ్రాయడం వల్ల అది పరిహాసమఁట. అందుచేత నీకు "వడ్ల శిష్యుఁ" డున్నాడంటూ యెత్తిపొడిచారు. నేనేమైనా విశ్వకర్మ శిష్యుఁడుండడంతప్పంటే అది కోపకారణం కావచ్చును. నాకున్నూ విశ్వకర్మ శిష్యులు చాలామందికలరు. యిందులో యింకోచిక్కు. వడ్డెకులస్థులు మేమే అంత తక్కువా? అని ప్రశ్నించడాని కారంభించారు నన్ను. యెప్పుడనుకున్నారు? మంచిది అసమయంలో భార్యాదశాహంనాఁడు. "దానిలో అంతదురర్థంలేదు. మా గురువుగారు నన్నంటే నేను కోపగించుకున్నానా?" అంటూ చెపితే వారి కెక్కుతుందా అది? మీరూ మీరూ యిప్పుడెందుకో వివాదపడుతూవున్నా బ్రాహ్మలే కనక సర్ది చెపుతూవున్నా రన్నట్లు వారిధోరణి కనపడింది. యిప్పుడెవఁడుగానేని పుట్టి కాలంగడుపుకో

వచ్చునుగాని బ్రాహ్మఁడుగా పుట్టి కాలం గడుపుకోవడానికి అవకాశం లేదుకదా? యింకా వారితగాయిదా పూర్తిగా తీరినట్లేలేదు. యేమో అడుగుతారఁట? నన్నడిగితే చిక్కులేదు. కాని గురువుగారి నడిగితే, వెం॥ శా॥ ప్రేరేపించాడని వ్రాస్తారు. యీ వివాదలో యితరులు జోక్యం కలిగించుకోకుండా నా శాయశక్తులా ప్రయత్నిస్తూ వున్నాను. ఓగిరాల సుబ్బారావుగారిని గురువుగారున్నూ శిష్యుఁడు బ్రహ్మంగారున్నూ దూషించినందుకు ఆయన మృదువుగానే అనుకుందాం యేదో వ్రాసి నావద్దకు పంపినారు. దాన్ని తొక్కి పెట్టి మీరు కలగఁజేసికోవద్దని వ్రాసి ఆపినాను. బ్రహ్మంగారు "సుధర్మ" లో యేదో వ్రాస్తే అది గురువుగారి ప్రేరణ కలవ్రాఁతే అని నేననుకున్నా లేదా? అట్లే యీ వడ్డెకులస్థులు గురువుగారి నేమైనా ప్రశ్నిస్తే అది నా ప్రేరణ కలదిగా గురువుగారే కాదు. పరిశీలన లేని లోకులు కూడా కొందఱు విశ్వసిస్తారు. కాఁబట్టి వారిని నేను కోరే దేమిటంటే? గురువుగా రెవరి నేమన్నప్పటికీ అవి నామీఁద కోపాన్ని పురస్కరించుకొన్నవే కనక మీరెవ్వరున్నూ కలగఁజేసుకోవద్దు, అది నాకు అపకారకము అనియే. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రులవారు పాపం వృథాగా కలిగించుకున్నారు. గురువుగారు వారికిచ్చిన జవాబు మాత్రం మిక్కిలి సమంజసముగా వుంది. దానితో వారు యోగ్యులుకనక తప్పుకున్నారు. యేదేనా వ్రాసినప్పటికీ పర్యవసానంలో ఉదారత్వాన్ని చూపిస్తే లోకం సంతోషిస్తుంది. అంతేనేకాని వ్రాసిన వాక్యాలన్నీ వకరు ఖండించకుండానే వాటంతట అవే ఖండింపఁబడుతూ వుంటే వ్రాసే వ్రాఁతల వల్ల ప్రయోజనం వుంటుందని యెవరో కాని అనుకోరు. "వాటంతట అవే ఖండింపఁబడే వంటూ వ్రాస్తావుకదా? అట్టి నమ్మికేవుంటే కొంచెమే అందాం. ఆ మాత్రమేనా గురువుగారి ధోరణ్ణి నీ వెందుకు ఖండిస్తూవున్నావు" అని అడుగుతా రేమో? తప్పే అని వప్పుకుంటాను. వకాయన మందలింపు వ్రాస్తూ వ్రాశారుకదా? "గురువుగా రాపాదించారన్న అపవాదలకు మీరేదో మొదట కొంత వ్రాశారు. అది కొంతవఱకు యుక్తమే. యిటీవల గురువుల ధోరణి బొత్తిగా నక్షత్ర మండలానికి పైఁగా నడుస్తూ వుంది. దీన్ని గుఱించి వారు నన్నేమన్నాసరే పత్రికలో కాదుకాని వారికేవ్రాయలనుకుంటూ వున్నాను. వ్రాస్తే వ్రాస్తా నేమో కూడా. మీరు మాత్రం యేకొంచెమో వ్రాసి సమాప్తి చెప్పండి" అని సలహాయిచ్చారు. దానిమీఁద యీకాస్తా వ్రాస్తూ వున్నాను. కాని కేవలమున్నూ స్వబుద్ధిచేతకాదు. గురువుగారి హృదయం చాలా మంచిదని నే నెఱుఁగుదును. కాని అవిమృశ్యకారిత్వం వారివద్ద అనాదిగా వుంది. దాని మూలాన్ని వ్రాసేవ్రాఁత యేలావుండాలో అలా వుంటుంది. విశ్వకర్మ శిష్యుణ్ణి గొప్పచేయడానికి బ్రాహ్మణ శిష్యుల్ని అధఃకరించడం యెందుకు? "శ్మశానవృక్షంగా పుడతావు నీ" వని నన్ను తిట్టడానికి బాలసరస్వతీ బిరుదానికి అపవ్యాఖ్యానం చేయడం యెందుకు?

మనుష్యాధముఁడు వెం॥శా॥ అనేటందుకు యేదోయేదో అప్రసక్తంగా వ్రాయడ మెందుకు? యిదంతా అవిమృశ్యకారిత్వమే. యీ "సరస్వతీ" బిరుదాలు గృహస్థుల లోకన్న సన్న్యాసులలో విస్తరించివున్నాయి. స్త్రీనామధారి శ్మశానవృక్షమై పుట్టేయెడల ఆముముక్షువులందఱున్నూ అట్టే కావలయును గదా? తిట్టడానికి శాస్త్రప్రమాణ మెందుకు? అన్నిటికన్నా నాకిది మఱీ ఆశ్చర్యం కలిగించింది. మా యింటి పేరు బుద్ధిపూర్వకంగా "చళ్లపిళ్ల" అని వ్రాసి గేలిచేశారు గురువుగారు. నేను చెళ్లపిళ్ల అని వ్రాలుచేయడం శ్రీవారెఱుఁగక కాదుసుఁడీ. యిది కూడా వెం॥శా॥ అయోగ్యుఁడనడానికి సాధన మనేవారి తాత్పర్యం. అసలు మాయింటిపేరు "చెల్వపిళ్ల" చెల్వము+పిళ్ల యెలాగో "చెళ్లపిళ్ల" కింద మాఱింది. చళ్లగా పేర్కొన్నారు గురువుగారు. బుద్ధచరిత్రలో వక పద్యాన్ని యెత్తుకుని గురువుగారు మహాబాగా వ్యాఖ్యానం చేశారు. దానిలో "వ్యాకరణ" శుంఠలు అన్నపదానికి వ్యాకరణం మాత్రమే వచ్చి యితరం లేశమున్నూ రాని కవులు అని అర్థం వస్తుందంటూ వ్రాసి దానికి వుదాహరణంగా నన్ను చూపి బొమ్మలాట, పగటి వేషాలు, భాగోతం, అంటూ కూడా యేకరుపెట్టి, రెండు "భాగోతప్పద్యాలు చెపితేనే అయిపోయిందా!" అన్నారు గురువుగారు. పోనీ భాగోతం భాగవతం కింద జమ కట్టుకొందామంటే వారి తాత్పర్యానికి భంగం వస్తుందికదా? యిప్పుడు కోపం వచ్చే కాదు, కోపంకొంచెంగా అంకురించి నప్పటినుంచీ శ్రీవారు నా కవనాన్ని గూర్చి యిట్టి ప్రసంగమే చేస్తూన్నట్టు పలువురు చెప్పఁగా వింటూన్నాను. నేను వ్యాకరణం చదువుకోవడం తప్పని తేల్చారు గురువుగారు. వారున్న శతాబ్దంలో వుండడం కూడా తప్పే కనుక యిదివరలో వారు యేకరుపెట్టిన పది తప్పులలోనున్నూ యీ రెండుకూడా చేర్చి పండ్రెండు తప్పులనుకుంటే బాగుంటుందనుకుంటాను. "భాగోతప్పద్యాలు చెపుతాఁడు వెం॥శా॥ అంటేనున్నూ గురువుల కోపోద్రేకానికి తుష్టి తీరిందికాదు. ఆ పట్లాన్ని మనుష్యాధముఁడంటూ వక బిరుదు అనుగ్రహించారు, బాగుందనుకున్నాను. యీ బిరుదు ధరిస్తే యే కృష్ణగాని, యేశిష్టా పరిమి పండితులుగాని, ఖండనమండనాలకు మొదలెట్టరనుకుంటాను. కాని యీ "మనుష్యాధముఁడే" గురువుగారి కాలికి "పెండేరం" తొడగడం చేత దానికి గౌరవం లేకపోతుందేమో? "యెగఁదీస్తే గోహత్య దిగఁదీస్తే బ్రహ్మహత్య" యీలా విమర్శిస్తే యిప్పుడేకాదు, యెప్పుడు వ్రాసినవిన్నీ గురువుగారి వాక్యాలు నిలవవు. అందుచేత వారియెడల అవిమృశ్యకారిత్వం వకటి అనాదిగా వుండడంచేత దాన్నే వీటికన్నిటికీ మూలంగా పెట్టుకొని శ్రీవారి ప్రవృత్తిని సమర్థించుకోవడం యుక్తం. "ధాష్టీకపంతులు" రచన కూడా యెప్పుడోకాదు డెబ్బైయో పడిలో చేయించిందీ అవిమృశ్య కారిత్వమే. అందులో తిట్లున్నాయనికాదు, నారాయణా! యెంతకోపం వచ్చినప్పటికీ శత్రువే అనుకోండి, ఆ శత్రువుకు వైద్యం మిషతో "పంది పెంట కషాయం" యిప్పించడం

కూడా గురువుగారికి కవితా కల్పనగానే తోఁచింది. వ్యాకరణం చదువుకోవడం వల్ల, వెం॥ శా॥ కవిత్వం "భాగోత" ప్పద్యాలయింది. వెం॥ శా॥ మనుష్యాధముఁడు కూడా అయినాఁడు. సర్వదా అట్లే అగుఁగాక. యేవిషయమందేనా వుత్తమత్వానికి ప్రయత్నిస్తే చిక్కు వస్తుందిగాని అధమత్వానికైతే చిక్కు రాదు. యిందుకు తార్కాణం గురువుగారు సర్వోత్కృష్టత్వానికి ప్రయత్నించి సంపాదించిన "సార్వభౌమ" బిరుదాదికమే అని లోకం గ్రహిస్తుంది. కనక విస్తరించేది లేదు. యీ అధమత్వమేనా నాకు అప్రయత్నంగా వచ్చింది, కాని సప్రయత్నంగా కాదుగదా? అబ్బో? అందుకు గురువుగా రొప్పుకుంటారా? నీవేమో? కృతఘ్నత్వదోషం నే నాపాదిస్తే దాన్ని పాపుకోవడానికి ప్రయత్నించావు. దాని మీఁద నీకీబిరుదు నేనిచ్చాను. కాబట్టి యిదిన్నీ ప్రయత్నించి సంపాదించికొన్నట్లే అంటారనుకుంటాను. విమర్శిస్తే నిలిచినా నిలువకపోయినా అంతట్లో యేదో కల్పిస్తారుగా? గురువుగారు. కోపంవచ్చినా వ్రాఁతలో గాంభీర్యం వుండాలి. అది లేకపోతే ప్రతివాది వూరుకున్నా లోకం గర్హిస్తుంది. మేమో లోకాన్ని గణించడం. యింక లోకం మేమ్మేంచేస్తుంది. 'సరకే సతికో దోషః, మరణే సతి కిం భయమ్' వార్ధక్యంలో కూడా వ్రాఁత బాల్యాన్నే జ్ఞప్తికి తేవడమేనా? "ముదిముప్పున బాల పాపచిన్నె" అంటారిదే కాఁబోలు ముగిస్తాను.

## అనుబంధము

చదువరులలో యెంతోమంది నా పేర పద్యపూర్వకంగానున్నూ, వట్టి వచనంగానున్నూ వ్రాసే వుత్తరాలలో గురువుగారి ధోరణిబాగా లేదని వ్రాస్తూవున్నారు. యీ వుత్తరాలు నేను ప్రకటించడంవల్ల ప్రయోజనం లేదు. గురువుగారిక్కూడా కొందఱిట్టివీ వ్రాసేవుంటారేమో? ఆత్మవంచన లేకుండా ప్రవర్తించేవారు లోకంలోచాలా తక్కువగా వుంటారనేది సర్వసమ్మతమైనమాట కాకపోలేదు. మా వాదం లోకసమ్మతం కాదన్నది నిర్వివాదాంశం. కాని నాకు వచ్చిన చిక్కు జాతకచర్యలో వ్రాసిన నా విద్యాభ్యాసానికి గురువుగారి వుత్తరం వల్ల భంగం కలగడమే. దాన్ని వారించు కోవద్దని యెవరైనా అంటారనుకోను. గురువుగారి వుత్తరానికే నేను సమ్మతించే యెడల యెందఱో గురువులకు నేను కృతఘ్నుణ్ణి కావలసి వస్తుంది. అందుచేత పత్రికలో వ్రాఁతకు దిగాను. వచ్చిన వుత్తరాలు గురువుగారు తిట్టేతిట్లకు అసమ్మతిని తెలుపడమేకాక చాలాకోపాన్ని ప్రకటిస్తూ వున్నాయి. అట్టివి ప్రకటనార్హం కావు. వారు ప్రకటించమంటూవున్నారు. కొంత మృదుపాకంలోవున్న భాగాన్ని మాత్రం వుదాహరిస్తాను. కవిమండల మండన బిరుదాంకితులు మంగళగిరి కృష్ణద్వైపాయనా చార్యులవారి 22 పద్యాలనుండి కొన్ని.

ఉ. నోటcగవీంద్రులాడదగునో? తమరాడినమాటలెల్ల నా
ర్భాటముచేసికొంత, నవభారతకర్తల మంచు గోటుతో
మాటలనాడుకొంట అది మాన కహంకృతి తెన్ను దెల్పదో?
చాటుకవిత్వమొక్కొ? అది శాస్త్రులవారి విశారదత్వమో? ౧

ఉ. పక్షముcబూని పల్కెనని భావములోపల నెంచవద్దు స
ద్వీక్షణకొంతచూడనది వెఱ్ఱిగc గానcగనయ్యె "కృష్ణలో
దక్షతతోc బ్రవేశమిడి తప్పులువ్రాసినమీదు వ్రాcతమీ
పక్షమువారె రోcత అటు ప్రక్కకుc జూడకుcడంట వింటినేన్. ౨

తే.గీ. మీరు వ్రాసిన వ్రాcతకు సారమెఱుcగు
జాణ లెవ్వరు మెచ్చరు బాగు బళిరె?
యనెడి వా రొక మేcక తోలయినcగప్ప
రెందుకో శాస్త్రిగారి కీ క్రిందుదృష్టి 3

యీయన 28 మార్చి 36 సం॥ కృష్ణలోని తిట్లుచూచి వ్రాసినట్లు వ్రాసివున్నారు. 25-2-36 సం॥ తేదీని నల్లా చిన్నరెడ్డి నాయుడుగారు 40 పద్యాలవఱకున్నూ వ్రాసినారు. అప్పటికింకా గురువుగారిధోరణి యింతగా పాకందప్పలేదు. "చెరలాటం" మొదలెట్టినప్పటికీ యింతగా దురుసులోకి దిగలేదనుకోవచ్చుననుట స్పష్టమే. అందుచేతనే యీయన పద్యాలలోని అంశాలు సరిగా తూకంతూcచినట్టు గోడమీcది పిల్లి వాటంగా వున్నాయికాని యే పక్షానికిcగాని వరగడంలేదు. కొద్దిగా వుదాహరిస్తాను.

## క్రొమ్ముటేన్గుల క్రుమ్ములాట

క. భారతమునంతగ్రంథము
తీరుగ నాంధ్రమున నద్వితీయతcబలుక
న్నేరిచిన సూరిcగూరిచి
కోరి యెవరు మొక్క కుంద్రు? గురుభావమునన్. ౨

తే.గీ. ... అరయcగ డోలునకుగట్టువారుమీరు
వీరణమునకుc బేరై నవారువారు
బలపఱిచి వారిమాట పైనిలుపcదగిన
మీరె అసహాయవాదులై మాఱుతిరిగి

యీ కరణి డీకొనిన నింక మీకు నేమి
చెప్ప నెవ్వరు వలతులు చిత్తగింపు
వినుతగుణధుర్య గురువర్య? వేంకటార్య? ౩

తే.గీ. గడుసుఁదనమొప్పఁగా ధ్వనిగర్భితంబు
గాఁగఁ బటుపరిభాషణ కాండములను
విసరగల మీవిచిత్ర ధన్విత్వమునకు
చెలఁగియొకవృద్ధగురుగుఱిఁజేయఁజనునె?
సరసహితచర్య? వేంకట శాస్త్రివర్య. ౪

ఆ.వె. ప్రాయమెల్ల యుద్ధపర్వధూర్వహమయ్యె,
డాకసాగె విజయఢక్క మ్రోఁగె
చాలునింక బుద్ధి శాంతిపర్వమునకు
మల్పవయ్య పొల్పునిల్పవయ్య ! ౫

తే.గీ. మొనసి 'యాడినదాట' పాడినదిపాట
యై యశోజ్యోత్స్న లెందు నభ్యర్థి తముగ
నడచె మీచరితంబు లీనాఁటనకట?
బహుళ దశ మీస్థదశనేఁటి పగలుమీకు. ౬

తే.గీ. వంగిపోయిన ముదుసలి "గంగిరెద్ల
యాట" వలెనిప్డు మీదుపోరాట నవ్వఁ
బాటు పాలౌట కాకేటిపాటు కెక్కు
మేటులార ! విద్యాధనపేటులారా ! ౭

తే.గీ. రేఁగెనఁట? యతఁ, డీవాదిరేపితంట
యెందులకు? నీకిటు నిరాపనిందకృష్ణ?
ఉడుగఁగదె? యిఁక గురుతకీద్వదగఁబోదు
ఘనవివేకివి వినవె నామనవిసుకవి. ౮

క. సచ్ఛీలురకుండునె? పు
త్రచ్ఛాత్రులయందు "భేదత త్త్వము" పుత్రా
దిచ్ఛేత్పరాజయ" మ్మను
స్వచ్ఛోక్తినివినవె? కృష్ణశాస్త్రివరేణ్యా ౯

చాలును. సుమారు యీయన పద్యాలలో నాల్గవవంతు పుచ్చుకొన్నట్లయినది. యీ విషయం గ్రంథ రూపంగా ప్రకటింపఁబడినప్పుడు యీయన పద్యాలన్నీ ప్రకటించ వలసినవే. మృదువైనపాకం. యుక్తి నైపుణ్యం, వ్యంగ్యమర్యాద, యివన్నీ యీయన కవిత్వాన్ని అలంకరిస్తూ వున్నాయి. నేఁటి కవులలో యిట్టి కవిత్వం వ్రాయువారు కొందఱే వుందురనుట అతిశయోక్తికాదు. యీ వాదాం సత్యనిర్ధారణకు తప్ప యితర విషయానికిగా బొత్తిగా పుట్టలేదు. అందుచే గురువుగారు ఆక్షేపించిన శబ్దతప్పులను గూర్చి రెండిటికి మాత్రమే సమర్థనం కనపరచి వూరుకున్నాను, తక్కినవికూడా అదేరీతిని సాధువులే. అన్యత్ర వాట్లను గూర్చి యెప్పుడో కాదు కొలఁది రోజుల్లోనే వ్రాస్తాను. కాలీన శబ్దాన్ని గూర్చిన్నీ ఉభయపదులగు ధాతువులను గూర్చిన్ని, యిదివరకే వ్రాశాను. బహుశః త్రిలింగలో నేఁట రేపట నయ్యది ప్రకటింతును. ఆ యీ విషయాలు వట్టి తిట్టాటవంటివికావు గనుక లోకాని కంతో యింతో వుపకరిస్తాయి. అందుచే వుపేక్షించ వీలుకాక వోపిక లేనప్పటికి యెట్లో వోపిక తెచ్చుకొని వ్రాయడమైనది. ప్రస్తుత విషయాన్ని గురించో యిదివరకే ముగియవలసింది. "కృష్ణ" యెందుకుపేక్షించింది అనే అంశాన్ని "ప్రజాసేవ" చర్చించ వలసింది. ఆమె చర్చించిందికాదు. అందుచేత యీకాస్తా వ్రాశాను కాని లేకపోతే వ్రాయను. యీపైని యెంతో అవసరం వస్తే తప్ప దీన్ని గురించి వ్రాసేదిలేదు. సశేష స్థితిలో గురువుగారి వ్యాసం వుండఁగా పంపే వ్రాఁత కనుక యీ మాట వ్రాయవలసి వచ్చింది. ముగించినట్టే లోకులు భావింతురుగాక.

★ ★ ★

# "ఊరిపిడుగు వీరి సెట్టిని కొట్టుకు పోయింది"

(14-5-1936 సం॥ర గోలకొండ పత్రిక నుండి)

అంటూ వక సామెతవుంది. ప్రస్తుతం మా గురుశిష్య వాదోపవాదాలు తుట్టతుదకు ఆలా పరిణమించి నట్లయింది. అసలు యీ వాదాలు హైదరాబాదులో హరికథ చెప్పడానికి మా గ్రామప్రాంతాన్నుంచి వెళ్లిన ఆయన చేసిన ప్రసంగంవల్ల కొంతా, ఆప్రసంగరక్షణకు గురువుగారు వ్రాసినవుత్తరం వల్ల కొంతా, ఆ వుత్తరం విమర్శించి అందున్న వ్యత్యాసాలు చూపినవారివల్ల కొంతా పుట్టినట్లు మా వాదోపవాదాలు ఆద్యంతాలు చదివిన వారికి తెలుస్తూనే వున్నాయికనక విస్తరించేదిలేదు. ఆయీ వాదోపవాదాల వల్ల వచ్చే లాభానష్టాలుకాని, కీర్త్యపకీర్తులుగాని మా గురుశిష్యులను పొందడం యుక్తం. యితరులపై పొలవడానికి నేనుగాని గురువుగారు గాని యెంత ప్రయత్నించినప్పటికీ తుట్టతుదకు జరిగేదిమాత్రం అంతే. "గురువుగారు ప్రమాదంవల్లనో అంతకుముందే అంతరంగంలో యేర్పడ్డ కోపంవల్లనో అబద్ధం వ్రాస్తే వ్రాశారు, అంతలో మునిగిపోయిందేమిటి, వెం ॥ శా॥ వూరుకోకూడదా" అనిగాని లేక "పెద్దలుగదా? శుద్ధాబద్ధంగా ఆలా వ్రాసి వెం॥శా॥ కి కృతఘ్నుత్వాన్ని ఆపాదించడ మెందు" కనిగాని లోకులు "పంచశుభం పంచాశుభం"గా యెట్లాగా చెప్పుకోక మానరన్నది వాది ప్రతివాదులమైన మే మిరువురమున్నూ తెలుసుకోఁదగ్గ ముఖ్యాంశం. ఇందును గుఱించి స్వయంగా చేవ్రాళ్లు చేసి యేదో వ్రాసుకుంటూనే వున్నాము. గురువుగారు హైదరాబాదుకు వ్రాసిన వుత్తరంలో సంగతులేమి "శృంఖలం"లో వ్రాసిన సంగతులేమి, మొట్టమొదట భ్రాంతిమూలకాలేమో అని నేననుకున్నాను గాని క్రమంగా అవి వారు బుద్ధిపూర్వకంగా వ్రాసినవే అని స్పష్టమవడంచేత లేశమున్నూ వాట్లనుగూర్చి యితరులమీఁద నాకు అనుమానం కలగడానికి అవకాశంలేదు. ఆకారణంచేత నేనుయితరులు తెచ్చిపెట్టినట్లు లిఖింపక యిటీవలి చర్యలో

"గురువరు - లందులకున్ మూలభూతు లగుట ధ్రువంబౌ"

అని వ్రాసియున్నాను. గురువుగారు మాత్రం, "సేలువులూ చేతికట్టా" నాకు లంచమిచ్చి యెవరో నన్ను తమమీఁదకు కయ్యానికి పురికొల్పినట్లు కృష్ణలోనున్నూ, ప్రజాసేవలోనున్నూ వ్రాస్తూవున్నారు. వారెవరు నాకివి యిచ్చారని వ్రాస్తూవున్నారో వారు

నా ప్రతిమకు హైదరాబాదులో మా చిరంజీవుల అవధాన సభలో వీట్లను యివ్వడానికి పూర్వమే యీవాదోపవాదాలు ప్రారంభమైనాయి. కాఁబట్టి హేతుహేతుమద్భావం కుదురదు. ఇదిన్నీకాక గురువుగారికింకా తెలియలేదేమోకాని నాకు మా యింటికి తెచ్చి సమర్పించింది సేలంకండువాగాని, సేలువులున్నూ చేతి కఱ్ఱకాదు. ఈ సేలంకండువా దరిమిలానే యీవాదం ప్రారంభమయింది కనుక గురువుగారు యీపైన వ్రాసేవ్రాఁతలో సేలంకండువా మీఁద యీదోషాన్ని ఆపాదిస్తే బాగుంటుందనుకుంటాను. ఇదియేలాపుట్టిందో నేను నాయెఱిఁగినంతలో ఆత్మవంచన లేకుండా వ్రాస్తూవున్నాను. జిజ్ఞాసువులు తెలుసుకొందురు గాక.

నాయందు గురువుగారికిన్నీ, నాకు వారియందున్నూ ప్రేమాభిమానములు పూర్ణంగానే వున్నా యని నేను మొన్న మొన్నటివఱకున్నూ అనుకొనేవాణ్ణి. కాని గురువులు వ్రాసేవ్యాసాలలో కొన్ని అంశాలనుబట్టి మా గీరతరచనా కాలంనాఁటికే గురువుగారికి నాయందు అసూయ అంకురించిందని తేలుతూవుంది. ఆయంశమేమిటంటే, ప్రభాకరశాస్త్రులకు సంబంధించినది. అతఁడేమో; తి॥శా॥ గారి పంపున గురువుగారివద్దకు వెళ్లియేమో అడిగిన ట్లొకకల్పన (అభూతకల్పన) వ్రాస్తూ అందులో "అసలే చదువలేదు వెం॥ శా॥ అని చేవ్రాలు చేసియిస్తాను" అని వ్రాసేవ్రాఁతవల్ల గురువుగారి హృదయం అప్పటికే మాఱినట్లు విస్పష్టమేకదా! మాఱకేపోతే ఆ మాటకి అంతకోపం రావలసివుండదు కదా? వారి వుద్దేశంలో బ్రహ్మయ్య శాస్త్రులవారిని ప్రధానగురువుగా సంభావించడం యిష్టంలేనట్లు యిటీవలవ్రాఁతలు చెపుతూవున్నాయి. వాట్లను వుదాహరిస్తే చాలా పెరుగుతుంది. ముఖ్యాంశ మేమిటంటే! యిప్పటికి సుమారు యిరవై యేళ్లకుపూర్వమే గురువుగారికి వెం॥ శా॥ మీఁద అసూయ వుదయించింది కాని అది అంతర్గతంగానే వుంది. అంతట్లో కొల్లాపురంగోల రావడం తటస్థించింది. ఆప్రాంతంలోనే కృష్ణలో సార్వభౌమ బిరుద కనకాభిషేకాలను యీసడించి వ్రాశారు కృష్ణరావుగారు. ఆయన వెం॥శా॥ పేరెత్తలేదుకాని దాన్ని బలపఱచే శిష్టాపరిమి, పండితులు, వెం॥ శా॥ పేరుకూడా యెత్తడంవల్ల అంతర్గతమైన ఆకోపాగ్ని మఱింత రవిలింది. శిష్టావారి మేఘసందేశంమీఁద యెవరిపేరుతోనో వీరువ్రాసిన విమర్శనానికి ఆయన కుమారుఁడు "వాగ్బంధ" మనేపేరుతో యిచ్చినజవాబులో వెం॥ శా॥ పేరెత్తి వీరియందు లాఘవాన్ని ఆపాదించడమే కాకుండా "సార్వభౌమ" బిరుదాన్ని కూడా కొంతకలిపాడు. అదిన్నీ చిక్కేతెచ్చింది. "శృంఖలం" వ్రాసేనాఁటికింకా యీ గందరగోళం రాలేదు. కాని దానికి కొల్లాపురం గోలమాత్రమే ముఖ్యకారణం. ఇవన్నీ అయినాక "శృంఖలం" నా కళ్లబడ్డాక నేను "శాంతివ్యాసం" వ్రాశాను. దానిలో అవకాశం వున్నంత వఱకు గురువులను సమర్థించాను, లేనిచోట

వదలినాను. ఇతరుల వాదాన్ని కూడా ఖండించాను. ఖండించలేనివి వదలినాను. ఒక్క నాగభూషణంగారి వ్యాసంలోవున్న రెండుమూఁడు యెత్తిపొడుపు మాటలు మాత్రం నావద్ద వ్యాసం వ్రాసేటప్పుడు పత్రిక లేకపోవడంచేత యెప్పుడో చూచిన జ్ఞాపకాన్ని బట్టి వ్రాయవలసివచ్చింది కనక నేను గమనించలేదు. ఆమాటల విషయంలో గురువుగారు చూపినసవరణను నేనువప్పుకుంటాను. తక్కిన "చాకలిచే" మహాపండితునికి జవాబు చెప్పించడంలోనైన ప్రసంగం గురువుగా రెన్నటికీ సమర్థించేదికాదు. అది అలా వుంచుదాం. శాంతివ్యాసానికి సుమారు ఆఱుమాసాలకాలంలో పెండేరపు సభ జరిగింది. గురువుగారు యిప్పుడేలా వ్రాస్తూవున్నప్పటికీ, అప్పుడు వెం॥ శా॥ గురువుగారికేవిధమైన అపచారమున్నూ చేయలేదు అని వారి అంతరాత్మకేకాదు ఆ సభయావత్తుకూ తెలుస్తుంది. కోపం వచ్చినప్పుడు కూడా నిజం నిజంగానున్నూ, అసత్యం అసత్యంగానున్నూ వప్పుకొనేవారితో వివాదు వచ్చినను చిక్కుండదుగాని అగ్రహానుగ్రహాలను బట్టి "యేయెండ కాగొడుగుగా" వాగ్ధోరణి మార్చేవారితో వాదోపవాదాలువస్తే చాలాచిక్కు! యీ చిక్కు కేమి! మేము ఆ ఆత్మను వంచించిచెప్పే మాటలేవో? వంచించ కుండా చెప్పే మాటలేవో? లోకం యేలాగా గ్రహిస్తుంది. దానికోసం శ్రమపడనక్కరలేదు. యిఁక ప్రస్తుతమేమిటంటే? యెవరో తెచ్చిపెట్టారంటూ వారిని దూషించడం అంత అవసరం కాదు. గురువులు వారికి వ్రాసిన వుత్తరం వగయిరా (అచ్చుపడ్డ) రికార్డు నాకు పంపినమాట వాస్తవం. అదినాకోరికనుబట్టి జరిగింది. గురువుగారి యేకలవ్య శిష్యునికిన్నీ యీ రికార్డు పంపినవారికిన్నీ, నా శిష్యత్వాన్ని గుఱించి కొంత ఘర్షణ జరిగినట్లు అక్కడ అచ్చుపడ్డపత్రికలే చెపుతాయి. ఆకారణంచేత ఆ యేకలవ్యశిష్యునికిన్నీ ఆయనకున్నూ స్పర్ధయేర్పడిందే అనుకుందాం. మాలో గురుశిష్యులకు జరిగేవాదోపవాదాలవల్ల ఆ యేకలవ్య శిష్యునికేమి భంగం వుంది? ఆయనకేమేనా నా ద్వారాగా భంగం కలిగినప్పుడు కదా, ఆయన ప్రతికక్షిదారుఁడు సంతోషించవలసివస్తుంది. అట్టిది లేశమున్నూలేదే? లోకులు మా యిద్దరినోలేక మాలోవకరినో భూషించడమో! దూషించడమో జరుగుతుంది. అంతేకాని ఆయేకలవ్య శిష్యుఁడికి దీనిలో వచ్చిన నష్టమేముంది? ఆయనవిన్నమాట లాయన యేకరు పెట్టివుండును. అంతే. అందువున్న సత్యాసత్య విచారంతో ఆయనకేం పని! గురువుగారు అసత్యంచెప్పినారని ఆయనయేలా అనుకుంటారు! అందుచేత ఆయన్ని యేమోచేయడానికి నేనుయిందు పూనుకోలేదు. నా విద్యాభ్యాసమెట్లు జరిగిందో ఆ సందర్భం యితరత్రా వ్రాసివుండడంచేత దానికి విరోధించే వ్రాఁత గురువులది బయలుదేరడంవల్ల నే నీ వ్రాఁతలకు దిగవలసివచ్చింది. నిజమిట్టిదైవుండఁగా, తమకూ యేకలవ్యశిష్యుఁడికీ యేమోఅపకారం జరిగించడానికి ఆయనశత్రువు శాలువలూ కట్టాయిచ్చి యీ వివాదాన్ని

కల్పించినట్లు గురువులు వ్రాయడం చాలా ఆశ్చర్యకరంగావుంది! పోనీ వారిచిత్తానికి అలాతోఁచింది వ్రాశారుసరే? పాపం యెవరో వక యువకవిగారు వకపుస్తకం వ్రాశారు! అచ్చొత్తించారు! ఆయువకవిగారికిన్నీ మాగురువుల యేకలవ్యశిష్యునికిన్నీ మైత్రి వుండి, ఆ శిష్యుని ప్రతికక్షిదారునియందు ప్రబలశత్రుత్వం వుండి, అది వ్రాయవలసి వచ్చినట్లు బాలునికి కూడా దానివల్ల తేలుతుంది. ఆ పుస్తకాన్ని, ఆయువకవిగారు కొంతసమ్మానాన్ని చూపేమాటలు స్వదస్తూరీతో వ్రాసి నాకు పంపారు! అభిప్రాయం అంతకు పూర్వం నాతలమీఁది వారంతా యిచ్చివుండడంచేతో నన్ను కూడా దూషించడంచేతో లేక మఱేకారణంచేతో నన్ను అభిప్రాయ మిమ్మనిమాత్రం వారు కోరలేదు గాఁబట్టి నేను వారికి అభిప్రాయంపంపలేదు. అభిప్రాయం కోరకుండా నావద్దకు వట్టిపుస్తకం మాత్రమే నమస్కారాలతో నా జీవితకాలంలో యితరకవులచే పంపఁబడ్డది యిది మాత్రమే! అందు మొట్టమొదటం వకగీతపద్యంలో మా గురుశిష్యులిద్దఱికీ వకనమస్కారబాణం వేయఁబడి వుంది. నిజానికాపద్యం నమస్కారార్థం పుట్టిందిమాత్రం కాదని నా అంతరాత్మకు తోఁచింది. యిఁక యెందుకుపుట్టినట్లు తోఁచిందంటే? యిందులో వున్న చరిత్ర వీరిద్దఱికిన్నీ సంబంధించిందని లోకులకు సుళువుగా తెలపడానికి కవిగారు యీ వుపాయం పెట్టుకున్నట్లు నాకు త్రికరణశుద్ధిగా తోఁచింది. అందు నాకంటె గురువులనుకొంత గొప్పచేశారు కవిగారు. అది న్యాయమే. గురువు శిష్యునికన్న గొప్పగా వుండడమే యుక్తంగదా! గురువుగారు అభిప్రాయం యిచ్చేవున్నారు కనక యిఁక శిష్యుఁడి అభిప్రాయం అంతకంటె వేఱుగావుందని అనుకొనికాఁబోలు నన్ను అభిప్రాయం మాత్రం వారుకోరలేదు. కోరకపోవడానికి యిదేకారణమైతే అది సరియైనదికాదు. నేను ఆ పుస్తక విషయంలో గురువులతోనే కాదు యింకా యిచ్చిన మహామహులతోకూడా లేశమున్నూ యేకీభవింపఁజాలను. అలా యేకీభవించేయెడల నా అంతరాత్మ నన్ను పీడిస్తుంది కాఁబట్టి యిట్లా వ్రాయడమైనది. నీయభిప్రాయం యెట్టిది? అని నన్నిప్పుడు గ్రంథకర్తగారు, ప్రశ్నించరు! ప్రశ్నిస్తే విపులంగా వ్రాస్తాను. గురువుగారొక్కరు తప్ప తక్కినవారు ప్రమాదపడిగాని ఆశ్రయింపువలన మోమోట పడిగాని అట్టి సదభిప్రాయం యిచ్చారని నేననుకుంటాను. అంతకంటె వారి విషయంలో నాలేఖిని అన్యథాగా వ్రాయనివ్వడంలేదు యేమంటే? వారి వారికి గురువులకుంబలె నాయందు ద్వేషము లేశమున్నూ లేదని నా అంతరాత్మద్వారా నాకు తెలుసును. అగుచో విశేషించి కాకున్నను యే కొంచెమో నన్ను కూడ అధఃకరించడానికి పుట్టినట్టి పొత్తముమీఁద సదభిప్రాయాన్ని బుద్ధిపూర్వకంగా యిస్తారని నేనేలా అనుకోఁగలను? ఆ పుస్తకంలో నీకేమి అధఃకరణమున్నదని అభిప్రాయ ప్రదాతలే అడుగుతారనుకొందాం! దానికి జవాబేమిటంటారా? పనిపడితే మనవి

చేసుకుంటాను. అన్యాపదేశంగా వున్నదాన్ని ఆ నెత్తిని బెట్టుకోనక్కఱలేదు. వాచ్యవృత్తిగానే వున్నదాన్ని చూపుతాను. యేమైనా యెవరో మాగురువుల సమ్మతిమీఁదనో, లేక వారిపరోక్షాన్నో ఆ పుస్తకంవ్రాస్తే వ్రాయవచ్చును గాక! అభిప్రాయ ప్రదాతలు ఆత్మవిద్యా గౌరవాన్ని కొంత చూచుకోవలసి వుంటుందని నేననుకొన్నాను ! యీ మా పని తప్పనితోస్తే వారొకకార్డులో నాకు వారుసూచించి నప్పటికీ నా "క్షమాపణ" ను నేను వారికి వెంటనే అందచేసుకోఁదలఁచినాను. వారిలో వకరిద్దఱిదర్శనం నేను చేసుకొనివున్నాను. కాని తక్కినవారి దర్శనం చేసికొన్నట్లు జ్ఞప్తిలేదు. యేమైనను పదవులనుబట్టిగాని విద్యనుబట్టిగాని వారునాకు పరమపూజ్యులు. అట్టివారు కనుకనే అంతోయింతో నా విషయమగు అధఃకృతి కొంత వాచ్యంగానున్నూ కొంత గూఢంగానున్నూ వున్నదానిపై అట్టి సదభిప్రాయాన్ని యివ్వడాన్ని గుఱించి చర్చించుకోవలసిన వాఁడనైనాను. అయితే "గుమ్మడికాయల దొంగ అంటే బుజాలు సవరించుకోవడం" వంటిదేమో యీవూహ? కానివ్వండి! వారున్నూకవులు గదా! వారి కాలాగే తోస్తే నేను దాన్నే విశ్వసించి "ముదిమది తప్పితే మూడుగుణాలు" అనే సామెతనుస్మరించి నాతప్పును నేను సవరించుకుంటానని కూడా మనవి చేసుకున్నాను గదా? యింతకూ ఆ కవిగారు ఆ గ్రంథం వ్రాయడం నన్నధఃకరించడానికిన్నీ కాదు, మాగురువులను పురస్కరించడానికిన్నీ కాదు. ఆయనకు ఆ వూళ్ళోవుండే వక ప్రబలశత్రు వనుకొనే వ్యక్తిని కసితీరా తిట్టడానికి ప్రారంభించినట్లే దానికి సందర్భించిన యితర విషయములు తెలియనివాళ్లకి కూడా స్పష్టమేకాని ఆయన ఆ పనిచేసుకొని వూరుకుంటే బాగుండేది! మా యిద్దఱినిన్నీ దీనిలో యెత్తుకోవడంతో అవసరమే లేదు! లోకంలో యెందఱెందఱు పరస్పరద్వేషాలతో తిట్టుకోరు? వారందఱూ మా గురుశిష్యుల జోలి తలపెడుతూవున్నారా? లేదు. కాఁబట్టి ఆకవి గారికి మాయిద్దఱిలో యెవరిదో గట్టిప్రోత్సాహం వుండితీరాలిఁ యీ అంశం ఆయన గ్రంథాన్ని దగ్గిఱపెట్టుకొని మామా వ్యాసాలల్లో వున్న కొన్ని వాక్యాలను పైకితీసివిచారిస్తే బట్టబయలవుతుంది. కాఁబట్టి చదువరులను అలా చేయవలసిందని ప్రార్థిస్తూ విరమిస్తూవున్నాను. విరమిస్తూ గురువుగారితో రెండుమాటలు మనవి చేసుకుంటాను. అయ్యా! మనకు వొరుల సాహాయ్య మెందుకు? యేదేనా సత్యనిర్ధారణకు సాక్ష్యం కావలిస్తే ప్రత్యక్షంగానే చెప్పేవారు చెపుతారుగదా! అన్యాపదేశగ్రంథా లెందుకూ? కసితీరా యెవరినో తిట్టడానికి కింతకన్న వుపాయం లేదంటారా? యిదివఱలో నేలాగైనా మీరేమి! నేనేమి? దెబ్బై యెనభై పడులలో నున్నాంగదా? యిదిన్నీ కాక తమరు నా విషయంలో యెంతతిట్టులనేనా వాచ్యంగానే వ్రాస్తూవున్నారుగదా? అంతతో తృప్తితీరింది కాదా? అయితే దానిలో నీకేమి తిట్లున్నాయంటారా? అట్లావుంటే నేను దానికియింత నొచ్చుకొనేదే లేదు. నేను యెన్నోతిట్లు

తినివున్నాను. ఆ తిట్లు ప్రకటించుకోవడం కూడా నాకు అలవాటయిపోయింది. యీ మధ్య భారతిలో మా ప్రభావతీ ప్రద్యుమ్నాన్ని వకరు ఆక్షేపిస్తే తోఁచిన జవాబు వ్రాస్తూ అందు వక శిష్యుఁడి పద్యాన్నొకదాన్ని మచ్చుకు ఉదాహరించాను. దానిమీఁద "నీకుంటే నాకు మాత్రం శిష్యప్రశిష్యులు లేరా" అని తెల్పడానికో అన్నట్లు కొన్ని పద్యాలున్నూ మాలికలున్నూ నీచోక్తులతో నిండినవి వ్రాసి "ఆకాశరామన్న" అర్జీగా "గంధర్వలోకంబున నుండి" అని చేవ్రాలు చేసేచోట వకమాట వ్రాసి, గంధర్వలోకంలో పోస్టాఫీసు లేకపోవడంచేత కాఁబోలు పిఠాపురం పోష్టుద్వారా నాకు అందచేశారు. పోష్టుముద్రవల్ల తెలిసిందేకాని ఆసలాయన ఊరుగాని పేరుగాని అందుదాహరింపలేదు సుమండీ! ఆకరపత్రంలో నె ౧౨ రు అని నాకు పంపిన దానిలో వ్రాశారు. ఇంతతో విరమిస్తే బాగానే వుండును. ఊరుకుంటే బాగుండదని మళ్లాయేవో నాలుగుమాటలు భారతిలో వాదాన్ని గుఱించి ప్రకటిస్తూ ఆమాటలలో యీ అక్షరాలు వ్రాశారాయన. "నాకు నెవ్వరో గంధర్వలోకంబున నుండి" యని పద్యములతో గూడిన ౧౪వ నంబరుగల బహిరంగలేఖను పంపినారు..... "పద్యములు కోపోద్రిక్తములై యుండుటచే వానిని శ్రీవారిరీతిగా మచ్చునకు జూపుటకైన మనస్సొప్పినదికాదు" అని. నాకువచ్చిన బహిరంగ లేఖ ౧౨ నంబరు కలది. ఆయనకు వచ్చినది ౧౪వ నంబరుకలది. అందులో నన్ను లెక్కకు మిక్కిలిగా దూషించడంవుంది. ఆయన్నికొంచం భూషించడంవుంది. ఆయన యీ మాటలు వ్రాసి ఆత్మవంచన చేసుకోఁగలిగినంతలో లోకం ఆలేఖతో తమకేమిన్నీ సంబంధం లేదని లోలోపల భావిస్తుందని భావించి వున్నారు. ఆయనకు మనస్సొప్పలేదుగాని నాకు మనస్సు వప్పుతోంది కనక దాన్ని నేనిందు కొంచెం ప్రకటిస్తాను.

## వకబహిరంగలేఖ

"................. కింకవీంద్రుడా? ఉ. కాటికి కాళ్లుచాచుకొని........... యేటికి నీదు పాండితి? మరేటికినీదు కవిత్వధాటి? నా; మాటలు వించునీపయిని మానుము, వోలెటివాఁ డసాధ్యుఁడు....... యశంబునేల కరాబొనరించుకొనఁగ, నట్లు కొట్లాటలనాడి నోట గెల్పుపొందెడిరోజులు వెళ్లిపోయెం......... కూయుచున్న వినుమోయి?... పండితాళి చీవాటుల పెట్టరయ్యె! తలవాచెడిలాగున..... పండితవర్యులెల్ల "ఛీ!ఛీ!" యని నిందల సేయఁగ..... నామతంబు గ్రహించి వేగమె క్షమార్పణ గోరుము... క. వెగటుగదా? చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి !"

ఇత్యాదులు. ఆయన ప్రకటింపక మానినానని బొంకినారు. తాను తనకు తోఁచినరీతిని మాపొత్తమును విమర్శిస్తే తోఁచినరీతిని జవాబువ్రాసిన దానిమీఁద లోకంలో

నిట్టితిట్లు వ్రాయవలసిన యవసరమేరికి కలుగుతుంది? వకవేళ నేనిచ్చిన ప్రత్యుత్తరం బాగులేదని తోస్తే బాగుగా లేదని స్వంత వ్రాల ప్రకటింపవచ్చునుగదా! యోగ్యులే అయితే అందులో తప్పేముండును? కాఁబట్టి యీపన్నుగడ సదరు విమర్శకులదియే. ముమ్మాటికిన్నీ విమర్శకులదియే. దీని గురించిన్నీ యీయన మల్లా భారతిలో వ్రాసిన దానికిన్నీ వేరొకప్పుడు వ్రాస్తే వ్రాస్తాను. ప్రస్తుతం మనకు కావలసింది కొందఱు వాదోపవాదాలలో ప్రకృతాన్ని విడిచి తిట్టడంకూడా వుంటుందనేది. అట్టితిట్లకు నేను ఏవగించుకొనేది లేదనేదిన్నీ. యింకోకర్మం, తాము యీలాగ స్వహస్త పరహస్తాలతో తిడుతూ ఎంతో జాగ్రత్తగా ప్రధాన విషయాన్నే వ్రాసేవాళ్లనుకూడా తమ్మును తిడుతువున్నారని వ్రాయడం వకటి. యివన్నీ నిష్ప్రయోజనాలు. లోకానికి విమర్శించే తెలివితేటలు లేకపోలేదు. తనకుకూడా నాకువచ్చినట్లే బహిరంగలేఖ వచ్చిందన్నంతలోనే లోకానికి తెలియదా? దానిలో గంధర్వలోకము అనే పదమెందుకు పడిందో ముందు తెలుపుతాను. ప్రస్తుతం నన్ను తిట్టించక నాకోసం మరొకరిని తిట్టించడం భావ్యంకాదనే నేను గురువులను ప్రార్థించేది. నాకేమి సంబంధమంటారా? సంబంధంవున్నట్టు మీ వ్యాసంలో వాక్యాలే చెపుతాయని మనవి చేసుకొంటాను. సేలువుల ప్రసంగంకన్న కావలసిందేమిటి? అభిప్రాయం యిచ్చినంతలో అనుమానానిక్కారణం వుండదు. యేమోఁ పుస్తకంచూచి యివ్వడం వుంటుంది. చూడక యివ్వడం వుంటుంది. చూచియిచ్చినా చూడకుండాయిచ్చినా బాగుందనేకదా? ఆ గ్రంథకర్తగారు నన్ను అభిప్రాయం అడగలేదుగాని అడిగితే నేనున్నూ యిచ్చేవాణ్ణేమో. మరికొందఱు ప్రముఖులిచ్చారా? లేదా? వారందఱూ సాంగంగా చూచేయిచ్చారనుకోఁగలమా? చూచేయిచ్చినట్లయితే, యిది దూషణాత్మక గ్రంథం : వారికీ వారికీ వుండే ద్వేషంమీఁద వ్రాసుకుంటే వ్రాసుకుంటారు మనకెందుకని వుపేక్షించేవారనే నేననుకుంటాను. అందులో వకరు బలవంతంమీద అంగీకరించినట్లు కొద్దిగా సూచించినారు. భవతు! దానికేమి? తుదకు గురువుగారున్నూ బాగానే వున్నారు. శిష్యుఁడుగారున్నూ బాగానే వున్నారు. "వీరిసెట్టి తిట్టులు తింటూ వున్నట్లుంది". "వూరిపిడుగు" సామెతకాక మరేమిటిది? గురువుగారే వెం॥ శా॥ కృతఘ్నుడనో కృతజ్ఞుడనో వకటి రెండుమాటలలో వ్రాస్తే తీరిపోయేది. వృథాగా కాలాలక్కాలాలు నింపుతూవున్నారు. అన్యాపదేశ కవిత్వాల కామోదమును చూపుతూవున్నారు. ప్రేరకత్వాన్ని కూడా సమర్థించడానికి ఆధారాలు కనపడతాయి. పాపం పుణ్యం భగవంతుఁడి కెఱుక. ఇది యవసరమని నాకుతోచడం లేదు. కాబట్టి విన్నవించుకున్నాను. దివాంధ గ్రంథకర్తగారికి నామనవి యేమిటంటే? నాకు యింత అన్నోదకాలున్నాయి. యెవరేనాయేమేనాయిస్తే నా ఆత్మను వంచించి వారు పోట్లాడుమంటే నాకు సంబంధింపని వారితో పోట్లాడేదిలేదు.

నేనెక్కడికీ వెళ్లలేకున్నా వచ్చేరాబడి యింట్లో వున్నావస్తూనే ఉంది. మీ దర్శనం నేనెప్పుడూ చేసుకోలేదు. లేకపోయినా మీరునన్ను ప్రేమించి మీ గ్రంథంలో నన్ను యిరికించి శాశ్వతుణ్ణిగా చేసినందుకు మిమ్ము అభినందిస్తూ వున్నాను. నా గ్రంథాలవల్ల నాకు పేరునిలుస్తుందో నిలవదోకాని మీ గ్రంథం వల్ల నేనుకృతార్థుఁడైనాను. వక సలహాయిస్తూవున్నాను, అంగీకరిస్తే అంగీకరించండి. లేదా తోసివేయండి. మీకున్నూ మాకున్నూ వివాదంవుంటే మఱియొకలాగు తీర్చుకోండి. మమ్మల్ని దానిలోకిదింపి రంజన్సు చేయడం ఆలోచనపనికాదు. యెన్నో విద్యావివాదాలు వచ్చాయి కానీ మీలాగు సాహసించిన వారింత వరకున్నట్లు నేనెఱుగను. మీ సాహసం వర్ణనీయం. నేను వృద్ధుడనేకాని గురువులకన్న నాలుగేండ్లు చిన్నవాణ్ణి, మీ కల్పన సమంజసమో కాదో ఆలోచించుకోండి. క్షమించండి.

★ ★ ★

# గురువుగారు వట్టి అమాయికులు

(20-6-1936 సం॥ర కృష్ణాపత్రిక నుండి)

అని సరిపెట్టుకోవడమేతప్ప, యిప్పుడు వారు నన్ను అధఃకరించడానికని వ్రాసేవ్రాఁతలను అన్యథాగా సమర్థించడానికి నాకు లేశమున్నూ మార్గం కనిపించడంలేదు. వకమాటేమో, వెం॥ శా॥ కాకరపర్తిసభలో వోడిపోయాఁడని వ్రాసి తృప్తిపడతారు. యింకొకమాటేమో, అవధానం వకమాటున్నూ సంపూర్తిగా చేయకుండానే శతావధాని బిరుదాన్ని పెట్టుకున్నాఁడని వ్రాసి సంతుష్టి సూచిస్తారు. మఱొకమాటేమో, బాలసరస్వతీ బిరుదం వుండడంచేత ధర్మశాస్త్రప్రకారం శ్మశానవృక్షమై పుడతాఁడనిన్నీ గురుధిక్కారం చేశాడుకనక నూఱుసార్లు కుక్కగా పుట్టడమేకాకుండా ఆ తర్వాత చండాలుఁడుగా పుడతాడనిన్నీ వ్రాసి సంతోషాన్ని ప్రకటించుకుంటారు. యింకా యెన్నెన్నో యిట్టి సందర్భాలు వ్రాసి వారు వారి సంతృప్తిని లోకానికి తెలుపుతూ వున్నారు. "యేడుకఱవు లొస్తా" యన్నట్లు ఆయీ వ్రాసేసందర్భాల్లో యే వకటిరెండో వెం॥ శా॥ పనికి మాలిన పంద అని సమర్థించడానికి చాలవూ? యిన్నిటిని ప్రకటించడమెందుకో? అని నే ననుకుని, వోహో! యిది గురువులవారి అమాయికత్వాన్ని తెలుపుడుచేసే సందర్భం అని సమాధానం చెప్పుకుంటూవుంటాను మళ్లాను.

గురువుగారు వ్రాసే వ్రాఁతధోరణి పరిశీలిస్తే వెంకటశాస్త్రికి కర్మం చాలక యేవ్యక్తివల్లనేనా యే మాత్రం ధిక్కారం జరిగినాకూడా సంతోషించే స్థితికి వచ్చినట్లు కనపడుతుంది. అలాగేకాకపోతే, యెవరో ఆచార్లగారు పాపం, కవిత్వరచనమంటే యేమిటో బొత్తిగా యెఱగనివారు, ఆంధ్రమంటే అసలే తెలియనివారు, తి॥ వెం॥ కవులను వెక్కిరించి "గిల్లికజ్జా" తెచ్చుకుంటే, ఆయన ఆక్షేపించిన ఆక్షేపణలనున్నూ ఆయన ఖర్చుపెట్టిన దురుక్తులనున్నూ తమ పుస్తకంలో చేర్చుకొని పరాక్రమిస్తారా? అట్లు పరాక్రమించి తరించడానికి ప్రయత్నిస్తూవున్న గురువుగారిని అమాయికు లనుకోవడం కన్న మార్గాంతరం కనపడదు.

ఆ ఆచార్లగారి ఆక్షేపణ మచ్చుకు వకటిచూపుతాను. "ఢిల్లికి ఢిల్లే పల్లికి పల్లే" అన్న సందర్భంలో ఆచార్లగారు మా గురువులకన్నను అమాయికులు గనుక "పామరుల

వాడుకలోనిది" అంటూ ఆక్షేపించడమే కాకుండా, "యింత తెల్వితక్కువగా" ప్రయోగించే మీరు మాబోట్ల రచనలను గూర్చి లేశమున్నూ "నోరెత్తడానికి" అవకాశం లేదంటూ కొన్ని మాటలు ఖర్చుపెట్టివున్నారు. యింకా కొన్నిటిని యిట్లాటివాటినే స్వామిగారు చూపించి వారికున్న పాండిత్యగర్వాన్ని ప్రకటించివున్నారు. యిప్పుడు వారిది ప్రస్తుతం కాదుకనుక మచ్చుకు వకటిమాత్రం చూపి వూరుకున్నాను. "భారతి"లో వారి విషయం బయలుపడుతుంది. శ్లో. లోకోక్తీనాం భవే ద్యోగో యథావ చ్ఛ్రుతిరంజనమ్. అని అహోబలుఁడు వ్రాసి "అయోలక్క" లోనైనవాటిని వుదాహరించిన వున్నట్లు జ్ఞాపకం. జ్ఞాపక మనడమేమిటి? ధ్రువంగానే వ్రాయరాదా? అంటే, అప్రస్తుతమైన వినండి. యిదివఱలో శతఘ్నులు వగయిరాలను పగులఁగొట్టే రోజుల్లో బందరులో వుండడపు సౌభాగ్యంవల్ల "టవున్‌హాలు"లో కావలసినంత గ్రంథసామగ్రి దొరికేది. యిప్పుడో, పల్లెటూరినివాసం. కాఁబట్టి ఆ సౌకర్యం బొత్తిగా లేదు. ఆయుధసామగ్రి లేకుండానే యుద్ధంచేయాలి. బహుశః అట్టియుద్ధంలోనే జయంపొంది గురువులవల్ల "క్రియాసిద్ధి స్సత్త్వే భవతి మహతాం నోపకరణే" అనే శ్లోకానుసరణంగా సర్టిఫిక్కట్టును సంపాదిద్దామని వుంది.

ఆచార్లుగారు భారతివిశేషాలు చదివిన్నీ, అందులో మేము వ్రాసిన "ఈవామనునికన్న ప్రాచీనుడుఁగాన కాళిదాసు" అనే వాక్యాన్ని యెఱిఁగినిన్నీ, నన్ను వెక్కిరిస్తూ యీ మధ్య భారతిలో వ్రాసిన వ్యాసంలో "కాళిదాసేకాలపువాఁడు, వామనాచార్యుడే కాలపువాఁడు" అంటూ బోధించి "ప్రకాస్తి" అనే పదాన్ని "పామరై కప్రయోజ్యమగు గ్రామ్యపదము" అని "ఢంకామీఁద దెబ్బగొట్టి" వ్రాయగల్గిన సాహసులు. "ప్రకాస్తి" గ్రామ్యమనడం, యిదివఱలో వెం॥ రా॥లు. "క్షమాపణ" నింద్య గ్రామ్యమన్న తెగలోకి వస్తుందిగదా. యిఁక "ఢిల్లికి ఢిల్లే" అనే లోకోక్తి అనుకరణంలో కూడా వుంది. పింగళి సూరన్నగారి "రోల్లా రోఁకళ్లం బాడిన" అనే ప్రయోగం వల్ల అనుకరణం కూడా అక్కఱలేదని తేలుతుంది. దాన్ని బట్టే "తొండరడిప్పొడియాళ్వారి" చరిత్రలో సారంగుమహాకవి "ధాత్రీమండలి పాలువిఱిగితే పెరుగగునే?" అని ప్రయోగించుకున్నాఁడు. అయీ సందర్భాలు లేశమున్నూ తెలియని ఆచార్లగారి తోడ్పాటును గురువులు అఱువైవేల పద్యాలు భారతం తెలుగులో వ్రాసినవారు, పుచ్చుకోవడం ఆశ్చర్యంకాదా? తాము చూపేతప్పులే నిలవడంలేదే! నిలవకేమంటారా? యిదివరలో (1) "స్త్రీలను" యెత్తికొని సప్తమ్యర్థక ద్వితీయ తప్పన్నారు. భారత ముదాహరించి వున్నాను. (2) "కోరికెలు" ఎకారఘటితం తప్పన్నారు. మహాకవి ప్రయోగాలు చూపి వున్నాను (3) "చూపఱులు" తప్పన్నారు. ప్రౌఢ వ్యాకరణము చూడాలన్నాను. యీ సమాధానా లేమైనా నచ్చినట్లేనా? లేక నచ్చనట్లా? నచ్చితే నచ్చాయని చెప్పి మళ్లా తప్పులజాబితా వ్రాయడాని కుపక్రమించవలసిందంటాను. ఆయీ మీ తప్పులజాబితా

నిలవదన్నంతలోనే లోకం విశ్వసించదు. కాఁబట్టి అందులోనుంచి కూడా మచ్చుకు వకటి చూపుతాను, ఖండిస్తానుకూడాను. "క. విని సైఁపక యిది యెంతేనిని గ్లిష్టము" అన్నచో, "ఏనిని" అన్నది తప్పన్నారు. భారతంలో తిక్కన్నగారి కవిత్వంలో యిట్లే ప్రాసస్థానంలోనే వుందని మనవి చేస్తూవున్నాను. యెక్కడో చూపాలిగాని అలా గూఢంగా సూచించడం న్యాయం కాదంటారా? ఆమాట గురుముఖతః వస్తే ఆప్రకారమే చేస్తాను. "చూపఱులు" అనే దానికిప్పటికి దొరికినవి ఆఱు ప్రయోగాలు గ్రంథ విస్తరమేమిటికి? గురువులవా రిప్పుడిచ్చిన తప్పుల జాబితాలో రెండు తప్ప తక్కినవన్నీ శుష్కేంధనాలే. ఆ రెండిటిలో వకటి సవరించి చాలానాళ్లయింది. షష్టిపూర్తి ముద్రణంలో చూచుకోవలసి వుంటుంది. యింకొకటి, న్యాయంగా అడిగేవారికయితే నా ప్రమాదమే అని వప్పుకుంటానుగాని, గొప్పకోసం పరాక్రమించే వీరికట్లా వప్పుకొనేది లేదు. బ్రహ్మయ్య శాస్త్రులవారి శుశ్రూషవల్ల కలిగిన ఆయుధబలంవల్ల మార్గాంతరం త్రొక్కి సాధిస్తాను. మళ్లా గురువుల గారి అమాయికత్వ ప్రసంగాన్ని కొంచెం చూపి మఱీ వ్రాస్తాను.

"ఆచార్యులవారు ఢంకామీఁద దెబ్బకొట్టి 'యేదీర' మ్మని చెప్పుచు నొక్క మహావ్యాసము ప్రచురించినారు. మఱియు నెందఱో యెన్నో విధముల వీరిని వీరి కవిత్వమును గర్హించుచు వచనరూపముగా పద్యరూపముగా వ్రాసియున్నారు..... నేను 'నావాఁ' డను నభిమానంబున నింతవఱ కెప్పుడును కల మాడింపలేదు."

"శృంఖల" గ్రంథంలో కల మాడించియున్నారని మనవి. దాని కేమి? యిప్పుడుకల మాడించితిరి గదా! జరిగేసందర్భాన్ని ఆలోచించు కొన్నారా? వెం॥ శా॥ నిజమైన శక్తికలవాఁడైతే పేరు నిలుస్తుంది గాని వకరి అనుగ్రహంవల్ల నిలిచే పే రెందాఁకా నిలుస్తుందంటాను!

తి॥ వెం॥ కవులను వారు గర్హించారు, వీరు గర్హించారు. వచనాలతోనున్నూ పద్యాలతోనున్నూ, అని సంతోషిస్తారు గురువుగారు. యెవరూ గర్హించి, గర్హించడానికి తగ్గ ఫలాన్ని అనుభవించకపోతే యీ గడ్డిపరకలకు యింత పేరెందుకు వస్తుందో గురువులే ఆలోచించుకోవాలి. ఈ విషయం "పుణ్యైర్యశోలభ్యతే" అనే వ్యాసంలో చూడలరు. వెం॥ శా॥ శుంఠ, వట్టి శుంఠే, అని లోకానికి తెలపడానికి వాఁడిన కవిత్వాన్ని విమర్శించడానికి పూనుకొని చూపే తప్పులు బొత్తిగా "లోయరు" క్లాసులో వుండే పాండిత్యానికి స్ఫోరకాలుగా వుండడంచేత. "భారతి" యాదృచ్ఛికంగా నన్ను పలికిన నిక్కపు కవిసార్వభౌముడు అన్నమాట గురువుల వారే సమర్థించి పెట్టినట్లవుతుందేమో! "నావాఁడు" అనే అభిమానం యీ రూపేణా ప్రకటించినట్లు నేను సంతోషిస్తూ గురువుగారి అమాయికత్వానికి అనేకవేల నమస్కారాలు

చేస్తూవున్నాను. వారి జాబితాలో వున్న శంకలలో వక్కదానికి "ఏనిని" అన్నదానికి నేనిందు సమాధానాన్ని గూఢంగా సూచించాను. యిప్పటి యుద్ధాలు పూర్వకపు యుద్ధాల మాదిరిని కావని "యిటలీ" యుద్ధమెఱిఁగిన వారికి తెలపనక్కరలేదు. కాబట్టి గూఢమార్గ మవలంబించాను.

గురువులతో శిష్యుఁడెన్నఁడున్నూ యెదుర్కోఁగూడదు. పలువురు గురువుల శుశ్రూష చేసిన శిష్యునకు తుట్టతుద గురువుగారుతప్ప తక్కినవారు లొక్కవడమే తఱుచు తటస్థిస్తుంది. కాని నిజం కనిపెట్టిన గురువులు ఆశిష్యుణ్ణి ప్రేమించి వారిప్రజ్ఞకు సంతోషిస్తారు. అంతేనేకాని వాణ్ణి అధఃపాతాళం అణగదొక్కడానికి ప్రయత్నించి తద్వారాగా అపకీర్తి వహించరు. ప్రస్తుతం అవసరంలేకపోయినా గురువుగారు శిష్యుఁడి తాలూకు కవిత్వంలో తప్పులంటూ యేకరుపెట్టి శిష్యుణ్ణి అధఃకరించాలని వారికుతూహలం. అందుకోసమే కాలదోషంపట్టిన "ప్రోనోట్లు" కంప్లయంటు చేసినట్లు యెన్నఁడో ఖండింపఁబడ్డ "శతఘ్ని" వగయిరా వాదోపవాదాలు స్వీకరించి ప్రకటించడానికి మొదలుపెట్టినారు. తమ భారతంలో తామేలా ప్రయోగించుకున్నారో, అలా ప్రయోగించిన ప్రయోగాలను కూడా తప్పనడానికి మొదలేశారు. యిది మఱీన్నీ అమాయికత్వం గదా? యిదివఱలో ఆక్షేపించిన ఆయీ ఆక్షేపణలకు మహాభారతాదుల నుంచి ప్రయోగాలిస్తే, అవి సరియైనవా కావా అన్న పరిశీలన లేకుండానే మళ్లా యేవో తప్పులంటూ వ్రాయడం చూస్తే గురువుగారి ధోరణికి అర్థమే కనపడడంలేదు. మహాకవులు ప్రయోగాలు వుంటేమాత్రం "వాళ్ల కర్మ వాళ్లదీ, మనకర్మం మనదీ" అంటారేమో. వక సందర్భంలో యిదివఱలో యిదేరీతిని అనివున్నారు. కొంచెమేనా ఆలోచించి వ్రాస్తే బాగుండేదేమో? వ్రాతకదా? వట్టిమాటలయితే యేమో అనుకోవచ్చు, వ్రాఁత బలికోరుతుందంటారు. శతంవద, ఏకం మాలిఖ. వ్రాసేదానిలో కొంతేనా నిలవాలా? అంతా పొల్లేనా? గురువులు కొల్లాపురపు పెండ్లిపీటల మీఁది ఆశీర్వచనపద్యాలు "తగలఁబెట్టుకొ" మ్మనడాన్ని సమర్థించుకోవడానికి చేసే ప్రయత్నం మఱీ అమాయికత్వాన్ని ప్రకటిస్తుంది.

ఉ. పాశుపతాగ్ని హోత్రమున భగ్గున మండి వెలింగి బూదియై
రాశికి రాక ధూళియుఁ బరస్పరమేళనలేమి బ్రుంగఁగా
నాశనమయ్యె దానికి వినాశనకాలము మూడి మున్నె మీ
యాశలతో శతఘ్ని...............................

అన్న గీరతపద్యాన్ని పుచ్చుకున్నారు గురువుగారు. యీ పద్యం వెం॥ రా॥ లు మా పాండవాశ్వమేధంమీఁద "శతఘ్ని" అనే దాన్ని ప్రయోగించామని సంతోషిస్తూవుంటే

ఆశతఘ్నిని (ఫిరంగిని) పాశుపతంచేత ఖండించి ఆ సందర్భాన్ని చమత్కరించిన విషయాన్ని బోధిస్తుంది. అర్థిప్రత్యర్థులు పరస్పరమున్నూ వకరి అస్త్రాలను వకరు ఖండించుకుంటారు. గురువులవారు ఆవలిపండితుఁడు తమరిని గూర్చి వ్రాసినదాన్ని ఖండించలేదే. ఆపండితుఁడు తమరినిగుఱించి యేంవ్రాశాడు పాపం. ఆయన్ని పోషించే ప్రభువును ఆశీర్వచించుకొన్నాఁడు. తమ ప్రత్యర్థియెవరో పెండ్లికుమారుణ్ణి ఆశీర్వచించిన పద్యాలను గద తాము "తగలఁబెట్టుకొ" మ్మన్నది. దానికిన్నీ దీనికిన్నీ లేశమాత్రమేనా పోలిక వుందా? "పృష్ఠతాడనా ద్దంతభఙ్గః". పైఁగా యీ పాశుపత పద్యంలో "శ్రాద్ధం పెట్టినట్లు" కూడా వుందంటారు గురువుగారు. కవితా రసాస్వాదనంచేసే రీతి యీలాగేనా? యీ పద్యంలో యెదటివారిని గూర్చి "అబ్బాయీ మీ వాదం వోడిపోయింది" అని యెత్తిపొడవడమే పరమార్థం. గురువుగారి "తగలఁబెట్టుకొమ్ము, అమంగళం, అశుద్ధం," అనే వాక్యంలోనో అన్వార్థం లేశమున్నూ లేదు. అంతా దురర్థమే. దీన్ని యీపాటికేనా సమర్థించే యత్నం మానితే బాగుండును. యెందుకు మానతారు? ప్రస్తుతం జరిగే వివాదుకంతా యిదేగదా "మూలకందం ముకుందం." యిది మూలమని బాహ్యానికి కనబడుతూవున్నా గీరతకాలం నాటికే కొంత అసూయ గురువుల హృదయంలో అంకురించివున్నట్లు సమర్థించడానికీ కొన్ని ఆధారాలు యిటీవల గురువులు వ్రాసే వ్రాతలలో దొరుకుతాయి. ఆ తగలబెట్టడాన్ని నిరసించిన పండితులనందఱినీ దూషిస్తూ నన్ను మిక్కిలిగా దూషిస్తూ "శృంఖలం" అంటూ వ్రాసి దాన్ని దాచి దాచి తుదకిప్పుడు అది పౌరుషంకాదని ప్రకటించారు. దాని ప్రకటనవల్ల ఆ శ్లోకాలు చెప్పిన బ్రాహ్మడికి వృత్తిచ్ఛేదమవుతుందని కూడా ఆపినట్లు గురువులే వ్రాశారు. యిప్పుడు వృత్తిచ్ఛేదం అవుతుందేమో చూడాలి. వేడినీళ్లవల్లనే యిండ్లు కాలతాయి కాఁబోలును. నాపూన్కి ఆ బ్రాహ్మడి వృత్తిని నిల్పుగాక, నాకు దీనివల్ల పుణ్యం కలుగుఁగాక. యెన్నఁడో భస్మమైపోయిన శతఘ్నిని యిప్పుడు మళ్లా కాలదోషపు ప్రోనోటులాగ బయటికి లాగుతూవున్నారు. పాశుపత మేమయిందనుకున్నారో?

పాపం "క్షమాపణ" అనే నిర్దుష్టమైన పదం కూడా వారికి నింద్యగ్రామ్యజాతిలో చేర్చవలసివచ్చింది. యింకొకచిత్రం. అది సర్వదా నిర్దుష్టపదం అన్న సంగతి మావల్ల తెలుసుకోవడం జరిగిందా? అలా జరిగినా యిప్పటికి్కూడా ఆ తెగలో చేరినవాళ్లు మాత్రం క్షమాపణ అనడానికి బదులుగా క్షమార్పణ అనే వ్రాస్తూవుంటారు. యీపదం అపశబ్దమైతే కాదుగాని యే అర్థం యివ్వాలో ఆ అర్థాన్ని మాత్రం యివ్వడానికి పనికి రాదు. గురువుగారుకూడా "క్షమార్పణ" అనే వాడుతూ వుంటారు. పైపదం నిర్దుష్టమన్న సంగతిని యెఱిఁగినవారుపండితులలోకూడా క్వాచిత్కంగా వుంటారు. ఆలాగే కాకపోతే శ్రీ వ్యాసమూర్తిశాస్త్రుల్లుగారి వంటి వారు "నింద్యగ్రామ్య" మనడం తటస్థించదుకదా.

అప్పుడు శిష్యులవల్ల లోకానికి ఆయీరహస్యాలు వెలిపుచ్చవలసివచ్చింది. యిప్పుడో, గురువుగారి పుణ్యమా అని, కొన్ని రహస్యాలు బయలుపడతాయి. నా కవిత్వాన్ని తప్పులంటూ వ్రాయడం బాగానే వుంది కాని నామీఁద వృథాదోషారోపణ చేసి శాపాలు పెట్టడం గురువులవారి అమాయికత్వాన్ని మఱింత బలపఱుస్తుంది. ఇతరుల సందర్భంలో నేను స్పష్టంగా వాడిన "ఆసీమాంత" పదాన్ని గురువులు తమమీఁద పెట్టుకోవడం మిక్కిలి శోచనీయం. గురువులు కోపోద్రేకంచేత నాకున్నూ వారికిన్నీ సందర్భించిన శుశ్రూషను అన్యథాగా వ్రాశారని నేను వ్రాస్తే దానికి "వొళ్లు తెలియక వ్రాశా" రని నేనన్నట్లు వ్యాఖ్యానం వ్రాసుకున్నారు గురువుగారు. సత్యంకోసం నేను పెనుగులాడుతూ వున్నప్పటికీ వెం॥రా॥ లవలె హెచ్చుతగ్గు మాటలు వ్రాయడం నాపనికాదు. గురువుగారు సరియైనతోవలో కలాన్ని నడిపించడంలేదు. నిన్నగాక మొన్న కాఁబోలు శ్రీదేశోద్ధారకులు "సుగృహీతనాములగు శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారికి గురువులగుటచేతను అగ్రపూజ కర్హులు" అని వ్రాసిన సంగతి యెఱిఁగివుండిన్నీ ఆ సభలోనే శ్రీకాంచనపల్లి కనకమ్మగారు తమ్ముస్తుతిచేసిన "యీతని పాదమ్ములు గొల్తు రేన్గుపయి నెక్కుకవుల్" అనే వాక్యాన్ని వినివుండిన్నీ, నాశిష్యత్వాన్ని తృణీకరించడం యేమనుకోవాలి? అట్టినే నేమి, నాకవిత్వమేమి, క్షణంలో పనికిమాలినవయినట్లు వ్రాస్తారు గురువరులు. యెవరో యెవరినో పడఁదిట్టి అందులో తమకేమో మెహర్బాని సంఘటించడానికి వ్రాసిన వకదూషణ పుస్తకాన్ని, ధారాశుద్ధిలేని పుస్తకాన్ని, తెగపొగిడి రాస్తారాయె, ఇదంతా అమాయికత్వంగాక యేమనుకోవాలి?

షష్టిపూర్తి సందర్భంలో వెం॥ శా॥ ని సమ్మానించిన సమ్మానించడం ఆంధ్రలోకాని కంతకున్నూ సమ్మానించడంగా పండిత లోకం అంగీకరించుగాక అని వ్రాసిరి. నేఁడు శుంఠ వెం॥ శా॥ అని వ్రాస్తూవుండిరి. శత్రుత్వమే వుందనుకుందాం వుంటేమాత్రం వ్రాఁతలో గాంభీర్యం వుండవద్దా? రామునికి రావణునిమీద శత్రుత్వం లేదా? అయితే మాత్రం గాంభీర్యాన్ని కోలుపోయినాఁడా? రాముఁడు చూడండి యేమన్నాడోను! "ఓయీ! నీవు కులమందుఁగాని బాహుబల మందుగాని మిగులపేరెక్కిన వాఁడవు. యిట్టివాఁడవై యుండిన్నీ దొంగతనంగా నా భార్యను అపహరించడం శూరులు మెచ్చరని తెలుసుకోలేక పోయావు. ఆయీ నీ అకార్యాన్ని బ్రహ్మ మొదలగు నీకూటస్థులు విని మిక్కిలీ నొచ్చుకుంటారుసుమీ" అని అన్నట్టు మురారి కవి వ్రాసివున్నాఁడు. అంతేనేకాని "కుండంతా వోటిగా" వ్రాసేవ్రాఁతకూడ వక వ్రాఁతేనా? నేను గురువుగారి భారతం యావత్తూ అసారమని వ్రాయలేదే? వారికింత కోపం యెందుకో? యేకొంచెమున్నూ అసారంగా వుండకుండా కవిత్వం చెప్పేవాళ్లంటూ స్వర్గ మర్త్యపాతాళలోకాల్లో యెక్కడేనా యెప్పుడేనా వున్నట్లు విన్నామా? వింటామా?

మాకున్నూ, వెం॥రా॥ లకున్నూ వచ్చిన వాదానికిన్నీ ప్రస్తుత వాదానికిన్నీ ముడిపెట్టాలని గురువులు మిక్కిలీ శ్రమచేస్తూవున్నారు. దాని కిన్నీ దీనికిన్నీ లేశమున్నూ పోలికలేదు. యీ అంశం గురువు లెఱుఁగనిదికాదు! యెఱుఁగుదురు. యెఱిఁగే లోకవంచన చేస్తున్నారు. యీ అంశాన్ని నేను మొట్టమొదటి వ్యాసంలోనే సూచించి వున్నట్లు జ్ఞాపకం. అసత్యములతోనూ అప్రమాణాలతోనూ నిండివున్న ఆయీ తమ వ్యాసాలను పుస్తకంగాచేసి చెరలాటం అనే పేరుతో వుచితంగా పంచిపెట్టిస్తూవున్న గురువుల అమాయికత్వం మిక్కిలీ వర్ణనీయం.

నేను; గురువుగారు నా కవిత్వంలో చూపిన దోషాలలో కొన్నింటికి పూర్వభారతాదులలో నుంచి వుదాహరణాలుచూపి, కొన్నిటికి గురువుగారి భారతప్రయోగాలే తుట్టతుదను అనుబంధంలో వుదాహరించి వున్నాను. గురువుగారు యేమాత్రం న్యాయపథాన్ని తొక్కేవారైనా అంతతో వూరుకొని "సరే! మిగిలినవాటి కేంసమాధానం చెపుతా" వని ప్రశ్నించడం తప్ప యింకోరీతిగా యేమాత్రం వ్రాసినా అది పిడివాదంలోకే చేరుతుంది.

గురువుగారు మిక్కిలీ సాహసులు. కొల్లాపురపు విషయాన్ని యీ గోదావరిజిల్లాలో వుండే మహామహులైన విద్వాంసులూ కవులూ అందఱున్నూ నిరసించివున్నప్పటికీ, వారి నందఱినీ యేవో మాటలతో నిరాకరిస్తూ మళ్లా వాదానికి ఆరంభించారు. ఆ వాదంపేరే "దురుద్ధర దోషశృంఖలం" దాన్ని మూడేళ్లు కాఁబోలును కొంత పస్తాయించి అచ్చువేసికూడా దాఁచిపెట్టివున్నారు. నాకేమో వంచనమని ఆలోచించి కాఁబోలు యిప్పుడు బహిర్గతం చేశారు. కాని అందులో మొట్టమొదటి అచ్చులో వున్న "తద్దినంబెట్టేవాఁడి తమ్ముడులాగా" అనే మాట, లోనగు నింద్యోక్తులు చాలావఱకు తగ్గించారు. యీమాట 82 వత్సరాల వయస్సులో యిప్పుడున్న వక మహాకవినిగూర్చి గురువులు వాడివున్నారు. యిప్పటి ప్రకటనలో కొందఱిని అసలే తగ్గించారు. యెవరిని తగ్గించారో వారినే మొదటి అచ్చులో విశేషించి దూషించి వున్నారు. యీ తగ్గింపువల్ల ఆ దూషించడం తప్పని యిప్పటికేనా వారి చిత్తానికి గోచరించినట్లు స్పష్టపడింది అని నేను సంతోషిస్తూవున్నాను. నన్ను గుఱించి మొదట యెంత దూషించారో అంతా యిప్పుడున్నూ ప్రకటించివున్నారు. యిలా మార్పు చేసి తుట్టతుదకు వ్రాస్తారు చూడండి.

"ఇవియే పండితుల యభిప్రాయములపై నేను వ్రాసిన వ్రాతలు. ఇవియే పండితులను తిట్టితి నని మన శతావధానిగారు పలుకగల్గిన పంక్తులు ఇందులో నెట్టి తిట్లున్నవో?......."

మార్చడం వల్ల కొన్ని తిట్లు తగ్గినాయని మనవిచేస్తాను. అవసరమైనపుడు నాచేతికి చిక్కిన పుస్తకంలో వున్న దుర్వాక్యాలు ప్రకటిస్తాను. మొదట తొందరపడినప్పటికీ

యిటీవలనేనా సవరించడం శ్రీవారి జీవితాన్ని అలంకరిస్తుందనిన్నీ విన్నవించుకుంటాను. యింక ప్రస్తుతాన్ని ముగిస్తూ నేను యిదివఱలో గురువులవారిశంకలకు యిచ్చినటువంటిన్నీ, యీ వ్యాసం తుట్టతుదను బహుసంగ్రహంగా శ్రీవారి భారతాన్నుంచే యివ్వఁబోయే టటువంటిన్నీ సమాధానాలను గూర్చివారి అంగీకారానంగీకారాలు తెలుప వలసిందని పునఃపునః మనవి చేసుకుంటాను. యిద్దఱమున్నూ వార్ధక్యంలోనున్నూ అనారోగ్యంలో నున్నూ వున్నవారమే కనుక తక్కిన పొడిమాటల వాదానికేంగాని విద్యావిషయికమైన యీ వాదాన్ని తేల్చుకోవడానికి తగ్గ ఆయురారోగ్యాలని యిమ్మని మా యిలువేల్పును ప్రార్థిస్తాను.

చ. గురువులు నాకునిప్పు డొక గొప్పపనిం గలిగించినారు, వే
గిరపడినంతఁ దేలదది కేవలసారవిహీనమయ్యు, నీ
కరుణయొకింత నాపయినె కాక గురూత్తమునందు జూపి సా
కిరివయి చూడు మిర్వురకు గీర్తియు నాయువుఁ బెంపు మీశ్వరీ

క. వాదిప్రతివాదులలో
రాదుగదాకీర్తి ఇర్వురకు నందువొ? నా
"చేదస్తపు" నుడి యెట్లో
నీదయచే యుక్తమగుచు నెగడుంగాతన్ !

క. గురువు లడుగుట శిష్యుం డు
త్తరమిడుటయుఁ బ్రాజ్ఞు లొప్పు ధర్మమ, తగు ను
త్తరమిచ్చినప్డు మెచ్చెడి
గురునకు శిష్యునకు యశము కొదవగునొక్కో?

క. తగునుత్తర మిచ్చెడివా
నింగ నన్నున్, గురుని దాని నిజము తెలియు వే
త్తఁగఁ జేసి యాయురారో
గ్యగరిమ హెచ్చించి మ్రొక్కు కైకొను మంబా !

క. వెనుక మము వెక్కిరించిన
మొనగాండ్రకతాన లోకమున కేమో మే
లొనఁగూడె నందు రిపుడును
జననీ! తాదృశయశః ప్రసాదినివగుమీ !

## అనుబంధము

(1) మృగవరాక్షి, (2) నడిపించె, 19, 225, 112, (3) మా యొక్కొక్కరి తురీయార్థంబుదాల్చి, కప్పిరొక్కొక్కరు భీష్మనేనిటన్, (4) నాదగుపాణిగ్రహణం బొనర్పన్ నగు, దేవతాచక్రవర్తికి నాచార్యుని యంత వాని సుతుఁడు, నీదు నధరామృతము, నా దుహితృ ప్రాణవిభుండు, (5) చేదిపుర మేగి, నిజపురం బరిగి, (6) వ్యాసు లరుగుదెంచి సలుపు మీకు హితోపదేశము (7) నానిమిత్త భయంబు (8) పన్నుకంచును గొనిరి (9) కాశియుఁబ్రయాగ మొదలుగ (1) అధ్యాత్మనూహించితిన్, సురవర్మన్ బిందుపాతస్ఫురణన్.

పైని చూపిన ప్రయోగాలన్నీ గురువుగారి భారతంలోన్నుంచి సంగ్రహింపఁబడ్డాయి. వారు నా ప్రయోగాలు ఆక్షేపించివున్నారు. ఆ ఆక్షేపణలు పైనిచూపిన గురువుల ప్రయోగాలచే వివరిస్తాయి. అందులో 2, 5, 9, అంకెలు పూర్తిగా గురువులు యేవి తప్పన్నారో అవే అనిన్నీ, తక్కిన అంకెలలోవి సజాతీయాలనిన్నీ, చదువరులేకాక గురువరులును గమనించాలి. వారు తాము ప్రయోగించివుండిన్నీ నన్ను ఆక్షేపించడమనేది మఱుపుతగలడం చేత అనుకోక తప్పదు. యింతతో గురువులు నన్ను తప్పుపట్టడం మానడం యుక్తం.

యింకొకటి. నీవు నే నాక్షేపించిన యే ఆక్షేపణకు దేన్ని వారకంగా యిచ్చి వున్నావని గురువులు అడిగితే దాన్ని గూర్చి విస్తరించి అప్పుడు ఫలానాదానికి ఫలానాదాన్ని వుదాహరించివున్నానని మనవి చేసుకుంటూవున్నాను. యిప్పుడు విస్తరభయంచేత అందుకు వుపక్రమించలేదు. యితరులకు తెలియదేమోకాని గురువుల ప్రయోగాలు గురువులకు తెలియక పోతాయా? నేనిప్పటికి వారి భారతం యిందు నిమిత్తం పరిశీలించింది ఆదిపర్వ సభాపర్వాలు మాత్రమే. ఆయీ ప్రయోగాలు ఆ పర్వాలలో చూచుకుంటే గురువులవారు తాము ప్రయోగించిన మాట మఱచినన్ను ఆక్షేపించినట్లు స్పష్టపడుతుంది. యితరుల ప్రయోగాలు బోఁలెడు వున్నప్పటికీ నేను గురువుల ప్రయోగాలే చూపడం వాదం సులభంగా తేలుతుందనే హేతువుతప్ప అన్యంకాదు. నామతంలో ఆ ప్రయోగాలన్నీ నిర్దుష్టాలే. గురువులు నన్నాక్షేపించే తోవనుబట్టి చూస్తే అవన్నీ శుద్ధతప్పులే అయితీరతాయి, భగవంతుఁ డవతరించినా లాభం లేదు. తాము ప్రయోగించీకూడా నన్ను ఆక్షేపించడం చూస్తే గురువులు అమాయికు లనుకోవడాన్నే బలపరుస్తుంది.

అయితే నీవు గురువుల భారతం రెండుపర్వాలు ప్రయోగాలకోసం చదివానంటావుకదా? అవి నీ ప్రయోగాలవలెనే నిర్దుష్టాలేనా? లేక యెక్కడేనా దుష్టాలున్నాయా? అని కూడా

యెవరేనా ప్రశ్నించవచ్చు. వారికి నేను చేసుకునే మనవి యేమిటంటే : వారు నా నిర్దుష్టమైన ప్రయోగాలు దుష్టాలని ప్రమాదపడి వ్రాస్తే నావి నేను వారి ప్రయోగాలే చూపి సమర్థించుకోవడాన్ని గూర్చి లోకం నా మీఁద లేశమున్నూ ఆఁగ్రహించదు, యెందుచేత? అది అవసరమైన విషయంకనక. పైపెచ్చు వారి తప్పులు చూపితేనో? ఆ తప్పులు నిజమైన వయినప్పటికీ "గుడ్డొచ్చి పిల్లని వెక్కిరించిం" దంటారు, సరే! లోకానికి వెలువడంచేతకాని లేకపోతే గురువుగారి భారతంలో దురుద్ధరమైన దోషాలు వున్నాయనే అంటావా? అంటే, అంటాను. మచ్చుకు రెండు మూడు చూపుతాను కూడాను. చిత్తగించండి.

> "అఘౌఘదహద్దండకమండలుప్రథితుఁడు," (శ్రీ-కృ-భా-ఆదిపర్వం-౧-౪-ఆ)
> "సుందరవతి, పురముల్, సరంబులున్" (౧౦- ఆశ్వాసము)
> "సుభగస్నిగ్ధములై మహాయుతములై శోభిల్లు కేశంబులన్" (సభా-౪-ఆ)

యిత్యాదులు చాలావున్నాయి. అంత పెద్ద గ్రంథం వ్రాసేటప్పుడు వ్యత్యాసాలు కొన్ని వుండడం ఆక్షేపణీయంకాదు కాని అంత గ్రంథం వ్రాసిన తమరు వకళ్లని ఆక్షేపించడానికి ఆరంభించ గూడదన్నది అందఱికీ సమ్మతమైనమాట. అయితే నీవిప్పుడు చూపిన ప్రయోగాలవల్ల గురువుల వారి ఆక్షేపణలన్నీ కొట్టబడ్డట్టేనా? అని శంక రావచ్చును. అబ్బే! యింకా కొన్ని మిగులుతాయి. యివి వూరికే అవసర నైవేద్యంగా సమర్పించుకున్నాను. మహా నైవేద్యం తరువాయివుంది. యింకా గురువులు నామీఁద చూపే దోషాలున్నూ తరువాయే. గురువులను యిదివఱలో ప్రార్థించివున్నా. మళ్లా కూడా ప్రార్థిస్తాను. అయ్యా, మీరు నా గ్రంథంలో దోషాలుచూపడానికి మొదలుపెట్టినారు. మీ కవిత్వమే చూపికొన్నిన్నీ భారతాదులు చూపి కొన్నిన్నీ వుపాయంగా సంగ్రహంగా సమర్థించివున్నాను. విస్తరించి కావలిస్తే దేన్నో తాము నిర్దేశిస్తే దాన్ని గుఱించి యెంత వ్రాయాలో అంతా వ్రాసి తృప్తిపఱుస్తాను. ఆలా అనుగ్రహించకోర్తాను. కోపంకొద్దీ యేదో పెద్దజాపితా వ్రాస్తే పండితలోకానికి దాని మంచిచెడ్డలు తెలుస్తాయికాని సామాన్యుల కేం తెలుస్తాయి? సంగీత పాటకులు యేదో ఒక స్థలంలో జాగాచేసి స్వరకల్పనచేసి లోకాన్ని రంజింపచేసినట్లు మనం కూడా అలా చేదాము. లేకపోతే గ్రంథం మఱీ పెరిగిపోతుంది. యీ వ్యాసంలో నేను చూపినవాట్లల్లో దేన్నో వకదాన్ని నిర్దేశించండని మనవి చేస్తాను.

యింకొక విషయం వ్రాస్తాను, ఫల్గుణ, ఫాల్గుణ, అనే ప్రయోగాలు యెనిమిదింటికి తక్కువకాకుండా తమ ఆది, సభాపర్వాలలో నాకు కనపడ్డాయి. వకటో రెండో నకారఘటితాలున్నూ కనపడ్డాయి. యీ సంగతి నేను వూరికే తమతో మనవిచేసుకోవడం లేదు. కారణం అడిగితే అప్పుడు విస్తరించి మనవి చేస్తాను. తాము "పాపం బద్ధలవుతుంది"

వగయిరా వాక్యాలతో నన్ను శపిస్తూవున్నారు. నేను వ్రాసిన మాటలు జాగ్రత్తగా చూడక తమకు బొత్తిగా సంబంధమేలేని వాక్యాన్ని తమమీఁదకు తెచ్చుకొని నన్ను శపించే గురువుగారి అమాయికత్వాన్ని నేను వర్ణింపలేను. గోలకొండ పత్రికలో "ఊరిపిడుగు" వ్యాసంలో "గంధర్వలోకం" అనే తుంటరివ్రాఁతను గురించి తమకు సంబంధమున్నట్టు నేను వ్రాసినట్లు వృథాగా అపోహపడ్డారు గురువులు. అందులో వో. వెం. సుబ్బారాయశాస్త్రిగారి వాక్యంలో వున్న "శ్రీవారు" అనే పదం నన్ను బోధించేది కాని తమకు లేశమున్నూ చెందదు. దాన్ని సవిమర్శంగా చూస్తే అందు గురువుగారుపడ్డ ప్రమాదం వారి ఆత్మకే గోచరిస్తుంది. గోచరించాక అయ్యో అని వారే పశ్చాత్తాప పడతారు. కనక విస్తరించేది లేదు.

ఆ "గంధర్వలోక" లేఖతో గురువుగారికిగాని, మఱివక మా పూర్వ శిష్యుడికిగాని సంబంధంలేదు. అది వ్రాసిన "గంధర్వు" డెవరో నేను బాగా యెఱుఁగుదును. అతఁడు కులాని కంతకున్నూ కళంకు తెచ్చుకొనే నిమిత్తం అట్టిపని చేసివుంటాడని ప్రతి ప్రాజ్ఞుఁడున్నూ గుఱితిస్తాఁడు. దివాంధంతో మాత్రం గురువులకు సంబంధం లేదనడానికి నా ఆత్మ విశ్వసించదు. "గంధర్వలోకము" తో సంబంధం వుందనడానికిన్నీ విశ్వసించదు. కాఁబట్టి వ్యక్తపరుస్తూ వున్నాను.

గురువుగారివలె నేను పరుషవాక్యాలు వాడడం లేదని గట్టిగా నేనున్నూ చెప్పగలను. నా వ్యాసాలుచూచిన వారున్నూ చెప్పగలరు. అట్టి స్థితిలో "గాండీవం" అనే పత్రికలో వారితోపాటుగా వివక్ష లేకుండా నన్నుగూడ యెవరో వక ప్రాజ్ఞ మహాశయులు విమర్శించి వున్నారు. ఆ వ్రాఁతలో వారి అంతరాత్మ నిజాన్ని గుర్తించి వున్నట్టున్నూ కొన్ని మాటలు కనపడతాయి. కాని అంతకన్న స్పష్టంగా వ్రాస్తేనే కాని సర్వులకున్నూ సులభంగా బోధపడదని వారికి నా విజ్ఞప్తి. అసలు యీ వాదమే పనికిరాదంటారా? అలా అనడం కూడా మంచిదే. అచ్చుపడి వున్న యథార్థమైన నా జీవితచరిత్రకు అవమానం వస్తూవున్నది గదా? నిజం తేల్చుకోకపోతే యేలాగ? నిజమైన తప్పేదేనా వుంటే దాన్ని కాదని వాదిస్తే నన్ను మందలిస్తే నేను వప్పుకుంటానోలేదో చూడండి. అలాటిచోట మార్గాంతరం వుంటే దాన్ని చూపుతాను. అది పాండిత్య బలాన్నిచూపేదవుతుందిగాని పిడివాదం లోకి రాదు. యేమైనా మీ "గాండీవ" వ్యాసం చాలావరకు యుక్తంగానే వుంది. మళ్లా వ్రాసేటప్పుడు వివేచనగా వ్రాయండి. యింతే మనవి.

★ ★ ★

# సంధి మిచ్ఛంతి సాధవః

(2-7-1936 సం॥ర ఆంధ్రపత్రిక డైలీ నుండి)

యోగ్యులు తమతో వేఱొకరికిగాని, వేఱొకరికీ వేఱొకరికీగాని స్నేహభావమునే కోరుతారు గాని ద్వేషభావాన్ని కోరరు. యీ భావాన్నే మనస్సులో పెట్టుకొని, శ్రీ గన్నవరపు సుబ్బరామయ్యగారు, మా గురువుగారి "చెరలాట" గ్రంథాన్ని గుఱించి కొన్ని వాక్యాలు వ్రాసివున్నారు. ఆమాటలలో వున్న ముఖ్యాంశం యెంత చర్చించినా వ్యాసకర్తలకు మా వుభయులయందున్నూ వున్న ఆదరాతిశయాన్నే వెల్లడిస్తుంది. కాని అన్యథాగా వుండదు. తుట్టతుదను వ్రాసిన "ఈ వాదాన్ని గూర్చి యింకొక భాగము గూడ ప్రకటింపవలెనా?" అనే అక్షరాలవల్ల చూచినంతలో ఆ పుస్తకం అనుచితంగా వుందనే తాత్పర్యాన్ని వెల్లడించినట్లు కూడా స్పష్టపడుతుంది. వారు మా వుభయులను గుఱించి వ్రాసిన మందలింపునకు నేను మాత్రం దోసిలి వొగ్గుచున్నానని మనవి చేసుకుంటాను. నాకిప్పటికి నెలమీఁద పదిరోజులు కాబోలును తరువాయిగా అఱువైయారు యేండ్లు నిండవచ్చాయి. నేను శ్రీ కృష్ణమూర్తి శాస్త్రుల్లుగారి వద్ద పుస్తకాలు పట్టి యేభైయేండ్లు అతిక్రమించాయి. వారు కొంతకాలమునుంచి నన్ను గూర్చి కొద్దిగానైతే నేమి గొప్పగానైతేనేమి యీసడించడం కర్ణాకర్ణికగా వినడం కలదు. యీ యీసడింపు విద్యకు సంబంధించిందే. అంతట్లో వారు కొల్లాపురం వెళ్లి అక్కడ తగాయిదా తెచ్చుకుని దేశానికి వచ్చి యేదో నిందాగ్రంథాన్ని వక యోగ్యునిమీద యితరులపేరుతో ప్రచురించారు. దానిమీద పలువురు పండితులతోపాటు నేనున్నూ అసమ్మతిని తెలపడం తప్పకపోయింది. దానిమీద వారికి కోపోద్రేకం అతిశయించి పలువురు పండితులతోపాటు నన్నున్నూ దూషించారు. ఆ దూషణాన్ని తెలిపే పుస్తకంపేరే "దురుద్ధరదోషశృంఖలం" అది నేను చూచిన్నీ అందులోవున్న అసత్యాలూ అనర్థపు మాటాలూ గమనించిన్నీ కూడా కిక్కురు మనకుండా వూరుకోవడమే కాకుండా గండపెండేరాన్ని నాస్వంత చేతులతో వారికాలికి తొడిగివున్నాను. ఆశృంఖలంలో నన్ను నిందించిన యితర విషయాలు వదులకున్ననూ వారి విషయంలో నేను వుపకారానికి చేసిన వక యత్నాన్ని అపకారంగానున్నూ, నేను సభలో వుపన్యసించని విషయాన్ని వుపన్యసించినట్టున్నూ లిఖించారు. యిందు వకటి ముక్కాలకున్నూ, వకటి పాలకొల్లుకున్నూ సంబంధిస్తాయి. లోకానికి ఆమాత్రం విమర్శనాజ్ఞానం వుండకపోతుందా? అని అప్పుడున్నూ

నేను కలగచేసుకోలేదు. తరువాత గురువుగారు నాశుశ్రూషను గురించి కేవలమున్నూ హైదరాబాదుకు వ్రాసిన వక వుత్తరం అక్కడ పత్రికలలో విశేషించి చర్చించి చర్చించి గందరగోళ పడ్డది. నిన్నమొన్న నాకు చేరింది. ఆ వుత్తరంవల్ల షష్టిపూర్తి కమిటీవారు ప్రచురించిన నా జాతకచర్యకు చిక్కు తటస్థించింది. దానిచే జాగ్రత్తగా వ్యక్తిదూషణ కలికానిక్కూడా రాకుండా వుండాలనే నియమంతో మూడువ్యాసాలు వ్రాశాను. దానిమీద కొంతబెడిదంగానూ కొంత శాంతంగానూ సమాధానం అంటూ గురువులు ప్రచురించారు. దానిమీద క్షమాపణం అనే శీర్షికతో వకవ్యాసం నేను వ్రాశాను. దానిలో వక్కమాటకూడా అసత్యం లేకపోయినా అది వారి చిత్తానికి మిక్కిలి కోపాన్ని రప్పించింది. ఆపైని తిట్టడమా? శపించడమా? అబద్ధాలాడడమా? వకటేమిటి నానాత్రోవలలోకి లేఖిని నడిపించి అంతతోకూడా మనస్సు శాంతించక నాకవిత్వంలో తప్పులు చూపడానికి ఆరంభించారు. తప్పులను గూర్చి సమర్థించవలసినది వుంటే సమర్థనం ప్రచురిస్తాననుకోండి. లేదా? దిద్దుకుంటానని మనవి చేసుకుంటాను. దానికిచిక్కు లేదు. తిట్లకున్నూ, శాపాలకున్నూ ప్రతిక్రియ చేసేదిలేదు. వృథాగా నావ్రాతలో మాటలకు వారు అపోహపడ్డవి కొన్ని వున్నాయి. వాట్లనుమాత్రం కనపరుస్తాను. యింత జాగ్రత్తగా యెక్కడేమి చిక్కువస్తుందో అని భయపడుతూ వ్రాస్తూవున్న నా వ్రాతనుకూడా సమష్టిమీద మిక్కిలి దురుసుగా వున్న గురువుగారి వ్రాతతోపాటు జమకట్టిన మా మిత్రులు సుబ్బరామయ్యగారిని వక పర్యాయం మామావ్రాతలు సవిమర్శంగా చదివి చూడవలసిందని ప్రార్థిస్తాను. తాగుడు దగ్గిఱనుంచి పంచమహా పాతకాలదగ్గిఱనుంచి వారు నాకు ఆపాదించి వున్నారుగదా! నా వ్రాతలో అట్టి ప్రసంగం యెక్కడేనా మందుకేనా వుండదేమో! సదరు సుబ్బరామయ్యగారు పరిశీలించారుకారుగదా అనే దుఃఖం నన్ను బాధిస్తూ వుంది. గురువుగారు వ్రాశారంటే నాకు బాధలేదు. వారికి నావల్ల పెద్ద చిక్కు వచ్చి పట్టుకుంది. దాన్ని పోగొట్టు కోవడానికి వారు "వెం॥శా॥ అల్లాటివాడు యిల్లాటివాడు, తాగుతాడు, తాళాలు వాయించుకుంటాడు, పొత్తర్లు కట్టుకుంటాడు" అని వ్రాయడం వారికి ఆవశ్యకమయింది. దాని వల్ల వచ్చే చిక్కు వారికి వదలిపోతుంది. కనక వారట్లు వ్రాస్తారనుకుందాం. అట్టి మాటలు లేశమున్నూ నేను వ్రాయలేదే? లేనప్పుడు నావ్రాత వారి వ్రాతతో సమష్టిమీదే అనుకుందాం సమానంచేసి వ్రాయడం నా మాటట్లుండగా లోకం మాత్రం సహిస్తుందా? అయితే మొత్తం వివాదం వద్దని వారి తాత్పర్యం అనుకుందామా? దాన్ని శిరసావహించని వారెవరు? తండ్రిమీద కొడుకు కోర్టులో దావాచేస్తాడు. దేనికోసం? ధన కనక వస్తు వాహనాల కోసం. దాన్ని తప్పుగా భావించడం నేటికాలంలో కనపడదు. ధనం యేలాటిదో కీర్తిన్నీ ఆలాటిదే. అందులో బాగా ఆలోచిస్తే ధనం కన్న కీర్తే యెక్కువగా గణించదగ్గది.

"సంభావితస్య చాకీర్తిర్మరణాదతిరిచ్యతే" కదా! అయితే నీకేమీ అపకీర్తి వచ్చిందంటారా? వినండి. జాతకచర్యలో వున్నదున్నట్టుగా విద్యాభ్యాసాన్ని గూర్చే కాదు యెన్నో విషయాలు వ్రాసుకొని వున్నాను. గురువుల వారు హైదరాబాదుకు కోపోద్రేకంతో వ్రాసిన వుత్తరం వల్ల నేను కాజులూరు, చామర్లకోట, పిల్లంక, పల్లెపాలెం, యిన్నివూళ్లల్లో చదువుకొన్న చదువు, చేసుకొన్న వారాలు, యెత్తుకొన్న మాధాకవళం అనుభవించిన కష్టసుఖాలు, తిన్న మొట్టికాయలు, యివన్నీ గంగలో కలిసిపోవడమే కాకుండా, వెం॥ శా॥ వట్టి అబద్ధీకుడు. వక్క గురువుదగ్గిఱ చదివిన చదువును యిందఱికి పంచిపెట్టి వ్రాశాడంటూ నా శత్రుకోటి నన్ను నా జీవితకాలంలోనున్నూ అటుపిమ్మటానున్నూ ఆక్షేపించడానికి కారణం కాదా? నా జీవితకాలంలో యేలాగయినా తరువాత యీ అపవాదునుబట్టి నా కొడుకులకు తలవంపు రాదా? చూడండి. పాపం. ఈ మధ్య జగదేక పండితులు శ్రీ ఆకొండి వ్యాసమూర్తిశాస్త్రుల్లుగారిని ఎవరో వృథాగా పనిలేనిపాటుగా అధఃకరించి వ్రాసినందుకు మిక్కిలి పరితాపపడుతూ ఆయనకుమారుడు వెంకటశాస్త్రిగారు "నివేదనం" అనే పేరుతో కొన్ని పద్యాలు ప్రచురించారు. అవి చదివేటప్పటికి నాకు కళ్లమ్మట నీళ్లు బొటబొట రాలడం మొదలెట్టాయి. అలాగే యీ అపవాదాన్ని నేను తొలగించుకోకపోతే యిదిముందు నాకుఱ్ఱలకు తలవంపు తేదా? అందులో సామాన్యులు ఆరోపించిందికాదాయె. గురువులవారిది కదా? ప్రభాకరశాస్త్రిని సుబ్బరామయ్యగారు యెఱిగేవుంటారు. అతణ్ణి వక విషయంలో గురువుల వారు అసత్యవాదినిగా వ్రాశారు. పైఁగా యిప్పుడు భారతంకాబోలును నెత్తిని బెట్టుకొని ప్రమాణం చేయవలసిందిగా విధిస్తూ వున్నారు. యీలాటివి యెన్నో అనుచితాలు వారి వ్యాసాలలో వున్నాయి. నాదానిలో లేవని నా నమ్మకం. విద్యావిషయంలో నేను గురువులకన్న యెక్కువ శుశ్రూష చేసినట్లు వ్రాసినమాట సత్యం. దాన్ని ధ్రువపరచడానికి తగ్గప్రసక్తి గురువుగారే కల్పించివున్నారు. యింకా ముందుకూడా కల్పించే వూహతో వున్నారు. ఆ సంగతి యెంతవఱకు సత్యమో! భగవంతుడు తిన్నగాచూస్తే త్వరలోనే తేలుతుంది. ఇంతకన్న అనుచితంగాని అవాచ్యంగాని అయోగ్యంగాని నా వ్రాఁతలోవుంటే చూపవలసిందని సుబ్బరామయ్యగారిని ప్రార్థిస్తాను. నాతప్పు నాకు గోచరించదు గనుక యీ ప్రార్థనం. దీని మీద వారు వూరుకుంటేకూడా నా అభిప్రాయాన్ని బలపఱిచినట్లే నేను సంబరపడవలసి వస్తుంది. ముగిస్తాను.

★ ★ ★

# గురు శిష్య ప్రశ్నోత్తరములు

(వ్రాత ప్రతినుండి)

గురు : అబ్బాయీ? నిన్ను కొన్ని ప్రశ్నములడుగఁ దలఁచితిని.

శిష్య : చిత్తం. యెఱిఁగినంతలో ఉత్తరం మనవి చేసుకుంటాను.

గురు : పాలకొల్లుసభలలో నెందేని మా అమ్మాయి కవిత్వము చెప్పునది కాదనియు, తండ్రిగారే చెప్పి యాపెపేరున ప్రకటింతు రనియు నర్థము ధ్వనించునట్లు పన్యసించియుందువా? లేదా?

శిష్య : అట్టి యపోహ నా కుంటే గదా? అలాటిధ్వని వచ్చేటందుకు? లేదని గుళ్ళోలింగాన్ని పీఁకమంటే పీఁకుతాను.

గురు : మొల్లను గూర్చి యైన నిట్లు మాటలాడితివా?

శిష్య : మొల్లకు తండ్రిగాని సోదరులుగాని కవులైనట్లు ప్రతీతి యెక్కడా వున్నట్లే లేదు గదా? యిట్టి యపోహ మేలాగు?

గురు : పోనీ ఆపెజోలి మన కెందుకు? మా అమ్మాయిని గూర్చియే మఱియొకసారి అడుగుచున్నాను.

శిష్య : మఱియొకసారి కాదు, వేయిసార్లడగండి."కవులకూఁతుళ్లు కూడా కవిత్వం చెప్పడం కలదు. శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రుల్లుగారి కొమార్త యిందు కుదాహరణం" అని భావ సం॥ మార్గశీర్ష బ ౨ శనివారంనాటి కృష్ణలో వ్రాశాను కూడాను.

గురు : దాని నటు లుంచుము. నా భారతమును గూర్చి విశేషించి నాఁడు పాలకొల్లులో నీవుపన్యసించలేదేమి.

శిష్య : ఉపన్యసించాను. ఆ సభలో సభ్యులరంజనకయి యితరమున్నూ మాటలాడాను. పాలకొల్లు వ్యాసంలో యీ యంశం గతార్థ మవుతుంది మళ్లా యిక్కడ పిష్టపేషణ మెందుకు?

గురు : 1916 సం॥ రములో బందరులో నీనిమిత్తమున జరిగిన మహాసభకు నే నధ్యక్షుఁడుగా వచ్చినపుడు, ఆ సభలో నన్ను రహస్యముగా పిలిచి నీవే మంటివి? జ్ఞప్తి యున్నదా?

శిష్యు : లేకేమి? మొన్న తామాయీసంగతులన్నీ "చెరలాటం"లో వుదాహరించారు కూడాను. తమ్ము రహస్యంగా పిల్చి "అయ్యా యీ సభలో నన్ను మీ శిష్యుడని చెప్పండి. బహువచనంగా సంబోధించకండి" అని సవినయంగా మనవి చేసుకున్నాను.

గురు : (తమలో) యిది మాత్రము శిష్యునికేమి బాధించెడిని. మిక్కిలి వినయవంతుఁ డనియు, ఆ వినయము కూడా అంతఃకరణశుద్ధికలదియే యనియు తేల్చెడిని. పైఁగా, చెరలాటములో దీనిని నే నెందుకెత్తుకోవలెను? సరి? బాగుగనే యున్నది నా ధోరణి. కొన్ని విషయములు తుదకు నిల్చినను నిలువకున్నను అడుగుటకేని యవకాశము కలవిగా నున్నవి. యిదియో? అట్లును లేదే? (ప్రకాశము) నీవు మాత్రము తఱచుగా నన్ను గురువుగారు, గురువుగారు, అని ప్రతిచోటను చెప్పుచుందువు, నాకేమో నిన్ను శిష్యుఁడని చెప్పుటకు సిగ్గుగా నుండెడిని. నీ మాటలయందంతఃకరణశుద్ధి లేకపోవుటయే దీనికి కారణ మనుకొందును.

శిష్యు : యిదంతా యిటీవల తామభిప్రాయం మార్చుకోవడంవల్ల కల్గిన విశేషమే. కొల్లాపురమే సర్వానికిన్నీ మూల మనుకుంటాను.

గురు : దానికేమిలే, నీ శిష్యత్వము అంతఃకరణశుద్ధి కలదే యగుచో నే నేదేని సభలో నొకమాటేని వాక్రుచ్చియుండనా?

శిష్యు : అదిన్నీ జరిగింది, తమకు జ్ఞాపకం లేకపోవచ్చు. "చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి నా శిష్యుఁడు, అతఁడు నా యెడల పితృవాత్సల్యత చూపుచు........."

గురు : (తొందరతో) ఆఁగు, ఆఁగు. పెండ్యాలవారి కేసులో నుండి కాదు నీ వుదాహరించుట. పండితాభియోగమని అచ్చుపడ్డది కాఁబోలును ఆ కేసు విచారణ. సరే? అది మహాసభ కాదుగదా! మేజిస్ట్రేటుకోర్టు.

శిష్యు : మహాసభకన్నా కోర్టుకే గౌరవ మెక్కువేమో? కోర్టులో చెప్పే మాటలన్నీ ప్రమాణం మీఁద చెప్పాలి కదా? మహాసభలో నట్లు కాదు.

గురు : కోర్టులో ప్రమాణాలకా నీవు వాల్యూయిస్తూన్నావు? పోనీ దాని కేమి? శాస్త్రిగారి "క్షమాపణ" అన్నా వేమిటి?

శిష్య : నేనన్నది "క్షమాపణ' అని మాత్రమే. శాస్త్రిగారి అన్నది పత్రికలవారు చేర్చినది. అందుకే వారు కొటేషన్ గుర్తు క్షమాపణకే పెట్టే రనుకుంటాను. శాస్త్రిగారంటే, వెం॥ శా॥ గారన్నమాటే.

గురు : చంకదుడ్డేమిటి?

శిష్య : అది నాదే. ఆమాట వాడడాని క్కారణం ఆ వ్యాసంలోనే వ్యాఖ్యానం చేసివున్నాను. యిక్కడ మళ్లాయెందుకు?

గురు : నీ వ్యాఖ్యానముల కేమిలే. ముఖ్యముగా కొల్లాపురపు విషయములో నిజమే అనుకొమ్ము నాకు వ్యతిరేకాభిప్రాయ మీవచ్చునా?

శిష్య : యివ్వకూడదు. విధిలేక యిచ్చాను. ముక్త్యాలవ్యాసంలో దీనికిని జవాబు కలదు.

గురు : నేను నీ మీఁద నెవరోవ్రాసిన శృంఖలము విషయమున నభిప్రాయ మడిగినపుడు చేసినది నీ వెఱుఁగుదువా?

శిష్య : యెఱుఁగుదును. తిట్టి పంపినారు. యీ సంగతి గూఢంగా వ్యాసాలలో సూచించే వున్నాను. మీ రట్లు చేయకున్ననూ నాకు చిక్కులేదు. దీనికిన్నీ దానికిన్నీ చాలా తేడా వున్నది. ప్రస్తుతమో? అభిప్రాయ మిచ్చి తీరాలి, లేదా పక్షపాతి, అనే అప్రతిష్ఠ పడేనా తీరాలి. నా ప్రతిపక్షికి మీరు సదభిప్రాయమిస్తే వృథాగా మీరుత్తర వాదులు కావలసి వచ్చేది! ఆయనగతి యేమయిందో తృణీకరణంలో చిత్తగించండి.

గురు : ఎందుచేత? నీకభిప్రాయ మీయక తప్పింది కాదు.

శిష్య : జమీందారయిన పెండ్లికొడుకును పెండ్లిపీఁటల మీఁద ఆశీర్వచించిన శ్లోకాలను మీరు అశుద్ధం, అమంగళం, అని తిట్టి పైఁగా తగలఁబెట్ట మన్నారు. యిది మీకిష్టమేనా? అంటే యేం చెప్పేది నేను?

గురు : ఆ శ్లోకాలు చెప్పిన పండితుఁడు నాకు చేసిన అపకార మెఱుఁగవా?

శిష్య : చేశాఁడు, చేయలేదు. మీ తొందర హరిహరబ్రహ్మాదులకుఁగూడ సవరింప రానిదిగా నున్నది. నే నేం చేసేది? అభిప్రాయ మివ్వడం మానాలి. అంతతో మీకేం లాభం, ఆయన కేం నష్టం, యెందఱో యిచ్చారుగా? నాకు నష్టం

యేలా గంటారా, చూడండి యీయన పక్షపాతి, అని ప్రదర్శించడానికి పనికివస్తుందాయనకు. మీ ప్రమాద మేలాగూ సమర్థింపఁబడదు కదా?

గురు : అదిగో? ప్రమాదమనికూడా ననుచున్నావు. నీ వట్లనుట మాత్రము తప్పుకాకపోదు. నీవు నావెంటనుండి నన్ను సమర్థింపవలయునే కాని అన్యథాగా నుండఁగూడదు.

శిష్యు : కోప్పడకండి. మీ రెప్పుడూ యిట్టి అనాలోచిత కార్యాలే చేయుచుండడం సహజం కదా. నేను కూడా మీతో చేరితే నాకున్నూ మీవంటిపేరే వస్తుంది గదా?

గురు : నా పేరు కంటె నీకు మంచిపేరున్నదా? లోకములో !

శిష్యు : అది నన్నడిగితే యేం తేలుతుంది? లోకాన్నే అడగండి. పెండ్యాలాయన్ని ముందస్తిగా శ్లేషించి వ్యక్తిదూషణ చేయడమెందుకు? తరవాత ఆయన తోఁకతొక్కిన తాఁచులా లేచి మిమ్మల్ని యేదో శ్రౌతసంప్రదాయాన్నాధారం చేసుకొని అడ్డమైన దుర్భాషలూ ఆడడమెందుకు? అంతతోనేనా సమసిపోకుండా కేసెందుకు? ఆయీ విషయాలలో మీకు నాబోటివాని సలహావుంటే అంతదాఁకా ములుఁగుతుందా?

గురు : అగుచో పెండ్యాల విషయము నాదేలోటని కూడ ననెదవుకదా? పరిశీలించినమాటేనా?

శిష్యు : "దోషావాచ్యా గురోరపి" కనక మనవి చేస్తారు. లోఁటా? లోఁటున్నటా? తప్పా? తప్పున్నటా? యిప్పుడు దానిజోలి మనకెందుకులెండి. చెరలాటంలోసంగతులను గూర్చి యింకా యేమేనా అడగండి అడగవలసుంటే.

గురు : ముక్త్యాలలో నేదో నన్నుఁగూర్చి ప్రయత్నము చేసితివి గదా? సంతోషమే. రమ్మన్నప్పు డేల రాలేదు?

శిష్యు : నా ఆరోగ్యం బొత్తిగా నెవ్వరిముల్లువాటంలోకి వచ్చి అప్పటికి చాలాకాల మయిందని తామెఱిఁగిన్నీ అట్లా నెపపెడితే నేనేం మనవి చేసుకోను?

గురు : ఆయేఁడే మదరాసు కేలా వెళ్లఁగలిగితివి?

శిష్యు : అదిన్నీ స్వేచ్ఛాప్రారబ్ధం కాదు. పరేచ్ఛా ప్రారబ్ధ మనుకోండి. ఆ మదరాసు ప్రయాణమే కదా? కొంపతీసింది. అప్పుడు చెడ్డ ఆరోగ్యం సుమారు

పదియేళ్లతిక్రమించినా యిప్పటికిన్నీ సవరణ కానేలేదు. ఆ మదరాసుదరిమి లానే మీరు నన్ను ముక్త్యాలకు రమ్మని నిర్బంధించింది జ్ఞాపకం తెచ్చుకోండి.

గురు : నీవలె నాకీ స్వల్ప జ్ఞాపకాలన్నియు జ్ఞప్తియందుండవు. నాధారణ గుటికి బారెఁ డెచ్చుతగ్గుగా నడిచెడిది.

శిష్య : ఆలాటిధారణ కావడంచేతనే వట్టి అపోహలు కలుగుతూ వుంటాయి. ఆ అపోహలేకదా? యీ భ్రాంతల క్కారణ మయ్యాయి.

గురు : తిరుపతిశాస్త్రి కొడుకుచేత కొల్లాపురం పండితునికి అభిప్రాయ మిప్పించినది నీవేనా?

శిష్య : నేను కాదు. జయంతి రామనాథశాస్త్రి. అతఁడే అందఱిదగ్గఱకీ తీసుకు వెళ్లినవాఁడు. అసలు దానిలో సారంలేకపోతే యెవ్వరూ యివ్వకపోదురు. మీదానిలోని అసారత్వమూ దానిలోని ససారత్వమూ స్పష్టంగా కనపడడంచేత అందఱు పండితులూ సదభిప్రాయాన్ని యిచ్చారు. యిచ్చినవారిలో చాలా విద్యావృద్ధులూ వయోవృద్ధులూ వున్నారు. నే నివ్వకూడదన్నందుకు నాకూ సమ్మతమే కాని "అపంథానం తు గచ్ఛంతం సోదరోఽపి విముంచతి"

గురు : ఆలాగా? పోనీ నీకు బ్రహ్మయ్యశాస్త్రులవారియం దున్నంతగురు భక్తి యితరగురువులయందున్నదా?

శిష్య : లేదని మీరుతప్ప యేయితరగురువులున్నూ అనలేదు. యెవరివల్ల యెంతవుపకృతి పొందేనో వారియందంత గౌరవమున్నూ నాకు వుంది. విరక్తిమాత్రం యేగురువులయందున్నూ లేదు.

గురు : నీకు లోకములో పేరేయున్నచో నయ్యది శాస్త్రమువల్లనా? కవిత్వమువల్లనా?

శిష్య : శాస్త్ర కవిత్వోభయసమ్మేళనంవల్ల నని అనేకుల అభిప్రాయం. యింకా అడిగితే కవిత్వంలో అంతోయింతో రసం వుండడంవల్ల. మొదటిదానికన్న యిదే నిక్కమేమో.

గురు : నీకు జగదతీతమైనకవి ననెడిగర్వమున్నదా? లేదా? చెప్పు.

శిష్య : వుంది. లేదు. నాకంటె యీ విషయం మీయందు సమర్థించడం మిక్కిలీ సులువు. వుందే అనుకోండి, దానివల్ల వచ్చేయశస్సు మాత్రం యెవరిది? గురువులదే కదా? ఆ పరంపరలో అంతో యింతో తమకున్నూ వాటా వుండి

తీరుతుంది. వస్తుతస్తు, అట్టి గర్వం అంతకు పూర్వం వున్నా మీ పెండేరపుటుత్సవం నాఁటినుంచేనా లేదని లోకం అంగీకరిస్తుంది. యే మంటారా? నా కట్టి గర్వమే వుంటే జగదతీతత్వస్ఫోరకచిహ్నమైన పెండేరాన్ని నిండుసభలో మీ కాలికి నేనెందుకు స్వయంగా తొడుగుతాను? "క్రియా కేవల ముత్తరం" గదా? దీన్ని గుఱించి "భారతి" యేమందో? చిత్తగించలే దనుకుంటాను.

గురు : భారతిమాటల కేమిలే, తప్పనివిధిచే తొడిగితి వని నా నిశ్చయము. ప్రసిడెంటుగా వచ్చియుంటివి కదా?

శిష్యు : తప్పనివిధేమిటి? యిష్టమేలేకపోతే ప్రసిడెంటుగానూ రాను. నాకంత గండగత్తిరేం వచ్చింది. యిప్పుడు తిరఁగఁబడ్డట్టే, తిరఁగఁబడాలంటే అప్పుడున్నూ తిరఁగఁబడేవాణ్ణే, తప్పకుండా వారించేవాణ్ణే. యిటీవలి చర్యలో వ్రాశాను చూడండి.

గురు : తిరుపతిశాస్త్రి యున్నచో కొంత ప్రసంగము జరిగెడి దేమో?

శిష్యు : వున్నా ఫరవా లేదు. యేమంటారా? అతఁడు నన్ను వ్యతిరేకించే వాఁడు కాఁడు. అట్లేకాకపోతే మీ భారతం మీఁద అతఁడభిప్రాయ మిచ్చేవాఁడేనా? యిదీలా వుండఁగా యింకొక అర్థార్థసంబంధంలో కోర్టుదాఁకా వెళ్లక మానతాఁడనుకొన్నారా?

గురు : కృష్ణా పత్రికా సంపాదకీయమును నీవు ఖండింతునని నా పేర వ్రాసికూడ మరల మూకీభావమును వహించితి వేమి?

శిష్యు : మీరు తొందరపడి యేదో ఖండనమని రాస్తారు. దానిమీఁద మఱీ అలుసవుతుంది లోకానికి. వూరుకుంటేనో? గంభీరంగా వుంటుందనే నా తాత్పర్యం గాని అది ఖండింపఁబడేదనే ఆశ నాకు మొదట నుంచీ లేదు. యిప్పుడున్నూ లేదు.

గురు : ఆఖండింపఁబడకపోవు టేలాటిదో వివరింపఁగలవా?

శిష్యు : వివరిస్తాను. కాని అది దేవరవారి మనస్సుకు మఱీ కోపకారణ మవుతుందని సాహించేదిలేదు.

గురు : అయినచో కృష్ణా పత్రికాధిపతి నన్ను ద్వేషించువాఁడని వ్రాయుటకు కూడ నీ వొప్పవనుకొందును.

శిష్యు : నే నొప్పుకోకపోవడం లెక్కేమిటి? లోకమే వప్పుకోదు. ఆయన స్వభావం చాలామంచిది. ఆయన నిర్నిమిత్తంగా ద్వేషించఁడు. నన్ను మాత్రం ఆయన వదలి పెట్టేఁడా యేమిటి. డింకీపందెపు కోడిపుంజుగా చిత్రించాఁడుకాఁడూ? గుంటూరి పోట్లాటరోజుల్లో. ఆనవాలు కోసమని నా పెద్దరుద్రాక్ష తావళం కూడా ఆపుంజుమెడలో తగిలించాఁడు. ఆయనకృత్యాన్ని ఆయన నెఱవేర్చు కున్నాఁడను కున్నాను.

గురు : తిరిగియు బందరు వీడుకోలు సందర్భములో మిక్కిలి అభినందించి ప్రశంసించినాఁడు కదా?

శిష్యు : "అవస్థా పూజ్యతే రామ" అన్న విషయం తమకు విశదమే కదా? గర్హించవలసివచ్చింది, గర్హించాఁడు, అర్హించవలసివచ్చింది, అర్హించాఁడు. అదే ఆయనకృత్యం. "కొట్టితేకొట్టాఁడు కొత్త కోకెట్టేఁడు."

గురు : బాగున్నది నీకు క్రొత్తకోక పెట్టుటచే నీవు సంతసించితివి. నన్ను కొట్టుటేకదా చేసి మిన్నకున్నాఁడు.

శిష్యు : అవసర మింకా రాలేదు వస్తే మీకున్నూ కొత్తకోక బహుమతీ దొరుకుతుం దేమో?

గురు : ఇంతకును, ఆయన యెంతచేసిన నంతే అని నీ యభిప్రాయ మనుకొందును. "విస్సన్న చెప్పినదే వేద" మన్నట్లు.

శిష్యు : ఆయనే కాదు పరిశీలించి ప్రవర్తించే ప్రతి పత్రికాధిపతి వాక్కు నందున్నూ వుంటుంది యీ వాల్యూ.

గురు : మరల "పరిశీలించి" అని విశేషణ మొకటిచేర్చితివే?

శిష్యు : చేర్చకపోతే చిక్కుగాదూ? ప్రతీ అవ్యక్తుఁడి రాఁతకున్నూ కట్టుబడవలసి వస్తుంది. అది భావ్యంకాదు గదా?

గురు : నేను చెరలాటములో "అందఱికి శిష్యుఁడను" అని వ్రాసికొన్నాను. దీని కాయన చాలాసంతోషించు ననుకొందును.

శిష్యు : యీ వినయోక్తి పనిచేయదు. యేమంటారా? అంత వినయవంతులకు సార్వభౌమ బిరుదధారణ ప్రయత్న మెందుకని వెంటనే ఆశంక వస్తుంది. దానిమీఁద వేంకటశాస్త్రివలె నేను గర్విష్ఠిని గాను సుమండీ, అని లోకాన్ని

ప్రతారించడానికి తప్ప ఆ వినయం అంతఃకరణశుద్ధి కలదిమాత్రం కాదని స్పష్టపడుతుంది, బాలుని క్కూడా.

గురు : నేను బోవుపోకడ లేవియు నీవు సమ్మతింప వనుకొందును. అందుకే ప్రతిమాటకు బదులు చెప్పుచుందువు.

శిష్య : అబ్బే? అలా వుంటుందా? మీ అమాయికత్వాన్ని, మీ పరోపకార పరాయణత్వాన్ని, వీట్ల నన్నిటినీ నేను శిరసావహించేవాణ్ణే. కొన్నిటిలో చాలా గడుసుతనంగానూ వెడతారు మీరు. కొన్నిటిలోనో? మిక్కిలీ పేలవంగా వుంటుంది మీ పోకడ.

గురు : ఇcక శిరసావహింపనివేవి?

శిష్య : వ్రాస్తే చాలా వ్రాయాలి. మీ మనస్సు నొచ్చుతుంది.

గురు : నొచ్చదుకొంచె మేకరువుపెట్టుము. యెవరిది వారికి తెలియదుకదా?

శిష్య : వుదాహరణకి వకటి మనవి చేస్తాను. పట్టనక్షేత్రంలో మీకు భగవతి (కలలోనూ గిలలోనూ కాదు) సాక్షాత్తుగా ప్రత్యక్ష మైనట్లు హరికథలోనూ జీవితచరిత్రలోనూ కూడా వ్రాయించుకొన్నారు గదా! దీన్ని లోకమెలా భావిస్తూ వుందో ఆలోచించండి. యిట్టివే యెన్నో వున్నాయి.

గురు : ప్రత్యక్షము కాకూడదా?

శిష్య : కావచ్చును, లోకం మాత్రం దీనికి గేలి చేస్తుంది. యీకాలంలో దీనిమీcదెన్నో ప్రశ్నలు పుడతాయి. జవాబు సున్న.

గురు : లోకములో నీకు లేవా? యిట్టి ప్రతీతులు.

శిష్య : వున్నాయి. అవి నే నంగీకరించేవి కావు. అక్కడే మీకూ నాకూ తేడా. అమాయికులు నాయందుండే ప్రేమచే కల్పించిన వివి. వీట్లనే అపవాదలు, అనే వ్యాసం వ్రాసి ప్రౌఢభారతిలో ప్రకటించి యీ మధ్య తొలcగించుకొన్నాను. అంతట్లో మీరు వేసిన, అపవాదలు తొలcగించుకోవలసి వచ్చింది. మూడు వ్యాసాలు జాగ్రత్తగా వ్రాశాను. యెక్కడా మృదువు తప్పలేదు. అయినా మీ చిత్తాని కాగ్రహం వచ్చింది. దానిమీcద వ్రాcతకి దిగారు. అది పరస్పర విరుద్ధమై అబద్ధాలాడడానికి దిగినట్లు తోcపిస్తూ వుంది లోకానికి. దీన్ని గురించి బోలెcడుత్తరాలున్నాయి. గ్రంథవిస్తర భీతిచే వుదాహరింప లేదు.

గురు : లోకమును మెప్పించఁగలమా? యేమి?

శిష్య : మెప్పించినా మెప్పించకపోయినా, కవి లోకంకోసమే పుట్టడం వల్ల వీలిచ్చినంతలో లోకాన్ని మఱవఁగూడదు.

గురు : సరే? యీ ప్రశ్నోత్తరాలవలన చెరలాటములోని సంగతి సందర్భాలుచాల వఱకు తేలినట్లయిన దనుకొందును.

శిష్య : అబ్బో? యెక్కడ తేలేయి, యింకా. తిరుపతిశాస్త్రి ప్రభాకరశాస్త్రి ద్వారా కబురంపడం వగయిరాలున్నూ "భగవంతుఁడు రక్షించుగాక శిక్షించుగాక" లున్నూ దేవునిముఖం చూచి వ్రాయడాలున్నూ వున్నాయి.

గురు : నీవు దేవుని తలపెట్టుట కంగీకరింప వనుకొందును.

శిష్య : అంగీకరింప కేమి, వ్రాసేవి అంతో యింతో అసత్యంగా కనపడుతూన్నప్పుడు అట్టిమాటలు అపహాస్యాస్పదంగా వుంటాయని నేను జంకుతాను.

గురు : నీవు జంకు టట్లుంచు, ఇతరులు జంకినట్టు కూడా ప్రకటింప సాహసించెదవు "ఆత్మవత్సర్వభూతాని" కదా?

శిష్య : (తనలో) యిదేమిటిచెప్మా? (ప్రకా) యిదా? శృంఖలాన్ని ప్రకటించడానికి తాము జంకారని నేను వ్రాశానని యెత్తి పొడుస్తూ వున్నారు గురువుగారు.

గురు : బాగుగా గ్రహించినావు. అలాటి జంకులు, గింకులు నాకు లేవు సుమా? ఏమనుకొన్నావో? నీవు. నేఁట రేపట దానిని ప్రకటించెదను చూడు.

శిష్య : తమచిత్తానికి నేనెవణ్ణి గాని దాన్ని మాత్రం ప్రకటించకండి.

గురు : కాశీపండితులు లోనగువారు పలువురు దానిమీఁద సదభిప్రాయాలిచ్చిన దెఱుఁగ వనుకొందును.

శిష్య : చెరలాటంలో, తమరు, నవద్వీపం, కలకత్తా, వగయిరాగ్రామాలు చాలా యేకరువుపెట్టేరు. చూచే వున్నాను. నాకు దొరికినప్రతిని బట్టి చూస్తే అది తెలుఁగులో వుంది. అభిప్రాయా లిచ్చినపండితులుండే మావూళ్లల్లో చాలాచోట్ల తెలుఁగున్నట్లే లేదు.

గురు : తెలుఁగే యున్నదో? సంస్కృతమే యున్నదో? అంతయుఁ దెలియ నయ్యెడిని. ప్రకటించుచున్నాఁడను గదా?

శిష్య : ప్రకటించకండని మనవి చేసుకున్నాను. అందులో నామాటల్లా వుండఁగా మీకంటె విద్యావయోవృద్ధులైన చాలామంది పెద్దల్ని చాలా నీచంగా "తద్దినం బెట్టే వాఁడితమ్ముఁడు" వగయిరా పరిహాసోక్తులతో తిరస్కరించి వున్నారు, వారందఱికంటే కూడా మీరు గొప్పవారయితేకండి గాని యెంత గొప్పవారైనా వ్రాఁత అలా వుండకూడదు. వారు మీవ్రాఁతను లక్షించరే అనుకోండి, చదువరులు హేయంగా భావిస్తారు గదా! ధాష్టీకపంతులు, లొడారి బుచ్చిగాఁడు, వగయిరాలతో పాటిదే అనుకోండి శృంఖలాన్ని, పయిఁగా పద్యాలు తగలఁబెట్టుకోమనడం వకటాయె, దాన్నే పండితుఁడు సమర్థిస్తాఁడు. మీరేదో కార్యం కోసం యేరాజునో దర్శించడానికెడితే ఆయన యేమని యెత్తిపొడిచారో? జ్ఞాపకం తెచ్చుకోండి (లొడారి బుచ్చిగాఁడు)

గురు : (తమలో) వీఁడు తన శనిగ్రహము, కామేశ్వరి, గీరతము, లోనైనవానిని మఱచినట్లున్నాఁడు (ప్రకా) దానిలో "కాలీన" లోనైన శబ్దముల విషయమున్నది గదా? దానిలోనేనా జయము వచ్చితీరును.

శిష్య : దానిలోనూ జయం రాదు, విద్యారణ్యులు, శంకరులు, వీరుకాక యావత్తర్కశాస్త్ర గ్రంథనిర్మాతలు, మహాకవిదండి, యిందఱు ప్రయోగించారని నాకు తెలుసును. తక్కిన రామానుజ మాధ్వభాష్యకర్తలు కూడా వాడే వుంటారు. యిందులో విద్యారణ్యులు వ్యాకరణంలో కూడా గ్రంథకర్త. తరువాత తమచిత్తం.

గురు : ఏమైనను కౌముదిలో భట్టోజీదీక్షితులు త్రోసివేసినది బ్రదుకదు. ఇది నిశ్చయము.

శిష్య : దీక్షితులు తోసివేసినా బతికేవిన్నీ క్వాచిత్కంగా వున్నాయి. పని పడ్డప్పుడు మనవి చేసుకుంటాను. యిప్పుడు గ్రంథవిస్తర మెందుకు?

గురు : నీవాదమంతయు ప్రతివిషయమునందును నిట్లేయుండెడిని. వెనుక వైకర్తన వాదములో నాకనుభూతమైనది. పైఁగా నాభారతమును కూడ "చింత్య" మన్న ప్రబుద్ధుడవు.

శిష్య : అదుగో! మల్లాదీన్ని జ్ఞాపకం చేస్తూన్నారూ గురువుగారు. వైకర్తన శబ్దానికి వకచోట మీరు సూర్యపుత్రుఁడని ఫుటునోటు వ్రాస్తిరి. గ్రంథభాగంలో "సహజ కవచకుండల కర్తనాత్కర్ణః" అనే అర్థాన్ని అవలంబిస్తిరి. చింత్యమనక యేమనేది? సెలవియ్యండి.

గురు : నీతో నేనేమిని వాదించితినా! కార్డుమాత్ర మొకటి వ్రాసి విరమించినాను.

శిష్య : ఆ కార్డుకూడా నేను దాఁచేవుంచాను. దీనిలో వున్నమాటలు కూడ గర్వస్ఫోరకములు. నేను గర్విష్ఠినే కనుక నాబోటివాళ్లు వ్రాస్తే నేమోతప్ప మీవంటివారు వ్రాస్తే బాగుండేవి కావు.

గురు : దానిలో గర్వమెక్కడ స్ఫురించు చున్నదో చూపించు.

శిష్య : యిదుగో చిత్తగించండి. 91 అన్నాపిళ్లవీథి 2-4-23 మద్రాసు, ఆశీర్వచనములు....... ఇది నేను వ్రాయుచున్నానే మీ యభిప్రాయమైనట్లు సూచింపఁబడుచున్నది. నేను వ్రాసిన మీకును మీకును చోటుంచి వ్రాయనెంచను. నా భారతములో వ్రాసినయంతకును నే సమాధానము చెప్పఁగలను. అది తప్పనికాని, ప్రమాదమనికాని, చింత్యమని, తెలివిలేమియని కాని వ్రాసిన వ్రాఁతలు నిరస్తములు కాఁగలవు.......... చే॥వ్రాలు. చూచితిరా? దీనిశైలియెట్లున్నదో? శిష్యుఁడిపేర వ్రాసే వ్రాఁతకనక చిక్కులేదనుకోండి. వేఱొకరిపేరనే అయితేనో?

గురు : (తమలో) నిజమే యితఁడన్నమాట. పరస్పర విరోధము కనవచ్చుచున్నపుడు నేనా ప్రగల్భోక్తులు వ్రాయుట బిభీషికా మాత్రమే (ప్రకా) అంత పెద్దగ్రంథము వ్రాయునపు డామాత్రము విరోధముండుట సహ్యముకాదా?

శిష్య : అట్లనడాని కెవఁడికి నోరొస్తుంది. అయితే "చింత్య" మని యెందుకు వ్రాయాలంటారేమో? నావాదంలో దాన్ని సమన్వయించవలసి వచ్చింది. యెదటివాళ్లు మీ గరువుగారే వ్రాశారు చూడండి, అనడానికి సిద్ధపడ్డారు. అప్పుడు నాయొక్క శాయశక్తులా యత్నించి తుదకు "చింత్యం" అనక తప్పిందికాదు. యథార్థమైనా అది కూడా మీకు కోపకారణమయింది.

గురు : ఏమైనను గురుశిష్యభావమున్నపుడు నావాదమునకు తోడ్పడుటయే యుక్తముకాని వ్యతిరేకోక్తులు వ్రాయఁగూడదు.

శిష్య : అవకాశ మున్నంతవఱకు అలాగే కాలంగడిపాను. శిష్టా వారున్నూ మీరున్నూ మేఘసందేశ విషయంలో వాదోపవాదాలు చేసుకుంటూ వున్నప్పుడు అభిప్రాయానికని నావద్ద కుత్తరాలొచ్చాయి. మెల్లిగా తప్పుకున్నాను. అవి

వుదాహరిస్తే గ్రంథం పెరిఁగిపోతుంది. ఆ విమర్శనంలో మతీ అనాలోచితంగా తమకలం పరుగెత్తింది. కణప, ఫణిప, యీ రెండుశబ్దాలనీ మీరు పరిశీలింపక ఆక్షేపించారు. "కణపయితాహే... ఫణిపయితాహే" అనే పెద్దమహామహుని ప్రయోగాన్ని అశాస్త్రుల్లుగా రుదాహరించారు వాగ్బంధంలో. ఆ మహామహుఁడు "కోశనానాచార్యః" తెగలోవాఁడు, మా బోట్లకు దానితో వాగ్బంధం కాక తప్పుతుందా? వారుంచినపేరు సార్థకమయిందనుకొన్నాను. వూరుకున్నాను. యీలాటివెన్నో చూపఁగలను తమరు తొందరపడ్డవి.

గురు : నీవు తొందరపడ వనుకొందును.

శిష్యు : పడననే మనవి చేసుకుంటాను. పైఁగా అంత అనాలోచితంగానూ పేలవంగానూ విమర్శించడమే కాకుండా "చాకలిచే జవాబు చెప్పించడమంటే, ఆ విమర్శించే పుస్తకం పెంటమీఁద దొరికిందంటే, చచ్చుతర్కమంటే, పుచ్చు తర్కమంటే" యెన్నో అప్రగల్భోక్తులు కూడా వాడివున్నారు. అవిచూచినప్పుడు నేనెంతో నొచ్చుకునేవాణ్ణి. శాంతివ్యాసంలో యీ అంశాన్ని సూచించే వున్నాను. చిత్తగించే వున్నారుకదా?

గురు : అట్టి మాటలన్నియు, అవసరమును బట్టియే వాడియుందును. నీవు నొచ్చుకొనుటకేమిలే. పరోపదేశవేళయం దందఱును మిన్నలే.

శిష్యు : యీ మాట యిదివఱలో "శృంఖలం" లో నన్నుఁగూర్చి వాడిందే. పైఁగా దానిలో కామేశ్వరీశతకాన్ని కూడా తమరు యేదోవిధపు కవిత్వంగా నిర్ణయించారు. యిట్టిపోకడ యిదివరకు కవితా ప్రపంచంలో లేనేలేదని శ్రీజయంతివారు లోనైనప్రాజ్ఞులు మెచ్చుకొన్న గీరతాన్నిన్నీ తమరు యెట్లోయీసడించి వున్నారు. ఆయీవిషయాలు "ముక్త్యాల" వ్యాసంలో కొద్దిగా వ్యాఖ్యానం చేసే వున్నాను. కాని "శృంఖలంలో" నన్ను తాము యింకా యెంతనికృష్టంగా అనుగ్రహించారో దాన్ని యావత్తూ మాత్రం కనపఱచలేదు. దాన్ని మళ్లా ప్రకటించుతామని గురువుగారు "చెఱలాటం"లో వక్కాణించడం చేత నేనుమానిన విషయం కూడా తమద్వారాగానే లోకానికి తెలుస్తుందిగదా? అని సంబర పడుతున్నాను.

గురు : నీ సంబరమున కేమిలే, శృంఖలమును ప్రకటించి తీరుదును.

శిష్యు : యెందుకు మనవిచేస్తూ వున్నానో బాగా ఆలోచించండి. శృంఖలాన్ని మాత్రం ప్రకటించకండి. లోకం కేసి దృష్టి ప్రసరింపఁ జేయండి.

గురు : నాకు లోకముతోడను, గీకముతోడను పనిలేదు. ప్రకటింతును.

శిష్యు : యిటుచిత్తగించండి. లోకమంటే మనవి చేస్తూన్నాను. శ్రీకాంచన పల్లె కనకమ్మగారు మనవుభయులకును మాననీయురాలేకదా? ఆమె "యీతని పాదమ్ములు గొల్తు రేన్గుపై నెక్కకవుల్" అని వక్కాణించింది. యెన్నాళ్లనుంచో మీచే సంశయింపఁబడుతూవున్న నా గురుభక్తి ఆబిడ కెందుకు నచ్చిందో విచారించండి. ఆ సభలోనే శ్రీ దేశోద్ధారకు లేమంటూ వున్నారో? తిలకించండి. "సుగృహీత నాములగు శ్రీ శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రులవారికి గురువులగుటచేతను అగ్రపూజ కర్హులు" అన్నారు. తాము నాశిష్యత్వంవల్ల వచ్చే గౌరవం లేశమున్నూ లేదన్నారు "శృంఖలం"లో. పైవారు మీ యెడల వకభావమూన్నూ నాయెడల వక భావమున్నూ కలవారు కారని లోకంతోపాటు తామున్నూ అంగీకరిస్తారని నా విశ్వాసం. మనమూ మనమూ యేం వ్రాసుకున్నా లోకాన్ని చూస్తూ వుండాలని నామనవి. లోకానికా శృంఖలం బొత్తిగా రుచించేది కాదు. కాఁబట్టి ప్రకటించవద్దని మనవి చేసుకుంటూ వున్నాను. మీకు పదివేల నమస్కారాలు, నా మనవి చిత్తగించండి.

గురు : (తొందరగా) నీకు పదికోట్ల ఆశీర్వచనాలు దానిని ప్రకటించి తీరుదును.

శిష్యు : యింక యితరధోరణిలోకి వెళ్లకండి. ఆ ఆశీర్వచనాలు ప్రసాదించండి. యింతటితో మన వాదోపవాదాలు ముగించుకుందాము. లోకం యొక్క అభిప్రాయం అలా వున్నట్టు వుత్తరాలు వస్తూవున్నాయి.

గురు : (తనలో) ఓహో? యిది తుట్టతుదకు "ముద్రారాక్షస" నాటకము వలె పరిణమించుచున్నదే, నిజానికి వీఁడు అంతఃకరణశుద్ధికల శిష్యుఁడు. నేను వీనియెడల నపోహ పడినట్లు విస్పష్టమగుచున్నది. కావున నాశీర్వదించెదఁ గాక. (ప్రకాశము) నిరోగశతాయుష్య మస్తు. వంశాభివృద్ధి రస్తు. సర్వశ్రేయస్సమృద్ధిరస్తు........"

శిష్యు : (వినయముతో దోసిలియొగ్గి) పరిగృహీతం శిరసా తీర్థపాదాశీర్వచనమ్.

(షరా) అయ్యా గురువుగారు ఆయాయి సందర్భాలు గుఱికి బారెఁడు హెచ్చుతగ్గుగా వ్రాస్తూవున్నారే కాని సప్రమాణంగా వ్రాయడం లేదని తమకు పైని ప్రశ్నోత్తరాల్లో చూపిన ఆధారాలవల్ల స్పష్టపడినట్లయితే దీన్ని ప్రకటించండి. నేను చూపిన ఆధారాలు సరియైనవి కావని మీ హృదయానికి తోస్తే ఆపివేయండి. నేను వారియెడల కృతజ్ఞుఁడనా? కృతఘ్నుఁడనా, అనే అంశం తేల్చుకోవడమే నాపనిగాని జయేచ్ఛ వగైరాలుకాదు. అవి యిదివఱకే తేలివున్నప్పటికీ, శ్రీవారికొమార్త కవిత్వ విషయం వగైరా కొన్ని సందర్భాలు లోకులకు అపోహను కలిగిస్తాయేమో అని దీన్ని వ్రాశాను కాని లేకపోతే వ్రాయను. కాఁబట్టి సర్వాధికారాలు మీ మీఁదపెట్టినాను. విక్రమ చెళ్లపిళ్ల, అనే వ్యాసం ఈ వివాదకి సందర్భించింది కాదుకనుక మొదలు పెడితే బాగుండునేమో? చెరలాటంలో వక మాట కూడా ప్రస్తుతానికి సంబంధించినట్టు నాకు తోఁచడం లేదు. మీకేలా తోస్తూవుందో. అన్యబుద్ధి యప్రత్యక్షము గదా? మీ యభిప్రాయానుసారము చేయఁగోరెదను.

★ ★ ★